# ఆంధ్రవచన

# శివమహాపురాణము

[శతరుద్ర, కోటిరుద్ర, ఉమా, కైలాస, వాయవీయ సంహితలు]



రచయిత్రి

శ్రీమతి యేలూరిపాటి లక్ష్మీసరస్వతి



ప్రతులకు



పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

సర్వస్వామ్యములు

రచయిత్రివి




వెల రు. 55/-




రాజమహేంద్రవరమున
అద్దేపల్లి నాగేశ్వరరావుగారిచే సరస్వతీ పవర్ ప్రెస్‌నందు
ముద్రించబడినది.



గ్రంథ ప్రకాశకులు

శ్రీ మేయారిపాటి నృసింహాసర్వతోముఖయాజులు

సౌమ్యసంవత్సరం కార్తీక పూర్ణిమ (27-11-1969)



# విషయ సూచిక

## శత రుద్ర సంహిత

### ప్రథమాధ్యాయము



### రెండవ అధ్యాయము



### మూడవ అధ్యాయము

## కోటి రుద్ర సంహిత

# ఉమా సంహిత

## వాయవీయ సంహిత

## ఉత్తర ఖండము

---



ర చ యి త్రి

శ్రీమతి మేలూరిపాటి లక్ష్మీసరస్వతి

విరోధికృత్ సంవత్సర కార్తీక బ. పంచమి (11-11-1911)

# అభిప్రాయము

శ్రీమతి ఏలూరిపాటి లక్ష్మీసరస్వతిగారు శ్రీతులసీదాస రామాయణమును, హరివంశ గ్రంథమునూ వచనమున బరివర్తనము చేయుట పాఠక మహాశయులకు విదితమే. ఈసాధ్వీమణి తెలుగునాట ప్రసిద్ధినొందిన కుటుంబములకు చెందిన యామె.

పండిత శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి అనుభవాలూ - జ్ఞాపకాలునూ' అను పొత్తము రెండవ సంపుటములో వీరి అత్తింటి వైభవమున్నది. అద్భుత ఘట్టమది. వినండి - దానిని -

"ఏలూరిపాటి నరసింహ యాజులుగారని వేగేశ్వర పురంలో వొక కంపనగృహస్థు.

వేదశ్రౌతాల్లో చాలాగట్టి వారాయన.

గట్టిసాహిత్య వేత్తాను.

పీటికిసాయం, పట్టుదల మహాయెక్కువ ఆయనకు.

ప్రత్యర్థి అయినాడా, యిక వాడెంత వాడయినా ఆయనదృష్టిలో వొక కడ్డీపరక.

యజ్ఞంచేసిన కర్మిష్ఠికూడానూ ఆయన.

నిగతాన్న దాత.

అలాంటి యాజులుగారికీ శంకరాచార్య పీఠాధిపతికీ మాటపట్టింపులు వచ్చాయొకమాటు.

నువ్వా నేనా అన్నంతవరకున్నూ వెళ్ళిపోయాయవి.

ఎవరుసద్దుకున్నా పోయిందేమీలేదు. కాని పట్టింపే పెట్టుకున్నారిద్దరూ.

ప్రతిష్ఠకోసమే పాకులాడారిద్దరూ.

సమానంగానే తూగారుపోరాటంలో, మరిఫలితం?

అదొకప్రళయం వంటిదయిపోయింది బ్రాహ్మణ్యంలో.

విద్వాంసులేకాదు, ఆస్తికులూ దద్దరిల్లిపోయారు, దాంతో.

సీమకిసీమ అంతా అట్టుడికినట్టుడికి పోయింది, కొన్నాళ్ళు.

నరసింహాయాజులుగారు, అటు, అరుణోదయాత్పూర్వం గోదావరి స్నానం చేసుకుని యింటికివెళ్ళారు ఇటుస్వాములవారి పడవవచ్చి రేవులో లంగరు వేసింది.

సూర్యోదయం కావడంతోనే వూళ్ళోకివెళ్ళి స్వాములవారి శిష్యులు బ్రాహ్మలకందరికీ యీవార్త అందించారు.

సంధ్యా వందనాదికం ముగించుకుని యాజులుగారప్పటికప్పుడే ప్రాతరగ్ని దీక్షితు లయివుండినారు.

కదలడానికి వీల్లేని స్థితి అది.

అంచేతవారు, తమస్థితి తెలియ జరచుకుంటూ వూళ్ళోకి దయచెయ్య వలసిందనీ "ఇవాళ మాయింట భిక్షస్వీకరించ వలసిం"దనీ విన్నవించు కున్నారు, తమవారినిపంపి.

ఎవరయినా ఆదరించవలసిన సన్నివేశం అది.

కాని "యాజులుమనకి ప్రత్యుత్థానం చెయ్యకపోడం - యేమి!" కున్నారు స్వాములవారు.

అలా జరక్కపోడం తమకు తిరస్కారంగా నున్నా భావించుకున్నారు వారు.

ఇందులో కొంతవిశేషం లేకపోలేదు.

అదేమిటంటే?

సమర్థులెప్పుడూ సమర్థుల ఆదరగౌరవాలే ఆశిస్తారు.

ఘనతవహించిన వారెప్పుడూ ఘనతవహించిన వారినే - కనీసం, ఘనతవహించ తగ్గవారినే తమచుట్టూ తిప్పుకుంటారు.

అంచేత, తక్కినవూరి వారందరూ చేతులుకట్టుకువచ్చి వుండినా, తృప్తి పడక 'వచ్చితీరాలిసిందే' అంటూ మళ్ళీ వర్తమానించారు స్వాములవారు.

ఆలస్యంకావడానికి వీల్లేదు, అనుష్ఠానాలన్నీ యథాకాలాన జరగాలి వితాధిపతులకు.

నిజమేమరి, అహితాగ్నికి మాత్రం?

ఇది యోచించుకోలేదు. స్వాములు.

వారికి పట్టుదల యెక్కువయింది.

యాజులుగారున్నూ స్వాములవారి యీసంబంధం తమకగౌరవంగా భావించుకున్నారు.

వారూ పట్టుదల పెంచుకున్నారు.

రాయబారాలు జరుగుతూనే వున్నాయి. కాని స్వాములవారు పీఠాధిపతియెదుట అగ్నిహోత్రావారికి తెక్కా?" అనుకోగా "వైదిక కర్మానుష్ఠానం యెదట పీఠాధిపతివారికి వారికి తెక్కా?" అనుకున్నారు యాజులుగారు.

ఎవరికెవరేమిచెప్పినా లాభంలేకపోయింది.

ఈస్థితిలో యాజులుగారి అగ్నిహోత్రదీక్ష నాసికదే ముగిసింది కొంత నేపటికి.

కాని అప్పుడున్నూ వారువెళ్ళే స్థితిలోలేరు. యాజులుగారు వెళ్ళినా స్వాములవారున్నూ తృప్తిపడే స్థితిలోలేరు.

'తిరస్కారం' 'అమర్యాద' అన్నవి అదివరకే జరిగిపోయి వున్నాయి, మరి.

దాంతో, స్వాములవారు రాజసమున్నూ విడిచి తామసంలోకి వెళ్ళిపోయారు పూర్తిగా.

యాజులుగారున్నూ స్వాములవారియెడల పూజ్యభావం అవతలపెట్టి తిరస్కారభావం పెంచేసుకున్నారు. తక్కువ కాకుండా.

ఈసందుబాట్లో, యాజులుగారి మన్ననకు పాత్రంకాలేకపోయిన వూరి సన్నకారు విద్వాంసులు స్వాములవారికి పక్కతాళం వేశారు. యెలాగూ తాము యాజులుగారిని పోలలేని యీసుతో.

స్వాములవారికి "యాజులేపాటి" అన్న తేలికభావం పుట్టించిందిది.

తమసంసారానికి, తమ ప్రామాణికతకూ, తమఉదాత్తతకూ, తమ పదవికీ యిదిపతనం అని గుర్తించుకోలేకపోయారు స్వాములవారు.

ఈసూ, మాపోపమూ, ఓర్వలేకపోవడమూ, ఉడుకుమోత్తనమూ, కడుపుమంటా, అక్కసూ - ఇలాంటి మనోవికారాలు పెంచుకుని సమర్థులనూ పూజ్యులనూ చులకన చేసిమాట్లాడతారు చాలామంది చాటునా మాటునా!

(3)

తమ ప్రతిపక్షుల యెడల యిలా ప్రవర్తించేవారిని చేరదీస్తే యెవరికీ తప్పనిదే యీాపతన,

అయితే, స్వాములవారిదే మీాగు ర్తించుకోలేదు.

పైపెచ్చు, తమ ముద్రాధికారం చెలాయించడానికి బూనుకున్నారు వారు.

"యాజులికి వెలి" అంటూ శ్రీముఖాలున్నూ పంపేశారు, అవసరం అయినవారందరికీ.

"ఇప్పుడేం చేస్తాడు యాజులు?" అంటూ వెన్ను విరుచుకున్నారు కూడా వారు.

నిజమే.

బ్రాహ్మడయినవాడి కంతకంటె కఠినశిక్ష మరిలేదారోజుల్లో.

ఎవరూ గుమ్మంయెక్కరు, ఎవరూ చూరుకిందికయినా రానివ్వరు, నిప్పూనీరూ కూడా పుట్టవు, వెలిఅయినవాడికి.

మంగళ్ళు క్షవరంచేయరు, చాకళ్ళు బట్టలుతకరు.

చండాలురకున్నూ లేనినికృష్టస్థితి యిది.

మరొకరయితే నిలువునా నీరయిపోయి వుందురపుడు.

కాని అందుకు మారుగా యాజిలుగారున్నూ వుద్రిక్తులయి పోయారు.

వీరభద్రావతారమే తాల్చేశారు చివరికి.

అప్పుడు, వారు స్వాములవారికి చేసిన మొదటి ప్రతిక్రియ, వారు పంపిన ఆంక్షపత్రిక చింపిపోగులు పెట్టడం,

రెండో ప్రతిక్రియ, వెంటనే వయనానికి సంకల్పం చెయ్యడం,

వేలమీాద అన్నదానం జరగాలి దానికి.

అదిన్నీ బ్రాహ్మలకు జరగాలి, ముఖ్యంగా.

ఎందరో ఋత్విక్కులు కావాలి.

వేదశ్రౌతాలతో ముఖరితం కావాలి యాగశాల

ఎవణ్ణి తమగుమ్మం యెక్కనివ్వరో వారియింట నోరువిప్పుతారా పండితులు?

విస్తరిస్నీ వేస్తారా బ్రాహ్మలు?
వెయ్యకపోతే యాజులుగారికి మరిపుట్టగతు లుండవు.
బతకడానికే అవకాశం ఉండదు.
గత్యాగత్యా యాజులుగారే జయిస్తే?
ఈదెబ్బ ఆచార్యపీఠానికి తగులుతుంది.
అదిచులకన అయిపోతుంది దేశంలో.
పాదపూజలు వెనకబడతాయి.
ఆజ్ఞలు హాస్యాస్పదాలయి పోతాయి.
జాతికిది శ్రేయస్కరమా?
పతనానికే దారితియ్యదూ యిది?
ఇది యోచించుకోలేక పోలేదు యాజులుగారు.

జాతిమొత్తంమీద యాజులుగారిదా ప్రాజాపత్యం? ఆచార్యపీఠానిదా? అంటే, ఆచార్య పీఠాన్ని కాదనలేరెవరూ.

మరి అంత ఆధిక్యం వుంటే ఆచార్యపీఠానికి బాధ్యతమాత్రం యెంత వుండదూ?

అదిగుర్తించుకోవాలి పీఠాధిపతి.
మాట్లాడితే వ్రతం వుండాలి పదస్థులకు,
పనిచేస్తే న్యాయం, సత్యం, ధర్మం, శాస్త్రం — ఇన్నివుండాలి.
ఇన్నింటికీపైని హృదయమున్నూ వుండాలి.
తామసచ్ఛాయలు చేరనిచ్చుకోగూడదు వారు.
వీరుడికి బ్రహ్మాస్త్రం యెలాంటిదో పీఠాధిపతికి 'వెలి' అలాంటిది.
ఈస్వల్పానికి యాజులు గారంతటివాడికి వెలివెయ్యవలసిందేనా?
ఆచార్యపీఠం తనయేల్బడిలోవున్న పండితులను సత్కరించాలి.
కర్మిష్ఠులను ఆరాధించాలి.

ఆపండితుల్లోనూ, ఆకర్మిష్ఠుల్లోనూ యాజులుగార గ్రేసరులు. వారిని కూడగట్టుగోడం పోయి వెలివెయ్యడం దుస్సాహసం.

పీఠాధికారం దేశవ్యాప్తమే.

యాజులుగారి పలుకుబడి స్థానికమే.

అయితే, ఇన్నికాలైన జనాల ఆదరగౌరవాలేగాని రాజావలంబంలేదు పీఠానికి.

గాలిలో దీపం అప్పటికేఅది.

నాలుగుమూలలా యాజులుగారి వంటివారు తిరగబడితే?

స్వాములవారి పరిస్థితులు గుర్తించుకోలేదు.

అవునుమరి, సామ్రాజ్యనిర్మాతల జాగ్రత్తలు వారసుల కెకర్ణాలనుంచి వస్తాయా?

పుత్రపౌత్ర పారంపర్యంగా అనుభవించడానికి అధికారమే సొత్తుగాని, శక్తి యుక్తులు అలాంటివి కావుగా?

దీంతో, బ్రాహ్మణ్యం చీలిపోయిందప్పుడు.

అంటే, స్వాములవారు చేసింది ఏకగ్రీవంగా అంగీకరించ లేకపోయింది.

సగానికి సగం యాజులుగారికేసి మొగ్గేసింది.

ఇందులో విశేషమేముంటుంది?

యాజులుగారికేసి మొగ్గిన సగమూ 'ఎప్పటికెయ్యది ప్రస్తుతం' రకం కాదు.

అదిధర్మాధర్మ విచక్షణ చెయ్యగలది.

ధర్మానికి అండగా వుండగలది.

ధర్మంకోసం ప్రాణాలయినా వొడ్డగలది.

ఇది గుర్తించుకున్నారు యాజులుగారు.

ఈధైర్యంతోనే వారు చయనసంకల్పం చేశారు.

బాగానేవుంది, అయితే, త్రిశంకు మహారాజు బొందితో స్వర్గానికి వెళ్ళడానికి యజ్ఞసంకల్పం చెయ్యడంవంటిపది. అచ్చంగా

కాస యాజులుగారికీ స్వాములవారికీ జీవన్మరణసమస్య అయిపోయింది.

అది ఏమయినా, శ్రోతలకు మాత్రం ముందునుయ్యీ వెనకగొయ్యీ అన్నట్లు తయారయిందది.

ఆకాలంలో, గోదావరికిద్దరిని మునికొండవలీ, యెదురుగా అద్దరిని వేగే శ్వరపురమూ విద్యాపీఠాలు.

బ్రాహ్మణుడైన వాడల్లా అప్పుడావూళ్ళల్లో పులభావ సరస్వతే.

సాధారణంగా అవిచ్ఛిన్నాగ్నిహోత్రిన్నీ.

సాధారణంగా అనేందుకన్నా అంటె విద్య నేర్చుకోడం వేరూ, కర్మిష్ఠి కావడం వేరూ కనక.

సాంగ వేద వేత్తల కా రెండూళ్ళూ నికషాలు.

అక్కడి విద్వాంసులకూ, కర్మిష్ఠులకూ, తపోధనులకూ దేశం పాద పూజలు చెల్లించేది.

జగత్పండితులు శ్రీపాద దాసు శాస్త్రిగారు కోరిమూసి నచ్చినవూళ్ళవి.

మొన్న మొన్న చైతన్యాలు పాలించిన మహావైయాకరణులు నోరి సుబ్రహ్మణ్యశాస్త్రిగారిది మామునికొండవలె.

మునికొండవలికీ వేగేశ్వరపురానికీ ఎన్నితేకాలంలంకె, వియ్యాలున్నూ.

పేరుబడ్డ యితర గ్రామాల శ్రోత్రులు, తమ కావూళ్ళల్లో ఆర్త్విజం లభించడం మహాప్రసాదంగా భావించేవారు.

విశేషించి నరసింహ యాజులు గారి క్రతువంటే ధర్మరాజు రాజసూయుల కంటేనూ విశిష్టం.

కాగా, పెద్దపెద్ద శ్రోత్రియులు యాజులుగారి ఆహ్వానం అంగీకరించి పొంగి పోయారు. దాని యిది తెలిసి, స్వాములవారు 'జాగ్రత్త' అని తమకున్నూ శ్రీముఖాలు పంపగా కుంగిపోయారు.

లోకసామాన్యమే అది.

శ్రోత్రియులదయినా, వేదవేత్తలదయినా, పండితులదయినా, లౌకికులదే అయినా సాధారణంగా వైయష్టిక ప్రవృత్తి.

అటాయిటూ అన్న సందర్భాలు తటస్థపడితే, స్వవిషయంలోనే జంకి పోతారు చాలామంది. యితరుల విషయమై అయితే యిక చెప్పడానికేమి వుంది?

వారిమాట ఏమయినా, —

అకార్యకరణం చేసినవాడికి భయం.

అగమ్యాగమనమూ, అభక్ష్యభక్షణమూ చేసినవాడికి జంకు,

పీఠాధిపతి అయేది, బ్రహ్మదేవుడే అయేది నికరమైన సత్తాగల వేద వేత్తకు – ధార్మికుడికి – సత్యనిరతుడికి – కర్మిష్ఠికి భయమేమిటి?

ఆగత్యం అయితే ప్రాణాలయినా వొడ్డగల నరసింహ యాజులుగారా చల్లపడి పోడం?

'యశోవా మృత్యుర్వా' అనినిశ్చయించుకున్నారువారు.

తమసంకల్పం నిర్వహించుకోడానికే పూనుకున్నారు.

అదిచూసి విద్వాంసులున్నూ యెందరో ధైర్యం తెచ్చుకున్నారు.

'మేమున్నాం' అంటూ యాజులుగారికి భరవసాకూడా యిచ్చారు.

అయితే, వారు శ్రోతులుకారు.

శ్రౌతం వల్లించి వుండినా ఆర్త్విజం నిర్వహించే అలవాటున్న వారున్నూ కారు.

ధర్మనిర్ణయం చెయ్యగల వేత్తలువారు.

పరిషత్తులకు భూషణాలున్నూ వారు.

కాగా, ఆపండితులూ యాజులుగారూ కూడా అందుకుతగ్గ వారికోసం అన్వేషణ ప్రారంభించారు.

పరికాయించగా, వర్థమానచంద్రులైన యువకులవల్లనే యీకార్యం నెరవేరుతుందని గుర్తించుకున్నారువారు.

ధర్మమే, సత్తాసంపూర్ణం కాకపోవచ్చు, అనుభవం చాలకపోవచ్చు, ప్రామాణికత్వమూ పట్టక పోవచ్చు, కాని సాహసం మాత్రం యువకులదే యెప్పుడూ.

ఏవుద్యమానికైనా జయం సంపాదించు కోవాలంటే యువకులనే కూర్చుకోవాలి.

విజయకీలకమైన రహస్యమిది.

అయితే, ఆయువకులను నడిపేవారికి నిండుహృదయం వుండాలి.

ఆహృదయం మృదులమూకావాలి, కఠోరమూకావాలి

స్వార్థచింత లేశమూవుండకూడదు దానికి, ఔదార్యంరాసి అయి వుండాలది.

అలాంటివారు నడిపినప్పుడే పూనికకు సాఫల్యమూ, యువకులకు ధన్యతానూ.

ఈదృష్టితో చూస్తే యాజులుగా రాదర్శ పురుషులు.

కనక, వండలాది యువకులు యాజులుగారికి అండగా నిలిచారు.

వారిలో మానాయనగారొకరు.

యుక్తసమయాన ముసికొడవలివచ్చి "బావా, నీకాశ్వీనం యిచ్చా" నంటూ మానాయనగారికి పిప్పుకట్టి వెళ్ళారు యాజులుగారు ప్రత్యేకశ్రద్ధతో

ఇదిగో, యీవిధంగా వచ్చింది మానాయనగారికి కాశ్వీనం అగత్యం,

ఆశ్వీనం అంటే ఋగ్వేదంలో వొకరమ్యమైన ఘట్టం.

పద్దెనిమిదివేల రుక్కులగ్రంథం అది.

చయనంతో దానికి వినియోగం,

ఒకనాటి తెల్లవారు ఝామున కదలకుండా కూచుని గుక్కతిప్పుకో కుండా యేకరువుపెట్టాలది, ఆ స్వాజంపుచ్చుకున శ్రౌతి.

మొదలుపెడితే పక్కజాము పడుతుందది ముగియడానికి.

శ్రౌతంలో గట్టిపాడనిపించుకోవాలంటే, అది నిక్కచ్చిగా నిర్వహించ గలగటం వొక యోగ్యత.

ఒక్క తప్పయినా వచ్చిందా, చెడిందన్న మాటే, మళ్ళీ మొదటికి రావాలి.

పైగా, చప్పరించేస్తారు నలుగురూ.

అంచేత, అదివల్లించడానికీ వల్లించేవుండినా ఆ స్వాజం పుచ్చుకోడానికి జంకుతారు చాలామంది.

ఒకరిద్దరు పుస్తకాలు పట్టుకూర్చుని వుండగా, కొందరు సాయం పడుతూవుండగా, అయిందనిపించుకుంటారు సాధారణంగా చాలామంది.

వల్లించేవారయినా శ్రౌతంలో తక్కినగ్రంథం అంతా పూర్తిచేసుకుని అప్పుడందుకు పూనుకుంటారు.

అంతవరకూ దాని అగత్యంరాక, జ్యోతిషం గట్టిచేసుకోడం పూనికలో దానివిషయం వెనక్కిపెట్టి పుచ్చుకున్నారు మానాయనగారు.

కాని, వారికి, జ్యోతిషమే వెనక్కిపెట్టుకోవలసి వచ్చింది దీంతో.

ఈకారణంవల్ల, యెప్పుడూ అనుకోనిది పాపయ్య సోమయాజులుగారి అగత్యమున్నా వచ్చింది మానాయనగారికి.

ఇటుబంధుత్వం — అటుసాహచర్యం — అన్నిటికీపైని చనువు — ఇన్ని సందర్భాలు పురస్కరించుకుని వెళ్ళారు సూర్యనారాయణగారు; కాని దాపరికం లేని పాపయ్యా సోమయాజులుగారు, మాట ముగియడం తడవుగా 'నాకుతప్ప మరి వొకడికివిరావడం యిష్టంలేదు బాబూ' అనేశారు, ఖండితంగా.

ఒకవిధంగా మెచ్చుకోతగ్గధోరణి అది.

కొత్తపల్లి సూర్యనారాయణగారూ, గాడగాసి సర్వదేవుడుగారూ చేసినదానికంటె వెయ్యి — లక్ష — కోటిరెట్లు సాహసోపేతం అది.

అలాంటివరలా అనడంవల్ల వచ్చేకోపతాపాదికం నిగ్రహించుకోగలిగితే, దీనివల్ల యివతలివారికి లేశమూ నష్టంలేదు, సరికదా, లాభమేవుంటుంది కావలసినంత.

మనం గుర్తించవలసిందల్లా యిక వొక్కటే.

“బోద్ధారో మత్సరగ్రస్తాః”

సార్వకాలికంగాని, తాత్కాలికం కాదన్న మాటయిది.

అయినా విద్యలు మూలపడిపోడంలేదు.

మత్సరగ్రస్తుల తలతన్నుతూనే వచ్చారు, తిరస్కృతులు.

ప్రతిభా, ప్రావీణ్యమూ వొకరి సొమ్మేకావుగా?

కాక, విద్యార్థి అయినవాడి కాత్మవిశ్వాసంవుంటే — దీక్షవుంటే — అభిమానమూ పౌరుషమూవుంటే యెంతోవుపకారం చేస్తుందీ ప్రవృత్తి.

ఆమనిషికి వచ్చినవిద్య తనకెందుకు రాదూ?

ఆవిద్యసాధించడంలో ఆమనిషి చూపించిన ఏపరాకాష్టతా నెందుకు చూపించ కూడదూ?

ఇలాంటి వూహాలందరికీ వుండవు, నిజమే.

ఇలాంటి కసి అందరికీ వుండదు, సత్యమే.

ఉండినా, చివరిదాకా నిలవనూ నిలవవు కొందరికి.

నిలిచాయా, కోటలో పాగా వేశానన్న మాటే యివతలిమనిషి.

అయితే బుద్ధిగ్రహణ సమర్థమేగాని — ప్రతిభకూడా నవనవోన్మేషితమే గాని - ప్రవృత్తి జాడ్యజుష్టం అప్పుడూవుంటుందప్పు డప్పుడు.

కాగా — గురువుకి పరమానుగ్రహం వుండడంచాలదు, తనదీక్ష యేమాత్రం అయినాసడలకుండా వుండదు, యేమిటేమిటో విప్రతిపత్తులూ

యేర్పడకుండా వుండవు — అయినా, విద్యార్థి అయినవాడు ఎక్కడో వొక్కడ ఎవరిచేతనో వొకరిచేత యిలాంటిదెబ్బ తిన్నాడా — చాలు పుంభావ సరస్వతి అయిపోతాడు.

అనుకోకేపోవాలిగాని, దీక్షా యేకాగ్రతా నిత్యప్రసన్నాలు మానాయనగారికి.

దీనికి, సాయం, అటు, నరసింహయాజులుగారికి మాటయిచ్చిన భాధ్యతా, యిటు పాపయ్య సోమయాజుగారిని నీలెక్కేమిటి బావా? అని దెకారించాలన్న కసిని.

నిద్రహారాలు మరచి పోయారు మానాయనగారు.

కథాక్రమం యెలాగంటె?

సంసారంమీద పడిందప్పటికి, కనక,యింటోనేవుండి సాధించుకోవాలది.

ఇంతేకాదు, మునికొండవలిలో అది చెప్పగల గురువులేడు. సొంతంగానే సాధించుకోవాలి.

మాతాతగారు రాసిన తాటాకు గ్రంథాల్లో ఆపుస్తకం దొరికింది; గాని రుక్కుల ఆద్యంతాలు మాత్రమే సమగ్రంగానూ సక్రమంగానూ రాసి మధ్యభాగాలు కుప్తులుపెట్టి పూర్తిచేసిందది.

సంతలూ వల్లెలూ పూర్తిచేసుకుని యేకరుపెట్టుకునే వారికి మాత్రమే వుపయోగిస్తుందది.

కాగా, వొకవిధంగా అది వుండినా లేనిదే అయింది.

మరొకవిధంగా అదయినా దొరికింది. అందుకే సంతోషించారు మానాయనగారు.

ధర్మమే.

తపనా, దీక్షావున్నచోట సాధనం యేపాటిదయినా పనికొచ్చిపోతుంది.

నేను పోలవరంలో ప్లీడరుగుమస్తా నేర్చుకునే రోజుల్లో యూరపియను ఏజెన్సీకలెక్టరు వేటకుబయలుదేరి, మాటుచేరుకోకపూర్వమే పులి యెదురుకాగా, నౌకర్ని తనకడ్డంగా నుంచోబెట్టుకుని, వాడి భుజంమీదగా తుపాకిపెట్టి కాల్చి చంపాడు దాన్ని.

తుపాకీతోగాదు, విల్లమ్ములతోగాదు, బల్లెంతోగాదు, కత్తితోగాదు, కైజారుతోనయినా కానేకాదు — చేతిలోవున్న ములకాటికర్ర తిరగవేసి తల

పగలేటట్లోనక్కేదెబ్బ కొట్టి పెద్దపులిని చంపారు. మాపితామహుల పితామహుల అక్క సోమయాజులుగారు.

'క్రియాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే'

కనక, ఆ అసమగ్ర గ్రంథంలోనే ఆశ్వీనం సాధించారు మానాయనగారు.

యానమండ్ర సుబ్బావధానులుగారిని ముక్కామల గ్రామంలో మరో బ్రాహ్మణ్యులు.

ఋగ్వేదులువారు.

తమవేదం అంతా క్షుణ్ణంగా వచ్చిన వారున్నూ.

అత్తవారింటికి ముక్కామల వెళుతూ వస్తూ వుండటంలో మానాయన గారికి ఆయనకూ చిరమైత్రి.

ఆయనచేత చెప్పించుకుని మానాయనగారు ఆవరసన సుక్కులన్నీ పూర్తిగా రాసుకున్నారు.

తరవాత పగలనిలేదు, రాత్రనిలేదు ఒకటే వల్లన

ఆశ్వీనం ఋగ్వేదం లోందే అయినా — ఉదాత్తా నుదాత్తా స్వరితాలతో దానికి నియతమైన వొక స్వరంవుండినా చయనంలో ఉచ్చైస్వరంలోనే దానికి వినియోగం.

శ్రౌతం వచ్చివుండినవారికది సుపరిచితమే, దానికోసం సంతలు చెప్పుకోనవసరం లేదు.

కాగా,- సక్ళదావృత్తిగా కాక పారాయణ ప్రారంభించారు ముందది. నలిగాక వల్లెలున్నూ ప్రారంభించారు.

ఇక కూచునివల్లె, నడుస్తూవల్లె, చివరికి పడుకునిన్నీవల్లె. ఆవల్లనలో ఒకవిశేషం

ఇంటోకల్లా పిన్నలు కావడంవల్ల, విస్తరాకులూ కూరలూ వగైరా సమకూర్చవలసిన విధి మానాయనగారిది.

ముసికొండపలి ప్రాంతంవారు ఉప్పుతో తొమ్మిదిరసాలూ రాజమహేంద్ర వరం వెళ్ళే! కొనుక్కోడం ఆరోజుల్లో.

బీదలదీ సాదలదీకూడా అప్పుడుడందరిదీ వొకటేఅంతస్థు ఇలాంటి సందర్భాల్లో.

ఎక్కడికిబయులుదేరినా, వెళ్ళేటప్పుడూ వచ్చేటప్పుడూ కూడాయేదో వొకటివల్లించుకుంటూ వుండడం మానాయనగారి కలవాటు

వేదశ్రౌతాలు వల్లించే నారాయణుడుంటే, అప్పటికీ యిప్పటికీ యెప్పటికీ.

ఈలాగ వాటిలో, అధ్యయనంచేటప్పుడు రాజమహేంద్రవరం ప్రయాణం తగిలితే, తెల్లవారగట్ల బయలు దేరడమూ, చీకటివుండినంత సేపూ వచ్చివుండిన గ్రంధం వల్లెకరువు పెట్టుకోడమూ తూర్పు తెల్లవారుతోందనగా కోటిలింగాలు చేరుకు నిలకడ దంతధావనాదికం కానిచ్చుకోడమూ, అప్పుడు బజారుకెళ్ళి కావలసిన సామగ్రికొనుక్కుని మూటకట్టి నెత్తినిపెట్టుకుని పుస్తకం విప్పివొకచేతపట్టుకుని శాస్త్రగ్రంథం వల్లెవేసుకుంటూ వెనక్కిబయలు దేరడమూ రమారమి పాతిక మైళ్ళు నడిచి భోజనాల వేళకల్లు చేరుకోడమూ ఇలాగవల్లించారట నారాయణగారు.

విద్యాపిపాస అంటువున్నచోట దీక్షకూ యేకాగ్రతకూ ఇంతకంటే పారమ్యమేమి వుంటుంది?

ఇలా సాధనచేస్తే విద్యలు రాకపోడమున్నా యేమిటి?

నారాయణగారిలాగానే తక్కిన యువకులూ అసాధారణ సాధన చేశారు.

వారికీ స్వాములవారిమీదకనే! యాజులుగారిని వెలిపెట్టినందుకు.

ముహూర్తం సమీపించింది.

స్వాముల వారెప్పటికప్పుడు తెలుసుకుంటూనే వున్నారు.

ఎత్తులమీద యెత్తులున్నూ వేసుకుంటూనే ఉన్నారు.

ఆసీను వారి చూపులన్నీ వేగేశ్వరపురం మీదనేవున్నాయి.

ఇరుగు పొరుగు జిల్లాల పండితులున్నూ వేగేశ్వరపురం వార్తలకోసమే యెదురుచూస్తున్నారు వచ్చివాలడానికి.

ముహూర్తంగానే వచ్చింది.

నరసింహయాజులుగారి పట్టుదలా యువకుల దక్షతా యాగవిశేషాలు చూడ్డానికి అనుకోనివారున్నూ సంతోషంగా వేలూ వచ్చి వాలారు వేగేశ్వరపురంలో బ్రాహ్మలు.

అన్నదానం భరద్వాజ విందును కాదనిపించింది.

ఋత్విక్కులు తాండవంచేశారు, ఉత్సాహోద్రేకాలతో.

యుక్త సమయాన, పండితులూ ఋత్విక్కులూ చుట్టాలూవందలకొద్దీ అనిమిషులై ఆత్రంగా చూస్తూవుండగా, అఖండ గోదావరి ప్రవాహంతగా

గుక్క తిప్పు కోకుండా వీణపలుకు తన్నట్టాశ్వీసం కానిచ్చి అప్పుడు కళ్ళు తెరిచారు మానాయనిగారు.

ఆనంద ధ్యానాలతో యాగశాల ముఖరితం అయింది.

కొంతగ్రంధం అయాటప్పటికి మానాయనగారికి నడ్డిసీలగ్గా,

'నేనున్నానుబావా, అంటూ వెనక్కివచ్చి తమమోకాలు వాపు ఆనించి పొదువుకుని వుండిన యాజులుగారు. బావా ఆమాత్రమే మాట్టాడగలిగిగుచ్చి కౌగలించుకుని, ఆనందాతి రేకంతో మూర్ధాఘ్రాణమున్నూ చేసి ఎవరోవాక జమిందారు తమకాసందర్భంలోనే బహూకరించిన పసుపుపచ్చని జలతారు కాశ్మీరుశాలువు విప్పి కప్పి బ్రహ్మానంద పరవశులయి పోయారు.

ఆశాలువు ముక్కలు మొన్న మొన్నటిదాకా వుండేవి మాయింటో యిప్పటి పురాణవస్తు సేకరణ పద్ధతి నాకప్పుడేమి తెలియదు, తెలిసివుంటే ఆముక్కలే పంచుకొని సాలగ్రామాలన్నట్లు చూసుకుంటూ వుందుం మేము.

అదియేమయినా, చయనం దేవదుందుభులు మోగేటట్టిలా పూర్తి కాగా, యీకోలాహలం గుండెలు బద్దలుకొట్టగా, స్వాములవారు, ఏనుగులూ లొట్టపిట్టలూ గుర్రాలో యెడ్లబళ్ళూ తోలించుకొని రాత్రికిరాత్రే బయలుదేరి మరోసీమకి తరలిపోయారు, అంధకారాన కుంఠనంతో.

తరవాత, ఆవిజయానందంతో అంతకంటే యెక్కుగా దీక్షపట్టి, డెబ్బయ్యిద్దరు ఋత్విక్కులనూ స్వయంగా తయారుచేయించుకుని అంతకంటేనూ ఘనంగా సర్వతోముఖయాగమున్నూ చేసి చయనులుగా రయివుండిన నరసింహ యాజులుగారు ఏలూరిపాటి నరసింహ సర్వతోముఖ యాజులుగారున్నూ అయినా రచిర కాలంలోనే.

అట్టి ఏలూరిపాటి నరసింహ సర్వతోముఖ యాజులుగారి పౌత్రిని ధర్మపత్నియే యీ రచయిత్రి శ్రీమతి లక్ష్మీసరస్వతిగారు. ఇట్టి పురాణగ్రంధములను అనువదించి అట్టివంశముయొక్క కీర్తిని యినుమడింపజేసి ఆంధ్రలోకము నానందముగ తేల్చిరి.

కొత్తపేట

ఇట్లు

బి. రామకృష్ణమ్మ. B. A.

Social welfare officer

శ్రీ గణేశాయనమః

# ఆంధ్రవచన శివ మహాపురాణము

## శతరుద్ర సంహిత ప్రారంభము

## ప్రథమాధ్యాయము

### పంచబ్రహ్మావతారకథనము

శ్లో॥ వందే మహానంద మనంతలీలమ్
మహేశ్వరం సర్వవిభుం మహాన్తం
గౌరీప్రియం కార్తికవిఘ్నరాజ
సముద్భవం శంకర మాదిదేవం.

మరల శౌనకాదులు సూతు నిట్లు ప్రశ్నించిరి. "సూతా! నీవు వ్యాసశిష్యుడవు. మహాభాగుడవు. జ్ఞానదయాసింధు వగునో మహర్షీ! శివుడు ఏయే యవతారము లెత్తి యేయే సత్పురుషుల రక్షించెనో చెప్పుమనగ సూతు డిట్లు చెప్పదొడంగెను. "ఓమునులారా! నేను శివావతారవిశేషములు చెప్పెదను జితేంద్రియులై శ్రద్ధాభక్తులతో వినుడు. పూర్వము సనత్కుమారు డిట్లే నందీశ్వరుని ప్రశ్నింప నతడిట్లు చెప్పదొడంగెను"

అసంఖ్యాకములైనకల్పములందు సర్వేశ్వరు డనేకయవతారంబులు ధరించియుండెను. వాటిలో కొన్నిటి నామతి ననుసరించి చెప్పెద వినుము. పందొమ్మిదవ కల్పమైన శ్వేతలోహితకల్పమున ప్రథమమున సద్యోజాతావతారమును ధరించె నని చెప్పుదురు. ఈకల్పమం దొకానొకప్పుడు బ్రహ్మ పరబ్రహ్మను ధ్యానింపుచుండ బ్రహ్మనుండి శిఖలతో కూడిన శ్వేతలోహితకుమారుడు ఉద్భవింప నతడు గాంచి ఇతడు పరబ్రహ్మస్వరూపు డగు పరమేశ్వరు డని తలచి దోసిలొగ్గి నమస్కరించి ఈమూర్తిని హృదయంబున ధ్యానింపుచు నీసద్యోజాతు డగు పురుషుడు, భువనేశ్వరు డగు శివు డని తెలిసికొని మాటిమాటికి నామూర్తిని ధ్యానింపుచుండ మరల బ్రహ్మనుండి శ్వేతవర్ణులు మహాయశస్వులు పరమవిజ్ఞానులు పరబ్రహ్మ

స్వరూపులు నగు సునంద నందన విశ్వనందన ఉపనందను లనెడు నలువురు కుమారులు ఉద్భవించిరి. వీరలు శ్వేతలోహితుడు పరమేశ్వరు డని తెలిసికొని ఈనల్వురు నీమహాత్మునకు శిష్యు లైరి. తదుపరి శ్వేతలోహితుడు బ్రహ్మకు తత్వజ్ఞాన ముపదేశించి సకలసృష్టిశక్తి నిచ్చియుండెను. ఇది ఈశ్వరుని మొదటిదగు సద్యోజాతావతారము.

తదుపరి ఇరువదవ కల్పమున బ్రహ్మ యరుణవర్ణంబు గల్గి పుత్రకాముడై పరమేశ్వరుని ధ్యానింప, రక్తమాల్యాంబరధరుడు, రక్తాక్షుడు, రక్తభూషణుడు నగు కుమారుడు జనింప నితడు వామదేవు డగు శివు డని గ్రహించి, కృతాంజలిపుటుడై నమస్కరించి ధ్యానింపుచుండ నితని వెంబడి నలువురు రక్తవస్త్రధారులు జనించిరి. వీరు విరజుడు, వివాహుడు, విశోకుడు, విశ్వభావను డనెడి నామంబులు గల్గి వామదేవుడు బ్రహ్మకు జ్ఞానోపదేశము చేసి సృష్టిశక్తి నిచ్చియుండెను. ఇది ఈశ్వరుని వామదేవావతారము. ఇది అరుణవాసకల్ప మని చెప్పబడెను.

పిమ్మట ఇరువదియొకటవ పీతవాసకల్పమున బహ్మ పీతవాసుడై పుత్రార్థియై ధ్యానము చేయుచుండ, పీతవాసుడు యౌవనవయస్కుడు, మహాతేజుడు, మహాభుజుడు నగు తత్పురుషాఖ్యు డగు శివు డుద్భవింప బ్రహ్మ ఇతనిని పరమేశ్వరు డని గ్రహించి ఆమూర్తిని మనంబున నిల్పుకొని ధ్యానింపుచు శివగాయత్రిని జపింప శివుడు సంతసించెను. ఇతనివెనువెంట శివతుల్యు లగు నలువురు కుమారులు జనించిరి. వీ రందఱు కూడ తత్పురుషనాములై, తత్పురుషనాము డైన పరమశివునకు శిష్యు లైరి. ఇది పీతకల్ప మని చెప్పబడెను. వీ రందఱు బ్రహ్మ నాశీర్వదించి సృష్టి చేయుసమర్థత నిచ్చియుండిరి. ఇది తత్పురుషావతారము.

పిమ్మట ప్రపంచమంతయు జలార్ణవమగ్నమై యుండ, బ్రహ్మ కృష్ణవర్ణుడై జగత్సృష్టి యెట్లు జరుపవలె నని విచారింపుచు పరబ్రహ్మను ధ్యానింపుచుండ, కృష్ణవర్ణుడు, కృష్ణాంబరధరుడు, కృష్ణాంబరోష్ణీషుడు, కృష్ణమాల్యధరుడు, కృష్ణానులేపుడు, కృష్ణమకుటుడు నగు ఘోరపరాక్రము డగు అఘోరుడు జనింప, కృష్ణపింగళగాత్రు డగు నాదివ్యపురుషుని

బ్రహ్మ గాంచి ఇతడు పరమశివు డని గ్రహించి నమస్కరింప, ఆమూ ర్తిని ధ్యానింపుచు ననేకవిధంబుల స్తుతింపుచుండ, నతని పార్శ్వమున కృష్ణగాత్రులు, కృష్ణాంబరమాల్యశోభితులు, కృష్ణయజ్ఞోపవీతులు, కృష్ణశి ఖాలంకారులు నగు నల్గురు మూర్తు లుద్భవించి, అఘోరునకు శిష్యు లైరి. వీరందఱు బ్రహ్మసృష్టికి తోడ్పడుచు నతనికి సర్వశక్తుల నిచ్చి యుండిరి. ఇది నాల్గవదైన అఘోరావతారము. ఇది కృష్ణకల్ప మని చెప్పబడెను,

తదుపరి బ్రహ్మకల్పము ప్రారంభము కాగా బ్రహ్మ విశ్వరూపు డనుపేరుతో పుత్రకాముడై మనసార పరబ్రహ్మను ధ్యానింపుచుండ, పెద్దనాద ముద్భవిల్లి దానినుండి విశ్వరూప యను సరస్వతి యుద్భవించెను. తదుపరి శుద్ధస్ఫటికరూపుడై, సర్వాభరణభూషితుడై పరమేశ్వరు డగు నీశాను డని గ్రహించి నమస్కరించి, సర్వగుడు, సర్వదాత, సర్వరూ పుడు నగు నీశానుని స్తుతింప, నతడు బ్రహ్మకు సన్మార్గము తెలిపి తనశక్తిచే జటీ, ముండీ, శిఖండి అర్ధముండి యను నామంబులు గల కుమారచతుష్టయమును సృజించి వారలకు యోగ ముపదేశింప, వారు యోగగతిని పొందిరి. ఇది పంచమ మగు ఈశానావతారము.

సద్యోజాతుడు, వామదేవుడు, తత్పురుషుడు, అఘోరుడు, ఈశాను డనెడి నామములతో శివుడు పంచమూర్తిస్వరూపములతో వెలసి జగద్వి ఖ్యాతుడై యుండెను. ఇతడు సర్వలోకహితమునకై సకలబ్రహ్మాండములు వ్యాపించి యుండెను. వీరిలో నీశానుడు గొప్పవాడని చెప్పబడుచుండెను. ఇతడు ప్రకృతిభోగము లనుభవించుటకై క్షేత్రజ్ఞు డనెడిపేరుతో నుండెను. తత్పురుషుడు రెండవవాడుగా చెప్పబడుచుండెను. ఇతడు సత్వరజస్తమో గుణసంజాత మైన భోగము లనుభవించుచు సర్వజ్ఞుడై యుండెను. అఘోరుడు తృతీయుడుగ జెప్పబడుచుండెను. ఇతడు ధర్మప్రధాన మైన బుద్ధితత్వస్వరూపుడు. నాల్గవవాడు వామదేవు డనెడి పేరుతో నుండెను. ఇత డహంకారమున కధిష్ఠానదేవతయై, సదా సర్వకార్యములను చేయు చుండును.

శివస్వరూపు డగు సద్యోజాతు డైదవవాయుగ నుండెను. ఈశాను డాకాశాధిష్ఠానదేవతయై శ్రోత్రవాగింద్రియములకు ప్రభుడై యుండెను. మఱియు త్వక్పాణిస్పర్శల కతడు వాయురూపుడై యధిష్ఠానదేవతగా నుండెను. బుద్ధిమంతు లగు పురుషులు దీనిని బాగుగా గుర్తించి మెలగినచో సాక్షాచ్ఛివస్వరూపు లగుచున్నారు.

శరీరరసరూపాగ్నికి అఘోరు డధిష్ఠానదేవతగా నుండెను. బుద్ధిమంతులు దీనినే యఘోరరూప మందురు.

వామదేవుడు జిహ్వోపస్థలయందలి జలమున కధిష్ఠానదేవతగా నుండెను.

సద్యోజాతుడు నాసిక, శిశ్నేంద్రియగంధభూమికలకు అధిష్ఠానుడై యుండెను. ఇట్టి స్వరూపములతో గూడిన శంకరుడు వందనీయుడు. శ్రేయఃకాము లీస్వరూపమును పూజింపవలెను. ఈసద్యోజాతాది పంచస్వరూపములు శ్రవణ, మనన, పఠనాదులచే నిరూపరసౌఖ్యము లొందగలవు.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు
ఒకటవ అధ్యాయము సంపూర్ణము.

---

## రెండవ యధ్యాయము

### అష్టమూర్తిస్వరూప వర్ణనము

పూర్వమునం దీశ్వరుడు సనత్కుమారునితో నిట్లుచెప్పదొడంగెను. అష్టమూర్తిస్వరూపు డగు పరమేశ్వరుడు లోకమందు సర్వకార్యములు చేయుచు సర్వులకు సర్వసుఖంబు లిచ్చుచు నీపరమేశ్వరు డష్టమూర్తిస్వరూపుడై సూత్రమందలి మణులవలె సర్వజగత్తులయందు వ్యాపించి యుండెను. శర్వుడు, భవుడు, రుద్రుడు, ఉగ్రుడు, భీముడు, పశుపతి, ఈశానుడు, మహాదేవుడు అనునామంబులతో నష్టమూర్తులు ధరించెను. భూమికి శర్వుడు,

జలమునకు భవుడు, అగ్నికి రుద్రుడు, పవనున కుగ్రుడు, ఆకాశమునకు భీముడు, క్షేత్రజ్ఞునకు పశుపతి, సూర్యున కీశానుడు, చంద్రునకు మహాదేవుడు, నధిష్ఠాన దేవతలుగ నుండిరి.

ఇతడు విశ్వంభరాత్మకమైన చరాచరరూప మంతయు ధరించుచుండెను. ఈశంకరునే మహేశ్వరు డని శాస్త్రవేత్తలు చెప్పుచుండిరి. పరమేశ్వరుడు జలస్వరూపుడై సకలజీవంబులను జీవింపజేయుచుండెను గాన, **భవు** డని చెప్పబడుచున్నాడు.

పరమేశ్వరు డంతర్బహిఃస్థితుడై సర్వము భరించుచు చలింపజేయుచుండెను గాన నుగ్రు డని చెప్పబడుచున్నాడు.

సర్వావకాశములయందు నాకాశరూపుడై సర్వదా నిండియుండి యణువులలో నణువుగను, మహాత్ములలో మహాత్ముగను, భయంకరులకు భయంకరుడుగ నుండుటచే భీము డని చెప్పబడుచుండెను.

మఱియు నీతడు సర్వాత్మలకు నధిష్ఠానుడై యుండి, నరక్షేత్ర నివాసుడై, పశుపాశవిచ్ఛేదకుడై యుండుటచే పశుపతి యని చెప్పబడుచున్నాడు.

గగనమందు సూర్యుడై ముల్లోకముల ప్రకాశించుచుండెను, గాన ఈశాను డని చెప్పబడుచుండెను.

చంద్రుడై అమృతమును కురియించుచు విశ్వమంతయు తృప్తి నొందించుచుండెను, గాన మహాదేవు డని చెప్పబడుచున్నాడు. ఈయష్టమూర్తులు పరమాత్ముడగుశివుని కాత్మస్వరూపమై యుండెను. విశ్వమంతయు శివాత్మకమై సర్వవ్యాపకమై యుండెను. వృక్షమూలము తడిపినచో సకలశాఖలు వృద్ధినొంది పుష్పించి ఫలించునట్లు పరమేశ్వరు నర్చించినచో సకలవిశ్వము నర్చించినట్లగును. తండ్రి పుత్రపౌత్రులను గాంచి సంతసించినట్లు శంకరుడు విశ్వమును గాంచి సంతసించును. పరమేశ్వరు డష్టమూర్తిస్వరూపుడై సర్వజీవదేహధారులయందుండును గాన, నే దేహమునకు కష్టము కల్గించినను, పరమేశ్వరునకు కష్టము కల్గించినవా రగుదురు. శివు డష్టమూర్తిస్వరూపుడై

ప్రపంచ మంతయు వ్యాపించియుండెను, గాన పరమకారణుండగు రుద్రుని సదా సేవింపవలెను. శ్రేయస్సులు కోరువారీపరమేశ్వరుని తప్పక సేవింతురు.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు
రెండవ యధ్యాయము సంపూర్ణము

---

## మూడవ యధ్యాయము

### అర్ధనారీశ్వర స్వరూపము

ఇటుపై నుత్తమంబైన యర్ధనారీశ్వరశివరూపము చెప్పెద విను, మని నందీశ్వరుండు సనత్కుమారునితో నిట్లు చెప్పదొడంగెను. పూర్వము బ్రహ్మ తన సృష్టి వృద్ధినొందుట లేదని దుఃఖావిష్టుడై విచారింపుచుండ నింతలో మైథునసృష్టి గావింపు మని నభోవాణి వలుక, గగనవాక్కులు విని బ్రహ్మ యిట్లు యోచింపదొడంగెను.

పూర్వము పరమేశ్వరుడు కూడ నారీసృష్టి చేయలేదు. నేను మాత్రము నారీసృష్టియెట్లు చేయగల్గుదును? ఈశ్వరానుగ్రహము లేనిచో నారీసృష్టి చేయలేను. పరాశక్తితో గూడిన పరమేశ్వరుని ధ్యానించి నారీసృష్టి గావించి మైథునసృష్టి గావింతు నని తలచి ఉమామహేశ్వరుల మనంబున ధ్యానింపుచు నుగ్రతపంబు చేయ మొదలిడెను. విధాత తపంబున కచిరకాలంబుననే ఈశ్వరుడు సంతసించి అర్ధనారీశ్వరరూపంబున బ్రహ్మ యెదుట సాక్షాత్కరింప నతడు శక్తితో గూడిన పరమేశ్వరుని గాంచి, సాష్టాంగదండనమస్కారము గావించి కృతాంజలియై స్తుతింప, విశ్వకర్త, మహేశ్వరుడు నగు మహాదేవుడు సంతసించి మేఘగంభీరవాక్కులతో, ఓబిడ్డా! ఓపితామహా! నీమనోరథ మెరింగితిని. నీవు ప్రజాసృష్టికై తపంబుచేయుచుంటివి. నీతపంబునకు మెచ్చి నీయభీష్టము నెరవేర్పదలచితిని. పరమోదారస్వభావు

డగు నీశ్వరుడు మధురవాక్కులు పల్కుచు తనశరీరభాగమందలి పరమేశ్వరిని వేరుచేసి స్త్రీస్వరూప మతనికి చూపించ బ్రహ్మ మాయాపరాశక్తిని గాంచి సత శిరస్కుడై నమస్కరించి ఓ దేవీ! నీపతి యగు పరమేశ్వరుడు పూర్వము నన్ను సృజించి, ఇతరప్రజలను కూడ సృజించెను. నే నతని యనుగ్రహముచే దేవతలను, మహర్షులను, మానసముగ సృజించితిని. నేను మాటిమాటికి నెంతగా సృజించినను, నాసృష్టి వృద్ధి నొందుటలేదు గాన, నే నిటుపై మైథున సృష్టి గావించితిని. నే నింతదనుక నారీసృష్టి గావింపలేదు. ఇందుకు నే నసమర్థుడ నైతిని. సర్వశక్తులు నీశక్తినుండియే జనింపుచున్నవి. నాకు సకల శక్తుల నిమ్మని సకలేశ్వరి వగు నిన్ను ప్రార్థింపుచుంటిని. ఓశివే! నీకు నమస్కారము. నాకు నారీకులసృష్టిసమర్థత నొసంగుము.

ఓ శివప్రియే! సకలచరాచరసృష్టికి కారణభూతురాలవు. నీవు నాకోర్కె దీర్పుము. చరాచరసృష్టి వృద్ధి నొందించుటకై నీవు నాకుమారు డగు దక్షు నకు పుత్రికవై జనింపుమన, పరమేశ్వరి తనభ్రూమధ్యమునుండి తన యాత్మ తుల్యమగు నొకశక్తిని సృజింప మహేశ్వరు డాశక్తిని గాంచి చిరునవ్వు నవ్వుచు ఓ దేవీ! పరమేష్ఠి యగు బ్రహ్మ తపస్సుచే నిన్నారాధింప నీవు ప్రసన్నురాలవై యతని సకలేప్సితంబులు నెరవేర్పుమన, ఆ దేవి యీశ్వరా జ్ఞను శిరసావహించి దక్షుపుత్రికయై జనించెను. తదుపరి పరాశక్తి బ్రహ్మ కనేకశక్తుల నొసంగి మరల శివునియం దైక్య మయ్యెను. తదుపరి పరమే శ్వరుడు కూడ నదృశ్యుడయ్యెను. బ్రహ్మ, శక్తిస్వరూపము తనమనంబున నిల్పుకొని, యనేకస్త్రీలను సృజించి, మైథునసృష్టి గావించెను. సర్వలోకమం గళదాయక మగు నీయర్ధనారీశ్వరస్వరూప వర్ణనము చదివినవారు సకల కోర్కెలీడేరి ఇహపర సౌఖ్యము లనుభవించి శివసాయుజ్యము నొందెదరు.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు

మూడవ అధ్యాయము సంపూర్ణము

---

# నాలుగవ యధ్యాయము

## వ్యాసశంకరావతారములు

శివుఁ డొకానొకపుడు బ్రహ్మతో నిట్లు పల్కెను. సప్తమవరాహకల్ప మన్వంతరమున సర్వలోకప్రకాశుఁడనైన నేను, నీకు మునిమనుమఁడను కాఁగలను. మరల చతుర్యుగమన్వంతరాంతమున లోకహితమునకై జన్మింపగలను. స్వాయంప్రభువునామంబున ప్రథమ ద్వాపరయుగమున వ్యాసుఁడై జన్మింపగలను. పరమాత్ముఁడ నగు నేను బ్రాహ్మణహితమునకై కలియుగాంతమున పరాశక్తి సహితుఁడనై శ్వేతమహామునినై జన్మించి హిమవత్పర్వతశిఖరమునందు వసింతును. అట్టితరి శ్వేతుఁడు, శ్వేతశిఖుఁడు, శ్వేతాశ్వుఁడు, శ్వేతలోహితుఁడు, ననువారలు శిఖలు ధరించి నన్ననుసరించి నాకు శిష్యులై, ధ్యానయోగులై, తత్త్వవేత్తలై, నన్నధ్యయనించి భావించి సద్భక్తి గల్గి నన్ను సేవింపుచు జన్మమృత్యుజరాహీనులై పరబ్రహ్మానందానుభవులై యుందురు. మనుజులు దానధర్మాదిసత్క్రియలచేతను, ధ్యానయోగములచేతను, నన్ను పొందగలరు. లేనిచో నన్ను పొందలేరు.

ద్వితీయద్వాపరమున సత్యప్రజాపతినామంబున వ్యాసుఁడు జన్మించును. వాని తదనంతరకలియుగమున నేను సుతారుఁ డనెడి నామంబున విఖ్యాతి నొందగలను. అపుడు నాకు దుందుభి, శతరూపుఁడు, హృషీకుఁడు, కేతుమంతుఁడు నను వేదవేత్త లగు నల్వురు శిష్యు లుందురు. వారు నా యవ్యయతత్త్వమును గ్రహించి ధ్యానయోగులై నాపురము ప్రవేశించి నన్ను సేవించి ముక్తి నొందెదరు.

తృతీయద్వాపరంబున భార్గవనామంబున వ్యాసుఁడై జన్మించును. అట్టితరి నేనాపురసమీపమున దమనుఁ డను పేరుతో విఖ్యాతి నొంది పుత్రచతుష్టయమును బడయ గల్గుదును. వారు విశోకుఁడు, విశేషుఁడు, విపాపుఁడు, పాపనాశుఁ డనెడి నామంబులతో నుండి వ్యాసశిష్యులై యతనికి సహాయము చేయుచు నివృత్తిమార్గపరులై సంచరించెదరు.

చతుర్థ ద్వాపరమందు అంగిరసు డను నామంబున వ్యాసుడై జన్మించును. అపుడు నేను సుహోత్రు డను పేరుతో నుందును. అపుడు నాకు యోగసాధకు లైన సుముఖుడు, దుర్ముఖుడు, దుదర్భుడు, దురతిక్రముడు నను నల్వురు పుత్రులు గల్గి వ్యాసశిష్యులై యతనికి సహాయము చేయుచుందురు.

పంచమద్వాపరమందు సవితృనామంబున వ్యాసుడై జన్మించును. అపుడు నేను కంకు డనుపేరుతో మహాతపస్వినై యుందును. అపుడు నాకు సనకుడు, సనాతనుడు, ప్రభుడు, సనందుడు నను మహాత్ములు యోగసాధకులు నగు నల్వురు పుత్రు లుండెదరు. వారు కూడ వ్యాసశిష్యులై యతనికి సహా యులై యుందురు. మఱియు వారు నిర్మలులు, నిరహంకారులు నైయుందురు. అప్పటివ్యాసుడు కూడ నివృత్తిమార్గమున చరించుచుండును. అపుడు నేను కంకు డనుపేరుతో నతనికి సహాయము చేయుచుందును.

ఆరవద్వాపరమందు లోకహితమునకై మృత్యునామంబున వ్యాసుడై జన్మించి వేదవిభాగకర్తయై యుండును. అట్టితరి నేను లోకాక్షు డనుపేరుతో నివృత్తి మార్గుడనై యుండి వ్యాసునకు సహాయముగ నుందును. అపుడు నాకు సుధాముడు, విరజుడు, సంజయుడు, విజయుడు, ననువారలు దృఢవ్రతులై నాకు శిష్యులై యుందురు.

సప్తమద్వాపరమందు శతక్రతువు నామంబున వ్యాసుడగును. అట్టి తరి నేను సర్వజైగీషుడనై దృఢయోగినై, మహాయోగవిచక్షణుడనై, దివ్యమైన కాశీక్షేత్రమందుండి గుహాంతరమందు కుశాసనాసీనుడనై వ్యాసునకు సహా యకుడనై భవబంధభీరువు లగుభక్తుల నుద్ధరించుచుందును. సారస్వతుడు, యోగీశుడు, మేఘవాహుడు, సువాహనుడు, నను నల్గురు పుత్రులను బడ యుదును.

అష్టమద్వాపరమందు వసిష్ఠనామంబున వ్యాసుడై యుండును. ఇతడు వేదవిభాగకర్తయై వేదవ్యాసుడై యుండును. నే నపుడు దధివాహను డను పేరుతో వ్యాససహాయకుడనై యుందును. అపుడు నాకు కపిలుడు, ఆసురి పంచశిఖుడు, శాల్వలుడు నను నామంబుల నల్గురు పుత్రు లుందురు. వారందఱు యోగములో నాతో సమానులై యుందురు.

తొమ్మిదవ ద్వాపరమందు సారస్వతు డనెడి వ్యాసు డుండును. అతడు నివృత్తిమార్గరతుడై ధ్యాననిష్ఠుడై యుండును. అపుడు నేను ఋషభ నాముడనై యుందును. పరాశరుడు, గర్గుడు, భార్గవుడు, గిరిశుడు, నాకు శిష్యులై యుందురు. నేను వారితోకూడ యోగమార్గము నభివృద్ధి చేయుచు, దృఢపరచుచు, వ్యాససహాయుడనై యుండి దుఃఖితు లగు భక్తుల ననేకుల నుద్ధరింపుచు దయాకరుడనై బ్రహ్మ నగునిన్ను కూడ నుద్ధరింపుచు యోగ వృషభుడనై సారస్వతవ్యాససహాయకుడనై భద్రాయు వనెడి నృపబాలకుని జీవింపజేసెదను. భద్రాయువు విషప్రయోగముచే మరణింప, నతని తండ్రి పుత్రుడు మృతి జెందెనని నిరాశ జెందియుండ నే నాబాలుని జీవింపజేసితిని. అప్పు డాబాలుడు షోడశవర్షప్రాయుడై యుండ, పుత్రుడు జీవించె నని తండ్రి ముదమంది న న్నెంతేని సత్కరించును. నే నపుడు రాజపూజ్యుడనై యాబాలునకు రాజయోగధర్మము లుపదేశించి, దివ్యకవచము, శంఖము, సర్వశత్రువినాశకర మైనదియు, ప్రకాశమాన మైనదియు, నగు ఖడ్గము నిచ్చి యతనిశరీరమంతయు భస్మము పూసి, ద్వాదశసహస్రగజబల మతని కిచ్చి భద్రాయువుచే పూజింపబడి నాస్థానమున కేగెదను. భద్రాయువు ధర్మ ముగ రాజ్యపాలనము చేయుచు కీర్తిమాలిని యనునామెను ఉద్వాహమాడ గలడు. ఇదియే నావృషభావతారము. ఈ నాతొమ్మిదవ యవతారంబున దీనుల నుద్ధరించి సత్పురుషుల రక్షించెదను. వృషభచరిత్ర పరమపవిత్ర మైనది. ఇది విన్నను, పఠించినను ఆయుర్యశంబులు స్వర్గము లభించును.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు

నాలుగవ అధ్యాయము సంపూర్ణము

# అయిదవ యధ్యాయము

## "వ్యాస శంకరావతారములు

దశమద్వాపరంబున త్రిధామనామంబున వ్యాసు డుండగలడు. అతడు నగోత్తమంబైన హిమభూధరశిఖరమం దుండి తపంబు చేయుచుం డును. నేనును వేదానుగాము లగు బలబంధు, నరామిత్ర, కేతుశృంగ, తపోధన, అనునామంబులు గల పుత్రులతో నటనే యుండి తపంబు చేయుచుందును.

పదునొకండవ ద్వాపరంబున త్రివ్రత్తుడను వ్యాసు డుండును. అట్టితరి నేను కవి యనుపేరుతో జన్మించి గంగాద్వారమందు తపంబు చేయుచుందును. లంబోదరుడు, లంబాక్షుడు, కేశలంబుడు, ప్రలంబకుడు, నను దృఢవ్రతులు నాకు పుత్రులై యుందురు.

ద్వాదశద్వాపరంబున వేదవిభాగకరు డగు శతతేజనామంబున వ్యాసు డుండును. ఇతడు వేదవిభాగము చేయును. ఆ ద్వాపరాంత కలియుగమునందు నేను జన్మించి హేమకవచధారుడనై అత్రి యనుపేరుతో వ్యాసునకు సహాయము చేయుదును, నివృత్తిమార్గప్రచారము చేయుదును. అపుడు నాకు సర్వజ్ఞుడు, సమబుద్ధి, శర్వుడు, సుయోగి, అనువారలు పుత్రు లగుదురు.

పదుమూడవ ద్వాపరంబున, ధర్ము డను నారాయణనామంబున వ్యాసు డుండ గలడు. అపుడు నేను బలి యనుపేరుతో మహామునినై యుత్తమంబైన గంధమాదనపర్వతమందు వాలఖిల్యాశ్రమమం దుండి శుభప్రదు లైన సుధాముడు, కాశ్యపుడు, వసిష్ఠుడు, విరజుడు నను వారలచే సేవింపబడుచుందును.

పదునాల్గవ ద్వాపరంబున రక్షనాము డగు వ్యాసు డుండును. అపుడు నేను అంగిరసుని వంశంబున గౌతము డనుపేరుతో వెలసియుందును. అపుడు నాకు అత్రి, అవశదుడు, శ్రవణుడు, శ్రవిష్కటుడు, ననువారలు పుత్రు లుందురు.

పదునేనవ ద్వాపరంబున త్రయ్యారుణు డనుపేరుతో వ్యాసు డుండును. అపుడు నేను వేదశిరోనామకుడనై మహాతేజోవంతమైన వేదశిరోనామకా స్త్రము ధరించి హిమాలయపర్వతపృష్ఠభాగమం దున్న వేదశిరోనామక శిఖరంబున సరస్వత్యుత్తరతటంబున నివసించెదను. కుణి, కుణిబాహు, కుశరీర, కునేత్రు లనెడి దృఢవ్రతు లగు నల్గురు సుతు లుందురు.

పదునారవ ద్వాపరంబున దేవముని యనుపేరుతో వ్యాసు డుండగలడు. అపుడు నేను గోకర్ణనాముడనై యోగప్రముడనై యుండగలను. నేనున్న ప్రదేశమునకు గోకర్ణవన మని పేరుండును. కశ్యప, ఉశన, చ్యవన, బృహస్పతి, యనునామంబులతో నగాధజలములవలె నతినిర్మలులై పరమయోగు లగు నల్గురు పుత్రులు నా కుండెదరు. వారందఱు యోగమార్గముచే తనే కైలాసము చేరుకొందురు.

పదునేడవ ద్వాపరంబున దేవకృతంజయు డనుపేరుతో వ్యాసుడు జన్మించును. నే నట్టితరి గుహావాసు డనుపేరుతో హిమగిరిశిఖరమం దుండగలను. ఉత్తుంగ హిమాలయ శివక్షేత్రమందు ఉతథ్యుడు, వామదేవుడు, మహాయోగుడు, మహాబలుడ నను నల్గురు నన్ననువర్తించి నాకు శిష్యులై యుందురు.

పదునెనిమిదవ ద్వాపరంబున కృతంజయు డను వ్యాసు డుండగలడు. ఆసమయంబున నేను హిమవన్నగశిఖరమున శిఖండి యనుపేరుతో నుండగలను. ఆసిద్ధక్షేత్రమందు మహాపుణ్యప్రదమైన శిఖండిపర్వతము, సిద్ధసేవితమైన శిఖండివనము కలవు. అట నాకు వాచశ్రవుడు, ఋచీకుడు స్యావాస్యుడు నను మహాయోగులు పుత్రులై యుందురు. వారందఱు తపోధనులై యుందురు.

పందొమ్మిదవ ద్వాపరంబున భరద్వాజనామంబున వ్యాసు డుండగలడు. అపుడు నేను జటీమాలి యను నామంబున ప్రకటింపబడుదును. అప్పటి నానల్వురుపుత్రులు హిమాలయశిఖరంబున కౌశల్య, లోకాక్షి, హిరణ్య, ప్రధిమి యనునామంబుల నుందురు.

ఇరువదియారవ ద్వాపరంబున పరాశరనామంబున వ్యాసు డుండ గలడు. నేను భద్రవటం బనెడి పురంబున సహిష్ణు డనెడినామంబున నుండ గలను. అలూకుడు, విద్యుతుడు, శంబూకుడు ఆశ్వలాయనుడు, నను తప స్వులు నలువురు నాకు శిష్యులై యుందురు.

ఇరువదియేడవ ద్వాపరంబున జాతూకర్ణనామంబున వ్యాసు డుండ గలడు. నేను ప్రభాసతీర్థంబున సోమశర్మనామధేయుడనై యుందును. అక్ష పాదుడు, కుమారుడు, ఉలూకుడు, వత్సుడు, నను వారలు నాకు శిష్యులై తపస్వులై యుందురు.

ఇరువదియెనిమిదవ ద్వాపరంబున శ్రీహరి పరాశరపుత్రుడై, కృష్ణ ద్వైపాయననామధేయుడై యుండును అట్టితరి పురుషోత్తము డగు కృష్ణుడు తనషష్ఠాంశముచే వసుదేవసుతుడై వాసుదేవుడనియు, శ్రీకృష్ణు డనియు పిలువబడుచుండును. అపుడు నేను యోగమాయచే యోగాత్ముడనై లోక మును మోహింపజేయుటకై బ్రహ్మచారినై, బ్రాహ్మణులకు హితము జేకూర్చుచు ప్రజారహితమైన నాశరీరమును యోగమాయచే శ్మశానమున విడిచి బ్రహ్మ నగు నితోడను, విష్ణువుతోడను కలసి మేరుగుహాయం దుండె దను. అపుడు నేను లంకులీనాముడనై యుండగలను. అనామయమైన నాశరీ రము విడిచిన ప్రదేశము సిద్ధక్షేత్రమగును. ఆప్రదేశము పృథ్వియున్నంత కాలము విఖ్యాతక్షేత్రమై యుండును. కుశికుడు, గర్గుడు, మిత్రుడు, కౌరుష్యుడు, నాకు శిష్యులగుదురు. నాకు యోగీశ్వరులు, బ్రాహ్మణులు, వేదపారగులు, నూర్ధ్వరేతస్కులు, నై మహేశ్వరయోగంబుచే శివధామమున కేగెదరు. ఇదంతయు వైవస్వతమన్వంతరమున కాగల దని శివుడు బ్రహ్మకు చెప్పియుండెను.

ప్రతిద్వాపరమందు వ్యాసు డుద్భవించుచుండును. ప్రతికలిప్రారంభ మున పరమాత్ముని యవతారములు కలుగుచుండును. ఈయోగేశ్వరావ తారము లన్నియు యోగమార్గప్రవర్తకములై యుండును. ప్రతికలి యందు యోగావతారములయందు నల్గురేసి చొప్పున శైవశిష్యు లుందురు. ఈపాశుపతశిష్యు లందఱు భస్మోద్ధూళితవిగ్రహులై రుద్రాక్షధారులై

త్రిపుండ్రాంకితమస్తకులై శిష్యసమేతులై ధర్మరతులై వేదవేదాంగపారగులై సదాలింగార్చనరతులై శాంభవధ్యాననిష్ఠులై నాయందు భక్తియోగంబు గల్గి, జితేంద్రియులై యుందురు. ఇరువదియెనిమిది. యవతారమునందు గల శిష్యులందఱు కలసి నూటపన్నెండుగు రుందురు.

ఇవియే నాయవతారలక్షణంబులు. ఇపుడు నీకు ఇరువదెనిమిది అవతారలక్షణంబులు చెప్పియుంటిని. అష్టావింశతిద్వాపరయుగమం దున్న వ్యాసుడు కృష్ణద్వైపాయను డనియు, బాదరాయణాచార్యు డనియు, పిలువబడును. దీసినే కృష్ణద్వైపాయనుఁ డల్పు మందురు. ఈ వ్యాసుడు శ్రోతుల యం దున్న బ్రహ్మలక్షణములు వేదాంతశాస్త్రములు పురాణగాథలుగా జెప్పుచుండును. ఇతడు సాక్షాద్విష్ణుస్వరూపుడై యుండును. అని ఇట్లు పరమేశ్వరుడు బ్రహ్మతో జెప్పి యదృశ్యు డయ్యెను.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు అయిదవ
యధ్యాయము సంపూర్ణము

## ఆరవ యధ్యాయము

### నందీశ్వరావతారము

సనత్కుమారుడు నందీశ్వరు నిట్లు ప్రశ్నించెను. ఓనందీశ్వరా మహాదేవాంశుడ వగు నీయవతార మెట్టిది? నీకు శివతత్త్వ మెట్లు ప్రాప్తించెను శివునెట్లు సేవింపగల్గితివో విన నిచ్ఛించుచుంటిని. గాన, చెప్పగోరుచుంటి నన, నందీశ్వరు డిట్లు చెప్పదొడంగెను. సర్వజ్ఞుడ వగు నోసనత్కుమారా! నేను శివాంశజుడనై శివు నెట్లు పొందగల్గితినో చెప్పెదను. సావధానచిత్తుడవై వినుము.

శిలాదముని సంతతి లేక పితృదేవతల నర్చించి వారిని మెప్పించి ఓపితృదేవతలారా! మీరు నావంశాభివృద్ధి గోరినచో నాకు సంతతి నిచ్చి

నాయభీష్టము నెరవేర్చి మీరును తృప్తినొందుడని యనేకవిధములఁ బ్రార్థింప, పితృదేవతలు సంతసించి ఓ శిలాదా! నీకు మెచ్చితిమి. నీవు పుత్రుని నిమిత్తమై తపంబు చేసి దేవతల మెప్పించి సంతానము బడసి మమ్ముల నుద్ధరింపు మన, శిలాదుడు సంతుష్టుడై, అధోదృష్టి కలవాడై ధర్మాత్ముడై మునివృత్తి నవలంబించి కైలాసగిరి కేగి పుత్రార్థియై ఇంద్రు నిగూర్చి దుష్కరతపంబుచేయుచు నిశ్చలాత్ముడై బహుకాలము గడప, దేవతాప్రభు వగు దేవేంద్రుడు సంతసించి వరమీయ నేతెంచి, ఓశిలాద మునీ! నీ తపంబునకు మెచ్చితిని. వరము కోరుకొమ్మన, శిలాదుడు శక్రునకు నమస్కరించి స్తుతించి, అయోనిజుడు, మృత్యుహీనుడు నగు కుమారు నిమ్మని కోర, ఓమునీ! మృత్యువంతుని, యోనిజుని పుత్రు నొసగగలను గాని, మృత్యురహితుని, అయోనిజుని, [illegible] నొసగజాలను. శివాంశసంజాతు లగు విష్ణుబ్రహ్మలకే మృత్యువు కల్గుచుండ నితరుల మాట జెప్పనేల? వారి జీవితపరిమాణములు [illegible] చెప్పబడి యుండెను. కాన నీ వట్టి యాశలు విడనాడి మృత్యువు యోనియు గలవాని జుడు, నగు పుత్రునే కోరుకొనుము. సమర్థు [illegible] కోరవలెను గాని నీ కిట్టి కోరిక యేమి? నీవు కోరిన పుత్రుని నొసగ నాతడే సమర్థుడు గాని మరియెవ్వరు సమర్థులు కారు. నేనుగాని బ్రహ్మవిష్ణులు గాని అట్టి పుత్రు నీయజాలము. నీవు శివు నారాధించినచో నీ కోరిక [illegible]దించును. అతడే సమర్థుడని శక్రుడు పల్కి దేవతలతో స్వర్గలోకమున కేగ, శిలాదుడు శక్రవాక్యములు విని సంతుష్టుడై, దివారాత్రంబులు శివు నారాధించుచు సతతము దివ్యసహస్రవర్షంబులు తపంబు గడిపెను. ఇతనిశరీర మంతయు చెదపుట్టలు వేసి [illegible] లతని రుధిర మాంసములు భుజింపుచు శల్యావశిష్టునిగా జేయ, నాబాధనుండియే యతడు, ఘోరతపము చేయుచుండెను. ఇతని తపంబునకు పరమేశ్వరుడు సంతసించి, యతనియెదుట సాక్షాత్కరించి. ఓభక్తుడా! వరము కోరుకొమ్మని పలికిన మహాసమాధిసంలగ్ను డగు నాశిలాదముని భక్తిపరవశ్యుడై యుండుటచే పరమేశ్వరుని వాక్యములతనికి వినబడకుండెను. అపుడు శివు డిది గాంచి యతనిని తనహస్తముచే స్పృశింప శివస్పర్శచే నతడు

సమాధిని విరమించి, ఎదుటనున్న పరమేశ్వరుని గాంచి ఆనందోత్ఫుల్లిత నేత్రుడై యుభయపాదంబులపై బడి నమస్కరించి సగద్గదకంఠుడై కృతాంజలియై హర్షగద్గదవాక్యములతో నీశ్వరుని స్తుతింప, దేవదేవుడు త్రిలోచనుడు నగు పరమేశ్వరుడు ప్రసన్నుడై నీకు వర మిచ్చెదను. కోరుకొనుము. నీ విక తపము చేయ నవసరము లేదు. సర్వజ్ఞుడు, సర్వశాస్త్రపారగుడు, నగు పుత్రుని నీకు నొసగుదు నన, శిలాదుడు శంకరవాక్యములు విని, దేవేశ్వరునకు నమస్కరించి హర్షగద్గద వాక్యములతో, ఓసోమశేఖరా! నీవు సంతుష్టుడవై నాకు పుత్రు నొసంగదలచితివేని, మృత్యురహితుడు, అయోనిజుడు. నీతో సమానుడు నగు పుత్రు నొసంగు మన, శంకరుడు ప్రసన్నాత్ముడై ఓశిలాదమునీ! నీవు కోరినట్లే చేయుదును. పూర్వము బ్రహ్మాదిదేవతలు, మునులు, నా యవతారము ప్రకటింపు మని ప్రార్థించిరి. కాన నేను నీకు పుత్రుడ నగుదును. నావంటి పుత్రుడు మరెవ డుండును? కాన నేనే నీకు సమానుడనై యయోనిజుడనై మృత్యురహితుడనై నందీశ్వర నామంబుతో నుందును. జగత్పిత నగు నేను నీకు పుత్రుడ నగుదును. సందేహము లేదని పలికి పరమేశ్వరు డదృశ్యు డయ్యెను.

చంద్రశేఖరు డేగినతరి శిలాదుడు తన యాశ్రమంబున కేతెంచి, ఈవిషయ మంతయు ఋషీశ్వరు లందరికి తెలిపెను. కొంతకాల మైనతరి నాతండ్రి యగుశిలాదుడు యజ్ఞము చేయుటకై భూమి దున్నుచుండ, ఆ భూమియందు ప్రళయాగ్నిసమప్రభ మైన తేజంబుతో శివతుల్యుడ నగు నేను జనింప, సురలు దివినుండి పుష్పవర్షము కురిపించిరి. ఖేచర, కిన్నర, కింపురుష, సిద్ధ, సాధ్యులు, శిలాదాత్మజుడ నైన నన్ను కీర్తించుచు కుసుమ వర్షము కురిపించిరి. సకలదేవతలు విష్ణుబ్రహ్మ శక్రులు, సకలమునులు ఉమామహేశ్వరులు నివసించినవానిని గాంచుటకై యేతెంచిరి. అట్టితరి అప్సరలు నాట్యమాడుచు నుత్సవములు గావించిరి. వారందఱు లింగస్వరూపుడ నగు నన్ను స్తుతించి వారి వారి స్థానముల కేగిరి. శిలాదుడు కాలసూర్యానలప్రభుడ నగు నన్ను గాంచి యత్యాశ్చర్యము నొందుచుండెను. అట్టితరి నేను త్రినేత్రంబులు చతుర్భుజంబులు గల్గి, దేదీప్య

మానంబు లగు త్రిశూలాద్యాయుధంబులు గల్గి, యపరశివుడనై ప్రకాశింపుచుండ, శిలాదు డపరిమితానందము నొందుచు, ప్రీతితో నమస్కరించి మహానందభరితుడై యుండుటచే నంది యని నాకు సార్థకనామ మయ్యెను. ఓపుత్రా! నీచే నే నానందభరితుడ నైతిని గాన నీకునంది యను నామ మిడుచుంటిని. నీవు దేవుడవు. ఆనందస్వరూపుడవు. జగదీశ్వరుడ వగు నీకు నమస్కార మని నన్ను స్తుతించి మహేశ్వరుని తలంచి నిర్ధనునకు ధనము లభించినట్లు నన్ను వెంట నిడుకొని తన కుటీరమున కేగెను. నే నాకుటీరమున కేగినతరి నా రుద్రరూపము నుపసంహరించుకొని, మనుజరూపముతో సంచరింపుచుంటిని. పూజ్యు డగు నాతండ్రి నా మనుజరూపము గాంచి, తనస్వజనులతో దుఃఖించెను. తదుపరి శాలంకాయనపుత్రుడు నాతండ్రియు నగు శిలాదుడు నాకు జాతకర్మాదిసంస్కారము లన్నియు గావించెను. సాంగోపాంగముగ వేదము లన్నియు జెప్పించెను. పంచవర్షప్రాయంబుననే సకలశాస్త్రంబులు పూర్తిచేసితిని. శివునియాజ్ఞచే మిత్రావరుణు లను నిరువురు ఋషులు నాకు సప్తవర్షములు నిండగనే నన్ను గాంచుటకు మాయాశ్రమంబున కేతేర, మాతండ్రిచే సత్కరింపబడి నన్ను మాటిమాటికి తిలకించుచు, ఓశిలాదమునీ! నీపుత్రు డెంత శాస్త్రపారగు డైన నేమిప్రయోజనము? ఏమిసంతోషము? అత డల్పాయుష్కుడు. అత డొక వర్షపర్యంతమే జీవించు నన, పుత్రవత్సలు డగు శిలాదుడు విప్రవాక్కులు విని దుఖార్తుడై నన్ను కౌగిలించుకొని, అయ్యో! ఇపుడు నే నేమి చేయుదు నని పెద్దగా రోదనము చేయుచుండ, మృతి జెందినవానివలె క్రింద పడియున్న తండ్రిని గాంచి ప్రసన్నాత్ముడనై శివుని స్మరించి తండ్రీ! నీ వి ట్లేలకు దుఃఖించుచుంటివి? నీ వింత వణకుచు దుఃఖింపుచుంటి వేల? కారణము తెల్పుమన, శిలాదుడు పుత్రుడ నగు నన్ను గాంచి, ఓపుత్రకా! నీ వల్పాయుష్కుడ వని ఇంతగా దుఃఖించుచుంటిని. నా యీదుఃఖము పోగొట్టువారిని శరణు వేడుకొందును. ఇపుడు నా కెవరు దిక్కని యేడ్చుచుండ, నేను నాతండ్రి వాక్కులు విని, తండ్రీ? నేను శపథముచేసి చెప్పుచుంటిని, వినుము. దేవతలు గాని, దానవులుగాని, కాలముగాని, ఇతరులుగాని నాజీవితమును హరింపలేరు,

నే నల్పాయుష్కుడను గాను. నీవు దుఃఖింపకుము. నేను సత్యము పలుకుచుంటిని, వినుమన్న, శిలాదుడు పుత్రవాక్యాలు విని, ఓబాలకా! నీ వేమితప మొనర్చితివి? నీ కేమిపరిజ్ఞాన మున్నది? నీ వేయోగ మభ్యసించితివి? నా యీదారుణ దుఃఖ మెట్లు పోగొట్టగలవు? చెప్పు మన, తండ్రీ! ఏయోగముచేతను ఏతపంబుచేతను ఏవిద్యచేతను మృత్యువును జయింపలేరు. ఒక్క శంకరుని సేవచేతనే మృత్యువును జయింపవచ్చును మరిదేనిచేతను సాధ్యము కాదని నాతండ్రితో బలికి నమస్కరించి ప్రదక్షిణముచేసి తపంబునకై వనంబున కేగితిని.

శివ మహాపురాణమునందలి రుద్రసంహితయందు
ఆరవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఏడవ యధ్యాయము

### నందీశ్వరుని గణాధిపత్యము వివాహము.

సనత్కుమారునితో మరల నందీశ్వరుఁ డిట్లు చెప్పదొడంగను. నే నొక విపినమున కేగి యేకాంతస్థలమున సుఖాసీనుడనై మునీశ్వరులకు కూడ నశక్యమైన దుష్కరతపము చేయ మొదలిడి, దేవదేవుడు, త్ర్యంబకుడు, దశభుజుడు, శాంతుడు, పంచవక్త్రుడు, పంచదశనేత్రుడు, సదాశివుడు నగు రుద్రుని హృత్పుండరీకగుహాయందు నిల్పుకొని మిక్కిలి ధ్యానింపుచు రుద్రజపము చేయుచు పవిత్రగంగానది యుత్తరభాగంబున సమాహితచిత్తుడనై యుండ, పరమేశ్వరుడు నాతపంబునకు సంప్రీతుడై, యుమాసహితుడైన యా సోమార్ధభూషణుడు, ఓశిలాదపుత్రుడా! నీతపంబునకు సంతసించితిని. ఓధీమంతుడా: నీవు నన్ను మెప్పించెడితపము చేసితివి. గాన, నీమనోభీష్టము తెలుపు మన, నే నతని పదంబులకు శిరసా నమస్కరించి జరాశోకవినాశను డగు నతని స్తుతించి భక్తిపారవశ్యుడనై యతనిపదంబులానందబాష్పముల చే తడుపుచు నతశిరస్కుడనై సమస్కరింపుచుతత్పదపంకజ

ములపై బడియుండ పరమేశ్వరుడు నన్ను ప్రేమచే లేవదీసి యాలింగన మొనరించి, తన కరములచే నన్నెదుట నిలబెట్టుకొని తన గణములను, జగదంబికను, గాంచుచు నాజగదీశ్వరు డిట్లు పల్కెను.

ఓవత్సా! ఓనందీ! ఓమహాప్రాజ్ఞుడా! నీకు మృత్యుభీతి యెక్కడిది. నాతో తుల్యులగు విప్రుల నినుపురిని నీకడకు నేనే పంపితిని. సంశయింపకుము. నీవు, నీ తండ్రి, నీసఖులు కూడ నజరామరులై యుందురు. నీవు నా ప్రమథగణములకు నాయకుడవై యుందువు. మీరందఱు నవ్యయులు, నక్షయులు, శ్రేష్ఠులునై యుందురు. నీవు దివారాత్రంబులు నన్ను సేవించుచు నాచెంత నుండుము. నా యనుగ్రహముచే నీ కెన్నడు జన్మజరామృత్యువు లుండ వని పరమేశ్వరుడు పలికి యొక కుశమాల నాకంఠమందు వేసెను. నే నాశుభప్రదమైన మాల ధరించుటచే త్రినేత్రంబులు దశభుజంబులు గల్గి, యపరశంకరునివలె ప్రకాశింపుచుంటిని. అపుడు పరమేశ్వరుడు నాహస్తము బట్టుకొని, నందీ! నీకెట్టి యుత్తమవరంబు కావలయునో కోరుకొమ్మని తనజటలనుండి జలము గ్రహించి నాపై ప్రోక్షింప, ఆజలబిందువులు శుభావహములైన పంచనదులై ప్రవహించెను. అవి మధురోదయంబులు గలవై, మహావేగవంతములై సుందరదివ్యరూపధారిణులై జటోదక, త్రిస్రోత, వృషధ్వని, స్వర్ణోదక, జంబునది యను నామంబులతో నుండెను. ఇవి శివపృష్ఠభాగంబున జటేశ్వరసమీపంబున పరమపవిత్రములై ప్రవహించుచుండెను. ఎవరీపంచ నదులయందు స్నానము చేసి, జటేశ్వరేశ్వరుని అర్చించెదరో వారు శివసాయుజ్యము నొందగలరు. సందియములేదు. ఈశ్వరుడు ఉమను గాంచి, ఓదేవి! ఈనందికి గణాధిపత్యాభిషేకము చేయుమందుమా యని ప్రశ్నింప,నో దేవేశ! పరమేశ్వర! ఈనంది గణాధిపత్యమునకు తగినవాడు. ఈశిలాదపుత్రుడు నాకు మిక్కిలి ప్రీతిపాత్రుడన, భక్తవత్సలుడు. శివుడు తన గణములను స్మరింప, శంకరాకృతి గల యసంఖ్యాకగణేశ్వరు లెందరో, యట కేతెంచి శిరము వంచి యుమామహేశ్వరులకు నమస్కరించి, ఓమహాప్రభూ! మమ్మెందులకు స్మరించితిరి?మా కేమి యాజ్ఞాపించెదరు? ఓత్రిపురాంతక! కామప్రద! సాగరములు శోషింప జేయువలయునా? యముని, కింకరులతో సహా సంహరింప

వలయునా? ఏదియో యాజ్ఞాపింపుము. లేక, వృద్ధబ్రహ్మను, వృ[illegible]ను మహాత్మ్యరూపుని సంహరింపవలెనా? శక్రాది దేవతలను పార్వతీసహితు విష్ణువును [illegible] తీసుకొని రావలెనా? దైత్యదానవుల బట్టి తీసికొని రావల యునా? మీయిద్దరి దేవతల [illegible] సంతోషింపవలెను? లేక, ఎవరికైనను కామనసమృ ద్ధము కైన సర్వసిద్ధులు కల్గింప వలయునా? ఏదియో యాజ్ఞాపింపు డన, శంకరుడు [illegible] వారిని ప్రశంసించుచు, ఓగణాధి పతులారా! మీ సంకీర్తనము నాకు ప్రీతికరము. మీరందఱకు నితడు ప్రభువు కాగలడు. ఇతనిని మీ రందఱు ప్రేమింపుడు. మీ రందఱు ప్రీతిపూర్వక ముగ నితని నభిషేకము చేసి గణాధ్యక్షునిగా జేయుడు. ఇతడు మీకు గతియు మతియు నై యుండగలడు. నేటినుండి మీకందఱకు నితడే నేత యన, శంకరుని వాక్యములు విని, వారందఱు నంగీకరించి యభిషేకసంభారము లన్నియు సమకూర్చిరి. శివాజ్ఞచే బ్రహ్మవిష్ణ్వాది దేవతలు, మునులు, ఋషులు మొద లగు వారందఱు వచ్చిరి. ఇంకను సర్వలోకవాసులు నేతెంచిరి. బ్రహ్మ శివాజ్ఞచే నభిషేకము [illegible] వారందఱు నన్ను స్తుతించిరి. సర్వ జగత్పతి యగు విష్ణువు నన్ను స్తుతించెను. ఇవ్విధంబున సర్వులు స్తుతించి [illegible] జయజయధ్వానములు గావించిరి.

బ్రహ్మవిష్ణ్వాది దేవతలందఱు నా కభిషేకము గావించిరి. తదుపరి బ్రహ్మవిష్ణ్వాది దేవతలందఱు నా కుద్వాహము గావింప దలచి, మనో[illegible] నా కిచ్చి వివాహము చేసి మహో త్సవంబులు గావించిరి. [illegible] శశిప్రభ మగు మనోహరచ్ఛ త్రము నా కొసంగెను. నన్ను సింహాసనాధిష్ఠితుని జేసి ఛత్ర మలంకరిం చిరి. ఇరువైపుల స్త్రీలు వింజామరలు వీచుచుండిరి. మహాలక్ష్మిప్రద త్తమైన కిరీటము నా కలంకరించిరి. దేవతాస్త్రీలు నాగళమం దనేకరత్న హారము లలంకరించిరి. శ్వేతవృషభము శివుడు నా కొసంగెను. దేవతలు చంద్రబింబసదృశ మైన రథము స్వర్ణహారము నొసంగిరి. ఇంకను అనేకు లనేకవిధంబు లగు బహుమానము లొసంగిరి. వివాహ మైనతరి నేను నాభార్యయు గలిసి యుమాశంకరులకు బ్రహ్మవిష్ణువులకు పాదాభివంద నము గావించితిమి. మాదంపతుల గాంచి భక్తవత్సలు డగు విశ్వేశుడు

నేను సంతుష్టుడనైతిని, నీయీప్సితవరము కోరుకొనుము. నీ భార్యయు వరములు కోరుకొనవచ్చును. నీతండ్రి, నీతాతయు కూడ, విశిష్టులు, పరమైశ్వర్యసంపన్నులు. మహాయోగులు. ధనుర్ధరులు. సదా వ్రతియులు. అజేయులు. సదా పూజ్యులు. మహాబలులునైయుండిరి. నీవు నా చెంతనే సర్వదా వసింపుము. మహాబలు డగు నీతండ్రియు, నీవుకూడ, నాగణముల కధ్యక్షులుగ నుండుడు. మీరు నాభక్తులు. నీతండ్రి తాతయుకూడ నాభక్తులై నాచే వరముల నొందిరి. గాన వారును నాకడనే యుందు రని పరమేశ్వరుడు పలుక, పిమ్మట పరమేశ్వరికూడ నిట్లు పల్కెను. ఓనందీ నేనుకూడ నీకు వరమిచ్చెదను. ఈప్సితవరము కోరుమన, ఓ తల్లీ! సదా నీపదపద్మములయందు నాకు భక్తి కల్గునట్లు చేయు మని వినమ్రుడనై పలుక, నా దేవి మాతృవాత్సల్యముతో, ఓబిడ్డా! నీవు త్రినేత్రుడవై, జన్మరహితుడవై, యుండుము. నీవు నీ పుత్రపౌత్రులు నాయందు, శివునియందు భక్తి కలవారలై యుందు రని దీవించి, నా భార్యకుకూడ ననేకవరంబు లిచ్చెను. తదుపరి శివాజ్ఞచే విష్ణుబ్రహ్మాదిదేవత లందఱు నాకు వరంబు లిచ్చిరి. తదుపరి శంకరుడు ఉమాసహితుడై వృషభారూఢుడై స్వస్థాన మేగెను. బ్రహ్మవిష్ణ్వాది దేవత లందఱు వారివారి నిలయముల కేగిరి. ఇదియే నందీశ్వరుని యవతారము. ఈచరిత్ర విన్నవారలకు శివభక్తి వృద్ధియగును. సర్వసుఖములు గల్గును. ఇహపర సౌఖ్యములు గల్గును.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహిత యందు
ఏడవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఎనిమిదవ యధ్యాయము

### భైరవావతారము

మరల నంది ఇట్లు చెప్ప దొడంగెను. సర్వజ్ఞుడ వగు నోసనత్కుమారా! భైరవావతారము చెప్పెద, వినుము. ఏది విన్నంతనే శంభుభక్తి వృద్ధి యగునో, అట్టి పరమాత్ముడు, పరిపూర్ణుడు నగు భైరవుని యవతారము

చెప్పెద. మూఢులు శివమాయామోహితులై యవతారపురుషుని గ్రహింప లేరు. ఇతనిని చతుర్భుజు డగు విష్ణువు చతుర్ముఖు డగు బ్రహ్మయు కూడ తెలిసికొన జాలరు. శాంభవీ విద్య తెలిసికొనుట కష్టము గాన, చిత్త మావిద్యయందు స్థిరముగా నుంచుము. మాయామోహితులై యతని సర్శింప లేరు. ఆత్మజ్ఞానము కలవాడెనచో నా పరమేశ్వరుని తెలిసికొనగలడు. సులభముగా తెలిసికొనుటకు శక్యమగు పురుషుడు గాడు. ఆపరమేశ్వరుడు సర్వవ్యాపి యైనను, మూఢాత్ములు తెలిసికొనలేరు. అందఱకు తెలిసిన వానివలె నగపడుచుండును, గాని, యతని యథార్థ మెవరికి తెలియదు. అతడు మనోవాచామగోచరుడు. పూర్వమందు జరిగిన యొక యితిహాసము చెప్పెద వినుము. అది పరమాత్మకృష్ణజ్ఞానకారణమై యున్నది. ఒకానొకప్పుడు దేవతలు మునులు మనోహరంబగు మేరుశిఖరమం దాసీనులై యున్న బ్రహ్మకడకు తత్త్వము తెలిసికొనుటకై యేగి నతకంధరులై కృతాంజలిపుటులై యత్యాదరంబుతో, నో దేవదేవ, ప్రజానాథ, అవ్యయ మగు తత్త్వ మెట్టిదో మాకు యథార్థముగ జెప్పు మన, బ్రహ్మ, శివమాయా మోహితుడై నిజతత్త్వము గ్రహింపనేరక, ఓసురలారా! ఓమహర్షులారా! యథార్థమైన యవ్యయతత్త్వమును మీకు జెప్పెదను. శ్రద్ధాభక్తులతో స్థిర చిత్తులై వినుడు. నేనే జగత్కారణుడను. సృష్టికర్తను. స్వయంభవుడను. ఈశ్వరుడను. అనాది పురుషుడను అద్వితీయ పరబ్రహ్మను. సర్వాత్ముడను. పరిపూర్ణుడను. జగన్నివర్తక ప్రవర్తకుడను. ప్రళయకరుడను. నాకన్న నధికు లెవరును లేరని పలుక, అట నున్న విష్ణువు మోహితుడై పలుకుచున్న బ్రహ్మవాక్కులు విని, క్రుద్ధుడై, ఓవిధీ! యోగవేత్త నగు నీ విట్లు పలుక తగదు. మూర్ఖతచే నీ వట్లనుచుంటివి. నీవు పరతత్త్వము తెలియక యిట్లు వృథావాక్కులు పల్కుచుంటివి. సర్వలోకములకు కర్తను నేను. నేనే పర మాత్ముడను. పరుడను. యజ్ఞస్వరూపుడను. దేవుడను. మాయాధీశుడను. సద్గ తిప్రదుడను. నాయాజ్ఞచే నీవు ప్రజాసృష్టి చేయుచుంటివి. జగదాధారభూతుడ నగు నన్ను సేవించనివార లధోగతి పాలగుదు రని విష్ణువు బ్రహ్మతో బలికె ను. ఇవ్విధంబున బ్రహ్మవిష్ణు లిరువురు వారివారి యాధిక్యమును జూపించుటకై పరస్పరము వాదులాడుచు వేదశాస్త్రములు ప్రమాణములు జూపించుచు పర

స్వరజయకాంక్షులై వాదులాడుకొనుచు, [illegible]మాయామోహితులై చతుర్వేదములు ప్రమాణములని భావించి మూర్తిస్వరూపులైన చతుర్వేదంబులతో విధివిష్ణువు లిట్లు ప్రశ్నించిరి.

ఓ చతుర్వేదములారా! సర్వత్ర మీరు ప్రమాణభూతులు. అందుచేతను ప్రతిష్ఠింపబడి యుంటిరి. అవ్యయ మగుతత్త్వ మేదియో మీరు నిర్ణయించి చెప్పు డన, నాచతుర్వేదములు వారి పలుకులు విని పరమాత్మతత్త్వము విశదముగ నిట్లు చెప్పదొడంగిరి.

సృష్టిస్థితికారు లగు నో బ్రహ్మవిష్ణువులారా! మేమే పూజ్యుల మని మీరు వాదులాడుచుంటిరి. మీ సందేహనివృత్తికై మా వాక్కులు వినుడు. ఋగ్వేద మిట్లు బల్కెను.

ఎవడు సర్వాంతర్యామియో, ఎవనిచే సర్వము ప్రవర్తించుచున్నదో, అట్టి రుద్రుడే పరమతత్త్వము. ఇతనికంటె వేఱొకదేవతయు లే దన తదుపరి యజుర్వేద మిట్లు చెప్పదొడగెను.

ఎవనిని యజ్ఞములచేతను, యోగములచేతను, జనులు పూజించుచుందురో, ఎవడు వేదములకు ప్రమాణభూతుడో, అట్టి శివుడే పరతత్త్వ మనెను;

పిమ్మట సామవేద మిట్లు పల్కెను. ఎవనిచే నీవిశ్వము భ్రమించుచున్నదో, యోగీశ్వరు లెవనిని సర్వదా ధ్యానించుచుందురో ఎవనిప్రకాశముచే నీవిశ్వమంతయు ప్రకాశించుచున్నదో, ఎవడు ప్రకృతికంటె పరుడో అట్టి త్ర్యంబకుడే పరతత్త్వ మని గ్రహింపవలయు నన.

తదుపరి యథర్వవేద మిట్లు చెప్పదొడంగెను. ఏదేవుని భక్తిచే భక్తజను లర్చించుచుందురో, ఎవడు మోక్షస్వరూపుడో, ఎవడు దుఃఖాతీతుడో, అట్టి శంకరుడే పరతత్త్వ మని తెలిసికొను డన; విధివిష్ణువులు మోహితులై చతుర్వేదవాక్కులు విని, విస్మితులై వివేకశూన్యులై ఓ వేదములారా! మీరు గతచేతస్కులై యిట్లు పల్కుచుంటి రేమి! మీ కేమి తెలియును? శివుడే పరతత్త్వ మని యెట్లు చెప్పగలరు? ఆప్రమథనాథుడు సదా పార్వతితో క్రీడించుచుండునుగదా! అతడు పరతత్త్వస్వరూపు డని యెట్లు చెప్పుదురు? అతడు దిగంబరుడు. పీతవర్ణుడు. సదా సర్వాంగములకు ధూళి ధరించును. ధూళిధూసర

గాత్రుడును, వికృత వేషుడు, జటిలుడు, వృషభ వాహనుడు, నాగభూషణుడు సంగరహితుడు, ఇట్టి శివుడు పరబ్రహ్మయని యోగులు చెప్పుదురని;

సగుణనిర్గుణస్వరూపుడగు పరమశివు డావులింపగా, అతని ముఖము నుండి ఓంకార ముద్భవించి విధివిష్ణువులవాక్కులు విని ఋక్కు పల్కెను. పరమేశ్వరుడు సదా శక్తితో విహరించుచుండు నని మీరు పల్కుచుంటిరి. ఈ పరాశక్తి శివుని కాత్మ్యంతకు భిన్నమైనది కాదు. ఈ శక్తి యీశ్వరుని కంటె వేరుగ వచ్చియుండలేదు. ఈశక్తి సనాతనమైనది, శబ్దాదిగుణములకంటె విశ్వరూపిణి తో నవినాభావముగ నుండును. లీలారూపమైన యీ ప్రపంచము ఆశక్తిచే సృష్టి స్థితమై యుండును. మహాప్రళయమున ప్రభవించుచుండును. పరమేశ్వరుడు స్వయంజ్యోతిస్స్వరూపుడు. సనాతనుడు. ఆనందరూపుడు. ఆనందశక్తియుతుని సదా నిదనాడరుడు నని ... ఆమాటలు విన్నను శివనామ మూయామోహితులై విధివిష్ణువు లజ్ఞానము వీడకుండుటచే వారిరువురి మధ్య ద్వా నాపృథువులు నిండిన జ్యోతిస్స్వరూపము వెలుగుచుండెను. దానిమధ్యనుండి యొకజ్యోతిస్స్వరూపు డగు పురుషు డుద్భవించియుండ, నామహాపురుషుని, విధివిష్ణువు, లద్భుతముగ గాంచుచు, నీయద్భుత తేజముచే వెలుగుచు నీమహాపు రుషు డెవడని వారు యోచించుచుండ, త్రినేత్రుడు, మహాపురుషుడు, నీలలో హితుడు, త్రిశూలపాణి, ఫాలాక్షుడు, నాగయజ్ఞోపవీతుడు, చంద్రశేఖరుడు, భుజగభూషణుడు, పరమేశ్వరుడగు నామహాపురుషుని బ్రహ్మగాంచి, మోహి తుడై నవ్వుచు, ఓనీలలోహితా! చంద్రశేఖరా! నిన్ను నే నెరుంగుదును. నీవు భయపడకుము. నీవు పూర్వము నాఫాలమునుండి జనించి రోదనము చేయుచుండ, నిను రుద్రు డని పేరిడితిని. నన్ను నీవు శరణుపొందుము. నిన్ను రక్షించెద నన, గర్వితుడగు బ్రహ్మయొక్క వాక్కులు విని పరమేశ్వరుడు కోపించి యొక భైరవు నుద్భవింప జేసి, కోపముచే ప్రజ్వరిల్లుచున్న భైరవుని గాంచి ఈశ్వరుడు సంతసించి, ఓభైరవా! ముందుగా నీకమలభవునకు తగిన శాస్తి చేయుము. నీవు సాక్షాత్తు కాలునివలె ప్రకాశించుచుంటివి గాన కాలరా జను పేరుతో నుండువు. నీవు విశ్వమును భరించుచు భయంకరముగ నుండువుగాన భైరవు డనుచు, కాలునికూడ భయపెట్టువాడవు గాన కాల భైరవు డని కూడ పిలువబడుదువు. నీవు దుష్టులను మర్దించుచుందువు గాన

మర్దకుడ వనియు పిలువబడుదువు. ఇంకను, భక్తులపాపములు క్షణములో భక్షించెదవు గాన పాపభక్షకుడ వని పిలువబడుదువు. సకలపురంబులలో ప్రసిద్ధికెక్కిన కాశీపురియందు నీవు వసించుచు, ఆపురాధిపత్యము వహించుచు కాలరా జని పేరొందగలవు. మనుజులు చేయు పాపపుణ్యంబులు శుభాశుభకర్మలు సర్వము చిత్రగుప్తుడు లిఖించుచుండును. ఎట్టి పాపులైనను కాశీపురి కేగి నీచే శిక్షింపబడుదురేని వారికి యమదండన మెన్నడు నుండ దని పరమేశ్వరుడు పలుక, కాలభైరవు డీశ్వరవాక్కులు విని తనవామహస్తనఖంబులచే బ్రహ్మపంచమశిరంబు త్రుంచిపడవైచెను. శరీరమందలి యేయే యంగములచే పాపములు చేయబడుచున్నచో ఆయా యంగములు ఛేదింపు మని శాస్త్రములు చెప్పుచున్నవి. గాన శివనింద చేసిన బ్రహ్మపంచమ శిరంబును కాలభైరవుడు త్రుంచివైచెను. విష్ణు విది గాంచి భయమొందుచు, శతరుద్రీయపారాయణ చేసి శివుని స్తుతించెను. బ్రహ్మకూడ భయమొందుచు శివుని శతరుద్రీయముచే (నమకముచే) స్తుతించెను. పరమేశ్వరుని గాంచినంతనే విధివిష్ణువుల యహంకారములు నశించెను. వారు గతగర్వులై శివుడే పరబ్రహ్మయనియు, సాక్షాత్సచ్చిదానందలక్షణు డనియు, గుణాతీతు డనియు తెలిసికొనిరి. అహంకార మున్నంతవరకు జ్ఞానము నిగూఢమై యుండును. అభిమానము త్యజించినచో పరమేశ్వరుని కనుగొనగలరు. గర్వితుల గర్వము విశ్వేశ్వరుడు హరించుచుండును. శంకరుడు విగతగర్వులై నమస్కరించుచున్న విధివిష్ణువులను గాంచి ప్రసన్నాత్ముడై వారల కభయ మిచ్చి మూర్తిమంతుడైన యా భైరవుని గాంచి,ఓభైరవా, విష్ణుబ్రహ్మలు నీకు మాననీయులు. నీ వీ బ్రహ్మకపాలము హస్తమున ధరించుము. నీహస్తమందలి బ్రహ్మకపాలము గాంచినవారల బ్రహ్మహత్యాదిపాపములు దూరమగును. గాన నీవు సర్వదా ఈకపాలమును ధరించుచు, భిక్షాపాత్రగా స్వీకరించి, సర్వుల కాకపాలము జూపించుచు, వారి పాపములు నశింపజేయుచుండు మని ఈశ్వరుడు పలికె. అందరు గాంచుచుండగ, బ్రహ్మహత్య యనెడు నొక కన్యకను సృజించి, ఓబ్రహ్మహత్యాస్వరూపిణీ! నీవు సదా బ్రహ్మహత్యా పాతకులను వెంటాడి పీడింపుచుండుము. వారెన్ని తీర్థయాత్రలు చేసినను వారిని మాత్రము విడువకుము. ముక్తిక్షేత్ర మగు కాశీక్షేత్రము చేరి కాలభైరవుని హస్తమందలి

బ్రహ్మకపాలము గాంచినవారలకు బ్రహ్మహత్యా దోషము నశించును గాన, అపుడు వారిని విడువుము. నీవుమాత్రము వారణాసియందు మాత్రము వసింపక ఇతర ప్రదేశములందు నీ ప్రభావము జూపించుచుండుము. అని ఇవ్విధంబున ఆమెకు జెప్పి యీశ్వరుడదృశ్యుడయ్యెను.

శివమహాపురాణము నందలి శతరుద్రసంహిత యందు
ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## తొమ్మిదవ యధ్యాయము

### భైరవ లీలలు

ఓసనత్కుమారా! భక్తివర్ధకమైనదియు, మహాదోషవినాశకరమైనదియు నగు భైరవచరిత్ర చెప్పెద, వినుము, కాలకాలుడగు కాలభైరవుడు శంకరాజ్ఞను పాలించుచు కాపాలికవ్రతధారియై బ్రహ్మకపాలహస్తుడై, ముల్లోకముల దిరుగుచుండ' నితని వీడక బ్రహ్మహత్య వెంటాడుచునే యుండెను. అతడెన్నితీర్థములు సేవించినను భయంకర బ్రహ్మహత్య యతనిని వెంటాడుచునే యుండెను. కామారియగు శంకరుని మహిమ యెంతటిదో వీనిచే నూహింతురు గాక, ఒకానొకప్పుడు ప్రమథగణసేవితుడగు కాలభైరవుడు నారాయణని కేతనమగు వైకుంఠమున కేగెను. మహాకాలుడు, త్రినేత్రుడు, కుండలాలంకృతుడు, మహాదేవాంశసంభూతుడు, పూర్ణాకారుడు నగు భైరవుని విష్ణువు గాంచి, దేవతాముని గణసమేతుడై భైరవుని సమీపించి నతమస్తకుడై, ముకుళితహస్తుడై నమస్కరించి స్తుతించి యతనిని సంతుష్టిపరచి క్షీరసాగర మథనోద్భవయు, పద్మాలయయు, నగు పద్మను గాంచి, ఓప్రియా! అబ్జనయనా! జగత్పతి యగు నీభైరవుని గాంచి మనము ధన్యులమైతిమి. ఇతడు ధాత, విధాత, సర్వలోకప్రభువు. ఈశ్వరుడు. శాంతుడు అనాది పురుషుడు. శరణాగతవత్సలుడు. శాంతుడు. మద్యాంశతత్వస్వరూపుడు. సర్వజ్ఞుడు. సర్వయోగీశ్వరుడు. సర్వభూతాధిపతి. సర్వభూతాంతరాత్ముడు.

సర్వప్రభుడు. సర్వజ్ఞుడు. ఇతడు ప్రియమన్నది యెరుంగక ఉచ్ఛ్వాస నిశ్వాసలు లేక శాంతచిత్తుడై సదా తన హృదయపీఠికయందు సన్నే నిల్పుకొని ధ్యానింపుచు, సూక్ష్మము పద్మమును గాంచుకై వడి హృత్పద్మమందు సన్నే గాంచుచుండును. అట్టిపరమేశ్వరుని నేడు చూడగల్గితిమి. తత్వజ్ఞులు, వేదవేత్తలు, యోగులు నెవనిని సదా గాంచుచుందురో, ఎవ, డరూపుడై సరూపుడై ప్రకాశించుచుండునో, సర్వులు నెవనిని దర్శింప గోరుచుందురో, అట్టి పరమపురుషుడు మనకనులయెదుట సాక్షాత్కరించెను. ఈపరమేశ్వరుని చేష్ట లతివిచిత్రము లైనవి. రూపనామంబులు లేని యితడు మనకై రూపనామంబులతో నేతెంచియుండెను. భువియందున్న మానవు లితనిని దర్శించినచో పునర్జన్మ యుండదు. అట్టి త్ర్యంబకుడు, చంద్రశేఖరుడు నగు పరమేశ్వరుడు మనకడ కేతెంచెను. మనసరోజదళ నేత్రము లిపుడు సార్థకములు లయ్యెను. మననేత్రములు సాఫల్యములు లయ్యెను. శంకరుని గాంచలేని దిక్పాలకపదవి యైనను వ్యర్థము. ఇంద్రపదవి యైనను నిరర్థకము. శివుని గాంచని ముక్తి యైనను నిరర్థకము. దేవా లైన సతిని గాంచనిచో స్వర్గమందైనను సుఖముండదు. ఎట్టి దేవతలైనను పరమేశ్వరుని గాంచకున్నచో ముక్తి యుండ దని విష్ణువు పలికి, పులకితగాత్రుడైన భైరవునకు నమస్కరించి, ఓ దేవదేవ! సర్వజ్ఞ! సర్వపాపనివారక! ఇవ్విధంబున జగత్తంతయు సంచరింపుచుంటి వేల? ఓ త్రిలోచనా! నీ విట్లు క్రీడించుటకు కారణమేమి? సర్వశక్తిసంపన్నుడ వగు నీ విట్లు భిక్షాటన మొనరించుచుంటి వేల? నాసందేహము దీర్పుమన, విష్ణునివాక్కులు విని భైరవుడు నవ్వుచు నోవిష్ణూ! బ్రహ్మశిరమును నానఖాగ్రముచే త్రుంచితినిగాన ఆదోషనివారణకై నే నీకాపాలికవ్రత మూని భిక్షాటన మొనరింపుచుంటి నన, భైరవవాక్కులు విని విష్ణువు వెనుకటిచర్యల దలచుకొని లజ్జానతవదనుడై, ఓప్రభూ! నీ ఇచ్చవచ్చినట్లు క్రీడింపుము. గాని మమ్ములను మాయామోహితులను మాత్రము చేయకుము. నీయోగబలముచే ప్రతికల్పమున నొక్కొక బ్రహ్మచొప్పున నీనాభికమలమునుండి యనేకవేలబ్రహ్మ లుద్భవించి లయమొందిరి. నీభక్తులయెడ నీమాయ ప్రయోగింపకుము. నీమాయచే బ్రహ్మాదు లందఱు మోహ మొందు

చుండిరి. నిచేష్టలు నే నెరుంగుదును. నీ యనుగ్రహముచే నేను లోకరక్షకుడ నైతిని. నీవు సర్వేశ్వరుడవు. సత్పురుషగతివి. ప్రళయకాలమునం దంతటిని సంహరింతువు. అపుడు సర్వలోకములను సర్వవర్ణంబులను హరింతువు. ప్రళయమందు సర్వవర్ణంబులను సంహరించెడి నీకు బ్రహ్మహత్యాదోష మెక్కడిది? ఓపరమేశ్వరా! నీవు సర్వస్వతంత్రుడవే గాని పరతంత్రుడవు గావు. పుర్రెలమాల కంఠమున ధరించినట్లుగనే, బ్రహ్మశిరమును నీహస్తమందు ధరించితివి. నీయాజ్ఞచే బ్రహహత్య నిన్ను వెంటాడుచున్నది గాని, నీవు పొమ్మనిన పోకుండునా? నిన్ను స్మరించినంతనే బ్రహ్మహత్యాపాపములు నశించుచుండ ఈబ్రహ్మహత్య నిన్నేమి చేయును? సూర్యుని యెదుట నంధకారము లేనట్లు నీభక్తులయెడ నేపాపములు నుండవు. నీభక్తులదరి జేరలేని పాపములు నిన్నెట్లు వేధింపగలవు? పుణ్యాత్ములు నీపాదాంబుజములు స్మరించినంతనే సర్వ బ్రహ్మహత్యాదిపాపములు నశింప, ఈబ్రహ్మహత్య నిన్నేమి చేయగలదు? పర్వతములవంటి పాపములైనను నీనామస్మరణచే నశింపుచుండ, నిన్నిదేమి చేయగలదు? పరంధామస్వరూపుడ వగు నిన్ను నేము చూడగల్గితిమి. మేము ధన్యులము. నిన్ను గాంచి మే మపరిమితానందము నొందితిమి. నిన్ను గాంచినవారల కమృతము స్వర్గాపవర్గములు తృణప్రాయములుగ నుండు నని,

ఇవ్విధంబున విష్ణువు ప్రశంసింప విమలాత్మ యగు లక్ష్మి యాకాల భైరవునకు మనోరథము లీడేర్చెడి భిక్షను అతనిపాత్రయందు వైవ నతడు సంతసించి యటనుండి మరియొకప్రదేశమున కేగెను. విష్ణువు భైరవుని వెంటాడుచున్న బ్రహ్మహత్యను బిలిచి ఈత్రిశూలిని నీవు విడువు మన: ఓవిష్ణూ! నే నీభైరవు నిమిషచే వెంబడించి యతనిని సర్వదా సేవింపుచు నా యాత్మను తరింప చేసికొనుచుంటినే గాని వేరుగా దని, బ్రహ్మహత్య పలికి, మరల భైరవుని వెంటాడుచునే యుండ, భైరవుడు మందహాసము చేయుచు ఓవిష్ణూ! పీయూషతుల్యములగు నీవాక్కులు విని, సంతుష్టుడ నైతిని. సాధువుల స్వభావమిట్లే యుండును. వారు పరులకష్టంబులు గాంచ లేరు. నేను వరదుడను గాన, వరంబులిచ్చెద, కోరుకొమ్ము.

నిర్వికారుడ వగు నోహరీ! నీవు నా భక్తాగ్రేసరుడవు. తరచుగ యజమాని పాపములు భిక్షుకులకు సంక్రమించును. నీవు బహుపుణ్యాత్ముడవు గాన ఇపుడు నీభిక్ష నే గ్రహించి సర్వపాపవిముక్తుడ నైతి నన, భైరవవాక్కులు విని విష్ణువు సుప్రసన్నుడై, ఓదేవదేవా! మనోవాచామగోచరుడ వగు నీదర్శనము లభించుటయే గొప్పవర మని తలచుచుంటిని. నీవు సదా సంపూర్ణసుధావృష్టిని నాపై ప్రసరింప జేయుము. నీ దర్శనముచే నప్రయత్నముగ పేదకు పెన్నిధి దొరకినట్లు సంతసించితిని. నీ యంఘ్రియుగళంబులు నేను సదా సేవించునట్లు చేయుము. ఇంతకన్న మఱియొక వరము నేను కోర నన, భైరవుడు విష్ణువాక్కులు విని ఓవిష్ణూ! దేవతా వరదుడ వగు నీయభీష్టము లన్నియు సిద్ధించు నని పలికి భైరవుడు త్రిభువనంబుల భిక్షాటనము చేయుచు చివరకు కాశీపురిని చేరుకొనెను.

పాపభయంకర మగు కాశీపురి గాంచి నంతనే బ్రహ్మహత్య భయపడి పాతాళమునకు పరుగిడెను. బ్రహ్మహత్య వీడినంతనే భైరవ హస్తమం దున్న బ్రహ్మశిరము భువిని పడిపోయెను. ఆప్రదేశము కపాల క్షేత్ర మని పేరుపొందెను. కపాల మందరు గాంచుచుండగ క్రింద బడుటచే దానిని గాంచి భైరవుడు నృత్యము చేయసాగెను. ఎన్ని క్షేత్రములు సేవించినను విముక్తి నొందని కపాలము అవిముక్తక్షేత్ర మగు కాశీపురిచేరినంతనే విముక్తి నొందెను. కాశీపురి యెంత యమోఘ మైనదో దీనిచే తెలిసికొనుడు. ఎవరైన నీక్షేత్ర మేతెంచి గంగాస్నానము చేసి యథావిధిగ పితరులకు తర్పణాదులు చేసినచో నెట్టిబ్రహ్మహత్యాదోషము లైనను క్షణములో నశించును. కాశీపురియందలి కపాలక్షేత్ర మేగి కాలభైరవుని దర్శించినవారి సర్వపాపములు భైరవుడు భక్షణ చేయుచుండును. మార్గశీర్ష బహుళాష్టమిరోజున కాలభైరవు డుద్భవించెను గాన ఆరోజున నుపవసించి కాలభైరవవ్రతము చేసి రాత్రి జాగరణ చేసిన వారి సర్వపాపములు నశించును. ఏవ్రతముచేతను నశింపని పాపములు దీనిచే నశించిపోవును. ఈకాలభైరవుని వ్రతదర్శనములచే ననేకజన్మార్జిత పాపములు కూడ నశించిపోవును. మార్గశీర్షాష్టమిరోజున కాలభైరవునియెదుట నుపవాసజాగరణలు చేసినచో సర్వపాపవిముక్తు డగును. మఱియు నేమా

సములందైన, నే రోజునందైనను, కాలభైరవు నర్చించి యుపవసించి జాగరణము చేసినచో మహాపాపములు నశించి ముక్తి నొందగలడు. భైరవ భక్తుల కపకారము చేసినవారలు దుర్గతి నొందగలరు. శివభక్తి కల్గి కాశీపురి కేతెంచి, భైరవుని దర్శింపనిచో దుఃఖభాగు లగుదురు. కాశీపురినివాసుడై భైరవుని దర్శించి భజింప కున్నచో, శుక్లపక్షచంద్రుని వలె వారిపాపములు వృద్ధి యగును. ఏమనుజుడైనను కాశీనివాసుడై బహుళాష్టమీభౌమవారమున కాలభైరవుని దర్శించినచో కృష్ణపక్షచంద్రునివలె వారిపాపములు క్షీణించును. ఈభైరవోత్పత్తిని విన్నను, పఠించినను, బ్రహ్మహత్యాది సకలపాపములు హరించును. కారాగారాది బంధనములందున్నను ఎట్టి విపత్తులు సంభవించినను ఈ కథాశ్రవణంబుచే సర్వబంధవిముక్తులై సర్వకష్టములు తొలగి సర్వసుఖముల నొందగలరు.

శివ మహాపురాణమునందలి శత రుద్రసంహితయందు
తొమ్మిదవ యధ్యాయము సంపూర్ణము

---

# పదవ యధ్యాయము

## నృసింహావతారము

నందీశ్వరుడు మరల నిట్లు చెప్పదొడంగెను. సనత్కుమారా! వీరభద్రుడుకూడ శివావతారమే. అతని చరిత్రయంతయు, దక్షయజ్ఞమందు పూర్తిగా జెప్పియుంటిని గాన దీనినంత విస్తరించి చెప్పనవసరములేదు. శార్దూలావతారముకూడా చెప్పెద వినుము. శంకరుడొకానొకప్పుడు దేవకార్యార్థమునకై అగ్నిజ్వాలాసమ ప్రభమైన యద్భుతమగు శరభరూపము ధరించెను. అపరిమితము లగు శివావతారము లన్నియు భక్తహిత కారకములై యుండెను. ఇత డనేకావతారముల నొంది యసంఖ్యాకు లగు భక్తుల నుద్ధరించెను. శివావతారములు గణింప నేరి తరముకాదు. గగమున తారలు, పృథ్వియందు రేణువులు మేఘజలధారలు, గణింప నలవియగునేమో కాని,

శివావతారము లెన్ని కల్పములు చిరజీవులు లెక్కించినను అంతు గానలేరు. పరమైశ్వర్యకారక మగు శరభ చరిత్ర వినుము. నీచే శపింపబడిన జయవిజయు లిరువురు దితిసుతులై జనించిరి. వీ రిరువురు హిరణ్యాక్ష హిరణ్యకశిపు లను పేరుతో మహాబలవంతులై యుండిరి. వీరిలో ప్రథముడు హిరణ్యాకశిపుడు. రెండవవాడు హిరణ్యాక్షుడునై యుండిరి. భూమి నుద్ధరింపు మని బ్రహ్మాది దేవతలు విష్ణువుతో మొరలిడ విష్ణువు వరాహరూపుడై హిరణ్యాక్షుని సంహరించి పృథ్వి నుద్ధరించెను. ప్రాణసన్నిభు డైన సోదరుడు విష్ణువుచే మరణించె నని హిరణ్యాకశిపుడు విని విష్ణువుపై తీవ్రకోప మూని వరములు పడయుటకై పది వేలసంవత్సరములు బ్రహ్మను గూర్చి తపంబుచేసి యీ సృష్టిజాలములో నెవరిచేతను దేనిచేతను మరణింపరా దను వరముల నొంది, శోణితపురి కేగి త్రిలోకములు జయించి నిష్కంటకముగ రాజ్యము చేయుచు సర్వధర్మముల వీడి దేవముని ఋషుల హింసింపుచు ద్విజులను పీడింపుచుండెను.

తన పుత్రు డగు ప్రహ్లాదుడు విష్ణుభక్తి కలవా డగుటచే మరింత విష్ణు ద్వేషియై యుండ, సభామధ్య స్తంభంబున విష్ణువు కరాళనృసింహావతారుడై, యతిభయంకరుడై ప్రజ్వరిల్లుచు దైత్యులను భయపెట్టుచు వారల ననేకుల సంహరించి హిరణ్యకశిపునితో ఘోరయుద్ధము చేయుచు నక్షత్రలకు రోమహర్షణము గావింపుచు సాయంసమయంబున గడపపై గూర్చుని హిరణ్యకశిపుని తన యంకమున బడవైచి తన నఖాగ్రములచే నతని యుదరము చీల్చి దేవతలు గాంచుచుండగ నతనిని సంహరించెను. ఇతని సంహారముచే దేవతలు దుందుభులు మ్రోగించిరి. ప్రహ్లాదు డిదంతయు గాంచుచుండెను. లక్ష్మి నృసింహాకృతిని విస్మయముగ గాంచుచుండెను. హిరణ్యకశిపుడు మరణించినను నృసింహజ్వాలలచే లోకములు వ్యాకులత నొందజొచ్చెను.. దేవత లందఱు ప్రళయము సంభవించునా యని మరల దుఃఖింపసాగిరి. ఈనృసింహ జ్వాలలకు భయపడి బ్రహ్మాది దేవతలు దరిజేర లేక ప్రహ్లాదుని ప్రార్థింపుమని వేడుకొన, నాభక్త ప్రహ్లాదుడు నృసింహమూర్తి కౌగిలించుకొనియుండ నారసింహుని హృదయము మాత్రము చల్లబడెను గాని, జ్వాలలుమాత్ర ముపశమింపకుండెను. ఇది గాంచి బ్రహ్మాది దేవత లందఱు దుఃఖింపుచు శంకరుని శరణు

నత డట్టహాసము చేయుచు నృసింహాకృతులగు కోటిగణంబులు వెంటనడువ, వారందఱు నట్టహాసంబుగ నాట్యములు చేయుచు శివునికడ కేతెంచిరి. బ్రహ్మ బ్రహ్మాండములతో బంతులాడునట్లు వీరభద్రుడు తన గణంబులతో నాడుచు పాడుచు కల్పాంతాగ్నివలె ప్రజ్వరిల్లుచున్న త్రినేత్రంబులు గల్గి జ్వలద్బాలేందుమండితజటాజూటుడై బాలేందువలయాకార తీక్ష్ణదంష్ట్రాద్వయంబు గల్గి, ఇంద్రధనుస్సులవంటి భ్రూయుగంబు గల్గి, మహాప్రచండహుంకారధ్వనులచే దిక్ఛ్రోత్రములను బధిరీకృతములుగ జేయుచు నీలమేఘాంజన శ్యామభీషణాగ్ని తప్తశ్మశ్రువులు గల్గి, యఖండభుజంబులచే వాద్యంబుల ప్రయోగించుచు త్రిశిఖము గల్గి మహాశక్తులు విజృంభింప జేయుచు వీరభద్రుడు డేతెంచి యీశ్వరునకు నమస్కరించి, స్వామీ! నన్ను స్మరించిన కారణము తెలుపుమన, ఖలసంహారకుడైన శివుడు వీరభద్రుని గాంచి, ఓ వీరభద్రా! ప్రళయము రాకుండగనే దేవతలకు భయము సంభవించెను. దారుణమైన నృసింహజ్వాలలను నీ వుపశమింప జేయవలయును. ముందుగా నీ వతనిని సాంత్వన వాక్యములచే శాంతింప జేయుము. అట్లు శాంతింపనిచో నీ భైరవాకృతిని జూపించి సూక్ష్మ తేజంబును సూక్ష్మ తేజంబుతోను స్థూల తేజంబును స్థూల తేజంబుతోడను ఉపశమింప జేయుము. నరసింహ తేజము నుపశమింప సమర్థమైన మహా తేజోవస్త్రంబు గల్గి శాంతింప జేయు మన;

శంకరాజ్ఞచే వీరభద్రుడును శాంతస్వరూపుడై నరకేసరి సమీపమున కేగి, తండ్రి పుత్రుని ఊరడించినట్లుగ శాంతివాక్యములతో, ఓ మాధవా! నీవు జగత్సుఖంబునకై యవతరించితివి. నీవు లోకరక్షణకై పరమేశ్వరునిచే నియోగింపబడితివి. పూర్వము ప్రళయకాలంబున భూమి యంతయు నేకార్ణవమై యుండ, సకలబీజజీవంబులను నావయందిడుకొని యానావను నీపుచ్ఛమునకు గట్టుకొని యేకార్ణవంబున మత్స్యరూపుడవై రక్షించితివి. నీవు వరాహరూపుడవై పృథ్విని నుద్ధరించితివి. నీవు నరకంఠీరవుడవై హిరణ్యకశిపుని హరించితివి. నీవు సర్వభూతప్రభుడవు. అవ్యయుడవు. లోకములకు దుఃఖములు కల్గునప్పుడెల్ల నీవు ప్రభవించి సుఖములు గూర్చుచుందువు. నీతో సమానుడు, నీకన్న నధికుడు మఱొకడు లేడు. నీవు శుభప్రదములైన వేదధర్మమార్గము ప్రతిష్ఠింప జేసితివి. నీ వెవనికై యవతరించితివో యాదానవుని సంహరించి

మహాత్త్వము వరకు గల తేజంబు లన్నియు, శివతేజంబులో లీనమయ్యెను. శివస్వరూపుడగు వీరభద్రుడిపుడు తనసాధారణ తేజంబు జూపించెను. తన మహత్తర తేజంబును చూపించినచో నెవరును గాంచలేరు. నిలువలేరు. తన సంహారరూపమగు వ్యక్తరూపమును వీరభద్రుడు జూపింప, దేవతలీస్వరూపమును గాంచి జయజయ ధ్వానములు చేయుచు మంగళ గీతికలు పాడజొచ్చిరి. అపుడా వీరభద్రుడు సహస్రబాహుడై, జటాజూటుడై, చంద్రార్ధశేఖరుడై, జాజ్వల్యమాన నేత్రుడై ద్విపక్షములు నొక్క చుంచువు (నాసిక) గల్గి అతితీక్ష్ణదంష్ట్రలు గల్గి నీలకంఠము గల్గి, దీర్ఘబాహువులు గల్గి, వహ్నిసన్నిభము లైన చతుష్పాదంబులు గల్గి, ప్రళయకాల నీలజీమూతము వలె భయంకరముగ గర్జించుచు మహాకోపాగ్నిచే ప్రజ్వరిల్లు నేత్రత్రయంబులు గిరగిర త్రిప్పుచు పండ్లు పటపట కొరుకుచు, నధరం బదరజేయుచు హుంకార ధ్వనులచే దిశలు దద్దరిల్ల జేయుచు, నరకేసరియెదుట సాక్షాత్కరింప నాతడీ శరభస్వరూపమును గాంచి, వినష్టబలవిక్రముడై దినకరునియెదుట ఖద్యోతమువలె వెలవెలబోవుచుండ, నీ శరభము తన రెక్కలు విలవిల విదళించుచు పాదములచే నాభిని దువ్వుకొనుచు, తన పుచ్ఛముచే నృసింహుని పాదములు బంధించి, పక్షములచే నతని బాహువుల బట్టి హృదయము భేదింపుచు మునులు దేవతలు గాంచుచుండ డేగ పావురమును బట్టినట్లుగ శరభుడు నృసింహుని బట్టి వినువీధి కెగిరి గిరగిర త్రిప్పుచు, అతనిని పీడింపజొచ్చెను. శరభుడు విష్ణువును తనపాదములచే బట్టి పీడించుచు పైకెగురుచు క్రిందకి దిగుచు బాధపెట్టుట బ్రహ్మాది దేవతలు మునులు గాంచి భీతి జెంది దీనవదనులై నమస్కరింపుచు స్తుతించిరి.

నృసింహమూర్తి వీరభద్రునిచే బంధింపబడి పరవశుడై దీనవదనుడై ఆశరభేశ్వరుని అష్టోత్తరశతనామంబులచే స్తుతించి, ఓ పరమేశ్వరా! శరభేశ్వరా! నేనహంకారముచే మతిభ్రష్టుడనైతిని. నే నహంకారముచే మతిహీనుడనై ప్రవర్తించినపుడెల్ల నీవు నన్ను శిక్షింపుచునే యుండవలె నని నరకేసరి శరభుని స్తుతించి, నేను యావజ్జీవితాంతము వరకు నీదాసుడ నని విన్నవించుకొన, శరభుడు మరల వీరభద్రస్వరూపుడై హరి

ఎదుట సాక్షాత్కరింప, బ్రహ్మాది దేవతలందఱు శరభాకారుడు, శివస్వరూపుడు నగు వీరభద్రుని నిట్లు స్తుతింపసాగిరి.

ఓ మహేశ్వరా! విష్ణుబ్రహ్మేంద్రాది దేవతలను, దనుజాది రాక్షసులను, చంద్రసూర్యులను, నీవే సృష్టిజేసితివి. సకలసృష్టులకు నీవే కారకుడవు. సృష్టిస్థితిలయంబులకు నీవె మూలకారకుడవు. సకలేశ్వరుడవు. ప్రపంచములను హరింపజేయువాడవు గాన, హరుడ వని పిలువబడు చుంటివి. నృసింహుని బంధించి మదము నణచితివి గాన, హరుడ వనిపిలువబడు చుంటివి నీ వష్టవిధములు విభజింపబడి యష్టమూర్తులతో ప్రపంచము నాశ్రయించి పాలించుచుంటివి. మా [illegible] యాధీనములు నెరవేర్చుము. నీవు మహానుభావుడవు. సుఖము నొసంగువాడవు. సర్వేశ్వరుడవు. సురనాయకుడవు. అణిమాదిరూపుడవు. స్వతంత్రుడవు. పరబ్రహ్మవు. సత్పురుషగతివి. దీనబంధుడవు. దయానిధానుడవు. [illegible]స్వరూపుడవు. పరబ్రహ్మధ్యానరతుడవు. ప్రజ్ఞుడవు. నిరాలంబస్వరూపుడవు. విభుడవు. సత్యస్వరూపుడవు. సచ్చిదానందస్వరూపుడ వని దేవతలందఱు స్తుతింప నీశ్వరుడు సంతసించి, ఓ దేవతలారా! మునులారా! వీరభద్రునకును నాకును భేదము లేదు. విష్ణువునకును నాకును భేదము లేదు. జలములో జలము కలిసినట్లును, పాలలో పాలు కలిసినట్లును నేతిలో నేయి కలిసినట్లును మాస్వరూపము లొకటేయని గ్రహింపుడు. మే మొకరిలో నొకరము లీన మగుచుందుము. ఈ నృసింహమూర్తి జగత్సంహారకుడై యుండెను. ఇతడు నాభక్తుడు గాన మీరందఱు నితనిని ప్రార్థింపుడు. ఇతడు వరదాత. మీసర్వకోర్కెలు సిద్ధింపజేయు నని పలికి, తన శరభరూప మందఱకును జూపి వారందఱును గాంచుచుండగ నదృశ్యుడయ్యెను. నృసింహుని వీరభద్రుడు తన శక్తిచే బట్టుకొని గిరిగుహాలోనికి గొంపోయెను. ఆనాటిదినంబున శివుడు నరసింహునిముఖమును ముండమాలగా ధరించి. అతనిచర్మము వసనముగ ధరించెను. దేవతలు నిర్భయులై నృసింహ శరభచరిత్రంబులు కీర్తించుచు విస్మయులై తమ తమ నెలవుల కేగిరి. వేదసారమైన యీ పుణ్యచరిత్రమును ప్రీతితో విన్నను పఠించినను సకల

శుచిమంతుడు. బ్రహ్మతేజోవంతుడు. ఇంద్రియ నిగ్రహుడు. సర్వశాస్త్రార్థ విజ్ఞాత. సదాచారరతుడు. శైవాచార ప్రవీణుడు. లౌకికాచార విశారదుడునై యుండెను. ఇతడు గృహస్థాశ్రమము స్వీకరింప దలచి గుణవతిని పరిణయమాడ నెంచి తగినకాలంబున యథావిధిగ వివాహమాడి, పంచయజ్ఞపరాయణుడై, యగ్నిని సేవించుచు, యజన, యాజన, అధ్యయన, అధ్యాపన, దాన, ప్రతిగ్రహము లనెడి షట్కర్మనిరతుడై, దేవ, పితృ, అతిథులను సేవించుచు నీ బ్రాహ్మణుడు చిరకాలము గడప, నొకానొక సమయంబున, శుచిష్మతి యను నితనిభార్య భర్తతో నిట్లనెను.

ఓ నాథా, తమదయచే నేను సకలభోగంబుల ననుభవించుచుంటిని. చాలకాలమునుండి మిమ్ములనొక కోరిక కోరదలచుచుంటిని. అది గృహస్థాశ్రమమునకు తగిన కోరికయై యుండెను. పతివ్రతయగు భార్యకోర్కె దీర్చుట పతికి ధర్మమై యున్నది, గాన, నాకోర్కె దీర్చుడన, విశ్వానరుడు భార్యవాక్యంబు విని, ఓసుశ్రోణీ! ఓప్రియా! నేను విలంబము చేయక యవశ్యము నీకోర్కె దీర్పగలను. మహేశ్వరప్రసాదముచే నాకు దుర్లభమైనది లేదు. సర్వకళ్యాణకారకులగు పురుషులు ఇహపరములయందు దేని కోరినను నొసంగుదు రన, శుచిష్మతి పతివాక్యంబు విని, బద్ధాంజలిపుటయై వినయముతో, నాథా! నేను వరయోగ్యరాల నైనచో నీశ్వరతుల్యుడగు పుత్రుని నాకు ప్రసాదింపు డన, నావిప్రుడావాక్యంబు విని, సమాధినిష్ఠుడై కొంతసేపాలోచించి నన్నిదె కడుదుర్లభమైన కోరికను కోరినదేమి, ఈశ్వరునకు నా మనోరథపథమునకు దూరమగునా యేమి? నా కోర్కె తీర్చువాడునా, ఆ ఈశ్వరుడే నాభార్య ముఖమున నిట్లు పలికించెను కాబోలును. లేనిచో నీమె యిట్లెందుకు పల్కునని బాగుగా నాలోచించి యోగక్షేమవహుడగు నావిప్రుడు నీకోర్కె తీర్పగల నని భార్యకభయమిచ్చి, కాశీవిశ్వేశ్వరునికడకు తపము చేయనేగి, ముందుగ మణికర్ణికా ఘట్టమున స్నానము చేసి, శతజన్మార్జితాధ్యాత్మికాధిభౌతికాధిదైవికము లనెడి తాపత్రయంబులను పోగొట్టు విశ్వేశ్వర పాదపద్మలింగమును దర్శించి సకలవాపీకూపతటాకాదులందు స్నానమాడి, సకలవినాయక గౌరీశంకరులను గాంచి నమస్కరించి, పాపభక్షకుడగు కాలభైరవుని పూజించి దండ

నాయకముఖ్యగణంబులను స్తుతించి ఆదికేశవుని, ముఖ్యమగు తదితర కేశవులను, సంతసపరచి, లోలార్క ముఖ్యు లగు సూర్యులకు నమస్కరించి, విలంబము చేయక సకలతీర్థములయందు పిండదానములు చేసి సహస్రసంఖ్యాకంబులుగ విప్రులను నన్నాదులచేతృప్తిపరచి, మహాపూజోపచారములచే సర్వలింగముల భక్తితో పూజించి యాశులోచలింగ మేదియా యని యోచించుచు తన మొనర్చుటకు నిశ్చలప్రదేశ మెచట గల దని యాలోచించి, పుత్రప్రద మైన లింగము వీరేశ్వరలింగ మని నిశ్చయించి యసంఖ్యాకులగు సిద్ధు లిచటనే సిద్ధినొందిరని తెలిసికొని, వీరేశ్వరలింగమే సిద్ధలింగ మని యెరింగి, తనభార్య కభిలషితపుత్రు నితడే యొసంగగల డని త్వరితముగ కార్యసిద్ధి కాగల దనియు, వీరేశ్వరలింగము నొకసంవత్సర మారాధింప దలచి, చంద్రకూపజలమందు స్నాన మాచరించి నియతవ్రతుడై యొకమాసము పగటియందు భుజింపుచు మరియొకమాసము రాత్రియందుభుజింపుచు నేకభుక్తవ్రతుడై మరియొకమాసమయాచితభోజనము చేయును. తదుపరి మాసము విడిచిమాసము నక్తభోజనముచేయుచు మరియొకమాసము ఫలశాకంబులు భుజింపుచు, మరియొక మాసము పయోవ్రత మాచరింపుచు మరియొకమాసము పిడికెడు తిలలు మాత్రమే భుజింపుచుచు మరియొక మాసము జలపానము మాత్రమే చేయుచు, మరియొకమాసము పంచగవ్యప్రాశన చేయుచు, మరియొక మాసము చాంద్రాయణవ్రత మాచరింపుచు కొన్నిరోజులు కుశాగ్రజల పానము చేయుచు, కొన్నిరోజులు వాయుభక్షణ చేయుచు నిట్లు పన్నెండు మాసములు గడిపి, ఈ సంవత్సరమంతయు ఘోరతప మాచరించి ఉత్తమంబైన వీరేశలింగమును త్రికాల మర్చించుచు, పదుమూడవ మాసమున యథాప్రకారంబుగ గంగాస్నాన మాచరించి వీరేశుని పూజించుటకై లింగసమీపమునకు బోవ నాతపోధను డాలింగ మధ్యభాగంబున, విభూతి భూషణుడు అష్టవర్షప్రాయుడు ఆకర్ణాయతనేత్రుడు నరుణోష్ఠద్వయుడు చారుపింగళజటాజూటుడు దిగంబరుడు ప్రహసితాననుడు శైశవోచితవేషుడు, చితాభస్మధరుడు నగు పరమేశ్వరుడు డష్టవర్షంబుల రూపమూని శ్రుతిసూక్తములు పఠింపుచు దరహాసితవదనుడై యెదుట సాక్షాత్కరించిన బాలుని విశ్వానరుడు గాంచి,

అతిముద మొంది రోమాంచితుడై యా బాలరుద్రస్వరూపముని తనహృదయమున దిడుకొని మాటిమాటికి నమస్కరింపుచు, తన యభిలషితము ప్రకటించు నట్లుగ నష్టపద్యంబులచే నీశ్వరు నిట్లు స్తుతింప జొచ్చెను.

## ఈశ్వరాష్టకం

శ్లో॥ ఏకం బ్రహ్మై వాఽద్వితీయం సమస్తం
సత్యం సత్యం నేహ నానాస్తి కించిత్
ఏకో రుద్రో నద్వితీయోఽవతస్థే
తస్మా దేకం త్వాం ప్రపద్యే మహేశం.

శ్లో॥ కర్తా హర్తా త్వంహి సర్వస్య శంభో
నానారూపే ష్వేకరూపోఽ ప్యరూపః
యద్వత్ప్రత్యగ్ధర్మ ఏకోఽ ప్యనేక
స్తస్మా న్నాన్యం త్వాం వినేశం ప్రపద్యే.

శ్లో॥ రజ్జౌ సర్పః శ్శుక్తికాయాంచ రౌప్యం
నైరః పూర స్తన్మృగాఖ్యే మరీచౌ
యద్వ త్తద్వ ద్విష్వగేవ ప్రపంచో
యస్మిన్ జ్ఞాతే తం ప్రపద్యే మహేశం.

శ్లో॥ తోయే శైత్యం దాహకత్వంచ వహ్నౌ
తాపో భానౌ శీతభానౌ ప్రసాదః
పుష్పే గంధో దుగ్ధమధ్యేఽపి సర్పి
ర్యత్త చ్ఛంభో త్వం తతస్త్వాం ప్రపద్యే.

శ్లో॥ శబ్దం గృహ్ణాస్యశ్రవా స్త్వంహి జిఘ్రస్యఘ్రాణ
స్త్వం వ్యంఘ్రి రాయాసి దూరాత్
వ్యక్షః పశ్యే స్త్వం రసజ్ఞోఽ ప్యజిహ్వః
కస్త్వాం సమ్య గ్వేత్త్యత స్త్వాం ప్రపద్యే.

శ్లో॥ నో వేద త్వా మీశ సాక్షాద్ధి వేదో
నోవా విష్ణు ర్నోవిధాతాఽఖిలస్య
నో యోగీంద్రా నేంద్రముఖ్యాశ్చ దేవా
భక్తో వేద త్వా మతస్త్వాం ప్రపద్యే.

శ్లో॥ నో తే గోత్రం నోసి జన్మాపి నాఖ్యా
నోవా రూపం నైవ శీలం న దేశః
ఇత్థం భూతోఽపీశ్వర స్త్వం త్రిలోక్యాం
సర్వా న్కామా న్పూరయే స్త్వాం భజేహం.

శ్లో॥ త్వత్త స్సర్వం త్వంహి సర్వం స్మరారే
త్వం గౌరీశ స్త్వంచ నగ్నోఽతిశాంతః
త్వం వై వృద్ధ స్త్వం యువా త్వంచ బాల
స్తత్త్వం యత్కిం నాస్యసి త్వాం నతోఽహం.

ఏకమేవాఽద్వితీయంబ్రహ్మ అనుశ్రుతి ననుసరించి నీవొక్కడవే కాని యన్యుడు లేడు. సమస్తము నీవే. ఇది ముమ్మాటికి సత్యము. రుద్రస్వరూపుడ వగు నీవుగాక మరి అన్యదైవము లేదని నీకు నమస్కరించుచుంటిని.

ఓ శంభో! నీవు సర్వమునకు కర్తవు. హర్తవునై యుంటివి. నీవు నానారూపుడవు. ఏకరూపుడవు. అరూపుడవునై యుంటివి. అనేకధర్మము లున్నను సనాతనధర్మమైన మహేశ్వరధర్మముకంటె వేరుధర్మము లేదని నిన్ను శరణు బొందుచుంటిని.

రజ్జువునందు సర్పము, శుక్తియందు రజతము, ఎండమావుల యందు జలము వలె నీమాయచే ప్రపంచ మంతయు నిండియున్న మహేశ్వరుడ వగు నిన్ను శరణు బొందుచుంటిని.

జలమందు శీతలత్వము, అగ్నియందు దాహకత్వము భానునియందు తాపము, చంద్రునియందు ప్రసాదము, పుష్పములందు సౌరభము, పాల యందు ఘృతము వలె సర్వవ్యాపివై యన్నిటియందు నీ వుంటివి.

నీవు శ్రవణేంద్రియములు లేకున్నను వినుచుంటివి. ఘ్రాణేంద్రియము లేకున్నను దూరమునుండి సువాసనలు గ్రహింపుచుంటివి. అక్షులు లేకున్నను గాంచుచుంటివి. రసనేంద్రియము లేకున్నను రసము గ్రహింపుచుంటివి. ఇట్టి సమ్యగ్వేది వగు నీకు నమస్కారము

ఓ ఈశ్వరా! నిన్ను వేదములుకూడ తెలిసికొనలేవు. విష్ణుబ్రహ్మలు తెలిసికొనలేరు. ఇంద్రాదిదేవతలు తెలిసికొనలేరు. నిన్ను యోగులైనను తెలిసికొనలేరు. నీభక్తులే నిన్ను తెలిసికొనగల్గుదురు. దేవా! నిన్ను శరణుబొంద వచ్చితిని.

నీకు గోత్రము లేదు. జన్మలు లేవు. నామము లేదు. శీలము లేదు. దేశము లేదు. ఏవి లేకున్నను సర్వభూతప్రభుడవై త్రిలోకవాసులకు సర్వకామ్యముల పూరింపుచున్న నిన్ను భజించి శరణు పొందితిని.

ఓ స్మరారీ! సర్వము నీవై యుంటివి. నీనుండి సర్వము జనించెను. నీవు గౌరీశుడవు. దిగంబరుడవు. అతిశాంతుడవు. వృద్ధుడవు. యువకుడవు. బాలుడవు. నీకన్న భిన్నమగు పదార్థ మేదియు లేదు. అని ఇవ్విధంబున విశ్వానరు డీశ్వరుని స్తుతించి భువిపై బడి సాష్టాంగదండప్రణామంబు లాచరింప, వృద్ధులలో వృద్ధుడగు నా బాలుడు విప్రస్తుతులకు సంతసించి;

ఓ మునిప్రవరా! నీ స్తుతులకు సంతసించితిని. నీ కుత్తమంబైన వర మిచ్చెద, కోరుకొమ్మన, నతడు సంతసించి లేచి శంకరుని గాంచి ఓమహేశ్వరా! నీకు తెలియని దేమున్నది? నీవు సర్వాంతర్యామివి. సర్వ ప్రభుడవు. ఏమియు నెరుగనివానివలె నిట్లడుగుచుంటి వేల? ఈ దీనుని మనోభీష్ట మెరింగి నీ ఇచ్చవచ్చినట్లు చేయుమనన, పవిత్రవ్రతధారి యగు విప్రవాక్యము లా దేవదేవుడు విని, దరహసిత వదనుడై, ఓమునిసత్తమా! నీవు శుచిష్మతికి పుత్రుని నీయదలచితివి. అచిరకాలమునందే నీకోర్కె తీరును. సంశయింపకుము. నీ భార్యకు నేనే పుత్రుడనై జనించెదను. నేను గృహపతి యని ప్రసిద్ధనాముడనై దేవతాప్రియుడనై యుందును నీవు స్తుతించిన యభిలషితాష్టకమును ఒక సంవత్సరము త్రికాలములందు శివ

సన్నిధిని పఠించినచో వారివారి మనోభీష్టము లీడేరును. ఈస్తోత్రపఠనము పుత్రపౌత్రధనప్రదమై యున్నది. ఇంకను సర్వశాంతికరమై సర్వాపత్తినివారకమై స్వర్గాపవర్గసంపత్తి కారకమై యొప్పుచున్నది. సందియము లేదు. ఈస్తోత్రము పఠించిన సకలస్తోత్రములు పఠించిన ఫలము గల్గి సకల కోర్కెలీడేరును.

ఏమనుజులు ప్రాతఃకాలమున లేచి స్నానమాచరించి శివలింగ మర్చించి, శివజపము చేసి, ఈస్తోత్రము సంవత్సరమువరకు పఠించినచో అపుత్రుడు పుత్రవంతు డగును. సకలకోరిక లీడేరును. ఈ యభిలషితాష్టకము ఈయలేని దేదియు నుండదు. ఇది యతిగుప్తమైన విషయ మని గ్రహింపుము. ఎట్టి మహావంధ్యయైనను పుత్రవంతురాలగును. స్త్రీ లైనను పురుషు లైనను ఈస్తోత్రము శివలింగము కడ నొక సంవత్సరము పఠించినచో తప్పక పుత్రవంతు లగుదురు. సంశయింపకు మని బాలశంకరుడు పలికి యదృశ్యు డయ్యెను. శుచిష్మతి విశ్వానరుడు సంతుష్టహృదయుడై తన గృహమున కేగెను.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
పదమూడవ యధ్యాయము సంపూర్ణము.

---

# పదునాల్గవ యధ్యాయము

## గృహపతి యవతారము

విశ్వానరుడు తపస్సిద్ధిని పొంది ముదంబుతో నింటి కేగి తనప్రియురాలితో సర్వము నెరింగింప నామె యతిముదాన్వితయై తనయదృష్టమును ప్రశంసించుకొనుచుండ, కొంతకాలమున కామె గర్భవతియై యుండ, నావిప్రుడు తనభార్యకు పుంసవనాదిసంస్కారము లన్నియు చేయించి యెనిమిదవ మాసంబున గర్భవృద్ధికై గృహ్యోక్తవిధిప్రకారంబుగ

సీమంతాది క్రియలు చేయించి పురుషసంతానము కోరగ సుఖప్రసవము కొరకు నేకవిధిగ సకలక్రియలు చేయించెను. తదుపరి నవమాసములు నిండగనే యొకానొక శుభనక్షత్రశుభలగ్నమున శుభకేంద్రమందు గురు డుండగ గ్రహము లన్నియు శుభలగ్నమం దుండగ బాలారిష్టనివార కుడు, సర్వారిష్టనివారకుడు, పరమేశ్వరుడు శుచిష్మతికి తనయుడై జనిం చెను. చంద్రముఖు డగు శిశువు జనింపగనే సూతికాగృహ మంతయు దేదీప్యమానముగ ప్రకాశించెను. భూలోక, భువర్లోక, సువర్లోక, వాసు లందులు సుఖముగా నుండిరి. సకలదిశల సుగంధవాయువులు వీచుచుండెను. మేఘములు కుసుమవర్షంబులు కురిపించెను. దేవతలు దుందుభులు మ్రోగించిరి. దిక్కు లన్నియు ప్రకాశముగ నుండెను. మనుజమనంబులు నదులు స్వచ్ఛముగ నుండెను. సర్వజీవులు సుఖముగ నుండి, తిమిర ములు నశించెను. ధూళి యణగిపోయెను, సాత్వికులకు సత్వగుణ మధిక మయ్యెను. ఎటు గాంచినను వృష్టి కురియుచుండెను. ప్రతిజీవులు శుభప్ర దవాక్కులు బల్కుచుండిరి. ప్రియవాక్కులే గాని, యప్రియవాక్కు లెవ రును బల్కుట లేదు. రంభాద్యప్సరసలు మంగళద్రవ్యములు చేత బూని మంగళగీతికలు పాడుచుండిరి. యక్షకిన్నరకింపురుషోరగవిద్యాధరులు మంగళ గీతికలు గానము చేసిరి. మరీచి, అత్రి, పులహుడు, పులస్త్యుడు, క్రతువు, అంగిరుడు, వసిష్ఠుడు, కశ్యపుడు, అగస్త్యుడు, విభాండుడు, లోమశుడు, రోమచరణుడు, భరద్వాజుడు, గౌతముడు, భృగుడు, శాలవుడు, గర్గుడు, జాతూకర్ణ్యుడు, పరాశరుడు, ఆపస్తంబుడు, యాజ్ఞవల్క్యుడు, దక్షుడు, వాల్మీకి, ముద్గలుడు, శాతాతపుడు, లిఖితుడు, శిలాదుడు, శంఖుడు, జమదగ్ని, సంవర్తుడు, మతంగుడు, భరతుడు, అంశుమంతుడు, వ్యాసుడు, కాత్యాయనుడు, కుత్సుడు, శౌనకుడు, సుశ్రుతుడు, శుకుడు, ఋష్యశృం గుడు, దుర్వాసుడు, శుచి, నారదుడు, తుంబురుడు, ఉత్తంకుడు, వామ దేవుడు, పవనుడు, అసితుడు, దేవలుడు, సాలంకాయనుడు, హారీతుడు, విశ్వామిత్రుడు, భార్గవుడు, మృకండుడు, మార్కండేయుడు, పర్వతుడు, దారుకుడు, ధౌమ్యుడు, ఉపమన్యుడు, వత్సుడు, మొదలగు మునులు ముని కన్యకలు బాలుని శాంతికొరకు విశ్వానరుని యాశ్రమంబున కేతెంచిరి.

బృహస్పతిసహితుడై బ్రహ్మ, దేవతలతో గరుడవాహనుడగు విష్ణువు, నందిభృంగిసహితులై యుమాశంకరులు, మహేంద్రాద్యష్టదిక్పాలకులు, పాతాళవాసులగు నాగులు, ననేకరత్నములు గ్రహించి నదులతో సాగరంబులు మూర్తిమంతము లైన యనేక స్థావరజంగమంబులు, నేతెంచిరి. ఈ మహోత్సవ సమయంబున నసమయ మైనను కౌముది స్వచ్ఛముగ ప్రకాశింపజొచ్చెను. బ్రహ్మ స్వయముగ విధిప్రకారము జాతకర్మ చేయించి శ్రుతులు విచారించి ఆబాలకుని రూపమునకు తగినట్లుగ గృహపతి యని నామకరణము చేసెను. బాలుడుద్భవించిన పదకొండవ రోజున యథావిధిగ నామకరణము చేసి, నాల్గు వేదమంత్రములచే నాశీర్వదించి, యేతెంచిన సకలమునులచే నాశీర్వదింపజేసి, యందఱు గాంచుచుండ హంసవాహనారూఢుడై తనలోక మేగెను. శంకరుడు లోకగతి నాశ్రయించి బాలునకు రక్షాబంధనము గట్టి నారిని గాంచి తన లోక మేగెను. ఈబాలుడెంత రూపసి! ఎంత తేజోవంతుడు, ఎంత సర్వాంగ లక్షణుడు! ఈశ్వరుడే స్వయముగ నీకు కుమారుడై జన్మించెను. శుచిష్మతి యెంత భాగ్యవంతురాలని యందఱు ప్రశంసింపజొచ్చిరి. మరియు మీదంపతులు సదా శివభక్తులై శివు నర్చించిరి, గాన కేవలము శివుడే వీరికి పుత్రుడై యావిర్భవించె నని వచ్చినవా రందఱు ప్రశంసించి యెవరి స్థానములకు వా రేగిరి.

పుత్రునిచే పున్నామనరకము దాటగల్గుదు రని యూహించి అందఱు పుత్రులనే కోరుచుందురు. 'పుత్రేణాలోకాన్ జయతి' యని శ్రుతి వాక్యములచే పుత్రుని గోరుచుందురు.

శ్లో॥ అపుత్రస్య గృహం శూన్య మపుత్ర స్యార్జనం వృథా
అపుత్రస్య తపశ్ఛిన్నం నోపవిత్రత్యపుత్రతః,

శ్లో॥ న పుత్రా త్పరమో లాభో నపుత్రా త్పరమం శుభం
న పుత్రా త్పరమం మిత్రం పరత్రేహాచ కుత్రచిత్.

పుత్రులు లేనిగృహము శూన్యము. అపుత్రకుని యార్జన వృథా యగును. అపుత్రకుని తపంబు ఫలింపదు. పుత్రహీనుడు పవిత్రుడు గాడు. పుత్రుని మిం

చిన మరియొక లాభము లేదు. పుత్రుని మించిన శుభమును లేదు. పుత్రుని మించిన పరమమిత్రుడును లేడు. ఇహపరముల యందు పుత్రుని మించిన దేదియు లేదు. కాన సామాన్య పుత్రునికే ఇంత యాధిక్యముండ నింక శంకరుడే సాక్షాత్తు పుత్రుడై యుండ విశ్వానరుని యదృష్ట మెంతని వర్ణింప గలము? విశ్వానరుడు తన పుత్రుడగు గృహపతికి నాల్గవమాసమునందు నిష్క్రమణసంస్కారము గావించెను. నిష్క్రమణ మనగా శుశ్రూష శ్రవణము ధారణము ఊహ యపోహ అర్థవిజ్ఞానము అనునవి. పసివాని కివి కలుగుటకై వేదసంస్కారక్రియలు చేయించెను. ఆరవమాసంబున నన్నప్రాశన గావించెను.

తదుపరి చూడాకర్మ చేయించెను. తదుపరి శ్రవణానక్షత్రమున చెవులు కుట్టించెను. బ్రహ్మతేజోభివృద్ధికై ఐదవ సంవత్సరమున నుపనయనము గావించెను. తదుపరి యుపాకర్మ చేయించి వేదాధ్యయనము ప్రారంభించెను. బాలుడు వేద మంత్రము పదక్రమసహితముగ నొక సంవత్సరమున పూర్తి చేసెను. ఇతడు నిమిత్తమాత్రముగ గురువును స్వీకరించెను గాని, సర్వ విద్యలు నాతనికి కంఠస్థమై యుండెను. సర్వవిద్యలు, వినయవిధేయతలతో గురువువద్ద స్వీకరించెను. తొమ్మిదవ సంవత్సరమున నతడు తలిదండ్రులకు శుశ్రూషలు చేయుచుండెను.

అట్టితరి నారదుడు గృహపతిని గాంచుటకై విశ్వానరుని పర్ణశాల కేతెంచి గృహపతిని కుశలప్రశ్నలడుగుచు మహాకౌతుకంబున నొసగిన యర్ఘ్యాసనంబున నాసీనుడై విశ్వానరుని ప్రశంసించుచుండ, విశ్వానరుడు శివపదాంబుజములు స్మరించుచు, నచిరకాలములో తన పుత్రుడు గ్రహించిన సకలవిద్యలు, నారదున కెరిగించి నారదునకు నమస్కరింపుమని పుత్రుని కాజ్ఞాపింప, అతడు నారదునకు నమస్కరించి కూర్చొనెను. నారదుడు గృహపతిని గాంచి, ఓ బాలకా! నీవు నా యొద్దకు రమ్ము. నీ దక్షిణ హస్తమును [illegible] శుభావిశేషములు కరతల [illegible], నారదుడు శివునకు [illegible], విశ్వానరుని గాంచి, ఓ మునీ! నీ పుత్రుడు సర్వలక్షణ [illegible] సంపన్నుడైయుండెను. ఇతని యంగములు కరతల [illegible] చెప్పెద, వినుము.

ఇతడు సర్వలక్షణసంపన్నుడు. సర్వగుణోపేతుడు. సర్వలక్షణలక్షితుడు. సంపూర్ణనిర్మలకళుడు. కాని నీవు సర్వవిధముల బాలుని రక్షించుచుండవలెను. బ్రహ్మలిఖితము బాగులేనిచో, ఎన్నిగుణము లున్న నేమిప్రయోజనము? ఈ బాలునకు పండ్రెండవ సంవత్సరము ప్రాయము కలుగగనే, ఉదయము విద్యుదగ్నిచే నితడు దహింపబడును. జాగ్రత్తసుమీ! యని చెప్పి నారదుడు తన లోక మేగెను.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునైదవ యధ్యాయము

### గృహపతి తపంబుచేసి ఆగ్నేయపదవి నొందుట

పిడుగువంటి నారదవాక్కులు విని బాలునితలిదండ్రు లిరువురు నయ్యో! దైవమా! ఇపు డేమి చేయుదు మని విలపించుచు బహువిధంబుల దుఃఖించుచు పుత్రశోకాతురులై మూర్ఛనొంది మరల లేచి శుచిష్మతి యతిగా దుఃఖించుచు మొర్రోయని యేడ్చుచుండ, విశ్వానరుడు ఉచ్చైస్వరంబున విపరీతముగ నేడ్చుచున్న భార్యను గాంచి ఇదేమి విపరీతము? ఏడీ మన గృహపతి యెక్కడ? నాబహిఃప్రాణము నాయంతరాత్మ సకలేంద్రియప్రభువు ఏడీ? యెక్కడుండె? నని గట్టిగా బలుక గృహపతి బహుశోకసమన్వితులగు తలితండ్రుల గాంచి శంకరాంశజు డగు నత డిట్లు పల్కెను. ఓతలిదండ్రులారా! మీ కీభయ మెందుకు? మీ దుఃఖకారణ మేమి? నాతో జెప్పుడు. మీపాదధూళి నే ధరించినంతదనుక మృత్యువు నన్నేమి చేయగలదు? ఏమంత్రముచే మృత్యువు భయపడి పారిపోవునో అట్టి మృత్యుంజయమంత్రము నా కుపదేశించినచో, నే నామంత్రమును జపించి మృత్యువును జయించెద నన, నాదంపతులు పుత్రునివాక్కులు విని, యాకాలా

మృతసర్పమువలె సంతసించి, ఓపుత్రా! ఏమంటివి? ఆయమృతవాక్కులు మరల బల్కుము. ఆమంత్రముచే కాలుడుకూడ నిన్ను జయింపలేడు. ఇక పిడుగుమాట చెప్పనేల? మా ఇరువురి దుఃఖములను దూరము చేయుటకై మంచి యుపాయము జెప్పితివి. మృత్యుంజయ మంత్రమునకు సరితూగు మంత్ర మేదియు లేదు. శంభుని మించిన శరణాగతసంరక్షకుడును లేడు. అతడు మనోరథపథాతీతుడు. పాపసంహారకుడు. పూర్వము శివుడు కాలపాశబద్ధు డగు శ్వేతకేతుని రక్షించె నని వినియుండలేదా? అష్టవర్షప్రాయు డగు నందిని ఈత్రిపురాంతకుడే రక్షించెను. క్షీరసాగరమథనోద్భవము, ప్రళయానలసన్నిభము నగు హాలాహలము శంకరుడు భక్షించి భువనత్రయము రక్షించెను. మహాదర్పుడై త్రైలోక్యసంపదలు హరించిన జలంధరుని తన యంగుష్ఠరేఖోద్భవచక్రముచే సంహరించెను. త్రిలోకైశ్వర్యంబులు హరించిన త్రిపురాసురులను త్రిపురములను నొక బాణాగ్నిచే దహింపజేసెను. త్రైలోక్యవిజయు డగు మన్మథుని తన నేత్రాగ్నిచే భస్మము చేసి యనంగుని జేసెను. విష్ణుబ్రహ్మేంద్రాది సృష్టికర్తయు విశ్వరత్నామణియు నగు శివుని శరణుపొందుము సుత,

ఆ బాలుడు తలితండ్రులకు ప్రదక్షిణనమస్కారములు చేసి వారి యాశీస్సుల నొంది ధైర్యము వహించి బ్రహ్మవిష్ణువులకు కూడ నలవి కాని తపంబు చేయదలచి కాశీపురి కేగి మహాసంవర్తసంతాపకరమైనదియు విశ్వేశ్వరపాలితమైనదియు నగు కాశీపురిని గాంచెను. అపురమం దున్న గంగ శంకరుని గళమం దున్న హారమా యన్నట్లు ప్రకాశించుచుండెను. ఇట్టి గంగామతల్లితో విచిత్రగుణశాలిని యగు పార్వతితో శంకరుడు డెందము సేసి శోభించుచుండెను. ఇతడట్టి కాశీ నంతయు కలయ జూచి ముందుగా మణికర్ణికాఘట్టమున స్నానమాచరించి విశ్వేశ్వరుని దర్శించి ప్రహృష్టాత్ముడై సాష్టాంగనమస్కారము చేసి ఆబుద్ధిమంతుడు మహానందభరితుడై త్రిలోకరక్షకు డగు విశ్వేశ్వరునకు నమస్కరించి, యా లింగమును మాటిమాటికి గాంచుచు ఆమూర్తిని హృదయమం దిడుకొని ఇతడు పరమానందకందు డని నిశ్చయించి, ఇందుకు సందేహము లే దని తలచి, ముల్లోకచరాచరములయందు నావంటి ధన్యుడు లే డని

యెంచి, ఈవిశ్వేశ్వరుని దర్శింపగలిగితిని, గాన నాకింకెట్టి కొదవ యుండును?
నేను కృతకృత్యుడను, గాన నారదుడు సెలవు చెప్పియుండెడ నని తలంచి
యానందామృతరసంబున నోలలాడుచు, ఒకశుభదినమందు సర్వహితప్రద
మగు నొకలింగము స్థాపించి, మహత్తరఘోరనియమంబుల బూని వస్త్ర
ముచే వడబోసిన గంగాజలపూరిత అష్టోత్తరశతఘటంబులచే శివు నభిషే
కించి ప్రతిదినము నీలోత్పలమాల శివలింగమును నలంకరించి, అష్టోత్తర
శతసహస్రపుష్పములచే పూజించి పక్షమునకు గాని, మాసమునకు గాని,
కందమూలఫలంబు లొకసారి భుజింపుచు షణ్మాసంబులు శుష్కపత్రం
బులు భుజింపుచు షణ్మాసంబులు వాయువునే భక్షింపుచు మరి మూరు
మాసంబులు కుశాగ్రజలబిందువుల పానము చేయుచు శివధ్యానపరుడై
తపంబు చేయుచుండగ, నారదవాక్యప్రకారంబుగ నితనికి ద్వాదశాబ్దములు
నిండెను. నారదవాక్యము చేయుటకు కులిశాయుధు డగు దేవేంద్రుడు
బాలుని యెదుట సాక్షాత్కరించి, ఓ బాలుడా? నేను శతక్రతువును. నీ
తపంబునకు మెచ్చి ప్రసన్నుడ నైతిని. నీ యీప్సితవరము కోరుకొమ్మన,

మునికుమారుడు ఇంద్రవాక్యములు విని మధురధీరవాక్యములతో, ఓ దే
వేంద్రా! నిన్ను నే నెరుగుదును. నాకు వరంబులు ప్రసాదించువాడు శంక
రుడే గాని నీవు గావు, నీవు బాలస్వభావముచే నిట్లనుచుంటివి గాని,
నాకన్న శంకరు డధికుడు గాడు. నేను దేవతలకు ప్రభువును. నీయజ్ఞానమును
విడి నాచే వరములు వడయు మని శక్రుడు పలుక, ఓపర్వతారీ! ఓపాకశా
సనా! నీవు వచ్చినదారినే పొమ్ము. నేను నిశ్చయముగ పశుపతినివినా యొవ
రిని అర్థింప నని పలికెను గృహపతి వాక్యములు విని, శచీపతి క్రుద్ధుడై వజ్రా
యుధము పైకెత్తె ఘోరభీషణమైన వజ్రాయుధమును బాలుడు గాంచి, నార
దవాక్యములు తలంచుకొని భయముచే మూర్ఛనొందె, శంకరుడు బాలునితపం
బునకు మెచ్చి యతని యెదుట సాక్షాత్కరించి, తనహస్తముచే నాబాలుని
స్పృశించి బాలుని తెప్పరిల్ల జేయుచు, బాలకా! నీకు భయము లేదు.
లెమ్ములెమ్మని పలుక రాత్రియంతయు నిద్రించి సూర్యోదయమైనతరి
కమలములు వికసించిన ట్లతడు నిద్రించి లేచిన వానివలె నున్మీలితనేత్ర

నచో నగ్నివర్చస్కులై యగ్నిలోకనివాసు లగుదురు. శీతకాలమందు శీత నివారణకై యగ్నిని ప్రజ్వాలింపజేసి జనులకు చలిబాధ నివారింపజేసినచో నగ్నిలోకము నొందగలరు. అనాథప్రేతముల కగ్నిసంస్కారము జేసినను చేయించినను అగ్నిలోకము నొందగలరు.

అనాథప్రేతసంస్కారాత్ కోటియజ్ఞఫలం లభేత్ అని శ్రుతి చెప్పుచున్నది. ఏజాతివైనను అనాథుల కగ్నిసంస్కారము చేయుటచేతను చేయించుటచేతను నగ్నిలోకము కల్గుటకు సందియము లేదు. ద్విజాతుల కగ్ని నుపాసించుట శ్రేయోదాయకము, మోక్షప్రదమునై యున్నది. సర్వతీర్థములు, సకలవ్రతంబులు, గురుదేవతలు నగ్నియందే యుండును గాన నగ్నిని సేవించినచో సకలదేవతలను సేవించిన ఫలము సంభవించును. అపవిత్రవస్తువు లన్నియు వహ్నిసంస్పర్శచే పవిత్రములగును. సమస్తమును పవిత్రముచేయు వాడు గాన పావకు డని ప్రఖ్యాతి నొందెను. అగ్ని యంతరాత్మగా నుండెను గాన ఆశుశుక్షణి యని పేరొందెను. త్వరలో శోషింపజేయు శక్తిగలవాడు గాన అశుశుక్షణి యని పిలువబడుచుండెను. ఇతడు పురుషుల కుక్షియందుండెడి మాంసముల గ్రసించుచుండును. స్త్రీలకుక్షియందుండెడి మాంసమును మాత్రము గ్రసింపడు. ఏగాన, ప్రత్యక్షముగ దహించెడి శివతేజము స్త్రీల గర్భమందుండును గాన దానినతడు గ్రసింపడు. ఈశివతేజము త్రిజగంబులకు కర్త, భర్త, హర్తయునై యుండెను. దీనినిబట్టి ప్రతివారి హృద్గుహయందు పరమేశ్వరు డుండగ నెక్కడనో వెదకనేల? సప్తజిహ్వుడైన యగ్ని ఈశ్వరుని తృతీయ నేత్రమై యుండ, నితని ప్రకాశమునెదుట నేప్రకాశము నిలువగలదు? ప్రపంచమందీయగ్ని లేనిచో నేవి ప్రకాశింపగలవు? వృక్షమూలసేచనముచే శాఖలన్నియు తృప్తినొందినట్లు అగ్నియందు హోమము చేయబడిన ధూప దీప నైవేద్య పయో దధిఘృతంబులచే సకలదేవతలు తృప్తినొందెదరు.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
పదునైదవ అధ్యాయము సంపూర్ణము

# పదునారవ యధ్యాయము

## యక్షేశ్వరావతారము

గర్వుల గర్వాపహారమైనదియు సత్పురుషుల సద్భక్తివివర్ధకమైనదియు నగు యక్షేశ్వరావతారమును చెప్పెద వినుము. పూర్వము దేవదానవులు తమస్వార్థములకై సంధి చేసికొని యమృతమునకై క్షీరోదధి మథింపుచుండ, ప్రప్రథమమున కాలానలతుల్యమగు నగ్నిజ్వాలలతో గూడిన విష ముద్భవింప, సకలదేవదానవు లది గాంచి భయవిహ్వలులై విష్ణుసహితముగ సర్వదేవశిఖామణి యగు శివునికడ కేగి నతమస్తకులై నమస్కరించి స్తుతించి యంతయు విన్నవింప, భక్తవత్సలుడగు శంకరుడు వారి స్తుతులకు ప్రసన్నుడై సురాసురవిమర్దకమైన యాయుల్బణవిషమును శంకరుడు పానముచేసి కంఠమందు నిల్పుకొనెను. అప్పటినుండి యీశ్వరుడు నీలకంఠనాము డయ్యెను. తదుపరి సురాసురులు విషదాహవినిర్ముక్తులై శివానుగ్రహముచే మరల సాగరము మథింప ననేకరత్నములు నమృతముకూడ లభించెను. హరికృపచే దేవతల కందరికి నమృతము లభించెను. దానవులకు లభింపలేదు. మిగిలిన రత్నంబు లన్నియు పంచుకొనుటకై దేవదానవులు ఘోరసంగ్రామము గావించిరి. ద్వంద్వయుద్ధములు కూడ చేసిరి. ఈకదనమందు చంద్రుడు రాహువుచే గొట్టబడి శరణుశరణని శివునికడ కేగి నతమస్తకుడై నమస్కరించి స్తుతించి పాహిపాహి యని మొరలిడుచుండ, భక్తవత్సలుడగు శంకరు డతని కభయ మిచ్చి యతనిభయము బాపుటకై శరణాగతుడగు చంద్రు నీశ్వరుడు తనశిరంబున ధరింప, నింతలో రాహువు వేతెంచి సకలాధీశ్వరు డగు నీశ్వరు ననేకవిధంబుల స్తుతింప, శివు డతనిమనోవాంఛిత మెరింగి అతని కేతునామకమైన ఖండితశిరంబును తనగళమున నలంకారముగ ధరించెను. ఆసమరమం దసురు లందఱు నోడిపోయిరి. దేవత లంద ఱమృతపానము చేసి, విష్ణుకృపచే దిగ్విజయు లైరి. దీనిచే విష్ణ్వాదిదేవత లందఱు గర్వితులై వారి బలంబులకు సంతసించుచు శివమాయామోహితులై వారిని వారు కొనియాడుకొనుచుండిరి.

ఇంతలో సర్వగర్వాపహారకు డగు శంకరుడు యక్షరూపము దాల్చి అతిగర్వితు లగు విష్ణ్వింద్రాది దేవతలకడ కేగి, ఓ దేవతలారా! మీరందఱు నిశ్చేష్టులై యొకచోట గుమిగూడి యుండుటకు కారణ మేమో తెల్పు డన, దేవత లాయక్షవాక్యలు విని అసురులు మేము ఘోరయుద్ధ మాచరించితిమి. మాబలవీర్యములకు నిలువలేక అనేకాసురులు మరణించిరి. శేషించిన వారు పలాయితు లైరి. మే మతిబలవంతులము. దైత్యమారకులము. మాయెదుట నల్పవీర్యు లైన యసురు లేమి చేయగల్గుదు రన, దేవతల గర్వవాక్యలు విని ఆయక్షు డిట్లు పల్కెను. ఓసురలారా! సర్వగర్వాపహారము లైన నావాక్కులు వినుడు. మీరు వృథాగా గర్వింపకుడు. సర్వమునకు కర్త, హర్త, భర్తయు నాపరమేశ్వరు డని తెలిసికొనుడు. అతనిని మరచి మీబలములు ప్రశంసించుకొందు రేల? మీబలపరీక్షకై నేనొక తృణమును స్థాపించెదను. మీశస్త్రములచే ఖండింపుడని యొకతృణము వారియెదుట స్థాపింప, దేవత లందఱు వారివారి శస్త్రములు ప్రయోగింప నవన్నియు విఫల మయ్యెను గాని, ఆ తృణ మేమియు చలింపలేదు. ఇంతలో మూఢగర్వాపహారిణి యగు నభోవాణి శివప్రభావ మెరింగించుటకై యిట్లు పల్కెను.

ఓసురలారా! సర్వమునకు కర్త, భర్త, హర్తయు నాపరమేశ్వరు డొక్కడే యని తెలిసికొనుడు. ఇతని బలముచేత నే మీ రందఱు బలవంతు లగుచుండిరి. అతని మాయామోహితులై మీ రిట్లు గర్వించుచుండిరి. బోధస్వరూపు డగు నాపరమ పురుషుని మీరు మదోన్మత్తులై యిప్పటికిని గ్రహింప లేకుండి రని నభోవాణి పలుక దేవతలు గతగర్వులై యిట్లు స్తుతించిరి.

ఓ దేవదేవ! మహాదేవ! సర్వగర్వాపహారక! ఓయక్షేశ్వరా! నీమాయ లద్భుతములు. నీమాయామోహితులమై నీస్వరూపము తెలిసికొన లేమైతిమి. మేము గర్వితులమై మాయిచ్చవచ్చినట్లు నీకడ పలికితిమి. నీ కృపచే మా కిప్పటికైనను జ్ఞానము కల్గినది. సర్వసృష్టిస్థితిలయంబులకు నీవే కారకుడవు. కాని యితరులు గారు. సర్వకర్తలు సర్వలయంబులు నీవే ప్రవర్తింప జేయుచుంటివి.

నీవు ప్రళయకారకుడవు. పరమేశ్వరుడవు. పరమాత్ముడవు. అవ్యయుడవు. నీవు యక్షరూపుడవై సురామదముల హరించితివి. నీవు కృపాళుడవు గాన మమ్ముల ననుగ్రహింపుమన, నాయక్షేశ్వరుడు వారల కనేకవిధంబుల బోధించి యదృశ్యుడయ్యెను.

ఇట్టి శుభకర మగు యక్షేశ్వరావతారము వర్ణించి చెప్పితిని. సత్పురుషుల కిది సంతోషకరమై యభయంకరమై యుండెను. ఈ యాఖ్యానము విన్నచో సర్వగర్వములు హరించును. శాంతి నొసంగును. భుక్తిముక్తుల నొసంగును. ఇది శ్రద్ధాభక్తులతో విన్నను, పఠించినను, సర్వకామములు నెరవేరి సత్పురుషగతి నొందగలరు.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
పదునారవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునేడవ యధ్యాయము

### శంకరుని దశావతారవర్ణనము

భక్తులు భక్తితో నుపాసనా కాండలచే సేవించెడి యీశ్వరుని దశావతారములు వర్ణించి చెప్పెద వినుమని, మరల నంది ఇట్లు చెప్పదొడంగెను. వీనిలో ప్రథమావతారము మహాకాలుడు భక్తులకు భుక్తిముక్తుల నిచ్చుచుండును. ఇతని భార్య మహాకాళి. ఈమె భక్తుల యీప్సితములు నెరవేర్చుచుండును.

ఈశ్వరుని తారకావతారము రెండవది. ఇతని భార్య తారకాదేవి. వీరిని సేవించినవారలకు భుక్తిముక్తులు సకలశుభంబులు గల్గును.

మూడవది బాలభువనేశ్వరావతారము. ఇతని భార్య బాలభువనేశ్వరి. వీరు సత్పురుషులకు సుఖము లొసంగుచుందురు.

నాల్గవది షోడశవిద్యేశ్వరుడు. ఇతని భార్య షోడశవిద్యేశ్వరి. వీరు భక్తులకు భుక్తిముక్తుల నిచ్చుచు సర్వసుఖంబుల నిచ్చుచురదురు.

ఐదవది భైరవావతారము. ఇతని భార్య భైరవి. వీ రుపాసకులకు సర్వకామ్యము లిచ్చుచుందురు.

ఆరవది భిన్నమస్తకావతారము. ఇతని భార్య భిన్నమస్తకి. వీరుభక్త కామప్రదులై యుండిరి.

సప్తమావతారము ధూమవంతుడు. ఇతనిభార్య ధూమావతి. వీరు భక్తాభీష్టప్రదులై యుండిరి.

శివుని యష్టమావతారము బగళాముఖుడు. ఇతని భార్య బగళాముఖి. వీరు భక్తవాంఛాప్రదులై యుండిరి. ఈబగళాముఖి మహానందా యని కూడ పిలువబడుచుండెను.

తొమ్మిదవ యవతారము మాతంగుడు. ఇతని భార్య మాతంగి. వీరు సర్వకాంక్షల నీడేర్చుచుందురు.

శంకరుని దశమావతారము కమలుడు. ఇతనిభార్య కమల. వీరు భక్తపాలకులై యుండిరి. శివునియొక్క యీపదియవతారములు కూడ భుక్తిముక్తిప్రదములై భక్తేప్సితప్రదాయకములై వెలుంగుచున్నవి. ఈదశావతారములు నిర్వికారులై సేవించినవారలకు సకలసుఖంబులు గల్గి సర్వకోర్కెలు సిద్ధించును. మఱియు నివన్నియు తంత్రశాస్త్రగర్భితములై యున్నవి. ఆదిశక్తులైన యీదశశక్తులు నద్భుత మగు మహిమలు జూపించుచుండును. మఱియు నివి సర్వకామ్యముల నొసంగుచున్నవి. ఈదేవతాశక్తులు శత్రుమారణకార్యములు చేయుచు, ఖలులను దండింపుచు, బ్రహ్మతేజోభివృద్ధి నొసంగుచుండును. శంకరుని మహాకాలాది దశావతారములు దశశక్తులు నీ కెరింగించితిని. ఈయవతారేతిహాసంబులను శివపర్వదినములయందు భక్తితో పఠించినచో శివున కత్యంతప్రియులై యుందురు. ఇది విన్నచో బ్రాహ్మణులు బ్రహ్మవర్చసులై యుందురు. క్షత్రియులు విజయవంతులు

గను వైశ్యులు ధనాఢ్యులుగను శూద్రులు సుఖవంతులు నై యుందురు. శివ భక్తులు శివధర్మము నాచరింపుచు దీనిని శ్రద్ధతో విన్నచో విశేషముగ శివభక్తు లగుదురు.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు
పదునేడవ అధ్యాయము సంపూర్ణము

---

# పదునెనిమిదవ యధ్యాయము

## శివుని ఏకాదశరుద్రావతారములు

ఇక శివుని యేకాదశావతారములు చెప్పెద, వినుము. ఇవి విన్నచో సనత్యాదిసంభవములైన బాధ లన్నియు నివారించును. పూర్వము శక్రాది దేవత లందఱు అసురులచే జయింపబడి యమరావతిని వీడి పారిపోయి కశ్యపునికడ కేగి నతకంధరులై యతివినయింబున చేతులు జోడించి సర్వము నతనితో విన్నవింప శివభక్తు డగు కశ్యపుడు దేవతల నుతువులు విని, దుఃఖితమానసుడై ధైర్యమూని శాంతచిత్తుడై విశ్వేశ్వరనివాసమైన కాశీపురి కేగి, గంగలో స్నాన మాచరించి, విధిప్రకారంబుగ విశ్వేశ్వరలింగముసర్చించి యొకశివలింగము స్థాపించి యట దేవతాక్షేమముసకై శివు నుద్దేశించి పూజాజపంబులు ధైర్యమూని బహుకాలము చేయ, దీనబాంధవుడు భక్తవత్సలుడునగు శంకరుడు ప్రసన్నుడై సాక్షాత్కరించి, కశ్యపా, నీభక్తికి మెచ్చితిని. వరము కోరుకొమ్మనస, కశ్యపుడు శంకరుని గాంచి, కృతాంజలియై యిట్లు స్తుతించెను.

ఓ దేవ దేవ! మహేశ్వర! శరణాగతవత్సల! సర్వేశ్వర! నీవు పరమాత్ముడవు. ధ్యానగమ్యుడవు అవ్యయుడవు, అద్వయుడవు, బలనిగ్రహకర్తవు. సతాంగతుడవు. దీనబంధుడవు. దయాసాగరుడవు. భక్తరక్షణదక్షుడవు. నీభక్తులైన సురలందఱు అసురులబాధ కోర్వ లేకుండిరి. వారిని రక్షించుటకు విష్ణువుకూడ సమర్థుడు కాకుండెను. దేవత లందఱు నిన్ను శరణువేడ వచ్చిరి.

ఓ ప్రభూ, దేవతల దుఃఖము బాపుము. వారిరక్షణకై నిన్నారాధించుచుంటిని. గాన సురలదుఃఖములు బాపి నాకోర్కె దీర్పుము. నేను నాపుత్రులదుఃఖము గాంచి సహింపలేకుంటిని. ఓ ఈశ్వరా! దివౌకసులకు సహాయముచేసి వారి దుఃఖములు బాపుము, నీప్రియు లగు దేవతలు యక్షులు దానవులచే పరాజితులైరి. సర్వలోకసహాయకారకుడ వగు నీవిప్పుడు దేవతల రక్షింపుము. వారలకు దానవపీడ లేకుండ జేయు మన, శంకరు డట్లే చేయుదు నని, కశ్యపునితో బల్కి అదృశ్యు డాయెను. కశ్యపుడు సంతసించి స్వస్థాన మేగి యిదంతయు దేవతల కెరింగింప, వారెంతేని ముద మొందిరి. తదుపరి శివుడు దేవతారక్షణకై సురభి యను కశ్యపునిభార్యకు ఏకాదశరుద్రులై జనించెను. వీ రందఱు శివస్వరూపు లని దేవతలు మునులు మహానందము నొంది మహోత్సవంబులు గావించుకొనిరి.

కపాలుడు, పింగళుడు, భీముడు, విరూపాక్షుడు, విలోహితుడు, శాస్తుడు, అజపాదుడు, అహిర్బుధ్న్యుడు, శంభుడు, చండుడు, భవుడు, సనా సీపదకొండుగురు నేకాదశరుద్రులై సురభీపుత్రులై జనించిరి. శివరూపులగు వీరందఱు దేవకార్యములకై జనించి రుద్రనాములై మహాబలపరాక్రములునై యుండిరి. వీ రందఱు దేవసహాయకులై దైత్యుల మర్దింపుచుందురు. వీరి సహాయముచే దేవతలు దైత్యుల గెల్చి స్వస్థచిత్తులైరి. ఆనాటినుండి శివస్వరూపులగు నీ మహారుద్రులు దేవతారక్షకై స్వర్గమందే యుండిరి. నానాలీలాకరులగు వీరందఱు నీశాన్యమూలప్రదేశమున నివాస మేర్పరచుకొని యుండిరి. వీరికి కోట్ల కొలది యనుచరు లుండిరి. వా రందఱు ముల్లోకసంచారులు, సర్వలోకసుఖావహ మైన ఏకాదశరుద్రావతారములు చెప్పితిని. ఈయాఖ్యానము సర్వ పాపప్రశమనమై ధన్యమై ఆయురారోగ్యయశోవంతమై సర్వకామప్రదమై భుక్తిముక్తిప్రదమై యుండెను.

శివ మహా పురాణము నందలి శతరుద్రసంహితయందు

పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

# పందొమ్మిదవ యధ్యాయము

## దూర్వాసుని చరిత్ర

మరల నందీశ్వరుడు సనత్కుమారునితో నిట్లు చెప్పదొడంగెను. సనత్కుమారా! ఏవిధంబున శంకరుడు దూర్వాసు డయ్యెనో అదంతయు చెప్పెద, వినుము. బ్రహ్మమానసపుత్రుడు, బ్రహ్మవిదుడు, బుద్ధిమంతుడు, నగు నత్రిమహాముని పుత్రకాముడై బ్రహ్మయాజ్ఞచే భార్యాసహితుడై ఋక్షకుల గిరికడకు తపంబు చేయ నేగి, అందమగు ప్రదేశము గాంచుచు వింధ్యనగ సమీపమందలి నదీతీరంబున నాసీనుడై ప్రాణాయామాది యోగంబులచే నిర్వికారు డగు పరమేశ్వరుని ధ్యానింపుచు శతవర్షంబులు తపంబు చేయుచు నా కీశ్వరుడు తప్పక పుత్రు నిచ్చుగాక యని మనంబున దృఢ సంకల్పుడై బహుకాలము నిశ్చలతపంబు చేయ, నతని శిరము నుండి తీక్ష్ణ తేజోగ్ని ప్రజ్వరిల్ల మొదలిడెను. ఈయగ్ని క్రమముగ పెద్దపెద్ద జ్వాలలతో లోకములను దహింప మొదలిడెను. ఇంద్రాది దేవతలు, మునులు, నగ్నిజ్వాలాపీడితులై బ్రహ్మను శరణుపొంది నేమి యతనికి నమస్కరించి స్తుతించి, తమ బాధలు చెప్పుకొనగ, బ్రహ్మ వారియిడుములు విని వారి నందరిని వైకుంఠ వాసు డగు విష్ణువుకడకు గొంపోయి స్తుతించి, సర్వము విన్నవింప, శ్రీమహా విష్ణువు బ్రహ్మాది దేవతలను వెంటనిడుకొని, శివునికడ కేగి ప్రణమిల్లి స్తుతించి, సర్వము విన్నవింప, శంకరుడు విష్ణుబ్రహ్మలతో నత్రిమహామునికడ కేగి, నతడు వీరల గాంచి నమస్కరించి స్తుతించి త్రిలోకపూజ్యులగు నో త్రిమూర్తులారా! సృష్టిస్థితిసంహారకారకులారా! నేను పుత్రార్థినై పరమేశ్వరుని మాత్రమే ధ్యానింపుచుండ, మీ త్రిమూర్తులు వచ్చుటకు కారణ మేమి? మీ రందఱు వరదాతలు. మీ రేతెంచిన కారణము తెల్పి నా సంశయము దీర్పు డన, త్రిమూర్తులు నత్రిపలుకులు విని, మేము మువ్వురము వరదాతలమై యుంటిమి గాన నీయాప్సితము నెరవేర్ప వచ్చితిమి. మా మువ్వురి యంశలచే మువ్వురు పుత్రులు నీ కుద్భవింప గలరు. వారు ప్రపంచవిఖ్యాతులై తలితండ్రులకీర్తినభివృద్ధిచేయగల రని యా త్రిమూర్తులు నదృశ్యులైరి. అత్రియనసూయలు లబ్ధవరులై వారి యాశ్రమంబున కేగి మహానందమగ్నులైరి.

తదుపరి ఈ దంపతులకు బ్రహ్మాయంశచే చంద్రుడు జనించెను. ఈచంద్రుడే సాగరమందు దేవతలయెదుట ప్రకటితు డయ్యెను. తదుపరి విష్ణ్వంశచే దత్తాత్రేయు డుద్భవించి సన్యాసియై సన్యాసాశ్రమ వృద్ధి గావించెను. తదుపరి శివాంశచే ధర్మప్రవర్తకుడగు దూర్వాసు డుద్భవించెను. ఈ రుద్రాంశసంభూతుడగు దూర్వాసుడు బ్రహ్మతేజో వివర్ధనుడై దయావంతులు శాంతమూర్తులు నగు సనేకులను పరీక్షించెను.

సూర్యవంశ సంజాతు డగు నంబరీషు డనెడి నృపవరేణ్యుడు గలడు. ఈ భూపాలుడు సప్తద్వీపవలయిత మైన పృథ్వి నంతయు నేలుచుండెను. ఆరాజు దృఢచిత్తుడై నియమవంతుడై ఏకాదశీవ్రతము చేసెడి వాడు. అతడొకనాడు ఏకాదశీవ్రతము చేసి యారోజంతయు నుపవసించి మరునాడు ద్వాదశిపారణ చేయ సంకల్పించియుండ, దూర్వాసు డిదియెరింగి యితనిని ధర్మపరీక్ష చేయనెంచి, ద్వాదశీఘడియలు కొద్దిసేపుమాత్రమే యుండ, దూర్వాసుడు తన శిష్యులతో రాజునొద్దకు పోవ, ఆనృపతి వారల గాంచి రండు రండు, పదార్థములు సిద్ధముగ నున్నవి. భోజనమునకు రండు. మీతో కలసి నేను ద్వాదశిపారణ చేతు నని వారి నాహ్వానింప నాదూర్వాసుడు వల్లె యని శిష్యులతో స్నానార్థ మేగి రాజును పరీక్షింప దలచి యతడు విలంబనము చేయుచు ఎంతసేపటికి నింటికి రాకుండెను. అంబరీషు డిది గాంచి ద్వాదశి దాటినచో పారణచేసిన శాస్త్రవిరుద్ధ మనియు, ఆహ్వానించినవిప్రులు రాకుండ భుజించినచో ధర్మవిరుద్ధ మని యెంచి శాస్త్రోక్తవిధి ననుసరించి జలపానము చేసి వారలకై నిరీక్షించుచుండెను. ఇంతలో దూర్వాసు డేతెంచి రాజు ప్రాశన గావించె నని గ్రహించి ధర్మపరీక్షకై భయంకరాకృతి దాల్చి మిక్కిలి కోపమూని యుగ్రవాక్కులతో, ఓరాజా! ఓమూఢుడా! ఓఅధముడా! నన్ను భోజనమున కాహ్వానించి, నేను రాకుండగ జలపానము చేసి నన్నవమానించితివి. దీనిఫలము చూచెదవుగాక. నేను దుష్టదండుడను. నన్నెరుగవు గాబోలు నని పలికి క్రోధతామ్రాక్షుడై రాజును వధము చేయ నుద్యుక్తుడు కాగా, నింతలో శివసంబధ మైన సుదర్శనచక్రము జ్వాలలు గ్రక్కుచు నృపుని రక్షించుటకై దుర్వాసుని దహింప నెదురుగా నిలబడెను. దూర్వాసుడు శివ

మాయామోహితుడై ఈచక్రము శివరూపమే యని గ్రహింపకుండెను. ఇంతలో నశరీరవాణి, బ్రహ్మజ్ఞుడు వైష్ణవభక్తుడునగు నంబరీషునితో నిట్లు పల్కెను.

పూర్వ మీసుదర్శనచక్రము హరికి హరు డిచ్చియుండెను. దూర్వాసుని దహింప నేతెంచిన ఈవిష్ణుచక్రమును శాంతింపజేయుము. ఈముని సాక్షాచ్ఛంకరస్వరూపుడు ఇతనిని సాధారణమునిగ భావింపకుము. ఈమునీశ్వరుడు నీ ధర్మపరీక్షకై యేతెంచెను. నీ విపు డితనిని శరణుపొందనిచో ప్రళయము సంభవింపగల దన, నాతడు దూర్వాసునితో నిట్లు పల్కెను. నేను దేవపూజానిరతుడ నైతినేని, స్వధర్మనిష్ఠాగరిష్ఠుడ నైతినేని, విప్ర, దేవతల నర్చించెడి కులోద్భవుడ నైతినేని, ఈచక్రము శాంతించుగాక. మఱియు, నేను భక్తుడ నైతినేని భక్తవత్సలు డగు భగవంతుడు నన్ననుగ్రహించెనేని యీ సుదర్శనచక్రము శాంతించుగాక. సుదర్శనచక్రమును ప్రార్థింప నది శాంతి నొందెను. తదుపరి యంబరీషుడు తన పరీక్షకై యేతెంచిన శివావతారు డగు దూర్వాసునకు నమస్కరించి స్తుతింప నతడు సంతసించి శాంతుడై తేనియుంట భుజించి స్వస్థానమున కేగెను.

తదుపరి కొంతకాల మైనపిమ్మట దూర్వాసుడు నియమవ్రతుడై యున్న దశరథపుత్రు డైన శ్రీరాముని పరీక్షింప నేగెను. అపు డా శ్రీరామచంద్రుడు మునిరూపధరు డగు యమధర్మరాజుతో తన ప్రతిజ్ఞను గూర్చి సంభాషించుచు లోని కెవరిని రానీయ వల దని ద్వారమందు లక్ష్మణుని నిలిపియున్న సమయంబున ధర్మపరీక్షకై దూర్వాసు డేతెంచి తన యాగమనము రామునకు తెల్పు మని భయపెట్టి లక్ష్మణుని లోనికి బంప లోనికి వచ్చినవానిముఖమును మరల చూడ నని ప్రతిజ్ఞ బూనిన రామచంద్రుడు లక్ష్మణుని విసర్జించెను. దూర్వాసుడు రామునిధర్మమునకు మెచ్చి వరంబు లిచ్చెను. ఈగాథ సంతయు పండితు లెరుంగుదురుగాన విస్తరించి నుడువ లేదు.

ఒకానొకపుడు దూర్వాసుడు ద్వాపరయుగమం దున్న శ్రీకృష్ణుని కూడ పరీక్షించిన విధానము చెప్పెద వినుము. సాధుసంరక్షణకై బ్రహ్మ

ప్రార్థనలచే విష్ణువు ధరయందు వసుదేవకుమారుడై జనించెను. ఇతడు బ్రహ్మద్రోహు లగు ననేకఖలులను మహాపాపు లగు దుర్మార్గుల ననేకులను సంహరించెను. అతడు కృష్ణు డనుపేరుతో విఖ్యాతుడై యనేకసాధువులను రక్షించుచు, దుష్టసంహారముచేయుచు బ్రాహ్మణభక్తి గల్గి పరబ్రహ్మధ్యాన పరుడై యుండెను. ఇత డనేకబ్రాహ్మణులకు రసవంతము లగు భోజనము లిడుచుండెడివాడు. ఇట్టి శ్రీకృష్ణునికడకు దూర్వాసుడు పరీక్షింప నేగెను. అట్టితరి రుక్మిణీసహితుడై శ్రీకృష్ణుడు రథము నధిష్ఠించి యుండి, దూర్వాసుని గాంచి రండురం డని తన హస్తమందిచ్చి యతనిని రథానిధిష్ఠితుని జేయ నతడు రుక్మిణీసరస నాసీనుడై యుండియు నిర్వికారుడై యుండుట కృష్ణుడు గాంచి సంతసించి నీవు దృఢాంగుడవై వజ్రకాయుడవై యుండుముగాక యని వర మిచ్చెను.

ఒకానొకప్పుడు దూర్వాసుడు గంగాస్నానము చేయుచుండ, తన కౌపీనము ప్రవాహములో కొట్టుకొనిపోవుటచే నతడు సిగ్గుచే తీరమునకు రాజాలకుండెను. ఇంతలో అనతిదూరమందు స్నానము చేయుచున్న ద్రౌపది యిది గాంచి తన పయ్యెదచెరగు చించి దూర్వాసునివైపునకు పడ వైవ నత డది ధరించి ప్రీతుడై, ఆమె కక్షయవస్త్రవరప్రాప్తి నొసంగెను. ద్రౌపదీవస్త్రాపహరణసమయంబున నామె కక్షయవస్త్రములు సంప్రాప్త మగుట కిదియే కారణము. ఇందరి నివ్విధంబున దూర్వాసుడు పరీక్ష చేసి యుత్తీర్ణులను జేసెను. మఱియు నితడు హంసడిభకు లనెడి రాక్షసుల గర్వ మణచి కృష్ణసహాయమువలచే సంహరించెను. ఇంకను బ్రహ్మతేజోవివర్ధకములైన సన్న్యాసాశ్రమములను పృథివియందు స్థాపించి శాస్త్రప్రకారముగ ననేకధర్మ ములు నడిపించి యనేకులకు జ్ఞానోపదేశములు చేసి యుద్ధరించెను. ఇతని చరిత్ర విన్నచో ధన్యత్వము, యశస్సు, ఆయుస్సు, సర్వకామ్యసిద్ధి, కలిగి ఇహపరలోకసుఖంబుల నొందెదరు.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు

పందొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువదవ యధ్యాయము

## హనుమదావిర్భావము

ఓసనత్కుమారా! హరరూపు డగు హనుమదవతారము చెప్పెద, వినుము. పరమేశ్వరు డగు హనుమంతుడు శ్రీరామచంద్రునకు సహాయము చేసియుండెను. సర్వసుఖావహ మైన యీ సర్వచరిత్రము చెప్పెద, వినుము. శివు డొకానొకసమయంబున విష్ణువు మోహినీరూపమును గాంచి మోహించి మదనపీడితుడై రామకార్యార్థమై పరమేశ్వరుడు వీర్యస్ఖలనము గావించెను. మహర్షులీవీర్యమును శివాజ్ఞచే నొకపత్రముపై భద్రపరచి గౌతమపుత్రిక యగు నంజనీదేవిశ్రవణములద్వారా ఆమెగర్భమందు ప్రవేశపెట్టిరి. తదుపరి యామెకు హనుమంతు డను నామంబుతో పరమేశ్వరుడు మహాబలపరాక్రమసంపన్నుడై కపిరూపంబున జన్మించెను. ఇతడు బాల్యమునందే యుదయించుచున్న సూర్యుని గాంచి పండని భ్రమసి దివి కెగసి రవిమండలము గ్రసింప బ్రహ్మాదిదేవత లందరు ప్రార్థింప మరల నాబింబమును త్యజించెను. అట్టితరి నితడు సురలచేతను మహర్షులచేతను ననేకవరంబుల నొందెను. తదుపరి హనుమంతుడు తల్లికడ కేగి సకలవృత్తాంతము నెరింగించెను. పిమ్మట తల్లియాజ్ఞచే ధీరుడగు హనుమంతుడు సూర్యునికడ కేగి యచిరకాలంబుననే సకలవిద్యలు గ్రహించి సూర్యునియాజ్ఞచే సూర్యపుత్రు డగు సుగ్రీవునికడ కేగెను. అట్టితరి సుగ్రీవుని భార్యను అతనియన్నగారగు వాలి హరింప, నతడు ఋష్యమూకగిరియందు వసించుచుండెను. హనుమంతుడు సుగ్రీవసఖుడై యతనికి హితబోధలు జేయుచు నతనిచెంతనే యుండెను. ఇంతలో సీతను రావణుడు హరింప శ్రీరామచంద్రుడు దుఃఖించుచు లక్ష్మణసహితుడై సీత నన్వేషించుచు ఋష్యమూకనగసమీపమునకు రాగా హనుమంతుడు వారల గాంచి. సుగ్రీవునితో సఖ్యము గలిపెను. తదుపరి రామచంద్రుడు భ్రాతృపత్నిహారకుడు, వీరమానుడు, పాపాత్ముడు, కపికుంజరుడు, నగు వాలిని సంహరించెను. వానరేశ్వరు డగు హనుమంతుడు రామా

జ్ఞచే సీతాన్వేషణార్థమై యేగి, సుహృద్వాక్యములచే నాబుద్ధిమంతుడు అపారసాగరము నవలీల దాటి లంకలో ప్రవేశించి సీతను గాంచి ముద్రిక నిచ్చి యామెశోకము బాపి సీతాప్రాణదాయక మగు రామవృత్తాంత మంతయు వినిపించి, రావణునియుద్యానవనంబులు ధ్వంసము చేసి యనేక రాక్షసులను జంపి యక్షయకుమారుని వధించి బ్రహ్మాస్త్రముచే గట్టువడి రావణసభ కేగ, రావణుడు హనుమంతుని వాలంబునకు తైలవస్త్రము జుట్టి యగ్నిని ముట్టింప, శివాంశజు డగు నిత డొకగృహమునుండి మరి యొకగృహమున కురుకుచు లంకాదహనము గావించెను. ఇతడు విభీషణుని గృహమును మాత్రము దహింపక సర్వము భస్మముచేసి, తాను సాగరమం దురికి తాపము చల్లార్చుకొని, రామసన్నిధి కేగి చూడామణిని రామున కిచ్చియుండెను. తదుపరి రామాజ్ఞచే నితడు సర్వవానరుల గూడుకొని పర్వతము లన్నియు దెచ్చి, వారధి గట్టెను. రాము డా సముద్రతీరమందు తన విజయమునకై శివలింగ మొకటి స్థాపించెను. దీనినే రామలింగేశ్వరు డందురు. తదుపరి శ్రీరాముడు వానరసైన్యముతో సేతువు దాటి లంకను ముట్టడించి యనేక రాక్షసులను సంహరింపుచుండ, రావణశక్తిచే లక్ష్మణుడు మూర్ఛిల్లెను హనుమంతుడు సంజీవపర్వతము దెచ్చి లక్ష్మణుని బ్రతికించెను. ఇవ్విధంబున హరాంశజు డగు హనుమంతుడు రామలక్ష్మణులకు సర్వసుఖంబులు చేకూర్చి కపిసైన్యము నంతను రక్షించి రావణుని బంధుమిత్రసహితముగ సర్వనాశనము చేసెను. మహాబలపరాక్రము డగు నీకపీశ్వరుడు సర్వదేవతలకు సుఖములు చేకూర్చెను. రావణయుద్ధమందు అహిరావణుడు రామలక్ష్మణులను మాయచే గొంపోవ హనుమంతు డిది తెలుసుకొని, అహిరావణుని సంహరించి మత్స్యవల్లభునకు రాజ్యాభిషేకము చేసి రామలక్ష్మణులను సురక్షితముగ యథాస్థానమునకు జేర్చెను. ఈకపిపుంగవుడు సర్వదా రామకార్యములు చేయుచుండెను. ఇత డనేకాసురులను సంహరించి నానాలీలలు జూపించెను. మఱియు నీరామభక్తుడు భూలోకమంతయు రామభక్తిని స్థాపించి సదా రామభక్తుడై సీతారాములకు సర్వసుఖంబులు కల్గించుచుండెను.

ఈ కపీశ్వరుడు సర్వదేవతలను దమించెను. లక్ష్మణునకు ప్రాణదానము చేసెను ఇత దశరుద్రావతారుడు. భక్తోద్ధారకుడు. ధీమంతుడు, వీరుడు. రామకార్యధురంధరుడు. ఈభక్తవత్సలుడు లోకమందు రామదూత యని ప్రఖ్యాతి గాంచెను. ఈచరిత్ర విన్నచో ధన్యత్వము, ఆయురారోగ్యభాగ్యయశోభివృద్ధి గల్గి సర్వకామఫలప్రదమై ఇహపరసుఖంబులు గల్గును.

శివ మహాపురాణమందలి శతరుద్ర సంహితయందు
ఇరవదవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది యొకటవ యధ్యాయము

### మహేశావతారము

పరమేశ్వరుని మరియొక యవతారము చెప్పెద, వినుము. ఇది శ్రద్ధతో విన్నచో సకలకార్యము లీడేరును. ఒకానొకప్పుడు పార్వతీపరమేశ్వరులు స్వేచ్ఛగా విహరింప నెంచి భైరవుని ద్వారరక్షకునిగ నియమించి గృహాభ్యంతరమునకు జని యనేకసఖీజనములతో సేవింపబడుచు నానాలీలావిశారదులగు వీరు చిరకాల మట విహరింపుచుండిరి. అనుపమ సౌందర్యవతి యగు పార్వతి యున్మత్తాకృతి గల్గి శివాజ్ఞచే ద్వారముకడకు రాగా భైరవు డామెను పరమేశ్వరిగా భావింపక మోహితుడై సాధారణ స్త్రీదృష్టితో నేకధ్యానుడై కాంచుచుండ, పార్వతి యది గ్రహించి క్రుద్ధురాలై, ఓ దుష్టసాధను, ఓ భైరవ, నీవు నన్ను నారీదృష్టితో గాంచితివి గాన, భువియందు నరుడవై జన్మింతువు అన భైరవుడు హాహాకారములు చేయుచు దుఃఖించుచుండ, శంకరు డేతెంచి యనేకవిధంబుల భైరవు నోదార్చియుండెను. పార్వతిశాపంబుచే భైరవుడు నరరూపంబున శివాజ్ఞచే వైతాళికుడై జన్మించెను. ఇతనియందున్న ప్రేమచే శంకరుడు మహేశనామంబుతో నుద్భవింప, పార్వతి శారదనామంబుతో జనించెను. వీరి

కారణముచే భువి సంచరించిరి. లింగధారు లందరికి మహేశుడు గురువుగా నుండి తగుబోధలు చేయుచుండెడివాడు. శ్రేష్ఠమైన మహేశచరితము చెప్పితిని. ఈచరిత్ర శ్రద్ధాభక్తులతో విన్నను పఠించినను నాయుర్యశంబులు గల్గి సర్వకామఫలంబులు గల్గి యిహాముత్రార్థఫలభాక్కు లగుదురు.

శివ మహాపురాణము నందలి శతరుద్ర సంహితయందు
యిరువది యొకటవఅధ్యాయము సంపూర్ణము

---

## ఇరువది రెండవ యధ్యాయము

### వృషభావతారము

ఓసనత్కుమారా! విష్ణుగర్వాపహారకమైన శివునివృషభావతారము చెప్పెద, వినుము. పూర్వము సురాసురులు జరామరణంబులు లేకుండుటకై పరస్పర మాలోచించుకొని రత్నములు సంపాదింప దలచి వారొండొరులుఉత్తమంబైన క్షీరోదధిని మథింప నిశ్చయించి, దీని నెట్లు మథింపవలయును? మన కార్యసిద్ధి యెట్లు చేకూరు ననీ, విచారింపుచుండ, నీశ్వరాజ్ఞచే నభోవాణి దేవదానవులు వినునట్లుగ మేఘగంభీరవాక్కులతో వారి నాశీర్వదించి, ఓసురలారా! మీ బుద్ధిబలము నుపయోగించి మందరాద్రిని కవ్వముగ జేసి వాసుకిని రజ్జువుగ జేసి మీరొండొరులు కలిసి సఖ్యముతో క్షీరాబ్ధిని మథింపు డన, దేవదానవులు గగనవాక్కులు విని, మందరాద్రిని తే నిచ్చగించి, కనకాభమైనదియు సరళమైనదియు నగు మందరాద్రికడ కేతెంచి యానగమును ప్రసన్నవంతముగ జేసికొని దానియనుజ్ఞ వడసి దానిని, వారలభుజబలములచే పెల్లగించి తమభుజములపై నిడుకొని సాగరంబున బడవేయ నిచ్చగించుచుండ వారిబలంబులు క్షీణించి తీరమున బడవైచి కదల్ప లేకుండిరి. వా రీనగమును కదల్ప నశక్తులై . జగదీశ్వరు డగు శివుని స్తుతించి

యతనియనుగ్రహముచే ఆగమును మరల పైకి లేవదీసి క్షీరోదధి నుత్తరభాగంబున బడవైచి, వాసుకిని రజ్జువుగ జేసి రత్నకాములై క్షీరసాగరమును మథింపసాగిరి. ఇట్లు మథింపుచుండ,

స్వర్లోకవాసినియు, కమలేశ్వరియు, హరిప్రియయు, భృగుపుత్రికయు నగు లక్ష్మీదేవి యుద్భవించెను. తదుపరి ధన్వంతరియు, శశాంకుడు, పారిజాతవృక్షము, నుచ్చైఃశ్రవసు, ఐరావతము, సుర శార్ఙ్గధనువు, కామధేనువు, కౌస్తుభమణి, అమృతము, ప్రళయాగ్నిసదృశమైన కాలకూట మహావిషము జనించెను. అమృతోద్భవసమయంబున పైకి జిమ్మబడిన అమృతబిందువులచే శరత్పూర్ణేందువదనలు, తటిత్పూర్యాననసమప్రభలు, హారకేయూరకటకాది దివ్యరత్నాలంకృతలు, నగువారలు దశదిశల లావణ్యామృత తేజంబులను జిమ్ముచు భ్రూభృతాయత వీక్షణంబులచే జగత్రయంబుల ముగ్ధుల జేసి యున్మత్తుల జేయుచు నద్భుతదర్శన లగు ననేకలావణ్యవతు లుద్భవించిరి. వా రందఱు జరామరణములు లేని యమృతబిందువులచే కోట్లకొలది జనించి యప్సరస లని విఖ్యాతలైరి.

మఱియు శంఖము, కౌస్తుభము, ఖడ్గము, శార్ఙ్గము జనించెను. ఈనాల్గింటిని లక్ష్మినిని కూడ విష్ణువు గ్రహించెను.

ఉచ్చైఃశ్రవ మను తురగమును సూర్యుడు గ్రహించెను. పారిజాతము, ఐరావతగజేంద్రము సిద్ధరాధిపతి యగు శచీపతి గైకొనెను. భక్తవత్సలు డగు శంకరుడు కాలకూటము చంద్రుని ధరించెను.

ఈ కాలకూటవిషము శంకరుడు గళమందు ధరించి నీలకంఠు డయ్యెను. చంద్రుని శిరమందు ధరించి చంద్రమౌళి యయ్యెను. రాక్షసు లందఱు నీశ్వరమోహితులై సురను గ్రహించిరి. జను లందఱు ధన్వంతరిని వైద్యునిగా స్వీకరించిరి. మునీశ్వరు లందఱు కామధేనువును స్వీకరించిరి.

సురాసురు లమృతలోభచేతస్కులై యమృతమునకై పోరాడ సాగిరి. బలవంతు లగు రాక్షసులు దేవతల నోడించి యమృతమును హరించిరి.

ప్రళయకాలాగ్నిసదృశుఁ డగు బలికుండ నమృతమునకై దేవతలతో పోరాడెను. దేవత లందఱు నసురులచే జయింపబడి శివుని శరణుపొంద, శివాజ్ఞచే విష్ణువు మోహినీరూప మూని రాక్షసులవద్ద నున్న యమృతమునుగ్రహించి మీ రందఱు నొక పంక్తిగా గూరుచున్నచో నే నీయమృతమును పంచిపెట్టెద నని యొప్పించి మాయావిశారదు డగు రమాపతి దానవులతో పలుక వారు శివమాయామోహితులై యందుల కంగీకరించి పంక్తిభేదము లేకుండ యమృతమును పంచిపెట్టు మని యమృతకలశమును విష్ణువున కొసంగి వారివారి స్థానములయం దాసీనులై యుండిరి. దానవు లందఱు మోహినీరూప మంత్రమున బద్ధులై యుండిరి. విష్ణువు మోహినీ రూపముచే సురలను రక్షింప నెంచి దేవదానవుల రణము మాన్పించి యమృతకలశము చేతబూని,

ఓసురాసురులారా! మీరు ఉభయులు మీబలములు చూపించి యుద్ధము చేయుడు. మీలో జయము పొందినవారలు నావక్షఃస్థలమును తాకుట కర్హులు. లేనిచో నర్హులు గా రన, వారు పరస్పరజయకాంక్షతో కదనము చేయసాగిరి. విష్ణుసహాయముచే దేవతలు జయ మొందిరి. కొందఱు రాక్షసులు మరణించిరి. మఱికొందఱు పలాయితులైరి. శేషించినవారు పాతాళమున కేగిరి. విష్ణువు చక్రము ధరించి భయపడి పాతాళమున కేగు చున్న దైత్యులను సంహారించి, పాతాళమున కేగి, యమృతసంభవలు, రూప లావణ్యగర్వితలు, పూర్ణేందువదనలు, నగు కాంతలను గాంచి కామార్తుడై మోహించి, వారలతో క్రీడింపుచుండ, వారికి విష్ణుపరాక్రమవంతులైన యనేకసుతు లుద్భవించి భూలోకస్వర్గలోకములన పీడింపుచు కంపింపజేయుచు, నానాయుద్ధవిశారదులై మహాబలపరాక్రములై మహోపద్రవములను గల్గించుచు త్రిలోకముల విహరించుచు భూలోకస్వర్గలోకవాసులను దుఃఖపెట్ట సాగిరి. లోకోపద్రవకారకు లగు వీరల దుష్కృత్యములను గాంచి, దేవతలు మహర్షులు దుఃఖింపుచు బ్రహ్మకడ కేగి నమస్కరించి సర్వము విన్నవింప, బ్రహ్మ వారినుడువులు విని వారితో కైలాస మేగి శివునకు ప్రణమిల్లి స్తుతించి కృతాంజలియై జయ జయ మహాదేవా! సర్వలోకరక్షక! మానుడువులు వినుము.

విష్ణుపుత్రులు పాతాళమందుండి సర్వలోకంబులు విహరింపుచు పీడింపుచుండిరి. అమృతసంభవ లగుస్త్రీలతో విష్ణువు పాతాళమందు స్త్రీలోలుడై విహరింపుచుండెను. గాన మమ్ములను రక్షింపు మన;

శంకరుడు బ్రహ్మాదిదేవతల స్తుతులకు ప్రసన్నుడై పాతాళమందున్న విష్ణువును తీసికొని రాదలచి వృషభరూపము ధరించెను. ఇదియే లోకరక్షణకై ధరించిన వృషభావతారము

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
ఇరువదిరెండవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువదిమూడవ యధ్యాయము

## విష్ణుగర్వాపహరణము

ఓసనత్కుమారా! విష్ణుగర్వాపహారక మైన శివుని వృషభావతారమును వర్ణించి చెప్పెద, వినుము. ఈశ్వరుడు వృషభరూప మూని గర్జింపుచు భీషణారవంబులు చేయుచు పాతాళము ప్రవేశించి తన గర్జనలచే పురములు, నగములు ప్రతిధ్వనింప జేయుచుండ, పురవాసు లందఱు కంపింపనారిరి. మహాబలపరాక్రమవంతులైన విష్ణుపుత్రులు శివమాయామోహితులై సంగ్రామోద్యతులై కార్ముకములను గైకొని వృషభేశ్వరునికడ కేతెంచిరి. వృషభుడు క్రుద్ధుడై తనఖురములచేతను శృంగములచేతను వారిని చీల్చివేయ వారందఱు విచేతస్కులై గతప్రాణులైరి. పాతాళవాసు లగు తనపుత్రు లందఱు మరణించె నని విష్ణువు తెలిసికొని వృషభునికడ కేతెంచి తన పుత్రుల నితడే సంహరించె నని, కోపించి దివ్యాస్త్రములతనిపై ప్రయోగింప రుద్రుడు క్రుద్ధుడై సర్వాత ను్రిష్ఠించి కేశవాస్త్రము లన్నియు నుపసంహరించి ముజ్జగంబులు కంపించునట్లు గర్జింపుచు గంతులిడుచు పరుగుపరుగున వచ్చి

తనఖురశృంగములచే విష్ణువును విదల్చ, నతడు క్షతగాత్రుడై రుధిరాక్తశరీ
రుడై బాధలు సహింపనేరక శివమాయామోహితుడై కోపమూని ఇతడు
రుద్రుడని యెఱుంగక శిథిలాంగుడై గతచేతస్కుడై వృషభతాడనముల
కోర్వలేక గతగర్వుడై ఈవృషభేశ్వరుడే పరమేశ్వరుడని గ్రహించి నతకంధ
రుడై కృతాంజలిపుటుడై గంభీరవాక్కులతో నిట్లు పల్కెను.

ఓ దేవదేవ! మహాదేవ! కరుణాసింధూ! ఓప్రభూ! నీమాయామో
హితుడనై మూఢచిత్తుడనై నాప్రభుడవగు నీతో యుద్ధము చేసితిని.
నాయందు కృపయుంచి నాయపరాధము క్షమింపుమన, భక్తవత్సలుడగు
శంకరుడు విని, ఓవిష్ణూ! నన్ను నీ వెరుంగవా! నీ విట్టి దుష్టవర్తనము
మానుము. కామాసక్తుడై స్త్రీలతో రమింప జ్ఞానము నశించును. నీ విట్లు
స్త్రీలోలుడవై యుండుట యుచితము గాదు. దేవేశుడ వగు నీ విట్లు స్త్రీలో
లుడవైనచో విశ్వము నెట్లు ధరింపగల వన, విష్ణువు విజ్ఞానప్రదమైన
శంకరవాక్కులు విని వ్రీడితమనస్కుడై, ఓదేవదేవ! నీ యాజ్ఞాబద్ధుడనై
నీచక్ర మిచ్చినచో గ్రహించి నాలోకమున కేగెద నన, ధర్మరక్షకుడైన
వృషభుడు విష్ణువాక్కులు విని, ఓవిష్ణూ! నీవు విలంబము చేయక త్వరిత
ముగ నేగుము. నాచే నీయబడిన ఈచక్రము నీవద్దనే యుండి నిన్ను సర్వదా
రక్షింపుచుండును. ఈచక్రము సూర్యునివలన జనించెను. ఘోరతరమైన
యీచక్రము ధరింప నీవే సమర్థుడ వని, కాలానలసమప్రభమైనదియు,
దివ్యమైనదియు, పరసంహారకమైనదియు, ఘోరసూర్యప్రకాశమాన
మైనదియు నగు చక్రము విష్ణువునకు సర్వామరమునిరక్షణకై యిచ్చి
యుండెను. విష్ణు వాచక్రము గ్రహించి దేవతలను బిలిచి, ఓసురలారా! మీ
రందఱు పాతాళంబున కేగి మాయావనవతులగు దివ్యాంగనలతో క్రీడింపుచు
సర్వసుఖంబుల నొందుచు సంతసింపుడన, వారందుల కంగీకరించి చను
చుండ, శివుడది యెఱింగి, ఓదేవతలారా!

నా నుడువులు వినుడు. శాంతులగు మునులు, శివాంశజులగు
దానవులు వినా, యుష్మదితర దేవతలలో పాతాళమునం దెవరు ప్రవేశించినను
తక్షణమే మరణించెద రని, శపింప, మానవహితకర మగు రుద్రవాక్కులు

విని శివునిగురించి ప్రత్యాఖ్యానము చేయుచు, వారివారి స్థానముల కేగిరి. స్త్రీలోలు డగు విష్ణువు శివునిచే శాసింపబడి తన వైకుంఠమున కేగెను. వృషభేశ్వరు డిట్లు దేవకార్యములను పూర్తిచేసి కైలాసమున కేగెను. ఈ పవిత్రచరిత్రము శత్రుబాధానివారణమై, స్వర్గాయుర్యశస్కరమై, భక్తిముక్తిప్రదమై, యుండెను.. ఇది భక్తితో సమాహితచిత్తులై విన్నను వినిపించినను భువియందు సకలకామ్యము లనుభవించి యంతమున మోక్షము నొందగలరు.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు
ఇరువదిమూడవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువదినాల్గవ యధ్యాయము

### శంకరుని పిప్పలాదావతారము

భక్తివర్ధనమైనదియు నుత్తమంబైనదియు నగు మహేశ్వరుని పిప్పలాదావతారమును జెప్పెద, వినుము. పూర్వము భృగువంశసంజాతుడగు చ్యవనునకు విప్రపుంగవుడైన దధీచిమహర్షి జన్మించెను. అతడు శైవభక్తుడు ప్రతాపవంతుడునై యుండెను. విష్ణువు క్షుపుని రక్షించుటకై దధీచితో పోరు సల్పి పరాజితు డయ్యెను. ఆతడు మహేశ్వరసహాయుడై విష్ణ్వాదిదేవతలను శపించెను. దధీచిభార్య మహాపతివ్రతయై సువర్చ యను నామధేయవతియై యొకపుడు దేవతలనుకూడ శపించెను. ఇట్టి ప్రభావసంపన్నురా లగు నీమెకు శివుడు పిప్పలాద నామంబున జన్మించె నన,

సనత్కుమారుడు నందీశ్వరవాక్యములు విని సంతసమంతుష్టుడై, కృతాంజలియై ఓనందీశ్వరా! ఓమహాప్రాజ్ఞా! నీవు సాక్షాద్రుద్రస్వరూపుడవు. సద్గురుస్వరూపుడవు. నాకద్భుతములైన శివచరిత్రలు వినిపించుచుంటివి. విష్ణువు

క్షుపునికై దధీచితో కదన మొనర్చి పరాజితుఁడైన ట్లిదివరలో చెప్పియుంటివి. నేను వినియుంటిని. గాన, దధీచిభార్య యగు సువర్చ దేవతల నెందులకు శపించెనో చెప్పుము పిప్పలాదచరిత్ర కూడ విన నిచ్ఛగించుచుంటిని, చెప్పుమన, శివపదాంబుజములు స్మరింపుచు నందీశ్వరు డిట్లు చెప్పదొడంగెను.

పూర్వము శక్రాది దేవత లందఱు వృత్రాసురాదిదానవులచే పరాజితులై వారివారి యస్త్రములు దధీచ్యాశ్రమమం దిడుకొని మునులతో గలసి బ్రహ్మకడ కేగి సర్వము విన్నవింప బ్రహ్మ వారల గాంచి, ఓసురలారా! మిమ్ములను వధించుటకై త్వష్ట వృత్రాసురుని జనింపజేసెను. వృత్రుడు సర్వదైత్యాధిపతియు, మహాతేజుడు నై యుండెను. ఇతని రహస్య మిది. ఈ యసురుని ప్రయత్నపూర్వకముగ సంహరింపవలయును. దీని కొక ధర్మోపాయము గలదు. చెప్పెద, వినుడు.

మహామునియు, జితేంద్రియుడు, మహాతపస్వియు నగు దధీచి మహర్షి గలడు. అతడు పూర్వము శివునిచే వరములు పడసి వజ్రాస్థికుడయ్యెను. మీ రతనియస్థులు యాచించినచో నతడు తప్పక మీ కొసంగ గలడు. అతని వెన్నెముకను యాచించి దానిని వజ్రాయుధముగ జేసికొని: దానితో వృత్రాసురుని సంహరింపుడు. అత డవశ్యము వజ్రాయుధముచే మరణింపగల డన, దేవత లందఱు బ్రహ్మవాక్కులు విని, బృహస్పతిని గూడుకొని దధీచియాశ్రమంబున కేగి, భార్యాసహితుడై యున్న యామునికి నమ్రశిరస్కులై నమస్కరింప దధీచి వారి ఇంగిత మెఱింగి తన భార్యను లోనికిబంపి యుండ, స్వార్థపరుడు, నర్థశాస్త్రవిశారదుడు నగు నింద్రుడు దధీచిని గాంచి, ఓమహామునీ! మేము త్వష్టచే జనించిన వృత్రాసురునిచే సకలబాధలు పడుచుంటిమి. మీరు మహాశైవు లనియు మహాదాత లనియు విని, మిమ్ముల శరణువేడి మీయస్థుల నర్థింపవచ్చితిమి. మీయస్థులు వజ్రతుల్యములు గాన మి మ్మర్థింప నేతెంచితిమి. వాటిచే వజ్రాయుధము చేసికొని వృత్రాసురుని సంహరించెద, మన, పరోపకారపరాయణు డగు నాదధీచిముని లోకహితమునకై శివుని మనసా స్మరించి యోగయుక్తుడై తనశరీరమును త్యజించి బ్రహ్మలోకము జేర, సకల దేవతలు నతనిదాతృత్వమునకు విస్మయము జెంది కామవృష్టిని







కురిపించిరి. తదుపరి దేవేంద్రుడు కామధేనువును బిలిచి దధీచి శరీరమం దున్న యస్థులు వెలుపలకు తీయించి, విశ్వకర్మను ధావించి దధీచివెన్నెముక వజ్రాయుధముగా తయారుచేయించెను. ఇతని యస్థు లన్నియు శివతేజముతో ప్రకాశింప జొచ్చెను. ఇట్టి వజ్రాయుధము తీసికొని శక్రుడు పర్వతశిఖరమును బోలు విప్రపుత్రుడగు వృత్రాసురుని శిరము ఛేదించెను. సకలదేవతలు వృత్రాసుర సంహారము గాంచి, మహోత్సవంబులు గావింపుచు శక్రునిపై కుసుమవర్షము కురియింపుచు ననేకవిధంబుల స్తుతించిరి. ప్రసంగవశమున నీకీచరిత్ర చెప్పితిని. ఇక పిప్పలాదునిచరిత్ర చెప్పెద వినుము.

గర్భవతియై యున్న దధీచిభార్య యగు సువర్చ గృహాంతరమునుండి వెలుపలకు వచ్చి, భర్త గాన్పింపకుండుటయు, దేవతలసంతోషమును గాంచి, విస్మితురాలై ఇదంతయు దేవతలమోస మని గ్రహించి క్రుద్ధురాలై ఓసురలారా! మీరందఱు కలసి నా భర్త నేమిచేసిరి. చెప్పుడు. మీరు దుష్టాత్ములు. స్వకార్యసాధకులు. లుబ్ధులు. స్వార్థపరులు. మీ రందఱు నాశాపముచే పశుప్రాయు లగుదు రని దేవతల శపించి సహగమనము చేయదలచి యాపతివ్రత చితి పేర్చుకొని పవిత్రమనస్కయై చితిలో బడ నుంకించగ, గగనవాణి యిట్లు పల్కెను. ఓ సాధ్వీ! నీ వట్లు సాహసింపకుము. నా వాక్కులు వినుము. నీగర్భమందు మునితేజము వర్ధిల్లుచున్నది. ఆశిశువును ప్రయత్నముగ వెలుపలకు తీసి నీ యిచ్చవచ్చినట్లు చేయుము. గర్భస్థు డగు దేవుని దేహము దహించినచో మహాపాపము సంభవించును. గాన, నీ వట్లు చేయకు మన, నభోవాక్కులు విని మునిపత్ని క్షణకాలము విస్మితురాలై ఆసాధ్వి పతిలోక మేగఁ దలచి యొకశిలచే గర్భమును చీల్చి శిశువును వెలుపలకు తీసెను. ఆశిశువు దేదీప్యమానముగ దశదిశలు ప్రకాశింప జేయుచుండెను. దధీచివర తేజోభవు డగు నితడు కేవలము రుద్రావతారుడు. అతని లీలచే నిట్లుద్భవించెను. ఆమునిభార్య ప్రకాశమాను డగు కుమారుని గాంచి ఇత డపరరుద్రావతారు డని గ్రహించి నమస్కరించి ఆస్వరూపమును తన హృదయమందు నిల్పుకొని పుత్రుని గాంచి నవ్వుచు, ఓతండ్రీ! మహేశ్వరా! మహాప్రాజ్ఞా! నీ వీయశ్వత్థవృక్షముకడ నుండి సర్వులకు సుఖములు గల్పించు

చుండుము. పతిలోకమున కేగుటకు నాకనుజ్ఞ నిమ్ము. నేను పతిలోకమున కేగినను రుద్రరూపుడ వగు నిన్నె ధ్యానించుచుందు నని పుత్రునితో బలికి యోగాభ్యాసముచే ప్రాణత్యాగము చేసి పతిలోక మేగి భర్తను గూడికొని ముదంబుతో శివుని సేవించుచుండెను.

బ్రహ్మావిష్ణ్వాది దేవత లందఱు రుద్రరూపుడు, దధీచిపుత్రుడు నగు నీబాలకునికడ కేతెంచి చేతులెత్తి మ్రొక్కి నమస్కరించి బద్ధపాణులై స్తుతించి మహోత్సవంబులు గావించి దుందుభులు మ్రోగించిరి. నర్తకులు నాట్యములు చేసిరి. గంధర్వులు గానము చేసిరి. కిన్నరులు వాద్యములు వాయించిరి. దేవతలు కుసుమవర్షము కురిపించిరి. వా రందఱు బాలునకు పిప్పలు డని నామధేయ మిడి సర్వసంస్కారములు గావించిరి. నీవు మాకు సదా ప్రసన్నుడవై యుందువు గాక యని ప్రార్థించిరి. అనేకోత్సవంబులు చేసి యతని యనుమతిచే వా రందఱు వారివారి స్థానములు కేగిరి. పిప్పలాదుడు లోకహితమునకై యశ్వత్థమూలముకడ నాసీనుడై బహుకాలము తపంబు జేసెను.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువది యైదవ యధ్యాయము

### పిప్పలాదుని వివాహము

లోకోపకారమునకై పిప్పలాదుడు చేసిన మహోపకారంబులు చెప్పెద, వినుము. పిప్పలాదు డొకానొకసమయంబున పుష్పదంతానదికి స్నానార్థ మేతెంచి శివాంశసంభవురాలును, మహాలావణ్యవతియును మనోహారిణియు పద్మనామవతియు నగు నొకయువతిని గాంచి యామెను పరిణయమాడ దలచి లోకతత్త్వవిచక్షణుడు త్రిలోక సంచారుడు నగు నా ముని, పద్మతండ్రి యగు యనరణ్యమహారాజుకడ కేగ, రా జతనిం గాంచి భయకంపితుడై నమస్కరించి మధుపర్కాదిసత్కారములు గావించి భక్తితో పూజించెను. మునీశ్వరు

డివన్నియు ప్రేమతో గ్రహించి, అతనికన్యకను తన కిమ్మని యాచింప, రాజు మౌనము వహించెను. ముని మరల రాజును గాంచి, ఓరాజా, నీకన్యకను భక్తితో నాకిచ్చి యుద్వాహ మొనరింపుము. లేనిచో నిన్ను పరివారసహితముగ భస్మము చేసెదను, అనిపలికెను. రాజు మొదలగువా రందఱువ్యాకులచిత్తులై యతిభయ మొందుచుండిరి. రాజు గురువాజ్ఞచే నువివాహము తప్ప దని నిశ్చయించి యనేకవిధంబుల విలపించుచు తన పుత్రిక యగు పద్మ నాస్పదమునికి సాలంకృతకన్యాదానము చేసెను. శివాంశసంభూతుడగు పద్మను వివాహమాడి పిప్పలాదుడు తన యాశ్రమంబునకు గొంపోయి, తా నతివృద్ధుడై నను భార్యతో రమించుచు నతిలంపటుడు గాక తపధ్యానము విడక సంచరింపుచుండెను. పద్మ సకలవిధంబుల త్రికరణశుద్ధిగ భర్తకు శుశ్రూషలు గావించుచు లక్ష్మి విష్ణువును సేవించినట్లుగ భర్తను సేవించుచుండెను. శివాంశజు డగు పిప్పలాదుడు తన లీలచే యువకుడై యాయువతితో క్రీడించుచుండెను. ఇతనకి పదుగురు పుత్రులు గల్గిరి. వా రందఱు పితృతుల్యులై తలిదండ్రులకు సర్వసుఖంబులు గల్గించుండిరి. ఈపిప్పలాదు డనేకలీలలు గావించుచు భక్తుల కనేకవరంబు లిచ్చియుండెను. ఈత డనివార్యమైన శనైశ్చరపీడ లన్నియు నిర్మూలించి ప్రజలకు సుఖములు గల్గించెను. జన్మలో షోడశవర్షములు భక్తితో శివుని సేవించినవారి కెన్నడు శనిపీడ కల్గ దని ఈతడు వక్కాణించి చెప్పెను. శని నాయాజ్ఞను తిరస్కరించి నాభక్తులను పీడించినచో నాతడు భస్మమై పోవు నని కూడ చెప్పెను. పిప్పలాదుని వాక్యానుసారముగ శనైశ్చరుడు శివభక్తుల నెన్నడు పీడింపడు. శివభక్తులకు భయపడుచుండును. ఈపిప్పలాదుని చరిత్ర సర్వకామప్రదమై యున్నది.

శ్లో॥ గాధిశ్చ కౌశికశ్చైవ పిప్పలాదో మహామునిః
శనైశ్చరకృతాం పీడాం నాశయంతి స్మృతాస్త్రయం

గాధి కౌశికుడు పిప్పలాదుడు ఈముగ్గురు శనిపీడలు నివారించెదరు. వీరిని దలచినంతనే శనిపీడలు నివారింప బడును. ఈచరిత్ర

విన్నను పఠించినను శనిపీడానివారణులై సకలసౌఖ్యము లొందగలరు. సకలకోర్కెలీడేరును.

దధీచియు, నతనిపుత్రుడైన పిప్పలాదుడు కూడధన్యులు. ఈయాఖ్యానము చెడ్డగ్రహపీడలు నివారించును. పాపరహితము స్వర్గదాయకము సర్వకామప్రదము శివభక్తివివర్ధకమునై యుండెను.

శివమహాపురాణము శతరుద్రసంహితయందు
ఇరువది ఐదవఅధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది ఆరవ యధ్యాయము

### శివుని వైద్య నాథావతారము

సనత్కుమారా! పరమాత్ముడగు శివుని వైద్యనాథావతారము చెప్పెద, వినుము. పూర్వము నందిగ్రామమున శివభక్తురాలగు నందా యనెడు వేశ్యకలదు. ఆమె యతిసుందరియై యమితధనాఢ్యయై మహావిభవసంపన్నయై మహోజ్జ్వలప్రకాశమానయై నానారత్నవిభూషితయై యత్యధికశృంగారవతియై సర్వసంగీతవిద్యానిపుణయై యతిమనోహారిణియై యుండెను. ఆదేశపు రాజు రాణియుకూడ నీమెగేయములు విని యెంతయో ముదమొందుచుండిరి. ఈమె సదా సాంబశివుని అర్చించుచు భస్మరుద్రాక్షమాలికలు ధరించుచు జగదీశ్వరుడగు పరమేశ్వరుని సదా యర్చించుచు అతనియెదుట శివయశంబులు గానము చేయుచు ఇంకను భక్తితో నృత్యము చేయుచు, యొకకుక్కుటము నొకవానరమును పెంచుచు వాటిని రుద్రాక్షమాలలచే నలంకరించుచు తాను తాళములు వేయుచు గీతములు పాడుచు, వాటిచే వినోదముగ నృత్యములు చేయింపుచు తా నుచ్చైఃస్వరంబున భక్తితో శివకీర్తనలు పాడుచు నానందముచే నవ్వుచు సఖిసమేతయై పాడుచు వానరకుక్కుటముల కర్ణభుజంబులకు

శిరంబులకు రుద్రాక్షలు గట్టి వాటిచే శిక్షగా నృత్యములు చేయింపుచు తా నానందింపుచు భక్తిపారవశ్యయై పరమానందభరితయై కాలము గడుపు చుండెను. ఇట్లు బహుకాలము గడువ;

ఒకానొక సమయంబున శంకరు డీమెను పరీక్షింపదలచి ఫాలమున భస్మత్రిపుండ్రములచే శోభించుచు రుద్రాక్షాభరణశోభితుడై జటామాలియై శివనామము స్మరింపుచు జంగమరూప మూని యీవేశ్యగృహమున కేతేర నావేశ్య భస్మోద్ధూళితగాత్రయై రత్నభూషణభూషితయై మోహనాంగియై పసులను భ్రమింపజేయుచు నతిముదంబున నేతెంచి అతిథిని పూజించి లోనికి గొంపోయి యాసనం బిడి కూర్చుండబెట్టి యతని దివ్యకంకణము గాంచి, స్వామీ! మీదివ్యకంకణము గాంచినంతనే నామనం బీకంకణమునకై యువ్విళ్లూరుచున్నది. ఇట్టి కంకణ మెన్నడును గాంచి యెరుగను. మీ రత్న కంకణము దేవతాస్త్రీలు ధరించెడి కంకణమువలె నున్నది. గాన, నిది నామ నంబు హరించుచున్నదన. నా జటిలుడును దారస్వభావముతో నాకంకణముపై భ్రమ కల్గినదా యని నవ్వుచు, నో వేశ్యా! నీకు దీనియందు భ్రమ కల్గెనేని దీనికి తగిన మూల్య మిచ్చి గైకొని నీవే ధరింపు మన, ఓమహాశయా! మేము స్వేచ్ఛాసంచారు లగు వేశ్యలము. వేశ్యకులమందు జనించినదానను. నేను వేశ్యనే గాని, పతివ్రతను గాను. మీవంటి యుదారపురుషులు సర్వాభరణ ములు మాకొసంగుటయే గాని, మూల్య మిచ్చి కొని యెరుంగము. వ్యభి చారమే మా కులధర్మము. మీ రాకరభూషను నా కొసంగినచో మూడు రాత్రులు మీకు పత్నిగా నుందు నని యావేశ్య పలుక, నా కపర్ది ఇట్లు వల్కెను.

ఓ భామినీ! అట్లే చేయుము. రవిచంద్రులు సాక్షిగా నాకు త్రిరాత్రం బులు మాత్రము పత్ని వగుము. వారే సాక్షులు గాన నీ విందుల కంగీకరించి నాహృదయము తాకు మన, నో ప్రభూ! నేను మీకు త్రిరాత్రములు పత్నిగా నుండెద నని, ప్రమాణము చేసి, చెప్పుచుంటిని. ఇది ముమ్మాటికిని సత్యము. శశిభాస్కరులు సాక్షిగా జెప్పుచుంటిని, నమ్ము మని, యతని హృదయము స్పృశించెను. అపు డాజంగముడు తనరత్నకంకణ మామె కిచ్చి, యొకరత్న లింగ మామెహస్తమం దుంచి, ఓ భామినీ! నీకు రత్నలింగమును కూడ నిచ్చు

చుంటిని. దీనిని నీ వతిరహస్యముగ భద్రపరుపుము. ఈశివలింగము నాప్రాణప్రద మైనది. ఇది యతిమనోహర మైనది. జాగ్రత్తసుమా యని, నామె రత్నలింగమును నాట్యశాలామధ్యమందు భద్రపరచి తా నాపురుషునితో మృదుశయ్యపై వేశ్యాధర్మంబున శయనించియుండ, శివాజ్ఞచే నొకనియమ్మాగ్ని యిట్లు పలికెను. అగ్ని వాయువులు ప్రకోపించుటచే నీనాట్యభవనము దహింపబడుచున్న దన, వేశ్య యాభయంకరవాక్కులు విని లేచి నాట్యభవనము దహింపబడుచుండుట గాంచి, కుక్కుటమర్కటములను బంధవిముక్తులను జేయ, కుక్కుటము తనరెక్కలచే నగ్నికణముల విదల్చుకొనుచు భయపడుచు మర్కటమునతో దూరముగా పారిపోయెను. నాట్యశాలతోసహా రత్నశివలింగము భస్మమగుట గాంచి వేశ్యయు వేశ్యాపతియు నతిగా దుఃఖింపసాగిరి. వేశ్యాపతి మాటిమాటికి దుఃఖించుచు, నాప్రాణలింగము లేనిచో నే నెట్లు జీవింపగల్గుదు నని, విలపించుచు, నందా! నాయాత్మలింగ మగు శివలింగము భస్మమాయెను. అది లేనిచో నేను జీవింపజాలను. దానితో పాటు నేనును భస్మమగుదును. చితి పేర్పింపుము. విష్ణుబ్రహ్మేంద్రాది దేవత లడ్డువచ్చినను మానను. శివుని మనసా స్మరింపుచు హుతాశనునియందు ప్రవేశించెదను. చితి పేర్పింపు మన, మహానంద యతనిపట్టుదల మానకుండుటచే దుఃఖించుచు తన గృహము వెనుకభాగమున తన భృత్యులచే నొకచితి పేర్పించియుండ, ఆజడదారి యందరు గాంచుచుండగ శివస్మరణ చేయుచు నగ్నికి ప్రదక్షిణ మిడి ఆయగ్నిం బ్రవేశించెను.

ఇది గాంచి మహానంద విస్మితురాలై తపించుచు దుఃఖింపుచు నతనిధర్మమును ప్రశంసించుచు కరుణతో తనబంధువు లందరిని రావించి, అందఱ గాంచుచు నే నిరత్నకంకణముపై నొట్టుపెట్టుకొని చెప్పుచుంటిని, వినుడు. ఈపురుషునకు మూడురోజులు పత్ని నగుదు నని శపథము చేసి ఈకంకణమును తీసికొంటిని. ఒకరోజుమాత్రమే యతనికోర్కె దీర్చియుంటిని. దైవవశముచే నీశివభక్తుడు గడువు తీరకనుండే మృతి చెందెను. నే నితనికి దినత్రయము సహధర్మచారిణిగ నుందు నని బాస చేసితిని గాన నాసత్యము నిలబెట్టుకొనుటకై నే నితనితో సహగమనము చేసెదను. పరమధర్మము సత్యము నాశ్రయించియే యుండును. సత్యము

చేతనే మోక్షము లభించును. సర్వము సత్యస్థాపితమై యుండె నని పలుకుచు, బంధువు లెందరు నివారించినను పట్టుదల నూనక, తన జీవితము వీడనెంచి సదాశివుని ధ్యానింపుచు తనసర్వస్వము ద్విజముఖ్యులకు దానమిచ్చి, ఆ చితాగ్నికి ముమ్మారు ప్రదక్షిణము గావించి యగ్నిం బ్రవేశింప నుంకించుచు, శివుని ధ్యానింపుచుండ, విశ్వాత్ము డగు శివుడా చితియందు ప్రాదుర్భవించి, ఆమెను నివారించియుండ, దేవదేవుడు త్రిలోచనుడు, చంద్రకళావతంసుడు, శశాంకసూర్యానల కోటిసమప్రభుడు, నగు నా పరమేశ్వరుని ఆవేశ్య గాంచి యట్లే నిలబడి యుండి కంపితగాత్రియై విస్మయమొందుచు నిట్టూర్పులు విడుచుచున్న యామెను గాంచి, పరమేశ్వరు డామెహస్తము బట్టి, ఓనందా! నీకు నాయందు దృఢమైన భక్తి సత్యధర్మములు నీయందున్నవి. నీసత్యధర్మములు పరీక్షించుటకై నే నీ జటిలరూపంబున నీకడ కేతెంచితిని. నాప్రేరణచేతనే నీనాట్యమండపము దగ్ధ మయ్యెను. నారత్నలింగము భస్మ మయ్యె నను నెపంబుతో నీయెదుట నే నగ్నిం బడితిని. నీసత్యధర్మములు నిలబెట్టుకొనుటకై నీవు సహగమనము చేయ నుద్యమించితివి. గాన నీకు దేవతాదుర్లభము లగు భోగము లిచ్చెదను. నీ వేది కోరిన నిచ్చెదను. నే నివ్వలేని దేదియు లేదు. నీభక్తికి సంతసించితిని. కోరుకొను మన, మహానంద శంకరవాక్కులు విని సంతసింపుచు, ఓ ప్రభూ! త్రిలోకములందలి భోగము లేవియు నా కవసరము లేదు. నీపాదాంబుజ స్పర్శమాత్రమే కోరుచుంటిని. అన్యమేదియు నా కవసరము లేదు. నాబంధుమిత్రసేవకు లందఱు నీభక్తులై యుండిరి గాన, వారలతో నాకు మోక్షపదవి నిమ్ము.

నా కుక్కుటవానరంబులకు కూడ ముక్తి నిమ్ము. మాకు పునర్జన్మ భయము లేకుండజేయుము. నీకు నమస్కార మన, శంకరుడు వా రందఱికి కైవల్యపద మిచ్చెను. భక్తానందకర మగు వైద్యనాథావతారము జెప్పియుంటిని. ఈచరిత్ర భక్తితో విన్నచో నెన్నడు ధర్మచ్యుతులు గారు. ఇహపరసుఖముల నొందెదరు.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
ఇరువదిఆరవ అధ్యాయము సంపూర్ణము.

---

# ఇరువదియేడవ యధ్యాయము

## శంకరుని ద్విజేశ్వరావతారము

సత్పురుషసుఖదాయకమైనదియు పరమపవిత్రమైనదియు నగు శంకరుని ద్విజేశ్వరావతారము చెప్పెద, వినుము. పూర్వము నీకు భద్రాయువు చరిత్ర చెప్పియుంటిని. అతనికి శంకరుడు ఋషభనామంబున జన్మించెను. భద్రాయువును పరీక్షించుటకై శంకరుడు ద్విజేశ్వరావతార మూనెను.

చంద్రాంగదమహారాజునకు సీమంతిని యను భార్య గలదు. ఈదంపతులకు సుభావయశంబులు గల కీర్తిమాలిని యను పుత్రిక కలదు. ఆ సుసాధ్విని భద్రాయువు పరిణయమాడి యొకానొక వసంతసమయంబున గాథారణ్యమున తనప్రియురాలితో విహరింపుచుండ, శివపార్వతు లితనిధర్మమును పరీక్షింప దలచి తమ లీలలచే ద్విజదంపతులై యటనే విహరింపుచు నొక వ్యాఘ్రమును కూడ కల్పించిరి; ఆవ్యాఘ్రము మీావిప్రదంపతులను వెంటాడుచుండ, వా రా వ్యాఘ్రమునకు భయపడుచు, నటునిటు పరుగిడుచు, దుఃఖింపుచుండిరి. శరణాగతరక్షకుడు, క్షత్రియర్షభుడు నగు భద్రాయువు వారిరోదనంబు విని వారిచెంతకేగ, నామాయాదంపతులు రాజును గాంచి ధర్మవిత్తముడ వగు నోమహారాజా! మమ్ము రక్షింపుము రక్షింపుము. మ మ్మీావ్యాఘ్రము హింసింపనున్నది. ఇది క్రూరజంతువు. ఇది కాలునివలె సర్వప్రాణిభయంకరమై యున్నది. అది మమ్ము గ్రసింపక మునుపే రక్షింపుము. నీవు ధర్మవేత్త వన, నానృపతి వారిరోదనంబులు విని, ధనువు గ్రహింప, నింతలో నామాయావ్యాఘ్రము ఆద్విజదంపతులమధ్య ప్రవేశించి విప్రభార్యను బట్టుకొన, వ్యాఘ్రము భయంకరముగ బట్టుటచే హానాథా! హానాథా! యీాశ్వరా! యని యామెయు, హాప్రియా! కాంతా! యని ద్విజుడు రోదనముచేయుచుండిరి. రాజు నిశితబాణముచే నావ్యాఘ్రమును గొట్ట నది వర్షధారలకు గిరీంద్రమువలె చలింపక వారు గాంచుచుండగనే వ్యాఘ్రము మా ద్విజపత్నిని గ్రహించి దవ్వునకు పారిపోవుచుండ, విప్రుడు విస్మితుడై లోకరీతిని మాటిమాటికి రోదనము చేయుచుండెను.

మదహారకుడు, మహేశ్వరుడు నగు విప్రుడు చిరకాలము భార్యకై దుఃఖించి భద్రాయువును గాంచి, ఓరాజా! మహాస్త్రము లన్నియు నే మయ్యెను? నీ శరణాగతరక్షణ మే మైనది? నీ ధనుఃపాటవ మేమైనది? నీద్వా దశసహస్రగజతుల్య మగు బల మే మయ్యెను? నీఖడ్గ మే మయ్యెను? నీ భీషణశంఖ మే మయ్యెను? నీ మంత్రాస్త్రవిద్యాబలము లన్నియు నే మయ్యెను? నీ శరీరబల మే మయ్యెను! ఇ వన్నియు నీకడ నిష్ఫల మాయెనా? నీవు విలాసమునకై వేటాడుదువు గాని క్రూరమృగంబులను సంహరింపలేవు. నీ వసమర్థుడవు. దుఃఖితులను రక్షించుట క్షత్రియులకు పరమధర్మమై యున్నది. నీ కులధర్మములు నశించినపిమ్మట నీవు జీవించిన ప్రయోజన మే మున్నది? శరణు పొందినవారిని క్షతగాత్రులుగ జేయకుండుటయే క్షత్రి యధర్మము. ఆర్తులను రక్షించుటయే రాజధర్మము. ప్రభువు శరణార్థులను తన ప్రాణధనములతో నైనను రక్షింపవలెను. లేనిచో జీవచ్ఛవతుల్యుడు. ఆర్తమూర్తులను రక్షింపక తాను జీవించుటకంటె మరణమే మేలు.

శ్లో॥ ధనినాం దానహీనానాం గార్హస్థ్యా ద్భిక్షుతా వరం
ఆర్తత్రాణవిహీనానాం జీవితా న్మరణం వరం

గృహస్థు డగు ధనికుడు దానహీను డగుటకంటె భిక్షాటనమే శ్రేయ స్కరము.

ఆర్తులను రక్షింపక జీవించుటకంటె మరణమే శ్రేష్ఠము.

శ్లో॥ వరం విషాశనం ప్రాజ్ఞై ర్వర మగ్నిప్రవేశనమ్
కృపణానా మనాథానా దీనానామపరక్షణాత్.

అనాథులను దీనులను రక్షింపని కృపణమనుష్యులకంటె విషాన్నభోజ నము అగ్నిప్రవేశము శ్రేష్ఠ మని బుద్ధిమంతులు నుడివి రని యావిప్రుడు నిందింపుచుండ, తే డిదంతయు విని శోకాకులమానసుడై నాకు దైవము ప్రతికూలు డగుటచే నాపౌరుష మంతయు నష్ట మయ్యెను. నా కీర్తి నశిం చెను. నాకు మహాపాతకము సంభవించెను. నా కులధర్మము నశించెను. నేను మందభాగ్యుడను. దుర్మార్గుడను. దీనిచే నా సర్వసంపత్తులు రాజ్యము

ఆయువు నశించును. భార్యావియోగముచే దుఃఖించుచున్న యీబ్రాహ్మణు నకు నాప్రాణము లిచ్చియైనను అతనిదుఃఖము బాపెద నని భద్రాయువు దలచి యీ విప్రునిపదంబులపై బడి, ఓద్విజోత్తమా! నేను నామమాత్రము నకే క్షత్రియుడను. నాపౌరుష మంతయు నశించెను. నీ కోర్కె యేదైనను దీర్చెదను. నీ విశోకము వీడుము. నా యీరాజ్యము, నా భార్య, నా శరీరము, సర్వము నీ యధీనము. ఇంతకన్న నీ వేది కోరినను నేనిచ్చెద నన, ఆవిప్రు డిట్లు పల్కెను.

శ్లో॥ కి మాదర్శేన చాంధస్య కింగృహై ర్భైక్ష్య జీవినాం
కిం పుస్తకేన మూఢస్య నిస్త్రీకస్య ధనేన కిం.

అంధున కద్ద మిచ్చిన ప్రయోజన మే మున్నది? భిక్షునకు సౌధ మిచ్చిన నుపయోగ మేమి? మూఢునకు పుస్తక మిచ్చిన లాభ మేమి? భార్యావిహీనునకు ధనముతో ప్రయోజన మేమి? భార్యావిహీనుడ నగు నే నేమి భోగముల ననుభవింపగలను? గాన, నీ పట్టమహిషి నిచ్చినచో నేను సంతసించెద నన;

భద్రాయు విది విని, ఓవిప్రేంద్రా! యెంతమహాదాత యైనను ననేక విధము లగు రసపదార్థము గాని, ఘనపదార్థములు గాని, అనేకవిధధనంబులు గాని, రథగజతురగంబులు గాని, తుదకు తన దేహ మైనను దానము చేయుగలడుగాని, తనకళత్రమునుమాత్రము దాన మీయ లేడు. ఏమన, దానము గ్రహించి పరదారను పొందిన మహాపాపము నొందగలడు గాన, నాభార్యను నీ కొసంగి నిన్నా పాపపంకములో పడద్రోయ లేను. స్వామీ! పడద్రోయ లేను. ఎన్నివందల ప్రాయశ్చిత్తములు చేసికొన్నను పరదారల పొందిన పాపము పోదన, విప్రుడు రాజవాక్కులు విని ఘోర మైన బ్రహ్మహత్యాదోష మైనను, మదిరాపానదోష మైనను, నాతపంబుచే బోగొట్టుకొందును. అట్టి నేను పరస్త్రీసంగమదోషము పోగొట్టుకొనుటలో సందేహ మేమి? నాకింతకంటె వేరు కోరిక లేదు గాన, నీభార్యను నా కొసంగుము. భయార్తులను రక్షింపనిచో నిరయము తప్పదు. అన, రాజు విప్రవాక్కులు

విని నిశ్చేష్టుడై, భయమొందుచు ఆర్తులను రక్షింపక మహాపాపము నొందుట కంటె భార్య నిచ్చుటయే శ్రేయస్కరము గాన నేను విప్రునకు భార్య నొసంగి నేనగ్నింబడి మృతి జెంది శాశ్వతకీర్తి బడసెద నని తలచి, యగ్నిని ప్రజ్వలింప జేసి, ఉదకపూర్వకముగ నా ద్విజునకు తనపత్నిని దాన మొసంగి స్నాన మాచరించి శుచిమంతుడై విప్రులకు నమస్కరించి అగ్నికి ముమ్మారు ప్రదక్షిణము చేసి, శివుని ధ్యానించి అగ్నిం బడ నుద్యుక్తుడు కాగా; నతనికి విశ్వేశ్వరుడు ప్రత్యక్షమై యగ్నిం బడకుండ నాపుజేసి పంచాస్యుడై, త్రిపంచనేత్రుడై, పినాకపాణియై, చంద్రకళావతంసుడై, ప్రలంబ పింగళజటాకలాపుడై మధ్యాహ్నకోటి సూర్యాండప్రకాశుడై, మృణాలగౌర వర్ణగజచర్మవాసుడై, గంగాతరంగార్ద్రజటామౌళియై, నాగేంద్రహారావళీ కంఠభూషణుడై, కాంచనోజ్వలకిరీటకంకణశోభితుడై, శూలాసిఖట్వాంగ కుఠారచర్మమృగాభయపినాకహస్తుడై, వృషభారూఢుడై, శితికంఠభూషణుడై, ఆయగ్నియం దుద్భవించి యారాజునెదుట సాక్షాత్కరించెను.

అట్టితరి దివినుండి కుసుమవృష్టి కురిసెను. సురలు దుందుభులు మ్రోగించిరి. అచ్చరలు నాట్యమాడిరి. హరి బ్రహ్మాదిదేవత లందఱు వచ్చి స్తుతించిరి. నారదాదిమహర్షు లందరు నుతించిరి. వీ రందఱు భక్తిధర్మప్రవర్తకము లగు ననేకోత్సవములు గావించిరి. అట్టితరి నాభూపాలుడు ఆభగవంతుని గాంచి సాష్టాంగ నమస్కరించి యానందవిజృంభితాశయుడై యానంద బాష్పకణములచే గాత్రము తడుపుకొనుచు ప్రబుద్ధరోమాంచితుడై, ముకుళితహస్తుడై, గద్గదవాక్కులతో స్తుతింపుచుండ, పరమేశ్వరుడు పార్వతితో ప్రసన్నుడై,

ఓరాజా! నీభక్తికి, ధర్మమునకు మెచ్చితిని. నీవు నీభార్యతో వరము కోరుము. నీభావము పరీక్షించుటకై మేము విప్రదంపతులమై వచ్చితిమి. నీశరఘాతములు పాటింపక నాభార్యను హరించిన వ్యాఘ్రము నామాయ. నీధైర్యము పరీక్షించుటకై నీపత్నిని గోరితి నన, శంకరవాక్కులు, భద్రాయువు విని, నతమస్తకుడై, నమస్కరించి, ఓప్రభూ! నాభవబంధములు బాపి నాదృక్పథమందు సదా గోచరింపుచుండుము. నాతలితండ్రులకు నాభా

ర్యకు సదా నీపాదసేవ నొసంగుము. నాస్నేహితుడైన పద్మాకరుడనెడు వైశ్యునకు, నతనిపుత్రునకు నీసామీప్య మిమ్మన, నింతలో రాజభార్య యగు కీర్తమాలిని శంకరుని గాంచి, ఓప్రభూ! నాతండ్రి యగు చంద్రాంగదుని, నాతల్లి యగు సీమంతినిని నీపార్శ్వమం దుండునట్లు చేయు మన, గౌరీశుడు ప్రసన్నుడై యట్లే యగుగాక యని, వారికోర్కెలు దీర్చి, క్షణములో నదృశ్యు డయ్యెను. భద్రాయువు ఈశ్వరప్రసాదముచే కీర్తిమాలినితో సకల భోగము లనుభవించుచు పదివేల సంవత్సరము లవ్యాహతపరాక్రముడై రాజ్యపాలన జేసి తదుపరి తన తనయునకు రాజ్యాభిషేకము చేసి శివసామీప్యము నొందెను. చంద్రాంగదుడు, సీమంతినియు, శివభక్తులై శివసాయుజ్యము నొందిరి. పరమానందకర మగు నీచరిత్ర మతిపవిత్రమై శివతారకమై కీర్తిప్రదమై భుక్తిముక్తిప్రదమై యున్నది.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు
ఇరువదియేడవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువది యెనిమిదవ యధ్యాయము

### శంకరుని యతినాథావతారము

పరమాత్ము డగు శివుని యతినాథావతారము చెప్పెద, వినుము. అర్బుదాచలసమీపమున నాహుకు డనెడి భిల్లుడు గలడు. ఇతనికి నాముకి యనెడు పతివ్రత యగు భార్య కలదు. ఈదంపతులు శివభక్తులై సదాశివుని సేవించుచుండిరి. ఒకానొకసమయంబున నాభిల్లుడు తన ప్రియురాలి కాహారము నిమిత్తమై చాలదూర మేగి సాయంసమయ మగుసరికి ఇంటికి చేరుకొనెను. ఇంతలో శంకరుడు సన్యాసిరూపంబున వారలపరీక్షించుటకై యేతెంచి యుండెను. భిల్లదంపతులు సన్యాసిని సత్కరించిరి. తదుపరి సన్యాసి వారలను పరీక్షించుటకై భయపడుచు దీనవాక్కులతో, ఓభిల్లుడా! నీగృహము బహుచిన్నది. నేను వెలుపల

నిద్రించుటకు చాల భయపడుచుంటిని. నాకు పండుకొనుటకు తావు జూపిం పుము. ప్రాతఃకాలమున లేచి పోవుదు నన, నాభిల్లుడు స్వామీ! మీరు చెప్పినట్లు మాగృహము కడుచిన్నది. తమకు నేనెట్లు చోటివ్వగల నన, నాభిల్లి భర్తవాక్కులు విని, ఓస్వామీ, మన గృహమున కేతెంచిన యతిథికి చోటిమ్ము. గృహస్థధర్మము నాశ్రయించి యతిథుల కాశ్రయ మివ్వ వలెను. ఇదియే గృహస్థధర్మము. మీరీయతీశ్వరునితో గృహ మందు సుఖముగా శయనింపుడు. నేనాయుధములతో వెలుపల నుండెదను. నాకేమియు భయము లే దన, భిల్లుడు భార్యవాక్కులు విని, పత్నిని వెలుపల విడిచి నే నెట్లు గృహమందు శయనింతును? ధర్మవిరుద్ధముగ యతి కాశ్రయ మివ్వక యెట్లు పొమ్మందును? గృహమేధి కీ రెండును తగినవి కావు. ఏది యెట్లున్నను నేను వెలుపల నే యుందు నని నిశ్చయించుకొని తనభార్యను, సన్యాసిని, గృహమందు శయనింపు డని తాను ధనుర్ధరుడై వెలుపల కూర్చుని యుండ, శివప్రేరణముచే నితనికడకు క్రూరమృగము లేతెంచి భక్షింపబోవ, తనశరములచే వాటిని గొట్టి మర లింప నెంతప్రయత్నించినను దైవప్రేరణచే నాహింసకమృగములు భిల్లుని భక్షించెను. యతీశ్వరుడు ప్రాతఃకాలమున మేల్కాంచి భక్షింపబడిన భిల్లునియస్థులు గాంచి, మిక్కిలి దుఃఖింపుచుండ, దుఃఖింపుచున్నయతిని గాంచి భర్తయస్థులు గాంచి తనభర్త మరణించె నని యాభిల్లాంగన దుఃఖించుచు ధైర్యమూని, ఓయతీశ్వరా! నీవు భద్రముగా నుంటివిగద. నీ వేల దుఃఖించుచుంటివి. మృతి నొందిన నాభర్త ధన్యుడు. నీవంటివాని కాశ్రయ మిచ్చి సద్గతి నొందెను. నేను సనాతనధర్మప్రకారముగ సహగమనము చేసెదను. చితిని బేర్పు మన, నత డాధర్మవాక్కులు విని, యుచిత మని తలచి చితిని బేర్చెను. ఆమె చితిలో ప్రవేశింప, నీశ్వరుడు సాక్షాత్కరించి ధన్యురాలవు! ధన్యురాల! వని ప్రశంసించుచు, ఓపాప రహితురాలా! నీవు నీధర్మము నిలబెట్టుకొంటివి గాన నేను మెచ్చి నీకు వర మివ్వదలచితిని. కోరుకొనుము. నే నివ్వలేని దేదియు లే దన, పరమానందదాయకములగు నాయతివాక్కులు విని యానందపరవశయై యేమియు బలుకక నిశ్చేష్టితవై యుండ, ఏమమ్మా? మాట్లాడవు?

వరము కోరుకొనుము. మీగృహమున కేతెంచిన యతీశ్వరరూపముతో నున్న శంకరుడను. గౌరీపతిని. పరమహంసస్వరూపుడనునేనే! నీభర్త యగు భిల్లుడు నిషధదేశంబున వీరసేను డను రాజునకు నలు డను నామంబున పుత్రుడై జనించును. నీవు విదర్భదేశాధీశ్వరు డగు భీమసేనునకు పుత్రికవై దమయంతీనామంబున జనించి నలునకు భార్యవు కాగలవు. మీ రిరువురు నిర్విఘ్నంబున భార్యాభర్తలై రాజసౌఖ్యము లనుభవించి యోగి దుర్లభము లగు భుక్తిముక్తుల నొందగల రని వరమిచ్చి నిజదర్శన మిచ్చి యచటనే లింగస్వరూపుడై వెలసెను.

ఆ భిల్లాంగన చితియం దాహుతియై భీమసేనపుత్రిక యగు దమయంతియై జనించెను. ఈయతీశ్వరుడు హంసరూపుడై నలదమయంతులకు వివాహసంధానము గావించెను. పూర్వ మీభిల్లదంపతులు యతీశ్వరున కాశ్రయ మిచ్చి సుఖము గల్గించిరి గాన, ఆ యతి హంసయై వీరిరువురకు సంధాన మొనర్చి సర్వసుఖంబులు చేకూర్చెను. శివుని యతీశ్వర, హంసావతారములు, నలదమయంతుల పూర్వజన్మచరిత్ర మతిపవిత్రమైనది. కీర్తిప్రదమైనది. ముక్తి నొసంగును. ఈ యాఖ్యాన మాసక్తితో విన్నచో నాయురారోగ్యైశ్వర్యంబులు గల్గి సర్వకోర్కెలీడేరి, సర్వయశంబులు గల్గి యుత్తమభక్తి గల్గి యిహమున సర్వసౌఖ్యంబులు గల్గి పరమున ముక్తి నొందగలరు.

శివమహాపురాణము నందలి శతరుద్రసంహితయందు
ఇరువది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది తొమ్మిదవ యధ్యాయము

### నభగున కీశ్వరుడు జ్ఞానోపదేశము చేయుట

శ్రాద్ధదేవసుతు లైన ఇక్ష్వాకుడు మొదలగు వారికి నభగుడు నవముడై యుండెను. ఇతనిపుత్రుడు నాభాగుడు. ఇతనిపుత్రుడు విష్ణుభక్తు డగు

నంబరీషుడు. ఇతని బ్రాహ్మణభక్తి దూర్వాసుడు మెచ్చియుండెను. నభగు డంబరీషుని పితామహుడు. శివుడు జ్ఞానోపదేశము చేసిన నభగునిచరిత్ర చెప్పెద, వినుము. ఇతడు మహాజ్ఞాని. మహాబుద్ధిశాలి. ఇతడు చిరకాలము గురుకులవాసము చేసి జితేంద్రియుడై సకలవిద్యల నభ్యసించెను. ఇతని సోదరు లగు నిక్ష్వాకుప్రముఖు లగు నెనమండుగురు తండ్రియాజ్ఞచే తమభాగములను విభజించుకొని ప్రజాపాలన చేయుచుండిరి. బ్రహ్మచారి యగు నభగుడు సాంగోపాంగముగ శ్రుతులన్నియు నభ్యసించి గృహమున కేతెంచి విభక్తు లగు సోదరు లందరిని గాంచి, ఓసోదరులారా! నాకు భాగ మియకుండ మీ రెట్లు విభక్తు లైతిరి. నాభాగము నా కిమ్మన, నీ విచట లేకుండుటచే నిన్ను మరచి, యున్న ఆస్తియంతయు మేమే పంచికొంటిమి. ఇక మిగిలిన మనతండ్రిని నీవు భాగముగా దీసికొనుము. సందేహింపకు మన, నభగుడు భ్రాతృవాక్యములు విని, కడు నాశ్చర్యము నొంది, తండ్రికడ కేగి, ఓతండ్రీ! నాభ్రాత లందఱు నన్ను వీడి దాయము పంచుకొనిరి. నేను బ్రహ్మచారినై గురుకులమునం దుండి, విద్య నభ్యసించి, ఇంటి కేతెంచి, నాభాగము నే నడుగ, నిన్ను మరచితిమి తండ్రియే నీకు భాగ మని చెప్పిరి. గాన నీసేవ చేసికొందు నన, శ్రాద్ధదేవుడు పుత్రవాక్యములు విని యాశ్చర్యము నొంది సత్యధర్మపరాయణు డగు పుత్రునితో నిట్లనెను.

ఓపుత్రా! భోగసాధన మైన భాగము నీకు పంచిపెట్టుచున్నాను. నీవు విచారింపకుము. నీజీవనోపాధికై యుపాయము చెప్పెద, వినుము. బుద్ధిమంతు డగు నంగిరసు డను విప్రుడు యజ్ఞము చేయుచుండెను. ఆమఖమునందు ఆరవ రోజున చేసెడు క్రియలలో నైశ్వదేవసూక్తములు రెండు మరచియుండిరి. నీ వట కేగి యారెండుసూక్తములు పఠించినచో ఆక్రతువు పరిశుద్ధ మగును. జన్మము పూర్తియైనపిమ్మట నావిప్రుడు స్వర్గమున కేగును. అట్టితరి యజ్ఞ శేష మంతయు సంతోషముతో నీ కొసంగును. నీవు నాభాగము కోరితివి గాన, నీ కీయుపాయము చెప్పితిని. వెడలు, మన, నభగుడు తండ్రివాక్యములు విని యాయధ్వరశాల కేతెంచి, వారు మరచిన రెండుసూక్తములు పఠించి యంగిరసుని క్రతువు సమాప్తి చేయ, నంగిరసుడు సత్రావశేష మైన ధన మంతయు నభగున కిచ్చి తాను స్వర్గమున కేగెను. నభగుడు హావశేషధన

మంతయు గ్రహింపుచుండ, అతని పరీక్షింప దలచి శంకరుడు సర్వాంగసుంద రుడై కృష్ణగాత్రుడై సాక్షాత్కరించి నభగుని గాంచి, ఓయీ! నీవెవడవు? ఈ శేషధనమంతయు నాది. నీవు గొంపోవుచుంటివేమి? ని న్నెవరు పంపించిరో నిజము పల్కుమన, నభగు డాపురుషుని గాంచి, యీశేషధన మంతయు నా కంగిరసు డిచ్చియుండెను. నాతండ్రి నన్నిటకు బంపె, నన, ఏప్రమాణముచే ని న్నిటకు బంపెనో నీతండ్రి నడిగి తెలిసికొని అందులసత్యము నాకెరింగింపు మన, నభగుడు తండ్రికడకేగి సర్వము విన్నవింప, నత డిదంతయు గ్రహించి శివపదాంభోజములు స్మరించి, ఓబిడ్డా! నీకు కనబడిన పురుషుడు సాక్షాత్తు శంకరుడు. యజ్ఞము, యజ్ఞభాగములు సమస్తము, నతనిస్వరూపములే. యజ్ఞ పరికరములన్నియు రుద్రభాగములే యని ప్రాజ్ఞులు నుడివియుండిరి. యజ్ఞావ శేషము రుద్రభాగముగ విడిచెదరు. దీని కీశ్వరుడే యర్హుడు. అతడు ని న్ననుగ్రహించుటకై స్వయముగ నేతెంచెను. గాన, నీ వట కేగి క్షమార్పణ వేడి యతనిని స్తుతించి అనుగ్రహమును పొందుము. అతడు సర్వప్రభువు. దేవదేవుడు. యజ్ఞాధీశ్వరుడు. అఖిలేశ్వరుడు. విష్ణుబ్రహ్మాదిదేవత లందఱు నతని యనుగ్రహముచే సర్వకర్మలు చేయుచుండిరి. గాన, నీవు విలంబము చేయక అతనిచెంత కేగు మన, నభగు డీశ్వరసన్నిధి కేగి నతమస్తకుడై కృ తాంజలియై నమస్కరించి వినయాన్వితుడై, ఓప్రభూ! ముల్లోకములందలి సర్వవస్తులు నీవే యని నాతండ్రి చెప్పియుండెను. ఇక యజ్ఞావశేషము నీది గాక మరెవ్వరి దగును? నే నజ్ఞానముచే భ్రమించి పల్కిన వాక్కులను క్షమిం పుము. నీకు శిరము వంచి నమస్కరింపుచుంటిని. నాయపరాధము క్షమింపు మని నభగుడు వేడుకొని, యనేకవిధముల స్తుతింపుచుండ నింతలో శ్రాద్ధదేవు డట కేతెంచి ఈశ్వరునకు శిరము వంచి నమస్కరించి నాయపరాధములు క్షమింపు మని వేడుకొనుచు స్తుతింపుచుండ, నింతలో బ్రహ్మాశుక్రాది దేవతలు సిద్ధులు, మునులు మహర్షులు నట కేతెంచి యీశ్వరు ననేకవిధంబుల స్తుతిం చిరి. పరమాత్ముడగు రుద్రుడు వారలగాంచి సుప్రీతుడై నభగునితో, ఓబిడ్డా! నీతండ్రివాక్కులు సత్యములు. నీవుకూడ సత్యమునే పల్కితివి. నీవ్రతమునకు నేను కడు సంతసించితిని. నీయందు నేను కృపయుంచి సనాతన మైన బ్రహ్మోప దేశము చేసెదను. నీవు మహాజ్ఞానివి. సందేహము లేదు. నేను చెప్పున దం

తయు వినుము, నీవు ఇహమున సర్వసుఖంబు లనుభవించి, నిర్వికారుడవై పరమున నన్ను పొందగల వని, నభగునకు బ్రహ్మోపదేశము చేసి, ఈశ్వరు డదృశ్యుడయ్యెను. విష్ణుబ్రహ్మాది దేవత లాదటను శివు డంతర్హితుడైన దిశకు నమస్కరించుచు వారివారి స్థానముల కేగిరి. తదుపరి నభగుడు తండ్రితో స్వగృహమున కేగి సకలభోగము లనుభవించి యంతమున శివపదము నందుకొనెను. నభగానందదాయక మగు కృష్ణదర్శనేశ్వరావతారము భుక్తిముక్తి ప్రదము, సర్వకామప్రదమునై యుండెను. ఈ చరిత్ర సంధ్యలయందు పఠించినచో మహాకవియై, మంత్రజ్ఞుడై యంతమున శివసాయుజ్యము నొందగలడు.

శివ మహాపురాణము నందలి శతరుద్రసంహితయందు
ఇదివది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

## ముప్పదవ యధ్యాయము

### అవధూతేశ్వరావతారము

ఇటుపై శక్రగర్వాపహారక మగు నవధూతేశ్వరావతారము చెప్పెద, వినుము. ఒకానొకప్పుడు శక్రుడు దేవతలతోను, బృహస్పతితోను, కలసి ఈశ్వరదర్శనార్థమై కైలాసమున కేగుచుండ, వారిని పరీక్షింపదలచి నానాలీలావిశారదు డగు పరమేశ్వరు డవధూతరూప మూని, దిగంబరుడై, జ్వలదగ్నిసమ ప్రభుడై భీమస్వరుడై వారిమార్గమున కడ్డముగ నిలబడి ఉత్తరీయము భుజముపై ధరించి యుండ, శక్రబృహస్పతులు భయంకరాకారపురుషుని మార్గమధ్యమున గాంచి యీశ్వరుం డని గుర్తెరుంగక, శక్రు డధికారగర్వముచే నిట్లుపల్కెను. ఓరీ, నీవెవడవు. నీ వెక్కడ నుండి వచ్చితివి, ఈదిగంబర వేష మేమి, నీనామధేయ మేమి, యథార్థము పల్కుము. పరమేశ్వరు డిపుడు కైలాసమం దుండెనా, లేదా? అతనిం గాంచుటకై మే మేగుచుంటి మన, మదగర్వాపహారకు డగు శంకరుడు శక్రు డీవిధంబున మున్నాగ్రుపల్కినను మౌనము వహించి యూరకుండుటచే త్రిలోకైశ్వర్యగర్వితు డగు శక్రుడు క్రుద్ధుడై

జటాధరుని భయపెట్టుచు, ఓమూర్ఖుడా, నాప్రశ్నలకు సమాధాన మివ్వకుంటి వేమి, నావజ్రాయుధముచే నిన్ను సంహరింప మందువా, లేక ప్రత్యుత్తర మొసగెదవా యని పల్కుచు కోపముచే నాదిగంబరుని సంహరించుటకై వజ్రాయుధము పైకెత్త, లీలాకరు డగు శంకరుడు వజ్రాయుధసహితముగ నతని హస్తమును స్తంభింపజేసి, క్రుద్ధుడై, కరాళాక్షుడై భయంకరుడై, ప్రజ్వలిత తేజోవంతుడై దహించునా యన్నట్లుండ, మంత్రబద్ధసర్పమువలె దేవేంద్రుడు కట్టబడి నిశ్చేష్టుడైయుండ, ఈదిగంబరుడు శివు డని బృహస్పతి తెలుసుకొని యతినికి నమస్కరించి భక్తితో నిట్లు స్తుతించెను.

ఓ దేవ దేవ, మహా దేవ, శరణాగతవత్సలా, గౌరీశ్వర, సర్వేశ్వరా, నీకు నమస్కారము. నీవు ప్రసన్నుడ వగుము. నీమాయచే బ్రహ్మవిష్ణ్వాదులు కూడ మోహితు లగుదురు. నీ యనుగ్రహముచే గాని నిన్ను తెలిసికొన జాల రని పరిపరి విధముల స్తుతించి, తన శక్తి కొలది యింద్రుని ఈశ్వరునిపాదములకు ప్రణమిల్లజేసి, యుదారచిత్తు డగు నాబృహస్పతి కృతాంజలియై, అవనతవదను డై ఓకృపానిధి, ఓమహా దేవ, నీపదములపై ప్రణమిల్లి యున్న దేవేంద్రుని రక్షింపుము. నాపై కోపమూనక నన్నుద్ధరింపుము. నీవు సంతుష్టుడవై దేవేంద్రుని రక్షింపుము. నీఫాలనేత్రమునుండి వహ్ని జనించెను దీనిని శాంతింప జేయుము, బృహస్పతివాక్యములు విని యనఘాత్ము డా సన్న్యాసి యిట్లు పల్కెను. కోపమునను విడిచిన [illegible] గ్రహింపదు, నేను విడిచిన త్రినేత్రాగ్నిని మరల గ్రహింపను, బృహస్పతీ భయము వలదు, భక్తానుకంపుడ నగు నో దేవ దేవ! నీభక్తవాత్సల్యము సఫలము చేసికొనుము, నీయుగ్ర తేజము నిచటనే విడిచి యింద్రుని రక్షింపు మన, భక్తార్తిహరు డగు హరుడు ప్రసన్నుడై, ఓబృహస్పతీ, నన్ను ప్రార్థించి యింద్రునకు జీవదానము చేసితివి గాన, నీవు నేటినుండియు జీవు డని పిలువబడుచుందువు. నా ఫాలనేత్రాగ్నిని ఇంద్రాదులను పీడింపకుండ దూరముగ లవణాంబుధిని పారవేయుదు నని, లవణాంబుధిమధ్యంబున పడవైవ, నా శివ తేజము సాగరమధ్యంబున బాలుడై జనించెను. ఆ సింధుపుత్రుడు జలంధరనాముడై అసురేశ్వరుడై యుండెను. ఈజలంధరుని దేవతలప్రార్థనలచే శివుడే సంహరించెను.

లోకశంకరు డగు శంకరు డీవిధముగ ఘూర్జటావతారము దాల్చి, దేవేంద్రుని గర్వ మణచి యదృశ్యు డయ్యెను. దేవతలు మునీశ్వరులు సంతుష్టులై సుఖముగ స్వస్థానముల కేగిరి. దుష్ట సంహారకుడు, పరమానందదాయకుడు, పరమేశ్వరుడు నగు శంకరుని యొక్క ఘూర్జటావతారము విన్నను, పఠించినను, పాపరహితము, యశోదాయకము, స్వర్గదము, భుక్తిముక్తి ప్రదము సర్వకామ ప్రదమునై యుండెను.

శివ మహాపురాణమునందలి శతరుద్రసంహితయందు
ముప్పదవ అధ్యాయము సంపూర్ణము

## ముప్పది యొకటవ యధ్యాయము

### శంకరుని భిక్షువర్యావతారము

విప్రా నారద! సందేహభంజక మగు శంకరుని భిక్షుకావతారము చెప్పెద, వినుము. విదర్భనగరమున సత్యరథు, శైవధర్మజ్ఞుడు, నగు సత్యరథు డను రాజుండెను. అతడు ధర్మపూర్వకముగ భూమిని పాలించుచుండెను. అతడు శివధర్మపరాయణుడై చాలకాలము సుఖముగ రాజ్యపాలనము చేసెను. కొంతకాలమునకు సాల్వదేశరాజులు విదర్భనగరమును ముట్టడించి సత్యరథుని సేనలతో పోరాడి మరణింప శేషించిన సైనికులు, మంత్రి మొదలగు వారు భయపడి పారిపోయిరి. గర్భవతియై యున్న సత్యరథుని పట్టపురాణి భర్త మరణింపగనే గుప్తమార్గమున నిశీథ సమయమున పురబహిఃప్రదేశమునకు జని శివుని ప్రార్థించుచు తూర్పుదిశగ నరణ్యమార్గమునకు జని శోకసంతప్తయై ప్రాతఃకాలసమయంబున నొకసరోవరము కడ శంకరునిదయచే చేరుకొని యట నొకదట్టమగు వృక్షచ్ఛాయ నాశ్రయించి యొకశుభముహూర్తశుభనక్షత్రమున సర్వలక్షణసంపన్ను డగు పుత్రుని గనెను. పాప మా రాజ్ఞి దాహపీడితయై సరోవరముకడ కేగి జల

పానము చేయుచుండ, దైవవశమున గ్రాహ మొం డేతెంచి యామెను గ్రసించివైచెను. ఈబాలుడు మాతాపితృవిహీనుడై క్షుత్పిపాసలచే రోదనము చేయుచుండ, దయామయు డగు పరమేశ్వరు డిది గ్రహించి భిక్షాటనచే జీవించెడి యొకస్త్రీని ఆమార్గమున తన ప్రేరణచే బంప, నామె తిరిగి తిరిగి దైవప్రేరరణచే నిమార్గమున కేతెంచి యాదినంబున నుద్భవించిన బాలుని గాంచి, ఇత డనాథు డని గ్రహించి జాలిపడి, ఆ విధవాంగన ఈ నిర్జనవనంబున బాలు డెట్లు వచ్చెనా యని యోచించుచు విస్మయ మొందుచు, ఏమియాశ్చర్యము! ఊహింప శక్యము గాకున్న దేమి? నాభినాళముకూడ ఛేదింపక ఈపసివాని నెవ రిట్లు విడనాడిరి? ఈ తేజోవంతుడు మాతృవిహీనుడై పాప మెట్లు దుఃఖించుచుండెనో! ఈబిడ్డకు తండ్రి మొదలగు రక్షకు లెవ రైనను లేరు కాబోలును, కారణ మేమియు తెలియుట లేదు. విధి బలవత్తర మైనది. ఈ పసివానిసంగతి తెలిసినవాడు కూడ లేడు. ఏమి యీదైవమాయ! ఈ బాలుని గాంచినంతనే నాకు దయ పొడముచున్నది. నేను నా కన్నబిడ్డవలె పెంచుకొందును. ఇత డే కులసంజాతుడో తెలియ దని విచారింపుచుండ, దయాకరు డగు శంకరు డీమెయందు దయ జూప నెంచి భిక్షురూప మూని, ఆమెసందేహము దీర్ప నెంచి యామె చెంత కేగి నవ్వుచు, ఓవిప్రభామినీ! నీవు సందేహముతో దుఃఖింపకుము. ఈ పవిత్ర పుత్రుని సందేహింప నీ పుత్రునివలె రక్షింపుము. ఈ శిశువుమూలమున నీవు స్వల్పకాలమునందె సకలశ్రేయస్సుల నొందగలవు. ఈ శిశువును పోషింపు మన, నామె భిక్షువాక్కులు విని, ఓభిక్షువర్యా! నీవు చెప్పి నట్లు ఈశిశువును నాపుత్రతుల్యముగ పోషించెదను. నా భాగ్యవశంబున నా కీ బాలుడు లభించెను. నే నీదారి నెన్నడును రానిదానను, నేడు వచ్చితిని. నిజము తెలిసికొనగోరుచుంటిని. అస లీబాలు డెవడు? ఎవని పుత్రుడు? మీ రిట కేతెంచుటకు కారణ మేమి? మిమ్ము గాంచి నంతనే నాకు జ్ఞానోదయ మగుచున్నది. ప్రభూ? మీరు సాక్షాత్తు శివస్వరూపులు. ఈబాలుడు మీప్రథమ భక్తుడు. ఏ కర్మవశంబుననో, ఈ బాలు డిట్టి గతిని పొందెనుగాని యిటుపై మీకృపాకటాక్షముచే సర్వసుఖంబులు బడయగలడు. మీప్రేరణచే దారితప్పి ఈబాలుని రక్షించుటకై ఇట కేతెంచితి నన,

భిక్షుడు విప్రస్త్రీవాక్కులు విని, ఓ యనఘురాలా! ఈబాలకుని చరిత్ర చెప్పెద, వినుము. ఈబాలుడు సద్ధర్మనిరతుడు. ధీమంతుడు. శివ భక్తుడు. విదర్భరాజాధీశ్వరు డగు సత్యరథుని పుత్రుడు. ఈసత్యరథుడు శత్రువు లైన సాళ్వరాజులచే సంహరింపబడెను. అతనిరాణి యర్ధరాత్రమున నంతఃపురమును వీడి యరణ్యమున ప్రవేశించి యిచ్చోట నీ బాలుని ప్రసవించి దాహార్తయై సరోవరమున కేగ దైవవశమున గ్రాహ మామెను గ్రసించె నని యతడు సర్వము నివేదింప, ఆమె భిక్షువాక్కులు విని, విస్మయము జెంది సిద్ధరూపుడు, జ్ఞానియు నగు నతనితో నిట్లుపల్కెను. స్వల్ప పరాక్రమవంతు లగు సాళ్వులు వీర్యవంతు డగు విదర్భాధీశు నెట్లు సంహరింపగల్గిరి? ఈబాలునితల్లి గ్రాహముచే నెట్లుభక్షింపబడెను? ఈబాలుడు పుట్టుకతోడనే యనాథు డెట్లయ్యెను? దరిద్రురాల నగు నీమహారాజపుత్రు నెట్లు పోషింపగలను? మే మిరువుర మెట్లు సుఖ ముండగలము? అన, భిక్షు డగు నీశ్వరు డామె వాక్కులు విని నవ్వుచు, నో విప్రపత్నీ! నీప్రశ్నలకు సమాధానము చెప్పెదను. సావధానముగ వినుము.

ఈబాలునితండ్రి పూర్వజన్మమున పాండ్యమహారాజు. ఇతడు ధర్మముగ ప్రజలను పాలింపుచుండెను. సర్వోపద్రవముల నశింపజేయుచు ప్రజలను కాపాడుచుండెను. అతడొక మాసశివరాత్రియందున నక్తవ్రతము చేయుచు సాయంప్రదోషసమయంబున నుపవాసముచే శివు నర్చించుచుండ, నొక మహాశబ్దము వీనుల బడ, నతడు శివార్చన పూర్తి గాక మునుపే లేచి గృహబహిర్భాగమున కేగ నింతలో నతనియమాత్యుడు సామంతరాజులను సైన్యమును వెంటబెట్టుకొని యస్త్రశస్త్రంబులతో రాజు కడకు రాగావారందఱు తనకు శత్రువు లని గ్రహించి తనమంత్రియే యీకుట్రకు కారణ మని తలచి కోపమూని యాలోచింపక మంత్రిశిరము ఖండించి యశుచియై ఇంటి కేతెంచి స్నానమైనను చేయక శివపూజ పూర్తి గావింపకయే భుజించెను. పూర్వ మితడు శివపూజ చేసెను గాన, ఈజన్మమున విదర్భదేశాధీశు డయ్యెను. పూజ సమాప్తి గావింపక భుజించెను గాన, సకలభోగము లనుభవించుచుండగ మధ్యలో నితనికి మరణము సంభవించెను. అతడే ఈపుత్రరూపంబున జనించెను. శివార్చన

పూర్తి గావింపకుండుటచే ఈబాలునికి దారిద్ర్యము సంభవించెను. ఈబాలునితల్లి పూర్వజన్మమున కపటముచే సవతిని చంపెను గాన, ఈజన్మమున గ్రాహముచే భక్షింపబడెను. నే నేమి చేయుదును? వారిపాపము వా రనుభవింపక తప్ప దయ్యెను. శివార్చన చేయని వారికి దరిద్రత తప్పదు. నీకుమారుడు పూర్వజన్మమున బ్రాహ్మణోత్తముడై యుండి యజ్ఞయాగాదులు మొదలగు సత్క్రియలు చేయక సదా భిక్షాటనముచే జీవనము గడిపెడువాడు కాన, నీకుమారుడు దరిద్రు డయ్యెను గాన, నీపుత్రునిచేతను ఈరాజపుత్రునిచేతను శివపూజలు చేయింపుము. శివార్చనచే ఈబాలు రిరువురు నైశ్వర్యవంతు లగుదురు. వీ రిరువురకు నుపనయనములు గావింపు మని పలికి తన నిజరూపము జూపింప నామె శంకరుని గాంచి యనేకవిధంబుల స్తుతింప, ఈశ్వరుడు సంప్రీతుడై యదృశ్యు డయ్యెను. ఆవిప్రవనిత ఈశ్వరు డదృశ్యుడైన దిక్కునే గాంచుచు తన కుమారుని రాజకుమారుని తీసికొని, ఏకచక్రపురమందున్న తన గృహమున కేగి, ఉభయబాలురను పోషించుచు విప్రులచే వారికి నుపనయనసంస్కారములు గావించి. వారిచే తన గృహమందే శివపూజలు చేయించుచుండెను. ఈబాలు రిరువురు శాండిల్యమునివద్ద సకలవిద్యలు నేర్చి ప్రదోషసమయంబుల శివు నర్చించుచుండిరి. ఒకదినంబున విప్రకుమారుడు రాకుండగ, రాజకుమారుడు నదికి స్నానార్థమై చన, నట నిధిపూరితమైన కలశ లభ్యము కాగా, దాని నింటికి గొంపోయి విప్రబాలుడు తాను నాల్గుమాసము లాధనముతో శివపూజలు గావించుచు సుఖముగా నుండిరి. వారి శివపూజాఫలితముచే నివ్విధంబున సంప్రాప్తమై మరియొక సంవత్సరము గడిపిరి. తదుపరి రాజపుత్రుడు విప్రపుత్రునితో వనమున సంచరింపుచుండ, దైవప్రేరణచే రాజపుత్రునితండ్రి యొకగంధర్వకన్యకను బంప, నత డాకన్యకను గాంధర్వవిధి నుద్వాహ మాడెను. శివానుగ్రహముచే నాయాదు లితనిరాజ్యమితని కిచ్చిరి. ఇతడు సుఖముగ రాజ్యపాలనము చేయుచు, తన్ను పెంచిన విప్రస్త్రీని తల్లిగను, విప్రపుత్రుని సోదరునిగను భావించి వారికి సకలసుఖములు చేకూర్చుచు, తాను సర్వసుఖంబు లనుభవించుచు, వి

దర్భదేశాధీశ్వరుడై ధర్మగుప్తు డను పేరుతో వర్ధిల్లుచుండెను. ధర్మగుప్తునకు సర్వసుఖంబులు కలుగజేసిన శివుని, భిక్షుకావతారము చెప్పితిని. ఈయాఖ్యాన మతిపవిత్ర మైనది. పాపరహిత మైనది. ధర్మార్థకామ మోక్షసాధన మైనది. సర్వకామప్రద మైనది గానుండెను. ఇది నిశ్చలచిత్తముతో విన్నను పఠించినను నిహమందు సర్వభోగము లనుభవించి పరమందు శివలోక మేగెదరు.

**శివమహాపురాణము నందలి శతరుద్రసంహితయందు**
**ముప్పది ఒకటవ అధ్యాయము**

---

# ముప్పది రెండవ యధ్యాయము

## సురేశ్వరావతారము ఉపమన్యు చరిత్రము

శివుని సురేశ్వరావతారము చెప్పెద, వినుము. ధీమంతు డగు వ్యాఘ్రపాదునకు బుద్ధిమంతు డగు తనయుడు కలడు. ఇతడే ఉపమన్యుడు. ఇతడు జన్మాంతరసుకృతముచే మునికుమారుడై జన్మించెను. ఇతడు బాల్యమునందు తల్లితో మేనమామగృహమున నివసించుచుండెను. ఇతడు దైవవశముచే నతిదరిద్రుడై యుండెను. ఒకనా డితడు తన మేనమామయింట స్వల్పమాత్రముగ క్షీరములు గ్రోలి నాకింకను కావలయు నని మాటిమాటికి నడుగుచుడ,

పుత్రునకు పాలు లే వని చెప్పుటకు నోరాడక, యతనితల్లి ఉంఛవృత్తిచే తెచ్చిన బియ్యమును పిండి చేసి ఆపిండని నీళ్లలో గలిపి ఇవియే పా లని పుత్రున కిచ్చెను. ఇవి పాలు కా వని యుపమన్యు డేడ్వ సాగెను. అపుడు తల్లి పుత్రు నోదార్చుచు, నతనికన్నీరు దుడుచుచు, బిడ్డా! వనవాసుల మగు మనకు పా లెట్లు లభించును? శంభుప్రసాదము లేనిదే మనకు పాలు లభింపవు. పూర్వజన్మమున శివు నుద్దేశించి

యేక్రియ చేయబడునో అదియే యీజన్మయందు సంప్రాప్తమగు నన, మాతృవత్సలుఁ డగు నాబాలుఁడు తల్లివాక్యములు విని శోకరహితుఁడై, తల్లీ! దుఃఖింపకుము. శంకరుఁడు సుఖదాత యనెడు పేరు సార్థక మైనచో నట్టి శంకరుని తపముచే మెప్పించి క్షీరములు గైకొందును. చిరకాలములోగాని, యచిరకాలములోగాని క్షీరార్ణవముచే తెచ్చెద నని తల్లికి నమస్కరించి హిమవత్పర్వతముకడ కేగి, యట వాయుభక్షకుఁడై, సమాహితచిత్తుఁడై, యెనిమిది యిటుకలచే నొక వేదిక నిర్మించి, దానిమధ్య నొక మృణ్మయలింగమును స్థాపించి, శివు నావాహనము చేసి, వన్యపత్రఫలపుష్పంబులచే పంచాక్షరితో నర్చించుచు, శివపంచాక్షరిని జపించుచు, సదాశివుని ధ్యానింపుచు, బహుకాలము గడుప, నితని తపోవేడిమికి చరాచరజగత్తంతయు చలింపసాగెను. ఈతాపము నణపు మని, విష్ణుబ్రహ్మాదు లందఱు శంకరుని ప్రార్థింప, శంకరు డుపమన్యుని పరీక్షింప దలచి, యింద్రరూప మూన, పార్వతి శచీరూపయై, ప్రమథగణము లన్నియు దేవతలై, వృషభ మైరావతమై, యుపమన్యునెదుట నిలబడిరి.

ఇతనిని పరీక్షింప దలచి గంభీరవాక్యములతో సురేశ్వరేశ్వరు డిట్లు పల్కెను. ఓ బాలుఁడా! నీతపమునకు మెచ్చితిని. నీయాప్సితముల నీడేర్చెదను, కోరుకొమ్మన. నుపమన్యుఁడు ఇంద్రరూపుఁ డగు శివుని గాంచి, నమస్కరించి, ఓ దేవేంద్రా! నీవు నన్ననుగ్రహింప దలతువేని, నచంచలమగు శివభక్తిని ప్రసాదింపు మన,

శక్రు డుపమన్యువాక్యములు విని, ఓ బాలకా! నేను త్రిలోకాధిపతిని. సర్వదేవనమస్కృతుఁడను. నీవు నా భక్తుఁడవై సదా నన్నర్చించినచో నీకు సర్వకామ్యములు చేకూర్చెదను. నిర్గుణుఁ డగు శివుని సేవించి నీ వేమిఫల మొందగలవు? అత డేమియు చేయజాలఁడు. అతఁడు పిశాచములచే సేవింపబడుచుండు నన, శివసేవాపరాయణుఁ డగు నుపమన్యుఁడు శక్రవాక్యములు విని, ధర్మమున కిట్టే విఘ్నములు జరుగుచుండు నని యెంచి, పంచాక్షరిని వీడక జపించుచు, నోయింద్రా నిర్గుణపరబ్రహ్మ యగు శివు నిట్లు నిందింపుచుంటి వేల? ఆ దేవదేవుఁడు త్రిమూర్తులను జనింప జేసెను. ఆ దేవ

దేవుని నీ వెఱుంగవు గాబోలును. అతను త్రిమూర్తిజనకుడు. ప్రకృతికంటె పరుడు. సత్తనియు, నవ్యక్తమనియు, నితనిని గూర్చి బ్రహ్మవేత్తలు పల్కుచుందురు. మరియు నితడు నిత్యుడనియు, ఏకుడనియు ననేకుడనియు చెప్పుదురు. నే నట్టిశివునిచే వరములు పడయనుంటిని. అతడు హేతువాదములు వీడి, సాంఖ్యయోగ మాశ్రయించిన నో తెలియబడును. అట్టి తత్త్వజ్ఞుడగు శివునిచే వరములు పడయుదును. సర్వకారణకారణుడగు నతనికంటె పరతత్త్వ మేదియు లేదు. బ్రహ్మవిష్ణ్వాది దేవతలకంటె పరుడగు శివునిచేతనే గాని మరెవరిచేతను వరములు పొందను. నాయభిప్రాయ మెఱింగించెద, వినుము. శివునివినా యే దేవతలైన నుపాసించను. శివనింద వినుటకూడ జన్మాంతరపాప మని తలచెదను. శివనిందను విని వెంటనే ప్రాణత్యాగము చేసినవారలు శివలోక మేగెదరు. నేను క్షీరములకై తపము చేయుచుంటిని గాని, నీయింద్రపదవికై తపంబుచేయుట లేదు. తపోవిఘ్నకరుడవగు నిన్ను శివాస్త్రముచే సంహరించి నేను శివలోక మేగెద నని, యఘోరమంత్రముచే భస్మమును గ్రహించి యింద్రునిపై జల్లి యాగ్నేయాస్త్రముచే యగ్నిని ప్రజ్వరిల్లజేసి, ఆ నాహుతి యగుటకు సిద్ధముగ నుండి, శివుని మనసా స్మరింపుచుండ, నింతలో నింద్రరూపధారి యగు శివుడు నిజరూపము దాల్చి యుపమన్యుని నివారింపుచుండ, నందీశ్వరుడు వీ రుభయులమధ్య ప్రవేశించి యగ్ని నుపశమింపజేసెను. బాలేందుశేఖరుడగు నీశ్వరుడు ఉపమన్యునియెదుట సాక్షాత్కరించి యాబాలుని యింగిత మెఱింగి, సహస్రక్షీరసముద్రములు దధిసముద్రములు భక్ష్యభోజ్యార్ణవంబులు నాబాలునకు జూపించి, వృషభారూఢుడై త్రిశూలహస్తుడై యుమావిఘ్నేశ్వరసహితుడై యాబాలునకు దర్శన మిచ్చెను. బ్రహ్మవిష్ణ్వాది దేవత లందఱు దివినుండి పూలవర్షము కురియింపుచు దశదిశలు వ్యాపించి యీయద్భుత చర్యలు గాంచుచుండిరి. ఉపమన్యుడు సాగరతరంగములవలె నుప్పొంగుచు, శివుని గాంచి భూమిపై బడి సాష్టాంగనమస్కారము చేయ, శంకరుడు బాలుని గాంచి, రా రమ్మని బుజ్జగింపుచు, నో బాలకా! నీదృఢభక్తికి మెచ్చి సంతసించితిని. నీ వీ భక్ష్యభోజ్యము లన్నియు నీబంధువులతో ననుభవింపుము. నీవు నాభక్తి గల్గి దుఃఖవిముక్తుడవై సర్వదా సుఖింపుము. నన్ను నీవు దృఢభక్తిచే తెలిసికొంటివి. ఈపార్వతి నీతల్లి. నేను

నీతండ్రిని. మేము పుత్రవాత్సల్యముతో నిన్ను గాంచుచుందుము. పాలు పెరుగు నెయ్యి తేనె మృష్టాన్నములు భక్ష్యభోజ్యములు నీయెదుట తరగని సాగరం బులై యుండును. నీ కివన్నియు నిచ్చితిని, గ్రహింపుము.

ఇంకను నీ కమరత్వము శాశ్వతగణాధిపత్య మొసగితిని. ఇంకను నీవేది కోరిన నిచ్చెదను. నీ వజామరుడవై దుఃఖరహితుడవై యుండగలవు. మరియు యశోవంతుడవై తేజోవంతుడవై దివ్యజ్ఞానివై మహాప్రభుడవై యుండి పశుపుత్రసుతాదులతో సుఖించుచుందువు. అని ఇంకను పాశుపతవ్రత జ్ఞానము వ్రతయోగము ప్రవక్తృత్వము సమర్థత్వము శివపదము నిచ్చి బాలునిహస్తము బట్టుకొని ముద్దిడి శిరము మూర్కొని యుండ, పార్వతి యాబాలుని ముద్దిడి, మూర్కొని, యుభయహస్తములు బట్టుకొని కుమార స్వామితో తుల్యముగ గాంచెను. శివు డిచ్చిన సాగరము లన్నియు పిండ రూపములు ధరించి శివాజ్ఞచే నట కేతెంచెను. ఈశ్వరుడు వాటిని బాలుని హస్తమం దిడెను. తదుపరి బ్రహ్మవిద్యనుకూడ నిచ్చెను. బాలు డివన్నియు గ్రహించి దేవదేవు డగుశివుని గాంచి, ఓ దేవ దేవ! రక్షింపుము రక్షింపుము. నీయందు నిశ్చలమైన పరమభక్తి నిమ్ము. నీభక్తులయందు శ్రద్ధాభక్తుల నిమ్ము. సదా నీదాస్యము స్నేహము నీసాన్నిధ్యము నిమ్మన, పరమేశ్వరుడు దేవత లందఱు గాంచుచుండగ నుపమన్యుని గాంచి, ఓయుపమన్యూ! నీవు యథార్థముగ నాభక్తుడవు. నీ వడిగిన వన్నియు నిచ్చితిని. నీ వజరామరుడవై నాభక్తప్రవరుడవై యుందువు! నీకులము నీబంధుకులము నక్షయమై వర్ధిల్లు చుండును. నాయందు నీకు శాశ్వతమైన భక్తి యుండును. సదా నీయాశ్రమ మందు నేను వసించుచుందును. నే నివన్నియు సంతోషముతో నిచ్చుచుంటి నని వరంబులిచ్చి తనగణములతో నదృశ్యు డయ్యెను. ఉపమన్యుడు శ్రేష్ఠవరం బుల నొంది సంతోషముతో తల్లికడ కేగి సర్వము విన్నవింప నామె యపరి మితానంద మొందెను. ఈసురేశ్వరావతారము శ్రవణపఠనాదులచే సర్వదా సుఖంబులు గల్గి పాపరహితమై సర్వకామఫలప్రదమై, స్వర్గయశఃప్రదమై, ఆయుష్కరమై, భుక్తిముక్తిఫలప్రదమై యుండును.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు

ముప్పది రెండవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పదిమూడవ యధ్యాయము

## శివుని బ్రహ్మచారి రూపము

పూర్వము సతీ దేవి దక్షసుతయై జనించి తండ్రియాగమునందవమానింపబడి తన దేహము త్యజించి, మేనకాహిమవంతులకు పుత్రికయై జనించి శివుని పతిగా పొందుటకై ఇరువురుసఖులతో విపినంబున కేతెంచి ఘోర తపంబు చేయుచుండ, నామెను పరీక్షించుటకై లీలాకరుడగు శంకరుడు సప్త ఋషులను పంపించెను. వారామెను పరీక్షించి యథార్థ మంతయు శివునితో నుడివి స్వస్థానమున కేగ, శంకరుడు పార్వతిని పరీక్షింపదలచి యద్భుతమైన బ్రహ్మచారిరూప మూని, విప్ర దేహధారియై, ప్రకాశమానుడై, సంతోష హృదయుడై, మహోజ్వలమగు ఛత్రదండముల ధరించి జటాధారియై, గిరిజను సమీపించి, సఖీసమేతయై యున్న పార్వతిని గాంచుచుండ, పరిశుద్ధవేదికో పరిభాగంబున ఆసీనురాలైయున్న పార్వతి చంద్రకళావతంసుడు బ్రహ్మచారి స్వరూపుడు నగు శంభుని గాంచుచుండ, గజచర్మాంబరధరుడు, కమండలుధరుడు, జటాధరుడు నగు శంకరుడు ఆమెను సమీపించుచుండ, పార్వతి యతనిని సత్కరించి పూజించి కుశల మడిగి, అయ్యా, తమ రెవరు? ఎందుండి యింగుల కేతెంచితిరి? ఓ వేదవిదాంవర! మీ తేజముచే నీవన మంతయు ప్రకాశింప జేయుచుంటిరి, అన, బ్రహ్మచారి యామెభావము పరీక్షింపదలచి ఓ భామిని! నేను స్వేచ్ఛాసంచారిని. బ్రహ్మచారిని. బ్రాహ్మణుడను. తపస్విని పరోపకారిని. సుఖప్రదుడను. నే నేమి చెప్పుదును? మహానర్థకర మగు దానిని గాంచుచుంటిని. నీవు నవయౌవనవయస్సులో నుండి సుఖకారకము లగు భోగము లనుభవింపక వృథాగా తపస్సు చేయుచుంటివి. నీ వెవనిపుత్రికవు? ఈనిర్జనవనంబున తపంబు చేయుచుంటివేల? నియమవంతులకు కూడ నలవి కాని తపంబు చేయుచుంటివేల? అన,

గిరిజ బ్రహ్మచారివాక్కులు విని నవ్వుచు ఓ బ్రహ్మచారీ! నా సకలవృత్తాంతము చెప్పెద. వినుము. నేనిభారతవర్షమందు హిమవంతునింట జనించితిని. పూర్వము సతీనామంబున దక్షపుత్రికనై జనించి శంకరపత్నినై యుండి

నాతండ్రి నాపతిని నిందింప సహింపనేరక యోగముచే శరీరము చాలించి పుణ్యావశముచే నిట జన్మించితిని. నేను శంకరునకు సపర్యలు చేయుచుండ, నతఁడు మన్మథుని భస్మము చేసి నన్ను విడనాడి యెచటికేగెనో తెలియదు. నేను చేయునది లేక దుఃఖించుచు వ్రీడితమనస్కనై నాతండ్రిగృహమున కేగ నింతలో నారదుఁ డేతెంచి నాకు శివమంత్ర ముపదేశింపఁ నే నివ్వనంబున ప్రవేశించి త్రికరణశుద్ధిగ శివుని పతిగాఁ గోరి నే నీతపంబు చేయుచుంటిని. నాకాదుర్లభుఁ డగు నీశ్వరు డెట్లు ప్రాప్తించునో తెలియకున్నది. అతనియందు గాఢానురాగనై తపంబు చేయుచుంటిని. విష్ణుబ్రహ్మాదిదేవత లందరిని వీడి కేవలమీశ్వరుడే పతికావలయు నని తపంబుచేయుచుంటి నన, ఆ జటిలుఁడు నవ్వుచు, ఓగిరిరాజపుత్రీ! నీ వింతటి బుద్ధిమంతురాలవై యుండి రుద్రునికై ఇంతతపము చేయుచుంటివా? నే నాతనిఁ బాగుగ నెరుంగుదును. అతనిసంగతి చెప్పెద వినుము. రుద్రుఁడు వృషభధ్వజుఁడు. వికృతాత్ముఁడు. జటాధరుఁడు. ఏకాకి. సదా విరాగి. గాన, నీ వతనిం గోరుట మంచిది గాదు. అతనిరూపమే విరుద్ధము నాకేమాత్రము నిష్టములేదు. తరువాత నీయిష్ట మని బ్రహ్మచారి పార్వతిని పరీక్షింపఁ దలచి శివనింద చేయుచుండ దుస్సహమైన యావిప్రవాక్కులు విని క్రుద్ధురాలై, ఓదుర్మార్గుఁడా! నీవు నాయెదుట శివనింద చేసినందుకు విప్రుడవైతివి గాన బ్రతికిపోతివి. బ్రహ్మచారిరూపంబునఁ వచ్చిన నీవెవరవు? మూఢుఁడవై శివనింద చేసియుంటివి. నీవు శివు నెరుంగవు. నీవు శివబహిర్ముఖుఁడవు. నిన్నెందుకు పూజించితినా యని బాధపడుచుంటిని. తెలియక శివనింద చేసినను జన్మార్జితపుణ్యమంతయు భస్మమగును. శివద్వేషితో సంభాషించినచో ప్రాయశ్చిత్తము చేసికొనవలెను. అతనిని నీవెరుంగవు గాని, నే నెరుంగుదును. అతడు పరాత్పరుఁడు. అతఁ డనేకరూపములు ధరింపుచుండును. అతఁడు సత్పురుషప్రియుఁడు. నిర్వికారుఁడు. నాకత్యంతము నభీష్టంబు లొసంగు నని, యివ్విధంబున పార్వతి పలుక, బ్రహ్మచారి యామెపలుకులు విని మరల శివనింద చేయుచుండ, తనసఖి యగు విజయను గాంచి శివనిందాపరాఙ్ముఖియు శివాసక్తచిత్తయు నగు పార్వతి, ఓసఖి! ఈద్విజాధముని దూరముగ పొమ్మనుము. ఇతఁ డిక్కడ నున్నచో శివనింద చేయుచునే యుండును. కేవలము శివనింద చేసినదానికన్న, శివనింద విన్నచో వెయ్యిరెట్లు మహాపాపము

సంభవించును. శివనిందాపరులను శివ కింకరులే శిక్షించెదరు. ఇతడు విప్రుడు గాన శిక్షింపక విడిచితిని. మరల దుర్భాష లాడకుండ దూరముగ తొలగిపోయుము. ఇతనిని నాదృక్పథమునకు దూరము చేయుము. ఈతడు పోకున్న నేనే పోవుదును. ఈమూర్ఖుని మరల మాట్లాడ చేయకుము. అని యివ్విధంబున బలుకుచు పార్వతి దూరమునకు పోవుచుండ, పరమేశ్వరుడు తన నిజస్వరూపము దాల్చి అవాఙ్ముఖి యగు పార్వతికొంగు బట్టి, ఓపార్వతీ! నన్ను వీడి నీ వెచటికి పోయెదవు? ఓఅనఘురాలా! నీదృఢభక్తికి నేను సంతసించితిని. నీకు నేయలేని దేదియు లేదుగాన, నీచిత్తేప్సితం బగు వరంబును కోరుము. నీతపఃప్రభావముచే నేటినుండి నేను నీకు దాసుడ నైతిని. నీసౌందర్యము గాంచినది మొదలు నాకు క్షణ మొక యుగమగుచుండెను. నన్ను గాంచి సిగ్గుచెందుచుంటివేల? నీవు నాసనాతన పత్నివి. నీవు నావెంట కైలాసమునకు రమ్మన నాదేవి యీశ్వరవాక్యములు విని తన తపఃక్లేశమునంతయు మరచి లజ్జానతవదనయై ఓప్రభూ! నీవు నాయెడల ప్రసన్నుడ వైతివేని నీవు నాకు పతివి గమ్ము. నీవు నన్ను యథాశాస్త్రముగ వివాహమాడి కైలాసమునకు గొంపోవుమనెను. ఇవ్విధంబున దేవకార్యములకై పార్వతి పరమేశ్వరుని పతిగా పొందెను. పార్వతిని పరీక్షించుటకై ఈశ్వరుడు బ్రహ్మచారి యవతారమూనెను. ఈపరమపావన మైన యాఖ్యానము విన్నచో పరమసుఖముల నొంది శివసాయుజ్యము నొందగలరు

శివ మహాపురాణము నందలి శతరుద్రసంహితయందు

ముప్పది మూడవ అధ్యాయము సంపూర్ణము

## ముప్పదినాల్గవ యధ్యాయము

### నటరాజేశ్వరావతారము

శంకరుని నటరాజేశ్వరావతారము చెప్పెద, వినుము. ఇవ్విధంబున శంకరుడు తపంబు చేయుచున్న పార్వతిని బ్రహ్మచారిరూపుడై యామె నవేకవి

థంబుల పరీక్షించి ప్రసన్నుడై వరము కోరు మన, నామె శంకరుని పతిగా కోరి, హిమవంతుని కడ కేగి పార్వతి నిచ్చి యుద్వాహము చేయు మని ప్రార్థించి యతనిగృహస్థాశ్రమము సఫలము చేసి నన్ను సంతసపరుపు మని పార్వతి కోర, శంకరుడు భక్తవత్సలుడు గాన, నట్లే చేయుదు నని శివు డదృశ్యు డయ్యెను. తదుపరి పార్వతి తపము చాలించి గృహమున కేగుచుండ, తలిదండ్రు లీవార్త నెరింగి సపరివారముగ నామెకెదు రేగి తమసౌధమునకు తీసికొని వచ్చి మహోత్సవములు గావించి మేనకాహిమవంతు లాదరములో బ్రాహ్మణులకు యాచకులకు ధనంబులు పంచిపెట్టిరి. తదుపరి మేనక పార్వతితోను, బంధుమిత్రులతోను గృహాప్రాంగణమందు కూర్చునియుండ, హిమవంతుడు స్నానార్థమై గంగ కేతెంచియుండ నింతలో శంకరుడు నటరాజవేషధారియై హిమవద్గృహాప్రాంగణమున కేతెంచి యతిమనోహరముగ నృత్యగానములు చేయుచు వారందరిని మెప్పించుచుండ, మేనక యాతనినాట్యమునకు సంతసించి స్వర్ణపళ్లెరమందు రత్నములు పోసి యానటునకు బహుమానతిగా నివ్వబోవ, నాతడంగీకరింపక పార్వతిని కోర, మేనక కోపించి ఈభిక్షుని గెంటు డని యాజ్ఞాపించుచుండ, నింతలో హిమవంతు డేతెంచి సర్వము నెరింగి నటుని వెలుపలకు గెంటు డని భటులకాజ్ఞాపింప నగ్నితేజోవంతు డగు నతనిదరి కెవ్వరును రాజాల కుండిరి. హిమవంతు డనేకప్రయత్నములచే నితనిని గెంటింప నుద్యుక్తుడు కాగా నత డొకమారు బ్రహ్మరూపము, మరొకమారి విష్ణురూపము, మరియొక తడవ సూర్యరూపము, ఇంకొకమారు పార్వతీసహితు డగు శివరూపమును దాల్చియుండ, మేనకాహిమవంతులు పార్వతికూడ ఇతడు రుద్రు డని యెరింగి, మా యపరాధములు క్షమింపు మని వేడుకొని యతనిని సంతోషపెట్టి తదుపరి పార్వతి నిచ్చి శివునకు వివాహము చేయుదు మని వాగ్దానము చేసిరి. ఇదియే శివుని నర్తకరూపము. పాపనాశకర మగు నీచరిత్ర విన్నచో సర్వసుఖంబుల నొంది శివసాయుజ్యము నొందగలరు.

శివమహాపురాణము నందలి శ్రీరుద్రసంహితయందు
ముప్పది నాలుగవ అధ్యాయము సంపూర్ణము.

---

# ముప్పదియైదవ యధ్యాయము

## వైష్ణవవిప్రరూపావతారము

దేవత లందఱు నిట్లాలోచింపదొడంగిరి. హిమవంతుడు తనతనూజ నీశ్వరున కిచ్చినచో పార్వతితోపాటు తానుకూడ భువియందుండక కైలాసవాసుడై యుండగలడు. తపోవంతుల కాశ్రయు డగు నితడు భువియందు లేనిచో తపోవంతుల నివాసములకు దేవతలవిహారములకు తావుండదు గాన, శివపార్వతుల వివాహము జరుగకుండ జేసినచో నతడు భువియందే యుండగల డనియెంచి, బృహస్పతిని బిలిచి నీవు హిమవంతునింటి కేగి శివనింద చేసినచో, నతడీవివాహమున కంగీకరింప డని, శివనింద చేయుమని బృహస్పతిని వేడ, నత డందుల కంగీకరింపక, శివనింద మహాపాప మనియు, మీ దేవతలందఱు స్వార్థపరు లనియు, బలుకుచు, ఓసురలారా! పరనింద యెంతదూషితమో ఆత్మనింద యంత స్తుతిపాత్రము గాన, నేను పరనింద చేయను, అందును శివనింద అసలే చేయలేను గాన మీ రందఱు శివునికడ కేగి ప్రార్థించి అతనినే హిమవంతునికడ కేగి తననింద తన్నే చేసికొమ్మని చెప్పుడు, దేవత లందఱు శివుని వేడుకొన, శంకరుడు వారల నంగీకరించి వైష్ణవ వృద్ధబ్రాహ్మణవేష మూని, మేనకాహిమవంతులకడ కేతెంచి యనేకవిధంబుల శివనింద చేయుచు, విష్ణువును ప్రశంసింప, మేనకాహిమవంతులు తమ తనూజను శంకరున కిచ్చుతలంపు మానుకొనిరి. తదుపరి ఎట్లనో సప్తఋషులు, అరుంధతి మేనకాహిమవంతుల నొప్పించి శివపార్వతులవివాహము జరిపించిరి. ఇదియే వైష్ణవవిప్రరూపావతారము. దీనితో నీకు 86 శివావతారములు చెప్పితిని. మరియొక శివునియవతారము చెప్పెద, వినుము.

శివమహాపురాణము నందలి శతరుద్రసంహితయందు
ముప్పది యైదవ అధ్యాయము. సంపూర్ణము.

# ముప్పది యాఱవ యధ్యాయము

## శంకరుని అశ్వత్థామావతారము

బుద్ధిమంతుడును దేవర్షియు నగు బృహస్పతియంశచే ద్రోణుడయోనిజుడై జన్మించెను. ఇతనిని భరద్వాజుడు పుత్రునివలె పోషించెను. ఈద్విజశ్రేష్ఠుడు ధనుర్ధరులలో శ్రేష్ఠుడు. అతిశూరుడు. సర్వశాస్త్రవిశారదుడు. మహాకీర్తివంతుడు. తేజోవంతుడు. చతుర్వేదపారగుడు. ధనుర్వేదనిపుణుడునై యుండెను. ఇతడు తన కులకీర్తి నభివృద్ధి చేయుచు, విచిత్రకర్మల చేయుచు, మహాబలవంతుడై, కౌరవులకు గురువై కౌరవులలో నాయకుడు మహారథులలో నితడు శ్రేష్ఠమహారథుడై విఖ్యాతి నొంది, కౌరవ సహాయార్థము పుత్రుని బడయుటకై శివుని గురించి మిక్కిలి తపంబు చేయ భక్తవత్సలుడగు శంకరుడు ప్రసన్నుడై ద్రోణునియెదుట ప్రత్యక్షము కాగా, ద్రోణుడు నతమస్తకుడై స్తుతించి, దోసిలొగ్గి నమస్కరించి స్తుతింప, శంకరుడు సంతసించి నీతపంబునకు మెచ్చితిని. వరము కోరుము మన, నో మహాదేవా! నీయంశజుడు సర్వులకు నజేయుడు నగు పుత్రుని నిమ్మని ద్రోణుడు కోర, శంకరుడు తథాస్తని పల్కి యదృశ్యుడయ్యెను. ద్రోణు డట్టివరము నొంది సంతసించి, ప్రమనస్కుడై తనగృహమునకేగి సర్వము భార్య కెఱింగింప కొంతకాలమున కీశ్వరాంశచే ద్రోణునకు కుమారుడు జన్మించెను. ఇత డతిబలవంతుడై యశ్వత్థామ యనెడు పేరుతో జగద్విఖ్యాతు డయ్యెను.

మఱియు నితడు మహావీరుడై [illegible]ప్రతాపఘ్నుడై శత్రుపక్షక్షయకరుడై భారతయుద్ధప్రఖ్యాతవీరుడై తండ్రియాజ్ఞను పాలించుచు కౌరవసహాయకుడై యుండెను. ఈవీరు నాశ్రయించుకొని కౌరవులందఱు మహాబలవంతులైరి. భీష్ముడు మొదలగు కౌరవు లందఱు నశ్వత్థామసహాయముచే దేవతలను కూడ జయించిరి. ఇతనిభయంబుచేతనే పాండవులు కౌరవులను జయింపలేకుండిరి. శ్రీకృష్ణుని యుపదేశముచే నర్జునుడు శివునిగురించి తపంబుచేసి, శివుని జయించి యతనివలన పాశుపతాస్త్రము నొంది, కౌరవులను జయించెను. శంకరాంశజు డగు నశ్వత్థామ రాజభక్తి జూపదలచి, బలవంతులగు పాండవ

పుత్రులను, ప్రయత్నపూర్వకముగ వధించెను. బలవంతమైన కృష్ణసహాయ మున్నప్పటికి పాండవులను పుత్రశోకాక్రాంతులను చేసెను. అర్జునుడు పుత్రశోకార్తుడై రథముపై కృష్ణునితో జనుచుండ, నర్జునునిపై నితడు బ్రహ్మశిరోనామకాస్త్రము ప్రయోగించెను. ప్రాణాపాయకరమైనదియు దశదిశాప్రకాశమానమైనదియు నగు నాయస్త్రము నర్జునుడు గాంచి, ఓకృష్ణా! ప్రజ్వలితాగ్నివలె నేతెంచుచున్న యీయస్త్రమేమో నాకు తెలియకున్నది. అదిగో, చూడుము మన, శ్రీకృష్ణుడు శివుని ధ్యానించి, అర్జునా! మహాతిశయముతో నేతెంచుచున్న యీబ్రహ్మాస్త్రము అశ్వత్థామచే విడువబడెను. దీనికి తుల్యమగు అస్త్రము మరియొకటి లేదు గాన, నీవు శివుని ధ్యానించి నీ కతడిచ్చిన పాశుపతాస్త్రమును ప్రయోగింపు మన, నర్జును డాయస్త్రమును ప్రయోగింప బ్రహ్మాస్త్రము శాంతించెను. ఇదంతయు శివప్రభావము. ఇతడు సృష్టిస్థితిసంహారకారకుడు. శివాంశజు డగు నశ్వత్థామ నైనాస్త్రమహిమను గుర్తెరింగి, ద్రోణియు ప్రతిక్రియ చేయక శాంతించెను. అనుపమ అశ్వత్థామ కౌరవపక్షపాతియై పాండవవంశము నిర్మూలింప దలచి యుత్తరాగర్భముపై యమనివార్యమైన బ్రహ్మాస్త్రమును విడువ, నప్పుడు ఉత్తర బ్రహ్మాస్త్రముచేత తపింపబడుచు శ్రీకృష్ణుని ధ్యానింప, నతడు పాండవ వంశాంకుర మగు నని తలచి శంకరుని ధ్యానించి మహేశ్వరునిచే ఇంద్రునిచే నీయబడిన సుదర్శన చక్రముచే శ్రీకృష్ణు డుత్తరాగర్భమును రక్షించెను. శివాంశజు డగు నశ్వత్థామను సంతోషపెట్టుటకై పాండవు లశ్వత్థామచరణములకు నమస్కరింప జేయ, నతడు సంతోషించి పాండవుల కనేకవరంబు లిచ్చెను. ఇవ్విధంబున శంకరు డశ్వత్థామరూప మూని భువిలో ననేకలీలలు గావించెను. మహాబలపరాక్రమవంతు డగు నీయశ్వత్థామ త్రిలోకసుఖంబుల నిచ్చుచు జాహ్నవీతటంబున తపమాచరించుచు నేటికిని చిరంజీవియై యుండెను. ఈతనిచరిత్ర సావధానచిత్తులై విన్నచో సర్వసిద్ధిప్రదమై, భక్తాభీష్టఫలప్రదమై ఇష్టసిద్ధుల బడసి శివలోకవాసు లగుదురు.

శివ మహాపురాణమందలి శతరుద్రసంహితయందు

ముప్పదియారవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పదియేడవ యధ్యాయము

## పాండవులకడకు వ్యాసు డేతెంచుట

నందీశ్వరుడు సనత్కుమారునితో మరల నిట్లు చెప్పదొడంగెను. ఓ సనత్కుమారా! ఈశ్వరుని కిరాతాఖ్యానతారము చెప్పెద, వినుము. ఇతడు మూకాసురుని సంహరించి యర్జునునకు వరంబు లిచ్చిన విధానమంతయు జెప్పెదను. పాండవులు సుయోధనునిచే జూదమందు జయింపబడి ద్రౌపదితో ద్వైతవనమందుండి. సూర్యదత్తమైన స్థాలి నాశ్రయించుకొని సుఖముగ కాలము గడుపుచుండిరి. ఇట్లుండ నొకనాడు దూర్వాసుడు దుర్యోధనప్రేరితుడై కపటముగ పాండవులకడ కేతెంచి నేను దశసహస్రశిష్యులతో నేతెంచితిని. మాకు భోజనసదుపాయములు చేయు డని యర్థింప పాండవు లందుల కంగీకరించిరి. దూర్వాసుడు శిష్యులతో స్నానార్థ మేగెను. అక్షయపాత్రయం దన్నము లేదు. పాండవు లిది గాంచి దుఃఖితులై ప్రాణత్యాగము చేయుటకు సిద్ధముగ నుండ, నింతలో ద్రౌపది కృష్ణుని స్మరింప నాతడు ప్రత్యక్షమై పాత్రయందు శేషించిన భక్ష్యశాకమును భుజించి తాను సంతుష్టుడై శిష్యసమేతముగ దూర్వాసుని సంతుష్టుని గావించెను. కృష్ణకృపచే పాండవులు దుఃఖవిముక్తులైరి. పిదప పాండవులు కృష్ణుని గాంచి, కృష్ణా! మాకు శత్రుబల మధికముగ నున్నది. ఇప్పుడు మే మేమి చేయుదుము. ముందు కర్తవ్య మేమని ప్రశ్నింప, కృష్ణుడు వారల గాంచి మీరు భయపడకుడు. మీ కుపాయము చెప్పెద, వినుడు. శివు నారాధించినచో మీ కే కష్టము లుండవు. నే నొకప్పుడు శత్రుబాధల కోర్వలేక, ద్వారక కేగి యుపమన్యుని యుపదేశములచే వటుకపర్వతమందు సప్తమాసములు శివు నారాధింప నతడు ప్రసన్నుడై నాయిష్టకామ్యంబు లన్నియు దీర్చెను. నే నాయీశ్వరప్రభావముచే సర్వకార్యసమర్థుడ నైతిని. భుక్తిముక్తిప్రదుడగు నాదేవుని ఇప్పటికిని సేవించుచునే యుంటిని. సర్వసుఖావహుడైన శంకరుని మీరు కూడ సేవింపు డని పాండవుల నూరడించి, శంకరుని స్మరింపుచు కృష్ణుడు ద్వారక కేగెను. తదుపరి పాండవులు, దుర్యోధనుని గుణగణంబులు, శక్తిసామర్థ్యబలంబులు, పరీక్షించి రమ్మని యొకభిల్లుని

పంప, నతడు దుర్యోధనునికడ కేగి సర్వము నెరిగి, యతనిశక్తిసామర్థ్యం బులు, ప్రజలపొగడ్తలు, దానధర్మంబులు నా భిల్లుడు పాండవుల కెరింగింప పాండవులు భిల్లవాక్యము విని దుఃఖితులై సత్యబంధపాశమున బంధింపబడి యున్న మన మిప్పుడేమి చేయగల్గుదుము? ఏసైన్యబలంబులు లేక మనము యుద్ధ మెట్లు చేయగల్గుదు మని పాండవులు యోచింపుచుండ,

ఇంతలో భస్మభూషితమస్తకుడు రుద్రాక్షాభరణుడు జటాజూటుడునై శివపంచాక్షరి జపించుచు శివప్రేమసమాకుల చిత్తుడై తేజోరాశియై ధర్మదేవతవలె ప్రకాశింపుచు వచ్చుచున్న వ్యాసుని గాంచి, పాండవు లెదురేగి యర్ఘ్యపాద్యము లిచ్చి కుశాసనాసీను జేసి సంతసంబున బూజించి వివిధ ప్రకారంబుల స్తుతించి మీ రాకచే మేము ధన్యుల మైతి మని స్తుతింపుచు, నో మహర్షీ! మీదర్శనముచే మాతపంబులు దానములు ఫలించెను. సఫలమనోరథుల మైతిమి. దుఃఖదూరుల మైతిమి. క్రూరాత్ముల క్రూరకర్మలచే మేము కడు దుఃఖింపుచుంటిమి. మీదర్శనముచే మాసర్వదుఃఖములు నశింప గలవు. సర్వసమర్థు లగు మీరు మాకాశ్రయులై యుండగ, మే మిట్లు దుఃఖించుటకు దైవము ప్రతికూలించుటయే కారణమని తలచుచుంటిమి. మీరాకచే దుఃఖకారణ మైన మాదారిద్ర్యము తొలగి పోవును. మీస్వభావము కల్పవృక్షసదృశము. యదార్థముగ మీ గుణములు గణింప నశక్యము. మనుజుల కాశ్రయములను బట్టి, లఘుగురుత్వములు గల్గుచున్నవి. దీనరక్షణమే యుత్తముల స్వభావము. లోకమున ధనహీనుడై శ్రేయస్సుల నొందగలడు. ఏమన, నితడు తన తోటివారల ప్రేమతో గాంచుచు, అర్థకులను సేవింపుచుండును. ఇట్టివాడు భాగ్యవంతుడైనను దోషరహితుడై యుండును. మీ యాగమనముచే మాకు సర్వమంగళములు చేకూరును. మామనంబులు సంతోషముగ నుండెను. మీయుపదేశములచే మాసర్వదుఃఖములు హరించు నన, పాండవవాక్యము విని వ్యాసుడు ప్రసన్నవదనుడై ఓపాండవులారా! మీరు కష్టము లనుభవించుటకు తగరు. మీరు ధన్యులు. కృతకృత్యులు. మీయందు ధర్మలోపము లేదు. సత్పురుషులు ప్రాణాంతమువరకు సత్యధర్మములను వీడరు. ధర్మము వీడనిచో సత్యము సఫలము నొందును. మీరును, కౌరవులు నాకు

సమానులైనప్పటికి, మీరు ధర్మాత్ములుగాన మీకడ కేతెంచితిని. అంధుడు దుష్టాత్ముడు నైన ధృతరాష్ట్రుడు ముందుగ ధర్మమును వీడి లోభముచే మీ రాజ్య మపహరించెను. మీరును అతనికి పుత్రసమానులే కదా. మీతండ్రి మరణించినతరి మిమ్ముల నతడు పుత్రులవలె పోషించెను. అతడు మీ కనర్థములు చేయకున్నను దుర్యోధనాదులు చేయు ననర్థములు నివారింప లేకుండెను. దుర్యోధనాదులు దుష్టాత్ములు గాన, వారికి పతనము తప్పదు. మీరు ధర్మాత్ములు గాన మీకు విజయము తప్పదు.

మీకు సుఖములు చేకూరును. గాన మీరు దుఃఖింపకుడన, పాండవులు వ్యాసవాక్యములు విని సంతుష్టులై, ఓ తాతా! నీపలుకులు సత్యములు. దుష్టులగు కౌరవులు వనవాసుల మగు మమ్ములను మాటిమాటికి పీడించుచుండిరి. మా యశుభంబులు నశింపజేసి మాకు శుభములు చేకూర్పుము. శంకరుని సదా యారాధింపుమని శ్రీకృష్ణుడు మాకు జెప్పియుండెను. మేము ప్రమాదవశముచే నతనిమాటలు త్యజించితిమి. గాన మీరు మాకు శివారాధన యుపదేశింపు డన, వ్యాసుడు పాండవవాక్యములు విని సంతసించుచు, పాండవులారా! కృష్ణవాక్యములు సత్యము. నేనుకూడ శివునే సేవించుచుంటిని. మీ రతనిని సేవించినచో నతులశుభంబుల నొందెదరు. శివారాధనచే సర్వదుఃఖములు నశించు నని పలికి పంచపాండవులలో శివారాధనకు నర్జునుడే తగినవాడని యెంచి తగిన తపఃస్థాన మాలోచింపుచు, సత్యధర్మపరాయణు లగు పాండవుల నుద్దేశించి, ఓపాండవులారా! హితకర మగు నావాక్యములు వినుడు. బ్రహ్మమొదలుకొని కీటకపర్యంతము గోచరించు జగద్వస్తుజాలము లన్నియు శివమయ మని తెలిసికొనుడు. శివుడు సతాంగతియు పరబ్రహ్మస్వరూపుడు. అట్టిశివుని మీరు పూజించి ధ్యానింపుడు. భక్తితో సేవించినచో నతడు స్వల్పకాలమందే యనుగ్రహించును. శంకరుడు సుప్రసన్నుడైనచో భక్తుల కీయలేని దేదియు నుండదు. అతడిహమందు భుక్తి, పరమందు ముక్తి నిచ్చును. గాన భుక్తిముక్తులు గోరువారు శంకరుని సేవింప వలెను.

శంకరుడు దుష్టసంహారకుడు శిష్టరక్షకుడు నై యుండెను. శివదర్శనార్థమై ముందుగ నింద్రు నారాధింపవలెను. శ్రేయఃకాములగు క్షత్రియులందఱు నిట్లు చేయవలయును. శివుని మెప్పించుటకు జ్ఞానుడే తగినవాడు గాన, ముందుగా నీవు ఇంద్రు నారాధించి యతనిని మెప్పించి యతని విపరీతు కుతృప్తు డైనచో శివసాక్షాత్కారము లభించును. ఇంద్రుడు సుప్రసన్నుడైనచో సర్వవిఘ్నములు నివారించును. అతడే యర్జునునకు శ్రేష్ఠమైన శివమంత్ర ముపదేశించు నని యర్జునుని బిలిచి వ్యాసు డింద్రవిద్య నుపదేశింప, నతడు స్నాతుడై పూర్వాభిముఖుడుగ నావిద్యను పొందెను. తరువాత వ్యాసుడు అర్జునా! నీ వింద్రకీలపర్వతమం దున్న గంగాతీరమున గూర్చుని తపమాచరింపుము. ఈమంత్రప్రభావముచే నీ వెవ్వరికిని కనబడకుందు వని యర్జును నాశీర్వదించి పార్థివలింగార్చనకూడ జెప్పి, పాండుపుత్రులారా! మీరందఱు ధర్మము వీడక ప్రవర్తించినచో మీకు సర్వసిద్ధులు చేకూరు నని వ్యాసుడు పలికి శివస్మరణ చేయుచు నంతర్హితు డయ్యెను.

శివమహాపురాణము నందలి శతరుద్రసంహితయందు
ముప్పది యేడవ అధ్యాయము సంపూర్ణము.

---

## ముప్పదియెనిమిదవ యధ్యాయము

### పార్థునితపస్సు — ఇంద్రోపదేశము

పార్థివపూజచే ప్రకాశించెడు పార్థుని గాంచి, అన్నదమ్ము లందఱు సంతసించి, ఈయర్జునుని తేజము వలన విజయముగాదక మని భావించి యుకార్యము తప్పక నీవే సాధింపగలవు. ఒరులకు సాధ్యము కా దని విజయుని ప్రశంసించుచు, ఫల్గునా! మనకు విజయము చేకూర్పుము. పాండవవిజయ మంతయు నీచేతిలో నున్న దని పలుకుచు, నతని యెడబాటు సహింపనేరక

భీతిల్లుచు పయన మిష్టము లేకున్నను సమ్మతిపరచి ప్రయాణసన్నాహము చేయుచుండ, ద్రౌపది కన్నీరు తుడుచుకొనుచు దుఃఖ మాపుకొనుచు, నాథా! మీ కార్యము సఫల మగుగాక. మీరు వ్యాసోపదేశములు పాటించి కార్యమును సాఫల్యమును చేయుడు. మీమార్గము శుభ మగుగాక, యని పలుకుచుండ, నీకు శంకరుడు సుఖము లిచ్చుగాక, యని వా రందఱు పలికి యర్జునుని సాగనంపి, వియోగమునకు దుఃఖించుచు నటనే నిలిచియుండి, సుహృదునితో కలిసియున్నపుడు దుఃఖములు కల్గినను నంతగా బాధింపవు; మన కిప్పుడితని వియోగముచే ద్విగుణీకృతదుఃఖము సంభవించెను. మన మెంతధైర్యవంతుల మైనను మన కిట్టితరి ధైర్య మెట్లుండు నని దుఃఖించుచుండ, నింతలో వ్యాసమహర్షి యట కేతెంచెను. పాండవు లతనిం గాంచి, యాసన మిడి సత్కరించి దుఃఖించుచు బద్ధాంజలిపుటులై, ఓ తాతా! దుఃఖదగ్ధుల మగు మేము మిమ్ము గాంచినంతనే యానందమగ్నుల మైతిమి. మా దుఃఖశాంతికై కొంతకాలము తమరు మాకడ నుండగోరుచుంటిమి. మీదర్శనముచే మాదుఃఖములు విడిపోవు నన, నా డందుల కంగీకరించి, వివిధాఖ్యానములు జెప్పుచు, వారిదుఃఖములు దూరముచేయుచుండెను. వ్యాసు డనేకగాథలు చెప్పుచుండ, వినుచు, ధర్మరాజువిని తాత్కృతై నమస్కరించి, ఓ మహర్షి! మాదుఃఖశాంతికై మిమ్మొకటి ప్రశ్నించెదను, చెప్పుడు. మేము పొందిన దుఃఖములు మరెవ్వడైనను గలఁడా? ఇట్టిదుఃఖము లెందుచే కే వని తలచుచుంటి నన, ధర్మరాజా! పూర్వము నిషధపతి యగు నలమహారాజు మీకన్న నధికదుఃఖ మనుభవించెను. హరిశ్చంద్రుఁ డంతరికన్న నధికదుఃఖ మనుభవించెను. అతనిదుఃఖము విని దుఃఖింపని వారు లేరు. రామచంద్రు విన్నంతనే స్త్రీపురుషు లందఱు మహాశోకాకు లగుదురు. దుఃఖమునకు మగు నతనిచరిత్ర నేను వర్ణింపలేను. శరీరమే దుఃఖమయ మని యెంచి, మీరు దుఃఖములు వీడుడు.

ప్రపంచమే దుఃఖమయము. మాతృగర్భమం దుండుటయే ప్రథమ దుఃఖము. జన్మించుటయే రెండవదుఃఖము. మూడవ దైన కౌమారావస్థ మరింతదుఃఖము. ఇది బాలలీలలచే నొప్పుచుండును. తదుపరి యౌవనుఁడై

సుఖములిచ్చును గాని ముక్తి నివ్వజాలదు గాన నేదైన శ్రేష్ఠమంత్ర ముపదేశము నొంది జపించినచో నీకు శుభంబులు గల్గు నన, పార్థుడు విప్రవాక్కులు విని, అతని ననాదరదృష్టితో గాంచుచు కోపగించి వినీతాత్ముడై, ఓబ్రహ్మచారీ! నేను కేవలము రాజ్యాభిలాషచే గాని, ముక్తికొరకు గాని, తపముచేయుట లేదు. వ్యాసవచనానుసారముగ నే నీతపము చేయుచుంటిని. నా తపోభంగ మొనర్చినచో నీకు ప్రయోజన మే మున్నది? నీ విటనుండి మరియొకచోటికి కేగు మన, విప్రు డతని నుడువులను సంతసించి యతని కుపకారము చేయదలచి సుందర మగు తన నిజస్వరూపంబు జూపింప, పార్థుడింద్రుని గాంచి లజ్జితుడై యేమియు బలుకలేక యూరకొన, మరల శక్రుడి ట్లనెను. ఓబుద్ధిమంతుడా! ఓధనంజయా! ఓకుమారా! నీ యాప్సితవరము కోరుకొను మిచ్చెదను. నే నీయలేని దేదియు నుండ దన, నో తండ్రీ! శత్రువుల యెడ నాకు సర్వదా విజయ మిమ్మని యర్జునుడు కోర, నోపుత్రా! దుర్యోధనప్రభృతు లగు నీశత్రువు లందఱు బలవంతులు. ద్రోణభీష్మకర్ణాదు లందఱు కడు దుర్జయులు. రుద్రాంశజు డగు ద్రోణపుత్రుడు అశ్వత్థామకూడ మిక్కిలి బలవంతుడు. నేనుకూడ నీహితమును నాశించెదను. నామాట కొంచెము వినుము. అట్టి బలవంతులతో రణ మొనర్ప, నేనుకూడ నీకు జయము చేకూర్పలేను. కేవలము ఈశ్వరుడే నీకు జయము చేకూర్పగలడు. శంకరుడు భుక్తిముక్తిప్రదుడు. చరాచరప్రభువు. సర్వలోకేశ్వరుడు. పరబ్రహ్మ. సర్వకార్యసమర్థుడు నేనును విష్ణుబ్రహ్మాదిదేవతలు నావరప్రభుని సేవించుచుందుము. జయేచ్ఛ గలవా రందఱు శివుని పూజించెదరు గాన, నీవు నేటినుండి శివారాధన చేయుచు శివమంత్రము జపింపుము. శివుని ధ్యానించి యనేకోపచారములచే పూజించినచో నీకు సిద్ధి గల్గు నని, సకల చరాచరంబులను బిలిచి యర్జునుని సర్వదా రక్షింపు డని పల్కి, మరల వాత్సల్యముతో కపిధ్వజుని గాంచి, ఓపుత్రా! యెట్టిపరిస్థితులయందుకూడ నీవు రాజ్యపాలన చేయకుము. నీ విట్లు చేసినచో సర్వశ్రేయస్సుల నొందగలవు. ఎంత ధర్మపరిపాలకు డైనను ప్రజలను మెప్పించుట కష్టము గాన, నీ వెన్నడు రాజ్యాధికారము కోరకుము. సాధకుడు సర్వదా ధైర్యము వహించి, శివుని జపించినచో సర్వసిద్ధులు కల్గును గాన, నీవు శివమంత్రము

జపింపుము. దీనిచే సర్వసంపత్తులు గల్గి తుదకు మోక్షముకూడ సిద్ధించు నని పల్కి శివమంత్రము నుపదేశించి శక్రుడు స్వస్థాన మేగ, గురూపదిష్టప్రకారముగ పార్థుడు శివజపము చేయుచుండెను.

శివ మహాపురాణమునందలి శతరుద్ర సంహితయందు
ముప్పదియెనిమిదవ యధ్యాయము సంపూర్ణము

---

## ముప్పది తొమ్మిదవ యధ్యాయము

### శంకరుని కిరాత రూపము

దేవేంద్రుడు వెడలి కేగినతరి పార్థుడు యథావిధిగ స్నానము చేసి విధిపూర్వకముగ న్యాసములు చేసికొని న్యాసప్రకారముగ భక్తితో శివుని ధ్యానము చేయుచు నేకపాదుడై నిలబడి సూర్యబద్ధ చక్షువులు గలవాడై శివమంత్రము జపించుచుండెను. ఇతడు సర్వోత్కృష్ట మాహాత్మ్యము గలదైన శివపంచాక్షరి జపించుచుండెను. శివధ్యానచిత్తుడై శివజపము చేయుచున్న పార్థుని తేజమును దేవతలు భరింపలేక శంకరుని శరణుపొంద నేగి, తపోనిమగ్నుడై యున్న శంకరుని స్తుతించి, ఓ దేవదేవ! అర్జునుడు మీకై తపము చేయుచుండెను. అతని తపోవేశమునకు మే మోర్వలేకుంటిమి. అతని యీప్సితము నెరవేర్చి మమ్ము రక్షింపు మన శంకరుడు సురల వాక్యములు విని, ప్రసన్నాత్ముడై నవ్వుచు, ఓ సురలారా! మీ కార్యము నేను సమకూర్తును. మీరు స్వస్థానములకు నేగు డన, నిర్జరు లందరు వారి వారి స్థానముల కేగిరి. ఇంతలో దుర్యోధన ప్రేరితుడై మూకు డనెడి దైత్యుడు అర్జునుని తపఃప్రదేశమున కేతెంచి సూకరరూపమూని తనకోరలచే పర్వతశిఖరంబులను వృక్షంబులను పడగొట్టుచు ఘోరశబ్దంబులు గావింపుచు నతివేగంబున పరుగులిడుచుండ, అర్జును డీసూకరంబును గాంచి మనసా శివపదాంబుజములు స్మరించి క్రూరజంతు వెటునుండి వచ్చెను? నా కనిష్టములు ప్రాప్తింపజేయుటకై యిట కేతెంచెను. సందేహము లేదు.

నాకిది శత్రువుగ తోచుచుండెను. నేను పూర్వ మనేక దైత్యదానవులను సంహరించితిని. నాశత్రువులు నాపై పగదీర్చుకొనుటకై దీనిని నాకడకు పంపియుండిరి. లేక దుర్యోధనునిమిత్రు డెవడైనను నాతపోభంగమునకై యిట కేతెంచెనాయేమి? ఎవనిని గాంచినంత నే మిత్రుడుగ దోచునో వాడు తప్పక హితకారు డగును. ఎవనిని జూచినంతనే మనం బాకులత నొందునో వాడు తప్పక శత్రువే యగును.

శ్లో॥ ఆచారః కుల మాఖ్యాతి వపు రాఖ్యాతి భోజనం
వచనం శ్రుత మాఖ్యాతి స్నేహ మాఖ్యాతి లోచనం.

ఆచారమునుబట్టి కులమును, శరీరమునుబట్టి భోజనమును, మాటలచే విద్యయు, నేత్రములచే స్నేహమును తెలిసికొనవచ్చును.

శ్లో॥ ఆకారేణ తథాగత్యా చేష్టయా భాషితేనచ
నేత్రవక్త్రవికారాభ్యాం జ్ఞాయ తేంతర్గతం మనః.

ఆకారముచేతను, నడకలచేతను, భాషణంబులచేతను, నేత్రములవికారంబుల చేతను అంతర్గతమనోభావంబులు తెలిసికొనవచ్చును.

శ్లో॥ ఉజ్జ్వలం సరసం చైవ వక్ర మారక్తకం తథా
నేత్రం చతుర్విధం ప్రోక్తం తస్యభావం పృథక్పృథక్.

శ్లో॥ ఉజ్జ్వలం మిత్రసంయోగే సరసంపుత్రదర్శనే
వక్రంచ కామినీయోగే ఆరక్తంశత్రుదర్శనే.

ఉజ్జ్వలము, సరసము, వక్రము, ఆరక్తకము అను దృష్టి నాలుగువిధము లని బుధులు చెప్పుదురు. మిత్రసంయోగమున నుజ్జ్వలము, పుత్రసంయోగమున సరసము, కామినీయోగమున వక్రము, శత్రుదర్శనమున నారక్తములై నాలుగు విధంబులుగా నేత్రము లొప్పుచుండును. ఈ సూకరమును గాంచినంతనే నా యింద్రియములు వికలత్వము నొందుచున్నవి. గాన వీడు నాకు శత్రువుగ గోచరింపుచుండెను. తప్పక నాకు వీడు వధ్యుడు, సందియము లేదు. నీవు క్షత్రియుడవు గాన నీకు దుఃఖము కలిగించెడి దుష్టులను సంహరింపు మని గురువు నా కుపదేశించియుండెను. గాన తప్పక యితనిని సంహరించెద నని

తనధనువును సంధించియుండ నింతలో శంకరు డర్జునుని పరీక్షింపదలచి, ఆ ఘోరసూకరమును సంహరింపదలచి తాను కిరాతుడై తనగణములన్నియు కిరాతసేవకులై యర్జుననికడ కేతెంచెను. ఆ కిరాతరూపుడగు శంకరుడు కచ్చ బిగించి, యుత్తరీయము నడుమునకు బంధించి, జెండా ధరించి, శరీరమంతయు తెల్లనివిభూతిరేఖలు దాల్చి, ధనుర్బాణధరుడై, పృష్ఠభాగమున నమ్ముల పొది ధరించి భిల్లరాజైన శివుడు గణములతో నేతెంచెను. భిల్లసైన్యగర్జనములు, సూకరగర్జనములు, దశదిశలు నిండి ప్రతిధ్వనించుచుండెను. ఆ ఘోరశబ్దముల కర్జునుడు, పర్వతవాసులుకూడ భయపడసాగిరి. ఇదంతయు గాంచి యర్జునుడు, వ్యాకులత జెందుచు, నేమి యీ ఘోరదృశ్యము? నా కిదివరలో వ్యాసుడు, శ్రీకృష్ణుడుకూడ శంకరు నర్చించినచో సర్వసుఖములు చేకూర్చు నని చెప్పియుండిరి. శివుడు శుభకారకుడనియు, సుఖకరుడనియు ముక్తిప్రదుడనియు, దేవతలుకూడ చెప్పియుండిరి. శివస్మరణ చేసినంతనే యమాంగభయములు తొలగును. శివధ్యానముచే కర్మబంధములగు దుఃఖము లెన్నడు నంటవని కూడ చెప్పియుండిరి. శివధ్యానపరుల కేకొరతలు కలుగవు. సరికదా, సర్వసమృద్ధులు కలుగును. ఇది నాకర్మదోషము కాని వేరు కాదు. ఏన్నాళ్ళదోషమున్నను ఇట్టి అనర్థము చేకూరుచుండును. ఈశ్వరేచ్ఛ కలిగినచో నావిఘ్నము లన్నియు దూరమగును. ఈశ్వరేచ్ఛచే విష మమృతము, అమృతము విషము నగును. అతడు చేయలేని దేదియు లేదు. చేయదలచినది చేయక మానడు. పూర్వభక్తులందరు నావిధంబుననే తలచియుండిరి. భావిభక్తులుకూడ నిట్లే తలతురు. ఈశ్వరకటాక్షమైనచో లక్ష్మి దరిజేరును. మృత్యువు భయపడి తొలగిపోవును. దుఃఖములు నశింపచేయుటకు కూడ నీశ్వరుడే సమర్థుడు. యశంబులు కలిగించుటకు నిందలు కలిగించుటకు నతడే కారకుడు. మనుజుల పుణ్యపాపములబట్టి సుఖదుఃఖంబులు కలిగించుచుండును. భక్తుని పరీక్షించుటకై ఇతడు దుఃఖంబులు కలిగించుచుండును. దయాళువు అంతమందు తప్పక సుఖంబులు కలిగించుచుండును. సువర్ణము పుటము వేసినకొలది నతిగా శోభించునట్లు భక్తుని పరీక్షించినకొలది నతని నిరూఢభక్తి, యచంచలమై యుండును. శంకరసేవకులకు తప్పక సుఖములు చేకూరగల వని మునీశ్వరులు చెప్పగా వింటిని. గాన నాకవశ్యము సుఖములు చేకూరు నని తలచి

పార్థుడు సూకరముపై బాణము విడువ, అర్జునుని రక్షించుటకై శంకరుడు సూకరపృష్ఠభాగమునందు శరము విడిచెను. అర్జునుడు సూకరపురోభాగమునం దుండెను. ఈ ఇరువురిమధ్య సూకరము పర్వతాకారముగ నుండెను. అర్జునుని బాణము సూకరముఖభాగమునను, ఈశ్వరునిబాణము సూకరపృష్ఠభాగమున నాటుకొని, పుచ్ఛమందు వేసిన ఈశ్వరబాణము ముఖమునందుండి వెలుపలకు వచ్చి, భూమిపై పడి లయమయ్యెను. పార్థుడు వేసినశరము సూకరముఖభాగమునుండి పుచ్ఛభాగమున కేతెంచెను. పార్థునిశరము సూకరము పార్శ్వభాగమున గ్రుచ్చుకొని అది నేలబడి మరణించెను. దేవత లిది గాంచి హర్ష మొంది, జయజయధ్వానములు చేయుచు పుష్పవృష్టి గురి యించిరి. కిరాతార్జునులిరువురు, సంతసమునొందిరి. ఈ దైత్యుని గాంచి యర్జును డాశ్చర్యము నొందుచు నేనిందిశను, ఈదానవు డెట్లు వచ్చెను? వీడు నన్ను చంపుటకై వచ్చెనుకాబోలు. శివానుగ్రహముచే నేను రక్షింప బడితిని. ఈశ్వరప్రేరణచే నే నీహింస చేయకలిగితిని. శివసేవ యెంతపని చేసి తిని! తపంబు చేయుచు నే హింస చేసి పాపముగట్టుకొంటి నని పార్థుడు పరి పరివిధంబుల విలపింపసాగెను.

శివ మహాపురాణము సంకలి శతరుద్రసంహితయందు
ముప్పది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

# నలువదవ యధ్యాయము

## భిల్లార్జున సంవాదము

సనత్కుమారా! పరమాత్ముని భక్తవాత్సల్యము, నాతనియద్భుత లీలలు చెప్పెద వినుము. అర్జునుడు తనబాణము తీసికొనుటకై సూకరము కడకు రాగ, నింతలో శంకరుడు తనబాణమును తీసుకొని రమ్మని తన గణాధ్యక్షుని పంప, నర్జునుడు తనబాణమును తీసుకొనెను. గణాధ్యక్షు డిది గాంచి, ఓతపస్వీ! మాశరము తీసికొందువేల, మా కిమ్మన, నోవనచరులారా!

మీ రింత తెలియక మాట్లాడుదు రేల? ఇది నా బాణము, నేనే దానిని విడిచితిని. దాని రేఖ, పింఛములయందు నా పేరు గలదు, చూచుకొనుడు. మీ దుష్టస్వభావమును వీడి, పొండన, గణాధిపతి యగు భిల్లుడు నవ్వెను, ఓ తాపసవేషధారీ నీవు కపటతపస్వివి గాని, యథార్థమైన తపస్వివి గావు. తపస్వి నని మిథ్యాలాపము లాడుచుంటి వేల? నే నేకాకిని గాను. సైన్యాధిపతిని. మా ప్రభువు అనేక భిల్లులతో గూడి యట నుండెను. అతడు నిగ్రహానుగ్రహసమర్థుడు. అతనిదే యీ బాణము. అతని శరము ఆతని కిమ్ము. నీకు బాణము లెక్కడివి? ఈ బాణము నీవద్ద నెన్నడును లేదు. ఓ తాపసా! నీ వనృతమాడి తపఃఫలమును వీడుకొనుచుంటి వేల? నీవు చౌర్యము చేసెదవు, కపటము చేసెదవు సత్యమును పోగొట్టుకొనుచుంటివి. నీ వనృతమాడి తపఃఫలమును ఎందుకు విడిచికొందువు? ఇట్లు వ్యర్థము చేసికొన్నచో నీకు తపఃఫల మెట్లువచ్చును? మా బాణము మాకీయనిచో నీవు కృతఘ్నుడ వగుదువు. ఇది మా ప్రభువు ప్రయోగించిన బాణము. నిన్ను రక్షించిన నా బాణము కూడ నపహరించి యేమిఫల మందెదవు? ఇంత కృతఘ్నుడ వైతి వేల? సత్యము పలుకనిచో తపస్సిద్ధి యెట్లు కలుగును? నీకు బాణముతో ప్రయోజన మున్నచో మా స్వామిని యాచింపుము. ఇట్టి శరములు మా ప్రభువుకడ ననేకములుగ నున్నవి. నీవు కోరినచో నతడీయగలడు. మా రాజుకడకు వచ్చి నీ వెందుల కడుగజాలవు? ఉపకారికి నపకారము చేయుదువా? నీ చపలత్వమును వీడుమన, నర్జునుడు క్రుద్ధుడై, శివుని స్మరించుచు, ఓ భిల్లుడా! నీ వాక్యములు సత్యములు కావు. మీ భిల్లజాతిని నే నెరుంగుదును.

నేను రాజును, మీరు చోరులు. మీతో నేను యుద్ధ మెట్లు చేయుదును? సమానులతో రణము చేయవలయును గాని, యల్పులతో చేయరాదు. మీరు, మీ ప్రభువులుకూడ చోరులు. నేను దాతను. అసత్యవాదు లగు మీతో నాకు పో రెట్లుచిత మగును? మీ భిల్లరాజు నెట్లు యాచింతును? నీవే నీ ప్రభువు నడిగి తీసుకొని రమ్ము. నీ ప్రభు వడిగినచో ననేక బాణములు నేనే ఇవ్వగలను. కాని, మీ ప్రభు విట్టి బాణము ఇవ్వలేను. రాజైనవా డెవ్వడు నితరులకు నిచ్చును గాని, ప్రతిగ్రహణము చేయడు. గాన నేను మీ రాజుకడకు రాను. మీ రాజు

వచ్చి నన్ను జయించి యీ బాణమును తీసుకొని పొమ్మనుము. అంతియేకాని నేను యాచింపను. విలంబము చేయక మీ ప్రభువును త్వరలో రమ్మనుము. నన్ను జయించి తాను స్వస్థానమున కేగవచ్చు నన, భిల్లుడర్జునుని వాక్యములు విని, ఋషీశ్వరా! నీ వజ్ఞానివివలె కనబడుచుంటివేమి? నీవు మరణము కోరుకొందువేల? నీ వీబాణ మిచ్చి సుఖముగా నుండుమన, పార్థుడు శంకరుని స్మరించుచు, ఓవనేచరా! మీ రాజు నాకడకు వచ్చినచో ఫలము చూపింపగలను. నీతో యుద్ధము చేయుట తగనిపని. నీ ప్రభువుతో యుద్ధము సల్పెద, రమ్మనుము. సింహము సృగాలముతో యుద్ధము చేయునా? అపహాస్యము. మీ ప్రభువును రప్పించి, నా బలము చూడు మన, నా భిల్లుడిదియంతయు తన ప్రభువున కెరిగింప, నతడు నవ్వుచు, విస్మయము నొందుచు, భిల్లరూపుడగు శంకరుడు సైన్యముతో నేతెంచుచుండ, పార్థుడు వానిని గాంచి, ధనువున బాణము సంధించి యెదురుగా జని, కదనమున కాహ్వానింప, కిరాతరాజు వని గాంచి, దూతతో నిట్లు కబురుపంపెను. ఓతపస్వీ! నా సైన్యమును చూచితివిగదా! నీకు పోరుట మున్నచో శరప్రయోగము చేయుము. లేనిచో వెనుకకు మరలుము. స్వల్పకార్యమునకై ప్రాణములు త్యజింతువా? నీ సోదరులు, నీ భార్యయు దుఃఖార్తులై యుండి, విజయమంతయు నీ చేతిలో నున్నదని తలంచుచుండి రని శంకరుడు పార్థుని పరీక్షింపదలచి, యనేకవిధంబుల యుద్ధము మానుమని హితము నుపదేశింప, పార్థుడు దూతవాక్కులు విని, ఓ దూతా! మీ ప్రభువాక్కులన్నియు నిపరీతముగ నున్నవి. నా యీశరము మీ కిచ్చినచో, నా కులమంతయు దూషితము చేసినవాడ నగుదును. నా భ్రాతలు దుఃఖింతురు. నే నేర్చిన విద్యయంతయు నిష్ఫల మగును. సింహ మెప్పుడు సృగాలమునకు భయపడదు. వనచరులగు మీచే నా కెన్నడును భయము లేదన, నా దూత యర్జున వాక్కు లన్నియు వివరముగ శంకరున కెరింగింప, నతడు భిల్లసైన్యముతో పార్థుని సమీపించెను.

శివమహాపురాణమందలి శతరుద్ర సంహితయందు
నలువదవ అధ్యాయము సంపూర్ణము

---

మొనరించి, ఓ దేవదేవ! మహాదేవ! కరుణాకర! శంకర! సర్వేశ్వర! నా సర్వాపరాధములు క్షమియింపుము. నీవు మాయారూప మూని నన్ను మాయలో ముంచితివి నే నేమి చేయుదును? సమర్థుడ నగు నీతో నేను యుద్ధము చేసితిని. ఏమి చెప్పుదును? ప్రభూ! యని పార్థుడు పశ్చాత్తప్త హృదయుడై, ఈశ్వరా! యని పదములపై బడ, భక్తవత్సలు డగు శంకరు డర్జును నాశ్వాసించి, నీవు నాకు భక్తుడవు కాన, విచారింపకుము ఇదం తయు నిన్ను పరీక్షించుటకై చేసితిని గాని, వేరు గాదని తన హస్తముచే పార్థుని లేవదీసి. యాదరించుచు, పార్థా! పాండవశ్రేష్ఠా! నేను ప్రసన్నుడ నైతిని. వరము కోరుకొనుము. నీ తాడనప్రహారములకు పూజించినట్లుగ సంతో షించితిని. నేను కోరి తెచ్చుకొంటిని గాని, నీయపరాధ మేమియు లేదు. నే నీయ లేని దేదియు లేదు. కోరుకొనుము. నీవు శత్రువుల జయించి, రాజ్యము స్థాపింప గలవు. [illegible] మన, శంకరా! భక్తప్రియుడవు, శంకరుడవు నగు నీ వీయలేని దే ముండును? నిత్యపాలుత్వము, నన్నీయ [illegible], వేద సమ్మత వాక్యములతో నిట్లు స్తుతింప సాగెను.

శ్లో॥ నమస్తే దేవదేవాయ నమః కైలాసవాసినే
సదాశివ నమస్తుభ్యం పంచవక్త్రాయ తే నమః.

2. కపర్దినే నమస్తుభ్యం త్రినేత్రాయ నమోస్తు తే
మనః ప్రసన్నరూపాయ సహస్రనయనాయ చ.

3. నీలకంఠ నమస్తేస్తు సద్యోజాతాయ వై నమః
వృషధ్వజ నమస్తేస్తు వామాంగగిరిజాయ చ.

4. దశబాహో నమస్తుభ్యం నమస్తే పరమాత్మనే
కపాలడమరుహస్తాయ నమస్తే ముండమాలినే.

5. శుద్ధస్ఫటికసంకాశ శుద్ధకర్పూరవర్ష్మణే
పినాకపాణయే తుభ్యం త్రిశూలవరధారిణే.

6. వ్యాఘ్రచర్మోత్తరీయాయ గజాంబర విధారిణే
నాగాంబర నమస్తుభ్యం గంగాధర నమోస్తు తే.

జయించి విజయము నొందుము. నీకు శ్రీకృష్ణుడుకూడ సహాయము చేయగలడు. నేనుకూడ నతనితో చెప్పెదను. కృష్ణుడు నాభక్తుడు. సర్వకార్యకరణసమర్థుడు. నాప్రభావముచే నీవు నీరాజ్యము నిష్కంటకముగా పరిపాలింపుము. నీవు భ్రాతృసహితుడవై, సర్వధర్మము లాచరింపు మని, శంకరుడు పలికి, తనహస్తముచే పార్థునిశిరము తాకి యాశీర్వదించి యతనిచే పూజింపబడి, యంతర్హితు డయ్యెను.

పార్థుడు పశుపతిచే పాశుపతాస్త్రము నొంది, పశుపతిని స్మరింపుచు, తననిజాశ్రమమున కేగ, నన్నదమ్ములు, భార్యయు పోయినప్రాణము తిరిగివచ్చినట్లు సంతసించి, పార్థవాక్యములు విని, అంతులేని సంతోషము నొందిరి. అట్టితరి దేవతలు వారిపై చందనమిళితమైన సుమవృష్టిని కురిపించిరి. శివుని మెప్పించి యర్జునుడు పాశుపతాస్త్రము పొందివచ్చె నని, తెలిసికొని, శ్రీకృష్ణు డర్జునుని గాంచుటకై వచ్చి యెంతయో సంతసించి, పార్థా! శంకరుడు సర్వదుఃఖాపహారకుడు. అతనిని స్వాయముగ సేవించి సిద్ధులు వడసితివి. పాండవులారా! శంకరుని నేను సదా సేవించుచుందును. మీరుకూడ నతనిని సర్వదా సేవింపు డని పలికెను. ఈచరిత్రము విన్నను, పఠించినను సర్వకోర్కెలీడేరును. ఇప్పటికి 88 శివావతారములు చెప్పితిని.

శివమహాపురాణము నందలి శతరుద్రసంహితయందు
నలువది ఒకటవ అధ్యాయము సంపూర్ణము.

---

## నలువది రెండవ యధ్యాయము

### జ్యోతిర్లింగావతారములు

ఇటుపై శంకరుని జ్యోతిర్లింగావతారములు చెప్పెద, వినుడు.

శ్లో॥ సౌరాష్ట్రే సోమనాథశ్చ శ్రీశైలే మల్లికార్జునః
ఉజ్జయిన్యాం మహాకాలః ఓంకారే చామరేశ్వరః

శ్లో॥ కేదారే హిమవత్పృష్ఠే ఢాకిన్యాం భీమశంకరః
వారణాస్యాంచ విశ్వేశ త్ర్యంబకో గౌతమీతటే

శ్లో॥ వైద్యనాథ శ్చితాభూమౌ నాగేశో దారుకావనే
సేతుబంధేచ రామేశో ఘుశ్మేశశ్చ శివాలయే

శ్లో॥ అవతారాద్వాదశక మేత చ్ఛంభోః పరాత్మనః
సర్వానందకరంపుంసాం దర్శనాత్ స్పర్శనాన్మునే॥

సౌరాష్ట్రమున సోమనాథుడు, ఉజ్జయినియందు మహాకాలుడు, ఓంకారమందు అమరేశ్వరుడు, హిమాలయమున కేదారేశ్వరుడు, ఢాకినియందు భీమశంకరుడు, కాశియందు విశ్వేశ్వరుడు, గౌతమీతటమందు త్ర్యంబకుడు, చితాభూమియందు వైద్యనాథుడు, దారుకవనమందు నాగేశుడు, సేతుబంధనమందు రామేశ్వరుడు, శివాలయమందు ఘుశ్మేశుడు అను నామంబులతో పరమేశ్వరుడు జ్యోతిర్లింగరూపమున నావిర్భవించెను. వీటి దర్శనస్పర్శనలచే నరులకు సకలానందములు కల్గును.

వీటిలో సోమనాథుని పూజించినచో, క్షయకుష్ఠువ్యాధులు నశించును. చంద్రు డీదేవుని పూజించి క్షయనిర్ముక్తు డయ్యెను. శంకరుని సోమనాథావతారము సౌరాష్ట్రదేశమున లింగరూపమై యుండెను. ఈలింగమును చంద్రుడు పూజించి సిద్ధి నొందెను గాన, సోమనాథేశ్వరు డని పేరువచ్చెను. అచ్చట సర్వపాపవినాశకర మగు చంద్రకుండము గలదు. అందు స్నానము చేసిన ధీమంతులు సర్వరోగవినిర్ముక్తు లగుదురు. సోమేశ్వరలింగదర్శనముచే సర్వపాపవినిర్ముక్తులై భుక్తిముక్తుల నొందగలరు.

రెండవది యగు మల్లికార్జునలింగము శ్రీశైలమం దుండి భక్తాభీష్టఫలప్రదుడై యుండెను. ఇతడు తనపుత్రు డగు కుమారస్వామిని దర్శించుటకై యిట వెలసి కుమారుని దర్శించి మరల కైలాస మేగెను. దీని దర్శనమాత్రముచేతనే సర్వసుఖంబులు గల్గి యంతమున ముక్తి కల్గును.

భక్తరక్షణార్థమై శంకరుడు ఉజ్జయినీనగరంబున మహాకాలుడై యవతరించెను. ఒకానొకసమయంబున వేదబ్రాహ్మణనిందకు డగు దూషణు డనెడి

రాక్షసు డుజ్జయినికి సమీపమం దైన రత్నమాలగ్రామమున వేదవిప్రకు మారు డొకడు శివధ్యానపరుడై యుండ నతనిని హింసించుటకై వచ్చెను. భక్తరక్షకు డగు నీశ్వరుడు మహాకాలరూపుడై హుంకారము చేసి ఆరాక్షసుని సంహరించి, ఆవిప్రుని రక్షింప, నట్టితరి దేవత లంతయు నీశ్వరుని నట నుండు మని ప్రార్థింప, పరమేశ్వరుడు జ్యోతిర్లింగస్వరూపుడై మహాకాలు డను నామంబున నటనే స్థిరనివాసుడై యుండెను. ఈలింగదర్శనముచే సర్వ కోర్కె లీడేరి పరమందు ముక్తి లభించును. ఇదిమూడవది.

తదుపరి పరమేశ్వరుడు ఓంకారక్షేత్రమున నమరేశ్వరు డను నామంబున వెలసియుండెను. ఈచతుర్థావతారము భక్తాభీష్టప్రదమై యుండెను. భక్తాభీష్టసిద్ధికై శంకరుడు తనలింగము యథావిధిగ నిల్పి స్థాపించి ఓంకారేశ్వరుడు డని ప్రఖ్యాతి వహించియుండెను. ఇతనిని దర్శించి పూజించినచో సర్వకామ్యము లీడేరి సద్గతి నొందగలరు. వింధ్యనగమున కితడు సర్వకామ్యముల నొసంగెను.

కేదారేశ్వరుని పంచమావతారము చెప్పెద వినుము. ఈశ్వరుడు కేదారమందున జ్యోతిర్లింగమై యవతరించెను. పూర్వము శ్రీమహావిష్ణువు నర నారాయణావతారమును బూని ఈకేదారేశ్వరుని దర్శించి సకలసిద్ధులు పడ సెను. నరనారాయణులకోరికచే శంకరుడు కేదారేశ్వరుడై యట స్థిరముగ నుండెను. ఇతని దర్శనపూజాదులచే సర్వసిద్ధుల నొందగలరు. ఇతడు కేదార ఖండమునకు ప్రభువుగా నుండి సేవించినవారలకు సర్వకామము లీడేర్చును.

ఆరవది భీమశంకరావతారము. భీమాసురుని సంహరించి ఢాకినియందు భీమశంకరరూపుడై వెలసి కామపురియం దున్న సుదక్షిణామహారాజును రక్షించెను. భీమాసురుని వధించెను గాన భీమేశ్వరుడని పేరుపొంది భక్తాభీష్ట ప్రదుడై జ్యోతిర్లింగస్వరూపుడై వెలసెను.

సర్వబ్రహ్మాండరూపు డగు విశ్వేశ్వరావతారము చెప్పెద, వినుము. ఇది సప్తమావతారము. ఇతడు బ్రహ్మవిష్ణ్వాదిదేవతలచే సదా పూజింపబడు చుండును. కైలాసాధిపతి యగు శంకరుడు కాశియందు భైరవమూర్తిగను,

విశ్వేశ్వరజ్యోతిర్లింగముగను గలసియుండెను. ఇతడు ఈ కాశీపురియందుండి భక్తులకు సర్వకామ్యము లొసంగుచు, అట మరణించినవారి కందరికి ముక్తి నొసంగుచుండును. కర్మలు చేయుచు ఫలములు గోరక కాశీ, కాశీ యనియు, విశ్వేశ్వర, విశ్వేశ్వర యని జపించినచో తప్పక ముక్తి లభించును.

గౌతమీతటమునందున్న శంకరుని త్ర్యంబకావతారము చెప్పెద, వినుము. ఇది యెనిమిదవది. గౌతమముని ప్రార్థనచే శంకరుడు గౌతమీతటంబున ఆవిర్భవించెను. ఇతని దర్శన,స్పర్శనాదులచే ముక్తి కలుగును.

ఈలింగార్చనలచే సకలాభీష్ట సిద్ధిని నొందగలరు. శంకర ప్రియురాలగు గంగ గౌతమీనామంబుతో గౌతమప్రీతికై త్ర్యంబకేశ్వరుని సాన్నిధ్యమున ప్రవహించుచుండెను.

తొమ్మిదవది యగు వైద్యనాథావతారము చెప్పెద, వినుము. లీలాకరుడగు శంకరుడు రావణప్రీతికై చితాభూమియందు ఆవిర్భవించెను. ఇతడు జగత్త్రయంబున వైద్యనాథుడని కీర్తిగాంచెను. ఈలింగదర్శన, పూజాదులచేతను, ఇతని చరిత్ర శ్రవణ, పఠనాదులచేతను, భుక్తిముక్తుల నొందగలరు.

దుష్టశిక్షణకు, భక్తరక్షణకు, ఆవిర్భవించిన శంకరుని నాగేశ్వరావతారము చెప్పెద, వినుము. ఇది పదియవది. ఇతడు ధర్మఘాతకుడైన దారుకుడనెడి రాక్షసుని సంహరించి భక్తుడగు వైశ్యనాథుని రక్షించెను. ఈపరమేశ్వరుడు లోకోపకారమునకై జ్యోతిర్లింగమై వెలసి యంబికతో కూడి నాగవనమునందుండెను. ఈనాగేశ్వరుని దర్శించినచో మహాపాతకములు నశించును.

శివుని ఏకాదశావతారము చెప్పెద, వినుము. రామచంద్రప్రియకరుడు, రామచంద్రస్థాపితుడునై, రామలింగేశ్వరావతారమాయెను. రామస్థాపితమైన ఈలింగమునుండి శివుడావిర్భవించి రామా, నీకు జయమగుగాక, యని పలికెను. రాముడు సేతుబంధన సమయంబున తన విజయమునకై ఈ లింగమును స్థాపింప శంకరుడు జ్యోతిర్లింగమై యట వెలసెను. ఈరామలింగేశ్వరుడద్భుతమహిమవంతుడై సర్వదా భక్తకామప్రదుడై భుక్తిముక్తుల నిచ్చుచుండును.

రామలింగేశ్వరునకు గంగాజలము నభిషేకించినచో జీవన్ముక్తుడై ఇహమందు సకలభోగము లనుభవించి పరమందు కైవల్యము నొందగలరు.

నానాలీలాకరుడగు పరమేశ్వరుని పండ్రెండవది యగు ఘుశ్మేశ్వరావతారము చెప్పెద, వినుము. దక్షిణదిశయందు దేవనగసమీపమందున్న సరోవరంబున ఘుశ్మేశ్వరుడు జ్యోతిర్లింగస్వరూపుడై వెలసెను. ఇతడు సుధేహ్ముడను దైత్యుని సంహరించి భక్తుడగు ఘుశ్మపుత్రుని రక్షించి, వారి ప్రార్థనలచే నిత డాసరోవరమందే నిలిచియుండెను. ఈజ్యోతిర్లింగస్వరూపు డగు ఘుశ్మేశ్వరుని సేవించినచో భుక్తిముక్తులు కలుగును. భుక్తిముక్తిప్రదంబు లగు నీద్వాదశజ్యోతిర్లింగావతారములు విన్నను పఠించినను సర్వపాపవిముక్తులై భుక్తిముక్తుల నొందగలరు. సర్వకామప్రద మగు శతరుద్రావతారములు వర్ణించి యుంటిని. ఈశతాంశావతారములు సమాహితచిత్తులై భక్తిశ్రద్ధలతో పఠించినను, విన్నను సర్వకామ్యము లీడేరి యిహాముత్రార్థఫలభోగము లొందెదరు.

## గద్యము

శ్రీవసిష్ఠ గోత్రపవిత్ర, యేలూరిపాటి నృసింహ సత్పౌత్ర ముఖరాజ ధర్మపత్నియు, చావల్యుపనామక యజ్ఞేశ్వరసోమయాజి అన్నపూర్ణాదంపతుల గర్భశుక్తిముక్తాఫలంబును, నగు శ్రీమతి యేలూరిపాటి లక్ష్మీసరస్వతిచే నాంధ్రీకరింపబడిన శ్రీశివమహాపురాణమందలి శతరుద్రసంహిత సమాప్తము.

శ్రీసాంబ సదాశివార్పణమస్తు.

మంగళం మహత్.

శ్రీ గణేశాయ నమః

# ఆంధ్రవచన శివమహాపురాణము

## కోటిరుద్ర సంహిత

## ప్రథమాధ్యాయము

ధ్యానము

శ్లో॥ యోఽధత్తే నిజమాయయైవ భువనాకారం వికారోజ్ఝితః
యస్యాహుః కరుణాకటాక్షవిభవౌ స్వర్గాపవర్గాభిధౌ
ప్రత్యగ్బోధసుఖాద్వయం హృది సదా పశ్యంతి యం యోగినః
తస్మై శైలసుతాంచితార్ధవపుషే శశ్వన్నమస్తేజసే

శ్లో॥ కృపాలలితవీక్షణం స్మితమనోజ్ఞవక్త్రాంబుజం
శశాంకకలయోజ్జ్వలం శమితఘోరతాపత్రయం
కరోతు కిమపి స్ఫురత్పరమసౌఖ్యసచ్చిద్వపుః
ధరాధరసుతాంబుజోద్వలయితం మహామంగళం

ఎవడు వికారరహితుడో, ఎవడు తనమాయచే సకలజగత్తును ధరించుచుండెనో, ఎవని కరుణాకటాక్షములచే స్వర్గాపవర్గములు ప్రాప్తించుచున్నవో, యోగీశ్వరు లెవనిని హృదయమునందు గాంచుచుందురో, యెవ డర్ధనారీశ్వరుడో, అట్టి తేజోవంతు డగు శంకరుని సదా నమస్కరించుచున్నాను.

కృపాకలితవీక్షణుడును, మనోహరమందస్మితవదనుడును, చంద్రకళచే ప్రకాశించువాడును, ఘోరతాపత్రయములను శమింపజేయువాడును, ప్రకాశమానుడు, పరమసుఖదాయకుడు, సచ్చిదానందరూపగాత్రుడు, హిమశైలసుతాలింగితుడు నగు శంకరుడు నాకు మంగళమును చేకూర్చుగాక.

శౌనకుడు సూతు నిట్లు ప్రశ్నించెను. ఓ సూతమహర్షీ! నీవు లోకహితమునకై యనేకశివావతారములు చెప్పియుంటివి. ఇపు డుత్తమంబైన శివలింగచరిత్రలు నాకు జెప్పుము. నీవు ధన్యుడవు. నీ ముఖాంభోజవినిర్గతగాథ

లెన్ని విన్నను నాకు తృప్తి లేకుండెను. రమ్యమగు శివయశోమృతగాథలు మరల మాకు వినిపింపుము. పృథ్వియందు శుభప్రదములైన యేయేలింగములు, ఏయేతీర్థములు కలవో, యింకను ప్రసిద్ధములైన వేవేవి కలవో పరమేశ్వరుని దివ్యలింగము లెచ్చటెచ్చట కలవో యవన్నియు విశదముగ వివరింపు మన, సూతు డిట్లు చెప్ప దొడంగెను. ఓ ఋషిశ్రేష్ఠులారా! లోకహితమునకై మీరు బాగుగ ప్రశ్నించితిరి. మీయందలి ప్రేమచే వానిని సంక్షేపముగా కొన్ని చెప్పెదను. పూర్తిగా నన్నిలింగముల సంఖ్య చెప్పుటకు నేనసమర్థుడను. సర్వజగత్తులు, భూమియుకూడ లింగమయమై యుండెను. కొన్ని లింగములతో కూడిన తీర్థములు, కొన్ని తీర్థములులేని లింగములు, కలవు. అనగా నుదకమయమైన తీర్థములు కొన్ని, లింగమయమైన తీర్థములు కొన్నియు కలవు. ఏది కనిపించునో అది వర్ణించి చెపుటకు వీలగును. ఈదృశ్యమంతయు శివరూపమేగాని వేరు గాదు. నేను విన్న దంతయు చెప్పెద, వినుడు. ముల్లోకములు లింగములతో నిండియుండెను. శంకరుడు దేవాసురమనుజులచే, సర్వత్ర పూజింపబడుచుండును. ఇతడు భువి మనుజులను, దివి దేవతలను రసాతలమున రాక్షసుల ననుగ్రహించుటకై లింగరూపములుగ నావిర్భవించి యుండెను. ఎక్కడెక్కడ శివభక్తులు శివుని భజింపు చుండిరో, అక్కడక్కడ శివుడు లింగరూపుడై వెలసి వారి ననుగ్రహించుచుండెను. శంకరుడు లోకోపకారమునకై తన లింగములను కల్పించి యుండెను. ఇట్టి లింగములను పూజించినవారలు సర్వసిద్ధులు బడయుచుండిరి. పృథ్వియందున్నలింగసంఖ్య నెవడును గణింపలేరు కాని, వానిలో ప్రధానలింగములు వివరించి చెప్పెద, వినుండు. ఈప్రధానలింగాఖ్యానములు విన్నచో సర్వపాపవిముక్తు లగుదురు. అతిముఖ్యమగు జ్యోతిర్లింగముల చెప్పెద, వినుడు. ద్వాదశజ్యోతిర్లింగస్థానములు మీ కిదివరలో చెప్పియుంటిని. వాటిని ప్రాతఃకాలమున పఠించినచో సర్వపాపములు నశించి సర్వసిద్ధులు కలుగును. మరియు నెవడు ఏయేకోరికలతో పఠించిన నాయాకోరికలు తప్పక ఫలించును. నిష్కాముడై పఠించినచో మరల మాతృగర్భమున జన్మింపడు. సర్వులు ఈలింగములను పూజింప వచ్చును. పూజించినవారలు సర్వదుఃఖములు నశించి భుక్తిముక్తుల నొందగలరు. ఈద్వాదశ జ్యోతిర్లింగనైవేద్యాన్నములు

భుజించినచో సర్వపాపములు క్షణములో నశించును. ఈ జ్యోతిర్లింగముల మాహాత్మ్యము బ్రహ్మాదులైనను నుడువ లేరు. ఇతరులమాట చెప్పనేల? వానిలో నేయొక్క లింగమైనను నారుమాసములు సేవించినచో సర్వ దుఃఖములు నశించి మాతృగర్భ నరక మెన్నడును పొందడు. ఎంత హీనజన్ము డైనను జ్యోతిర్లింగమును దర్శించినచో సత్కులసంజాతుడై, ధనాఢ్యుడై, వేదపారగుడై, శుభకర్మలు చేసి ముక్తినొందగలడు. మఱియు మ్లేచ్ఛు డైనను, అంత్యజు డైనను, నపుంసకు డైనను, జ్యోతిర్లింగములను దర్శించి నచో మఱుజన్మమున ద్విజుడై ముక్తి నొందగలడు. జ్యోతిర్లింగములను గూర్చి చెప్పితిని. వాని యుపలింగములను గూర్చి చెప్పెద, వినుము.

మహాసాగరసంగమమున నంతకేశ్వరు డను పేరుతో సోమేశ్వరుని కుపలింగమై వెలసెను. మల్లికార్జునున కుపలింగము భృగుకక్షప్రదేశమున రుద్రు డను పేరుతో వెలసియుండెను. మహాకాలున కుపలింగము నర్మదానదీ తీరంబున దుగ్ధేశ్వరనామంబున వెలసియుండెను. ఓంకారేశ్వరున కుపలింగము కర్దమేశ్వరు డను పేరుతో బిందుసరోవరంబున వెలసి, సర్వకామప్రదుడై యుండెను. కేదారేశ్వరున కుపలింగము యమునాతటంబున వెలసి, దర్శించి, యర్చించినవారలకు, మహాపాతకంబుల నశింపజేయుచుండెను. భీమశంకరున కుపలింగము భీమేశ్వరు డని పేరుజెంది సహ్యాచలసమీపంబున ప్రసిద్ధనాముడై దర్శించినవారలకు బలము చేకూర్చుచుండును. నాగేశ్వరున కుపలింగము భూతేశ్వరనాముడై, మల్లికాసరస్వతీతీరంబున వెలసి దర్శనముచేతనే నరకి పాపములు నశింపజేసి, సర్వకోర్కెలీడేర్చుచుండెను. రామేశ్వరున కుపలింగము గుప్తేశ్వరనామంబున వెలసెను. ఘుశ్మేశ్వరున కుపలింగము వ్యాఘ్రేశ్వర నామంబున వెలసెను. జ్యోతిర్లింగోపలింగములు చెప్పితిని. వానిని దర్శించి నచో మహాపాతకములు నశించి సర్వకామ్యము లీడేరును. ఇంకను నితరము లైన ముఖ్యలింగములు గూడ చెప్పెద, వినుము.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ఒకటవ అధ్యాయము సంపూర్ణము.

## రెండవ యధ్యాయము

### పూర్వదిశ నుండు శివలింగములు

ఈశ్వరుడు కాశియందు కోటిలింగములతో స్థిరనివాసుడై గంగాతీరమం దుండెను. ఆ యవిముక్తక్షేత్ర మంతయు నెటు గాంచినను లింగమయమై యుండెను. ఆపురియందు నొక ముఖ్యలింగము విశ్వేశ్వరనామంబుతో నుండెను. అట నున్న వృద్ధులు బాలురు కూడ విశ్వేశ్వరతుల్యులై యుండిరి. దశాశ్వమేధఘట్టమందు తిలభాండేశ్వరలింగ ముండెను. గంగాసాగరసంగమమున సంగమేశ్వరలింగ ముండెను. దానినే భూతేశ్వరలింగ మనికూడ చెప్పెదరు. కౌశికీతీరంబున నారీశ్వరు డను పేరుతో నుండెను. గండకీతీరంబున వటుకేశ్వరనాముడై యుండెను. ఫల్గునీతీరంబున పూరేశ్వరనామంబుతో నుండెను. ఇతడు దర్శనమాత్రముచే సిద్ధి నొసంగువాడు కావున సిద్ధేశ్వరుడని కూడ పిలువబడుచుండెను. ఈపట్టణమున నుత్తరభాగమున దూరేశ్వరుడు గలడు. దధీచిరణస్థలంబుల శృంగేశ్వరుడు, వైద్యనాథుడు, యజ్ఞేశ్వరుడు నను నామంబులతో లింగత్రయ ముండెను. మఱియు నితరప్రదేశములందు గోపేశ్వరుడు, రంగేశ్వరుడు వామేశ్వరుడు, నాగేశ్వరుడు, కామేశ్వరుడు, వాగీశ్వరుడు, సుభేశుడు, భాండేశ్వరుడు, హుంకారేశ్వరుడు, సురోచనుడు, భూతేశ్వరుడు, సంగమేశ్వరుడు నను పేర్లతో వెలసి మహాపాతకములను నశింపజేయుచుండెను. తప్తకాతీరమున కుమారేశ్వరుడు, సిద్ధేశ్వరుడు, రామేశ్వరుడు, కుంభేశ్వరుడు, నందీశ్వరుడు, పుంజేశ్వరుడు, పూర్ణేశ్వరుడు నను నామంబులతో లింగరూపుడై భువి నుండెను. మఱియు ప్రయాగయందు బ్రహ్మచే స్థాపింపబడి బ్రహ్మేశ్వరనామంబుతో నుండెను. కాశియందు దశాశ్వమేధఘట్టంబున చతుర్వర్గఫలంబుల నిచ్చుచు సోమేశ్వరుడని ప్రసిద్ధనాముడై యుండెను. ఇంకను భరద్వాజేశ్వరు డను నామంబుతో బ్రహ్మతేజంబు నభివృద్ధిజేయుచుండెను. శూలటంకేశ్వరుడు సర్వకామంబు లీడేర్చుచుండును. మాధవేశ్వరుడు భక్తరక్షకుడై యుండెను. సాకేతపురియందు నాగేశ్వరలింగము సూర్యవంశపురాజులను రక్షించుచుండును. పురు

షోత్తమపురంబున భువనేశ్వర నామంబున సిద్ధుల నొసంగుచుండును. లోకేశ్వరు డను మహాలింగము సర్వానందప్రదుడై యుండెను. కామేశ్వరుడు, గంగేశ్వరుడు, పర్వులను పరిశుద్ధుల జేయుచుండెను. శుక్రుడు లోకహితమునకై శుక్రలింగమును స్థాపించెను. సింధుతీరమున సర్వకామప్రదు డగు వటేశ్వరుడు సర్వపాపహరు డగు కపాలేశ్వరుడు వక్త్రేశ్వరుడు ధూతపాపేశ్వరుడు, భీమేశ్వరుడు సూర్యేశ్వరుడు జ్ఞానప్ర డగు నందీశ్వరుడు, నాకేశ్వరుడు, రామేశ్వరుడు, విమలేశ్వరుడు, కంఠకేశ్వరుడు, అను నామంబులతో వెలసి సర్వసిద్ధుల నొసంగుచుండెను. పూర్వసాగరసంగమమందు ధర్మకేశ్వరుడు, చంద్రేశ్వరుడు, సిద్ధేశ్వరుడు, బిల్వేశ్వరుడు, అనునామంబులతో వెలసి సర్వసిద్ధుల నొసంగుచుండెను. పూర్వము అంధకాసురుని సంహరించిన ప్రదేశమున నంధకేశ్వరు డావిర్భవించెను. ఇంకను శరణేశ్వరుడు, కర్దమేశ్వరు డను లింగములు కలవు. మఱియు నర్మదాచలమందు కోటీశుడు, అచలేశుడు అను నామంబులతో లోకహితకరుడై యుండెను. కౌశికీతీరంబున నుత్తరభాగంబున నాగేశ్వరుడు గలడు. ఇతడనంతేశ్వరు డను నామంబున శుభకల్యాణము లొసంగుచుండును. ఇంకను యోగేశ్వరుడు, వైద్యనాథేశ్వరుడు, కోటీశ్వరుడు సప్తేశ్వరుడు, భద్రేశ్వరుడు, చండీశ్వరుడు, సంగమేశ్వరుడు అను లింగములు కలవు. ఇవి పూర్వదిగ్భాగమందలివి; ఇక దక్షిణదిశయం దున్న శివలింగములు చెప్పెద వినుము.

శివ మహాపురాణమందలి కోటిరుద్రసంహితయందు
రెండవ అధ్యాయము సంపూర్ణము

---

# మూడవ యధ్యాయము

## దక్షిణదిశయం దుండు శివలింగములు

చిత్రకూటనగంబున బ్రహ్మగిరియందు బ్రహ్మచే స్థాపితమైన మత్తగజేంద్రేశ్వరలింగము కలదు. ఇది సర్వకామసమృద్ధికరమై యుండెను. దానికి

పూర్వభాగంబున సర్వవరప్రద మైన కోటీశలింగము గలదు. గోదావరికి పశ్చిమభాగంబున పశుపతిలింగము గలదు. దక్షిణభాగమున నత్రీశ్వరలింగము గలదు. ఈలింగము లోకోపకారమునకు, ననసూయసుఖముకొరకు నత్రి స్థాపించెను. అనావృష్టి సంభవించినపుడు ఈలింగమును పూజించినచో సువృష్టి కలుగు నన శౌనకాదులు మఱల నిట్లు ప్రశ్నించిరి. ఓమహాభాగా! ఓసూతమహర్షి! అత్రీశ్వరాఖ్యానము మాకు జెప్పు మన, సూతు డిట్లు చెప్పదొడంగెను. ఏకథ సతతము విన్నచో సర్వపాపవిముక్తు లగుదురో అట్టి శివగాథ చెప్పెద, వినుడు. దక్షిణదిశయందు కామదమన మనెడి వనము గలదు. అది చిత్రకూటసమీపముగ నుండి తాపసుల కనుకూలముగ నుండెను. అట విప్రశ్రేష్ఠు డగు నత్రి తనధర్మపత్ని యగు ననసూయతో కఠినతపము చేయుచుండెను. అట్టిసమయంబున దైవప్రతికూలముచే శతవర్షములు అనావృష్టి కలిగి సకలజీవులు దుఃఖింప సాగిరి. సరస్సు లన్నియు శుష్కించి పల్లవఫలంబులు లేక శూన్యమై యుండెను. నిత్యకృత్యములు దీర్చుకొనుటకు కూడ జలము లోపించెను. దశదిశలు వేడిగాల్పులే కాని, చల్లని వాయువులే లేవు. భూమి తడి యున్నది లేకుండుటచే జీవులు హాహాకారములు చేయుచుండిరి. పతివ్రత యగు ననసూయ యీక్షామము గాంచి సహింప లే నన, నత్రి ముమ్మారు ప్రాణాయామము చేసి సమాధియం దుండి హృదయంగతు డైన పరమాత్ముడు నిర్వికారుడు నగు శంకరుని ధ్యానింపుచుండ, నితని శిష్యు లన్నపానములు లేక గురువును విడి యన్యప్రదేశములకు పోయిరి. అనసూయమాత్రము పతిని విడక, పరిచర్యలు చేయుచు పార్థివలింగమును భక్తితో పూజింపుచు యథావిధిగ మంత్రము జపించుచు, మాటిమాటికి శంకరుని స్మరింపుచు బద్ధాంజలిపుటయై నమస్కరింపుచు, స్తుతింపుచు సాష్టాంగదండప్రణామంబు లాచరింపుచు, ప్రదక్షిణనమస్కారములను చేయుచుండెను. తపోగ్నిచే ప్రజ్వరిల్లుచున్న సౌందర్యవతి యగు ననసూయను గాంచి, దైత్యదానవు లగ్నిం గాంచి దూరమున కేగునట్లు తొలగి పోవుచుండిరి. అత్రితపస్సు, ననసూయశివపూజనంబుల కాగలేక సమీపమునకు రాజాలక అందఱు దూరమునుండియే కాంచుచుండిరి. అత్రి తపస్సు చేయునంతకాలము ననసూయ త్రికరణశుద్ధిగ తపంబు చేయుచునే యుండెను.

అత్రి చైతన్యము లేక సమాధియం దుండుటయు, ననసూయ శివపూజ చేయుటయు, నత్యాశ్చర్యమున నందఱు గాంచుచుండిరి. దేవతలు, ఋషులు, గంగాదినదులు, వీరిని గాంచుట కేతెంచి, వీరి తపంబుల కచ్చెరు వందుచు నిట్టిదుష్కరతపము నెవరు చేయలే దని వారిని ప్రశంసించుచు, వీరు ధన్యులు, వీరు పరులకై యింత తప మొనర్చుచుండిరి. వీరు దుష్కర తపంబుచే తప్పక శుభములు చేకూరును. ముల్లోకములందు నిట్టి తపోవంతుల గాంచలే దని వారందరు ప్రశంసించుచు వారివారి తావుల కేగిరి. శివారాధన చేయుచున్న యనసూయను గాంచి గంగ విడువలేక అటనే యుండిపోయి వీరి యుపకారము చేసి వెడలుదు నని నిశ్చయించుకొనెను. ఈశ్వరుడు కూడ నత్రి ధ్యానము చేయుచుండ, నటనే యుండిపోయెను. మరల కొంతకాలమున కీశ్వరుడు కైలాసమున కేగెను. అత్రిమహాముని సమాధి విరమించువరకు, ఏకొలదిజల మున్నను, జలప్రాశనకూడ జేయ నని యనసూయ పట్టుబట్టి జలమైనను గ్రోలక శివారాధన చేయుచుండెను. ఈవిధముగ 54 సంవత్సరములు జరిగెను.

శివ మహాపురాణమందలి కోటిరుద్రసంహితయందు
మూడవఅధ్యాయము సంపూర్ణము

---

## నాల్గవ యధ్యాయము

### అత్రీశ్వరలింగ మాహాత్మ్యము

తదుపరి అత్రిముని సమాధిని విరమించి లేచి యనసూయను గాంచి, దాహ మగుచున్నది. జలము తెమ్మన, ననసూయ కమండలము తీసికొని జలమెక్కడ నుండి తెచ్చెదనా యని యడవిలోనికి జని నే నెక్కడికి పోవుదును? నే నేవిధంబున జలము తెచ్చెద నని, యెటు గాంచినను జలము లేకుండుటచే విస్మయ మొందుచుండ, గంగ యామె వెనువెంట నేగుచు సుందరమైన శరీరమును దాల్చి, ఓయనసూయా!

నీవు ధన్యురాలవు, సుభగురాలవు, నీయాజ్ఞ తెలిపినచో దానిని సంపూర్తి చేసెద నన, వనసూయ గంగావాక్కులను విని భయమొందుచు, ఓకమలపత్రాక్షీ! నీ వెవతవు? ఎటనుండి వచ్చుచుంటివి? నాయందు కృపయుంచి నీవెవతవో చెప్పు మన, గంగ, యనసూయవాక్కులను విని నవ్వుచు, నోపతివ్రతా! నీపతిసేవ, నీశివభక్తి, నీపతివ్రతాధర్మము గాంచి నీకడనే యుండదలచితిని. నేను గంగాదేవిని. నిన్ను సేవించుటకై యిట కేతెంచితిని. నీకు నేను వశీభూతురాలను గాన నీ వేది కోరిన నవశ్యమిచ్చెదను. కోరుకొను మన, నెదుట నున్న గంగకు నమస్కరించి, ఓదేవీ! నీవు ప్రసన్నురాలవైనచో సమృద్ధికరమగు జలము నిమ్మని కోర, గంగ యనసూయను గాంచి, నీవొకగుంట తీసినచో నే నట సమృద్ధికరముగ నుండెద నని పలికెను. అనసూయ గంగవాక్కులు విని, గుంట తీయ, నాగంగ యదృశ్యమై జలరూపమున అందు నిండియుండెను. అనసూయ యిదిగాంచి యచ్చెరువందుచు ఆజలము కమండలముతో తీసికొని యత్రికడ కేగ నామహర్షి సంతోషించి యాచమించి దాహము తీరునంతదనుక పానము చేసి యిట్లు ప్రతిదినము సంపూర్తిగ జలము గ్రోలినచో జల మెక్కడనుండి వచ్చె నని తలచి, నలువైపులను గాంచి శుష్కవృక్షములను జూచి, యనసూయా! వర్ష మించుకంతయైనను లేదా యని ప్రశ్నింప, లేదులేదు, స్వామీ వర్ష మున్నమాటే లేదని, యనసూయ పలుక నైనచో నీకీజల మెట్లు సంప్రాప్త మయ్యెనో చెప్పు మని ఋషి పలుక, నామె భర్తవాక్కులను విని, నేను యథార్థము చెప్పినచో నాఘనత చెప్పుకొన్నదాన నగుదును. లేనిచో నసృతదోషము వచ్చు నని యామె యాలోచించి సత్యమును చెప్పుటయే శ్రేష్ఠ మని తలచి, ఓస్వామీ! శివానుగ్రహముచే ఈగంగ నాకు సంప్రాప్త మయ్యె నని యాథార్థము బలుక నామాని యచ్చెరువు నొందును, నోప్రియా! నే నామాట యథార్థ మని నమ్మజాలను. ఇది చాల దుర్లభమైన పని. ఇది యోగులకు దేవతలకు కూడ దుర్లభ మైనది. నే నిది విని కడు విస్మయము నొందుచుంటిని. నే నెపుడు కనివిని యెరుంగ నన, పతివాక్కులను విని యనసూయ, ఓనాథా! నామాటను మీరు విశ్వ

సింపకున్నచో నాతో వచ్చి యథార్థము గాంచు డని భర్తను తన వెంట గొనిపోయి, యాగంగాగర్తమును జూపింప, నత డాగర్తమందు దిగి యెంతదూర మేగినను, గంగ నిం[illegible]సూతాముపరకు నుండుటను గాంచి, యత్రి యాశ్చర్యపడుచు, నే నెంత ధన్యుడను, ఇది నాతపః ప్రభావమా, లేక యనసూయాపతివ్రతా ప్రభావమా యని, తనభాగ్యమును కొనియాడుకొనుచు, ఆ శుభజలమున స్నానమొనరిడి. ముమ్మా రాచమించి స్తుతించెను. ఇట్లీవిధంబున నత్రియనసూయలిరువురు ప్రతిదినము స్నానము చేయుచు నిత్యకృత్యములు దీర్చుకొనుచుండిరి. కొంతకాలమునకు గంగ స్వస్థానమున కేగెద నని యనసూయతో బలుక, నో గంగా! నీకు నాయందు కృప యున్నచో, నీ వీవనమందే స్థిరముగా నుండుము. మహాత్ము లన్నమాట తప్పరు. నీవు నాకడ స్థిరముగా నుండెద నని పలికి యిపుడు కా దనుచుంటి వేల! యని పలుకుచు, బద్ధాంజలిపుటియై స్తుతింపుచుండ నత్రికూడ గంగను ప్రతిమాలుచు వెడలిపోవల దని ప్రార్థింపుచుండ గంగ ప్రసన్నురాలై, యనసూయా! మీభార్యాభర్తల శివారాధనలచే జలలోపముండక వర్షములు కురియుచుండును. నేను దేవతాహితమునకై యిచటనే యుండెదను. దాన,ధర్మ, యజ్ఞ, తీర్థములకు నేను సంతసింపను. పాతివ్రత్యమునకే మిక్కిలి సంతసించెదను. పతివ్రత పార్వతితో సమానురాలు. నీమో దర్శనస్పర్శనలచే నేను పవిత్రురాల నగుదును. నీవు లోకహితమునకై నన్ను గోరుచుంటివి గాన నేను స్థిరముగ నిచటనే యుండెద నని, గంగవాక్యముల కనసూయ సంతసించి యొకసంవత్సరము చేసినపుణ్యము గంగకు ధారవోసెను.

శ్లో॥ మహతాంచ స్వభావోహి
పరేషాంహితమావహేత్.
సువర్ణంచందనంచేక్షు
రసస్తత్రనిదర్శనం.

సువర్ణము చందనము ఇక్షురసంబునువలె, మహాత్ములు పరుల కుపకారము చేయుస్వభావము గలవారై యుందురు. అనసూయయొక్క

పాతివ్రత్యమునకు పరోపకారబుద్ధికి సత్కర్మలకు మెచ్చి హరుడు పార్థివ లింగమం దావిర్భవించి, ఓపతివ్రతా! నీసత్కర్మలకు మెచ్చి ప్రసన్నుడ నైతిని. నీవు నా కధిక ప్రియభక్తురాలవు. కాన నీకు వరమిచ్చెద, కోరుకొమ్మన, అత్రియు ననసూయయు, పంచవక్త్రుడు పరమసుందరుడు నగు శంకరుని గాంచి సంతసించి యద్భుతముగ మాటిమాటికి వీక్షించుచు మహాభక్తి సమన్వితులై, బద్ధాంజలిపుటులై, నమస్కరించి స్తుతించి శంకరు నర్చించి, వామభాగమం దున్న దేవినికూడ ననేకవిధంబుల స్తుతించి, ఉమాశంకరులారా! మీరు మాయందు ప్రసన్నులైనచో లోకహితమునకై యీతపోవనమందు స్థిరముగా నుండు డని యాదంపతు లాదంపతులను కోర, భక్తులకోరిక లంగీకరించి యుమాశంకరులు గంగయు కూడ నాసమీపమందే యుండిరి గంగ యాగుంటయందే స్థిరముగా నుండెను. ఈశ్వరు డత్రీశ్వరు డను నామంబున నాప్రదేశంబుననే పరులదుఃఖములు బాపుచు స్థిరముగా నుండెను. గంగ తనమాయచే ఆదినమునుండి రెండుబారల [illegible] గల యాగర్తమందు మందాకిని యను పేరుతో నటనే స్థిరముగ నుండెను. ఋషు లందఱు తమపత్నులతో గూడి ఈపుణ్యతీర్థముకడ కేతెంచి, యచట హోమములతో పంచయజ్ఞములు చేయుచు సుఖముగా నుండిరి. ఈసత్కర్మలకు సంతసించి మేఘములు సమృద్ధికరముగ వర్షింపసాగెను. సర్వులు సుఖముగా నుండిరి. సుఖావహ మగు నత్రీశ్వరమాహాత్మ్యము చెప్పియుంటిని. ఈచరిత్ర భుక్తిముక్తిప్రదమై సర్వకామవివర్ధకమై యుండెను.

శివమహాపురాణము సందలి కోటిరుద్రసంహితయందు

నాల్గవ అధ్యాయము సంపూర్ణము

# ఐదవ యధ్యాయము

## విప్రభార్య మరణసమయంబున కోరినకోరిక

కాలంజరగిరియందు నీలకంఠు డను మహేశ్వరుడు లింగరూపుడై సదా భక్తానుగ్రహుడై యుండెను. ఇతని మహిమ ప్రతిస్మృతులయందు ప్రఖ్యాతిగ చెప్పబడి యుండెను. అక్కడ నీలకంఠ మను తీర్థము కలదు. అందు గ్రుంకిడినచో సర్వపాపములు నశించును. రేవానదీతీరమున అనేక శివలింగములు కలవు. అవన్నియు సర్వసౌఖ్యంబుల నిచ్చుచుండును. ఆలింగసంఖ్య గణింప నశక్యముగ నుండెను. కురుక్షేత్రస్వరూపలింగము లన్నియు దర్శనమాత్రముచే సర్వపాపములు హరించును. వాటిలో భుక్తిముక్తిప్రదము లగు కొన్నిలింగము లున్నవి. వానిని కూడ చెప్పెద. వినుడు. మహాపాపసంహారకుడగు నాగేశ్వరు డను సింహేశ్వరుడు కలడు. ఇంకను శక్రేశ్వరుడు, కుమారేశ్వరుడు, పుండరీకేశ్వరుడు, మండివేశ్వరుడు, తీక్ష్ణేశ్వరుడు అను లింగములు కలవు. ఇంకను సర్వపాపహరు డగు ధుంధుమారేశ్వరుడు నర్మదాతటమున గలడు. ఆదిసిద్ధ[illegible]ము. గళాయతనము లగు సూర్యేశ్వరుడు, కుంభేశ్వరుడు, కపోతేశ్వరుడు, సోమేశ్వరుడు, నీలకంఠేశ్వరుడు, మహాకపీశ్వరు డను నాను [illegible] లింగములు, నందికేశ్వరుడు కొన్ని లింగములు స్థాపించెను. ఇవన్నియు కోటిహత్యాపాతకములు నివారించి సర్వకామ్యములు తీర్చి మోక్షము నొసంగును. వాటిలో నందికేశ్వరలింగము దర్శించినచో అష్టసిద్ధులైనను బడయవచ్చును. రేవానదియందు స్నానమాడినచో సర్వపాపములు నశించి సర్వకామ్యములు సిద్ధించు ననె, శౌనకాదు లివన్నియు విని నందికేశ్వరలింగమహాత్మ్యము చెప్పుమని కోర సూతు డిట్లు చెప్పదొడంగెను

ఓ మహాత్ములారా! పూర్వము యుధిష్ఠిరు డిట్లే ప్రశ్నింప వ్యాసు డిట్లు చెప్పెనో యదంతయు చెప్పెద వినుము. రేవానదీపశ్చిమతీరంబున చాతుర్వర్ణ్యవిరాజిత మగు కర్ణిక యను పట్టణము గలదు. అట నివసించు నొక యుత్తమకులసంజాతు డగు ద్విజుడు తనయిరువురు పుత్రులను భార్యను కాపాడుమని చెప్పి తాను కాశికేగి యట మరణించెను. పుత్రు లీ వార్తను విని తల్లి

శ్రాద్ధక్రియలు గావించిరి. వానితల్లి పుత్రులనిరువురను పెద్దవారిని చేసి తనమరణక్రియలకై కొంతధనము వేరుగా దాచి మిగిలినధనమును పుత్రులకు పంచిపెట్టెను. ఈద్విజపత్ని యనేకపుణ్యవ్రతములు చేసి, కొంతకాలమునకు మరణబాధపడుచున్నను ప్రాణములు పోకుండెను. దైవయోగంబుచే తమతల్లి మరణబాధ నొందుట గాంచి, ఓతల్లీ! నీవు పుణ్యాత్మురాలవుకదా, సకలదానవ్రతంబులు చేసితివి. ఏలోపంబుచే నిట్టి బాధపడుచుంటివి? నీ వాలోపమును చెప్పినచో మే మది పూర్తిచేసెద మను పుత్రవాక్యములను విని, ఓపుత్రులారా! నే నన్నిలోపములు పూర్తి చేసికొంటిని. కాని, ఒకలోపము మాత్ర మున్నది. కాశీ వెళ్లెద నని యనేకమారులు ప్రయత్నించితి గాని నా కది సిద్ధింపవేదు. ఇంతకన్న నాకేలోపము లేదు. నాయస్థికలు కాశీగంగయందు కలిపెదనన్నచో నాప్రాణములు సుఖముగ పోవు నన పెద్దకుమారుడు నీవు చెప్పినట్లు తప్పక చేయుదు నని వాగ్దానము చేసి యామె హస్తమున నుదకము విడుచునంతలోనె యామె శివస్మరణము చేయుచు ప్రాణమును విడిచెను. తదుపరి జ్యేష్ఠపుత్రుడు తల్లికి సకలక్రియలు గావించి నెలమాసికము కూడ పూర్తిచేసి, తన భార్యాపుత్రుల నింటివద్దనుంచి తల్లియస్థికలపేటికల బట్టుకొని సేవకుని వెంటబెట్టుకొని మంగళస్మరణము చేయుచు కాశీప్రయాణమై యిరువదియోజనములు ప్రయాణము చేసి ప్రదోషసమయంబున నొకగ్రామము చేరి యొక విప్రునింట బసచేసి యారాత్రి యంతయు సుఖముగా గడిపెను.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
అయిదవ అధ్యాయము సంపూర్ణము

---

## ఆఱవ యధ్యాయము

### విప్రభార్య సద్గతి నొందుట

ఈ విప్రునిముంగిలివాకిటయందొక గోవత్సము, గోవు కట్టబడి యుండెను. ఆగృహయజమాని భార్యతో వెలుపలికి వచ్చి గోక్షీరములు

పితునదలచి భార్యను గాంచి యాగోవు ఇంతకుముందు దుగ్ధము లీయలేదు. ఇప్పుడైనను పితికి చూచెదను. పాత్రను తెమ్మని దూడను వదలి దానిని మరల రాటకు కట్టబోవ నది పరుగులిడుచు ఆవిప్రునిపదముపై త్రొక్క, నతడు విసుగుజెంది యాకేగదూడను కొట్టెను. విప్రునితాడనంబులచే వత్సము అలసి సొమ్మసిలి యుండ, విప్రుడు క్రోధముచే పాలను పితికి, వత్సమును పాలకై విడువక లోనికేగెను. గోమాత తనవత్సము రాకుంటను గాంచి యంబా యని యరచుచు దుఃఖించుచుండ తల్లిని గాంచి యావత్సము ఇట్లు పలికెను.

ఓతల్లీ! నీ వేదుకు దుఃఖించుచుంటి వన, వీడు దుష్టుడు. నిన్ను కొట్టి పాలకై నను విడువకుండుటచే నేను బాధపడుచు దుఃఖించుచుంటి నని తల్లి పలుక, నావత్సము మాతృవాక్యాలు విని, ప్రారబ్ధ మనుభవింపక తప్ప దని యిట్లు పలికెను. తల్లీ! కర్మబద్ధు లగు మన మెక్కడికి పోవుదుము? ఏమిచేయు దుము? మనపూర్వకర్మ మిపు డనుభవించుచుంటిమి.

శ్లో॥ మానసా క్రియతే కర్మ రుచసా పరిభుజ్యతే
దుఃఖదాతా నకోప్యస్తి సుఖదాతా నకశ్చన.

నవ్వుచు కర్మలు చేయుదురు. ఏడ్చుచు ననుభవించెదరు. గాని సుఖ దుఃఖము లిచ్చువా డెవడును లేడు. ఎవరో సుఖదుఃఖము లిచ్చుచుందు రని యజ్ఞులు పలుకుచుందురు. మిథ్యాజ్ఞానులు నేనే సర్వము చేయుచున్నా నని పలుకుదురు. సుఖదుఃఖములు వారివారి కర్మలచే కల్గుచున్నవి. మనము జీవులము. కర్మబద్ధులము. గాన, విచారింప నవసరము లేదన, పుత్రశోకముచే విలపించుచున్న గోమాత జ్ఞానగర్భితము లైన తనబిడ్డవాక్యాలు విని, ఓవత్సా! జీవులందరు కర్మాధీనులని తెలుసుకొని నేను మాయాధీను రాలనై దుఃఖింపుచుంటిని. దుఃఖము శాంతించుటకై ఏడ్చుచుంటి నన, తల్లివాక్యాలను విని యావత్సము మరల నిట్లు పలికెను. ఓతల్లీ! నీ వన్నియు తెలిసియుండి యేల దుఃఖించుచుంటివి. ఏడ్చినంతమాత్రమున దుఃఖము లెట్లు పోవును? చెడుకర్మలు చేయనిచో దుఃఖము లుండ వని వత్సము పలుక, తల్లి నిట్టూర్పులు విడుచుచు, ఓవత్సా! నాదుఃఖ మెట్లుపోవునో చెప్పెద వినుము.

రేపు ఉదయము విప్రుడు పాలు పితుకుటకై నావద్ద కేతెంచును. అపుడు నేను నాశృంగములచే నతనిని పొడిచి చంపి నాపగ తీర్చుకొందు నన, ఓతల్లీ గత జన్మకర్మఫలముచే మన మీ యిక్కట్లు పొందుచుంటిమి. మరల బ్రహ్మహత్యా పాపము చేసి ఇంక నెన్ని యిక్కట్లు పడవలసి వచ్చునో యాలోచించు చుంటివా? పుణ్యపాపములు సమముగా నున్నచో భరతవర్షమున జన్మింప గలరు. పుణ్యపాపములు రెండును క్షీణింపగనే జీవునకు ముక్తి కలుగును. క్రొత్తక్రొత్తకర్మలు చేయక, చేసినకర్మలను అనుభవించినచో ముక్తి నొంద వచ్చును. పూటపూటకు కర్మ నాచరించినచో జన్మలు బాధలు తప్పవు. పుణ్యకర్మలు చేసినను జన్మలు తప్పవు. పాపకర్మలు చేసినను జన్మలు తప్పవు. పుణ్యకర్మలచే సుఖములు, పాపకర్మలచే దుఃఖము లనుభవింపవలసి వచ్చును. సకర్మలు చేయక, విషయములు కోరక భగవద్ధ్యానము చేయుచు కాలము గడిపిన ముక్తి నొందగలడు. కాన మరల బ్రహ్మహత్యాపాపమును కొనిగట్టు చుంటివేల? నీవు చేసిన కర్మలచే నీవు నాకు తల్లివైతివి. నీవెక్కడ తల్లివి, నేనెక్కడ పుత్రుడను? పుత్రు డనియు, తల్లి యనియు అభిమానమే కాని వేఱుగాదు. జీవులు తల్లి యనియు, తండ్రి యనియు, పుత్రు డనియు, మిత్ర మనియు భావించి ప్రేమించెదరే గాని యథార్థముగా నెట్టిసంబంధమును లేదు. ఎవరికర్మలు వా రనుభవింప వలసినదే గాన నాకై నీవు దుఃఖింప వలసిన పనిలేదు. నాకర్మ నే ననుభవించుచుంటిని. నాకై నీవు దుఃఖము చేయనేల? నీ వింతయు నెఱింగి దుఃఖము మానుము. మంచి కార్యములు చేసినచో పరమును సుఖపడ గల వన, తల్లి, బిడ్డవాక్కులు విని, వత్సా! బ్రహ్మ హత్యాపాపమునకు సరితూగు పాప మేదియు లేదని నాకు తెలుసును. నీ దుఃఖము నేను సహింప లేకుంటిని. గాన నే నా విప్రుని జంపి, బ్రహ్మహత్యనే పోగొట్టుకొందును. బ్రహ్మహత్య పోవుట కొక ప్రదేశము గలదు. అది నే నె రుగుదు నన నావత్సము చేయునది లేక తల్లిమాటలు విని యూరకుండెను. కాశికి జనుచున్న యీ పాంథుడు ఇదంతయు విని విస్మితచిత్తుడై నేను కూడ ప్రొద్దుట నీగోవుతో జనినచో నాప్రదేశ మేదియో తెలిసి కొని పాపవి ముక్తుడ నగుదు నని తలచి మాతృభక్తుడగు నాపాంథవిప్రుడు తనసేవకునితో లేచి ప్రయాణసంసిద్ధుడై, యుండ గృహయజమాని పాంథుని గాంచి తెల్లవారగ

మునుపే ప్రయాణ మగుచుంటి రేల? ఉదయము కాగనే మీయిష్టము
వచ్చినతావునకు జను డని తనపుత్రుని జేపి, పుత్రా! తెల్లవారగనే నీ యావు
పాలు పితుకు మని చెప్పి కార్యాంతరముచే తా నన్యగ్రామమున కేగ,
ఇంతలో తెల్లవారగనే యావిప్రపుత్రుడు పాలుపితుకుట కై దీనముఖియై
యున్న దూడను కొట్టుచు విప్పి పాలు పితుకుట కై గోసమీపమున కేగ, నది
కోపించి, తన శృంగములచే విప్రబాలుని తనపగ దీర్చుకొనుట కై పొడిచి
చంపెను. ఇది గాంచి యందఱు హాహాకారములు చేయుచు నేడ్వసాగిరి.
ఆగోవు బ్రహ్మహత్యాదోషముచే తన స్వచ్ఛమైన ధావళ్యమును వీడి శ్యామ
రూప మూనెను. ఇది గాంచి యందఱు విస్మితు లైరి. ఆగోవు తనపగ దీర్చు
కొని తాను తెంచుకొని పరుగిడుచుండ, నా పాంథు లిరువు రిదంతయు గాంచి
విస్మితు లై ఆగోవువెంట జనుచుండిరి. గోవు పిల్లవానిని జంపె నని చెప్పు
కొనుచు నాడిపోసుకొనుచుండిరి. తరువాత పిల్లవానికి ప్రేతక్రియ లన్నియు,
పూర్తి చేసికొనిరి. యజమానిని చంపదలచిన గోవు అతనికుమారుని జంపెను.
ఇదియే కర్మఫలము. విధియెట్లు జరుగునో యెవరికిని తెలియదు. ఆగోవు వెళ్లి
వెళ్లి నర్మదానదీతీరమున నందికేశ్వరలింగ మున్న తావు. కేగి నర్మదానది
యందు ముమ్మార్లు స్నాన మాచరింప, దానిశ్యామము పోయి, ధావళ్యము
నొందెను. ఆపాంథు లిదంతయు గాంచి వారు కూడ నానదియందు ముమ్మారు
స్నానము చేసి యాతీర్థమును ప్రశంసింపుచు జనుచుండ సకలభూషణభూషిత
యగు నొక దివ్యాంగన వారి కెదురువచ్చి మీ రెక్కడనుండి వచ్చుచుంటిరి?
ఎక్కడ కేగుచుంటిరి? కపటము లేక యథార్థమును బలుకు డన మాతృ
సద్గతి కై అస్థికలు తీసికొని కాశికి జనుచుంటి మని జరిగినయథార్థ మంతయు
నామెతో విన్నవింపగా, నామె వారిపలుకులు విని, ఓవిప్రవర్యా! మీతల్లి
యస్థులీరోజున నర్మదానదియందు బడవైచినచో, కాశీగంగ యందు పడ
వైచినఫలము సంభవించును. నీతల్లి ఈశ్వరసాన్నిధ్యము నొందగలదు.
వైశాఖశుద్ధసప్తమిరోజున గంగ నర్మదానదిలో కూడియుండును. ఆపుణ్యదిన
మీరోజే కాన నీవు సందేహింపక నీతల్లి యస్థికలు నర్మదానదిలో పడవేయు
మని గంగాదేవి చెప్పి యంతర్ధాన మయ్యెను. విప్రు డాయస్థికలమూట విప్పి
యానదియందు పడవైవ నందొక చిత్రము జరిగెను. చెప్పెద వినుము. తనతల్లి

దివ్యరూపధారియై, ఓపుత్రా! నీవు ధన్యుడవు. కృతకృత్యుడవు. నీచే నాకుల మంతయు పవిత్ర మయ్యెను. నీవు ధనధాన్యములతో నాయురారోగ్యాభివృద్ధి కలిగి యుండగల వని పుత్రు నాశీర్వదించి దివమున కేగి ఉత్తమభోగములు చిరకాల మనుభవించి యట శివకటాక్షముచే నుత్తమగతి నొందెను. ఇట విప్రుడు స్వస్థచిత్తుడై సంతోషముతో స్వగృహమున కేగెను. ఈకథ విన్నను పఠించినను బ్రహ్మహత్యాదిసకల పాపములు నశించి భుక్తిముక్తుల నొందగలరు.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు

ఆఱవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఏడవ యధ్యాయము

### నందికేశ్వర మాహాత్మ్యము.

వైశాఖశుద్ధసప్తమియందున నర్మదానదియందు గంగ ఏవిధంబున ప్రవేశించెను? ఈశ్వరుడు నందికేశు డెట్లయ్యెను? ఇదంతయు దయయుంచి చెప్పు మని శౌనకాదు లడుగ సూతు డిట్లు చెప్పదొడంగెను. విన్నంతనే పుణ్యవర్ధన మగు నందికేశునిచరిత్ర చెప్పెద వినుము. ఋషీక యనెడి బ్రాహ్మణస్త్రీ తనతనయ నొక విప్రున కిచ్చి యథావిధిగ నుద్వాహము చేసియుండెను. ఆబాలిక తనపూర్వకర్మవశముచే బాల్యముననే వైధవ్య మొంది బ్రహ్మచర్యవ్రత మాచరింపుచు పార్థివార్చన చేయుచు, ఘోరతపము చేయుచుండ, మూఢనాము డగు నొకరాక్షసుడు కామబాణ పీడితుడై యట కేతెంచి తపంబు చేయుచున్న యాసుందరిని గాంచి తనతో రమింపు మని యనేక విధంబుల నామెను ప్రార్థింప, నామె యీశ్వరధ్యానముతో నుండుటచే నతని మాట లేమియు చెవిని బెట్టకుండెను. ఈవిప్రస్త్రీ మాటిమాటికి శివునే ధ్యానింపుచు తన్ను గాంచకుండుటచే రాక్షసుడు కోపించి తన నిజస్వరూపము చూపించి భయపెట్టుచు భయంకరవాక్యములచే బెదిరింపుచుండ, శివాశ్రితురాలగు నాద్విజపత్ని మాటిమాటికి శివాయని శివుని స్మరింపుచు నా స్త్రీధర్మమును కాపాడుమని శంకరుని ప్రార్థింప, శరణాగత రక్షకుడు, దయామయుడు

నగు శంకరుడు తపోనిష్ఠలో నున్న యామెను రక్షించుటకై యట నావిర్భ వించి దురాత్ముడగు దైత్యుని క్షణములో భస్మముచేసి భక్తరక్షకుడగు నీశ్వరుడామెను కృపాదృష్టితో గాంచుచు నీకపమునకు ప్రసన్నుడనైతిని, వరమడుగుమన, నానందజనక మగు శంకరునిలీల గాంచి నమస్కరించి సాంజలియై, స్తుతించి ఓదేవదేవా! మహాదేవా! శరణాగతవత్సలా! దీనబాంధవా! పరమేశ్వరా! భక్తరక్షకా! నీ వీమూఢరాక్షసుని సంహరించి నాధర్మమును రక్షించి జగత్తును రక్షించితివి. నాకు వర మీయ దలచితివేని. నాకెప్పుడు నీయందు నెడతెగని భక్తి నిమ్ము. ఇంతకన్న నధిక మగు వర మేమున్నది? నే నింకొకటి ప్రార్థింపుచుంటిని. వినుము. లోకోపకారమునకై యీప్రదేశమున స్థిరముగా నుండుమని యామె పలుక కరుణాకరుడగు నా శంకరుడు, ఓసుచరిత్రా! నీవు గంభీరురాలవు. నీకోర్కె లన్నియు తీర్చెద నన, నింతలో విష్ణుబ్రహ్మాదిదేవత లందఱు నట కేతెంచి శంకరుని దర్శించి యనేకవిధంబుల స్తుతించిరి. ఇంతలో గంగకూడ నేతెంచి యామెను ప్రశంసింపుచు వైశాఖశుద్ధసప్తమిరోజున నేను నీకడ నుండెదను. నీవు ధర్మాత్మురాల వని గంగ యామెను కొనియాడ లోకహితకర మగు గంగవాక్కు లామె విని కడు సంతోషించెను. ఈశ్వరుని పార్థివలింగ మం దంతర్హితుడై నందీశనామంబుతో పూర్ణాంశజుడై యట నుండెను. బ్రహ్మాదిదేవతలు ఈశ్వరుని వ్యాపికను ప్రశంసింపుచు వారివారి నిలయంబుల కేగిరి. ఇదంతయు వైశాఖశుద్ధసప్తమి రోజున జరిగెనుగాన గంగానది యట కేతెంచి నర్మదానది యందు గలియు చుండును. అప్పటినుండి నర్మదానది పవిత్రతీర్థమై యలరారుచుండెను. ఈ నందికేశ్వరక్షేత్రము సర్వపాపహారమై యుండెను. మనుజుల సర్వపాపంబులు నశింపజేయుటకై గంగ యాదినంబున ప్రతివర్షంబు నట కేతెంచుచుండెను. పాపక్షాళనమునకై జనులందఱు నట కేతెంచుచుందురు. ఈదినంబున నటకేతెంచి నర్మదా, గంగా సంగమమందు స్నానముచేసి, నందికేశు నర్చించినచో బ్రహ్మహత్యాది పాపములు తక్షణమే నశించును.

శివ మహాపురాణమునందలి కోటిరుద్ర సంహితయందు
ఏడవ అధ్యాయము సంపూర్ణము.

# ఎనిమిదవ యధ్యాయము

## గోకర్ణేశ్వర మాహాత్మ్యము

మహర్షులారా! పశ్చిమదిశయందున్న శివలింగములను గూర్చి చెప్పెద వినుము. పశ్చిమదిశయందు కాలరామేశ్వర మను శివలింగముగలదు. దానిదర్శనముచే సర్వపాపములు హరించును. పశ్చిమసాగరతటంబున సిద్ధేశ్వర నామంబున నీశ్వరుఁడుండెను. ఇతని దర్శనముచే సర్వకామ్యములు సిద్ధించి మోక్షము లభించును. పశ్చిమాంబుధి తీరంబున నుత్తమంబైన గోకర్ణ క్షేత్రముగలదు. అం దనేకకోట్ల శివలింగములు కలవు. అడుగడుగున ననేక తీర్థములు కూడకలవు. ఇవన్నియు బ్రహ్మహత్యాది పాపంబులు పోగొట్టి సర్వకామ్యము లొసంగుచుండును. గోకర్ణ క్షేత్రంబునం దున్న యుదకములన్నియు తీర్థములే. అటనున్న పాషాణంబు లన్నియు శివలింగములే. అటనున్న ప్రతిలింగములయందు శివుడు ప్రత్యక్షమగుచుండును. వాటిమహిమలన్నియు పురాణమందు వర్ణింపబడియుండెను. ఆశివలింగములన్నియు కృతయుగంబున శ్వేతవర్ణంబులుగను, త్రేతాయుగంబున నరుణ వర్ణంబులుగను, ద్వాపరంబున పీతవర్ణంబులుగను, కలియందు శ్యామవ ర్ణంబులుగను ఉండును. ఈలింగము లన్నియు బలిష్ఠములై సప్తపాతాళ లోకముల నాక్రమించి యుండును. ఘోరకలియం దాలింగములన్నియు మృదుత్వముజెంది యుండును. గోకర్ణేశ్వరుని పూజించినచో మహాపాతకములు నశించి శివసాయుజ్యము నొందగలరు. గోకర్ణేశ్వరుని పర్వదినమున పూజించినచో కేవలము రుద్రరూపు లగుదురు. మఱియు ఈ దేవుని యెవడెప్పుడు పూజించినను బ్రహ్మపదవి నొందగలడు. అక్కడ శివుడు మహాబలుడను నామంబుతో సకలదేవతలను గూడి యాక్షేత్రమందు నివసించుచుండెను రావణుడు ఘోరతపంబు చేసి శివుని యాత్మలింగము కోరి తెచ్చుకొనివచ్చుచు నాశాపము తీర్చుకొనుటకై ఆలింగమును గణపతి చేతికిచ్చెను. ఆతడొక నిమిషచే క్రిందపడవేయ నది భూస్థాపితమై మహాబలే శ్వరుడని పేరుజెంది యటనే యుండెను. ఈలింగముయొక్క తూర్పు ద్వారంబున విష్ణు, బ్రహ్మ, మహేంద్రాది దేవతలు, విశ్వేదేవతలు, మరుద్గణములు,

ఆదిత్యులు, వసువులు, అశ్వినీదేవతలు, తారకలతో గూడిన చంద్రుడు, పార్షదులతో గూడిన దేవతలు, విమానాధష్ఠితులై వచ్చి ఈశ్వరుని సేవించుచుందురు.

వరుణుడు, సరిత్ప్రభువైన సాగరుడు, గంగాది సకలనదులతో గూడికొని ఈమహాబలేశ్వరుని పశ్చిమద్వారంబున సేవించుచుందురు.

యముడు, మృత్యువు, చిత్రగుప్తుడు, పావకుడు, పితృదేవతలు, ఏకాదశ రుద్రులు దక్షిణద్వారము నాశ్రయించి యీమహాబలుని సేవించుచుందురు.

వాయువు, కుబేరుడు, భద్రకాళి, చండికాది సప్తమాతృకలు, ఉత్తర ద్వారమునాశ్రయించి యీదేవుని సేవించుచుందురు.

సకలదేవతలు, గంధర్వులు, పితరులు, సిద్ధులు, చారణులు, విద్యాధరులు, కింపురుషులు, కిన్నరులు, గుహ్యకులు పక్షిగణంబులు, నానావిధ పిశాచులు, బేతాళులు, మహాబలులగు దైత్యులు, శేషాదినాగులు, సిద్ధులు, మునులు మహాబలుని నమస్కరింపుచు స్తుతింపుచుందురు. ఈమహాబలుని సేవించినవారందరు ఇహపరలోక సుఖంబుల నొందుచుండిరి. ఈశివలింగము మోక్ష ద్వారమని చెప్పుదురు. మాఘబహుళ చతుర్దశి రోజున నాలింగము దర్శించినవారి సర్వపాపములు హరించును. ఆనాడు శివరాత్రియందు, ఉతిధియందు దర్శించ శివోత్సవములు చేయుచుందురు. వాటిని గాంచుటకై యనేక దేశవాసులగు చాతుర్వర్ణ్యంబులతో బాలురు, వృద్ధులు, స్త్రీపురుషులు వచ్చి దేవుని దర్శించి, కృతకృత్యులగుచుండిరి. చండాలస్త్రీ యీలింగ మును పూజించి శివలోకమేగెను.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

# తొమ్మిదవ యధ్యాయము

## చండాలస్త్రీ సద్గతి నొందుట

శౌనకాదులు మఱల నిట్లుప్రశ్నించిరి. సూతమహర్షీ! చండాలస్త్రీ సద్గతి నెట్లు పొందెనో, చెప్పు మన సూతుడిట్లు చెప్పదొడంగెను. ఓవిప్రు లారా! అద్భుతమగు కథ చెప్పెద వినుడు. ఈకథ శివప్రభావ సంయుక్తమై భక్తివర్ధకమై యుండెను. ఈచండాలస్త్రీ పూర్వజన్మంబున బ్రాహ్మణియై సౌదామినియను పేరుగలిగి, చంద్రముఖియై సర్వలక్షణాలక్షితయై, యొప్పుచుండెను. ఈకన్యక నామెతండ్రి యొకదివ్యకుమారునకిచ్చి యుద్వా హముచేయు నవయౌవన లావణ్యవతియగు నామెభర్తతో కొంతకాలము సుఖముగానుండెను. కొంతకాలమునకు యౌవనవంతు డగు నామెభర్త రుజ బాధచే కాలధర్మమునొందెను. భర్త మరణింపగనే యామె యపరిమిత దుఃఖాక్రాంతయై, సుశీలయై, సుబుద్ధితో కొంతకాలము గృహముందే యుండెను. తదుపరి యౌవనవతియగుటచే కామబాణప్రపీడితయై వ్యభిచరింపుచుండ నామె జ్ఞాతులందఱు నామెదుష్కృత్యములకు నిందింప సాగిరి. ఈమె వారి బాధపడలేక దూరప్రాంతమునకేగి, యొకశూద్రునితో స్వేచ్ఛగా రమింపుచుండెను. ఆశూద్రు డామెను తనపత్నిగా స్వీకరింప, మధుమద్యాదులు గ్రోలుచు, నామె యతనియింట నివసింపుచు, నతని వలన నొకపుత్రికను బడసెను. ఆశూద్రు డొకనా డజమాంసము వండుమని చెప్పి యెచటికో చన ఆమె మదిరా పానమత్తయై చీకటి పడుచుండగ ఖడ్గముచేతబూని, గోశాలకేగి మేక యని గోవత్సమును ఖడ్గముచే ఛేదిం పుచుండ, అదేగ యంబాయని యరచెను, గోవత్స మని యెరింగి దుఃఖించి. తనపూర్వపుణ్యముచే శివ, శివా, యెంతపనిచేసితినని, విలపించుచు, ఆమాం సము వండి ఆశూద్రునకు బెట్టి తాను భుజించెను. ఈమె కొంతకాల మిట్లుండి కాలవశముచే సంయమినీపురికేగ, యము డీమె కర్మానుసారముగ నిరయయాతనల ననుభవింపజేసి తదుపరి చండాలజాతియందు జనింపజేసెను.

ఈమె చండాలస్త్రీయై జాత్యంధురాలై జనించి బాల్యమునందే తలితండ్రుల గోల్పోయి పెంచిపోషించువా రెవరును లేక కుష్ఠవ్యాధిచే పీడింపబడుచు క్షుధార్తయై, దీనవదనయై చేత కఱ్ఱనుధరించి, నడుచుచు, ఆకలి దహింపుచుండుటచే చండాలోచ్ఛిష్ట భోజనము చేయుచు, యౌవనమంతయు గడిపి, తదుపరి జరాభార పీడితయై దురత్యయమగు దుఃఖము నొందుచు, కొంతఱు గోకర్ణక్షేత్రమునకు జనుచుండ తానుకూడ నటకేగి మహాశివరాత్రిరోజున కట్ట బట్టయు, తిన తిండియు లేక సందతిని యాచింపుచు నంజలి ఘటించి తిరుగుచుండ, నొక పాంథు డొకబిల్వపత్రము విసిరివేయ, నది యామెయంజలియందు బడెను. అది భక్ష్యవస్తువుని కాదని గ్రహించి దానిని దూరముగవిసిరివేయ నది నిశీథసమయంబున దైవయోగంబుచే శివలింగముపై బడెను. ఈమెయెంతమందిని యాచించినను దైవయోగముచే నామహా శివరాత్రి దినంబున తినుటకేమియు దొరకలేదు. ఈకారణముచే నీమె కుపవాసఫలము దక్కెను. క్షుద్బాధచేతను, అజ్ఞానముచేతను రాత్రియంతయు తిరుగుచుండ నానందదాయకమగు జాగరణఫలము కూడ దక్కెను. తెల్లవారగనే యామె దుఃఖించుచు తన స్వస్థానమేగెను. ఈమె మార్గబడలికచేతను క్షుద్బాధచేతను శరీరాస్వస్థతచేతను చైతన్యముతప్పి, క్రిందబడి ప్రాణంబులు విడిచి శంభుకృపచే తనువు బాసియుండ, శివదూతలు విమానముపై నామెను కైలాసమునకు గొనిపోయిరి. ఈమెపూర్వజన్మమునందు వ్యభిచారిణియైనను అజ్ఞానముచే శివనామము నుచ్చరింపుటచే మరుజన్మమున చండాలస్త్రీయై జన్మించి గోకర్ణక్షేత్రమేగి, శివరాత్రియం దుపవాసముండి బిల్వపత్రము శివునిపై వేసి జాగరణచేయుటచే నామెకిట్టి ఫలమువచ్చెను. ఈమె బుద్ధిపూర్వకముగ శివార్చన, యుపవాసాదులు చేయనప్పటికి నిట్టిఫలము సంభవింప, బుద్ధిపూర్వకముగ భక్తితో శివు నారాధించినవారి ఫల మేమని చెప్పుదును. గోకర్ణమందైన మహాబలేశ్వరశివలింగ మహాత్మ్యము చెప్పియుంటిని. ఈచరిత్రవిన్నంతనే శివునియందు భక్తికలుగును.

శివమహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

# పదవ యధ్యాయము

## కల్మాషపాదుని చరిత్ర

ఇక్ష్వాకువంశంబున పరమధార్మికుడు ధనుర్ధరుడునగు మిత్రసహుడను రాజుగలడు. ఇతనిభార్యయగు మదయంతి నలుని భార్యయగు దమయంతితో సమానురాలుగనుండెను. ఈరాజు ఒకానొకప్పుడు గహనమునకు వేటకేగి యట విహరింపుచు, ఖలుడు, సాధుపీడాకరుడు, మహాదుష్టుడు నగు కమఠుడనెడి నిశాచరుని సంహరింప నా రాక్షసుని సోదరుడేదో మిషచే నారాజును వంచింపదలచి కపటముగ నితనికడకేగి వినయము నటింపుచు మీ సేవకుడనై యుండెదనని కోర రా జితనిని వంటవారి కధ్యక్షునిగ నియమించెను. రాజు కొంత కాలము వనమందు విహరించి మృగములను వేటాడి తనగృహమునకేగి యొక దినంబున తనతండ్రి శ్రాద్ధదినంబున తనగురుడగు వసిష్ఠుని భోజనమునకై యాహ్వానింప వంటవాడగు రాక్షసుడు తనపగను దీర్చుకొనుటకై నరమాంసమును వండి వసిష్ఠునకు వడ్డించె. గురువు నరమాంసశాకమును గాంచి, ఓరాజా! నీవు నన్ను మోసగించి నరమాంస భోజనం బిడుచుంటివి. పిశాచునివలె ప్రవర్తించితివిగాన దుష్టరాక్షసుడవై ప్రవర్తింతువుగాక యని శపించి, ఇదంతయు రాక్షసుని వలన జరిగినదనియు, రాజు నిర్దోషి యనియు, వసిష్ఠుడు గ్రహించి యీ రాక్షసత్వము పండ్రెండువర్షములు మాత్రమే యుండునని యనుగ్రహించెను. తన్నవసరముగ గురువు శపించెనని రాజు కోపించి అంజలిచే జలముగ్రహించి, గురువగు వసిష్ఠుని శపింపబోవ ధర్మాత్మురాలు పతివ్రతయు నగు మదయంతి పతిపదంబులపైబడి గురువును శపింపకుండ నివారింప, రాజు భార్యయందలి గౌరవముచే నాశాపోదకములను తనపాదములపై విడువ నాటినుండి యతని పాదములు నల్లనాయెనుగాన, నితడు కల్మాషపాదుడని పిలువబడుచుండెను. ఈరాజు గురుశాపముచే దుష్టరాక్షసుడై ఘోరారణ్యమున ఘాతుకుడై కాలాంతక యమునివలె తిరుగుచు పథికజనులందరిని భక్షింపుచుండెను.

ఒకదినంబున నితడు వనమున విహరింపుచున్న నవోఢదంపతులనుగాంచి, వ్యాఘ్రము మృగశిశువును బట్టినట్లుగ నాదంపతులలో పురుషునిబట్టియుండ,

నామునిభార్య భయపడుచు తనభర్తను చంపవలదని యనేకవిధంబుల రాక్ష
సుని ప్రార్థింప నతడు దయావిహీనుడై, యతనిశిరమును విరిచిభక్షించెను. ఇది
గాంచి యామునిభార్య విలపించుచు, భర్తయెముకలు ప్రోగుచేసికొని, చితి
పేర్చుకొని, ఓరాక్షసా! విహరింపుచున్న మాదంపతుల నడబాటు చేసితివి
గాన, నిటనుండి నీ వేస్త్రీతో రమించినను, వెంటనే మరణింతువని శపించి, తా
నగ్నిం బ్రవేశించి దహింపబడెను. తదుపరి రాజు ద్వాదశాబ్దములు గురుశాప
మనుభవించి, శాపవిముక్తుడై, రాజధాని కేతెంచి ప్రియురాలగు మదయంతిని
గాంచి, మునిపత్నిశాపమును తలంచుచు దుఃఖింపుచుండ మదయంతి యిది
యంతయు నెరింగి, తనకు వైధవ్యము సంభవించునని, పతికి దూరంబుగ మెల
గుచు, పతిసేవచేయుచుండెను. రాజు తా ననపత్యుడ నని దుఃఖింపుచు, రాజ్య
భోగములన్నియు వీడి యేకాకియై యరణ్యమునకు జనుచుండ బ్రహ్మహత్య
వికటాకారముతో నితనిని భయపెట్టుచు వెంటాడుచుండును. రాజు బ్రహ్మ
హత్యానివారణకై తపో, జప, వ్రతయజ్ఞాదిక్రియలెన్నియో గావించెను, అనేక
తీర్థయాత్రలు చేసెను గాని బ్రహ్మహత్య వెంటాడుచునే యుండును.
ఒకదినంబున మిథిలాపట్టణమున కేగి బ్రహ్మహత్యానివారణకై విచారింపు
చుండ, నింతలోగౌతమునిగాంచి యతనికి మాటిమాటికి నమస్కరింపుచు
నిట్టూర్పులు విడుచుచుండ నాముని రాజు నోదార్చి, కుశలమడుగ, నోమునీ!
నన్ను బ్రహ్మహత్య మాటిమాటికి పీడింపుచుండెను. ఇది పరుల కెవరికి
గోచరింపక, పదేపదే నన్నే పీడింపుచుండెను. నేను శాపదగ్ధుడనై యె
ఱుంగక విప్రపుత్రుని భక్షించితిని. వేలకొలది ప్రాయశ్చిత్తములు చేసికొ
న్నను, నన్నా పాపము విడువకుండెను. దానిశాంతికై యనేకోపాయములు
చేసికొంటిని. కాని బ్రహ్మహత్య విడువకుండెను. నాపూర్వజన్మతపఃఫల
ముచే నేడు తమదర్శనమాయెను. నాయానందమునకు మేర లేకుండెను. మీపా
దంబులపై బడియున్న యీపాపాత్ముని రక్షింపుడు. నాకు శాంతి సుఖంబులు
చేకూర్చు డన, ఘోరపాపమునొందిన రాజునుగాంచి గౌతముడు కరుణార్ద్ర
చిత్తుడై శరణాగతరక్షకుడగు శంకరుడు భక్తులను రక్షింపుచుండ శివభక్తులకు
భయమెక్కడిది? గోకర్ణ క్షేత్రమున శివుని దర్శించినచో బ్రహ్మహత్యాది
సకలపాపములు నశించును. ఎంత మహాపాపులైనను నట నివసించినచో సకల

పాపములు నశించును. మహాబలు డనుపేరుతో శివుడక్కడ ప్రత్యక్షముగ నుండెను. సకల లింగములలో నామహాబలు డక్కడ సార్వభౌముడై యుండెను. ఇతడు చతుర్యుగంబులలోను నాలుగువర్ణంబులుగలిగి భక్తులను రక్షింపుచుం డును. ఈగోకర్ణ క్షేత్రము పశ్చిమసాగరతీరంబున గలదు. అటనున్న శివలింగ ములన్నియు మహాపాపములు హరించును. అటకేగి యటనున్న తీర్థమున గ్రుంకులిడి, మహాబలుని పూజించనచో శంకరపదవి లభించును. గాన నోరాజా! నీవటకేగి యామహాబలేశ్వరుని పూజించి, కృతార్థుడవై, యటనున్న సర్వతీ ర్థముల, స్నానమాచరించి, సర్వపాప వినిర్ముక్తుడవై శివలోకము నొందుమన, రాజు గౌతమవాక్కులు విని, గోకర్ణ క్షేత్రమేగి, యటనున్న తీర్థముల స్నాన మాడి శివుని సేవించి, విధూతకల్మషుడై శివసాయుజ్య నొందెను. ఈకథ నిత్యము విన్నచో తనతో నిరువదియొక్క తరముల వారు తరింతురు.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
పదవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునొకండవ యధ్యాయము

### ఉత్తరదిశనుండు లింగములు

ఓసూతమహర్షీ! పశ్చిమదిశయందున్న గోకర్ణక్షేత్రమందలి మహాబలే శ్వరుని మాహాత్మ్యమును చెప్పియుంటిరిగాన, నిక నుత్తరదిశయందున్న శివ లింగమాహాత్మ్యములు చెప్పగోరుచుంటి మని ఋషులుపలుక, సూతుడిట్లు చెప్పదొడంగెను. అందలిమాహాత్మ్యములు సంక్షేపముగ చెప్పెద వినుడు. గోకర్ణక్షేత్రముతో తుల్యమగునదియు, మహాపాతక నాశకరమైనదియు, నతిపవిత్రమైనదియు, విస్తారమైనదియు, నగు మహావనము గలదు. అట చంద్ర భాలు డనెడి యుత్తమంబైన శివలింగము గలదు. దానిని భక్తితో రావణుడు స్థాపించెను. ఈలింగము సర్వసిద్ధుల నొసంగును. వైద్యనాథేశ్వరు డెట్టి సిద్ధుల

నొసంగునో, యీచంద్రభాలుడుకూడ నష్టసిద్ధుల నొసంగును. దానిని రెండవ గోకర్ణక్షేత్ర మనిచెప్పుచుందురు. ఈక్షేత్రమందు స్నానముచేసి, చంద్రనాథేశ్వరు నర్చించినచో, శివలోక మవశ్యము లభించును. ఇది ముమ్మాటికి సత్యమని నమ్ముడు. సందియములేదు. ఈలింగ మహాత్మ్యము వర్ణింప నశక్యమై, పరమాద్భుతమై యుండెను. సకలపురాణ కర్తయైన, వ్యాసుడుకూడ దానిని సంపూర్తిగ వర్ణింపలేదు. ఐనను నాశక్తిసామర్థ్యముల ననుసరించి చెప్పితిని. ఇంకను నితర లింగములను గూర్చి చెప్పెదను వినుడు. మిశ్రర్షి తీర్థంబున దధీచిముని యొక శివలింగమును స్థాపించెను. ఆలింగమునకు దధీచీశ్వరుడని నామంబుగలదు. అందున్న తీర్థమున స్నానముచేసి దధీచీశ్వరు నర్చించినచో కృతకృత్యులగుదురు. తీర్థ యాత్రాభిలాషు లట నున్న దధీచిమూర్తిని సేవించినచో కృతకృత్యులై ఇహపరసౌఖ్యముల నొంది శివసాయుజ్యము నొందగలరు. నైమిశారణ్యమున సకలఋషులు కలసి యొకశివలింగమును స్థాపించిరి. అది ఋషీశ్వరలింగమను పేరుతో సర్వసుఖముల నొసంగుచుండును. ఎంతపాపులైన నాఋషీశ్వరలింగమును దర్శించినచో నిహపరసుఖంబుల నొందగలరు. హత్యాహరణ తీర్థమందున్న శివలింగము నర్చించినచో కోటి హత్యాదోషములైనను నశించును. దేవప్రయాగతీర్థమందున్న లలితేశ్వరు నర్చించినచో సర్వాఘములు నశించును. నేపాళదేశమున పశుపతీశ్వరుడను ప్రసిద్ధలింగము గలదు. ఇది శ్రేష్ఠలింగమై సర్వకామ్యములనీడేర్చి సర్వసిద్ధుల నొసంగుచుండును. సర్వలింగములలో నిది శ్రేష్ఠమైయుండెను. దాని సమీపమున ముక్తినాథేశ్వరుడను శివలింగము గలదు. దానిదర్శనార్చనలచే భుక్తిముక్తులు లభించును. మీకు నాలుదిక్కుల యందలి శ్రేష్ఠ శివలింగములను చెప్పితిని. ఇకమీరేది వినదలచితిరో జెప్పుడు.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందలి
పదునొకండవ అధ్యాయము సంపూర్ణము.

---

# పం[డెండవ యధ్యాయము

## హాటకేశ్వర ప్రాదుర్భావము

ఓసూతమహర్షీ! వ్యాసప్రసాదముచే తమకు తెలియని వేమియులేవు గాన, మిమ్ములడుగుచుంటిమి. మీచే చెప్పబడిన శివలింగము లన్నియు నెవరిచే పూజింపబడినవో యవన్నియు వినియుంటిమి. పార్వతీ పరమేశ్వరులు బాణలింగ రూపమున నెట్లుండిరో చెప్పుడని శౌనకాదు లడుగ సూతుడిట్లు చెప్పదొడంగెను. ఓవి[ప్రులారా! కల్పభేదముల ననుసరించి వ్యాసునిచే నే విన్నదంతయు చెప్పెద, వినుడు. శ్రేష్ఠమైన దారుకవనము గలదు. అందున్న ఋషిసత్తములందరు శివధ్యానపరాయణులై, శివభక్తులై, [త్రికాలముల యందు శివునర్చింపుచు, నానావిధస్తోత్రములచే శివుని స్తుతింపుచు నుండిరి. వారందరు నొకసమయంబున సమిధలకై వనమున కేగ, నింతలో శంకరుడు వారి భక్తిని పరీక్షించుటకై దిగంబరుడై, యతి తేజోవంతుడై, భస్మభూషితుడై, హస్తముచే, తన లింగము బట్టుకొని ఆ వనవాసుల సంతసింప జేయదలచి తానుస్వయముగ నావనమున కేగెను. ఆమునిపత్నులందరు నాదిగంబరుని గాంచి విస్మితులై, భయమొందుచు యొకరినొకరు కౌగలించుకొనుచు, నొకరిహస్తము నొకరుబట్టుకొని, యాశ్చర్యముగ చూచుచుండ, నింతలో ఋషివర్యులందరు నేతెంచి, విరుద్ధముగ నున్న యీనూతన పురుషుని గాంచుచు క్రోధో[ద్రిక్తులై దుఃఖిత లైన స్త్రీలనుగాంచి, యీవచ్చినవాడెవడు, మీరేల దుఃఖింపుచుంటిరని బలుకుచు, శివ మాయామోహితులై, దిగంబరుని వైపుగాంచుచు, నీవెవడవు? మాట్లాడ వేమి? వేదమర్యాదలువీడి సంచరింపుచుంటివేమి? నీవకార్యము చేయుచుంటివి. కాన, నాలింగము భూమిపై పడుగాక యనిఋషులుపలుక, వెంటనే ఈశ్వరుని లింగము భూమిపై బడి, ముల్లోకములు వ్యాపించి, యగ్నివలె ప్రజ్వరిల్లుచు, భువియందు స్థిరముగ నుండక నటునిటు సంచరింపుచు, లోకములను వ్యాకులత జేయుచుండ, ఋషులు దేవతలు మొదలగు వారందఱు దుఃఖింపుచు నది శివ సంబంధమని యెరుంగక [బహ్మను శరణుపొంద నేగి, యతనిని స్తుతించి, నమస్కరించి, సర్వము నెరింగింప, [బహ్మ శివమాయామోహితులగు వారినిగాంచి,

శంకరునకు మనసా నమస్కరించి, ఓ ద్విజవర్యులారా! మీరన్నియు తెలిసిన వారై యుండి, యిట్టియకార్యముచేసి యుంటిరేల? శివద్రోహులకు కుశల మెట్లుండును. మధ్యాహ్న సమయంబున నే తెంచిన యతిథిని మీరవమానించితిరి. ఇట్టియతిథుల నవమానించినచో నతనిదుష్కృతములు వానికివచ్చును. వాని సుకృతము లతనికివచ్చును. అతిథి నెప్పుడు శివునిగా పూజింపవలయును. శివుడే యిట్టి యతిథియై వచ్చియుండ మీరు గ్రహింప లేకుంటిరి. ఆజ్యోతిర్లింగ మును మీరు మనసా ధ్యానించినచో, మీయిక్కట్లు నివారించునన, మేమిపు డేమిచేయవలయునో సెలవిండని ఋషులు పలుక బ్రహ్మయిట్లు చెప్ప దొడంగెను.

పానవట్టరూపమైన పార్వతిని ధ్యానించినచో నీశ్వరుడు స్థిరముగ నుండగలడు. ఆవిధాన మంతయు మీకు చెప్పెదను. స్థిరచిత్తులై వినుడు ఒకపరిశుద్ధ ప్రదేశమును నలికి యష్టదళ పద్మము లిఖించి దానిపై నూతన ఘటము నుంచి, అందు దూర్వాంకురములు వేసి తీర్థోదకములచే కుంభమును పూరించి వేదమంత్రములచే, కుంభము నభిమంత్రించి, శివుని స్మరింపుచు వేదోక్తవిధిగ ఘటమును పూజించి, తజ్జలముచే శివుని శతరుద్రీయ మంత్రముచే (నమకముచే) నభిషేకించినచో శివుడు శాంతించును. తదుపరి గిరిజారూపమైన పానవట్టమునందు బాణరూపుడైన శివుని స్థాపించి, మరల నభిషేకించి, సుగంధ చందన పుష్ప, ధూప, దీప, నైవేద్యాదులచే శివు నర్చించి స్తుతించి, నృత్యగీత వాద్యములచే శివుని మెప్పించి జయజయ ధ్వానములుచేసి, యిట్లు స్తుతింపవలయును.

శ్లో॥ జగదాది ర్జగద్యోని ర్జగదంతర్గతోపిచ
శివో భవో మహేశాన స్సర్వాన్ లోకాంశ్చ పాలయేత్॥

శ్లో॥ ప్రసన్నో భవ దేవేశ జగదాహ్లాదకారక
కర్తా పాలయితా త్వంచ సంహర్తా త్వం నిరంకుశః॥

అని యిట్లు స్తుతించినచో నిర్వికారుడై యుండగలడని బ్రహ్మ పలుక దేవతలు, ఋషులు, విని బ్రహ్మతోకూడ నీశ్వరునికడ కేతెంచి, యీశ్వరుని

పూజించి, ప్రార్థింప, నీశ్వరుడు సుప్రసన్నుడై, ఓ దేవఋషులారా! పార్వతి వినా నాజ్యోతిర్లింగము నెవరును ధరింపలేరు నాయీజ్యోతిర్లింగమును పార్వతి ధరించినచో మీకు శాంతి చేకూరు నన, ఋషులు ఈశ్వరవాక్కులనువిని, బ్రహ్మను పురస్కరించుకొని పార్వతిని ప్రార్థింప, నామె సాక్షాత్కరించి, యాజ్యోతిర్లింగమును యథావిధిగ స్థాపనచేసి సర్వులకు సుఖము చేకూర్చెను. ఋషులు, దేవతలు, మంత్రోక్తవిధిగ నీలింగమును పూజించి, దానికి హాటకేశ్వరు డని పేరిడిరి. త్రిలోకవాసులు బ్రహ్మవిష్ణ్వాది దేవతలు సుఖముగానుండిరి. ఈహాటకేశ్వరస్వామిని సేవించిన వారిహాపర సౌఖ్యముల నొందగలరు. ఈశ్వరుని యోనిలింగము విప్రశాపముచే భూపతనమయ్యెనుగాన యిదిహాటకేశ్వర లింగమను పేరుతో ప్రఖ్యాతి వడసియుండెను. అప్పటి సమయంబున శివుని యోనిలింగము క్రిందబడిన ఖండములన్నియు నర్మదాలింగము లని, నర్మదబాణము లని చెప్పుచుందురు.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము.

---

## పదమూడవ యధ్యాయము

### అంధకేశ్వరమహిమ

సూతు డిట్లు చెప్పదొడంగెను. పూర్వము సాగర గర్తము నాశ్రయించుకొని యంధకు డను దానవు డుండెడివాడు. అతడు సురసూదనుడై, త్రిలోకములను తనవశము చేసికొని సర్వులను పీడింపుచుండెడివాడు. ఇతని పరాక్రమంబున కోర్వలేక దేవతలందఱు మాటిమాటికి శివుని ప్రార్థింపుచు వారి దుఃఖములు శివునితో విన్నవింప దుష్టహంతకుడు, సత్పురుషరక్షకుడు నగు శంకరుడు దేవతావాక్కులు విని, ప్రసన్నాత్ముడై, ఓసురలారా! నేను నా గణములతో నేతెంచి యంధకుని సంహరించెదను. మీరు, మీసైన్యములతో గర్తముకడ కేగు డన, దేవతలందఱు సైన్యముతో సాగర్తము

ముట్టడించిరి. దేవదానవులు పరస్పరము తుములయుద్ధము చేయుచుండిరి. శివానుగ్రహముచే దేవతలందఱు బలవంతులై దైత్యులను పీడింపజొచ్చిరి. ఆసమయంబున శంకరు డేతెంచి తనశూలముచే నంధకాసురుని పొడువ, నత డు శంకరుని గాంచి, ఓశంకరా! అంతకాలమున నిన్నుగాంచిన వారికి నీసా రూప్యము తప్పక సిద్ధించు నని యనేకవిధంబుల స్తుతింప, శంకరుడు సంత సించి, నీవు వరము కోరు మిచ్చెద నన, నాదైత్యుడు సత్వభావమునొంది యీశ్వరునకు నమస్కరించి స్తుతించి, ఓప్రభూ! నీకు నాయందు దయగల్గి నచో నాకు నీభక్తి నిచ్చి నీ విక్కడ లింగరూపమున స్థిరముగ నుండు మన, నీశ్వరుడు సంతసించి, ఆగర్తమున లింగరూపుడై వెలసి, భక్తుల కామ్య ముల నీడేర్చుచు, నంధకేశ్వరు డను పేరుతో నట నుండెను. యీలింగ మును నారుమాసములు పూజించినచో సర్వసిద్ధులు కలుగును. సర్వకోర్కె లీడేరును. జీవనోపాధికై ధనముతీసికొని యారుమాసము లెవడు శివలింగ ము నర్చించునో వాడు దేవలకుడని చెప్పబడును. (అనగా పూజారి.) ఇట్టి వాడు పంక్తిబాహ్యుడు.) పూజసేయుటకుగాడు. బ్రాహ్మణాధికారము లేదన, దేవలకునివలన ప్రపంచమునకేదేన నుపకారమున్నదా లేదా చెప్ప గోరుచుంటి మని ఋషులుపలుక సూతుడిట్లుచెప్పదొడంగెను.

ధర్మిష్ఠుడు, వేదపారగుడు, శివభక్తిరతుడు, శివశాస్త్రపరాయణుడు నగు దధీచియను విప్రుడుగలడు. అతనికి సుదర్శనుడను పుత్రుడుగలడు. ఇతనికి దుష్కులోద్భవయైన దుకూల యనెడి భార్యగలదు. ఈమెకు నలు గురు పుత్రులుగలరు. పుత్రులు భర్తకూడ నామెకువశులైయుండిరి. ఈ పుత్రులందఱు తండ్రివలె గుణవంతులు, శివభక్తులైయుండిరి. సుదర్శనుడు నిత్యము శివపూజచేయుచుండిడివాడు. దధీచియొక దినంబున తన బంధు వుల గృహమునకు శుభకార్యమునకై యేగదలచి తనకుమారుని పిలిచి, భక్తిశ్రద్ధలతో నిత్యము శివార్చన చేయుమనిచెప్పి, గ్రామాంతరమునకేగి బంధువు లాపివేయుటచే చిరకాలమటనే యుండిపోయెను. సుదర్శనుడు భక్తితో శివపూజను చేయుచుండ, శివరాత్రి యేతెంచెను. అందఱు శివరాత్రివ్రతము చేయుచు నుపవాసము లుండిరి. సుదర్శను డుపవాసముండుటచే చెంతనున్న

వారందఱు నుపవాసముండిరి. సుదర్శనుడు శివరాత్రియం దుపవసించి పగ లంతయు నభిషేకములు, శివపూజలుచేసి యారాత్రి దుష్టకులోద్భవియైన తనభార్యప్రేరణచే నామెతో రమించుటయేగాక, స్నానమైనను చేయకుండ గనే మరల శివపూజలు ప్రారంభింప, నితని యకృత్యమునకు శంకరుడు కోపించి, ఓదుష్టాత్ముడా! శివరాత్రినాడు స్త్రీసంగ మొనర్చితివి. ఇదియునుగాక యవివేకివై స్నానముచేయకుండ నాపూజలు చేయుచుంటివి. గాన నీవు జడు డవై యుందువుగాక. నీ వస్పృశ్యుడవై యుంటివిగాన, నన్ను తాకక దూర మునుండి దర్శింపు మనెను. అప్పటినుండి సుదర్శనుడు శివమాయా మోహితుడై జడుడై ప్రవర్తింపుచుండెను. ఇంతలో శివసత్తముడైన దధీచి గ్రామాంతరమునుండివచ్చి సర్వమునెరింగి పుత్రుడు చేసినదుష్కృత్యమునకు హాతోస్మియని దుఃఖింపుచు మాటిమాటికి నదియే తలపోయుచు, నా కుపుత్రునిచే నాకులమంతయు ధ్వంసమయ్యెను. నాసుతుని మనంబు దుష్టమతియగు కోడలు చెడగొట్టెనని విచారించి, తనపుత్రిక్షేమమునకై పార్వతీదేవిని పలువిధంబుల పూజింప నారంభించెను. తండ్రియాజ్ఞచే సుద ర్శనుడుకూడ చండికాదేవిని పూజించి, యనేక స్తోత్రములచే పూజింపు చుండెను. తండ్రికుమారు లిరువురు నతిభక్తితో చండికను సేవింప, నాదేవి సంతుష్టురాలై సుదర్శనుని తనపుత్రునిగ భావించి, యితనిపై క్రోధము వీడుమని శివుని ప్రార్థింప, శంకరుడు సుదర్శనునిపై క్రోధమున్నను, గిరిజావాక్యములచే ప్రసన్నుడై యుండ, గిరిజ సుదర్శనుని బట్టుకొని శివుని యంకమందు కూర్చుండబెట్టి ఘృతముచే యభ్యంగస్నానము చేయించి, ఒక్కముడితోగూడిన మూడుపేటల యజ్ఞోపవీతము ధరింపజేసి, షోడ షాక్షరసంయుక్తమైన శివగాయత్రీ మంత్రము నుపదేశించి, శ్రీశబ్దపూ ర్వకముగ, ఓంనమశ్శివాయ యను మంత్రమును షోడశపర్యాయములు జపిం పజేసి సంకల్పముచెప్పి షోడశోపచారములచే శివుని పూజింపచేసెను. ఇవ న్నియు మేళతాళములతో ఋషులసన్నిధిని యథావిధిగజేయించెను. శివనామమంత్రము లనేకముగ సుదర్శనుడు పఠింప, శంకరుడు ప్రసన్నుడై. ఓసుపుత్రా! మాకుసమర్పించినది ప్రతిద్రవ్యము నీ వనుభవింపుము. నీ కే దోషముండదు. నీవునాకు ముఖ్యుడవు దేవికి విశేషముగ ముఖ్యుడవు. నాకీయ

బడిన ఘృత తైలాదికములన్నియు నీవే గ్రహింపుము. నీవుముఖ్యముగ ప్రాజాత్య వ్రతముచేయుము. ఆపూజనసంపూర్ణ కానిచో నిష్ఫలమగును నీవు నిత్యము స్నానముచేసి వర్తులాకారముగ నుదుట తిలకముధరించి శివసంధ్య వార్చి శివగాయత్రి జపించి ముందుగా నన్ను సేవించి, తరువాత నితరకార్యములు చేయవలయును. ఇట్లు చేసినచో నీకు శుభంబులు కలిగి, యశుభంబులు నశించును. నాయనుగ్రహముచే నీదోషములన్నియు పోవునని శంకరుడు పలికి సుదర్శనుని నలుగురుకుమారులకు నలుదిక్కుల రాజ్యాభిషేకము చేసెను. చండి తన పుత్రతుల్యులైన సుదర్శనుని తన చెంతను స్థాపించి యతని కనేకవరంబులిచ్చి పార్వతి పరమేశ్వరుల మగు మాయిరువురిమధ్య మీ వటువులందఱు స్థిరముగనుండి విజయము పొందుదురుగాక. వటువులను మిమ్ములపూజించినవారలు, మమ్ముల పూజించినవారగుదురు. మిమ్ములను పూజించిన పిమ్మట మమ్ములను పూజించినచో మేము సంతసింతు మని వారిని స్థాపించిరి. ఈవటువులు పార్వతీ పరమేశ్వరులచే స్థాపింబడిరి గాన వీరు పూజనీయులైరి. తపోభ్రష్టులు ఈవటువులను స్మరించినచో తపోధను లగుదురు. శివకృప యున్నచో నెంత యధము లైనను నధికు లగుదురు. వటువులను ప్రథమమున పూజించినచో మహాత్ములకు మహాపూజలు గావించిన ఫలము వచ్చును. వారిని వ్రతాదులయందు ముందుగా నర్చింపక, శివపార్వతులను పూజించినను ఫలము లేదు. శుభంబులుచేకూరవు. శుభాశుభంబులయందుగూడ వటుపూజ మానక చేయవలయును ప్రాజాపత్యవ్రతము నందు వటుభోజనము విశేషమైనది. శివపార్వతుల వ్రతసమయమందు కూడ వటుభోజనము విశేషము. దానినిగురించి యొక యితిహాసము చెప్పెద, వినుము.

అంధకేశుని సమీపమున భద్రుడనెడి రాజు ప్రాజాపత్య నియమంబుతో నిత్యము విప్రులకు భోజన మిచ్చుచుండెడివాడు. శివానుగ్రహకారణముచే నటనొక యద్భుతము జరిగెను. అదంతయు చెప్పెదవినుము. శంకరుడు రాజు నియమవ్రతములకు సంతుష్టుడై, అతనికొక ధ్వజము నిచ్చి ఓరాజా, యాధ్వజము పగటియందు వృద్ధిజెంది, రాత్రి పతనమగుచుండును. బ్రాహ్మణ

భోజనము కానిచో దివారాత్రుల నెడి భేదము లేకుండ, పతనమొందక సర్వదా నిలిచి యుండునని చెప్పి, శంకరు డంతర్హితు డయ్యెను. రాజు సంతసించి ప్రాజాపత్యవిధిగ నిత్యము శివపూజ చేయుచుండెను. ఈవిధంబున ధ్వజము పగలు వృద్ధి జెంది వ్రతసంపూర్తి యైనతరి, రాత్రి పతనమగుచుండెను. కానిచో నిలిచియే యుండును. ఒకానొక సమయంబున బ్రాహ్మణభోజనము కాకుండగనే ధ్వజము పతనమయ్యెను. రాజు పండితులను రావించి బ్రాహ్మణభోజనము కాకుండగనే నాధ్వజము పతనమగుటకు కారణమేమి? యథార్థము బలుకు డన, పండితోత్తములగు విప్రులు, రాజా! ముందుగా చండీపుత్రుల వటుభోజనమైనది. దానిచే పార్వతీపరమేశ్వరులు సంతసించిరి. దానితో వ్రతఫలమంతయు సంభవించెను. గాన బ్రాహ్మణభోజనము కాకున్నను ధ్వజముపడిపోయెను. గాన నీకు వ్రతలోపమేదియు లేదు. వటుభోజనముచే నావ్రతము పరిసమాప్తిఅయ్యెను. దానిలో నంతమహాత్మ్య గలదన నటనున్న వారు, రాజును, పండితవాక్కులు విని, కడుసంతసించి, మిక్కిలి యాశ్చర్యమునొందిరి. వటుభోజనమునం దెంత మహాత్మ్యగలదో తెలిసికొనుడు. ఈపూజకు బ్రహ్మచారులకే యధికారము. ఇదిశివశాసనము. వటుభోజనముచే శివపూజ పూర్తియగును.

శివ మహాపురణమునందలి కోటిరుద్రసంహితయందు
పదుమూడవ అధ్యాయము సంపూర్ణము

---

## పద్నాలుగవ యధ్యాయము

### సోమనాథ జ్యోతిర్లింగోత్పత్తి

జ్యోతిర్లింగ మాహాత్మ్యములు, వాటియుత్పత్తి విధానములు మీరు విన్నట్లుగ మాకు జెప్పుడని ఋషులు పలుక, సూతుడిట్లు చెప్పదొడంగెను. ఓఋషులారా! నా గురువగు వ్యాసునిచే విన్నదియు, నాకు తెలిసినదియు చెప్పెదను. సావధానులై వినుడు, దక్షుడు తనసప్తవింశతికన్యకలను చంద్రున

కిచ్చి యుద్వాహముచేసెను. సువర్ణముచే మణులు, మణులచే సువర్ణము శోభించునట్లు సోమునిచే సప్త వింశతి తారకలు, తారకలచే సోముడు శోభించుచుండెను. చంద్రుడు తనభార్యలలో రోహిణి నెక్కుడుగ ప్రేమించెడివాడు. మిగిలినవారందఱు చంద్రునకు ప్రీతిపాత్రులు కాకుండుటచే, తండ్రి కడకేగి మొరబెట్టుకొనగ, దక్షు డిదంతయు విని దుఃఖితుడై చంద్రునికడకేగి, శాంతముగ నిట్లు పలికెను. ఓ చంద్రా! నీవు సత్కులసంజాతుడవు. విమలవంశ జనితుడవు. నాపుత్రికలందఱు నీభార్యలేకదా! వారందఱు నీ యాశ్రితలేకదా. వారిలో నీకు న్యూనాధిక్యము లెందుకు? ఇట్టి యనుచిత కార్యము శోచనీయము. ఇట్టి విషమప్రవర్తనచే నరకముకూడ ప్రాప్తించునని చంద్రున కనేక విధముల బోధించి, దక్షుడు తనగృహమునకేగ, చంద్రుడు శివమాయామోహితుడై, మామగారి మాటను పెడచెవినిబెట్టి యథాప్రకారముగ సంచరింపుచుండెను. ఎంతటి వారలైనను శివమాయను దాటలేరు. జగత్తంతయు శివమాయామోహితమై యుండెను. శుభము దలచిన శుభమే కలుగును. అశుభము దలచిన నశుభమే జరుగుచుండును. అంతయు శంకరుని కటాక్షము. చంద్రుడు విధివశముచే దక్షునిమాటలు గణింపక రోహిణినే కను గారాబముగ చూచుచు నహర్నిశము నామెయందే గాఢానురక్తుడై యుండెను. దక్షుడిది విని దుఃఖితుడై, మరల చంద్రునికడకేతెంచి, చంద్రా! యేమిటి విపరీతముని యనేకనీతి మార్గము లుపదేశించినను, చంద్రు డంగీకరింప కుండుటచే, నీవు క్షయరోగముచే పీడింపబడుదువుగాక యని చంద్రుని శపింప, నాతడా క్షణమునందే క్షయరోగ పీడితుడయ్యెను. దేవతలు, ఋషులు, ఇది విని హాహాకారములుచేయుచు, నిపు డేమిచేయుదుమని దుఃఖించుచు, భయవిహ్వలులై శక్రాది దేవతలు, వసిష్ఠాది మహర్షులు బ్రహ్మకడ కేగి, యిదంతయు విన్నవింప, బ్రహ్మ విస్మయమొందుచు, శివమాయను ప్రశంసించుచు, అయ్యో, సర్వలోకములకు కష్టముకల్గించు నుపద్రవము వచ్చినది. చంద్రుని యసభ్యత్వమునకు, దక్షు డీతనిని శపించెను. చంద్రుడనేక దుష్టకర్మలుచేసి యుండెను. పూర్వమితడు బృహస్పతి గృహమునకేగి, తార నపహరించి, దైత్యులతో కలసి దేవతలతో యుద్ధముచేసెను. అత్రి నిషేధింపగ తారను మరల బృహస్పతికిచ్చి యుండెను. తార గర్భవతి యని తెలిసికొని, బృహస్పతి తారను స్వీకరించుటకు

నంగీకరింపక యుండుటచే, యీగర్భ మెవరివలన కల్గినదని, బ్రహ్మ తార నడుగ, చంద్రునివలన కల్గినదని తార పలికెను. ఈమె ప్రసవించిన పిమ్మట, బ్రహ్మ యాజ్ఞచే బృహస్పతి తారను గ్రహించెను. ఈవిధంబుగ చంద్రుడనేక దుష్టకర్మలుచేసియుండెను. అతని దుష్కృత్యము లెన్నియని చెప్పుదును. మీరందఱు ప్రభాసతీర్థము కడకు చంద్రునిగొంపోయి, మృత్యుంజయమంత్రముతో శివునారాధింపజేయుఁడు. ఈశ్వరలింగము నెదుటబెట్టుకొని నిత్యము శివార్చనచేయుఁచుండు. ఇట్లు చేసినచో, శివుడుప్రసన్నుడై క్షయరోగము నివారింప జేయు,నన, దేవతలు, ఋషులు బ్రహ్మవాక్కులువిని దక్షునూరడించి, చంద్రుని ప్రభాస తీర్థమునకు గొంపోవ చంద్రుడు సరస్వతి మొదలగు తీర్థముల నాహ్వానముజేసి మృత్యుంజయ విధానముగ పార్థివ పూజచేయ మొదలిడెను. దేవతలు ఋషులు, చంద్రు నిట తపోనిష్ఠునుజేసి, వారివారి ధామములకేగిరి. చంద్రుడు షణ్మాసములు మృత్యుంజయ మంత్రముచే వృషభధ్వజుని పూజించి, ధ్యానింపుచు, నిశ్చల మనస్కుడై దశకోట్లు మృత్యుంజయ మంత్రమును జపింప, శంకరుడు సంతసించి ప్రసన్నుడై సాక్షాత్కరించి, చంద్రా! నీతపంబునకు మెచ్చి నేను ప్రసన్నుడనై వరమీయ దలచితిని. నీయీప్సితము తెలుపు మన, నోప్రభూ! నీవు ప్రసన్నుడవైనచో నాకు సాధ్యము కానున్న దేమున్నది? నాక్షయరోగమును బోగొట్టి నాయపరాధములను క్షమించి సర్వదా నాకు శుభములు చేకూర్చు మన, ఓచంద్రా! నీవు దినమునకొక్క కళచొప్పున పక్షమువరకు క్షీణింపుచు మరియొక పక్షమున దినమునకొక్క కళచొప్పున వృద్ధినొందెద వని యీశ్వరుడు పలుక, నింతలో దేవతలు ఋషులు నేతెంచి హర్షనిర్భరమానసులై చంద్రు నాశీర్వదించి బద్ధాంజలి పుటులై శివునకు నమస్కరించి, ఓ దేవదేవా! మహాదేవా! పరమేశ్వరా! నీకునమస్కారము. నీవు ఉమాసహితుడవై నిట స్థిరముగ నుండుమని ప్రార్థించిరి. చంద్రుడుకూడ తనపేరుతో స్థిరనివాసియై యుండుమని శంకరుని ప్రార్థింప, నిరాకారుడగు శివుడు, సాకారుడై చంద్రుని కీర్తి స్థాపింప దలచి సోమనాథేశ్వరుడను పేరుతో నచటనే స్థిరనివాసుడై త్రిలోకవిఖ్యాతుడై యుండెను. ఈస్వామిని సేవించినచో,క్షయ కుష్ఠవ్యాధులు నశించును. ఇతడు జగతీతల మంతయు పవిత్రము చేయుచుండెను. దేవత లందఱు నట నొకకుండమును

స్థాపించిరి. ఇంకను నట శివబ్రహ్మ కుండ మొకటి కలదు. పాపనాశమగు చంద్ర కుండ మొకటి కలదు. ఇందుస్నానముచేసిన వారల సర్వపాపములు నశించి సర్వవ్యాధులు ప్రశమించును. ఎట్టి యసాధ్య రోగములైనను చంద్రకుండ స్నానముచే నివారింపబడగలవు. ఇందారు మాసములు స్నానముచేసినచో నివారింపని రోగములే యుండవు. ప్రభాస తీర్థమునకు ప్రదక్షిణ మొనర్చి నచో భూప్రదక్షిణచేసిన ఫలమువచ్చును. అచట మృతినొందిన వారలు స్వర్గలోకము నొందగలరు. సోమనాథ లింగమును దర్శించినచో సర్వపాప విముక్తుడై మనోభీష్టంబులు నెరవేరి అంతమున స్వర్గవాసులగుదురు. ఏ కోర్కెలతో నాతీర్థ మేతెంచిన నాకోర్కె లవశ్యము సిద్ధించును. ఈవిధంబున సోము డాతీర్థరాజమును సేవించి సర్వసిద్ధులు బడసి, క్షయని వారితుండు కాంగా, దేవతలందఱు సంతసించి ప్రశంసించుచు చంద్రునితో స్వస్థానమున కేగిరి. ఇవ్విధంబున సోమేశ్వరు డుద్భవించెను. ఈలింగము సౌరాష్ట్రమునం గలదు. దాని శ్రవణపఠనాదులచే సర్వపాపవినిర్ముక్తులై, సర్వకోర్కె లొందగలరు.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
పద్నాలుగవ అధ్యాయము సంపూర్ణము.

---

## పదియేనవ యధ్యాయము

### మల్లికార్జున లింగోత్పత్తి

మల్లికార్జున లింగమునుగూర్చి చెప్పెదను. ఇది విన్నంతనే సర్వపాపములు నశించి భక్తిమంతులు ధీమంతులు నగుదురు. ఈచరిత్ర నిదివరలో చెప్పి యుంటిని. మరలచెప్పెద వినుము. శివపుత్రుడు, తారకారియు నగు కుమార స్వామి భూప్రదక్షిణముచేసి కైలాసమునకు వచ్చినతరి, నారదుడేతెంచి గణపతి వివాహసంగతులన్నియు నెరిగింప, కుమారుడు కోపించి తలితండ్రు లెంత వారించినను వినక, వారికి నమస్కరించి క్రౌంచపర్వతమున కేగెను. కుమార వియోగము సహింపనేరక, పార్వతి దుఃఖింపుచుండ, కుమారుడు మరల

తిరిగివచ్చునని పార్వతినూరడించుచు బుద్ధిమంతులైన దేవతలను, ఋషులను పిలిచి, కుమారుని తీసికొనిరమ్మని యాజ్ఞాపింప, వారందఱు కార్తికేయుని కడకేగి, నమస్కరించి, సర్వము విన్నవింప, కుమారు డహంకారముతో శివు నాజ్ఞను తిరస్కరించి రాకుండుటచే, దేవతలందఱు చేయునదిలేక, శివున కిదం తయు విన్నవించి, శివాజ్ఞచే వారివారి స్థానములకేగిరి. కుమారుడు రాకుండు టచే లోకాచారప్రకారముగా పార్వతీ పరమేశ్వరు లతిగా దుఃఖించుచు కుమా రునికడ కేగిరి. తలితండ్రు లేతెంచుచుండి రని తెలిసికొని కుమారుడు క్రౌంచ పర్వతమునుండి యోజనత్రయదూర మేగెను. పుత్రుడు దూరమున కేగెనని శివపార్వతులు విరహాతురులై జ్యోతీరూపులై వారువచ్చిన తావుననే నివసిం పుచు, అమావాస్యరోజున ఈశ్వరుడు, పౌర్ణమిరోజున పార్వతియు కుమారుని కలిసికొని వచ్చుచుండెడివారు. అదినమునుండి శివుడు మల్లికార్జున లింగమని ప్రసిద్ధికెక్కెను. ఈలింగము ముల్లోక ప్రసిద్ధమైయుండెను. దానిని దర్శించినవారలు సకలదోషవిముక్తులై సర్వకామ్యముల నొందుచు, సర్వ దుఃఖదూరులై యత్యంత సుఖముల నొందగలరు. ఇట్టివారు మాతృగర్భమునం దెన్నడును జన్మింపరు. పునర్జన్మముండదు. ధనధాన్యసమృద్ధియు పేరుప్రతిష్ఠలు, నాయురారోగ్యములు, నభీష్టఫలసిద్ధుల నొందుటలో సంశయములేదు. దర్శన మాత్రముచే సర్వ సుఖములనిచ్చు లోకహితమునకై యుద్భవించిన మల్లి కార్జునలింగమును గూర్చి చెప్పితిని, ఇది రెండవది.

శివ పురాణమునందలి కోటిరుద్రసంహితయందు
పదియేనవఅధ్యాయము సంపూర్ణము

---

## పదియారవ అధ్యాయము

### మహాకాల జ్యోతిర్లింగోత్పత్తి

ఓసూతమహర్షి ! వ్యాసప్రసాదముచే సర్వము నెరింగితివి. జ్యోతిర్లింగ గాథ లెన్నివిన్నను మాకు తృప్తికలుగుటలేదు. ఇటుపై, తృతీయజ్యోతిర్లింగ

గాథను చెప్పుమని మహర్షులు పలుకగ సూతుడిట్లు చెప్పదొడంగెను. ఓమహర్షు లారా! మీయందరి సాంగత్యముచే నేను ధన్యుడను. కృతకృత్యుడను. నా భాగ్యవశముచే పావనమైన కథను మీరు ప్రశ్నించుచుంటిరి. పాపప్రణా శనమైన దివ్యగాథను చెప్పెదను. ఆదరముతో వినుడు. సర్వజీవులకు ముక్తి నిచ్చునదియు, శివప్రియమైనదియు, మహాపుణ్యమైనదియు, లోకపావనమైన దియు, నవంతినగరము గలదు. అందు శుభకర్మ పరాయణుడగు బ్రాహ్మణోత్త ముడు గలడు. అతడు వేదకర్మలు చేయుచు, నితరులచే చేయించుచు నగా ఖ్యాధానములు చేయుచు సదాశివపూజా నిరతుడై నిత్యము పార్థివలింగమును పూజించెడివాడు. మఱియు నితడు సర్వకర్మఫలంబులనొంది వేదప్రియుడై సమ్యగ్ జ్ఞానపరాయణుడై సత్పురుషులు పొందినగతిని పొందెను. ఇతనికి తనతో సమానులగు పుత్రచతుష్టయము గలదు. తండ్రివలె వారును నిత్యము, శివపూజలు చేయుచుండెడివారు. వారిలో జ్యేష్ఠుడు దేవప్రియుడు. రెండవ వాడు మేధాప్రియుడు. మూడవవాడు సుకృతుడు. నాల్గవవాడు ధరం వాహుడు ననునామంబులతో నొప్పుచు తలిదండ్రుల నతిగౌరవముతో గాంచ చుచుండెడివారు. తలిదండ్రులపుణ్యప్రభావముచే వారు శుక్లపక్షచంద్రునివలె దినదిన ప్రవర్ధమానులైరి. ఇవ్విధంబుననే వారిసుగుణంబులు గూడ వృద్ధి నొందన సాగెను. వారి బ్రహ్మతేజంబుచే నానగరమంతయు ప్రకాశింప జొచ్చెను. వారిని గురించి యొక యద్భుతమైన చరిత్రవింటిని. నాకు తెలిసి నంత వరకు వివరించి చెప్పెద వినుడు. రత్నమాలయను పర్వతమునందు ధర్మద్వేషి, బలవంతుడు, దైత్యరాజు నగు దూషణుడను మహాసురుడు గలడు. ఇతడు బ్రహ్మవరదర్పితుడై పృథ్విని తృణప్రాయముగ నెంచుచు దేవతల నోడించి వారి స్థానము లాక్రమించుకొని పృథ్వియందున్న వేద ధర్మమార్గము లన్నియు, సింహము కుందేళ్లవలె నశింపజేయుచుండెను. ఇంకను వేదధర్మ ములు, బ్రాహ్మణ ధర్మములు, క్షేత్రధర్మములు, తీర్థధర్మములు, దూరముచేయు చుండెను. ఒకానొక సమయంబున తన పర్వతప్రాంతమునం దవంతీనగరము నందు శ్రేష్ఠబ్రాహ్మణు లుండిరని తెలిసికొని, యామదుష్టుడగు దూషణు డవంతీ పురిని ప్రవేశించి, నల్గురదుష్టరాక్షసుల బిలిచి, నాకు సర్వులు వశులైరిగాని, వేదధర్మపరాయణులగు నానల్గురు విప్రులు నాకు వశులు గాకుండిరి. వారు

నామాట పాటింపక వేదధర్మక్రియల నొనర్చుచుండిరి. గాన నాదుష్టులు నాకుశత్రువులు. సర్వులు నాచేపరాజితులైరి. ఈబ్రాహ్మణులు మాత్రము నాకు వశు లగుట లేదు. వారికి జీవితేచ్ఛ యున్నచో వేదధర్మములు, శివ పూజ మాని సకలభోగము లనుభవింప వచ్చును. లేనిచో వారు జీవించుట కష్టము. ఇదిముమ్మాటికి సత్యమని వారితో జెప్పు డన, నీదుష్టచతుష్టయము సైన్యములతో పట్టణము నలు వైపుల ముట్టడించి బ్రాహ్మణులందఱను పీడింపు చున్నను శివధ్యానపరాయణులగు నల్గురువిప్రులు నేదుఃఖము పొందక నణు మాత్రమైనను చలింపక, నిశ్చలులై ధ్యానమగ్నులై యుండిరి. శివుడు వారి యందు ప్రసన్నుడై యుండ నాదుష్టులేమి చేయగలరు. లోకుల నందఱిని పీడింపుచు నానగరవాసుల పీడింపనెంచియుండ, పురవాసులందఱు భయపడి నిపుడేమిచేయుదుమని, విప్రశ్రేష్ఠులగు నానలుగురతోను బలుక, వారిట్లనిరి.

ఓప్రజలారా! ఆరాక్షసుల జయింప మా శక్యముకాదు. మేమేమి చేయుదుము. మనలనందఱిని రక్షించుట శంకరుడే సమర్థుడు. ఈదుష్టుల జయించుటకు మనకు బలమును లేదు. శస్త్రములును లేవు. ఇపుడు మనకు శివుడే రక్షకుడు. అతడువినా మనకు వేరొకడుశరణ్యుడులేడు. తనయాశ్రితుల యవమానమును సామాన్యులే భరింపలేకున్న. పరమేశ్వరునిమాట వేరుగ జెప్పనేల? దేవతలకు, మనుజులకు నతడే శరణ్యుడని, కృతనిశ్చయులై యాద్విజవర్యులు పార్థివశివార్చనచేయ మొదలిడిరి. ఈవిప్రుల చంపుడు కొట్టుడని దూషణుడు పలుకుచు విప్రుల సమీపించియుండ, శివధ్యానపరా యణులగు నాద్విజులు దుష్టునిమాటలు చెవినిబెట్టక ధ్యానమగ్నులై యుండిరి. రాక్షసు డా విప్రుల జంప నుద్యుక్తుడై యుండ, నింతలో నాపార్థివలింగస్థానము పెద్దగర్త మొకటి గావించి, మహారవంబులు జేయుచు శివు డటనావిర్భవించెను. ఈశివుడే సత్పురుషుల రక్షించుచు, దుష్టుల శిక్షింపుచు మహాకాలుడను పేరుతో వెలసి, దూషణా! యీవిప్రులు నాభక్తులు. దూరముగ పొమ్మనుచు. నతడు పోకుండుటచే, తన హుంకారముచే సైన్యసహితముగ దూషణుని భస్మముజేసెను. దూరముగనున్న సైనికులు పారిపోయిరి. సూర్యునిచే నంధ కారము నశించునట్లు, శివతేజముచే దుష్టదానవులు నశించిరి. దేవతలందఱు దుందుభులు కుసుమవృష్టిని కురిపించిరి బ్రహ్మవిష్ణ్వాది దేవతలందఱు నేతెంచి

స్తుతించిరి. శంకరుడు విప్రుల గాంచి వరములు కోరు డన, విప్రులు కృతాంజలి పుటులై, శివునకు భక్తితో నమస్కరించి, ఓ దేవ దేవా! మహాదేవా! ఓమహాకాల! ఓప్రభూ! మమ్ములను సంసారసాగరమునుండి తరింపజేసి ముక్తి నొసగుము. నీవులోక రక్షణార్థమై యిటనుండి, నిన్ను దర్శించిన వారల రక్షింపుచుండు మన, శంకరుడు లింగరూపుడై యాగర్తమందు మహాకాల నామంబుతో నుండి భక్తులను రక్షింపుచు నావిప్రులకు సద్గతినిచ్చెను. ఈ లింగము క్రోశదూరమువరకు జ్యోతిర్లింగరూపమై నలుదెసల ప్రకాశింపుచుండెను. ఈమహాకాలుని దర్శించినచో స్వప్నమందు కూడ దుఃఖములు కలుగవు. ఏకోర్కెలతో సేవించిన నాకోర్కెలు సిద్ధించును. మహాకాలుని సర్వవృత్తాంతము జెప్పితిని ఇక నేమి విన గోరుచుంటిరో చెప్పుడనెను.

శివ మహాపురాణమందలి కోటిరుద్రసంహితయందు
పదునారవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునేడవ యధ్యాయము

### మహాకాలజ్యోతిర్లింగమాహాత్మ్యము

మహాకాలమాహాత్మ్యము నతని భక్తుల మాహాత్మ్యములను ఇంకను జెప్పగోరుచుంటి మని ఋషులు కోరగా, సూతుడిట్లు చెప్పదొడంగెను. భక్తివర్ధకమగు మహాకాలుని చరిత్ర చెప్పెద, నాదరముతో వినుడు. ఉజ్జయినీనగరంబున భద్రసేనుడను మహారాజుగలడు. అతడు సర్వశాస్త్రార్థతత్వజ్ఞుడు, శివభక్తుడు, జితేంద్రియుడునై యుండెను. ఇతనికి గిరాతగణముఖ్యుడు, సర్వలోకనమస్కృతుడు నగు మణిభద్రు డను సఖుడు గలడు. ఇతడు తనమిత్రుడైన రాజున కుదారబుద్ధితో మహామణి యగు చింతామణి నిచ్చియుండెను. ఆమణి కౌస్తుభసదృశమై సూర్యునివలె ప్రకాశింపుచుండెను. దానిని ధ్యానించినను, చూచినను, విన్నను సర్వమంగళములు

చేకూరును. దానికాంతి సోకినచో కంచుగాని, రాగిగాని, యేవిధమైన పాషాణములుగాని సువర్ణము లగును. ఇట్టిచింతామణిని చంద్రసేన మహారాజు కంఠమున ధరించి దేవతలలో రవివలె ప్రకాశింపజొచ్చెను. చింతామణిగ్రీవుడైన రాజునుగాంచి లోభముచే మణి కాశించి యనేకోపాయములచే నితరరాజులు ఈమణిని గూరించిరి. కాని నిష్ఫల మగుటచే రాజులందఱు నేకమై, శివభక్తుడగు చంద్రసేనుని జయించి మణి నపహరించుటకై సర్వసేనలతో నుజ్జయినీనగరము నలుమూలల నాలుగుద్వారములు ముట్టడింప, రాజొక్కడు చేయునదిలేక ఈశ్వరుని శరణుజొచ్చి నిరాహారుడై, నిర్విసల్పుడై, దృఢనిశ్చయుడై తదేకనిష్ఠుడై ధ్యానింపుచుండెను. అతడెట్లు ప్రసన్నుడై యితని నేవిధముగ రక్షించెనో చెప్పెద, వినుము.

ఆసమయమున నొకగోపాంగన తనపుత్రుడగు పంచవర్ష ప్రాయుడగు బాలునితో శివసన్నిధి కేగ, రాజాశివునికి చేయు పూజలన్నియు నాబాలుడు గాంచి, తనగృహమున కేగి, తానుకూడ శివపూజలు చేయవలె నని యెంచి, యందమగు పాషాణమొకటి తెచ్చి దానిని గంధ పుష్పాది దీపంబులచే భక్తితో శివునిపూజించి కృత్రిమ పదార్థములను నైవేద్యము చేయుచు, మాటిమాటికి పత్ర పుష్పాదులు తెచ్చి పూజింపుచు, నమస్కరింపుచు నృత్యము చేయుచుండ, యింతలో తల్లియగు గోపిక వచ్చి, కుమారుని భోజనమునకై పిలువ, సతడు శివాసక్తమనస్కుడై యుండుటచే మాట్లాడక ధ్యాననిష్ఠుడై మౌనముదాల్చి శివునియెదుట కూర్చుండుటచే, తల్లి కోపించి బాలకుని బట్టుకొని తాడనముచేయ, నాపిల్లవాడు ఏడ్చుచుండ నాశివలింగమును దూరముగ గెంటి సర్వంధముగ శివార్చన జరుగకుండ చేసెను. ఆబాలకు డక్కడనే కూర్చుండి శివపూజాభంగము జరిగె నని దుఃఖింపుచు, మొత్తుకొయని యేడ్చుచుండ, గోపికచేయునది లేక లోనికేగెను. బాలుడు మరల శివలింగముకడ కేగి, ఓదేవదేవా! శంకరా! నాతల్లి నాపూజ నంతను చెడగొట్టెను. నేనేమి చేయుదునని దుఃఖంచుచు, భూమిపైబడి మూర్ఛనొంది శోక సంతప్త మానసుడై యొక క్షణములో కన్నుదెరచి చూడగా, ప్రదేశమంతయు మహాకాలశివాలయముగా మారెను. అదిగాంచుట కతిమనోహరముగ

నుండెను. ఆలయము బంగారు వికారములైన ద్వారబంధములు కవాటములతో నొప్పుచుండెను. మఱియు నింద్రనీల మణి వేదికలతో నొప్పుచు విచిత్ర హేమకలశలతో ప్రకాశించుచు, మణిస్తంభములతో విరాజిల్లుచు, నారత్నమండపమున నీశ్వరుడు రత్నలింగమై విరాజిల్లుచుండెను. తాను స్వయముగా నర్చించు శివలింగ మిట్లు రత్నలింగముగ మారినందుకు ఆ పసివాడెంతేని యచ్చెరువొందుచు నానంద సాగర మగ్నుడై నాటినాటికి శివుని స్మరించుచు, సాష్టాంగముగా పూజచాలించి, యాలయమునుండి వెలుపలికివచ్చి చూడ తన శిబిరమంతయు పురందర భవనముగ మారియుండెను. ఆభవనమంతయు స్వర్ణమయమై దేదీప్యమానముగ ప్రకాశింప జొచ్చెను. అవిధానమయంబున మణిహేమనిర్మాణ కీర్ణమైన భవనమంతయు ధగధగ మెఱయుచుండెను. నాదివ్యభవనము ప్రవేశించి సర్వాభరణ భూషితయగు దేవతాస్త్రీవలె శయనించియున్న తల్లిని గాంచి [illegible]గ లేపియుండ, నామెయు నంతయు గాంచి విస్మితురాలై పుత్రుని గౌగలించుకొని యిదంతయు సర్వేశ్వరానుగ్రహమువలన కలిగెనని తెలిసికొని పుత్రునితో పాటు తానుకూడ సహర్షముగ శివుని ధ్యానించుచుండెను. చంద్రసేనమహారాజు శివపూజ విరమించుకొని యా మార్గమున గోపశ్రేష్ఠభవనము శివాలయముగాంచి యాశ్చర్యపడుచు మంత్రులతో నచటి కేగినంత శివప్రభావమంతయు గాంచుచు, సర్వము తెలిసికొని యానందమునొందెను, నానందబాష్పముల రాల్చుచు గోపికాపుత్రు నాలింగన మొనర్చెను. నాటినుండియు నారాజు శివనామసంకీర్తనము చేయుచుండ నగరవాసులందఱు శివనామ ఘోషగ మారుచు చుండ నారాత్రి క్షణములో గడచి తెల్లవారెను. శత్రురాజులు పురమంతయు ముట్టడించి యుద్ధసన్నద్ధులై యుండిరి. చారులతో నావార్త సమాచారములవలన తెలిసి, యొకొక్కరే వచ్చి గాంచి యాశ్చర్యమును శత్రురాజులు వారిలో వారిట్లు అనుకొనిరి. ఈ చంద్రసేనుడు శివభక్తుడు, సమర్థుడు, ఉజ్జయినీ నగరమును శివుడు కాపాడుచుండెను. ఈనగరమందున్న పసిబాలుడే యింతప్రభావవంతుడై యుండ శివభక్తుడగు రాజుసంగతి చెప్పనేల! మహేశ్వర సేవకుడగు చంద్రసేనునితో విరోధపడితిమేని శంకరుడు కోపించును. ఈశ్వరుడు కోపించిన మనమందఱము నశింతుము గాన, మనమందఱము రాజుకడకేగి క్షమార్పణ వేడి

నచో శివుడు సంతసించు నని వారందఱు తెలచి చంద్రసేనునికి లిసికొని క్షమా ర్పణ మేశికొని అస్త్రశస్త్రములు త్యజించి చంద్రసేనుని కొనియాడుచుండిరి.

చంద్రసేనుడు గోపికాపుత్రుని సింహాసనముపై కూర్చుండబెట్టి పూజిం చెను. రాజులందఱు నాబాలుని పూజించి శివునర్చించి యనేక కానుకలర్పిం చిరి. సకలదేశవాసులు పసివాని ప్రభావమెరింగి యితని నొక రాజుగజేసి పూజించిరి. వీరందఱిరాజుల మధ్య వానరాధిపతియగు హనుమంతుడు ప్రత్య క్షమై గోపికాపుత్రుని కౌగలించుకొన రాజులందఱు హనుమంతునిగాంచి యాశ్చర్యమొంది యతనికి నమస్కరించి స్తుతించిరి. హనుమంతుడు రాజులను గాంచి ఓభూపతులారా! దేహధారులందఱకు శివుడే సద్గతి నిచ్చుచుండును. అట్టికృపామయుడుగామరి యెవడు లేడు. ఈగోపబాలుని శివపూజలు చూచితిరి గదా! ఇతడు మంత్రయుతముగ పూజింపకున్నను శంకరుడు పసిబాలుని భక్తికి సంతసించి తనప్రభావముజూపించి సకలైశ్వర్యము లిచ్చియుండెను. యథావిధిగ సేవించినవారిమాటజెప్పనేల? ఈగోపబాలుని కీర్తి ముల్లోకముల వ్యాపించి, ఈలోకంబున సకలైశ్వర్యము లనుభవించి చివరకు ముక్తినొంద గలడు. ఇతని యష్టమతరమువాడు నందు డనుపేరుతో నుండి శ్రీకృష్ణునిపుత్రు డుగా పొందగలడు. నేటినుండి బాలుడు శ్రీకరుడనిపిలువబడుచుండునని పలికి రాజులందఱను, చంద్రసేనుని కృపాదృష్టితో గాంచుచు శ్రీకరుడను గోపకుమారునకు శివమంత్రము, శివపూజావిధాన ముపదేశించి వారందఱు గాంచుచుండగా హనుమంతు డదృశ్యుడయ్యెను. రాజులందఱు చంద్రసేనుని కనేక కానుకలిచ్చి ప్రశంసించుచు వారివారినెలవులకేగిరి. చంద్రసేనుడు గోప కుడు మహాకాలు నత్యంతప్రీతితో సేవించుచుండిరి. చంద్రసేనుడు చాల కాలము శివారాధనచేసి ముక్తినొందెను. ఈమహాకాలు డివ్యంబున దుష్టులను శిక్షింపుచుండెను. పరమపవిత్రమైనదియు, సరహస్యమైనదియు నగు నీవ్యా ఖ్యానము విన్నను, పఠించినను శివభక్తి యభివృద్ధినొంది స్వర్గము నొందగలరు. ఆనాటినుండియు శివు డుజ్జయినీనగరంబున మహాకాలు డనుపేరుతో భక్తులను, కాపాడుచుండెను.

శివ మహాపురాణమందలి కోటిరుద్రసంహితయందు

పదియేడవఅధ్యాయము సంపూర్ణము

---

# పదునెనిమిదవ యధ్యాయము

## ఓంకారేశ్వర మాహాత్మ్యము

నాల్గవదియైన ఓంకారేశ్వర మహాత్మ్యము చెప్పుడని ఋషులు ప్రార్థింప సూతు డిట్లు చెప్పదొడంగెను. ఋషీశ్వరులారా! ఓంకారేశ్వరలింగమును గూర్చి చెప్పెద వినుడు. నారదుడు ఒకానొక సమయంబున గోకర్ణక్షేత్ర మేగి యట శివు నర్చించి యటనుండి వింధ్యపర్వతమునకడ కేగ వింధ్యుడు నారదుని అర్ఘ్యపాద్యాదులచే పూజించి నాకన్న నగములలో నధికుడు లేడని సగర్వముగ బలుక, నారదుడేమియు బలుకక యూరకుండుటచే, ఓమహర్షీ! నాయందేమి న్యూనతగాంచియుంటిరి. మాట్లాడరేమని వింధ్యుడు పలుక నారదు డతనిని గాంచి నీవన్నది నిజమే కావచ్చును కాని, యన్నిటికన్న మేరునగమే యత్యున్నతమైన దని దేవతలు నిర్ణయించియుండిరి అని నారదుడు పలుక వింధ్యుడు చిన్నబుచ్చుకొని యింతకొనుద్దై జీవించిన లాభమేమి? నాజీవితము వ్యర్థమని తలపోసి, శంకరుని నారాధించి యతనిని శరణుజొచ్చెద నని నిశ్చయించి ఓంకారక్షేత్రమున కేగి పార్థివలింగమును నారుమాసములు నిశ్చయుడై సేవింప, శివుడు యోగిమనోగమ్యమైన నిజస్వరూపమును జూపించి, నీతపంబునకు మెచ్చితిని. నేను భక్తానుగ్రహకరుడను. నీ యభీష్టవరంబు కోరుము, యిచ్చెద, నన, ప్రభూ నీవు భక్తవత్సలుడవుగాన నామనోవాంఛిత కార్యములు సిద్ధించునట్లు చేయుమని కోర, నిది పరులకపకార మొనరించు వరంబు కాదని యాయన క్షణమాలోచించి, ఓ వింధ్యా! నావరముచే నీవు పరుల కపకృతి చేయరాదు. నీయభీష్టము నెరవేరు నని పలుకుచుండ నంతలో దేవతలు ఋషులు నేతెంచి శంకరుని పూజించి మీరు యీపార్థివలింగమందే యుండవలెనని [illegible] కోర శంకరుడు పార్థివరూపుడుగను నాదస్వరూపుడుగ నోంకారేశ్వరుడుగను క్షేత్రమందు రెండువిధములుగ నుండెను. ఈ యుభయలింగములు భక్తులకు భుక్తిముక్తుల నిచ్చుచుండెను. దేవతలు ఋషులు నితని పూజించి సంతసపరచి యనేక వరములు వడసి వారివారి స్థానముల కేగిరి. వింధ్యుడు తన కార్యము కొనసాగెనని పరితాపము వీడి సుఖముగనుండెను. ఓంకారేశ్వరుని

దర్శించి యర్చించినచో మరల పునర్జన్మ ముండదు. గర్భనరక ముండదు. ఇటుపై కేదారేశ్వర మాహాత్మ్యము చెప్పెద వినుము.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

## పందొమ్మిదవ యధ్యాయము

### కేదారేశ్వర మాహాత్మ్యము

భరతఖండమున విష్ణ్వంశసంభూతులైన నరనారాయణులు బదరికాశ్రమంబున తపంబుచేయుచు పార్థివలింగమును స్థాపించి పరమేశ్వరుని పూజించుచుండిరి. భక్తదాసుడగు శివు డా లింగమందుండి యుభయులచే పూజింపబడుచుండును. ఇట్లు చిరకాలముపూజింప, ఈశ్వరుడు ప్రసన్నుడై నేను మీతపంబునకు మెచ్చితిని. వరంబులు కోరుకొండన నారాయణులు ప్రశంసించి, దేవా నీవు ప్రసన్నుడవైనచో మాచే చేయబడు పూజాదులు స్వయముగ వేంచేసి యీ స్వరూపముతోనే స్వీకరింపు మని మాకోరిక యనగ, శంకరుడు దానికంగీకరించి హిమవద్గిరి సమీపమందైన కేదారక్షేత్రమున జ్యోతిర్లింగస్వరూపుడై కేదారేశ్వర నామంబున స్థిరముగా నుండెను. నరనారాయణులచే పూజింపబడిన యా కేదారేశ్వరుని పూజించినచో సర్వ దుఃఖభయంబులు నశించును. లోకోపకారమునకును భక్తరక్షణకును స్వయముగ శంకరుడు కేదారేశ్వరనాముడై యుండెను. నిత్యము దర్శన, స్పర్శనాదులచే భక్తుల యభీష్టములను దీర్చుచుండెను. పురాతనమునుండియు నీ కేదారేశ్వరుని దేవతలు ఋషులు పూజించి మనోభీష్టఫలంబుల నొందుచుండిరి. బదరికాశ్రమవాసులందఱు శివుని పూజించి యభీష్టవరముల నొందుచుండిరి. ఈదేవుని పూజించిన వారెల్లరు స్వప్నమందుకూడ దుఃఖములనొందరు.

ఒకానొక సమయమందున పాండవులు కేదారేశ్వరుని దర్శింప నేతెంచిరి. ఈశ్వరుడు మహిషరూపుడై పరుగెత్తుచుండ పాండవులు వెంటాడి దాని

పుచ్ఛము బట్టుకొన, నా పుచ్ఛము పాండవుల హస్తమందుండిపోయెను. మిగిలిన శిరఃప్రదేశము పరుగిడి నేపాళమందు దాగిపోయెను. ఈ మహిషము ఈశ్వరుడని తెలిసికొని స్తుతింప, శంకరుడు ప్రసన్నుడై పుచ్ఛభాగము యీశ్వరలింగ భాగమై వెలసియుండ పాండవులు దానిని సేవించి సకలాభీష్టము లొందిరి. నేపాళమందున్న మహిష శిరము శివలింగమ్మై వెలసి సర్వులచే పూజింపబడుచు సర్వాభీష్టములు నొసంగుచుండును. భారతీయులందఱు కేదారేశ్వరుని పూజించి యిహపరంబుల నొందుచుండిరి. ఈశ్వరున కెవ్వరైనను సువర్ణముతోగాని, వెండితోగాని, ఇత్తడితోగాని, శక్తికొలది వలయాభరణ భూషణ మర్పించినచో సంతసించును. హరహరప్రియుడై హరసాన్నిధ్య మొందగలరు. బదరీవనమందున్న ఇట్టి వలయభూషితుడగు ఈశ్వరుని గాంచినచో సర్వపాపవిముక్తుడై జీవన్ముక్తుడగును. బదరియందున్న నరనారాయణులను కేదారేశ్వరుని గాంచినచో ముక్తి వచ్చుటలో సందియము లేదు. కేదారేశ్వరుని గాంచుటకై పయనముచేయుచు మార్గమధ్యమున మరణించినను తప్పక ముక్తి లభించును. కేదారేశ్వరు నర్చించి యాతీర్థమందున్న యుదకము పానముచేసినచో పునర్జన్మ ముండదు. భరతఖండమునందున్న వారు శ్రీ కేదారేశ్వరుని పూజించి జీవన్ముక్తులగుచుండిరి. ఈ ఖండమునకు కర్తయు నితడే ప్రభువు. ఇతడు సర్వకామ్యములొసంగు ననుటలో సందియము లేదు. మీ రడిగిన గాథ నంతయు జెప్పితిని. ఇది విన్నవారు పాపదూరు లగుదురు.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
పందొమ్మిదవ యధ్యాయము సంపూర్ణము

---

## ఇరువదవ యధ్యాయము

### భీమాసుర జననము

స్మరణమాత్రముచేతనే జనులకు సర్వాభీష్టంబుల నొసంగు భీమశంకరుని యవతారము చెప్పెద వినుడు. కామరూపదేశంబున లోకకళ్యాణము

నకై శివు డవతరించెను. పూర్వకాలమున సకలజీవులకు దుఃఖము కలిగించుచు ధర్మవిధ్వంసకుడై మహావీరుడై కర్కటీకుంభకర్ణులకు పుత్రుడై భీమనాము డైన మహాసురుడు డుండెను. ఇతడు తనతల్లితో సహ్యాపర్వతంబునవసించు చుండెను. శ్రీరామచంద్రుడు కుంభకర్ణుని సంహరించినతరి నతనిభార్యయగు కర్కటి తనపుత్రునితో సహ్య్రాదియందు వసించుచుండెను. భీమాసురు డొక నాడు తల్లితో నాతండ్రియెక్కడనుండెను? నీవేకాకినివై యుటనుండుటకు కారణ మేమి? యథార్థము తెల్పుమన, దుష్టాత్మురాలగు నారాక్షసి పుత్రునిగాంచి ఓపుత్రా! రావణానుజుడగు కుంభకర్ణుడు నీతండ్రి. ఇతడు శ్రీరామచంద్రునిచే నన్నగారితోకూడ మరణించెను. బలవంతుడైన కుంభకర్ణు డొకనా డీ సహ్య పర్వతముకడ కేతెంచి నాతో బలాత్కారముగ రమించి నన్ను వీడి లంకాపురి కేగెను. నేనెన్నడు లంకను చూచియెరుగను. నేనిక్కడనే నివసించియుంటిని. నాతండ్రి కర్కటకుడు. నాతల్లి పుల్కసి. నా మొదటిభర్త విరాధుడు. అతనిని కూడ రామచంద్రుడే వధించెను. అప్పటినుండియు నా తల్లితండ్రుల కడనే యుంటిని. నా తలిదండ్రుడు లగస్త్య శిష్యుడగు సుతీక్ష్ణుని భక్షింపబోవ నామహాతపస్వి వారలను భస్మముచేసెను. అప్పటినుండి యేకాకినినై దుఃఖింపు చు నీపర్వతమునందు నిరాలంబనై నిరాశ్రయురాలనై యుంటిని. అట్టితరి కుంభకర్ణు డేతెంచి నాతో బలవంతముగ రమించి నన్ను వీడి లంకకేగెను. పిమ్మట మహాబల పరాక్రము డవగు నీ వుద్భవించితివి. నీతో నేను కాలక్షేపము చేయుచుంటి నన, భీమాసురు డిది విని క్రుద్ధుడై హరికి ప్రతీకార మెట్లుచేయుదునా యని తలంచుచు, నాతండ్రియగు కుంభకర్ణుని విరాధునికూడ శ్రీహరియే సంహరించెను. నా మాతామహి మాతామహులను సుతీక్ష్ణ మహాముని భస్మముచేసెను. గాన వారిపై పగతీర్చుకొనెద నని నిశ్చయించి సహస్రవర్షం బులు బ్రహ్మనుగూర్చి ఘోరతపంబుచేయుచు నూర్ధ్వబాహుడై యేకపాదం బున నిలబడి సూర్యబద్ధ చక్షుష్కుడై తపమాచరింపుచుండ నితని శిరము నుండి దారుణమైన తేజము బయలుదేరెను. దేవత లాతాపంబును భరింప లేక, బ్రహ్మను శరణుపొందనేగి నమస్కరించి, స్తుతించి, సర్వము నెరిగించి, దేవతలందఱు ఓవిధాతా! భీమాసురుని తపోవేడిమిని మేము భరింపలేకుంటిమి. గాన నతనికి వరంబులిచ్చి శాంతింపజేయుము. నీ వుపేక్షించినచో నతని తేజ

  

ముచే మేముభస్మమైపోవుదు మన, విధాత వారి ప్రార్థనల సంగీకరించి, యసురుని చెంతకేతెంచి ఓభీమా! నేను ప్రసన్నుడనైతిని. నీయాశ్రితవరము కోరుమన, ఓకమలభవా! నీవు సంతుష్టుడవైనచో నాకతులమైన బలంబు నొసగుమని, యసురుడు పలుక, బ్రహ్మ యట్లేయగుగాక యని తన లోకమున కేగెను.

భీముడు బ్రహ్మచే నమితబలము నొంది గర్వితుడై తల్లికడకేగి ఓతల్లీ! నాబలము చూడుము. హరిసహాయముతో శక్రాది దేవతలేతెంచినను ప్రళయము గావింతునని పలికి, ముందుగా శక్రాదిదేవతలను వారివారి స్థానముల నుండి తొలగించి స్వర్గరాజ్యమును స్వాధీనము చేసుకొనెను. తదుపరి దేవతలందఱు విష్ణువుతో మొరబెట్టుకొన విష్ణువు దేవతలతోకూడ యుద్ధమునకేతెంచి భీమవిక్రముడగు భీమునిచే నోడిపోయెను. తదుపరి భీము డానందముతో రసాతలమునుకూడ జయించి, కామరూప దేశాధీశ్వరుని జయింప దక్షిణదిశకేగి తనభయంకర పరాక్రమముచే నతనిని జయించి, శివభక్తుడగు నారాజును తనవరప్రభావముచే బంధించి, కొట్టి నిగడ బంధన మొనరించి, కారాగృహవాసుని జేసి, శోభాయమానమైన యతని రాజ్యమంతయు హరించెను. శివభక్తుడగు నారాజు కారాగృహమున బంధితుడై ప్రారబ్ధమనుభవింపవలెనని తలచి పార్థివలింగమును తయారుచేసి శివు నర్చించుచుండెను. మఱియు గంగను స్మరించి మానసిక స్నాన మాచరింపుచు, మానసిక శివపూజలు చేయుచు, ముద్రాసనాదులతోడను సాష్టాంగదండ నమస్కారముతోడను సంతసంబున శంకరు నర్చించుచు, ప్రణవసహిత పంచాక్షరిని జపించుచు నితర చింతలు లేక శివాసక్తమనస్కుడై యుండెను. ఇతనిపత్నియగు దక్షిణకూడ భర్తతోపాటు పార్థివ శివు నారాధించుచుండెను. ఈదంపతు లిరువురు ననన్యమనస్కులై శంకరు నర్చింపుచుండిరి. భీమాసురుడు నిరాటంకముగ రాజ్యపాలన చేయుచు వరదర్పితుడై యజ్ఞకర్మల లోపింప జేయుచు, యజ్ఞభాగంబులు తనకే యర్పింపుమని పీడింపుచు దుష్టరాక్షస సేనలతో పృథివినంతయు జయించి తనవశము చేసికొని వేదశాస్త్ర పురాణ స్మృతి ధర్మముల లోపింపజేసి సర్వస్వతంత్రుడై సర్వభోగముల ననుభవించు చుండెను. శక్రాది దేవతలను మహర్షులను సదా పీడింపుచు సారహీనులజేయుచు దుఃఖింప జేయుచుండెను. శక్రాది దేవతలు,

ఋషులు బ్రహ్మ విష్ణులవెంట నిడుకొని శంకరుని శరణుపొంది స్తుతించి, శివుని ప్రసన్నుని జేసికొనుటకై పార్థివ లింగమును స్థాపించి, పూజించి, స్తుతించి షోడశోపచారములచే నర్చింప శంకరుడు సంతసించి ఓ బ్రహ్మావిష్ణ్వాది దేవతలారా! నేను మీకు ప్రసన్నుడనైతిని. నేను మీకు చేయవలసిన కార్యమేదియో జెప్పుడన, నోపరమేశ్వరా! నీవు సర్వాంతర్యామివై యుండి మమ్మిట్లు ప్రశ్నించుచుంటివేల? మా దుఃఖములు విని మమ్ము కృపాదృష్టితో గాంచుము. బలవంతుడు, కర్కటీకుంభకర్ణపుత్రుడునగు భీమాసురుడు బ్రహ్మవరదర్పితుడై మనుష్యుల నందరిని పీడించుచున్నాడు. నీవు విలంబము చేయక ఆదుష్టుని సంహరింపుమన, శంకరుడు వారి మనవులు విని అట్లే చేయుదును. కామరూపదేశాధిపతి, నాభక్తు డుత్తముడై యుండెను. అతనికొరకై నే నారాక్షసుని సంహరించెదనన, దేవతలు ఋషులు సంతసించి వారివారి నిలయములు కేగిరి.

శివ మహాపురాణమందలి కోటిరుద్రసంహితయందు
ఇరువదవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువది ఒకటవ యధ్యాయము

## భీమేశ్వర జ్యోతిర్లింగ మాహాత్మ్యము

శంకరుడు భక్తరక్షణార్థమై తనగణములతో గుప్తముగా కామరూపాధీశ్వరుడగు సుదక్షిణుని కడకేగ, నట్టితరి ఆ రాజు పార్థివలింగము నెదుట కూర్చుని ధ్యానించుచుండెను. శివధ్యానపరుడగు నతనిని భటులు గాంచి, రాక్షసునికడకేగి నిన్ను జంపుటకై యభిచారమంత్రములు రాజు పఠించుచుండెనని పలుక, భీమాసురుడు కోపించి, ఖడ్గహస్తుడై, రాజును జంపుటకై, యేతెంచి నిజముగా రాజు నాపై ప్రయోగము చేసినచో, నతనిని కుటుంబ సహితముగ ఖండించెదనని తలచి క్రుద్ధుడై, ఓదుష్టాత్మా! నీవిపుడేమి చేయుచుంటివి? నిజము చెప్పుము? లేకున్న నిన్ను సంహరించెద, నన, రాజతని ప్రగల్భవాక్కులు విని, కానున్నది కాకమానదని తలచి

సకలము కర్మాధీనము, ఆకర్మ శివాధీనము. కృపాళుడగు శివుడీపార్థివ లింగమందుండక మానడు. నన్నీ రాక్షసుడేమిచేయగలడు. నేను లింగ రూపముగ నుండెదనని ప్రతిజ్ఞచేసెను. శివుడు సత్యప్రతిజ్ఞుడని శ్రుతులచేతను చెప్పబడెను. నాభక్తులను పీడించిన దుష్టుని తప్పక సంహరించెదనని ప్రతిజ్ఞచేసియుండెను. అతనిప్రతిజ్ఞ యూరక బోవునా యని ధైర్యమువహించి, శివుని ధ్యానింపుచు, ఓశంకరా! నేనునీవాడను నన్నేమిచేసిననుసరే! నేనుసత్యము పలికియుంటిని. నాకు హితము చేకూర్పుమని మనంబున ధ్యానింపుచు, సత్యపాశబద్ధుడై రాక్షసునితో నిట్లు పలికెను సకలచరాచరంబులకీశ్వరుడు, నిర్వికారుడు, స్వభక్తపరిపాలకుడు నగు శంకరుని ధ్యానింపుచుంటినన, నాయసురుడు నృపవాక్యములువిని, క్రుద్ధుడై, భయంకరవాక్యములతో నోరాజా నిన్ను నీశంకరుని నేనెరుంగనివాడనుగాను. నాపితృవ్యుడయిన రావణుడు, శంకరుని కింకరునిగాజేసికొని స్థాపించియుండెను. అతనిబలము నాశ్రయించి నన్ను జయింపదలచితివి గాబోలును. అయినచో నీవు నన్ను జయించినట్లే. నాపాలకుడైన శంకరుని నాకు జూపకున్నచో, నీవాశంకరుని నారాధింపరాదు. నాకు జూపించువరకు నామూర్తికి దూరముగనుండుము. లేనిచో నాచే నీకు భయముతప్పదు. దండనము తప్పదన, రాజు రాక్షస వాక్యములు విని, శంకరునియందు దృఢవిశ్వాసము గలవాడై, ఓయసురా! నేను పామరుడను. దుష్టుడను. అతడే సర్వేశ్వరుడు. నాకుప్రభువు. నేనతని నెన్నడును విడువను. నామనంబతనిపై లగ్నమైయున్నది. అతడు దూరముగనున్నను నాచెంతనున్నవాడే యగు నన, రాజువాక్యములువిని రాక్షసుడిట్లుపలికెను. శంకరుడున్మత్తుడై, బిచ్చమెత్తుకొనుచుండ పరుల నెట్లు రక్షింపగలడు? తన్ను తాను రక్షించుకొనలేనివాడు పరులనెట్లురక్షించును? యోగనిష్ఠులు భక్తులనెట్లు రక్షింపగల్గుదురు? నీస్వామియోగి, అతడే మియు చేయలేడు. నీవు నాస్వామికి దూరముగపొమ్ము నేనునాస్వామితో యుద్ధముచేయుదునన సర్వులకు భయముగొల్పు భీమాసురవాక్యములు విని శివభక్తుడగురాజు, ఓదుష్టాత్ముడా! నీవుశక్తివంతుడవుగాన నీకు నేను లోబడితిని. నీవేమిచేసిననుసరే యన, భీమాసురుడుగ్రుడై తనతీక్ష్ణకరాళము పార్థివలింగముపై విసరి కోటిరాక్షసులతో పరిహాసముగ నవ్వుచుండ ఖడ్గము

లింగమును తగలకుండగనే, ఆలింగమునుండి హరు డావిర్భవించి, ఓదుష్టుడా నేను నాభక్తులను సర్వదా రక్షించు చుందును. ఈరాజు నాభక్తుడు గాన నేను భీమేశ్వరుడనై నాభక్తుని రక్షింప నేతెంచితిని. నేను భక్తరక్షకుడను. భక్తాధీనుడను. నాబలము చూడుమని యాఖడ్గమును రెండు ఖండములుగ విరిచి బడవేయు రాక్షసుడు తన శూలమును శివునిపై ప్రయోగింప, పరమేశ్వరుడాశూలమును శతఖండములుగ ఖండించెను. తదుపరి నాయసురుడు శక్తిని ప్రయోగింప, శివుడు తనబాణముచే శక్తిని లక్షఖండములుగ జేసెను. మఱల నసురుడు పట్టిసమును ప్రయోగింప, శంకరుడు తనత్రిశూలముచే నాపట్టిసమును తిలఖండములుగ ఖండించెను. తదుపరి. రాక్షసులకు శివగణంబులకు దుఃఖావహమైన ఘోరసంగ్రామము జరిగెను. అట్టితరి పృథ్వీ కంపించెను సాగరములు పర్వతములు చలింపసాగెను. దేవతలు, ఋషులు వికలమనస్కులైరి. ఇంతలో నారదుడేతెంచి. నతమస్తకుడై. ఓశంకరా! తృణముపై కుఠారము వేయవలయునా, ఈదానవుని త్రుటిలో సంహరించి, నీభక్తులను రక్షింపుమన, శంకరుడు తనహుంకారముచే రాక్షసులనందఱిని భస్మముచేసెను, దావానలము వనమును భస్మముచేసినట్లు రాక్షసులందఱిని క్షణములో భస్మముచేయ, వారందఱు నామమాత్రము లేకుండ భస్మావశేషులై యుండిరి. దానిచే శక్రాది దేవతలందఱు సంతసించిరి. రాక్షసభస్మము వనమంతయు వ్యాపించి యనేక గుణములు కల్గిన యోషధులై యుద్భవించెను. ఈభస్మ మలదుకొన్నచో భూత ప్రేత పిశాచములు తొలగిపోవును. కార్యసిద్ధులన్నియు కలుగునని శంకరుడు పలికెను. దేవతల ప్రోత్సాహముచే శంకరు డట స్థిరముగానుండెను. ఈప్రదేశమునం దెవరు యుద్ధముచేసినను గెలువలేరు. ఇది కుత్సితమైన దేశముగాన నీవిట స్థిరముగ నుండుమని దేవతలు ఋషులు ప్రార్థింప నీశ్వరుడటనే యుండెను. ఈభీమేశ్వరుని పూజించినచో సర్వాపత్తులు నివారితములగును.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది ఒకటవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది రెండవ యధ్యాయము

## విశ్వేశ్వరుడు కాశికేతెంచుట

మహాపాతక నాశనమైన విశ్వేశ్వర మాహాత్మ్యము వినిపించెద వినుము. అవిముక్తక్షేత్రమైన కాశియందు యథార్థ వస్తువుగ నేది చూడబడుచున్నదో, అట్టి చిదానంద స్వరూపమైనదియు నిర్వికార మైనదియు. సనాతన మైనదియు. నగు విశ్వేశ్వర లింగమును గూర్చి చెప్పెదను. నిర్వికారుడగు పరమేశ్వరుడు సగుణరూపుడై యిట నావిర్భ వించెను. ఇతడు పుంస్త్రీరూపముతో నర్ధనారీశ్వరు డయ్యెను. ఇందు పురుషాకారుడు శివుడుగను, స్త్రీ యంబికాకృతిగను నావిర్భవించియుండిరి. వీరు జగన్మాతా పితరులై, యదృశ్యులై యుండిరి. పిదప ప్రకృతి పురుషు లను సృజింప వారల కేమియు గోచరింపక సంశయాత్ములై యుండ, నిర్గుణ పరబ్రహ్మ యగు గగనవాణి ప్రకృతి పురుషులారా! మీరు సంశయింపక తపంబుచేయుడు. తపంబుచే నుత్తమ సృష్టి కలుగ గలదన, వీరు పరమేశ్వరుని ధ్యానింపుచు, నో ప్రభూ? తపంబు చేయుటకు మాకు ప్రదేశము గోచరించుటలేదు. నీవు శాసించిన తావున తపంబు చేసెదము. ప్రదేశము తెలుపుమన శివుడు విష్ణుస్వరూపుడగు పురుషుని కడకేతెంచి తనసారభూతమైన తేజంబుతో పంచక్రోశ విస్తీర్ణంబైన నగరమొకటి నిర్మించి, ఆనగరమందు సర్వోపకరణములు నిర్మించి యంతరిక్షమందున్న శ్రీహరి నటనిలుప, శ్రీహరి యాపట్టణమందధిష్ఠించి బహుకాలమందుండి తపంబుచేయ, శ్రీహరి తపః శ్రమచే ననేక జలధార లుద్భవింప, నట్టితరి నాప్రదేశమంతయు జలమయమై యేమియు గోచరింపకుండెను. ఈయద్భుత మేమని యాశ్చర్య బడుచు, శ్రీహరి, శిరము పంకింప, నతని కర్ణము నుండి యొకమణి క్రిందబడెను. అదియే మణికర్ణికా తీర్థమై ప్రసిద్ధివడసెను. ఈతీర్థము పంచక్రోశ విస్తీర్ణమైన యానగరమంతయు వ్యాపించుచుండ, నదృశ్యుడై యున్న శంకరుడు తనత్రిశూలముచే నాపివేసెను. శ్రీమహావిష్ణు వా తీర్థమందు ప్రకృతితోగూడి శయనించెను. శంకరుని శాసనముచే విష్ణు నాభికమలమునుండి బ్రహ్మ యుద్భవించెను. ఈబ్రహ్మ శివశాసనముచే

చతుర్దశ భువనంబులు సృజించెను. ఒక్కొక్క బ్రహ్మాండము ఏబదికోట్ల యోజనములు ప్రమాణముగలదై యుండెను. భూలోకమందు కర్మబద్ధులై యున్న జీవులందఱు తన్నెట్లు పొందగల్గుదు రని పరమాత్ముఁడగు శివుఁడాలోచించి, పంచక్రోశ విస్తీర్ణంబగు నీపట్టణము సృజించెను, ఈప్రదేశము కర్మక్షయకరమై, శుభంబు లొసంగును. మరియు నీకాశీక్షేత్రము జ్ఞానము నొసంగి మోక్షము నిచ్చును. ఇచట పరమాత్ముఁడు స్వయముగ నవిముక్త లింగమును స్థాపించెను.

ఇది నాయంశగాన దీని నెన్నఁడు విడనాడ నని శంకరుడు ప్రతిజ్ఞచేసి తన త్రిశూలమునకు గుచ్చి కాశిక్షేత్రమును భూలోకమున స్థాపించెను. బ్రహ్మప్రళయమందు కూడ నీశ్వరు డీపట్టణమును త్రిశూలమున బట్టుటచే నెన్నఁడును నశింపదు. మరల బ్రహ్మ సృష్టికాగానే శంకరుడీ పట్టణము యథాస్థానమందు నిలుపును. కర్మల నాకర్షించును గాన కాశి యని పిలువబడుచుండెను. ఈ యవిముక్తలింగము సర్వదా కాశియందుండును. ఈక్షేత్రము, మహాపాతకముల నశింపజేసి ముక్తి నొసంగును. సాలోక్య, సామీప్య, సారూప్య, సాయుజ్యముల నెడు ముక్తి చతుష్టయములో సాయుజ్య క్షేత్రమిదియే మిగిలిన క్షేత్రములు సాయుజ్యమును మాత్ర మీయలేవు. గతిలేని వారలకు వారణాసి యేగతి. ఈ పంచక్రోశక్షేత్రము హత్యాకోట్లను నశింపజేయును అమరులుకూడ కాశీమరణంబున కాశింతురు. ఇచట భుక్తిముక్తుల నొసంగును. ముల్లోకములు దీని ప్రశంసింతురు. దీని మహిమ వర్ణింప శక్యముకాదు. దానిని శతవర్షము వర్ణించిన నంతు తెలియలేదు. నేను వర్ణింప శక్తిమంతుడను కాను కైలాసవాసుడగు శివుడు అంతఃకృత్యుడు, బహిఃకోపియునై యుండెను. కాలాగ్నినాముడు, రుద్రుడు, నగుండు నగు సదాశివు డనేకులచే నమస్కరింపబడుచుండ, నొక నాడు ఇచటు డేతెంచి, ఓమహేశ్వరా! ఓవిశ్వేశ్వరా నేను నీవాడను నీవు జగదంబతో కూడ నన్ను రక్షింపుము. నీవు లోకహితముకొరకై యీకాశియందుండి తరింపజేయుము. అవిముక్తక్షేత్రమైన యీపట్టణంబు వాసముగ జేసికొని భక్తుల రక్షింపుమని పరమేశ్వరుని పరిపరివిధంబుల ప్రార్థింపుచు, ఓదేవ దేవా! మహాదేవా! కాలు డనేరోగంబునకు నీవు సుప్రసిద్ధ వైద్యుడవు

త్రిలోకపతివిగాన బ్రహ్మాదులు నిన్ను సేవించుచుండిరి. కాశిపురిని నీవు రాజధానిగా చేసికొనుము. నీవు నాచే ధ్యానింపబడుచు నిటనుండి యచింత్య సుఖముల నొందగలను. కోరిక లొసంగినను ముక్తి నిచ్చినను నీకన్న సమర్థుడు లేడు. లోకోపకారముకై యుమాసహితుడవై నీవిట నుండి సర్వ జీవులను తరింపజేయు మని నాటినాటికి హరుడు విశ్వనాథుని ప్రార్థింప, ఆనాటినుండి శంకరు డుమాసహితుడై యట స్థిరనివాసుడై యుండెను. నాటినుండియు కాశీపురి సర్వశ్రేష్ఠతమమై యొప్పుచుండెను.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువదిమూడవ యధ్యాయము

### కాశీవిశ్వేశ్వర జ్యోతిర్లింగ మాహాత్మ్యము

అవిముక్తక్షేత్రమను వారణాసి పురి మాహాత్మ్యము జెప్పుమని ఋషులుపలుక సూతుడిట్లు చెప్పదొడంగెను. ఒకానొకప్పుడు పార్వతీదేవి లోకహితార్థముకై నాయందు కృప యుంచి కాశీపురి మాహాత్మ్యము జెప్పు డని యీశ్వరుని కోరగా సర్వజ్ఞుడును జగత్ప్రభుడు నగు శంకరుడు పార్వతి వాక్యములు విని సంతుష్టుడై ప్రియమునకై యిట్లు చెప్పదొడంగెను. ఓ దేవీ! లోక క్షేమకరంబగు ప్రశ్న చేసితివి గాన చెప్పెద వినుము. కాశీపుర మతిగుహ్యతమ మైనది. ఇది సర్వజీవులకు మోక్షకారణమైనది. సిద్ధు లీక్షేత్రమందుండి శివ సంబంధమగు వ్రతములను చేయుచుందురు. జనులు కోరికలతో నానావిధ చిహ్నములు ధరించి శివలోకము గోరుచు మహాయోగము లభ్యసించుచు, జితాత్ములై, జితేంద్రియులై, నన్ను సేవింపుచు భుక్తి ముక్తి ప్రదమైనదియు, శ్రుతి సమ్మతమైనదియు నగు పాశుపతవ్రతము నభ్యసించుచుందురు. ఓమహేశ్వరా! సదా వారణాసియందు వసించుటయందు నాకెంతేని సంతోషము. నే నిట నుండుటకు కారణము చెప్పెద వినుము. నాభక్తులు. విజ్ఞానులు ఏకార్థ

ములు సేవింపకున్నను వారుభయులు ముక్తి నొందగలరు. వారెక్కడ మర ణించినను జీవన్ముక్తులేయని తెలిసికొనుము. సంశయము లేదు. ఓ దేవీ! యీ యవిముక్తక్షేత్ర విశేషములు చెప్పెదవినుము. ఏవర్ణసంజాతుడైనను బాల్యాదిగా నేయన స్థలయందున్నను కాశియందు మరణించినచో నవశ్యము ముక్తినొందుట తథ్యము. మఱియు యేయాశ్రమవాసులైనను, శుచిమంతు లైనను అశుచిమంతులైనను, కన్యకయైనను, వివాహితయైనను, విధవయైనను, వంధ్యయైనను, రజస్వలాస్త్రీయైనను, ప్రసవవంతురాలైనను, ఏట్టి స్త్రీయైనను, యిక్కడ మరణించినచో మోక్షము తప్పదు. మఱియు జరాయుజ, అండజ, ఉద్భిజ్జ, స్వేదజము లనెడు చతుర్విధ జంతుజాలములు నాక్షేత్రమున మరణిం చినచో ముక్తి లభించును. జ్ఞాన భక్తి వైరాగ్యములు లేకున్నను కర్మలు చేయకున్నను దానంబు లిడకున్నను, ఏసంస్కారంబులు లేకున్నను, భగవ ద్ధ్యానము లేకున్నను, భగవన్నామము జపింపకున్నను, పూజలొనరింప కున్నను సుజాతియుం దుద్భవింపకున్నను, నీక్షేత్రమందు, వసించి, మరణించిన వారికి తప్పక మోక్షము లభించును. ఇచట నేవిధమున మరణించినను మోక్షము తప్పదు. ఈపుర మతిఖ్యాతమమైనది. బ్రహ్మాదులుకూడ దాని మాహాత్మ్యము నెరుంగలేరు. ఇది యవిముక్త క్షేత్రముగాన మహాక్షేత్రమని పేరువచ్చెను. నైమిశారణ్య క్షేత్రాదుల కంటె యిది విశేషమైన క్షేత్రము. ఇది ధర్మస్థానమనియు, మోక్షస్థానమనియు, క్షేత్రస్థానమనియు, తీర్థస్థాన మనియు పండితులు చెప్పియుండిరి. ఈ క్షేత్రమం దెన్ని కోరిక లనుభ వించినను, మత్తుడై యెంతగా నిద్రించినను, యేయే క్రీడలొనరించినను యెట్టి పాపాత్ములైనను, యెట్టిపిశాచజన్ములైన నిట మరణించినచో ముక్తిలభించును. శతక్రతువులొనరించి శక్రుడైనను కాశీపురితో సరిరాడు. కావున సర్వప్రయ త్నములచే మోక్షప్రదమగు కాశీపురిని సేవింపవలయును. అవ్యక్త లింగ స్వరూపమైన నావిశ్వేశ్వర లింగమును సర్వదా మునులు ధ్యానింపుచుందురు. ఏకోర్కెలతో నాలింగము నర్చించిన నాకోర్కెలు తప్పక సిద్ధించి శివ సాయుజ్యము నొందకల్గుదురు. ఇట తనువుచాలించిన వారి కెట్టికర్మబంధము లుండవు. బ్రహ్మ విష్ణ్వాది దేవతలు, మహర్షులు, సూర్యుడు మొదలగు మహనీయులందఱు ఈపురియందు నన్నుపాసింతురు. విషయాసక్తచిత్తు

లైనను, సధర్మ ప్రవర్తకులైనను ఈ గృహమునందు మరణించినచో మరల తల్లి గర్భమున జనింపరు. నిరభిమానులు, నమ్రులు, శాంతులు, ధీరాత్ములు, సత్యవంతులు, దంభవర్జితులు, ఈశ్వరహితులు, కృతకృత్యులు నాలోలయమొందెదరు. జన్మాంతర సహస్రములు భగవదారాధకుడు కానిచో యోగి కాజాలడు. యోగి కాకున్నచో మోక్షము లభింపదు. కాశియందు మరణించినచో యెట్టియోగములు పొందకున్నను మోక్షము లభించును. ఓపార్వతీ! కాశియందు నాభక్తులనేక లింగములుస్థాపించిరి. అవన్నియు సేవించినవారలకు నిహమందు సర్వకామ్యము లొసంగి పరంబున మోక్షము నొసంగెదను. ఈక్షేత్రము నలుదైపుల పంచక్రోశ విస్తీర్ణంబై యుండెను. ఈ ప్రదేశమందెట మరణించినను ముక్తినొందెదరు. పుణ్యాత్ములు కాశియందు మరణించినచో తత్కాలమందే మోక్షము లభించును. పాపాత్ములిక్కడ మరణించినచో కర్మయాతనల ననుభవించి తిరిగి జన్మల నొందక మోక్షము నొందగలరు. అవిముక్త క్షేత్రమందు పాపముచేసినచో పదివేల వర్షంబులు భైరవీ యాతనల ననుభవించి పాపవిముక్తులై మోక్షము నొందగలరు. దీనినంతయు నెరింగి యవిముక్త క్షేత్రమును సేవింపవలయును. కల్పకోటి శతంబులైనను చేసినకర్మల ననుభవింపక తప్పదు. చేసిన శుభాశుభ కర్మలవశ్యముగ ననుభవింపవలసినదే. పాపకర్మలు నరకమునకు హేతువులు. శుభ కర్మలచే స్వర్గము ప్రాప్తించును. శుభాశుభ మిశ్రకర్మలచే మానుషజన్మ లభించును. న్యూనాధిక కర్మలచే న్యూనాధిక కర్మలు లభించును. పాపపుణ్యములు క్షీణించుటయే ముక్తియనబడును. కర్మకాండయందు కర్మలు త్రివిధంబులుగ చెప్పబడెను. అవి సంచిత, క్రియమాణ ప్రారబ్ధములని త్రివిధములు. ఇవి బంధహేతువులైనవి.

పూర్వజన్మమందు చేయబడిన కర్మలన్నియు సంచిత మనబడును. ఈ శరీరముచే ననుభవించెడు నదంతయు ప్రారబ్ధమనబడును ఈజన్మలో చేసిన కర్మలన్నియు క్రియమాణ మని చెప్పబడుచున్నవి. దానినే ఆగామి యందురు. ప్రారబ్ధకర్మ యనుభవించినగాని క్షయముగాదు. జపపూజాది కర్మలచే సంచిత, క్రియమాణకర్మలు రెండును నశించును. సర్వకర్మలు నశింప

చేయుటకు కాశివినా మరొండులేదు. అన్ని తీర్థముల సులభముగ సేవింప వచ్చునుగాని కాశిమాత్రము దుర్లభము. పూర్వజన్మపుణ్యముచే కాశిని దర్శింప గలడు. విశేషపుణ్యముచేగాని కాశీమరణము సంభవింపదు. కాశీపురి కేతెంచి గంగాస్నాన మాచరించి, విశ్వేశ్వరుని దర్శించి చేయవలసిన సత్క్రియలు చేసినచో సంచితము నశించును. కాని ప్రారబ్ధము మాత్ర మనుభవింపక తప్పదు. కాని యిట మృతిజెందినచో కర్మక్షయ మొందును. పూర్వజన్మము నం దాదరముతో కాశిని సేవించినచో యీబీజ బలముచే మరుజన్మమున కాశీ యందు మృతి లభించును. కాశీపురి సర్వపాపములను భస్మముచేసి సర్వకర్మల నశింపజేయును. ఏమనుజుడైన నొక బ్రాహ్మణునకు సాధినిచ్చి కాశీవాసుని జేసినచో నాబ్రాహ్మణునితోపాటు పంపినవానికి కూడ కాశీవాసఫలము ముక్తియు కూడ లభించును. కాశియందు మృతిజెందినవానికి పునర్జన్మ ముండదు. గంగా యమునా సంగమంబగు ప్రయాగ రాజతీర్థంబున నేకోరికతో మరణించిన నాకోరిక తప్పకసిద్ధించును. కాశిలో మరణించిన వారలకు ముక్తియే కాని జననము లేదు. గంగా యమునలు కలియకున్నచో నాతీర్థరాజు నకు ఫలమేలేదు. కోర్కెలతో కాశియందు మరణించినచో వారికోర్కెలు తీరిన పిమ్మట ముక్తినొందగలరు. విష్ణువు కాశియందుండి, తపంబుచేసి, నావలన సకలసిద్ధులనొంది నూతన సృష్టులను చేయుచున్నాడు. ఓమహర్షులారా! యీవిధంబుగ శంకరుడు కాశీమాహాత్మ్య మంతయు శాంభవితో చెప్పియుండెను. ఈశ్వరుడు కాశీవాసుడైయుండి సర్వులకు భుక్తిముక్తుల నిచ్చుచుండెను. ఇటుపై మీకు త్ర్యంబక మాహాత్మ్యమును చెప్పెదను. మానవు లిది విన్నంతనే సర్వపాపవిముక్తు లగుదురు.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువదినాలుగవ యధ్యాయము

## గౌతముని ప్రభావము

ఋషులారా నేను వ్యాసునిచే విన్న పాపప్రణాశనమైన త్ర్యంబకేశ్వర చరిత్ర చెప్పెద వినుడు. ఇంతవరకు సప్త లింగముల గూర్చి చెప్పితిని. పూర్వము గౌతముడను మహర్షి గలడు. ఆతనికి పరమసాధ్వియగు నహల్యయను ధర్మపత్ని గలదు. ఆతడు దక్షిణదిశయందలి బ్రహ్మగిరియందు పదివేలవర్షంబులు తపంబుచేసెను. ఒకానొకప్పుడు శతవత్సరము లనావృష్టి దోషము సంభవింప ప్రజలందఱు దుఃఖము నొందుచుండిరి. వృక్షాదులయందు పచ్చని చిగురుటాకు లేక, దగ్ధ గోచరంబులాయెను. జీవనాధారంబగు జలము లభింపక మునులు, మనుజులు, పక్షులు, మృగములు, నానాదేశముల కరిగిపోయిరి. ఋషులు విప్రులు ప్రాణాయామధ్యానాదులచే నెట్లో కాలము గడుపుచుండిరి. గౌతము డిది గాంచి ప్రాణాయామ పరాయణుడై సన్న్యసనములు వరుణునిగూర్చి తపంబుచేసెను. ఆతని తపంబునకు వరుణుడు మెచ్చి నీకు కావలసినది కోరుకొమ్మనగా గౌతముడు వృష్టి నిమ్మని కోర, వరుణుడిది విని, గౌతమా! దేవతల యనుజ్ఞలేనిచో నేనెట్లు వృష్టి నివ్వగలను? మఱియొక పరమేదైన కోరినచో నిచ్చెదనన పరోపకారపరాయణుడగు గౌతముడు వరుణునిగాంచి, ఓ ప్రభూ! నీవు యే వరంబులీయ సమర్థుడవో వాటినే యిమ్ము. నీవు జలరాశికి ప్రభుడవుగాన నిన్ను జలము కోరితిని. జలదానము నిత్యఫలప్రదమైయుండును. దాని యక్షయఫలంబుల నొసంగు మన వరుణుడు గౌతమవాక్యములకు, నీవొక గర్తము నిర్మించినచో, నేను జలమొసంగెద నన, గౌతముడు బారెడు వెడల్పుగల గర్తము నిర్మింప, వరుణుడా గర్తమునందు మధురజలంబులు నిండించి, మునిశార్దూలుడును, పరోపకారపరాయణుడు నగు గౌతమునిగాంచి, యీగర్త మక్షయజలపూరితమై తీర్థరాజమైయుండును. ఇది క్షితియందు నీ పేరుతో ప్రవహించుచుండును. ఇట దానధర్మంబులు దేవపూజలు, యజ్ఞ హోమాదులు, పితృశ్రాద్ధములు, చేసినచో నక్షయఫలంబులొసగు నని పలికి వరుణు డదృశ్యుడయ్యెను. సర్వులకు నుపకారముచేసి గౌతముడు సుఖమునొందెను. మహాత్ములు సత్కార్యమునే చేయు

చుందురు. మహాత్ములు మహాత్ములనే గాంచుచుందురు. నీచులు మహాత్ముల మహిమలను తెలిసికొనలేరు. యెట్టి మనుజుల సేవించిన నట్టి ఫలము నొందగలరు. మహాత్ముల సేవించిన మహత్త్వము, క్షుద్రుల సేవించిన క్షుద్రత్వము కల్గును. సింహమును సేవించినచో ముక్తాఫలంబులు లభించును. సృగాలమును సేవించినచో అస్థులు సంప్రాప్తమగును. ఉత్తములు పరుల దుఃఖములు సహింపనేరక తమ సుఖములుగ భావించి వాటిని పోగొట్ట ప్రయత్నింతురు.

శ్లో॥ వృక్షాశ్చ హాటకంచైవ చందనం చేక్షురసస్తథా
యేతే భువి పరార్థేచ దక్షాయేవం న కేచన

భువియందు వృక్షములు, స్వర్ణము, చందనము, చెఱకు, పరోపకారము చేయుటకు సమర్థములైనవి. ఇట్టి దక్షులు మరియొకరులేరు.

శ్లో॥ దయాళు రమదస్పర్శ ఉపకారీ జితేంద్రియః
యేతైశ్చపుణ్యై మేతైస్తు చతుర్భిర్ధార్యతే మహీ.

దయావంతులు, మదరహితులు, పరోపకారులు, జితేంద్రియులు నీనలుగురచేతను భూమి ధరింపబడుచున్నది. గౌతముడు వరుణునిచే సుదుర్లభమగు జలమును పొంది నిత్యనైమిత్తిక కర్మలన్నియు విధివిధానముగ పూర్తిచేసికొనెను. మఱియు హోమక్రియలకై గోధుమలు, యవలు చల్లి మొ॥ ధాన్యములచే హవనక్రియలు చేయుచుండెను. అప్పటినుండి యనేక ధాన్యములు ననేక ఫలపుష్పంబులు సమృద్ధిగా నుండెను. ఇదివిని యనేకమంది ఋషులు, పశుపక్ష్యాదిమృగాదులట కేతెంచి సుఖముగ జీవించుచుండిరి. గౌతమ వనమంతయు భూమికలంకారమై ప్రకాశించుచుండెను. గౌతమ మహర్షి తపఃప్రభావముచే నేయనావృష్టి దోషములు లేక అన్నియు సమృద్ధికరముగ నుండెను. ఋషులందఱు భార్యాపుత్రసహితముగ నిట నివసించుచు, శిష్యప్రశిష్యులతో శుభకర్మలు చేయుచు సుఖముగా నుండిరి. గౌతమప్రభావముచే సకలవిధధాన్యములు పండుచు నానందకరములై యుండెను.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువదిఅయిదవ యధ్యాయము

## గౌతమునకు గోహత్యాపాపము సంభవించుట

గౌతము డొకనాడు శిష్యులను జలము తెమ్మని పనుప వారు కమండల ధారులై జలమునకై గర్తముకడ కేగ, నక్కడ చాలమంది ఋషిపత్నులు జలమునకై వచ్చి, ఓవిప్రులారా! మేము చాల దూరము నుండి వచ్చితిమి. మేము ముందుగా జలమును, తీసుకొని వెళ్లెదము, మీరు కొంతతడవుండు డని వారి నాపుజేసిరి. శిష్యులేతెంచి యిదంతయు నహల్యతో జెప్ప నామెయే స్వయముగ వచ్చి భర్తకై జలమును తీసికొని వెళ్ళెను. ప్రతిరోజున నావిధంబుగనే జరుగుచుండెను. ఋషిపత్నులు అహల్యను కూడ భయపెట్టుచు క్రోధముతో జలము నింపుకొని వారివారి యాశ్రమముల కేగి దుష్టాత్మలగు వారందరు తమ తమ భర్తలతో నహల్యను గురించి యనేక నిందారోపణలుచేయ, ఋషు లందరు భార్యావశులై భార్యల మాటలు విని, గౌతమునియందు కోపించి, కుబుద్ధులై, భ్రష్టులై, స్వాభిమానులై నానావిధ పూజాదికములచే విఘ్నార్థమై విఘ్నేశ్వరుని సేవించుచుండ, నతడు సంతసించి దర్శనమిచ్చి, ఋషులారా! మీకు నేనేమిచేయవలయునో చెప్పుడు. మీపూజలకు సంతసించితి ననగ, గణాధిపా! మాకు వర మీయ దలచితివేని గౌతము నీప్రదేశమునుండి వెడలుగొట్టు మన, సత్పురుష గతియగు గణపతి మందహాసము చేయుచు వారికి హితవాక్యములు బోధించుచు, ఓఋషులారా! మీరు చేయుపని మంచిదికాదు. అపరాధములేకున్న కోపించినచో హాని సంభవించును. పూర్వమితడు మీ కుపకారము చేసియుండెను. ఉపకారులకు నపకారము తలపెట్టుట మంచిదికాదు. అట్టివారలకు దుఃఖము కల్గించినవారు తప్పక నశింతురు. బహుకోపంబుచేసి మీ రిదియేల కోరుకొనుట? ఉత్తమఫలమును సాధింపవలయునుగాని, మీకిట్టి దుష్టబుద్ధి యేలకలిగెను? మీరు విపరీతభావవలచే శుభంబులను వీడి యశుభ ఫలంబులను కోరుచుంటిరేల నన, ఋషులు మోహావశులై ఓగణనాథా! మేము కోరినవర మిచ్చి మమ్ము సంతోషపెట్టుము. ఇతర వరములేమియు మాకనవసర మన,

మఱల గణపతి ఓఋషులారా! దుష్టులు సజ్జను లగుట సజ్జనులు దుష్టు లగుట కష్టసాధ్యమని బ్రహ్మ నుడివిన వాక్కులు సత్యము. పూర్వము మీ రాహారము లేక దుఃఖించుచుండ గౌతముడు జలమును సంపాదించి మిమ్ముల నందఱిని రక్షించెను. అతడు మీకు సుఖములు కల్గించెను. అట్టివా నికి మీరందఱు దుఃఖము కల్గింపనున్నారు. మీరు బాగుగ నాలోచిం చినచో, మీ కిది మంచి పనికాదని విశదమగును మీరు స్త్రీబలాత్కార మోహితులై యుండి నామాట విశ్వసింపకుంటిరి. గౌతముడు మీకు హితుడుకాని యహితుడుకాడు. సందేహములేదు. అతడు మీకు శుభములు కలుగజేయును కాని దుఃఖమును కల్గింపడు. అతనిని దుఃఖపెట్టుట యుచి తముకాదు. మరొక వరము కోరుడన, మా కిదియే కావలయునని ఋషులం దఱు పట్టుబట్టిరి. శివపుత్రుడగు గణపతి భక్తాధీనుడుగాన నుదాసీన మ నస్కుడై, ఋషులారా! మీ యిష్టప్రకారమే చేయుదును. కానున్నది కాకమాన దని పలికి యదృశ్యుడయ్యెను. మునుల దుష్ప్రవర్తన గౌత ము డేదియు నెఱుగడు. తనభార్యతో నిత్యకర్మలు చేయుచు సుఖముగా నుండెను.

ఈదుష్టమును లు తమవర ప్రభావముచే నేమి చేసిరో చెప్పెద వినుడు. గౌతముడు తనపొలములో యవలు గోధుమలు చల్లినవి ఫలోన్ముఖము నకు రాగా గణపతి తనవరము సిద్ధింపచేయుటకై సూక్ష్మమైన గోరూప ముదాల్చి ఆపంటచేలను భక్షింపుచుండ, గౌతము డిదిగాంచి దైవవశమున నటకేతెంచి, గడ్డితాడుచే బెదిరించి యాగోవును గొట్ట నదివెంటనే క్రిందబడి, గౌతముడు గాంచుచుండగనే క్షణములో మరణింప, ఋషులు, ఋషిపత్నులు తమపన్నాగము ఫలించెనని సంతసింపుచు గౌతముడెంత పని చేసెను. అతనికింత సాహసమూ యని పరిపరి విధంబుల నిందింప సాగిరి. గౌతముడు భార్యను పిలిచి యెంతవిపర్యయము జరిగినదో చూచి తివా? ఇపుడు నేనెచటికి పోవుదును? నేనేమి చేయుదును? పరమేశ్వరుడు నాయెడ కోపించెను గాబోలును. ఎంత ఘోరకృత్యము జరిగినదో గాం చితివా యని విచారింపుచుండ, ఋషులు ఋషిపత్నులు నేతెంచి,

యీభార్యా భర్తల నిరువురను దూషింపుచు, దుర్వచనములచే భయపెట్టుచుండ, వారిశిష్యులు, పుత్రులు కూడ నేతెంచి, యందఱు నేకీభవించి ఓ పాపాత్ముడా యని మాటిమాటికి నిందింపుచు, భయంకర వాక్కులతో గౌతమా! నీవుగోహత్యాపాతకుడవు. నీముఖము చూడరాదు. నీవెచటికైనను బొమ్ము. గోహత్యాపాతకుని జూచినచో, సచేల స్నానమాచరింప వలయును. నీవు నాయాశ్రమ మధ్యమందున్నచో దేవతలు హవ్యములు, పితృదేవతలు కవ్యములు గ్రహింపరు. గాన నీవు నాపరివారముతో నెచటికైన బొమ్ము. విలంబము చేయకుమని రాళ్లచే గొట్టుచు, నహల్యాగౌతములను నిందింపుచుండ, గౌతముడు వారల గాంచి, ఋషులారా! నేనెక్కడికి పోవలయునో జెప్పుడని, వారియాజ్ఞచే క్రోశదూరంబున నాశ్రమంబు నిర్మించుకొని భార్యతో నట నివసించుచుండెను. మఱియు గోహత్యాదోషము పోవునంతదనుక దేవకర్మలు కాని పితృకర్మలు గాని చేయరాదని ఋషులందఱు శాసించిరి. గౌతముడు దుష్టులచే నిట్లుశాసింపబడి, యత్యంతదుఃఖముగడిపి, మఱల నా ఋషులకడ కేతెంచి యనేకవిధంబుల బ్రతిమాలుచు, మీరు నాయందు దయయుంచి నాపాపము లెట్లు పోవునో సెలవిండన, విప్రులందఱు నొకరినొకరు గాంచుచు, మౌనము వహించి కొంతసే పాలోచించి యందఱు నేకమై యూరకొన, గౌతముడు వారలగాంచి మూకముగనుండకయే నమస్కరించి వినయముతో నే నిపుడేమి చేయవలయునో సెలవిండని మాటిమాటికి ప్రార్థింప, మునులందఱు నాలోచించి, గౌతమా! ప్రాయశ్చిత్తముచేగాని నీవు పరిశుద్ధుడవుగావు. ముందుగా నీదేహశుద్ధికై ప్రాయశ్చిత్తము చేసికొనుము. పిమ్మట నీపాపములు చెప్పికొనుచు ముమ్మారు భూప్రదక్షిణము చేసి తదుపరి యిటకేతెంచి మాసవ్రతమాచరించి చాంద్రాయణము, తదుపరి బ్రహ్మగిరికి నూటఒక్కసారి ప్రదక్షిణము చేసినచో నీవు పరిశుద్ధుడవు కాగలవు. లేనిచో తపంబుచే గంగను తీసికొనివచ్చి, అందు స్నానమాడి కోటిపార్థివలింగములను పూజించి, మరల గంగాస్నానముచేసి పదునొండు పర్యాయములు బ్రహ్మగిరికి ప్రదక్షిణముచేసి శతకుంభ స్నానము చేసినచో నీవు పరిశుద్ధుడవగుదువని ఋషులు పలుక, వాటికన్నిటికి గౌతముడంగీకరించి

పదునొకండుసార్లు గిరిప్రదక్షిణముగావించి, అహల్యతో కోటితీర్థపలింగపూజలు చేయుచుండ శిష్యులు, ప్రశిష్యులు వారిని సేవింపుచుండిరి.

శివమహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది యైదవ అధ్యాయము సంపూర్ణము.

## ఇరువది ఆరవ యధ్యాయము

### గౌతముడు తపంబుచేసి గోదావరినితెచ్చుట

భార్యతోకూడ చేసిన గౌతముని శివపూజలకు శివుడుమెచ్చి ప్రసన్నుడై యట నావిర్భవించి, ఓమహర్షీ! నీపూజలకు ప్రసన్నుడనైతిని, నీకేమివరములు కావలయునో కోరుకొనుమన, మహాత్ముడగు శంభుని సుందరరూపము గాంచి ముదన్వితుడై, నమస్కరించి, స్తుతించి, బద్ధాంజలిపుటుడై, ప్రభూ! నన్ను నిష్పాపుని చేయుమని గౌతముడుకోర, మహాత్ముడగు గౌతమవాక్యములు విని, శివుడు సుప్రసన్నుడై, ఓముని! నీవుధన్యుడవు కృతకృత్యుడవు. నిష్పాపుడవు. దుష్టులు నిన్ను కపటముచే మోసగించిరి. నిదర్శనముచే జనులు నిష్పాపులగుదురు. నాభక్తుడ వగునీకు పాపములెట్లు సంభవించును? దురాత్ములు నీకీయుపద్రవము కల్గించిరి. వారలే పాపాత్ములు, దుష్టాత్ములు, హంతకులునై, యుండిరి. వారిని దర్శించిన పాపములు సంభవించును. వారందఱు కృతఘ్నులుగాన వారికి ప్రాయశ్చిత్తము లేదని, దుష్టశిక్షకుడు, శిష్టరక్షకుడునగు శంకరుడు ఆదుష్టులుచేసిన దుశ్చరిత్ర నంతను గౌతమునకు తెలుప, శర్వవాక్కులు విని గౌతముడు విస్మితుడై, భక్తితో ప్రణమిల్లి, మహేశ్వరా! ఋషులు నాకు మంచియుపకారమే చేసిరి. వారట్లు చేయనిచో నీదర్శనమెట్లు లభించును? ఆధన్యాత్ములు నాకు శుభములు చేకూర్చిరి. వారి దుష్కృతియే నాకు శ్రేయోదాయక మయ్యె నన, శంకరుడు గౌతముని కృపాదృష్టితో గాంచుచు, ఓవిప్రేంద్రా! నీవు ఋషిశ్రేష్ఠుడవు. ధన్యుడవు నేను ప్రసన్నుడ

నైతినిగాన, నుత్తమవరము కోరుమన, గౌతముడు లోకోపకారము చేయదలచి నతమస్తకుడై, ఓశంకరా! నీనుడువులు సత్యము. ఆదుష్టులు నాపై పగచే నన్ను పంచమహాపాతకునిగా నెంచిరి. నాదోషము పోగొట్టుకొనుటకును, లోకోపకారమునకు నాకు గంగ నిమ్ము. నీకు మాటిమాటికి నమస్కరింపుచుంటి నని గౌతముడు శంకరుని పదములపై వ్రాల, పూర్వము బ్రహ్మ దివి భువి సారభూతంబులైన జలంబులను కమండలమునందు రక్షింపుచు నీశ్వర వివాహసమయంబున కొంతజల మతని కీయ, నతడాజలంబును తనజటాజూటంబున భద్రపరచి, శేషించిన జలమును శివుడు గౌతమున కిచ్చియుండ, నాగంగా జలము స్త్రీరూపమై గౌతముని యెదుట నాత్మసాక్షాత్కరింప నతడామెను గాంచి నతమస్తకుడై, ఓగంగా! నేనుధన్యుడను. కృతకృత్యుడను. నీవు ముల్లోకములను పవిత్రముచేయుచుందువు. నరకమునకు బోవుచున్న నన్ను పవిత్రునిజేయుమని, గౌతముడు ప్రార్థింప శంకరుడుగంగనుగాంచి, ఓగంగా! సర్వహితమునకై చెప్పెదను నా నుడువులు విని యీగౌతముని పవిత్రుని జేయుమన, శివభక్తి కలిగిన గంగ, గౌతమవాక్యములు, శంకరవాక్యములు విని, శంకరా! గౌతముని పరివారసహితముగ పవిత్రుని చేసి నేనుస్వస్థానమేగెదనని పలికెను. లోకోపకారమునకై శంకరుడు మరల గంగతో, గంగా! నీవు యిరువదియెనిమిదవ కలియుగంబున వైవస్వత మన్వంతరమువరకు (కలియుగంబున) భూమియందు నివసింపుమన, నదిశ్రేష్ఠయు. పరమపవిత్రురాలును నగు నాగంగ, పరమేశ్వరా! నేనతి మహాత్మ్యకల్గినదాననై యుండవలయును. అట్లైనచో నేను భువికి జనెదను. మరియు నీవు సుందరవేషధారివై, యంబికాసహితుడవై, గణపరివృతుడవై నాచెంత నివసించియుండవలె నన, గంగవాక్యములు విని, శంకరుడు లోకోపకారమునకై, గంగా నీవు ధన్యురాలవు. నానుడువులు వినుము. నేను నీకంటె భిన్నుడను కాను. నీవెక్కడనున్న నేనక్కడ స్థిరముగ నుందు నన గంగ సంతసించి, శంకరునిపూజింప, నింతలో దేవతలు, ఋషులు మూర్తిమంతములగు ననేక క్షేత్రములు నేతెంచి జయజయధ్వానములు జేయుచు, శివుని, గంగను, గౌతముని పూజించిరి. బ్రహ్మవిష్ణ్వాది దేవతలు చేతులొగ్గి నమస్కరించి ఓపరమేశ్వరా! ఓగంగా! లోకోపకారమునకై మీరిటనుండి రక్షింపుచుండుడన గంగవారలగాంచి, ఓదేవతలారా! మీరం

దలు మాతోపాటు స్థిరముగనుండి లోకోపకారము చేయుదురుగాకయన, దేవతలా మె వాక్కులువిని, గంగా నీవిటనే యుందుము. బృహస్పతి సింహరాశియందున్నపుడు మేమందఱము నీతోకలసి యుండెదము. మేము యేకాదశ వర్షంబులు ప్రజల పాపములన్నియు భరించి,కలుషితములై దేవగురుడు సింహారాశికి రాగ మేము నీలో ప్రవేశించి విదూషకల్మషులమై పరిశుద్ధుల మగుదుము. సార్ధత్రికోటి తీర్థములు నపుడు నీయందేనివసించి యుందును. ఓ దేవీ! లోకోపకారమునకును, మమ్ముల సంతోసింపజేయుటకును, నీవును శంకరుడును నిటనే యుండవలయును. సింహారాశియందు గురుడుండగ, మేమందఱము వచ్చినీయందు త్రికాలస్నానమాచరించి, శంకరుని దర్శించుచు పవిత్రులమై సంవత్సరము నిటనే వసించెదము. అదియే గౌతమీ పుష్కరమందురు. మేము పాపవిముక్తులమై మామాస్థానములకేగెదమని బలికిరి. దేవతలు, గంగ, గౌతముడు ప్రార్థించుటచే శంకరుడు త్ర్యంబకనామమున నట స్థిరుడై యుండెను. యీగంగ గౌతమీ నామంబుతోడను, యీశ్వరుడు త్ర్యంబకేశ్వరనామంబుతోడను, ఆదివసమందుననే బృహస్పతిసింహారాశియందు ప్రవేశింప ముక్కోటి దేవతలు, సర్వతీర్థంబులు, గంగాది సకలనదులు, సర్వపుణ్యసరోవరంబులు, విష్ణ్వాది దేవతలు నీతటంబుననే నివసించియుండిరి. వారందఱు గౌతమీతటంబుననున్నంతవరకు నితరక్షేత్రములందలి నదులకు, దేవతలకు మహాత్తులుండవుగాన నితరక్షేత్రములు సేవించినను ఫలములుండవు. గౌతమి సకలపాపంబులు హరింపజేయును. త్ర్యంబకేశ్వరుని దర్శించి, యర్చించిన వారలు సకల పాపవిముక్తులై సకలభోగముల ననుభవించి, ముక్తినొందెదరు. గౌతమముని ప్రతిష్ఠితమైన యీజ్యోతిర్లింగము సర్వకామ్యములీడేర్చుచుండును. గౌతమియందు స్నాన మాచరించి, యందున్న త్ర్యంబకుని సేవించినచో సర్వపాపములు నశించి, సర్వకోర్కెలీడేరి, ముక్తినొందెదరు. గోవునిమిత్తము తేబడెనుగాన గోదావరియనియు గౌతముడు తెచ్చెనుగాన గౌతమియనియు పిలుబడుచుండెను.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది ఆరవ అధ్యాయము సంపూర్ణము

## ఇరువదియేడవ యధ్యాయము

## త్ర్యంబకేశ్వర మాహాత్మ్యము

గౌతమి యెంతవరకు ప్రవహించెను? గౌతమునిదుఃఖపెట్టిన దుష్టాత్ము లేమైరి? యని ఋషులు ప్రశ్నింప సూతుండిట్లు చెప్పదొడంగెను. గౌతమ ప్రార్థనలచే గంగ బ్రహ్మగిరినుండి బయలుదేరి యౌదుంబరశాఖలనుండి (మేడి) ప్రవహించి వచ్చుచుండ గౌతముడానందముతో స్నానముచేయ, గౌతమశిష్యులు, నితరమైన మహర్షులు నేతెంచి, యానదియందు స్నానమాచరించిరి. ఆప్రదేశము గంగాద్వారమని చెప్పబడుచుండెను. ఇది ప్రఖ్యాతమై, దర్శించిన వారలకు సర్వపాపహారమై యుండెను. గౌతమద్వేషులగు మును లచటికి స్నానార్థమై రాగ గంగవారలగాంచి, యదృశ్యరాలయ్యెను. గౌతముడిదిగాంచి, నతమస్తకుడై ముకుళితహస్తుడై గంగను మాటిమాటికి ప్రార్థింపుచు, నోదేవీ! వీరు శ్రీమదాంధులు సాధువులు. నసాధువులుకూడనై యుండిరి. నాపుణ్యప్రభావముచే వారికి దర్శనమిమ్మనికోర, వ్యోమమండలమందున్న గంగ గౌతమా! వీరందఱు దుష్టాత్ములు, కృతఘ్నులు, స్వామిద్రోహులు, ధూర్తులు, పామండులు, సర్వదా దర్శనవర్జితులు క్రూరులునై యుండిరన, గౌతముడు మఱల నిట్లు ప్రార్థించెను. ఓతల్లీ! నీవు శంకరాజ్ఞను పరిపాలించి నీకర్తవ్యము నెరవేర్చుకొనుము. అపకారుల కుపకారముచేయుటయే మహత్తరమైనదని మహాత్ములు నుడివియుండిరి. యీకారణముచే నీవు వారినికూడ పవిత్రుల జేయుమన, గంగ గౌతమ వాక్కులువిని, గౌతమా! నీపలుకులు సత్యములై మంగళప్రదములై యున్నవి. కాని లేనిపాపము లంటగట్టిరిగాన వారుకూడ ప్రాయశ్చిత్తము చేసికొనవలయును. అదెట్లన బ్రహ్మగిరికి నూటఒక్కసారి ప్రదక్షిణములుజేసి, నిన్ను క్షమార్పణ వేడి నీయధీనులై యున్నచో, మఱల నేతెంచును. వారందఱికి నీవే యధికారివై యుండవలయును. అప్పుడు వారలకు దర్శనమిత్తునన, వారందఱు వ్యోమవాక్కులువిని, దీనులై యట్లే ప్రాయశ్చిత్తము చేసికొనెదమని గౌతముని పదంబులపై బడి మా యపరాధములు క్షమింపుమని ప్రార్థించి వారు నూటొక్కసారి గిరి ప్రదక్షిణముచేసి ప్రార్థింప,

గౌతముని ప్రార్థనలచే గంగాద్వారానికి భాగమైన కుశస్థలినుండి ప్రవహింప జొచ్చెను. యిది విఖ్యాతిగాంచిన తీర్థమై యుండెను. యిచట స్నానము చేసిన నరులు మోక్షము నొందగలరు. మఱియు సర్వాఘములు నశించి, సుస్లభమైన విజ్ఞానమునొందగలరు. కృతఘ్నులైన గౌతమ ద్వేషు లందఱు లజ్జితులై యుండిరని సూతుడు పలుక, గౌతముడు క్రుద్ధుడై యామునిష్ట మును లందఱిని శపించెనని విని యుంటిమి. అది యథార్థమా కాదాయని ఋషులు పలుక సూతుడిట్లు చెప్పదొడంగెను.

ఋషులారా! మీరన్నదికూడ సత్యమే కల్పభేదముల ననుసరించి చెప్పియుండిరి. అదంతయు చెప్పెదవినుడు. అనావృష్టి దోషముచే ప్రజలందఱు పీడింపబడుచుండ గౌతముడు లోకోపకారమునకై వరుణుని గూర్చి తపంబు చేసి, యతని యనుగ్రహముచే నక్షయజలమునుపొంది యవలు, గోధుమలు చల్లి పంటలు పండించుచు తన తపోబలంబుచే నందఱకు నాహారమొసంగు చుండ కుటిలులగు ఋషిపత్నులందఱు జలమునకై వచ్చి యనేకవిధంబుల నహల్యను దూలనాడి గౌతముని నిందింపుచు పరోపకారులగు వారినిగాంచి సహింపలేక తమభర్తలతో నేదోనెపములుపన్ని వారిపై నేరారోపణము చేయ, విప్రులు తమభార్యలమాటలు విశ్వసించి కుత్సిత స్వభావులై, కృత్రిమ గోవును నిర్మించి గౌతముని ధాన్యరాశియందు దువిడువ, నతడు ధాన్యమును భక్షించుచున్న గోవునుగాంచి, మెల్లగా గోవును తృణముతో గొట్ట, గౌతముని భావికర్మచే తృణస్పర్శ తగిలినంతనే నాగోవు వెంటనే భూమిపైబడి మరణించెను. కుటిలమానసులగు నావిప్రులందఱు గౌతముడు గోహంతకుడని పలుకు చుండ, గౌతముడు నిష్కారణముగ గోవుమరణించెనని దిగులుచెందుచు దుఃఖింపుచుండ, యింతలో తనశిష్యులు, నహల్యయు నేతెంచి విస్మయముగ గాంచుచుండిరి. తదుపరి గౌతముడు దుష్టవిప్రుల కపట కృత్యము నెరింగి యాగ్రహించి, ఓవిప్రులారా! శివభక్తుడనగు నన్ను దుఃఖపెట్టితిరిగాన, నేను మీకు శాపమిచ్చుచుంటిని. నేటినుండి మీరు వేదమార్గవిముఖులై శివభక్తి విహీనులై యుండెదరు. ఇంకను మీరు దుర్మార్గులై శృతిబహిర్ముఖులై మోక్షమార్గ విహీనులై, మృత్తికా తిలకధారులై యుండెదరు. విభూతి ధరించు కాలమున మీరు మృత్తిక ధరించుటచే నరకవాసు లగుదురు. మీరం

దఱు శివోపాసకులు గాకుందురుగాక! యద్వితీయుడైన శివుని మీరు సామాన్యముగ భావించెదరు. శివపూజాదులయందెన్నడు మీకు ప్రీతియుండదు. శివభక్తులసరసను కూడ మీరు పొర్గొనరు, మీ రేగాకుండ మీసంతానము కూడ నిట్లే యగుదురు. మీరు పుత్ర పౌత్ర సహితముగ శివభక్తి శూన్యులై నరకమందు బడెదరు. మఱియు నేటినుండి మీరందఱు చండాలులై దుఃఖ దారిద్ర్యపీడితులై మూర్ఖులై సంకటులై నిందాకరులై తప్తముద్రాంకితులై యుండెదరని గౌతముడు శపించి, తన యాశ్రమంబున కేతెంచి శివధ్యానము చేయుచుండెను. శాపము చెందిన విప్రులందఱు పుత్రపౌత్రులతో కాశీపురవాసులై శివభక్తి శూన్యులై యుండిరి. వీరు కలియుగంబున కూడ నతిదుష్టులై, శివనిందకులై ప్రవర్తింపగలరు. ఋషులారా! ఇటుపై వైద్యనాథేశ్వర జ్యోతిర్లింగ మాహాత్మ్యము చెప్పెద వినుడు.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది ఏడవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువది ఎనిమిదవ యధ్యాయము

## వైద్యనాథేశ్వర లింగమాహాత్మ్యము

మానవరాయణుడు, నభిమాని, రాక్షసశ్రేష్ఠుడు నగు రావణు డుత్తమంబైన కైలాసమందు భక్తితో భవానిని నారాధింప, నతడు ప్రసన్నుడు గాకుండుటచే హిమవద్గిరి సిద్ధస్థానమును దలంచి, శివానుగ్రహము నొందుటకై యట కేగి దక్షిణ దిశయందున్న వృక్షప్రదేశమందాసీనుడై యట గర్తము నిర్మించుకొని యగ్నిని స్థాపించి, తనసన్నిధిని శివలింగమును స్థాపించి హోమములు చేయుచు గ్రీష్మమందు పంచాగ్ని మధ్యమందును, వర్షమందు భూమిమీద శయనించియు శీతలమందు జలమందున నుండియు తపంబు చేయుచు త్రికాలమందు తపోహోమం

బులు చేయుచుండెను. దురాత్ముడగు రావణు డిట్టిధంబున నెంత కాలము తపంబుచేసినను, దురారాధ్యుడగు పరమేశ్వరుడు ప్రసన్నుడు గాకుండు టచే తనయొక్కొక్క శిరంబునే ఛేదించి శివున కర్పించుచుండ నిక నొక్క శిరంబు మాత్రమే శేషించియుండెను. శంకరు డిదిగాంచి ప్రసన్నుడై యాభక్తవత్సలుడు ఆలింగమందే యావిర్భవించి ఖండితములైన శిరంబులన్నియు యథాప్రకారముగానే బాధలేకుండ వరమిచ్చి యతని మనోరథంబు లీడేర్చి యుత్తమంబైన యతులబలంబు నిచ్చియుండ రావణుడు శివానుగ్రహమునొంది నతస్కంధుడై కృతాంజలియై, ఓప్రభూ! నీవు ప్రసన్నుడ వైనచో నావెంట లంకాపురికి రమ్ము. నిన్ను శరణుపొందితిని గాన, నీవు నాయీకోర్కెను దీర్పుమన శంకరుడు విస్మితుడై, విచేతస్కుడై మనంబున దిగులుజెందుచు, రావణా! సారభూయిష్ఠమైన నావాక్కులు వినుము. నా యీలింగమును భక్తి నియమంబులతో తీసికొని వెళ్లుము. నీ వీలింగమును భువిపై పెట్టినచో, నచటనే నేను స్థిరముగ నుండెదను. సందేహములేదు. జాగ్రత్తగా తీసికొనివెళ్లు మన, రాక్షసేశ్వరుడగు రావణుడు శంకరవాక్కులు విని యట్లే చేయుదు నని శంకరు డిచ్చిన యాశ్శలింగమును తీసికొని లంకకు బయలుదేరి వెళ్లుచుండ, దారిమధ్యమున నీశ్వరమాయచే మూత్రవిసర్జన చేయవలసివచ్చి, యాపుకొనలేక, లింగమును భూమిపై నుంచుటకు వీలులేక, సమీపమం దున్న గోపబాలునిగాంచి యీలింగమును నేను వచ్చుదనుక పట్టుకొనుమని ప్రతిమాలి యాబాలునిచేతి కిచ్చి లఘుశంకకు బోవ, నొక ముహూర్తకాలము గతించి నతరి, గోపబాలు డా లింగభారము భరింపలేక, వజ్రసారభూతమైన యాలింగమును భువిపై నుంచెను. అప్పటినుండి యాజ్యోతిర్లింగము వైద్యనాథేశ్వర నామంబున ప్రఖ్యాతివడసి, దర్శన పూజాదులచే సర్వపాపంబుల హరింపజేయుచు, నుత్తమభక్తి నొసంగుచు ప్రసిద్ధనాముడై, ముల్లోకప్రఖ్యాతుడై, సత్పురుషులకు భుక్తిముక్తుల నిచ్చుచుండెను. ఈలింగము సర్వపాపహారమై, యుత్తమసుఖంబులనిచ్చుచు, సర్వలోక హితమునకై, తనసత్యము నిలబెట్టుకొనుటకై యట స్థిరనివాసుడై యుండెను. రావణుడు శంకరునివలన నుత్తమవరంబులనొంది స్వగృహమున కేగి తనభార్యతో

నిరంతరము తెలిపి సుఖముగా నుండెను. శక్రాది దేవతలు, మునులు నిరంతర యు నెరింగి, శివాసక్త మనస్కులై యీవైద్యనాథేశ్వరుని కడ కేతెంచి హరిబ్రహ్మాదులతో సర్వేశుని విశేషముగ పూజించి స్తుతించి యచ్చటనే ప్రతిష్ఠచేసి, షోడశోపచారంబుల పూజించి వైద్యనాథుడని పేరిడి దివంబున కేగిరి. లింగ మచట స్థాపితమై, రావణుడు గృహమునకేగినతరి నేమిజరి గెనో విస్తరించి చెప్పుమని మహర్షులు ప్రశ్నింప, సూతు డిట్లు చెప్పదొ డంగెను.

రావణుడు మహోత్తమవరంబును పొందినపిమ్మట నిరంతరము మహానందముతో తన ప్రియురాలి కెరింగించెను. శక్రాది దేవతలు మునులు నిందతయు నెఱింగి యుద్రేకపూరితులై నొకరొకరు చెప్పుకొనుచు రావ ణుడు దురాత్ముడు, దేవద్రోహి, దుష్టుడు, కుత్సితమనస్కుడు. అతడు శివు నిచే వరములు పొందుటచే మనకు దుఃఖములు కల్గించును. ఇపుడు మన మేమిచేయుదుము? ఎక్కడికి పోవుదుము? ఏమి కావలచినదో? సమర్థుడైన దుష్టుడు చేయలేని దేమున్నదని వారందరును దుఃఖింపుచు వికలమనస్కులై నారదుని రావించి, ఓమునిసత్తమా! నీవు సర్వకార్యసమర్థుడవు గాన దేవ దుఃఖనాశనమునకై నేదేని యుపాయ మాలోచింపుము. రావణుడు కడు దురాత్ముడు వాడు చేయలేని పనియుండదు. ఈ దుష్టునిచే పీడింపబడ కుండ మేమెట్లుండవలెనో తెలియకున్నదన, నారదుడు దేవతల దీనవాక్కులువిని, సురలారా! మీరు దుఃఖము విడుడు. నే నొక యుక్తిని పన్నెదను. శంకరునికృపచే మీకు సహాయము చేసెద నని చెప్పి, రావణాల యమున కేగి, యతనిచే సత్కరింపబడి, రావణా! నీవు ధన్యుడవు. శైవశ్రే ష్ఠుడవు. తపోవంతుడవు. రాక్షసోత్తముడవు. నిన్ను గాంచి నే నతి ప్రసన్నుడ నైతిని. నీవు శివు నెట్లారాధించితివో తెలుపు మన, రావణు డిట్లు చెప్పదొడంగెను. ఓమహామునీ! ప్రథమంబున తపంబునకై కైలాస మున కేగితిని. బహుకాల మట నేను దారుణతపంబు చేసితిని. కాని నాక చట శంకరుడు ప్రసన్నుడు కాలేదు. తదుపరి హిమగిరియందలి వృక్షషం డమున మఱల తపమాచరింపుచు గ్రీష్మఋతువునందు పంచాగ్ని మధ్య

మున వర్షఋతువునందు కటికినేలపై బడియుండియు, శీతకాలంబున జలాంతరమందు నను త్రివిధంబుయిగ తపమాచరించితిని. ఇంత తీక్ష్ణంబుగ తపమాచరించినను, యీశ్వరుడు ప్రసన్నుడు కాకుండుటచే నేను కోపించి భూమియందు గర్తము త్రవ్వి, అందగ్నిని స్థాపించి, పార్థివలింగ మును సంముఖమున బెట్టుకొని, చందన, గంధ, ధూప, దీప నైవేద్యాదులచే, శంకరు నారాధించి, నీరాజనము నిచ్చి సాష్టాంగ నమస్కారములు గావించి పవిత్ర స్తోత్రములచే స్తుతించి, ముఖవాద్య, గీత, నృత్య వాద్యములచే సంతసపరచి, యింక ననేకోపాయములచేతను, సకల శాస్త్ర విధానంబులచేతను, హరుని హర్షంబున పూజించితిని. కాని యెప్పటికిని హరుడు ప్రసన్నుడుగాక నాకు దర్శన మీయకుండుటచే, ఇంతతపంబుచేసి సత్ఫలంబు నొందకుండుటచే, నేనెంతో దుఃఖించుచు, నాశరీరంబును, నాబలంబును, నాతపంబును, నిందించుకొనుచు నాజన్మ కాల్పనా, నేనుతపస్సిద్ధిని పొందలేకుంటిని. అగ్నింబడి నాశరీరము దహింప జేసికొందునని ఒకక్రమా రాయగ్నిం బడకుండ, సక్రమంబుగ నాయీ శరీరము భగవంతున కర్పింపవలయు నని యూహించి, నాయొక్కకశిరమే ఖండించి యగ్నింబడవేసి, హోమముచేయుచు, నవశిరంబులు ఖండించి హోమముచేసి, దశమశిరము ఖండింపబోవ, నప్పటికి శంకరుడు ప్రసన్నుడై, జ్యోతిస్స్వరూపుడై, యావిర్భవించి, రావణా! వలదు, వలదు. సాహసము చేయకుము. నేనిదే వచ్చితిని, నేనుప్రసన్నుడనైతిని. నీయాప్సితము కోరుకొనుమన, నోవరమేశ్వరా! నాతపంబునకు నీవు సంతసించినచో నాకతులమైన బలమునిమ్ము. నీవు ప్రసన్నుడవైనచో నాకు దుర్లభ మగునదేమున్నదని నేను నతమస్తకుడనై పలుక, శంకరుడు నాయీప్సితము నెరవేర్చదలచి, యతని సుధాదృష్టిని నాపై ప్రసరింపజేయుచు, వైద్యుని వలె నాశిరంబులన్నియు యథాప్రకారముగ సంధానమునర్చి, యతుల బలంబునిచ్చి, నాశరీరమునకు పూర్వమువలె పుష్టినిచ్చి యుండెను. అతని ప్రసాదమున సర్వఫలంబుల నొందితిని. నే నావృషభధ్వజుని ప్రార్థింప వైద్యనాథేశ్వరుడను పేరుతో జగత్త్రయమందు ప్రసిద్ధి బడసి యుండెను. జ్యోతిర్లింగ రూపుడగు మహేశ్వరుడు దర్శన పూజాదులచే సర్వులకు

భుక్తిముక్తుల నొసంగుచుందును. ఇట్టి జ్యోతిర్లింగమును నేను విశేషముగ పూజించి, నమస్కరించి త్రిలోక విజయమునకై బయలుదేరుచున్నాను;

నారదుడు రావణవాక్యములు విని, సవ్యముగ నీకు హితవాక్యములు చెప్పెద, వినుము. నేను చెప్పినట్లు చేయుము. మరియొకవిధముగ మాత్రము చేయకుము. నీహితమునకై చెప్పుచుంటిని. శివుడు చెప్పినదంతయు యథార్థ మని నమ్మకుము. ఉన్మాదుడగు శివునివాక్యములు నీ వెట్లు నమ్మితివి? అతనివరంబులు యథార్థములని నమ్ముట యెట్లు? నీవేగి కైలాసపర్వతము పైకెత్తినచో, నీకిచ్చిన వరంబులు సత్యము లని నమ్మవచ్చును. నీబలము తెలియబడును. నీకార్యము సఫలత నొందగలవు. నీబలము తెలియుటకై కైలాసము కదిలించి, పైకెత్తి మరల యథాస్థానమున స్థాపించి, సుఖముగ నీగృహమునకు రమ్మన, రావణుడు విధిమోహితుడై నారదవాక్యములు సత్యములని గ్రహించి, కైలాసమునకు కేగి నగమును కదలించుచుండ, నగము మీనుండు సకలవస్తుజాలములు తలక్రిందు లగుచుండెను. పర్వతము నిట్లు చలించుచున్న దేమని శంకరుడు ప్రశ్నింప, గిరిజ సవ్యముగ నిట్లు ప్రత్యుత్తరం బిచ్చెను. మీ యోగ్య మగుశిష్యుని యోగ్య ఫలమని తెలుసుకొనుడు. అతులబలము శాంతాత్మునకు బుద్ధిమంతునకు నివ్వవలయునుగాని, యిట్టి మూఢున కిచ్చినచో నిట్లుచేయక, యేమిచేయు నని పార్వతిపలుక, మహేశ్వరుడు గ్రహించి రావణుడు కృతఘ్నుడని తెలిసికొని బలదర్పితుడని గ్రహించి, శాప మీయదలచి, ఓరీరావణా! దుష్టభక్తుడా! నీగర్వము వినుము. నీభుజదర్పమణంచు ధీరుడు త్వరలో రాగలడని శపింప, శంకరవాక్యములు నారదుడు విని సంతసించెను. రావణుడు కైలాస మెత్తగలిగితి నని సంతసింపుచు, యథేచ్ఛగ తనపురమున కేగి దిగ్విజయ యాత్రకై బయలుదేరెను. శంకరునిచే నొందిన దివ్యాస్త్రములను బొంది, రావణుడు సర్వులను జయించుచుండెను. వైద్యనాథేశ్వరుని చరిత్రనంతయు చెప్పితిని. ఇదివిన్నంతనే క్షణములో సర్వపాపములు హరించును.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు

ఇరువది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

# ఇరువదితొమ్మిదవ యధ్యాయము

## దారుకావనమున రాక్షసోపద్రవములు

దారుకవనమందున పార్వతీ వరదర్పితురాలై నదారుకియనెడు రాక్షస స్త్రీ గలదు. ఆమెకు దారుకు డనెడి భర్తగలడు. వీరిరువురు బలవంతులై యుండిరి. వీ రనేక రాక్షసులను గూడుకొని యజ్ఞధ్వంసములు జేయుచు, సత్పురుషులను పీడింపుచు సర్వధర్మముల నశింపజేసెడివారు. ఈదారుకవనము పశ్చిమసాగర తీరంబున నలువైపుల దశయోజన విస్తీర్ణముగల్గదై సర్వ సమృద్ధి కరమై యుండెను. సర్వశోభితమైన యావనమందు, దారుక తన భర్తతో విహరింపుచు నటకేతెంచిన వారిని భయపెట్టుచుండెను. ప్రజలందఱు వీరి బాధ సహింపలేక ఔర్వఋషికడ కేగి యాతనిని శరణుపొంది, నతమస్తకులై, కృతాంజలులై, ఓమహర్షీ! తమరు మమ్ము రక్షింపకున్నచో మే మారాక్షసులచే మడియుదుము. తేజోవంతులు, దీప్తిమంతులు, సర్వసమర్థులుగాన తమరు మమ్ము రక్షింపకున్నచో నీభూమియందు మమ్ము రక్షించు వారెవరును లేరు. మిమ్ము గాంచినంతనే రాక్షసులు పలాయను లగుదురు గాన మేమందఱము తమచెంతనే నివసింప దలచితిమి. తమయందు సదాశివ తేజము ప్రజ్వరిల్లుచున్నది. గాన తమరు వారల నరికట్ట సమర్థు లన, దుఃఖితులైన ప్రజలవాక్యముల విని వారల రక్షింపదలచి, ఓప్రజలారా! ఆ బలవంతులగు రాక్షసు లట నేప్రాణుల హింసించినను, యెంత బలవంతులైనను నా శాపముచే వారు తప్పక మడియుదురు. ఇది సత్యమని నమ్ముడని వారల నూరడించి, లోకక్షేమమునకై తపముచేయ నారంభించెను. దేవత లీ మునిప్రజ్ఞ నెఱింగి రాక్షసులతో పోరాడుటకై దారుకవనమున కేతెంచి నానాయుధపాణులై యుద్ధోన్ముఖులైయుండ శక్రాది దేవతలందఱిని గాంచి, రాక్షసులిట్లు విచారింప జొచ్చిరి. ఇపుడు మనకీ కష్టము సంభవించెను. మన మేమి చేయుదుము. ఎందుబోవుదము ? యుద్ధములో మనకు మరణము తప్పదు. గాన మనము వారితో రణముచేయవలదు. ఎన్నివిధము లాలోచించినను మనకుదుఃఖము తప్పుటలేదు. దీని నివారించువారు కనబడుట లేదన, నింతలో దారుకి వచ్చి వారిదుఃఖము లెఱింగి తన వరప్రభావము వారికి తెల్పుచు

నిట్లు పల్కెను. పూర్వము నేను హరపత్నియగు నుమాదేవి నారాధించి వరమును బడసితిని ఆ వరప్రభావముచే నీవనముతోసహా మనమందఱ మెటకైన పోవచ్చును. నా కీవరమున్నది, గాన, మీరు దుఃఖింపకుడు. మన మందఱము జలముతోగూడిన ఈవనమును తీసికొని యెటకైనను బోయి సుఖముగానుండవచ్చు నన, నామెవాక్కులు విని వారందఱు సంతసించి నిర్భయులై, మన మందఱము ధన్యులము, కృతకృత్యులము. మాకు నీవు రాణివి. మమ్ములను కాపాడి రక్షించితివి. నీకు నమస్కరింపుచుంటిమి. నీ యిష్టము వచ్చిన తావునకు గొంపొమ్మని వారలు ప్రతిమాలుచుండ, నింతలో సురలు పోరాటమున కేతెంచిరి. సురలనుగాంచి ఆరాక్షసి దేవీ ప్రభావముచే జలసహితముగ దారుకవనమంతయు రాక్షసులతో సహా పెకలించి జయజయ శబ్దంబులు పల్కుచు తీసికొనిపోవుచుండ నదిరెక్కలుగల హిమవన్నగ మా యన్నట్లు చనుచుండెను. రాక్షసి, దారుకవనమును సాగర మధ్యమందుంచి సుఖముగ తనపరివారముతో నివసించు చుండెను. ఈరాక్షసులు భువికి రాకుండ యీ సాగరపురియందు నిర్భయముగ సంచరింపుచుండిరి. మునిశాప భయముచే రాక్షసు లాప్రదేశమునువీడి వెలుపలకు రాకుండిరి. నగరవాసు లెవరైనను నోడలపై ప్రయాణముచేయుచుండ వారినిబట్టి తెచ్చి కారాగృహ మందు బంధించి యీ రాక్షసులు భక్షింపు చుండెడివారు. దారుకి దేవీవర ప్రభావముచే నిర్భయముగ మనుజులను పూర్వమువలెనే భక్షింపుచుండెడిది.

ఇవ్విధంబున రాక్షసులందఱు సాగరతీరమునకు వచ్చి మనుజులను భక్షించి పోవుచుండెడివారు. ఒకదినంబున రాక్షసరాణి జలంబునుండి పైకి వచ్చి మార్గమున కడ్డుగ నిలబడి వచ్చిపోవు వారందఱిని పీడింపుచుండ ననేకములైన యోడలు వచ్చియుండెను. రాక్షసి యిదిగాంచి హర్షంబున తనపరివారంబుతో ముట్టడించి యోడలోనున్న వారందఱిని బంధించి తెచ్చి కారాగృహ వాసులజేసి యుండెను. ఈమనుజు లందఱు నిగళబద్ధులై దుఃఖింపుచుండిరి. వీరినాయకుడు వైశ్యుడు శివభక్తుడునై యుండెను. అతడు సనాతనమైన శివపూజలు చేయుచు శివప్రియుడై శుభాచారం. బులు సల్పుచుండెడు వాడు. శివపూజ లెన్నడును మానెడు వాడు గాడు

మరియు నతడు సర్వదా శివధర్మము లాచరింపుచు, భస్మ రుద్రాక్షలు ధరింపుచు శివపూజ చేయనిదే భుజించెడువాడు గాడు. అట్టివైశ్యుడు కారాగార బద్ధుడై చేయునదిలేక పార్థివపూజ మానక జేయుచు శివ మంత్రము జపించుచు తనతోటివారలనుగూడ చేయించెడువాడు. కొంద లు బద్ధాసనులై శివుని ధ్యానింపుచుండిరి. కొందఱు శివు నర్చింపుచుండిరి. కొందఱు శివమంత్రము జపించుచుండిరి. కొందఱు మానసిక పూజ లొన రించుచుండిరి. మరికొందఱు ప్రత్యక్ష పార్థివ లింగపూజలు గావించు చుండిరి. వారిపూజ లన్ని పరమేశ్వరు డదృశ్యుడై గ్రహించుచుండెను. ఇవ్విధంబున మగ్మాసములు గడచెను.

శివమహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
ఇరువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## ముప్పదవ యధ్యాయము

### నాగేశ్వర జ్యోతిర్లింగ మాహాత్మ్యము

ఒకనాడు దుష్టాత్ముడగు రాక్షససేవకు డొకడు వైశ్యుని యెదుట సాక్షాత్కరించిన శివుని గాంచి ఇదంతయు రాజునకు దెలుప, రాక్షసరాజు విస్మితుడై కుతూహలముతో నిది గాంచ నటకేతెంచి వైశ్యుని భయ పెట్టుచు, దారుకు డిట్లు పల్కెను, ఓవైశ్యుడా! నీ వేమి ధ్యానింపు చుంటివో, నాయెదుట యథార్థము బల్కుము. లేనిచో నీకు మృత్యువు తప్ప దన, వైశ్యుడు నే నేమియు నెరుంగ నని పల్క, నీవైశ్యుని జంపు డని భటుల కాజ్ఞాపించెను. ఆభటులు సకలాయుధంబులు ధరించి శంకరాసక్తమానసు డగు నావైశ్యుని జంపబోవ, నతడు భయముచే గడగడ వణకుచు నేత్రములు మూసికొని, ఓశంకరా! నన్ను రక్షింపుము. ఓదేవేశ! నన్ను పాలింపుము. ఓశివ! ఓశంభో! న న్నీదుష్టునిబారి

నుండి రక్షింపుము. ఓ త్రిలోకేశా! ఖలహంతకుడా! భక్తవత్సలా! నీవే నా సర్వస్వ మని నమ్మియుంటిని. సర్వదా నేను నీ యధీనుడను. నేను జీవుడను. నీవు పరమేశ్వరుడవు. నన్ను రక్షించువాడవు నీవే యని వేడుకొన, పరమేశ్వరుడు ప్రసన్నుడై, పరివారసమేతుడై జ్యోతీరూపం బున వెల్గుచు ప్రత్యక్షము కాగా, వైశ్యు డపరిమితానందముతో పరివారయుతముగ శంకరుని పూజింప, నతడు సంతసించి వైశ్యునకు పాశుపతాస్త్ర మిచ్చి, దానితో పరివారసహితముగ దారుకుని సంహారింప జేసెను. సకలదానవులను సంహరించినతరి, ఈవనంబు సదా వర్ణాశ్రమధర్మంబులతో నొప్పియుండవలెను. ఇందు చతురాశ్రమంబులవారు తామసము లేక సుఖులై యుండెదరు. ఇందు నివసించువా రందఱు శివధర్మము లాచరింపుచు నుపదేశింపు చుండెద రని శంకరు డావనంబునకు వరంబు లిచ్చెను. దారుకస్త్రీ దీనమానసయై పార్వతిని స్తుతింప, నామె ప్రసన్నచిత్తయై, నీ కేమి కావలయునో కోరుకొను మన, నావంశమును రక్షింపు మని యామె కోర, నట్లే నీవంశము నాచే రక్షింపబడు నని యాదేవి పల్కి యారాక్షసిని రక్షింపు మని యీశ్వరునితో పోరాడ, పరమేశ్వరుడు కోపగించినపార్వతిని గాంచి, నీయిష్టము వచ్చినట్లే చేయు మన, పార్వతి నవ్వుచు సుప్రసన్నయై, పరమేశ్వరా! మీ రిదివరలో పల్కినపల్కులన్నియు యుగాంతమందు జరుగ గలవు. అంతవరకు నిట తామసస్రృష్టి జరుగగలదు. ఇట్లు గానిచో నిపుడే ప్రళయము సంభవింపగలదు. మీప్రియురాలను గాన మీరు నామాటలు మన్నింపుడు. ఈదారుకాదేవి నా శక్తిస్వరూపము. ఈమె బలిష్ఠమైన రాక్షసి గాన, ఈరాజ్యము పరిపాలింపుచుండును. ఈ రాక్షసస్త్రీ లందఱు పుత్రవంతులై యీవనమందే యుందురుగాక, యన, శంకరుడు ప్రసన్నుడై, ఓ దేవీ! నామాటలుకూడ వినుము. భక్తరక్షణార్థమై నే నీవనమందు స్థిరనివాసుడనై యుండెదను. ఇట వర్ణాశ్రమధర్మములతో నున్నవారందఱకు నేను ప్రీతితో దర్శన మిచ్చుచుందును. వర్ణాశ్రమధర్మములను పాలింపుచు వీరసేనుడనురాజు మున్ముందు చక్రవర్తియై సర్వసేనలతోగూడి

కలియుగాంతమువరకు ఈప్రదేశమునంతను పాలింపుచుండును. అతడు నా భక్తుడు గాన నే నతనికి దర్శనమిచ్చుచుందును. నా దర్శనమాత్రముచే తనే అతడు చక్రవర్తి కాగల డని ఆ యనాదిదంపతు లిరువురు హాస్య వాక్కులు పలుకుచు నచటనే నివసించియుండిరి. అచ్చోట శివుడు నాగే శ్వరు డని ప్రఖ్యాతజ్యోతిర్లింగమై వెలసియుండెను. పార్వతి యిందు నాగేశ్వరీనామంబున వెలసియుండెను. వీరసేను డేవిధంబుగ శివు నర్చించి దారుకావనమునకు రాజయ్యెనో చెప్పు మని ఋషులు పలుక సూతు డిట్లు చెప్పదొడంగెను.

నిషధదేశాధీశుడు, సుక్షత్రియుడు, శివభక్తుడు నగు మహాసేను నకు వీరసేనుడు పుత్రుడై జన్మించెను. ఇతడు పార్థివశివలింగమును నర్చింపుచు దుష్కరతప మాచరింపుచు, ద్వాదశవర్షంబులు గడుప, శంక రుడు సంతసించి ప్రత్యక్షమై ఓవీరసేనా! నేను నాయోగమాయచే కాష్ఠముచే నొకమీనమును నిర్మించి, తగుపుఫూత పూసి నీ కొసంగె దను. నీవునీసేనలతో దాని నధిష్ఠించి నాచే నిర్మింపబడిన బిలముగుండా ప్రవేశించి, నాగేశ్వరుని పూజించి, పాశుపతాస్త్రమును పొంది రాక్షసు లందరిని సంహరింపుము. నీ కేన్యూనత లేకుండ నిన్ను నేను కాపాడె దను. పార్వతిబలముకూడ నీకు సంపూర్ణముగ నుండును. కొందరు మ్లేచ్ఛరూపు లగు రాక్షసులు సనాతనధర్మముల ననుసరింపుచు నీ కనుకూలముగ నుండెద రని శంకరుడు వీరసేనునకు చెప్పి యంతర్హితు డయ్యెను. ఇవ్విధంబున వీరసేను డీశ్వరునిచే వరమును పొంది చక్రవ ర్తియై పరిపాలింపుచు, నాలింగమును సదా యర్చింపుచు సర్వసుఖముల పొందుచుండెను. ఈలింగము ముల్లోకవాసులకు సర్వకామము లీడేర్చు చుండును. ఈనాగేశ్వరచరిత్ర విన్నను, పఠించినను, సర్వపాతకనాశకమై, సర్వకామ్యముల నొందుచు ధీమంతు లయ్యెదరు.

శివమహాపురాణము నందలి కోటిరుద్ర సంహితయందు
ముప్పదవ అధ్యాయము సంపూర్ణము.

---

# ముప్పదియొకటవ యధ్యాయము

## రామేశ్వరలింగమాహాత్మ్యము

ఋషులారా! ఇటుపై రామేశ్వరలింగోత్పత్తివిధానము చెప్పెద, వినుడు. పూర్వము త్రేతాయుగంబున శ్రీమహావిష్ణువు సత్పురుషరక్షణార్థమై భువిపై రాముడై జనించియుండ, అతనిపత్ని యగు సీతను మహామాయావి యగు రావణు డరణ్యమున హరించి లంకాపురి కేగ, నపుడు రాముడు సీత నన్వేషించుచు కిష్కింధాపురి కేగి, సుగ్రీవహితమునకై వాలిని సంహరించి, సీతాన్వేషణకై కొంతకాల మట నుండి సుగ్రీవ లక్ష్మణాదులతో నాలోచించి, నలువైపులకు వానరులను పంపియుండ, హనుమదాదికపు లందఱు నలుదిశల కేగిరి. హనుమంతుడు లంక కేగి సర్వము సీత కెరింగించి సీతచే నియ్యబడిన చూడామణిని గ్రహించి, లంక దహనము గావించి, చూడామణిని రాముని కొసంగ, నతడు కడు సంతసించి, సకలకపిసైన్యములతోడను, సుగ్రీవాదిప్రముఖులతోడను, లక్ష్మణుని గూడుకొని, పయోనిధితీరంబున, నష్టాదశపద్మసంఖ్యలు గల కపిసైన్యముతో దక్షిణసాగరము గాంచుచు శివప్రియు డగు రాముడు వారలతో నట విశ్రమించి, హా జానకీ! ని వెక్కడ నుంటివి? ని న్నెట్లు కలిసికొందును? ఈ యగాధసాగరంబు ని పిరు లెట్లు దాటగలరు? దాటినను కైలాసమును కదలించిన మహాబలశాలి యగు రావణు నెట్లు జయింపగలను? మఱియు నతనిపుత్రు డగు నింద్రజి త్తెంతటి కిన్న పరాక్రమవంతు డని లక్ష్మణునితో బలుకుచు, నిట్టూర్పులు విడుచుచు, నాలోచింపుచు నంగదాదిప్రముఖులకు తగిన సలహాలు చెప్పుచు, లక్ష్మణుని గాంచి, సోదరా! నాకు మిక్కిలి దాహ మగుచున్నది. ఈ వానరులుకూడ దాహపీడితులవలె గోచరింపుచుండిరి, గాన నెట జల మున్నదో గాంచు మన, నిది విని వానరులు దశదిశల కేగి జలము తీసికొని వచ్చితిమి. ఓ రామా! నీకై యీజలము తెచ్చితిమి. ఈజల మతిమధురంబుగను శీతలంబుగా నుండెను. గాన దానిని గ్రోలి పిపాస తీర్చుకొమ్మన, రామచంద్రుడు కృపాకటాక్షముతో వానరుల గాంచుచు, సంతసంబున జలపానము సేయ

బోయి, సర్వానందప్రదుడు, పరాత్పరుడు, నాప్రభువు నగు పరమేశ్వరుడు నాకు కనబడకుండ నే నీజల మెట్లు గ్రోలుదు నని శివస్మరణ చేయుచు నా జలపానము చేసి, తదుపరి పార్థివలింగము స్థాపించి, ఆవాహనాదిషోడ శోపచారములచే శంకరు నర్చించి, ప్రయత్నపూర్వకంబుగ స్తుతిప్రమాణంబు లచే శంకరుని సంతసపరచి, ఓప్రభూ! మహాదేవా! భక్తవత్సలా! నీభ క్తుడను, శరణాపన్నుడ నగు నన్ను రక్షింపుము. దాసుడనై నిన్ను ప్రార్థింపుచుంటిని. ఈవారిధిజల మతియగాధమై యుండెను. నీవు భవతార కుడవు. మహావీరుడు, బలవత్తరుడు, నగు రావణసంహారార్థమై నే నిట కేతెంచితిని. చంచలు లగు నీవానరులు నాకు యుద్ధసహాయులై యుండిరి. నాకార్య మెట్లు సాధించెదవో నాకు తెలియకున్నది. ఈకార్యభార మంతయు నీదేసుమా. నీసహాయము లేకున్నచో నాకార్యము కడు దుర్లభమైనది. నీ వరప్రభావముచే రావణు డందఱికి దుర్జయుడై యుండి వరదర్పితుడై ముల్లోకములు జయించి యుండెను. నేను సర్వదా నీదాసుడను. నీ యధీ నుడను. నీవు బాగుగ విచారించి నా కార్యము కొనసాగింపు మన యీవిధంబున జయజయధ్వానములు చేయుచు రుద్రుని ననేకవిధంబుల స్తుతించి శివ మంత్రము జపించి ధ్యానింపుచు, పునఃపూజగావించి, స్వామియెదుట నృత్యము చేయుచు, ప్రేమవిహ్వలుడై, ముఖవాద్యము సల్పుచుండ, శంకరుడు సుప్రసన్నుడై, తన నిజరూపమును ధరించి, పరివారయుతుడై, యత్యద్భుతముగ గోచరింపుచు, రామునిభక్తికి సంతసించి, రామా! నీకు శుభ మగుగాక! వరము కోరు మని పలుక, ఓశివా, శంకరా! యని, శివధర్మపరాయణు డగు రాఘవుడు శివుని పూజించి యనేకవిధంబుల స్తుతించి, యుద్ధమందు రావణుని జయింపవలె నని కోర, శివుడు సంతసించి, ఓరాజా! నీకు జయ మగుగాక, యని పలుక, రాము డా జయాశీర్వాదములు పొంది, సాంజలియై, నతమస్తకుడై, శంకరా! నీవు సంతుష్టుడ వైనచో లోకోపకారమునకై నీవిచటనే స్థిరముగ నుండు మన, శంకరు డట్లే యని జగతీతలమందు రామలింగేశ్వరనామముచే ప్రసిద్ధి వడసి, యట స్థిరముగ నుండెను. రాము డీశ్వరప్రసాదముచే, సేతువు దాటి, రావణాదిదుష్టరాక్షసుల సంహరించి, తన భార్యను పొంద

కల్గెను. భువియం దీరామేశ్వరుని మహిమ యతివిస్తారముగ విస్తరించి యుండెను. ఇతడుభక్తకామప్రదుడై, భుక్తిముక్తుల నిచ్చుచుండును. ఈరామలింగేశ్వరుని గంగాజలముతో నభిషేకించినచో జీవన్ముక్తుడై దేవతా దుర్లభ మగు భోగముల ననుభవించి దివ్యజ్ఞానమును పొంది కైవల్యమును పొందగలరు.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ముప్పదియొకటవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పదిరెండవ యధ్యాయము

## సుదేహ సుధర్ముల చరిత్ర

దక్షిణదిశయందు దేవగిరి యను శ్రేష్ఠపర్వతము గలదు. అది మహా శోభాన్వితమై యద్భుతదర్శనీయమై ప్రకాశింపుచుండెను. ఆగిరినికటంబున భరద్వాజకులోద్భవుడు, బ్రహ్మనిష్ఠుడు, నగు సుధర్ము డనెడి విప్రుడు గలడు. అతని ధర్మపత్ని పతిసేవాపరాయణియై, సౌందర్యవతియై, శివధర్మపరాయణియై, గృహకర్మనిపుణయై, నిత్యము దేవతాతిథులను పూజింపుచు సద్ధర్మములను నాచరింపుచుండెను. ఈమె భర్త యగు సుధర్ముడు వేదమార్గపరుడై నిత్యాగ్నిహోత్రియై త్రికాలసంధ్యల నుపాసింపుచు, సూర్యునిభంగి ప్రకాశింపుచు, వేదశాస్త్రవిచక్షణుడై, శిష్యులకు పాఠములు జెప్పుచు, ధనవంతుడై, పరులకు దానములు జేయుచు, సుగుణములచే నలరారుచు, సదా శివపూజానిరతుడై, శివభక్తప్రియుడై యుండెను. ఇవ్విధంబున బహుకాలము గడిచినను, సంతానము లేకుండెను. ఇతడు జ్ఞానవంతు డగుటచే, "ఆత్మానమాత్మనాతారయేత్" అను శ్రుతిప్రకారముగా ఆత్మను ఆత్మజ్ఞానముచే తరింప జేసికొనవలయును. ఇతరసాధనములచే పని లేదనినిశ్చయజ్ఞానుడై, యతడు సంతానము లేకున్నను, విచారింపకుండెను. కాని, యితనిభార్య యగు సుదేహ సం

తానము లే దని దుఃఖించుచు సర్వవిద్యావిశారదు డగు తన భర్తను గాంచి, పుత్రోత్పాదనకై యేదైన సాధన మున్నచో ప్రయత్నించు డని పలువిధ ముల ప్రార్థింప, జ్ఞానవంతు డగు భర్త తనప్రియురాలి నూరడింపుచు, ఓ దేవీ! పుత్రు డేమి చేయగలడు? మఱియు తల్లియెవరు? తండ్రి యెవరు? బంధువు లెవరు? ప్రియు లెవరు? భార్య యెవరు? ఇ దంతయు త్రిలోకములయందు స్వార్థమునకై పుట్టబడెను గాని, పరమార్థమునకై కాదు. నీ విదంతయు బుద్ధిచే నాలోచించి తెలిసికొని శోకమును వీడుము. పుత్రోత్పాదనవిషయమై విరమించి, దుఃఖము వీడి పరమేశ్వరు నారాధింపు మని, యనేకవిధంబుల బోధించి, యామెను నూరడించి, భగవద్ధర్మతత్పరుడై సుఖదుఃఖములు, శోక మోహములు, కలిమిలేములు, క్షుత్పిపాసలు, శీతోష్ణాదులు మొదలగు ద్వంద్వంబులు వీడియుండ, నొకానొకసమయంబున నితనిభార్య యగు సుదేహ తన యిరుగుపొరుగున నున్న నెచ్చెలులయింటి కేగి ప్రియగోష్ఠులు సల్పు చుండ నట్టిసందర్భములో చెలు లగు విప్రపత్నులా మెను గాంచి సంతానము లే దని హేళన జేయుచు, దురుక్తులు పలుకుచు, నోసుదేహా! మే మందఱము పుత్రవతులము. నీవు వంధ్యవు. నీ కీగర్వ మెందుకు? మాధనము మాపుత్రు లనుభవించెదరు. నీ ధన మెవ రనుభవించెదరు. నీ ధనము రాజుల పాలగును. నీధనము తగులబడగా? గొడ్రాలి కింత యభిమాన మెందుల కని వారందఱు నిందింప, నామె యభిమానవంతురాలై, దుఃఖించుచు నింటి కేగి, తనభర్తతో ని దంతయు తెలుప, విజ్ఞానవంతుడు, బుద్ధిమంతుడు, నగు నావిద్వాంసు డెంత మాత్రము దుఃఖింపక, ఓప్రియా! యెవ రేమన్న నించుకంతయేని దుఃఖింప కుము. కా దలచినది కాక మాన దని భార్య నెంతగా నూరడించినను నామె దుఃఖము వీడక ఆగ్రహముతో, నోస్వామీ! మీరు నాకోర్కె దీర్ప దల చినచో నాకు పుత్రుడు కల్గునట్లు చేయుడు. లేనిచో నేను దేహత్యాగము చేయుదు నన, బ్రాహ్మణోత్తము డగు సుధర్ముడు భార్యవాక్కులువిని, మనసా శివుని స్మరించి, ఆగ్రహపీడితుడై, మరల శాంతిని బొంది శివుని స్మరించి తా నారాధించు అగ్నిహోత్రుని సామీప్యమున రెండు పుష్పములుంచి, వాటిలో కుడిభాగమునం దున్న పుష్పము పుత్రసంతతి నొసంగు ననియు, ఎడమభాగ మునం దున్న పుష్పము శూన్య మనియు భావించి యీరెండుపుష్పములలో

నీకు దోచిన పుష్పము గ్రహింపు మని యావిప్రుడు పలుక, ఆమె అగ్ని కెడమ భాగమం దున్న పుష్పము గ్రహింప, నతడు తనప్రశ్నచే సంతతి కలుగదని నిశ్చయించి, నిట్టూర్పులు విడుచుచు, తనకు శివానుగ్రహము లేదని తలచి, ఓప్రియా! భగవన్నిర్మాణ మిట్లుండ, వేరుగా నెట్లు జరుగును? నీవు పుత్రాశను వీడి, శివుని సేవింపు మని భార్యకు బోధించి, తాను నిరాశ జెంది, శంకర ధ్యానతత్పరుడై, ధర్మకార్యములు చేయుచుండ, సుదేహ భర్త నుడువుల కాగ్రహింపక శాంతచిత్తయై శిరము వంచి, నమస్కరించి, నాకు పుత్రయోగము లేదు గాన, మీరు నాయనుమతిచే మరియొక స్త్రీని వివాహమాడుడు. ఆమె తప్పక సుతుని బడయగల దన, ధర్మతత్పరు డగు నావిప్రుడు భార్యతో, ఓప్రియా! నిశ్చింతతో భగవద్ధ్యానము చేయుచున్న మనము లేని దుఃఖము తెచ్చిపెట్టుకొనుట యెందులకు! నాకు ధర్మవిఘ్నములు చేయకు మని యనేక విధముల బోధింప నామె యెంత చెప్పినను వినక, తనపుట్టినింటి కేగి, తనసోదరిని తనగృహమునకు తీసుకొని వచ్చి నాసోదరిని వివాహమాడు డని బ్రతిమాల, నతడు భార్యను గాంచి, నీ విట్లు పలుకుచుంటివి, కాని, యామెకు సంతతి కలిగినచో ద్వేషించెద వేమో! ఆలోచించుకొను మన, నామె పతివాక్కులు విని, బద్ధాంజలియై ఓద్విజోత్తమా! నేను నాభగినియెడ స్పర్ధ యెట్లు వహింతును? పుత్రునికై మిమ్ము నిట్లు ప్రార్థించుచుంటిని. నే నెన్నడును ద్వేషింప నన, భార్య ప్రార్థనల కంగీకరించి ఘుస్మ యను నామెసోదరిని యథావిధిగ వివాహమాడి, నీసోదరిభారము నీవే వహింపు మని పలికి, తాను ధర్మనిష్ఠుడై యుండ, నామె తనసోదరిని అహర్నిశములు దాసివలె సేవించుచు ప్రేమతో పోషింపుచుండ, ఆమెసోదరికూడ నక్కగారియాజ్ఞను శిరసావహించి యామె యాజ్ఞచే నూటఒక్క పార్థివలింగములను చేసి యథావిధిగ షోడశోపచారములచే పూజించి, యీపార్థివలింగములను సమీపమునం దున్న తటాకమందు పడవేయుచుండెను. ఇవ్విధంబున నిత్యము కోర్కెల నీడేర్చుచు శివపూజలనాచరింపుచు, విసర్జింపుచు సేవించుచుండెను. ఇట్లు ప్రతిదినము నూటఒక్క పార్థివలింగముల చొప్పున లక్షలింగములు పూర్తియైనపిమ్మట సర్వకామ ఫలప్రదు డగు శంకరుడు ఘుశ్మ కొకపుత్రుని ప్రసాదించెను. సుందరుడు, సుభగుడు. కల్యాణగుణవంతుడు నగు పుత్రుని గాంచి, ధర్మవిత్తము డగు

దున్న మాంసఖండములు గాంచుచుండెను. ఇంతలో ఘుశ్మ కూడ నా, శయ్యకడ కేతెంచి సర్వము గాంచి, యెట్టిదుఃఖమును పొందక, యే భగవంతుడు నా కీ సంతతి ప్రసాదించెనో, ఆ భగవంతుడే నా కీపుత్రుని మరల నొసంగ గల డని పలుకుచు, శంకరుడు భక్తప్రియుడు, కాలకాలుడు, సతాంగతికుడు నగు నతడే రక్షించును. నన్ను రక్షించువాడు నీశ్వరుడే కాని, మరి యెవరును లేరు. మాలాకారుడు పుష్పముల గ్రుచ్చుచు విడదీయుచున్నట్లు పరమేశ్వరుడు జీవులను కలుపుచు విడదీయుచుండును. ఇపుడు నేను దుఃఖించిన ప్రయోజన మే మున్నదని తత్త్వము విచారించి సకల సర్వభారము శివునిపై నర్పించి దుఃఖము వీడి, పూర్వమువలె స్వస్థచిత్తయై, నాతటాకముకడ కేగి, పార్థివము నర్చించుచు శంభునామ ముచ్చరించుచు, పూజ ముగిసినపిమ్మట నాతటాకమందు పార్థివలింగమును పడవైచి, వెనుకకు తిరిగి వచ్చుచుండ, నా తీరంబున తనకుమారుడు గాన్పించెను. పుత్రుడు తల్లిని గాంచి, ఓతల్లీ! నేను మృతి జెంది మరల జీవించి నీపుణ్యప్రభావముచేతను, శంకరుని కృపచేతను నిన్ను కలిసికొన గల్గితిని. ఘుశ్మ కుమారుని గాంచి పూర్వమువలె నేవికారము లేక యుండెను. ఇంతలో జ్యోతీరూపు డగు శంకరు డీమెభక్తికి మెచ్చి ప్రసన్నుడై యటనే యావిర్భవించి, ఓ ఘుశ్మా! నీపుత్రుని దుష్టాత్మురా లగు సుదేహ సంహరించెను గాన, నామె నీ త్రిశూలమున పొడిచిచంపెదను.

నీ యాప్సితవరము కోరుకొను మన, ఘుశ్మ శంకరునకు శిరము వంచి నమస్కరించి, ఓప్రభూ! నాసోదరి యగుసుదేహను రక్షింపు మని కోర నీ కపకృతి యొనర్చిన దుష్టురా లగు నాసోదరిని బ్రతికింపు మందు వేల? అపకారి కెవ్వరైన నుపకారము చేయుదురా? ఆమెను చంపుటయే మంచి దని శంకరుడు పలుక. నెట్టిపాపు లైనను నీదర్శనభాగ్యముచే పవిత్రు లగుదురు గాన, నామెకు నీదర్శన మిచ్చి పవిత్రురాలిని జేయుము. అపకారుల కుపకారము చేసినవారిని గాంచినచో వారి సకలపాపములు నశించును. గాన నామెను బ్రతికింపుము. నే నీవాక్యము పెద్దలచే వింటిని.

శ్లో॥ అపకారేషు యశ్చైవ హ్యుపకారం కరోతిచ
తస్యదర్శనమాత్రేణ పాపం దూరతరం వ్రజేత్॥.

అను వాక్యప్రకారము నాయక్కను రక్షింపు మనెడి ఘుశ్మవాక్కులు విని, నీ నిర్వికారగుణములకు నేను సంతసించితిని. కాన మరి యొక వరము కూడ కోరు మన, ఘుశ్మ సంతోషముతో నో దేవా! నీవు ప్రసన్నుడ వైనచో లోకరక్షణార్థమై నా పేరుతో నీప్రదేశమందు లింగస్వరూపుడవై స్థిరముగా నుండు మన, శంకరుడు ప్రసన్నుడై, యట్లే నే నిట జ్యోతీరూపుడనై ఘుశ్మేశ్వర నామంబుతో స్థిరముగ నుండెదను. ఈ సరోవరము శివలింగముల కాలయమై యుండి శివాలయ మని ముల్లోకప్రసిద్ధమై యుండెను. ఈసరస్సు దర్శనమాత్రముచే తనే సర్వపాపములు హరించి, సర్వకామ్యము లొసంగును. నీవంశములో పదితరములవరకు శివారాధనతత్పరు లగు పురుషులే జనించి దీర్ఘాయుష్మంతులై, ధనాఢ్యులై, విద్యావంతులై, యుదారులై, గుణవంతులై, పతివ్రత లగు భార్యలు కలవారై భక్తి ముక్తుల నొందువారలై యుందురు. ఇవ్విధంబున నీ వంశము విస్తరించి శోభాయమానమై యుండు నని పలికి శంకరుడు లింగస్వరూపమై వెలయ, నింతలో సుధర్ముడు, సుదేహాయు ఘుశ్మ కడ కేతెంచిసర్వము తెలిసికొని పుత్రుని గాంచి యానందించిరి. తదుపరి వారందఱు ఘుశ్మేశ్వరునకు నూటొక్కసార్లు ప్రదక్షిణములు చేసి యథావిధిగ పూజించిరి. సుదేహ జీవించినపుత్రుని గాంచి లజ్జావతియై యంతశ్శల్యము వీడి, తనతప్పు క్షమింపు మని వారందఱిని వేడుకొని, తన పాపప్రాయశ్చిత్తమునకై శివవ్రతములు చేసియుండెను. అప్పటినుండియు నాలింగము ఘుశ్మేశ్వరలింగ మని ప్రఖ్యాతి వడసెను. దీనిని దర్శించి పూజించినవారలకు సర్వసుఖములు చేకూరుచుండును. నేను ద్వాదశజ్యోతిర్లింగ మాహాత్మ్యములు చెప్పితిని. దీని శ్రవణపఠనాదులచే భుక్తిముక్తుల నొంద గలరు.

శివమహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
ముప్పది మూడవ అధ్యాయము సంపూర్ణము.

# ముప్పదినాల్గవ యధ్యాయము

## విష్ణువునకు సుదర్శన చక్రప్రాప్తి

హరీశ్వరలింగమహిమను, విష్ణువునకు సుదర్శనచక్రలింగప్రాప్తియు, నతఁ డారాధించిన విధానము చెప్పు మని ఋషులు కోర, సూతు డిట్లు చెప్పదొడంగెను. ఒకానొక సమయంబున బలవత్తరు లగు రాక్షసులు లోకములను పీడింపుచు, ధర్మలోపము చేయుచుండ, నీదైత్యులచే దేవతలు పీడింపబడుచు, నిర్జర రక్షకు డగు విష్ణువుతో మొఱపెట్టుకొనుచు, నోప్రభూ మేము దైత్యులచే పీడింపబడుచుంటిమి. మమ్ము రక్షింపుము. మే మెక్కడికి పోవుదుము? ఏమి చేయుదుము? నిన్నే శరణు పొందితి మన్న, విష్ణువు వారి మొఱాలకించి, మనసా శివపదాంబుజములు స్మరించ యోసురలారా! శత్రువులు బలవత్తరులు గాన, నేను శివు నారాధించి నీకార్యము ప్రయత్నముగ సాధించెద నన, సురలు విష్ణువాక్యములు విని, రాక్షసులు మడిసినట్లుగనే భావించి వారివారి స్థానముల కేగ, విష్ణువు అసురులవిజయమునకై శివుని సేవింపుచు సర్వదేవతాధిపతియు, సర్వసాక్షి, యవ్యయుడు నగు పరమేశ్వరస్థాన మైన కైలాసనగసమీపమున కేగి, యొక గుండమం దగ్నిని స్థాపించి పార్థివవిధానమంత్రములచే శివు ననేకవిధంబుల నర్చించి, యనేకస్తోత్రములచే గిరీశుని స్తుతించి మానససరోవరోద్భవ మైన సహస్రసకళకమలములచే నర్చించి. పద్మాసనాసీనుడై శంకరుడు నాకడ సాక్షాత్కరించుదనుక నిటనే యుండి తపంబు చేయుదు నని నిశ్చయించి, శివార్చన చేయుచు, స్థిరచిత్తుడై, ధ్యానమగ్నుడై యుండి, హరు డెప్పుడు ప్రసన్ను డగునా యని విచారింపుచు ననేకవిధంబులు సేవించుచున్నను, శంకరుడు ప్రసన్నుడు గాకుండుటచే విష్ణువు విస్మితుడై, దృఢభక్తిపరుడై, పరమేశ్వరుని సహస్రనామంబులచే స్తుతించి, యొక్కొక్క నామమున నొక్కొక కమలము పూజింపుచు సహస్రకమలార్చన గావింపుచుండ, నొకరోజున నాపరమేశ్వరుడు విష్ణువును పరీక్షించుటకై సహస్రకమలములకు నొకకమలము లోపించునట్లు చేయ, విష్ణు వా మాయను గ్రహింపనేరక, యీకుసుమమునకై యనేకతావుల నన్వేషింపుచు,

విష్ణురువాచ

శ్లో॥ శివో హరో మృడో రుద్రః
పుష్కరః పుష్పలోచనః
అర్థిగమ్యః సదాచారః
శర్వః శంభు ర్మహేశ్వరః.

శ్లో॥ చంద్రాపీడ శ్చంద్రమౌళిః
విశ్వో విశ్వామరేశ్వరః
వేదాంతసారసందోహః
కపాలీ నీలలోహితః.

శ్లో॥ ధ్యానాధారో౽పరిచ్ఛేద్యో
గౌరీభర్తా గణేశ్వరః
అష్టమూర్తి ర్విశ్వమూర్తి
స్త్రివర్గస్వర్గసాధనః.

శ్లో॥ జ్ఞానగమ్యో దృఢప్రజ్ఞో
దేవదేవ స్త్రిలోచనః
వామదేవో మహాదేవః
పటుః పరివృఢో దృఢః.

శ్లో॥ విశ్వరూపో విరూపాక్షో
వాగీశః శుచిసత్తమః
సర్వప్రమాణసంవాదీ
వృషాంకో వృషభవాహనః.

శ్లో ॥ ఈశః పినాకీ ఖట్వాంగ
శ్చిత్రవేష శ్చిరంతనః
తమోహరో మహాయోగీ
గోప్తా బ్రహ్మాచ ధూర్జటిః.

శ్లో॥ కాలకాలః కృత్తివాసాః
సుభగః ప్రణవాత్మకః
ఉన్నధ్రః పురుషో జుష్యో
దుర్వాసాః పురశాసనః.

శ్లో॥ దివ్యాయుధః స్కంధగురుః
పరమేష్ఠీః పరాత్పరః
అనాదిమధ్యనిధనో
గిరీశో గిరికాధవః.

శ్లో॥ కుబేరబంధుః శ్రీకంఠో
లోకవర్ణోత్తమో మృదు:
సమాధివేద్యః కోదండీ
నీలకంఠః పరశ్వధీః.

శ్లో॥ విశాలాక్షో మృగవ్యాధః
సురేశః సూర్యతాపనః
ధర్మధామః క్షమాక్షేత్రం
భగవాన్ భగనేత్రభిత్.

శ్లో॥ ఉగ్రః పశుపతి స్తార్క్ష్యః
ప్రియభక్తః పరంతపః
ధాతా దయాకరో దక్షః
కర్మధీః కామశాసనః.

శ్లో॥ శ్మశాననిలయః సూక్ష్మః
శ్మశానస్థో మహేశ్వరః
లోకకర్తా మృగపతి
ర్మహాకర్తా మహౌషధిః.

శ్లో॥ ఉత్తరో గోపతి గ్గోప్తా
జ్ఞానగమ్యః పురాతనః
నీతిః సునీతిః శుద్ధాత్మా
సోమః సోమరతః సుఖీ.

శ్లో॥ సోమపో௨మృతపః సౌమ్యో
మహా తేజో మహాద్యుతిః
తేజోమయో௨మృతమయో௨
న్నమయశ్చ సుధాపతిః.

శ్లో॥ అజాతశ్రతు రాలోకః
సంభావ్యోహవ్యవాహనః
లోకకరో వేదకరః
సూత్రకారః సనాతనః

శ్లో॥ మహర్షిః కపిలాచార్యో
విశ్వదీప్తి స్త్రిలోచనః
పినాకపాణి ర్భూదేవః
స్వస్తిదః స్వస్తికృత్సుధీః.

శ్లో॥ ధాతృధామా ధామకరః
సర్వగః సర్వగోచరః
బ్రహ్మసృ గ్విశ్వసృ క్సర్గః
కర్ణికారః ప్రియః కవిః

శ్లో॥ శాఖో విశాఖో గోశాఖః
శివో భిష గనుత్తమః
గంగాప్లవోదకో భవ్యః
పుష్కలః స్థపతిః స్థిరః.

శ్లో॥ విజితాత్మా విషయాత్మా
భూతవాహనసారథిః
సగణో గణకాయశ్చ
సుకీర్తి శ్ఛిన్నసంశయః.

శ్లో॥ కామదేవః కామపాలో
భస్మోద్ధూళితవిగ్రహః
భస్మప్రియో భస్మశాయీ
కామీ కాంతః కృతాగమః

శ్లో॥ సమావర్తో ఒ నివృత్తాత్మా
ధర్మపుంజః సదాశివః
అకల్మష శ్చతుర్బాహు
ర్దురావాసో దురాసదః.

శ్లో॥ దుర్లభో దుర్గమో దుర్గః
సర్వాయుధవిశారదః
అధ్యాత్మయోగనిలయః
సుతంతు స్తంతువర్ధనః.

శ్లో॥ శుభాంగో లోకసారాంగో
జగదీశో జనార్దనః
భస్మశుద్ధికరో మేరు
రోజస్వీ శుద్ధవిగ్రహః

శ్లో॥ అసాధ్యః సాధుసాధ్యశ్చ
భూత్యమర్కటరూపధృక్
హిరణ్యరేతాః పౌరాణో
రిపుజీవహరో బలః.

శ్లో॥ మహాహ్రదో మహాగర్తః
సిద్ధబృందారవందితః
వ్యాఘ్రచర్మాంబరో వ్యాలీ
మహాభూతో మహానిధిః.

శ్లో॥ అమృతాశో ఽ మృతవపుః
పాంచజన్యః ప్రభంజనః
పంచవింశతతత్త్వస్థః
పారిజాతః పరావరః.

శ్లో॥ సులభః సువ్రతః సూరో
బ్రహ్మవేదనిధి ర్నిధిః
వర్ణాశ్రమగురు ర్వర్ణీ
శత్రుజి చ్ఛత్రుతాపనః.

శ్లో॥ ఆశ్రమః క్షపణః క్షామో
జ్ఞానవా నచలేశ్వరః
ప్రమాణభూతో దుర్జ్ఞేయః
సుపర్ణో వాయువాహనః.

శ్లో॥ ధనుర్ధరో ధనుర్వేదో
గుణరాశి ర్గుణాకరః
సత్యః సత్యపరో దానో
ధర్మాంగో ధర్మసాధనః.

శ్లో॥ అనంతదృష్టి రానందో
దండో దమయితా దమః
అభివాద్యో మహామాయో
విశ్వకర్మా విశారదః.

శ్లో॥ వీతరాగో వినీతాత్మా
తపస్వీ భూతభావనః
ఉన్మత్తవేషః ప్రచ్ఛన్నో
జితకర్మో జితప్రియః.

శ్లో॥ కల్యాణః ప్రకృతిః కల్పః
సర్వలోకప్రజాపతిః
తరస్వీ తారకో ధీమాం
ప్రధానప్రభు రవ్యయః.

శ్లో॥ లోకపాలో ఽంతర్హితాత్మా
కల్పాదిః కమలేక్షణః
వేదశాస్త్రార్థతత్త్వజ్ఞో
నియమో నియతాశ్రమః.

శ్లో॥ చంద్రసూర్యః శనిః కేతు
ర్వరాంగో విద్రుమచ్ఛవిః
భక్తివశ్యః పరబ్రహ్మ
మృగబాణార్పణో ఽనఘః.

శ్లో॥ అద్రి రద్ర్యాలయః కాంతః
పరమాత్మా జగద్గురుః
సర్వకర్మాలయ స్తుష్టో
మంగళో మంగళావృతః.

శ్లో॥ మహాతపా దీర్ఘతపాః
విష్టపస్థవిరో ధ్రువః
అహః సంవత్సరో వ్యాప్తిః
ప్రమాణం పరమం తపః.

శ్లో॥ సంవత్సరకరో మంత్రః
ప్రత్యయః సర్వదర్శనః
అజః సర్వేశ్వరః సిద్ధో
మహారేతా మహాబలః.

శ్లో॥ యోగీ యోగ్యో మహాతేజాః
సిద్ధిః సర్వాది రగ్రహః
వసు ర్వసుమనాః సత్యః
సర్వపాపహరో హరః.

శ్లో॥ సుకీర్తిః శోభనః శ్రీమా
నవాఙ్మానసగోచరః
అమృతః శాశ్వతః శాంతో
బాణహస్తః ప్రతాపవాన్.

శ్లో॥ కమండలుధరో ధన్వీ
వేదాంగో వేదవిన్మునిః
భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా
లోకనాథో దురాధరః.

శ్లో॥ అతీంద్రియో మహామాయః
సర్వావాస శ్చతుష్పథః
కాలయోగీ మహానాథో
మహోత్సాహో మహాబలః.

శ్లో॥ మహాబుద్ధి ర్మహావీర్యో
భూతచారీ పురందరః
నిశాచరః ప్రేతచారీ
మహాశక్తి ర్మహాద్యుతిః.

శ్లో॥ అనిర్దేశ్యవపుః శ్రీమా
న్సర్వాచార్యమనోగతిః
బహుశ్రుతో మహామాయో
నియతాత్మాధ్రువో ధ్రువః.

శ్లో॥ ఓజ స్తేజో ద్యుతిధరో
నర్తకఃసర్వకాసకః
నృత్యప్రియో నృత్యనిత్యః
ప్రకాశాత్మా ప్రకాశకః.

శ్లో॥ స్పష్టాక్షరో బుధో మంత్రః
సమానః సారసంప్లవః
యుగాదికృ ద్యుగావర్తో
గంభీరో వృషవాహనః.

శ్లో॥ ఇష్టో విశిష్టః శిష్టేష్టః
శలభః శరభో ధనుః
తీర్థరూప స్తీర్థనామా
తీర్థదృశ్యః స్తుతోఽర్థదః.

శ్లో॥ అపాంనిధి రధిష్ఠానం
విజయో జయకాలవిత్
ప్రతిష్ఠితః ప్రమాణజ్ఞో
హిరణ్యకవచో హరిః.

శ్లో॥ విమోచనః సురగణో
విద్యేశో బిందుసంశ్రయః
బాలరూపోబలోన్మత్తో
వికర్తా గహనో గుహః.

శ్లో॥ కరణం కారణం కర్తా
సర్వబంధవిమోచనః
వ్యవసాయో వ్యవస్థానః
స్థానదో జగదాదిజః.

శ్లో॥ గురుదో లలితో భేదో
భావాత్మాత్మనిసంస్థితః
విశ్వేశ్వరో వీరభద్రో
వీరాసనవిధి ర్విరాట్.

శ్లో॥ వీరచూడామణి ర్వేత్తా
తీవ్రానందో నదీధరః
ఆజ్ఞాధార స్త్రిశూలీచ
శిపివిష్టః శివాలయః.

శ్లో॥ వాలఖిల్యో మహాచాప
స్తిగ్మాంశు ర్బధిరః ఖగః
అభిరామః సుశరణః
సుబ్రహ్మణ్యః సుధాపతిః.

శ్లో॥ మఘవా న్కౌశికో గోమా
న్విరామః సర్వసాధనః
లలాటాక్షో విశ్వదేహః
సారః సంసారచక్రభృత్.

శ్లో॥ అమోఘదండో మధ్యస్థో
హిరణ్యో బ్రహ్మవర్చసః
పరమార్థపరో మాయీ
శంబరో వ్యాఘ్రలోచనః.

శ్లో॥ రుచి ర్విరించిః స్వబంధు
ర్వాచస్పతిరహర్పతిః
రవి ర్విరోచనః స్కన్దః
శాస్తా వైవస్వతో యమః

శ్లో॥ యుక్తి రున్నతకీర్తిశ్చ
సానురాగఃపరంజయః
కైలాసాధిపతిః కాంతః
సవితా రవిలోచనః.

శ్లో॥ విద్వత్తమో వీతభయో
విశ్వభర్తాఽనివారితః
నిత్యో నియతకల్యాణః
పుణ్యశ్రవణకీర్తనః.

శ్లో॥ దూరశ్రవా విశ్వసహో
ధ్యేయో దుస్స్వప్ననాశనః
ఉత్తారణో దుష్కృతిహా
విజ్ఞేయో దుస్సహోఽభవః

శ్లో॥ అనాదిభూ ర్భువో లక్ష్మీః
కిరీటీ త్రిదశాధిపః
విశ్వగోప్తా విశ్వకర్తా
సువీరో రుచిరాంగదః.

శ్లో॥ జననో జనజన్మాదిః
ప్రీతిమా న్నీతిమా న్ధవః
వసిష్ఠః కశ్యపో భాను
ర్భీమో భీమపరాక్రమః.

శ్లో॥ ప్రణవః సత్వ థాచారో
మహాకోశో మహాధనః
జన్మాధిపో మహాదేవః
సకలాగమపారగః.

శ్లో॥ తత్త్వం తత్త్వవివేకాత్మా
విభు ర్విశ్వవిభూషణః
ఋషి ర్బ్రాహ్మణ ఐశ్వర్య
జన్మమృత్యుజరాతిగః.

శ్లో- పంచయజ్ఞసముత్పత్తి
ర్విశ్వేశో విమలోదయః
ఆత్మయోని రనాద్యంతో
వత్సలో భక్తలోకధృక్.

శ్లో॥ గాయత్రీవల్లభః ప్రాంశు
ర్విశ్వావాసః ప్రభాకరః
శిశు ర్గిరిరతః సమ్రాట్
సుషేణః సురశత్రుహా.

శ్లో॥ అమోఘోఽరిష్టనేమిశ్చ
కుముదో విగతజ్వరః
స్వయంజ్యోతిస్తనుర్జ్యోతి
రాత్మజ్యోతి రచంచలః.

శ్లో॥ పింగళః కపిలశ్మశ్రుః
ఫాలనేత్ర స్త్రయీతనుః
జ్ఞానస్కంధో మహానీతి
ర్విశ్వోత్పత్తి రుపప్లవః.

శ్లో॥ భగో వివస్వా నాదిత్యో
యోగపారో దివస్పతిః
కల్యాణగుణనామాచ
పాపపుణ్యప్రదర్శనః.

శ్లో॥ ఉదారకీర్తి రుద్యోగీ
సద్యోగీ, సదసన్మయః
నక్షత్రమాలీ నాకేశః
స్వాధిష్ఠానపదాశ్రయః.

శ్లో॥ పవిత్రః పాపహారీచ
మణిపూరో నభోగతిః
హృత్పుండరీకమాసీనః
శక్రః శాంతో వృషాకపిః.

శ్లో॥ ఉష్ణో గృహపతిః కృష్ణః
సమర్థో ఽనర్థనాశనః
అధర్మశత్రు రజ్ఞేయః
పురుహూతః పురుశ్రుతః

శ్లో॥ బ్రహ్మగర్భో బృహద్గర్భో
ధర్మధేను ర్ధనాగమః
జగద్ధితైషీ సుగతః
కుమారః కుశలాగమః.

శ్లో॥ హిరణ్యవర్ణో జ్యోతిష్మా
న్నానాభూతరతో ధ్వనిః
అరాగో నయనాధ్యక్షో
విశ్వామిత్రో ధనేశ్వరః.

శ్లో॥ బ్రహ్మజ్యోతి ర్వసు ర్ధామా
మహాజ్యోతి రనుత్తమః
మాతామహో మాతరిశ్వా
నభస్వా న్నాగహారధృక్.

శ్లో॥ పులస్త్యః పులహోఽగస్త్యో
జాతూకర్ణపరాశరః
నిరావరణనిర్వారో
వైరంచ్యో విష్టరశ్రవః.

శ్లో॥ ఆత్మభూ రనిరుద్ధోఽత్రిః
జ్ఞానమూర్తి ర్మహాయశాః
లోకవీరాగ్రణీ ర్వీర
శ్చండః సత్యపరాక్రమః.

శ్లో॥ వ్యాలాకల్పో మహాకల్పః
కల్పవృక్షః కళాధరః
అలంకరిష్ణు రచలో
రోచిష్ణుర్విక్రమోన్నతః.

శ్లో॥ ఆయుః శబ్దపతి ర్వేగీ
ప్లవనః శిఖిసారథిః
అసంతుష్టోఽతిథిః శక్రః
ప్రమాథీ పాదపాసనః

శ్లో॥ వసుశ్రవా హవ్యవాహః
ప్రతప్తో విశ్వభోజనః
జప్యో జరాదిశమనో
లోహితాత్మా తనూనపాత్.

శ్లో॥ బృహాదశ్వో నభోయోనిః
సుప్రతీక స్తమిస్రహా
నిదాఘ స్తపనో మేఘః
స్వక్షః పరపురంజయః.

శ్లో॥ సుఖానిలః సునిష్పన్నః
సురభిః శిశిరాత్మకః
వసంతో మాధవో గ్రీష్మో
నభస్యో బీజవాహనః

శ్లో॥ అంగిరోగురు రాత్రేయో
విమలో విశ్వపావనః
పావనః సుమతి ర్విద్వాం
స్త్రైవిద్యో వరవాహనః.

శ్లో॥ మనో బుద్ధి రహంకారః
క్షేత్రజ్ఞః క్షేత్రపాలకః
జమదగ్ని ర్బలనిధి
ర్విగాలో విశ్వగాలవః

శ్లో॥ అఘోరోఽనుత్తరో యజ్ఞః
శ్రేయోనిశ్రేయసాంపథః.
శైలో గగనకుందాభో
దానవారి రరిందమః.

శ్లో॥ రజనీజనక శ్చారు
విశల్యో లోకకల్పధృక్
చతుర్వేద శ్చతుర్భావ
శ్చతురశ్చతురప్రియః.

శ్లో॥ ఆమ్నాయోఽథసమామ్నాయ
స్తీర్థదేవ శ్శివాలయః
బహురూపో మహారూపః
సర్వరూప శ్చరాచరః.

శ్లో॥ న్యాయనిర్మాయకో న్యాయీ
న్యాయగమ్యో నిరంతరః
సహస్రమూర్ధా దేవేంద్ర
స్సర్వశస్త్రప్రభంజనః.

శ్లో॥ ముండో విరూపో విక్రాంతో
దండీ దాంతో గుణోత్తమః
పింగళాక్షో జనాధ్యక్షో
నీలగ్రీవో నిరామయః.

శ్లో॥ సహస్రబాహుః సర్వేశః
శరణ్యః సర్వలోకభృత్
పద్మాసనః పరంజ్యోతిః
పరంపారః పరంఫలం.

శ్లో॥ చరాచరజ్ఞో వరదో
పరేశస్తు మహాబలః
పద్మగర్భో మహాగర్భో
విశ్వగర్భో విచక్షణః.

శ్లో॥ దేవాసురగురు ర్దేవో
దేవాసురమహాశ్రయః
దేవాదిదేవో దేవాగ్ని
దేవాగ్నిసుఖదః ప్రభుః.

శ్లో॥ దేవాసురేశ్వరో దేవో
దేవాసురమహేశ్వరః
దేవదేవమయో౽చింత్యో
దేవదేవాత్మసంభవః.

శ్లో॥ సద్యోని రసురవ్యాఘ్రో
దేవసింహో దివాకరః
విబుధాగ్రవరశ్రేష్ఠః
సర్వదేవోత్తమోత్తమః.

శ్లో॥ శివజ్ఞానరతః శ్రీమా
న్శిఖిశ్రీపర్వతప్రియః
వజ్రహస్తః సిద్ధిఖడ్గీ
నరసింహనిపాతనః.

శ్లో॥ బ్రహ్మచారీ లోకచారీ
ధర్మచారీ ధనాధిపః
నందీ నందీశ్వరోనంతో
నగ్నవ్రతధర శ్శుచిః.

శ్లో॥ లింగాధ్యక్షః సురాధ్యక్షో
యోగాధ్యక్షో యుగావహః
స్వధర్మ స్స్వర్గతః స్స్వర్గ
స్స్వరస్వరమయ స్స్వనః.

శ్లో॥ బాణాధ్యక్షో బీజకర్తా
ధర్మకృద్ధర్మసంభవః
దంభో లోభోర్థవి చ్ఛంభుః
సర్వభూతమహేశ్వరః.

శ్లో॥ శ్మశాననిలయస్త్వష్టా
సేతు రప్రతిమాకృతిః
లోకోత్తర స్ఫుటాలోక
త్ర్యంబకో నాగభూషణః.

శ్లో॥ అంధకారి ర్మఖద్వేషీ
విష్ణుకంధరపాతనః
హీనదోషోఽక్షయగుణో
దక్షారిః పూషదంతభిత్.

శ్లో॥ ధూర్జటిః ఖండపరశుః
సకలో నిష్కలోఽనఘః
అకాలః సకలాధారః
పాండురాభో మృడో నటః.

శ్లో॥ పూర్ణః పూరయితా పుణ్యః
సుకుమారః సులోచనః
సామగేయప్రియోఽక్రూరః
పుణ్యకీర్తి రనామయః.

శ్లో॥ మనోజవ స్తీర్థకరో
జటిలో జీవితేశ్వరః
జీవితాంతకరో నిత్యో
వసురేతా వసుప్రదః.

శ్లో॥ సద్గతిః సత్కృతిః సిద్ధిః
సంజ్యోతిః కాలకంఠకః
కళాధరో మహాకాలో
భూతసత్యపరాయణః.

శ్లో॥ లోకకల్యాణకర్తా చ
లోకోత్తరసుఖాలయః
చంద్రసంజీవన శ్శాస్తా
లోకగూఢో మహాధిపః.

శ్లో॥ లోకబంధు ర్లోకనాథః
కృతజ్ఞః కీర్తిభూషణః
అనపాయోఽక్షరః కాంతః
సర్వశస్త్రభృతాంవరః.

శ్లో॥ తేజోమయో ద్యుతిధరో
లోకానామగ్రణీరణుః
శుచిస్మితః ప్రసన్నాత్మా
దుర్జ్ఞేయో దురతిక్రమః.

శ్లో॥ జ్యోతిర్మయో జగన్నాథో
నిరాకారో జలేశ్వరః
తుంబవీణో మహాకోపో
విశోకః శోకనాశనః.

శ్లో॥ త్రిలోక స్త్రిలోకేశః
సర్వశుద్ధిరధోక్షజః
అవ్యక్తలక్షణో దేవో
వ్యక్తావ్యక్తో విశాంపతిః.

శ్లో॥ వరశీలో వరగుణః
సారో మానధనో మయః
బ్రహ్మావిష్ణుః ప్రజాపాలో
హంసోహంసగతి ర్వయః.

శ్లో॥ వేధావిధాతా ధాతా చ
స్రష్టాహర్తాచతుర్ముఖః
కైలాసశిఖరావాసీ
సర్వావాసీ సదాగతిః.

శ్లో॥ హిరణ్యగర్భో ద్రుహిణో
భూతపాలో౽థ భూపతిః
సద్యోగీ యోగవిద్యోగీ
వరదో బ్రాహ్మణప్రియః

శ్లో॥ దేవప్రియో దేవనాథో
దేవజ్ఞో దేవచింతకః
విషమాక్షో విశాలాక్షో
వృషదో వృషవర్ధనః

శ్లో॥ నిర్మమో నిరహంకారో
నిర్మోహో నిరుపద్రవః
దర్పహా దర్పదో దృప్తః
సర్వర్తుపరివర్తకః

శ్లో॥ సహస్రజిత్సహస్రార్చిః
స్నిగ్ధప్రకృతిదక్షిణః
భూతభవ్యభవన్నాథః
ప్రభవో భూతనాశనః.

శ్లో॥ అర్థో౽నర్థో మహాకోశః
సురకార్యైకపండితః
నిష్కంటకః కృతానందో
నిర్వ్యాజో వ్యాజమర్దనః.

శ్లో॥ సత్త్వవా న్సాత్త్వికః సత్య
కీర్తిః స్నేహకృతాగమః
అకంపితో గుణగ్రాహీ
నైకాత్మా నైకకర్మకృత్.

శ్లో॥ సుప్రీత స్సుముఖ స్సూక్ష్మః
సుకరో దక్షిణానిలః
నందిస్కంధధరో ధుర్యః
ప్రకటః ప్రీతివర్ధనః

శ్లో॥ అపరాజితః సర్వసత్త్వో
గోవిన్ద స్సత్త్వవాహనః
అధృత స్స్వధృతః సిద్ధః
పూతమూర్తి ర్యశోధనః.

శ్లో॥ వారాహశృంగధృక్ శృంగీ
బలవా నేకనాయకః
శ్రుతిప్రకాశః శ్రుతిమా
నేకబంధు రనేకధృక్.

శ్లో॥ శ్రీవత్సల శివారంభః
విశాంభద్రః సమోయశః
భూశయో భూషణో భూతి
ర్భూతకృద్భూతభావనః.

శ్లో॥ అకంపో భక్తికాయస్తు
కాలహానీలలోహితః
సత్యవ్రతమహాత్యాగీ
నిత్యశాంతి పరాయణః.

శ్లో॥ పరార్థవృత్తిర్వరదో
వివిక్షుస్తువిశారదః
శుభదశ్శుభకర్తాచ
శుభనామశుభస్స్వయం

శ్లో॥ అనర్థితో౽గుణః సాక్షీ
హ్యకర్తాకనకప్రభః
స్వభావభద్రోమధ్యస్థః
శీఘ్రగశ్శీఘ్రనాశనః.

శ్లో॥ శిఖండీకవచీశూలీ
జటీముణ్డీచకుణ్డలీ
అమృత్యుర్వ్యదృక్సింహ
స్తేజోరాశిర్మహామణిః.

శ్లో॥ అసంఖ్యేయో౽ప్రమేయాత్మా
వీర్యవాన్వీర్యకోవిదః
వైద్యశ్చైవవియోగాత్మా
పరావరమునీశ్వరః.

శ్లో॥ అనుత్తమోదురాధర్షో
మధురప్రియదర్శనః
సురేశశ్శరణంస్సర్వః
శబ్దబహ్మసతాంగతిః

శ్లో॥ కాలపక్షః కాలకారీ
కంకణీకృతవాసుకిః
మహేష్వాసోమహీభర్తా
నిష్కళంకోవిశృంఖలః

శ్లో॥ సూర్యమణి స్తగణిరన్వః
సిద్ధిదస్సిద్ధిసాధనః
విశ్వతస్సంవృతిస్తుత్యో
వ్యూఢోరస్కో మహాభుజః

శ్లో॥ సర్వయోని ర్నిరాతంకో
నరనారాయణప్రియః
నిర్లేపో నిష్ప్రపంచాత్మా
నిర్వ్యంగో వ్యంగనాశనః.

శ్లో॥ స్తవ్య స్తవప్రియస్తోతా
వ్యాసమూర్తి ర్నిరంకుశః
నిరవద్యమయోపాయో
విద్యారాశిరసప్రియః.

శ్లో॥ ప్రశాంత బుద్ధి రక్షుణ్ణః
సంగ్రహీ నిత్యసుందరః
వైయాఘ్రధుర్యో ధాత్రీశః
శాకల్యః శర్వరీపతిః

శ్లో॥ పరమార్థగురు ర్దృష్టిః
శరీరి శ్రితవత్సలః
సోమో రసజ్ఞో రసదః
సర్వసత్వావలంబనః

ఇవ్విధంబున విష్ణువు శంకరుని సహస్రనామంబులచే స్తుతించి సహస్ర కమలంబులచే పూజించి యొకకమలము లోపించినను, తననేత్రకమలముచే సహస్రనామార్చన పూర్తి చేసి శంకరుని మెప్పించి, సుదర్శన చక్రమును పొందెను. ఈనామంబులకు శంకరుడెంతేని సంతసించెను.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
ముప్పది అయిదవ అధ్యాయముసంపూర్ణము

# ముప్పదియారవ యధ్యాయము

## శివసహస్ర నామముల కర్థములు, నానార్థములు

శివ సహస్ర నామముల కర్థము లన్నియు ప్రాచీనటీకాకారుల ననుసరించి యున్నవి. ఇవన్నియు సనాతనులచే గ్రహింపబడి. ప్రాచీన మతానుసారముగ రెండేసి శబ్దముల కొకటే యర్థము చెప్పబడుచున్నది. కొన్ని యర్థములకు పునరావృత్తి వచ్చినను శంకింప నవసరము లేదు. ఎక్కడైతే నపుంలింగ శబ్దప్రయోగము లున్నవో అక్కడ శివ దేవతా వాచకముగ చెప్పబడుచున్నది. స్త్రీలింగ ప్రయోగములందుకూడ శివదేవతా వాచకములుగ చెప్పబడియుండెను. ఏమన దేవతాశబ్దములు నిత్యస్త్రీ లింగములైనను, నపుంసకలింగ ప్రయోగములుకూడ నున్నవి. బ్రహ్మశబ్దమునకు విశేషణములబట్టి లింగనిర్ధారణమును చేసికొనవలయును. సర్వము మంగళప్రదములగుటకై ఈసహస్రనామములకు ప్రారంభమున శివశబ్దముతో ప్రారంభమయ్యెను.

శివః - మంగళ కరుడు గాన శివు డనియు, మరియు
త్రిగుణ రహితుడు గాన శివు డనియు చెప్పబడెను.
హరః= సృష్ట్యంత మందు సంహారకుడు.
మృడః= సుఖమునిచ్చువాడు సుఖపడువాడు.
రుద్రః= ప్రళయ మందు సర్వులను రోదనము చేయించు వాడు
వాడు గాన రుద్రుడు. దుఃఖమును దూరము చేయు
వాడు గాన రుద్రుడు, దుష్టులను దుఃఖపె పెట్టువాడు గాన రుద్రుడని
చెప్పబడుచున్నాడు
పుష్కరః - పుష్టినిచ్చువాడు
పుష్పలోచనః- పద్మనేత్రుడు
అర్థిగమ్యః - ఉపాసకులకు కామ్యముల నిచ్చువాడు.
సదాచారః — సత్ప్రవృత్తి గలవాడు
శర్వః — సకల ప్రజాంత కారకుడు.

శంభుః — సుఖము నిచ్చువాడు.
మహేశ్వరః — యః పరస్స మహేశ్వర ఇతి శ్రుతేః
ఎవడు పరుడో వాడు మహేశ్వరుడు.
చంద్రాపీడః — చంద్రుని భూషణముగా ధరించిన వాడు.
చంద్రమౌళిః చంద్రుని శిరంబున ధరించువాడు.
విశ్వః — వ్యాపించినవాడు. పరబ్రహ్మస్వరూపుడు.
విశ్వామరేశ్వరః ప్రపంచ మందలి సకల దేవతలు ప్రభువు.
వేదాంతసార సందోహః — వేదాంతసారమును గ్రహించిన మహా పురుషుడు.
కపాలీ — జటాజూటుడు, కపాలమును ధరించినవాడు.
నీలలోహితః - నలుపు ఎరుపు కలిగిన జటలుకలవాడు.
ధ్యానాధారః— ధ్యానమున కాధారుడు.
అపరిచ్ఛేద్యః— దేశకాలపరిచ్ఛేదశూన్యుడు.
గౌరీభర్తా పార్వతీపతి.
గణేశ్వరః— ప్రమథగణనాయకుడు
అష్టమూర్తిః — శర్వుడు, భవుడు, రుద్రుడు, ఉగ్రుడు, భీముడు పశుపతి, ఈశానుడు, మహాదేవుడు అనువారలు అష్టమూర్తులు, ఇదియే అష్టమూర్తి స్వరూపము. మరియు అష్టదిక్పతుల స్వరూపమై యుండెను.
విశ్వమూర్తిః జగత్స్వరూపుడు.
త్రివర్గస్వర్గసాధనః - ధర్మార్థకామంబు లనెడు యచింత్య సుఖముల నిచ్చువాడు.
జ్ఞానగమ్యః— జ్ఞానముచే పొందబడెడివాడు.
దృఢప్రజ్ఞః— దృఢమైన ప్రజ్ఞావంతుడు
దేవదేవః— దేవతా ప్రభువు. దేవతలకు సామర్థ్యము నిచ్చి ప్రకాశింప జేయువాడు.
త్రిలోచనః — త్రినేత్రుడు. త్రిగుణుడు. త్రిలోకుడు. త్రివేద్యుడు. అకార, ఉకార, మకార, అక్షర నేత్రుడు. సూర్యచంద్రాగ్ని నేత్రుడు.

మఱియు శాస్త్ర, ఆచార్య, ధ్యానము లనెడు నిదర్శన సాధనములకు కారణభూతుడైనవాడు. ఈయర్థము మహాభారతమునందు నీలకంఠ వ్యాఖ్యానమునందు గలదు.

వామదేవః— దుష్టమదసంహారకుడు. లోకవిపరీతుడు. అతిసుందరుడు. కర్మఫలవిభాగుడు, వామభాగమున గౌరిచే ప్రకాశించెడివాడు.

మహాదేవః— బ్రహ్మాదులచే పూజింప బడెడివాడు.

పటుః — దుఃఖనాశనము చేయువాడు. భక్తులకు శుభము లిచ్చెడి వాడు, సమర్థుడు.

పరివృఢః - జగత్ప్రభువు. వృద్ధినొందించువాడు.

దృఢః — బలవంతుడు.

విశ్వరూపః— సర్వజగత్స్వరూపుడు.

విరూపాక్షః— విషమనేత్రుడు. త్రినేత్రుడు.

వాగీశః— వేదవాక్కులకు పతి.

శుచిసత్తమః— త్రిగుణరహితుడు గాన పరిశుద్ధుడు. శుచులలో శ్రేష్ఠుడు.

సర్వప్రమాణసంవాది—సకల వేదప్రమాణములచే తెలియబడినవాడు.

వృషాంకః=వృషభధ్వజుడు. ధర్మయుక్తుడు.

వృషవాహనః=నందివాహనుడు. ఇంద్రియాధిష్ఠాన దేవత.

ఈశః=సర్వజగన్నియంత.

పినాకీ=పినాక మను ధనుస్సు గలవాడు.

ఖట్వాంగీ=మంచముకోడు ఆయుధముగ గలవాడు.

చిత్రవేషః=కార్యానుకూలముగ ననేక వేషములు ధరించువాడు.

చిరంతనః=చిరనివాసి.

తమోహరః=అవిద్యను నశింపజేయువాడు.

మహాయోగీ—అష్టాంగ యోగతత్త్వములను తెలిసినవాడు.

గోప్తా—రక్షకుడు.

బ్రహ్మ—సృష్టికర్త అంతటను వ్యాపించువాడు.

ధూర్జటిః — గంగను జటలయందు ధరించి గంగాభారమును భరించిన వాడు.

కాలకాలః — మృత్యువునకు మృత్యువు.

కృత్తివాసాః — గజచర్మాంబరుడు.

పినాకహస్తః=పినాక మను ధనువును హస్తమందు ధరించినవాడు.

సుభగః — సుందరైశ్వర్యవంతుడు.

ప్రణవాత్మకః -ఓంకారస్వరూపుడు. అనగా ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ.

ఉన్నఘ్నః — పాపులను పాశములచే బంధించెడివాడు.

పురుషః = సకలశరీరములయందు వ్యాపించువాడు.

ప్రాణాగ్రేశ్వరుడు - దేహమునందు శయనించువాడు, పరిపూర్ణుడు.

ద్యుష్టః — మనోవాక్కాయకర్మలచే సేవింపబడువాడు.

జుష్టః — మనోవాక్కాయకర్మలచే సేవింపబడువాడు.

దుర్వాసాః — అత్రికి దుర్వాసనామంబున జనించినవాడు. నారబట్ట లను ధరించినవాడు.

పురశాసనః — త్రిపురసంహారకుడు.

దివ్యాయుధః — పినాకాద్యాయుధములు ధరించినవాడు.

స్కందగురుః — కుమారస్వామితండ్రి.

పరమేష్ఠి — తనమహిమచే ఆకసమునం దుండువాడు.

పరాత్పరః — అవ్యక్తముకన్న పరుడు, స్వర్గాదిలోకములకంటె పరుడు.

అనాదినిధనః — దేశకాలాతీతుడు. జననమరణములు లేనివాడు.

గిరీశః — మేరువు మొదలగు పర్వతములకు ప్రభువు.

గిరిజాధవః — పార్వతికి భర్త.

లోకవర్ణోత్తమః — బ్రాహ్మణాది సకలవర్ణములలో శ్రేష్ఠుడు. సూర్యాది సకలప్రకాశకులలో శ్రేష్ఠుడు.

కుబేరబంధుః — కుబేరసఖుడు.

శ్రీకంఠః — శోభాయమానకంఠుడు, వేదకంఠుడు.

శ్రుతి — ఋచస్సామానియజూంషిసాహి శ్రీరమృతాసతామితి. సత్పురుషులు. శ్రీశబ్దమునకు—ఋక్కు లనియు, యజుస్సు లనియు, సామము

లనియు, అమృతమనియు చెప్పుచుండిరి.

మృదుః — భక్తులయెడ సౌమ్యరూపుడు.

సమాధివేద్యః — యోగాభ్యాసముచే తెలియబడినవాడు.

కోదండీ — ధనుర్ధరుడు.

నీలకంఠః — నలుపుకంఠము గలవాడు.

పరస్వధీః — భక్తులకు తనధనము నిచ్చి పుష్టిని గలిగించువాడు.
మరియు భక్తులకు తనయందు బుద్ధి నిచ్చువాడు.

విశాలాక్షః — విశాలనేత్రములు కలవాడు.

మృగవ్యాధః — మృగపక్షులను సంహరించుటలో వేటకానివంటివాడు
అర్జునుని రక్షించుటకై బోయవేషముతో వచ్చినవాడు.

సురేశః - దేవతలకు ప్రభువు.

సూర్యతాపనః — దుర్జనులను సూర్యునివలె తపింపచేయువాడు.

భీషాదస్మాత్సూర్యస్తపతి=సూర్యునిభయపెట్టితపింపచేయువాడు.

భీషోదేతిసూర్యఇతిశ్రుతేః

ధర్మధామ — వర్ణాశ్రమధర్మములకు స్థానమైనవాడు

క్షమాక్షేత్రం — ఓర్పున కుత్పత్తిస్థానము

భగవాన్ — షడ్గుణైశ్వర్యసంపన్నుడు

భగనేత్రభిత్ — దక్షయజ్ఞమున భగునినేత్ర మూడబెరికినవాడు

ఉగ్రః — సర్వసంహారకుడు

పశుపతిః — జీవపాలకుడు

తార్క్ష్యః — కశ్యపపుత్రుడగు గరుత్మంతుడు

ప్రియభక్తః — భక్తప్రియుడు

పరంతపః — శత్రువులను తపింపచేయువాడు

ప్రియంవదః — ప్రియముగా బలుకువాడు

దాతా — భక్తుల కైశ్వర్యము నిచ్చువాడు

దయాకరః — దయచూపువాడు

దక్షః — జగద్రక్షణసమర్థుడు

కర్మధీః — సత్కర్మలందు బుద్ధి కలవాడు

కామశాసనః — మన్మథుని శాసించువాడు
శ్మశాననిలయః — శ్మశానవాసుడు
సూక్ష్మః—శబ్దాదిస్థూలకారణరహితుడు, సర్వగతంసుసూక్ష్మమితిశ్రుతేః సర్వగతుడు గాన సుసూక్ష్ముడని చెప్పబడుచుండెను.
శ్మశానస్థః — శ్మశానవాసి
మహేశ్వరః — గొప్పప్రభువు
లోకకర్తా — జగత్తులనుసృజించువాడు
మృగపతిః — మృగరక్షకుడు
మహాకర్తా — పంచమహాభూతములను నిర్మించినవాడు
విశ్వస్యకర్తాభువనస్యగోప్తే త్యాదయఆగమాః — విశ్వమును సృజించి రక్షించువాడు.
మహౌషధిః—యవలుగోధుములు మొదలగు బీజములు, సంసారరోగము నకుమహౌషధివంటివాడు.
ఉత్తరః — జన్మసంసారసాగరమునుండి ఉద్ధరించువాడు
గోపతిః — స్వర్గము, పృథ్వి, పశువులు, వాక్కు కిరణములకు ప్రభువు
గోప్తా — రక్షకుడు
జ్ఞానగమ్యః — కేవలము కర్మలచేత గాక జ్ఞానముచే పొందదగినవాడు
పురాతనః — కాలాధీనుడుగాక, పూర్వము నుండియున్నవాడు
నీతిః—నీతిచే పొందబడువాడు.
సునీతిః — మంచినీతిగలవాడు
శుద్ధాత్మా — నిర్మలచిత్తుడు
సోమః — ఉమతో గూడినవాడు
సోమరతః — సోమరసామృతప్రియుడు
సుఖీ — సుఖవన్తుడు
సోమపః — యజ్ఞములయందు దేవతారూపుడై సోమపానము చేయువాడు, ధర్మమర్యాదలను జూపించుచు యజమానిరూపంబున సోమపానము జేయువాడు.
అమృతపః — తన ఆత్మామృతమును పానముచేయువాడు.

సౌమ్యః = భక్తులయెడ సౌమ్యరూపుడు
మహాతేజాః — ఎవని తేజంబుచే సూర్యాది తేజంబులు వృద్ధినొందుచున్నవో అట్టివాడు మహాతేజుడు. (శ్రుతి - యేనసూర్యస్తపతి - తేజసేద్ధ ఇతిశ్రుతేః
మహాద్యుతిః — స్వయంజ్యోతి రితి శ్రుతేః. ఇతడే స్వయంజ్యోతి
(మహానీతిర్మహామతిః) అనిపాఠాన్తరముగలదు
తేజోమయః — విశ్వప్రకాశమాన తేజోవన్తుడు
అమృతమయః — మరణరహితుడు, జలమయుడు, అమృతం వా ఆప ఇతి
శ్రుతేః. అమృతస్వరూపుడు, మోక్షానందమయుడు
అన్నమయః — అన్నస్వరూప, అన్నమయః, ఆత్మస్వరూపుడు అన్నం
బ్రహ్మేతిశ్రుతేః

సుధాపతిః=అమృతరక్షకుడు
అజాతశత్రుః=శత్రువులు లేనివాడు
ఆలోకః=స్వప్రకాశరూపుడు
సంభావ్యః=సర్వులకు పూజ్యుడు
హవ్యవాహనః=అగ్నిరూపముతో దేవతలకు హవిస్సు నందించువాడు
దేవో హవ్యవాహనః ప్రజానన్నితి శ్రుతేః
లోకకరః=లోకకర్తా
వేదకరః=ఋగ్వేదాది వేదంబులను ప్రకాశింపజేయువాడు
సూత్రకారణః=వ్యాసాదిరూపములచే సూత్రములను రచించినవాడు
సనాతనః=చిరకాలపురుషుడు
మహర్షింకపిలాచార్యః ఋషిం ప్రసూతం కపిలం యస్తమగ్రే ... ఇతి శ్రుతేః
సకలవేదములను చూచినవాడు గాన ఋషి యనియు, సాంఖ్య సూత్రములద్వారా, ఆత్మజ్ఞానమును తెలిసికొనినవాడు గాన కపిలాచార్యుడనియు చెప్పబడుచున్నాడు
విశ్వదీప్తిః=(శ్రుతి)యస్యభాసా సర్వ మిద మితి శ్రుతేః,
విశ్వమంతయునితని కాంతిరూపమే
త్రిలోచనః=చంద్రసూర్యాగ్నిలోచనుడు
పినాకపాణిః=పినాక మను ధనుస్సును ధరించినవాడు

భూదేవః=పృథ్వియందు దూర్వాసాదివిప్రరూపముల నొందినవాడు
స్వస్తికృత్ — మంగళములు చేయువాడు
స్వస్తిదః=మంగళముల నిచ్చువాడు
సుధీః=మంచిబుద్ధి కలవాడు
ధాతృధామా=విశ్వధారణసమర్థుడు
ధామకరః=సూర్యాది సకలజీవులకు కర్త యైనవాడు
సర్వగః=సర్వవ్యాపి
సర్వగోచరః=సర్వులకు గోచరించువాడు
బ్రహ్మసృక్=బ్రహ్మను, వేదములను సృజించినవాడు
విశ్వసృక్=ప్రపంచమును సృజించినవాడు
సర్గః=సృష్టిస్వరూపుడు
కవిః=సర్వము తెలిసినవాడు, అంతటను వ్యాపించినవాడు, బుద్ధిమన్తుడు
తనంత తాను జనించినవాడు. (కవిర్మనీషీ పరిభూఃస్వయంభూరితిశ్రుతేః
నాన్యతోऽస్తి ద్రష్టేత్యాదిశ్రుతేః
శాఖః=శాఖుడనెడు ఋషి
విశాఖః=కుమారస్వామి
గోశాఖః=వేదశాఖలు గలవాడు, ఎవనియందు జగత్తు నిద్రించుచు
న్నదో ఎవడు త్రిగుణరహితుడో, అట్టివాడు శివుడనియు, బ్రహ్మ
యనియు, చెప్పబడుచున్నాడు. ఏ బ్రహ్మసశివఇతిశ్రుతేః. శివబ్రహ్మ
శబ్దములు రెంటికిని ఏకబ్రహ్మయను యర్థము
భిషక్=వైద్యుడు రోగములను పోగొట్టునట్లు పరమేశ్వరుడు భవరోగ
ములను పోగొట్టువాడు గాన భిషక్ అని పిలువబడుచుండెను.
భిషక్తమంత్వా భిషజం శృణోమీతి శ్రుతేః
అనుత్తమః — యస్మాత్పరం నాపర మస్తి కించి దితి శ్రుతేః —
పరమేశ్వరునకంటె అధికు లెవ్వరు లేరు.
గంగాప్లవోదకః — గంగాప్రవాహముచే తడుపబడినవాడు
జనతారకః — జనులను తరింపచేయువాడు
భవ్యః — సర్వకళ్యాణయుక్తుడు

పుష్కలః — సర్వవ్యాపకుడు
స్థపతిస్థిరః — అనన్తబ్రహ్మాండములకు సృష్టికర్త(మాయాకంచుకమును ధరించినవాడు)
విజితాత్మా — ఆత్మను జయించినవాడు
విషయాత్మా — ప్రపంచవిషయాత్మకుడు
భూతవాహనసారధిః=సర్వభూతములకు కర్మఫల మనుభవింపజేయువాడు బ్రహ్మను సారధిగా చేసుకొన్నవాడు
సగణః — ప్రమథాదిగణయుక్తుడు
గణకాయః — ఛేదింపబడని శరీరుడు. గణశరీరుడు.
సుకీర్తిః — మంచికీర్తి గలవాడు
ఛిన్నసంశయః — సంశయరహితుడు
కామదేవః—ధర్మార్థకాములయందు ఇచ్ఛకలవాడు
కామపాలః — కాముకుల కామ్యములను పూర్తిచేయువాడు
భస్మోద్ధూళితవిగ్రహః=శరీరమంతయు భస్మము పూసుకొన్నవాడు
భస్మప్రియః=భస్మప్రియుడు
భస్మశాయీ=భస్మశయనుడు
కామీ=పూర్ణకాముడు శ్రుతి (కామయతీతి
లోకాంతః=మనోహరుడు, ద్వితీయపరార్థమునందు బ్రహ్మనుకూడా అంతముచేయువాడు
కృతాగమః=శ్రుతిస్మృతులను ప్రకటింపచేయువాడు.
సమావర్తః=సంసారచక్రమును త్రిప్పువాడు.
అనివృత్తాత్మా=ఆత్మజ్ఞానమును విడువనివాడు. సర్వస్థలములయందు ప్రకటింపబడువాడు
ధర్మపుంజః=ధర్మసమూహము
సదాశివః=సదాకళ్యాణస్వరూపుడు
అకల్మషః=కల్మషము లేనివాడు, నిత్యశుద్ధుడు
చతుర్బాహుః=నాలుగుబాహువులుకలవాడు
దురావాసః=కఠినయోగుల చిత్తమందు గాన్పించువాడు.

దురాసదః = సామాన్యులకు పొందశక్యముగానివాడు, అతికష్టముచే పొందబడెడివాడు.

దుర్లభః = దుర్లభభక్తిచే ప్రాప్తించెడువాడు.

దుర్గమః = కఠినమార్గముచే కనబడువాడు.

దుర్గః — ప్రయాసముచే పొందబడువాడు

సర్వాయుధవిశారదః సకలాస్త్రవిద్యానిపుణుడు.

అధ్యాత్మయోగనిలయః = అసంప్రజ్ఞాతసమాధియం దుండువా డనగా సకలభూమికలను నిరోధించుటయే అసంప్రజ్ఞాతసమాధి యనబడును.

సుతంతుః=ప్రపంచమును విస్తరింపచేయువాడు.

తన్తువర్ధనః — సంసారమును వృద్ధిపరచి భేదించువాడు.

శుభాంగః— యోగ్యమగు అంగములు కలవాడు.

లోకసారంగః—లోకసారమైన ఓంకారమును తెలిసికొనినవాడు. సారంగము లోకసారము పచ్చిక గ్రహించినట్లు, ఓంకారసారము గ్రహించిన వాడు జగదీశః జగత్ప్రభువు

జనార్దనః— ప్రళయకాలంబున జనులనంహరిని పీడించు వాడు. సాగర మధ్యయందున్న జనుల నెడి రాక్షసులను పీడించువాడు.

భస్మశుద్ధికర్మః — భస్మమునుకూడ శుద్ధిచేయువాడు.

మేరుః— మేరుస్వరూపుడు

ఓజస్వీ— ఆత్మకుబలము నిచ్చువాడు, తేజశ్శాలి

శుద్ధవిగ్రహః—పరిశుద్ధవిగ్రహుడు (చిదాత్మకుడు).

అసాధ్యః దుష్టులకు సాధ్యముకానివాడు.

సాధుసాధ్యః= సాధువులకు సాధ్యుడు

భూతమర్కటరూపధృక్— గొప్పమర్కటరూపమును ధరించిన హనుమన్తుడు.

హిరణ్యరేతాః— అగ్నిస్వరూపుడు

పురాణః—పురాణపురుషుడు, సకలపురాణములందు బ్రహ్మరూపుడుగా ప్రతిపాదింప బడినవాడు.

జీవహారః—శత్రుజీవులను హరించువాడు.

బలః — బలవంతుడు

మహాప్రాదః— యోగులహృదయ మందు నివసించువాడు

మహాగర్తః — మహారథుడు, దాటశక్యముగాని మాయానంతుడు, శ్మశానవాసి.

సిద్ధబృన్దారవందితః సిద్ధులు దేవతలచేత నమస్కరింపబడెడువాడు.

వ్యాఘ్రచర్మాంబరః—పులిచర్మము ధరించినవాడు

వ్యాళీ— సర్పభూషణుడు

మహాభూతః—యో బ్రహ్మాణం విదధాతిపూర్వం మిత్రి శ్రుతేః కాలత్రయ మందున, నవచ్ఛిన్నుడై మహత్తత్వరూపము నొందిన వాడు ఎవనిచే మహావిరాట్టు ఉత్పన్నమైనదో, వాడే మహాభూతుడు, చతుర్ముఖ బ్రహ్మను సృజించినవాడు, మహాభూతుడు.

మహానిధిః గొప్పస్థానము కలవాడు మహానాగరుడు

అమృతాశః—ఆత్మానందామృతరసపానము చేయు వాడు.

అమృతవపుః— జరామరణములు లేనివాడు, శృతిః అజరోమరః

పాంచజన్యః —శ్రుతి (అగ్నిః ఋషిః పవమానః పాంచజన్యః పురోహితః ఇతి, పంచయజ్ఞమునందు కూడా జనించినవాడని చెప్పవచ్చును. ఎవనిచే పంచియజ్ఞము లుజనించినవో అట్టివాడు పాంచజన్యుడని చెప్పబడుచున్నాడు పంచజనునియం దుద్భవించినవాడు అగ్ని.

ప్రభంజనః — భక్తులయొక్క మాయారూపమగు సంసారణాను నశింప జేయు వాడు. (వాయువు

పంచవింశతి తత్త్వస్థః — ప్రకృత్యాది పంచవింశతి తత్త్వములయందు నివసించువాడు తత్సృష్ట్వాత దేవాను ప్రావిశత్ ఇతి శ్రుతేః

పారిజాతః — కల్పవృక్షస్వరూపుడు.

పరావరః— జగద్రూపుడు

సులభః— సులభుడు

సువ్రతసూరః— శుభవ్రతుడు, భక్తరక్షకవ్రతుడు, వ్రతభోజనుడు, శూరుడు, సూర్యరూపుడు, సంచరించువాడు

బ్రహ్మవేదనిధిః— వేదోద్భవమునకు స్థానమైనవాడు శ్రుతి— అస్య

మహాతో భూతస్య నిశ్వసిత వేతద్యదృగ్వేద ఇత్యాది శ్రుతేః ఈమహా పురుషుని నిశ్వాసములనుండియే వేదములు జనించెననిఋగ్వేదమునం జెప్పబడెను. వాఙ్మయైకనిధియనికూడ జెప్పబడెను.

వర్ణాశ్రమగురుః— చాతుర్వర్ణములకు, చతురాశ్రమములకు గురువైన వాడు

వర్ణీ— బ్రహ్మచారి

**శత్రుజిత్— శత్రువులను జయించినవాడు**

**శత్రుతాపనః— శత్రువులను పపింపజేయువాడు.**

ఆశ్రమః - జీవులనాశ్రయించుకొని సంసారమునందు భ్రమించెడువాడు

క్షపణః— పాపక్షయము చేయువాడు

క్షేమః— ప్రళయకాలమందు ప్రజలను క్షీణింపచేయువాడు.

జ్ఞానవాన్— నిత్యజ్ఞానయుక్తుడు

అచలేశ్వరః పృధీః పర్వతాదులకు ప్రభువు

ప్రమాణభూతః= ప్రత్యక్షాది ప్రమాణములకు కారణుడు

దుర్జ్ఞేయః — తెలిసికొనశక్యముకానివాడు, అతిపరిశ్రమచే తెలిసికొన బడినవాడు

సుపర్ణః= పర్ణముల నెడిపక్షములు కలవాడు, గరుత్మంతుడు. ఈసు పర్ణశబ్దమునకు కవులనేక విధంబులుగ నర్థములు చెప్పుచుండిరి.

వాయువాహనః - వాయువాహనుడు పరమేశ్వరుని రథమునకు వాయువు సోపానముగానుండెను, భీషాస్మాద్వాయుః పవతే ఇతిశ్రుతేః పరమాత్మునివ భయముచే వాయువు వీచుచుండెను.

ధనుర్ధరః — పినాకపాణి

ధనుర్వేదః= ధనుర్వేదమును ప్రకటించినవాడు

గుణరాశిః గుణాకరః — యోగాదిగుణంబులకు, యోగసాంఖ్యశాస్త్రములకు నివాసస్థానము, విద్యా, విధి, క్రియా, సత్య, దయా, అహింసా క్షమా ధ్యాన ధ్యేయ, దమ, శాన్తి, విద్యా, మతి, ధృతి, కాంతి, నీతి, శ్రద్ధా, మేధా, లజ్జా, దృష్టి, సరస్వతి, తుష్టి, పుష్టి క్రియా, ప్రసాద, ప్రతిష్ఠి తాద గుణంబులకు స్థానమైనవాడు

సత్యః, సత్యపరః— సాధువుల యెడ సత్యస్వరూపుడు

దీనః — శ్మశాన వాసియై బాహ్యదృష్టికి దీనత్వము చూపువాడు.

ధర్మాంగః — ధర్మస్వరూపము లైనయజ్ఞములే అంగములుగా గల వాడు, ఈసంగతి హరివంశములో వరాహరూపము వర్ణించినపుడు, విపులముగా జెప్పబడెను. మరియునిది నాచే రచింపబడిన హరివంశ తెలుగు గద్యపుస్తకమందు హరివంశపర్వమున 41 అధ్యాయమున 125 పుటయందు పరమేశ్వరుడు యజ్ఞవరాహమూర్తిగా వర్ణింపబడెను కాన, నిచట విపులముగ వ్రాయలేదు, పరమేశ్వరుని యంగము లన్నియు, యజ్ఞరూపముగా నందు వర్ణింపబడెను గాన నితనికి ధర్మాంగుడని పేరువచ్చెను.

అనంతదృష్టిః - అసంఖ్యదృష్టికలవాడు

ఆనందః — ఆనందం బ్రహ్మేతివ్యజానాత్, ఇతిశ్రుతేః ఇతడు పర బ్రహ్మానందస్వరూపుడు

దండోదమయితా — దండింపచేయువాడు

విశ్వకర్మవిశారదః— జగత్సృష్టిచేయుటలో సమర్థుడు, సృష్టికి ఆదియం దు సరస్వతిని సృజించినవాడు

వీతరాగః — రాగద్వేషదూరుడు, భక్తుల రాగద్వేషములను దూర ము చేయువాడు

వినీతాత్మా — భక్తసాధ్యుడు, నమ్రస్వరూపుడు

తపస్వీ— తపోయుక్తుడు

భూతవాహనః - ప్రాణులచే ప్రార్థింపబడువాడు

ఉన్మత్తవేషః— ఉన్మాదునివలె దిగంబరుడై సంచరించువాడు,

ప్రచ్ఛన్నః — గోచరింపనివాడు

జితకామః — మన్మథుని జయించినవాడు

అజితప్రియః - విష్ణుప్రియుడు జితరోచిః ప్రియః, కవిః అనిపాఠాన్తర ములు కలవు.

కల్యాణప్రకృతిః — శుభస్వభావుడు

కల్పః— కల్పస్వరూపుడు

సర్వలోక ప్రజాపతిః— సర్వలోకపాలకుడు
తరస్వీ - వేగవంతుడు
తారకః- భవసాగర తారకుడు
ధీమాన్ — బుద్ధిమన్తుడు
ప్రధానప్రభుః - ప్రధానమైన ప్రకృతి ప్రభువు
అవ్యయః— నాశరహితుడు
లోకపాలః— లోకరక్షకుడు
అన్తరాత్మా— హృద్గుహయందు దాగినవాడు
కల్పాదిః— కల్పమున కాదియైనవాడు
ప్రమాణః— ప్రమిత స్వయంప్రమాణరూప ప్రజ్ఞానంబ్రహ్మేతి శ్రుతేః ప్రమాణ పురుషుడు
పరమః— పరమశుభయుక్తుడు
తపః — ఋతసత్యాది రూపుడు (ఋతంతప ఇతిశ్రుతేః)
సంవత్సరకః—కాలచక్రప వర్తకుడు. ప్రభవాది సంవత్సరములను సృజించినవాడు
మన్త్రప్రత్యయః — వేదమన్త్రములచే పూజింపదగినవాడు
సర్వదర్శనః — శ్రుతివిశ్వతశ్చక్షుర్విశ్వాక్షీ ఇత్యాదిశ్రుతేః, సర్వదర్శనుడు
సర్వేశ్వరః — సర్వప్రభువులకు ప్రభువు ఏషసర్వేశ్వర ఇతిశ్రుతేః
సిద్ధః—నిత్యసిద్ధస్వరూపుడు
మహారేతాః - ఊర్ధ్వరేతంవిరూపాక్ష మితిశ్రుతేః ఊర్ధ్వరేతస్కుడు, మహావీర్యుడు
మహాబలః — గొప్పబలవంతుడు, పరాక్రముడు
యోగీయోగ్యః— నిత్యయోగయుక్తుడు, యోగశ్రేష్ఠుడు
మహాతేజాః — గొప్పతేజోవంతుడు
సిద్ధిః— సర్వసిద్ధుల పొందినవాడు, సర్వసిద్ధులనిచ్చువాడు
సర్వాదిః - సర్వులకాదికారణుడు
అగ్రహః — పాపులకు తెలియబడనివాడు

వసుః—సకల ప్రాణులయందు వసించువాడు, సకలప్రాణులను తన యందిముడ్చుకొనువాడు

వసుమనాః —

సత్యః — సత్యం జ్ఞానమనన్తంబ్రహ్మేతిశ్రుతేః - సత్యస్వరూపుడు

సర్వపాపహరోహరః - సర్వపాపములను హరించువాడు, హరుడు

సుకీర్తిః— మంచికీర్తివంతుడు

శోభనః — సకలైశ్వర్యశోభాయమానుడు

శ్రీమాన్— సర్వలక్షణ శోభితుడు

అవాఙ్మనస గోచరః - వాక్కులకు మనస్సుకు అందనివాడు శ్రుతి, యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసాసహ

అమృతః - అమరుడు

శాశ్వతః- శాశ్వతుడు (అజరా అమృత ఇతిశ్రుతేః

శాన్తః - శాన్తుడు- తరంగహీన సాగరునివంటి వాడు, భక్తులకు లోబడినవాడు గాన అస్వతంత్రుడు

బాణహస్తః = బాణహస్తుడు.

ప్రతాపవాన్— ప్రతాపవన్తుడు

కమండలుధరః = కమండలమును ధరించినవాడు

ధన్వీ - ధనుర్ధరుడు

వేదాంగః = వేదములే అంగములుగా గల ...

వేదమునిః = వేదము తెలిసిన ముని

భ్రాజిష్ణుః = ఏకరసప్రకాశస్వరూపుడు, భూమగుణముల చే ప్రకాశించు వాడు

భోజనః = క్రతుభోజుడు

భోక్తా = అనుభవించెడు వాడు

లోకనాథః = జగత్ప్రభువు

దురాధరః = అతికష్టముచే పొందబడెడు వాడు

అతీన్ద్రియో మహామాయః = అశబ్ద స్పర్శమితిశ్రుతేః, శబ్దాది రహితుడు ఇంద్రియాంతీతుడుమాయనుకూడా మాయముచేయువాడు

సర్వవాసః = అంతటను నశించువాడు

చతుష్పథః = ధర్మార్థ కామ మోక్షముల నెడు నాలుగు మార్గములు కలవాడు

కాలయోగీ = కర్మలనుబట్టి ప్రాణులకు ఫలములిచ్చువాడు

మహానాదః = గొప్ప నాదస్వరూపుడు

మహోత్సాహః ఉత్పత్తిస్థితిలయంబులు చేయుటకు కడునుత్సాహము కలవాడు

మహాబలః = బలవంతులలో బలవంతుడు

మహాబుద్ధిః = బుద్ధిమంతులలో శ్రేష్ఠుడు

మహావీర్యః = ఉత్పత్తికారణుడు గాన మహావీర్యుడని చెప్పబడు చున్నాడు

భూతచారీ = భూతప్రేతములతో సంచరించువాడు

పురందరః = త్రిపురసంహారకుడు

నిశాచరః = రాత్రిసంచరించువాడు

ప్రేతచారీ = ప్రేతములతో దిరుగువాడు

మహాశక్తిః = మహాశక్తివంతుడు

మహాద్యుతిః = గొప్ప తేజోవంతుడు. జ్యోతిషాంజ్యోతిరితి శ్రుతేః జ్యోతిస్సులను ప్రకాశింపచేయువాడు

అనిర్దేశ్యవపుః = ఇట్టి శరీరము కలవాడని నిర్దేశింపశక్యము కాని వాడు

శ్రీమాన్ — ఐశ్వర్యవంతుడు

సర్వాచార్యః = సర్వులకు గురువు

మనోగతిః = మనోవేగుడు

బహుశ్రుతః = అనేక వేదశాస్త్రము లెరింగినవాడు

నియతాత్మా = నియతాత్ముడు

ధ్రువః = నిశ్చలుడు

అధ్రువః = చలించెడు వాడు

నర్తకః = తాండవ నృత్యము చేయువాడు

సర్వశాసకః = సర్వుల శాసించువాడు
అన్తః ప్రవిష్టశ్శాస్తా జనానాం పరాత్మేతి శ్రుతేః సకలాన్తత్మల యందు ప్రవేశించి సర్వులను శాసించువాడు
నృత్యప్రియో నిత్యనృత్యః = నృత్యప్రియుడు గాన నిత్యము నృత్యము చేయువాడు
ప్రకాశాత్మా ప్రకాశకః = ప్రకాశకుడు ప్రకాశాత్మకుడు
స్పష్టాక్షరః = ఓంకారవాచ్యుడు
బుధః = సర్వజ్ఞుడు, బోధచేయువాడు
మన్త్రః = మన్త్రస్వరూపుడు, త్రివేదస్వరూపుడు
సమానః = సమభావుడు
సాంద్రసంప్లవః = సంసారసాగరమును తరింపచేయుటకు వేదాన్తనావికుడు
యుగాదికృత్ = యుగములను నిర్మించువాడు
యుగావర్తః = కాలస్వరూపముచే యుగములను త్రిప్పువాడు
గంభీరః = జ్ఞానైశ్వర్యబలంబులలో గంభీరుడు
వృషవాహనః = నందివాహనుడు
ఇష్టః = పరమానందస్వరూపుడు గాన ఇష్టుడు, మఖపూజితుడు
విశిష్టః = ఉత్కృష్టుడు
శిష్టేష్టః = పండితప్రియుడు, శిష్టుల కిష్టుడు
శలభః = సర్వత్రగమనశీలుడు
ధనుః = పినాకధనుర్ధారి
తీర్థరూపః = విద్యాతీర్థస్వరూపుడు
తీర్థనామః = ప్రపంచోద్ధరణకై గంగనుభువిపై ప్రవహింపచేసినవాడు
శరభః = శరభావతారుడు
తీర్థదృశః = తీర్థములచే జూడబడువాడు
స్తుతః = బ్రహ్మాదులచే స్తుతింపబడువాడు
అర్థదః = పురుషార్థముల నిచ్చువాడు
అపాంనిధిః = సాగరరూపుడు

అధిష్ఠానః=సర్వప్రాణాధిష్ఠానుడు
విజయః=సర్వవిజయుడు
జయకాలవిత్—సముచితమైన కాలముగ దేవతలకు జయమొసంగు వాడు
ప్రతిష్ఠితః—తనమహిమచే ప్రతిష్ఠను పొందినవాడు
ప్రమాణజ్ఞః—సకల జీవులజీవిత ప్రమాణములను తెలిసినవాడు
హిరణ్యకవచః— నమోహిరణ్య బాహవే హిరణ్యవర్ణాయ, హిరణ్య రూపాయేతిశ్రుతేః హిరణ్య కవచుడు
హరిః=సకలపాపముల హరించువాడు
విమోచనః=త్రిదుఃఖములు హరించువాడు
సురగణః=సర్వదేవతాత్మకుడు
విద్యేశః=సకలవిద్యలకు ప్రభువు
బిందుసంశ్రయః=ప్రణవాత్మకుడు
బాలరూపః=బాలరూపుడు
బలోన్మత్తః=అధిక బలము గలవాడు
వికర్తా=విచిత్రసృష్టికర్త
గహనః=పొందశక్యము కానివాడు
గుహః=హృద్గుహావాసుడు
కరణః=జగదుత్పత్తి సాధకుడు
కారణం=కారణస్వరూపుడు
కర్తా=స్వతంత్రుడు
సర్వబంధవిమోచనః=సర్వబంధనములను బోగొట్టువాడు
వ్యవసాయః=ప్రయత్న పూర్వకముగ పరిశ్రమ చేయువాడు
వ్యవస్థానః—వర్ణాశ్రమ ధర్మవిభాగకుడు
స్థానదః=జీవులకర్మానుసారముగ లోకముల నొసంగువాడు
జగదాదిజః=జగత్తుకంటె ముందు జనించినవాడు
గుణదః=గొప్పకోర్కెలనిచ్చువాడు
లలితః=సుందరుడు

అభేదః=అద్వైతస్వరూపుడు

భావాత్మాత్మని సంస్థితః=భావభూతి యందు దేహస్థితుడు, అనగా జీవాత్ముడు

వీరేశ్వరః=వీరులకు ప్రభువు

వీరభద్రః=వీరభద్రుడు

వీరాసనవిధిః=వీరాసనాధిష్ఠితుడు

విరాట్=సర్వజగత్స్వరూపుడు

వీరచూడామణిః=వీరశ్రేష్ఠుడు

వేత్తా=సర్వజ్ఞుడు

తీవ్రానందః=బ్రహ్మానందస్వరూపుడు

నదీధరః=గంగాధరుడు—సముద్రుడు

ఆజ్ఞాధారః—అవిచ్ఛిన్నముగ జగత్తులను నియమించువాడు

త్రిశూలీ—త్రిశూలధరుడు

శిపివిష్టః=యజ్ఞమందు విష్ణుస్వరూపముగా నున్నవాడు - యజ్ఞో వై విష్ణుః పశవః శిపిర్యజ్ఞ ఏవ పశుషు ప్రతిష్ఠ తిష్ఠతీత్యుక్తేః, మరియు జీవులతో కూడియుండు వాడుగాన శిపివిష్టుడనబడును సూర్యునియందు కిరణములనెడి శిపినియందు జగత్తులు వ్యాపించియుండెను

శివాలయః=కల్యాణములకు స్థానమైనవాడు

వాలఖిల్యః=వాఖిల్యఋషిరూపుడు

మహాచాపః = గొప్పధనుస్సుగలవాడు

తిగ్మాంశుః = సూర్యరూపుడు

బధిరః =శ్రోత్రేంద్రియ రహితుడు

ఖగః =వ్యోమ సంచారి

అభిరామః = యోగులయందు రమించువాడు

సుశరణః =యోగ్యులను రక్షించువాడు

సుబ్రహ్మణ్యః = బ్రహ్మజ్ఞాని, వేద వేత్త

సుధాపతిః = అమృతమునకు ప్రభువు

[illegible], న్యాకేశికః = ఉండించు శబ్దములకు ఇంద్రుడర్థము
గోశాఖః = వేదస్వరూపుడు, ఇతడు సంసార రూపమైన గో పని లింగ
పురాణమున చెప్పబడెను
విరామః = విశ్రాంతినొందినవాడు
సర్వసాధనః = సకలపురుషార్థసాధకుడు
లలాటాక్షః = ఫాలనేత్రుడు
విశ్వదేవః = విశ్వదేవుడు
సారః = సారవంతుడు
సంసారచక్రభృత్ =సంసారచక్రమును ధరించినవాడు
అమోఘదండః = పాపుల నధికముగ దండించువాడు
మధ్యస్థః = పక్షపాతరహితుడు
హిరణ్యః = సువర్ణ స్వరూపుడు
బ్రహ్మవర్చస్వీ= బ్రహ్మతేజంబునిచ్చినవాడు
పరమార్థః = మోక్షమునిచ్చువాడు
పరో మాయీ = మాయాతీతుడు
శంబరః = [illegible] వరాహరూపవంతుడు
వ్యాఘ్రలోచనః = ఉగ్రనేత్రుడు
రుచిః = [illegible]
విరించిః = బ్రహ్మస్వరూపుడు
స్వర్బంధుః = స్వర్గబంధువు
వాచస్పతిః = [illegible] బృహస్పతి - [illegible] నామితిశ్రుతేః.
అహర్పతిః = దినప్రభువు - సూర్యుడు
రవిః = రసములను గ్రహించువాడు
విరోచనః = [illegible] సూర్యాగ్ని నేత్రుడు
స్కందః = సృష్టిమును ప్రళయము చేయువాడు, వాయురూపుడై శోషింప
చేయువాడు
శాస్తా = శిక్షించువాడు
వైవస్వతో యమః = యమస్వరూపుడు

యుక్తిరున్నతకీర్తిః ఉన్నతకీర్తిమంతుడు
సానురాగః = భక్తానురాగుడు
పరంజయః = శత్రువులను జయించువాడు
కైలాసాధిపతిః = కైలాసమునకు ప్రభువు
కాంతః = మనోహరుడు
సవితా= నిద్రించువానిని మేలుకొల్పువాడు
రవిలోచనః = సూర్యనేత్రుడు. అగ్నిర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ విత్తిశ్రుతేః
విద్వత్తమః = అధికజ్ఞాన వంతుడు
వీతభయః = భయరహితుడు
విశ్వభర్తా= ప్రపంచ పోషకుడు
అనివారితః = ఎట్టివిషయములయందు నొకరిచే నివారింపబడువాడు కాడు
నిత్యః = నిత్యుడు
నియతకల్యాణః =సతతకళ్యాణయుక్తుడు
పుణ్యశ్రవణకీర్తనః = పుణ్యాత్ములచే కీర్తింపబడువాడు
దూరశ్రవాః = దూరమందున్నను వినెడువాడు
విశ్వసహః =విశ్వమును సహించెవాడు
ధ్యేయః = ధ్యానింప దగినవాడు
దుఃఖప్రణాశనః = దుఃఖనాశకరుడు
ఉత్తారణః — సంసారమునుండి తరింపచేయువాడు
దుష్కృతిహా — దుష్టులను దండించువాడు
విజ్ఞేయః — విశేషముగా తెలియదగినవాడు
దుస్సహః — సహింపశక్యము గానివాడు
అభవః — జన్మరహితుడు
అనాదిః — ప్రపంచకన్న ముందా విర్భవించినవాడు
భూర్భువోలక్ష్మీః — ఆత్మవిద్యచే భూర్భువలోకములను లక్ష్మివలె శోభింపచేయువాడు

కిరీటీ — కిరీటధారుడు

త్రిదశాధిపః = దేవతాప్రభువు

విశ్వగోప్తా — జగద్రక్షకుడు

విశ్వకర్తా — జగములు సృజించినవాడు

సువీరః — గొప్పవీరుడు

రుచిరాంగదః — శోభాయమాన భుజకీర్తులుకలవాడు

జననః — జనింపచేయువాడు

జనజన్మాదిః — ప్రాణులజన్మల కాది కారణమైనవాడు

ప్రీతిమాన్ — ప్రీతిమన్తుడు

నీతిమాన్ = నీతిమంతుడు

ధవః = ప్రభువు

వశిష్ఠః = ప్రళయమందుకూడా నశింపనివాడు

కశ్యపః = కశ్యపరూపుడు

భానుః = ప్రకాశించువాడు తమేవభాన్తమను భాతి సర్వమితిశ్రుతేః)

భీమః = భయంకరుడు

భీమ పరాక్రమః = భయంకర పరాక్రముడు

ప్రణవః = ఓంకారరూపుడు

సత్పథాచారః=సన్మార్గమున నడుచువాడు

మహాకోశః=అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ,
ఆనన్దమయ మనెడు పంచ కోశస్వరూపుడు

మహాధనః=అపరిమితైశ్వర్యవంతుడు

జన్మాధిపః=జీవులకు ప్రభువు

మహాదేవః=సకలభావములను వీడి ఆత్మజ్ఞానైశ్వర్యముల నొందిన వాడు

సకలాగమపారగః=సకల వేదాన్తముల నెరింగినవాడు, వేదముల యంతు తెలిసినవాడు

తత్త్వం=బ్రహ్మస్వరూపుడు

తత్త్వవిత్ - యథార్థరూపము నెరింగినవాడు

ఏకాత్మా=ఆత్మావా ఇదమేక ఏవాగ్ర ఆసీదితి శ్రుతేః=ఏకాత్ముడు
విభుః=సర్వవ్యాపకుడు
విశ్వభూషణః=ప్రపంచభూషణుడు
ఋషిః=విశ్వాధిపో రుద్రో మహర్షిరితి శ్రుతేః=ఇన్ద్రి[illegible]
బ్రాహ్మణః=ఉత్తమవర్ణరూపుడు, బ్రహ్మరూపుడు
ఐశ్వర్యజన్మమృత్యుజరాతిగః = అస్తి, జాయతే, వర్ధతే, విపరిణమతే,
అపక్షీయతే నశ్యతి యను జననాదిషడ్భావవికారములు [illegible]
పంచయజ్ఞ సముత్పత్తిః=దేవాది పంచయజ్ఞములీశునియందు జనించెను
విశ్వేశః=విశ్వమునకు ప్రభువు
విమలోదయః=ఇతనిచే నిష్కళంకమైన [illegible]
ఆత్మయోనిః= సర్వులకు కారణరూపుడు
అనాద్యన్తః=ఆద్యంతములులేనివాడు
వత్సలః=సర్వులకు ప్రియుడు
భక్తలోకధృక్=భక్తులను భరించెడువాడు
గాయత్రీవల్లభః=గాయత్రీవిభుడు
ప్రాంశుః=తనకిరణములచే [illegible]
విశ్వావాసః=ప్రపంచవ్యాప్తుడు
ప్రభాకరః=అత్యన్తదీప్తిమన్తుడు
శిశుః - బాలరూపుడు, [illegible]
వరమునందు విపులము జెప్పబడెను
గిరిరతః - కైలాసప్రియుడు
సమ్రాట్ - సకలాధిపతి, సర్వప్రభువు
సుషేణః— శత్రుసంహారకుడు
సురశత్రుహా — దేవతా శత్రువులను నశింప చేయువాడు
అమోఘోఽరిష్టనేమిః— స్తుతించిన వారికి సర్వఫలంబుల నిచ్చు
వాడు శుభాశుభఫలంబు లిచ్చువాడు
కుముదః - భూమికి ప్రసన్నత కలుగ జేయువాడు, ముకున్దో ముక్తిదః
అనుపాఠము గలదు

నక్షత్రమాలీ — నక్షత్రములను మాలగా ధరించినవాడు
నాకేశః = స్వర్గమునకు ప్రభువు
స్వాధిష్ఠానపదాశ్రయః = స్వాధిష్ఠాన చక్రము నాశ్రయించినవాడు
పవిత్రః = పవిత్రుడు
పాపహారీ = పాపములను హరించువాడు
మణిపూరః = రత్నాములచే భక్తుల మనోరథంబుల నీడేర్చువాడు
నభోగతిః = అన్తరిక్షమున సంచరించువాడు
హృత్పుండరీకమాసీనః= యోగుల హృత్పుష్కరీకములయందు వసించువాడు
శక్రః = ఇన్ద్రరూపుడు
శాన్తః = శాంతుడు
వృషాకపిః = ధర్మమును స్థిరముగా నుంచుటకు కారణుడు
ఉష్ణః = అగ్నిరూపుడు
గృహపతిః = సర్వ గృహపాలకుడు
కృష్ణః = నీలకంఠుడు
సమర్థః = సర్వకార్య సమర్థుడు
అనర్థనాశనః = భక్తుల యనర్థములను బోగొట్టువాడు
అధర్మశత్రుః = అధర్ములకు శత్రువు
అజ్ఞేయః = యోగులకు తెలియబడెడివాడు, కుయోగులకు తెలియబడనివాడు
పురుహూతః పురుశ్రుతః = అనేకులచే నుపాసింపబడెడువాడు అనేక గురువులను గాంచువాడు
ధర్మధేనుః = ధర్మోత్పత్తికి స్థానమైనవాడు
ధనాగమః = వేదధనంబు గలవాడు
జగద్ధితైషీ = లోకకల్యాణము చేయనిచ్ఛగించువాడు
సుగతః = మంచిగతి నిచ్చువాడు. ప్రజలను మోహింప జేయుటకై బుద్ధావతారమెత్తినవాడు
కుమారః = ఇతనియెదుట మన్మథుడు పరాజితుడయ్యెను (కుమారుడు)
కుశలాగమః = కల్యాణదాత

**హిరణ్యవర్ణో జ్యోతిష్మాన్** = బంగారు వర్ణము కలిగిన కాంతివన్తుడు,
నమో హిరణ్య వర్ణాయేతి శ్రుతేః

**నానాభూతరతః** = పిశాచములతో క్రీడించువాడు

**ధ్వనిః** = నాదాత్మకుడు

**అరాగః** = రాగశూన్యుడు

**నయనాధ్యక్షః** సర్వుల నయనంబులచే జూపించువాడు

**విశ్వామిత్రః** = విశ్వమునకు మిత్రుడు, ఒకఋషి

**ధనేశ్వరః** = కుబేరమిత్రుడు

**బ్రహ్మద్యోతిః** = సర్వులను ప్రకాశింపజేయు బ్రహ్మస్వరూపుడు

**వసుధామా** = ధననిధి

**మహాజ్యోతిరనుత్తమః** = మహాతేజోవంతుడు

**మాతామహః** = తాత

**మాతరిశ్వా** = వాయుస్వరూపుడు

**నభస్వాన్** = వాయువు

**నాగహారధృక్** = నాగాభరణుడు

**పులస్త్యః** = పులస్త్యఋషిరూపుడు

**పులహః** = పులహఋషిరూపుడు

**అగస్త్యః** = అగస్త్యస్వరూపుడు

**జాతుకర్ణః** = జాతుకర్ణఋషిరూపుడు

**పరాశరః** = పరాశరస్వరూపుడు

**నిరావరణః** = ఆవరణలేనివాడు

**నిర్వారః** = నివారింపబడనివాడు

**వైరంచ్యః** = విరించిపుత్రుడు

**విష్టరశ్రవాః** = విష్ణుస్వరూపుడు

**ఆత్మభూః** = ఆత్మస్వరూపుడు

**అనిరుద్ధః** = అడ్డగింపబడనివాడు

**అత్రిః** = అత్రిమునిరూపుడు

**జ్ఞానమూర్తిః** = జ్ఞానస్వరూపుడు

మహాయశాః = అపారకీర్తిమంతుడు

లోకవీరాగ్రణీః = లోకమునందున్న వీరులలో అగ్రగణ్యుడు

వీరః = వీరుడు

చండః - దుష్టదండకుడు

సత్యపరాక్రమః = సఫలశక్తిమన్తుడు

వ్యాలాకల్పః = సర్పభూషణధరుడు

మహాకల్పః = అతిసమర్థుడు

కల్పవృక్షః = భక్తుల మనోరథముల నీడేర్చువాడు

కళాధరః = చన్ద్రకళాధరుడు

అలంకరిష్ణుః = విశేషకాన్తిమన్తుడు

అచలః = స్థిరుడు

రోచిష్ణుః = దీప్తిమన్తుడు

విక్రమోన్నతః = అధికబలవంతుడు

ఆయుశ్శబ్దపతిః = సకలజీవుల కాయువు ప్రభువు, [illegible]

వేగప్లవనః = శ్వేతాశ్వము [illegible] భక్తుల కోర్కెల [illegible]

శిఖిసారథిః = అగ్ని సహాయుడు

అసంస్పృష్టః=మాయాసంసర్గరహితుడు

అతిథిః=భక్తులచేత అతిథిరూపమున పూజింపబడువాడు

శక్రప్రమాథీ=నసురసేనల గణము [illegible]

పాదపాసనః=వృక్షమూలమున [illegible]

వసుశ్రవాః=మధురశ్రవణుడు

హవ్యవాహః=అగ్ని స్వరూపుడు

ప్రతప్తః=కఠినతపము చేయువాడు

విశ్వభోజనః=ప్రళయమునందు విశ్వమంతయు మ్రింగువాడు, విశ్వమును పాలించువాడు

జప్యః=జపింపదగినవాడు

జ్వరాదిశమనః=జ్వరములను శాన్తింపజేయువాడు

లోహితాత్మా తనూనపాత్ =అగ్నివర్ణస్వరూపుడు

బృహదశ్వః=హయగ్రీవావతారుడు
నభోయోనిః=ఆకాశస్వరూపుడు
సుప్రతీకః=సుందరమైన అవయవములుకలవాడు
తమిస్రహా=అజ్ఞానమును నశింప జేయువాడు
నిదాఘతపనః=గ్రీష్మకాలసూర్యుడు
మేఘః=మేఘస్వరూపుడు
పరపురంజయః=శత్రునాశకుడు
సుఖానిలః=ప్రాణవాయుస్వ పుడు
స్వక్షః=సుందరనేత్రుడు
సునిష్పన్నః=జగత్తును బుట్టించినవాడు
సురభిః=కామధేనువు వంటివాడు
శిశిరాత్మకః=చల్లనిఆత్మకలవాడు
వసంతోమాధవః=వసంతఋతువునందు మాధవుడు
గ్రీష్మః=హరింపజేయువాడు
నభస్యః=శ్రావణమాస స్వరూపుడు
బీజవాహనః=ధాన్యాదిబీజములనిచ్చు శరదృతువు హేమంతఋతు
స్వరూపుడు
అంగిరాః=అంగిఋషిస్వరూపుడు
గురురాత్రేయః=దత్తాత్రేయ స్వరూపుడు
విమలః=స్వచ్ఛస్వరూపుడు
విశ్వవాహనః—జగన్నిర్వాహకుడు
పావనః—పవిత్రుడు
సుమనాః—మంచిబుద్ధిగలవాడు
విద్వాన్=ఆత్మవేత్త
త్రైవిద్యః=త్రివేదములు తెలిసినవాడు
నరవాహనః=కుబేరస్వరూపుడు, నరవాహనుడు
మనోబుద్ధిరహంకారః=మనోబుద్ధ్యహంకారస్వరూపుడు
క్షేత్రజ్ఞః=లింగశరీరము తెలిసినవాడు

క్షేత్రపాలకః=సిద్ధస్థానముల రక్షించువాడు
జమదగ్నిః=జమదగ్ని ఋషిస్వరూపుడు
జలనిధిః—సర్వశక్త్యధిష్ఠానస్వరూపుడు
విగాలః=మోక్షరూపామృతమును స్రవింపజేయువాడు
విశ్వగాలవః=గాలవఋషి స్వరూపుడు
అఘోరః=శాంతస్వరూపుడు
అనుత్తరః=తనకన్న యధికుడెవ్వడు లేనివాడు
యజ్ఞః=యజ్ఞస్వరూపుడు
శ్రేయః=శ్రేయోదాయకుడు
నిశ్శ్రేయసాంపథః= మోక్షమార్గస్వరూపుడు
శైలః=నర్మదబాణ శిలాస్వరూపుడు
గగనకుందాభః= రవిచంద్రులవంటి కాంతిగలవాడు
దానవారిః=దానవ సంహారకుడు
అరిందమః=శత్రుసంహారకుడు
రజనీజనకః—కాళరాత్రినిపుట్టించువాడు
చారువిశల్యః=తనసురాక్షబుద్ధిచే దుఃఖమును దూరము చేయువాడ
లోకకల్పధృక్=లోకోత్పత్తికారకుడు
చతుర్వేదః=చతుర్వేదస్వరూపుడు
చతుర్భావః=ధర్మార్థ కామమోక్షభావుడు
చతురః=నేర్పరి
చతురప్రియః=చతురప్రియుడు
ఆమ్నాయః=వేదస్వరూపుడు
సమామ్నాయః=సకలప్రాణాత్మకమై వేదస్వరూపుడు, వేదములకు ప్రాణస్వరూపుడు
తీర్థదేవశివాలయః తీర్థములకు దేవతలకు కల్యాణస్థానమైనవాడు
బహురూపః=అసంఖ్యాకరూపుడు
మహారూపః=పూజనీయరూపుడు
సర్వరూపః=సర్వస్వరూపుడు

చరాచర: = చరాచరరూపుడు, శ్రీభూస్వరూపుడు
న్యాయనిర్వాహక: = నిర్వాహకుడై న్యాయమును పాలించువాడు
నిరంతర: = నిత్యుడు
సహస్రమూర్ధా = సహస్ర శిరములు గలవాడు
దేవేంద్రః = దేవతా ప్రభువు
సర్వశాస్త్రప్రభంజనః = సకలశాస్త్రములను చక్కగా విభజించువాడు
ముండః = సన్యాసిరూపు గలవాడు
విరూపః – విశేషరూపుడు
విక్రాంతః = అతిశయ విక్రమము గలవాడు
దండీ – కాలదండధరుడు
దాంతః = జితేంద్రియుడు
గుణోత్తమః – ఉత్తమగుణుడు
పింగళాక్షః – పింగళ వర్ణ నేత్రుడు
జనాధ్యక్షః – జనాధిపతి
నీలగ్రీవః = నీలకంఠుడు
నిరామయః – రోగరహితుడు
సహస్రబాహుః = అనేక బాహువులు గలవాడు
సర్వేశః = సర్వులకు ప్రభువు
శరణ్యః = రక్షకుడు
సర్వలోకధృక్ = సర్వలోకాధారుడు
పద్మాసనః – పద్మాసీనుడు
పరంజ్యోతిః – పరబ్రహ్మస్వరూపుడు, తేజోవంతులకు తేజంబులిచ్చు వాడు
పరంపరః – సంసార దుఃఖమునుండి దాటించువాడు
పరఫలం – పరమపురుషార్థ స్వరూపుడు
పద్మగర్భః – పద్మగర్భుడు – యోగి హృత్పీఠయందుని వశించువాడు
మహాగర్భః – బ్రహ్మాండగర్భుడు
విశ్వగర్భః – విశ్వగర్భుడు

విచక్షణః — సర్వవేదశాస్త్రములను తెలిసినవాడు
చరాచరః — సర్వజ్ఞుడు
వరదః — వరము లిచ్చువాడు
వరేశః — వరము లిచ్చువారిలో శ్రేష్ఠుడు
మహాబలః — మహాబలవంతుడు
దేవాసురగురుర్దేవః = దేవాసురులకు గురువు దైవము
దేవాసుర మహాశ్రయః = దేవాసురులకాశ్రయుడు
దేవాదిదేవః — దేవతలకాదిదేవుడు
దేవాగ్నిః — ప్రకాశమైన యగ్నిస్వరూపుడు
దేవాగ్నిసుఖప్రప్రభుః — దేవతులకగ్ని ద్వారా సుఖములనిచ్చువాడు
దేవాసురేశ్వరః — దేవాసురులకు ప్రభువు
దివ్యః = దేవతాస్వరూపుడు
దేవాసుర మహేశ్వరః = దేవాసురులకు పూజనీయుడు
దేవదేవమయః = దేవదేవస్వరూపుడు
అచింత్యః = ఊహింప శక్యము కానివాడు
దేవదేవాత్మ సంభవః — బ్రహ్మావిష్ణ్వాది దేవతలను జనింప చేసినవాడు
సద్యోనిః — సకల వస్తువులకు మూలకారణుడు
అసురవ్యాఘ్రః — అసురులకు వ్యాఘ్రము వంటివాడు
దేవసింహః — దేవతాశ్రేష్ఠుడు
దివాకరః — సూర్యుడు
విభుదాగ్రవరేష్ఠః — బ్రహ్మాదులలో శ్రేష్ఠుడు
సర్వదేవోత్తమః — సర్వ దేవతలలో నుత్తముడు
శివజ్ఞానవేత్త = ఆత్మజ్ఞానవేత్త
శ్రీమాన్ — శోభాయమానుడు
శిఖశ్రీపర్వతప్రియః — కుమారుని నిమిత్తమై మల్లికార్జున పర్వతమందున్నవాడు
వజ్రహస్తః - ఇన్ద్రస్వరూపుడు

సిద్ధఖడ్గీ — సిద్ధినిచ్చు ఖడ్గము కలవాడు
నరసింహనిపాతనః - శరభరూపముచే నృసింహగర్వమణచిన వాడు
బ్రహ్మచారీ - వేదశీలుడు
లోకచారీ = సర్వలోకసంచారి
ధర్మచారీ - ధర్మప్రవర్తకుడు
నందీ- నందీశ్వరస్వరూపుడు, ఆనందము కలిగించువాడు
నందీశ్వరః - నందికి ప్రభువు
అనంతః - దేశకాలాది పరిచ్ఛేదరహితుడు
నగ్నవ్రతధరః — దిగంబరవ్రతధారి
శుచిః — దోషరహితుడు
లింగాధ్యక్షః — నానాలింగాధిష్ఠాన దేవత, లింగశరీరాధిష్ఠాన దేవత
సురాధ్యక్షః — సురులకధ్యక్షుడు
యోగాధ్యక్షః — యోగశాస్త్ర ప్రవర్తకుడు
యుగావహః — యుగములను ధరించిన వాడు
స్వధర్మా — తనధర్మము నిర్వర్తించుకొనెడువాడు
స్వర్గతః = స్వర్గసంచారి
స్వర్గస్వరః= స్వర్గప్రకాశకుడు
స్వరమయస్వనః = షడ్జాది సప్తస్వరస్వరూపుడు
బాణాధ్యక్షః = బాణాసురసైన్యాధ్యక్షుడు
బీజకర్తా = సృష్టికర్తా
ధర్మకృద్ధర్మసంభవః = ధర్మము చేయువాడు ధర్మస్థాపనకై యుద్భవించినవాడు
దంభః = భక్తపరీక్షకై మాయారూపము ధరించినవాడు
అలోభః = లోభరహితుడు
అర్థవిచ్ఛుభః = వేదార్థమును గౌరవించువాడు సుఖములనిచ్చువాడు
సర్వభూతమహేశ్వరః = సర్వభూతములకు ప్రభువు
శ్మశాననిలయః = శ్మశానవాసి
త్ర్యక్షః = త్రినేత్రుడు

సేతుః = సంసారసాగరమునకు సేతువువంటివాడు

అప్రతిమాకృతిః = సాటిలేని యాకృతి గలవాడు

లోకోత్తరస్ఫుటాలోకః = అన్నిలోకములకన్న పైలోకముగలవాడు

నాగభూషణః = పాములుభూషణముగా గలవాడు

అంధకారిః = అంధకాసురుని శత్రువు

విష్ణుకంధరపాతనః = దక్షయజ్ఞమందు యజ్ఞస్వరూపుడగు విష్ణువు వీరభద్రునకు భయపడి లేడిరూపముతో పారిపోవుచుండ వీరభద్రుడు లేడిశిరమును బేధించెను

హీనదోషః = దోషరహితుడు

అక్షయగుణః = సకలగుణసంపన్నుడు

దక్షారిః = దక్షునకు శత్రువు

పూషదంతభిత్ = సూర్యునిదంతము లూడబెరికినవాడు

ధూర్జటిః = శ్రేష్ఠకేశములుకలవాడు భారమైన జటలుకలవాడు

ఖండపరశుః = దుష్టులనుఖండించు గొడ్డలికలవాడు, పరశువను రాక్షసుని ఖండించినవాడు

సకలః = చంద్రకళతో కూడినవాడు

నిష్కలః = కలంకరహితుడు

అనఘః = పాపరహితుడు

అకాలః = మృత్యురహితుడు

సకలాధారః = సకలజగత్తుల కాధారుడు

పాండురాభః = తెల్లని కాంతికలవాడు

మృడః = సుఖములిచ్చువాడు, సుఖవంతుడు

నటః = నటుడు

పూర్ణః = పరిపూర్ణుడు

పుణ్యః = పుణ్యాత్ముడు

సుకుమారః = సుకుమారుడు, సుందరపుత్రుడు కలవాడు

సులోచనః = సుందరలోచనుడు

సామగేయప్రియః = సామగానప్రియుడు

కృతజ్ఞః=ప్రాణులపుణ్యాపుణ్య ఫలంబుల నెరింగినవాడు చేసినమేలు తెలిసికొనినవాడు

కీర్తిభూషణః=యశోభూషణుడు

అనపాయః=నాశరహితుడు

కాన్త= మనోహరుడు

సర్వశాస్త్ర భృతాంవరః=సర్వశాస్త్ర వేత్తలలో నిపుణుడు

తేజోమయః - తేజోరూపుడు

ద్యుతిధరః - కాంతినిధరించినవాడు

లోకానామగ్రణీః ప్రజలలో శ్రేష్ఠుడు

అణుః - సూక్ష్మమూర్తి॥ ఏషోఽణురాత్మా చేతసా వేదితవ్యః అణువే పరమాత్మయని శ్రుతి చెప్పుచున్న

శుచిస్మితః - హర్షముతో చిరునవ్వు నవ్వువాడు

ప్రసన్నాత్మా - ప్రసన్నాత్ముడు

దుర్జయః - జయింపశక్యము కానివాడు

దురతిక్రమః - దాటశక్యముకానివాడు, భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతిసూర్యః భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమ ఇతిశ్రుతేః

జ్యోతిర్మయః - తేజఃపుంజుడు

జగన్నాథః - జగత్తులకు ప్రభువు

నిరాకారః - ఆకారశూన్యుడు

జలేశ్వరః - గంగాపతిః

తుంబవీణః - తుంబవీణుడు, సొరకాయ వీణా ధరించినవాడు

మహాకోపః - మహాకోపుడు

విశోకః - శోకరహితుడు

శోకనాశకః - శోకనాశకుడు

త్రిలోకపః - త్రిలోకపాలకుడు

త్రిలోకేశః - త్రిలోకప్రభువు

సర్వశుద్ధిః - సర్వులను శుద్ధిచేయువాడు

అధోక్షజ: - ఇంద్రియాతీతుడు
అవ్యక్త లక్షణో దేవ: - గోచరింపని దేవుడు
వ్యక్తావ్యక్త: - సగుణనిర్గుణ స్వరూపుడు
విశాంపతి: - సకల ప్రజాపాలకుడు
వరశీల: - శ్రేష్ఠుడు
వరగుణ: - గుణవంతులలో శ్రేష్ఠుడు
సార: - సారవంతుడు
మానధన: - మానధనుడు
మయ: - సుఖస్వరూపుడు
బ్రహ్మ - బ్రహ్మ స్వరూపుడు
విష్ణు: - సర్వవ్యాపకుడు - ప్రజాపాలకుడు
హంస: - అజ్ఞాన నాశకుడు
హంసగతి: - యోగమార్గగుడు
వయ: - పక్షిరూపుడు, గరుత్మద్రూపుడు, జీవాత్మ పరమాత్మ స్వరూపుడు జీవాత్మ పరమాత్మయనెడు రెక్కలు కలవాడు (శ్రుతి)
సఖాయం విశ్వంభువనం విచష్టే ద్వాసుపర్ణే త్యాదిశ్రుతే:
వేధావిధాతాధాతా = జగదుత్పత్తికారకుడు గాన వేధయనియు కర్మలకు తగినఫలమొసంగువాడు గాన విధాతయనియు, యనేకవిధంబుల ప్రపంచమును ధరించువాడు గాన ధాతయనియు జెప్పబడుచుండెను.

స్రష్టా = సృజించువాడు
హర్తా = హరించువాడు
చతుర్ముఖ: = నాలుగుముఖములు గలిగినబ్రహ్మ
కైలాసశిఖరావాసీ = కైలాసశిఖరమందున్నవాడు
సర్వావాసీ = అందరిలోను నుండువాడు
సదాగతి: = సదాసంచరించువాడు, సర్వులకు గతినిచ్చువాడు

హిరణ్యగర్భః = గర్భమందు హిరణ్యముగలవాడు, హిరణ్యమయాండమునందు వ్యాపించినవాడు, బ్రహ్మను సృజించినవాడు, హిరణ్యగర్భసమవర్తతాగ్రగతఇతిశ్రుతేః,
ద్రుహిణః = పరబ్రహ్మస్వరూపుడు
భూపాలః = జీవపాలకుడు
భూపతిః = పృథ్వీపతి
సద్యోగి = ప్రపంచహితముచేయువాడు
యోగవిత్ = యోగము తెలిసినవాడు
యోగీ = యోగీశ్వరుడు
వరదః = వరములిచ్చువాడు
బ్రాహ్మణప్రియః = విప్రప్రియుడు
దేవప్రియః = దేవతలకుప్రియుడు
దేవనాథః = దేవతాప్రభువు
దేవజ్ఞః = దేవతలకు జ్ఞానమొసంగువాడు
దేవచింతకః = దేవతలచే చింతింపబడువాడు
విషమాక్షః = త్రినేత్రుడు
విశాలాక్షః = ఆయతనేత్రుడు
వృషదః = ధర్మస్వరూపుడు
వృషవర్ధనః = ధర్మవర్ధనుడు
నిర్మమః = మమకారరహితుడు
నిరహంకారః = అహంకార రహితుడు
నిర్మోహః = మోహశూన్యుడు
నిరుపద్రవః = ఉపద్రవములేనివాడు
దర్పహా = గర్వమును హరించువాడు
దర్పదః = గర్వమునొసంగువాడు
దృప్తః = దర్పముగలవాడు
సర్వర్తుపరివర్తకః = ఋతువులను ప్రవర్తింపచేయువాడు
సహస్రజిత్ = అనేకులను జయించినవాడు

సహస్రార్చిః = అనేకజ్వాలలుకలవాడు
స్నిగ్ధప్రకృతిదక్షిణః = సరళస్వభావుడు
భూతభవ్యభవన్నాథః = భూతభవిష్యద్వర్తమానములకుప్రభువు
ప్రభవః = తేజోవంతుడు
భూతినాశనః = శత్రుసంపత్తుల నశింపజేయువాడు
అర్థః = ప్రయోజనము ధనము
అనర్థః = నిష్ప్రయోజనము, ధనములేకుండుట
మహాకోశః = గొప్పధనాగారముగలవాడు, హృదయముగలవాడు
పరకార్యైకపండితః = ఇతరులకార్యములు చేయుటలోపండితుడు
నిష్కంటకః = అరిషడ్వర్గ బాధలులేనివాడు
కృతానందః = సదానందస్వరూపుడు
నిర్వ్యాజః = కపటములేనివాడు
వ్యాజమర్దనః = కపటమునుబోగొట్టువాడు
సత్త్వవాన్ = శౌర్యవీర్యాదియుక్తుడు
సాత్త్వికః = సత్త్వగుణప్రధానుడు
సత్యకీర్తిః = సత్యకీర్తివంతుడు
స్నేహకృతాగమః = భక్తులకై యాగమశాస్త్రములు రచించినవాడు
అకంపితః = నిశ్చలుడు
గుణగ్రాహీ = భక్తులగుణములే గ్రహించువాడు
నైకాత్మానైకకర్మకృత్ = అనేకాత్మలలోనుండువాడు, అనేకకర్మలు చేయువాడు
సుప్రీతః = ప్రీతివంతుడు
సుముఖః = అనుకూలుడు
సూక్ష్మః సర్వగతుడగుసూక్ష్మ స్వరూపుడు
సుకరః = వరదహస్తుడు
దక్షిణానిలః = మలయవాయురూపుడు
నందిస్కంధధరః = నందివాహనుడు
ధుర్యః = సకలముధరించువాడు

ప్రకట: = సూర్యరూపుడై సర్వులకుగాన్పించువాడు శ్రుతి ఉక్తె
సంగోపా అదృశన్న దృశ్యన్ను దహార్య: అనగా కన
పడి కనబడనిదైవము సూర్యుడు, దివమన్ను కనబడి రాత్రి
యన్ను కనబడ కుండువాడని యర్థము
ప్రీతివర్ధన: - భక్తులకు ప్రీతినివృద్ధిచేయువాడు
అపరాజిత: = ఓటమిలేనివాడు
సర్వసత్వ: = సర్వులకు బలమునిచ్చువాడు
గోవింద: = వేదములచే తెలియబడువాడు
సత్యవాహన: = సత్యమే వాహనముగా గలవాడు
అధృత: = ఇతరాధారములేనివాడు
స్వధృత: = తనచేతనే సర్వముధరింపబడుచున్నది
సిద్ధ: = సిద్ధపురుషుడు
పూతమూర్తి: పవిత్రమూర్తి
యశోధన: = కీర్తియేధనముగా గలవాడు
వారాహశృంగధృక్ శృంగీ = వరాహావతారమున తనదంతశిఖరమును
శృంగముగా ధరించెను
బలవాన్ = బలవంతుడు
ఏకనాయక: = అద్వితీయప్రభువు
శ్రుతిప్రకాశ: = వేదప్రకాశకుడు
తంతౌవనిషదంపురుషం పృచ్ఛామీతిశ్రుతే: - ఉపనిషత్పురుషుడు
శ్రుతిమాన్ = వేదయుక్తుడు
ఏకబంధు: = అద్వితీయబంధువు
అనేకకృత్ = బహుస్యాంప్రజాయేయ యేతితదాత్మానం స్వయమకు
రుతేత్యాదిశ్రుతే: తనఆత్మ ననేకజీవులుగా సృజించిన
వాడు
శ్రీవత్సలశివారంభ: - విష్ణువునకై యనేకమంగళములు చేకూర్చిన
వాడు
శాన్తభద్ర: = సత్పురుషమంగళప్రదుడు

సమోయశ: = సర్వులకు యశంబులిచ్చువాడు
భూశయ: = భూమిపై శయనించినవాడు
భూషణ: = సర్వులకుభూషణుడు
భూతి: = సర్వసంపత్స్వరూపుడు
భూతకృత్ = పంచభూతముల సృజించినవాడు
భూతవాహన: = ప్రాణులను వహించువాడు
అకంప: = స్థిరుడు
భక్తికాయ: = భక్తిశరీరుడు
కాలహా = కాలనాశకుడు
నీలలోహిత: = నీలకంఠుడు
సత్యవ్రత: = సత్యవ్రతుడు
మహాత్యాగీ = గొప్ప త్యాగవంతుడు
నిత్యశాన్తిపరాయణ: = సదాశాన్తుడు
పరార్థవృత్తిర్వరద: = ఇతరులకుకర్మఫలంబుల నిచ్చువాడు మాయావరణమును ఖండించువాడు, వరములిచ్చువాడు

తత్సృష్ట్వాతదేవానుప్రావిశత్

ఇతిశ్రుతే: = జీవులనుసృజించి వారిహృదయమందు ప్రవేశించువాడు
విశారద: = చతుష్షష్టికళానిపుణుడు
శుభద: = శుభములిచ్చువాడు
శుభకర్తా = శుభములుచేయువాడు
శుభనామాశుభ: = శుభనాముడు, శుభుడు
అనర్థిత: = యాచింపనివాడు
అగుణ: = గుణరహితుడు
సాక్షీ = సర్వసాక్షీ
అకర్తా = కర్తకానివాడు
కనకప్రభ: = స్వర్ణకాన్తికలవాడు
స్వభావభద్ర: = స్వభావముగా మంగళస్వరూపుడు
మధ్యస్థ: = బ్రహ్మవిష్ణుల మధ్యముననుండువాడు

శీఘ్రగః = శీఘ్రగాముడు
శీఘ్రనాశనః =భక్తులదుఃఖంబుల త్వరితముగా బోగొట్టువాడు
శిఖండీ = శిఖలుగలవాడు
కవచీ = కవచముగలవాడు
శూలీ = శూలముగలవాడు
జటీ = జటలుగలవాడు
ముండీ = ముండుడు
కుండలీ = సర్పకుండలములు గలవాడు
అమృత్యుః మృత్యువులేనివాడు
సర్వదృక్సింహః = సర్వదిక్కులగాంచు సింహమువంటివాడు
తేజోరాశిః = తేజఃపుంజుడు
మహామణిః = కోర్కెలిచ్చు చిన్తామణి
అసంఖ్యేయః = గణింపశక్యముకానివాడు
ప్రయోగాత్మా = అపరిచ్ఛేద్యస్వరూపుడు
వీర్యవాన్ = వీర్యవంతుడు
వీర్యకోవిదః = వీర్యవంతులలో నిపుణుడు
వేద్యః = తెలిసికొనతగినవాడు
వియోగాత్మ = విశిష్టయోగయుక్తుడు, విశిష్టాత్మస్వరూపుడు
పరావరమునీశ్వరః = పరాత్పరుడు, మునీశ్వరుడు
అనుత్తమః = అత్యన్తోత్తముడు
దురాధర్షః = ఎదిరింపశక్యముకానివాడు
మధురః = సుందరస్వరూపుడు
ప్రియదర్శనః = భక్తులకుప్రియదర్శకుడు
సురేశః = సురులకుప్రభువు
శరణః = రక్షకుడు
శర్వః - విశ్వరూపుడు
శబ్దబ్రహ్మ - శబ్దబ్రహ్మ స్వరూపుడు
సతాంగతిః - సత్పురుషులకు గతియైనవాడు

కాలపక్షః - సృష్టిసహాయకుడు
కాలకారీ - కాలమును సృజించువాడు
కంకణీకృతవాసుకిః - వాసుకుని కంకణముగా ధరించినవాడు
మహేష్వాసః - అక్షయధనువు గలవాడు
మహీభర్తా - భూమిని ధరించువాడు
నిష్కళంకః - అవిద్యా రహితుడు
విశృంఖలః - బంధరహితుడు
ద్యుమణిః - తరణిః - సూర్య ప్రుడై భవసాగరము తరింపచేయువాడు
ధన్యః - కృతకృత్యుడు
సిద్ధదః - అణిమాది సిద్ధులనిచ్చువాడు
సిద్ధిసాధనః - పురుషార్థ సాధకుడు
విశ్వతస్సంవృతః - విశ్వముతో కూడినవాడు, విశ్వముతనకుక్షియం దున్నవాడు
స్తుత్యః - స్తుతిపాత్రుడు
వ్యూఢోరస్కః - విశాలవక్షుడు
మహాభుజః - ఆజానుబాహువు
సర్వయోనిః - సర్వకారణుడు
నిరాతంకః - అడ్డులేనివాడు
నరనారాయణప్రియః - కృష్ణార్జునులకు ప్రియుడు
నిర్లేపః - దేనినిఅంటనివాడు
నిష్ప్రపంచాత్మా - పంచభూత రహితమైన ఆత్మస్వ పుడు
నిర్వ్యంగః - అంగశూన్యుడు, అనేకాంగములు గలవాడు
వ్యంగనాశనః - మన్మథాంగము లన్నియు నశింపజేసినవాడు
స్తవ్యః - స్తుతింపదగినవాడు
స్తవప్రియః - స్తుతిప్రియుడు
స్తోతా - స్తుతింపువాడు
వ్యాసమూర్తిః - వ్యాసస్వరూపుడు
నిరంకుశః - అడ్డులేనివాడు

నిరవద్యమోక్షోపాయః – మోక్ష సాధకుడు
విద్యారాశిః – విద్యాస్వరూపుడు
రసప్రియః – భక్తిరసప్రియుడు
ప్రశాన్తబుద్ధిః – ప్రశాన్త మనస్కుడు
అక్షుణ్ణః – తిరస్కరింప దగనివాడు
సంగ్రాహీ = భక్తజనులననుగ్రహించువాడు
నిత్యసుందరః = నిత్యసుందరుడు
వైయాఘ్రధుర్యః = వ్యాఘ్రచర్మధరుడు
ధాత్రీశః = పృథ్వీపతి
శాకల్యః = శాకల్యమహాఋషి
శర్వరీపతిః = నిశాప్రభువు
పరమార్థగురుః = తారకమన్త్రగురువు
చక్షుః = చక్షురింద్రియ దేవత
శరీరాశ్రితవత్సలః = జీవదయాపరుడు
సోమః = ఉమతోగూడినవాడు
రసజ్ఞః = రసము తెలిసినవాడు
రసదః = రసము నిచ్చువాడు
సర్వసత్త్వావలంబనః = సర్వజీవాశ్రయుడు

ఇప్పటికి 1048 నామముల కర్థములు వ్రాయడమైనది. పదములు విడదీయుటలో 48 నామము లధికములైనవి. ఇవ్విధంబున విష్ణువు శివుని సహస్రకమలములచే సహస్రనామార్చనచేసి ప్రార్థించెను. ఆ సమయమున శంకరుడు అద్భుత విచిత్రలీల జరిపెను. చెప్పెద వినుడు

## శివసహస్రనామస్తోత్రఫలము

మరల సూతుడు ఇట్లు చెప్పదొడంగెను. విష్ణువు తాను చేసిన సహస్ర నామములచే శంకరుని సహస్రకమలములతో ప్రతిదినము అర్చించుచుండ శంకరుడు సంతసించి యొకరోజున శివుడు విష్ణుని పరీక్షింపదలచి సహస్ర

కమలములలో నొకకమలమును లోపింపజేయ విష్ణువు కమలము లోపించుటచే వ్యాకులచిత్తుడై కమలమేమైనదో తెలియకున్నది లేనిచో నా నేత్రకమలమేమైనదని యోచించి సర్వసత్వావలంబుడు గాన ననాయాసముగా నేత్రకమలము నూడబెరికి పూజ పూర్తిచేయుదునని నిశ్చయించి తన నేత్రమును నూడబెరుకుచుండ ఇంతలో శంకరుడు విష్ణూ! ఆగుము ఆగుము సాహసింపకుమని శాస్త్రోక్తరూపముతో ఆ లింగమందు ప్రత్యక్షము కాగా విష్ణువు శంకరుని గాంచి యపరిమితానందముతో నమస్కరించి యనేకవిధముల స్తుతింప శంకరుడు కృతాంజలిపుటుడై యున్న విష్ణువును గాంచి నగుచు నో హరి! నీ చిత్తేప్సితము నే నెరుంగుదును. నీవు దేవతాకార్యసిద్ధికై తపము చేసితివి. దేవతలను రక్షించుటకై దైత్యుల సంహరింపదలచితివి. నీవద్ద సమర్థమైన యాయుధము లేదు. గాన శత్రు సంహారకమగు సుదర్శన చక్రము నీకిచ్చెదను. లోకసుఖావహమైన నాయీ రూపము నీ మనమునందిడుకొని ధ్యానించినచో నీ సకలేప్సితములు సిద్ధింపగలవు. ఈ చక్రము గాంచి నన్ను స్మరించినంతనే సకలదుఃఖములు నశించును. రణమందు దీనిని స్మరించినంతనే దేవతల దుఃఖములు నశించును. నీవు నుతించిన సహస్రనామములయొక్క స్వరూపమే ఈ సుదర్శన చక్రము. ఈ చక్రమున కొక్కొక నామ మొక్కొక యంచుగా వెలసియుండెను. ఈ స్తోత్రము విన్నచో సకల సిద్ధులు వెంటాడుచుండును. నాయొక్క ప్రసాదముచే సర్వకోరిక లీడేరునని శంకరుడు పలికి సూర్యాయుత సమప్రభమైన సుదర్శన చక్రము తన పదములనుండి ఉద్భవింప చేసి యా చక్రమును విష్ణువున కిచ్చియుండ అతడు దానిని యథావిధిగ దన్ముఖుడై పూజించి, నమస్కరించి, ఓ శంకరా! నేను దేనిని పఠించి దేనిని ధ్యానించి దుఃఖరహితుడనగుదునో జెప్పుమన శంకరుడు విష్ణు వాక్కులు విని సంతుష్టుడై దేవసహాయుడగు విష్ణువుతో నో విష్ణూ! సర్వానర్థప్రశాంతికై సర్వదా నా రూపమును ధ్యానించుచుండుము. అనేక దుఃఖములు నశించుటకై నా సహస్రనామములు పఠింపుము, సర్వాభీష్టసిద్ధికై నాచక్రమును సదాధరింపుము- నన్ను స్మరించినవారికి స్వప్నమందు కూడా దుఃఖము లుండవనుటలో సంశయములేదు. రాజులవల్ల బాధలు గల్గినచో విధిపూర్వకముగా ఈ సహస్రనామములు శతపర్యాయములు పఠించినచో భయ విముక్తులగుదురు.

మరియు నిది పఠించినచో సర్వరోగములు నశించి, సకలవిద్యలు చేకూరి, సకలమనోరథంబు లీడేరును. పవిత్రమగు శివభక్తికలుగును, నింకను దేనినుద్దేశించి పఠించిన అది సిద్ధించును. ప్రాతఃకాలమున లేచి స్నాన మాచరించి నా పూజ కావించి, నా సన్నిధిని ఈ సహస్రనామ పారాయణ చేసినచో సకల సిద్ధులు చేకూరును. మరియు ఐహిక సిద్ధులన్నియు పొంది అంతమున మోక్షము నొందగలరని చెప్పి శంకరుడు విష్ణువు చేయి బట్టుకొని విష్ణూ! నీ భక్తికి, నీ స్తోత్రమునకు ప్రసన్నుడనైతినని, ఇచ్ఛవచ్చిన వరమును కోరుమన పరమేశ్వరుని వాక్కులను విని విష్ణువు సుప్రసన్నుడై నమస్కరించి కృతాంజలిపుటుడై ఓ ప్రభూ! సదా నీవిట్టి దయనే నాయందు చూపుచుండ వలెను. నీవు దయామయుడవు గాన నా కార్యములన్నియు నెరవేర్చుము. నీయందచంచలమగు భక్తినిమ్ము నాభక్తులకెన్నడు పీడలు కలిగింపకుమన శంకరుడు నగుచు విష్ణు కరావలంబనముచేసి ఓ హరీ! నాయందు నీకెడతెగని భక్తి నిలుచుగాక నీవు సదా దేవతలకు ప్రజలకు పూజనీయుడవు, వందనీయు డవు అగుదువు. నీవు నేటినుండి సర్వపాపహారమగు విశ్వంభరుడవని పిలువబడు దువు. నా యనుగ్రహముచే నీవు తప్పక నట్టివాడవగుదువని చెప్పి విష్ణు వర్చించిన పార్థివలింగమున అంతర్హితుడయ్యెను. మునులందరు గాంచు చుండగా పరమేశ్వరునిచే నీయబడిన చక్రమును విష్ణువు స్వీకరించి అతి ము[illegible]న్వితుడై సదా శంకరుని ధ్యానించుచు నీ స్తోత్రమును పఠించుచు భక్తులచే పఠింపజేయుచు నుప[illegible]ంచుచుండెను. మీరడిగినదంతయు జెప్పితిని. ఇటుపై మీ రేదడుగ దలచితిరో చెప్పుడని [illegible]తుడు [illegible]న కాదులతో పలికెను.

శివమహాపురాణము కోటిరుద్రసంహితయందు

ముప్పది ఆరవ అధ్యాయము సంపూర్ణము.

---

# ముప్పది ఏడవయధ్యాయము

## పూర్వము శివపూజలు గావించిన వారిచరిత్రలు

ఓసూతా! నీవు ధన్యుడవు జ్ఞానవంతుడవు సువ్రతుడవు ఇంకను శివచరిత్రలు చెప్పి మమ్ము తరింప జేయుము. పూర్వము ఋషులు, మునులు, దేవతలు దేవతా శ్రేష్ఠుడగు శివుని ఎట్లు ఆరాధించిరో చెప్పుమని ఋషులు ప్రశ్నింప సూతుడిట్లు జెప్పతొడంగెను. ఓ ఋషిశ్రేష్ఠులారా! బాగు,బాగు, మంచిప్రశ్న వేసితిరి. భుక్తిముక్తి ప్రదమైనదియు రమ్యమైనదియు నగు శివచరిత్ర చెప్పెద వినుడు. ఇదేవిధముగా నారదుడు బ్రహ్మను ప్రశ్నింప నతడిట్లు చెప్పదొడంగెను. ఓనారదా! నీయందలి ప్రేమాతిశయంబుచే మహాపాతక నాశకంబగు నుత్తమంబైన శంకరచరిత్ర చెప్పెద వినుము. రమాసహితుడై శ్రీహరి శంకరు నర్చించి సర్వకామ్యముల నొందెను. పితామహుడగు నేనాశంశంకరు నర్చించి విశ్వసృష్టిని చేయుచుంటిని, నామానస పుత్రులగు పరమ ఋషులు, తదితరమునులును సదాశివుని ఆరాధించుచుందురు. నీవుకూడా విశేషముగా శివుని ఆరాధించితివి. వశిష్ఠాది సప్తఋషులు నరుంధతి మదయంతి, లోపాముద్ర, అహల్య మొదలగు వారందరు శివుని ఆరాధించియుండిరి. మరియు దూర్వాసుడు కౌశికుడు వశిష్ఠకుమారుడగుశక్తి దధీచి గౌతముడు కణాదుడు భార్గవుడు బృహస్పతి, వైశంపాయనుడు, పరాశరుడు, వ్యాసుడు, ఉపమన్యుడు, యాజ్ఞవల్క్యుడు, మహాశైవుడగు జైమిని, గర్గుడు, శుకుడు శౌనకాదులు మొదలగు వారందరు శివపూజా నిరతులై యుండిరి. మరియు దేవమాతయగు నదితిప్రేమతత్పరయై, కోడండ్రతో కూడా పార్థివ పూజలు చేయుచుండును. ఇంకను శక్రాది లోకపాలురు, నష్టవసువులు, సురలు, మహారాజులు, దేవతలు సాధ్యులు, గంధర్వులు, కిన్నరులు, నుపసురులు, శివపూజానిరతులై యుండిరి. ఇంకను మహాత్ములగు నసురులు సోదర పుత్రసమేతుడై దైత్యుడగు హిరణ్యకశిపుడు, విరోచనుడు, బలి, బాణాసురుడు, హిరణ్యాక్షుడు నతనిపుత్రుడగు నంధ

కుడు, దానవుడగు వృషపర్వుడు నాదిశేషుడు, వాసుకి, తక్షకుడు, తది తరనాగులు, గరుడాది పక్షులు, వంశప్రవర్తకు లగు రవిచంద్రు లిరువురు వారివారి సంతానములతో కూడ శివునారాధించిరి. మరియు స్వాయంభు వాది చతుర్దశమనువులు, శివవేషధారులై శివు నర్చిచిరి. ఉత్తానపాదుడు ప్రియవ్రతుడు మొదలగు మనుపుత్రులందరు శివు నర్చించిరి ఇంకను తద్వం శీయు లందరు శివు నర్చించిరి. ధ్రువుడు, వృషభుడు, భరతుడు నవయో గులు, వారిభ్రాతలు శివునర్చించిరి. ఇంకను వైవస్వతమనుపుత్రుడగు తార్క్ష్యుడు ఇక్ష్వాది ప్రముఖులగు నృపులు శివపూజానిరతులై సకలభోగ ముల ననుభవించిరి. ఇంకను కకుత్స్థుడు, మాంధాత, సగరుడు, ముచకుం దుడు హరిశ్చంద్రుడు కల్మాషపాదుడు భగీరథుడు మొదలగు భూపా లురు ననేక నృపసత్తములు శివ వేష ధారులై శివునర్చించి యుండిరి. దేవసహాయకారకుడగు ఖట్వాంగమహారాజు ప్రార్థివశివపూజలు గావించి యుండెను. ఇంకనుఖట్వాంగపుత్రుడగు దిలీపుడు, దిలీపపుత్రుడగు రఘువు, రఘుపుత్రుడగు నజుడు, నజపుత్రుడగు దశరథుడు, భక్తితో శివు నారా ధించిరి. దశరథుడు పుత్రార్థియై పార్థివలింగమును విశేషముగా పూజించుచు వసిష్ఠుని యనుమతిచే పుత్రకామేష్టి చేయదలచి పుత్ర ప్రాప్తికై ఋష్య శృంగుని తోడితెచ్చి పూజించెను, కౌసల్య ఋష్యశృంగుని యాదేశాను సారముగా పుత్రార్థినియై పార్థివలింగార్చనలు గావించెను. సుమిత్ర కైకే యీలు కూడా పుత్రార్థినులై పార్థివలింగ సపర్యలు గావించియుండిరి. దశరథుడు పుత్రకామేష్టిచేసి శివప్రసాదముచే తనముగ్గురి భార్యల వలన, పుత్రచతుష్టయమునుబడసెను, వీరు మహా ప్రతాపవంతులు సన్మార్గులు నైయుండిరి. శ్రీహరి శివాజ్ఞచే ఈముగ్గురియందును నాల్గు రూపంబు లుగా నవతరించెను వీరిలో కౌసల్య సుతుడు రాముడు, సుమిత్రా తన యులు లక్ష్మణ శత్రుఘ్నులు కైకేయి పుత్రుడు, భరతుడు. వీరిలో రాముడు సహజముగా శివభక్తుడై పార్థివ పూజలుచేయుచు భస్మరుద్రా క్షలు ధరించి విరాగియై యుండెడివాడు. ఇతని వంశీయులందరు శివా రాధకులుగా నుండిరి. మునిసుతుడగు సుద్యుమ్నమహారాజు శివభక్తుడై శివారాధన చేసెడివాడు ఇతడొకానొకప్పుడు తన సేనాసహితముగా శివశా

పముచే స్త్రీరూపమునొంది పార్థివపూజలు గావించి శివానుగ్రహముచే నొకమాసము పురుషరూపము మరియొకమాసము స్త్రీరూపముగా నుండి, మరల శివానుగ్రహముచే పురుషరూపము నొంది విరాగియై తనరాజ్యమును త్యజించి శివధర్మ పరాయణుడై శివవేషధారియై శివుని స్మరించుచు దుర్లభమగు మోక్షము నొందెను. మరియు పురూరవుడు నతని పుత్రుడుకూడా శివు నర్చించి వారిమనోరథము లీడేర్చుకొనిరి. మహాశైవులగు భరతుడు, నహుషుడు శివపూజలుచేసి కృతార్థులైరి. యయాతి శివునర్చించి సకల కామ్యముల నంది పంచపుత్రులను బడసెను. వీరుశివపూజలు గావించి యదుముఖ్యులై శివపూజా ప్రభావముచే సర్వాభీష్టములను పొందిరి. ఇంకను నితరులగు మహారాజులందరు శివునర్చించి వారివంశీయులతో భుక్తిముక్తుల నందిరి. శ్రీకృష్ణుడు బదరికాశ్రమమున సప్తమాసములు శివునిగూర్చి తపంబు చేసియుండ, శివుడు ప్రత్యక్షమై యనేకవరంబులీయ జగంబులన్నియు తనవశంబు చేసికొనెను. కృష్ణపుత్రులగు ప్రద్యుమ్నుడు సాంబుడు మొదలగు వారందరు, శివునర్చించి యనేకవరముల నందిరి. జరాసంధుడు అతనివంశీయులు ననేకవరంబుల బడసిరి. నలుడు పూర్వజన్మంబున బోయవాడై శివునర్చించి సన్యాసిరూపుడగు శివునకాతిథ్య మిచ్చి మనుజన్మమున వీరసేన పుత్రుడగు నలమహారాజై జనించెను. ఈభిల్లుని భార్యకూడ శివార్చనచే మరుజన్మంబున దమయంతియై నలునకు పత్నియై యుండెను. నీవడిగిన దంతయు చెప్పితిని.

శివ మహాపురాణము కోటిరుద్ర సంహితయందు
ఇరువది ఏడవ అధ్యాయము సంపూర్ణము.

# ముప్పది ఎనిమిదవ యధ్యాయము

## శివరాత్రి మాహాత్మ్యము

ఓసూతమహర్షీ ! నీవు ధన్యుడవు. కృతకృత్యుడవు. నాజీవితము సఫలమైనది. శంకరుని శుభచరిత్రలన్నియు నాకు వినిపించితివి. అనేక మహర్షులచే శివుని యథార్థతత్వము వినియుంటిమి కాని మాసందేహనివృత్తికాలేదు. ఏవ్రతములచే శంకరుడు సంతుష్టుడై సుఖములనిచ్చునో, ఏకృత్యములచే కుశలము కలిగించునో దేనిచే భుక్తిముక్తులు లభించునో యట్టిదానిని నీవు విశేషముగ జెప్పుమన, సూతుడిట్లు చెప్పదొడంగెను, ఓ మహర్షులారా ! మీరు బాగుగా ప్రశ్నించితిరి. నేను శివపదాంబుజములు స్మరించి వ్యాసునిచే విన్నదంతయు జెప్పెద వినుడు. మీరు నన్ను ప్రశ్నించినట్లుగ బ్రహ్మ విష్ణువు పార్వతియుకూడ ప్రశ్నింప శివుడిట్లు చెప్పదొడంగెను. పుణ్యప్రదములగు నావ్రతములు అనేకములుగలవు. వాటిలో ముఖ్యమగు పదివ్రతములు జెప్పెదవినుడు, జాబాలికూడ నా పది వ్రతములే చెప్పియుండెను. ద్విజులందఱు ప్రయత్నపూర్వకముగ నాపది వ్రతములు చేయవలెను. ప్రతి అష్టమిరోజున నక్తభోజనము చేయవలెను. కాలాష్టమిరోజున భోజనము వర్జింపవలయును. మార్గశీర్ష బహుళాష్టమిరోజున కాలభైరవుడు జన్మించెను. గాన ఆరోజు కాలాష్టమియందురు. ప్రతీ శుక్లపక్ష యేకాదశి రోజున నుపవసింపవలెను. కృష్ణపక్ష యేకాదశియందు నాపూజలుచేయుచు రాత్రివరకు నుపసించి రాత్రిభోజనముచేయవలయును. ప్రతిశుక్లపక్ష త్రయోదశియందు పగలుపవసించి రాత్రిభుజింపవలెను. శివదీక్షాపరుడు కృష్ణపక్షత్రయోదశినాడు ఉపవసింపవలెను. ప్రతిసోమవారము నక్తభోజనము చేయవలెను. శైవులందఱు నావ్రతనియమముతో భుజింపవలెను. ద్విజులందఱు యథాశక్తిగ నావ్రతము పూర్తిచేయవలెను. ద్విజులీవ్రతము చేయనిచో తస్కరఫలము సంభవించును. ముక్తిమార్గ ప్రవర్తకులందఱు నియమముతో నావ్రతము లాచరింపవలెను. ముక్తినొందుటకు చతుర్విధమార్గము లున్నవి.

శ్లో॥ శివార్చనం రుద్రజపః ఉపవాస శ్శివాలయే
వారణాస్యాంచ మరణం ముక్తిరేషా సనాతనీ

1) శివార్చన (2) రుద్రజపము (3) శివాలయమునం దుపవాసము (4) కాశీలో మరణించుట. ఈ నాలుగు ముక్తినిచ్చుటలో సనాతన ధర్మములైయున్నవి. అష్టమీ సోమవారము, కృష్ణపక్ష చతుర్దశి, శివునకు ప్రీతికరమైన రోజులు. వాటన్నిటికన్నను శివరాత్రి వ్రతము చాలాబలిష్ఠమైనది. భుక్తి ముక్తులు కోరువా రీవ్రతమువీడరాదు. ఇంతకన్న నాచరింపవలసిన యధికవ్రతము లేవియులేవు. ఇవన్నియు మనుజులకు ఉత్తమధర్మ సాధనములై యున్నవి. నిష్కాములు, సకాములు, సకలవర్ణంబులవారు, సకలాశ్రమంబులవారు, స్త్రీలు, బాలురు, సర్వులు, నీవ్రతము నాచరింపవచ్చును. మాఘకృష్ణ త్రయోదశి నాడు రాత్రి త్రయోదశి నిశీధమందున్నప్పుడు శివరాత్రి వ్రతముచేసినచో హత్యా కోట్లు వినాశనమగును. శివపూజాదికృత్యములన్నియు శివరాత్రి నాడుదయమునందే ప్రారంభింపవలెను. అదంతయు చెప్పెదవినుము. బుద్ధిమంతులు పరమానందభరితులై, ప్రాతఃకాలమునలేచి స్నానాది నిత్యకృత్యములు నిర్వర్తించుకొని, శివాలయమునకేగి, యథావిధిగ శివునర్చించి, నమస్కరించి ఓదేవదేవా! మహాదేవా! నీశివరాత్రి వ్రతముచేయ నిశ్చయించుకొంటిని. నీప్రభావముచే నాయీవ్రతమును నిర్విఘ్నముగ నెరవేర్పుము. కామాది శత్రువులునన్ను పీడింపకుండజేయుము. అని యీవిధంబున సంకల్పించుకొని, పూజాద్రవ్యములు సేకరించి, ఆగమశాస్త్రప్రకారముగా స్థాపించిన శివలింగము కడకు రాత్రి నిశీధమందు నేగి శివుని దక్షిణ పశ్చిమభాగములయందు పూజాద్రవ్యము లుంచుకొని మరల విధిపూర్వకముగ స్నానముచేసి, పరిశుద్ధమగు వస్త్రోపవస్త్రములుధరించి, ముమ్మారాచమించి పూజప్రారంభించి శ్లోక రూపమునగాని, మంత్రరూపమునగాని విధిపూర్వకముగ షోడశోపచారములచే శివునర్చింపవలెను. శ్లోకముగాని, మంత్రముగాని లేకుండ శివార్చనచేయ రాదు. తదుపరి భక్తిభావసమన్వితులై నృత్యగీతవాద్యములచే శివుని మెప్పింపవలెను. ప్రథమయామమందు శివునర్చించి, యటుపై జపముచేయ వలెను. నిత్యకృత్యములు దీర్చికొని తదుపరి పార్థివపూజచేయవలెను. ముందుగా పార్థివలింగమును తయారుచేసి, పిమ్మట స్థాపనజేసి, పూజించి, స్తోత్రములచే, సంతుష్టిపరుపవలెను. పిమ్మటశివగాధలు పఠించి, శివమాహాత్మ్యమును పఠింపవలెను. రాత్రి యామమున కొక్కొక్క పార్థివలింగమును చేసి

పూజించి, యిట్లు నాల్గుయామములకు నాల్గు పార్థివలింగములుచేసి పూజించి, క్రమముగ నొక్కొక్కయామమున నొక్కొక్క లింగమును పూజించి, విసర్జింపవలెను. మహోత్సవంబుగ రాత్రియంతయు జాగరణముచేయవలెను. మరునాడుదయమున స్నానముజేసి, మరల పార్థివలింగమును స్థాపించి, శివునర్చించి వ్రతము సంపూర్ణమైనదని తెల్పుచు, మాటిమాటికి నమస్కరింపుచు, నో ప్రభూ! నీయనుజ్ఞచే నియమ ప్రకారము నీపూజలు గావించితిని. ఉత్తమమైన వ్రతమాచరించి నిన్ను విసర్జించుచుంటిని. యథాశక్తిగ నీ వ్రతముపూర్తి చేసియుంటిని. నాయందు దయనుంచి నీవు సంతుష్టుడవగుమని ప్రార్థించి, పుష్పాంజలులిచ్చి, శక్తికొలది దానముచేసి, యథాశక్తిగ యతీశ్వరులకు, విప్రులకు భోజనంబిడి పార్థివలింగమును విసర్జించి తాను భుజింపవలెను. శివుని ప్రతియామమునందు నిత్యముపూజింపవలెను. శివరాత్రినాడు విశేషముగ పూజింపవలెను. ప్రథమయామమున పార్థివలింగమును స్థాపించి భక్తితో షోడశోపచార విధిగ పూజించి, పంచపూజలు గావించి, యటుపై మంత్రయుక్తముగ, విధిపూర్వకముగ నర్చించి, శివమంత్రముచే నష్టోత్తరశతపర్యాయములు జలధారలచే శివునభిషేకించి, సగుణ నిర్గుణరూపుడగు శివుని గురూపదిష్టమంత్రములచేగాని యితరనామమంత్రములచేగాని సదాశివుని పూజింపవలెను. మఱియు ఖండితములుగాని చిత్రాక్షతలచేతను, చందనము, కృష్ణతిలలచేతను, యనేకవిధపుష్పంబులు, పత్రంబులు, కరవీరపుష్పంబులచేతను, శ్రీభవాయనమః, శ్రీశర్వాయనమః, శ్రీరుద్రాయనమః, శ్రీపశుపతయేనమః, శ్రీఉగ్రాయనమః, శ్రీమహాదేవాయనమః, శ్రీభీమాయనమః, శ్రీఈశానాయానమః, అని యిట్లు అష్టమూర్తి నామంబులచే పూజింపవలెను. నామములు శ్రీకారపూర్వకనమోంతముగ పూజింపవలెను. తదుపరి ధూపదీప నైవేద్యములొసంగవలెను. శివరాత్రి వ్రతముచేయువారు మొదటియామంబున పక్వాన్నము నైవేద్యముజేసి, తదుపరి నారికేళఫలముపై నర్ఘ్యమిచ్చి, తాంబూలమర్పించి, నమస్కరించి, ధ్యానించి, గురూపదిష్టమంత్రమును జపింపవలెను. లేనిచో శివపంచాక్షరిని జపించి శంకరుని సంతుష్టిపరచి, ధేనుముద్రను ప్రదర్శించి, శుభ్రజలములచే తర్పణజేసి, పంచవిప్రులకు భోజనంబడెదనని సంకల్పించి రోజంతయు మహోత్సవంబులుగావించి, పూజా

ఫలమును దేవునకు సమర్పించి, పార్థివంబును విసర్జింపవలెను. పిమ్మట ద్వితీయ యామ సంకల్పముచేసి. యథావిధిగ పార్థివలింగము నర్చించి, ద్విగుణీకృత ముగనభిషేకముచేసి, పూజలుగావించి, తిలలు, యవలు, కమలములు, బిల్వ పత్రములచే పూజించి, మాజీఫలముపై నర్ఘ్యమిచ్చి, పరమాన్నము నైవేద్యము చేసి, పూర్వముకన్న ద్విగుణీకృతముగ మంత్రమునుజపించి, విప్రులకు భోజ నముపెట్టెదనని సంకల్పించి, తృతీయయామమున మరల పార్థివమును గావించి, పూర్వమువలె యథావిధినర్చించి, యవలు, గోధుమలు, జిల్లేడుపూలచే పూజించి, ధూపదీపంబు లొసంగి, అప్పములు నైవేద్యములుచేసి, శాకములు సమర్పించి, కర్పూరానంద, నీరాజనములిచ్చి, దానిమ్మఫలము పైనర్ఘ్యమిచ్చి పూర్వముకన్న ద్విగుణీకృత జపమాచరించి, ఉత్సవములుగావించుచు పార్థిన విసర్జనచేయువలెను. మఱల పార్థివమునుచేసి యథావిధిగ పూజించి మినుములు, కఱ్ఱులు, పెసలు, మొదలగు సప్తధాన్యములు, శంఖపుష్పాలు, మారేడు పత్ర ములచే నర్చించి, మినపకుడుము లు నైవేద్యముచేసి, కదళీఫలములపై నర్ఘ్య మొసంగి, యింకను యితరఫలముతో కూడ సర్ఘ్యమిచ్చి, పూర్వముకంటె ద్విగుణీకృతముగ మంత్రము జపించి, భక్తితో నృత్యగీత వాద్యములు గావించి, యరుణోదయమున లేచి, భక్తజనులతో స్నానముచేసి, యుదయమున మరల స్నానముచేసి, యనేకవిధములగు నభిషేకములు, పూజలుగావించి, యనేక దానంబు లిచ్చి విప్రుల సంతుష్టిపరచి, నల్గురు బ్రాహ్మణులకు భోజనంబిడి, సన్యాసులకు కూడభోజనంబిడి, శంకరునకు నమస్కరించి, పుష్పాంజలులిచ్చి,

శ్లో॥ తావక స్త్వద్గతప్రాణాః త్వచ్చిత్తోహం సదామృడ
కృపానిధే యితిజ్ఞాత్వా యథాయోగ్యం తథాకురు

శ్లో॥ అజ్ఞానాద్యది వాజ్ఞానా జ్జపపూజాదికం మయా
కృపానిధే తాచరితం భూతనాథ ప్రసీదమే

శ్లో॥ అనేనై వోపవాసేన యజ్జాతం ఫలమేవచ
తేనైవ ప్రీయతాం దేవః శంకరః సుఖదాయకః

శ్లో॥ కులేమమ మహాదేవ భోజనం తేస్తు సర్వదా
మాభూత్తస్య కులేజన్మ యత్రత్వమ్ నహి దేవతా.

జ్ఞానా జ్ఞానములచే నేచేసిన పూజలకు నీవు సంతసింపుము. నాయుపవాసాది పూజావ్రతాదులకు నీవు సంతసించి నాకుతగిన ఫలములిమ్ము. నావంశీయులం దఱుకూడ నిన్ను భజించునట్లు చేయుము. నిన్ను పూజింపని కులమందెన్నడు నన్నుద్భవింప జేయకుము. నాజీవిత మంతయు నీకై యర్పించి యుంటిని. ఇది తెలిసికొని యేది యోగ్యమో అట్లు చేయుమని స్తుతించి, పుష్పాంజలులిచ్చి, బొట్టుపెట్టుకొని, బ్రాహ్మణాశీస్సులనొంది, విసర్జన చేయవలెను.

పార్థివలింగములు మాత్రమే విసర్జనచేయవలయును గాని శిలలు బాణలింగములు మాత్రము విసర్జనచేయ నవసరములేదు. ఈవిధంబున శివవ్రతము నాచరించినచో పరమేశ్వరుడు నూరుడు గాకుండును. ఐశ్వర్య మైన ఫలము వచ్చును. భగవంతునకు ఈయలేని దేదియు నుండదు. ఇదియె నాయానసమైన వ్రతము. దీనిచే ముక్తి తప్పక లభించును. భక్తికలిగిన వారు ప్రతిమాసము ఈవ్రతముచేయు వచ్చును. తదుపరి యుద్యాపనతో పూర్తిఫలము లభించును. వ్రతాధిష్ఠాన దేవతను నేను గాన వ్రతలోప మెన్నటికినురాదు. ఎట్టివాడైనను యీవ్రతమాచరించినచో భుక్తి ముక్తులు గలుగును. సకలకోర్కెలు ఈడేరును. ఇవ్విధంబున విష్ణువు శంకరుని వ్రతవిధానమంతయు విని స్వస్థానమేగి తానుచేసి యందరిచేతను యీవ్రతము చేయించెను. నారదునకు కూడ నీవ్రతమును చెప్పి చేయించెను.

శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు
ముప్పది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

## ముప్పది తొమ్మిదవ యధ్యాయము

### శివరాత్రి వ్రతోద్యాపనవిధి

శివరాత్రి వ్రతోద్యాపన విధిని తెలుపుమని ఋషులు ప్రార్థింప సూతుడు ఇట్లు చెప్పదొడగెను. ఋషులారా ఉద్యాపన విధిని చెప్పె

ద వినుము. దీనిచే వ్రతము సంపూర్తియగును. 14 సంవత్సరములు శివరాత్రి వ్రతమును చేసి తుదిసంవత్సరమున త్రయోదశినాడు ఏకభుక్తముచేసి చతుర్దశిరోజున నుపవసించి అనగా శివరాత్రియందున, పూజాద్రవ్యములను సమకూర్చుకొని పరిశుభ్రమగు తావున ఒక మండలము నిర్మింపవలెను. ఇట్టి మండలమును ముల్లోకములయందు గౌరీతిలకమందురు. ఈ మండల మధ్యమున లింగమును లిఖింపవలెను. లేనిచో సర్వతోభద్రమండలము కూడ లిఖింప వచ్చును. దీనిమధ్య వస్త్ర, పుష్ప, ఫలాదులతో ఘటమును స్థాపింపవలెను. దానిపై దక్షిణకూడ నుంచవలెను. దీనిని ప్రాజాపత్యకలశ యందురు. దీనిని మండలపార్శ్వభాగమున స్థాపించి మండపమధ్యమున స్వర్ణకలశగాని తదితర కలశగాని స్థాపించి ఉమామహేశ్వర స్వర్ణ ప్రతిమ నందు స్థాపింపవలయును. ప్రతిమ, తన శక్త్యానుసారముగా చేయవచ్చును వామభాగమున పార్వతియు దక్షిణభాగమున శంకరుడు నుండునట్లుగా ప్రతిమను చేయించవలయును. మధ్యకలశపై ప్రతిమనుపెట్టి రాత్రి పూజింపవలయును. ఋత్విక్కులను నాచార్యునకు వరుణనిచ్చి వారి యనుజ్ఞను పొంది శివపూజ ప్రారంభింపవలయును. రాత్రి జాగరణచేసి ప్రతియామమునకు పూజలుచేసి రాత్రియంతయు నృత్యగీతవాద్యంబులతో గడుపవలెను. ఇవ్విధంబున రాత్రినంతయు గడిపి ప్రాతఃకాలమున స్నానము చేసి పునఃపూజ సలిపి యథావిధిగా ప్రాజాపత్యహోమము గావించి బ్రాహ్మణభోజనంబిడి యథాశక్తిగా వారలకు దక్షిణలిచ్చి ఋత్విక్కులను పత్నీసహితముగా వస్త్రాలంకరణ భూషణములచే నలంకరించి వేరువేరుగా నందరకు దానంబులిచ్చి శివప్రీతికై యాచార్యునకు సవత్సగోదానమిచ్చి వృషభవాహనుడగు శివమూర్తిని వస్త్రసహితకలశ నాచార్యునకు దానమీయవలెను. పిమ్మట పరమేశ్వరునట్లు స్తుతింపవలెను. దేవదేవ, మహాదేవ, శరణాగతవత్సల ఈవ్రతముచే నీవు నాయందు దయయుంచి సంతసింపుము. నా భక్త్యనుసారముగా నేనీ వ్రతముచేసితిని. నీ ప్రసాదముచే నా వ్రతలోపము లన్నియు శమింపచేయుము. జ్ఞానాజ్ఞానములచే నేచేయు జప

పూజాధికములు సఫలము లగునట్లు చేయుము. అని యిట్లు ప్రార్థించి పుష్పాంజలు లిచ్చి నమస్కరించి మరల ప్రార్థించినచో వ్రతఫలము సిద్ధించును. మనోభీష్టములు నెరవేరును.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహిత యందు
ముప్పదితొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

# నలువదవ యధ్యాయము

## గుహుని పూర్వ వృత్తాంతము

సూతవాక్కులు విని ఋషులు పరమానంద భరితులై పూర్వము దీవ్రతోద్యాపనములచే ఎవరెవరు నుత్తమ ఫలంబు లొందిరో చెప్పు మని ఋషులు ప్రశ్నింప సూతు డిట్లు చెప్ప దొడంగెను. సర్వ పాప ప్రశమనం బగు నిషాద చరిత్ర చెప్పెద వినుడు. పూర్వమం దొక యరణ్యంబున గుహు డను బోయవా డుండెడివాడు. వాడు బహు కుటుంబము కలవాడు. బలవంతుడు, క్రూరుడు, క్రూరకర్మ పరాయణుడు నతడు ప్రతిదినము నరణ్యమున కేగి మృగముల చంపుచు దారులు కొట్టి దొంగతనముచే జీవించెడివాడు. ఇతడు బాల్యము మొదలు కొని యిట్టి ఘోరకృత్యము లేగాని శుభక్రియలు చేసి ఎరుగడు బహు కాల మిట్లుగడచెను, ఒకరోజున శివరాత్రి వచ్చెను. ఈ దురాత్ము డరణ్యవాసి యగుట చేతను సజ్జన సహవాసము లేకుండుట చేతను నానాడు మహా శివరాత్రి యని యెరుంగక యుండెను. ఆరోజున ఇతని తల్లి దండ్రులు భార్యయు క్షుధాతురులై మేమాకలిచే దహింపబడు చుంటిమి మాకేదేని ఆహారము తెచ్చి ఇమ్మని కోర నతడు ధనుర్బాణ ములు గ్రహించి సత్వరమే మృగహింసార్థమై విపినమున కేగి గ్రుమ్మరు చుండ దైవయోగముచే నేదియు ప్రాప్తింపక దుఃఖింపు చుండ నింతలో రవి అస్తమింప నేనేమిచేయుదును. యెక్కడికి పోవుదును! ఏమృగము ప్రాప్తింప

కుండెను. నాతల్లి దండ్రులు భార్య గృహమునం దేమి చేయు చుండిరో గదా రిక్తహస్తములతో నింటికి పోయి నూత్రమేమి చేయుదునని వ్యాధుడిట్లువిచా రించుచు నొక జలాశయమున కేగి ఆతటాకము దాటి అచ్చట అక్క డక్కడ జంతువులను అన్వేషించుచు ఈ జలాశయమునకు నేయొక్క జంతువైన రాకుండునా యని తలంచుచు, యొక్క మృగమునైనను జంపి కృతకృత్యుడనై యింటి కేగెదనని యూహించుచు యొక బిల్వ వృక్షు మెక్కి దాహము వేసినచో నుండునని జలఘటము దగ్గర బెట్టుకొని ఎపు డేమృగము వచ్చునా చంపుదునా యని కనిపెట్టి చూచుచు క్షుత్పిపాసలచే పీడింపబడుచు నట స్థిరుడై యుండ రాత్రి ప్రథమ యామమున యొక మృగము దాహపీడితయై యాతటాకము కడకు రాగా వ్యాధుడు సంతసంబుతో దానిని గాంచి ధనువున బాణము సంధించి యుండ జలపాత్ర ధనువునకు తగిలి మారేడు పత్రములు జలము నావృక్షము క్రిందనున్న శివలింగముపై బడ ప్రథమ యామములో చేసిన శివపూజా ఫల మతనికి ప్రాప్తిం చెను. ఈఫలముచే అతని పాపము లన్నియు నశించెను. ఈ అల జడికి వ్యాధుని గాంచి భయపడి మృగ మిట్లు పల్కెను. ఓవ్యా ధుడా! నీవిపుడేమి చేయ దలచితివో సత్యము చెప్పుమన నో మృగమా! నాకుటుంబ మంతయు నాకలి బాధ చే తపించుచుండెను గాన నిన్ను జంపి వారి క్షుధ నివారించెదనని పలుక ఆదారుణ వాక్కులు విని దురాత్ముని ఖలునిగాంచి నేనేమి చేయుదును ఎక్కడికి పోవుదును యేయు పాయమున బ్రతుకుదునని యోచింపుచు నిట్లుపల్కెను. అనర్థకరమైన యీశరీర మాంసములో నీకు పని యేమున్నది. నాఈ మాంసము భుజించి సుఖించినచో నాకధిక పుణ్యము లభించును. ఉపకారము చేసిన ఫలము ఎన్ని వందల సంవత్స రములైనను నశింప శక్యము గాదు గాని నామనవి వినుము. నాకు పసికూన లుండిరి వారలను నాభర్తకు గాని బంధువులకు గాని ఒప్పగించి మరల నీవ ద్దకు వచ్చెదను. నామాటల సనృతములుగా భావింపకుము నేనిపుడేగి మర లవచ్చెదను సంశయింపకుము

శ్లో॥ స్థితా సత్యేన ధరణీ సత్యే నైవచ వారిధిః
సత్యేన జలధారాశ్చ సత్యే సర్వం ప్రతిష్ఠితం

సత్యము చేత భూమి. సత్యము చేతనే జలధులు స్థానము తప్పక నిలచి యుండును. సత్యము చేత నె మేఘుడు జలధారల కురియుచుండు నన, వ్యాధుడు మృగవాక్కులు నివి నిన్న నేను నమ్మజాలనన మృగము విస్మితయై భీతినొందుచు నో వ్యాధుడా నేను శపథము చేయుచుంటిని వినుము నేను నాస్వగృహమున కేగి నీసమీపమునకు తప్పక వచ్చెదను నేనట్లు రానిచో బ్రాహ్మణుడు సేవవిక్రయము చేసిన పాపమును, త్రికాలసంధ్యలు వీడిన పాపమును పొందగలను. మరియు స్త్రీలు తమభర్తల యాజ్ఞలను తిరస్కరించిన పాపమును, చేసిన మేలుమరచిన కృతఘ్నుల పాపములను, హరివిముఖుల పాపములను, మిత్రద్రోహుల పాపములను, ధర్మద్రోహుల పాపములను, విశ్వాసఘాతకులు ద్రోహులు చేసిన పాపములను నేను తిరిగి రానిచో పొందెదనని యనేక శపథంబులు చేసిన మృగవాక్కులు విని విశ్వసించి దాని మాటల కంగీకరింపనామృగము సంతసించి దాహము దీర్చుకొని తనగృహమున కేగెను. ఈసంభాషణలచే ప్రథమ యామమంతయు నిద్రలేకుండ గడిపెను

ఇంతలో నా మృగము యొక్క చెల్లెండ్రు మరియొక మృగము జలార్థమై యీతటాకము కడకే వచ్చుచుండ బోయవాడు మృగములను గాంచి మరల బాణము సంధించుచుండ, ధనువు మరియు జలపాత్రకు తగిలి కొన్ని మారేడు పత్రములు, పాత్రయందలి కొంత జలము, శివలింగము పైబడెను. దీనితో వ్యాధునకు రెండవ యామపూజ సిద్ధించెను, ఇంతలో మృగములు, భయపడి పూర్వము వలె వ్యాధుని ప్రశ్నింప నతడు కూడ పూర్వము వలెనే సమాధానము నొసంగ, మృగములు వ్యాధుని గాంచి మేము ధన్యులము, అనిత్యమైన యీశరీరములతో నీ కుపకారము చేయగల్గుచుంటిమి, కాని మాపిల్లలు మాగృహము కడనుండిరి వారల మాభర్తల కొసంగి మేము తిరిగి వత్తుమన మీమాటలు నమ్మజాలను మిమ్మిప్పుడే సంహరింతునని వ్యాధుడు పలుక ఓ వ్యాధా! మేము నీకడకు తిరిగి రానిచో మాసత్య వాక్కుల కనృతదోషము సంభవించును. వివాహ మాడిన స్త్రీని వీడి పరస్త్రీతో రమించిన

వాని దోషమును, వేదధర్మములను వీడి యితరగ్రంథములు కల్పించిన వారి దోషములును, విష్ణు భక్తుడై శివనింద చేసిన వాని దోషమును, తల్లిదండ్రులకు శ్రాద్ధము చేయని వాని దోషమును, మున్ముందుగా పరిత్రాణ వాక్యములు బలికి పిమ్మట శాంతి వాక్యములు పలికిన వాని దోషమును. మేము తిరిగి రానిచో పొందెద మన వ్యాధు డందులకంగీకరింప మృగములు సంతసించి జలము గ్రోలిసుఖముగ నింటి కేగినవి.

ఇవ్విధంబున బోయవానికి రెండవయామముకూడ నిద్రలేకుండ గడిచెను. ఇక మూడవయామము ప్రారంభింప నింకను మృగములు రాలేదని యాలోచించుచుండెను. ఇంతలో నొక మృగము జలాశయమునకు నడచి రాగ, మరల ధనుర్బాణములు సంధింప పూర్వమువలెనే దైవయోగముచే బిల్వపత్రము శివలింగముపై బడ నతనికి తృతీయయామము పూజాఫలము సిద్ధించెను. ఈ ధ్వని యేమని మృగము ప్రశ్నింప కుటుంబపోషణకై నిన్ను సంహరించెదనని పూర్వమువలెనే నతడు ప్రత్యుత్తరంబీయ మృగము వ్యాధ వాక్యములు విని సంతుష్టమానసయై, ఓ వ్యాధుడా! నీకు తృప్తి కల్గించి నేను ధన్యనయ్యెదను. ఉపకారము చేయని వాని జీవితము వ్యర్థము.

శ్లో॥ యోవై సామర్థ్యయుక్తశ్చ నోపకారం కరోతి వై ।
తత్సామర్థ్యం భవేద్వ్యర్థం పరత్రనరకం వ్రజేత్ ॥

సమర్థుడై యుపకారము చేయనిచో వాని సామర్థ్యము వ్యర్థమగుటయే గాక, పరమందు నరకము సంభవించును. కాని నేను పసిపాపలతో నుంటిని. వాటిని జనని కప్పగించి వచ్చెద నన వ్యాధుడు విస్మితుడై వెంటనే వాని పాపములు నశించి, ఓ హరిణమా! ఇటకేతెంచిన నీవారందరును నిట్లే నన్ను మోసగించి వెళ్ళుచుండిరిగాని, యింతవరకు నెవరును తిరిగి రాకుండిరి నీవుకూడ నన్ను మోసగించి పోదలచితివి. ఇక నే నెట్లు జీవింపగల నన, వ్యాధా! నా మాట వినుము. చరాచరములతోగూడిన సర్వబ్రహ్మాండములు సత్యముచేతనే నిలిచి యున్నవి. అసత్యవాక్కులు పలికినచో తక్షణమే పుణ్యము నశించును. నా సత్యప్రతిజ్ఞ వినుము. సంధ్యాకాల, మధ్యాహ్న మైథునముచేసిన దోష

మును, శివరాత్రియందు భుజించిన దోషమును, కూటసాక్ష్యదోషమును, దాచనిచ్చిన సొమ్ము నపహరించిన దోషమును, బ్రాహ్మణుడై సంధ్యవార్చని దోషమును, శివస్తుతి చేయనివాని ముఖము చూచిన దోషమును, సమర్థుడై యుండియు నుపకారము చేయనివాని దోషమును, పర్వదినమందు మారేడు ఫలము కోసినవానిదోషమును, యభక్ష్యభక్షణము చేసినవాని దోషమును, శివార్చన చేయనివాని దోషమును, భస్మమలదక భుజించినవాని దోషమును. నేను తిర్గిరాకున్నచో పొందగలనన, వ్యాధు డిందుల కంగీకరింప యా హరిణము వ్యాధునకు ప్రణమిల్లి స్వస్థానమున కేగి, తన వారందఱిని కలిసికొని, తమ ప్రతిజ్ఞలు నెరవేర్చుకొనుటయే ధర్మమని యెంచి, సత్యయంత్ర నిబద్ధులై మొదటి మృగము తనబిడ్డ నూరడించి తనభర్తను గాంచి, స్వామీ! నేను బోయవానికడకు వచ్చెదనని ప్రతిజ్ఞ చేసితిని. ఈ బాలకుని కాపాడుచుండుము. నీవు లేనిచో నాబాలకుడుండలేడు. మీరిరువురు నిటనుండుడు, నేను పోయెదనన, మరియొక లేడి యిట్లు పలికెను. నీకు నేను సేవకురాలను గాన, నేనే యా వ్యాధునికడకు పోయెదను. నీవిటనే యుండుమన, వారికి పతియగు మృగములు వీరిమాటలు విని, మీరీ పిల్లలను సంరక్షింపుడు. మేమే పోయెదమని బల్కెడు భర్త వాక్కులు విని భార్యలిట్లనిరి. మీరు పిల్లలను రక్షింపుడు మేమే పోయెదము. స్త్రీకి పతిలేనిచో నిందితమగు వైధవ్యము వచ్చును. అది భరించుట దుర్లభము. గాన నాపిల్లల కెవరికైనను వప్పజెప్పి మనము వ్యాధునికడకు పోవుదమన, పిల్లలిదంతయు విని, తల్లిదండ్రులు లేని జీవితము మేమెట్లు గడుపుదుము. మము రక్షించువారెవరు! గాన మీరిట నుండుడు. మేమే పోయెదమని బయలుదేరిరి.

వారు నొకరి నొకరు వీడలేక నందఱు వ్యాధుని కడకేతెంచు చుండ నతడు వారిని గాంచి పరమానందము నొంది మరల శరము ధనువునకు సంధింప నది తగిలి జలపాత్రయందలి జలము, దళములు శివునిపై బడ చతుర్థ యామము పూజ సంపూర్తియయ్యెను. దానితో తక్షణమే యాతని పాపము లన్నియు భస్మమాయెను. మృగములు భార్యా పిల్లలతో నటకేతెంచి నీవు మమ్ములనందరిని భక్షించి మాజీవితములు సఫలము చేయుమని వ్యాధుని

ప్రార్థింప, శివరాత్రియందు శివుని చతుర్యామంబుల పూజించుటచే వ్యాధుడు విజ్ఞానవంతుడై, శివపూజాప్రభావముచే నతడు దుర్లభమైన జ్ఞానము నొంది ఓమృగములారా! మీరందఱు ధన్యులు మృగములు జ్ఞానహీనులందురు కాని మీరట్టివారు కాదు. మీశరీరము లర్పించి పరోపకారముచేయ సంసిద్ధులైరి. నేను మనుజుడనైనను యేమి పుణ్యము సాధించితిని, నేను పరుల శరీరము హింసించి, నాశరీరమును పోషించు కొనుచుంటిని. అనేక పాపములుచేసి నా కుటుంబమును కూడ పోషించుకొను చుంటిని. ఇట్టి పాపాత్ముడనగు నాకు నెట్టి గతివచ్చునో? జన్మతః పాపాత్ముడను. నాకెట్టిగతివచ్చునో తెలియకున్నది. ఇట్టి నా జీవిత మెందు కని జ్ఞానవంతుడై బాగుగా విచారించి, బాణములను విడనాడి, మీరందఱు ధన్యులు, సత్యవ్రతులు గాన మీరు యథేచ్ఛగా పొండన, శంకరుడు సంతసించి, ఆలింగమునుండి తన నిజరూపముతో నావిర్భ వించి, ఓభిల్లుడా యని స్పృశించి, నీ వ్రతమునకు సంతసించితిని, యేదైన వర ము కోరుకొనుము. వ్యాధుడు శివరూపమును గాంచి, పాపవిముక్తుడై, శివ పదంబులబడి కోర్కెలన్నియు నేటితో తీరెనన, శివుడుప్రసన్నాత్ముడై గుహు డని పేరునొసగి నామమునిడి, కృపాదృష్టితో గాంచుచు, ననేక దివ్యవరంబులిచ్చి ఓవ్యాధుడా! నీ యిష్టమైన దివ్య భోగములన్నియు ననుభవింపుము. నీవుశృం బేరపురమును రాజధానిగ నేర్పరచు కొని రాజ్యము పాలింపుము, నీవు, నావంశమువారలు, దేవతా ప్రశంసనీయులై యుందురు. నీకడకు స్వయముగ శ్రీరామచంద్రుడు రాగలడు, అతడు సాక్షాద్విష్ణువు, నీవునాభక్తుడవు గాన నీతోనతడు మైత్రిచేయును, నీవునాసేవాసక్త మనస్కుడవుగాన, తప్పక ముక్తి నొందగలవన, మృగము లన్నియు సుందర శివస్వరూపములు గాంచి, శాపవిముక్తములై దివ్య శరీరధారులై, విమానాధిష్ఠితులై, కైలాసమున కేగిరి శంకరుడు వ్యాధేశ్వర నామంబుతో, అర్బుదాచలంబున లింగస్వరూపుడై వెలసి యుండెను, ఇతడు దర్శనపూజాదులచే వెంటనే భుక్తిముక్తులనిచ్చును. అప్పటి నుండి వ్యాధుడు సకలభోగములనుభవించి, రామకృపచే శివసాయుజ్యము నొందెను. ఈ భిల్లు డజ్ఞానముచే శివపూజలు గావించినను, శివసాయుజ్యము నొందెను. ఇక భక్తితో శివు నర్చించినచో సాయుజ్యము నొందుటలో నాశ్చర్యమేమి? అనేక ధర్మములు. శాస్త్రములు, విచారింప, శివరాత్రి వ్రత

ముత్కృష్టమని చెప్పబడెను. అనేకవ్రతదాన తీర్థాధ్వర జపతపంబులెన్ని చేసినను, శివరాత్రివ్రతమునకు సరిరావు. శుభములు కోరువారీవ్రతము చేయవలెను శివరాత్రివ్రతము భుక్తి ముక్తులనిచ్చును. శుభప్రదమగు శివరాత్రి వ్రతమంతయు చెప్పితిని. దానిని వ్రతరాజమందురు, ఇంకను మీరేమి వినదలచితిరి.

**శివ మహాపురాణమునందలి కోటిరుద్రసంహితయందు**
**నలువదవ అధ్యాయము సంపూర్ణము**

---

## నలువది యొకటవ యధ్యాయము

### ముక్తినిరూపణము

ముక్తియనగా యెట్టిదని ఋషులు ప్రశ్నింప సూతుడిట్లు చెప్పతొడంగెను. ముక్తి నాలుగు విధంబులు చెప్పెద వినుడు. ఇవి అన్నియు సంసారక్లేశముల హరింపజేసి పరమానందమును కలుగజేయును. అవి ఏవన సాలోక్య, సామీప్య, సారూప్య సాయుజ్యములని ముక్తి నాల్గువిధములు. ఇవియన్నియు శివవ్రతములచేతనే సిద్ధించునని ముక్తిప్రదాతయగు శివుడే చెప్పియుండెను. బ్రహ్మాది దేవతలందరు ధర్మార్థకామంబులనెడి త్రివర్గమునిచ్చు సమర్థులే గాని మోక్షమునిచ్చు సమర్థులు కారు. బ్రహ్మాదులు త్రిగుణాధీనులు. శివుడు, త్రిగుణాతీతుడు. నిర్వికారుడు, పరబ్రహ్మతురీయుడు, ప్రకృతికంటె పరుడు జ్ఞానరూపుడు. అవ్యయుడు, సాక్షిభూతుడు జ్ఞానగమ్యుడు యథార్థముగా నద్వయస్వరూపుడు, కైవల్యముక్తిప్రదుడు, త్రివర్గప్రదుడు, కైవల్యముక్తి అందరకు లభించునది కాదు. చాలదుర్లభమైనది. దానిలక్షణములను కూడ చెప్పెద వినుడు. ఎవరివలన సర్వజగత్తులు నుద్భవించుచున్నవో, ఎవరిచే పరిపాలింపబడుచున్నవో, ఎవరియందు లయమగుచున్నవో యట్టివాడే శివుడని చెప్పబడుచున్నాడు. ఇదియే శివస్వరూపము, ఇతడు సకలుడని, నిష్కలుడనియు, వేదమందు, రెండువిధములుగా చెప్పబడెను. ఇతనిని విష్ణువుగాని, బ్రహ్మగాని, సనత్కుమారులుగాని, నారదుడుగాని, వ్యాసపుత్రుడైన శుకుడు

గాని, వ్యాసుడుగాని, మునీశ్వరులుగాని, సకలసురులుగాని, వేదశాస్త్రంబులు గాని, ఈపరమాత్ముని తెలుసుకొనలేకుండిరి. ఇట్టివాడనగా సత్యజ్ఞానానంద స్వరూపుడు, అనంతుడు, సచ్చిదానంద స్వరూపుడు, నిర్గుణుడు నిరుపాధికుడు (శరీర రహితుడు) అవ్యయుడు, శుద్ధుడు, నిరంజనుడు, రక్తవర్ణుడుగాడు, పీతవర్ణుడును గాడు, శ్వేతవర్ణుడునుగాడు, నీలవర్ణుడునుగాడు. ఏవర్ణంబులు లేనివాడు.

శ్లో॥ నరక్తో నైవపీతశ్చ నశ్వేతో నీల ఏవచ
నహ్రస్వోనచదీర్ఘశ్చ నస్థూల సూక్ష్మ ఏవచ

శ్లో॥ యతోవాచో నివర్తంతే అప్రాప్యమనసాసః
తదేవపరమం ప్రోక్తం బ్రహ్మైవశివసంజ్ఞకం

హ్రస్వుడుగాడు, దీర్ఘుడుగాడు, స్థూలుడుగాడు, సూక్ష్ముడుగాడు, మనోవాగతీతుడు ఇట్టివాడే పరబ్రహ్మయని చెప్పబడుచుండెను. ఆకాశ మంతటను వ్యాపించినట్లుగా నాపరమాత్మ సర్వత్ర వ్యాపించియుండెను. ఇతడు మాయాతీతుడు, పరమాత్మస్వరూపుడు ద్వంద్వాతీతుడు మాత్సర్యరహితుడు. ఇట్టివానిని భక్తిచేతను సద్యఃమోక్షము పొందెదను ఇతనిని భజించిగాని సూక్ష్మబుద్ధిచేగాని అతని జ్ఞానముచే తెలిసికొనుట కష్టము. భజనముచే తెలిసికొనుట సుకరముగాన శివుని పూజించి యనాయాసముగా ముక్తి నొందవచ్చును. జ్ఞానమున్నను ముక్తికానేరదు. శివుడు భక్త్యధీనుడు అనేక మంది సిద్ధులు భక్తిచేతనే ముక్తినొందిరి. శంభుభక్తియే జ్ఞానమాత ఇది భుక్తిముక్తులనిచ్చును. ఇతని ప్రసాదముచే భక్తిప్రేమాంకుర లక్షణములన్నియు ఉద్భవించుచుండును. భక్తిసగుణ నిర్గుణరూపములతో యనేకవిధములుగా నొప్పుచున్నది. వాటిలో వేదసంబద్ధమైన భక్తిస్వాభావసిద్ధమై యుత్కృష్టమైనదియై యుండెను. వాటిలో నైష్ఠికభక్తి అనైష్ఠికభక్తి అని రెండువిధములు. వాటిలో నైష్ఠికభక్తి నానావిధంబులు అనైష్ఠికభక్తి ఒకవిధంబులును చెప్పబడెను. వాటినిగూర్చి విహితములనియు నవిహితములనియు బహువిధములుగా పండితులు చెప్పియుండిరి. వాటిభేదము లనేకములుగా నున్నవి గాన విస్తరించి చెప్పుటలేదు. ఈ రెండువిధముల భక్తిలక్షణములకు

యొకొక్కదానికి తొమ్మిదేసి యంగములుగలవు శివప్రసాదముచేగాని యవి సుకరముగా తెలియబడవు. భక్తికి జ్ఞానమునకు స్థానము వేరులేదు. ఒకదానికొకటికి అవినాభావసంబంధ మున్నది. భక్తిజ్ఞానవంతులు సర్వదా సుఖములనందెదరు. గాన వీటికెన్నడు భేదము కల్పింపరాదు భక్తిలేనివారి కెన్నడును విజ్ఞానము కలుగదు. శివభక్తిచే జ్ఞానోదయము త్వరితముగా జరుగును. గాన ముందుగా నీశ్వరభక్తి నలవరచుకొన వలయును. దానిచే సర్వము సిద్ధించుటలో సంశయము లేదు. మీా రడిగిన దంతయు చెప్పితిని. ఇది విన్నచో సర్వపాపములు హరించును.

శివ మహాపురాణమందలి కోటిరుద్రసంహితయందు
నలువదియొకటవ అధ్యాయము సంపూర్ణము

---

# నలువది రెండవ యధ్యాయము

## సగుణ నిర్గుణ నిరూపణము

ఓ సూతమహాఋషి! శివుడెవరు? విష్ణువెవరు, రుద్రుడెవరు, బ్రహ్మ ఎవరు, వీరిలో నిర్గుణుడెవరు? ఇవి యన్నియు విశదముగా దెల్పి మమ్ము సంశయరహితుల జేయుమని ఋషులు వాక్రుచ్చిన, సూతు డిట్లు చెప్ప దొడంగెను. ఎవ డాదియందు జనించెనో అట్టి శివుడు సద్గుణపరమాత్మస్వరూపుడని, వేద వేదాంత వేత్తలు జెప్పియుండిరి. ఇతనినుండి ప్రకృతిపురుషులు జనించి జలమందుండి తపము చేయుచుండిరి. జలమయమైన విశ్వమందు పంచక్రోశ విస్తీర్ణమైనదియు ప్రపంచ విఖ్యాతమైనది యగు కాశీపురి జనించెను. విష్ణువిది ఎరింగి మాయతో కూడుకొని ఆ జలమందె శయనించెను. జలమునందు శయనించెనుగాన నారాయణుడను పేరువచ్చెను. పురుషుడు నారాయణుడనియు ప్రకృతి నారాయణి అనియు చెప్పబడుచుండిరి. నారాయణుని నాభికమలము నుండి బ్రహ్మ యుద్భవించెను. ఇతడు తపంబుజేసి విష్ణువుని కనుగొనెను.

నేనే యధికుడనని వారివురకు వివాదము కాగా నా బ్రహ్మవిష్ణువులమధ్య నిర్గుణ స్వరూపుడగు శివుడు మహాదేవుడను పేరుతో నావిర్భవించి నేను బ్రహ్మలలాటమునుం డుద్భవించి రుద్రుడను పేరుతో నుండి లోకాను గ్రహాకారుడ నగుదు నని చెప్పెను. ఇతడు భక్తుడు ధ్యానించుటకై సగుణ నిర్గుణ రూపములు నందెను. ఇతడు భక్తవాత్సల్యము గలవాడు. శివుడు త్రిగుణాతీతుడు. రుద్రుడు త్రిగుణస్వరూపుడు భూషణములు వేరు గాని స్వర్ణమొక్కటే యగునట్లు పేరులేవేరుగాని శివరుద్రులకు భేదము లేదు. వీరువురు సమాన రూపవంతులు తమభక్తులకు సమానముగా కర్మఫలము లిచ్చుచుందురు. వీరుసమానముగా సేవింప నర్హులు. వీరు నానాలీలావిహారులు శివరూపుడు రౌద్రపరాక్రముడు నగునితడు భక్తరక్షణకు హరిబ్రహ్మల సహాయమునకు నుద్భవించెను. ఉద్భవించిన వారందరు క్రమానుసారముగా లయయందెదరు. రుద్రుడు మాత్రమట్లుగాక శివునియందే లయ మగుచుండును. విష్ణుబ్రహ్మాది దేవతలందరు రుద్రుని యందు లయమగుదురు. రుద్రుడు మాత్రము శివునియందే లమగునని శ్రుతిచెప్పెను. రుద్రుని సర్వులు భజింతురు. రుద్రుడు మాత్ర మెవ్వరిని భజింపక నాత్మస్వరూప మగు తన్నుతానె భజించుకొనును. ఇతరులను సేవించినవారు బహుకాలమునకు గాని రుద్రుని పొందలేరు. రుద్రుని భజించినవారు త్వరితముగా మోక్షము నొందెదరు. రుద్రభక్తులందరు శివనామోపాసకు లగుదురు. రుద్రునకితరాపేక్షలేదని శ్రుతులందు చెప్ప బడెను. అజ్ఞానముచే భగవంతునననేక విధములుగా దలచుచుండిరి. విజ్ఞులు భగవంతుని ఏకరూపునిగా భావించుచుండిరి. దీనిసగూర్చి విపులముగా చెప్పెదవినుము.

బ్రహ్మాది తృణపర్యంతము గోచరించిన వస్తువులెల్ల శివస్వరూపమని తెలిసికొనుము. అనేక విధములగు కల్పనలన్నియు మిథ్యయని తెలిసి కొనుము. సృష్టికి పూర్వమందున మధ్యయందున నంతమందున కూడ నీ శివుడు స్థిరుడై యుండును. సర్వము శూన్యమైనప్పుడుగూడా శివుడు నిలచి యుండునుగాన శివుడు చతుర్గుణుడని చెప్పబడెను. ఈమహాశక్తిమంతుడు

సగుణుడనియు నిర్గుణుడనియు చెప్పబడుచుండెను. ఇతడు సనాతనమైన వేదములన్నియు నిశ్వాసమున నొసంగెను. మరియు నుదాత్తా నుదాత్తస్వరితములతో వేదము విష్ణువునకుపదేశించెను. తన ధ్యానపూజావిధులన్నియు కూడ జెప్పెను. ఈశానుడు సర్వవిద్యాధిపతియని సనాతనశ్రుతులు చెప్పియుండెను. ఈశానశంభుడు, వేదకర్తయనియు, వేదపతియనియు చెప్పబడుచుండెను. ఈ శంకరుడు సర్వానుగ్రహకారకుడు అతడు కర్తయు, భర్తయు, హర్తయు అయివుండి సర్వసాక్షియై నిర్గుణుడై యుండెను. ఇతరులవలె నితనికి కాలమానము లేదు. మహాకాళి మహాకాళుడుకూడ నితని ఆశ్రయించియుందురు. ఇతడు కాలస్వరూపుడని చెప్పబడుచుండెను. ఇతనిలీలల చేతనె సర్వము చెప్పబడుచుండెను. ఇతనికి యుపాధిగాని, కర్తగాని, భర్తగాని లేదు. సర్వమునకు కారణుడు ఇతడే సర్వము చేయువాడు చేయించువాడు కూడ ఇతడే. ఏకుడుగాను అనేకుడుగాను కూడ ఇతడే యొప్పుచుండును. ఇతడు కార్యకాలస్వరూపుడు. ఇతనికి కారణుడెవ్వడును లేడు. ఒక్క బీజము మహావృక్షమై విస్తరిల్లి మరల బీజస్వరూపము నొందినట్లుగా ఇతడొక్కడే ప్రపంచస్వరూపుడై మరల ప్రళయసమయమున సర్వములయముచేసి తానొక్కడు బీజస్వరూపుడై నిలచియుండును. ఇట్టివాడే మహేశ్వరుడని చెప్పబడుచుండెను. శివుని యొక్క యథార్థరూపము జ్ఞానులువినా మరెవరును తెలిసికొనలేరన సూతుని మునులు జ్ఞానమన నెట్టిది? ఎట్టిజ్ఞానముచే శివుడు తెలియబడునో తెలుపుమని ఋషులు మరల ప్రశ్నించిరి.

శివ మహాపురాణము నందలి కోటిరుద్రసంహితయందు
నలుపది రెండవ అధ్యాయము సంపూర్ణము

---

# నలువది మూడవ యధ్యాయము

## జ్ఞాన నిరూపణ వర్ణనము.

ఋషులారా! అతిగుహ్యమైనదియు ఫలముగా ముక్తి నిచ్చునదియు నగు శివజ్ఞానము చెప్పెదవినుడు. కాణాద, నారద, సనత్ కుమార, వ్యాస, కపిలాది మహర్షు లందరు నొకచోటున గుమిగూడి శివజ్ఞాన మివ్విధంబున నిశ్చయించు కొనిరి. శివజ్ఞాన మన సర్వజగత్తు శివమయ మని తెలిసి కొనవలెను. శివుడు సర్వజ్ఞుడనియు సర్వమయుడనియు తెలిసి కొనవలెను. ఆబ్రహ్మ స్తంబపర్యంతము నేది కన్పించుచున్నదో యదియంతయు శివమయమని యెఱుంగ వలెను. ఇదియే శివస్వరూపము. తన ఇచ్ఛచే జగత్తును సృజించుచుండును. సర్వము పరమేశ్వరు డెరుంగును గాని, యాపరమేశ్వరు నెవరును తెలుసు కొనలేరు. ప్రతిసృష్టిజాలమందు తానుండి దూరస్థునివలె గోచరింపుచుండెను. అన్నిటియందును తానుండును. తనయందెవ్వరును ప్రవేశింపలేరు. అతడు దేనిసంబంధ నిర్లిప్తుడై ప్రకాశించుచుండును. రవిచంద్రాగ్నులు జలమందు ప్రతిబింబములుగా గోచరించి నట్లు తాను సాక్షిమాత్రుడై యుండి దేహసంబంధ సంకటములను ప్రకాశించుచుండును. జలమందు సూర్యుడు యథార్థముగా లేకున్నను నట్లు గోచరించినట్లు ఈశ్వరుడు సర్వత్రయున్నట్లు గోచరించుచుండును. అతడు యథార్థముగా నున్నట్లు ప్రకాశించుచుండును. తానొక్కడై యుండి యనేకులను ప్రకాశింప జేయును ననేకస్వరూపములుగా గోచరింపుచుండును. అజ్ఞానులు ఇదియెఱుంగక దైవమొక్కడే యని భావింపక యనేక దైవము లుండునని భావింతురు. జ్ఞానవంతులైనవారు భగవంతుడొక్కడేయని భావించును అనేక జలఘటములయం దనేక ప్రతిబింబములు గోచరింపగనే మతిభ్రమచే ననేక సూర్యులున్నారని యజ్ఞానులు తలచెదరు. వేదాంతులు పరమాత్ముడొక్కడేయనియు నద్వితీయుడు గాడనియు తెలుసుకొందురు. జీవులందరు పరమాత్ముని అంశచే జనించిరి గాని జీవులుమాత్ర మజ్ఞానముచే తాము పరమాత్మ సంతానమని భావింపరు. అవిద్యామోహితులై జీవపరమాత్మలకు భేదము కల్పించుచుందురు, కాని వారిరువురకు భేదము

లేదు శివుడు సర్వవ్యాపియై సర్వజంతువుల యందు వ్యాపించి యుండును. సకలచేతనాచేతనములయందు శివుడు స్థిరుడై వ్యాపించియుండెను. పండితులనేక యుపాయములు పన్ని తుదకు వేదాంతమార్గము నాశ్రయించి పరమాత్ముని దర్శింతురు. ప్రతి కాష్ఠమునందు నగ్ని యున్నప్పటికిని ప్రయత్నముచే మధించినగాని యా యగ్ని బయటకు రానట్లు శివుడు అందరి యందున నివసించినను భక్తిజ్ఞాన వైరాగ్యములచే గాని గోచరింపడు. యన్నిటి యందు శివుడేగాని మరియన్యుడు లేడని భావించినచో తప్పక నతడు గోచరించును. ఇతడు నానారూపములుగా ప్రకాశించుచుండును. జలము, మృత్తిక స్వర్ణము ఉపాధిభేదములచే నానాత్వమును పొందినట్లు శివుడుగూడ దేహభేదములచే నానాత్వముగా గోచరింపుచుండును. యథార్థముగా కార్యకారణములకు భేదములేదు. భ్రాంతిచే భేదము కల్పించుచుందురు. భ్రాంతినశించినచో యథార్థము గోచరమగును. బీజము వృక్షమై అనేకవిధములు వ్యాపించి తుదకు వృక్షము నశించి బీజమై శేషించునట్లు దేహములన్నియు నశించి చివరకు పరమాత్మయొక్కడే శేషించియుండును, జ్ఞానియగువాడు సంసారబీజమును నాటి వృక్షము ఫలింపకుండునట్లు విరక్తుడై బీజమును నశింపచేయును, సర్వము శివుడే, వీటిలో భేదములేదు. ఒక్క సూర్యుడనేక ఘటజలాశయములలో ప్రకాశించునట్లు శివుడు సర్వవస్తువులయందు ప్రకాశించును, గగనసూర్యుడందరకు గోచరింపుచు నెవ్వరకు నందనట్లు భగవంతుడంతట నుండియు నెవ్వరకు లభ్యుడుగాడు. స్పృశింపబడడు, దేనికి బద్ధుడుగాడు, జీవు లహంకారయుక్తులు, పరమాత్మ డహంకార రహితుడు, జీవులు తుచ్ఛకర్మభోగులు. పరమాత్ముడు నిర్లిప్తుడు(దేనిని యంటనివాడు) స్వర్ణమందు రజతము కలిసినచో, సువర్ణము కాంతి తగ్గినట్లు జీవు డహంకారయుక్తుడైనచో నతని యందలి మహిమ తగ్గు. స్వర్ణమునందు మూల్యమును తగ్గును. కట్టీబంగారము పుటము పెట్టినచో మాలిన్యముపోయి మేలిమియై యథాప్రకార మూల్యము వచ్చునట్లే యహంకారముతోగూడిన జీవుడు సంస్కారముల చే పరిశుద్ధి నొందమూల్య వంతుడగును పరిశుద్ధుడగుటకు భక్తితో సద్గురువు నాశ్రయించి యతడే శివస్వరూపుడని భావించి ధ్యానించి, యాతనిపదము లాశ్రయించి, పూజించి, స్మరింపు చున్నచో, తన దేహ

మందలి సర్వపాపమలంబులు నశించి, యజ్ఞాన మంతరించి జ్ఞానవంతు డగును. జీవునహంకారము తొలిగినంతనే నిర్మలుడై బుద్ధిమంతుడగును. గురుప్రసాదముచే శంకరభక్తి కల్గును. శివప్రసాదముచే శివానుగ్రహము కల్గును. దర్పణమాలిన్యము పోయినచో తన ముఖము స్వచ్ఛముగ కన బడినట్లు మనోమాలిన్యము నశించినచో స్వచ్ఛమగు పరమేశ్వరుని గోచ రించును. ఇట్టివాడు జీవన్ముక్తుడై శరీరము శిథిలము కాగనే శివుని యం దైక్యమొందును. ప్రారబ్ధవశముచే శరీరము లభించి జ్ఞానవంతుడైనచో మరల శరీరమును పొందడు. సుఖములు కలిగినపుడు సంతసించుట, కష్ట ములు కలిగినపుడు దుఃఖించుట లేనివాడు జ్ఞానియని చెప్పబడు చున్నాడు. ద్వంద్వములు సహించువాడే జ్ఞానియని చెప్పబడు చున్నాడు. అష్టాంగయో గము చేతగాని, తత్వయోగము చేతగాని, వివేకముచే గాని ముక్తినొందగలరు. భక్తిచే జ్ఞానమూల మగు నధ్యాత్మ తత్వము నొందగలరు. భక్తిచే భగవంతుని యందు ప్రేమ, ప్రేమచే భగవత్కథలు వినుట, వినుటచే సత్సాంగత్యము, సత్సాంగత్యముచే సద్గురువు, గురువుచే జ్ఞానము, జ్ఞానముచే ముక్తి లభించును. కేవలము శివుని భజించు వాడుకూడ నిట్టి జ్ఞానవంతుడగును. అనన్యభక్తితో శివునిభజించిన వారలకంతము న వశ్యము ముక్తిలభించును. ముక్తిపొందినచో నికకోరవలసిన దేమున్నది? ఈశ్వరుని శరణు పొందినచో భవబంధ విముక్తుడగు నని ఋషులందఱు సమావేశమై ముచ్చటించు కొనిరి.

ఈ శివజ్ఞానము ప్రప్రథమంబున శివుడు విష్ణువున కిచ్చియుండెను. విష్ణువు బ్రహ్మ కిచ్చియుండెను. బ్రహ్మ సనకాదులకు, సనకాదులు నారదునకు, నార దుడు వ్యాసునకు, వ్యాసుడు నాకు నిచ్చియుండెను. నేను లోకహితమున్నకై మీకు చెప్పియుంటిని. ఈవిజ్ఞానము మీరు సర్వులకు తెలియజేయుడు. మీ రడిగినదంతయు పూర్తిగా చెప్పితిని. దీనిని గోప్యముగ నుంచి సత్పురుషులకు మాత్రము చెప్పవలయు నన, ఋషులు సూతవాక్కులు విని హర్షగద్గద వాక్కులతో సూతుని ప్రశ్నించుచు వ్యాసశిష్యుడవు, శైవసత్తముడవు నగు నోసూతమహర్షి! నీవు ధన్యుడవు. పరవస్తు వగు శివజ్ఞాన మంతయు మాకు దెల్పితివి. నీకృపచే మాసర్వభ్రాంతులు నశించెను. ముక్తిప్రదమగు శివజ్ఞాన

మును విని మే మందఱము సంతోషించితి మన, సూతు డిట్లుపలికెను. ఇది నాస్తికులకు, శ్రద్ధలేనివారికి, మూర్ఖులకు, భక్తిలేనివారికి, వినిపింపరాదు. ఇతిహాసపురాణ వేదశాస్త్రసార మంతయు గ్రహించి వ్యాసుడు నాకు వినిపించి యుండ, నిదంతయు మీకు జెప్పితిని. ఇది యొకసారి విన్నచో, సర్వపాపములు భస్మమై భక్తి యభివృద్ధి యగును. అభక్తుడు భక్తు డగును. ఇది రెండుసార్లు విన్నచో దృఢభక్తి కల్గును. మరొకసారి విన్నచో ముక్తి కల్గును. ఇది ఐదుసార్లు పఠించినచో కోరినకోరిక లన్నియు సిద్ధించు నని వ్యాసుడు చెప్పియుండెను. ఇదివిన్న వారికి లభ్యము కాని దేదియు నుండదు. ఇది ఐదుసార్లు పఠించినచో కోరినకోరికలన్నియు సిద్ధించు నని వ్యాసుడు చెప్పియుండెను. ఇది ఐదుసార్లు పఠించినచో ప్రత్యక్ష శివదర్శనము కల్గును. పూర్వము చాతుర్వర్ణంబులవారు దీని నైదుసార్లు పఠించి సర్వసిద్ధుల నొంది యంతమున శివసాయుజ్యము నొందిరి. ఇది భక్తితో విన్న వారలు, విజ్ఞానవంతులై భుక్తిముక్తుల నొందెద రని సూతుడు పలికెను. ఋషు లందఱు పరమానందభరితులై యనేకవస్తువులచే నతనిని పూజించి, నమస్కరించి, స్వస్తివాచనపూర్వకముగ స్తుతించి సంశయరహితు లై, ప్రశాంతు లై, యొకరి కొకరు చెప్పికొనుచు శంకరుడె పరమదైవ మని నమస్కరించి పూజించి కొలుచుచుండిరి. మోక్షమగు శివజ్ఞాన మన నిదియే. ఇది భుక్తిముక్తిప్రదమై శివభక్తివర్ధకమై యున్నది. ఈ కోటిరుద్రసంహిత యత్యంతపుణ్యప్రదమైనది. దీనితో నాలుగు సంహిత లైనవి. ఈసంహిత సమాహితచిత్తులై విన్నవారు ఇహమందు సర్వసౌఖ్యములు సర్వభోగములు ననుభవించి పరమందు కైవల్యము నొందెదరు.

కోటిరుద్రసంహితయందు నలుబదిమూడవాధ్యాయము సంపూర్ణము

గద్యము

శ్రీవత్సగోత్రపవిత్ర యేలూరుపాటి నృసింహసర్వతోముఖయాజి ధర్మ
పత్నియు చావల్యోపనామక యజ్ఞేశ్వర సోమయాజ్యన్నపూర్ణాదంపతుల
గర్భశుక్తిముక్తాఫలమునునగు శ్రీమతి యేలూరిపాటిలక్ష్మీసరస్వతిచే
నాంధ్రీకరింపబడిన శ్రీశివమహాపురాణమందలి కోటిరుద్రసంహిత

సమాప్తము

శ్రీసాంబసదాశివార్పణమస్తు

శ్రీగణేశాయ నమః

# ఆంధ్రవచన శివ మహాపురాణము

## ఒకటవ యధ్యాయము

## ఉమాసంహిత ప్రారంభము

ధ్యానం

శ్లో॥ యో ధత్తే భువనాని సప్తగుణవాన్ స్రష్టా రజస్సంశ్రయాత్
సంహర్తా తమసాన్వితో గుణవతీం మాయామతీత్య స్థితః
సత్యానంద మనంతబోధ మమలం బ్రహ్మాదిసంజ్ఞాస్పదం
నిత్యంసత్త్వసమన్వయాదధిగతం పూర్ణంశివంధీమహి.

ఎవడు సత్త్వగుణముచే సప్తభువనములు ధరించి పాలించుచుండెనో, రజోగుణముచే సృజించుచుండెనో. తమోగుణముచే సంహరించుచుండెనో, యెవడు మాయాత్రిగుణములను అతిక్రమించెనో, యెవడు సత్యానందానంత బోధస్వరూపుడో, యెవడు స్వచ్ఛమైనవాడో, యెవడు త్రిమూర్తిస్వరూపుడో, సత్త్వము నాశ్రయించిన యధికుడెవడో, యట్టిపరిపూర్ణుడగుశివుని ధ్యానించుచుంటిని.

### కృష్ణోపమన్యుల సంవాదము

ఓసూతమహర్షీ! నీకు నమస్కారము, నీచే నాల్గవదియైన కోటిరుద్ర సంహితను వింటిమి. ఇప్పుడు నానాఖ్యానసమన్వితంబైనదియు, పర మాశ్చర్యమైన సాంబశివుని చరిత్రము గల ఉమాసంహితను మాకు విని పింపు మన, సూతుడు మహానందభరితుడై యిట్లనెను. శౌనకాదిఋషులారా! భుక్తిముక్తిప్రదంబగు శివచరిత్ర చెప్పెద వినుడు మీరు పుణ్యప్రదమగు ప్రశ్న వేసితిరి. పూర్వము సనత్కుమారుడు వ్యాసునకెట్లు చెప్పెనో యట్లు చెప్పెదవినుడు సనత్కుమారుడు ఇట్లుచెప్పదొడంగెను. ఉపమన్యుడు శ్రీకృష్ణునకుచెప్పిన విధానమంతయు చెప్పెదవినుడు. పూర్వము వసుదేవ

పుత్రుడగు శ్రీకృష్ణుడు పుత్రార్థియై, శివాలయమగు కైలాసపర్వతము కడ కేగి, ఆనగశిఖరంబుపై తపంబు చేయుచున్న యుపమన్యునిగాంచి, భక్తితో నమస్కరించి, కృతాంజలిపుటుడై ఇట్లు పల్కెను. మహాప్రాజ్ఞుడవు శైవప్రవరుడవు. బుద్ధిమంతుడవు నగునో యుపమన్యూ! నేను పుత్రార్థినై యీ గిరియందు తపమాచరింపవచ్చితిని. సదానందకరమగు శంకరమాహాత్మ్యము నాకు జెప్పుము. నేనిది విని భక్తితో శంకరునిగూర్చి తపంబుచేసెదనన, నుపమన్యుడు వాసుదేవవాక్కులువిని, శివుని స్మరించి, ఓశైవభక్తుడా! మహేశ్వరుని మహిమ జెప్పెదవినుము. భక్తివర్ధనమైనదియు, నుత్తమంబైనదియు నగు, నేనుగాంచిన శంకరస్వరూపము చెప్పెదవినుము. నేనుతపంబు చేయుచుండగ నాయుధములతో గూడిన శంకరునిగాంచితిని. అతనిగణము లన్నియు నతని పరివేష్టించియుండిరి. విష్ణ్వాది దేవతలందఱు నతనిని సేవించుచుండిరి. మఱియు నతడు సత్వరజస్తమోగుణంబులచే శోభించుచు నిత్యసుఖదాయకుడై, యవ్యయుడై, యేకపాదుడై, మహాదంష్ట్రుడై, జ్వాలాముఖుడై, ద్విసహస్రకిరణంబులుగలిగి, జ్యోతిస్సులచే ప్రకాశింపుచు, సర్వాస్త్రశస్త్రనిపుణుడై, యనేక నేత్రంబులుకల్గి, యనేకపాదంబులుకల్గి, కల్పాంత మందు విశ్వమంతయు మారింపజేయుచు, త్రిలోకమందలి చరాచరంబులకు వధ్యుడుగాక, మరల త్రిలోకముల సృజింపుచు ప్రళయకాలమునందీసృష్టినంతను నశింపజేయుచుండును. ఇట్టి రుద్రుని గూర్చి నేను తపంబు జేయుచుండ నతడు నాకు ప్రత్యక్షమయ్యెను. నేను సంతసంబున గాంచుచు నతనికడ నొక దివ్యాస్త్రముగాంచితిని. అది చాలగోప్యమైనది. దానితో తుల్యమైనదికాని, యధికమైనదికాని మరియొకటిలేదు. దానిని శూలమందురు. ఇది ధరించుటచే శంకరుడు శూలియని పేరు నొందెను. ఇదిసకలశస్త్రాస్త్రములను నశింపజేయునుగాన, దానికి విజయాస్త్రమని పేరు. మఱియు నిది సమస్తభూమండలమును, ఛేదించును. సర్వజలధులను, శోషింపజేయును. సర్వతారాగణములను నేలబడవైచును. దానిచే నతిబలవంతులగు యవనాశ్వుడు, మాంధాత, కొట్టబడిరి. వారిరువురు త్రైలోక్య విజయము నొందిన చక్రవర్తులు. దర్పావిష్టులగు హయహయుడు, లవణాసురుడు, దానిచే మడసిరి. వారిరువురను శత్రుఘ్నుడు సంహారించిన పిదప, శూలము

ఈశ్వరుని హస్తమందు చేరెను. ఆ త్రిశూలాగ్రమతి భయంకరమైనది. ఆశూలము త్రిశిఖరంబులుగల్గి, యీశ్వరుని మూడుకనుబొమ్మలా యనునట్లుండి భయపెట్టుచు, ధూమసహితాగ్నివలె ప్రకాశింపుచు, బాలసూర్య ప్రకాశమానమై, యదృశ్యమగుచుపూర్వ హస్తంబువలెను, యంతకుని హస్తమందున్న పాశమువలెను గోచరింపుచు, తీక్ష్ణధారలుగల్గి, సర్వవిభూషితమై, కల్పాగ్నివలె ప్రకాశింపుచు, పౌరుషముగలదై, క్షత్రియాంతకుడగు భార్గవునివలె ప్రకాశింపుచుండెను. పూర్వము పరశురాముడు శివునిచే పరశువును గ్రహించి బలవంతుడై యిరువదియొక్కమారు క్షత్రియులందఱిని ఛేదించెను. మఱియు శివుని హస్తమందు సుదర్శనచక్రమును గాంచితిని. అది సహస్రముఖంబులుగల్గి ద్విసహస్ర భుజంబులుగల్గి పురుషాకృతి గల్గి రెండువేల నేత్రంబులుగల్గి, దీప్తివంతమైన సహస్రపాదంబులు గల్గి, కోటిసూర్యప్రతీకాశమై, త్రిలోకములు దహించు సమర్థతగలదై, కఠినమై, మహోజ్జ్వలమై, యతితీక్ష్ణమై, శతపర్వంబులుగల్గి, పినాకమను మహాధనువును, మహాద్యుతికరంబగు నంబులపొదియు, శక్తిఖడ్గపాశంబులు, మహాతీక్ష్ణమగు నంకుశంబును, గొప్పదగు గదను, దివ్యములగు నితరాస్త్రములును. లోకపాలురపద్దనున్న సకలాస్త్రంబులును, ధరించి యుండెను. నే నివన్నియు సుదర్శనచక్రమందు జూడగల్గితిని. కుడిభాగమున లోకపితామహుడగు బ్రహ్మ, మనోహరమగు హంసవిమానారూఢుడై యుండెను. ఎడమ పార్శ్వమున విష్ణువు శంఖచక్రగదాధారుడై, గరుడారూఢుడై యుండెను. స్వాయంభువాదిమనువులు భృగ్వాదిమహర్షులు, శక్రాది దేవతలు, మయూరారూఢుడై శక్త్యాయుధమును ధరించిన స్కందుడు మొదలగువారందఱు శంకరుని పరివేష్టించి యుండ, నతడు ఉమాసహితుడై, యగ్నివలె ప్రకాశింపుచుండెను. నందీశ్వరుడు శూలహస్తుడై యీశ్వరుని పురోభాగమున నుండెను. సకలభూతగణంబులు సకలమాతృగణంబులు పరమేశ్వరుని సేవించుచు, నమస్కరించుచు, పరివేష్టించి యుండిరి. సురులందఱు నీశ్వరుని స్తోత్రములు చేయుచుండిరి. జగత్తునందేది చూడబడుచున్నదో, యేది వినబడుచున్నదో, యదియంతయు, నీభగవంతునియందు చూడబడుచుండెను. నే నతివిస్మయముతో భగవంతుని పార్శ్వమందుండి యిదంతయు గాంచుచు ధైర్యమూని, చేతులుజోడించి యనేకవిధంబుల స్తుతించితిని. పర

మానందభరితుడనైతిని. నేనా యీశ్వరుని సమ్ముఖమందున నిలబడి, బాష్ప గద్గదవాక్కులతో స్తుతించి, శ్రద్ధాభక్తులతో పూజించితిని. శంకరుడతి ప్రసన్నుడై నన్ను గాంచి మందహాసముచేయుచు, ఓ ఉపమన్యూ! నీవు నాపరీక్షకు చలింపకుండ నాగితివి. నీ దృఢభక్తిని నేను మెచ్చితిని. నేను సంతసించితిని గాన నీయభీష్టవరములు కోరుము. దేవతాదుర్లభమగు వరంబు నీకిచ్చెదను. నే నీయలేని దేనియు లేదన, భక్తానుకంపుడగు దేవదేవుని వాక్కులువిని, నమస్కరించి యిట్లు పలికితిని. ఓ దేవదేవా! నీవు సంతసించితివేని, నీ యందు నాకు దృఢభక్తి యుండునట్లు, నిత్యము త్రికాలజ్ఞానము, నీయందచంచల భక్తియునిచ్చి నాబంధువులకందరకు, పాలు, పలు మృష్టాన్నములు సమృద్ధికరముగనుండునట్లు చేయుము. నా యాశ్రమము సమీపంబున, నీవు సపరివారముగ నుండుము. సదా భక్తులతో సహవాసములు గల్గునట్లు చేయుమన, శంకరుడు నాపలుకులువిని, నన్ను కృపతో గాంచి నవ్వుచు ఓ యుపమన్యూ! నీవు జరామరణంబులు లేకుండ, కోరుట మరచితివి. నీవు జరామరణంబులు లేకుండ సర్వకామ్యములనుభవించెదవు. నీవు మునులచే పూజింపబడుచు, యశోధనసమన్వితుడవై నా ప్రసాదమునచే నుండగలవు. ఇంకను శీలరూపగుణైశ్వర్యంబులచే నొప్పుచుందువు. నీసమీపమున క్షీరోదసాగరంబు లుండగలవు. నీవెచ్చోటకేగినను నది యచ్చటనే యుండును. అవన్నియు నమృతమయమై యుండును. నీవు వైవస్వతమన్వంతరము వరకు నీబంధువులతో సహా జీవింపగలవు. నీవంశము వృద్ధినొందుచుండును. నీయాశ్రమ సమీపంబున నేనుండెదను. నీకు నాయందచంచలభక్తియుండును. నేను సదా దర్శనమిచ్చుచుందును. నీవు నాకత్యంత ప్రియుడవు. సమస్తములగు భోగములననుభవింప గలవు. నీకు దుఃఖమన్నదిలేదు. నీవు కోరినవన్నియు సఫలమగునని సూర్యకోటి సమప్రభుడైన శంకరుడు నాకీవరంబులిచ్చి యదృశ్యుడయ్యెను. ఓ కృష్ణా! నేనిటనుంటిని గాన దేవదేవుడగు శంకరుడు, పరివార సహితముగ, నిక్కడనే యుండెను. ఈశ్వరుడు చెప్పిన దంతయు నీకు జెప్పితిని. శంకరుడిక్కడ సమాధియందుండెను. గంధర్వాప్సరస లందరును వానిని ప్రత్యక్షముగ గాంచు చుండిరి.

దిరో చెప్పుమన నుపమన్యుడిట్లు చెప్పదొడంగెను. ఓయదుశ్రేష్ఠా! భవారాధనచే నెవరెవరికెట్టి ఫలము ప్రాప్తించెనో చెప్పెద వినుము.

పూర్వము హిరణ్యకశిపుడు పదిలక్షల సంవత్సరంబులు తపముచే శివుని మెప్పించి, సురులను, వారిరాజ్యములను స్వాధీనముచేసి కొనెను. ఇతని పుత్రుడగు నందనుడు శివుని గూర్చి తపంబుచేసి పదివేల సంవత్సరములు దేవేంద్రుని యధోగతిపాలుచేసి, చివరకు విష్ణుచక్రముచేతను, ఇంద్రుని వజ్రాయుధముచేతను రణమం దితని శరీరము విదీర్ణము గాకుండెను. ఇతని శివభక్తిచే శస్త్రము లేవియు నితని యంగములు చీల్చలేకున్నవి. ఇతడు వరప్రభావముచే, సురాసురు లందఱిని జయించెను, ఇతని తపంబునకు మెచ్చి ఒక లక్షసంవత్సరములు ముల్లోక రాజ్యాధిపత్యమునిచ్చి, పదివేలమంది పుత్రులనిచ్చి, నాయనుచరులలో నొకడవై యుందువని కూడ శివుడు వరమిచ్చెను. ఢుండను కుశద్వీపమంతయు రాజధానిగజేసికొని రాజ్యము పాలింపుమనికూడ జెప్పెను.

శతముఖుడనెడి రాక్షసుడు శివునిగురించి నూరుసహస్రములు తపముచేసి శతపుత్రుల బడసెను, యాజ్ఞవల్క్యుడు శివునారాధించి యుత్తమ జ్ఞానము నొందెను. వేదవ్యాసుడు శివునారాధించి త్రికాలజ్ఞానము నొందెను. వాలఖిల్యాదులు శక్రునిచే తిరస్కరింపబడి యీశ్వర ప్రసాదమునుచే నమృతహర్తయగు గరుత్మంతు నాశ్రయించి యాతనిచే యొక్కడ సుకరములు లేకుండ జేసిరి. అత్రియనసూయలు మూసలక్షేత్రమునందు మూడువేల సంవత్సరంబులు శర్వునిగూర్చి తపంబుచేసి, దత్తాత్రేయుడు, చంద్రుడు, దూర్వాసుడు నను పుత్రత్రయమును బడసిరి, అనసూయ శివారాధన చేసి, చిత్రకూటమందు గంగను ప్రవహింపజేసెను, విదర్భుడు మహాదేవుని మెప్పించి యనేకసిద్ధుల నొందెను. చిత్రసేనుడు శివు నారాధించి రాజుల వలన భయము పోగొట్టుకొనెను. శ్రీకరుడను గోపికాకుమారుడు రాజు చేయు శివపూజను గాంచి, తాను శివభక్తుడై, శివు నారాధించి గొప్పసిద్ధుల నొందెను.

సీమంతినీ భర్తయగు చంద్రాంగద మహారాజు యమునా నది యందు మునిగిపోయి మృతుడుగాక శివానుగ్రహముచే జీవించి పాతాళ

మందున్న శక్తు కాలయమున కేగి యతనితో సఖ్యముచేసి నానార్థ సమన్వితుడై వ్యాఖ్యానముచేసుకొనెను.

ఇతని భార్యయగు సీమంతిని సోమవార వ్రతముచేసి సర్వసౌభాగ్యముల నొందెను. ఒక బ్రాహ్మణుడు స్త్రీరూపము ధరించి సోమవార వ్రతముచేయు సీమంతిని కడకు ముత్తయిదువుగా జని వాయినమును స్వీకరింప, శివప్రభావముచే నా స్త్రీత్వము స్థిరమైపోయెను. చంచుకయనెడు విప్ర స్త్రీ వ్యభిచారిణియై యుండి గోకర్ణక్షేత్రమున కేగి, నొకవిప్రుని వలన శివగాథలువిని, శివభక్తిగల్గి శివలోకమేగెను. ఈమెభర్తయగు బిందుగుడు శివచరిత్ర విని సద్గతినొందెను. పింగళ యనెడు వేశ్య శివభక్తిచే సద్గతినొందెను. కైకేయి సాదరా, యనెడు విప్రకన్యకలు, శివవ్రతములుచేసి, సకలసిద్ధులు బడసి కైవల్యము నొందిరి. విమర్షణు డనెడి నృపుడు, మహాపాపియై, ఖలుడై బహుస్త్రీలంపటుడై యున్నను శివునారాధించుటచే సద్గతినొందెను, శబరుడు భస్మరుద్రాక్షలు ధరించి భార్యతో శివారాధనచేసి, యుక్తమగతి నొందెను. సౌమిని యనెడు చండాల స్త్రీ యజ్ఞానముచే శివునిపూజించి సద్గతినొందెను. మహాకాలుడనెడి కిరాతుడు, క్రూరకర్మలు చేయుచు, జీవహింసలుచేయుచు శివపూజచేసి శ్రేష్ఠగతి నొందెను. దూర్వాసుడు శివానుగ్రహముచే శివభక్తిని ప్రపంచ మంతటను చాటెను, విశ్వామిత్రుడు శివునిగురించి తపంబుచేసి బ్రహ్మర్షి యనియు, అపరబ్రహ్మయనియు పేరొందెను. బ్రహ్మశివునారాధించి సృష్టికర్తయయ్యెను. మార్కండేయుడు శివునారాధించి, చిరజీవి యయ్యెను, దేవేంద్రుడు శివునారాధించి సర్వదేవతలకు ప్రభు వయ్యెను, బలపుత్రుడగు బాణుడు, శివారాధనచే బ్రహ్మాండ నాయకుడై సకలేశ్వరుడయ్యెను, విష్ణువు, రాముడు, దధీచి, కాణాదుడు, భార్గవుడు, బృహస్పతి, గౌతముడు, ఇంకను యనేకరాజులు శివారాధనలచే బలవీర్య తేజోవంతులైరి, శంసితాత్ముడగు శాకల్యుడు తొమ్మిదివేల శతవర్షంబులు శివునారాధించి మనోయజ్ఞముచే శివుని ధ్యానింప నతడు సంతసించి, నీవు గొప్ప గ్రంథకర్త వగుదువు. నీ కీర్తి ముల్లోకములయందు వ్యాపించును. నీకుల మక్షయమై ఋషులలో నలంకారమై

యుండును. ఇంకను నీవు సూత్రకారుడవై యుందువని శంకరుడు వరం బులిచ్చెను. ఓకృష్ణా యతడిట్టి వరంబులుపొంది త్రిలోక పూజ్యుడయ్యెను కృతయుగంబున, సావర్ణియను వసువదివేల నూరువర్షంబులు, శివునారాధింప నతడు సంతుష్టుడై శివుడతని నిం-ంచి ఓయనఘా! నీతపంబునకు మెచ్చి తిని, నీవు లోక ప్రసిద్ధమగు గ్రంథకర్తవై, జరామరణములు లేకయుందువు. ఇవ్విధంబున వారి పూర్వ పుణ్యముల ననుసరించి తగిన ఫలములొసంగుచుండెను. భగవంతుడగు శివుని గుణంబు లొక్క ముఖంబుగల నేనేమి వర్ణింపగల్గుదును. శతవర్షంబులు వర్ణించినను, సమర్థుడనుగాను.

శివ మహాపురాణము నందలి ఉమాసంహిత యందు
రెండవ అధ్యాయము ముగిసెను

---

## మూడవ యధ్యాయము

### శ్రీకృష్ణునకు శివదర్శనము - వరప్రాప్తి

కృష్ణు డుపమన్యువాక్యము లు విని విస్మితుడై, శాంతచిత్తుడై యుపమన్యూ! నీవుధన్యుడవు. నిన్నెవడు స్తుతింపగలడు? దేవదేవుడగు శంకరుని, నీసాన్నిధ్యమందు నిల్పుకొంటివి, నీవుసదాయీశ్వరుని దర్శింపుచుంటివి. నీవు నాయందు దయయుంచి ఈశ్వరుడు నాకుదర్శనమిచ్చు నట్లుచేయుమన నోపురుషోత్తమా! నీకచిరకాలమందే, శివదర్శనము లభించును. నీకిటుపై పదహారు మాసములలో శివదర్శనము కాగలదు. అపుడు నీవతనిచే వరములు బడయ దేవతాప్రశంసనీయుడవు, పూజనీయుడవునగు నీకుమంత్రోపదేశముచేసెదను. శ్రద్ధాభక్తులతో వినుము. నీవాజపప్రభావముచే, శంకరునిచూడ గలవు. నీవతనికృపచే నాత్మతుల్య బలుడగు తనయునిపొందగలవు. మంత్ర రాజమగు నమఃశివాయ యనుపంచాక్షరిని జపింపుము. ఇదిసర్వకామప్రదమై భుక్తిముక్తిదాయకమై యుండునని, మంత్రోపదేశమునుగురించి యివ్విధంబున కృష్ణోపమన్యులు సంభాషించుచుండ నెనిమిది దినములొక క్షణ

ముగా గడచెను. తొమ్మిదవ దినమందు పమన్యుడు శ్రీకృష్ణున కధరోపనిష త్తునందలి శివమహామంత్ర దీక్ష నిచ్చెను.

కృష్ణుడు దీక్ష వహించి జటాధరుడై సమాహితచిత్తుడై, పాదాంగుష్ఠమునందు నిలబడి, యూర్ధ్వబాహుడై, తపంబు చేయుచుండ పదహారవ మాసము వచ్చుసరికి శంకరుడు ప్రసన్నుడై గణపరివృతుడై కృష్ణుని యెదుట సాక్షాత్కరింప, పార్వతీసహితుడు, దేవదేవుడు, త్రినేత్రుడు, చంద్రశేఖరుడు, బ్రహ్మాదులచే స్తుతింపబడెడువాడు, సిద్ధకోట్లచేపూజింపబడెడువాడు, దివ్యమాల్యాంబరధరుడు, సురసేవితుడు, నానాభూషణభూషితుడు, సర్వైశ్వర్యమయుడు మనోహరుడు, మహేశుడు, అజుడు, అవ్యయుడు, నానాగణాన్వితుడు, పురితుష్టుడును కుమారగణపతి సంయుతుడు నగు పరమేశ్వరునిగాంచి, సంతసించి, నమస్కరించి, విస్మయోత్ఫుల్లనయనుడై, సాష్టాంగదండప్రణామంబుంచి, నానావిధస్తుతిమయవాఙ్మయంబులచే స్తుతించి, యర్చించి, నతకంధరుడై, సహస్రనామంబులచేస్తుతింప, దేవగంధర్వవిద్యాధర మహోరగులు బాగుబాగని ప్రశంసించి కుసుమవృష్టికురిపించిరి. శంకరుడు కృష్ణస్తుతులకు సంతసించి, కృష్ణా! నీవునాయందు దృఢభక్తిగలవాడవని, నిన్ను నే నెఱుంగుదును. నీకు త్రైలోక్యదుర్లభంగు వరంబిచ్చెద కోరుకొమ్మన, కృష్ణుడు శంకరవాక్కులువిని సంతసించి, యాదరంబున నమస్కరించి, ఓ దేవదేవ, మహాదేవ, నిన్ను యెనిమిదివరములు కోరదలచితిని. అ వేమన శివధర్మములందు మఱియు, స్థిరమగు యశంబు, నీసారూప్యము, నిరంతరమునిమందు స్థిరభక్తి, బలవంతులు, సంగ్రామవిజయులు నాయందభిమానులు, నాశత్రువుల నశింపజేయువారు నాపదిమంది పట్టపురాణుల యందు, ఒక్కొకరికి పదుగురు చొప్పున పుత్రులు నాకుదృవింపవలెను. దురభిమానులగు నాశత్రువులునశింపవలెను. శత్రువులచే నేనెన్నడు తిరస్కరింపబడకుండుట, సర్వయోగులకు నేను ప్రభుడనై యుండుట నను నీయష్టవరంబులనిమ్ము. ఓ దేవదేవ, నీవు సర్వులకు ప్రభుడవు. నాకీవరంబు లిమ్మన.

అట్లే యిచ్చెదనని శంకరుడు పలికి నీకు సాంబుడనెడి మహాబలవంతుడు పుత్రుడై జనింపగలడు, అతడు ప్రళయాదిత్య సంకాశుడై యుండును, కాని

యశోదకు మునులచే శపింప బడును, నీవు మనుజుడవై జనించితివి గాన, ఆశాప మునకు నీవుకూడ గురియగుదువని, శంకరుడు బలుక శ్రీకృష్ణుడిట్టివరంబుల నొంది శంకరు ననేక విధంబుల స్తుతింప శంకరుడు సంతసించెను పార్వతి కూడ కృష్ణస్తుతులకు సంతసించి, ఓకృష్ణా! నీకు భువి దుర్లభము లగు వరము లిచ్చెదను కోరుకొమ్మన భక్తితో కృష్ణు డిట్లు పల్కెను.

ఓదేవీ నీవు నాయందు ప్రసన్నవైతివేని నాకెన్నడు బ్రాహ్మణ ద్వేషము గల్గింపకుము. నేను విప్రపూజలు చేయుచుండ వలెను. నావంశీయు లందరకు నీవుదర్శన మిచ్చుచుండవలెను. మాదంపతులు నాయందు ప్రసన్నులై యుండవలెను, సర్వభూతములు నాకనుకూలముగ నుండి నేనెచటి కేగినను, నన్ను పూజింపుచుండ వలెను. నేను శతక్రతువులు చేసి దేవతలను తృప్తిపరుప వలయును, నేను వేలకొలది నతిథులను సర్వదా యర్చించుచుండ వలెను. నేను నాగృహమందు బంధువులతో నిత్యము షడ్రసోపేతాన్న భోజనములు చేయుచుండవలెను. నే ననేక వేల నారీమణులకు భర్తనై యుండి వారల యందు క్షీణింపని ప్రేమానురాగము లుండవలయును, వారితండ్రులందరు సత్యవాదు లైయుండవలయునని పార్వతిని కోరగా నామె కృష్ణవాక్యములు విని విస్మితురాలై నీవు కోరినవన్నియు నిచ్చెదనని బల్కె పార్వతీ పరమేశ్వరు లదృశ్యులైరి. శ్రీకృష్ణుడు కృతకృత్యుడైన తరి నుపమన్యుని యాశ్రమంబున కేగి యతనికి నమస్కరించి, సకల వృత్తాంతము నెరింగింప, నుపమన్యుడు కృష్ణుని గాంచి ఓజనార్దనా! పరమేశ్వరుడు గొప్పదాత, మహాకోపి, సహింపశక్యము కాని వాడు, జ్ఞానమునందు, తపంబునందు, శౌర్యస్థైర్యములయందు, నున్నత పదవులయందు, సకలైశ్వర్యములయందు, మహామనస్సుయందు, శంకరునకు సాటియెవ్వడును లేడు. నీవిది తెలిసికొని పరమేశ్వరుని యందు శ్రద్ధా భక్తులు కలిగియుండుము, పూర్వము బ్రహ్మలోక మందు, దండియనెడు మహాయోగి, శివుని సహస్రనామములుచే స్తుతించెను. దీనిభావ మంతయు సాంఖ్యశాస్త్రమందు చెప్పబడెను. సర్వకామ ప్రదమైన యీస్తోత్రమును మనుజు లెరుంగరు. నీవు గృహమున కేగి, నిత్యము శంకరుని స్మరించి పూజింపుము. నీవు శివభక్తాగ్రేశ్వరుడవు కాగల వన,

కృష్ణు డుపమన్యునకు నమస్కరించి శివునిస్మరింపుచు గృహమునకేగెను. ఇవ్విధంబున కృష్ణుడు శంకరు నుపాసించి సర్వుల కజేయుడై యుండెను.

పూర్వము శ్రీరామచంద్రుడు శివుని గురించి పర్వతముపై తపంబు చేసి, యుత్తమజ్ఞానమును, ధనుర్బాణములు పొంది సేతువుగట్టి సగణంబుగ రావణుని సంహరించి సీతను పొంది స్వగృహమేగి భూమినంతయు పరిపాలించెను. పరశురాముడు తన తండ్రి క్షత్రియునిచే చంపబడుట గాంచి శివుని గురించి తపంబుచేసి యతని ప్రసాదముచే పరశువును పొంది మూడేడు మారులు క్షత్రియులందరిని ఖండించి సంతుష్టుడై యజరామరుడై నేటికిని తపంబు చేయుచు సిద్ధచారణులు గాంచుచుండగ లింగార్చనలు గావించుచు మహేంద్ర పర్వతమునందు తపంబుచేయుచుండెను. ఇతడు కల్పాంతమందు ఋషియై సప్తమహర్షులలో నొకడుగా నుండును. చార్వసమను పుత్రుడు వశిష్ఠుని శాపముచే మృగరూపి మనుస్థలియందు సంచరించుచు శివమంత్రము జపించుటచే శివు డనుగ్రహించి యతని శాపముపోగొట్టి జరామరణంబులు లేకుండజేసి, తనగణములలో నొకనిజేసి, గణపతికి సఖునిగాజేసెను. ఇంకను శివుడు గార్గికి భుపదుర్లభమగు మోక్షమిచ్చెను. ఈమెకు మోక్షమిచ్చిన ప్రదేశము కాల జ్ఞాన ప్రదమై, కోర్కెలనొసంగునదై సమృద్ధి వంతమై యుండెను. సరస్వతి శంకరు నారాధించి చతుష్పాద స్వరూపయగు గాయత్రియై నారాధింప బడుచుండెను. ఇంకను సాటిలేని సహస్ర పుత్రులను గూడ బడసెను. పరాశరుడు తపంబు చేసి శివ ప్రసాదముచే జరామరణ వివర్జితుడగు వ్యాసుని పుత్రునిగా బడసెను. మాండవ్యమహాముని దశలక్ష సహస్రవర్షంబుల వరకు త్రిశూలాగ్రమందుండి మరల శివప్రసాదముచే జీవించెను. ఇవ్విధంబున శివప్రసాదముచే, గాలవుడు మొదలగు వారందరు ననేక సుఖములు బడసి యంతమున ముక్తి నొందిరి. మరియు ననేకులు ధనవంతులై, పుత్రవంతులై కృతకృత్యులైరి.

శివ మహాపురాణము నందలి ఉమాసంహిత యందు
మూడవ అధ్యాయము ముగిసెను

---

# నాలుగవ యధ్యాయము

## శివ మాయా ప్రభావము

బుద్ధిమంతుడవగు నో సూత మహర్షి! నీవు ధన్యుడవు అద్భుతమగు శివకథలన్నియు మాకు వినిపించితివి. వ్యాసునిచే ప్రశ్నింప బడిన శివగాథ లన్నియు నింకను వినిపింపుమని ఋషులు ప్రశ్నింప సూతుడిట్లు చెప్పదొడంగెను. బ్రహ్మపుత్రుడగు సనత్కుమారునిచే వ్యాసుడు వినిన దంతయు నతడు నాకు వినిపించెను. వారిసంవాదము చెప్పెద వినుడు. సర్వజ్ఞుడవగునో సనత్కుమారా! నానాలీలావిహారుడగు శంకరుని మహిమ లింకను నాకు వినిపింపుము. శ్రద్ధా భక్తులతో నేను వినెదను. అతని మహిమలే యేలోకములం దెట్లువిస్తరించి యున్నవో, యెవరెవరు మోహితులైరో తెల్పుమన సనత్కుమారుడిట్లు చెప్ప దొడంగెను, ఏదివిన్నచో, సుఖకరమై యుండునో, దేనిచే శివభక్తి కల్గునో యట్టిచరిత్ర చెప్పెదవినుము.

శివుడు సర్వేశ్వరుడు, దేవదేవుడు, సర్వాత్ముడు సర్వదర్శనుడు, జగత్తులన్నియు నితని మహిమలే వ్యాపించియుండెను. నతడు పరబ్రహ్మ స్వరూపుడు, త్రిమూర్త్యాత్మకుడు, సర్వభూతాత్ముడు, పంచభూతస్వరూపుడు, త్రిలింగ స్వరూపుడు, దేవయోనులు 8, మనుజయోని యొకటి, తిర్యగ్యోనులు 5 కలసి పదునాల్గు యోనులయందు జనించిన సృష్టిజాలమంతయు నితడు వ్యాపించి భూతభవిష్యద్వర్తమానములయందు నితడు సకలము వృద్ధిచేయుచుండెను, బ్రహ్మోపేంద్ర చంద్రులకు, దేవదానవ భోగులకు, గంధర్వ మనుజులకు నితర సర్వ జీవులకు, బంధుమిత్రాచార్యునిగను రక్షకునిగను నాయకుడుగను ప్రయోగకారి యగు గురువుగను, కల్పవృక్షముగను మాతాపితరులుగను శివు డుండెను. ఇతడు సర్వమయుడు, సర్వాంతర్యామి. పుష వేద్యుడు పరాత్పరుడు. వర్ణనాతీతుడు, పరుడు. పరునాశ్రయించినవాడు.

ఇట్టివాడు తనదివ్యమాయచే ప్రపంచమంతయు వ్యాపించెను. సర్వజగత్తులు నతనియధీనము, ఇతడు కాముని వశబరచుకొని విష్ణ్వాదిదేవతలందరిని తనవశము చేసికొనెను శివమాయచే విష్ణువు కామమోహితుడై స్త్రీలోలుడై

పరస్త్రీలను కూడ పొందెను, ఇంద్రుడు త్రిలోకపతియై యుండియు, శివమాయచే గౌతమ పత్ని యగు నహల్యను కూడి ... పొంది యాదుష్టాత్ముడు శాపమును కూడపొందెను, జగచ్ఛ్రేష్ఠుడగు పావకుడు శివ మాయా మోహితుడై, కామాధీనుడై, గర్వితుడై, యుండెను, వాయువు శివమాయా మోహితుడై పరస్త్రీతో రమించెను. చండరశ్మియగు మార్తాండు శివమాయా మోహితుడై కామాగులుడై తానశ్వమై బడబముతో రమించెను.

చంద్రుడు శివమాయా మోహితుడై కామసంకులుడై గురుపత్నితో రమించి, మరల శివుని వల్లనే దోషవిముక్తుడయ్యెను. పూర్వము మిత్రావరుణులు, ఘోరతపము చేసి శివమాయా మోహితులై, యావ్వనవతియగు నూర్వసిని గాంచి కాముకులై, మిత్రుడు కుంభమునందు, వరుణుడు సలిలమునందు, వీర్యము విడువ, మిత్రసంభవుడగు వశిష్ఠుడు కుంభభవుడయ్యెను, వరుణ సంభవుడగు నగస్త్యుడు బడబాగ్ని సదృశుడై యుదకము లందు జనించెను, బ్రహ్మపుత్రుడగు దక్షుడు, శివమాయా మోహితుడై, తనసోదరులతో సోదరినే ప్రేమించెను, బ్రహ్మ శివమాయా మోహితుడై, పరస్త్రీలనే గాక తనతనూజను కూడ మోహించెను.

ఇకడనేక పర్యాయములు కామమోహితుడాయెను, చ్యవనుడు మహాయోగియైయుండియు, శివమాయా మోహితుడై రాజపుత్రికయగు సుకన్యను ప్రేమించెను. కశ్యపుడు శివమాయా మోహితుడై కామాతురుడై నృపుడగు ధన్వుని కుమార్తెను యాచించెను, గరుత్మంతుడు శాండిలీ కన్యను మోహించి దగ్ధపక్షుడయ్యెను. విభాండక మహాముని మృగముతో రమింప ఋష్యశృంగు డను కుమారుడు జన్మించెను. ఇతడు మృగమునకు జనించుటచే శృంగములుగల్గి ఋష్యశృంగుడని పేరొందెను. ఈవిధంబున గౌతమ మహర్షి శివమాయా మోహితుడై, నగ్న స్త్రీయగు శారద్వతిని గాంచి కామపీడితుడై వీర్యము స్ఖలనముకాగా దానినొకదొన్నెయందుంచ నందుండి శస్త్రభృతాం వరుడగు ద్రోణుడుద్భవించెను. పరాశరుడు శివమాయా మోహితుడై మీనోదర సంజాత యగు దాశకన్యతో క్రీడింప వారికి పురాణకర్త యగు వ్యాసుడు జన్మించెను. విశ్వామిత్రు డరణ్యమున తపంబు

చేయుచు శివమాయా మోహితుడై మేనకతో రమింప, వీరికి శకుంతల జన్మించెను. ఈశకుంతలా దుష్యంతులకు జగద్విఖ్యాతుడగు భరతుడు జనించెను. నాటినుండియు నీఖండమునకు భరతఖండమని పేరువచ్చెను, విశ్వామిత్రుడు వశిష్ఠునితో కలహించి నష్టచేతస్కుడై మరలతపంబు చేసి శివప్రసాదముచే బ్రహ్మఋషియై రెండవసృష్టికర్త యయ్యెను.

**రావణుడు శివమాయా మోహితుడై సీతను దెచ్చి మృత్యువును కోరి తెచ్చుకొనెను.**

బృహస్పతి శివమాయా మోహితుడై, కాముకవశుడై, భ్రాతృపత్నితో రమింప, భరద్వాజుడుద్భవించెను. ఇట్లు వీరందరు శివమాయా మోహితులైరి

శివ మహా పురాణము నందలి ఉమా సంహితయందు
నాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

## అయిదవ యధ్యాయము

### మహా పాతక వర్ణనము

ఏమహా పాపములు చేసిన జీవులెట్టి నరకము లొందెదరో తెల్పుమని వ్యాసుడడుగ సనత్కుమారు డిట్లు చెప్పదొడంగెను. మానసిక దుష్కర్మలు నాల్గు విధములు. అవియేవన, మనసా పరస్త్రీలను గోరుట, పరధనము లపహరింపవలయునని తలచుట, పరభూములు కలుపుకొనవలయునని యూహించుట వరులకు చెడుకల్గింప వలెనని యూహించుట, ఇవిమానసిక దోషములు.

తోచినట్లుగ కఠినముగ మాట్లాడుట, అసత్య సంభాషణము, నప్రియ వాక్కులు, పరోక్షమున పిశునత్వము, ఈనాల్గు వాచిక దోషకర్మ లనబడును.

అభక్ష్య భక్షణము. హింసా, అన్యాయసాక్ష్యము చెప్పుట, పరద్రవ్య మపహరించుట, ఈనాల్గు కాయిక దోషకర్మ లందురు. కాయిక, వాచిక,

మానసిక కర్మలు పన్నెండు విధములుగ చెప్పబడెను. వీటిభేదములు చెప్పబడెను. వీటిఫలము ననంతములై యున్నవి. సంసారార్ణవతారకమైన మహాదేవుని ద్వేషించిన వాడు, మహాపాతకుడై నిరయము నొందగలడు.

శివ నిందయు, శివభక్తులను నిందించుట, శంభుని కుపథాని, దూషించుట మొదలగు వాటిచే నరక వాసులగుదురు. మరియు, శివనిందయు గురునిందయు శివజ్ఞాన దూషణము, దేవద్రవ్యాపహరణము, విప్రద్రవ్యాపహరణము, శివపురాణహరణము లనెడి యారును, మహాపాతకములని చెప్పబడెను. శివపూజను గాంచి హర్షింపకున్నను, పూజింపబడిన, శివలింగమును గాంచి సమస్కరింప కున్నను, స్తుతింపకున్నను నిశ్శంకుడై యథేచ్ఛగా సంచరించు వాడును, గురుసన్నిధిని, శివసన్నిధిని వినయము చూపకున్న వాడును, పర్వదినముల యందైనను భగవంతు నర్చింపని వాడును, నర్తకులకు వేశ్యలకు పూజలు సలుపనివాడును, శివుని, శివభక్తులను ద్వేషించిన వాడును, అన్యాయము చేయువాడును, అన్యాయము విని సహించిన వాడును, అపవిత్రములైన స్థలంబు యథేచ్ఛగా కూర్చుండుట, భగవద్గోష్ఠులు గాక యన్యగోష్ఠులు వినగోరుట అసత్య సంభాషణము, అశుచిప్రదేశముల యందు భగవత్కథలు చెప్పుట, వినుట, గురుపూజ గురుశుశ్రూషలు చేయక శాస్త్రములు నభ్యసించుట, గురునాజ్ఞ మీరుట, గురువుని తిరస్కరించుట, గురువు చెప్పిన కార్యము కష్టసాధ్య మని యుపేక్షించుట గురువు నిష్ఠసమయము లందున్నప్పుడును రోగియై యున్నపుడును పరదేశముల యందున్నప్పుడు నతని త్యజించిన శిష్యులును, గురు భార్యా పుత్రులను నిందించు వారును మహాపాపులని చెప్పబడుదురు. గురుధర్మము లెరిగిన వారెవ్వరు గురువును తిరస్కరింపరు. గురునింద చేసినచో శివనింద చేసిన వారగుదురు.

శ్లో॥ బ్రహ్మఘ్నశ్చ, సురాపశ్చ స్తేయీచ గురుతల్పగః
మహాపాతకిన స్సర్వే తత్సంయోగీచ పంచమః

బ్రహ్మహత్య చేసిన వాడును సురాపానము చేసినవాడును, దొంగతనము చేసినవాడును, గురు తల్పగతుడును ఈనలుగురితో కూడిన వాడును, ఏవరు మహాపాతకులని చెప్పబడుదురు. క్రోధ, లోభ భయదోషములచే బ్రాహ్మణుని సంహరించినను, లేక మర్మ భేదములగు వాక్యములు పలికినను,

బ్రహ్మహత్యా దోషము సంభవించును. బ్రాహ్మణు నాహ్వానించి దానమిచ్చి మరల గ్రహించినను, నిర్దోషిని దూషించినను బ్రహ్మహత్యాదోషము సంభవించును. విద్యాభిమానముచే సభామధ్యమున నుదాసీను డగు బ్రాహ్మణుని పరాభవించినను, అనృత వాక్కులచే తాను మహాపండితుడ నని తానున్న తిని ప్రకటించు కొన్నను, గురువులు పెద్దలతో సంభాషించు నపుడు విఘ్న మొనర్చినను, దేవ బ్రాహ్మణ గోవుల కిచ్చిన భూము లపహరించినను వారల కిచ్చిన సొమ్మపహరించినను. అన్యాయముగ ధన మార్జించినను కూడ బ్రహ్మహత్యాదోషము వాటిల్లును. వేదమభ్యసించి శివాత్మక మగు బ్రహ్మజ్ఞానము లేనిచో సురాపానము చేసిన దోషము నొందును. యజ్ఞము చేసి దేవతలను ఋషులను పితరులను, భూతములను బ్రాహ్మణులను తృప్తి పరచుట యనెడి పంచయజ్ఞములు విడిచనచో సురాపానముచేసిన దోషము సంభవించును. తలి తండ్రులను విడనాడుట, కూటసాక్ష్యము బల్కుట, అనృతమాడుట, మాంసభోజనము చేయుట, శివభక్తుడై యుండి యభక్ష్య భక్షణము చేయుట, నిరపరాధులగు జీవులను హింసించుట, సాధు బ్రాహ్మణుల సధర్మము లందు నియోగించుట గోమార్గమందున వనమందున గ్రామమందున నగ్నిని ప్రజ్వలింప జేయుటయనునవి బ్రహ్మహత్యతో తుల్య మగు ఘోర పాపములని చెప్పబడెను.

మరియు, దీనుల సర్వస్వము హరించుటయు, స్త్రీపురుష గజాశ్వములు గోభూరజత వస్త్రములు, ఔషధములు, పాదరసము చంద నాగరు కర్పూర కస్తూరీ మొదలగు సుగంధద్రవ్యములు, పట్టువస్త్రములు విక్రయించుట యెంత విపత్తు సంభవించినను చేయరాదు. అట్లుచేసినచో హస్తమందున్న స్వర్ణ ధనమపహరించిన దోషము సంభవించును. మరియు పుత్రికను తగిన వరున కీయనిచో కన్యాదాన ఫలముండదు. పుత్రుని భార్యతోను మిత్రుని భార్యతోను తన పుత్రికతోను మద్యపానము చేసిన స్త్రీతోడను రమించిన ఘోరపాపము సంభవించును. సగోత్రస్త్రీని వివాహ మాడినచో మహాపాపము సంభవించును. ఇవన్నియు గురు పత్నీ గమనముతో తుల్యములని చెప్పుదురు.

శివ మహాపురాణము నందలి ఉమాసహిత యందు
అయిదవ అధ్యాయము సంపూర్ణము

---

# ౨౩వ యధ్యాయము

## పాపభేద వర్ణనములు

ద్విజద్రవ్యాపహరణము, దాయాదులకు సక్రమముగ పాలొసంగకుం డుట, యతిమానకోపములు కల్గుట, దాంభికుడగుట, చేసినమేలు మరచుట, అత్యంత విషయాసక్తుడగుట, లోభియగుట, సాధుమాత్సర్యము, పరదారాభిగమనము, సాధుకన్యాదూషణము, మహాపాపములని చెప్పబడుచున్నవి. అన్నను విడిచి వివాహము చేసికొన్నవాడు దానములకుగాని, యాగములకుగాని పనికిరాడు. దేవాలయమునందు ఫలపుష్పంబులు నశింపజేయుట, భృత్యపరివారపశుధనంబులు హరించుట, దాయాదుల పశుధనంబు లపహరించుట, జలము నపవిత్రత జేయుట, యజ్ఞారామ తటాకంబులు, దారాపుత్రులను విక్రయించుట, స్త్రీధనంబుతో తీర్థయాత్రోపవాసంబులు, వ్రతముల, నుపనయనంబులచేయుట, స్త్రీధనంబులు మాయచే నపహరించుట, స్త్రీధనముతో జీవించుట, స్త్రీలచే జయింపబడుట, సమయమునకు వచ్చిన యతిథిని రిక్తహస్తములతో పంపుట ధాన్యవ్యాపారముచేసి జీవించుట, నిందితులకు ధనదానముచేయుట, కూటసాక్ష్యముచే ధనముసంపాదించి జీవించుట విషమారణ్యపత్రములు తెచ్చుట, సతతము వృషభ వాహనుడై సంచరించుట, ఉచ్చాటనాభిచారిక మంత్రములు ప్రయోగించుట, ధాన్యముపుచ్చుకొని వైద్యము చేయుట, రుచులకై కామభోగములకై, నియమ వ్రతములను వీడుట, వేదార్థమును తెలిసియు తానుగ్రహింపక, నొకరికి జెప్పక మూలము మాత్రము పఠించినవాడును, తన ధర్మమును వీడి, యితరధర్మముల నాచరించినవాడును. అశాస్త్రీయము లాచరించుట, శుష్కతర్కవాదములు బల్కుట, దేవాగ్ని గురుసాధువిప్రులను, పరిపాలకులను, పరోక్షమునగాని, యపరోక్షమున గాని నిందించుట, దేవపితృ యజ్ఞంబులు వీడినను, స్వకర్మలు త్యజించినను, దురాచారులై, నాస్తికులై, సదాపాపాత్ములై, యసత్యవాదులైయున్నను, సర్వకాలమందున పగటిసమయమందున, రజస్వలాస్త్రీయందున మైథునముగావించినను, భార్యాపుత్ర మిత్రుల యాశలుచ్ఛేదించువారును, జనుల కప్రియములు బలుకువారును, సమయము తెలిసికొని క్రూరత్వము జూపువారును, కూపతటాకం

బాలు ప్రాప్తి చెడగొట్టిన వారును, రసపదార్థములు విక్రయించినవారును, పంక్తిభేదముగ వడ్డించినవారును, ఇట్టి పాపాత్ములందరు నుపపాతకులని చెప్ప బడుచున్నది. వీరుకాక నితరపాపాత్ములను కూడ చెప్పెదను.

గోబ్రాహ్మణులకు, కన్యకలకు, యజమానికి, మిత్రులకు, తపస్వులకు, నపకారము జేయువారు, నరక మనుభవింతురు. పరస్త్రీలను గాంచి తపించిన వారును, పరద్రవ్య మపహరింప గోరువారును, పరద్రవ్యాపహారకులును, నన్యాయముగా సూకము వేసినవారును, విప్రులకు దుఃఖముకల్గించువారును, ద్విజులను గొట్టినవారును, ద్విజులైయుండి శూద్రులను సేవించినవారును, కామాతురులై సురాపానము చేసినవారును, జీవనోపాధికై దానయజ్ఞాదిక్రియలు సల్పువారును, గోశాలయందు, నగ్నియందు, మార్గమందు, తరుచ్ఛాయల యందు, పర్వతములయందు, తోటలయందు, దేవాలములమందున, మూత్ర పురీషములు విడుచువారును, లజ్జాభయములచే నాశ్రమప్రాసాదములయందు మలమూత్రములుచేసినవారును, వేశ్యాలోలుడై క్రీడించువాడును, యితరుల లోపములనన్వేషించువారును, రాళ్లు, ఇటుకలు, కర్రలు, కొమ్మలు, యెముకలు మొదలగునవి కఠినముగ పైనవేయువారును, పరభూము లపహరించువారును, కపటముగా శపథము చేయువారును కూటకర్మలు చేయువారును, కూటపాకాన్న వస్త్రములను అనుభవించువారును, కూటవ్యవహారములు చేయువారును, యముములతో బాణములు తయారుచేయువారును, నవి విక్రయించువారును, సతిని కన్నను సన్యాయముతో బృత్యులను పశువులను నతిగా కొట్టినను మిథ్యావచనములు పలుకువారును, పిసినారులు, స్వామి మిత్ర గురుద్రోహులు, మాయావులు చపలులు, మూర్ఖులు, మొదలగు వారును, పుత్ర మిత్రులను వృద్ధులను భృత్యాతిథి బంధువులను వీడి భుజించిన వారును, నన్యులకు పెట్టక స్వయముగా భుజించినవారును నరకగాము లగుదురు. వస్తువులు ఇతరులకు పెట్టక తాను భుజించినచో అట్టి పాకము వృథాపాకమని నియమములు స్వీకరించి జితేంద్రియుడుగాక నియమములు వీడిన వారును, సన్యసించి గృహమం దున్నవారును శివలింగముల నుచ్ఛేదించువారును క్రూరులై గోవులను మాటిమాటికి గొట్టువారును దుర్బలులను పోషింపనివారు, అతిభారము వేసి జంతువులను పీడించువారును సహిం

పనిబరువు మోయించువారును, ఆహారముపెట్టక పశువులచే అతిగా దున్నించు వారును, శక్తి క్షీణించినతరి పశువులను పోషించని వారును ఇట్టి వారు నరక గాములగుదురు. మరియు వృషలములను ఛేదించువారును, వంధ్యగోవును నాగలి కట్టి వాహనముగా నుపయోగించువారును మహానరకము నొందె దరు. మరియు స్వతంత్రుడై యుండియు నాకలి దప్పికలతో వచ్చిన నతిథికి నన్నపానంబు లొసంగని వారును అన్నాతురులై వచ్చిన బాలవృద్ధ, కృశుల కన్నమిడని వారును, ఇట్టి వారిని గాంచి దయలేని మూఢులు నరకవాసు లగుదురు.

శ్లో॥ గృహేష్వర్థాని వర్తంతే శ్మశానే మిత్ర బాంధవాః
సుకృతం దుష్కృతంచైవ గచ్ఛంతమనుగచ్ఛతి.

ధనము గృహమందే యుంచును. బంధువులు స్మశానము వరకు నత్తురు. పుణ్యపాపములు మాత్రము జీవుని వెంటవచ్చును. మరియు అజమహిషంబుల విక్రయించువారును శూద్రస్త్రీని పెండ్లియాడినవారును శూద్ర ద్రవ్య మనుభ వించినవారును క్షత్రియవృత్తి నొందిన ద్విజాధములు నరకవాసు లగుదురు. శిల్పులు వడ్రంగులు వైద్యులు స్వర్ణకారులు కంసాలులు, కపటముగా రాజ లాంఛనములు ధరించి తిరుగువారును, నరకవాసులగుదురు. ఇంకను శాస్త్ర విరుద్ధముగా సంచరించువారును ప్రభుస్వాపములు లపహరించినవారును నరక దండనలకు గురియగుదురు. ఇంకను స్వేచ్ఛగా విహరింపుచు ప్రజలను పీడిం పుచు క్రయవిక్రయములను పెంచుచు నప్పరుల రెచ్చగొట్టుచు లంచగొండి తనము పెంచుచుండు ప్రభువులు నరకవాసులగుదురు. అన్యాయ ప్రవర్తకుడగు రాజుయొక్క ధనము స్వీకరించిన బ్రాహ్మణుడుకూడ నరకవాసుడగును. రాజు యన్యాయార్జిత ధనమును బ్రాహ్మణున కిచ్చినచో నాతడు నరకవాసుడగును. పరస్త్రీల నపహరించుట పరస్త్రీ రతుడునగువాడు నరకమనుభవించును. దొంగ కానివానిని శిక్షించినను దొంగను శిక్షింపకున్నను విచారింపక రాజుదండిం చినచో రాజు నరకమందును ఘృత తైలాన్న పానములు మధుమాంసశురా వంబులు, గుడేక్షుశాఖ దుగ్ధంబులు దధిమూలఫలంబులు, తృణకాష్ఠపత్ర పుష్పంబులు నౌషధంబులు నాత్మభోజనంబులు ఛత్రపాదుక, శకటాస్రన

కమండలంబులు తామ్ర. సీస, తగరంబులు శస్త్రంబులు జలోద్భవంబు లైన శంఖంబులు వైద్యవస్తువులు వెదుళ్ళు నితర గృహోపకరణంబులు ఉన్ని పట్టు, వస్త్రంబులు స్థూల సూక్ష్మంబులైన వస్త్రంబులు బాల్య చాపల్యముచే నపహరించినను నరకమునందగలరు. పరధనము నావగింజంత నపహరించినను నరకము తప్పదు. ఇట్టి పాపములు చేసినవారు చనిపోయిన పిమ్మట ననేక యాతనా జన్మము లెత్తవలసివచ్చును. ఇట్టి జీవులను యముడు తన దూతలచే గొంపోయి నరకయాతనల ననుభవింపచేయును. దేవ, మానవ, పశువులైనను యధర్మముగా ప్రవర్తించినచో యముడు వారిని తప్పక శిక్షించును. నియమ వంతులు ప్రమాదవశమున పాపకృత్యములుచేసినచో గురువు నడిగి గాని, పెద్దలనడిగి గాని, ప్రాయశ్చిత్తముచేసికొనినచో యమభటయాతన లుండవు. పరదారల నపహరించుట పరధనముల నపహరించుట మొదలగు ప్రత్యక్ష పాపములు చేసినచో రాజే దండించును. రాజదండ నైనచో యమదండన యుండదు. రహస్యపాపములకు యముడే శిక్షించును. పాపపరిహారములకు ప్రాయశ్చిత్తము చేయనిచో ఎన్ని వేల జన్మములెత్తినను పాపపరిహారము కాదు. ఎవడు పాపములు చేయునో చేయించునో ఆమోదించునో యట్టి వాడు మనోవాక్కాయ కర్మ జన్యమైన పాపముల నొందగలడు.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
ఆరవ అధ్యాయము సంపూర్ణము

---

## ఏడవ యధ్యాయము

### నరకలోకమార్గ బీభత్సము.

చతుర్విధములైన పాపాత్ములు యమలోక మనుభవించుచు దుఃఖింతురు. గర్భస్థులు, జనించినవారలు, బాలురు, తరుణులు, మధ్యస్తులు స్త్రీ, పుం, నపుంసకులు, మొదలగు సర్వజీవులు శుభ అశుభ ఫలంబులు తెలిసికొనవలయును. యేప్రాణులు ఏయేకర్మలుచేసి యేయేఫలముల

నొందెదరో చిత్రగుప్తుడుగాని వశిష్ఠాది మునులుగాని చెప్పలేరు కారణ మేమన ప్రాణోత్క్రాంతి సమయమున శివుని గాని విష్ణువుని గాని స్మరించినచో నెట్టిపాపి యైనను సర్వపాప విముక్తుడై సద్గతి నొందుచు న్నాడు. చేసిన కర్మలననుభవింపవలయునని తెలపవలెను. శుభకర్మలు చేసిన వానిని యముడు సుఖమార్గమున తనలోకమునకు తూర్పు ద్వారమున గొంపోయి శుభాశుభ కర్మలను విచారించి తగిన కర్మఫలముల ననుభవింప చేయును. పాపకర్మల చేసిన వారిని, ఎన్నడు ఏ దానముచే యనివారిని యమ భటులు దక్షిణద్వారమును గొంపోయి నానాహింసలు చేయుదురు. యమపురియందైన దక్షిణమార్గ మతిఘోరముగా నుండును. ఈపురి భూలోకమునకు 86 వేల యోజనముల దూరమున నుండును. పుణ్యాత్ములకీ మార్గ మతిచేరువుగా నుంచి యతిసులభముగా పయనము చేయుదురు. పాపుల కతిదూరముగను రౌద్రముగాను గన్పట్టి తీక్ష్ణ కంటకయులు కఠిన శిలలచే నొప్పును మార్గమంతయు క్షురధారలవలె నతి కఠినముగా నుండును. పాపాత్ములు దానియందు నడచి ప్రయాణము చేయవలెను. ఇంకను లోతైన బురద మార్గము వుండును. ఉరుతర పాపములు చేసికొనినవారు ఈ ఊబియందు దిగబడుచుందురు. కొందరు పాపాత్ములను లోహసూదులవంటి దర్భలలో నడిపించెదరు. మరికొందరిని విషమప్రదేశములైన తటంబులయందును వృకసంకులంబైన పర్వతంబులయందును నగ్నిచే కణకణలాడు బొగ్గుల యందును దుఃఖపెట్టుచు గొంపోవుదురు. మరికొందరు పాపాత్ములను విషయగర్తముల యందతికఠినములైన మట్టిబెడ్డలయందు, తీక్ష్ణమైన గశికలయందును, శాఖోపశాఖలుగల వెదురు వనములందును కష్టమైన కటిక చీకటియందును బహు దూరముగా గొంపోవుదురు. మరికొందరిని, తీక్ష్ణమైన చతుష్పథ వీధులయందు త్రిప్పుచు గొంపోవుదురు. కొందరిని దావాగ్నుల యందును, కొందరిని తప్తశిలలయందును, మరికొందరిని మంచుయందును, ఇసుకయందు కంఠపర్యంతము దింపి ఈడ్చుకొని పోవుదురు. కొందరిని, మలిన జలంబుల యందును కొందరి నేరు పిడకల నిప్పులయందును కొందరిని దారుణములైన సింహ, వ్యాఘ్ర, వృక, మశకములచే పీడింపజేయుచు గొంపోవు

దుగు. కొందరిని నగాధ జలంబుల, కొందరి నజగరంబులచే పీడింపబడుచు గొంపోవుదురు. కొందరిని ఘోరవృశ్చికముల చేతను ఘోరసర్పముల చేతను ప్రమాద కరంబులైన మత్త మాతంగ యూథంబులచేతను తీక్షణశూలంబుల చేతను భయపెట్టుచు మార్గములను చూపుచు గొంపోవుదురు. మరికొందరిని తీక్ష్ణశృంగములు గల మహిషంబులచేతను, భయంకర భూతములచేతను తీక్ష్ణ దంష్ట్రలుగల ఏదుపందులచేతను భయపెట్టుచు గొంపోవుదురు. గొందరిని రౌద్రులగు ఢాకినులచేతను, వికటాస్యులగు రాక్షసులచేతను మహాఘోర వ్యాధులచేతను మహాధూళిమిశ్రితములైన ప్రచండవాయువుల చేతను నాశ్ర యములేని మహాపాషాణ వర్షంబుల చేతను పీడించుచు గొంపోవుదురు. కొందరిని విద్యుత్ ప్రభలచేత హింసజేయుచు బాణవర్షంబులచే పీడింపజేయుచు కొందరిని పిడుగుల చేతను కొందరి నుల్కాపాతము చేతను, కొందరి నం గారపాత వర్షముల చేతను దహింపజేయుచు గొంపోవుదురు. మరికొంద రిని పాంశువర్షముచే పూరింపజేయుచు ఘోర మేఘ ధారలచే తడుపుచు నిశితాయుధ వర్షంబుల చేతను గిటిధారా వర్షంబులచే తడుపుచు గొం పోవుదురు. కొందరిని తీక్షణ శీతలవాయువుల చేతను వేడిగాడ్పులచే నెం డింపజేయుచు శుష్కింప జేయుచు ఆహారమైన నొసంగక గొంపోవుదురు. నింకను నాశ్రయరహితమైన దుర్గమ విషమప్రదేశమందున ప్రదేశమందున జనోదకములు లేనిప్రదేశమునందున కటికిచీకటియందున గొంపోవుదురు. ఇట్టి పాపాత్ములందరిని యముని యాజ్ఞచే దూతలు సర్వకష్టములకు నాశ్రయ మైన ప్రదేశములయందీడ్చుకొని పోవుదురు. పాపకర్మలనుచేయు మూఢుల నిట్లు బాధించుచు గొంపోవుదురు. పాపయుత జీవులు తమ బంధువులను వీడి సకల సుఖంబులను త్యజించి ఏకాకియై వచ్చుచున్న వారి నివ్విధం బున దుఃఖపెట్టుచు నీడ్చుకొని పోవుచుందురు. పాపము జీవు లీబాధలను పడలేక తాము చేసిన పాపకర్మల భరించుచు, శోకించుచుందురు.

ఇట్టిమృతజీవులు ప్రేతలై, వస్త్రహీనులై, శుష్కకంఠోష్ఠతాళువులు గలవారై, కాంతిహీనులై, క్షుధన్వితులై యుందురు. కొందరు శృంఖలముల చే బంధింపబడియుందురు, మరికొందరూర్ధ్వపాదులై యుందురు. ఈకృశించిన ప్రేతజీవులను బలాత్కారముగ నీడ్చుకొని పోవుచుందురు. కొందరిని

హృదయము వరకు నధోముఖులజేసి ముళ్ళలో నీడ్చుకొని పోవుచుందురు. కొందరిని కణకణలాడు నిప్పులపై నుండి నడిపించెదరు. కొందరికి బాహువులు బంధించి జఠరముపై మోదుచుందురు. కొందరి హస్తములను గొలుసులతో బంధించియీడ్చుకొని పోవుదురు. కొందరికంఠములకు పగ్గములు బిగించి యీడ్చెదరు. కొందరి జిహ్వాలయం దంకుశములు గ్రుచ్చి యంకుశములకు త్రాడుకట్టి లాగుచుందురు. కొందరినాసాపుటంబులకు రంధ్రములుపొడిచి వాటికి త్రాళ్ళనుజొనిపి లాగుచుందురు. కొందరికపోలములకు రంధ్రములు పొడిచి త్రాళ్ళుగ్రుచ్చి యోష్ఠమధ్యములనుండి లాగుచుందురు. కొందరిపాద హస్తంబులు, కంఠనాళికలు, శిశ్నవృషణంబులు, ఛిన్నభిన్నముగ రంధ్రములుపొడిచి కుంతసాయకములచే ప్రతీయంగములు చీల్చిపొడుచుచు గొంపోవుదురు. అప్పుడీపాపులందరు, నిరాశ్రయులై యటునిటు పరుగులిడుచు నాక్రందనములుచేయుచుందురు. కొందరిని జ్వలనార్కసమప్రభము లగు ముద్గరంబులచే తను, లోహదండంబుల తను, మాటిమాటికిగొట్టుచు, ఘోరమైనముండ్లకర్రలచే మోదుచు, భిందివాలముల గొట్టుచు నీడ్చుకొని పోవుచుందురు.

పాపు లీ ఘోరకృత్యముల కోర్వలేక, భయపడి, మూత్రపురీషంబులు విడుచుచు పోవుచుందురు. కొందరి నీమూత్రపురీషములనుండి యీడ్చుకొని పోవుచుందురు. ఏదానములు చేయని మహాపాపు లాకలాకలియని యేడ్చినను యన్నముపెట్టకయు, దాహము దాహమని విలపించినను, నీరొసంగకయు, చలిచలియని గడగడవణకుచున్న నగ్ని వేల్చకయు, కప్పుకొనుటకివ్వకయు, నీడ్చుకొని పోవుచుందురు. ఇట్లు వీరందరికి కర్మానుసారముగ కష్టములు కల్గించుచు, శ్రమలను కల్పించి యమపురికి గొంపోయి యతని సముఖంబున నిలబెట్టుదురు.

పుణ్యాత్ములగు జీవులను దూతలు సుఖమార్గమున ననాయాసముగ గొంపోయి, శమనుని యెదుట నిలబెట్ట నతడు పుణ్యాత్ములను గాంచి అర్ఘ్యపాద్యాచమనములతో పూజించి సత్కరించి, మీరు నిగమోదితకర్మ లాచరించినవారు గాన ధన్యులని ప్రశంసించుచు, మీరు దివ్యసుఖంబుల నొందు

టన్నై పుణ్యకర్మలు చేసియుంటిరని, ప్రశంసించుచు మాటిమాటికి కొనియాడు చుచు, ఓ పుణ్యపురుషులారా! మీరు దివ్యవిమానము నధిష్ఠించి దివ్యస్త్రీ భోగభూషితులగు, స్వర్గమున కేగి యట సకలభోగంబు లనుభవించి, పుణ్య క్షయమైనతరి నేస్వల్పపాపమైన నున్నచో, మరలనీలోకమే తెంచి స్వల్ప దోషకర్మ లనుభవింపుడని చెప్పుచుండును. ధర్మాత్ములైన పురుషులందరిని యముడు తనయాత్మమిత్రులుగ గాంచుచు, సౌమ్యముగ వీక్షించుచు సుఖ ములనొసంగుచుండును. మరియు నీశమనుడు క్రూరకర్ములకు, భృకుటీకుటి లేక్షణుడై, దంష్ట్రాకరాళవదనుడై, యూర్ధ్వకేశుడై, మహాశ్మశ్రుసంయు తుడై, యూర్ధ్వప్రస్ఫురితాధరుడై, యష్టాదశభుజుడై, కృష్ణుడై, నీలాంజన సమప్రభగాత్రుడై, సర్వాయుధధరుడై, సర్వభయంకరదండ హస్తుడై, మహామహిషారూఢుడై, ప్రజ్వలితాగ్ని సదృశలోచనుడై రక్త మాల్యాంబర ధరుడై, మహా మేరోన్నతుడై, కాలానల సమప్రభుడై, కాలాంజనసంకాశుడై, ప్రళయకాల మేఘగర్జనుడై, మహోదధిని పానము చేయువానివలె గోచరించుచు, హిమాలయమును గ్రసించువానివలెను, అనలము మ్రింగువానివలెను, మృత్యుదేవతను చెంతనుంచుకొనియివ్విధం బున కృతాంతుడు భయపెట్టుచు, నుగ్రమారీ, మహామారీ, కాళరాత్రి మొదలగు దారుణవ్యాధులు, నానారూపభయావహములైన కుష్ఠాదివ్యాధు లచెంతనిడుకొని, శక్తితోమరాంకుశపాశచక్రహస్తుడై, వజ్రతుండధరుడై, రౌద్రదక్షుగ, తూణధనుర్ధరుడై, మహావీరుడై, నానాయుధంబులు ధరించి కాలాంజన సమప్రభులైన యసంఖ్యాకులగు మహావీరులగూడుకొని యుండును. యమదూతలందరు భయంకరులై, సర్వాయుధంబులుధరించి యుందురు. భయంకరుడగు చిత్రగుప్తుని, యమధర్మరాజుని, పాపులుగాంచు చుందురు. చిత్రగుప్తుడు యమధర్మరాజునకు వారివారిపాపపుణ్యంబులు చెప్పుచుండును. యముడువారిని తర్జన భర్జనలచే భయపెట్టుచుండును.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు

ఏడవ అధ్యాయము సంపూర్ణము

---

# ఎనిమిదవ యధ్యాయము

## నరక లోకవర్ణనము

చిత్రగుప్తుడు పాపాత్ములను గాంచి ఓదుష్కృత కర్ములారా! మీరు పరద్రవ్యములను హరించి రూపలావణ్య గర్వితులై పరదారల జెరిచితిరి. మీరుచేసిన కర్మలు మీరే యనుభవింప గలయును. మీరిట్టి దుష్కర్మలుచేసి యాత్మఘాతకులైతిరి. మీ స్వకర్మలచే మీరిట్లు పీడింప బడుచుండిరి. విలపించిన ప్రయోజనమేమున్నది? ఎవరుచేసిన కర్మలువారనుభవింపక తప్పదు. ఇదియంతయు కర్మదోషముగాని వేరుగాదని తదుపరి భూపాలుర గాంచి దురాచారులగు నోనృపులారా! మీరుప్రజలను పీడించి ధ్వంసముచేసితిరి. అల్పకాలము రాజ్యముచేసి దుష్కృత్యములు చేసిరిగాని సుకృతము లేవియు చేయలేదు. మీరు రాజభోగ మోహాబలాదులచే ప్రజల నన్యాయముచేసి నన్యాయముగా దండించితిరిగాన దానిఫలము నేడనుభవింపుడు. మీ రాజ్యము, ధనము, భార్యాపుత్రాదు లేమైరి? అందరిని వీడి మీరు ఏకాకులై వచ్చితిరి. ఇక్కడమీకు దిక్కెవరు? ఈమాత్రము దానికి అంతటి దుష్కృత్యములు చేయుటేల? ప్రజలందరిని ధ్వంసముచేసిన మీబలమంతయు నశించెనుగదా. ఇంతటి బలవంతులు యమదూతలచే కట్టుబడివచ్చితిరి. ఇప్పుడు ఏమిచేయగల్గితిరి? బలవంతులమని విర్రవీగుచున్న మీబలమంతయు ఏమైనదని చిత్రగుప్తుడు పలికె, రాజులు తాముచేసిన కర్మలు దలంచుకొనుచు మౌనముదాల్చియుండిరి. యమధర్మరాజు పాపులను పరిశుద్ధులను చేయుటకై దూతలతో నిట్లుపలికెను. ఓచండుడా! మహాచండుడ! ఈనృపతులను బలాత్కారముగా బట్టి వీరు పరిశుద్ధులగు వరకు క్రమముగ నరకాగ్నులందు పడవేయుడన దూతలు వారి పాదములను బట్టి గిరగిర త్రిప్పుచు నున్నత ప్రదేశములనుండి విసరివేయుచుండెను. కొందరి. నున్నశిలాతలంబులపై బడవైచి వజ్రముచే వృక్షములు ఛేదించునట్లుగా వారిని ఛేదింపుచుండిరి. వారి తాడనంబులకు రుధిరాక్త గాత్రులై శ్రోత్రముల నుండి నెత్తురు గారుచు శిథిలులై నిశ్చేష్టులై

నిస్సంజ్ఞులై పడియుందురు. మరియు వారును వాయుస్పర్శచే మరల చైత న్యులై యుండ మిగిలిన పాపము లనుభవింప జేయుచుండిరి.

భూమిక్రింద సప్తకోట్ల ఇరువదిఎనిమిది యోజనములు దాటినపిమ్మట సప్తమతలాంత మందు గోళము చీకటిగా నుండును. అందు ఇరువదిఎనిమిది ఘోరనరకము లుండును. వాటిలో మొదటిది ఘోరనరకమనియు దాని యడుగున సుఘోరము దానిక్రింద నతిఘోరము దానిక్రింద మహాఘోరము. ఘోరము తలాతలము, భయానకము. కాళరాత్రి, భయోత్కటచండ, మహా చండ, చండకోలాహల ప్రచండ, చండనాయక, పద్మ, పద్మావతి భీత, భీమ, భీమణనాయికా, కరాళ. వికరాళ, వజ్రత్రికోణ, పంచ కోణ, సుదీర్ఘ, మహా దీర్ఘ, అఖిలార్తిదా, సమా, భీమబలఉగ్రదీప్తి ప్రాయయను నరకంబులొకదాని క్రిందనొకటి గలవు. ఇవి యన్నియూ ఘోరనరక సముదాయము లని చెప్ప బడుచున్నవి. ఈ అష్టావింశంతి 28 నరకములయందు పాపులు యాతనలు ననుభ వింతురు. వాటి కొక్కొక్క దానికయిదుగురు నాయ కులుందురు. ప్రథమ నరక మైన రౌరవమందు దేహధారు లగు జీవులు దుఃఖింతురు. మహారౌరవమందు మరింత దుఃఖింతురు. శీతోష్ణములచే బాధించుట కయిదుగురు నాయకులుం దురు. వీటికి శీత, ఉష్ణ సుఘోర, మహాతీక్ష్ణ సంజీవన, యను వారలు నాయ కులై పీడింతురు. మహాతమ, విలోమ విలోప కంటక తీవ్రవేగ కరాళ, వికరాళ, ప్రకంపన, మహా వక్ర కాల, కాలసూత్ర ప్రగర్జన సూచిముఖసునా ఖాదక సుపీడన, కుంభిపాక, సుపాక, క్రకచ, అతిదారుణ, అంగారరాశి భవన, యోను, అసృక్ ప్రహిత, తీక్ష్ణతుండ, శకుని, మహాసంవర్తక, క్రతు, తప్త జంతు పంక లేప, ప్రతిమాంస త్రపూద్భవ, ఉచ్ఛ్వాసుని రుచ్ఛ్వాసుదీర్ఘ కూటశాల్మలి దుష్టను మహాబాధ ప్రహిద సుప్రతాపనమేఘ వృషశాల్మ సింహ, వ్యాఘ్రఘుగజానన, శ్వాన, శూకర, అజ, మహిష, ఘూక కోక వృకానన గ్రాహ కుంభీన, నక్ర, సర్ప, కూర్మ వాయుసగృధ్ర, ఉలూక, హాలేక శార్దూల, కర్కటకట మండూక, పూతివక్త్ర, రక్తాక్షి, పూతిమృత్తిక, కణధూమ్రమఅగ్ని, కృమి, గంధివపు, అగ్నిదగ్ధ, అప్రతిష్ట రుధిరాభ, స్వభోజన లాలాభక్ష్య ఆంత్రభక్ష్య, సర్వభక్ష్య, సుదారుణ కంటక, సువిశాల, వికట, కటపూతన అంబరీష, కటాహ కష్టదాయక వైతరణి సుతప్త లోహశయన ఏకపాద,

ప్రపూరణ ఆశితాళవన ఘోర అస్థిభంగ విలాతస అసుయంత్ర, కూటపాశ, ప్రమర్దన, మహా చూర్ణ అసుచూర్ణ తప్తలోహమయ పర్వత క్షురధార, యమల ప్రసర్త, మూత్రపిష్ట, అశ్రుకూప క్షారకూప, శీతల ముసల ఉలూఖల, యంత్రసూల, శకట, లాంగల, తాళపత్ర, అశిగహన, మహాశకట మండప సంమోహన, అస్థిభంగ, తప్తశ్చల తమోగుడ బహుదుఃఖ మహాక్లేశ, కశ్మల, సమల, ముహాలాహల విహాప, స్వహాప, యామానుగ ఏకపాద త్రిపాద, తీవ్ర అచీవ, తమ, అను నాయకులు ఒకొక్క నరకమున కయిదుగురు చొప్పున ఆర నరకములకు 140 నాయకు లుండిరి. ఇదియును గాక, రౌరవము నకు వంద ఉపనరకములున్నవి. ఇవికాక 140 మహానరక మండలము లున్న వని చెప్పెదరు.

నరకముల పరిమితులు ఇవ్విధంబున వ్యాసుడు నాకు చెప్పియుండెను. అనేక కోట్లజీవుల ననేక కోట్ల కింకరు లనేక విధంబుల జీవుల పాపములను బట్టి యనుభవింప చేయుచుండురు. ఏఏ పాపములకు ఏఏ నరకములు యనుభవింప వలసివచ్చునో చెప్పెద వినుము. అది విన్నంతనే వైరాగ్యము గలుగును.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

## తొమ్మిదవ యధ్యాయము

### నరక యాతనలు

పాపము చేసినవారందరు ఇట్టి నరకాగ్నులయందు తపింపబడు చుందురు. వారి కర్మ క్షయమగు నంతవరకు నరకయాతనల ననుభవించు చుందురు. కొందరి పాపులహస్తములను, శృంఖలములచే దృఢతరముగా బంధించి యున్నత వృక్షశాఖలకు వ్రేలాడదీసి, యమకింకరులు యోజన దూరమువరకు విసరిపడవేయుదురు. అపుడువారు చైతన్యము తప్పియుందురు.

మరలయమదూతలు ఆజీవుల నంతరిక్షమునకు గొంపోయి శతబారువుల బరువు గలలోహాండ్లను వారిపాదములకు గట్టుదురు అప్పుడువారు పీడింప బడుచు పూర్వపాపములను స్మరించుకొనుచు నిశ్చలులై యుందురు. వీరి పాపకర్మలచే భటులు యగ్నితేజంబుగల లోహాంశముల తోడను దారుణదండములతోను కొట్టుచుందురు. కొందరుపాపులను కణకణలాడు అగ్నికణములు శరీరమంతయు పోయుదురు. అగ్నికణంబులు మాటిమాటికి పోయుచుండ జర్జరీకృత దేహులై యుందురు. తదుపరి సకలాంగములు చీల్చివేసి యాఖండములను లోహపెనములలో వేసి వంకాయ ముక్కల వలె మెత్తగా ఉడికించి క్రిములతో కూడిన మలకూపమునందు పడవేయుదురు. మరల మేదోసృక్పూయ కూపములయందు పడవేయుదురు. అనగా క్రొవ్వు, రక్తము, చీములచే నిండిన నూతులయందు పడవేయుదురు. కొందరిని, లోహతుండములు గలవాయసములచేతను, తీక్ష్ణక్రిములచేతను భక్షింపజేయుదురు. మరల కుక్క, వృకవ్యాఘ్రములు మొదలగు రౌద్రవిక్రుతాననలచే భక్షింపబడు చుందురు. కొందరిని ప్రదీప్తమైన యంగార రాసులయందు మీనంబులవలె కాల్చివేయుదురు. కొందరు పాపులను శూలములచే భిన్నములు చేయుదురు. కొందరు ఘోరపుపాపులను తైల యంత్రములందు బడవైచి గిరగిరతిప్ప తిలలవలె పిండిపిండి యగుదురు. కొందరిని తప్తలోహ ఖండములయందు పడవేచి దహింపజేయుదురు. కొందరిని సలసల కాగెడు నూనెపాత్రలయందు పడవైచి ఉడకబెట్టెదరు. కొందరి హృదయములయందు జిహ్వలయందు పదములయందు మరగ గాచిన తైలము పోయుదురు. తత్ఫలంబున శరీరమంతయు మహాయాతనల ననుభవింప చేతురు, పాపకర్మలను బట్టి నొక నరకము తరువాత మరియొక నరకమును ననుభవించిప చేతురు. నరకములందు యమయాతనలు కడు విచిత్రములుగ నుండును. సర్వాంగముల నతికష్టపెట్టు చుందురు. మండుచున్న కొరకంచులను మొకముపై కొట్టుచుందురు రాగికడ్డీలను కాల్చి మాటిమాటికి వాతలుపెట్టెదరు. మరగ గాచినతైలంబులు ముఖముపై పోయుదురు. ఇటునటు ఈడ్చిత్రిప్పుచు కొట్టెదరు. క్రిములతో కూడిన చీము, మూత్రపురీషములు శరీరములకు పూసెదరు. అగ్నిచే కాల్చిన

లోహస్తంభములను కౌగిలింపజేతురు. కాలినశిలలచే పృష్ఠప్రదేశమున కాల్చెదరు. గునపములచే నంతములను ఖండించెదరు. ఘోరకర్ములను శిరఃప్రభృతి సర్వాంగములను రంపములచే పసించెదరు. భుజించుటకు స్వమాంసము నిచ్చెదరు. స్వరుధిరము పానమున కిచ్చెదరు. వారికి దోషఫలములచే నన్నపానముల పెట్టకుందురు. వాడ్గరంబులచే నిక్షుఖండములు ఛ్ఛేదించినట్లు జర్జరీభూతగాత్రుల చేయుదురు. ఇంకను అశితాళవనమందుంచి ఖడ్గములచే ఖండఖండములుగా ఖండించెదరు. కొందరిని ముందుగా సూదులు శరీరమంతయు గ్రుచ్చి తదుపరి తప్తశూలాగ్రములచే పొడిచెదరు. ఇన్ని బాధలు పెట్టినను మహాతీవ్ర లనుభవించుటయే గాని మరణించెద మన్నను మరణింపరు. ఈ శరీరములచే నిత్య సుఖదుఃఖము లనుభవించుచునే యుందురు. శరీరమునుండి మాంసమును నెలుపలకు తీసి ముద్గరములచే మోదుచుందురు. విశితీక్ష్ణశూలముల ఘోరభటులచే కోసించెదరు. ఉచ్ఛ్వాసనిశ్వాసలు తీసికొనుటకు సందులేని నిప్పుల త్రొక్కెదరు. రౌరవనరకమునందు వేసి నగ్నముగా నింపునపుడు మహాఘోరనరకమందు నింత దుఃఖ పెట్టి మహాతగాధ పెట్టుదురు. తప్తలోహశంఖులచే పాద, ముఖ, గుద, శిరో నేత్రములయందు గ్రుచ్చెదరు. వేడి ఇసుకలయందు మాటిమాటికి దొర్లింపుచుందురు. తప్తమైన జంతుపంకములయందు విసరి పడవేయుదురు. అప్పుడువారు మొర్రోయని యాక్రోశింతురు. మహాపాపులను కుంభీపాకనరకమందు తప్తతైలములలో పడవేసి మసిలింతురు. ఘోరపాపులను ఇట్టి యసహ్యకరములగు యాతనల ననుభవింప జేయుదురు. ఈపాపాత్ములను లాలాభక్ష్య కూపంబుల బడద్రోచి క్రమముగ నన్ని నరకముల ననుభవింపజేతురు. మహాపాపులను క్రోధాయుతముగు సూచీముఖ నరకయందు పడవేయుదురు. పుణ్యవిహీనులగు పాపులందరిని యమభటులిట్లు కొట్టి బాధించుచుందురు. మరియు లోహకుంభములయందు పడవైవ ఉచ్ఛ్వాస నిశ్వాసలు సలుపక బాధపడుచుందురు. మానవులు వారివారి పాపముల ననుభవించి, దహింపబడుచుందురు. కొందరిని దృఢముగు త్రాళ్ళచే బంధించి రాళ్ళలో నీడ్తురు. అంధకూపముల యందు పడద్రోచి భ్రమరములచే పొడిపించెదరు. కొందరిని ఘోరక్రిములచే పొడిపించి శిథిలదేహులజేసి తీక్ష్ణ

క్షార కూపములయందు పడద్రైతురు. మహాపాపులగు వారందరు మహాజ్వాలా నరకములయందుబడి మిక్కిలి క్రాంతులయ్యెదరు. ఈజ్వాలల బాధ లేక ఇటునటు పరుగిడు చుందురు. రజ్జువులచే నడుమునకు బంధించి ఈడ్చెదరు. కొందరిని యవయవములన్నియు మడిచియుండగా జేసి యగ్నిజ్వాలలలో పడద్రైతురు. కొందరిని రజ్జులచే బంధించి బురదలో పడవేయుదురు. కొందరిని పిడకజ్వాలలయందు పడవేయుదురు. కొందరిని కఠిన శిలలయందు పడద్రైచిమోదుచు తృణములవలె పైకెగరద్రైచి మాంస శోణి తాస్థివిష్టర, పూయముల యందు పడవేతురు. కొందరిని కొట్టుచు పర్వతములనుండి క్రిందపడవేయుదురు. కొందరిని తప్తవజ్రములచే శరీరమంతయు దువ్వెదరు. కొందరి పాదములను బట్టుకొని యగ్నిలో బడవేయుదురు. కొందరి ముఖముల గాల్చిన గదలను గ్రుచ్చెదరు. పాపులా గదలను కొరుకుచుండ ముద్గములచే మోదుచుందురు. ఇవ్విధంబున పాపాత్ములను నరకములయందు బాధించెదరని వ్యాసుడు చెప్పియుండెను.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## పదియవ యధ్యాయము

### చేసిన దుష్కృతములకు తగిన ఫలితములు

మిథ్యా లాపములాడు వారిని, ద్విజిహ్వ నరకము నందు పడద్రైచి జిహ్వను యర్ధక్రోశదూరము వరకు లాగి తీక్ష్ణహాలంబులచే పీడించెదరు. తలితండ్రులను, గురువును తిరస్కరించి నిందించిన వారలకు, క్రిములతో గూడిన మలమును నోటినిండ పూరించి కొట్టెదరు. శివాలయములను, శివారామములను, అందున్న వాపీ కూప తటాకంబులను, బ్రాహ్మణ స్థలములను పాడుచేసి యందు విహరించుట, యిట్టి పవిత్ర స్థానములందు కామార్తులై, యభ్యంగ స్నాన పాన భోజనము లొనర్చుట, క్రీడా మైథునద్యూతము

లోనరించుట మదోన్మత్తులై తిరుగుట మొదలగునవి చేయుటచే, నరక వాసులగు జేసి ఇక్షుఖండములు యంత్రములచే పీడించు నట్లు యిట్టిపాపులను పీడించెదరు, ఇట్టివారు ప్రళయ కాలపర్యంతము నరక మందుండెదరు.

పరదారలను ప్రేమించెడి వారలను సుతప్త లోహస్త్రీల నాలింగనముల చేయింతురు. పూర్వము తానే పరస్త్రీని ప్రేమించి యాలింగన మొనర్చెనో, యట్టితప్తలోహ స్త్రీని గావించి యాలింగన మొనరించెదరు. వీటిచే నిట్టిపాపులు దుఃఖించెదరు,

సత్పురుషుల నిందలు విన్న వారల కర్ణంబుల లోహంబులు కరగించియు, పాలు తైలంబులు మరగ కాచి కర్ణ రంధ్రంబుల నింపెదరు. ఇవి యొక దాని తరువాత నొక టనుభవింపజేతురు. ఏ ఇంద్రియములచే తప్పుచేసిన నాయింద్రియముల నిగ్రహ బాధించెదరు, మూఢులై కామ దృష్టిచే పరస్త్రీని స్పృశించినచో, నతని హస్తములు కణకణలాడు నెఱ్ఱని బూడిదలో గాల్చెదరు. అటుపై నకల లవణంబులు బూసెదరు.

పతివ్రతల ముఖంబులను కోపముచే గాంచిన వారల ముఖంబుల గునపశంఖువులచే పొడిచెదరు.

పరస్త్రీలను గాంచిన చక్షువులు పరపురుషుని గాంచిన చక్షువులు స్పృశించిన హస్తములు విలుప్తమును చేయుదురు.

పరస్త్రీని కామముతో వీక్షించినను, పరపురుషునినివీక్షించినను, నరక మందు వారి నేత్రములు సూదులచే గ్రుచ్చి యంధుల గావించెదరు. వీటిలో నసత్య మింతయు లేదు, సుమార్గులకిది నిజము.

దేవాగ్ని గురు విప్రులకు బెట్టకుండ, నెవరు భుజింతురో వారిముఖములు తప్తలోహ కీలములచే పీడించెదరు,

దేవాలయము నందలి పుష్పములు వినోద విలాసములకై కోసినను, యాఘ్రాణించినను, శిరమున ధరించినను, వారి శిరోముఖ హస్తంబులు, తప్త లోహ కీలంబులచే కాల్చి, లోహ కడ్డీలచే మోదుచు క్షారాదు లన్నియు నాశిక యందు పోసెదరు.

మహాత్ములను, పురాణములు జెప్పు వారిని, ధర్మాత్ములను, గురువుల ను, యగ్నిని, యుపదేశకులను. భక్తులను నిందించిన వారల శిరములయందు కంఠముల యందు, జిహ్వల యందు, దంత సంధుల యందు, దవడలయందు, పెదవులయందు, నాశికల యందు, హృదయములందు, సర్వాంగ సంధుల యందు, తప్తములైన యగ్ని వర్ణంబులుగల త్రిశూలశంఖుల చేతను ముద్గర ముల చేతను, భేధించి గాయములందు తీక్ష్ణములైన క్షారములను పూసి క్రమముగ నన్ని నరకముల ననుభవింప జేతురు.

పరద్రవ్య మపహరించినను, పాదంబులచే విప్రులను తన్నినను, పూజాద్రవ్యంబులు మంగళకర వస్తువు, గోవులు జ్ఞానలిఖితములైన పుస్తక ములు తన్నిన వారల పాదహస్తములనుండ భారమువేసి పీడించి బహునరక వాసుల జేయుదురు.

దేవాలయములందు, దేవతావనంబులయందు మూత్రపురీషములను, విడిచిన వారలయండశిశ్నములను, లోహముద్గరంబులచే చూర్ణముచేసి, నెర్ర గాగాల్చిన సూదులచేగుచ్చి మూత్రదేశములందు క్షారము పూసి, సకలేంద్రి యములకు పీడగల్గించెదరు.

ధనముగల్గి దానంబుచేయకున్నను, సకాలమున గృహమునకేతెంచిన యతిథులకన్నమిడక యవమానించినను, దుష్కరములైన నరకము లనుభ వింపజేసెదరు.

వాయసశునకంబులకు బలులివ్వకుండ భుజించిన వారి కంఠముఖము లను, లోహకడ్డీలచే గొట్టి, క్రూరజంతువులచేతను, యుగ్రతుండంబులు గల వాయసంబులచే పొడిపించి నుగ్రవస్తువులచే పీడించెదరు. ఇట్టిబలులు వేయ కున్న వారిని యమమార్గమున శ్యామశబలము లనెడి యిరువురడ్డుకొని పీడించె దరు. బలులిచ్చినచో వారిబాధయుండదు. శ్యామశబలభూతంబు లీబలులు గ్రహించుగాకయని భుజించునప్పుడు ముందుగా బలులీయవలెను.

మరియు పుణ్యకర్ములగు వాయసమూలారా! నేను శివపూజానంత రము మీకు హోమరూపమున బలులిచ్చుచుంటిని, నే వేయు బలులు గ్రహిం

పుడని పలుకుచు శివమంత్రముచే బలులిచ్చినచో నెన్నడును యమునిగాని, యమలోకముగాని చూడరు.

శ్లో॥ శ్యామశ్చశబలశ్చైవ యమమార్గానురోధకౌ
యౌ స్తస్తాభ్యాం ప్రయచ్ఛామితౌగృహ్ణీతామిమంబలిం.

శ్లో॥ యేవావరుణా వాయవ్యా యామ్యానైరుత్యా వాయసాః
వాయసాపుణ్యకర్మాణ స్తే ప్రగృహ్ణన్తుమేబలిం

శ్లో॥ శివమభ్యర్చ్య యత్నేనహుత్వాగ్నౌవిధిపూర్వకం
శైవమంత్రైర్బలింయేచ దదంతేనచతేయమం

శివు నర్చించి విధిప్రకారము. బలిహోమము చేసినచో యము నెన్నడును దర్శింపరు. ప్రతిదినము సవ్విధంబున బలులిచ్చినచో త్రిదివమును దర్శింపగలరు. ఒకపవిత్ర ప్రదేశమున, చతురస్రమండపము చేసి, సుగంధగంధాక్షతలుజల్లి, ఈశాన్యదిశయందు ధన్వంతరికి తూర్పుదిశయందు ఇంద్రునకు దక్షిణదిశయందు యమునకు పితృదేవతలకు, పశ్చిమదిశయందు, సుద క్షోమునకు బలులుంచి తదుపరి తూర్పుదిశయందు యూప్యునకు, ధాతకు, విధాతకు, ద్వారప్రదేశమున బలులివ్వవలెను తదుపరి శ్వాన శ్వపతులకు, యొత్తివిసిరి భూమిపై బహునట్లు బలులువేయవలెను. ఇవన్నీ వాయసబలులు. తదుపరి దేవపితృ మనుజప్రేత భూతగుహ్యకులకు, పక్షిక్రిమికీటకములకు, గృహమందు జీవించెడి జీవులకు, స్వాహాకార, స్వధాకార, వషట్కారంబులతో, హోమములుచేయవలెను. తదితరులకు హంతకారములతో హోమములు చేయవలెను. గృహస్థులకీనాల్గు విధంబులు గోవునకు నాల్గు స్తనములవలె నొప్పుచుకోర్కెల నొసంగుచున్నవి.

అనగా, స్వాహాకార స్తనమందు దేవతలు, స్వధాకార స్తనమందు పితరులు, వషట్కార స్తనమందు ఇతర దేవతలు, భూతములు, హంతకార స్తనమున మనుజులు గృహస్థగోవునందలి స్తన్యములను సతతము పానముచేయుచుందురు. అనుస్యూతముగ వచ్చుచున్న యీగోవును మనుజులు విధిప్రకారముగ నర్చించి భుజింపవలెను. మనుజుడు సతతము నీయగ్నిని సేవింపవల

యును. పీటని త్యజించినవారు నరకమునందు కూలెదరు. ఈ విధముగా బలులిచ్చి కొంతతడవు గృహద్వారమునందు నిలబడి గ్రామస్థులుగాని యతిథులకై నిరీక్షించుచు స్వగ్రామవాసియైనను క్షుధార్తుడై వచ్చినచో శక్తియనుసారముగా భోజనమిడి తాను భుజింపవలయును. గృహమున కతిథి వచ్చి నిరాశుడై చనినచో యజమాని సుకృతములను గ్రహించి తన దుష్కృతము లతనికిచ్చి చనును. అతిథికోరిన వస్తువులు పెట్టనిచో నట్టివారు బంధింపబడిన జిహ్వాగలవారై చిరకాలము నరకవాసులగుదురు. మరియు వారిమాంసము తిలప్రమాణముగా ఖండించి యామాంసరుధిరములు వారిచే భుజింపజేసి తదుపరి కొరడా కఱ్ఱలచే నతిగా మోదుచు నాకలిదప్పులచే పీడింతురు. పాపకర్ముల నిట్టియాతనల ననుభవింపజేతురు. బహుపాపములు చేసి స్వల్పపుణ్యము చేసినవారును; బహుపుణ్యముచేసి స్వల్పపాపము చేసినవారును ఎట్టి గతినిపొందెదరో జెప్పెదవినుము.

బహుపాపముజేసి స్వల్పపుణ్యముజేసిన ఆపుణ్యము గణనకురాదు. ఈపాపముచే బహుభోగములున్నను వానికి సుఖముండదు. అట్టివాడు పాపములచే పీడింపబడుచు సుఖముల ననుభవింప జాలడు. అట్టి వారు నాకన్ని భోగములున్నను యనుభవించుటకు యోగ్యత లేదని దుఃఖించుచుందురు. ఎంత ధనవంతుడైనను పూర్వజన్మమున ఇతరులకు పెట్టనివాడు రోగభూయిష్ఠుడై భుజించుటకు హితవులేకుండుట తిన్నది యరుగకుండుట జరుగును. ఇట్టివాడేమియు తినకున్నను తనధనము దాచుకొని అన్నయు తిన్నవానివలె సంతృప్తి పడుచుండును. వారివారి పాపములచే వజ్రాయుధముచే శిరములు ఖండింపబడు నట్లు ఖండింపబడుచుందురు.

శివ మహాపురాణమందలి ఉమాసంహితయందు

పదవఅధ్యాయము సంపూర్ణము

---

# పదునొకండవ యధ్యాయము

## అన్నదాన మాహాత్మ్యము

వ్యాసుడు సనత్కుమారుని ఇట్లు ప్రశ్నించెను. "పాపజీవులు యమమార్గమున పాట్లుపడకుండ ఎట్లుచనెదరో అట్టిధర్మంబులను చెప్పుమన నా సనత్కుమారుడిట్లు చెప్పదొడగెను. విచారింపక చేసినకర్మ లనుభవింప వలయును. అట్టిశుభాశుభ కర్మలను గూర్చి చెప్పెదవినుము. దయాన్వితులై సౌమ్యచిత్తులై శుభకర్మలు చేయువారు భయానకమైన యమమార్గమును సుఖముగా దాటుదురు. ఉత్తమబ్రాహ్మణులకు పాదుకలు దానముచేసి నవారు యమమార్గమును సుఖముగా జనెదరు. ఇట్టివారి నశ్వారూఢులచేసి సుఖముగా గొంపోయెదరు. ఛత్రదానముచేసినచో ఛత్రమువేసి గొంపోయెదరు. శిబికాదానముచేసినచో రథారూఢునిచేసి గొంపోయెదరు. శయ్యాసనములు దానముచేసినచో సుఖముగా విశ్రాంతిగా గొంపోయెదరు. ఆరామములయందు వృక్షములుపాతి నీడగల్గించినను బాటలకిరువైపుల వృక్షములనాటి నీడనుగల్గించినను ఎండతగలకుండ నీడలుకల్గించుచు గొంపోవుదురు. పుష్పవాటికలు నిర్మించిన వారలను పుష్పకవిమానములపై గొంపోదురు. దేవాలయములు నిర్మించినవారలు యమసన్నిధికి ఆడుచు పాడుచు నేగెదరు. సన్యాసులకు మఠములు కట్టించిన వారలు యనాథశరణాలయములు నిర్మించిన వారు యమునిగృహద్వారములందు క్రీడించుచుందురు. దేవాగ్ని గురుపూజలను, మాతాపితరులను పూజించిన వారలు సర్వసుఖములతో యమపురికేగెదరు. దీపదానమిచ్చినవారు ప్రకాశమానమైన వెలుగులో సుఖముగా యమాలయమునకేగెదరు. గృహదానము చేసినవారు రోగరహితులై సుఖముగా యమపురి కేగెదరు. గురుశుశ్రూషకులు సుఖముగా విశ్రమించుచు పోయెదరు. విప్రులకు దానమిచ్చువారిని వాద్యఘోషంబులతో గొంపోయెదరు. గోదానము చేసినవారలు సర్వకామ సమృద్ధులనుభవించుచు జనెదరు. అన్నపానములు దానముచేసినవారికి సమృద్ధిగా అన్నపానంబు లొసంగుచు గొంపోవుదురు. పాదప్రక్షాళనకై జలమొసంగిన వారలను జలప్రదేశమున సుఖముగా గొంపోవుదురు. పాదములొత్తినవారిని యశ్వారూఢులచేసి గొం

పోవుదురు. గృహదానముచేసి దీపమునకు భుక్తికినొసంగినచో యమబాధలు గలుగవు. హేమరత్నములు దానముచేసినచో నెట్టి కష్టములనైనను దాటి పోవుదురు. రౌప్యమును వృషభమును దానముచేసినచో సుఖముగా యమ లోకమునకరిగెదరు, తదుపరి వీరు స్వర్గమున కేగి యనేకసౌఖ్యము లనుభవింతురు. అన్నిదానములకంటె అన్నదానము ఉత్కృష్టమైయుండెను. ఇది సద్యః ప్రీతికరమైనది గాన దానితో సరియగు దానమింకొకటిలేదు. ఇది సంతోషమును బలమును వృద్ధిచేయును. గాన దానితో తుల్యమగున దేదియు లేదు. అన్నముచే జీవులు వృద్ధిపొందుచున్నవి. అన్నములేనిచో మరణించుచున్నవి. దానిచే రక్తము, మాంసము, క్రొవ్వు, శుక్రము క్రమముగ వృద్ధి నొందుచున్నవి. శుక్రముచేతనె జీవోత్పత్తి గలుగుచున్నది గాన జగత్తంతయు అన్నమయమని చెప్పుదురు. ఆకలిగొన్నవాడు హేమరత్న గజాశ్వంబులచేతను నారీస్రక్చందన నాదులచేతను ఇంకను సమస్తము సంప్రాప్తమునను సంతసించడు. అన్నమున్నచో భోగములకాశించును గాని లేకనాశింపడు. దేవదానవ రాక్షసులైనను గర్భమునందున్నను జన్మించినను బాలవృద్ధమధ్యములైన నాహారమునే కాంక్షింతురు. అన్నిబాధలకంటె నాకలిబాధ ఎక్కువ. ఆకలితో సమానమగు బాధయులేదు. అన్నముతో సమానమైన ఔషధమునులేదు. ఆకలి అన్నౌషధముచే గాని నశింపదు. దానితో సమమగు దుఃఖము మరియొకటిలేదు. ఆకలితో తుల్యమగు రోగములేదు. ఆరోగ్యముతో సమానమగు సుఖమగునది లేదు. క్రోధముతో సరియగు శత్రువులేదు. అన్నదానముతో సమానమగు నదియులేదు. కాన యన్నదానము మహాపుణ్యమని చెప్పుదురు. సర్వదేహులు నాకలిబాధచే మృతినొందెదరు. అన్నదాతలు ప్రాణదాతలని చెప్పబడుదురు. ప్రాణదానముచే సర్వదానముల ఫలము లభించును. కాన అన్నదానముచే అన్నిదానములుచేసిన ఫలము వచ్చును. ఎవరియన్నముతిని పుష్టినిచెంది పుణ్యకార్యములు చేయునో వాని పుణ్యఫలములలో సగము దాతకుచెందును. సందియములేదు. అన్నదాతలు త్రిలోకములందలి రత్నములు సకలభోగములు, సకలవాహనములు స్త్రీల ననుభవింతురు. అన్నదానముచే నిహాముత్ర ఫలభోగముల నందగలరు. ధర్మార్థకామమోక్షముల కీదేహము పరమసాధనమైనది గాన నీదేహము నన్న

పానాదులచే పోషింపబలయును. అన్నము సర్వజీవులకు నాధారముగాన దానినందరు ప్రశంసింతురు. అన్నదానముతో సమానమగునది "నభూతో నభవిష్యతి" అని చెప్పుదురు. ఈ విశ్వమంతయు అన్నముచే భరింపబడు చున్నది. లోకమునందలి జీవులన్నియు నన్నముచే ప్రతిష్ఠింప బడియున్నవి. తన క్షేమము కోరుకొనువారు కుటుంబమును పీడించియైనను. విప్రులకు భిక్షుకు లకు నన్నదానము చేయవలెను. అర్థులకన్న మిడినచో భగవంతుడు నిధులను ప్రసాదించును. అనార్త్తుడగు బ్రాహ్మణునకన్న మిడినచో పరలోకసుఖములు గల్గును. ఐశ్వర్యములను గోరువారు సకాలమునకువచ్చిన బ్రాహ్మణు నర్చింప వలెను. మార్గమునబడలిక చేనలసివచ్చినయతిథులను కోపమూనక మత్సరము లేక నర్చించి యన్నమిడినచో నిహపరసుఖముల నందెదరు. గృహమునకు నేతెంచిన వారెవ్వరిని నిందింపరాదు. చండాలునకైనను సునకమునకైన నన్న మిడినచో దానిఫలమూరకపోదు. ఏజీవికైనను అన్నమిడినచో సఫలమే యగును. అన్నదానమునకు పాత్రాపాత్ర విచక్షణములేదు. మార్గముచే నల సినవానికి ఎన్నడెరుగని వానికి అన్నమిడినచో సర్వసమృద్ధులు గల్గును. దేవ తలను పితృదేవతలను, విప్రులను, యతిథులనన్నముచే తృప్తిపరచిన మహా పుణ్యఫలము లభించును. శూద్రుడైనను అన్నదానము లొసంగినచో విశేష ఫలములభించును. శూద్రులు వంటకములతో భూరిదేయించి విప్రులకు భోజన మొసంగవచ్చును. దేశకాల గోత్ర నామధేయములు నడుగకయే యన్న దానముచేసినచో ప్రళయమువచ్చువరకు స్వర్గమందుండెదరు. అన్నదాన మనెడు మహావృక్షము సర్వకాలములందును ఫలములిచ్చుచుండును ఇట్టివారు స్వర్గమందు సంతోషముతో నుండెదరు. అన్నదాతలకు స్వర్గమందు ప్రత్యేక ముగా నొకస్థానము సృష్టించెను. వారందరు సుఖముగా నుండెదరు. వీరదివి యందు ప్రకాశమానమైన భవనములందు విహరింపుచు అనేకసంస్థాన భోగ ముల ననుభవించుచు సాలంకృతుల ననుభవించుచుందురు. సర్వకామ ఫల వృక్షములు వారిభవనములయందుండును. వారుండు ప్రదేశమున హేమవాపీ కూపతటాకములు సరోవరంబులు నంటియుండును. పుణ్యాత్ములుచేయు దాన ములు సహస్రవిధంబుల ఘోషింపుచుండును. అటవారికి భక్ష్యభోజ్యంబులు వస్త్రాభరణంబులు పర్వతరాశులవలె విరసియుండును. ఇంకను క్షీరసరోవరం

బులు ఘృతపర్వతంబులు పాయసములాభముల్తైన ప్రాసాదంబులు. కనకోజ్వలములైన శయ్యలు నట వారిననుభవింతురు గాన నాలోకమును గోరువారన్నదానముచేయవలెను. దానిచే నిహపరసౌఖ్యముల ననుభవింతురు. అన్నదానముచే ఇట్టిప్రకాశమానమైన లోకభోగము లనుభవింతురు గాన మానవులు విశేషముగా నన్నదానముచేయవలెను. అన్నమే ప్రజాపతి.అన్నము సాక్షాత్ విష్ణుమూర్తి. అన్నముస్వయముగా శంకరుడు. అన్నము త్రిమూర్తి స్వరూపము గాన అన్నదానముతో సరితూగుదాన మింకొకటిలేదు. దానిచేసర్వపాపములు నశించి స్వర్గప్రాప్తి లభించును. అన్నము, జలము, అశ్వము గోవు, వస్త్రము, శయ్య, ఛత్రము, ఆసనములను నీయుట్టిదానములు ప్రేత లోకమున విశేషముగా ప్రశంసింతురు. ఈదానములనే జీవులు విమానముపై యమలోకమున కేగెదరు. ఈయన్నదాన ప్రభావ వర్ణనము విన్నను పఠించినను, పఠింపజేసినను సర్వసమృద్ధులుగల్గి యుండును. శ్రాద్ధసమయమున భోక్తలకు దానిని చదివి వినిపించిన పితృదేవతల కక్షయమైన యన్నదానమును చేసిన ఫలము వచ్చును.

శివ మహాపురాణమునందలి ఉమాసంహితయందు
పదునొకొండవ అధ్యాయము సంపూర్ణము

---

## పండ్రెండవ యధ్యాయము

### తపో మాహాత్మ్యము

అన్ని దానములలోను పానీయ దానంబు మిక్కిలి యుత్తమమైనది. సర్వజీవులకు దానిచేతనె తృప్తి గలుగుచుండును. ఈదానము నెన్నడు మానక నిచ్చుచుండవలెను. మహాసందర్భమగు జలాశ్రయ నిర్మాణములు నిహపర లోకసుఖంబుల నిచ్చును గాన వాపీ కూప తటాకంబులు నిర్మింపవలెను. ఇందలి నీరు సాధువులు, గోవులు, విప్రులు, నితర పశు పక్షులు గ్రోలి యజమానుని పాపములో సగము పాపము పోగా

పైదరు. నిర్మాత వంశము వృద్ధియగును. వేసవియందు నీరులేని ప్రదేశముల యందు చలివెంద్రలపెట్టిగాని లేక, యేవిధంబునగాని నీరు ఒసంగినచో నెన్నడు దుఃఖంబులనొందడు. తటాకములు నిర్మించినవారు ముల్లోక పూజితులగుదురు. దీనిచే మిత్రుని దుఃఖము కూడ నశించి మైత్రి కల్గి కీర్తి కల్గును. ధర్మార్థ కామములు సిద్ధించును. తటాకముల యందు చతుర్విధ జీవులు తృప్తి నొందుదురు గాన వీటిచే నుత్తమ శ్రేయస్సుల నొందగలరు. దేవ మనుజ గంధర్వ పితృ నాగ రాక్షసు లందరు స్థావర భూతంబులన్నియు జలాశ్రయముల నాశ్రయించియుందురు. తటాకము నిర్మించిన దాతకు వర్షఋతువునందు నిత్యాగ్నిహోత్రము చేసిన ఫలమును శరదృతు సలిలంబుచే గోసహస్రదాన ఫలంబును హేమంత శిశిర ఋతు సలిలంబులచే బహుయజ్ఞంబులు చేసిన ఫలంబును బహు సువర్ణ దానము చేసిన ఫలంబును వసంత గ్రీష్మ ఋతువుల యందలి సలిలముచే నతిరాత్ర మఖంబు చేసిన ఫలంబు లభించును.

ఇక వృక్షారోపణ ఫలములు చెప్పెదవినుము. వృక్షనిర్మాణములచే పూర్వాపరములందున్న పితృదేవతలందరు తరించెదరు. మరియు కాంతారములయందు వృక్షములు నాటినచో నావృక్షములే వృక్షారోపకులకు పుత్రులై జన్మింపగలరు. ఇట్టివాడు పరలోకములం దక్షయ ఫలముల నందెదరు. వృక్షంబులు ఫల పుష్పంబులచే దేవతాప్రీతిని గల్గించుచుండును. వృక్షములు ఛాయలచే పాంథులను సంతసపరచుచుండును. మహీరుహంబులు ఈ కారణములచేతనే యందరిచేతను పూజింపబడుచున్నవి. దేవ గంధర్వ మానవులు కిన్నరోరగ రాక్షసులు మహీరుహంబుల నాశ్రయించి యుందురు. పుష్పఫలంబులు మానవుల తృప్తిపరచుచున్నవి. ఇహ పర లోకములయందు ఫలపుష్ప వృక్షములు పుత్రులుగా పరిగణింపబడు చున్నవి. తటాక నిర్మాతలు వృక్షారోపకులు పంచయజ్ఞములు చేసినవారలు సత్యవాదులు స్వర్గ వాసులై యుండి ఎన్నడును చ్యుతులుగాక యుందురు. సత్యమే పరబ్రహ్మ స్వరూపము. సత్యమే పరమ తపము. సత్యమే పరమయజ్ఞము. సత్యమే పరమ వేదము. సత్యము నిద్రించిన వానిని మేల్కొల్పును. అనగా నజ్ఞానము నుండి కండ్లు తెరిపించును. సత్యమే

పరమప్రదము. సత్యముచే భూమి ధరింపబడుచున్నది. సత్యముచే సర్వము ప్రతిష్ఠింప బడెను. తపము యజ్ఞము పుణ్యము దేవర్షి పితృపూజలు ఉదకములు సర్వవిద్యలు సత్యముచేతనే ప్రతిష్ఠింప బడుచున్నవి. సత్యమే యజ్ఞము తపము దానము మంత్రము వాక్కు బ్రహ్మచర్యము ఓంకారము అయియుండెను. సత్యముచే వాయువు వీచుచున్నది. సూర్యుడు తపించు చుండెను. అగ్ని దహింపుచుండెను. స్వర్గము సత్యము చేతనే నిలబడి యున్నది. సత్యబలము చేతనే సర్వదేవతలు పూజింప బడుచుండిరి. సర్వ తీర్థములు సత్యము చేతనే నిలబడుచున్నవి. సత్యముచేతనే లోకము వహింపబడు చున్నది. అశ్వమేధ సహస్రంబుకన్న సత్యమే యధికమైనది. లక్షలాది క్రతువులకన్న సత్యమే విశిష్టమైనది. చరాచరంబులతో కూడిన లోకంబు లన్నియు సత్యము చేతనే నిలబడి సంతోషించుచున్నవి. సత్యమే పరమ ధర్మము. సత్యమే పరమపదము సత్యమే పరబ్రహ్మ గాన నరులు సత్యమునే పలుక వలయును. మునులందరు సత్యనిరతులై ఘోరతపముచేయు చుండిరి. సత్యధర్మముల చేతనే సిద్ధులు స్వర్గవాసులగు చుందురు. సిద్ధులందరు సత్యబలము నాశ్రయించి స్వర్గమందు అప్సరసలతో విమానాధిష్ఠితులై సంచరింపుచుందురు. సత్యమునకు మించిన ధర్మములేదు. తపంబునులేదు. అగాధమైన సత్యతీర్థమున మునుగుటయే పరమ పవిత్ర తీర్థ స్థానమని చెప్పబడెను. ఆత్మార్థమునకై గాని పరార్థమునకు గాని పుత్రార్థమునకు గాని యనృతములు పలుకువారు నిరయమునందెదరు. అనృతవాదులందు వేద యజ్ఞమంత్రము లేవియు శోభింపవు, ఫలింపవని సనత్కుమారుడు పలుక తపోఫలమునుగూర్చి చెప్పుమని వ్యాసుడు బలుక నాత డిట్లు చెప్పదొడంగెను.

సర్వకామ్యార్థ సాధకమైన తపఃఫలమునుగూర్చి చెప్పెద వినుము. తపమే పరమోత్కృష్టమైనది. తపంబుచేతనే సర్వఫలంబులు గల్గుచున్నవి. తపోనిరతులు నిత్యము దేవతలతో కలసి సంతసింతురు. తపంబుచేతనే స్వర్గము యశము సంభవించుచున్నవి. తపంబు సర్వార్థసాధకంబై యుండెను. తపంబుచే గొప్పమహాత్ములు మోక్షము గూడ లభించుచున్నవి. జ్ఞాన

విజ్ఞాన సంపత్ సౌభాగ్యములు, రూపలావణ్యములు, నానావిధ వస్తుజాలములు మనస్సునందున్న కోర్కెలు తపంబుచే లభించుచున్నవి. తపంబు లేకున్నచో బ్రహ్మలోకమెన్నఁడు లభింపదు. తపంబు చేయకున్న శంకరుని పొందలేడు. తపంబుచే నిహపరలోకములం దేవి కోరినను లభించును. సురాపాన, పరదారగమన బ్రహ్మహత్యా పాతకములు గురుతల్ప గమన దోషము మొదలగు సర్వ పాపములు నశించును. సర్వేశ్వరుడగు శివుడు, సనాతనుడగు విష్ణువు బ్రహ్మాగ్ని శక్రాదులు తదితర దేవతలు నూర్ధ్వరేతస్కులగు 88 వేల మునులు తపంబుచే స్వర్గమందు దేవతలతో సంతోషమున కాలము గడుపుచుండిరి. త్రిమూర్తులు తపంబుచే సృష్టి, స్థితి, లయంబులు చేయుచుండిరి. తపంబుచేతనే శక్రునకు సురరాజ్యము లభించెను. తపంబుచేతనే రవిచంద్రులు స్వర్గలోకహితులైరి. తపంబుచేతనే గ్రహనక్షత్రములు ప్రకాశించుచున్నవి. తపంబుతో తుల్యమగు సుఖంబు రాదుగాన నవశ్యము తపమాచరింపవలెను. వేదవేత్తలు తపమునకు మించిన సుఖము లేదని చెప్పిరి. తపంబుచే జ్ఞాన విజ్ఞానంబులు నాయురారోగ్యంబులు రూప సౌభాగ్యంబులు సర్వదా సుఖంబులు గల్గుచున్నవి. తపంబుచేతనే బ్రహ్మ శ్రమలేకుండ విశ్వము సృష్టించుచుండెను విష్ణువు రక్షించుచుండెను. రుద్రుడు సంహరించుచుండెను. క్షత్రియ కులోద్భవుడగు గాధ నందనుడైన విశ్వామిత్రుడు తపముచేతనే బ్రహ్మర్షియై ముల్లోకవిఖ్యాతు డయ్యెను. ఉత్తమమైన తపో మాహాత్మ్యమును చెప్పితిని ఇటుపై అధ్యయన ఫలము చెప్పెద వినుము.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము



# పదుమూడవ యధ్యాయము

## వేదాధ్యయన ఫలము

విప్రుడు వేదమందలి యొక ఋక్కును పఠించినచో వనమందుండి కంద మూలాదులు భుజింపుచు తపంబు చేసిన ఫలంబు వచ్చును. వేదాధ్యయనముచే పుణ్యము లభించును. వేదము మరియొకనికి జెప్పినచో, ద్విగుణీకృతఫలంబు లభించును. సూర్యచంద్రులు లేనిచో ప్రపంచము ప్రకాశహీన మైనట్లు, పురాణములు పఠింపకున్నచో, జగత్తంతయు నజ్ఞానాంధకారమునలెనుండును. గాన సదా పురాణకాలక్షేపము చేయవలెను. అజ్ఞాన తిమిరాంధకారమున తపింప బడుచున్న జనులకు శాస్త్రసమ్మతమైన పురాణములు వినిపించి జ్ఞానోదయము కల్గించు చున్నవాడు గాన పురాణవక్తను సర్వదా పూజించవలెను. అందరి పాత్రులలోను పురాణవక్త మిక్కిలి శ్రేష్ఠుడు. నరకకూపములయందు పడిపోవు చున్నవారిని రక్షించువాడు గాన పాత్రుడని చెప్పబడుచున్నాడు. పురాణ వక్తను భగవంతునిగ నెంచవలెనుగాని మానవునిగ నెంచరాదు. పురాణ వేత్తను బ్రహ్మ విష్ణు మహేశ్వర గురుస్వరూపునిగ భావింపవలెను. ఇహలోక పరలోక సుఖంబులకై పురాణవేత్తకు ధనధాన్య హిరణ్యవస్త్రాదులు దాన మివ్వవలెను. ఇట్లు మహాప్రీతితో దానమిచ్చినచో పరమగతి నొందగలరు. గో భూరథాశ్వ గజంబులు, సత్పాత్రునకు దానమిచ్చినచో నిహపరంబుల యందు సర్వకోరికలొందును ఇంతియు యశ్వమేధ యాగఫలము కూడ లభించును. భూదానముచే మహోత్కృష్టమైన ఫలమువచ్చును. దీనచే తనతో వెనుక పది తరములవారు ముందు పది తరములవారు తరింతురు. ఇహమందు సర్వసుఖము లనుభవించి పరమందు దివ్యశరీరులై దివ్యవిమానారూఢులై శివ లోకమున కేగెదరు. శివాలయంబులయందుగాని విష్ణ్వాలయంబులయందుగాని సూర్యాలయములయందుగాని ఇతర దేవాలయంబులయందుగాని వేదపు రాణములు చెప్పినను చెప్పించినను రాజసూయాశ్వమేధయాగఫలంబులు లభించును. మరియు వారు, సూర్యలోకము భేదంచుకొని బ్రహ్మలోకమున కేగి కల్పశతంబులవరకు నుండి మరల భూమండలాధిపతియై నిష్కంటకముగా రాజ్యము నేలుచు సకల భోగములనొందును. సందియములేదు. దేవుని

ఎదుట జపంబుచేసినవారికి అశ్వమేధ సహస్రంబుల ఫలము లభించును. శివాలయములందు ఇతిహాస పురాణములు చెప్పినచో సర్వదేవతలు సంతోషింతురు. గాన సర్వప్రయత్నములచే దేవాలయములయందు పురాణశ్రవణ పఠనాదులు జరిగింపవలయును. దానిచే సర్వ కామఫలప్రదమై యుండును. పురాణ శ్రవణముచే జనులు నిష్పాపులై ఇహపర సౌఖ్యముల నందెదరు. శివ కథలు వినుటచే రాజసూయాగ్నిష్టోమాది శతక్రతు ఫలంబుల నందెదరు ఈ కథలు విన్న వారందరిని రుద్రస్వరూపులుగా భావింపవలెను. శివ కథలు విన్నచో గోసహస్రంబులు దానము చేసిన ఫలమును, సర్వతీర్థముల యందు స్నానము చేసిన ఫలము లభించును. శివ కీర్తనలు పఠించు వారి పదాంబుజరజంబులు సోకినంతనే సర్వ తీర్థ స్నాన ఫలంబులు లభించును. శివ పురాణశ్రవణముచే సర్వకోర్కెలు సిద్ధించును. పూర్తిగా వినుటకు శక్తి లేనిచో స్వల్పకాలమైనను వినవలెను. ప్రతి దినము నొక ముహూర్త కాలమైనను భక్తి శ్రద్ధలతో వినవలయును. ప్రతి దినము వినుట కశక్యమైనచో పుణ్య మాసములయందైనను వినవలయును. శివ గాథను విన్న వారలు సంసార కర్మ మహారణ్యమును దహించి ముక్తినొందగలరు. శివ పురాణము ముహూర్తముగాని క్షణముగాని విన్నచో దుర్గతి నందరు. ఈ పురాణశ్రవణముచే సర్వయజ్ఞ సర్వదానఫలంబులు లభించును. కలియుగమున ముక్తి నిచ్చు ఫలమింకొకటిలేదు. మనుజులకు పురాణశ్రవణము శివనామ సంకీర్తనము కల్పవృక్ష సమానమై యుండెను. కలియందు ధర్మాచారములు విడిచిన వారలకు దుర్మార్గులకు సమృత తుల్యమగు నీ పురాణమును ఈశ్వరుడు కల్పించెను. ఈ పురాణామృతమును గ్రోలినవారలకు జరామరణము లుండవు. వారి కులములందుండు వారందరు జరా మరణము లేక యుందురు. పుణ్య పురుషులకు తపోవంతులకు నెట్టి ఫలము లభించునో పురాణశ్రవణముచే నట్టి ఫలములభించును. జ్ఞానోదయము గల్గినచో యోగశాస్త్ర మభ్యసించవలెను. లేనిచో పురాణములు వినవలయును. పురాణశ్రవణముచే పాపములు క్షీణించి ధర్మము వృద్ధి యగును. పురాణ జ్ఞానముచే పునర్జన్మ లభించదు. గాన ప్రయత్నముగా పురాణములు వినుచుండవలెను. ధర్మార్థ కామ మోక్షములు యజ్ఞదానాదులు తపస్తీర్థయాత్రలుచేయుచుందురు. యజ్ఞ దానతపస్తీర్థయాత్రలుచేయుచుందురు.

పురాణ శ్రవణముచే నాల్గును సిద్ధించును. పురాణములు లేనిచో మనుజులు ధర్మ మార్గమున క్షణ కాలమైనను నిలువలేరు. వ్యాసరచితమైన 36 పురాణములలో నే యొక్క పురాణము శ్రద్ధాభక్తులతో పఠించినను ముక్తి గలుగుటలో సందియము లేదు. అన్ని మార్గములకన్న పురాణ మార్గము శ్రేష్ఠమైనది. సూర్యుడు లేనిచో జీవుడు జీవింపలేనట్లు పురాణశాస్త్రములు లేనిచో మనుజులు జీవింపలేరు. జీవించినను వ్యర్థము.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
పదుమూడవ అధ్యాయము సంపూర్ణము

---

# పదునాల్గవ యధ్యాయము

## సామాన్య దానములు

నేను చెప్పిన ఈ దానము లన్నియు పాత్రుల కిచ్చినచో తరించెదరు. గో భూ హిరణ్యా దానములు చేసిన వారు గ్రహించినవారు యుభయులు తరింతురు. ఈమూడు దానములు శ్రేష్ఠదానములు గాన వాటిచే సర్వ పాపములు హరించును. మరియు సువర్ణదానము గోదానము భూదానము విద్యాదానము దివిప్రశస్తములై యున్నవి. అన్నిటిలోను అనేక కారణములచే విద్యాదానము శ్రేష్ఠమైనది. సత్యము పాలిచ్చెడి గోవును ఛత్రము, వస్త్రము, పాదరక్షలు, అన్నపానంబులు, సంకల్పపూర్వకముగా విప్రులకు దానమియ్యవలెను. పీడితులై యర్థించిన వారలకు కూడ దాన మీయవలెను. కనకము, కన్య, తిలలు, గజము దాసీలు గృహము రథము మణులు, కపిలగోవు భూమి, అను ఈ దశ దానములు శ్రేష్ఠములని చెప్పబడుచున్నవి. జ్ఞానవిత్తములైన దశదానములు గ్రహింప వచ్చును. ఇచ్చినవాడు వెంటనే తరించును. సందియ ములేదు. పరిశుద్ధ చేతస్కుడై విప్రునకు సువర్ణదానము చేసినచో దేవత లందరకు సువర్ణదానము చేసిన ఫలమువచ్చును. సువర్ణమగ్ని స్వరూప

మనియు నగ్ని సర్వదేవతా స్వరూపుడనియు శ్రుతులు చెప్పుచున్నవి. గాన సువర్ణ దానముచే సర్వదేవతలు తృప్తి నొందెదరు.

పృథ్వీ దానము సర్వదానములలో శ్రేష్ఠమై సర్వకామ ప్రదమై యుండెను. పూర్వము పృథుచక్రవర్తి విశేషముగా సువర్ణదానము చేసియుండెను. భూదానముచేతను సువర్ణ దానముచేతను మనుజులు పాపవిముక్తులగుటలో సందియములేదు. అంతమందు పరమగతినిగూడ నందెదరు. ఇంకను సర్వోత్తమములగు దానములు చెప్పెద వినుడు. దానిచే దుఃఖ దాయకములగు యమ కాననంబు లెన్నడు గాంచరు. పరిశుద్ధమనస్కుడై విధిప్రకారముగా వనదానము చేయవలెను. మరియు ఏదానమునైనను తన శక్త్యనుసారముగా న్యాయార్జితద్రవ్యముతో చేయవలెను. ఒకప్రస్థము తిలలచే గోవును నిర్మించి సువర్ణముచే గోవత్సము నిర్మించి యష్టదళపద్మము నిర్మించి కుంకుమాక్షతలు చల్లి తిలగోవును సువర్ణ వత్సమును స్థాపించి ఇంకను రుద్రాది సర్వదేవతలను స్థాపించి యథావిధిగా స్థాపించి తదుపరి ఈమండపముతో సహా విప్రునకు దానమిచ్చి రాత్రి విశేషముగా దీపములు వెలిగించి నక్తభోజనము చేయవలెను. ఇది కార్తిక పౌర్ణమినాడు బహు విశేషము. ఇదిశక్త్యను సారముగా ఇట్లు చేయుటచే ఘోరమైన యమ మార్గము నరకము నెన్నడు గాంచరు. ఇట్టివారు బంధు మిత్రులతో పదు నారుగురింద్రుల కాలము వరకు స్వర్గమందు సుఖముగా నుందురు. యథావిధిగా నిజగోదానము చేయుట సర్వోత్తమమైయున్నది. దానిని మించిన దానము మరియొకటి లేదు. మరియు వత్ససహితముగా కపిలగోవును తెచ్చి స్వర్ణముచే శృంగముల నలంకరించి వెండిచే ఖురము లలంకరించి పాలుపితుకుకొనుటకై కాంస్య పాత్రనిచ్చి సర్వలక్షణ లక్షితమగు గోదానము చేసినచో నిహపర సౌఖ్యముల నందగలరు, తనకిష్టమైనదియు తనకున్న దానిలో శ్రేష్ఠమైనదియు గుణవంతుడగు విప్రునకు దాన మొసంగినచో నక్షయమైన సమృద్ధులు గలిగి యుండును. ఒకమనిషి బరువుగల ధనము దానము చేసిన నాత్మ శ్రేయస్సు గలుగును. దానిచే హత్యాదోషము బంధన దోషము పోవును. తులాదానము మహాపుణ్యకరమై, సర్వపాప క్షయకరమై యుండెను దీపచే

సకలపాపములు హరించి స్వర్గము నందగలరు. ఉదయమధ్యాహ్న సాయంకాల రాత్రులయందు చేసిన పాపమును మనసా వాచా కర్మణా చేయుపాపములు భారమగు తులదానముచే హరించును. బాల వృద్ధ యువకులు తెలిసి తెలియక చేసిన సర్వ పాపములు తులాదానమునే హరింప జేసెదనని శివుడు చెప్పెను. దానము చేయువాడు తనయొత్తు ధనములో సత్పాత్రదానముకై విభాగించి దానినే పాత్రత ఎరింగి దానమిచ్చు చుండవలెను. నేను కొంత ధనము సత్పాత్రదానమునకై వినియోగించి మిగిలినది పుణ్య కార్యములకై వినియోగించెదనని తలచుకొనుచు పుణ్యకార్యములు చేయవలెను. అనగా తాను యొత్తుధనము తూచుకొని దానిలో సగము ధనము సత్పాత్రదానమునకై వినియోగించి మిగిలిన సగము ధనము తనఇష్టవచ్చిన పుణ్యకార్యములకై వినియోగింపవచ్చును. ఇదియే శివశాసనము. ఇట్లుచేసినవారో సర్వపాప విముక్తులై పదునలుగురు ఇంద్రుల పర్యంతము స్వర్గమందుండెదరు ఈధనము నొక్కరికే యీనవసరము లేదు. తులదాన ముత్యుత్తమమైనది

శివ మహాపురాణ మందలి ఉమాసంహిత యందు
పదునాల్గవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునైదవ యధ్యాయము

### పాతాళ లోకవర్ణనము

ఏదానములచే మనుజులేయే ఫలమునందెదరో తెలుపుమని వ్యాసుడు ప్రశ్నింప సనత్కుమారు డిట్లు చెప్పదొడగెను. సమయాను కూలముగా ఏయొక్క దానముచేసిన అనేక దానములు చేసిన ఫలములభించునో అది చెప్పెదవినుము. ఏకాగ్రచిత్తుడై బ్రహ్మాండదానము చేసినవాడు సప్తలోకాధి పతియగును. మానవులకు బ్రహ్మాండ దానముకన్న ఉత్తమమైన దేదియు లేదు. మేదిని ఎంతవరకు స్థిరముగా నిల్చియుండునో దివాకర నిశాకరు లెంత వరకు ప్రకాశించుచుందురో యంత దనుక బ్రహ్మాండ

దానము చేసినవాడు తనబంధువులతో స్వర్గవాసియగును. మరియు నిట్టి వాడు బ్రహ్మాండములన్నియు సంచరింపుచు విష్ణులోకమేగి మాధవునితో క్రీడించు చుండునని పలుక బ్రహ్మాండము యొక్క పరిమాణమెంత? దీనికా ధారమెవరు? బ్రహ్మాండమెట్లు నిర్మింపబడెనో చెప్పుమని వ్యాసుడు పలుక మరల సనత్కుమారు డిట్లు చెప్పనొడంగెను. బ్రహ్మాండ కదనము సంక్షేపముగా విన్నను సర్వపాపములు హరించును. బ్రహ్మాండములకు వ్యక్తా వ్యక్తుడు ననామయుడునగు శివుడే కారణము ఈపరబ్రహ్మ వ్యక్తావ్యక్తుడై ద్వివిధంబులుగా నావిర్భవించెను. చతుర్దశ భువనాత్మకమైన బ్రహ్మాండ మంతయు ఇతడే సృజించెను. దీనిక్రమమంతయు చెప్పెదను సావధానుడవై యుండుము. పాతాళాద్యధో లోకములు ఏడు భూమ్యాద్యూర్ధ్వ లోకము లేడు కలసి చతుర్దశ భువనంబులయ్యెను భూమి యధోభాగమున జలము క్రింద సప్తలోకంబు లున్నవి. ఈపదునాల్గు లోకములను పాతాళమందు నేషుడుండి భరింపుచుండెను. ఇతడే విష్ణువని చెప్పుదురు. ఇతడు పర బ్రహ్మ ఆజ్ఞాను సారము పదునాల్గు భువనంబులు భరింపు చుండెను. ఈశేషుని గుణంబులు వర్ణించుటకు దేవదానవులైనను సమర్థులు గారు. దేవఋషి సిద్ధగణంబు లన్నియు శేషుని పూజింపుచు ననంతుడని చెప్పుచుందురు. ఇతడు సహస్ర శీర్షంబులు గల్గి సకలదిక్కులను ప్రకా శింప జేయుచుండెను. ఇతడు ఫణిమణి సహస్రభూషణుడై మదఘూర్ణిత నేత్రుడై యగ్నితో గూడిన శ్వేతాచలమువలె ప్రకాశించుచు కిరీట పూలమాలచే నలంకృతుడై మణికుండలశోభితుడై సాయంకాల గంగా ప్రవాహమువలెను, శ్వేత శైలంబు వలెను శోభించుచు నీలాంబరము ధరించి మదోద్రిక్తుడై యపర కైలాసాద్రివలె నొప్పుచు లాంగల, ముస లమును హస్తమున ధరించి స్వర్ణ వర్ణాభులగు నాగకన్యలచే సేవింప బడుచు సంకర్షనుడను పేరుతో రౌద్రుడై విషానల అగ్ని శిఖోజ్వల ప్రకాశ మానమైన కల్పాంతాగ్నివలె మాటిమాటికి ముఖములనుండి అగ్ని శిఖలు వెడలగ్రక్కుచుండును. ఇతడీ జాజ్వల్యమానాగ్ని శిఖలచే ప్రళయమందు సర్వలోకములను సంహరించి శాంతుడగునని శ్రుతులు చెప్పుచున్నవి. ఇతడు పాతాళ వాసియై సకలభువనంబులు ధరింపుచుండెను. అశేషగుణా

న్వితుడగు, శేషు నందరు సేవించవలెను. ఇతని స్వరూపగుణగణంబులు దేవతలైనను వర్ణింపలేరు. ఇతడు అరుణకాంతులు గల ఫణిమణి శిలలచే నశేషమైన భూమంతయును పూలమాలవలె తన వీర్యములచే చరించుచుండును. అతడు మహాఘూర్ణితనేత్రుడై యావలించి నపుడు చరాచరంబులతో గూడిన భూమియంతయు చలించును. పాతాళలోకము లొక్కొక్కటి దశసహస్ర యోజన విస్తీర్ణములై యుండెను అవిఏవన,

శ్లో॥ అతలం వితలం చైవ సుతలంచ రసాతలం.
తలం తాలాతలం చాప్యయం పాతాళం సప్తమం మతం

అతల, వితల, సుతల, రసాతల, తల, తలాతల పాతాళంబులనునవి సప్తాధో లోకములు పాతాళము ఆఖరి లోకము ఇటనే శేషుడు వసించి యుండును. ఈలోకములు ఒక లోకము కన్న మరియొక లోకము ద్విగుణీకృత విస్తారము కలిగియుండెను. ఇవి యన్నియు నొకదానిని మించి మరియొక్కటి రత్నభూములై యుండెను. ఈప్రదేశము లన్నియు రత్నప్రాసాదముల తోడను, సువర్ణభూముల తోడ నొప్పుచుండెను. అట నాగులు, దానవులు, దైత్యులు, వసింతురు, మరియు నటదైత్యసంభవులైన మహానాగులు దానవులు, నివశించుచుందురు. పాతాళలోకమిం దిట్లుండె నని స్వర్గసభలో నారదుడు చెప్పియుండెను, నారదుడు నొకానొక సమయమున పాతాళలోకము లన్నియు సంచరించి యట వైభములన్నియు గాంచి స్వర్గసభలో నిట్లు చెప్పదొడంగెను పాతాళములయందు నానావిధ భూషిత భూషణంబులగు మణులెక్కడ గాంచినను ప్రకాశించుచుండెను. ఆహ్లాదమునకు పరిశుభ్రమునకు పాతాళమునకు మించిన లోకములేదు. పాతాళమందెచ్చట గాంచిన ప్రీతిలేని వస్తువే లేదు. అటనున్న కన్యకలను గాంచినచో దేవతా కన్యకలందరు విరూపలుగా కనిపించుదురు. రవి చంద్రుల కిరణంబులట ప్రసరింపవు. అట శీతోష్ణబాధ లుండవు. కేవలము మణితేజములచే ప్రకాశించును. అచటి వారందరు మోదముతో భక్ష్య భోజ్యాన్న పానములన్నియు భుజింతురు. అవిఅన్నియు సమృద్ధిగా నుండును. రాత్రింబవళ్ళు లేకపోవుటచే నటవారికి కులము తెలియదు అక్కడ పద్మము

లతో కూడిన కమలాకరంబులు సంసు బంధరవ్యులతో కూడిన పద్మములు రమ్యములగు నదీ సరోవరంబులు గలవు. మరియు నచటి వారందరు నతిసుభ్రములైన గంధద్రవ్యములు పూసికొని, సర్వాలంకారయుక్తులై వీణావేణు మృదంగ నిశ్వనములచే గానముచేయుచు నన్యోన్యముగా స్త్రీపురుషులు విహరింతురు. పాతాళ సుఖంబు లన్నియు దైత్యోరగులు అనుభవించు చుందురు. దానవులు సిద్ధమానవులు తపంబుచేసి ఈభోగము లనుభవించు చుండిరని నారదుడు చెప్పియుండెను.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
పదునైదవ అధ్యాయము సంపూర్ణము.

---

## పదునాఱవ యధ్యాయము

### నరకోద్ధార వర్ణనము

ఈ సప్తలోకంబున కధోభాగంబున పాపు లనుభవించు నరకలోకము లున్నవి చెప్పెద వినుము. రౌరవ, శూకర, రోధ, తాల, వివసన, మహాజ్వాల, తప్తకుంభ, లవణ, విలోహిత, వైతరణి, పూయవహ, క్రిమిశ, క్రిమిభోజన, ఘోర, అసిపత్రవన, దారుణ, లాలాభక్ష, హర్గాల, అధశ్శిర, సందంశ, కాలసూత్ర, తమశ్చావి, చిరోధన, శ్వభోజన, మప్తి, మహారౌరవ, శాల్మలి మొదలగు దుఃఖదాయకములగు, బహునరకములు గలవు. ఏ పాపు లే కారణముచే, నరకములందు పడెదరో, చెప్పెద వినుము.

గో బ్రాహ్మణ దేవతల విషయమైగాని, కూటసాక్ష్యము చెప్పినవారును, సదాయసత్యము లాడువారును, రౌరవ నరకము నొందగలరు.

భ్రూణహత్య చేసినవారు, సువర్ణ మపహరించినవారు, గోవుభుజించు గ్రాస మడ్డగించు వారు, విశ్వఘాతకులు, సురాపానము చేసినవారు, బ్రహ్మహత్య చేసినవారు, పరద్రవ్య మపహరించినవారు, ఇట్టి వారితో సహకరించిన

వారు, గురువుని, తల్లిని, సోదరిని, పుత్రికను, గోవును హత్యచేసినవారు, కుంభీపాక నరక వాసులగుదురు.

పతివ్రతా స్త్రీని విక్రయించినవాడు, నమ్మినవానిని మోసగించినవాడును, తప్తలోహ నరకమందు పడుదురు.

గురువు నవమానించువాడు, గురువుకి పెట్టకుండ భుజించువాడు, దేవతలను దూషించినవాడు, దేవతా విగ్రహము దొంగిలించి విక్రయించువాడు, పొందకూడని వానిని పొందినవాడు, సప్తజల నరకమున కేగెదరు.

దొంగతనము చేసినవాడు, గోహంతకుడు, పతితుడు, వేదమర్యాదలను దూషించువాడు దేవబ్రాహ్మణ పితురులను ద్వేషించువాడు శ్రేష్ఠవస్తువులను దూషించువాడు, కృమినరకమందు, కృమి భక్షకుడై యుండును.

దేవతలకు, పితృదేవతలకునిడక భుజించువాడు లాలాభక్ష్య నరక వాసుడగును.

అంత్యజుని సేవించినవారు, దుష్టులను చేరదీసినవారు, బ్రహ్మ, ఉద్గాత, హోత అధ్వర్యుడు, బ్రహ్మణాచ్ఛంసి, ప్రస్తోత, మైత్రావరణ, ప్రతిప్రస్థాత, పోత, ప్రతిహర్త, అచ్ఛావాక, నేష్టు, అగ్నిధ్రవ, సుబ్రహ్మణ్య గ్రావస్తుత ఉన్నేతలనెడు షోడశ ఋత్విక్కు లేకుండ యజ్ఞము చేసినవాడును, అభక్ష్య భక్షకుడు, సోమరస విక్రయుడు, రుధిరౌఘ నరకమందు పడెదరు.

మధువును హరించినవాడు గ్రామహంతకుడు వైతరిణీ నదియందు పడెదరు. నవయౌవనుడై, మర్యాదలను త్యజించినవాడు, సద్వంశజుడై యశుచిగా నుండువాడు, కృత్య నరక గాములగుదురు.

అనవసరముగ వృక్షములు ఛేదించువారు అసిపత్ర నరకవాసులగుదురు, మృగవ్యాధులు వహ్నిజ్వాలా నరకవాసులగుదురు.

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులై యుండి భ్రష్టాచారులైన వారలు, పంచముల గృహముల కగ్ని ముట్టించిన వారలు అసి పత్ర నరకమందు పడెదరు. వర్ణాశ్రమ ధర్మములనురడి చ్యుతులైన వారు సంవంశ నరక వాసులగుదురు.

బ్రహ్మచారికి స్వప్నమందైనను వీర్య స్ఖలన మైనను తన పుత్రులను చదివింపకున్నను, శ్వభోజన నరక వాసులగుదురు. ఇవ్విధంబున దుష్టాత్మ లనేక వేల పాపములు చేసి యనేక నరకంబు లనుభవింతురు. పాపము లను భవింపక తప్పదు. మనోవాక్కాయ కర్మలచే వర్ణాశ్రమ ధర్మ విరుద్ధ కర్మలు చేయువారు నిరయవాసులగుదురు. జీవులు పాప పుణ్య భేదములచే కొందరు ముమ్ముందుగా స్వర్గభోగము లనుభవించి దేవతలచే నధోముఖులుగ క్రిందకు త్రోయబడి నరకయాతనల ననుభవించి వారి సుకృతముల ననుస రించి క్రిమి కీటకాది జన్మలుగాని మంచి జన్మలుగాని పొందగలరు. ముందు గనే నరక యాతనల ననుభవించి తరువాత స్వర్గాది భోగము లనుభవించి, వారి సుకృతముకొలది జన్మింతురు. ధార్మికులు యథాక్రమంబుగ మోక్షము నకూడ పొందగల్గుదురు. ప్రాయశ్చిత్తముచే కొందరు పాపులు నరక విముక్తు లగుదురు. గురుపాపములకు గురుప్రాయశ్చిత్తములు లఘుపాపము లకు లఘుప్రాయశ్చిత్తములు స్వాయంభువ మనువు చెప్పియుండెను. సర్వ పాపములు పోవుటకు సర్వప్రాయశ్చిత్తముల కన్నను, శివస్మరణకు మించిన ప్రాయశ్చిత్తము లేదు. పాపములు తెలిసీ తెలియక చేసినను పశ్చాత్తాపము జెంది శివస్మరణ చేసినచో పాపవిముక్తు లగుదురు. త్రికాలములయందు శివ స్మరణ చేసిన వారలు సర్వపాప విముక్తు లగుదురు. శంభు స్మరణచే సర్వ పాప విముక్తులగుటయేగాక స్వర్గభోగము లనుభవించి ముక్తులగుదురు. జప హోమాదులచే పాపములు పెరుగకుండుటను గరికి రావు. ముల్లోకముల యందు వీటితో శివ భక్తుడై జపహోమాదులు గావించినచో, నాపుణ్యఫల ముచే, మహేంద్ర పదవి పొందగలడు. అహర్నిశంబులు శివ స్మరణ గావించి నచో పుణ్యాత్ము నరకవిముక్తు డగును. పాప పుణ్యములచే నరక స్వర్గములు కల్గుచున్నవి. పాపము దుఃఖకారణము. పుణ్యము సుఖకారణము. సుఖ దుఃఖ ముల నెవ్వరు నీయజాలరు. వారి పుణ్యపాపములచే కల్గుచున్నవి. ఎవరిని నిందింప నవరసము లేదు. పాపాత్ములు పాపములను క్షీణింప జేసికొనని చో మరల పాపాత్ములై జన్మించి దుఃఖమనుభవింపగలరు. ఇట్లే పుణ్యాత్ములును నగుదురు. జ్ఞానమే పరబ్రహ్మస్వరూపము. జ్ఞానముచే తత్వము తెలియబడును. చరాచరములతో గూడిన నీజగత్తంతయు జ్ఞానాత్మక మైన విజ్ఞానము కన్న

నధికమైన దేదియులేదు విజ్ఞానవంతులకు పుణ్య పాపములతో నవసరములేదు. ఇట్టి వాడు మోక్షము నొందగలడు. ఈ నధోమండలములు నరకమండలములు చెప్పితిని. ఇటుపై నూర్ధ్వ మండలంబులు చెప్పెద వినుము.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
పదునారవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునేడవ యధ్యాయము

### జంబూద్వీపవర్ష వర్ణనము

ఇటుపై సప్తద్వీపాది సంయుతమైన భూమండలము గూర్చి చెప్పెదను వినుము. జంబూద్వీపము, ప్లక్షద్వీపము శాల్మలిద్వీపము కుశద్వీపము క్రౌంచద్వీపము శాకద్వీపము పుష్కరకద్వీపములు భూమండలమందు సప్తద్వీపములు సప్తసాగరావృతంబులై యుండెను. లవణ ఇక్షుఘృత, దధిక్షీర సుర జలంబులనెడు సప్తసముద్రములమధ్య జంబూద్వీపము మధ్యగానుండెను. దీనిమధ్య కనకాభమైన మేరుపర్వతము గలదు. ఆపర్వతము 10 యోజనములు భూమిలోపలిభాగము భూమట్టమునకు చుట్టుకొలత 16 వేల యోజనములు 84 యోజనములు ఎత్తు శిఖరభాగమునందున్న పరిమితి 32 యోజనములుగల్గి శిఖరములతో నుండెను. భూమట్టమునందున్న 16 వేల యోజనముల పర్వతము కర్ణికాకారముగానుండెను. దీనిదక్షిణభాగంబున హిమాలయ, హిమకూట నిషధనామక పర్వతములు గలవు. దీనికుత్తరభాగంబున నీల శ్వేతశృంగములనెడు వర్షపర్వతములు గలవు. ఇవిఅన్నియు దశ సహస్ర యోజనంబులు పరిమితిగలవై రత్నవంతములై యరుణప్రభలతో నొప్పుచుండెను. మరియు వీటిలో సహస్రయోజనములు పొడవు సహస్రయోజనములు వెడల్పుకు తక్కువైనవి ఏవియులేవు. వీటిలో మొదటిది భారత వర్షము రెండవది కింపురుషవర్షము మూడవది హరివర్షము ఇవి మేరువునకు దక్షిణముగానున్నవి. కింపురుషవర్షము హరివర్షము కేతుమాలవర్షము, భద్ర

వర్షము, ఇలావర్షము రమ్యకవర్షము హిరణ్మయ వర్షము కురువర్షము అని తొమ్మిది వర్షములు ఇవి యొక్కొక్కటి 9000 తొమ్మిదివేల యోజనముల విస్తీర్ణముతో నొప్పుచున్నవి. మేరువున కుత్తరభాగంబున రమ్యకవర్షము గలదు. ఇది హిరణ్మయాకారమై మేరుసంపన్నమై యుండెను. దీనికి ఉత్తరభాగమున కురు దేశముండెను. దీనినే భారత దేశమందురు. ఈవర్షంబులమధ్య నిలా వర్షముండెను. దీనిమధ్య మేరు పర్వతముండెను. మేరువునకు నలువైపుల 9000 యోజనములు విస్తీర్ణము గలదై ఇలావర్షముండెను. ఇలావర్షమునకు నలుదిక్కుల మేరుతుల్యములగు నాలుగుపర్వతములు గలవు. పూర్వదిశ యందు మందరపర్వతము దక్షిణమునందు గంధమాదన నగము పశ్చిమంబున విపులాచలము ఉత్తరదిశయందు సుపార్శ్వపర్వతము గలవు. అక్కడ కదంబ వృక్షంబులు నేరేడు చెట్లు పిప్పలంబులు మహీరుహంబులు వట వృక్షంబులు గల్గి పదకొండవందల యోజనంబులు విస్తీర్ణముగలవియై యుండెను. జంబూ ద్వీపమని పేరెట్లుగల్గెనో మరియు, వానిస్వభావము చెప్పెదవినుము. జంబూ వృక్షములనుండి మహాగజ ప్రమాణంబులు గల జంబూఫలంబులు పర్వత శిఖరములనుండి దొర్లును నలువైపుల పడుచుండును. ఈఫలరసమంతయు జంబూనదియనిపేరుతో ప్రవహించుచుండెను. అక్కడివారందరును ఈరస మును పానముచేయుదురు. ఈరసపానముచే రోగములు పుట్టవు. దుర్గంధముండదు. ముసలితనముండదు. ఇంద్రియ నిగ్రహులై యుందురు. ఆతీరవాసులందరు సర్వసుఖంబు లనుభవించెదరు. ఆతీరమృత్తికచే సుఖవాయువులు వీచు చుందురు. ఈజాంబూనదమందలి సువర్ణముసిద్ధులందరు భూషణములుగా నలంకరించుకొందురు. మేరువునకు తూర్పున భద్రాశ్వవర్షము పశ్చిమం బున కేతుమాలవర్షము ఈరెండిటి-మధ్య నిలావృతవర్షము గలదు. మరియు దీనికి పూర్వదిక్కున చైత్రరథవనము దక్షిణంబున గంధమాదనవనము పశ్చి మంబున విభ్రాజవనము దానికుత్తరంబున నందనవనము గలదు. ఈనందన వనంబున దేవతాభోగ్యంబులగు అరుణోద మహాభద్ర వీశోద, మానస ములనెడి నాల్గుసరోవరంబులు గలవు. మేరువునకు కేసరాచలమునకు పూర్వ భాగంబున వేరు వేరుగా శీతాంజన కురంగకురర మాల్యవంతంబులను ప్రముఖ పర్వతంబులు గలవు. మేరు కేసరాచల దక్షిణమున త్రికూట శిశిరపతంగరు

చక, నిషధ, కపిలాది కేసరాచల పర్వతంబులు గలవు. మేరుకేశరాచల పశ్చిమభాగమున శినీవాస కుశుంభ కపిల, నారద, నాగాదిపర్వతంబులు గలవు. మేరువున కుత్తరకేసరాచలంబున శంఖచూడవృషభ, హంస, కాలంజ రాది పర్వతములు గలవు. మరియు మేరూపరిభాగమున శీతకుంభమను బ్రహ్మపురి గలదు. అది చతుర్దశసహస్ర 14 వేల యోజనంబులు విస్తీర్ణము గల ఆపురి కష్టదిక్కులయందు అష్టదిక్పాలుర పురంబులు గలవు. విష్ణుపాద ములనుండి గంగ, చంద్రమండలముపై బడి యటనుండి బ్రహ్మపురిపై పడి అలకనందా, చక్షూ, భద్రయను నామంబులతో నలువైపుల ప్రవహించు చుండెను. శీతానది తూర్పుదిక్కున నలకనంద దక్షిణదిక్కున చక్షుర్నది పశ్చిమంబున భద్రానది. భద్రానది యుత్తరంబున నా శైలంబున ప్రవ హించుచు ఈనాల్గునదులు మేరుగిరినుండి సాగరాముల పాలగుచున్నవి. ఈగంగ స్వర్గమర్త్యపాతాళములయందు ప్రవహించుటచే త్రిపథగామియని ప్రఖ్యాతిబడసెను. సునీల, నిషధ, మాల్యవంత, గంధమాదనము, లనెడు పర్వతములమధ్య మేరుపర్వతము కర్ణికాకారంబున నొప్పుచుండెను. భారత కేతుమాల, భద్రాశ్వ. కురవ, యనెడి వర్షంబులు మర్యాదాలోక పర్వతం బులనెడి లోకపద్మమునకు పత్రంబులవలె శోభించుచున్నవి. దానికి దక్షిణో త్తరములయందు జఠర దేవకూటంబు లనెడి నగంబులును పూర్వపశ్చిమంబుల గంధమాదనగిరులు గలవు. మేరువునకు పూర్వపశ్చిమ భాగములయందున్న నిషధనీలపర్వతంబులు రెండును. దక్షిణోత్తర భాగములవరకు వ్యాపించి కర్ణికాంతర్భాగమువలె నున్నవి. మేరువునకు కొంతఎడముగా ముందుభాగ మున జఠరాదిపర్వత ద్వంద్వములుగలవు. ఇంకను కిన్నరశ్వేతాది సుమనోహర పర్వతంబులు గలవు. ద్రోణనగంబున నుత్తరభాగమున సిద్ధచారణ సేవితమై యతిరమ్యంబయి కాననపురంబులచే నొప్పుచుండెను ఇట సదా దేవదానవ యక్షరాక్షస కిన్నరులు క్రీడింపుచుందురు. ఈభూస్వర్గములన్నియు ధర్మా త్ములకై నిర్మింపబడినవి. పాపాత్ములెన్నడు ఇవిచూడనులేరు, రానులేరు. భారతవర్షముగాక మిగిలిన ఎనిమిదివర్షంబులవారికి శోకంబులు, ఆపత్తులు ఉద్వేగము లుక్షుదాభయంబులు నుండవు. వారందరు స్వస్థచిత్తులై నిరాతం కులై యుందురు. మరియువారు 12000 వేల సంవత్సరములు జీవించియుం

దురు. అక్కడ సత్యయుగ, త్రేతాయుగ ద్వాపరయుగంబులు మాత్రమే వర్తించును. కలియుగ ప్రవేశింపదు. అట నదులన్నియు స్వర్ణవాలుకలతో కూడియుండును. ఆ యిసుకతిన్నెలయందనేకవందల పుణ్యాత్ములు దేవకన్యలతో క్రీడించుచుందురు.

శివ మహాపురాణ మందలి ఉమాసంహింతయందు
పదునేడవఅధ్యాయము సంపూర్ణము

---

## పదునెనిమిదవ యధ్యాయము

### సప్తద్వీప వర్ణనము

ఆసేతుహిమాలయమువరకు భారత దేశమని చెప్పబడుచున్నది. ఇది 9 వేల యోజనంబులు విస్తారముగల్గియుండెను: ఈభూమిస్వర్గాపవర్గముల నిచ్చు కర్మభూమియని చెప్పబడుచున్నది! ఇక్కడనుండియే జీవులు స్వర్గనరకములు సంపాదించుకొనవలెను. భారతవర్షము 9ఖండములుగనున్నది ఇంద్రద్యుమ్న, కసేరు, తామ్రవర్ణ, గభస్తిమాన్, నాగద్వీప, సౌమ్య, గంధర్వ వారుణ, భారత,యను నవ యుప ద్వీపంబులు, ద్వీపంబులు సాగర పరివేష్టితంబులై యుండెను. ఈద్వీపములు సహస్ర యోజన విస్తీర్ణములై దక్షిణోత్తరములు వ్యాపించియుండెను, దీనికి తూర్పుదిక్కున కిరాతులు. దక్షిణదిక్కున యవనులు, పశ్చిమోత్తరంబుల తపస్వులు, నివసించుచుండిరి, వీటి మధ్యప్రదేశమున, బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు ననేకములుగ నివసించుచుండిరి, వీరిలో విప్రులు జన్నములు క్షత్రియులు యుద్ధములు, వైశ్యులు వాణిజ్యములు, శూద్రులుసేవలు చేయుచుండిరి, ఇందు, మహేంద్ర మలయ, సహ్య సుదామ, ఋక్ష, వింధ్య, పారియాత్రములనెడు సప్తకులపర్వతములు కలవు, వేదస్మృతి పురాణములన్నియు, పారియాత్రమునందుద్భవించెను, వీనిని స్పర్శన దర్శనాదులచే సర్వపాపములు నశించును, వింధ్యపర్వతమునుండి,

నర్మదా, సురసా మొదలగు సప్తమహానదులు సహ్యాద్రివిదంబులుగ నుద్భవించి మహాపాపహారంబులై, శుభప్రదంబులై యున్నవి గోదావరి, భీమరథీ తాపీ, మొదలగు ప్రశిద్ధనదులు ఋక్షగిరినుండి బయలుదేరి పాపభయాపహారములై యున్నవి, కృష్ణవేణీ మొదలగునదులు సహ్యాద్రినుండి వెలువడినవి కృత మాల, తామ్రపర్ణీ మొదలగునదులు, మలయాద్రినుండి, బయలుదేరెను, త్రియామా, ఋషికుల్యాది నదులు, మహేంద్ర పర్వతమునుండి వెలువడెను. ఋషికుల్యాకుమారీ మొదలగు నదులు సుక్తిమత్పర్వతమునుండి యుద్భవించెను, ఈ తీరంబుల ననేక జనులు గుంపులు గుంపులుగా నివసించి నీ నదీజలంబులు పానము చేయుచుండిరి. భారతవర్షంబున నాల్గు యుగంబులు వర్తించుచున్నవి, మిగిలన వర్షంబులయందు కలియుగముండుట లేదు, అవన్నియు భోగభూములు, భారతవర్షము మాత్రము కర్మభూమి, ఇందు కొందరు సుకృతులు యజ్ఞదానంబులుచేసి తరించెదరు కొందరు యతీశ్వరులై యుండిరి పరలోకంబులకై తపంబు చేయుచుందురు జంబూ ద్వీపమంతయు కర్మభూమియని చెప్పబడుచుండెను సహస్రజన్మంబుల పుణ్యఫలముననే గాని భారత వర్షంబున జన్మంబు లభింపదు. అక్కడైనను సహస్రజన్మలైనగాని మనుజుడై జన్మింపడు, ధన్యమైన భారతభూమి యందు, స్వర్గాపవర్గములకునికిపట్టై యుండెను. ఇక్కడవారలు దేవతలను కీర్తించుచుందురో, దేవత్వమునొందెదరు. మానవుడు పరమేశ్వర ధ్యానముచేసి సంచరించినదో జన్మపరంపరల నొందెదరేగాని ముక్తినొందజాలరు. ఎట్టికర్మలుచేయుదురో దానికి తగినశరీరములతో కర్మఫలము లనుభవింపుచుందురు. పుణ్యకర్మలచే సుఖములు పాపకర్మలచే దుఃఖములు పొందుచుందురు. ఇక్కడజన్మించిన మనుజులు యిహాపర భోగంబులు మోక్షముకూడ నొందగల్గుచున్నారు. ఈజంబూద్వీపము లక్షయోజనంబుల విస్తీర్ణమై, నలుదిక్కుల క్షీరసాగర పరివేష్టితమై యుండెను. ఈసాగరము శతసాహస్ర యోజనంబులు వ్యాపించియుండెను.

దీనికి ద్విగుణముగ ప్లక్ష ద్వీపముండెను, దీనియందు, గోమంత చంద్ర నారద దుర్దుర సోమక సుమన వైభ్రాజములనెడు సప్తకుల పర్వతములుగలవు ఇందలి ప్రజలు వర్షాచలముల నివసించెదరు. ఇందు దేవగంధర్వులు సదానివ

సించు చుందురు ఇచటి వారలకు అధివ్యాధులుండవు ఇచటి మానవులు పది వేలవర్షంబులు జీవింతురు. మరియు నందు అనుతప్తా శిఖి పాపఘ్ని త్రిదివా కృపా అమృతా సుకృతా యనెడు సప్తనదులు ప్రవహించు చున్నవి. ఇంక ను శైలములనుండి యనేక చిన్నచిన్న నదులు ప్రవహించు చున్నవి అచటి జానపదులందరు నదీతోయంబులు త్రాగి సంతసించెదరు అక్కడ మూడుయుగ ముల యొక్క ధర్మములు సమయములు సమముగానుండి. కలిధర్మము లుండ వు, అక్కడ బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను నాల్గు వర్ణంబులుగలవు మరి యును ఆర్యకృషు సద్భృతి భావులు యనే ప్లక్షవృక్షములు గలవు గాన దానికి ప్లక్షద్వీపమని పేరు స్థిరపడెనని చెప్పి, అక్కడ వారు పరాత్పరుడైన శంకరు నకై యజ్ఞములు చేయుచుందురు పాద్యార్ఘ్యాదులను కూడ వైదిక మంత్రము లచే పూజించెదరు ఈద్వీపము ఇక్షురససాగర పరివేష్టితమైయుండెను.

ఇటుపై సంక్షేపముగ శాల్మలి ద్వీపమును గురించి చెప్పెదను. ఇందు శ్వేత హరిత జీమూత రోహిత వైద్యుత మానసము అనెడు సప్తకుల పర్వతం బులుగలవు ఇచట శాల్మలివృక్షములుండుటచే శాల్మలిద్వీపమనిపేరొందెను, శాల్మలి యనగా బూరుగ, ఈద్వీపము పైదానికన్న ద్విగుణీకృత సాగర పరివేష్టి తమైయుండెను. యోనీ, తోయా, వితృష్ణా, చంద్రా, శుక్లా విమోచనా నివృత్తీ యనెడు సప్తనదులుగలవు. ఇవన్నియు పవిత్రతోయములై యున్నవి ఇచటకూడ చాతుర్వర్ణ్యము గలవారలు ఇక్కడివారు శివునిగూర్చి యనేక యాగంబులు చేయుదురు ఈ మనోహర ద్వీపమందు దేవతలతి చేరువుగనుం దురు. ఈద్వీపము తరువాత సురాసాగర పరివృతమై యున్నది.

ఇంక మూడవది కుశద్వీపమునందును దేవదానవ మనుజులు వసించుచుందురు ఇంకను గంధర్వ యక్షకిన్నరాదులు విహరించుచుందురు. అటచాతుర్వర్ణ్యంబులవారు వారి వారి యనుష్ఠానములు విధిప్రకారముగ నెర వేర్చుకొనుచుందురు. కుశద్వీపము నందలి ద్విజులందరు సర్వ కామప్రదు లైన శివ కేశవుల సేవించుచుందురు. అట కుశేశయ హరి, ద్యుమాన్ పుష్పవాన మణిద్రుమ హేమశైల మందరయనెడి సప్తకుల శైలంబులు గలవు ధూతపాప, శివా, పవిత్రా, సమ్మతి, విద్యా, దంభా, మహీ యనెడి

సప్తనదులును హేమవాలుకలతో గూడిన శుభప్రదములగు చిన్న నదులనేకములుగ గలవు. కుశద్వీపమంతయు కుశస్తంభములచే నిండెను.

క్రౌంచద్వీపము దీనికి ద్విగుణీకృత్క్షీర సాగర పరివేష్టితమై యుండును ఇందు క్రౌంచ, వామన అంధకార, దివావృత్తి, మన, పుండరీక, దుందుభి యనెడు సప్తకుల పర్వతములు గలవు. నిరాటంకముగ నచటి వారందరు సువర్ణ వర్ణములు గల పర్వతముల యందు దేవగణంబులతో సంచరింపుచుందురు అక్కడను చాతుర్వర్ణంబులు గలవు గౌరి, కుముద్వతి, సంధ్యారాత్రి, మనోజవా, శాంతి, పుండరీకాయనెడు నదీసప్తముకగలదు. ఈశుభోదకములచటి వారందరు పానము చేయుదురు వారందరు యోగరుద్రస్వరూపుడగు భగవంతుని సేవించుచుందురు.

శాకద్వీపము ద్విగుణీకృతే క్షురసాగర పరివేష్టితమైయుండెను. అక్కడ ఉదయగిరి, జలధార, అస్తగిరి, అవికేశ, కేసరి శతకేసర దేవయాన యనెడు, సప్తగిరులును సుకుమారి, కుమారి, నళిని, వేణుక, ఇక్షు, రేణుక, గభస్థియనెడు సప్తనదుల తోడను చతుర్వర్ణంబుల తోడను యటచెలు వారుచుండెను అచటి వారందరు సూర్యభగవానుని సేవించుచుందురు.

దీనికవ్వల ద్విగుణీకృత శుద్ధోదక పరివేష్టితమై పుష్కర ద్వీపముగలదు అందు దెదుకేల యోజనంబులు పొడవుగల మానస సరోవరము గలదు. ఈసరోవరము పుష్కర ద్వీపమునకు వలయాకారముగ నుండెను. ఇచటి మానవులు దశవర్షసహస్రంబులు జీవించుచు నిరామయులై, వీత శోకులై రాగద్వేష వివర్జితులై యధర్మశూన్యులై బంధ, వధరహితులై ఏక మతావలంబులై, సమానవేషధారులై, హేమవర్ణ స్వరూపులై సదానందులై యుందురు. మరియు నచట స్వర్గతుల్యమై, జరారోగ వివర్జితులై సర్వులు సుఖముగా నుందురు, ఈ ద్వీపమందు ధాతకీఖండమున బ్రహ్మస్థానమున న్యగ్రోధ వృక్షము కలదు, అందు సురాసురులచే పీడింప బడుచు బ్రహ్మనివసించుచుండును ఈపుష్కర మంతయుస్వాదూదకములచే పరివేష్టింప బడియుండెను.

ఇవ్విధంబునన సప్తద్వీపంబుల నొక్కొకటి ద్విగుణీ కృత పరితపంబులు గల్గిసప్తసాగర పరివేష్టితములై యుండెను. ద్వీపములు, సాగరములుకూడ

సమాన పరిమితములై యున్నవి. ఈసాగర జలమంతయు సమృద్ధిగా నుండును. ఇవన్నియు నగ్నితప్తమైన జలంబులు కొటమునందే సపొంగి నట్లు చంద్రుని వృద్ధి నొందినకొలది సాగరములు కూడ వృద్ధిక్షయముల నొందు చుండును. ఒకద్వీపముకన్న నొక ద్వీపము ద్విగుణీకృత విస్తారము గలవియై, యుండెను. మిగిలిన ద్వీపములన్నియు హిరణ్మయప్రదేశములు గలవియై జంతుశూన్యములు గలవియై, లోకాలోక పర్వతములతో పదివేల నగంబులతో గూడియుండెను, ఈగిరులన్నియు పదివేల యోజనంబు లున్నతివిస్తీర్ణంబులు గలవై యుండెను. పర్వత సాగరంబులతో నొప్పుచున్న సప్తద్వీపములు గూడిన భూమియంతయు నేబదికోట్లయోజన విస్తీర్ణముగలదై యుండెను, అన్నిటికిని భారత భూమియాధారమై, సర్వభూత గుణాధికమై కాలస్వరూపమై యొప్పుచుండెను.

శివ మహాపురాణ మందలి ఉమాసంహిత యందు
పద్దెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

## పందొమ్మిదవ యధ్యాయము

### ఊర్ధ్వ లోకవర్ణనము

సూర్యచంద్రముల కిరణప్రభ యెంతవరకు వ్యాపించియున్నదో అంతవరకు భూలోకము వ్యాపించి యుండెను. భూమికి లక్ష యోజనములు దూరముగ రవిమండలము 10 వేల యోజనముల పరిమితి గలదై యుండెను. దానికిలక్ష యోజనముల దూరములో చంద్రమండలము గలదు. చంద్రమండలమునకు పదివేల యోజనముల దూరమున నలువదిపుల నక్షత్ర మండలములు గలవు. తారకా మండలములపైన, బుధమండలము, దీనిపై భాగమున శుక్రమండము. దానిపైన యంగారక మండలము, దానిపై బృహస్పతి మండలము, దానిపై శనైశ్చర మండలము, దానికి లక్ష యోజనముల దూరమున, సప్తర్షి మండలము, దానికి లక్ష యోజనముల దూరమునందు ధృవమండలము గలదు, ధృవమండలమునకు క్రిందుగా,

భూలోక, భువర్లోక, సువర్లోకము లున్నవి. ధృవమండలముపైని, కోటి యోజనంబుల దూరంబున, కల్పవాసులగు ఋషులు నివసింతురు, అనగా, సనకసనందన, సనాతన, కపిల, ఆసురీ, వోఢు, పంచశిఖుడు నను సప్తబ్రహ్మపుత్రు లుందురు.

వారికి రెండులక్షల యోజనంబుల దూరంబున శుక్రమండలము, దానికి రెండులక్షల యోజనములు క్రిందుగా బుధమండలము గలదు. బుధునకూ ర్ధ్వముగ రెండులక్షల యోజనంబుల దూరంబున, కుజమండపము గలదు కుజునకు రెండులక్షల యోజనంబులకు పైని బృహస్పతి మండలము గలదు. దీనికి రెండులక్షల యోజనముల కుపరిభాగమున సూర్యపుత్రుడగు శనై శ్చర మండలము గలదు. ఈసప్తగ్రహములు వారివారి స్థానములయందే నిల్చియుందురు. దీని కుపరిభాగమున, 11 వేల లక్షల యోజనంబుల దూరంబున సప్తఋషుల మండలములు గలవు, దీనికి 13లక్షల యోజ నముల కుపరిభాగమున జనోలోకము గలదు. దీనికారులక్షల యోజనం బుల దూరంబున తపోలోకము గలదు. దీనికారు రెట్లుదూరంబున, సత్య లోకము గలదు. దీనినే బ్రహ్మలోకమందురు.

భూలోక మందలి మనుజులు బ్రహ్మచారులై, సత్యధర్మ రతులై, జ్ఞానులై ప్రవర్తించిన వారలే బ్రహ్మ లోకమందు వసింతురు స్వర్గలోక మందు సురులు, ద్వాదశాదిత్యులు, సప్తమరుత్తులు, నష్టవసువులు. నశ్వ నీకుమారులు విశ్వేదేవతలు, యేకాదశరుద్రులు, నాగులు, యక్షాదులు, నవగ్రహములు, పితకల్మషులగు ఋషులు, నివసింతురు. నివ్విధంబున, నధోలోకములేడు. నూర్ధ్వ లోకములేడు. కలిసి మొత్తమొక బ్రహాండ మయ్యెను. ఇదంతయు కలసి యొకయండకటాహకమని పేరు. ఇట్టి బ్రహ్మాండ మంతయు. జలము, వహ్ని, వాయువు, ఆకాశము. తమస్సుల నెడు. పదిరెట్లు పంచభూతములతో నావరించి యుండెను.

దీనికి మహత్తత్వము. ద్విగుణముగ పరివేష్టించి యుండెను. ఈమ హాత్త్వమే ప్రధాన పురుషుడు. ఇతడే పరమాత్ముడు. ఇతని సంఖ్య యనంతములు గాన గణింప శక్యముగాదు, ఇతనికి ప్రమాణములేదు.

ఈపరమాత్మునకు ప్రకృతియే కారణము. వేలాదియండములకీ పరమేశ్వరుడే కారకుడు. ఈబ్రహ్మాండము లన్నియు సర్వవ్యాప్తుడైన పరబ్రహ్మ నుండి జనించెను. దారువునందగ్ని, తిలలయందు తైలము. పాలయందు నేయి వలె పరమేశ్వరుడు సకల బ్రహ్మాండముల యందు నవ్యక్తముగ దాగి యుండెను. ఇతడే యాదిబీజము. ఇతనిచే బ్రహ్మాండము లన్నియు జనింపబడెను. తనబీజముచే తనపుత్రు లుద్భవిల్లినట్లు, మహదాది తత్వములచే సురులు జనించిరి. బీజములనుండి వృక్షములు జనించి నట్లుగను. సూర్యకిరణములచే సూర్యకాంతమణి యందగ్ని యుద్భవిల్లి శివుడు కోరకున్నను శివశక్తి సంయోగముచే దేవతాసృష్టి యంతయు, జరిగెను, ఈ విధంబుగ జీవులుకోరకున్నను, తమతమ కర్మలను బట్టి జన్మలు కలుగుచున్నవి. శివుడే బ్రహ్మవిష్ణు రుద్రనామంబులతో ప్రసిద్ధుడయ్యెను. ఈత్రిమూర్తులు సృష్టిస్థితిలయ కారకులై యుండిరి. సమస్త క్రియలకు పరమేశ్వరుడే కర్త యని సనత్కుమారుడు బలుక నీబ్రహ్మాండముల కుపరిభాగంబున నేమైన లోకము లున్నవా? లేవా? యని నాకుసందేహముగ నున్నది గాన నాసందేహ నివృత్తిచేయు మని వ్యాసు డడుగ సనత్కుమారు డిట్లు చెప్పదొడంగెను.

లేకేమి? చెప్పెదవినుము, బ్రహ్మలోకమున కుపరిభాగమున, వైకుంఠ లోకము గలదు. అందు శ్రీమహావిష్ణువు నివసించుచుండును. దానిపైన శివ పుత్రుడగు కుమారలోకము గలదు. ఇందు కుమారస్వామి నివసించుచుండును. ఇదికడు రమ్యమై, యతిమనోహరమై, యత్యద్భుతంబై యుండును దానిపై యతిమనోహరంబగు నుమాలోకంబు గలదు. ఇట త్రిలోకజననియు, మహాశక్తి స్వరూపిణియు నగు యుమాదేవి యుండును. ఈమెయే పరాశక్తి, ప్రకృతి స్వరూపిణి. రజస్సత్వతమోమయయు నిర్వికార శివాత్మికయునై యుండెను. దీనిపైన సనాతనమైన శివలోక ముండెను. అందు నవినాశనుడు, మహాదివ్యుడు, మహాశోభాన్వితుడు, పరబ్రహ్మమునగు మహేశ్వరుడు విరాజిల్లుచుండెను. అతడు త్రిమూర్తి జనకుడు. త్రిగుణాతీతుడు, సర్వులకు ప్రభువునై యుండెను, దీనిపైనే లోకంబులు లేవుకాని దీనిసమీపమున గోలోకము మాత్రమున్నది. అందు శివప్రియులు, సుశీలురునగు గోమాత లుండిరి. వీరిని శంకరాజ్ఞచే కృష్ణుడు పాలింపుచుం

దానవులు, మునులు రాజస తపంబు చేయుదురు. క్రూరకర్ములగు మనుజులు రాక్షసులు తామస తపంబు చేయుదురు. తత్వజ్ఞులగు మునులీమూడింటికి మూడువిధంబులుగా ఫలంబులు చెప్పియుండిరి. సద్ధ్యానార్చలతో దేవతలనర్చించినచో శుభంబులు గల్గును. ఈవిధంబగు సాత్విక తపంబనేకఫలదాయకంబనినిర్దేశింప బడినది. దీనిచే నిహపరలోకవాంఛలనందగలరు. కోర్కెలువీడి భగవంతుని సేవింపుచు ధ్యానించుటయే సాత్విక తపంబని చెప్పబడును. కోర్కెలతో జేయుజపతపఃపూజాదులు రాజసమనబడును. దుస్సహమైన కర్మలచే శరీరముశోషింప జేయుచుపీడింప జేయుచు మనోవాంఛాసిద్ధులకై జేయు జపతపఃపూజాదులు తామసము లనబడును. సాత్విక తపంబుత్తమమైనదని గ్రహింపవలయును. ఉత్తమంబైన సాత్విక బుద్ధితో నిశ్చలులై స్నాన, పూజా, జప, హోమ, పరిశుద్ధ, శౌచా, హింసకులై వ్రతోపవాస మౌనేంద్రియ నిగ్రహులై, ధీమంతులై, సత్యవంతులై, క్రోధరహితులై, దానశీలులై, క్షమవంతులై, బాహ్యేంద్రియనిగ్రహులై, దయావంతులై వాపీ కూప తటాక సౌధ నిర్మాణకులై కృచ్ఛ్రచాంద్రాయణ వ్రతనిష్ఠులై యజ్ఞకర్ములై, సుతీర్థసేవకులై, మనుజులు ప్రవర్తించినచో అన్ని సుఖములు పొందగల్గెదరు. ఇట్టిధర్మకార్యములచే పొందలేని దేదియుఉండదు. ఇదియే పరమధర్మము. దీని కంతకు శివభక్తియే కారణము. సంక్రాంతి విషువద్యోగములయందు త్రికాలములయందు పరమేశ్వరుని ధ్యానింపుచు ఏకాగ్రచిత్తుడై జ్యోతీరూపమును గాంచుచుండవలెను. రేచక, పూరక, కుంభకములని, ప్రాణాయామము మూడువిధంబులు నాడీ సంచారవిజ్ఞానము చేతను ప్రత్యాహార నిరోధనము చేతను, తురీయావస్థనొందగలరు. దీనిచే నణిమాద్యష్ట సిద్ధులనందగల్గెదరు. ఇదంతయుపరమ జ్ఞాన సాధనము. ప్రత్యాహారమన విషయములనుండి ఇంద్రియములను మరలించుట విషువద్యోగమనగా రాత్రింబవళ్ళు సమముగానుండు కాలము.

కాష్ఠావస్థ, మృదావస్థ, హరితావస్థ అనిఅవస్థలు త్రివిధంబులు ఇవి సర్వార్థపాపహరములై సర్వార్థసాధకములైయుండెను. నారీ, శయ్యా, పానము వస్త్రధూపలేపనంబులు, తాంబూలభక్షణము రాజైశ్వర్య

47

భోగములు మరియు అధిక భారంబులైన స్వర్ణంబులు, తామ్రాది పాత్రలు, ఇంకను గృహసంబంధములైన యనేక ధనంబులు వేదశాస్త్ర పురాణ పాండిత్యము గీతనృత్యాది భూషణంబులు శంఖభేరీ మృదంగాది వాద్యములు గజేంద్రఛత్రచామరంబులు, ధేనువులు. మొదలగు భోగముల న్నియు శివకటాక్షముచే ననుభవింపవచ్చును. తిలలయందున్న తైలము శ్రమపడినగాని లభింపనట్లు అధర్మవస్తువులన్నియు శ్రమచేగాని లభింపవు. అజ్ఞానులు ప్రాప్తి యున్నచో అదే వచ్చుననిపల్కెదరు కాని ప్రయత్నింప కున్నచో నేదియు లభింపదు. భగవదారాధనము నెడ ప్రయత్నము లేనిచో నేదియు లభింపదు. యతని యనుగ్రహముచే నన్నియు లభించును. సంసారమందు జీవులు భ్రమచే బంధింపబడినవారై నానా యోనిగతులగుచు తిరుగుచుందురు. ఇట్టివారు మహాపాతకులై నానా నరకములయందు జనించు చుందురు. ఇట్లు నరకములయందు జనించుచు బాల్యావస్థచే నతిదుఃఖంబగు మనుజజన్మంబు నందెదరు. బహుపుణ్యంబుచేతగాని నరజన్మంబు లభింపదు. ఉత్కృష్ట నీచకర్మలచే న్యూనాధిక జన్మలు కలుగుచున్నవి. నరజన్మము లభిం చినగాని స్వర్గమోక్షములు రావు. నరజన్మ లభించినను సుకృతకార్యములు చేయనిచో మృతుడైన పిమ్మట సుకృతకార్యము చేయలేనని చిరకాలము దుఃఖించును. దేవాసుర జన్మలకన్న మనుజజన్మ దుర్లభమైనది గాన ఇట్టి మనుజజన్మ లభించినపుడు నరకము పోనడచు విధానము నాలోచింప వలయును. మానుషజన్మ లభించినను స్వర్గాపవర్గములను సాధించనిచో జన్మ వృథాయగును. ధర్మార్థ కామ మోక్షములకు నరజన్మయే మూలకారణము గాన మనుజులు ధర్మమొనర్చుటకై ప్రయత్నింపవలయును మనుజుడేయును, వాడు సర్వార్థ సాధకమైన ధర్మమూలము నాశ్రయించినచో సర్వశ్రేయస్సుల నందగలడు గాన సర్వప్రయత్నములచే ధర్మమును రక్షించుకొనవలయును. నర జన్మ లభించినను విప్రజన్మ కడు దుర్లభము. విప్రుడై యుండి జ్ఞానము సంపాదించనిచో ఇక ఇతరుల మాట చెప్పనేల! అన్ని ద్వీపములలో జంబూ ద్వీపము ప్రశస్తమైనది యేమన, నిది కర్మభూమి దీనియందే స్వర్గమో క్షములు సాధింపవచ్చును. ఇట్టి భారతభూమియందు మనుజులై జనించి సత్కర్మలుచేయనివారు వారియాత్మలను వారు వంచించుకొనినవారగుదురు.

# ఇరువదియొకటవ యధ్యాయము

## రణఫల వర్ణనము

అన్ని వర్ణంబులలోను దుష్ప్రాపమనియు నిట్టి బ్రాహ్మణులు ఈశ్వరుని ముఖమునుండి జనించిరనియు బాహువులనుండి క్షత్రియులు జనించిరనియు, యూరువులనుండి వైశ్యులు జనించిరనియు తమచే వినియుంటిని. వీరిన్ని విధంబులుగా జనించుటలో కారణమేమని వ్యాసుడు ప్రశ్నింప సనత్కుమారు డిట్లు చెప్ప దొడంగెను. దుష్కృత్యములచే స్థాన భ్రష్టులగుదురు గాన పండితులైన వారలు స్థాన భ్రష్టత్వము రాకుండా చూచుకొనవలయును. బ్రాహ్మణుని వలన క్షత్రియ స్త్రీకి జన్మించినవాడు బ్రాహ్మణ భ్రష్టుడై క్షత్రియ సేవకుడై యుండెను. ఎట్టి వారైన నధర్మముగా నడిచినచో భ్రష్టులగుదురు. ఇట్టి మూర్ఖులు సహస్ర జన్మల వరకు తామిస్ర నరకమున బడెదరు. ఉత్తము స్థానము నొందిన వాడెట్టి ప్రమాదముల చేతను చ్యుతుడు కాకూడదు. ఎట్టివిపత్తులలో యున్నను స్థానభ్రష్టుడు కాకూడదు. బ్రాహ్మణుడై జనించి బ్రాహ్మణ ధర్మము లాచరింపక భోజ్యా భోజ్యంబులెరుంగక భుజించువాడు క్షత్రియు డని చెప్ప బడుచున్నాడు. శూద్రుడు తన వర్ణోచిత కర్మల నాచరింపుచు పై వర్ణ క్షత్రియులను సేవించునచో వాడుత్తము వైశ్యుడని చెప్ప బడును. ఇట్టి వారు వైశ్య కులమందు జనింతురు. వైశ్యుడు తనధర్మము నెరవేర్చుకొనుచు అగ్ని హోత్రము చేసి శేషాన్నము భుజించినచో క్షత్రియ కులమున జనించును. క్షత్రియుడు తన కులోచిత ధర్మములు నెరవేర్చుకొనుచు యజ్ఞయాగాదులు చేసి యనేక దక్షిణలిచ్చుచు స్వర్గము కోరుచు త్రేతాగ్నులు సేవించుచు నిత్యము దానములు చేయుటచే నాంధ్ర వాస్తుడై ధర్మముగా క్షితిని పరిపాలింపుచు భార్యతో ఋతు కాలము దేహమింపుచు బ్రహ్మ, క్షత్రియ, వైశ్యులకు కోరినదానము లిచ్చుచు గో బ్రాహ్మణుల నిమిత్తము నాత్మరక్షణకుమాత్రమే సంగ్రామములు చేయువాడే అగ్ని మంత్రములచే పవిత్రుడై బ్రాహ్మణుడై పుట్టును. మరియు బ్రాహ్మణుడై వివిధ దక్షిణలచే యజ్ఞములుచేయుచు చేయించుచు స్వకర్మ

నిరతుడై సదాసత్యవాదియై జితేంద్రియుడైనచో దేవతలకు కూడా దుర్లభం బగు విప్రుల స్వర్గము నందగలడు. నరులు అతికష్టముచేతగాని బ్రాహ్మణత్వము పొందలేరు. బ్రాహ్మణత్వముచే సకలమును పొంది మోక్షముకూడా పొంద వచ్చును. గాన బ్రాహ్మణుడు సర్వప్రయత్నములచేత ధర్మతత్పరుడై యుండ వలెను. ఉత్తమ బ్రాహ్మణుడు సాధనములచే చతుర్వర్గమును సంపాదింపవలెనని సనత్కుమారుడు పలుక సంగ్రామము నందలి ప్రీతి దాని మహాత్మ్యము చెప్పుమని వ్యాసుడు మరల ప్రశ్నింప సనత్కుమారు డిట్లు చెప్ప దొడంగెను.

విపుల దక్షిణలతో నగ్నిష్టోమాదిక్రతువు లెన్ని చేసినను క్షత్రియు నకు రణమందు వెనుచూపక యుద్ధముచేసిన ఫలముతో సరిరాదు. యజ్ఞకర్మ నిష్ఠులగు తత్త్వవేత్తలు క్షత్రియులకు రణమే ముఖ్యమని చెప్పి యుండిరి. శస్త్రజీవుల ఫలము చెప్పెద వినుము. వారికి ధర్మలాభము, అర్థలాభము, యశోలాభముగల్గును గాన శూరులు శత్రువులను చెండాడు యుద్ధము నేకోరె దరు. ఎవడు రణమున కేతెంచు సమయమున సముఖమునం దున్న విప్రునకు దానము లిచ్చి వాహనారూఢుడై రణమున కేగునో యట్టి క్షత్రియునకు సదక్షిణలతో యజ్ఞము చేసిన ఫలము ధర్మార్థ కామ ఫలంబులుచే కూరును. యుద్ధమునందు పరాజితుడు గాక శత్రుసంహారము చేసినవాడ శ్లాఘ్యుడు గాగ ఫలమునంది పుణ్యలోకమునం గలుగును. ఏ శూరుడు యుద్ధము పెనుము చేసియుండగా యస్త్రశస్త్రములు జారవో యనను యుద్ధము చేయుచు వెనుచూపక మరణించువాడు స్వర్గమునంది మరల క్రిందికిరాడు రాజపుత్రు డైనను సేనానాయకుడైనను క్షత్రియధర్మముచే మరణించినచో నక్షయలోకము నందగలడు. కదనమందు శస్త్రాదులచె నెన్ని రోమంబులు ఛేదింపబడునో అన్ని యూర్ధ్వలోకంబుల నందగలడు. వీరాసనము, వీరశయ్య, వీర స్థానస్థి తుడై యున్నచో నిహాపరలోక సుఖంబు లందగలడు. గో బ్రాహ్మణ రక్ష ణకు ప్రభురక్షణకు మరణించినవారు పుణ్యవంతు లనుభవించు సుకృతంబు లనుభవింతురు. బ్రాహ్మణుని నిమిత్తమై యుద్ధమున మరణించినచో నెన్నడు స్వర్గచ్యుతుడు గాడు. అజియందు రాక్షసులచేతను గజాదులచేతను మరణించి నచో యుత్తమ గతి ప్రాప్తించును. గోవిప్రులకై మరణించినచో నక్షయ

గతి నందగలడు. సమర్థు డైనచో నెన్ని క్రతువు లైనను చేయవచ్చును గాని యుద్ధమందు శరీర త్యాగ మొనర్చుట బహుకష్టము. యుద్ధము పుణ్యతమ మైనది, స్వర్గప్రద మైనది, యజ్ఞస్వరూప మైనది సర్వ సుఖస్వరూపము వంటిది. ఈయజ్ఞము రథ, గజ, తురగ, పదాదు లనెడి చతుర్ముఖములతో నొప్పుచు సర్వతోముఖముగా నుండెను. చతుర్వర్ణములోను క్షత్రియునకిది విధియై యుండెను. రణమునందు చంప దగినవాడు చంప దగనివాడిని గురించి చెప్పెద వినుము. యుద్ధసంముఖులై వచ్చిన ఆతతాయులు విప్రు లైనను చంప దగిన వారు. వారిని చంపినను బ్రహ్మహత్యా దోషముండదు.

శ్లో॥ అగ్నిదో గరదశ్చైవ శస్త్రపాణిర్ధనాపహః
క్షేత్ర దార హరశ్చైవ షడేతే హ్యాతతాయినః

గృహముల నగ్నిచే దహింప జేయువాడు, విషము పెట్టువాడు హింసకై శస్త్రములు ధరించువాడు పరులధనము హరించువాడు, పరభూముల నపహ రించువాడు పరదారల నపహరించువాడును, ఈ యార్గురును ఆతతాయులని చెప్పబడుదురు. వారందరు నధికపాపాత్ములు. వారి నేమి చేసినను పాపము లేదు. చంప దగినవాడైనను రణమునందు దాహార్తుడై జలమున్నని యాచించిన వానిని చంపినచో బ్రహ్మహత్యా దోషము సంభవించును. రణమందు వ్యాధి గ్రస్తుని దుర్బలుని బాలుని అనాథుని ధనుర్భంగమైన వానిని చంపినచో బ్రహ్మహత్యాదోషము సంభవించును. ధర్మయుద్ధము చేసియే రణము చేయవలెను. ఇవి ధర్మము గ్రహించి క్షత్రియుడు సఫలము చేసికొనినవాడు ఇహ పరసుఖముల నందగలడు.

శివ మహాపురాణము నందలి ఉమాసంహిత యందు
ఇరువది యొకటవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువది రెండవ యధ్యాయము

## దేవోత్పత్తి విధానము

సనత్కుమారా నాకు వైరాగ్యము గల్గుటకై గర్భస్థ జీవోత్పత్తి విధానము చెప్పుమని వ్యాసుడుకోర సనత్కుమారు డిట్లు చెప్పదొడంగెను. సర్వశాస్త్రసార భూతమైనదియు వైరాగ్యము కల్గించునదియు భవబంధనముల పోగొట్టి మోక్షమునిచ్చునదియు నగు జీవోత్పత్తి విధానమును గూర్చి చెప్పెద వినుము. గర్భపాత్రమధ్యయందన్నము జలము వేరు వేరుగా నుండును. అగ్నిపై భాగమున జలోపరి భాగమున అన్నము నుండును. జలము క్రిందనున్న జఠరాగ్ని నాడులద్వారా వచ్చు వాయువుచే ప్రజ్వలింప బడి జలము వేడి చేయును యుష్ణముచే నన్నము సమముగా పచనమై కొంతమలపదార్థముగాను కొంత రసపదార్థముగాను మారును. మలము 12 విధములుగా మారి ఇంద్రియములద్వారా వెలుపలకు వచ్చును. రసము దేహమును పెంచు పుష్టి నిచ్చును.

శ్లో॥ కర్ణాక్షి నాశికాజిహ్వాదంత శిశ్నోగుదంనఖాః
మలాశ్రయాఃకఫః స్వేదోవిణ్మూత్రం ద్వాదశస్తథా.

1. కర్ణములు 2. నేత్రములు 3. నాశిక 4. జిహ్వ 5. దంతములు 6. శిశ్నము 7. గుదము 8. నఖములు 9. కఫము 10. స్వేదము 11. మలము 12. మూత్రములను 12 ద్వారములద్వారా 12 విధములుగా మలము ఈవలకువచ్చును. సర్వనాడులు హృత్పద్మమునందు బద్ధమై యుండెను. ఈనాడులు హృదయమునుండి నలుదైపుల రసమును ప్రవహింప జేయును. ఈవిధానమంతయు చెప్పెద వినుము. నాడీ ముఖముద్వారా ప్రాణ వాయువు రసమునందు ప్రవేశించి పుష్టినిచ్చుచుండును. నాడియందున్న ప్రాణ వాయువు రసముతోగూడి వృద్ధినొందించుచు దేహమంతయు వ్యాపించి స్వస్థానమందుండి శరీరాత్మలతో సంబంధము గల్గియుండి శరీరమందున్న పదార్థములనన్ని యుపచయము చేయుచు చర్మముచే కప్పబడి రుధిరమును వృద్ధి చేయును. ఈరక్తముచే రోమములు మాంసము కేశములు అస్థులు, సూక్ష్మ

నరములు, నఖములు క్రొవ్వు జనించి వృద్ధి నొందుచున్నవి. క్రొవ్వువలన బీజ వృద్ధిగల్గుచున్నది. శరీరమందన్న ము, నానావిధములుగా నిట్లు పరిణమించు చుండెను. అన్నముచే శుక్లము, శుక్లముచే దేహములుగల్గుచున్నవి. ఈవీర్యము, ఋతుకాలమునందు నిర్దోషమైన యోనియందు పడినచో నిది వాయువుతోగూడి స్త్రీరక్తమునందు సమ్మిళితమైనచో జీవోత్పత్తికి కారణ మగును. జీవులు వారివారి కర్మఫలంబులచే స్త్రీగర్భములందు శుక్లముద్వారా ప్రవేశింతురు. ఈశుక్లము రజస్సంయోగముచే కరుడుగట్టి 5 దినములలో బుద్బుదాకారమై యుండును. తదుపరి మాంసపుముద్దవలె నుండును. రెండు మాసములలో శిరము, కంఠము, భుజములు పృష్ఠము, వక్షము, ఉదరము, కరచరణంబులు, నరసముదాయము పార్శ్వభాగములు, కటిప్రదేశము మున్నగు శరీరభాగములు రెండుమాసములు దాటినపిమ్మట క్రమముగా తయారగును. మూడవమాసము దాటినపిమ్మట నరసంధులన్నియు వృద్ధియగును. నాల్గవమాసమున క్రమముగా వేళ్ళుబయలుదేరును. 5 వ మాసంబున కర్ణ నాశికలు పిమ్మట దంతపంక్తులు, గుహ్యము, నఖములు, బయలుదేరును. 6 వ మాసమున కర్ణరంధ్రములు, 7 వ మాసమున గుహ్యేంద్రియము మూత్రద్వారము యోనిస్థానము నాభియంగసంధులు బయలుదేరును. తదు పరి అంగప్రత్యంగములు సంపూర్తియై పరిపక్వమై మాతృగర్భమందు మావిచే కప్పబడియుండి తల్లిభుజించిన షడ్రసపదార్థముల సారమునుదొంగి లించుచు నాభినాళనిబంధుడై దినదినము వర్ధిల్లుచు సకలావయంబులు సంపూర్తియైన తరి స్మృతిగల్గి సుఖదుఃఖములు ననుభవించుచు నిద్రాస్వప్నముల నందుచు పురాకృతము తెల్సినవాడై అయ్యోనాకీ జననమరణంబులు తప్పవు కాబోలును నేనిదివరలో జనించి మరణించి మరలజనించుటకు సిద్ధముగా నుంటిని. నేను జనింపగనే సంస్కారమునంది గర్భనరకము నొందక సత్క్రియలు నాచరించుచు భగవత్ ధ్యానముచేసికొందును. నేను గర్భమునుండి వెలువడిన వెంటనే సంసారవినివర్తకమైన శివజ్ఞానమును సంపాదించెదను. నేను మాత్రము ఈసంసారలంపటుడనై యుండను. నేనుగర్భనరకమును విడలేకుంటి నని జీవుడు పరిపరివిధంబుల దుఃఖించుచు మోక్షమునకై అనేకఉపాయముల నాలోచించుచుండును. మరియు జీవుడు జరాయుపరివేష్టితుడై పర్వతమునుండి

క్రిందపడిన వానివలె దుఃఖింపుచుండును. మరియు జీవుడు సదాగర్భోదకముచే తడుపబడుచు నానా విధచింతుడై సాగరంబున మునిగిన వానివలె గర్భనరక సాగరమునందుపడి కుములుచుండును. లోహకుంభము నందుంచబడిన పదార్థములగ్నిచే పచనమైనట్లు గర్భకుంభమునందున్న జీవుడు జఠరాగ్నిచే తపింపబడుచు నగ్ని తప్తమైన సూదులచే గ్రుచ్చినవానివలె బాధపడుచు గర్భస్థుడై యుండి యతిగదుఃఖింపుచు గర్భనరకమునకు మించిననరకము లేదని తలంచుచుండును. జీవులకింతకన్న మించినదుఃఖము మరియొకటి లేదు. దేహులకు ఘోరమైన యనేకదుఃఖములేగాని సుఖంబులు లేశమాత్రమైనను లేవు. ఇట్లు గర్భస్థులైన జీవులందరు యోనియంత్రముచే పీడింపబడుదురు. వారిలో పాపాత్ములు మరింత బాధపడుచుందురు. ధర్మాత్ములంతగా బాధపడరు. జీవుడు యంత్రమునందలి ఇక్షుఖండమువలె గర్భయంత్రమునందు నలిగిపోవుచుండును. ఈయంత్రమునందు పాపమనెడి ముద్గరముచే శిరము నందు కొట్టబడుచుండును. గానుగనందుపడిన తిలలవలె గర్భయంత్రమునందు పడిన జీవులునలిగి నిస్సారులగుచుందురు. మరియు నస్థిపాదములనెడు తులాస్థంభము నరములచే బంధింపబడి రక్తమాంసములనెడి మృత్తికచే పూయబడి విణ్మూత్రద్రవ్య పాత్రలుగల్గి కేశరోమనఖములచే కప్పబడి రోగములకాస్థానమై వదనమనెడి సింహద్వారముగల్గి నేత్రా దృష్ట గవాక్షములుగల్గి ఓష్టద్వయంబులనెడి రెండుకవాటములుగల్గి జిహ్వాయనెడి గడియగల్గిన శరీరమనెడి గృహమునందు బంధింపబడి రాగద్వేషయుతుడై భోగతృష్ణాతురుడైన మూఢుడు అంగప్రత్యంగములు ముడుచుకొని మాయిచేపరివేష్టింపబడి యతికష్టముచే యోనిమార్గమునుండి బయల్పడి విణ్మూత్ర రక్తసిక్తదేహుడై అతి కష్టుడై జనించి యస్థిపంజరములతో గూడిన కళేబరముగలవాడై 365 మాంసఖండములతోను సార్థత్రికోటి రోమంబులతో గూడి స్థూలసూక్ష్మ శరీరములయందు దృశ్యాదృశ్యరూపుడై కనబడుచుండును. ఈరోమములద్వారా స్వేదముపైకి చిమ్ముచుండును. జీవుడు 32 దంతములు 20 నఖములుగల్గి యుండును. పిత్తము 16 తులములు కఫము 256 తులములు వస 20 ఫలంబులు కపిలత్వము 10 ఫలంబులు, మేదస్సు 9½ తులంబులు మహారక్తము 3 ఫలములు దానికి 4 రెట్లుక్రొవ్వు 8 తులములు శుక్రము

యుండును. ఈశుక్రము జీవులకు బలమునిచ్చుచుండును. ఈ దేహమందు సహస్రఫలంబుల మాంసముండును. రక్తము శతపలంబులుండును. నాల్గేసి దోసిళ్ళచొప్పున విణ్మూత్రములుండును. ఈవిధంబుగా దేహగృహమునందు అపవిత్రవస్తువులచే నింపబడిన యనిత్య శరీరమున జీవుడు కర్మబద్ధుడై యుండును.

**శివ మహాపురాణమందలి ఉమాసంహితయందు**
**ఇరువదిరెండవ అధ్యాయము సంపూర్ణము**

---

## ఇరువదిమూడవ యధ్యాయము

### బాల్యాది యవస్థలు

ఇంకను యీ దేహము యొక్క పవిత్రతను మహాత్మ్యమును గూర్చి చెప్పెద వినుము ఈ దేహము శుక్లశోణిత సంయోగముచే జనించి యశుచియైన మూత్రపురీషముల యందు పెరుగుచు, నపవిత్రమగు విణ్మూత్రములతో గూడి వెలుపలకు వచ్చును గాన దేహ మపవిత్రమైనది, పవిత్రమైన పంచగవ్యము హవిస్సు, శరీరము తాకినంతనే యవికూడ నపవిత్రములగును, గాన శరీర మెంత పవిత్రమైనదో దీనిని బట్టి తెలిసికొనుము ఈశరీరమునకన్న, నపవిత్రమైన దేదియు లేదు. పవిత్రములగు నన్నపానాదులుకూడ శరీరమందుపడిన తోడనే యపవిత్రములగును మలమూత్రముల కాధారమైన యీ దేహము కడు నపవిత్రమై యుండెను. ఈ దేహము పంచగవ్యంబులచేతను మైపూతచేతను పవిత్రము కానేరదు. పర్వతమువంటి యీ దేహము సదా కఫమూత్రపురీషాదులచే నిండియుండును గాన దీనికి పవిత్రత యెట్లుగల్గును, ఈ దేహ సర్వాపవిత్రవస్తువులకు మూలకారణమైయుండెను. శరీరమం దెటుజూచిన నసహ్యాకరములగు నపవిత్రవస్తువులే గోచరింపుచుండును మలవిసర్జన చేసిన తోడనే హస్తములు మట్టితో కడిగినగాని శుద్ధి కానేరవు, అశుచి వస్తువులకు శరీరము భాండము వంటిది, ప్రయత్నపూర్వకముగ నీశరీరమున ననేకవిధంబులైన సువాసన

ద్రవ్యంబులు పూసినను కుక్కతోక సమానము గానట్లు దాని దుర్వాసన పైకి జిమ్ముచునేయుండును, స్వభావముగ నల్లని వస్తువులు తెలుపు చేయగలరు? ఆమలమును మన నాశికచే వాసన చూడలేముగదా? చూచినతోడనే కడుననసహ్యించుకొందుముకదా? ఇట్టిశరీరమున జూచివైరాగ్యము నొందులకు పొందరో యాశ్చర్యముగనున్నది, ఇది యజ్ఞానము యొక్కమాహాత్మ్యము దుర్గంధ భూయిష్ఠమగు నీశరీరమును మూఢులధికముగ ప్రేమింతురు, ఇదియేయాశ్చర్యము, మనశరీరమందు ప్రయోగించు వస్తువేదియును లేదు. ఇవన్నియుచూచుచున్నను, వైరాగ్యమునొందరు. శరీర మలము సోకినంతనే పవిత్రవస్తువులు కూడ నపవిత్రములగును. గంధలేపనములచే శరీరము పరిశుద్ధముగ గాన్పించునుగాని వాటిసువాసన తగ్గినంతనే మరల దేహమశుచివంతమై దుర్వాసనలు బయలుదేరును చీము, నెత్తురు, శ్లేష్మము, కఫము, చీమిడి, చెమట, మలమూత్రములతో దుర్గంధ భూయిష్ఠమగు దేహము నజ్ఞానులు, మాత్రమే ప్రేమింతురు, వాంతి మలంబులజూచి యసహ్యించుకొన్నట్లు, జ్ఞానులీదేహ మన్న హేయముగజూచుచు, వైరాగ్యము నొందుదురు. శరీరమే గాక స్వభావముకూడ కలుషితమైనచో నట్టివారు గంగాజలముచేగాని, పర్వతమంతమృత్తికచేతనైనను పరిశుద్ధులుగారు, దురాత్ములు తీర్థస్నానముల చేతను, తపంబుచేతను కూడ పరిశుద్ధులుగారు, సురాభాండము గంగాస్నానము చేసినను పరిశుద్ధతనొందనట్లు పరిశుద్ధులుగారు. దుష్టస్వభావులు యగ్నియందు కాల్చబడినను తైలఘృతంబులతో తడుపబడినను, యనేకపర్యాయములగ్ని ప్రదక్షిణములు చేసినను, చురకగ్నిలో దహింపబడినను పరిశుద్ధులుగారు. గంగయందు సదారమించు మీనంబులు దేవాలయమందు సహానవసించుచు ప్రదక్షిణములు చేయుచున్న పక్షులు, యేమైన ఫలమునొందుచున్నవా? అట్లే దుష్టాత్ములెన్ని తీర్థంబుల గ్రుంకినను యెన్ని దానంబులు చేసినను ఫలంబులేదు.

శ్లో॥ గంగాది తీర్థేషు వసంతి మత్స్యాః.
దేవాలయే పక్షిగణాశ్చ నిత్యం.
భావోజ్ఝితాస్తేన ఫలంలభంతే
తీర్థావగాహాశ్చతథైవ దానాత్.

2. భావశుద్ధిః పరంశౌచం
ప్రమాణే సర్వకర్మసు
అన్యథా లింగ్యతే కాంతా
భావేన దుహితాన్యథా

3. మనసోభిద్యతేన్వృత్తి
రభిన్నేష్వపి వస్తుషు.
అన్యథైవ సుతంనారీ
చిన్తయస్త్యన్యథాపతిం.

భావశుద్ధి చేసికొనుటయే యన్నిశుద్ధులకన్న శ్రేష్టమైనది. భావశుద్ధి లేనిచో నేకర్మలు ఫలింపవు. జ్ఞానపరిశీలనచే కర్మఫలంబులు తెలిసికొని కర్మలాచరించినచో నవి ఫలించును గాని పశుపక్ష్యాదులవలె కర్మఫలంబులు తెలియక జేయుకర్మలు ఫలింపవు. ఇదియే పరమశౌచము, పురుషుడు భార్యను ప్రేమించి యాలింగన మొనర్చునపుడు భావ మొకవిధంబుగ నుండును. పుత్రికాలింగనమున మరియొకవిధ మగుభావ ముండును. స్త్రీ తనభర్త నొకవిధంబున ప్రేమించును. పుత్రు నొకవిధంబున ప్రేమించును. పుత్రపుత్రికాప్రేమలు స్వార్థము లేని ప్రేమలు. భార్యాభర్తృప్రేమలు స్వార్థములైనవి. ఇవ్విధంబున భావము లనేక విధంబులుగ నుండును. స్త్రీభావము లేనపురుషుడు కామరాహితుడై యుండును. అన్నిటి కన్న స్త్రీప్రేమ యగాధసముద్రమునందు ముంచు పైకిరానీయదు. మిగిలిన ప్రేమ లంతగా నణగద్రొక్కవు. స్త్రీప్రేమికులు, కామక్రోధాది శత్రువులకు గురియగుదురు. ఎన్ని భోగము లనుభవించినను వారికి తృప్తియుండదు, వీటిని విరక్తులై యుండువారికి, స్వర్గమోక్షంబులు చేకూరును. పరిశుద్ధ మనస్కులుకూడ స్వర్గాపవర్గంబుల నొందగలరు.

మృణ్మాత్రాదులచే నపరిశుద్ధమైన శరీరము జ్ఞానమనెడు జలంబులో గాని వైరాగ్య మనెడు మృత్తికచే గాని పరిశుద్ధమగును.

మరియు నవిద్యారాగ రూపమైన విణ్మూత్ర శేషదుర్గంధిశముల నుండి పరిశుద్ధుడగును. ఈ శరీరము స్వభావముగ నపవిత్రమైనది. ఇది కదళీసారసన్నిభమై నిస్సారముగ నుండును.

గాన శరీరము, శిథిలమైనదని బుద్ధిమంతులు గ్రహింతురు. దేహభోగముల కాశింపరు. ఇట్టివారు సంసార సాగర మవలీలగ దాటుదురు. వారేజీవన్ముక్తు లగుదురు. ఇట్టివారు సంసారరూపమైన కదళీ సారమును గ్రహింతురు. ఇవ్విధంబున నజ్ఞాన దోషముచే ననేక కర్మలకు వశులై మహాకష్ట దాయకములైన జన్మదుఃఖములనుభవింతురు. అనేక శ్లోకములతో జెప్పిన ప్రయోజన మేమున్నది. ముఖ్యవిషయము నర్ధశ్లోకముతో జెప్పెదవినుడు.

నేనే దుఃఖములకు పరమకారణుడను, నేను లేకుండుటయే పరమ సుఖము. అనగా, నేను నాదియను నహంభావముండుటయే కడుదుఃఖము. అదిలేక విరక్తుడగుటయే మిక్కిలి సుఖమని యర్థము. అనేక రాజులు విరక్తులై, బంధవిముక్తులై మోక్షమునొందిరి. బద్ధజీవులనేక మంది మమతాశూన్యులై బంధవిముక్తులగుచుండిరి. మాయయంత్ర పీడితులై జీవులు దుఃఖించుచుందురే గాని గర్భనరకమున బడని స్వాతంత్రమాలోచింపరు. గర్భనరకమునందుండగా దుఃఖించుచు నన్యకు నట్టిబాధలు పడును. నేను వెలుపలకువచ్చి ముక్తిమార్గమును వెదకెదను, మంచిని, సత్కర్మలు చేయుదు, విరాగినై భగవత్సేవలు చేయుదు, మనస్సునందనేక విధముల తలంచుచున్న జీవుడు, గర్భము నుండి వెలుపలకు వచ్చినంతనే, మాయలోబడి, బాహ్యవాయుస్పర్శచే విజ్ఞానము నశించినవాడై, మోహజ్వరాక్రాంతుడై, మూఢుడై, విజ్ఞానశూన్యుడై, పూర్వస్మృతిని మరచి దుష్టకర్మలాచరించుచు, విషయాసక్తుడై యుండును. మూఢులిట్లు ప్రవర్తింతురేగాని దీనిలో ప్రయోజనమేమియు లేదు. ఇట్టివారాత్మను గాని, దైవమును గాని తెలిసికొనలేరు. శ్రవణంబులున్నను, పరమోత్కృష్టములగు భగవద్వాక్యములు వినలేరు, నేత్రములున్నను, భగవంతుని గానలేరు. ఇట్టివారు పండితులెంత బోధించినను యథార్థమును గుర్తెరుంగజాలరు. వీరునడచెడు మార్గము

సరియైన దైనను, యజ్ఞానముచే త్రోయుబాటుతో నడచెదరు, గర్భమం దున్న జ్ఞానము, వెలుపలకు వచ్చినతోడనే నశించుటచే మరల నజ్ఞాన ముచే దుఃఖింపుచునే యుందురు. శాస్త్రమిట్లుండెనని శిశువు చెప్పియుం డెను, తన్ను గురించి తపమొనర్చిచో స్వర్గమోక్షములు చేకూరునని కూడ చెప్పియుండెను. ఆత్మశ్రేయస్సుకై సర్వకామార్థసాధనమైన జ్ఞానమున్నను, ఆత్మశ్రేయస్సును పొందనుపాయము గాన కుండుటయే యత్యద్భుతము.

బాల్యాదస్థలో నింద్రియ శక్తి లేకుండుటచే, కడుదుఃఖించుచుందురు. బాల్యావస్థయందెంత యిచ్ఛయున్నను, నడచుటకు గాని, పలుకుటకు గాని పనిచేయుటకు గాని, సమర్థుడు గాడు. మరియు దంతములు వచ్చున పుడు, అల్పవ్యాధులు కల్గినను కడుదుఃఖించుచు, చుందురు. ఇంకనువారు బాలరోగముల చేతను, బాలగ్రహముల చేతను. క్షుత్పిపాసల చేతను, పీడింపబడుచు ఏడ్చుచు, అడుగుటకు మాటలురాక బాధపడు చుందురు. ఇంకను విరుమోహముచే విణ్మూత్రములు కూడ భక్షింపుచుందురు. కౌమారంబున చెవులు కుట్టించుట చేతను, తలితండ్రు లక్షరాభ్యాసము చేయగా నక్షరములు లిఖించలేక, దుఃఖించెదరు, బాల్యము దాటిన తరి యుక్తాయుక్త వివేకహీనులై, సంచరింతురు. పిమ్మట యవ్వన మంకు రింపగనే, యింద్రియ ప్రవృత్తి గల్గి, కామరోగ ప్రపీడితుడై, సతతము సుఖములు గోరుచు నవి లభింప కున్న చో దుఃఖింపుచుందురు, యవ్వన మందు మాత్రము సుఖమున్నద, ఈర్ష్యచే మహాదుఃఖము నొందుచు, మోహముచే పీడింపబడుచు, కుపితనేత్రుడగుచు. ధనమును సత్పాత్రవిని యోగముచేయక. దుర్వ్యసనములకులోనై. దుఃఖించుచు, కామాగ్నిచే దహింప బడుచు, రాత్రంతయు నిద్రలేక పరితపించుచు, పగలంతయు ధనోపార్జనకై చింతించుచుందురు, ఇట్టివానికి సుఖమెక్కడి నుండివచ్చును! పురుషునకు వీర్యము చముటవంటిది, దీనివలన సుఖమేమున్నది? క్రిమిసం యుక్తకుష్ఠరోగపీడితయైన వానరము కండూతి సుఖమున కాశించినట్లు, స్త్రీసంయోగ సుఖమట్లే యుండును. మురదపెట్టిన వానికి సఖములతో గోకిన నెంతసుఖమో స్త్రీసంయోగముకూడ నంతియేసుఖము. ఇంతకన్న సుఖమేమియు లేదు.మరియు. విణ్మూత్రములు విడిచినప్పు డెంతసుఖమో.

స్త్రీసంయోగ మంతియే సుఖము.మూఢులు స్త్రీసంయోగమే మహాసుఖ మని తలంతురు; స్త్రీలు సర్వదోషములకు మూలకారణములు. స్త్రీలతో నైన మాత్రమైనను సుఖములేదని పంచచూడ 11 చెప్పియుండెను. సన్మానావ మానముల చేతను, వియోగ సంగముల చేతను, ప్రియాప్రియంబుల చేతను, యౌవ్వన మందు సుఖదుఃఖము లొందుచుండును. ఇట్టియౌవ్వన మును, జర గ్రసించు చుండును, ఇంకసుఖ మెక్కడిది? జరయంకురించి నంతనే శరీరమంతయు ముడుతలు బడి, కేశములు తెల్లబడి, శిథిల శరీరుడై, సర్వశక్తులు నశించి, పురుషునకు స్త్రీయందు, స్త్రీకిపురుషుని యందు విర క్తిగల్గి, పూర్వప్రీతి నశించును. వైశాల్యమున్న వాడైనను నిట్టి శరీరమును ప్రేమింపడు ఇట్టివాడు బంధుమిత్రులచే గాక, భృత్యులచే గూడ తిరస్క రింప బడుచుందురు. వార్ధక్య దశలో ధర్మార్థ కామమోక్షంబులు సంపా దించుట కసమర్థులగు చుందురు, గాన యువావస్థయందే సంపాదించు కొన వలెను.

శివమహాపురాణము నందలి ఉమాసంహిత యందు
ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది నాల్గవ యధ్యాయము

### స్త్రీస్వభావము

మరల వ్యాసుమునీట్లు ప్రశ్నించెను సనత్కుమారా! పంచ చూడయనె డు స్త్రీరత్నము చెప్పిన స్త్రీలయష్ట స్వభావములుకూడ చెప్పుమన సనత్కు మారుడిట్లు చెప్పదొడంగెను. స్త్రీస్వభావము నన్నదున్నట్లుగ చెచ్చెదవినుము. ఇదివిన్నంతనే వైరాగ్యముకల్గును స్త్రీలుసర్వ దోషములకు మూలకారణములు, అల్పబుద్ధులు మోక్షము కోరువారెవ్వరు స్త్రీలయం దాసక్తినుంచరాదు. ఇందువిషయమై యొకపురాతనేతి హాసమును చెప్పెదవినుము. వ్యభిచారి యగు పంచచూడకు నారదునకు జరిగిన సంవాదము చెప్పెదవినుము. పూర్వము నార

డుడు త్రిలోకములు సంచరింపుచు పంచచూడయను నప్సరో బాలికనుగాంచి, ఓసుమధ్యమా! నామంబునందొక సందేహమున్నది దానిని నివృత్తిచేయు మన సౌందర్యవతియగు నాయచ్చరలేను నారదవాక్యములువిని మహర్షీ! నా వాక్యములు నీవువిన గోరినచో చెప్పెదను నీకోరిక తెల్పుమన పంచచూడా! నాకు కోర్కెలేవియునులేవు స్త్రీస్వభావములు మాత్రము వినగోరితినన నామెయిట్లు చెప్పదొడంగెను.

ప్రతీస్త్రీస్వభావము చెప్పెద వినుము. పతివ్రతా స్త్రీని యెట్టి స్త్రీలు కూడ నిందింపలేరు. యెట్టిపురుషులు నిందింపలేరు. నీబోటి వారలు నన్నిట్లు ప్రశ్నింపరాదు. మాబోటివారలతో మీవంటివారు ప్రసంగించుటయే దూష్యమని యూరుకొన నారదుడామెతో లోకహితముకై ప్రశ్నించుచుంటనని వేడెంచగాను అనృతవాక్యములు పల్కినచో దోషముగాని సత్యము పల్కినచో దూష్యముకాదు గావనీవు యథార్థము బల్కుమన నాచారు హాసిని స్త్రీదోషము లిట్లు చెప్పదొడంగెను.

సద్వంశమున జనించి వివాహితురాలై రూపవతియగు స్త్రీమర్యాదను త్యజించినచో నామె దోషురాలని చెప్పబడును. స్త్రీలకన్న పాపాత్ములెవరును లేరు. స్త్రీలు స్వపాపములకు మూలకారణులని తెలిసికొనుము.

రూపవతులగు స్త్రీలు ధనవంతులను యతీశ్వరులను వారియశస్సులను గుణంబులను తెలిసికొని దర్శింపవలయును గాని యథేచ్ఛగా దర్శింపరాదు స్త్రీలు అధర్ములు ఇట్టివారిని పాపులగువారు లజ్జను వీడి సేవించుచుందురు. వారివద్దకు జని ప్రార్థించుచుందురు. వారలను స్త్రీలు ప్రేమించుచుందురు భర్తభయముచే స్త్రీ పరులను ప్రేమింపరు గాని సుందర పురుషునిగాంచి నంతనే మోహింపుచుందురు. మర్యాదామర్యాదలు మానావమానములు భర్తకు స్త్రీవల్లనే గల్గుచుండును. యోగ్యాయోగ్యంబులు గుర్తెరుంగక పురుషులను ప్రేమించుచుందురు. కామార్తలు సురూపులనియు కురూపులనియు భావింపక భోగింపుచుందురు. స్త్రీలునిర్భయులు కారణములేక దుఃఖించుచుందురు. ధనముకై పరితపింతురు. జ్ఞాతివారలకు భర్తకునిట్లు, బడియుందురు, యౌవ్వనము వచ్చినంతనే కులస్త్రీలు వ్యభిచారిణిలు, కూడ,

మంచిమంచి వస్త్రాలంకారములు కోరుచుందురు. స్త్రీలను సదా రక్షించుచుండవలెను. వీరు చంచల స్వభావులు వ్యభిచార స్త్రీలు ధనోపార్జనకై బధిరాంధకుబ్జ వామనులను కూడ కోరుచుందురు. స్త్రీస్వభావము తెలిసికొనుట కష్టము వీరవసరము వచ్చినపుడు సతులను కూడ సంహారింతురు అసృతమునకు వెరువరు. మాటచేనమ్మించి లేనిప్రేమను వెలిబుచ్చుచు భర్తలను మోసగింతురు. చపలచిత్తులు, దుశ్చేష్టలు అగ్రాహ్య మనస్కులు ఇట్టి వ్యభిచారిణులు యెందరితో రమించినను తృప్తినొందరు ఎన్ని కాష్ఠములు వేసినను యగ్నికి తృప్తి కానట్లు. యెన్ని నదులు కలిసినను, సాగరమునకు తృప్తి కానట్లు స్త్రీలు యెందరి పురుషులనుభవించినను తృప్తి నొందరు, పురుషులు లభింపకున్నను, లోకుల భయము చేతను వ్యభిచారము మానివలెనుగానిన లేనిచో మానరు. సుందర పురుషుల గాంచి నంతనే స్త్రీలు మోహించుచుందురు, అంతకుడు శమనుడు, మృత్యువు, పాతాళము, బడబాగ్ని క్షుర ధార విషము సర్పము అగ్ని మొదలగు ఘోరదుస్తుతుల్యలై, స్త్రీ లుండెదరు. బ్రహ్మ పంచ మహాభూతములతో గూడిన ప్రపంచమును సృజించి సకల దోషములతో గూడిన స్త్రీలను కుడ సృష్టించెను. కాని స్త్రీలందరు నిట్టి వారుండరు కులటలు మాత్రమే యిట్లుందురు. యెట్లైనను స్త్రీలుసర్వ ప్రమాదములకు కారణ భూతలని పంచచూడ బలుక నారదుడు విని యిందలి సత్యముగ్రహించి విరక్తుడై తూష్ణీంభావమునొందెను,

శివ మహా పురాణమందలి ఉమాసహితయందు
ఇరువది నాల్గువ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువది యైదవ యధ్యాయము

## కాలజ్ఞానము

కాలజ్ఞానమునుకూడ చెప్పు మన వ్యాసుడు ప్రశ్నింప సనత్కుమారు డిట్లు చెప్పదొడంగెను. పూర్వము పార్వతి శివునివలన ననేకకథలు విని శివు నిట్లు ప్రశ్నించెను. పరమేశ్వరా! మీయనుగ్రహముచే సర్వము నెరింగితిని. ఓ దేవా! నిన్నర్చించు టెట్లు? యథావిధిగా మంత్రోపాసన చేయుటెట్లు? కాల చక్రమునుగూర్చి నాకొకసంశయ మున్నది. ఆయుర్దాయముయొక్క ప్రమాణ మెంత? మృత్యుచిహ్నము లెట్లుండును? నేను నీకు ప్రియురాలను గాన నిదంతయు విస్తరించి చెప్పు డన, పరమేశ్వరు డిట్లు చెప్పదొడంగెను. దేవీ! సర్వోత్తమంబైన శాస్త్రవిధాన మంతయు జెప్పెద వినుము. నరులు కాలప్ర మాణమంతయు నేశాస్త్రమునం దెట్లు చెప్పబడెనో యదంతయు జెప్పెద వినుము, దినము, పక్షము, మాసము, ఋతువు, అయనము, సంవత్సరము మొదలగు బాహ్యాభ్యంతర చిహ్నములతో గూడిన, స్థూల సూక్ష్మచిహ్న ములచే, మృత్యువును తెలిసికొనవచ్చును. ఇది లోకోపకారమునకు వైరాగ్య ము కల్గుటకును చెప్పెదను. అకస్మాత్తుగ శరీరమంతయు పాండువర్ణము కల్గి, ముఖముమాత్రము యెర్రగానున్నచో నట్టివానికి షణ్మాసములలో మృత్యువు సంభవించును, భయానక ఘోరశబ్దంబులు వినబడనిచో షణ్మాసములలో మృ త్యువు సంభవించును. ప్రజ్వరిల్లుచున్న రవిచంద్రాగ్నులు కనబడకున్నను, నంతటా, తమోమయముగ గోచరించినను, నారుమాసములలో మృతితప్ప దని గ్రహింపవలయును. వామహస్తము, వారమురోజు లదరినచో, నొకమా సములో మృతి సంభవించును. శరీరమంతయు నుబ్బి పదములు మాత్రము శు ష్కించినచో నొకమాసలో జీవితము సమాప్తమగును. వాతపిత్తశ్లేష్మము లనెడు, త్రిదోషములచే నాసిక స్రవించినచో ఒకపక్షములో మరణించును, ముఖము కంఠము శుష్కించినచో షణ్మాసములలో మరణించును. నాలుక పూచి, యుబ్బి, దంతములన్నిటియందు చీము గారి రంధ్రములు పడినచో నారుమాసములలో మరణించును. తైలఘృతాంబువులయందున దర్పణమం దున, తన ముఖముకనబడనిచో, లేక వికృతముగ నున్నను, ఆరుమాసము

లలో కాలచక్రము సమీపించె నని తెలిసికొనవలెను. తనఛాయ కనబడకున్నను, లేక శిరోహీనముగ నున్నను, నొక మాసములో మరణించును. ఓపార్వతీ! ఇటుపై నంగసంబంధము లగు బాహ్యమృత్యుచిహ్నంబులు చెప్పెద వినుము. సూర్యచంద్రులకిరణములు గానిపింపక, మకమకలాడుచు, నెఱ్రగా గోచరించినచో నొకయర్ధమాసములో మరణించును. అరుంధతి, చంద్రుడు, తారలు కనబడనిచో, మాసములో మరణించును, గ్రహములు చూచుచున్నను దిగ్భ్రమకల్గినచో, నారుమాసములలో నాయువు క్షీణించును. ఉత్తరదిక్కునం దున్న ధృవమండలము గోచరింపకున్నను, రవిమండలము కనబడకున్నను, రాత్రి యింద్రధనువును గాంచినను, మధ్యాహ్నసమయంబున నుల్కాపాతంబులు గోచరించినను, గృధ్రవాయసంబులచే పరివేష్టింపబడినను, షణ్మాసములు జీవింతురు! ఇందులో సంశయములేదు.

గగనమున సప్తఋషులు గానిపింపకున్నను, అకస్మాత్తుగ రవిచంద్రులు రాహుగ్రస్తులై గోచరించినను. దిక్చక్రము భ్రమించినట్లు గోచరించినను, శ్మశానములలో గానము వినబడినను, నీలమక్షిక, లకస్మాత్తుగ పురుషుని పరివేష్టించినను, గృధ్రకాకపోతంబులు పరివేష్టించినను, శిరమున వ్రాలినను. నొకమాసములో మరణించును. బాహ్యస్థమైన యరిష్టభేదములన్నియు జెప్పితిని, ఇదంతయు [illegible] చెప్పితిని, ఇటుపై హస్తసాముద్రికము జెప్పెదను. శుభయుహస్తరేఖలను బట్టి కాలనిర్ణయముచేయవచ్చును, నాడములవలన [illegible], లక్షణములు చెప్పవచ్చును.

క్షణము, త్రుటి, లవము, నిమేషము, కాష్ఠము, కలికము, ముహూర్తము, అహోరాత్రము, పక్షము, మాసము వత్సరము, అబ్దము, యుగము, కల్పము, మహాకల్పములను నామంబులతో వాయువు ఆయుర్దాయమును హరించుచుండును. ఐదుదినములనుండి ఇరువది నైదు దినములవరకు, వామాచారకలి నాశ్రయించి నాడము ప్రవర్తించుచుండును. భూతరంధ్రములు, దిశలు, ధన్వులులచే కాలభేదములు, వామాచారప్రమాణములను, తెలిసికొందుము, [illegible]నములనుండి, దక్షిణనాద ప్రమాణములనుగూర్చి, తెలిసికొనవచ్చును, ఇడాపింగళాదినాడులు, జీవుల

ప్రాణములను, వహించుచున్నవి ఇడా పింగళాయనెడు నాడులు, కుడియెడమనాసికలందు ప్రవర్తింపుచున్నవి. ఒక్క ఇడానాసికచేతనె, గాలి పీల్చెడి జీవులన్నియు, సంవత్సరములోపుగా మరణించును, ఇడానాడియందు, పదిరోజులుగాని, పదిహేనురోజులుగాని, వాయుసంచారమున్నచో, ఒక సంవత్సరమువరకు జీవించును, ఇరువదిరోజులు ప్రవహించినచో, షణ్మాసములుజీవించును; వామనాడియైన పింగళనాడి 25 రోజులుప్రవహించినచో, 3 మాసములు జీవించును + 26 రోజులుప్రవహించినచో, రెండుమాసములుజీవించును, 27 దినములుప్రవహించినచో ఒక మాసముజీవించును, కుడియెడమవాయువులనుబట్టి, ఈవిధముగ జీవితము తెలిసికొనవలెను, హృదయము, కంఠము, నోరు, నాసికలనెడి నాల్గుస్థానములయందు నాడీసంచారముకలిగినచో, షోడశనాడీయుని చెప్పబడును ఈనాడీసంచారమును బట్టి జీవితపరిమాణములెక్కపెట్టవచ్చును.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
ఇరువది యైదవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువది యారవ యధ్యాయము

### కాలవంచనము శబ్దలక్షణము

మరియు, పరమేశ్వరి పరమేశ్వరునితో మూడు కాలజ్ఞానమును గూర్చి చెప్పితిరి. ఇటుపై కాలము నెదుర్కొను విధానమును గూర్చి చెప్పుమని ప్రార్థింప సతి డిట్లు చెప్పదొడంగెను. ఓ దేవీ నీ వడిగిన దంతయును మనుజహితంబునకై జెప్పెద వినుము. పృథివ్యప్తే జో వాయ్వాకాశములనెడు పంచభూతములచే శరీరములు నిర్మితము లగుచుండెను. వీటిలో నాకాశము సర్వవ్యాప్తమై యుండెను. ఒక్కొక్కప్పు డది వియోగము పొందినను మరల స్వస్థానమును పొందుచునే యుండును. ఇది స్థిరముగ నుండదు. దీని విషయమై

జ్ఞానులు మంత్ర తంత్ర యోగములద్వారా తెలిసి కొందురన, ఓ పరమేశ్వరా! ఘోరకాళ కరాళ స్వరూపులగు తమ రాకాశమును దగ్ధము చేయుచు తృప్తిజెంది మరల మాయచే సృజించెదరు. మీరు కాలస్వరూపులై, జీవుల శుభా శుభంబులు ప్రకటించుచుందురు. కాలము ననేక విధములుగ వర్ణించియుండిరి. తమరు గుప్తముగనుండి కాలమును ప్రేరేపింతురు. కాలము మీయిష్టప్రకారము సంచరించును. మీరాత్మతంత్రము తెలిసిన యోగీశ్వరులు, మీరు పరోపకారమునకై యీసగుణ రూపమును ధరించితిరి. కాలము నెట్లుమరొక్కనవలయునో, తెల్పుడని పరమేశ్వరి పలుక, శంకరుడు నవ్వుచు దేవీ! నీపలుకులు సత్యము. యోగీశ్వరులు వినా కాలము నెవరడ్డుకొనగలరు? పంచభూతములతోను, పంచగణములతోను జనించిన ఈదేహము, మరల పంచభూతముల యందు విలీన మగును, ఆకాశము నుండి వాయువు వాయువునుండి యగ్ని యగ్ని నుండి యుదకము, యుదకము నుండి, భూమి జనించెను. మరల నివిధంబుగనే పంచభూతములు లయమగుచుండును. మరియు పృథివికి శబ్దస్పర్శరూప రసగంధము లనెడి యైదుగుణంబులు గలవు. జలమునకు, శబ్దస్పర్శరూప రసంబులనెడు నాల్గు గుణంబులు గలవు. అగ్నికి శబ్దస్పర్శ రూపంబు లనెడు మూడు గుణంబులు గలవు. వాయువునకు శబ్దస్పర్శలనెడు రెండుగుణంబులు గలవు. ఆకాశమునకు శబ్దమను నొక్క గుణంబు మాత్రమే శేషించియుండును. శబ్దస్పర్శ రూప రస గంధము లలో [illegible] వ్యత్యాసము గల్గును. పంచభూతముల [illegible] కాలము నేదురొక్కన గలరు. మరియునే భూతము గోపించిన నాభూతము నుపాసించినచో, సమసరిగా ప్రవర్తించునని శంకరుడు బలుక నే ధ్యాన యోగ మంత్రయులచే, యోగులు మృత్యువుని జయించు చుండిరో తెల్పుడని పరమేశ్వరి పలుక శంకరు డిట్లు చెప్పదొడంగెను. నీవడిగిన ప్రశ్న మితరులకు చెప్పరాదు. కాని యోగులహితమునకై నీకుమాత్రమే చెప్పెదవినుము. ఈ పరజ్ఞానము శ్రద్ధాభక్తులున్నవారికే చెప్పవలయును. నాస్తికులుకానివారికి, పరిశుద్ధులకు, నిత్యధర్ములకు వినిపింపవలయును. మంచిశ్వాసకల్గినప్పుడు మృదుశయ్యపై నాసీనుడై, యోగవేత్తలు యోగమును సాధింపవలయును. ఈయోగము ప్రజలందరు నిద్రించువేళను,

దీపములేని తావులందును, యోగమునభ్యసింపవలయును. ఇది ప్రారంభమున నొకముహూర్తకాలము, రెండు తర్జనులచే రెండు కర్ణములు బంధించినచో, నగ్నివిస్ఫులింగములవలె చిటపటశబ్దములు వినబడును. ముహూర్తమనగా 48 నిమిషములు. ఇట్టి శబ్దము ప్రతిదినము విన్నచో సర్వరోగములు, సర్వజ్వరోపద్రవములు, నశించును. ఇట్లు ప్రతిదినము రెండు ఘడియలకాలము అనగా నొకముహూర్తకాలమిట్లు చిటపట శబ్దములు వినుచు, నేదేక ధ్యానముగ నున్నచో, సకలరోగములు పోవుటయేగాక వాయుపథ సంచారికూడ కాగలడు. ఇట్టివాడు సర్వజ్ఞుడై, సర్వదర్శియై, సర్వసిద్ధుల నొందగలడు. ఇట్ల భ్యాసముచేయుగా చేయగా మేఘగర్జనలు వినబడును. అట్టి శబ్దములు విన్నవాడు సంసారబంధవిముక్తుడై, యోగియై యతిసూక్ష్ముడై, యెంత సూక్ష్మవస్తువునందైన ప్రవేశింపగల సమర్థుడగును. ఇదియే శబ్ద బ్రహ్మ విధి క్రమము. ధాన్యమునుగాంచి ధాన్యములేనివెన్నును త్యజించినట్లు, ఈధ్యానమందున్న పురుషుడు సర్వబంధవిముక్తుడగును. శబ్దబ్రహ్మను విన్న మనుజులు దేనిని కాంక్షింపరు. ఈ శబ్దబ్రహ్మోపాసనచే నసాధ్యమైన కోరికల సాధింపవచ్చును. ఇది పరమసుఖదాయకమై, ముక్తినికూడనొసగును. ఇది మనసుచేతనైనపని. దీనికేయుపాధులు నవసరములేదు. కాలపాశమోహితులు, మృత్యుపాశవశంగతులునగు పాపులు, దుర్బుద్ధులు శబ్దబ్రహ్మను తెలిసికొనలేరు. ఇది తెలియనివారు సంసారబద్ధులై యుందురు. ఇట్టి పరమతత్త్వము నెరింగినచో, జన్మబంధనము లుండవు. ముందుగా నిద్రాలస్యము లనెడు శత్రువులను జయింపవలెను. ఇట్టి విఘ్నములను ప్రయత్నముగ జయింపవలెను. సుఖాసీనుడై శబ్దబ్రహ్మను సాధించినచో, శతజీవియై వృద్ధుడై యున్నను నాయురారోగ్యములు వృద్ధినొంది మృత్యువును జయింపవచ్చును. వృద్ధునకే యింత యభివృద్ధి గల్గుచుండ, నిక యువకుని మాటజెప్పనేల, దీనికి బీజమంత్రములుగాని, ఓంకారముగాని యవసరములేదు. ఉచ్చారణము నవసరము లేదు. దీనిని శ్రద్ధతో ధ్యానము చేసినజాలును. ఆయుర్వృద్ధికై నవ, విధానములను గూర్చి చెప్పెద వినుము. వీటిచే క్రమముగా నాదసిద్ధిని పొందగరు. 1 ఘోషనాదము 2 కంచునాదము 3 శృంగబూరానాదము 4 ఘంటానాదము 5 వీణానాదము 6 పిల్లంనాదము 7 దుందుభినాదము 8 శంఖనాదము

9 మేఘగర్జనము. ఇవియే నవ విధనాదములు. వీని క్రమముగా నభ్యసించి వీనిని త్యజించి తుంకార మభ్యసించిన యోగి పుణ్యపాపము లంటకుండును. దీనిని తుంకారశబ్దమందురు. యోగాభ్యాస సమయంబున నేయితర శబ్దములు వినరాదు. దివారాత్రంబు లిట్టి శబ్దంబులు విన్నచో సప్తదినములలో మృత్యువును జయింపగలడు. నవ విధనాదముల ఫలితమునుగూడ చెప్పెద వినుము. మొదటిది ఘోషనాదము. ఇది ఆత్మశుద్ధిని కలుగజేయును. ఇంకను నిది సర్వ వ్యాధులను హరించి యుత్తమంబగు వశ్యాకర్షణము నిచ్చును.

రెండవదియగు కాంశ్యనాదము సర్వప్రాణుల గతులను స్తంభింపజేసి, భూత గ్రహంబులను, సర్వవిషంబులను, భస్మము చేయుటలో సందియము లేదు.

మూడవదియగు శృంగనాదము యాభిచారిక హోమములవలె నుచ్చాటనచే శత్రువులను సంహరింపజేయును.

నాల్గవదియగు ఘంటానాదము. దేవతలనే వశముచేసికొనును. ఇక మనుజుల మాట జెప్పనేల, దీనిచే యక్ష గంధర్వ కన్యకలు వచ్చి కావలసిన సిద్ధుల నొసంగి చనెదరు.

ఐదవదియగు వీణానాదము విన్నచో దూరదర్శన శక్తి కల్గును.

ఆరవదియగు వంశనాదము విన్నచో సర్వతత్త్వములు తెలియబడును.

ఏడవదియగు దుందుభినాదము విన్నచో, జరామృత్యు వివర్జితుడగును.

ఎనిమిదవదగు శంఖనాదము విన్నచో కామరూపులై సంచరింపగలరు.

తొమ్మిదవదగు మేఘనాదము విన్నచో సర్వాపత్తి విహీనుడై యుండును.

సదా మనసా తుంకారనాదమువిని ధ్యానించిన వానికి సాధ్యముకాని దేదియు నుండదు. ఇట్టివారు, సర్వజ్ఞులై, కామరూపులై, వికార రహితులై యంతమున శివ సాన్నిధ్యము నొందగలరు. సంశయము లేదు. ఓ దేవీ నీకు శబ్దబ్రహ్మను గూర్చి చెప్పితిని నిటుపై నేమి వినదలచితివో జెప్పుము.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు

ఇరువది యారవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువది యేడవ యధ్యాయము

## యోగలక్షణములు, ప్రాణాయామముచే మృత్యువును జయించుట

మరల పరమేశ్వరి ఇట్లు ప్రశ్నించెను. పరమేశ్వరా! యోగులు యోగాకాశ సముద్భవమైన వాయుపథమెట్లు పొందెదరో తెల్పుమన నత డిట్లు చెప్పదొడంగెను, పూర్వము యోగుల హితమునకై సకలసర్వజ్ఞులచేతను నీవిషయమై చెప్పబడి యుండెను, యోగులు కాలమును జయించి వాయుపథము నెట్లుపొందిరో చెప్పెదవినుము. యోగి తన మృత్యుదినము తెలిసికొని స్థిరచిత్తుడై యోగాభ్యాసము చేయుచు, పదిహేను దినములలో తన మృత్యువుని జయింపగల్గుచున్నాడు. హృదయ మందున్న వాయువు జఠరాగ్నిని ప్రజ్వలింప జేయుచుండును, సర్వగతుడగు నీవాయువు బాహ్యాభ్యంతరములయందు సంచరింపుచుండును, జ్ఞానవిజ్ఞానోత్సాహంబులు వాయువుచే ప్రవర్తిల్లుచున్నవి. ఇట్టివాయువును జయించినవాడికి జగత్తంతయు జయింపబడుచున్నది. జరామృత్యు నిరోధమును కోరువారు, వాయువుని జయింపవలెను. లోహకారుడు తిత్తిచే నగ్నినూది సర్వకార్యములు సాధించునట్లుగ యోగులు వాయునిరోధముచే సర్వకార్యములు సాధింపగల్గుదురు, భగవంతుడు సహస్రశిరో బాహుచరణ నేత్రంబులు గలవాడై, సర్వగ్రంథుల నావరించి దశాంగుళ పరిమితి గలవాడై, జీవుల హృదయ మందుండును, వ్యాహృతులతో గాయత్రిని ముమ్మారు పఠించి, యనగా జపించి ప్రాణముల నరికట్టుటయే ప్రాణాయామమని చెప్పబడును రవిచంద్రులకైన నుదయాస్తమయంబు లుండును గాని, యోగాభ్యాస కులకు మాత్రము జనన మరణములుండవు. ఒక్క ప్రాణాయామము చేసినచో శతసంవత్సరములు కేవలము కుశాగ్రాంబువులు పానముచేసి తపంబు చేసినఫలంబు సంభవించును. ప్రాతఃకాలమున లేచి యొక్క ప్రాణాయామము చేసినంతనే సర్వపాప విముక్తుడై బ్రహ్మలోకమును బొందగలడు, ఇతరచింతలు వీడి యేకాంతమందుండి, ప్రాణాయామము చేసినచో, జరామృత్యు వర్జితుడై, వాయుపథమందు గగన సంచారము చేయును, ప్రాణాయామ తత్పరుడు స్వేచ్ఛాస్వరూపము నొంది

కాన్తిగల్గి, మేధావంతుడై, పరాక్రమవంతుడై, శౌర్యవన్తుడై, వాయువే గము గల్గి, ప్రకాశించు సౌఖ్యసుఖములననుభవించును, పరమందుకూడ సుఖమునుభవించును. ఇప్పుడు యోగి వాయు సిద్ధిని పొందుటను గురించి చెప్పితిని, ఇటుపై తేజస్సిద్ధిని గూర్చి చెప్పెదను వినుము. నిర్జనప్రదేశమందు సుఖాసనశాయియై, రవిచన్ద్రులనెడి నేత్ర తేజంబులతో గూడుకొన్న యోగియాలస్య రహితుడై, భ్రూమధ్య యందు యగ్నిని ప్రజ్వాలింపచేయుచున్న యోగి దీపములేని ప్రదేశము లందుగూడ, తన తేజంబును ప్రకాశింప జేయును యోగితన నేత్రములు ప్రయత్న పూర్వకముగ వ్రేళ్లతో మూసుకొని. తారలను గాంచుచు, నేకాగ్రచిత్తుడై 24 నిమిషములు తమస్సునే ధ్యానింపు చుండ, శ్వేత,రక్త, పీతకృష్ణవర్ణంబులు గల ఇంద్రధనుస్సు వంటి తేజంబు గోచరించును, ఇంచుపరిభ్రూమధ్యలలాటములందు బాలార్కసదృశ తేజంబును గాంచుచుండును. ఇట్టివాడు కామరూపుడై సంచరింపగలడు, మరియు వివిధ కామములు నశింపజేసికొని, యిట్టిధ్యానమందున్నవాడు పరకాయ ప్రవేశము గూడ జేయుగలడు, మరియు సృష్టించుట, అణిమాద్యష్ట సిద్ధులనొంది మనసుచే సర్వమును గాంచగలడు. మరియు దూరశ్రవణ విజ్ఞానము, నదృశ్యము, బహురూపముల నొందుట మొదలగు సిద్ధుల నొందగలడు. సంతతి మిట్లభ్యసించినచో నాకాశగమనము చేయుగలడు, ఎన్నిశాస్త్రము లభ్యసించినను, యర్ధముతో వేదము తెలుసుకొనుచు జదివినను, ఎంత జ్ఞానవంతుడైనను, పూర్వకర్మ వశముచే మోహితుడగు చుండును, ఇట్టివానికి జూచుచున్నను కనపడదు, వినుచున్నను వినబడదు, పాపవిమోహితులగు మూఢులు అంధులవలె ప్రవర్తింతురు,

శృతి. వేదాహ మేతంపురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పురస్తాత్
తమేవ విదిత్వాతి మృత్యుమేతి, నాన్యః పంథావిద్యతే ప్రాయనాయ.

అనుశృతి ప్రకారము, సూర్యతేజస్కుడు, తమస్సు కన్నపరుడును, మహాత్ముడును నగు నాపరమాత్ముని నేనెరుంగుదును, అని నిశ్చలము కలిగినచో, మృత్యువును దాటిమోక్షము నొందగలడు, మోక్షము నొందుట

లోనింతకన్న వేరుమార్గము లేదు, యుత్తమంబైన తేజోయోగమును నీకు జెప్పితిని, దీనిచే కాలాతీతుడై, యమరత్వము నొందగలడు, ఓ దేవీ ఇటు పైని, అసలు మృత్యువేలేని విధానము చెప్పెదను సావధాన చిత్తవై వినుము, యోగి పరబ్రహ్మను ధ్యానింపుచు, జితేన్ద్రియుడై నియత మౌన నుడై, సుఖాసీనుడై, సమున్నత శరీరుడై, కరసంపుట బద్ధుడై, పక్షి ముక్కువలె ముఖమును బెట్టి మెల్లిమెల్లిగా వాయువును పీల్చుచుండ, దవడల నుండి జీవదాయకమైన యంబువులు స్రవించుచుండును. ఆనీ టిబిందువులు, తానుపీల్చిన వాయువుతో గలసి అమృత బిందువులగును, వీటిని సదాపానము చేసినచో మృత్యువశుడు గాడు, మరియు నిట్టివాడు దివ్యశరీరుడై మహాతేజో వంతుడై క్షుత్పిపాసా వర్జితుడై, గజబల సమన్వితుడై, అశ్వవేగుడై సుపర్ణునివంటి దూరదృష్టి గలవాడై, దూరశ్రవణము గలవాడై, నల్లటి యుంగరముల వంటి కేశములు గలవాడై, గంధర్వ విద్యాధర సమప్రభుడై, దేవతా మానప్రకారముగ నరుడు శత సంవత్సరములు జీవించి, మేధావంతుడై, బృహస్పతివంటి బుద్ధిగలవాడై, గగనగమనుడై, యథేచ్ఛా సంచారియై, సదాసుఖియై యుండును, ఓ దేవీ! దేవతలకు కూడ నసాధ్యమగు మరియొక విధానము జెప్పెద వినుము యిదియతి రహస్యముగ నుంచుము, దవడల యందు నాలుకను నొక్కిపెట్టి కొన్ని రోజులలవాటు చేసినచో క్రమముగా లంబికాయోగమలవడును, జిహ్వాతాలువుల స్పర్శచే శీతలామృత బిందువులు స్రవించును, ఈయమృత బిందువులు గ్రోలినచో నమరుడగును, నాలికాగ్రమును పైకిచాచి కొండనాలికనుప్రయత్నముగ తాకి, కరతలములు బంధించి పీడించినచో, పద్మ బిందువుల వంటి యమృతబిందువులు స్రవించును దీనిపానముచే నమరత్వము నొందగలడు, ఇదియే అన్నిటికన్న సారమైన యోగము, ఇదిసంసార సాగరమును దాటించును, మరియు నిదిచేసిన పాపములు హరించును. మృత్యువును జయించును, శరీరమును పవిత్రముచేయును క్షుత్పిపాస లుండవు, ఈనాల్గు విధముల యోగముల చేతను, మృత్యువును జయించి సకలసుఖంబుల పొందవచ్చును, యీయోగములు ధైర్యము వహించి, యభ్యసించినచో సర్వసుఖంబుల పొందవచ్చును, ఇట్టివానికి స్వప్నమందుగాని,

మనస్సు నందుగాని, యేవిధమైన దుఃఖములు నుండవు. ఇట్టివారు స్వర్గ మన్దుగాని, భువియందు గాని, ఎవరికి తోచిన తావులయందు నివసింప సమర్థు లగుదురు, మనుజులు మంత్రముల చేతను, తపముల చేతను, వ్రతనియమంబుల చేతను, యాగముల చేతను, రోగికి ఔషధమువలె తరించుచున్నారు, ఈ చతుర్విధ మార్గములలో, దేనిచేతనైనను, పరమేశ్వరుని పొందవచ్చును, మనుజులు నీతి నియమంబులతో గూడి, ధర్మాత్ములై, క్రమముగా యోగమలవరచుకొన్న,చో ఈ ధరిత్రిని సత్ఫల మొసగూడును.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
ఇరువది యేడవ అధ్యాయము సంపూర్ణము.

---

# ఇరువది యెనిమిదవ యధ్యాయము

## ఛాయాపురుష లక్షణము.

పరమేశ్వరా నాకిపుడు ఛాయాలక్షణముల నెరింగింపుమని పరమేశ్వరి ప్రశ్నింప వతడిట్లు చెప్పఁదొడంగెను. ఓ దేవి ఛాయాపురుషలక్షణము గూర్చి చెప్పెదవినుము. ఇది తెలిసికొనగలవారు సర్వపాప విముక్తు లగుదురు, సూర్యునకు గాని, చంద్రునకు గాని. పృష్టభాగ మందు నిలబడి శ్వేతాంబర శ్వేతమాల్యగంధానులిప్తుడై, గంధధూపాది వాసితుడై, సర్వకామ ఫలప్రదమైనదియు, పవిత్రమైనదియునగు ఓంనమోభగవతే రుద్రాయ యనునామ మస్త్రము జపించుచు, పిండభూత భూతమైన, తనఛాయను గాంచుచు, మరల నాకసముపైకి జూచుచు. తన శ్వేత ఛాయను గాంచుచు పరమ కారణుడైన శివుని ధ్యానింపుచున్నచో, బ్రహ్మప్రాప్తి కలుగునని కాలవేత్తలు చెప్పియుండిరి. దీనిచే బ్రహ్మహత్యాది పాపములు కూడ నశించును తనఛాయ శిరోహీనముగా గబడినచో 6 మాసములలో మరణించును. శ్వేతవర్ణముగా గనబడినచో ధర్మబుద్ధి గలవాడగును. కృష్ణవర్ణముగా గోచరించినచో పాపాత్ముడగును, రక్తవర్ణముగా గోచరించినచో

బుద్ధిమంతుడగును, పీతవర్ణముగా గోచరించినచో శత్రువులు బ్రాప్తించెదరు, రెండుముఖములు కనబడినచో వివాహ మందు బంధునాశన మగును. క్షుద్బాధాపీడితుడగును. నడుము లేకుండ గాన్పించినచో భార్యావియోగ ముగల్గును. జఘనములు (పిక్కలు) లేకుండ గాన్పించినచో శ్రీహీనుడగును. చరణములు కన్పింపనిచో, విదేశగమనము గల్గును. ఇవియే ఛాయా పురుషలక్షణములు. దీనిని ప్రతి మనుజుడు గుర్తించు చుండవలయును. ఆకాశమందలి యామహాపురుషుని గాంచి, ఆత్మను పరమాత్మయందు నిల్పి, హృదయమందున్న నన్ను గూర్చి, యిదివరలో జెప్పిన, నవాత్మ కమంత్రము జపించుచుండ వలెను. ఇట్లీవిధంబున మంత్రము నొక సంవత్స రము జపించినచో, సాధింపలేని దేదియు నుండదు. అణిమాద్యష్టసిద్ధులు లభించును. ఇటుపై దుష్ప్రాప్యమగు శక్తిజ్ఞానముం బాగ చెప్పెదను. ఇట్టి జ్ఞాని లోకమందున్నవన్నియు తన పురోభాగమున ప్రత్యక్షముగా జూచు చుండును. ఏమాత్రము జ్ఞానము లేకున్నను చదువు [illegible] లేకున్నను సర్పాకారమగు కుండలిని గాంచినచో బ్రహ్మాండమున నెచ్చటి భాగమగు గుప్తవిద్యలన్నియు గూడ గ్రహింపగలడు. సకలవిద్యలను నతడు తెలిసికొనగలడు. ఈగుప్తవిద్య లన్నివిద్యలకు తల్లివంటిది. ఈవిద్యచే దృశ్యాదృశ్యముల నన్నిటిని జూడగలడు. ఖేచరవిద్యచే సర్వప్రాణులయందు సంచరింపగలడు. అనగా పరకాయప్రవేశముగూడ చేయగలడు. ఈసనాతనవిద్య దృశ్యాదృశ్యమైనదియు వ్యక్తావ్యక్తమైనదియు నై యుండెను. ఇది అవర్ణమనియు, సవర్ణమనియు, బిందుపూరితయనియు చెప్పబడు చుండెను. యోగి ఈవిద్యను పొంది యన్నియు గాంచుచు కృతకృత్యు డగును. దీనిచే సర్వతీర్థస్నానఫలము సర్వదానములు చేసినఫలము లభించును. మరియు సర్వయాగఫలంబు లభించును ఈకుండలీ దర్శనముచే నిట్టిఫలము లభించును. సకలమనోరథములు సిద్ధించును. మున్నాటి వాక్యము నే చెప్పిన వన్నియు సిద్ధించును. ఋషులు సదా దీనిని సాధింతురు. అభ్యాసముచే యోగము వృద్ధియగును. ఈయభ్యాసముచే జ్ఞానము, జ్ఞానముచే మోక్షమును కల్గును, భుక్తిముక్తిఫలప్రద మగు నీయోగము నీకు చెప్పితిని. ఇటుపై నీవేది వినదలచితివో చెప్పు మని యివ్విధంబున

సనత్కుమారుడు పార్వతీ పరమేశ్వరసంవాద మంతయు వ్యాసునకు జెప్పి యుండ, వ్యాసుడు పరమానందభరితుడై, మాటిమాటికి సనత్కుమా రునకు నమస్కరింపుచు స్తుతించి, సుజ్ఞానసాగరుడైన సనత్కుమారుని ప్రశంసింపుచు, బ్రహ్మపుత్రా! నీచే నేను కృతార్థుడ నైతిని. నీవు బ్రహ్మ వేత్తవు ధన్యుడవు నీకు మాటిమాటికి నమస్కార మన, సనత్కు మారుడు సంతసించి యూరకుండ, వ్యాసుడు గురుభావముచే సనత్కు మారుని పూజించెను. తదుపరి యొకరితావులకు వారేగిరని సూతుడు శౌనకాదులతో చెప్పియుండెను.

శివ మహాపురాణము నందలి ఉమాసంహిత యందు
ఇరువది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది తొమ్మిదవ యధ్యాయము

### ఆదిసృష్టి క్రమము

సనత్కుమారుడు వ్యాసునకు చెప్పినదంతయు నీచే మేము వినియుంటిమి ఇంకను వ్యాసునిచే వినబడిన బ్రహ్మసృష్టిక్రమమంతయు వినిపింపుమని ఋషు లడుగగా సూతుడిట్లు చెప్పదొడంగెను.

ఓ మునులారా! నేను చెప్పబోయెడు కథయంతయు, బహ్వర్థములతో సకీర్తిప్రదము నైయుండెను, వేదశాస్త్ర పురాణములచే, వంశవృద్ధిగల్గి స్వర్గవాసు లగుదురు. సనాతనాత్ముడు నిత్యుడనువాడే ప్రధానపురుషుడు, ఈప్రధాన పురుషుడే సర్వలోకములను నిర్మించెను. అమితమగు బ్రహ్మతేజముతో గూడిన సృష్టికర్తయగుటచే ఇతడు నారాయణ పరాయణుడు, ఎవనిచే సర్వ బ్రహ్మాది కల్పము సృజింపబడెనో, అట్టి స్వయంభువ స్వరూపునకు నమస్క రింపుచున్నాను, మరియు హిరణ్యగర్భుడు పురుషుడునైన ఈశ్వరునకు

నమస్కారము, ఇట్టిపరమేశ్వరునకు నమస్కరించి, సృష్టిక్రమమంతయు జెప్పెదను.

ఈపరబ్రహ్మ బ్రహ్మయై సృష్టించును, విష్ణువై పాలించును. మహేశ్వరుడై సంహరింపుచుండును, ఇతనిని మించినసృష్టికర్త మరియొకడులేడు, ఇట్లు సృష్టిస్థితిలయంబులు చేయుచు, కాలమును వెళ్లబుచ్చుచుండెను, ఈస్వాయంభువు డనేకవిధంబులగు చతుర్విధ సృష్టులను చేసియుండెను, ఇతడు ముందుగాజలమును సృజించి, యందు తన వీర్యమును విడిచెను, నీరములనగా నుదకములు, ఉదకములు నారాయణుని సంతానమని చెప్పబడె, ఉదకములు స్థానముగా గలవాడుగాన, నారాయణుడని జెప్పబడుచున్నాడు, ఈఉదకమందున్న వీర్యము స్వర్ణాండముగాబయలుదేరెను, ఈయండమందు బ్రహ్మ స్వయముగా నావిర్భవించెను, కనుక నేబ్రహ్మను హిరణ్య గర్భుడందురు, ఇతడొకసంవత్సర మాయండ మందుండ, మాయండము ద్విఖండములై, పైదియాకసము, క్రిందిది భూమియును పేరుతో నొప్పుచుండెను, వీటిక్రింద సప్తలోకములు, పైనిసప్తలోకములునై, చతుర్దశలోకములని చెప్పబడుచుండెను, ఈద్విఖండములకు మధ్యనాకాశముండెను. భూమి లగాయతుపై యూర్ధ్వలోకములవరకు నాకాశము దిక్కులు నిర్మించెను. తదుపరికాలము, మనోవాక్కులు, కామక్రోధాదులు. ప్రేమ సృజించెను. పిమ్మట మరీచి యత్రి, యంగిరస, పులస్త్య, పులస్త్య, క్రతు, వశిష్ఠులనెడి సప్తమానస పుత్రులను సృజించెను, ఈసప్తఋషుల నామంబులు పురాణములందు ప్రఖ్యాతమైయుండెను, తదుపరిబ్రహ్మ తనక్రోధముచే నేకాదశరుద్రులను సృజించెను, అందరి ఋషులకన్న ప్రథమమున, సనత్కుమారులను సృజించెను, కానవీరుసర్వఋషులచే పూజింపబడుచుండిరి, వీరురంగులతోగూడిన ఇంద్రధనుస్సువలె దేవఋషులలో ప్రకాశింపుచుండిరి, ముందుగాజలములను సృజించి. తదుపరి మేఘముల సృజించి, తదుపరి యజ్ఞముచేయుటకై ఋగ్యజుస్సామవేదంబులను సృజించెను, దేవతలకై సిత్యము వైశ్వ దేవాది యజ్ఞములుచేయుచు వారిని పూజింపవలయును, బ్రహ్మముఖము నుండి దేవతలు, వక్షమునుండి పితృదేవతలు, యూరువులనుండి మనుజులు,

మొలనుండి యసురులు, మిగిలినభూతము లన్నియు సతిని శరీరము నుండి యేయుద్భవించెను, దీనిచే ప్రజోత్పత్తి జేయుటచే, పిమ్మట తనశరీరము ద్విధావిభజించి, స్త్రీపురుష రూపులుగా విభజించుకొనెను, తదుపరి తన మహిమచే, విశ్వమంతయు వ్యాపించి ప్రజా సృష్టిజేయసాగెను. అనగా ప్రపంచమందలి స్త్రీపురుషులందరు తానేయై, సృష్టిని వృద్ధినొందింప సాగెను, ఇతడు విష్ణువై, జగద్వ్యాపియై, మనువై ప్రజాసృష్టిగావించెను, పిమ్మట రాజులనందరిని సృజించెను, నారాయణునివలన కీర్తివంతులు ప్రశంసనీయులు నగు నయోనిజ లనేకు లుద్భవించిరి. మీకీయాది సృష్టి క్రమమంతయు జెప్పితిని. ఇది తెలిసి కొన్నవారు యథేష్టగతిని పొందగలరు.

శివ మహాపురాణము నందలి ఉమాసంహిత యందు
ఇరువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

## ముప్పదవ యధ్యాయము

### సృష్టి క్రమము

మనువు ప్రజా సృష్టికై యయోనిజయగు శతరూపను వివాహమాడెను, ధర్మాత్ముడును మహాత్ముడునగు, నాతడు మహిమచే స్వర్గమందు శతరూపయుద్భవించెను, ఈమె శత సంవత్సరములు తపమాచరించి స్వాయంభువ మనువును పతిగా బడసెను, వీరి వివాహము 71 న మన్వంతరమున జరిగెను, విరాట్పురుషుని వలన జనించుటచే వీరాయనియు శతరూప యనియు పిలువబడుచుండెను, ఈమెకు ప్రియవ్రతుడు యుత్తాన పాదుడు నను పుత్రద్వయము ద్భవించెను ఉత్తానపాదునకు కర్దమ ప్రజాపతి పుత్రిక యగు కామ్య వలన సామ్రాట్టు సాక్షి అవియునను చక్రవర్తులగు ముగ్గురు సుతులు జన్మించిరి ఆత్మవర్చస్సు గల ధ్రువుడుకూడ నితనికుమారుడె, ధర్ముని పుత్రికయగు సునీతి ధ్రువుని జనని యైయుండెను ఈధ్రువుడు మూడువేల దివ్య సహస్రంబులు కాననంబున తపమాచరించి బ్రహ్మచే వరంబులనొంది సప్తఋషి మండలముపై

నున్న ధృవమైన మండలమునకు ప్రభువై, ధృవుడని ప్రఖ్యాతి వడసెను, ధృవునకు పుష్టి, ధన్య యనెడు భార్యలయందు గలుగు, పుష్టికి కల్యాణులగు రిపు రిపుంజయ, విప్రుడు, వ్యాకలుడు, వృష తేజుడు అను నేవురు పుత్రులు గల్గిరి వీరిలో రిపునకు తేజోవంతుడగు చాక్షుష మను పుద్భవించెను నితని పుష్కరిణి వలన వరుణుని పుత్రునిగా బడసెను, మరియు నీమనువుకు నీడ్వలయనెడు స్త్రీవలన, పురువు, మాపము, శతద్యుమ్నుడు, తపస్వి, సచితుడు, కవి, యగ్నిష్టోమ అతి రాత్రి, అతిమన్యుడు సుయవసుడు అను పదుగురు పుత్రులు గల్గిరి వీరిలో పురువున కాగ్నేయి యందు అంగుడు, సుమనుడు, ఖ్యాతి, క్రతువు, ఆంగిరసుడు, గయుడు అను పుత్ర షట్కముజనించెను. వీరిలో అంగునకు సునీధయను ధర్మపత్ని వలన దుశ్శీలుడగు వేను డుద్భవించెను. ఈవేను డత్యాచారముగ ప్రవర్తించు చుండ ఋషులితనిని హుంకారముచే సంహరించిరి. రాజ్య మరాజక మగు నని సునీధయు ప్రజలు ప్రార్థింప ఋషులు వేనుని దక్షిణ కరము మథింప నందుండి, ధనుఃకవచములతో సూర్యసన్నిభుడగు పృథువుద్భవించెను. ప్రజాపాలనకై విష్ణువే పృథుగా జనించెను. ఇతడు ధర్మరక్షకుడు దుష్ట శిక్షణకు భువిపై నవతరించి క్షత్రియులలో మొదటి వాడై పృథ్వినంతయు పరిపాలించు చుండెను ఇతడు రాజసూయ యాగముచేసిన వారిలో మొదటివాడు. ఇతడు వసుధాపతి. ఇతడు మహావిప్రులగు సూత మాగధులను పుత్రులుగా బడసెను ఇతడు సర్వహితమునకై భూమిని గోవుగా జేసి, సర్వౌషధులను పితికెను ఇంకను దేవ దనుజ రాక్షసఋషి మనుజాది సర్వజీవుల జీవనోపాధికై శతక్రతువులు చేసి యుండెను. మరియు పృథువునకు ధర్మాత్ములు సర్వశాస్త్ర విఖ్యాతులు పరాక్రమవంతులగు విజితుడు, హర్యక్షుడు అను నిరువురు తనయు లుద్భవించిరి. విజితునకు శిఖండినియందు ప్రాచీన బర్హి జనించెను. ఇతడు తూర్పు దిశలుగా దర్భలు బరచుచు పృథ్వి యంతయు జన్నములు చేసె గాన ప్రాచీన బర్హియని పేరొందెను. ఇతడు సాగరసుత యగు శతధృతిని వివాహమాడి యామెవలన దశపుత్రులం బడెసెను వీరందరు ప్రాచేతసులని పిలువ బడుచు బహు యజ్ఞములు చేసి ధను ర్వేదపారగులై సర్వధర్మ తత్పరులై మహాతపము గావించుచు దశసహస్ర వర్షంబులు సాగరోప వసను నందు శయనించి శివధ్యాన పారాయణులై రుద్రగీతను జపించు చుండిరి.

వీ రిట్లుండ ప్రజారక్షకులు లేక భూమియంతయు మహీరుహంబులచే నిండియుండు నపుడు ప్రజారక్షయు మగుటచే నబ్ధవరులగు ప్రచేతస్కులి దంత యుగాంచి తపంబు విరమించి తపోబలంబుచే వృక్షముల దహింప జేయదలచి వారిముఖములనుండి యగ్నివాయువులు విడువ వాయువులు వృక్షములను బడగొట్టుచుండ నగ్ని వాటిని దహింపుచుండెను వృక్షము లన్నియు దహింప బడి కించిన్మాత్రముగ శేషించియుండ ప్రతాపవంతుడగు సోముడే తెంచి ఓ ప్రచేతస్కులారా. మీరు కోపగింపక శాంతింపుడు, ఈవనకన్యకను మీరు వివాహమాడుడు నేనుముందు భవిష్యత్తు తెలిసి కొనినేనీ కన్యకను సంరక్షిం చితిని ఈమెమీకు భార్యయై సోమవంశమును వృద్ధినొందించును, ఈమెకు దక్షుడు జనింపగలడు. అతడు పూర్వము బ్రహ్మపుత్రుడు, సృష్టికర్తయునై యుండెను నా తేజము మీ తేజములు కలసి నీమెకు దక్షప్రజాపతి జనింపగల డు. అతడు మీయర్థ తేజంబులచేతను నా తేజంబుతోడను జనించి బ్రహ్మతేజో మయుడై ప్రజావృద్ధి గావించుచుండునన వారుసోమవాక్కు నంగీకరించి వనపు త్రికను వివాహమాడి దక్షప్రజాపతిని పుత్రునిగా బడసిరి, ఇతడు సోమాం సుడై దేదీప్యమానముగ ప్రకాశింపు చుండెను. దక్షుడు చరాచరంబులను ద్విపదులైన మనుజులను చతుష్పదంబులైన జంతుకోట్లను మనసా సృజించెను, తదుపరియితడు ధర్మాత్ముంరాలు పతివ్రతయు వీరణ సుతయునగు వీరిణిని యథావిధిగ వివాహమాడి యామెవలన దశసహస్రపుత్రులను బడసెను వీరం దరు నారదోప దేశములచే విరక్తులైరి దక్షుడది విని మరల వీరణివలన సహ స్ర పుత్రులను బడసెను వీరందరు కూడ నారదోపదేశముచే భ్రాతృపథము నాశ్రయించి విరాగులై భిక్షుకులై సంచరింపుచుండ దక్షుడిది విని కోపించి కలహభోజుడగు నారదముని నీ వెప్పుడు నొకచో స్థిరుడవై యుండకుందువు గాక యని శపించెను. తదుపరి బ్రహ్మ దక్షుని శాంతింప జేయ మరల దక్షుడు వీరణి వలన 60మంది పుత్రికలను బడసెను వీరందరు గుణవంతులు తేజోవ తులునై యుండిరి

దక్షుడు పదుగురు పుత్రికలను యమధర్మరాజునకు, పదమువ్వురు పుత్రికలను కశ్యపునకు, కృశాస్వున కిరువురు, అంగిరసున కిరువురు. అరిష్ట

నేమికి నల్గురు, ఇవ్విధంబున మహర్షుల కిచ్చి ఉద్వాహము గావించెను. దేవాసురులందరు దక్షపుత్రికవలన జనించిరి. వారి సంతాన మంతయు జగత్తంతయు నిండియుండెను. అప్పటినుండి ప్రజలందరు మైథున సృష్టిచే జనించుచుండిరి. దీనికి పూర్వము సంకల్పముచేతను, దర్శనముచేతను, స్పర్శ ముచేతను, జనించెడు వా రని సూతుడు బలుక పూర్వము నీవు బ్రహ్మాయం గుష్ఠమువలన దక్షుడు జనించె నని చెప్పియుంటివి. కారణ మేమి? దక్షున కిది వరలో అల్లుడైను, ఇపుడు మామగా రెట్లయ్యెను? చిత్రముగ నున్నది వివ రము తెలుపు మని శౌనకాదులు ప్రశ్నింప సూతు డిట్లు చెప్ప దొడంగెను. ఋషులారా! ఉత్పత్తినిరోధములు నిత్యము భూతములచే జరుగుచుండును, ప్రతికల్పము నందున దక్షాదిమునులు జన్మించుచునే యుందురు. ప్రతికల్పము నందు చరాచరసృష్టియంతయు, దక్షునివలననే జరుగుచున్నది. కల్పభేదము లను బట్టి కథలు మారుచుండును, ఈదక్షోత్పత్తిని తెలిసికొన్నను, విన్నను, పఠించినను, సంతానవంతులై! పూర్ణాయుష్కులై స్వర్గలోకవాసు లవుదురు.

శివ మహాపురాణము నందలి ఉమాసంహిత యందు
ముప్పదియవ అధ్యాయము సంపూర్ణము

---

## ముప్పది ఒకటవ యధ్యాయము

### ప్రజాసృష్టి

దేవదానవ గంధర్వోరగ రాక్షసుల సృష్టిక్రమంబు జెప్ప మని శౌన కాదులు ప్రశ్నింప, సూతు డిట్లు చెప్పదొడంగెను. సృష్టికంతకు వీరిణీదక్షులే మూలకారణులు. వీరి మైథునసృష్టిక్రమ మంతయు జెప్పెద వినుడు దక్షుడికి, వీరిణివలన నైదువేల పుత్రులు జనించిరి. వారిని నారదుడు గాంచి, ఓదక్ష పుత్రులారా! మీ రందరు ప్రజోత్పత్తికై జన్మింపలేదు. జన్మవలన ముక్తి మార్గము తెలిసికొనుటయే శ్రేయస్కరము. మానవజన్మమును సార్థకము

చేసికొనుడు. జంతువులలో నరజన్మము దుర్లభము. అందులో పురుషత్వము శ్రేష్ఠము. ఇందులో విప్రజన్మ దుర్లభము. ఇందులో వైదిక ధర్మముగ నడుచుకొనుట దుర్లభము. అన్నిటికన్న వీరిలో విద్వాంసు డగుట కడుకష్టము. ఇంతకన్న నాత్మానాత్మవివేకము గలుగుట మరింత కష్టము. అది యనుభవములో పెట్టుకొనుట దుర్లభము. గాన శతకోటి జన్మల సుకృతములు చేసినగాని మోక్షము లభింపదు గాన మోక్షమునకై ప్రయత్నింపుడు. దక్షపుత్రికవలన కశ్యపునిచే సృష్టి యభివృద్ధి యగును. కాన మీరు మోక్షమార్గ మవలంబింపు డని యుపదేశింప, వారందరు విరక్తులై మోక్షగాము లైరి. వీరిలో నేయొక్కడునుకూడ వెనుకకు తిరిగి తండ్రిగృహమునకు రాలేదు. దక్షు డిది యెరింగి మరల ఏనూరువందలమంది సుతులను బడయు, నారదుడు వారలను గాంచి మీరు బాలిసులై సృష్టికై ప్రాకులాడెద రా? సృష్టితో మీకు ప్రయోజన మేమున్నది? దుర్లభమైన యీజన్మలను వ్యర్థము చేసికొందురా? యన, నారదోపదేశములువిని వారునుకూడ తమభ్రాతల ననుసరించి సాగరగాములగు నదులవలె వెనుకకు తిరిగి రాలేదు. సృష్టిమాత్ర మీకారణముచే వెనుకబడు చుండెను, పుత్రులు తిరిగిరాకుండుటగాంచి దక్షుడిది యెరింగి నారదునిపై కోపగించి నీవెన్నడును స్థిరుడవుగాక ముల్లోక సంచారివై తిరుగుచుందువు, నీవు కలహభోజివై, వైరములు కల్పించుచుందువు, పొమ్మని శపింప బ్రహ్మ దక్షుని శాంతపరిచెను, తరువాత దక్షుడు అరువదిమంది కన్యకలను బడెసెను, వీరిలో పదిమంది యమధర్మరాజునకు, పదమువ్గురను కశ్యపునకు, ఇరువది ఏడుగురను సోమునకు, నలుగురిని అరిష్టనేమికి, బ్రహ్మపుత్రున కిరువురను, కృశాస్వున కిరువురు అంగిరసున కిరువురను ఇచ్చి దక్షుడు అరువది మందికి వివాహముచేసెను, వీరినామంబులు వినుము.

అరుంధతి, వసు యమి, లంబా, భాను, మరుత్వతి, సంకల్ప, ముహూర్త, సంధ్యా, విశ్వా యనుపదుగురు యమధర్మపత్నులై యుండిరి. వీరి సంతానమును కూడ చెప్పెద వినుడు, విశ్వకు విశ్వే దేవతలు, సాధ్యకు సాధ్యగణంబులు మరుత్వతికి మరుత్తులు, వసునకు, నష్టవసువులు, భానుకు ద్వాదశాదిత్యులు, ముహూర్తకుముహూర్తము లుద్భవించిరి. మరియు లంబవ

లన, ఘోషము, యామినవలన నాగవీధి, అరుంధతివలన పృథ్వీవిషయంబులు సంకల్పకు, సత్యాత్మకమైన సంకల్పము కలిగెను.

అయ, ధృవ, సోమ, ధర, అనిల, అనల, ప్రత్యూష, ప్రభాస, యనెడు వారలు అష్టవసువులన బడుదురు. వీరిలో అయకు వైతండుడు. శ్రముడు, శాంతుడు, మునియనెడు, పుత్రచతుష్టయము గలదు. ధృవకు లోక ప్రతాపవంతుడైన కాలుడుద్భవించెను. సోమకు దీప్తిమంతుడగు వర్చస్సుజనించెను. ధరకు ద్రవిణుడుజనించెను. ఇతడు హుతహవ్యుడని పిలువబడుచుండెను. అనిలునకు పురోజవుడు అవిజ్ఞాత, గతియనెడు పుత్రత్రయముగలదు. అగ్నికి శరస్తంభమునందు కుమారస్వామి పుత్రుడుగా జనించెను. ఇతని పృష్ఠభాగమునుండి, శాఖఉపశాఖ నైగమేయ, యనుమువ్వురు పుత్రులు జనించిరి. ప్రత్యూషకు దేవలఋషి, దేవలునకు ప్రజావంతులగు సిద్ధులు పుత్రులు గలరు. అష్టమవసువగు ప్రభాసునకు విశ్వకర్మ జనించెను. ఇతడు దేవతాభివృద్ధికై యనేక శిల్పములను సృజించెను. ఇంకను దేవతలకు సకలభూషణంబులు తయారుచేసి, యనేక విమానములను కూడ తయారుచేసి శిల్పశ్రేష్ఠుడై యుండెను. ఈశిల్పవిద్యచేతనే నరులుకూడ జీవించుచుండిరి. దైవతుడు, అజుడు, భవుడు, భీముడు, వాముడు, ఉగ్రుడు, వృషాకపి, అజైకపాదుడు, అహిర్బుధ్నుడు, బహురూపుడు ననువారలనేక రుద్రులు బహురూప యందు జనించిరని మతాంతరము గలదు. వీరిలో ముఖ్యులగు నేకాదశ రుద్రుల నామంబులు చెప్పెద వినుడు.

అజైకపాదుడు, అహిర్బుధ్నుడు, రుద్రుడు, హరుడు, వృషాకపుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, వృషాకపి, శంభుడు, కపర్ది, రైవతుడు, ననువారలు నేకాదశ రుద్రులని ప్రఖ్యాతివడసిరి ఇటుపై కశ్యపుని భార్యల నామంబులు వినుడు.

శివ మహాపురాణమందలి ఉమాసంహితయందు

ముప్పదియొకటవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పది రెండవ యధ్యాయము

## కశ్యప వంశ వర్ణనము

అదితి దితి సురస అరిష్టా ఇలదను సురభి వినతా తామ్రా క్రోధా కద్రూ మునీ, ఖటా, యనుపద మువ్వురు భార్యలు గలరు తుషితులు వారిలో వారిట్లను కొనిరి. వైవస్వతమన్వంతరము మొదలు చాక్షుష మన్వంతరము వరకు మనము ప్రపంచోద్ధరణకై కలసి యుండవలయును గాన మనమందరము అదితికశ్యపులకు జనించెదమని నిశ్చయించి వారలకు తుషితులుజనించిరి. తదుపరి వామనుడు ఇంద్రుడు కూడ నదితికి జనించిరి ఈతుషితులు అర్యమ, ధాత, త్వష్టా, పూష, వివస్వాన్, సవిత, మిత్రా, వరుణ, అంసు, భగ, తేజ, ఆదిత్యలనెడి ద్వాదశాదిత్యులై జనించిరి వీరుచాక్షుష మన్వంతరము లోనివారలు. వీరందరునదితి సంతానము.

సోమునకు సప్తవింశతి తారలయందు తేజోవంతులగు సుతులుద్భవించిరి. అరిష్టనేమి నల్గురు భార్యల వలన షోడశపుత్రులు గల్గిరి. వారందరికి కూడ విద్వాంసులగు బహుపుత్రులుండిరి.

కృశాశ్వునకు దేవర్షి వలన దేవప్రహరణుడు అర్చిషివలన ధూమ్రకేశుడు జనించిరి. స్వధా సతియను దక్షపుత్రికలలో స్వధకు పితృదేవతలు సతికి అంగిరసుడు జనించెను. ప్రళయాంతమందు మునుల పితరులే జనించుచుందురు. దేవతలందరు సదాముప్పది మూడు వర్షముల ప్రాయముగలవారై యుందురు సూర్యుని నిత్యము నుదయించి యస్తమించునట్లుగ వీరుప్రతియుగాంతమందున నుదయించి యస్తమించుచుందురు. కశ్యపునకు దితివలన హిరణ్యాకశిపుడు హిరణ్యాక్షుడనను వీర్యవంతులగు నిరువురు పుత్రులుగల్గిరి ఈమెకు సింహికయను కుమార్తెకూడగలదు. సింహికను విప్రచిత్తు వివాహ మాడెను,

హిరణ్యకశిపునకు ప్రహ్లాదుడు, అనుహ్లాదుడు హ్లాదుడు సంహ్లాదుడు నను పుత్ర చతుష్టయము గలదు, వారిలో ప్రహ్లాదుడు విష్ణుభక్తి గల్గియుండెను; అనుహ్లాదుడు సూర్యుని వలన, పులోమను, హ్లాదుడు ధమని వలన వాతాపి

ఇల్వలులనుపుత్రులు గాబడసిరి, సంహ్లాదుడు కృతియను భార్యవలన పంచ జనుడనెడు పుత్రుని బడసెను. ప్రహ్లాదునకు, విరోచనుడు విరోచనునకు బలి జనించిరి. బలికి అశని వలన శతపుత్రు లుద్భవించిరి. ఈబలి మహాశైవుడు శివభక్తి పరాయణుడునై యుండెను ఇతడు దానశీలుడు నుదారుడు పుణ్యకీర్తి తపోవంతుడు బలిజ్యేష్ఠ పుత్రుడు, బాణాసురుడు ఇతడు శివభక్తాగ్రేశ్వరుడు, పండితుడు శివుడితనిని శివగణములతో నొకనినిగా జేసికొనెను ఇతని కథ పూర్వము వినియుంటిరి ఈవీరుడు యుద్ధమందు శ్రీకృష్ణునితో పోరు సల్పెను.

హిరణ్యాక్షునకు కకురుడు, శకుని, మహానాదుడు, విక్రాంతుడు, కాలనాభులను భూతసంతాపకులగు నేవురు పుత్రులు గలరు.

ఇటుపై దనుపుత్రులను గూర్చి చెప్పెద వినుడు దనువునకు అధోముఖుడు శంబరుడు, కపోలుడు, వామనుడు, వైశ్వానరుడు, పులోముడు, విద్రావణుడు మహాశిరుడు స్వర్భాను వృషపర్వుడు విప్రచిత్తులనెడి నామంబులతో తీవ్ర పరాక్రమవంతులగు శతపుత్రులు గలరు. వీరిలో స్వర్భానునకు ప్రభయనెడి కన్యక గలదు పులోమునకు శచియను కన్యకగలదు. వృషపర్వునకు ఉపదానవీ, హాయశిరా శర్మిష్ఠాయను ముగ్గురు పుత్రికలు గలరు. వీరు మరీచివలన ననేక సంతానమును బడసెను.

అనగా, దానవానందకరు లైన అరువది వేల పుత్రులను బడసిరి. పులోమపుత్రులగు కాలఖంజులనెడు దానవులు మహాబలవంతులై, హిరణ్యపుర వాసులై యుండిరి. వీరందరకుగూడ దేవతల కవధ్యులై యుండి బ్రహ్మ వరముచే భారతయుద్ధమున నర్జునుని చే మడసిరి. విప్రచిత్తునకు, సింహికవలన, ననేకపుత్రులు గల్గిరి. ఈదైత్యదానవసంయోగముచే తీవ్రపరాక్రములైన పదమువ్వురు పుత్రులు జనించిరి. వీరందరిని సింహికేయు లందురు, వారి నామంబులు కూడ చెప్పెదను. రాహువు, శల్యుడు, సుబలుడు, మహాబలుడు, వాతాపి, నముచి ఇల్వల, స్వస్వప, అజిక, నరక, కాలనాభ, శరమాణ, శరకల్ప, యను నీపదమువ్వురు మహాబలపరాక్రవంతులై వంశవర్ధనులై యుండిరి. ఇట్లు దనువంశమంతయు పుత్రపౌత్రులతో వృద్ధినొందెను. విస్తార భయముచే వారందరి నామంబులు చెప్పుటలేదు. సంహ్లాదునివంశమందు.

నివాతకవచు లుద్భవించిరి. వీరికులమందు శుద్ధాత్ములు, తపోవంతులు నగు మారుత్తులు జనించిరి. తామ్రమవలన మహాసత్వవంతు లగు షణ్ముఖాదిపుత్రులు, కాకులు, డేగలు, భాసులు, సుగ్రీవులు, శుకములు, గృధ్రములు, ఉలూక ములు జనించిరి. మరియు, కాకులకు కాకులు శ్యేనములకు డేగలు, భాసులకు బాతులు, సుగ్రీవికి అందమగు పక్షులు శుకంబులకు చిలుకలు, గృధ్రములకు గ్రద్దలు ఉలూకములకు గుడ్లగూబలు, జనించిరి. మరియు కశ్యపపత్ని యగు తామ్రకు అశ్వగార్దభ ఉష్ట్రములుకూడ జనించినవి. ఇవన్నియు తామ్రసంతా నము. వినతకు అనూరుడు, గరుత్మంతుడు నను నిరువురుపుత్రులు మాత్రమే జనించిరి. సురస కనేకవేల సర్పము లుద్భవించినవి. వీరందరు మహాతేజో వంతులై యనేకశిరంబులు దాల్చి గగనసంచారులై యుండిరి. వీరిలో ప్రధానులు, శేష, వాసుకి, తక్షక, ఐరావత. మహాపద్మ, కంబళ, అశ్వ తరులై యుండిరి. ఇలకు, పద్మ కర్కోటక, ధనంజయ, మహానీల, మహా కర్ణ, ధృతరాష్ట్ర, వలాహక, కుహార, పుష్పదంత, దుర్ముఖ, సుముఖ, బహుళ, ఖరరోమ, పాణి మొదలగు పుత్రులుగలరు.

క్రోధకు, వశకు, క్రమవకు, ననేకదంష్ట్రంబులు గల సర్పములు జనించి నవి. మరియు, నండజము లగు పక్షులు, జలజంతువులు, వరాహములు మొద లగు చతుష్పాదజంతువులు కూడ వారికి జనించినవి. అనాయుమకు బలవంతు లగు నేబది మంది పుత్రులు మహావృక్షంబులు కూడజనించినవి. సురభికి మహి షంబులు చెవుల పిల్లులు, ఇలకు సకలవృక్షలతాతృణంబులు, ఖశకు యక్ష రాక్షసులు, మునికి యప్సరసలు, అరిష్టకు సర్పములు, ప్రభకు, మానవులు జనించిరి. వీరందరుకశ్యపసంతాన మని చెప్పబడుచు ననేకవేలపుత్రప్రౌత్రు లతో వృద్ధినొందిరి.

శివ మహాపురాణమందలి ఉమాసంహితయందు

ముప్పదిరెండవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పది మూడవ యధ్యాయము

## రాజ్యస్థాపనలు

మరల సూతుడిట్లు చెప్పదొడంగెను ఓమహర్షులారా! కస్యపునకు పశు పక్ష్యాది జలజంతువులు, వృక్షలతాగుల్మంబులు నెట్లుద్భవించెనని అబ్బుర పడ నవసరములేదు. అతడు బ్రహ్మానుగ్రహముచే యింతటి సృష్టిని చేయ గలిగెను. ఈ సృష్టి యంతయు స్వారోచిషమన్వంతరమున బ్రహ్మగారు వీరిణీక్రతువు చేయు చుండగా ప్రజాసృష్టిచేసి యుండెను. ముందుగా సప్తమహర్షులను మానస ముగా సృజించెను. ఈవిధముగా పితామహుడు స్వయముగా పుత్రులను కల్పిం చెను. అట్టి తరి దేవదానవు లిరువురు పోరాడియుండ ఆసమయమున దితి పుత్రు లందరు నశింప. దితి కశ్యపుని సేవింప, కశ్యపుడు సంతసించి వరముకోరుమన, నమిత తేజోవంతుడు, యింద్రుని జయించు సమర్థుడునగు తనయుని ప్రసాదింపు మని గోర నీవు శతసంవత్సరములు నియమముగా బ్రహ్మచర్య వ్రతమాచ రించినచో నీకోరిక సిద్ధించునని కశ్యపుడు బలుక, నీమె నియమవ్రతయై గర్భము ధరించెను. తదుపరిసంతుష్టమానసుడై కస్యపుడు తపమునకు జనెను. పిమ్మట దేవేంద్రుడీమె వ్రతము పదహారుసంవత్సరములలో పూర్తియగునని, తలచి ఆమెచ్ఛిద్రముల న్వేషింపుచుండ, నింతలో నొక సమయంబున దితి మూత్రవిసర్జన మైనపిమ్మట పాదప్రక్షాళన మొనరింపక, శయ్యపై నపసవ్య ముగ పరుండ నిదంతయు శక్రుడు జాగరూకుడై కనిపెట్టుచు, నామె కుక్షి యందు ప్రవేశించి తన వజ్రాయుధముచే నాగర్భము సప్తఖండముగ ఖండింప నాశకలములు రోదనముచేయ నారంభించెను. శక్రుడిది గాంచి మీరు దుఃఖింపకుడు మీకుభయములేదని బల్క శక్రవాక్యములువిని ఓ ఇంద్రా మేము నీసోదరులము మమ్ము హింసజేయకుమన, శక్రుడు మరల నాశకలములను శంకరేచ్ఛచే నొకొక్క శకలము నేడేసి ఖండములుగ జేయ నవి నలుబదితొమ్మిది ఖండములైనవి. వారి ప్రార్థనల నంగీకరించి యన్నిఖండముల నన్నిమరుత్తు లుగా జేసి, వారలను భ్రాతృభావముగ జూచుచు, వారల నూర్ధ్వలోక వాసులుగ జేసెను. వీరు మరుద్దేవతలని చెప్పబడుచుండిరి. పృధువు లగాయతు వారి రాజ్యములన్నియు జెప్పెద వినుము. అరిష్టపురుష, వీర, కృష్ణ, జిష్ణు,

ప్రజాపతి, పర్జన్య ధనాధ్యక్ష అనువీరందరు జగత్తంతయు వ్యాపించి యుండిరి. భూతసర్గమంతయు జెప్పితిని. క్రమముగా వీరి రాజ్యమును గురించి జెప్పెద వినుడు విధాత వేణు పుత్రుడగు పృధువునకు రాజ్యాధికారమిచ్చి క్రమముగ నివ్విధంబున నొకొక్కరి కొక్కొక్క రాజ్యమిచ్చి నిట్లుస్థాపించెను. బ్రాహ్మణులకు, వృక్షములకు గ్రహనక్షత్రములకు యజ్ఞతపంబులకు సోముని రాజుగా జేసెను. ఉదకములకు వరుణుని, రాజులకు కుబేరుని, ఆదిత్యులకు విష్ణువుని, వసువులకు పావకుని, ప్రజాపతులకు దక్షుని, మరుత్తులకు వాసవుని, దైత్యదానవులకు తేజోవంతుడగు ప్రహ్లాదుని, పితరులకు వైవస్వతుని (యముని ప్రభువులుగా జేసెను. మాతృదేవతలకు, వ్రతములకు మన్త్రములకు గోవులకు, యక్షరక్షస్సులకు రాజులకు సర్వభూత పిశాచములకు కైలాసాధిపతి యగుశూలపాణి ప్రభువుగానుండెను. మరియు శైలములకు హిమవన్తుడు, నదులకు సాగరుడు, మృగములకు శార్దూలము, గోవులకు ఋషభము వనస్పతులకు వృక్షములకు వటవృక్షములను రాజ్యాభిషేకము చేసెను. ఇవ్విధంబున నందరిని రాజ్యాధిపతులుగ చేసెను. మరియు పూర్వదిశకు వైరాజ ప్రజాపతి పుత్రుని స్థాపించెను. దక్షిణదిశకు కర్దమ ప్రజాపతి పుత్రుడగు సుధన్వుని స్థాపించెను. పశ్చిమదిశకు రజసపుత్రుడగు నచ్యుతుని స్థాపించెను. మరియు నిచటనే మహాత్ముడగు కేతుమంతుని పర్జన్య ప్రజాపతి పుత్రుడగు హిరణ్యరోముని రాజ్యాధిపతులుగ జేసెను. ఉత్తరదిశయందు దుర్ధర్షుని స్థాపించెను. పృధువును గురించి యనేకపురాణములందు విస్తరించి చెప్పుటచే నిటవిపులముగ వర్ణించియుండలేదు.

శివ మహాపురాణమందలి ఉమాసంహితయందు
ముప్పదిమూడవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పది నాలుగవ యధ్యాయము

## మన్వంతరములు

మన్వంతరములను గూర్చి విస్తరించి చెప్పుమని శౌనకాదులు ప్రశ్నింప సూతుడిట్లు చెప్పదొడంగెను. స్వాయంభువుడు, స్వారోచిషుడు, ఉత్తముడు, తామసుడు, రైవతుడు, చాక్షుషుడు, ననువార్వురు మనువులు గడిచిరి. ఇప్పటి వర్తమాన మనువు వైవస్వతుడు, మరియు, రౌచ్యుడు, బ్రహ్మసావర్ణి, ధర్మసావర్ణి, రుద్రసావర్ణి, దేవసావర్ణి, ఇంద్రసావర్ణి, ఈయార్వురు భవిష్యన్మనువులు, నేను శ్రీ కాలవేత్తలవలన విన్నట్లుగా మీకు మనువుల సంగతి జెప్పితిని మనువుయొక్క కాలమునకు 3 , 10, 40, 000 సంవత్సరములు ముప్పయొక్క కోట్ల సంవత్సరములు, సహస్రయుగములొక కల్పమని చెప్పబడెను. వీరి కాలమున ఋషులను, పుత్రులను యశస్సులను జెప్పెదవినుడు,

స్వాయంభువమను కాలంబున, మరీచి, అత్రి, అంగిర, పులహ, క్రతు, పులస్తి, వశిష్ఠులనెడి సప్తఋషులు గలరు. వీరుత్తరదిశయందు యాములనెడి దేవతలతో నివసించుచుండిరి.

అగ్నీధ్రుడు, అగ్నిబాహు మేధ మేధాతిథి, వసువు, జ్యోతిష్మంతుడు, ద్యుతిమంతుడు, హవ్యుడు, సవనుడు, శుభ్రుడు, ననుపదుగురు పుత్రులీమనువునకు జనించిరి. అప్పటియింద్రుడు యజ్ఞనాముడై యుండెను. అప్పటి దేవతలు యాములనెడి నామంబులతో నుండిరి.

రెండవమనువైన స్వారోచిషమను కాలంబున, ఊర్జస్తంభుడు, పరస్తంభుడు, ఋషభుడు, వసుమంతుడు, జ్యోతిష్మంతుడు, ద్యుతిమంతుడు రోచిష్మంతుడు ననువారలు సప్తఋషులుగా నుండిరి. అప్పటి దేవతలు తుషితులనెడి నామంబులతో నుండిరి. అప్పుడు రోచనుడనెడు పేరుతో నింద్రుడుండెను. హరిఘ్ను, సుకృతి, జ్యోతి, అయోమూర్తి, అయుతు, స్మయుడు, ప్రథితుడు, మనస్యుడు, నభుడు, సూర్యుడనను, పదుగురు స్వారోచిషమనుపుత్రులై యుండిరి. వీరందరు మహావీర్య పరాక్రమవంతులు.

మూడవ మనువైన ఉత్తముని కాలంబున వశిష్ఠపుత్రులగు నేడ్వురు వశిష్ఠనాములై సప్తఋషులుగ నుండిరి. అప్పుడు సత్యవేదస్మృతుల నెడి ఋషభులు దేవతలుగా నుండెడివారు. సత్యజిత్తనెడి పేరుతో యింద్రుడుండెడి వాడు. ఇషా, ఊర్జిత, ఊర్జ, మధు, మాధవ, శుచి, శుక్ర, వహా, సభస, నభ యనెడు పదుగురు యుత్తమమను పుత్రులై యుండిరి.

చతుర్థమనువైన, తామసుని కాలంబున, గార్గ్య, పృథు, వాగ్ని, జయ, ధాతకపీనక, కపివాన్, అనువారలు సప్తఋషులై యుండిరి. అపుడు దేవతలు సత్యుల నెడి నామంబులతో నుండెడివారు. త్రిశిఖుడనెడి పేరుతో నింద్రుడుండెడివాడు. ద్యూతి, హోత, నార, పశ్య, శుభ, శూలతాపన, తపోరతి, కల్మాష, ధన్వ, ఖడ్గ, యనువారలు తామసమను పుత్రులై యుండిరి.

ఇక నైదవ మనువైన రైవతుని కాలంబున దేవబాహు, జయ, వేదశిర, హిరణ్యరోమ, పర్జన్య, ఊర్ధ్వబాహు, సోమప, యనువారలు సప్తఋషులై యుండిరి. భూత, రజ, ప్రకృతియనెడు దేవతలుండెడివారు. అప్పుడు విభుడనెడి యింద్రుడుండెడివాడు. బలబంధ, సంభావ్య, యుక్త, తత్త్వదర్శి, నిరుత్సుక, అరణ్య, ప్రకాశ, నిర్మోహ, సత్యవాక్, కవి, యనెడి పుత్రదశకము రైవతమనువున కుద్భవించిరి.

ఇక నారవ మనువగు చాక్షుషి కాలంబున, భృగు సభ సుధామాన్ సుధామా, విరజ అతినాము సహిష్ణు వనెడు వారలు సప్తఋషులుగ నుండెడి వారు, ఆద్యాప్రభూత ఋషి ప్రకృతి వ్యావహారిక యను వారలు దేవతా గణంబులుగ నుండెడివారు విరజుడనెడు పేరుతో నింద్రుడుండెడివాడు. ఈ మనువునకు అనూరుప్రభృతులగు దశ పుత్రులుండిరి ఇప్పటికి నారు మన్వంతరములు జెప్పితిని ఇక సప్తమమన్వంతరము జెప్పెద వినుము.

సప్తమ మనువగు వైవస్వతుని కాలంబున కశ్యప, అత్రి, వశిష్ఠ, విశ్వామిత్ర, గౌతమ, జమదగ్ని, భరద్వాజు లనెడి సప్తఋషులు గలరు, సాధ్య, రుద్ర, విశ్వేదేవ, వసు, మరుద్గణ ఆదిత్యులు అశ్వినీ కుమారులు దేవతలుగా

నుండిరి. ఈమనువునకు ఇక్ష్వాకు ప్రభృతులు దశపుత్రులుండిరి, వీరందరు ప్రఖ్యాత పురుషులై పుత్రపౌత్రాభి వృద్ధితో దశదిశలు వ్యాపించి యుండిరి. ప్రతి మనస్వంతరమందున సప్తఋషులు నామభేదంబులతో పిలువబడు చుందురు. ఈ మనుకాలంబున నదితికశ్యపులకు జనించిన పాకశాసను డింద్రు డుగనుండును. వర్తమాన మన్వంతరము జెప్పితిని. ఇక భావి మన్వంతరము చెప్పెద వినుము.

రుచిప్రజాపతి పుత్రుడగు రౌచ్య డష్టమ మనువగును. ఇతని కాలం బున పరసురాముడు, వ్యాసుడు, అత్రికుమారుడగు భరద్వాజుడు, ద్రోణ కుమా రుడగు నశ్వత్థామ, గౌతమ పుత్రుడగు శరద్వంతుడు, కౌశికపుత్రుడగు గాల వుడు, కశ్యప పుత్రుడగు, రురుడు, సప్తఋషులగుదురు. వీరు భూతభవిష్య ద్వర్తమానజ్ఞులై, పరిశుద్ధులై వంశప్రవర్ధకులై యుందురు. ఇవ్విధంబున ఋషులు యుగయుగములయందు, వర్ణాశ్రమ ధర్మముల స్థాపింపజేయుచు, ధర్మహానియగు సమయంబున, మంత్ర బ్రాహ్మణముల సృజింపుచు, పరులకై మంత్రముల యాచింపుచు ఇంద్రియాతీతులై వర్తింతురు. వరీయాన్, అవరీ యాన్, ధ్వతియాన్, సమ్మతి, వసు, చరిష్ణు, అర్యదృష్ట, వాజ సుమతి, యనెడు పదుగురు పుత్రులీ మనువున కుందురు. భౌములనెడు పేరుతో దేవత లుందురు. విరోచనపుత్రుడగు బలిఇంద్రు డగును.

తొమ్మిదవ మనువగు సావర్ణి కాలమున పులస్త్య గోత్రోద్భవుడైన మేధాతిథి, కశ్యప గోత్రుడగు వసువు, భార్గవుడు, అంగిరసుడు. వశిష్ట కుమా రుడగు సవనుడు అత్రిపుత్రు డగు హవ్యవాహానుడు, పౌలహుడు సప్త ఋషు లుగా నుందురు. ఆకాలంబున దక్షపుత్రులనెడి మూడు దేవతాగణంబు లుండును. బిడౌజు డనెడి ఇంద్రుడుండును.

నృతకేతు, పంచహోత్ర, నిరాకృతి, పృథుశ్రవ, భూరిధామ, ఋచీక అష్టహాత, గయుడనెడి నవపుత్రు లీమనువున కుండెదరు.

ఇక పదియవ మనుకాలంబున, పులహ కుమారుడగు హవిష్మంతుడు, భృగు కుమారుడగు సుకృతుడు, అత్రికుమారుడగు యశోమూర్తి వశిష్ట తన

యుడుగు యష్టనుడు. పులస్త్య కుమారుడగు ప్రమతి, కశ్యప కుమారుడగు నాభాగుడు నభపుత్రుడగు సత్యుడు, సప్తఋషులగుదురు. ఋషి మంత్రియు నెడు నామంబులతో దేవతలు రెండు తెగలుగా నుందురు. పురందరుడనెడి పేరుతో నింద్రుడుండును. ఈ మనువునకు ఉత్తమ, ఓజ, నికౌంజ, వీర్యవాన్, శతానీక, నిరామిత్ర వృషసేన జయద్రథ, భూరిద్యుమ్న, సువర్చయనెడు పదుగురు పుత్రులుందురు. ఇతని కాలంబున పురుహూతుడనెడి యింద్రు డుండును.

ఏకాదశ మన్వంతరమున కశ్యప పుత్రుడగు హవిష్మంతుడు భృగు పుత్రుడగు హవిష్మంతుడు వశిష్ఠ కుమారుడగు యనఘుడు, అంగిరస పుత్రు డగు ధధిష్ముడు, పులస్త్యకుమారుడగు నిశ్చరుడు, పులహుడు సప్తఋషు లౌదురు. ఈ కాలమున దేవతలు మూడు తెగలుగా నుందురు. శతక్రతు వను పేరుతో నింద్రుడుండును. సంవర్తక, సుశర్మ, దేవానీక పురూద్వహ క్షేమ ధన్వ దృఢాయు ఆదర్శ, పండక యనువారలతని పుత్రులౌదురు.

ద్వాదశ మనుకాలంబున వశిష్ఠకుమారుడగు ధృతి అత్రికుమారుడగు సుతపుడు అంగిరుడు, కశ్యపుడు తపోశనుడు తపోనిధృతుడు సప్తఋషు లగుదురు. బ్రహ్మపుత్రు లందరు దేవతలై నైదుగణములుగ నుందురు. శంభుడనెడి పేరుతో నింద్రుడుండును. దేవాయు, అదూర, దేవశ్రేష్ఠ విదూర మిత్రవంశ మిత్రదేవ, మిత్రసేన, మిత్రకృత్ మిత్రబాహు, సువర్చల యనెడు పదుగురు పుత్రులీ మనుపుత్రులై యుందురు.

త్రయోదశ మనుకాలంబున, ధృతిమంతుడు, హవ్యపుడు, తత్త్వదర్శి, నిరుత్సక, నిష్ప్రకంప నిర్మోహ, సుతపయనెడు వారలు సప్తఋషులుగా నుం దురు. చిత్రసేన, విచిత్ర, నయ, ధర్మ భృత, ధృత, సునేత్ర, క్షత్ర, వృద్ధి, సుతప, నిర్భయ, దృఢయ యను వారలీమను పుత్రులగుదురు. దేవతలు మూడు గణంబులుగా నుందురు. హరి హయుడనెడి పేరుతో ఇంద్రుడుడను.

చతుర్దశ మనుకాలంబు చెప్పెద వినుము. అతిబాహుడు, శుచి, అం గిర, యుక్తి, శుక్రుడు, అజిత, పులహ, యనువారలు సప్తఋషులగుదురు.

ఇతని కాలంబున నైదు దేవతాగణంబు లుండును. సంక్రందను డనుపేరుతో నింద్రుడుండును. తరంగభీరు, వప్ర, శరస్వాంత ఉగ్ర అభిమాని, ప్రవీణ జిష్ణు సంక్రందన, తేజస్వి, సబలయనెడు వారలు మనుపుత్రులై యుందురు. కల్పమున కొక మన్వంతర కాలము జరుగుచుండును. ఈవిధముగ చతుర్దశ మనువులు, సహస్రయుగ పర్యంతము ప్రజాభివృద్ధి నొనరించి, సాగరపర్యంత మగు భూమిని పాలింతురు. ఈమన్వంతర కాలము శ్రవణపఠనాదులచే నాయుర్యశో వృద్ధులు గల్గి, సుఖభోగులగుదురు. మన్వంతరాంతరములయందు మనువులతోబాటు జగత్తు లయ మగుచుండును.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
ముప్పది నాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

## ముప్పదియైదవ యధ్యాయము

### వైవస్వతమను చరిత్రము

కస్యపుడు దక్షపుత్రుని వనసూర్యుని పుత్రునిగా బడసెను. సూర్యుని భార్య త్వష్టపుత్రికయగు సంజ్ఞ. ఈమె యతిరూపలావణ్యవతియైనను, సూర్యతేజమును సహింపనేరక భర్తవలన సుఖము నొందలేకుండెను. మరియు భర్తృతేజ మతికష్టముచేనెట్లనో సహించి, ముగ్గురు సంతానమును మాత్రము బడసెను, వీరిలో మొదటి వాడు శ్రాద్ధదేవుడగు ప్రజాపతి యముడు యమునయనెడు పుత్రికజనించిరి. యమయమున లిరువురు కవలులై యుండిరి. సంజ్ఞ రానురాను సూర్యుని వేడిమికి తాళలేక తానొక ఛాయను నిర్మించి ఓఛాయా! నేను నాతండ్రిగారింటికేగెదను. నీవునాయిరువురికుమారులను, పుత్రికను జాగ్రత్తగ పోషింపుచు, నావలే నాభర్తకడనునాబిడ్డలకడను, (నావలె) ప్రవర్తింపుము ఈరహస్య మెవరికిని తెలుపకుము, జాగ్రతసుమాయని బలుక, నో దేవీ! సూర్యుడు నా కేశములాడిసి

పట్టి నిజముచెప్పుమని, నిర్బంధించు నదాని నీరహస్యము ప్రకటింపకే తును, నీవుసందేహింపకుము సుఖముగనిన్నుగృహముగు కేగుము, ఛాయబలుకు, సంజ్ఞ తండ్రిగృహమున కేగెను, త్వష్ట తనపుత్రికను గాంచి. భర్తనువీడి వచ్చుటకు కారణమేమని మాటిమాటికి నిర్బంధించి యడుగుచు, నిది మంచిపనికాదు భర్తనువీడివచ్చుట యుత్తమస్త్రీలక్షణముకాదని బోధింప, నామెసిగ్గుజెంది, బడబయై, యుత్తరకురుదేశప్రాంతమున విపినమందు సంచ రింపుచుండెను.

సూర్యుడు. ఛాయను సంజ్ఞగా భావించి, ఆమెవలన, సావర్ణిని, శనైశ్చరుని, మనువును పుత్రులనుగా బడసెను, ఈఛాయ సంజ్ఞయందలి గౌర వముచే సవతిబిడ్డలను ప్రేమతో పెంచెనుగాని, తనకు పుత్రుడు జనించి నంతనే, సవతిపిల్లలయందు భేదభావముతో ప్రవర్తింప, యముడు కృద్ధుడై తనపాదంబులతో తల్లినితన్న. నీపదంబులూడి క్రిందపడుగాక యని తల్లి శపించెను, ఇతడుతల్లిచే శపింపబడి తండ్రికడ కేగి జరిగినదంతయు విన్న వింపుచు ఓతండ్రీ తల్లికి పుత్రులందరు సమానులేగద, యేకారణముచేతనో మాతన్నుని గాఢముగా ప్రేమింపుచుండెను, మమ్ములనవమానింపుచుండెను, నేనిది సహింపనేరక, నాతల్లిని కాలితోతన్నితిని, నీపాదములు పడుగాక యని ఆమెనన్ను శపించెను తండ్రీ ఆమెశపించినను నీప్రభావముచే నాపాదములు పడకుండచేయుమన, సూర్యుడు పుత్రవాక్యములువిని, పుత్రా, ధర్మాత్ము డవు సత్యసంధుడవునగునీకు, క్రోధమువచ్చుటలో నదోకారణమున్నది! నీతల్లి వాక్యులన్నృతములు కాజాలవు, క్రిములు నీపాదమాంసములు భుజించి, భూమికిజనును, దానితో నామెశాపము సిద్ధించును, నీకుక్షేమము కల్గునని జెప్పి, ఛాయకడకేగి

ఓచండీ ఓకుమతీ నీకిట్టికుబుద్ధి యేలకలిగెనని నిర్బంధించి శిఖ పట్టుకొని యడుగ నామెయదార్థమంతయు జెప్పెను, తరువాత సూర్యుడు త్వష్ట కడకేగి. సంజ్ఞయేమయ్యెనని యడుగ, సంజ్ఞనీతేజముసహింపక ఉత్త రకురుప్రదేశములయందు, బడబయైపచ్చికబైళ్లయందు సంచరింపుచున్నది, కొంత తేజము తగ్గినచో, సహింపగలదుగాని, లేకున్న సహింపలేదన,

సూర్యుడు త్వష్టమాటలువిని మీరాలోచించినట్లు చేయుమన, సూర్యుని భ్రమికాయంత్రమున బెట్టి తేజంబును తగ్గింప, నతడతిప్రకాశ వంతుడై, ఆమెసహింపగల్గిన వేషమునుండి, యోగమార్గముచే తనభార్యయున్న తావు తెలిసికొని, తానశ్వమై భార్యతో రమింపదలచియుండ, నామె ఇతడు పరపురుషుడని యెంచి దూరమునకుజనుచుండ, నశ్వరూపుడగు సూర్యుని వీర్యము, బడబానాపుటములందుపడ, దైవవైద్యులగు. నశ్వనీ కుమారులు జనించిరి, వీరిరువురకునాసత్యుడు, దస్యుడునని నామంబులుగలవు, తేజోవంతులగు నిరువురిపుత్రులను భార్యనుగాంచి, సూర్యుడు ముదన్వితుడై వారలతో స్వస్థానమేగెను, వీరుపూర్వముకన్న నధికముగ ప్రేమించుకొనుచుండిరి, యముడు జరిగినదానికి దుఃఖించుచు ప్రజలను ధర్మముగ పాలించుచుండె నందుచే ధర్మరాజని పేరొందెను. నితనికి పితృదేవతాధిపత్యము, లోకపాలకత్వముకూడ లభించెను, ఇతని యన్నగారగు వైవస్వతుడు తపంబు చేసిమనువయ్యెను. యమునయనెడు కన్యక పరమపవిత్రమగు యమునా నదియై ప్రవహింపజొచ్చెను, ఈమను చరిత్ర విన్నను పఠించినను సర్వాపత్తులనశించి సర్వశ్రేయస్సుల నొందగలరు.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు

ముప్పది అయిదవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పది యారవ యధ్యాయము

## మను పుత్రుల చరిత్రలు

వైవస్వత మనువునకు ఇక్ష్వాకుడు శిబి, నాభాగుడు దృష్ట. శర్యాతి, నరిష్యంత, నాభాగ. కరూష ప్రియవ్రత యును, నవ పుత్రులుండిరి, వారందరు, పితృ తుల్య పరాక్రమ వంతులు, మహోన్నతులు, ధీరులు క్షత్ర ధర్మ పరాయణులునై యుండిరి, మరియు నీమనువు యింకను పుత్రకాముడై, ప్రజాపత్యేష్టి గావింప నా హోమ గుండమునందు, దివ్యాంబర ధారిణి యై, దివ్యా

భరణ భూషితయై దివ్య శరీర ధారిణియై ఇలయను కన్యక జనించెను మను వా మెను గాంచి నాగృహమునకురమ్మనసీవు పుత్రికాముడనై ప్రజా ప్రత్యేష్టి చేసితివి, నేను మిత్రా వరుణుల యంశచే జనించితిని గాన వారికడ కేగెదనని ఇల మిత్రా వరుణుల కడకేగి ప్రాంజలియై ఓమహా మునులారా! నేను మనుయజ్ఞమునందు, మీ ఇరువురి యంశచే జనించితిని, గాన మీకడ కేతెంచితిని నేనిపుడేమి చేయవలయునో శలవిండన మిత్రా వరుణు లిట్లనిరి ఓకన్యకారాలా మేమునీ యందలి ప్రేమపురస్సరముగ బల్కెడి వాక్కులు వినుము నీవుమా యిరువురకు ఖ్యాతిని కల్గింప జేయుచుపు నీవుమను వంశ కరుడవై సుద్యు మ్నుడను నామంబుతో ప్రఖ్యాతి నొందుచు ముల్లోక ప్రసిద్ధుడవై మను వంశ వివర్ధకుడవై ధర్మశీలుడవై జగత్ప్రియుడవై యుండు మన, నిల వారిమాట లు విని మరల మను గృహమున కేగు చుండ మార్గమధ్యమున చంద్ర సుతుడగు బుధుడు యిలను ప్రేమించి యామెతో రమింప పురూరవుడు జన్మించి చక్రవర్తి యయ్యెను, ఊర్వసి యితని సౌందర్యమును గాంచి తన పతిగా జేసి కొనెను పిమ్మట నిల శివప్రసాదముచే పురుషుడై సుద్యుమ్న నామంబుతో నుండెను, ఇతనికి ఉత్కల, గయ విన తాశ్వుడను పరమ ధార్మికు లగు పుత్ర త్రయము గలదు. వీరిలో ఉత్కలు డుత్తరోత్కల దేశం బును వినతాశ్వుడు పశ్చిమ దేశంబును తూర్పున గయుడును పాలించిరి, దివాకర తనూజుడగునై వస్వతమనువు తనక్షేత్రమంతయు దశవిధంబులు గ విభజించి ఇక్ష్వాకునకు మధ్య దేశము వశిష్ఠుని యనుమతి ప్రకారము పంచి పెట్టెను. సుద్యుమ్నుడు ధర్మ ప్రకారముగ తనవంశ రాజ్యమును పురూరవుని కిచ్చియుండెను. మను పుత్రుడగు నభగునకు నాభాగుడు నాభాగున కంబరీషుడు అంబరీషునకు విరూపుడు విరూపునకు బృహదశ్వుండు బృహదశ్వునకు రథీత రుండు జన్మించిరి. రథీతరునకు సంతానము లేకుండుటచే అంగిరుండను బ్రాహ్మ ణుని వలన సంతానము బడసెను. ఇక దృష్టుని సంతానము దాష్ట్యులైరి. శర్యాతి, ఆనర్తుడు కళానిధి యను సుత ద్వయము సుకన్య యనెడు పుత్రిక గలరు. ఈ సుకన్య ముదుసలియగు చ్యవనుని పరిణయ మాడి యశ్వనీ దేవ తల యనుగ్రహముచే తన భర్తను యౌవన వంతుని గజేసి కొని సర్వ సౌఖ్యం బులను భవించెను. ఆనర్త పుత్రుడగు రైవతుడు ఆనర్త దేశమందు కుశస్థలిని

రాజధానిగా జేసికొని పరిపాలించెను. ఇతనికి కకుద్మ్యుడు మొదలగు నూర్గురు సుతులు గలరు. రేవతి యనెడు కన్యకా రత్నంబు గలదు. ఈమె యతి సౌందర్యవతియై అపరలక్ష్మి యనుయన్నట్లుండెను. ఇతడు తన కన్యకను తీసికొని బ్రహ్మలోక మేగియుండ నాబ్రహ్మ సభలో నొక క్షణకాల మాగి గాంధర్వ నర్త గీతంబులు విను చుండ నట నొక ముహూర్త కాలము కాగా, భూలోకంబున బహు యుగంబులు గడచెను. ఇంతలో, కకుద్మి తన పుత్రిక యగు రేవతిని బ్రహ్మ కడకు తీసి కొని వచ్చి విధాతా! నాపుత్రిక కెపుడు వివాహమగును? తగిన వరుడెవడో తెల్పుమన బ్రహ్మ మందహాసము చేయుచు నీ దేశమందు నీవనుకున్న వారెవరును లేరు. నీవిచటకు వచ్చిన తరి కొన్ని యుగంబులు గడచి పోయెను. నీరాజ్యమంతయు రాక్షసు లాక్రమించు కొనిరి. నీవారందరు గతించిరి. కాలము సర్వులను భక్షించెను. ఇప్పుడ క్కడ నష్టావింశతి ద్వాపరంబు జరుగుచుండెను. అక్కడ ద్వారకా పురిని నిర్మించు కొని శ్రీకృష్ణుడుండెను. ఆపురి బహు ద్వారంబులతో నుండెనుగాన ద్వారవతి యని పేరు వచ్చెను. వాసుదేవు నాశ్రయించు కొని భోజ వృష్ణ్యంధకులు ద్వారక యందే యుండిరి. నీవు వెంటనే జని వసుదేవ పుత్రుడగు బలరామునకు నీకన్యక నిచ్చి త్వరితముగ వివాహము చేయుమన నతడట్లంగీకరించి తనకన్యకతో తనపురంబునకు వచ్చి కొన్ని యుగంబులు గడుచుటచే పూర్వ చిహ్నంబులేమియు గాన్పింపక నచ్చెరు వొందుచు బలరామునకు రేవతి నిచ్చి వివాహము చేసి తాను మేరుశిఖరంబున తపమాచరింపు చుండెను కకుద్మి రేవతి బ్రహ్మలోక మేగు తరి యెట్టి యునికులై యుండిరో మరల తిరిగి వచ్చినను యథా ప్రకారంబుగనే యుండిరి. కకుద్మంతునికి రైవతుడను నామాంతరము గలదు. బ్రహ్మలోక మందున్న వారికి. క్షుత్పిపాసలు గాని జరామృత్యువు యుండవు. బలరామునకు నూర్గురు పుత్రులు గలరు. వారందరు ధార్మికులై యుండిరి. కృష్ణునకు కూడ బహు పుత్రులు గలరు వారందరు క్షత్రియులై నలుదిశల పాలింపు చుండిరి. మీకు శర్యాతి వంశమంతయు జెప్పితిని. ఇంకను మనువంశము సంక్షేపముగ జెప్పెద వినుడు. నాభాగునకు ఇష్టకుడను పుత్రుడు గలడు. అతడు బ్రాహ్మణత్వము నొంది, క్షత్రియవంశసంస్థాపకుడై బ్రహ్మ కర్మల నాచరింపు చుండెను. దృష్టకు ధార్ష్టుడు జనించెను. ఇతడు కూడ క్షత్రియుడై

నను బ్రహ్మత్వము నొందెను. కరూషునకు యుద్ధదుర్మదులగు కారూషులు జనించిరి. మనుపుత్రుడగు నృగుడు మహాదాతయైయుండెను. ఇతడు బ్రాహ్మణుల కెల్లప్పుడు గోవులను ధనంబులను దానము చేయుచుండెడివాడు. ఇతడిచ్చిన గోవు తిరిగి తనవద్దకు వచ్చుటచే దానినెరుంగక మరియొక విప్రునకిచ్చుటచే తానూసరవిల్లియై శ్రీకృష్ణునిచే నుద్ధరింపబడెను. నృగునకు ధర్మనేత్రుండగు ప్రమతియను పుత్రుడు గలడు. మనుపుత్రుడగు పృషధ్రుడు గురు నాజ్ఞచే గోవుల మేపుచుండెడివాడు. రాత్రి కూడ వీరాసనాధిష్ఠితుడై గోవులను రక్షించెడివాడు. ఒకనాడొక వ్యాఘ్రము గోహింసకై గోశాల ప్రవేశింప గోవులాక్రందనచేయ పృషధ్రుడు ఖడ్గధారియై గోష్ఠమందు ప్రవేశించి వ్యాఘ్రమనుకొని యావుదూడ శిరము ఖండింప వ్యాఘ్రము దానిగాంచి భీతిజెంది తనస్థానమున కేగెను. ఆ రాత్రిగాలితో గూడిన వర్షముండుటచే గోవ్యాఘ్రములకు భేదము గ్రహింపనేరక గోవ్యాఘ్రమునకు బదులు గోశిశువును చంపెను. తెల్లవారగనే గోశాలకేగి ఖండితమై బడిన దూడను గాంచి వ్యాఘ్రమనుకొని గోశిశువును హింసించితినని చాలదుఃఖించి గురువునకు విన్నవింప నతడు క్రుద్ధుడై నిరాలోచింపక నీవు కపటవృత్తి జేసితివిగాన నీవు క్షత్రియుడవైనను శూద్రత్వము నొందెదవని శపించెను. ఇతడు గురు శాపమునొంది విరక్తుడై సర్వమును త్యజించి ఘోరారణ్యమున కేగి, యోగమభ్యసించి దావాగ్నియందు దహింపబడి పరమగతి నొందెను. మను పుత్రుడగు కవి శివానుగ్రహముచే ప్రజ్ఞావంతుడై దుర్లభంబులగు నిహపర సుఖభోగముల నొందెను.

శివ మహాపురాణ మందలి ఉమాసంహిత యందు
ముప్పదిఆరవ అధ్యాయము సంపూర్ణము

## ముప్పది యేడవ యధ్యాయము

### మనువంశ ప్రవర్తకులు

మనువుయొక్క నాశికనుండి ఇక్ష్వాకుడు జనించెను. ఇక్ష్వాకునకతి సమర్థులగు నూర్గురు పుత్రులు గలరు. ఈ రాజులందరు వింధ్యపర్వతము మొదలు హిమవత్పర్వతము వరకునుండు నార్యావర్తమును పాలించిరి. వీరిలో జ్యేష్ఠుడగు వికుక్షి మాత్రమయోధ్య రాజధానిగా జేసికొని పాలించెను. ఇతడు శ్రాద్ధకర్మకై నియోగింప బడిన శశిమాంసము భక్షించుటచే, తండ్రిచే త్యజింపబడి శశాదుడని పిలువబడుచు నరణ్యవాసియై యుండెను. ఇక్ష్వాకుడు వశిష్టుని యాదేశాను సారముగ, తనపుత్రులలో శకుని మొదలగు పంచదశ పుత్రుల నుత్తర ప్రదేశమంతయు పాలింపుడని నియోగించెను. మరియు నయోధునకు కకుత్స్థుడు, కకుత్స్థున కరినాభుడు అతనికి పృథువు, పృథువునకు విష్టరాశ్వుడు జనించెను. ఇతడు ఇంద్రుని జయించెను. ఇతనికి యువనాశ్వుడు, యువనాశ్వునకు, శ్రావస్త్య ప్రజాపతి జనించెను. ఇతని పేరుతో పురము నిర్మించెను. ఇతని పుత్రుడు, బృహదశ్వుడు. ఇతనికి యువనాశ్వుడు యువనాశ్వునకు వలయాశ్వుడు. ఇతడు ధుంధువనెడి రాక్షసుని సంహారించుట చే ధుంధుమారుడని పేరువచ్చెను కువలయాశ్వునకు ధనుర్ధరులగు శతపుత్రులు గలరు. ఇతడు తన పుత్రులకు రాజ్యభారము నిడి తా నరణ్యమునకేగ నుద్యుక్తుడు కాగా నింతలో నుత్తంకమహర్షి యేతెంచి ఓ రాజా! నీవింకను ధర్మముగ రాజ్యపాలనము చేయవలెను. నీ వీ భూమిని రక్షించినచో సర్వులు సుఖముగ నుండెదరు. నాయాశ్రమ సమీపంబున సాగరవాలుకల యందు బలదర్పితులగు రాక్షసులు నివసించుచుండిరి. వారందరు మహాబలులు. మహాకాయులునై, దేవతల కవధ్యులై యుండిరి. వారందరు భూమిలోపల నిసుకలో దాగియుండిరి. వీరిలో మధు పుత్రుడగు ధుంధుభుడు లోకనాశనమునకై, కఠిన తపము చేయుచుండెను. ఇతడు సంవత్సరమున కొకతూరి యూపిరి విడుచును. అట్టితరి చరాచరంబులతో గూడిన భూమంతయు చలించి ధూమసహితమైన యగ్నికణంబులు పైకి లేచుచుండును. నే నిదంతయు భరింపలేకుంటిని గాన, నీవు లోకహితమునకై నారాక్షసులను సంహరించి

నచో లోకమంతయు సుఖముగ నుండును. ఆ దుష్టుని సంహరించుటకు నీవే సమర్థుడవు, పూర్వము నీకు విష్ణువు వరమిచ్చి యతని తేజము నీకిచ్చి యుండెను. ప్రజాపాలనము మహాధర్మమని చెప్పబడుచున్నది. దీనికి మించిన ధర్మము లేదు. ముందుగా ప్రజాపాలనము చేసి తదుపరి రాజర్షి వి యగుము. కాన నీపయనము విరమింపుమన, రాజు మహర్షి వాక్కులు విని ఓ మహర్షి నే నస్త్ర సన్యాసము చేసితిని, విడిచిన యస్త్రము మరల బట్టను గాన, నా పుత్రుడు దుంధుమారుని సంహరింప గలడని పలికి, తన పుత్రునకు దుందుభుని సంహరింపుమని యాజ్ఞాపించి యతడు తపంబునకు జనెను. తదుపరి కువలయాశ్వుడు దుందుభుని చంపుటకై పయనము కాగా నుత్తంకుని ఆదేశాను సారముగ విష్ణువు తన తేజము కువలయాశ్వుని యందు ప్రవేశపెట్ట నతడు దుందుభుని సంహరించుటకై బయలుదేర దేవతలు గగనమునుండి పూల వర్షము కురియించిరి, జయజయ ధ్వానములతో ప్రశంసించిరి. తదుపరి రాజు తన పుత్రులతో గూడ సాగరము కడకేతెంచి, సైకతమంతయు దొలగించి రాక్షసుల నన్వేషింపుచుండెను. దుందుభుడనసురుడు గర్తమందు సాగర పశ్చిమ భాగంబున తపోనిష్ఠుడై యుండెను. నారాయణ తేజోసంభూతు డగు దిక్కులనెల్ల పరిశీలించి గాంచుచుండ, దుందుభి యటగాన్పింప నాదుందుభి నోరు తెరువ, నతని ముఖశ్వాసాగ్నులచే నా రాజుయొక్క నూర్గురు పుత్రులు భస్మమైపోయిరి. చంద్రోదయముచే సాగరము ముప్పొంగినట్లు, దుందుభి శ్వాస లచే దహింపబడిన నూర్గురు పుత్రులను ముంచి వైచెను. వీరిలో ముగ్గురు మాత్రము కొనయూపిరితో శేషించి యుండిరి. ఆ ప్రదేశమంతయు సాగర జలమయమై యుండ, నాజలమంతయు రాజు తన వహ్ని బాణంబుచే శోషింపజేసెను. తదుపరి నాదుందుభిని జంప ఉత్తంకుని కడకేగ, నామహర్షి రాజునుగాంచి అక్షయమైన ధనంబును శత్రు పరాజయమును సతతము ధర్మమందు మతియు, స్థిరమగు స్వర్గవాసము రాక్షసునచే దహింపబడిన పుత్రుల కక్షయలోకంబులు గలుగుగాక యని వరమిచ్చియుండెను. దృఢాశ్వ, హంసాశ్వ, కపిలాశ్వ యనెడు ముగ్గురు పుత్రులు మాత్రమే రాజునకు శేషించి, యుండిరి. వీరిలో దృఢాశ్వునకు హార్యశ్వుడు. నితనికి కుంభుడు, నితనికి సంహాతాశ్వుడు సంహాతాశ్వున కక్షాశ్వుడు, నితనికి కృతాశ్వుడు, నీకృతాశ్వునకు

హైమవతీ, వృషద్వతీ యనెడు నిద్దరు పుత్రికలు గలరు. వృషద్వతికి త్రిలోక విఖ్యాతుడగు ప్రసేన జిత్తుడనెడి పుత్రుడు గలడు. నితనికి గౌరి యనెడి భార్యకలదు. ఈమె భర్తచే శపింపబడి బాహుదయను నదియ య్యెను. ప్రసేనజిత్తునకు యువనాశ్వుడు యువనాశ్వునకు మాంధాత పుత్రుడై యుండెను. నితడు త్రైలోక్య విఖ్యాతుడై శశిబిందు పుత్రికయగు చైత్రరథి పదివేల సోదరులకు సోదరియై పతివ్రతయై యుండెను. మాంధా తకు పదివేల తనయులు జనించినతరి పురుకుత్సుడు, ముచుకుందుడు అను నిద్దరు పుత్రులను గనెను. పురుకుత్సునకు త్రయ్యారుణుడను పుత్రుడు గలడు. ఇతడు కవి విద్వాంసుడై యుండెను. ఇతనికి మహాబలవంతుడగు సత్యవ్రతు డను కుమారుడు కలడు. ఇతడు ప్రాణిగ్రహణము జరుగుచున్న పర భార్యను హరించి వివాహమాడెను. ఇతడు బలకాముడు మహాసంహర్ష మదోత్కటంబు లచే పురవాసిని యగు కన్యకను హరించి, నితడధర్మముగ సంచరించుచుండె నని, యితని తండ్రియగు త్రయ్యారుణుడు నితని త్యజించెను. తండ్రీ నేనెచ టికి పోవుదునని కుమారుడు మాటిమాటికి ప్రశ్నించ, తండ్రి క్రోధముతో పొమ్ము దూరముగ పొమ్ము. చండాలుల శ్వపచులకడ నివసింపుమన, పుత్రు డట్లేచేసెను. కుమారుడిట్లుండుటచే తండ్రి విరక్తుడై, రాజ్యము విడచి వనంబున కేగి శివుని గూర్చి తపమాచరించుచుండెను. రాజు చేసిన యధర్మమునకు ఆఖండలుడు ద్వాదశవర్షముల వరకు వర్షములు లేక క్షామము గావించెను. ఆసమయంబున విశ్వామిత్రుడు భార్యను విడి, సాగరతటంబున ఘోరతపమా చరించుచుండెను. ఇతని భార్య మిగిలిన పుత్రులను పోషించుటకై తన మధ్య మపుత్రునకు మెడయందు త్రాడుగట్టి, గోశతమునకై పుత్రుని విక్రయింపబోవ సత్యవ్రతుడది గాంచి, గోశతంబునిచ్చి పిల్లవానిని విడిపించి, పిల్లవానిని గౌర వముగ పోషించుచుండెను. నితని గళము నందు త్రాడు గట్టి విక్రయించుటచే గాలవుడని పిలుచుచుండిరి.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
ముప్పది యేడవ అధ్యాయము సంపూర్ణము

---

బడుచుండెను, హరిశ్చంద్రుడు రాజసూయ యాగముచేసి సామ్రాట్టని బిరుదు పొందెను. ఇతనికుమారుడు లోహితాస్యుడు, ఇతనికి వృకుడు, వృకునకు బాహువు, యనువారలు పుత్రులైరి, ఈబాహువుని, హైహయులు, తాల జంఘులుకలసి రాజ్యభ్రష్టునిచేయ నతడు తనధర్మము తప్పక విప్రులనాశ్రయించి, ఈబాహువు గరళముతోగూడిన సగరుని పుత్రునిగా బడసెను, ఈసగరుడు ఔర్వాశ్రమమునందు భార్గవునిచే రక్షింపబడుచు నతనిచే నాగ్నేయాస్త్రమును పొంది తన శత్రువులగు, హైహయ తాలజంఘులను సంహరించి తన తండ్రిరాజ్యమును పొందెను, మరియు నితడు శకులు బహూదకులు, పారదులు, అనేకగణములు ఖసులునను వారల జయించి రాజ్యస్థాపనచేసి ధర్మముగ ప్రజాపాలనము చేయుచుండెను, ఈరాజు గరళముతో జనించుటకు కారణమేమని ఋషులు ప్రశ్నింప సూతుడిట్లు చెప్పదొడంగెను.

## సగర చరిత్ర

పరీక్షితుడు ప్రశ్నింప వైశంపాయనుడెవ్విధంబున జెప్పెనో. యదంతయు జెప్పెద వినుడు, వ్యసనుడగు బాహుకుని రాజ్యము హైహయులు తాళజంఘులు, శకులు, యవనులు, పారదులు కాంభోజులు, పల్లవులు, బహూదకులు, యనెడు వారందరు కలసి రాక్షసకృత్యములచే తమపరాక్రమంబుల జూపించి బాహుకుని రాజ్యమపహరింప నతడు తనప్రాణములు రక్షించుకొనుటకై భార్యతో గూడ నరణ్యమున కేగెను, యాదవపుత్రికయగు నితని భార్య సవతిచే గరళము పెట్టబడినదై గర్భవతియైయుండి భర్తతోబాటు యరణ్యమునకు వచ్చెను, కొంత కాలమునకు భర్త మరణింప దుఃఖమాపుకొనలేక. భర్తతో సహగమనము చేయనుంకింప భార్గవుడామెను వారించి తనయాశ్రమంబునకు గొంపోయి యామెను రక్షించిపోషింపుచుండెను, నామెశివుని ప్రార్థింపుచు భార్గవునకు పచారములుచేయుచుండ నొకానొక శుభదినంబున పంచగ్రహము లుచ్చస్థితియందుండ శుభలగ్నమున గరళముతో సహ కుమారుని కనెను ఈలగ్నబలముచే బాలుడు దినదిన ప్రవర్ధమానబలుడై యుండెను, ఔర్వముని ఈబాలునకు జాతకర్మలన్నియు గావించి, సగరుడని నామంబిడి, అస్త్రశస్త్రాదివిద్యలన్నియు నభ్యసింపజేసెను. ఇతడు స్వయముగ బలవంతుడు,

అస్త్రబలముచే మరింత బలవంతుడయ్యెను, తదుపరి పెరిగి పెద్దవాడై, తన శత్రువులను తెలిసికొని కృష్ణుడై వారిని జయించి లోకమందు కీర్తిని సంపాదించి ధర్మము స్థాపించెను, శకులు, యవనులు, కాంభోజులు, పల్లవులు ఇతనిధాటి కాగలేక వశిష్ఠుని శరణుపొంద గురువాజ్ఞచే సగరుడు శకులకర్ధముండన గావించి వదలివేసెను, యవనలకు పూర్తిముండనముగావించి విడిచిపుచ్చెను, కాంభోజులను ముక్తకేశులగావించి పొమ్మనెను, పల్లవులను, గడ్డములు మీసములతో నుండుడని శాసించి స్వాధ్యాయ వషట్కారంబులు లేకుండచేసెను, తదుపరి సగరుడు తన భుజబలముచే ధర్మముగ పృధివినంతయు జయించెను, ఇతడు రాజసూయయాగము గావించుచు నశ్వము నలంకరించి విడువ నాయశ్వము పూర్వదక్షిణ తీరంబుల సంచరింపజొచ్చెను. అశ్వము వెంట, సగరుని అరువదివేలపుత్రులుజనిరి, స్వార్ధపరుడగు దేవేంద్రుడు తీరమందున్న యశ్వమును హరించి భూమిలో తపంబుచేయుచున్న కపిలుని కడ విడిచి యంతర్హితుడయ్యెను, సగరపుత్రు లందరశ్వముగానక నాప్రదేశమంతయు నలువైపుల త్రవ్వి పరికింపుచుండ నాదిపురుషుడు, విశ్వరూపుడు, సమాధినిష్ఠుడునగు కపిలునిగాంచి మాయశ్వ మేమైనదని ధిక్కరించి బలుక నతడుకోపముతో కండ్లుతెరువ వారందరు భస్మమైరి, సగరపుత్రులు త్రవ్విసప్రదేశమంతయు సాగరమయ్యెను, వీరిలో నల్గురుమాత్రమే శేషించియుండిరి. మిగిలినవారు భస్మమైరి, హర్షకేతుడు, సుకేతుడు, ధర్మరధుడు, పంచజనుడు, నని, నీశేషించిన సగరపుత్రుల నామంబులైయుండెను, శేషించిననల్వురను కపిలుడుగాంచి దయాన్వితుడై ఓసగర పుత్రులారా? మీచే వంశమువృద్ధియగును, మీరుబహుమేధావంతులు బుద్ధివంతులు, కీర్తివంతులునగుదురు, సముద్రుడు మీకు తనయుడగును, మీరుమిక్కిలి ధనవంతులగుదురని వరంబులిచ్చెను. తదుపరి, వారలశ్వమునుపొంది తిరిగి గృహమునకేగిరి సగరు డశ్వమేధయాగము పూర్తిజేసెను తదుపరి తొంబదితొమ్మిది యశ్వమేధయాగములు జేసియుండెను, ఇత డీశ్వరకృపచే సర్వయశస్సుల నొందియుండెను.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు

ముప్పదిఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పది తొమ్మిదవ యధ్యాయము

## సగరపుత్రుల జన్మవృత్తాంతము.

అరువది వేలపుత్రులు సగరున కెట్లుద్భవించిరో తెల్పుమని శౌనకుడు ప్రశ్నింప సూతుడిట్లు చెప్పదొడంగెను. సగరునకు తపంబుచే దగ్ధకిల్బిషు లగు నిరువురు భార్యలుండిరి. వీరుతపంబుచేయ నౌర్వుడు సంతసించి వరం బులు కోరుకొమ్మన వీరిలో నొకతె మంచిచురుకైన యరువది వేలపు త్రులనుకోర, మరియొకతె వంశవర్ధన కరుడగు సుపుత్రు డొక్కడే కావ లయునని కోరెను. ఆముని ప్రసాదముచే అరువది వేలమంది జీవులుగల తుంబము (ఆనపకాయ.) నొకభార్యయు, రెండవభార్య బలవంతుడగు నొకపుత్రుని మాత్రమే బడసెను. వీరందరు శూరులు వీరులునై వృద్ధి నొందిరి. ఈబీజములన్నిటిని ఘృతభాండముల యందుంచి పోషించిరి. వీరు క్రమముగ పెద్దవారై, కపిలాగ్నిచే దగ్ధమైనవారిలో, శేషించిన చతుష్ట యమందు పంచజనుడు రాజుగానుండెను. ఈపంచజనునకు అంశుమంతుడు అంసుమంతునకు దిలీపుడు దిలీపునకు భగీరథుడు జనించెను. ఈభగీరథుడు తపంబుచేసి గంగను తెచ్చి తనపుత్రికగాబడసి, సాగరము నల్లునిగాజేసికొ నెను, భగీరథునకు శ్రుతసేనుడు, శ్రుతసేనకు నాభాగుడు, నాభాగున కం బరీషుడు, అంబరీషునకు సింధుద్వీపుడు, సింధుద్వీపున కయుతాజితుడు, అయుతాజితునకు ఋతుపర్ణుడును జనించెను. ఇత డక్షహృదయము నెరింగి నలుని సఖుడై యుండెను. ఈఋతుపర్ణున కనుపర్ణుడు, అనుపర్ణునకు మిత్రు సహుడనెడి కల్మాషపాదుడు జనించెను. కల్మాషపాదునకు సర్వకర్ముడు, సర్వకర్మున కనరణ్యుడు, అనరణ్యునకు ముండిదృహుడు. ముండిదృహునకు నిషధుడు నిషధునకు ఖట్వాంగుడు. రతియనెడు పుత్రులుగలరు. ఖట్వాం గుడు దేవతల సహాయమునకై స్వర్గమునకేగి తనయాయువు ముహూ ర్తము మాత్రమేయున్నదని తెలిసికొని, తనసత్యబుద్ధిచే ముల్లోకములను సాధించెను. ఖట్వాంగునకు దీర్ఘబాహుడు, దీర్ఘబాహునకు రఘువు రఘు వున కజుడు, అజునకు దశరథుడు దశరథునకు ధర్మాత్ముడగు శ్రీరాముడు జనించెను. ఈశ్రీరామ చరిత్ర సకలపురాణములయందు విస్తరించియుం

డెను. ఇతడు విష్ణ్వంశ సంభూతుడు, ఇతనిచే రావణాదులుమడిసిరి. ఇతని చరిత్రమంతయు రామాయణమునందున్నదిగాన విస్తరించి చెప్పుటలేదు. రామునకు కుశుడు కుశున కతిధి. అతిధికి నిషధుడు, నిషధునకు నలుడు నలునకు నభుడు, నభునకు పుండరీకుడు, పుండరీకునకు క్షేమధన్వుడు, ఇతనికి దేవానీకుడు, దేవానీకున కహీనగుడు, అహీనగునకు, సహాస్వుడు, సహాస్వునకు వీరసేనుడును జనించిరి. వీరందరు ఇక్ష్వాకువంశజనితులు ఇంకను వీరసేనునకు పారియాత్రుడు, పారియాత్రునకు బలుడు బలునకు స్థలుడు స్థలునకు ప్రతాపవంతుడు, సూర్యాంశజుడునగు యక్షుడను పుత్రుడుకలడు. ఇతని కగుణుడు అగుణునకు విధృతి, విధృతికి హిరణ్యానాభుడు, హిరణ్యనాభునకు యోగాచార్యుడు జనించిరి. ఈయోగాచార్యుడు జైమినిమునికి శిష్యుడై యుండెను. ఇతడాత్మ విద్యాప్రవీణుడు ఈయోగాచార్యుడు, యాజ్ఞవల్కుడు నధ్యాత్మ సంజ్ఞకమగు యోగవిద్య నెరింగియుండిరి. వీరివలన హృదయగ్రంధ భేదక మగు నాత్మ విద్య ననేకులెరింగిరి. యోగచార్యునకు పుష్యుడనెడి పుత్రుడుగలడు, పుష్యునకు ధృవుడు, ధృవునకగ్నివర్ణుడు అగ్నివర్ణునకు శీఘ్రుడు శీఘ్రునకు మరుత్తు మరుత్తునకు యోగసిద్ధుడు నేటికిని కలాపగ్రామమునందుండెను. ఇతడు కలియుగాంతము వరకు నుండును, ఇతనితరువాత సూర్యవంశము ముందుముందు సూర్యవంశము మొక్కువుగ నభివృద్ధిగాలేదు. ఈయోగసిద్ధునకు పృధుశ్రుతుడు పృధుశ్రుతునకు సంధి సంధికి అమర్షణుడు, అమర్షునకు మరుత్వంతుడు, ఇతనికి తక్షకుడు, తక్షకునకు బృహద్బలుడు జనించి యింతవరకు ప్రజాపాలనము గావించిరి.

ఇటుపై నుద్భవించెడి రాజులను చెప్పెదవినుము. బృహద్బలునికి బృహాద్రణుడు, బృహాద్రణున కురుక్రియుడు, ఉరుక్రియునకు వత్సవృద్ధుడు నితనికి ప్రతివ్యోముడు. ప్రతివ్యోమునకు భాను భానునకు ప్రతీకాశ్యుడు ఇతనికి రాజర్షియైన సుప్రతీకుడు ఇతనికి మరుదేవుడు, వానికి సునక్షత్రుడు, వానికి పుష్కరుడు, పుష్కరున కంతరిక్షుడు, వానికి సుతపుడు, సుతపునకు వీరుడు, వీరునకు మిత్రజిత్తు, ఇతనికి బృహాద్భాజుడు

ఇతనికి బర్హి, బర్హికి, కృతంజయుడు నితనికి రణంజయుడు, ఇతనికి మయుడు మయునకు శాక్యుడు, శాక్యునకు శుద్ధోదనుడు ఇతనికి లాంగలుడు ఇతనికి ప్రసేనజిత్తు, ఇతనికి శూద్రకుడు ఇతనికిరుణకుడు, వీనికి సురథుడు, వానికి సుమిత్రుడు ననువారలు ముస్ముందు జనింపగలరు. ఇక్ష్వాకుతో వీరివంశము సమాప్తమాయెను. మనువంశసంజాతులగు సూర్యవంశపురాజుల నందరిని జెప్పియుంటిని. ఇక్ష్వాకువంశీయులందరు ప్రధానపురుషులు సూర్యవంశావళి విన్నచో. ప్రజలకు పుష్టియు. తుష్టియు, కీర్తియు సంతతి యిహమందు సకల భోగంబులు పరమందు శివసాయుజ్యము కల్గును

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
ముప్పది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## నలువదవ యధ్యాయము

### పితృదేవతలవృత్తాంతము

శ్రాద్ధదేవుడు సూర్యవంశమందెట్లుజన్మించెనో తెల్పి సందేహము బాపుమని శౌనకాదులుప్రశ్నింప సూతుండిట్లు చెప్పదొడంగెను. ఓ ఋషులారా! మీరడిగినట్లుగ పితృదేవతలనుగురించి భీష్ముడు మార్కండేయు నడుగ, నతడిట్లుచెప్ప దొడంగెను, ఈప్రశ్నలు సర్వకామఫల ప్రదంబులైనవి, ఈప్రశ్నలేధర్మరాజు భీష్ముని శరతల్పమునందుండ నిట్లుప్రశ్నించెను. తాతా! ఏకార్యముచే మనుజులకు పుష్టికల్గునో వివరముగ జెప్పుమన, నతడిట్లు జెప్పదొడంగెను. నరులు ఫలకాములై పితృదేవతల నారాధించి నచో వారిప్రసాదంబుచే సర్వకామంబులనొందెదరు, పితృపితామహ, ప్రపితామహులకు (తండ్రి, తాత, ముత్తాతలకు) నెవరు పిండప్రదానము చేయుదురో వారుపితృదేవతల ప్రసాదముచే సంతానము బడయుదురు. ఇంకను వీరుసకలలోకోద్రేకుల దీర్చుచుందురన, యుధిష్ఠిరుడు తాతా! కొందరు పితరులు స్వర్గమందున, మరికొందరు నరకమందున యుందురుగదా!

నరకమందున్న పితరులకు పిండములెట్లుచేరును? నరకవాసులగు పితరులేమి ఫలంబులివ్వగలరు? వారుఫలంబులిచ్చుటకు సమర్థులెట్లగుదురు, స్వర్గవాసులగుపితరులు, దేవతలచే పూజింపబడుదురని వినియుంటిని, ఇదంతయు వినిపించి నా సందేహము బాపుమన, భీష్ముడిట్లు చెప్పదొడంగెను. ధర్మరాజా! నీవునన్నడిగినప్రశ్నలు లోకాంతరగతుడగు మాతండ్రి చెప్పియుండెను. నేనొకనాడు నాతండ్రి శ్రాద్ధము చేయుచుండ, పిండము తనహస్తమందుంచమని చేయిజాప, నేను కొంతతడవాలోచించి యిదివిరుద్ధమని తలచి పిండమును తినహస్తమందిడక భువిపై కుశలుబరచి యందుంచితిని, నేనుచేసినపనికతడు సంతసించి మధురవాక్కులతో ఓభారతశ్రేష్ఠుడా! ఓయనఘా! నేనుసంతుష్టుడనైతిని, నీవుధర్మాత్ముడవు, శాస్త్రప్రమాణమైన ధర్మమాచరించితివి గాన, నేనుతరించితిని. నీవాచరించినట్లుగ ప్రజలుకూడనాచరింతురు, నీవు వేదధర్మముల నెరింగినవాడవుగాన, నిట్లు చేసితిని, నీకొకయుత్తమంబైన వరమిచ్చెదను వినుము, నీవుకోరినప్పుడు నీకుమృత్యువులభించును, ఇంకను నేదైన కోరుకొనుమన, తండ్రీ. నేనుకృతకృత్యుడనైతిని నవునాయందు ప్రసన్నుడవైనచో పితృకల్పమును గూర్చి నీవుస్వయముగ నాకుజెప్పుమన, శంతనుడిట్లు బల్కెను. ఓభీష్మా! నీకుమార్కండేయుడు స్వయముగ జెప్పగలడు నీవతనిచే వినుమన, నే నతనిని ప్రార్థింప నతడిట్లు చెప్పదొడంగెను.

ఓ రాజా! నేనొకదినంబున నాకసమువైపు జూచుచుండ, నేనుండు పర్వతముపైనుండ యొకవిమానముపచ్చుట గాంచితిని. ఆవిమానమందు జ్వలితాంగారవర్చస్కుడు ప్రజ్వలితమహాతేజస్కుడు, నిర్విశేషుడు, మనోహరుడు, నంగుష్ఠమాత్రశరీరుడై శయనించియున్న మహాపురుషునిగాంచి శిరమువంచి నమస్కరించి ఓప్రభూ! నిన్ను నేనెట్లు తెలిసికొందును, నేనేమియు తపంబుచేయలేదు, నీవెవరవో తెల్పుమన, నతడిట్లుబల్కెను, నేనుబ్రహ్మపుత్రుడను, నా పేరుసనత్కుమారుడు, నాతోనీకేమిపని! నేనుబ్రహ్మపుత్రుల నల్వురిలోనాఖరువాడను, సనక, సనందన, సనత్సుజాత, సనత్కుమారుల నెడు మేమునల్గురన్నదమ్ములము, ఇంకను మేముగాక మాభ్రాతలగు సప్తమహర్షులుగలరు, వారిచే వంశవృద్ధిజరిగియుండెను, మేమునల్గురము సంయములమై

యశ్వరులమై, ఆత్మ నాత్మ యందుంచి, పరమేశ్వరధ్యాన మగ్నులమై యుందుము, మేము జన్మించినపుడెట్లు టిమో, యిప్పటికి నట్లేయుంటిమి, నన్ను గూర్చి ధ్యానించితివిగాన, నీకుదర్శనమిచ్చితిని. నీకోరిక తెల్పుమన, మహానుభావా? నాపూర్వజన్మ సుకృతముచే నేనుతలచినంత నేదర్శనమిచ్చితివి, పితృకల్పమంతయు దెల్పినామనోరథ మీడేర్పుమన సనత్కుమారుడిట్లు చెప్పదొడంగెను. బ్రహ్మముందుగా దేవతలను సృజించి తన్ను గూర్చి తపంబుచేయుమని యాదేశింప వారుబ్రహ్మను యజించుటమాని ఫలార్థులై యాత్మయజ్ఞముచేయ మొదలిడిరి, దీనిచే బ్రహ్మకోపగించి మీజ్ఞానమంతయు నశించుగాకయని శపింప, పితామహునిశాపముచే వారందరు నష్టసంజ్ఞులై, మమ్మనుగ్రహింపుమని మరల బ్రహ్మనుప్రార్థింప వారిప్రాయశ్చిత్తమునకై నామానసపుత్రులగు సనకాదులను సేవించినచో మీకుజ్ఞానప్రాప్తికల్గును, వారుమిమ్మనుగ్రహింపగలరు, ఇదియేమీకుప్రాయశ్చిత్తము, వారిని సేవింపనిచో మీకుజ్ఞానముకలుగదన, వారలందులకంగీకరించి మాకడకేతెంచి నతమస్తకులై, యథార్థము బలుక, మేము వారినుడువులువిని, పుత్రులారా! మీరు బ్రహ్మనుతిరస్కరించుట, పొరబాటు. త్రికరణశుద్ధిగ మరల బ్రహ్మనుపాశించుటయే దీనికి ప్రాయశ్చిత్తము, ఇదిమీకర్తవ్యము, మీరుసర్వజ్ఞులు, మీకు తెలియని దేదియులేదని బ్రహ్మతత్త్వముపదేశించి ఓపుత్రులారా! మీరు మీతండ్రికడకేగుడు, అతడేబోధింపగలడు పశ్చాత్తాపమునకు మించినప్రాయశ్చిత్తములేదని మేముబలుక, వారుపుత్రులారా! యనిమేముపిలిచిన సంబోధనమునందర్థముగ్రహింపనేరక, సంశయాత్ములై, మరలబ్రహ్మకడకేగి, కుమారులు బోధించినదంతయు విన్నవింప బ్రహ్మయిట్లనెను. ఓపుత్రులారా! మీరజ్ఞానులుగాన బాలులారా! పుత్రకులారా! యనివారు మిమ్ములసంబోధించిరి జ్ఞానదాతలు పితరులని చెప్పబడిరి, గాన సనత్కుమారులు మీకుపితరులు, మీరుకూడ సృష్టిచేయుటకధికారులు, జ్ఞానప్రదాతలునై యుందురు, మీరుప్రజలకు పితృదేవత లగుదురు. సంపూర్ణకాములగుటకై, కశ్యపపుత్రులగు దేవతలుకూడ మిమ్ముపూజింతురన, బ్రహ్మవాక్కులువిని వారుసంతుష్టాత్ములై బ్రహ్మనందభరితులై, సర్వులకు పూజ్యులై యుండిరి, పితృశ్రాద్ధముచే చంద్రుడు సంతసించి లోకమునకుతృప్తిగల్గించుచుండును. పితృశ్రాద్ధముచే సకలసాగర

వనపర్వతములతో గూడిన స్థావరజంగములన్నియుతృప్తినొంది, తృప్తినొందును గానపితృదేవతలను సర్వదాతృప్తినొందింపవలెను, మాతాపితా, తండ్రి, తాత, ముత్తాతలకు, వారివారి నామగోత్రములతో మూడుపిండములు వేసినచో వారుసంతృప్తులై శ్రాద్ధకర్తకు సర్వకోర్కెలుతీర్చెదరు. ఈకారణముచే వారుమాకు పుత్రులైరి, అందరికి వారు పితృదేవతలైరి. ఎవరితండ్రి, తాత, ముత్తాతలకు పిండప్రదానముచేసినను, సర్వపితరులు నెక్కడయున్నను సంతసింతురుగాన పితృశ్రాద్ధముతప్పక చేయవలెను.

1 దేవలోకస్థితజీవస్య ఫలప్రాప్త్యర్థం అగ్నికరణం

2 స్వర్గస్థస్యనిమంత్రితబ్రాహ్మణభోజనం

3 యమలోకస్థితస్య పిండప్రదానం

4 నరకపతితస్య వికిరం

5 మనుష్యలోకప్రవిష్టస్య భోక్తృదక్షిణదానం

6 అసురలోకప్రాప్తస్య భూరిభోజనం

అనగా పితరులు దేవలోకమందున్నచో అగ్నికరణము చేసినచో వారికిముట్టును.

పితరులు యమలోకమందున్నచో పిండప్రదానముచేసినచో వారికి చేరును.

వారు నరకమందున్నచో వికిరాన్నముపెట్టినచో ముట్టును,

వారు మనుజలోకమందున్నచో భూరిదక్షిణలిచ్చినచో వారుసంతసించెదరు. అసురలోకమందున్నచో బహుమందికి భోజనమిడినచో వారికి ముట్టునుగాన, పితరులు యేలోకమందుండిరో మనకు తెలియదుగాన యథావిధిగపిండప్రదాన పూర్వకముగ శ్రాద్ధముచేసినచో పితరులెక్కడ నున్నను ముట్టును, పితరులెక్కడనున్నను వరంబులీయ సమర్థులు.

శివ మహాపురాణమునందలి ఉమాసంహితయందు

నలువదవ అధ్యాయము సంపూర్ణము

---

# నలుబది యొకటవ యధ్యాయము:

## సప్తవ్యాధుల చరిత్రలు

మరల సనత్కుమారు డిట్లు చెప్పదొడంగెను. స్వర్గమం దు పితృ దేవతాగణంబులు సప్త విధంబులుగ నుండిరి. వారిలో నాల్గుగణంబులు మూర్తివంతములుగను, మూడు గణంబు లమూర్తివంతములుగ నుండిరి. ఈనాల్గు గణంబుల వారిని, బ్రహ్మ క్షత్రియ వైశ్యులు సేవించుచుందురు. ఈ పితరులు యోగబలముచే సోముని తృప్తిబరచిరి. పితరులకు శ్రాద్ధ సమయంబున రజత పాత్రలు వాడుచు, రజత పళ్లెరమందు పాదప్రక్షాళనము గావించుట యుత్తమంబు. స్వధాకారములతో పితృదేవతల నర్చింపవలెను. పితృదేవతలను యథావిధిగ నర్చించినచో పుష్టిని సంతతి నిచ్చెదరు. అగ్నిహోత్రము నందు సోమునకు, యమధర్మరాజునకు హోమము చేయవలెను. అగ్ని లేనిచో జలమందైనను పడవేయవలెను. పితరుల నారాధించినచో విపులసంతానము పుష్టి, స్వర్గము, నారోగ్యము సకలేప్సితంబులు చేకూరును.

శ్లో॥ యచ్ఛంతిపితరః పుష్టిం
ప్రజాశ్చ విపులా స్తథా
స్వర్గ మారోగ్య వృద్ధించ
యదన్యదపి చేప్సితం.

శ్లో! దేవకార్యాదపి మునే
పితృకార్యం విశిష్యతే
పితృభక్తోసి విప్రస్త్వే
తేనత్వ మజరామరః.

శ్లో॥ నయోగేన గతిస్సాతు
పితృ భక్త స్యయా మునే
పితృభక్తి ర్విశేషణ
తస్మాత్కార్యా మహామునే.

పితృదేవతలు, పుష్టి, విపులసంతానము, స్వర్గము, నారోగ్యము, సకలేప్సితంబులు చేకూర్తురు.

దేవకార్యముకన్న పితృకార్యము విశేషమైనది. పితృభక్తిచే నజరామరు లగుదురు.

ఎంత యోగవంతునకైనను పితృదేవతలను సేవించిన ఫలమురాదు. దీనిచే సర్వకార్యములు సాధింపవచ్చును.

అని ఇట్లు సనత్కుమారుడు విజ్ఞాన ముపదేశించి యోగగతిని తెల్పి దివ్యచక్షువుల నిచ్చియుండెను. ఓ ధర్మరాజా ఈవిధంబున మార్కండేయుడు సనత్కుమారునిచే విన్నదంతయు నాతో జెప్పియుండెను.

పూర్వము భారద్వాజ కులోద్భవులగు ద్విజులుండిరి. వారుదుర్వ్రవర్తనులగుటచే యోగభ్రష్టులైరి. వాగ్దుష్టుడు క్రోధుడు, హింసకుడు, పిశునుడు కవి స్వసృపుడు పితృవర్తి యనెడు నామంబులతో నేడ్వురన్నదమ్ములై యుండిరి. వీరు కౌశికపుత్రులై గార్గ్యుని శిష్యులై యుండిరి. వారుతండ్రి మరణించిన తరి స్వగ్రామమును వీడి గురువులగోవును మేపుటకై గొంపోయి క్షుద్బాధచే మార్గమధ్యంబున వారి మనసులుమారి క్రూరబుద్ధిచే గోహింస చేయదలచి యుండ వీరిలో కవి స్వసృపుడు ననువారలు యిది యుచితముగాదు. గోహింస చేయరాదని వారలను బ్రతిమాలుకొనిరి. కాని వారెంత జెప్పినను వినకుండుటచే చేయునది లేక మనము యీగోమాంసముచే పితృశ్రాద్ధము చేసినయెడల శేషము భుజింపవలెనని పితృవర్తిబలుక వారందరు నేకీభవించి గోవును సంహరించి యామాంసముచే పితృశ్రాద్ధము చేసి భుజించిరి. వీ రధర్మముచేతనైనను పితృశ్రాద్ధముగావించి గురువుదరికేగి ఓగురువరా శార్దూలమువచ్చి మీధేనువును సంహరించెను. మేమతిప్రయత్నముచే వత్సమునుమాత్రము తెచ్చితిమనిరి. గోహత్యచేయుటయేగాక గురువునొద్ద మిథ్యాపవాదంబులు కూడ బల్కిరి. ఈ సప్తద్విజులు కొంతకాలమునకు మరణించి, ఘోరహింసకుడగు వ్యాధపుత్రులై బలవంతులై, బుద్ధిమంతులై, ధర్మవిచక్షణులై, దశార్ణవదేశమందు జనించి స్వధర్మనిరతులై, వేటయందు విరక్తిగల్గి యుద్వేగసంవిగ్నులై, కాలాంజన

గిరియందు సంచరింపుచు పూర్వజన్మయందు పితృశ్రాద్ధముచేయుటచే, పూర్వ జ్ఞానముగల్గి, శాంతులై, నిర్ద్వంద్వులై, నిష్పరిగ్రహులై, వనచరులై, సధర్ములై శుభకర్మలాచరింపుచు, తమవృత్తిధర్మమును వీడి, పూర్వము గురువువద్ద విన్న ధర్మంబులాచరింపుచు, జన్మలేని విధి యెట్లనియోచింపుచు, జితేంద్రియులై లబ్ధాహారులై జీవించుచు, నాపర్వత గుహాలయందే ప్రాణములు విడిచిరి. ఆకా లాంజనగిరియందు వారు సంచరించిన చిహ్నము లిప్పటికిని గలవు. ఈవిధం బుగ జీవులు శుభాశుభకర్మ లనుభవించుచుండవలెను. తదుపరి వీరు శుభా శుభకర్మలతో గూడిన చక్రవాకములై శరద్వీపమున జనించిరి. వీరు మిధున ధర్మంబు వీడి ధర్మపరులై మునులై, నిస్సంగులై, నిర్మలులై, శాంతులై, నిర్ద్వంద్వులై, నిష్పరిగ్రహులై, నివృత్తిమార్గులై, చక్రవాకములై, బ్రహ్మ చారులై, ధర్మచారులై, జాతిస్మరులై, స్వధర్మప్రవర్తకులై, ఏకత్రనివాసులై వికార రహితులై యుండి విప్రయోని జనితులమై యుండికూడ గురువుని వం చించితిమని తలపోయుచు దుఃఖించుచుండిరి. వీరు తిర్యగ్యోనిజనితులైనను, పూర్వమున పితృశ్రాద్ధముచేయుటచే పూర్వ జ్ఞానము గల్గి ఒక జన్మకన్న మఱియొక జన్మయందు విశేషజ్ఞానవంతులై, యధర్మము లాచరింపక యోగ్య మగు జన్మలనొందుచుండిరి. పూర్వమందు గురుకులమునందు సంపాదించిన బ్రహ్మజ్ఞానము మాత్రము విడువక స్థిరచిత్తులై, ఈజ్ఞానమునే తలపోయుచు వృద్ధిగొందించుకొనుచు, సునాశ్వుడు, సువాక్సృష్టుడు, పంచముడు, ఛిద్రదర్శుడు, స్వతంత్రుడు సుయజ్ఞుడు, కులీనుడునను నామంబులతో నొప్పుచు విహంగములై స్వధర్మముగ సంచరింపుచుండ నొకదినంబున సర్వ శోభాయుక్తుడు ప్రభాసంపన్నుడు నీప దేశాధిపతియునగు నొక రాజు యంతఃపు రమును వీడి, స్త్రీపరివారయుతముగ వనమునకేతెంచ, స్వతంత్రయనెడు చక్ర వాకము రాజుంగాంచి తాను కూడ పరిపాలకుడు రాజు కావలయునని యూహించుచు పరమ సుఖదాయకుడగు రాజునుగాంచి నే నేమాత్రపు దపంబుచేసిన వాడనైతినేని నాయుపవాస తపోనియంబులు ఫలించెనేని సర్వ సౌభాగ్యములతో గూడిన ఇట్టి రాజును కావలయునని కోర మరి రెండు చక్రవాకములు దీని యభిప్రాయము తెలిసికొని నీవు రాజువైనచో నీకు సహచరులుగా నుందుమని వారుకోరిరి. మిగతా చక్రవాక చతుష్టయము నీకు

సచివులమై ప్రియహితైషిణులమై యోగాత్మగతులమై యుందుమనియు మన మందరము కాంపిల్య నగరవాసులమై యుండవలయునని కోరిరి. వీరందరు నిట్లు తలచి స్వతంత్రుని చక్రవాకమును రాజుగా జేయనిశ్చయించుకొని ఓస్వతంత్రా ! మనము పూర్వము పితృశ్రాద్ధము చేయుటచే పూర్వజన్మ జ్ఞానము కల్గియుంటిమి గాన మనకు యెట్టి జన్మలు లభించినను ధర్మమువీడక యోగమును మానక చివరకు ముక్తి నొందవలెను. గాన మనమందరము కలసి యొక శ్లోకము లిఖించి కొనియుంచి దానిని విన్నంతనే పూర్వజ్ఞానము కలవారలమై దేహములను వీడి మోక్షము నొందవలెను. అన్ని జన్మలలో మానవజన్మ శ్రేష్ఠము. మానవజన్మలో రాజై, సర్వస్వతంత్రుడై సర్వధర్మములు నెరవేర్చుకొని యనాయాసముగ మోక్షము నొందవచ్చునని వారందరు నిశ్చయించుకొనిరి. ఓశంతనపుత్రా ! యిటుపై నీవేదివినదలచివో చెప్పుమని మార్కండేయుడు నన్నడిగెను.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
నలువది యొకటవ అధ్యాయము సంపూర్ణము

---

## నలుబదిరెండవ యధ్యాయము

### కౌశికపుత్రులజన్మ పరంపరలు-ముక్తి

మార్కండేయుని గాంచి భీష్ముడిట్లు ప్రశ్నించెను. ఈ చక్రవాకము లేమైనవి. వారు జన్మపరంపర లెట్లు తెలిసికొనిరో తెల్పుమన మార్కండేయుడిట్లు చెప్పదొడంగెను. ఈ చక్రవాకములు ధర్మయోగ నిరతములై మానస సరోవరంబున సంచరింపుచు, వాయుజలంబుల భక్షింపుచు. శరీరములను శోషింపజేసికొనుచుండిరి. ఈ వనంబున కేతెంచిన నీపాధిపతి దేవేంద్రుడు. నందనవనమందు విహరించినట్లు విహరింపుచు కొన్ని దినములటనుండి పరివారయుతముగ పురమునకేగెను. ఈ రాజునకు పరమ ధార్మికుడగు అనుహుడను పుత్రుడుగలడు ఇతనితండ్రి విభ్రాజుడు. నీపాధిపతి యగు విభ్రాజుడు తన కుమారుడగు నను

హానునకు యువరాజపట్టాభిషేకముజేసి తాను తపంబునకై వనంబున కేగెను. విభ్రాజుడు తపంబుచేసిన వనమునకు వైభ్రాజ వనమనిపేరుగల్గెను. ఈ యేడ్వురు పక్షులలోను నల్వురు యోగోత్తీర్ణులైరి. ముప్వురు యోగభ్రష్టులైరి మొత్తము వీరందరు శరీరములు చాలించి విగత కల్మషులై కాంపిల్యనగరమున జనించిరి. వారిలో యోగోత్తీర్ణులైన నలువురు పూర్వజ్ఞానము కల్గియుండిరి. మిగిలిన ముప్వురు రాజ్య మోహమునందు బడియుండిరి. వీరిలో స్వతంత్రుడనెడి చక్ర వాకము. విభ్రాజునకు పౌత్రుడై అనుహానకు పుత్రుడై జన్మించి బ్రహ్మదత్తు డను నామముతో రాజ్యము చేయుచుండెను. ఛిద్రదర్శి సునేత్రుడు నను వారలు రాజుకడ సచివులై యుండిరి. పాంచాల, బహురుచి, ద్వివేదుడు పుండరీకుడు నను వారలు బ్రాహ్మణులై జనించి వేదమునభ్యసించి పూర్వస్మృతి గలవారై రాజునకు పురోహితులై రాజుచే యజ్ఞయాగాది కర్మలు చేయించుచుండిరి. అనుహుడు బ్రహ్మదత్తుని రాజ్యాభిషిక్తునిజేసి తపంబున కేగ బ్రహ్మదత్తుడు రాజ్యము చేయుచుండెను. బ్రహ్మదత్తుని భార్యయగు సన్నతి భర్త కనుకూల ముగనుండెడిది. వారిలో శ్రోత్రియ కులమందుద్భవించిన నలుగురు దరిద్రులై యుండిరి. కాని వీరు తత్వదర్శులై ధైర్యవంతులై మహాత్ములై విరాగులై వేదాధ్యయనము గలవారై యోగనిరతులై శంభుపదాంబుజముల స్మరింపుచు తపంబునకై యరణ్యమునకుబోవ నుద్యుక్తులై యుండ తండ్రి వారినిగాంచి కుమారులారా! దరిద్రుడను వృద్ధుడను నగు నన్నువీడి మీ రెట్లుపోవుదురు. ఈ పరిస్థితిలో నన్ను పోషించి కాపాడువారెవరు? ముప్పు గనుపుదురనియేకదా మనుజులు పుత్రులకై పరితపింతురు. మీరుండియు నన్ను దుఃఖపెట్టెదరా యని వారల వారింప వారొక తాళపత్రముపై నొక శ్లోకమువ్రాసి ఈ పత్రము రాజునకొసంగినచో నతడు నిన్ను సత్కరింపగలడు. అధనముతో నీవు సుఖజీ వనము చేయవచ్చునని పలికి తండ్రికి నచ్చజెప్పి వారడవుల కేగి తపస్సుచేసి మోక్షమునొందిరి.

శ్లో॥ సప్తవ్యాధా దశార్ణేషు.
మృగాః కాలాంజనేగిరౌ
చక్రవాకాః శరద్వీపే
హంసాః సరసి మానసే.

శ్లో॥ తేభిజాతాః కురుక్షేత్రే
బ్రాహ్మణాః వేదపారగాః
ప్రస్థితా దీర్ఘమధ్వానం
యూయం కి మవసీదథ

వారు వ్రాసిన శ్లోకములివి వీటియర్థమేమన మనము పూర్వము కురుక్షేత్రమున బ్రాహ్మణులమై జనించి వేదపారగులమైతిమి. తదుపరి దశార్ణవ దేశమందు సప్తవ్యాధులమై జనించితిమి. తదుపరి కాలాంజనగిరియందు మృగములమై జనించితిమి. తదుపరి శరద్వీపమునందు చక్రవాకములై జనించితిమి. తదుపరి మానససరోవరమందు హంసలమై సంచరించితిమి. మేము, మోక్షము నకై పోవుచుంటిమి. మీరేమిచేయవలయునో యూహించుకొనుడు. అని ఈశ్లో కార్థము. తండ్రి ఈశ్లోకమును గొంపోయి మంత్రులకు జూపింప. వారు నిశ్చే ష్టులై రాజునకు జూపింప సతిడు కూడ నిశ్చేష్టుడై పూర్వస్మృతిగల్గి ఆవిప్రునకు విపులధనంబులు క్షేత్రంబులు భవనంబులు నొసంగి బ్రాహ్మణుల కనేక దానంబులిచ్చి తన పుత్రుడైన విష్వక్సేనుని రాజ్యాభిషిక్తునిజేసి తాను భార్యతోడను సచివులతోను గలసి వనమునకేగి తపంబుచేసి యోగమభ్యసించి ముక్తినొందెను వారిలో పాంచాలుడను మంత్రి పాంచాలసంహితను రచించెను. వీరందరు యోగము నభ్యసించి శివస్మరణ చేయుచు ముక్తినొందిరి. వీరి కథ యంతయు హరివంశమునందు విపులముగ వ్రాయబడెను. ఈ అధ్యాయ శ్రవణ పఠనాదుల మనోవాక్కాయకర్మలతో జేసిన పాపములు నశించును. శ్రద్ధాభ క్తులతో నీ యధ్యాయమును పఠించిన వారలు సర్వపాప విముక్తులై సర్వకా మ్యము లొందగలరు జలము తగులగనే పచ్చికుండ విడిపోయినట్లు శివస్మరణచే సర్వపాపములు నశించును.

శివమహాపురాణము నందలి ఉమాసంహితయందు
నలువది రెండవ అధ్యాయము సంపూర్ణము.

---

## నలువది మూడవ యధ్యాయము

### వ్యాసపూజావిధి

గ్రంథశ్రవణానంతరము గురువైన వ్యాసాచార్యు నెట్లుపూజింపవలెనో చెప్పుమని శౌనకుడడుగ సూతుడిట్లు చెప్పదొడంగెను. గ్రంథశ్రవణానంతరము ఆచార్యుని యథావిధిగ పూజించి వ్యాసునిగా భావించి పూజింపవలెను. ఆచార్యుని సత్కరించి వస్త్రభూషణంబులచే నలంకరింప వలయును. తదుపరి శివపూజగావించి వత్సతోగూడిన ధేనువును దాన మీయవలెను, తదుపరి ఆసనముపై పలమెత్తు బంగార మిడి, దానిపై శివపురాణపుస్తకమిడి, పుస్తకపూజగావించి, వాటిని పురాణవక్తకిచ్చినచో భవబంధవిముక్తుడగును.

ఇంకను సమర్థులైనచో, గ్రామంబులు, హయగజంబులు, సర్వవస్తువులు శక్త్యనుసారముగ వాచకున కీయవలెను, పురాణము వినిపించి జ్ఞానవంతునిగ జేయుచున్నాడుగాన, వక్తకు దానమిచ్చినచో సర్వకోరిక లీడేరును. ఇది ముమ్మాటికి సత్యము, ఈపురాణము విధి పూర్వకముగవిన్నచో సకల కోర్కెలీడేరును. ఈపురాణమంతయు వేదార్థబృంహితమై యుండెను. ఇదిపుణ్యము నిచ్చునని శ్రుతులు చెప్పియుండెను.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
నలుబదిమూడవఅధ్యాయము సంపూర్ణము

---

## నలువది నాలుగవ యధ్యాయము

### వ్యాసోత్పత్తి

ఓసూత మహర్షి! మాకు వ్యాసోత్పత్తిని జెప్పి మమ్ముల కృతార్థుల జేయుము. వ్యాసుడు సత్యవతీ పరాశరులకు జన్మించె నని వినియుంటిమి. సత్యవతి శంతనుని వివాహ మాడి మహారాణి యయ్యెనని వినియుంటిమి ఇదంతయు

నాశ్చర్యముగనున్నది. గాన విస్తరించి జెప్పి మాసందేహములు దీర్పుమని మహర్షులు ప్రశ్నింప సూతుడిట్లు జెప్పదొడంగెను. ఒకానొకప్పుడు యోగి యగు పరాశరుడు తీర్థయాత్రలు జేయుచు యమునా తటంబున స్వేచ్ఛగా విహరింపుచు నాసమీపమున భుజింపుచున్న నావికుడగు నిషాదుని గాంచి ఓరీ నిషాదుడా నన్ను త్వరితముగ నీయమునా నదిని దాటింపుమన నతడు తన పుత్రికయగు మత్స్యగంధిని బిలచి తల్లీ! నీవుత్వరితముగ నీ మహర్షిని దాటింపుము, నేను భుజించుచుంటినన, నామె సూర్యతేజస్కుడగు నామహర్షిని నావపై నాసీనుంజేసి నావ నడుపుచుండ కాలయోగముచే నామహాముని కామాతురుడై యొకప్పుడు కూడ అప్సరసలను గాంచి యైనను మోహము నొందని మహర్షి మనోహారిణి యగు నా దాశకన్యకను గాంచి మోహితుడై నామె దక్షిణ కరము గ్రహింప నావిశాలాక్షి మందహాసము జేయుచు ఓమహర్షీ! మీచేష్టలు విపరీతములుగ నున్న వేమి? సత్పురుషు లిట్టి నిందితకర్మలు చేయదగునా; ఓబుద్ధిమంతుడా; నీవు వశిష్ఠ కులోద్భవుడవైన బ్రాహ్మణుడవు నేనా నిషాదకుల సంజాతను మన యిరువురకు పొత్తు ఎట్లుపొసగును? మానవ జన్మ కడు విశేషము. అందులో తపోవంతుడగుట మహాదుర్లభము మరియు విద్యాకులశీలంబు లుండుట కడుదుర్లభము. నీవివన్నియు కూడి యున్న మహర్షివి. సుందరాంగుడవు. అట్టి నీవు కామ బాణప్రపీడితుడవగుట నాకాశ్చర్యముగ నున్నది. మహాత్ములు దుష్కర్మలు చేయుచున్నను అడ్డుకొనుటకు సమర్థు లెవరుందురు? వారిమాట కాదన్నచో శపింతురని భయము కదా? యని పలుకుచు ఇపుడేమి చేయుదునని లోలోన దలచుచు ఓస్వామీ తమరీ నదిని దాటువరకు ధైర్యమువలంబంపుడన యోగిరాజగు పరాశరుడు దాశ కన్య కరము వీడి స్వస్థ చిత్తుడై కూర్చుండెను తదుపరి తీరము జేరిన తరి యోగి పుంగవుడు కామప్రపీడితుడై నామె కరముడు మరల గ్రహింప నామె కంపింపుచు, నోమహర్షీ! నేను దుర్గంధ భూయిష్ఠను కృష్ణ వర్ణు రాలను నిషాద సంజాతను, ఓయోగి సత్తమా! మీరున్నత కుటుంబులు గాన, నాలోచింపుడు. గాజు, కాంచనము సంఘటన మగునట్లు మన మిరువుర మొకచోట తటస్థ పడితిమి మన మిరువురము సమానకులస్థులమైనచో బాగుండును ఇపుడు వ్యత్యాసము నున్న దన నామెపల్కులు విన్నంతనే నీప్రభాశాలి మందహాసము జేయుచు

మత్స్యగంధిని యోజన గంధిగను మనోహరరూప లావణ్యవతిగను జేసి, కామ పీడితుడై యాబాలిక చేయిబట్ట నామె మునీశ్వరా! దివాసంగమము కూడ దని శ్రుతులు జెప్పి యుండెనుగదా రాత్రికాకుండ మీకోర్కె యెట్లు తీరును దివాసంగమముచే మహాపాపము, దుర్భర నిందయు సంభవించును గాన రాత్రి వచ్చు నంత దనుక నిట నిరీక్షింపుచుండుము. అదియుంగాక పగటి సమయ మగుటచే నందరు గాంచుచుందురు అవ్వలి యొడ్డున నాతండ్రి నాకై నిరీక్షించుచుండు నన నామె వాక్కులు విని నామౌని తన తపోబలముచే నీహారము గావించి (మంచుపొగ) యుండ రాత్రివంటి పొగమంచు నామెగాంచి నాశ్చర్య భయకంపితయై ఓయోగీశ్వరా! నీవమోఘ వీర్యుడవు. నీవునాతో రమింప నేగర్భవతినైనచో నాపని యేమికా వలయును, పిమ్మట నీదారిని నీవేగెదవు, నాకన్యాత్వము చెడి పోవును గదా? లోకులు నన్ను గాంచి పరిహాసింతురు, నాతండ్రికే సమాధానము, చెప్పెదనన నామెపల్కులు విని,ఓ ప్రియా! నీకేమియు భయములేదు.నీవు స్వేచ్ఛగా నాతోరమింపుము, నీకోర్కెను పూర్తిచేసెదను. నాయాజ్ఞను సత్యముగ పాలించితివి గాన నేటినుండి నీపేరు సత్యవతి యనిప్రసిద్ధికెందును. యోగులు దేవతలుగూడ నిన్ను పూజింతు రన నోస్వామి! నాతలితండ్రులకు గాని తదితరులకుగాని యీసంగతి తెలియరాదు నాకన్యాత్వమునకు భంగము కలుగరాదు. నీతోతుల్యుడు, నద్భుత శక్తివంతుడు నగు తనయుని నాకు ప్రసాదింపవలెను. నేను సదాతరుణు రాలనై నవయౌవనవతినై సర్వాంగ సౌందర్య సౌరభముగలదాననై యుండవలయునన, పరాశరుడందుల కంగీకరించి ఓప్రియా! నీసర్వాభీష్టంబు నెరవేర్చెదను. మహాయశోవంతుడు, విష్ణ్వంశసంభూతుడు నగుతనయుడు నీకుదయింపగలడు. దైవప్రేరణచే నిన్ను కోరుచుంటిని గాని నేనెన్నడు నప్సరసల గాంచి యైనను లేశమాత్రమైనను భ్రమించి యెరుంగను, అనేక సౌందర్యవతులగు నప్సరసలను గాంచి స్వప్నమందైనను మోహింపనినేను, తుచ్ఛమగు మీనగంధముతో గూడిన నిన్ను ప్రేమించితిని, ఇదియే యాశ్చర్యము. భగవద్విలాసము, బ్రహ్మవ్రాత యిట్లుండ నెవరు తప్పింపగలరు? విధిదాట నెవరితరము? నీకు జనించు కుమారుడు వేదశాఖవిభాగకర్తయై, పురాణకర్తయై యుండగలడు. అతడు ముల్లోకములయందు కీర్తిని బడయగలడని ఆయోగ

విశారదుడు బలుకుచు నామెతో రమించి యమునా నదియందు స్నానముచేసి తన స్థానమునకు జనెను"

సత్యవతి సద్యోగర్భముదాల్చి ద్వాదశాదిత్యసంకాశుడు మన్మథ సమానుడు, నగు పుత్రునిపరాశరాజాద్వీపమునందు కనెను. అతడుజన్మించిన వాడనే వామహస్తమున కమండలము దక్షిణహస్తమున దండము పింగళవర్ణములగల జటలుధరించి తల్లినిగాంచి తల్లీ! నీవు నీయిచ్ఛ వచ్చిన తావునకు స్వేచ్ఛగా జనుము. నా యిచ్ఛ వచ్చిన తావునకు నేను పోయెదను. నీ కెప్పుడైన నత్యంతావసరము కల్గినపుడు నను స్మరించినచో నీకడకే వచ్చి నీకోర్కెదీర్చగలనని తల్లితో బలికి యామె పాదంబులకు నమస్కరించి పాప విశోధనతీర్థంబు కడకేగి తపంబు చేయుచుండెను. సత్యవతి తన పుత్రుని తలపోయుచు తన గృహమునకేగెను, ఈసత్యవతీపుత్రుడు కృష్ణవర్ణుడై, ద్వీపమందుజనించుటచే కృష్ణద్వైపాయనుడనియు, వేదశాఖలు విభజించెను గాన, వేదవ్యాసుడనియు, పేరుగాంచెను, ఈవ్యాసుడు కొంతకాలము తపంబుచేసిన పిమ్మట తీర్థయాత్రలు చేయ సంకల్పించి ప్రథమమున ధర్మార్థకామ మోక్షంబులిచ్చు తీర్థరాజమైన ప్రయాగను, నైమిశారణ్యమును, కురుక్షేత్రమును, గంగాద్వారమును, అవంతికను, అయోధ్యను, మథురను, ద్వారకను, అమరావతిని, సరస్వతీ గంగాసింధు మొదలగు సాగరసంగమములను, కాంచీత్ర్యంబక సప్తగోదావరీ తటంబులను, కాలంజర, ప్రభాస బదరీ కాశ్రమంబులను, మహాలయ ఓంకారపురుషోత్తమ క్షేత్రంబులను, గోకర్ణభృగుకచ్ఛ, భృగుతుంగ పుష్కర క్షేత్రంబులను, శ్రీపర్వతాది పర్వతధారా తీర్థంబులను, సేవించి యాపుణ్య తీర్థములయందు గ్రుంకులిడియచ్చోటుల తపంబు చేయుచుండెడి వాడు. మరియు నితడనేక దేశములయందున్న తీర్థములన్నిటిని సేవించి సాక్షాద్విశ్వేశ్వరుడు నన్నపూర్ణ మహేశ్వరి నివసించు భక్తకామితదాయకమగు, కాశీపురి చేరికొని, యందున్న మణికర్ణికా తీరమున కేగి, కోటిజన్మాఘములు నశించు నామణికర్ణికయందు గ్రుంకులిడి, విశ్వేశ్వరాది ప్రముఖ లింగములన్నియుగాంచుచును, నందుండు సకలవాపీ కూప తటాక కుండములయందు స్నానమాడి, సకల వినాయకులకు గౌరీదేవులకు నమస్కరించి, కాలరాజు పాపభ

ఢుకుడు నగు కాలభైరవుని పూజించి, దండనాయక గణంబుల ప్రయత్న పూర్వకముగ స్తుతించి ఆదికేశవ, ముఖ్యకేశవుల సంతృప్తి పరచి లోలార్క ముఖ్య సూర్యులకు నూటిమాటికి నమస్కరింపుచు, విలంబముచేయక, సకల తీర్థములయందు పిండప్రదానములు గావించుచు, వ్యాసలింగమని తనపేరుతో నొకలింగమును స్థాపించెను. ఆలింగమును దర్శించి పూజించినచో విద్వాంసుడై వాక్పతియగును, ఇట్లు విశ్వేశ్వరాది సకలలింగములను క్రమముగా పూజించి వాటిలో శీఘ్రసిద్ధి ప్రదమగు లింగమేదియా యనియాలోచించి మహాదేవు డగు విశ్వేశ్వరునర్చించి, యతని యనుగ్రహముచే సర్వవిద్యల బడసి, సర్వపు రాణ కర్తయగుదునని తలచి శ్రీప్రదుడగు నోంకారనాథుడు, కృత్తివాసే శ్వరుడు, కేదారేశ్వరుడు, కామేశ్వరుడు, చంద్రేశ్వరుడు, త్రిలోచనుడు. కాలే శుడు, వృద్ధకాలేశుడు, క్షేమేశుడు, జంబుకేశుడు, జైగీషేశ్వరుడు, దశాశ్వమే ధేశ్వరుడు. ద్రుమిచండేశ్వరుడు, దృక్కేశుడు, గరుడేశుడు. గోకర్ణేశుడు. గణే శ్వరుడు, ప్రసన్నవదనేశుడు, ధర్మేశుడు, తారకేశ్వరుడు, నందికేశుడు, నివా శేశుడు, పత్నీశుడు, ప్రీతికేశ్వరుడు, పర్వతేశుడు, పశుపతీశుడు దోపకేశ్వ రుడు బృహస్పతీశుడు, తిలభాండేశుడు, భారభూతేశ్వరుడు, మహాలక్ష్మీశ్వరుడు మరుతేశుడు, మోక్షేశుడు, గంగేశుడు, నర్మదేశ్వరుడు, కృష్ణేశుడు, పరమే శుడు, రత్నేశ్వరుడు, యామునేశ్వరుడు, లాంగలీశుడు, విశ్వేశ్వరుడు, అవిము క్తేశ్వరుడు, విశాలాక్షీశ్వరుడు, వ్యాఘ్రేశ్వరుడు, వరాహేశుడు, విద్యేశ్వరుడు వరుణేశుడు, విధీశుడు, హరికేశ్వరుడు, భవానీశుడు, కపర్దీశుడు. కందుకేశుడు మహేశ్వరుడు, విశ్వకర్మేశ్వరుడు, వీరేశ్వరుడు, నీవారేశుడు, కపిలేశ్వరుడు భువ నేశ్వరుడు, బాష్కలీశుడు, సిద్ధీశ్వరుడు, విశ్వేదేవేశ్వరుడు వీరభద్రేశ్వరుడు భైరవేశ్వరుడు, అమృతేశుడు సతీశుడు పార్వతీశ్వరుడు మతంగేశ్వరుడు భూతేశ్వరుడు, ఆషాఢీశుడు, ప్రకామేశుడు, కోటిరుద్రేశ్వరుడు, మదాలేశ్వ రుడు, తిలపర్ణేశ్వరుడు, హిరణ్యగర్భేశుడు, శ్రీమధ్యమేశ్వరుడు, నను నామం బులతో కాశీపురియందు కోటిలింగంబులుండెనుగదా, వీటిలో నేలింగమర్చించి నేను కృతకృత్యుడ నగుదునో తెలియకున్నదని శివ భక్తిరతాత్ముడగు వ్యాసుడు చింతింపుచు కొంతకాల మాలోచించి జ్ఞాననిమగ్నుడై విచారింపుచు, అయ్యో పరబడితిని ఈ అవిముక్తక్షేత్రమందు సిద్ధులచే

పూజింప బడిన మధ్యమేశ్వర లింగము గలదు, అది నాయనో రథంబులీ డేర్చును నాకది ధర్మార్థ కామ మోక్షంబు లీయగలదు, ఈలింగ మర్చించిన వానికి స్వర్గ ద్వారము తెరిచి యుండును, దీని దర్శ నాములచే నిర్మలచేత స్కులగుదురు. అవిముక్త క్షేత్రమైన: సిద్ధ క్షేత్రమందు మధ్యేశ్వరలింగము సకలలోకాల్కు లీడేర్చును, దీనిని మించిన లింగ మేదియులేదు. ప్రతిపర్వ దినములయందు దేవతలీ దేవుని పూజించెదరు. ఇట్టి మధ్యమేశ్వరుని యనేక పితృులు సేవించి సిద్ధులైరి. ఇతడు ప్రధానుడు గాన, కాశీపుర మధ్యయందుండెను. కాశీపుర సౌఖ్యార్థమై యటను సర్వులను రక్షించుచుండెను. గంధర్వులగు తుంబురుడు దేవర్షియగు నారదుడు ఈమహాదేవు నారాధించి గాన విశారదు లైరి. విష్ణు వితని నారాధించి మోక్ష దాతయయ్యెను. బ్రహ్మ విష్ణు రుద్రులీ విశ్వేశ్వరు నారాధించి సృష్టిస్థితిలయంబులు చేయగల్గు చుండిరి. కుబేరుడితని నారాధించి ధననాథుడయ్యెను, ఇతని నారాధించి వామ దేవుడు జ్ఞాన రాట్టయ్యెను. ఖట్వాంగుడీతని నారాధించి సంతాన వంతుడయ్యెను. చంద్రభామ యనెడు యప్సరస యితని యెదుట కోకిలారావముచే గానంబొనరించి నృత్యము చేయుచు శివలింగ మందులీన మయ్యెను. శ్రీకరుడగు గోపకుమారుడు శంకర కృపచే గాణాపత్యము నొందగల్గెను. ఈదేవ దేవుని కృపచే గురుడు శుక్రుడు లిరువురు, దేవ దానవులకు గురువులైరి. గాన నేను కూడ విశ్వేశ్వరుని సేవించి పురాణ కర్తృ శక్తి వంతుడ నగుదును, నిశ్చయమని తలచి వ్యాసుడు భాగీరథీ నదియందు స్నానముచేసి, నియమ వ్రతుడై ఉపవాసి, కొంత కాలము పర్ణాశనుడై మరి కొంత కాలము ఫలశాకంబుల భుజించుచు కొంతకాలము వాయుభక్షకుడై కొంతకాలము జలాశనుడై కొంత కాలము నిరశన వ్రతుడై యుండి త్రికాలముల యందు మధ్యమేశ్వరుని బూజించుచు నానా వృక్ష ఫలంబుల నైవేద్య మిడుచు బహుకాలము గడిపె ఈ కాలికాయానుడు త్రిపథగామిని యందు గ్రుంకులిడుచు కటిక చీకటిని కూడ సహించెను. గాన కాలికాయానునకు పిమ్మట వచ్చెను భక్తాభీష్ట ప్రదుడు మధ్యమేశ్వరుడు నగు విశ్వేశ్వరుడు ప్రసన్నుడయ్యె సంతత పరకు స్తుతు పూజింపుమనే యుండెను. ఇట్లుండ నొకనాడు లింగ మధ్యమంబున, సుమా భూషితవామాంగుడై చలద్గంగా తరంగ జటాజూటుడై వ్యాఘ్రచ

రోన్నత్యురీయుడై, చారు విగ్రహుడై శరచ్చంద్ర చంద్రికా శోభాయ మాన మాళియై భస్మోద్ధూళిత సర్వాంగుడై కర్పూరార్జున విగ్రహుడై, యాకర్ణా యతనేత్రుడై, విద్రుమారుణోష్ఠుడై పంచవర్ష ప్రాయుడై బాలోచిత భూష ణుడై ధిక్కృతకోటి కందర్ప వర్ణుడై, నగ్నుడై, దరహాసితాబ్జ వదనుడై సామ గాయకుడై యపార కరుణాపయోనిధియై భక్త వత్సలుడై, యాశుతోషుడై యుమాసహితుడై సుముఖుడై యున్న గాంచివారుని ప్రేమ గద్గద వాక్కుతో యోగి దుర్లభుడు, దీనబంధుడు చిదాత్మకుడు నగు నాపరమేశ్వరు నిట్లు స్తుతింప దొడంగెను.

శ్లో. దేవదేవ మహాభాగ శరణాగతవత్సల
వాఙ్మనః కర్మదుష్ప్రాప యోగినామప్యగోచరః.

2. మహిమానంన తే వేదా, విదామాసురుమాప తే
త్వమేవజగతః కర్తా, ధర్తాహర్తా త్వమేవచ.

3. త్వమాద్యః సర్వ దేవానాం సచ్చిదానంద ఈశ్వరః
నామగోత్రే సహా తే స్తః సర్వజ్ఞోసిసదాశివ

3. త్వమేవపరమం బ్రహ్మమాయా పాశనివర్తకః
గుణత్రయైర్నలిప్తస్త్వంపద్మపత్రమివాంభసా.

5. నచబ్రహ్మ, నలక్ష్మీశో, నచ నేంద్రోదివౌకసః
నయోగీంద్రా విదుస్తత్వంయస్యతంత్వాముపాస్మహే

6. న తేజన్మనవాశీలంన దేశంనకులంచ తే
ఇత్థంభూతోపీశ్వర స్త్వంత్రిలోక్యాః కామమావహే.

7. త్వత్తః సర్వంత్వంహిసర్వం
గౌరీశ స్త్వం పురాంతకః
త్వంబాలస్త్వంయువావృద్ధస్త్వం.
త్వాంహ్యాదియు నజమ్మహా:

8. నమ స్తస్మై మహేశాయ.
భక్తధ్యేయాయ శంభవే,
పురాణపురుషాయాద్ధా
శంకరాయ పరాత్మనే.

ఓ దేవదేవ మహాభాగ శరణాగత వత్సల మనోవాగాతీతుడా; త్రికర్మలకు పొందశక్యము కానివాడా, యోగులకు కూడ దుర్లభమైన వాడా, ఉమాపతీ! నీ మహిమ వేదంబులుకూడ నెరుంగవు నీవు జగత్కర్తవు, భర్తవు, హర్తవు కూడనై యుంటివి. సర్వదేవతలలో నీ వాద్యుడవు, సచ్చిదానందమయుడవు, ఈశ్వరుడవు, నీకు నామగోత్రములు లేవు నీవు సర్వజ్ఞుడవు. సదాశివుడవు. నీ వేపరబ్రహ్మవు. మాయాపాశ విమోచనుడవు. పద్మపత్రాంబువులవలె త్రిగుణంబుల నంటనివాడవు, జన్మరహితుడవు, స్వభావశూన్యుడవు. దేశకుల రహితుడవైనను, సర్వభూతములకు ప్రభుడవై యుంటివి. త్రిలోకములయందలి వారి మనోరథంబుల నీడేర్చుచుందువు. బ్రహ్మాదులు మహాయోగులు నీ తత్త్వము నెరుంగరు.

నీవు బ్రహ్మవుగావు, లక్ష్మీపతివిగావు, ఇంద్రుడవుగావు. ఏ దేవతయును గావు, యోగీంద్రుడవు గావు నీతత్త్వమెట్లు తెలిసికొని నన్నుపాసింతును?

సర్వము నీచే జనించెను. సర్వము నీస్వరూపము, నీవు గౌరీశుడవు, పురాంతకుడవు, బాలుడవు, యువకుడవు, వృద్ధుడవు. కూడనై యుంటివి. ఇట్టి నిన్ను నాహృదయ మందెట్లు నిల్పుకొందును? ఓ మహేశ్వరా నీకు నమస్కారము, నీవు భక్తధ్యేయుడవు, శంభుడవు. పురాణపురుషుడవు. శంకరుడవు. పరమాత్ముడవు నగు నీకు నమస్కారము,

అనిఇట్లుస్తుతించి, భువిపైబడి, సాష్టాంగ నమస్కారము గావించియుండ బాలశివుడు వ్యాసునిగాంచి సంతుష్టాంతరంగుడై ఓయోగిపుంగవా! నీభక్తికి మెచ్చితిని, నీమనోవాంఛను దెల్పుమిచ్చెదను, నేనుభక్తాధీనుడనుగాన భక్తులకీయలేని దేదియులేదన, భగవద్వాక్కులువిని వ్యాసుడుసంతసించిలేచి ఓప్రభూ! నీవుసర్వజ్ఞుడవు, నీకు తెలియనిదేమున్నది, నీవు సర్వాంతరాత్ముడవు

భగవంతుడవు, శర్వుడవు, సర్వప్రదుడవు, ఈదీనుడనగు నేనిన్ను యాచింపు చుంటిని, నామనోవాంఛతీర్పుమన, నమలచేతస్కుడగు వ్యాసునినుడువులు వినిశంకరుడు చిరునవ్వునవ్వుచు, నీవుబ్రహ్మవిదులలో శ్రేష్ఠుడవు, నీహృదయ మందలితలంపు త్వరలో సిద్ధింపగలదు, సంశయింపకుము, నేనునిక ముందంత ర్యామినైయుండి నిచే పురాణేతిహాసంబులన్నియు రచింపజేసెదను, నీవునన్ను స్తుతించిన యభిలాషాష్టకము, నీశ్వరసన్నిధిని త్రికాలములయందు నొకసంవత్సరము పఠించినచో సర్వకోర్కెలీడేరును. ఈస్తోత్రము పఠించినచో విద్యాబుద్ధులువృద్ధినొంది, సర్వసంపత్తులుగల్గి ధర్మాత్ముడై, యంతమున మోక్షము నొందగలడు. ప్రాతఃకాలమునలేచి. సుస్నాతుడై, శివలింగము నర్చించి యీస్తోత్రమును పఠించినచో మూర్ఖుడుకూడ బృహస్పతి యంతటి వాడగును, స్త్రీలైనను, పురుషులైనను, నియమబద్ధులై, శివలింగమునసన్నిధి నొకసంవత్సరము ఇదిపఠించినచో విద్యాబుద్ధులువృద్ధియగునని, బల్కి యాబాలుడా లింగమునందదృశ్యుడయ్యెను వ్యాసుడు శివప్రేమాకులుడై యానంద బాష్పములుగార్చుచు, యభీష్టవరములనొంది భగవత్కృపచే నష్టాదశపురాణంబులు రచించెను. అవి యేవన,

శ్లో॥ బ్రాహ్మంపాద్మం వైష్ణవంచ శైవం భాగవతంతథా
భవిష్యంనారదీయంచ, మార్కండేయమతఃపరం

2 ఆగ్నేయంబ్రహ్మవైవర్తంలైంగం వారాహమేవచ
వామనాఖ్యంతతఃకౌర్మంమాత్స్యంగారుడమేవచ

3 స్కాందంతథైవ బ్రహ్మాండం పురాణంచాపికీర్తితం
యశస్యం పుణ్యదంన్నాణాంశ్రోతౄణాంశంకరంయశః

బ్రహ్మము, పద్మము, వైష్ణవము, శైవము, భాగవతము, భవిష్యము, నారదీయము, మార్కండేయము, ఆగ్నేయము, బ్రహ్మవైవర్తము, లైంగము వారాహము, వామనము, కూర్మము మత్స్యము, గారుడము, స్కాందము, బ్రహ్మాండము నను, 18 పురాణములు రచించెను. వీటికి నామంబులు కల్గుటకు కారణముచెప్పెదవినుము

1 మొదటిది బ్రహ్మకర్తగానుండెను గాన బ్రహ్మపురాణమని చెప్ప బడెను.

2 పద్మకల్పమందలి మాహాత్మ్యము చెప్ప బడెనుగాన పద్మపురాణ మయ్యెను.

3 పరాశరుడు విష్ణుబోధనుగురించి చెప్పియుండెను, తండ్రికొడుకులకు భేదములేదు గాన సిరికూడ వ్యాసకృతమని చెప్పబడెను విష్ణునిగురించిచెప్ప బడెను గాన వైష్ణవపురాణమయ్యెను

4 పూర్వోత్తరఖండములందు శివగాథలున్నవి గాన శైవపురాణమని చెప్పబడెను.

5 భగవతి యగుదుర్గాచరిత్రలు చెప్పబడుటచే దేవీభాగవతముపురాణ మని చెప్పబడెను

6 నారదునిచే చెప్పబడెనుగాన నారదపురాణమయ్యెను

7 మార్కండేయుడు చెప్పుటచే మార్కండేయపురాణమయ్యెను

8 అగ్ని చెప్పుటచే అగ్నిపురాణమయ్యెను

9 రాబోవుచరిత్రలు చెప్పబడెను గానభవిష్యత్పురాణమయ్యెను

10 బ్రహ్మయొక్కమార్పును చెప్పుటచే బ్రహ్మవైవర్తపురాణమయ్యెను

11 శివలింగములనుగూర్చి చెప్పబడెను గాన లింగపురాణమయ్యెను.

12 వరాహమూర్తి వర్ణింపబడెను గాన. వరాహపురాణమయ్యెను.

13 స్కందుడు శ్రోతగను, పరమేశ్వరుడు వక్తగ నుండుటచే స్కాంద పురాణమని చెప్పబడెను.

14 వామనమూర్తిని గురించి చెప్పబడెను గానవామన పురాణ మయ్యెను.

15 కూర్మావతారము వర్ణింప బడెను గాన కూర్మపురాణ మయ్యెను.

16 మత్స్యావతారమును గూర్చి చెప్పబడెను గానమత్స్యపురాణ మయ్యెను

17 గరుత్మంతుడు స్వయముగ చెప్పెను గాన గరుడ పురాణమయ్యెను

18 బ్రహ్మాండ చరిత్ర లన్నియు చెప్పబడెను గాన బ్రహ్మాండ పురాణమని చెప్ప బడుచుండెను.

ఓమహాత్ములారా! ఇవన్నియు నేను వ్యాసునిచే విని యుంటిని. ఇంకను వ్యాసుడు పురాణోప పురాణంబులు, సంహితలు, పంచమవేదమైన భారతమును రచించియుండెను. పరాశరుని వరప్రభావముచే సత్యవతి తనకన్యాత్వమును వీడక శంతనుని వివాహమాడెను. ఈవ్యాసోత్పత్తి యాశ్చర్యకరము. మహాత్ముల యొక్క చరిత్రలలో గుణంబులు మాత్రమే గ్రహింపవలయును. ఈపరమరహస్యమైన చరిత్ర నెవరువిన్నను, పఠించినను, సర్వపాప విముక్తులై ఋషి లోకమునొందెదరు.

శివ పురాణము నందలి ఉమాసంహితయందు
నలుపది నాలుగవ అధ్యాయము సంపూర్ణము.

---

## నలువది యైదవ యధ్యాయము

### కాళీ ప్రాదుర్భావము - మధు కైటభులవధ

మునులు మరల సూతునిట్లు ప్రశ్నించిరి. నానావతార సమన్వితమైనదియు నానావ్యాఖ్యాన సంయుతమైనవియు మనుజులకు శుభ ముక్తిప్రదమైనవియు నగు శంభు కథలు నీ చేవిని యుంటిమి గాన యింకను నీవలన మనోహరమైన భగవతి యగు జగదంబ చరిత్రలు వినగోరుచుంటిమి. పరబ్రహ్మ యగు మహేశ్వరుని సనాతని యగు నాది శక్తి యుమా యను నామంబుతో, త్రిలోక జననియై, పరాంబికయై యున్న యీామె సతీ హైమవతులుగ రెండు విధములుగ జనించెనని వినియుంటిమి. ఇదియునుంగాక యితరావతారంబులను గూర్చియు తెల్పుము: దేవి భక్తిలేని వారికేమో చరిత్రలను విన నిచ్చగించరేమో గాని, యేమాత్రపు భక్తియున్న వారైనను ఈమెచరిత్రలు వినగోరు

నా ద్విజప్రభావముచే సహజ విరోధ జంతువులు వైర భావము వీడి యొకరి
నొకరు బాధించు కొనక మైత్రీ భావముతో నుండిరి. మహాకారుణికోత్తముం
డగు యాస్పతి యామునివర్యునిచే భోజనాసన సువాక్కులచే సత్కరింప
బడుచు నటనే యుండెను. ఇట్లుండి యొకానొక సమయంబున రాజిట్లు తలచెను.

అహో యెంత ఆశ్చర్యము; నేను భాగ్యహీనుడనైతిని. నా దుర
దృష్టముచే తేజోహీనుడ నైతిని. మదోత్కటులగు శత్రువులు నా రాజ్య
మంతయు హరించి మావంశీయులైనను గాక, ఇతర వంశీయులు నా రాజ్య
మనుభవించుచుండిరి. ఏమిచేయుదును? ఎక్కడికి పోవుదును? మరల రాజ్య
మెట్లు పొందగల్గుదును? నా పూర్వామాత్యులకు స్నేహితులకు కూడ
నేనిటనుంటినని తెలియదు. మరల నారాజ్యమెట్లు స్థాపించుకొం
దును? నా కెట్టిగతి ప్రాప్తించునో తెలియకున్నది. రణోత్సాహముగల నా
సైన్యమంతయు పరరాజులు సేవించుచుండిరి. పర్వతాభములగు గజంబులు
వాయువేగగాములగు నశ్వములు మాపూర్వులచే నార్జింపబడిన ధనకోశం
బులు పరరాజులపాలాయెను. ఏమిచేయుదునని పరమ ధార్మికుడగు రాజు
మోహవశుడై విచారింపుచుండ నింతలో నొక వైశ్యుడటకేతెంచ, రాజు
వానింగాంచి నీవెవరవు? ఎందులకై యిటకేతెంచితివి? నీకెట్టి దుఃఖము సంభవిం
చెనో తెల్పుమన నాభూపాలవాక్కులాలకించి యశ్రుబిందువులు
విడుచుచు ప్రేమపూర్వకముగ శిరమువంచి నమస్కరించి, ఓ రాజా! నా పేరు
సమాధియందురు. నేను ధనికవంశమునందు జన్మించితిని. వైశ్యుడను. నేను
ధనలోభముచే దారాపుత్రాదులను వీడి నాపూర్వ కృతకర్మచే వనముల
పాలైతిని. కరుణాసాగరుడగు నో రాజా! నాకు పుత్ర పౌత్ర కళత్ర మిత్ర బాం
ధవులు, భ్రాతలు, భ్రాతృపుత్రులు, సుహృదులుగలరు. కాని వారి క్షేమ
మిసుమంతయైనను తెలియుట లేదని విచారింపుచుంటి నన, నో వైశ్యా!
దురాచారులు, దుష్టబుద్ధులు, లోభులునగు నీదారాపుత్రాదు లందరు నిన్ను
వీడియుండ నీవు వారికై పరితపింతువేల? అది నీమూర్ఖత్వము కాని నేనుగానన
నోరాజా! నీవు సాకార్థ బృంహితములగు వాక్కులు బల్కితివి నామనసంబు
మిక్కిలి మోహపాశముచే బంధింపబడెను. ఏమిచేయుదునని విచారింపుచు

వీరుభయులు మునిసాన్నిధ్యముచేరి యా యోగివర్యునకు శిరసానమస్కరించి బద్ధాంజలులై నిలబడి ఓమునివర్యా మా యిరువురి మోహంబులు నిర్మూలము చేయుడని రాజిట్లు పల్కెను.

ఓ మునిపుంగవా! నేను రాజ్యలక్ష్మిని వీడి గహనమున కేతెంచితిని. నేను రాజ్యభ్రష్టుడ నైనప్పటినుండి నాకు సంతోషమనంది లేదు. ఈ వైశ్యుడు కూడ దారాపుత్రాదులను వీడి తమసన్నిధి కేతెంచెను. మా మమకారంబులనొక్కటి మముల్ల స్వస్థ చిత్తులుగావింపుడు. మేము గృహముల త్యజించినను మమకారము పోకుండెను. కారణమేమి? మేము మోహముచే వ్యాకులత జెందుచుంటిమి. మా మూర్ఖత్వమున సంతోషము లేకుండెను. మాకేదైన యుపాయము జెప్పుమన మామునీశ్వరు డిట్లు చెప్పదొడంగెను.

జగద్ధాత్రియు సనాతనియు, శక్తిరూపిణియు నగు మాయ సర్వుల మనంబులను మోహింపజేయుచుండెను. ఆమె పరతత్త్వము నెరుంగక బ్రహ్మాది దేవతలే మోహితులగుచుండ మనుజుల మాటజెప్పనేల? ఈ మాయ, త్రిగుణాత్మకములచే సృష్టి స్థితిలయంబుచేయుచున్నది. కామరూపిణియు పరదామినియు నగు, నా దేవి ప్రసన్నరాలైనచో మోహజాలమును బాయుదురు. లేనిచో మోహావరుద్ధులగుదురనిన, నో ముని! మహామాయ యెవరు? ఆ దేవి యెవరు? సర్వులను మోహింపజేయు నామె యెవరు? ఆమె యెట్లు జనించెనో చెప్పుమని రాజు ప్రశ్నింప ముని ఇట్లు చెప్పదొడంగెను. ఓ రాజా! జగత్తంతయు నేకార్ణవముకాగ యోగరాట్టగు కేశవుడు శేషశాయియై పవళించి యోగనిద్రయందుండ నతని కర్ణమలంబుల నుండి యిరువురు దుష్టులు జనించిరి. వీరు భువియందు మధుకైటభులని ప్రఖ్యాతి వడసిరి. వారు ప్రళయార్క తేజస్కులై ఘోరస్వరూపులై, మహాకాయులై, పెద్దపెద్ద వదనలు గల్గి దంష్ట్రాకరాళ వదనులై లోకమును మ్రింగుదురా యన్నట్లుండిరి. వారు విష్ణునాభికమలమందున్న బ్రహ్మను గాంచి నీవెవడవని చంపనున్ముఖులై బ్రహ్మతో వాదింపుచుండ నతడు శేషశయను డగు విష్ణుని గాంచక స్తుతించి సంతసపరచి మహామాయాదేవి నిట్లు స్తుతింప దొడంగెను.

ఓ దేవీ! మహామాయా! శరణాగత వత్సలా! జగదంబికా! ఘోరరూపులగు నీ రాక్షసుల బారినుండి రక్షింపుము. రక్షింపుము. నీకు నమస్కారము. నీవు యోగనిద్రవై యున్నయుమాసతివి. కాళ రాత్రివి. మహా రాత్రివి. మోహ రాత్రివి. పరాత్పరవు. త్రిదేవ జననివి. సత్యస్వరూపవు. భక్తాభీష్టఫల ప్రదవు. సర్వ దేవతలను పరిపాలించెడి కరుణాసాగరవు నీప్రభావముచే బ్రహ్మనగు నేను సృష్టించుచుంటిని. విష్ణువు పాలించుచుండెను. గిరిజాపతి ప్రళయ కాలంబున సర్వులను సంహరించుచుండెను. తుష్టివి. పుష్టివి. శాంతివి. క్షాంతివి. క్షుద్రవు మాయవునై యుంటివి. మరియు జగదంబా నీవే విష్ణుమాయవు. నీవే చేతనస్వరూపిణివి. నీవే పరమ శక్తివి లజ్జాతృష్ణలు నీవేయై యుంటివి. నీవే భ్రాంతివి. శ్రుతివి మాతృరూపిణివియునై యుంటివి. పుణ్యాచార ప్రవర్తకుల గృహములందుండెడి లక్ష్మివి నీవు, సమస్తజాతులు నీవు, సకల వృత్తులు నీవు, సకలజగత్తులయందు నీవే వ్యాపించి సకల మనోవృత్తుల యందుంటివి, ఈదుష్టులగు యసురులను మోహింపజేయుము, అజుడు, విభుడు, జగద్యోనియు నగు నారాయణుడు యోగనిద్రయందుండెను. మేల్కొల్పుమని బ్రహ్మ పలువిధంబులు వేడ, నా దేవి, విధిప్రార్థనలువిని రక్షింపదలచి ఫాల్గుణ శుద్ధద్వాదశి రోజున ప్రాదుర్భవించి త్రిలోక మోహినియగు నామ మహాకాళియని విఖ్యాతివడసెను. బ్రహ్మనుద్దేశించి యామె గగన వాక్కులతో నోకమలాసనా! నీవు భయపడకుము! మధుకైటభుల సంహరించి నీభయము బాపుదునని, విష్ణు ముఖము నుండి నిర్గమించి యవ్యక్త జన్ముడగు బ్రహ్మకు దర్శనమిచ్చె. విష్ణుని మేల్కొలుప నతడు లేచి ఎదుట నున్న మధుకైటభులగాంచి వారిరువురితో తుములయుద్ధము చేయ నారంభించి యైదువేల సంవత్సరములు వారితో బాహు యుద్ధము చేసెను. మహామాయా ప్రభావముచే రాక్షసు లిరువురు మోహితులై, విష్ణుని గాంచి నీపరాక్రమునకు మెచ్చితిమి, నీకేమి వరము కావలయునో కోరుకొమ్మనగ, విష్ణువు వారలగాంచి మీరు నాయందు ప్రసన్నులైనచో నాచేమీరు మరణింపవలయును, యింతకన్న, నాకేకోరికయు లేదన, నంతయు జలమయమే గాని వేరుప్రదేశము లేకుండుట గాంచి ఓమహావిష్ణూ! అట్లే మరణింతుము గాని జలములేని ప్రదేశమున మమ్ము సంహరింప వలయునని మధుకైటభులు కోర విష్ణువు అట్లే చేయుదునని పల్కి తనయూరు ప్రదేశంబున వారల పరుండ

బెట్టి తనజాజ్వల్యమానమైన చక్రముతో వారి శిరములను ఛేదించెను. ఓరాజా నీవిపుడు కాళికోత్పత్తి, మధుకైటభసంహారము వినియుంటివి. ఇటుపై, మహాలక్ష్మియుత్పత్తిని చెప్పెద వినుము, నిర్వికార, సాకార, నిరాకార రూపంబులు గల యాదేవి, దేవతారక్షణార్థై యుగయుగంబుల జనించి ఇచ్ఛానుసారంబుగనా నారూపంబుల నవతరించుచుండును. తనలీలచే నిమునిన భక్తులకు ప్రభావము జూపించుచు వారిచే స్తుతింప బడుచుండును.

శివ మహాపురాణము నందలి ఉమాసంహితయందు
నలుబదియైదవ అధ్యాయము సంపూర్ణము.

---

## నలుబది ఆరవ యధ్యాయము

### మహాలక్ష్మి యవతారము.

మరల నామహర్షి సురథ మహారాజున కిట్లు చెప్పదొడంగెను, దైత్యవంశ శిరోమణియగు రంభాసురు డనెడి వాడుండెడి వాడు. ఇతనికి మహాబలుడగు మహిషుడనెడి దానవుడు జనించెను, ఇతడు రణమందు దేవతలందరిని జయించి స్వర్గరాజ్యమును స్వాధీనపరచుకొని, మహేంద్రుని గూర్చిన మనస్థించి పరిపాలింపుచుండ పరాజితులైన దేవతలందరు బ్రహ్మను శరణు పొంద నాతడు వీరందరిని శివకేశవుల కడకు గొనిపోయె, సకలవృత్తాంతమును తెలుపు శక్రాదిదేవతలు శివకేశవులకు నమస్కరించి. ఓశివకేశవులారా! దురాత్ముడగు మహిషాసురుడు స్వర్గమందున్న మమ్ముల యుద్ధమునందోడించి పరాజితులజేసి, భూస్వర్గంబులద పరిపాలింపుచు, మాకునిలువ నీడలేకుండ జేసెను. అతడిప్పుడు స్వర్గమందున, మరియొకప్పుడు భూమియందున సంచరింపుచు, మమ్ముల పీడింపుచుండెను. మాయిక్కట్లు మీకు తెలియకపోవు, మాయష్ట దిక్పాలకుల యాధిపత్యములు తామేవహించి పరిపాలింపుచు యక్షగంధర్వ విద్యాధర కిన్నర చారణకింపురుషాది దేవ గణము లన్నిటిని తరిమికొట్టి తాను దైత్యపక్షపాతియై పాలింపుచుండెను. గాన మీరుభయులు నాదైత్యుని వధోపాయ మాలోచించి

మమ్ము రక్షింపుడన, దామోదర పరమేశ్వరులిరువురు దేవతల నుడువులు విని, క్రుద్ధులై, రోషఘూర్ణితలోచనులై, తమ ముఖముల నుండి తేజములు వెలుపలకు తీసి దేవతల దేజంబులన్నియు కూడి వెలుపలకు తీసియుండ, ఈ తేజంబులన్నియు కలిసి, మహాతేజః పుంజమై దశదిశలు ప్రజ్వలింపుచుండ నందుండి మహిషాసుర సంహారిణియగు దుర్గ ప్రాదుర్భవించెను.

ఆమె శంకర తేజముచే ముఖము, యముని తేజంబుచే కేశంబులు, విష్ణు తేజంబుచే బాహువులు, చంద్ర తేజంబుచే స్తనద్వయంబు ఇంద్ర తేజముచే మధ్యభాగము, వరుణ తేజంబుచే నూరుజంఘంబులు, భూ తేజంబుచే పిరుదులు, బ్రహ్మ తేజంబుచే చరణద్వయంబు, సూర్య తేజంబుచే పాదాంగుళులు, వాసవ తేజంబుచే చేతివ్రేళ్లు, కుబేర తేజంబుచే నాసికయు, ప్రజాపతి తేజంబుచే దంతములు, యగ్ని తేజంబుచే, త్రినేత్రంబులు, సాధ్యుల తేజంబుచే భ్రూమధ్యము, వాయు తేజంబుచే కర్ణద్వయంబు గలిగి, సమస్త దేవతల తేజంబులతో గూడి పద్మాలయ యగు నా పరమేశ్వరి యుద్భవించెను అనగా పద్మాసనాసీనురాలై యుండెను. సర్వదేవతా తేజఃపుంజ సంజాత యగు నా మహాదేవిని గాంచి దేవతలందరు మిక్కిలి సంతసించిరి. బ్రహ్మాది దేవతలందరు నీమె శస్త్రములు ధరించిన బాగుండునని యూహింప, శంకరుడామెకు త్రిశూల మొసంగెను. శంఖసుదర్శన చక్రములు విష్ణుభగవాను డొసంగెను. వరుణుడు పాశమిచ్చెను అగ్ని శక్తి నిచ్చెను. వాయువు చాపమిచ్చెను, శచీపతి యక్షయ తూణీరము వజ్రాయుధము ఘంటనిచ్చెను, యముడు కాలదండము, ప్రజాపతి యక్షమాలయు, బ్రహ్మ కమండలము, సూర్యుడు కిరణంబులు, కాలుడు ఖడ్గము సముజ్జ్వల ఫలకము నిచ్చియుండిరి. క్షీరసాగరుడు మనోహర హారము, పట్టు వస్త్రములు, చూడామణియు, కుండలంబులు, కడియంబులు, నర్ధచంద్ర కేయూరంబులు, నూపురంబులు, కంకణంబులు, ముంగరంబులు, హారంబులు, నిచ్చియుండెను. విశ్వకర్మ మనోహరమైనదియు, నభేద్యమైనదియు నగు కవచమును యనేకాస్త్రంబుల నిచ్చియుండెను, అంబుధి రమ్యమైనది, సరసమైనదియు నగు నబ్జమాల నిచ్చియుండెను, హిమవంతుడు సింహమును, యనేక రత్నంబులు నిచ్చియుండెను, కుబేరుడు పూర్ణసుర పాత్రను సమర్పించెను, ఫణిరాజగు

శేషుడు. విచిత్ర-చిత్ర రచితమైనదియు, నానారత్న సమన్వితమైనదియు నగునాగహారమర్పించెను. మరియు సకల దేవతలు సర్వాయుధంబులు సకల భూషణంబుల నొసంగిరి.

ఇట్లు సకల దేవతలచే సకలాస్త్రంబులు సకలభూషణంబులు గైకొని యాదేవి, యుచ్చైస్స్వరంబున పెద్దగ నట్టహాసము చేయ మొదలిడెను ఆభీషణారావంబులచే భూనభోంతరాళంబులు నిండి భువనత్రయము గడగడ వడకసాగెను. భూమి సాగర పర్వతములతో చలించెను. మహిషాసుర పీడితులగు దేవతలందరు జయజయ ధ్వానములు చేయసాగిరి. అంబికయు పరాశక్తియు మహాలక్ష్మీ స్వరూపిణియు నగు నా దేవికి దేవతలందరు గద్గద వాక్కులతో స్తుతింప సాగిరి. దేవతల కోలాహలంబులు విని మహిషాసురుడు క్రుద్ధుడై సైన్యసమేతుడై యుద్ధసన్నద్ధుడై యుండెను. ముల్లోకములు నిండిన తన కమాంత తేజంబు మహిషుడు గాంచి క్రుద్ధుడై రవరవ మండి పడుచు సకలాయుధంబులు ధరించి కోటి సైన్యములతో గూడి యుద్ధసన్నద్ధుడై బయలు దేరెను.

ఇతని వెంట చిక్షుర చామర ఉదగ్ర కరాళ ఉద్ధత బాష్కల తామ్ర, ఉగ్రాస్య ఉగ్రవీర్య బిడాల అంధక దుర్ధర దుర్ముఖ త్రినేత్ర మహాహనులనెడి శూరులు యుద్ధ విశారదులగు వారెందరో యతని వెంట బయలు దేరి దేవి కడ కేతెంచి, వారి వారి సర్వాయుధంబులు ప్రయోగించి యుద్ధము చేయ నారంభించిరి. కాని యామహాదేవి శత్రువులచే విడువబడిన యస్త్రంబులు సన్నియు, క్షణములో విఫలము గావించుచు చిక్షురాది ప్రముఖ శత్రువులందరిని సగణ సహితంబుగ, బాణశూల శక్తి పరశ్వధంబులచే సంహరించి తన నిశ్వాసముచే కొన్ని గణములను సృజింప మహిషాసురుడీ వంతయు గాంచి వారలను శృంగములచే పొడుచు ఖురములచే తన్నుచు కొందరిని ముట్టెతోసెను. మరికొందరిని లాంగూలములతోను కొందరిని కొమ్ములతోను వాటి నాటికి కొట్టి చంపుచు దేవీవాహనమగు సింహముపై నుంకించుచు క్రుద్ధుడై తన ఖురములచే, మహానగములు పడగొట్టుచు భూమిని విదళించుచు పెద్దగా గర్జించుచు, వేగముగ నటు నిటు నడ్డముగ దిరుగుచు పర్వతములను పైకెగర

వేయుచు పైకెగురుచు క్రిందకు దుముకుచు నుండ నాకాశమునుండి మేఘములు ఖండ ఖండములై నేలకూలుచుండెను. ఇతని తోకచ్ఛ ప్రహారముచే సింధువులు చెలియలి కట్ట నతిక్రమించి ప్రవహింప సాగెను. దేవతల కభయమిచ్చిన యా దేవి మహిషాసురు డెట్లు మడియునాయని యాలోచించుచు నతని పై నొక పాశము విసర నతడు బంధితుడై, మహిష రూపము వీడి యా మాయావి సింహరూపుడు కాగా నా దేవి ఖడ్గముచే ఖండింప నుద్యమించ నతడు ఖడ్గము దాల్చి యొక పురుషుడై యెదుట నిలచి యుండెను దేవి వీనిం గాంచి చర్మ బాణ ఖడ్గములచే గొట్ట నతడు గజరూపుడై యామె వాహన మగు సింహమును తొండముచే లాగుచుండ నా దేవి మహా ఖడ్గముచే గొట్టుచుండెను. ఇంతలో నసురుడు తన నిజరూపము దాల్చి తన మాయచే ముల్లోకముల పీడింపుచుండ నామహా కాళి కుపితురాలై మాటి మాటికి మధు పానము చేయుచు ఘూర్ణిత నేత్రయై మహాట్ట హాసంబుగ నవ్వుచుండ నసురుడు కోపించి గర్జింపుచు నున్నత పర్వతంబు లామెపై విసరుచు బల వీర్య మదోత్కటుడై యుండ నా దేవి యా పర్వతము లన్నియు తన శరములచే సత్వరము చూర్ణము గావించుచు వారుణీ మద సంజాతముఖ రాగ కలితేంద్రియయై, మేఘగంభీర వాక్యములతో నసురుని గాంచి ఓమూఢుడా! నీ ప్రజ్ఞ నశించెను. వ్యర్థమైన పట్టుదల కింకను త్రిలోక దేవతలు కూడ నా యెదుట నిలువలేరని పలుకుచు సర్వ శక్తిమయి యగు నా దేవి తన పదములచే నసురుని కంఠము త్రొక్కిపెట్టి శూలముచే నతని కంఠము పొడవ మహిషాసురుని ముఖము రెండు ఖండములుగ చీల్చబడి నేలకొరిగెను. ఇతడు నేల కొరగగనే శేషించిన యతని సైన్యమంతయు హాహాకారములు చేయుచు రక్షింపుము రక్షింపుమని వేడుచు పారిపోయిరి. రాక్షస సంహారమైన తరి బ్రహ్మాది దేవత లందరును దేవిని స్తుతించిరి. గంధర్వులు గానము చేసిరి. నర్తకులు నాట్యమాడిరి. ఓ రాజా! మహాలక్ష్మి చరితము చెప్పితిని. ఇటుపై కౌశికీ ప్రాదుర్భావము చెప్పెద వినుము.

శివ మహాపురాణమందలి ఉమాసంహిత యందు

నలుబది యాఱవ యధ్యాయము సంపూర్ణము

---

# నలువది ఏడవ యధ్యాయము

## కౌసికీ ప్రాదుర్భావము

శుంభనిశుంభులనెడి యిరువురు దైత్యులు గలరు. వారిరువురు సోదరులు. వారు చరాచరంబులతో గూడిన త్రిభువనంబులు వారి ప్రతాపంబులచే నాక్రమించి దేవతలను స్వస్థానములనుండి తరిమికొట్టుటచే వారు హిమాలయము కడకేగి, సర్వభూతజననియు, కామదాయినియు నగు పార్వతి నిట్లు స్తుతింప సాగిరి.

శ్లో॥ జయ దుర్గమహేశాని జయాత్మీయ జనప్రియే
త్రైలోక్య త్రాణకారిణ్యై, శివాయై తే నమోనమః

2. నమో భుక్తి ప్రదాయిన్యై, పరాంబాయై నమోనమః
నమస్సమస్త సంసారోత్పత్తి స్థిత్యన్తకారికే

3. కాళికారూప సంపన్నే నమస్తారాకృతే నమః
ఛిన్నమస్తా స్వరూపాయై, శ్రీవిద్యాయై నమోస్తుతే

4. భువనేశి నమస్తుభ్యం నమస్తే భైరవాకృతే
నమోస్తు బగళాముఖ్యై ధూమావత్యై నమోనమః

5. నమస్త్రిపురసుందర్యై మాతంగ్యై తే నమోనమః
అజితాయై నమస్తుభ్యం విజితాయై నమోనమః

6. జయాయై మంగళాయై తే విలాసిన్యై నమోనమః
దోగ్ధ్రీరూపే నమస్తుభ్యం నమో ఘోరాకృతేస్తుతే

7. మనో, పరాజితాకారే నిత్యాకారే నమోనమః
శరణాగత పాలిన్యై రుద్రాణ్యై తే నమోనమః

8. నమో వేదాంత వేద్యాయై నమస్తే పరమాత్మనే
అనంతకోటి బ్రహ్మాండ నాయికాయై నమోనమః

1. ఓమహేశ్వరీ! ఓమాతృయ జనప్రియే నీకు జయముగుగాక త్రిలోక రక్షకురాలవగునో శివప్రియా నీకు నమస్కారము.

2. ముక్తిప్రదాయినివగు నీకు నమస్కారము. ఓ! పరాంబా నీకు నమస్కారము సకల జగదుత్పత్తి స్థితి సంహారకారిణివగు నీకు నమస్కారము.

3. కాళికారూప సంపన్నురాలవు, నమస్కారార్హత కలదానవునగు నీకు నమస్కారము. ఛిన్నమస్త స్వరూపిణివి. శ్రీ విద్యాస్వరూపిణివి నగు నీకు నమస్కారము.

4. ఓ భువనేశ్వరీ! ఓ భైరవీ! ఓ బగళాముఖీ! ఓ ధూమావతీ! నీకు నమస్కారము.

5. ఓ త్రిపురసుందరీ! ఓమాతంగీ! ఓయజితరూపా! ఓ జయరూపా! నీకు నమస్కారము.

6. జయస్వరూపవు, మంగళస్వరూపవు, విలాసస్వరూపవు, ఘోరాకృతివి. కామధేనుస్వరూపవు నగు నీకు నమస్కారము.

7. ఓ జయస్వరూపా! నీవు నిత్యకారిణివి, శరణాగతరక్షక్, ఓ రుద్రాణీ నీకు నమస్కారము.

8. వేదములచే తెలియబడు దానవు, నీవు పరమాత్మ స్వరూపిణివి, నీవ నంత బ్రహ్మాండకోటి నాయకివి యగు నీకు నమస్కారము.

అని ఇట్లు దేవతలు స్తుతింప గౌరి ప్రసన్నురాలై ఓ దేవతలారా! నన్ను స్తుతించిన కారణము గ్రహించితినని తననుండి యొక కన్యక నుద్భవింప జేసి దేవతల యెదుట సాక్షాత్కరింప జేయ దేవతలామెను గాంచి ఓ దేవీ! మేము ప్రళయ మందలి జీవులు పీడింప బడు నట్లు శుంభనిశుంభులచే పీడింప బడు చుంటిమి. నీవు గౌరి కోశముచే జనించితివిగాన కౌశికి యని పిలచెదము. నిన్నింకను శుంభాసురనిబర్హిణి వని కూడ పిలచెదము నీవు గౌరిచే ప్రాదుర్భవించితివి గాన మాతంగి వని పిలువ బడుదువు తల్లీ మమ్ము రక్షింపు మన ఓ

దేవతలారా మీరు నిర్భయ ముగ నుండుడు నేనెవరి యాశ్రయంబును లేక మీకార్యము సాధింతు నని మా దేవి యదృశ్యురాలై శుంభనిశుంభుల సేవకుల యెదుట సాక్షాత్కరింప నేత్రసుఖావహ మైన ఈమనోహరాంగిని చండ ముండులు గాంచి మోహితులై చైతన్యము తప్పి నేల కూలి మరల లేచి రాజు కడకేగి ఓరాజా! హిమాలయ మందొక యపూర్వ సుందరిని గాంచితిమి. ఆమె సింహారూఢయై బద్ధ పాణులగు దేవతా స్త్రీలచే సేవింప బడు చుండెను, దేవతా స్త్రీలలో కొందరామె పాదములొత్తుచుండిరి. కొందరు కేశములు దువ్వుచు నలంకరింపుచు చుండిరి. కొందరు చేతు లొత్తుచుండిరి. కొందరు కండ్లకు కాటుక బెట్టు చుండిరి. కొందరు దర్పణము చూపించుచుండిరి. కొందరు యేలాలవంగ కర్పూర మిశ్రిత మైన తాంబూల మిచ్చుచుండిరి. కొందరుభూషణముల లంకరింపు చుండిరి కొందరామెకు వస్త్రాలంకరణ చేయుచుండిరి. ఆమె అంద మెంతని వర్ణింతును.

ఆమె జంఘోరువులు కదళీ స్తంభసదృశములు ఆమెనాసి కశుక నాసికా సదృశము ఆమె బాహువులు సర్ప సదృశములునై యుండెను ఆమె పదనూపురములు ఘల్లుఘల్లు మని మనోహర ధ్వనులు చేయుచుండెను. ఆ ధరించిన వడ్డాణము శోభ చెప్ప తరముగాకుండెను. కస్తూరిచే పూయ బడిన స్తనద్వయంబులపై ముత్యాల హారములు ధగధగ మెరయు చుండెను. ఆమె కంఠహారము శోభ వర్ణింప దరము గాకుండెను. ఆమెకర్ణములకు మణికుండలంబులు శిరమున నర్ధచంద్రుని ధరించెను. యామె త్రినేత్ర ధారిణియై ఆయత నేత్రియై అక్ష మాలా ధారియై మనోహర కంకణ ధారిణియై, స్వర్ణాంగుళీయంబులు ధరించి శుభ వస్త్రాలంకృతయై గౌరీ రూపయై, పద్మాసన విరాజితయై కాశ్మీరాగరుబిందు తిలకధారిణియై చంద్రాలంకృతమస్తకయై, విద్యుత్ప్రకాశమానయై మాల్యాంబర (చోల) ధారిణియై, యున్నత కుచయై ఆయుధ ధారిణియై నాసురియు గాక, నాగియుగాక, గంధర్వియుగాక దానవియు గాకుండెను. ముల్లోకముల యందు నీమెను బోలు బాల కానరాదు, ఆమెసౌందర్యమున కామె యేసాటి. ఓప్రభూ! ఆకన్యక నను భవించుటకు మీరే కతగును. మీరు పురుష రత్నముగాన నాస్త్రీరత్నము మీకే తగునని పంపుము

డుంబు బలుక, నా దైత్యుడు సుగ్రీవా! నీవు వింటివిగదా. నాసుందరి యున్న తుషారాద్రికేగి ప్రయత్న పూర్వకముగ నాయానతిచే నామె నిటకు తీసి కొనిరమ్మన సుగ్రీవుడు రాజాజ్ఞచే హిమాలయమునకేగి మహేశ్వరిని గాంచి ఓ దేవీ శుంభుడనెడి దైత్యుడుగలడు అతనికి నిశుంభుడను సోదరుడు గలడు వారిరువురు త్రిలోక విఖ్యాతులగు మహా పరాక్రమ వంతులు. వారంపగా నీ కడ కేతెంచితిని మారాజు చెప్పిన వాక్కులను కూడ వినుము.

నేను సంగ్రామమున నింద్రాదుల జయించి వారి సకల రత్నంబుల హరించితిని దేవతలకు యాగముల యందీయ బడిన హవిర్భాగము లన్నియు, మేమే భుజింపు చుంటిమి నీవు సకల రత్నములలో శ్రేష్ఠురాలవని తెలిసి కొంటిని గాన నీవు నాయనుజుని గాని నన్నుగాని ప్రేమించి మమ్మానందింప జేయుమని పలికెను దూత వాక్కులు విని మహామాయా భూతేశ్వర ప్రాణ వల్లభయగు నా దేవి ఓమాతా! నీవు నిజము వక్కాణించితివి. ఇందులో అనృత మేమియు లేదు. కాని పూర్వము నే నొక ప్రతిన చేసియుంటిని, అదే మన యుద్ధ మందు నన్ను జయించి నాదర్ప మణంచిన వానిని పతిగా పొంద నిశ్చ యించితిని. ఇదనా నిశ్చయము ఈనా వాక్కులు శుంభనిశుంభులకువినిపింపుము. పిమ్మట వారి కేది యుచిత మని తోచునో యట్లు చేయుదురన సుగ్రీవుడను నాదూత యామె వాక్కులన్నియు తనప్రభువునకు సవిస్తరంబుగ తెలిపెను. శుంభుడు దూత వాక్కులు విని క్రుద్ధుడై బలవంతుడు సేనాధిపతియు నగు ధూమ్రాక్షుని బిలిచి ఓధూమ్రాక్షా! తుషారాద్రియందొక సుందరి యున్నది. ఆమెను నిక్కడకు తీసి కొని రమ్ము. ఆమె ఇందుల కంగీకరింపనిచో యుద్ధము చేసి యైన నిటకు తీసుకొని రమ్మన నతడు హిమాద్రికేగి, ఓనితంబినీ. దేవీ! నీవు రాజుకడకు మరియాదగ రమ్ము. లేనిచో నరువది వేల సైన్యముతో వచ్చితిని నాప్రభావము చూడుము నిన్ను సంహరింతునన, దేవి దూత వాక్కులు విని ఓమాతా! సంగ్రామ మందు నన్ను జయించిన వానిని వివాహము చేసి కొందునని ప్రతిన బూనితి నని చెప్పియుంటిని గదా నన్ను సంహరించినచో నాప్రతిన యెట్లు చెల్లును? కాన ముఖ్యముగ యుద్ధము చేయవలయు నన, ధూమ్రా క్షుడు క్రుద్ధుడై యామెను చంప నుద్యుక్తుడు కాగా, నా దేవి తనహుంకా రముచే నతనిని భస్మము చేసెను. ధూమ్రాక్షుని సంహరించెను గాన నాటినుండి

ధూమావతి యని పిలువ బడు చుండెను. శతృనాశనమున కై యీమెనారా ధింతురు ధూమ్రాక్షుడు నశింపగ నే దేవి వాహనమగు సింహమును జంపు టకై సైనికులు ప్రయత్నింప వారందరిని సింహము బెదిరించి పారద్రోలెను. శుంభుడిది విని సందష్టోష్ఠ పుటద్వయుడై, మిక్కిలి క్రుద్ధుడై చండ ముండ రక్త బీజులను కొంత సైన్యముతో బంప రాజాజ్ఞచే వారు నా దేవి కడకేగి సింహా రూఢము భగవతియు నణిమాద్యష్ట సేవితయు దశదిశల ప్రకాశ మానయునగు దేవిని గాంచి ఓదేవీ, నీవు మాప్రభువుకడకు రానిచో నిన్ను వాహన సైన్య సహితముగ సంహరింతుము. లోకపాలస్తుత్యు డగు మాప్రభువుని పతిగా బడసి దేవతా దుర్లభమగు యానందము బొందు మన దేవి వారి వాక్కులు విని మందహాసము చేయుచు యథార్థరస పంతము లగు వాక్కులతో నిట్లు పల్కెను. ఓదైత్యులారా; అద్వితీయుడు మహేశ్వరుడు, పరబ్రహ్మ సదా శివుడు నాథ ర్థయె యుండెను. ఇట్టినా పతిని వేదంబులే తెలి యకున్నచో విష్ణుబ్రహ్మాదుల మాట వేరుగ జెప్పనేల, నేనా పరమేశ్వరునకు సూక్ష్మరాలనగు ప్రకృతిని. సింహము యెంత కాముార్తయెనను జంబుక మును కోరునా? కరిణి గార్దభమును కోరునా? మీరు మృత్యువనెడు సర్ప పాశ బంధితులై యుండిరి గాన నిట్లు పల్కు చుండిరి. మీకు శక్తియున్నచో నాతో యుద్ధమునకు రండు. లేనిచో పాతాళమున కేగుడన నాదానవు లిట్లనిరి ఓయబలా, నివన్న మాటలకు నివబలవు గాన విడిచి పుచ్చితిమి. లేనిచో మాచే నీవు మృత్యు ముఖమున పడెదవని వారుభయుల వాదములు తీవ్రమైన కలహమై మహా సంగ్రామ మయ్యెను. ఉభయ సైన్యములు పుంఖాను పుంఖములుగ శర వర్షములు కురిపించు కొనుచుండిరి. ఈసమర మంతయు నాపరమేశ్వరి విలాసముగ జేయుచు చండ ముండ రక్తబీజులను సంహరించెను. ఈదానవులు ద్వేష బుద్ధితో నున్నను దేవిచే మరణించుటచే స్వర్గ లోక వాసులైరి.

శివ మహా పురాణ మందలి ఉమా సంహిత యందు

నలువది యేడవ అధ్యాయము సంపూర్ణము

---

# నలువది ఎనిమిదవ యధ్యాయము

## శుంభనిశుంభుల కధ

మహావీర్య విక్రము డగు శుంభుడు చండముండాది ప్రముఖ రాక్షసులు మరణించుట విని, రణ దుర్ధర్షులు, మదోత్కటులునగు మరికొందరి రాక్షసులను దేవిపై యుద్ధమునకు బంపి జయాశచే బలాన్వితులు కాలక వంశసంభవులు నగు కాలకేయాది రాక్షసులతో గూడుకొని దితి సంజాతులగు శుంభనిశుంభులు రథారూఢులై యగ్నింబడు పతంగంబుల వలె యుద్ధోన్ముఖులై మరణోన్ముఖులగు జీవుల వలె జనుచుండ మృదంగ మర్దల భేరీ డిండిమ ఝర్ఝర ఆనకాది వాద్యంబులు మ్రోగింపు చుండ సంగ్రామ ప్రియులగు యోధులు కవచ ధారులై కదనమునకు జనుచు పరస్పర జయేచ్ఛతో రణభూమి చేరు కొనిరి. కొందరు రథగజతురగా రూఢులై చను చుండిరి, కొందరు పదాతులై జనుచుండిరి. దానవు లందరు జయజయ ధ్వానములతో శతఘ్ని ధ్వనులతో భయంకరా రావములతో హిమాలయ ప్రాంతము నలువైపుల ముట్టడింప మదించిన గజము లన్నియు పర్వత సదృశములై ఘీంకారంబులు చేయు చుండెను. ఒంటెలన్నియు చిన్న చిన్న నగంబుల వలె నొప్పుచు గలగల మని ధ్వనులు చేయుచుండెను. హయములు హేషారవంబులతో బెగ్గురు పక్షుల వలె వ్యోమంబున కెగురుచు గజ కుంభ స్థలములపై పదములు మోపి పైకెగురు చుండ గజకంఠహారములాయున్నట్లు శోభించు చుండెను. అట్టితరి దేవి రాక్షసుల రాకను గాంచి ధనుష్టంకారము చేయుచుండ వాహన మైన సింహము కూడ గర్జింపసాగెను. ఇంతలో శుంభ నిశుంభులు సర్వాలంకార భూషితయు సర్వశస్త్రాస్త్ర ధారిణియు నగు నా దేవిని గాంచి యామె యొక విలాస స్త్రీయనియు వారు పండితులమనియు భావించి మధుర వాక్కులతో నిట్లు పలుకజొచ్చిరి. ఓ దేవీ! నీ వతిమనోహరాంగివి. మాలతీ లత వలె నతి సుకుమారివి. మా కరుకు బాణములతో నిన్ను గొట్టినచో దళముత్యజించిన మాలతీ లతవలె నీవు వాడిపోవుదువు. ఇట్టి మనోజ్ఞవు నీకీ కఠిన మైన యుద్ధ మేల యన చండిక కుపితయై, ఓమూర్ఖులారా? యెందు కిట్లు వృధా సంభాషణలు పలికెదరు?

కదనము చేయ లేకున్నచో నాగలోక మునకు పొందన నపుంసకు (ప్రేష్యులై యూమెపై నామహా రథులు, నద్భుత మైన బాణ వృష్టి గురిపించిరి. ఇంకను వారు తీక్ష్ణ శరంబులు శూల పరశ్వ ధాయుధంబులు భిండి వాల పరిఘ భుశుండి ప్రాసక్షురనామక మహా ఖడ్గంబులు మొదలగు నాయుధంబులు ప్రావృట్కాల మేఘముల వలె కురిపించిరి. ఇట్టి వానితో నతి ప్రగల్భముగ రాక్షస సైన్యమును రథగజ తురంగంబులును దేవి తనయస్త్రశ స్త్రములతో సంహరింపు చుండ శేషించిన సైన్యమును సింహము చంపు చుండెను. పర్వతా కారంబులగు గజంబు లన్నియు కుంభ స్థలంబులు బ్రద్దలై నేల కొరుగుచుండెను. శుంభనిశుంభుల జెండాలు యెగురు చుండగనే వారి సైన్య మంతయు పడి పోవు చుండెను. దైత్యు లందరు విభిన్న దేహులై జలము లేని మీనంబు లవలె గొట్టు కొనుచుండిరి. వాజి యూధంబు లన్నియు కంఠహీనంబులై భయం కరముగ నుండెను. ఇవ్విధంబున కాళీ యుండరిని విగతాసువులుగ జేసెను. సింహము రాక్షసులను జీల్చి వేయు చుండ నచట శోణిత నదియై ప్రవహిం చుచుండెను. ఈరక్త నదియందు భటుల కేశంబులు నాచుగను, వస్త్రంబులు ఫేనంబులుగ నుండెను. దేవీ మాయచే గజంబులు గజంబులతోడను హయములు హయములతోడను రథికులు రథికులతోడను పదాతులు పదాతులతోడను వాహకులు వాహకులు తోడను, మోహముచే నాలో నాలే పోరాడు కొనుచు చాలమంది మరణింప నిశుంభుడు యిది యేమి యాశ్చర్యమని తలపోయుచు ఒకస్త్రీతో నింతమంది పోరు సల్పుటయా యని స్గిగ్గుజెంది యుద్ధము చేయుచున్న రాజైన తనయన్న కోపించు నని భయము చెందుచు, అచ్చెరు వందుచు మనస్కై కరాళ కాళియే తెంచెను, ఈశ్వర విలాసముచే దరిద్రుడు మహా ధనవంతుడగును

ధనవంతుడు మహా దరిద్రుడు డగును కాలమిట్లు తారుమా రగుచుం డును. ఇంకను జడుడు మతిమంతు డగును, మతిమంతుడు జడు డగును. ఘాతు కుడు సాధు వగును సాధువు ఘాతకు డగును. బలవంతులు పరాజితులు, పరా జితులు బలవంతులు నగుదురు. దేహధారులకు పరమేశ్వ రేచ్ఛచే జయాప జయంబులు కల్గుచున్నవి, త్రిమూర్తులు కూడ కాలము దాట నశక్యులు. వీరులు

సంగ్రామమును వీడిపోవుట కిచ్ఛగింపరు. యుద్ధము చేయుద మన్న బలమంతయు నశించెను, ఈమె దేవతా రక్షణకై దైత్యసంహారమునకై వచ్చిన పరదేవత గాని సామాన్య వనితగాదు. స్త్రీచే సంహరింప బడుట యశస్కరము గాదు. యుద్ధవీరులు స్త్రీలచే సంహరింప బడకూడదు. ఈమెను సంహరింపక నాయన్న ముఖ మెట్లు చూడగలను? ఏమైనను యుద్ధము తప్ప దనుకొని మహారథుడైన నిశుంభుడు దేవి కడకు రథము బోనిమ్మని సారథి కాజ్ఞాపించి యామె కడకేగి, ఓ దేవీ, నీవు రణమం దింతమంది బలహీను లగు భటుల జంపిన ప్రయోజన మేమున్నది? నీవు కవచధారివై మాయన్న దమ్ము లిరువురితో యుద్ధముచేసి గెలువు మన:

కౌశికి నామాఖ్యయగు నా దేవి నిశుంభుని మాటల నాగ్రహించి విపత్తులు కల్గనున్నప్పుడు విపరీత బుద్ధులు కల్గుచుండును, దీనికంతకు కాలమే కారణ మని యాదేవి పలుక నిశుంభు డామెపై వేలకొలది శరవర్షము కురిపింప దేవి యాబాణము లన్నియు మధ్యలోనే ఖండించెను. తదుపరి నిశుంభుడు తనఖడ్గమును సింహముపై విసర, దేవి తనఖడ్గముచే నాఖడ్గమును ఖండించెను. తదుపరి యాదానవుడు బాణప్రహారము చేయుచు నామెహృదయముపై త్రిశూలము ప్రయోగింప, నా దేవి తనముష్టి ప్రహారములచే వాటిని త్రుంచి వేసెను. మరణోన్ముఖు డగు నాయసురుడు జగదంబపై గదను ప్రయోగింప, నా దేవి త్రిశూలముచే ఖండించి, మరియొక త్రిశూలముచేతను నాశీముఖ విశిఖంబుల చేతను దానవుని గొట్టి భువిపై బడవైచెను. బలవంతుడు అసుర ప్రియుడు నగు శుంభుడు తన సోదరుని మరణ వార్త విని రోషపూరితుడై యష్టభుజంబులు గల్గి రథారూఢుడై, కౌమారికడ కేతెంచుచు, శంఖమును, ధనుష్టంకారము చేయుచు, దుస్సహమైన సింహనాదము చేయుచు, వచ్చుచుండ, నీవాద్యత్రయంబుచే నాకసము బ్రద్దలగునా యున్నట్లు ప్రతిధ్వనించుచుండెను; వచ్చుచున్న దైత్యుని గాంచి దేవి అట్టహాసముగ నవ్వుచు, నోరి దైత్యాధమా! ఈరణమున నీవు స్థిరముగా నుండుము ఇదే వచ్చుచుంటి నన, దేవత లందరు జయజయ ధ్వానంబులు చేయుచుండిరి, శుంభుడు ప్రదీప్తాగ్నివలె తేజోవంతమైన శక్తిని దేవిపై ప్రయోగింప, నామె యనేక బాణపరంపరలచే

నాశక్తిని తుత్తినియలు గావించి, గొప్ప శూలము మహనిపై విసర, సహస్ర వజ్రాహతపర్వతమువలె నేలగూలెను. ఇతడు భువిపై పడగనే పర్వత సాగరములతో గూడిన భూమంతయు చలించెను. శుంభుడు కొంతసేపటికి మూర్ఛదేరి దశసహస్ర భుజుడై, త్రిశీర్షుడై, దేవకంటకమగు చక్రమును సింహవాహినియగు దేవిపై ప్రయోగింప నాదేవి యసుర చక్రము నుపసంహరించి యసురునిపై త్రిశూలమును ప్రయోగింప, నతడు మరణించెను. శుంభనిశుంభు లిరువురు జగదంబ పాణి పద్మములచే సంహరింపబడిరి గాన పరమగతి నొందిరి. వారు మరణింపగనే శేషించిన సైన్యమును సింహము సంహరించి భక్షించెను. సురలు దేవరాజ్యమును స్వీకరించిరి. కొందరు దానవులు దశదిశలకు పారిపోయిరి. నదులన్నియు శుద్ధోదకములచే యథాస్థానమున ప్రవహింప జొచ్చెను. వాయువులు సుఖవంతముగ వీవజొచ్చెను. అంబరము నిర్మలముగ నుండెను. బ్రహ్మర్షులు మరల యాగములు చేయ నారంభించిరి. ఇంద్రాది దేవత లందరు సుఖముగ నుండిరి. ఈ ఉమాచరిత్ర పరమ పవిత్రమైనది. ఇది పఠించిన వారిలు దేవతా దుర్లభము లగు భోగము లనుభవించి పరమందు మాసాన్నిధ్యము నొందగలరు.

శివ మహా పురాణమందలి ఉమాసంహితయందు
నలువది యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

# నలుబది తొమ్మిదవ యధ్యాయము

## ఉమాప్రాదుర్భావము

శౌనకాదులు సూతు నిట్లు ప్రశ్నించిరి. సర్వవేత్త వగు నోసూతుడా ! సరస్వతి యెట్లుద్భవించెను? ఉమ, ఆమె పరబ్రహ్మస్వరూపిణి యనియు మూలప్రకృతియనియు, నిత్యానందమయి యనియు, సతి యనియు, వినియుంటిమి. సరస్వతికూడ నీమెయే యని వినియుంటిమి. అ దెట్లయ్యెనో చెప్పుమన, సూతు డిట్లు చెప్పదొడంగెను.

ఏ దేవియొక్క విజ్ఞానము కల్గినతోడనే సకలవిద్యలు, సకలసంపదలు గల్గి పరమగతి నొందెదరో యట్టి పరమోత్కృష్ట మగు చరిత్ర చెప్పెదను వినుము. దేవదానవు లిరువురు నొకానొకప్పుడు సంగ్రామము చేయుచుండ, మహామాయాప్రభావముచే దేవతలు విజయము నొంది, మాకంటె ధన్యు లెవరు? మమ్ముల నసురు లేమి చేయగలరు? ఇట్టి మన దుస్సహమగు ప్రతాపమును గాంచి యసురులు పాతాళమున పరుగులెత్తిరి. మాబల మెంత యాశ్చర్యకరమైనది? మా తేజంబు దైత్యవంశక్షయకరమైనది. మా భాగ్యము పండితులే కొనియాడజాల రని దేవత లందరు తలంచుచుండ, వారియెదుట తేజఃపుంజ మొకటి బయలుదేరెను. ఎన్నడు కనివిని యెరుంగని యా తేజమును గాంచి విస్మితులై, యిదియేమి? యిదియే మని యూర్ధ్వస్వరంబున బల్కుచు, ఈ శ్యామల తేజంబు నెన్నడు గాంచియెరుంగమని తలచుచుండిరి. ఇంతలో దేవేంద్రుడు వాయువును బిలిచి అదేదియో తెలిసికొని రమ్మనగ నత డా తేజముకడ కేగ, నీ వెవర వని యా తేజము ప్రశ్నించెను. నేను లేనిచో జీవులు చలింపనే చలింపవు. నేను వాయువును నేను జీవులనడుమున నోతప్రోతములవలె నుండి నిఖిలాధారుడనై జగత్తంతయు చలింపజేతు నన, నోవాయువా! నీకు శక్తియున్నచో నీతృణమునుకదుల్చుము, అంత శక్తి వంతుడవా యని తేజము బలుక, అనిలుడు సగర్వముగ నింతయేనా యని తనశక్తి నంతయు జూపి తృణమును కదల్ప నశక్తుడై, తూష్ణీంభావుడై ఇంద్ర సభకేతెంచెను. తదుపరి దేవేంద్రుడు బలవంతు లగు దిక్పాలకుల నందరిని బంప, వా రసమర్థులై తిరిగివచ్చిరి. సమర్థు డగుదేవేంద్రుడు వారి మాటలు విశ్వసింపక నింతబలవంతుడను ఆతృణముకూడ నెత్తలేనా? వానియంతు చూడకుందునా? ఓసురులారా! మీరు చేయలేనిపని నేనుచేసెదను చూడు డని సగర్వముగ బయలుదేరి దుస్సహమైన యా తేజంబు గాంచుచు విస్మితు డగుచుండ, నింతలో నా తేజ మదృశ్యమయ్యెను. ఇంద్రు డిదిగాంచి యబ్బురపడుచు, ఈమె యెవరు? మాగర్వమణచుటకై వచ్చిన యుమాదేవియై యుండవచ్చును. ఈమె యెవరో తెలిసినచో నామెను నేను శరణుపొందెదను. ఇవ్విధంబున పాకశాసనుడు పలుమారు తలచుచుండ, నింతలో నిర్వ్యాజకరుణావతి యగు నాశివాంగన దేవతలగర్వము లణంచుటకై చైత్రశుద్ధనవమినాడు

మధ్యాహ్న సమయంబున సచ్చిదానందరూపిణి యగు మాయాదేవి ప్రాదుర్భ వించెను.

ఆమె యుద్భవించినంతనే దశదిశలు ప్రకాశింప జొచ్చెను. ఆదేవి ఓ దేవతలారా ! నేనే బ్రహ్మస్వరూపను. సర్వవ్యాపిని నేనే యని పలుకుచు, స్ఫుటాక్షరంబులతో మాట్లాడుచు, చతుర్బాహువులు గల్గి, పాశాంకుశధా రిణియై వరదాభయహస్తంబులు గల్గి శ్రుతులచే సేవింపబడుచు, నవయౌవన గర్వితయై, మనోహారిణియై, రక్తాంబరధారిణియై, రక్తమాల్యానులేపనయై, కోటికందర్పసంకాశయై, చంద్రకోటి సమప్రభయై, మహామాయా విశార దయై, సర్వాంతర్యామియై, సర్వభూతసాక్షిణియై, పరబ్రహ్మస్వరూపిణియై, ఇంద్రుని యెదుట సాక్షాత్కరించి, ఓ దేవతలారా! నేను బ్రహ్మను గాను, విష్ణువుని కాను, రుద్రుడను గాను. మీ రింత గర్వించుటకు కారణ మేమి? నేను పరబ్రహ్మను, పరంజ్యోతిని, ఓంకార స్వరూపిణిని శివ శక్త్యాత్మక ద్వంద్వస్వ రూపిణిని, సర్వము నేనే గాని, నాకన్న భిన్నమైన దేదియు లేదు. నేను సాకార నిరాకారను సర్వతత్త్వస్వరూపను, అప్రతర్క్య గుణాత్మను, నిత్యురా లను, కార్య కారణ రూపను, నేనొకప్పుడు స్త్రీవలెను మరొకప్పుడు పురు షునివలెను, నింకొకప్పుడు నుభయాకారములతో నర్ధనారీశ్వరినై యుందును. నేను సర్వాకార స్వరూపను, విరించి యగు సృష్టికర్తను నేను, జగత్పాలకు డగు నచ్యుతుని నేను, సంహారకర్తయగు రుద్రుడను నేను, సర్వవిశ్వమును మోహింప జేయుదానను, నేను. కాళి, కమలా వాణీ, మొదలగు శక్తు లన్ని యు నేను, నాయంశచే దేవతలు, సకల కళలు జనించినవి, మీరు నాప్రభావ ముచే నసురులందరిని జయింపగ గల్గితిరి. అజ్ఞానులై యిది మీ రెరుంగక మీరే ప్రభువు లని తలచు చుండిరి, సర్తకుడు కొయ్యబొమ్మ నాడించినట్లుగ సర్వభూతముల నాడించు మహేశ్వరిని. నా శాసనముచే పవనుడు వీచు చుండెను, హవ్యవాహనుడు దహింపుచుండెను. లోకపాలు లందరు పాలింపు చుండిరి. నాలీలచే నొకప్పుడు దేవతలకు మరొకప్పుడు రాక్షసులకు విజయము కల్గుచుండును, అవినాశి, పరంధామ, మాయాతీత, పరాత్పర, యని శ్రుతులు నన్ను వర్ణించు చుండును. సగుణ నిర్గుణ స్వరూప

నని రెండు విధములుగ బిలుతురు. వీటిలో సగుణము మాయతో గూడినది నిర్గుణము మాయారహితము నై యుండెను ఇంతయు తెలిసికొని మీ గర్వం బులు వీడుడు. సనాతనియు ప్రకృతియు నైన నన్ను ప్రేమతో సేవింపు డన సుని లా దేవి వాక్కులు విని భక్తితో నతకంధరులై యిట్లు స్తుతించిరి, ఓతల్లీ జగదీశ్వరీ! పరమేశ్వరీ! మమ్ము రక్షింపుము మే మిట్టిగర్వము నెన్నడు పొందము రక్షింపు మని యానాటి నుండి దేవతలు గర్వములు వీడి దేవిని సేవించు చుండిరి. ఉమాప్రాదుర్భావ శ్రవణ పఠనాదులచే భుక్తిముక్తులు కల్గును.

శివ మహా పురాణమందలి ఉమాసంహితయందు
నలువది తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

# ఏబదియవ యధ్యాయము

## శతాక్షీయవతారము.

ఓ సూతమహర్షి! అమృతోపమాన మైన దుర్గాచరిత్రను వినగోరుచుంటిమి. ఉమాదేవిగాథ లెన్నివిన్నను మాకు తృప్తి కల్గుటలేదని మహర్షులు బలుక సూతు డిట్లు చెప్పదొడంగెను. మహాబలుడు, విఖ్యాతవంతుడు, మరుపుత్రుడు నగు దుర్గము డనెడివా డుండెడివాడు. అతడు బ్రహ్మవరముచే వేదచతుష్టయ మును బడసెను. ఇతడు దేవతలను కూడ జయించు బలవంతుడు గాన దేవత లితనికి భయపడసాగిరి. వేదము లన్నియు నితనివద్ద నుండుటచే, వేదక్రియ లన్నియు లోపించి బ్రాహ్మణులు దురాచారులై యుండ, జన్నము లేకుండుటచే సురలు బలహీనులై యుండిరి. ఎచటను దానంబులుగాని, తపంబులుగాని, యోగంబులు, యాగంబులుగాని లేకుండెను. హోమంబు లసలే లేవు. దీనిచే శతవత్సరంబు లనావృష్టి సంభవింప త్రిలోకవాసులు హాహాకారంబులు చేయుచు దుఃఖింపుచుండిరి. ప్రజలందరు క్షుత్పిపాసలచే పీడింపబడుచుండిరి. వాపీకూపతటాక(సాగర)నదీనదంబు లన్నియు నిర్జలంబు లగుటచే వృక్షలతాగు

ల్యంబు లన్నియు శుష్కించిపోయెను. దీనచేతస్కు లగుప్రజల మహాదుఃఖ మును గాంచి దేవతలు యోగమాయ యగు పరమేశ్వరిని శరణుపొంది, ఓప రమేశ్వరీ! ఓమహామాయీ! నీప్రజ లందరు దుఃఖింపుచుండిరి. రక్షింపుము. రక్షింపుము, నీకోప ముపసంహరింపకున్నచో లోకము నశించును. ఏవిధంబుగ మధుకైటభులను, మహిషాసురుని, చండముండరక్తబీజధూమ్రాక్షులను, శుం భనిశుంభులను సంహరించితివో ఆవిధంబుగనే యీదుర్గముని సంహరించి జగత్ స్వాస్థ్యము చేకూర్పుము. ఓకృపాసాగరీ! దీనబాంధవీ! బాలురు పదేపదే యపచారములు చేసినను, తల్లులుగాక మరెవరు రక్షింతురు? తల్లి లేకున్న బిడ్డలయపరాధములు క్షమించువా రెవరు? మాతల్లివై యున్న నీవు మా యపరాధములు క్షమించి మమ్ము కాపాడుము. దేవతలకు బ్రాహ్మణులకు హాని సంభవించినపు డెల్ల నీ వవతరించి కాపాడుచుంటివి. ఓకృపామయీ! మ మ్మీవిపత్తులనుండి రక్షింపు మన, నా దేవి యనంతాక్షియమైన రూపముతో వారికి దర్శనమిచ్చి ధనుర్బాణములు పద్మము నానాకందమూలఫలంబులు నాల్గుహస్తంబుల ధరించి, ప్రసన్నముఖపంకజయై, కరుణాపూరితేక్షణయై దుః ఖితప్రజలను గాంచుచు నవదినంబులు గనుపుచు నామె కరుణాపూరితాశ్రువులు గార్చుచుండ, సహస్రధారలుగ వర్షింపజొచ్చెను. మేఘవర్షములవలె గార్చు చున్న నీమె యశ్రుజలముచే సర్వౌషధులు చిగురించెను. అగాధములైన నదీ సాగరంబులు జలపూరితములై యుండెను. శాకమూలఫనాదులచే భూమి పరి పుష్టయై యుండెను. ఆమె ఫలమూలంబులు ధరించుటచే భూమిఫలమూలాదు లచే సమృద్ధిగ నుండెను. గోవులకు వలసినంత తేనెవచ్చినిక బీళ్లు సమృద్ధిగ నుం డెను. దీనిచే దేవతలు, విప్రులు, ప్రజలు, సంతసించిరి. దేవి దేవతలను. విప్రు లను గాంచి మీ కేమి కావలయునో తెల్పు డన, ఓ దేవీ! నీవలన జీవులన్నియు సుఖించుచున్నవి. దుర్గము డపహరించిన వేదములు తిరిగి మా కిమ్మన దేవి తథా స్తని పల్కి యదృశ్య కాగా, దేవతలు. విప్రులు సంతుష్టాంతరంగులై దేవిని స్మరింపుచు నెవరిదారిని వా రేగిరి.

అట్టితరి త్రిభువనంబులవారు పెద్దకోలాహలములుచేయుచు ప్రఫుల్లక మలలోచనియు, జగద్యోనియు నగు నాదేవిని స్తుతింపుచు, దివిభూమ్యంత

రిక్షుంబుల కేగుచుండిరి; దుర్గము డీ కోలాహల మంతయు విని స్వర్గపురి నాక్ర మింప, దేవి యిదంతయు గాంచి, పుర బహిర్భాగమున దేవతలతో గూడి తేజోమయ చక్రమును దాల్చి రణసంసిద్ధయై యుండ, దేవదానవులకు ఘోర యుద్ధము జరుగుచుండెను. వా రుభయులు నిశిత బాణములచే నొకరి నొకరు భేదింపు కొనుచుండ, నా దేవి శరీరము నుండి కాళీ, తారా, ఛిన్నమస్తా, భువనేశ్వరి, శ్రీవిద్యా, భైరవీ, బగళా, ధూమ్రా, త్రిపుర సుందరి, మాతంగి, మహావిద్యా స్వరూప లగు దశశక్తు లుద్భవించిరి. వీరందరు నాయుధపాణులై నసంఖ్యాకము లగు మాతృగణముల నుద్భవింప జేసిరి, వారందరు చంద్రకళావతంసులై, విద్యుత్సమ ప్రభలై, భయంకర యుద్ధము చేయుచు దుర్గముని శతాక్షోహిణీ జలంబుల సంహరించిరి తదుపరి దుర్గముని కూడ సంహరింప నతడు మూలముతో గూడిన వృక్షమువలె నేలగూలెను. ఈవిధంబున దేవి దుర్గమాసురుని జంపి యతనివద్ద నున్న వేదములు సురల కిచ్చియుండెను.

తదుపరి దేవతలు దేవి నిట్లు స్తుతించిరి. ఓజగదంబికా! నీవు మాకై యనంతాక్షి స్వరూపముదాల్చితివిగాప నిన్ను శతాక్షి యని మునులందరు పిలచెదరు. మరియు నీవు శాకములధరించి మా కిచ్చితివి గాన నీవు శాకంభరి వని పిలువబడుదువు, దుర్గముని సంహరించితి గాన దుర్గ వని పిలచెదరు. మమ్ము దుర్గమునుండి రక్షించితివి గాన దుర్గవని పిలుతురు. దుర్గా భగవతి యని కూడపిలువ బడుచుందువు. నిన్ను కష్టముచే గాని పొందలేరు గాన దుర్గ వని పిలువ బడుదువు. నీకు వనపర్వతములే యాస్థానము గాన దుర్గవని పిలచెదరు, ఓ యోగనిద్రా నీకువందనము. ఓమహా బలా! నీకునమస్కారము. ఓప్రజ్ఞాప్రదాయినీ? నీకుప్రణతులు. ఓవిశ్వమాతా; నీకుమస్కృతులు, ఒపరమేశ్వరీ! నీవు తత్వమస్యాది వాక్యంబులచే తెలియ బడుచుందువు. నీవు వాఙ్మనః కాయములకు పొంద శక్యము కానిదానవు. నీవు రవిచంద్రాగ్ని నేత్రవు, అల్పబుద్ధులమగు మేము నీప్రభావ మెట్లు తెలిసి కొందుము? ని న్నెట్లుస్తుతింప గలము? మాయందు నీవిట్టికృపను జూపితివి. ఓసురేశ్వరీ ఓశతాక్షీ! నీవు లేకున్న ముల్లోక వాసులు నెంతదుఃఖింతురో కదా నీవు లేకున్న మేమందరము నిరంతరము దుఃఖింప వలసినదే కదా?

నీవలన మాశత్రువు నశించెనన, దేవి వారి నుడువులు విని ప్రసన్న వదనయై ఓసురలారా! వత్సము బిలిచి నంతనే గోవు పరుగిడి వచ్చునట్లు, మీరు పిలిచినంతనే నే నేతెంచి మీదుఃఖములు బాపుచుందును. తల్లి తనశిశువులను గాంచక యుండలేనట్లు మిమ్ములను వీడి నే నుండ జాలను మీ రందరు నాప్రాణ తుల్యులు. మీరు నాభక్తులై శక్తివంతులైరి. మీకు భయము లేదు. మీయాపత్తు లన్నియు తీర్చి దిద్దుదానను నేనుండగ మీకు భయ మేల! నే నిదివరలో మీశత్రువులగు దైత్యుల నెట్లువధించితినో నిటుపై కూడ నట్లేవధింప గలను. సంశయింపకుడు. ముమ్ముందు శుంభనిశుంభులు సురల దానవులై జనించి నపుడు నేను గో కులంబున యశోదా గర్భంబున బాలికనై జనించి నాయన తార మట నిల్పుకొందును. అరుణాసురుని, భ్రమరముచలె తిరుగుచు సంహరించితిని గాన, భ్రమరాంబ యని పిలువబడుచుందును. నేను భయంకర రాక్షసులను సంహరించితిని గాన భీమాదేవి యని పిలువ బడుదును ఎప్పు డెప్పుడు భూలోక వాసులు స్వర్గలోక వాసులు బాధ పడు చుందురో అప్పుడు నే నవతరించి వారిబాధలు బాపెదను నే నొక్కతెనే శతాక్షి యనియు, శాకంభరి యనియు దుర్గ యనియు పిలువ బడుదును. శతాక్షితో తుల్య మగుదేవి మరొండు లేదు. దుఃఖముదు బాపుటకు యీామెను మించిన దేవత లేదు.

శివ మహా పురాణ మందలి ఉమాసంహితయందు
యేబదవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఏబదియొకటవ యధ్యాయము

### క్రియాయోగ నిరూపణము

వ్యాసశిష్యుడవు, పౌరాణికోత్తముడవు నగు నోసూతా! వ్యాసుడు సనత్కుమారునిచే విన్న జగదంబ యగు నుమా దేవియొక్క క్రియాయోగ మును జెప్పు మని ఋషులు ప్రశ్నింప సూతు డిట్లుచెప్పదొడంగెను. ఓమహా

ష్ములారా! మీరు ధన్యులు. దేవీభక్తులు, దృఢవ్రతులుగాన మీకు పరాశక్తి యొక్క యతిరహస్యపు గాథలు చెప్పెద వినుడు. ఒకానొకప్పుడు వ్యాస భగవానుడు సనత్కుమారుని గాంచి సర్వజ్ఞుడ వగునో సనత్కుమారా! బుద్ధి మంతుడ వగు నో బ్రహ్మపుత్రా! మహాద్భుతమైన యుమాదేవియొక్క క్రియాయోగము వినదలచితిని. ఆయోగలక్షణ మేమి? అ దెట్లాచరింపవల యును? దానిఫల మేమి? ఇదంతయు విస్తరించి చెప్పుమన సనత్కుమారు డిట్లు చెప్పదొడంగెను. ఓపరాశరనందనా! నీవీతత్వరహస్యమంతయు నడిగి తివి గాన నేను వర్ణించి చెప్పెద వినుము. నీదేవివలన భుక్తిముక్తులు కల్గును జ్ఞానయోగము క్రియాయోగము భక్తియోగము లనెడి మూడుమార్గములు కలవు. చిత్తము నాత్మయందు కలుపుటయే జ్ఞానయోగ మందురు. చిత్తము బాహ్యక్రియలయం దుపయోగించుట క్రియాయోగమందురు. తనచిత్తము దేవియందుంచి ధ్యానముచేయుట. భక్తియోగమందురు. దీనినే ఆత్మైక్య భావన మని కూడ నందురు. ఈమూడు యోగములనుకూడ క్రియాయోగ మందురు. సత్కర్మలచే భక్తి కల్గును. భక్తిచే జ్ఞానము కల్గును.

జ్ఞానముచే ముక్తి కల్గు నని శాస్త్రములు ఘోషించి చెప్పుచుండెను. ప్రధానముగ ముక్తికి కారణము యోగము. ఈక్రియాయోగమే మోక్ష సాధనమై యున్నది. ప్రకృతియే మాయ. ఈమాయయే సనాతనబ్రహ్మ యని తెలిసికొనవలెను. వీరిరువురకు భేదము లేదని తెలిసికొన్నచో భవ బంధవిముక్తు డగును. పాషాణముచే గాని, దారువుచే గాని, మృత్తికచే గాని, దేవాలయము నిర్మించినచో నిత్యము యోగ మభ్యసించినఫలము లభించును. ఇట్లు దేవతాలయము నిర్మించినచో, సహస్రతరములవెనుకవారు, సహస్రతరములముందువారు తరింతురు. ఇక నిర్మాతమాట చెప్పనేల? అతడు దేవీసాన్నిధ్యముననే యుండును. మరియు కోటిజన్మములలో జేసిన స్వల్ప బహు పాపములైనను నశేషముగ నశించును. మరియు, నదులలో గంగానదివలెను, నదములలో శోణనదమువలెను, నోర్పునకు పృథివివలెను, గంభీరమునకు సాగరమువలెను, గ్రహములలో సూర్యునివలెను, సర్వదేవత లలో నీపరాంబిక విశిష్టమైనది. దేవీమందిరము నిర్మించినవాడు ప్రతిజన్మ

యు పున ప్రతిష్ఠావంతుడై యుండును. మరియు, వారణాసియందున, కురు క్షేత్రమందున, ప్రయాగమందున, పుష్కరక్షేత్రమందున, గంగాసాగర సంగమతీరంబున నైమిశారణ్యమున, నమరకంటకమందున, శ్రీశైలంబున, గోకర్ణమందున, మధురాపురియందున, నయోధ్యయందున, ద్వారావతి యందున, దేవీమందిరనిర్మాణము గావించినచో, భవబంధవిముక్తు డగును.

దేవీమందిరము నిర్మించిన యెడల నెన్నిసంవత్సరములు స్థిరముగా నుండునో అన్ని వేలసంవత్సరము లాయూనిర్మాతలు మణిద్వీపమునందు సుఖముగా నుందురు. విగ్రహములు ప్రతిష్ఠించినవారు దేవీలోకంబున స్థిరముగా నుండెదరు. దేవీవిగ్రహములను శుభముహూర్తశుభగ్రహములయందు ప్రతిష్ఠించినచో మనుజులు యోగమాయాప్రభావముచే కృతకృత్యు లగుదురు. దేవీప్రతిష్ఠచే తానుతరించుటయేగాక వెనుకవారు, ముందువారుకూడ తరింతురు. ఒక్కయీమందిరస్థాపనచే త్రిలోకములు స్థాపించినఫలము వచ్చును. శ్రీచక్రము స్థాపించినచో కోటిగుణితఫలము లభించును. పంచాయతనంబున దేవిని మధ్యనుంచి, దేవిని పూజించినచో గణింప శక్యముకాని పుణ్యము లభించును. సూర్యచంద్రగ్రహణసమయములందు విష్ణుజపము కోటి చేసిన దానికన్న, పంచాయతమున దేవీప్రాధాన్యంబుగ పూజించినచో దానికి నూరురెట్లు ఫలము లభించును. శివనామమును కోటి జపించుటకన్న శ్రీదేవి జపము కోటిరెట్లు ఫలము వచ్చును. శ్రీదేవికి ప్రాసాదము నిర్మించి స్థాపించినచో పొంద శక్యముకాని దేదియు నుండదు. వారి కెట్టిపాపము లంటక పుత్రపౌత్రులతో వర్ధిల్లుచుందురు. ఈదేవిని మనంబున స్థాపించుకొన్నచో మునిదుర్లభ మగు నుమాలోకము సిద్ధించును. ఎవడైనను నాకు ధన మున్నచో దేవీమందిరనిర్మాణము చేయుదు నని తలచినను, తాను, తన వంశమువారు కూడ స్వర్గలోకవాసు లగుటకు సందియము లేదు. మహామాయాప్రభావంబుచే ముల్లోకములయందు దుర్లభమైన దేదియు నుండదు. ఉమాపరాంబిక నర్చించెడివారు దేవీగణంబు లని యెరుంగవలయును. లేచినను, కూర్చున్నను, పరున్నను సర్వకాలసర్వావస్థలయందు, ఉమా యనునక్షర ద్వయంబు నెవరు పఠింతురో వారు దేవీగణంబులై యుందురు. నిత్యనైమి

త్రికసమయములయందు దేవ్యాలయమున కేగి, పుష్పధూపనైవేద్యాదులచే పూజించినను నిత్యము దేవ్యాలయము గోమయమృత్తికలచే నలకినను తుడిచి నీరు చల్లినను, ఆలయ మంతయు రమ్యముగ నలంకరించినను వారికుల మువారందరు దేవీయాశీస్సుల నొందెదరు. మరియు నావారలుకూడ శతవర్షంబులు జీవించి యాయురారోగ్యైశ్వర్యవంతులై యుండవలె నని కోరినచో నా దేవి దయచే వానికోర్కెలన్నియు సిద్ధింపజేయును. ఆపదలు రాకుండ కాపాడు మని కోరినచో నామె యాపదలు రానీయదు. దేవీ విగ్రహమును శుభప్రదముగ జేయించిన వారలు పదివేలబంధువర్గముతో మణిద్వీపమందు వసింతురు. ఈమెమూర్తిని స్థాపించి పూజించినచో కోరినవన్నియు లభించును. ఏమనుజు లీయుత్తమవిగ్రహమును స్థాపించి మధుఘృతంబులచే స్నానము చేసినచో అంతులేనిఫలము వచ్చును. చందనము, అగరు, కర్పూరము జటామాంసి, తుంగముస్తలు చూర్ణము చేసి కలిపినజలంబు తోడను, యేకవర్ణంబుగల గోక్షీరంబుతోడను దేవికి యభిషేకము చేసి నైవేద్యమిడి, గోఘృతాక్తవత్తులచేతను కర్పూరముచేతను నీరాజన మిడి షోడశోపచారముల పూజింపవలెను. కృష్ణపక్షాష్టమిరోజున గాని నవమిరోజున గాని, యమావాస్యరోజున గాని, పంచపర్వముల యందు గాని, ధాత్రీగంధపుష్పాదులచే పూజింపుచు, దేవీసూక్తముచే గాని, శ్రీసూక్తముచే గాని, మూలమంత్రముచే గాని, పూజింపుచు, విష్ణుక్రాంతము తులసిని వర్జించి, మిగిలినపుష్పపత్రంబులచే పూజించినచో, దేవి చాలా సంతోషించును. ఇంకను, కమలంబులచేతను, స్వర్ణపుష్పంబులచేతను, రజితపుష్పంబులచేత గాని, దేవి నర్చించినచో, కోటిసిద్ధులు వడసి పరమధామమున కేగెదరు. పూజానంతరము

శ్లో॥ అపరాధసహస్రాణి క్రియంతేహర్నిశంమయా
దాసోహమితిమాంమత్వా క్షమస్వపరమేశ్వరి.

శ్లో॥ ధ్యాయేత్కంఠీరవారూఢాం
వరదాభయపాణికాం
మమసిద్ధిమసిద్ధింవా
స్వప్నేసర్వంప్రదర్శయ.



అనియిట్లు వేడుకొని ధ్యానముచేయువలెను. తదుపరి నానాఫలభక్ష్యాన్నములు నైవేద్యము చేయవలెను. ఈనైవేద్యాన్నము భక్షించిన వారలు సర్వపాపవిముక్తు లగుదురు. చైత్రశుద్ధ తదియరోజున భవానీవ్రతము చేసినచో భవబంధవిముక్తులై పరమగతి నొందెదరు. మరియు నీ దినంబున నుమాశంకరులను పూజించి డోలోత్సవముచేయువలెను. కుసుమకుంకుమ వస్త్ర కర్పూరాగరు చందన ధూప దీపనైవేద్య కుసుమమాలలచేతను నితరసువాసనగంధంబుచేతను దేవినలంకరించి యర్చించి మహామాయా స్వరూపిణి యగు మహేశ్వరి కీవిధంబుగ డోలికోత్సవము గావింపవలెను. ఇట్లు ప్రతివత్సరము నియమముగ డోలికోత్సవము గావించినచో దేవి సకలకోర్కె లీడేర్చును.

మరియు నక్షతృతీయయగు వైశాఖశుద్ధ తదియరోజున నంబికావ్రతమాచరించి మల్లికామాలతీమందార బంధూక పంకజ జపాపుష్పంబులచే గౌరీశంకరులను పూజించినచో మనోవాకాయ కర్మలతో జేసిన కోటిజన్మకృత పాపంబులు నశించును.

జ్యేష్ఠశుద్ధ తదియరోజున దేవిపూజను గావించినచో సిద్ధింపని వేవియు నుండవు.

ఆషాఢశుద్ధ తదియరోజున పృథ్వీరథముగను రవిచంద్రులు చక్రములుగను చతుర్వేదంబులు తురంగంబులుగను బ్రహ్మ సారథిగను పూలమాలికలు నానామణిహారంబులుగను భావించి రథమునను కల్పించి ఈరథమందు దేవిని స్థాపించి లోకరక్షణకు ప్రజలను రక్షించుటకై బయలుదేరు చున్నదా యన్నట్లు భావింపుచు మందమందముగ రథము నడుపుచు జయజయజయ శబ్దంబులు బల్కుచు నోదేవి! దీనులమగు మమ్ము రక్షింపుమని వేడుచు ననేక వాద్యఘోషంబులతోడను స్తుతులతోడను రథోత్సవము గావింపుచు సీమాంతమువరకు రథమును గొంపోయి రథమందున్న దేవిని పూజించి నానావిధంబులుగ స్తుతించి మరలగృహంబునకు తీసికొనవచ్చి శతపర్యాయములు దేవికి నమస్కరించి ప్రార్థించి ఇట్లురథోత్సవము గావింపవలెను. ఇవ్విధంబున రథోత్సవముగావించినచో నిహమందు సర్వసౌఖ్యము లనుభవించి పరమందు దేవీ సాన్నిధ్యము నొందగలరు.

శ్రావణ భాద్ర పద శుద్ధ తదియల యందు దేవిని పూజించి పర మాన్నము మొదలగు పిండి వంటలు నైవేద్య మిచ్చినచో, పుత్ర పౌత్రులు గల్గి ముదాన్వితుడై, ధైర్యవంతుడై, యంతమున సర్వలోకోపరి లోకమై దేవీ సాన్నిధ్య మందుండును.

ఆశ్వయుజ శుద్ధంబున దేవీ నవరాత్రులు గావించినచో, సర్వ కామ్యము లీడేరును. ఈ నవ రాత్రి వ్రతభావమును షణ్ముఖుండగు కుమార స్వామి గాని పంచముఖుడగు పరమేశ్వరుడుగాని చతుర్ముఖుడగు బ్రహ్మగాని వర్ణింప లేరు. ఇతరుల మాట జెప్పనేల? ఓ మహాత్ములారా! నవరాత్రి వ్రతము చేసి విరథ పుత్రుడగు సురథుడు పోయిన రాజ్యమును మరల సంపాదించు కొనెను. మరియు నీవ్రతముచే ధృవ సంధి పుత్రుడగు ద్యుమంతుడు, నయోధ్యా వాసుడగు సుదర్శనుండు పోయిన రాజ్యమును మరల సంపాదించు కొనిరి. అన్నివ్రతములలోను నవరాత్ర వ్రతము వ్రత రాజమై యుండెను. ఇది సంసార బంధ విముక్తుని జేసి ముక్తి నిచ్చును.

మరియు శుక్ల పక్ష మందలి తదియ, పంచమి, సప్తమి, యష్టమి, నవమి, చతుర్దశి, యశ్విని నక్షత్రమందున నీ దేవిని పూజించినచో దేవీ ప్రసాదంబుచే సర్వాభీష్టంబులు నెరవేరును.

కార్తిక మార్గశిర పుష్య మాసంబులందలి సితపక్ష తృతీయ దినంబున లోహిత వర్ణంబులుగల కరవీరాది కుసుమంబుల తోడను సుగంధిత ధూమం బులచేతను నామంగళాంబను పూజించినచో సకల మంగళములు చేకూరును. స్త్రీ లందరు సౌభాగ్యము కొరకీ వ్రత మాచరింప వలెను. విద్యా ధనసుతులకై పురుషులు విధేయుతతో నీవ్రతమాచరింప వలయును. దేవీ వ్రతంబు లనేకము లున్నను మోక్షము కోరువా రవశ్యము నవరాత్రవ్రతము చేయవలెను.

మాఘ ఫాల్గుణ శుద్ధ తదియందు కూడ దేవీ పూజ చేసినచో దేవి సంతసించి సకల సౌభాగ్యముల నిచ్చును. ఈ యుమాసంహిత మహా పుణ్య ప్రవర్తినియై శివభక్తి వివర్ధినియై యుండెను. ఇది యాఖ్యాన సమన్వితమై భుక్తి ముక్తి ప్రదమై యుండెను. ఇదిసమాహిత చిత్తులై విన్నను, వినిపించినను పరమ

గతి నొందెదరు. ఉమా యను లలితాఖ్యానంబు లిఖించి యథావిధిగ పూజించినచో సర్వకోర్కెలీడేరును. ఇట్టి తావుల యందు భూతప్రేత పిశాచము లెన్నడు నుండవు. పుత్రపౌత్రాది సకల సంపత్తులు గల్గును. మహా పుణ్యప్రద మైనదియు రమ్యమైనదియునగు నీ సంహితను సదా విన్నను పఠించినను శివా శివుల భక్తి కల్గి సర్వకోర్కెలీడేరును,

శ్రీవత్సగోత్రపవిత్ర యేలూరిపాటి నృసింహ సర్వతోముఖయాజి ధర్మపత్నియు చావల్యుపనామక యజ్ఞేశ్వర నామ యాజ్యసన్న పూర్ణాదంపతుల గర్భసుక్తిముక్తాఫలమును నగు శ్రీమతి యేలూరిపాటి లక్ష్మీసరస్వతిచే నాంధ్రీకరింపబడిన శ్రీశివమహాపురాణమందలి యుమాసంహిత సమాప్తము

ఏబది యొకటవ అధ్యాయము సంపూర్ణము

ఉమాదేవ్యర్పణమస్తు

---

శ్రీ గణేశాయనమః

# ఆంధ్రవచన శివ మహాపురాణము

కైలాస సంహిత ప్రారంభము

## ప్రథమాధ్యాయము

శ్లో. నమశ్శివాయ సాంబాయ
సగణాయ ససూనవే
ప్రధానపురుషేశాయ.
సర్గస్థిత్యంత హేతవే.

సర్గస్థిత్యంత కారణుండును ప్రధాన పురుషేశ్వరుండును, అంబికా పుత్ర గణంబులతో గూడియున్నవాడునునగు శివునకు నమస్కారము. అనేకాఖ్యానములతో గూడిన యుమా సంహిత విని యుంటిమి. శివ తత్త్వ వివర్ధక మగు కైలాస సంహిత మాకు వినిపింపు మని ఒకానొకప్పుడు మహాత్ములు వ్యాసుని ప్రశ్నింప నతడిట్లు చెప్పదొడంగెను. ఓ బిడ్డలారా! మీయందలి ప్రేమాతిశయంబుచే కైలాస సంహిత యందలి పరమ దివ్య మగు శివతత్త్వము వినిపించెద వినుడు పూర్వము హిమవచ్ఛిఖరమందున్న తేజో వంతులు, తపస్వులునగు మునీశ్వరు లందఱు వారణాసిని చూడ దలచి వెళ్లి మణికర్ణిక యందు స్నానమాచరించి గంగ యందు దేవతల కర్ఘ్య మిచ్చి త్రిదశేశ్వరుడగు విశ్వేశ్వరుని దర్శించి పరమ భక్తితో నమస్కరించి పూజించి నమక చమక ములచే స్తుతించి కృతార్థుల మైతి మని తలచి సదా శివ భక్తి నిరతులై యుండ, నింతలో సూతుడు పంచక్రోశ పరిభ్రమణం బైన కాశిని చూడదలచి వారున్న తావునకేగ ఋషులందరు నతనికి నమస్కరించిరి. తరువాత సూతుడు దేవ దేవుడగు విశ్వేశ్వరునకు నమస్కరించి పూజించి ఋషి మండలమునకేగ ఋషులందరు నతనిని నర్ఘ్య పాద్యములచే నర్చింప నతడు వారిని కుశలప్రశ్న లడిగి తత్కుశలమును కూడ జెప్పియుండ, ఋషులు ప్రణవార్థమును తెలియగోరి, వ్యాస శిష్యుడవు, మహా భాగుడవు, పౌరాణికోత్తముడవు నగునో సూతమహర్షీ!

పరు లని నాకు తెలియును. ఈశ్వర భక్తికి ముక్తికి కారణ మని వ్యాసుడు బలుక మహర్షులు సంతసించి వ్యాసునకు నమస్కరించి శివాను రాగసంతుష్ట మానసులై ఓభగవంతుడా! ముని శార్దూలా! నీవు సాక్షాన్నారాయణాం శజుడవు, కృపానిధివి. మహా ప్రాజ్ఞుడవు, సర్వ విద్యాధిపాధిపుడవు. త్రిమూర్తుల కనుగ్రహ పాత్రుడవు. నీపాదాంబుజ రసా స్వాదనములకు భ్రమరములము. మీపాద పంకజ దర్శనముచే, మేము కృతార్థుల మైతిమి. మీచరణాంభోజ దర్శనము పాపులకు దుర్లభము. మేము సుకృతులము గాన మీదుర్లభము లగు పద పంక జములు, లభించెను. మే మోంకారార్థమును ప్రకటించుటకై యీనైమిశా రణ్యమున దీర్ఘ సత్రయాగమును ప్రారంభించితిమి. మే మందఱ మాలోచించి పరమేశ్వర జ్ఞానము మీచే వినవలెను గాన, నల్పచేతస్కుల మగు మా యజ్ఞాన సంశయములను భేదించి మాకు శివజ్ఞాన ముపదేశింపుము. త్రిలోకముల యందు నీవంటి మాసంశయములు బాపువారు నెవ్వరును లేరు. అపార గంభీర మోహాబ్ధిని మునిగియున్న శివజ్ఞాన మనుయుపాయంబుచే తరింప జేయుము. మేము శివ భక్తిని దెలిసి కొనుటకు శ్రద్ధా భక్తులతో నుంటి మన, సర్వ వేదార్థ తత్త్వజ్ఞుడు శుకజనకుడు నగు వ్యాసుడు, వేదాంత సారమైన ప్రణవము పరమేశ్వరుడని యెఱింగి సంసార మోచకుడగు సాంబుని హృత్పద్మ మందు ధ్యానించి ప్రహృష్ట మానసుడై యిట్లు చెప్ప దొడంగెను.

శివ మహా పురాణ మందలి కైలాస సంహిత యందు

ఒకటవ అధ్యాయము సంపూర్ణము

## రెండవ యధ్యాయము

### ప్రణవార్థము తెలుపు మని పార్వతి శివుని ప్రశ్నించుట

ఓమునులారా! ప్రణవార్థసాధక మగు శివజ్ఞాన ప్రకాశము కడుదుర్లభము. మీరు భాగ్యవంతులు గాన, నిట్టిప్రశ్న వేసితిరి. పరమేశ్వరాను గ్రహాము లేనిచో ప్రణ వార్థముచే ప్రకాశ మానమగు శివజ్ఞాన మెవరికి బోధ పడదు

సందేహ మేమియు లేదు. ఈప్రణ వార్థము శివభక్తి శూన్యులకు బోధపడదు.
మీరీ దీర్ఘసత్ర యాగమున పరమేశ్వరో పాసన చేయు చున్నందున నేను
మిమ్ములి సంతసించితిని. మీకు పురాతన మగు నితిహాసము చెప్పెద వినుడు
అది ఉమా మహేశ్వర సంవాద రూపమై యత్యద్భుతముగ నుండెను. పూర్వ
ము జగదంబ దక్షునకు సతీనామంబున జన్మించి జనకాధ్వరమునందు శివ నింద
సహింప నేరక దేహము త్యజించి హైమవతియై జనించి నారదోప దేశంబుచే
శివునికై తపంబు చేసి స్వయంవరవిధానమున శివుని వివాహ మాడి సుఖ
ముగా నుండి, యొకానొకప్పు డామె భర్తతో హిమవన్నగమున గూర్చుండి,
ఓభగవానుడా! పరమేశ్వరా! పంచ కృత్య విధాయక! సర్వజ్ఞ! భక్తసులభ!
పరమాత్మక విగ్రహ నేను దాక్షాయణీ తనువున తమనింద వినలేక త్యజించి
హైమవతినైతినిగాన నాయందు కృపయుంచి నాకు మంత్ర దీక్ష నిచ్చి
పరిశుద్ధాత్మురాలను జేయు మన, శీతాంశు భూషణుడగు శంకరుడు సంతసించి,
ఓ దేవ దేవేశ్వరీ! నీవుధన్యు రాలవు. మంచి విషయ మడిగితివి మనము కైలా
సమేగిన పిమ్మట నీకు తత్త్వోప దేశము చేసె దనని యామెను కైలాసమునకు
గొంపోయి, యామెకు యథా విధిగ దీక్షనిచ్చి క్రమముగా ప్రణవాది మంత్ర
ము లుపదేశింప నామె పరి శుద్ధాత్మురాలనైతి నని సంతసించెను. తదుపరి
శంకరుడు దేవితో నుద్యాన వనమున కేగ, సుమాలిని మొదలగునామె ముఖ్య
నెచ్చెలులు కల్పవృక్షము లందలి వికసిత పుష్పంబులా దేవి నలంకరింప
నాదేవ దేవుడా. దేవిని తన యంక మందు కూర్చుండ బెట్టుకొని సహ్యాక
యుడై నామె ప్రఫుల్ల పద్మాననము నవలోకింపుచుండ, అమెసర్వలోక హితం
బునకై వేదార్థములతో గూడిన గాథలు ప్రశ్నింప దలచి భర్తముఖ మవలో
కించుచు నోనాథా! తమరు నాకు ప్రణవ మంత్ర ముపదేశించితిరిగాన దాని
యర్థమును వినగోరు చుంటిని, ప్రణవ మెట్లు ద్భవించెను? ప్రణవ మెట్లువచ్చెను
ప్రణవము నకు మాత్రలెన్ని? దీని విషయమై వేదము లెట్లు చెప్పెను? దీనికి
దేవతలెవరు? దీనియందు వేద భావ నెట్లు చేయబడెను; దానిక్రియ లేమిటి? ఇది
వ్యాప్య వ్యాపక మెట్లయ్యెను? ఈమంత్రమును క్రమ మందు పంచ బ్రహ్మలె
ట్లు చెప్పబడిరి? దీనికి కళలెన్ని? ఇది ప్రపంచాత్మక మెట్లయ్యెను? దీనికి వాచ్య
వాచక సంబంధ మెట్లుండును? దీనికధి కారు లెవరు? దీనిచే తెలియబడు నదే

మున్నది? దీని ప్రయోజన మేమి? దీనిని పాటించు టెట్లు? ఉపాసనా స్థానమే మిటి; ఉపాస్య వస్తువు యొక్క రూపమేమి? ఉపాస కులకు దీని ఫలమేమి? దీని యను స్థాన విధి యెట్లు; దీని పూజాస్థానమెట్టిది? దీని పూజా మండల మెట్లుస్థాపింప వలెను? ఏయే ఋషులను స్థాపింప వలెను? పూజా విధక్రమ మెట్టిది; నదంతయు నాకు విశేషముగ జెప్ప గోరు చుంటిని పరమేశ్వరు డిట్లు చెప్పదొడంగెను?

శివ మహా పురాణమందలి కైలాస సంహితయందు
రెండవ అధ్యాయము సంపూర్ణము

---

## మూడవయధ్యాయము

### శివుడు పార్వతికి ప్రణవార్థము చెప్పుట

ఓ దేవీ! దేనిని విన్నంతనే జీవుడు శివుడగునో? యదంతయు జెప్పెద వినుము. ప్రణవార్థ పరి జ్ఞానము కల్గుటయే జ్ఞానము అదియే నాస్వరూపము. ప్రణవము సర్వమంత్రములకు బీజము. ఇది వట బీజము వలె నతి సూక్ష్మమై మహార్థము గలదై యున్నది. మరియు నిది వేదముల కాద్యమై వేదసారమై, విశేషమై' సద్రూపమై గుణాత్రయా తీతమై సర్వజ్ఞమై, సర్వ సృష్టి కర్తయైయుండెను, ఓమిత్యే కాక్షర మంత్రము నందు శివుడు స్థిరుడై యుండును. ఈప్రణవము నకేయితర వస్తుసంయోగము కల్గినను యిది ప్రధానమైన వస్తువుగనే యుండును. ఈప్రధాన వస్తువు యొక్క కలియకచే సమస్తము సమిష్టిరూపమై, విరాడ్రూపమని చెప్పబడుచుండెను, వ్యష్టిరూపస్థావర జంగమాత్మకమైన జగత్తంతయు ప్రణవార్థ మని చెప్పబడు చున్నది. సర్వార్థ సాధకమైన ఓం అనెడియేకాక్షరము పరబ్రహ్మస్వరూప మని చెప్పబడుచుండెను. ఓంకారము చేతనే ముందుగా సకలజగత్తులు సృజింప బడెను శివుడే ప్రణవము. ప్రణవమే శివుడు. వాచ్య వాచకములకు భేదములేనట్లు ప్రణవమునకు శివునకు భేదములేదు. లే

బ్రహ్మర్షు లందఱు నన్ను నేకాక్షర దేవుడని చెప్పెదరు. ఈప్రణవమే సర్వకారణ మైనదని తెలిసి కొనవలెను. సన్యాసులు సిద్ధులు ముముక్షువులు నన్ను పరమేశ్వరునిగా తెలిసికొందురు! ప్రణవము నాస్వరూపముగాన, నిది సర్వమంత్రశిరో మణిగా నుండెను. కాశీయందు మరణించెడు జీవులకు ముక్తికొరకై యీప్రణవము నుపదేశించెదను. ఈప్రణవమునే ప్రథమమున నెవ డుద్ధరింపబడెనో చెప్పెద వినుము. ఏది విన్నంతనే పరమ సిద్ధికల్గునో యట్టి దానిని చెప్పెదను.

ఓంకార మందలి మొదటిదగు అకారము సన్నృత్తి కళగా చెప్పబడెను. రెండవదగు, నుకారము, ఇంధనకళగా చెప్పబడెను. మూడవదియగు మకారము జ్ఞానరూపకళగా చెప్పబడెను. నాదము దండముగాను బిందువు ఈశ్వరునిగనుండి ఓంకార కళనుద్ధరింపుమండిరి. ఇవ్విధంబున పంచవిధ కళలచే ప్రణవ ముద్ధరింప బడుచుండెను. త్రిమాత్రలతో గూడినబిందు నాదాత్మకమగు ప్రణవమును సదా జపించినవారే ముక్తినొందగలరు బ్రహ్మాది తృణపర్యంతముగల జీవులను ప్రాణస్వరూపము గాన ప్రణవమని చెప్పబడు చున్నది. అకార ఉకార మకారము లనెడు త్రిమాత్రలతో కూడియున్నదిగాన ఓంఅని చెప్పబడుచున్నది. ఈకారము విజ్ఞానులేకాని సాధారణులు తెలిసికొన లేరు. దీనికర్ధ మాత్ర కలయుటచే ఓంకారము నాద బింద్వాత్మక మయ్యెను. ఈఅర్థమాత్రయే బిందునాదస్వరూపిణి యగు మహేశ్వరనియని చెప్పబడు చుండెను. దీనివర్ణించుట కసంతరము కాదు. ఇదిజ్ఞానుల సొమ్మై యున్నది. ఈశ్వరస్సర్వభూతానా మిత్యాది శ్రుతులచే బ్రహ్మాదులు నావల్లనే సర్వము జనించెనని తెలిసికొనియుండిరి వేదములకాది యైన ప్రణవము నాస్వరూపము. నేనువేద నాథుండనని కూడ నెరంగిరి అకారము మహద్బీజము దీనియందలి రజోగుణమే బ్రహ్మస్వరూపము, ఉకారము ప్రకృతి స్థానమని చెప్పబడుచుండెను. నిది స్వగుణముచే పరిపాలించెడు విష్ణువని చెప్ప బడుచుండెను. మకారము పురుష బీజము ఇది తమోగుణముతో గూడినసంహారకుడగు రుద్రుడని చెప్ప బడుచుండెను. అనగా అకార ఉకార మకారంబులు బ్రహ్మవిష్ణురుద్రులనియూహింపుము బిందువు మహేశ్వర స్వరూపుడై స్థిరుడై యుండును. నాదము

సర్వానుగ్రహ కారకుడగు సదా శివుడు నాదోర్ధ్వమందున్న పరాత్పరుని ధ్యానింపవలెను, ఆ పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వకర్త, సర్వేశ్వరుడు, నిర్మలుడు, అవ్యయుడు యనిర్దేశ్యుడు పరబ్రహ్మ, సదసత్తులకంటె పరుడు సర్వకాలములయందు వ్యాపించియుండెను. పూర్వోత్తర వ్యాపకుడై యుండెను అకార ఉకార మకారము నాద బిందు పంచస్వరూపుడు పంచబ్రహ్మ స్వరూపుడు అకారాది అక్షర స్వరూపుడై యుండెను, అపంచ బ్రహ్మస్వరూపమే నాస్వరూపము సద్యోజాత వామదేవ అఘోర, తత్పురుష, ఈశానులనెడి వారలు పంచబ్రహ్మలనబడుదురు. అకారవాచ్యుడగు సద్యోజాతుడు అష్టకళలతో గూడియుండెను. ఉకార వాచ్యుడగు వామదేవుడు త్రయోదశ కళలతో నొప్పుచుండెను. మకార వాచ్యుడగు నఘోరుడు యష్టకళలతో నొప్పియుండెను. బిందు సంయుక్తుడగు తత్పురుషుడు నాల్గు భాగకళలతో నొప్పియుండెను. నాదసంయుక్తుడగు నీశానుడు పంచకళలతో నొప్పుచుండెను. మంత్రమును యంత్రము దేవత ప్రపంచము గురువు శిష్యుడనను ఆరింటికి యర్థము చెప్పెద వినుము.

1 పంచాక్షరములతోగూడినది యంత్రము, అనగా నమశ్శివాయ యనునది
2 జగన్మండలమే యంత్రము.
3 యంత్రమే దేవతా స్వరూపము.
4 దేవతయే విశ్వరూపము.
5 విశ్వరూపమేగురువు.
6 గురుశరీరమే శిష్యుడు

ఓమితీ దగుంసర్వం బ్రహ్మేతి చశ్రుతేః॥

ఓంకారమే సమస్తము, బ్రహ్మయనని శ్రుతియందు చెప్పబడియుండెను. ఈ వాచ్య వాచకముల సంబంధమే బ్రహ్మయనబడును, ఆధారము మణిపూరకము, విశుద్ధము, ఆజ్ఞా, శక్తి, శాంతియను, షట్చక్రములు క్రమముగా దేవతాస్థానములై యున్నవి పరమేశ్వరుడు వీటికతీతుడైయుండెను.

దృఢమగు వైరాగ్యవంతుడు యోగాభ్యాసకుడు, షట్చక్రములను దాటి పరమేశ్వర సన్నిధానమున కేగగలడు. జీవబ్రహ్మైక్యసంధానమునకు నేను కారకుడనై యుందును ఓ దేవి ఈ విషయము చెప్పుచున్నాను. జీవాత్మలు ప్రణవమందైక్యమగుటయే దాని ముఖ్యార్థము, బోధ్య బోధకుని వలె జీవబ్రహ్మైక్య సంధానముల్లుండును, వాచ్యవాచకములకు భేదములేనట్లుగా జీవాత్మలకు భేదములేదు. ప్రశాంతచిత్తుడు శాంతుడు, తపస్వి, విజితేంద్రియుడు, శౌచాచారసమాయుక్తుడగు బ్రాహ్మణుడు, వేదనిష్ఠుడు విషయవిరక్తుడు, దేవబ్రాహ్మణప్రియుడు, ధర్మిష్ఠుడు, శివభక్తుడు, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుడు, వేదాంతజ్ఞానపారగుడు నగు గురువు నాముముక్షుకాముడగువాడు పొందవలెను. ఇట్టిగురువునకడకేగి వినయవంతుడై, యతిబుద్ధిమంతుడై, ప్రయత్న పూర్వకముగ దండప్రణామంబు లాచరించి స్తుతించి శాంత్యాదిగుణసంయుక్తుడై, శిష్యసౌశీల్యముగల్గి మనసారా గురువునాశ్రయించవలెను. గురువే శివుడు, శివుడేగురువని తలచినవాడే శిష్యుడనబడును. శిష్యుడీట్లుతలంచుకొని, తన మనోభిప్రాయము గురువునకెరిగించి గురునాజ్ఞనొంది, పన్నెండురోజులు పయోవ్రతము నాచరించి సాగరతీరమందుగాని, నదీతీరమందుగాని, పర్వతమందుగాని శివాలయమందుగాని, శుక్లపక్షపంచమినాడుగాని, ఏకాదశియందుగాని యరుణోదయంబున లేచి స్నాన మాచరించి శుద్ధాత్ముడై నిత్యక్రియలు నెరవేర్చుకొని గురువు నాహ్వానించి, యథావిధిగ నాందీశ్రాద్ధము గావించి, కక్షోపస్థ వివర్జితముగ క్షౌరముచేయించుకొని, కేశశ్మశ్రునఖంబులు తీయించుకొని స్నానమాచరించి నిమంత్రణానుడై, పాలపిండి భుజించి సాయాహ్నస్నాతుడై, సంధ్యనుపాసించి సాయమౌపాసన గావించి, శివరూపుడగు గురువునకు శాస్త్రోక్తదక్షిణనొసంగి. హోమద్రవ్యముల సమకూర్చుకొని స్వసూక్తమంత్రములచే హోమముచేసి లౌకికవిధిగ అగ్న్యాధానము చేసి, ఆహితాగ్నియై ప్రాజాపత్యేష్టిని చేసి, శ్రౌతాగ్నియందు సర్వదేవతలను పూజించి యాయగ్నిని యాత్మయందారోపణముచేసికొని, బ్రాహ్మణగృహమునుండి చరువు, సమిధలు, ఆజ్యము పురుషసూక్తముతో హోమముచేసి, ప్రతిఋక్కును ఆత్మయందు తలచుకొనుచు, స్విష్టకృత్తులను గావించి ఉత్తరాభిముఖుడై, అగ్నియందాగ్నేయ భాగమున తంత్రవిధిని

హోమము చేసి, ఆసనముపై, కుశలు కృష్ణాజినము, దానిపై వస్త్రము వేసి కూర్చొనినవాడై జపించుచు, బ్రాహ్మముహూర్తమున లేచి దృఢమానసుడై గాయత్రిని జపించుచు, విధిప్రకారముగ స్నానము చేసి, చరుహోమము గావించి, పురుషసూక్తముతోను విరజామంత్రములతోను వామదేవమతాను సారముగాని, శౌనకాదుల తానుసారముగాని హోమము గావింపవలెను. వీటిలో వామదేవమతము శ్రేష్ఠమైయుండెను. కారణమేమనన, వామదేవుడు తల్లిగర్భమునందుండియే జ్ఞానియయ్యెను. అతడు జీవన్ముక్తుడు హోమము పూర్తియైన తరి ప్రాతరౌపాసనచేయవలెను. తదుపరి వాయుగ్నిని యాత్మారోపణ చేసికొని ప్రాతస్సంధ్యనుపాసింపవలెను. సూర్యోదయమైనతరి గాయత్రినుపాసింపవలెను. పిమ్మట ఈషణత్రయములవిడి మయాసన్యస్తంఅని పలుకవలెను. పిమ్మట శిఖోపవీతంబులుత్యజించి, తదుపరి కటిసూత్రాదులు త్యజించి, సకలము త్యజించి, గృహాదులువిడి, పూర్వముఖముగాగాని, యుత్తరముఖముగాగాని, జనపదయును, లోకప్రసన్నకై, దండకౌపీనంబులుధరింపవలెను. లోకవృత్తులయందు విరక్తుడై బాగుగ నాలోచించినగాని సన్యసింపరాదు. తదుపరి గురుసమీపమున కేగి, ముమ్మారుసాష్టాంగదండప్రణామంబులాచరించి, లేచి గురుపాద సన్నిధినాసీనుడై, విరజాగ్ని సంబంధమగు భస్మమునుగురువుచే పొంది, అగ్నిరితిభస్మ, వాయురితిభస్మఅను మంత్రములచే భస్మాలంకారుడై, హృత్పద్మమున పార్వతితో శివుని ధ్యానింపవలెను. తదుపరి గురువు శిష్యుని శిరముపై హస్తముసి, ఋషి దేవతాసహితముగ శిష్యుని దక్షిణకర్ణమున, అకార ఉకార మకారాత్మకమైన,త్రివిధప్రణవంబు నుపదేశించి, దానియర్థమునుకూడ తెలుపవలెను. తదుపరి శిష్యుడు షడ్విధములగు ప్రణవమును గురువుచేవిని, గురువునకు సాష్టాంగ దండప్రణామంబులాచరింపవలెను. తదుపరి ప్రతిదినము గురువువలన వేదాంతవాక్యములు వినుచు, నాత్మయందు పరమాత్మనగునన్ను ధ్యానింపుచు, విగతమత్సరుడై యుండవలెను. వేదాంతుడై, విగతమత్సరుడై యుండువాడేసన్యాసమునకర్హుడు. స్వచ్ఛమైనదియు, శోకరహితమైనదియు, రజోశూన్యమైనదియునగు హృత్పుండరీకమున, నష్టపత్రములుగలదియు, కర్ణికోపరిశోభితమైనకింజల్కములు గలదియునగు హృత్పద్మమునందాధారశక్తి మొదలుకొని (చక్రము) మూడు

తత్త్వములతో గూడినదై యొప్పుచున్న మధ్యప్రదేశము, దహరాకాశమని చెప్పబడుచున్నది. మరియు హృత్పద్మమునందు ఓంకారనిర్దిష్ట కాక్షర పరబ్రహ్మనగు నన్ను శివునితో సహా ధ్యానింపవలెను ఇట్టివిధముగను హృదయమున నిలుపుకొని నిత్యము ధ్యానింపవలెను. ఓ పార్వతీ! మనసునిట్లుపాసించువాడు విజ్ఞానవంతుడై మన సాయుజ్యమునొందగలడు.

**శివ మహాపురాణము నందలి కైలాససంహితయందలి**
**మూడవ అధ్యాయము సంపూర్ణము**

---

## నాలుగవ యధ్యాయము

### సన్యాస విధులు

ఓ దేవీ నీ యందలి ప్రేమచే, సన్యాసాహ్నిక కర్మలు, నిత్యకృత్యములు, వారి సాంప్రదాయకములు, విశేషములు చెప్పెదను. యతీశ్వరుడు బ్రాహ్మీ ముహూర్తమున లేచి, తనశిరంబున, శ్వేతసహస్రారపద్మాధిష్ఠితుడగు గురువు నిట్లు ధ్యానింపవలయును.

శ్లో॥ శుద్ధస్ఫటిక సంకాశం
ద్వినేత్రం వరదాభయే
దధానం శివసద్ధ్యాన
మేవాత్మని మనోహరం.

శుద్ధస్ఫటికసంకాశుడు ద్వినేత్రుడు వరదాభయహస్తుడు శివధ్యానపరుడు మనోహరాకృతుడునగు గురువుని ధ్యానింపుచున్నానని, ధ్యానింపవలెను. తదుపరి గంధ పుష్పాదులచే నలంకరించు నట్లుగ భావించి మనసా పూజించి బద్ధాంజలిపుటుడై నమస్కరించి ప్రాతః ప్రభృతి సాయాహ్నము వరకును సాయమాది ప్రాతఃకాలమువరకును నే చేయు క్రియలన్నియు నో దేవా! నీపూజలుగా భావింపుమని గురువునకు నివేదించి గురువాజ్ఞనొంది ప్రాణాయామము

చేయుచు సుఖాసనాధిష్ఠితుడై, జితాత్ముడై, జితేంద్రియుడై మూలాధారాది బ్రహ్మరంధ్రాంతము వరకుగల షట్చక్రముల ధ్యానింపుచు విద్యుత్కోటి సమ ప్రభుడు. సర్వతేజోమయుడు, సచ్చిదానందవిగ్రహుడు సహస్రార స్థితుడు నగు నన్ను ధ్యానింపవలెను. నిర్గుణుడు, పరబ్రహ్మ, సదాశివుడు ననామయుడు నగునన్ను అహంబ్రహ్మాస్మి యనిధ్యానించినచో నాయందైక్యమగును. మరియు ప్రాతః కాలమున లేచి ఊరివెలుపలకేతెంచి దూరమగు ప్రదేశమునగూర్చుని వస్త్రముచే శిరోనాశికలు గప్పుకొని దేహమును పరిశోధించి మలవిసర్జనగావించి జలాశయమునకేగి శౌచమునివర్తించుకొని హస్తపాద ప్రక్షాళనముగావించి ఓంఓం అనిరెండు పర్యాయము లాచమించి ఉత్తరాభిముఖుడై మౌనమున దంతధావనము చేసికోనవలెను. ఏకాదశీ అమావాస్యలు వినా సదాతృణ పత్రంబులతో దంతధావన మొనరింపవలెను. తరువాత ద్వాదశ పర్యాయములు జలముచే గండూష మొనరించి ముఖము కడిగికొని మృత్తికలంబుచే రెండు పర్యాయము లాచమించి కటిశౌచమాచరించి యరువోకయముని మృత్తిక పూసికొని స్నానముచేసి, గురువును, నన్ను స్మరించుకొని యథావిధిగ స్నాన సంధ్య లాచరింపవలెను. విస్తారభయముచే నెక్కువగ చెప్పుటలేదు విధులు విద్వాంసులచే తెలిసికొని యాచరింపవలెను. తరువాత శంఖముద్ర బంధించి ప్రణవ మంత్ర ముచ్చరించుచు స్నాన మాచరించు పన్నెండు పర్యాయములుగాని ఆరుపర్యాయములుగాని మూడు పర్యాయములుగాని జలములో మునిగి స్నాన మాచరింపవలయును. తరువాత తీరమునకు వచ్చి కౌపీనమును పీడించి రెండు మార్లాచమించి కౌపీనమునకు తనయందున ప్రణవముచే రెండుసార్లు జలము ప్రోక్షించి తరువాత ముఖాది సర్వాంగములు తుడుచుకొని ఓంకారముచే దేహము మార్జనము చేసికొని గురుసన్నిధి నాసీనుడై మౌనముతో మరియొక యారవేసిన కౌపీనము ధరించి అగ్నిరితి మంత్రము చేత యథావిధిగ భస్మ ధారణచేసి రెండుమార్లాచమించి సద్యోజాతాది మంత్రములచేగాని అగ్నిరిత్యాది మంత్రములచేగాని శరీర మంతయు స్పృశించి ఆపోహిష్ఠాది మంత్రములతోను మానస్తోకేతి మంత్రములతోను భస్మము తడిపి తనహస్తమందిడుకొని అయిదు వేళ్లను విడిగా జాచి పద్మాకారముగ జేసికొని శిరమునందున ముఖమునందున హృదయ మందున గుహ్యపాదంబుల యందున సద్యోజాతాది

పంచమంత్రములచే నీ అయిదు స్థానముల యందు విభూది ధరింప వలెను. తదుపరి భస్మలిప్త హస్తముచే సర్వాంగ ములు మసకు చుకొని మరల భస్మము గ్రహించి త్ర్యాయుష మను మంత్రములచే త్రిపుండ్రధారియై ప్రణవముచేతను శివమంత్ర ముచేతను. శిరమునకు లలాటమునకు భుజాగ్రములకు బాహువులకు నాభియందు సంధులయందు పృష్ఠప్రదేశములయందు యథాక్రమమున భస్మము బూసికొని చేతులు కడుగుకొని రెండు మార్లాచమించి పంచాక్షరి జపించుచు గురువుని ధ్యానింపుచు వామహస్తముచే దక్షిణ హస్తమున జలముపోసుకొని హస్తము చేగప్పి పన్నెండుసార్లు ప్రణవముచే నభిమంత్రించి ఈజలమును శిరమున జల్లు కొని ముమ్మారు పానము చేయువలెను. అటుపైని సమాహిత చిత్తుడై ఓంకారరూపుడగు నీశ్వరు నిట్లుస్తుతింపవలెను

శ్లో. సౌర మండల మధ్యస్థం సర్వ తేజో మయంపరం.
అష్టబాహుంచతు ర్వక్త్ర మర్ధనారీశ మద్భుతం.

సర్వాలంకార శోభితుడు, సర్వైశ్వర్యగుణోపేతుడు నగు నీశ్వరుని ధ్యానించి మూడర్ఘ్యములిచ్చి యష్టోత్తర శతము జపించి ద్వాదశ తర్పణంబు లొసంగి మరల నాచమించి విధిప్రకారము ముమ్మారుప్రాణా యామముచేసి పూజామందిరము కడకేగి మనసా శివుని ధ్యానించి మరల ద్వారము కడకేగి పాదప్రక్షాళనము గావించి మౌనము దాల్చి రెండుమార్లాచమనము చేసి మరల పూజాగృహమందు కుడికాలు ముందు పెట్టి ప్రవేశించి పూజామండప మున నొక మండలము నిర్మింపవలెను.

శివ మహా పురాణమందలి కైలాస సంహితయందు
నాల్గవ అధ్యాయము సంపూర్ణము

---

# ఐదవ యధ్యాయము

## సన్యాసమండప నిర్మాణపద్ధతులు

ఈశ్వరుడు పార్వతితో మరల నిట్లు చెప్పదొడంగెను. పరిశుద్ధ ప్రదేశము నందు వస్త్రాచ్ఛాదనముచేసుకొని రెండు బారల పొడవు వెడల్పుగలచతురశ్ర మండలముగావించి, సున్నగాఅద్దమువలె నలికి ముగ్గులుపెట్టి, పొడవు, వెడల్పు గలతాళపత్రములందుపరచి, పదునూడు భాగములుగ విభజించి, పశ్చి మాభిముఖుడై కూర్చుని మండపముచుట్టూ దృఢముగు సూత్రముగట్టవలెను. సూత్రమునకు 115 పోగులుండవలెను. అష్టకోణములయందున యష్టదళపద్మ ములులిఖించి పద్మము మధ్యయందు పసుపుతో కర్ణికలవలె నలంకరించి, మధ్యనొక యష్టదళపద్మము పసుపు, కర్ణిక, నిర్మించి, పచ్చనికర్ణికయందు ఎర్రనికుంకుమను గుండ్రముగజుట్టి, దళసందులయందు యెరుపునలుపుగల రంగుముగ్గులలది, మధ్యకర్ణికయందుప్రణవార్థప్రకాశకమైన యంత్రమును లిఖించివానిపై పీఠమువేసి దానిపై ఈశ్వరుని లిఖించి, దేవేంద్రుని, మహా కాలుని, దండమునులిఖింపవలెను. పీఠమును శ్యామవర్ణముగను, ఈశ్వరుని పీతవర్ణముగను, ఇంద్రునిరక్తవర్ణంబుగను, మహాకాలుని కృష్ణవర్ణంబుగను దండము ధూమ్రవర్ణంబుగను, శిఖిపింఛవర్ణంబుగను క్రమముగచిత్రింపవలెను. ఇట్లుయంత్రములింఖించినతరి చుట్టూ నెర్రనికుంకుమ పరివేష్టింపవలెను. తదు పరి నాపీఠముపై నాదస్వరూపుడు విద్యాధీశుడునగు పరమేశ్వరునియంబికతో స్థాపింపవలెను. మండల పరిధిపై క్రమముగా నాగ్నేయాది దిక్కులుస్థాపింప వలయును. మండపమునకు యెరుపు, నలుపు, పసుపు, తెలుపుగలరంగులతో నాల్గుద్వారములు నిర్మింపవలెను. ఆద్వారములకిటునటు పసుపురంగులచే నలంకరింపవలెను. ఈమండపమున కాగ్నేయదిశగా చతురశ్రకోణమునందు పీతవర్ణకర్ణికగల యరుణాష్టదళపద్మమును లిఖింపవలెను. ఆపద్మమధ్యమున 'హాం' అనునక్షరము లిఖింపవలెను. నైరుతి కోణంబున పీతకింజల్కకర్ణికను నిర్మించి, యష్టదళయుతారుణ పద్మమును నిర్మించి, అందుషష్ఠస్వరము తోగూడిన, శకారములిఖించి, బిందునాదముతో కూడిన, జౌం అను అక్షరము

కూడలింపవలెను. మరియు నిశానకోణమం దష్టదళపద్మము లిఖించి అందు 'క' వర్గములో మూడవదైన, 'గ' లిఖింపవలెను. తన్మధ్యమున బిందువులిఖించి 'గు' అనుఅక్షరములిఖించి - మిగిలిన కోష్టములందు క్రమముగ పద్మములు లిఖించి మధ్యపీతకర్ణికయు నరుణాదళంబులు పూర్వమువలెలిఖించి, దాని బాహ్యప్రదేశమున, నల్లటి ద్వాదశబిందువులులిఖించి యాగ్నేయాది నాల్గుకోణంబుల యందు శ్వేతబిందువులులిఖించి, మిగిలిన యారుకోణంబులయందు నల్లటి బిందువులునిర్మించి, దక్షిణాత్రికోణోత్తరభాగంబున రక్తవర్ణంబులుగలబిందువులనుంచి పశ్చిమంబున తెల్లటి పిండిచే నర్థ చంద్రాకారముగ లిఖించి, పసుపుచే నలంకరింపవలెను. ఈనాల్గు కోణములయందు, క్రమముగ తూర్పున శ్వేత బిందువును, దక్షిణమందు కృష్ణబిందువును. ఉత్తర మందు ఆరు వర్ణంబులతో ఉకారమును పశ్చిమంబున పీతవర్ణంబుతో మకారమును నకారమును, లిఖింపవలెను: క్రింద పంక్తిని ప్రారంభించి పీత, శ్వేత, నీలిరంగులతో నాల్గువైపుల గీట్లుగీసి మండప నిర్మాణముగావించి యథా విధిగ సకల సంభారములతోను సూర్య పూజ గావింపవలెను.

శివ మహాపురాణమందలి కైలాస సంహితయందు
అయిదవ అధ్యాయము సంపూర్ణము

---

## ఆరవ యధ్యాయము

### సన్యాసవిధి

మండప దక్షిణభాగంబున వ్యాఘ్రచర్మము బరచి అస్త్రమంత్రములచే గాయత్రీమంత్రముచే, శుద్ధోదకమును ప్రోక్షించి ప్రణవోచ్చారణ చేయుచు, నా ధార చక్రమును కదలించుచు, శక్తి కమలాయనమః అని యుచ్చరింపుచు నుత్తరముఖుడై, మూలమంత్రమును జపించుచు, ప్రణవోచ్చారణ పూర్వకముగ యథావిధిగ ప్రాణాయామము గావించుచు నగ్ని రిత్యాయంత్రములచే భస్మమును ధరించి గురువు శిరమునం దున్నట్లుగా భావించి నమస్కరించి,

మరల మండలము రచించి, త్రికోణవృత్తము లిఖించి దానిలోపల చతురస్రమండలము నిర్మించి, ఓం అని పూజించి. యాధారణమున శంఖము స్థాపించి పూజించి, శంఖమును జలముచే పూరించి ప్రణవముచే దశవార మభిమంత్రించి ప్రణవముచే సప్తపర్యాయములు, సుగంధ ద్రవ్య పుష్పములచే పూజించి ధేను శంఖముద్రలు జూపించి గాయత్రీ మంత్రము చే ప్రోక్షించి, తన యాత్మను గంధపుష్పాదులచే పూజించుకొని, ముమ్మారు ప్రాణాయామును గావింపి ఋషులను స్మరించి, అస్య శ్రీ సౌరమహామంత్రస్య, దేవ భాగ ఋషిః, గాయత్రీ చ్ఛందః సూర్య మహేశ్వరో దేవతా, హ్రాం, హ్రీం హ్రూం ఇత్యాది బీజశక్తికీలకములు, హ్రామిత్యాది యంగన్యాస కరన్యాసములు జెప్పుకొని సూర్యోపాసన జేసి, గాయత్రీ మంత్రముచే నష్టకోణదళ పద్మమును ప్రోక్షించి సకల వస్తువులచే పూజించి తదుపరి అష్టదిక్పాలుర పూజించి కాల రుద్రుని, అధారశక్తిని పూజించి, రత్నగర్భమైన భూమిని పూజించి వృక్షోద్యాన గుహా మణిమయ, రక్తపీఠము నర్పించెదనని సంకల్పించి చతుర్దిశలయందు, ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యంబుల గోరుచు, అధర్మాదుల నగ్న్యాది కోణంబులయందు పూజించి మాయ నధోభాగమున విద్యనూర్ధ్వ భాగంబున ఆచ్ఛాదనమునందు సత్వ రజస్తమోగుణంబుల పూజించి, చతుర్దిక్కులనుధ్యను దీప్తి వంతమైనదియు, సూక్ష్మమైనదియు, జయదాయకమైనదియు భద్రమైనదియు, ఐశ్వర్య ప్రదమైనదియు, స్వచ్ఛ మైనదియు, నమోఘమైనదియు విద్యుత్సంబంధ మైనదియు, నగు సర్వతో ముఖమను పేరుగల పద్మమును లిఖించి, కందనాళ ఛిద్రముల యందు గల తంతు టంకములు చ్ఛేదించి, సకలాత్మకములైన కింజల్కముల ప్రకాశింపజేసి, పంచగంధి కాయుతమగు దళములను కేశరములను, బ్రహ్మావిష్ణు రుద్రాత్మకముగ భావించి యంతరాత్మయందున్న జ్ఞానాత్మను పరమాత్మగ బూజించి తదుపరి సూర్యనామకమైన యోగపీఠమును పూజించి, ఆపీఠమందు మూలమంత్రముచే మూర్తిని స్థాపించి మూలమంత్రముచే మూలాధార చక్రమున ప్రాణాయామముచే ప్రాణములరిగట్టి, యాసనాసీనుడై, పింగళ నాడీ ప్రభావముచే యాధార శక్తిని పైకి లేవ దీసి, మండల స్థితుడు, ప్రకాశమానుడు సిందూరారుణ దేహధారియు, వామాంగయామాసహితుడు, రుద్రాక్షమాలా

ఖరుడు పాంశాంకుశఖట్వాంగకపాలకసులశంఖధారియు చతుర్వక్త్రుడు ద్వాదశాక్షుడు నగు పరమేశ్వరుని హృత్కమలమున ధ్యానించి యర్చించి ప్రణవమునుచ్చరించి, హ్రాం హ్రీం సః యని పలుకుచు ప్రకాశాత్మకుడగు సూర్యదేవు నాహ్వానించి మార్తాండభాస్కరాయనమః యని ఆహ్వానించి నమస్కరించి, బాహ్యావాహన చేసి. హృద్దైన యొక ముద్రచే స్థాపించి ముద్రను జూపించి హోమిత్యాద్యంగన్యాస కరన్యాసములు జెప్పుకొని లమితి పంచ పూజలు గావించి మూలమంత్రముచే ముఖ్యార్థు పూజించి కేసర మధ్యమగు పద్మమును షడంగములచే పూజించి ద్వితీయా వరణ మందున్న ద్వాదశాదిత్యులను పూజించి

అగ్ని ఈశ్వర, రాక్షస, వాయువుల నిడి చతుర్మూర్తులను పూజించి, పద్మమందలి నలుదిశలందు నాదిత్య, భాస్కర భానురవులను క్రమముగ పూజించి సూర్య బ్రహ్మరుద్ర విష్ణ్వీశానులను తృతీయా వరణమునందు పూజించి తూర్పు దిశనున్న పద్మదళ మధ్య మందున, సోమ కుజ బుధ గురు శుక్ర, శని దేవతలను పూజించి ఈతృతీ యావరణము నందు మేషాది ద్వాదశ రాసులను, సప్తసాగరములను గంగాది నదులను సప్తఋషులను, ఇంద్రాది దేవతలను ,గంధర్వ నాగా ప్సరసలను గ్రామాధి కారిని యక్షరాక్షసులను సప్తచ్ఛందస్సులను, వాలఖిల్యాది ఋషులను బహిర్భాగమందు పూజింపవలెను, తదుపరి తృతీయా వరణమందైన దివాకరుని చతురశ్రమండలము నిర్మించి అందు తామ్ర పాత్రను స్థాపించి, అందు గంగోదకమును పోసి గంధ పుష్పాక్షత లందు వేసి గంధపుష్పాదులచే పూజించి మోకాళ్లతో భూమినానుకొని, యర్ఘ్యపాత్రను తీసికొని భ్రూమధ్యము వరకుపైకెత్తి సర్వసిద్ధి ప్రదమగు సూర్యమంత్రము నుచ్చరింపుచు ఈ చెప్పబడిన శ్లోకములతో సూర్యున కర్ఘ్య మీయవలెను-

శ్లో. సిందూర వర్ణాయ సుమండలాయ.
నమోస్తు వజ్రా భరణాయ తుభ్యం.
పద్మాభ నేత్రాయ సుపంక జాయ,
బ్రహ్మేంద్ర నారాయణ కారణాయ.

సరక్త చూర్ణం ససువర్ణ తేజసం.
స్రకుంకుమాద్యం సకుశం సపుష్పం
ప్రదత్త మాదాయ సహేమ పాత్రం
ప్రశస్త మర్ఘ్యం భగవాన్ప్రసీద.

అని యివ్విధంబున పఠించి సూర్యున కర్ఘ్యమీయవలెను. పిమ్మట

శ్లో. నమశ్శివాయ సాంబాయ సగణా యాది హేతవే
రుద్రాయ విష్ణ వేతుభ్యం బ్రహ్మణే చ త్రిమూర్తయే.

యని పఠించి నమస్కరింప వలెను.

తదుపరి ఆసనాధిష్ఠితుడై మరల ఋష్యాదుల జెప్పుకొని హస్తములు కడిగికొని పూర్వోక్త విధిగ భస్మము ధరించి అంగన్యాసకరన్యాసములు గావించి లఘుత పంచపూజ గావించి శిరమునంచి గురువును పంచోప చారములచే పూజించి ఓం శ్రీం గురవేనమః అనియుచ్చరించుచు పంచాత్మక మైనదియు, బిందు సంయుక్తమైనదియు, పంచ స్వరసంయుతమైనదియు గాని, బిందుసంయుతమై పంచమ స్వర వర్జితమైనదిగాని, శివ మంత్రరాజమును జపింపవలయును. తదుపరి ప్రణవసహిత పంచాక్షరితో, గురుగణపతులకు సాష్టాంగనమస్కార మాచరించి, దుర్గకుక్షేత్ర పాలునకు బద్ధాంజలిపుటుడై నమస్కరించి యస్త్రాయఫట్ అని యుచ్చరించి, చేతులు కడిగికొని, యంగన్యాసకరన్యాసములు జెప్పికొని, అపసర్పంతుయే భూతాని అని భూతోచ్చాటనజేసి. ప్రణవముచ్చరించి, యస్త్రాయఫట్ అని ముమ్మారు దిగ్బంధనముచేసి పార్శ్వభాగమునందున్న భూమిపై ముమ్మారుగొట్టి భూతపిశాచములు పోవునట్లుగ ముమ్మారు కరతాళధ్వనులుచేసి యంతరిక్షమందున్న దేవతలగాంచుచు, నిరుద్ధప్రాణుడై హంససోహం అని హంసమంత్ర ముచ్చరించుచు హృదయమందున్న జీవచైతన్యమును, బ్రహ్మనాడియందు, అనగా సుషుమ్నానాడియందు సంధానముచేసి ద్వాదశదళ హృదయపద్మము నందున్నదనియు, నుజ్వలసహస్రదళములతో నున్న మహాపద్మమందు చిదాత్మక చంద్రమండలమందున్న చిద్రూప పరమేశ్వరుని ధ్యానముచేయుచు రేచకముచే శోషదాహములను దూరముచేసికొని 32

పర్యాయములుగాని 14 పర్యాయములుగాని 16 పర్యాయములుగాని లెక్క పెట్టుకొని ప్రాణాయామముచేసి భూతశుద్ధి పంచభూతములను వేదాదిమంత్రములచే ధ్యానముచేయుచు ప్రాణాయామముచేసి మూలాధారమందున్న కుండలిని బ్రహ్మరంధ్రమువరకు లేవదీసి, ద్వాదశపత్ర హృదయకమలము నందుచేర్చి, తదుపరి సహస్రార పద్మము కడకుచేర్చి నిలిపి చిచ్చంద్రమండలోద్భూతపరమామృతధారలచే తడుపుచు, శుద్ధదేహుడై, శుభావహుడై సోహం బ్రహ్మాస్మి యని తెలిసికొని హృదయాంబుజమున ధ్యానింపుచు నాత్మన్యావేశ్యచాత్మాన మమృతః అనుశ్రుతి ప్రకారము జీవాత్మను పరమాత్మయందైక్యముచేసి తాను బ్రహ్మనని తలచి భావింపవలయును. తదుపరి యథావిధిగ ప్రాణప్రతిష్ఠాపనచేసికొని యోగిపరాగ్రమానసుడై అంతరాత్మకలను విడిచి, బహిరాత్మల్లను ప్రణవసంపుటిచే నుచ్చరింపుచు నియతప్రాణుడై బాహ్యదృష్టిని నిలిపి, చిన్మయుండగు శంకరుని స్మరింపుచు, విగతమత్సరుడై ఋషిన్యాసము చెప్పుకొని సమస్కరించి ప్రణవమును జపింపవలయును.

బ్రహ్మ ఋషిః దేవీగాయత్రీచ్ఛందః సదాశివపరమాత్మా దేవతా అం బీజం ఉం శక్తిః మం కీలకం మోక్షప్రాప్త్యర్థే జపేవినియోగః ఓం అంగుష్ఠాభ్యాంనమః అని ఓంకారమంత్రముచే అంగన్యాసకరన్యాసములు చెప్పుకొని ఓం నమః అని హృదయమందు జలము చల్లుకొని అంబీజ ఉం శక్తి మంకీలకం అంబ్రహాత్మనే నమః అని శిరమును స్పృశించి మం హ్రదాయనమః అని శిఖను స్పృశింపవలయును. ఈ మంత్రముచేతనే యంగన్యాస కరన్యాసములు చెప్పుకొనవచ్చును. అంగ ముఖ కళ భేదముచే పంచబ్రహ్మల న్యాసము కూడ చెప్పుకొనవలెను. అనగా, సద్యోజాతాయనమః శిరసి, వామదేవాయనమః ముఖే, అఘోరాయనమః హృదయే తత్పురుషాయనమః గుహ్యే, ఈశానాయ నమః పాదయోః పూర్వాది చతుర్దిక్కుల యందు పరమేశ్వరుని చతుర్ముఖములుగ భావించి హృదయము కంఠము భుజమూలపురములు రెండు నాభి కుక్షి పృష్ఠభాగము వక్షములనెడి ఈఅష్ట స్థానముల యందు క్రమముగ నఘోరుని యష్టకళలచే పూజింపవలెను తదుపరి పాయు శిశ్న యూరుద్వయము జానుద్వయము కటిప్రదేశము రెండు పిరుదులు నుభయ పార్శ్వము

లనెడి త్రయోదశ భాగముల యందు వామ దేవుని త్రయోదశ కళలచే పూజింపవలెను సద్యోజాతుని అష్టకళలచే నేత్రహస్త చరణ హృదయ శిరో బాహు శ్రప దేశముల పూజింపవలెను. ఇట్లు అష్టత్రింశత్కళలచే న్యాసము చెప్పుకొని బుద్ధిమంతుడు ప్రణవ న్యాసము చెప్పుకొని పై జెప్పిన ప్రదేశము ప్రణవముతో విన్యాసము జెప్పుకొనవలెను ఇది పరమాత్మను బోధించును.

**శివ మహాపురాణమందలి కైలాస సంహిత యందు**
**ఆరవ అధ్యాయము సంపూర్ణము**

---

# ఏడవ యధ్యాయము

## శివ ధ్యాన పూజాదులు

తదుపరి తన భాగమున చతురశ్రమండలము నిర్మించి. ఓం యని పూజించి, శంఖస్థాపనచేసి, ప్రణవముచే నర్చించి, చందనాది సుగంధిత జలముచే శంఖమును పూరించి, మరల ప్రణవముచే గంధ పుష్పాదులతో సప్త పర్యాయము లభిమంత్రించి పూజించి ధేను ముద్రను, శంఖముద్రను జూపించి, పురోభాగమున చతురశ్రమండలము గావించి, దానిమధ్య నర్ధ చంద్రము, దానిమధ్యను త్రికోణము, దానిమధ్య వృత్తమును జుట్టి దానిమధ్యమట్కోణము లిఖింపవలెను. ఇట్లు మండల నిర్మాణముచేసి గాయత్రీమంత్రముచే గంధపుష్పాదు లభిమంత్రించి ధేనుముద్రను ప్రదర్శించి, గాయత్రీమంత్రముచే ప్రోక్షించి గంధపుష్పాదులచే, తన్ను దాను పూజించుకొని షట్కోణకమ లీసాను భాగమున ప్రణవోచ్చారణ పూర్వకముగ గురువున కాసనము కల్పించి గురుమూర్తి నటస్థాపించి ఓం గుం గురుభ్యోనమః అని నమస్కరించి దక్షిణాభిముఖుడై,

శ్లో॥ సుప్రసన్న ముఖంసౌమ్యం శుద్ధస్ఫటిక నిర్మలం
వరదాభయహస్తంచ ద్వినేత్రం శివ విగ్రహం.

అని ఇట్లు గురువుని ధ్యానించి గంధపుష్పాదులచే యథావిధిగా పూజించి, దీనికి నైరుతి భాగమున గణపతికి యాసనము కల్పించి గణపతి మూర్తిని స్థాపించి గణానాంత్వాను మంత్రముచే గణపతి నావాహనముచేసి,

శ్లో. రక్త వర్ణం మహాకాయం సర్వాభరణ భూషితం.
పాశాంకు శేష్టదశనాధ దానంకర పంకజై ॥

అని ఏకాగ్ర చిత్తుడై ధ్యానించి గంధ పుష్పా ద్యుపచారంబులచే పూజించి, కదళీ నారికేళ చూత ఫలంబులను లడ్డువులను నైవేద్యముచేసి గజాననునకు నమస్కరించి తదు పరి వాయువ్య భాగమున స్కందుని స్థాపించి యావాహన ముచేసి స్కంద గాయత్రిచే కుమారుని ధ్యానించి మరియు,

శ్లో. ఉదయాదిత్య సంకాసం మయూరవర వాహనం.
చతుర్భుజ ముదా రాంగం మకుటాదివి భూషితం.
' వరదా భయహస్తంచ శక్తికుక్కుట ధారణం

అని ధ్యానించి గంధపుష్పాదులచే పూజించి తదుపరి తూర్పు దిశ యందున్న గణాధ్యక్షు నంతఃపురాధిపుడు మేరునగ సంకాశుడు, సర్వాభరణ భూషితుడు బాలేందు ముకుటుడు, సౌమ్యుడు త్రినేత్రుడు చతుర్భుజుడు దీప్తశూలధరుడు మృగఖడ్గధరుడు హేమనేత్ర ధరుడు, చంద్రబింబా భవ దనుడు సింహపరాక్రముడు నగు నందీశ్వరుని ధ్యానించి యథావిధిని పూజింప వలెను. ఉత్తరద్వారమున యశోవంతయు, సువ్రతయు మరుత్పుత్రికయు నంబికా పద భక్తురాలును నగు నందీశ్వరుని భార్యను యథావిధిగ గంధ పుష్పాదులచే పూజింప వలెను. తదు పరి శంఖోదకమును మండలముపై ప్రోక్షించి యధోముఖుడై శుభప్రదయు, శ్యామలయునగు నాధారశక్తిని ధ్యానింప వలెను. మరియు దాని పురోభాగమందున్న యనంత స్వరూపుడగు కుండలిని ధ్యానింప వలెను. ఆకుండలి ధవళమై పంచఫణంబులుగల్గి, యాకసమును తెలి హాసమును చేయుచున్నట్లుండును, దాని సమీపమున ధర్మజ్ఞాన వైరాగ్యై శ్వర్యములనెడు చతుష్పాదంబులుగల సింహాముపై నాసీనుడగు నట్లుగ భావించి, ఆగ్నేయ నైరుతి, వాయు ఏశాన దిక్కులయందు శ్వేత రక్త, పీత

శ్యామల వర్ణంబులు గల్గియున్నట్లును పూర్వాది చతుర్దిక్కులయందు ధర్మాది కామమోక్షము లున్నట్లు భావించి రాజావర్తమణులచే గాత్రమంతయు దేదీప్యమానముగ నున్నట్లు భావించి కంద నాళ కంటక దళకర్ణిక లోకూడిన పద్మమును యథావిధిగ పూజింపవలెను. కళములయం దష్టసిద్ధులను కేసరములయందు రుద్రవామాద్యష్ట సిద్ధులను, పూర్వాదికళయందు వైరాగ్యము బీజములయందు నవశక్తులను పూర్వ దిక్కులయందు వామాది శక్తులను దానివెనుక మనోన్మనీ శక్తిని కందమందు స్కందుని ధర్మనాళమునందు శివాశ్రయమైన జ్ఞానమును కర్ణికోపరి నాజ్ఞేయ భాగమున సూర్యుని ధ్యానము చేయవలెను. తదుపరి శివాత్మకమైన యాత్మ విద్యాజ్ఞానమును తత్వత్రయమును పొంది విచిత్ర కుసుమోజ్వల మైన చిత్రాసనముపై నాసీనుడై, మహాకాశము మహోజ్వలాకాశమును నిర్మించుకొని యాధారశక్తి మొదలు, శుద్ధవిద్య వరకు, సహస్రారమువరకు ఓం శివాయనమః యని యుచ్చరించుచు యథా విధిగ షట్చక్రములను పూజింపవలెను. తదుపరి ఈశానాది పంచబ్రహ్మలచే నంగన్యాస కరన్యాసములు చెప్పుకొని ముద్రలను జూపించి, పుష్పాంజలిపుటమై దేవతల నావాహనముచేసి సద్యోజాతం ప్రపద్యామి మొదలుకొని, శివోమే అస్తు సదాశివోం వరకు నుచ్చరించి మూలాధారమును వీ బయలు వెడలిన నాదముచే ద్వాదశ గ్రంథులను భేదించి ఓంకారము నుచ్చరించుచు బ్రహ్మ రంధ్రము వరకు ఓంకారమును వ్యాపింప జేసి ఓంకార గోచరుడగు పరబ్రహ్మనిట్లుధ్యానింప వలెను.

శ్లో॥ శుద్ధస్ఫటిక సంకాశం దేవం నిష్కళమక్షరం
కారణం సర్వలోకానాం సర్వలోకమయాంవరం
అంతర్బహిస్థితంవ్యాప్య, వ్యానోరల్పంమహత్తరం
భక్తానామప్రయత్నేన. దృశ్యమీశ్వరమవ్యయం
బ్రహ్మేంద్ర విష్ణురుద్రాద్యైరపిదేవైర గోచరం
వేదసారైశ్చ విద్వద్భిరగోచరమితిశ్రుతం
ఆదిమధ్యాంతరహితం భేషజంభవరోగిణాం

అనిధ్యానించి సమాహిత చిత్తుడై యూహాహనము చేసి స్థాపించి మంత్రబద్ధుని జేసి, నిరీక్షించుచు, నమస్కరించి వేరు వేరుగా ముద్రలను ప్రదర్శించుచు, నిట్లు ధ్యానింపవలయును.

సాక్షాద్దేవుడు, నిష్కలుడు, శుద్ధస్ఫటికసంకాశుడు ప్రసన్నవదనుడు శీతలేక్షణుడు విద్యుద్వలయసంకాశుడు జటామకుట భూషితుడు శార్దూల చర్మవసనుడు మందస్మితవదనారవిందుడు రక్తపద్మ సదృశపాణి పాదద్వయుడు. అరుణోష్ఠద్వయుడు. సర్వలక్షణసంపన్నుడు. సర్వాభరణ భూషితుడు. దివ్యాయుధహస్తుడు. దివ్యగంధానులేపనుడు. పంచవక్త్రుడు. దశభుజుడు. చంద్రశేఖరుడు నగుపరమేశ్వరుని పూర్వముఖము సౌమ్యమై బాలార్క సదృశమై అరవిందతుల్యమై త్రినేత్రయుతమై నిందుమౌళియై యుండెను. పూర్వముఖము నీప్రకారము ధ్యానింపవలయును.

ఇతని దక్షిణముఖము నీలజీమూత సదృశమై భృకుటీకుటిలమై, ఘోరమై రక్తవృత్త త్రిలోచనయుతమై దంష్ట్రాకరాళదుర్నిరీక్ష్యమై స్ఫురితాధరపల్లవమై యొప్పుచుండెను.

పరమేశ్వరుని యుత్తర వక్త్రము. విద్రుమ ప్రకాశమానమై నీలాలక విభూషితమై సద్విలాస త్రినేత్రయుతమై చంద్రార్ధకృత శేఖరమై యొప్పుచుడును.

పశ్చిమ ముఖము, పూర్ణచంద్రాభమై ప్రకాశమానలోచనత్రయమై చంద్రలేఖావతంసమై, సౌమ్యమై, మందస్మితమనోహరమై, యుండెను.

మరియు నూర్ధ్వమందైన పంచమముఖము శుద్ధ స్ఫటికసంకాశమై యిందు రేఖానముజ్వలమై, యతిసౌమ్యమై, యుత్ఫుల్లలోచన త్రితయోజ్వలమై యొప్పుచుండును.

దక్షిణభాగమందలి నైదు హస్తంబులయందు మహోజ్వలములైన శూల, పరశు, వజ్ర, ఖడ్గానలంబులు ధరించెను. వామ భాగమందలి నైదు హస్తములయందు మహోజ్వలములగు పినాక, నారాచ, ఘంటా, పాశాంకుశముల

ధరించెను. ఇతడాజానుడాహుడై యిట్టి ఆయుధములచే శోభించుచు కంఠపర్యం తము, విద్యచేతను, లలాటపర్యంతము శాంతిచేతను,నూర్ధ్వభాగంబున శాంత్యా తీత కళలచే నొప్పుచు ఆకాశమంతయు వ్యాపించి కళాపంచక విగ్రహుడై యుండెను. అదెట్లన పంచ బ్రహ్మలలో ఈశానుడు ముకుటముగను తత్పు రుషుడు పురాతనపురుషుడుగను అఘోరుడు హృదయముగను వామదేవుడు గుహ్యముగను సద్యోజాతుడు చరణములుగను యుండెను. ఈ మూర్తంతయు ముప్పది మూడు కళలచే నొప్పుచుండెను. ఈశానుడు మాతృకామయుడు. పంచబ్రహ్మమయుడు, ఓంకారాఖ్యమయుడు, హంసన్యాసమయుడు, పంచా క్షరమయుడు, షడక్షరమయుడు, షడంగమయుడు, నగు నీశ్వరు నీవిధంబున ధ్యానింపవలెను. శిక్షా. వ్యాకరణము. ఛ్ఛందస్సు నిరుక్తము జ్యోతిషము కల్పము అనునవి షడంగము లందరు.

## ఈశ్వర ధ్యాన శ్లోకములు

శ్లో॥ శుద్ధ స్ఫటికసంకాశం ప్రసన్నం శీతలద్యుతిం
విద్యుద్వలయసంకాశం జటాముకుట భూషితం.

2. శార్దూల చర్మవసనం సుందస్మిత ముఖాంబుజం
రక్తపద్మదళప్రఖ్య పాణిపాద తలాధరం.

3. సర్వలక్షణ సంపన్నం సర్వాభరణ భూషితం
దివ్యాయుధకరై ర్యుక్తం దివ్యగంధానులేపనం.

4. పంచవక్త్రందశభుజం చంద్రఖండ శిఖామణిం
అస్యపూర్వముఖం సౌమ్యం బాలార్క సదృశప్రభం.

5. త్రిలోచ నారవిందాఢ్యం బాలేందు కృతశేఖరం
దక్షిణం నీలజీమూతం సమాన రుచిరప్రభం.

6. భృకుటీకుటిలం ఘోరం రక్తవృత్త త్రిలోచనం
దంష్ట్రాకరాళం దుష్ప్రేక్ష్యం స్ఫురితాధర పల్లవం.

7. ఉత్తరం విద్రుమం ప్రఖ్యం నీలాలకవి భూషితం
సద్విలాస త్రినయనం చంద్రార్థ కృత శేఖరం.

8. పశ్చిమం పూర్ణచంద్రాభం లోచన త్రితయోజ్జ్వలం
చంద్రలేఖాధరం సౌమ్యంమందస్మిత మనోహరం.

9. పంచమం స్ఫటికప్రఖ్యం ఇందు రేఖా సముజ్జ్వలం
అతీవ సౌమ్యముత్ఫుల్లలోచన త్రితయోజ్జ్వలం.

10. దక్షిణే శూలపరశు వజ్రఖడ్గానలోజ్జ్వలం
పూర్వేపి నాక నారాచఘంటా పాశాంకుశోజ్జ్వలం.

11. నివృత్యా జానుపర్యంత మానాభిచ ప్రతిష్ఠయా
ఆకంఠం విద్యయాతద్వదాలలాటం తు శాంతయా

12. తదూర్ధ్వశాంత్యతీ కలయాపరయాతథా
పంచాధ్వవ్యాపినంతస్మాత్ కళాపంచకవిగ్రహం.

13. ఈశానముకుటం దేవ పురుషాఖ్యం పురాతనం
అఘోరహృదయం తద్వద్వాను గుహ్యంమహేశ్వరం

14. సద్యోజాతం చతతున్మూర్తిం అష్టత్రిశత్కళామయం
మాతృకామయ మీశానం పంచబ్రహ్మమయం తథా

15. ఓంకారాఖ్యమయంచైవ హంస న్యాసమయంతథా
పంచాక్షరమయం దేవం షడక్షరమయం తథా
అంగషట్కమయం చైవ జాతిషట్క సమన్వితం

అని యిట్లు పరమేశ్వరుడనగు నన్ను ధ్యానించి నావామభాగమున మనో న్మయివగు నిన్ను స్థాపించి, గౌరీమిమాయ సలిలాయను మంత్రముచేతను, ప్రణవముతోడను, భక్తితో ధ్యానించి యావాహనముచేసి, నమస్కరించి పూజించి సమాహిత చిత్తుడై నిన్నిట్లు ధ్యానింపవలయును.

శ్లో॥ ప్రఫుల్లోత్పల పత్రాంభాం విస్తీర్ణాయత లోచనాం
పూర్ణచంద్రాభవదనాం నీలకుంచిత మూర్ధజాం

2. నీలోత్పలదళ ప్రఖ్యాం చంద్రార్థ కృత శేఖరాం
అతివృత్త మనోత్తుంగ స్నిగ్ధపీనపయోధరాం

3. తనుమధ్యాంపృథు శ్రోణీం పీతసూక్ష్మ్యత రాంబిరాం
సర్వాభరణ సంపన్నా లలాటతిలకోజ్వలాం

4. విచిత్రపుష్ప సంకీర్ణ కేశపాశోపశోభితాం
సర్వతస్సు గుణాకారాం కించిల్ల జ్జానతాననాం

5. హేమారవిందం విలసద్ధ ధానంకక్షి శేకరే
దండవచ్చామకంహస్తే న్యస్యాసీనాం సుఖాసనే

అని యిట్లు నిన్ను ధ్యానించి, ప్రణవముచే ప్రోక్షించి శంఖోదకముచే నిన్ను స్థాపించి భవే భవేనాతి భవమితి మంత్రముచే, పాద్యమిడి వామాయనమః అని ఆచమనమిచ్చి, జ్యేష్ఠాయనమః అని యజ్ఞోపవీత మొసగి రుద్రాయనమః అని పునరాచమనమిచ్చి కళాయనమః అని గంధమిచ్చి, కలవికరణాయనమః అని అక్షత లొసగి, బలవికరణాయనమః అని పుష్పము సమర్పించి, బలాయ నమః అనిధూపమర్పించి, బలప్రమథనాయనమః అని దీపమిడి, బ్రహ్మావడం గాది మాతృకలతో మనలను ప్రణవముతో నర్చించి ముద్రలజూపించి శ్రీవా చకములతో మనలను పూజించినచో భద్రములు కల్గును. ఇట్లు సమ్యగ్వి ధానముగ ధ్యానపూజాదులు గావించి విచక్షణుడైనవాడు నాయావరణ పూజ గావింపవలయును.

శివ మహాపురాణము నందలి కైలాస సంహితయందు
యేడవ అధ్యాయము సంపూర్ణము



# ఎనిమిదవ యధ్యాయము

## ఆవారణ పూజావిధి

మరల పరమేశ్వరు డిట్లు చెప్ప దొడంగెను. ఇటుపై నావరణ పూజా విధానము చెప్పెద వినుము. మొదట ప్రారభించిన ప్రదేశమునందే క్రమముగా పూజింప వలెను. ముందుగా గణపతిని కుమారస్వామిని పూజింపవలెను. తదుపరి సద్యోజాతాది పంచబ్రహ్మలను పూర్వదక్షిణ పశ్చిమోత్తరంబుల యందు క్రమముగ పూజింప వలెను పశ్చిమంబున షడంగ పూజచేయవలెను. పదుపరి యాగ్నేయ ఈశాన్య నైరుతి వాయువ్య దిశల మధ్యయందు నేత్రములను అస్త్రములను పూజింపవలెను అనగా త్రినేత్రంబు లనెడి చంద్ర సూర్యాగ్నులను ధరించిన సర్వాయుధములను పూజింపవలెను. ఇదియే ప్రథ మావరణ పూజ. ద్వితీయావరణ పూజ చెప్పెద వినుము.

పూర్వ దిక్పత్రమున అనంతుని దక్షిణమున సూక్ష్ముని. పశ్చిమంబున శివుని, యుత్తరంబున లలాట మందున్న నేక నేత్రమును ఈశాన్యమున రుద్రుని యాగ్నేయమున దత్తాత్రేయుని నైరుతియందు శ్రీకంఠుని వాయువ్యము నందు శిఖండీశుని పూజింపవలెను. ఇవ్విధంబున ద్వితీయావరణ పూజగావింప వలెను

తృతీయావరణంబున పూర్వ ద్వారమధ్యమున వృషేశానుని, దానికి దక్షిణంబున, నందిని యుత్తరంబున మహాకాలుని, దక్షిణ పశ్చిమ ద్వారముల భృంగీశుని పూజింప వలెను.

చతుర్థావరణమునందు పూర్వ కాష్టమునందు గంధ పుష్పాదులచే పశ్చిమోత్తర కోష్ఠంబున వృషభుని, దక్షిణ కోష్ఠంబున స్కంధుని పూజించి యుత్తర పూర్వ ద్వారములయందు ప్రదక్షిణ విధిగా నామాష్టకవిధానంబుగ నర్పింపవలెను అనగా, భవుడు, శర్వుడు, ఈశానుడు, రుద్రుడు, పశుపతి, ఉగ్రుడు భీముడు మహాదేవుడు అను అష్టమూర్తి నామంబులచే పూజింపవలెను. తదుపరి యోవేదాదౌ స్వరప్రోక్త అను మంత్రముచే మహేశ్వరు నాహ్వానించి కమల

కర్ణికోపరి పూర్వాది గ్భాగంబున పూజింప వలెను. తదుపరి పూర్వాదిక్పత్రమున ఈశ్వరుని దక్షిణ పత్రమున విశ్వేశుని సౌమ్యుడు శర్వేశ్వరుడునగు వాని పశ్చిమదళ భాగంబున పూజింప వలెను.

పంచ మావరణయందు దక్షిణంబున రుద్రుని, మూవో జానయను బుక్కుచే కర్ణికాదళమున నావాహన చేసి గంధపుష్పాదులచే పూజించి శివుని పూర్వ భాగమున హరుని దక్షిణ భాగంమున భవుని పశ్చిమ భాగంబున పూజించి ఉత్తర భాగంబున విష్ణువాహ్వానించి ప్రతద్విష్ణురితిమంత్రములచే పూజించి పూర్వ భాగంబున వాసుదేవుని దక్షిణ భాగంబున యనిరుద్ధుని పశ్చిమంబున సౌమ్యులగు సంకర్షణ ప్రద్యుమ్నులను యర్చించి పశ్చిమ భాగంబున బ్రహ్మను హిరణ్యగర్భః సమవర్తత యనెడు మంత్రములచే నర్చింప వలెను. పూర్వభాగంబున హిరణ్యగర్భుని దక్షిణంబునది రాజుని పశ్చిమంబున కాలుని ఉత్తరంబున పుష్కరుని పూజింప వలెను. వీటికిని యూర్ధ్వ భాగంబున పూర్వాది దిక్కులయందు లోకపాలుర స్థాపించి, రాం, హాం, జ్ఞాం, లాం, అం, ఓం, కాం, షాం, సాం శ్రీం అను బీజాక్షరముల లచేతను లోకపాలురగు నష్టదిక్పాలకుల పూజింప వలెను. మరియు నైరుతి ఉత్తర ఈశాన దక్షిణ దిశలయందు బ్రహ్మవిష్ణులను విధిక్రమముగ పూజింప వలెను. తదుపరి పంచమావరణ యందైన పరమేశ్వరునిట్లు పూజింపవలెను.

ఈశాన్య భాగమున త్రిశూలము తూర్పున వజ్రాయుధమును, అగ్నేయమున పరశువును, దక్షిణమున సాయకమును, నైరుతియందు ఖడ్గమును పశ్చిమంబున పాశమును వాయువ్యమున యంకుశము, నుత్తరమున పినాకమను ధనస్సును పూజించి పశ్చిమ దిశయందు రౌద్రుని క్షేత్రపాలుని పూంవవలెను. ఇవ్విధంబున శివప్రీతికై పూజించి కృతాంజలి పుటుడై మందస్మితుడై పైజెప్పిన సకల దేవతలను ధ్యానించి సాదరముగ గౌరీ శంకరులను వీక్షింపవలెను. విఘ్న శాంతికై యిట్లా వరణ పూజించేయువలెను. మరల శివునర్చించి ప్రణవమును జపింప వలయును. ఇట్లుపూజించి నైవేద్యమొసంగి తాంబూల పానీయంబులిచ్చి నిరాజన మంత్రపుష్పము లర్పించి పూజను సమాప్తిగావించియు మామహేశ్వరుల ధ్యానించియష్టోత్తరశత మోంకారమును జపించి పుష్పా

జలిపుటుడై లేచి యో దేవానాం అనుమంత్రమును జపించి యో వేదాదౌ స్వరః ప్రోక్తయను మంత్రమును పఠించి పుష్పాంజలినిచ్చి మువ్మూరు ప్రదక్షిణములుచేసి పరము భక్తితో సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి మరల ప్రదక్షిణము చేసి మరియొక మారు నమస్కరించి యాసీనుడై యష్టమూర్తి నామంబులచే మరల భగవంతుని పూజించి ఓ దేవా నేనుచేసెడు సాధ్వ సాధుకర్మలన్నియు నీసేవలుగ భావింపుమని శంఖ జలముచే పుష్పము లర్పించి మరల నామాష్టకము జపించి పునః పూజగావింప వలయును.

శివ మహాపురాణమందలి కైలాస సంహితయందు
యెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

## తొమ్మిదవ యధ్యాయము

### ప్రణవార్థ పద్ధతి

ఈశ్వరుడు మరల నిట్లుచెప్పదొడంగెను, శివుడు, మహేశ్వరుడు, విష్ణువు, పితామహుడు, సంసారవైద్యుడు, సర్వజ్ఞుడు, పరమాత్ముడు, సనుసీ నామాష్టకము శివప్రతిపాదకములై యున్నవిగాన నివి నిత్యముస్మరింప వలయును. మొదటియైదునామంబులు శివమూర్తిని బోధించును. శాంతిని మించిన ఫలమువచ్చును. పైమూడు నామంబులు నిర్గుణపరమాత్మను తెలుపుడు చేయును. నిత్యపదము, అనిత్యపదము అని పదము రెండువిధములు పదమన గాస్థానము. నిత్యుడగు నిర్గుణు నిత్యపదము, మూర్తివంతమై, సగుణరూపంబు తోనున్న శివాదిదేవతలు అని నిత్యులు. సగుణమును తెలిసికొని ధ్యానించి యారూపమును వీడి నిర్గుణబ్రహ్మయగుపరమేశ్వరుని తెలిసికోవలెను. మొదటి పంచనామంబులతోడను యాత్మయందున్న యంతరాత్మను తెలిసికోవలెను. మిగిలినమూడునామంబులు జగత్తున కుపాదానకారణమైయుండెను. మాయా కారణముచే, నుపాధిమూడు కారణములుగా నుండెను. ఈమూడును శివస్వరూ పములే, కర్మలజలమును, పరిశుద్ధిచేసినట్లు, కర్మలమునంబును, పైనైదునామం

బులచే పరిశుద్ధిచేసి, పై మూడింటిచేత నిర్గుణబ్రహ్మను తెలిసికొనవలెను. నిర్గుణ పరమాత్మమే యుపాధిలేకయుండును, సగుణబ్రహ్మ యుపాధిసహితుడై యనేక నామంబులతో నుండును. అశేషకళ్యాణగుణైక ఘనుడై, ఈశ్వరుడనుచెప్ప బడుచున్నాడు. శివతత్వార్థవేదు లితనిని శివుడని చెప్పుచుండిరి. ఇరువది మూడుతత్వములకంటె పరమైనది ప్రకృతి యనబడును. ప్రకృతి కంటె పరుడు పురుషుడు. ఇతడే పంచవింశతి: తత్వజ్ఞుడగు పరమేశ్వరుడు. మరియు నితడు వేద ములకు స్వరమని వాచ్యమనియు చెప్పబడు చున్నాడు ఇతడువేదైకవేద్యుడు ఇతడు యథార్థముగ వేదాంతముచే తెలియబడు చున్నాడు అనగా నుపనిష చ్ఛ్రుతిపామ్యుడు. ఇతడు ప్రకృతికంటె పరుడైనను ప్రకృతి యందులీనమై సర్వ ము ననుభవించుచుండును. ఇతడే మహేశ్వరుడు. ప్రకృతి పురుషులు నివృత్తి కూడ నితని యధీనములు. త్రిగుణముల కధీనమైన ప్రకృతి పురుషులు పర మేశ్వరున కధీనములై యుండును. మాయయేప్రకృతి. ఈమాయ పరమేశ్వర కల్పితమైనది. ఈమాయా విమోచకుడే యనంతుడైన మహేశ్వరుడు. దుఃఖ మును పోగొట్టువాడుగాన ఇతనికి రుద్రుడని పేరు కలైను. ఈరుద్రుడే పరమ కారణముగు శివుడని చెప్పబడుచున్నాడు. మృత్తికఘటమైనట్లుగ పంచవింశతి తత్వములు శివస్వరూపము. ఇతడు సర్వవ్యాపియగుటచే విష్ణువని చెప్పబడుచు న్నాడు. ఇతడు జగత్సృష్టి చేయుచుండును గాన పితృతుల్యుడనియు పితా మహుడనియు చెప్పబడుచున్నాడు. వైద్యుడు నాడీ నిదానముచే రోగుల కౌషధములిచ్చి రోగనివారణ చేసినట్లుగ నీశ్వరుడు తత్వజ్ఞానము నొసంగి భవరోగ భిషగ్వరుడై భవబంధ విముక్తి చేసిమోక్షము నొసంగును గాన నితడు వైద్యుడనియు మోక్షప్రదాతయనియు తత్వవేత్తలు .చెప్పియుండిరి. ఇంద్రియజ్ఞానమున్నంత వరకు జీవునకు పరమార్థము తెలియదు కాని తత్వవేత్త యైనచో పంచేంద్రియముల నరికట్టు శక్తివంతుడగును. స్థూల సూక్ష్మేంద్రియ ములన్నిటిని జయించినచో త్రికాలవేదియగును. మాయాజాల మగ్నులు సూక్ష్మజ్ఞానము నొందలేరు. సర్వము అసత్తని సిద్ధులు తెలిసి కొందురు. నశింపనియథార్థవస్తువే సదాశివుడు. ప్రయత్నముచే పరమేశ్వరుని తెలిసి కొన్నవాడు సర్వజ్ఞుడని చెప్పబడుచున్నాడు. ఈగుణముల చేతనే పరమేశ్వరుడు నిత్యుడని తెలిసి కొనవలెను. శివుని కన్నవేరైన పరమాత్మ వస్తువేదియును

లేదు. ఈశివుడే ప్రణవాత్మకుడు, అవ్యయుడు, మహాదేవుడు, యీశాన మస్తకుడు నగు నీశ్వరునకు సమాహిత చిత్తుడై ప్రణవముతో పునఃపూజ గావించి పుష్పాంజలిపుటుడై ఇడానాడిచే నీశ్వరుని పింగళనాడిచే దేవిని సహస్రారపద్మమున స్థాపించి, శివోహమని జీవబ్రహ్మైక్యము నొంది సర్వదేవతలను హృదయమందు స్థాపించి బ్రహ్మవిద్యను గురునిపూజించి, శంఖార్ఘ్య పాత్రమంత్రముల పఠింపుచు, పరమాత్మను హృదయ మందు నిల్పుకొని, నిర్మాల్యము చండీశ్వరున కర్పించి. ప్రాణాయామముచేసి. ఋష్యాదులను స్మరించి, కైలాస ప్రస్తరమనెడి మండలము కల్పించి, నిత్యముగాని పక్షమునకు గాని, మాసమునకుగాని, షణ్మాసమున కొకతూరిగాని, చాతుర్మాస్యాదిపర్వదినములయందు గాని యాస్తికుడాలింగము నభ్యర్చింపవలెను. ఓ దేవి! ఇంకొక విశేషము చెప్పెదవినుము. ఉపదేశ దినంబున గురువుసహితుడై లింగము నర్చింపవలెను. మరియు గురుశివులయెదుట నాజీవితాంతము వరకు పూజగావింతునని ప్రమాణము చేయవలెను. ఇట్లు ముమ్మారుగురుని యెదుట ప్రతిన బూనవలెను. తదుపరి పూర్వోక్త పధిగ నిత్యము పూజింపుచుండవలెను. తదుపరి అర్ఘ్యోదకములచే శివుని శిరము నందర్ఘ్యము విడువవలెను. తదుపరి ప్రణవముతో నర్చించి ధూపదీపములు సమర్పించి ఈశాన్యమందు చండీశ్వరు నారాధించి, నిర్మాల్యము నివేదించి. వడపోసిన జలముచే లింగమును వేదికను కడిగి శుభ్రముచేసి ప్రణవముతో లింగశిరోభాగంబున పుష్పములుంచి, ఆధారచక్రము లగాయతు సహస్రార చక్రము వరకు పరమేశ్వరుని భావనచేసి, పరమేశ్వరునట స్థాపించి విధవానుకూలముగ పంచగవ్యములతోడను, సుగంధపరిశుద్ధ జలముతోడను నభిషేకించి, పవమానమంత్రముల చేతను, ఇలాసూత్రముల చేతను, త్వరితమంత్రములచేతను ఋక్కుల చేతను, సామముల చేతను. పంచబ్రహ్మమంత్రముల చేతను, ప్రణవము చేతను నీశ్వరునభిషేకింపవలెను. సగము జలము పై జెప్పిన మంత్రముల చేతను, మిగిలి సగము జలము నోంకారము చేతను నభిషేక మొనరింప వలయును. తదుపరి వస్త్రముచే లింగమును తుడిచి లింగోపరి భాగమున పుష్పములిడి సింహాసనముపై లింగమునుంచి, సూర్యాది పంచాయతన దేవతల నర్చించి, ఆధారశక్తిని యనంతుని పీఠముక్రింది భాగమున పూజించి. తదుపరి సింహాసన మందున్న

పంచాయతనమును పూజింపవలెను. పీఠముపై నొకభాగమున కుమారస్వామిని పూజించి లింగమందు పార్వతీపరమేశ్వరుల మగుమున మున్నటుల భావించి పూజింపవలెను. ఈవిధంబున బాహ్యపూజయు. మానసిక పూజయు కూడ చేయవలెను. ఇదియతిరహస్యమైనది. అందరకు చెప్పవలసిన విషయముకాదు. వీతరాగులు, నాభక్తులునగు యతులు మాత్రమే గ్రహింప వలయును. గురుభక్తులు, శాంతులు, శివభక్తులు మాత్రమే దీనిని గ్రహింపనర్హులు. శివాజ్ఞను మీరినవారు, భక్తిలేనివారు, దీనిని గ్రహింపరాదు. శివద్రోహులు తప్పక నరకము నొందెదరు. నీవునాభక్తురాలవు, ఇష్టురాలవు గాన నీకు జెప్పితిని. నన్నుపూజించిన వారు ఇహమందు సర్వభోగములనుభవించి, పరమున నా సన్నిధానమందుండెదరు. ఓఋషులారా! దేవి యిదంతయువిని వేదార్థ గుంభితములగు వాక్కులచే నాపరమేశ్వరుని స్తుతించి, పాదపద్మములకు నమస్కరించి ప్రహృష్టమానసయై యుండెను. ఓమునీశ్వరులారా! ప్రణవార్థప్రకాశ మతిగుప్తమైనది. ఇది శివజ్ఞానమునిచ్చును. వ్యాసుడొకానొప్పుడీ దంతయు మహర్షులతో జెప్పి వారిచే పూజింపబడి, కైలాసాద్రి యందున్న తపోవనమున కేగెను వ్యాసవాక్కులు విని మహర్షులందరు సోమశేఖరుని పూజించి, యమాది యోగనిరతులై, శివధ్యాన పరాయణులై యుండిరి. ఈప్రణవప్రకాశ మంతయు శంకరుని వలన పార్వతీవిని, కుమారస్వామికి చెప్పియుండ, నతడు నందీశ్వరునకు, నందీశ్వరుడు, సనత్కుమారునకు, సనత్కుమారుడు వ్యాసునకు వ్యాసుడు సూతునకు జెప్పియుండెను. నేనీరహస్య చరిత్రమీకు వినిపించితిని, మీరు శివభక్తుల కెవరికైన వినిపింప వచ్చును, శాంతులు, శివభక్తులు, యతీశ్వరులు నగువారికి తప్పక వినిపింప వలెను అనియిట్లు సూతుడు మహర్షులకు జెప్పి తీర్థయాత్రలకై భూపర్యటనము గావించెను. మహర్షులు సూతునిచే గుప్తమగు ప్రణవార్థము తెలిసికొని, విరక్తులై, కాశియందే నివసించుచు ప్రణవము జపించుచు ముక్తులైరి.

శివమహాపురాణము నందలి కైలాస సంహితయందు
తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

# పదియవ యధ్యాయము

## సూత సూక్తులు

సూతుకు చనినతరి విస్మితులై భ్రమించి విన్నదంతయు మరచి ఋషులందరు వారిలో వారిట్లనుకొనిరి. వామదేవ మతప్రకారముగ సూతుడు చెప్పినదంతయు మరచితిమి. మనకు సూతదర్శన మైచో బాగుండును. సంసార తరణోపాయ మంతయు మన కుపదేశించును మనము మహాదేవు నారాధించినచో, మనకు మరల సూతదర్శనంబగునని తలంచుచు వ్యాసుని తమ హృదయ పద్మములందు ధరించి హృత్పుండరీక మును పూజింపుచుండ, పురాణార్థ ప్రకాశకుడు, మహాజ్ఞాని, శివభక్తిరతుడు నగు సూతుడొక సంవత్సరము గడచినతరి మరల కాశీపురి కేతెంచ మును లతనిం దర్శించి, హృష్టమానసులై, యెదురేగి యర్ఘ్యపాద్యాస నాదులొసంగి యర్చింప సూతుడు ప్రసన్నుడై, పరముగ గంగాస్నాన మాచరించి, ఋషులకు దేవతలకు తర్పణంబువిడిచి, పితృదేవతలకు తిలాంజలులువిడిచి, తిలతండులంబులతో తర్పణములు గావించి, తీరమునకు సమీపించి ప్రోక్షించిన వస్త్రము విదళించి ధరించి, రెండు మార్లాచమించి సద్యోజాతాది మంత్రములచే భస్మముధరించి, రుద్రాక్షాభరణుడై నిత్యక్రియలాచరించి, యథోక్తాంగములందు భస్మము త్రిపుండ్రములు ధరించి, గణపతి స్కందులను విశ్వేశ్వరుని దర్శించి, మాటిమాటికి భక్తితో నమస్కరింపుచు, కాలభైరవుని యథావిధిగ నర్చించి మున్నూర్మారు ప్రదక్షిణముచేసి అయిదు విధముల నమస్కరించి, మరల ప్రదక్షిణముచేసి, సాష్టాంగ నమస్కారముచేసి ఈశ్వరపదాంబుజములు స్మరించుచు, స్తుతింపుచు వెయ్యి నూటయెనిమిది సార్లు పంచాక్షరిని జపించి కొంత తడవట విశ్రమించి, చండీశ్వరు నర్చించి, ముక్తిమండపమున కేగి, వేదపారగులగు మునీశ్వరులచే నిర్దేశింపబడిన యాసనాసీనుడై యుండ ఋషులందరు నమస్కరించి కూర్చున్నతరి సూతుడిట్లు చెప్పదొడంగెను. ఓ మునులారా! మీరందరు ధన్యులు. శంసితవ్రతులునై యుండిరి గాన, మీనిమిత్తమై మరల నిటకేతెంచితిని. మీకు ప్రణవార్థము చెప్పినతరి నేను తీర్థయాత్రల కేగి, చూచినవి శేషంబులన్నియు చెప్పెదవినుడు. ఇటనుండి బయలువెడలి తిన్నగా దక్షిణ సముద్రతీరమున కేగియందు స్నానముచేసి, పార్శ్వ

తీస్వరూపమగు కన్యాకుమారిన్ దర్శించి తదుపరి సువర్ణముఖీతటంబున కేగి, అటనుండి కాళహస్తి పర్వతముకడ కేగి సువర్ణముఖీనదీ తోయంబుల గ్రుంకు లిడి దేవ పితృ ఋషులకు తర్పణంబులిడి వారల సంతుష్టి పరచి, కాళహస్తీశ్వరు నర్చించి, పశ్చిమాభిముఖుడై పంచశిరంబులతో నొప్పువాడును, దర్శనమాత్రముచే సర్వాఘముల నశింపజేయువాడును, సర్వసిద్ధిప్రదుడును, భుక్తి ముక్తి ప్రదుడును. త్రిగుణేశ్వరుడు నగు నీశ్వరుని భక్తితో ధ్యానించి జగత్ప్రసూతయు, జ్ఞానప్రసూన కలికయు నీశ్వర వామభాగస్థితయునగు నంబి కను పూజించి యష్టోత్తర శతసహస్రము పంచాక్షరిని జపించి, ప్రదక్షిణము చేసి స్తుతించి, మాటిమాటికి ప్రణమిల్లుచు సత్యము గిరిప్రదక్షిణము చేయుచు నట నాల్గుమాసములునియమముగనుండి పరదేవతయగు ప్రసూనాంబికా ప్రసా దముచే జితేంద్రియుడనై, చేలాజినకుశోత్తరుండనై కూర్చుని సదాపరమా నంద చిద్ఘనుడనై సమాధినొంది శాంతచిత్తుడనై యుండ, నొక సమయంబున సద్గురుస్వరూపుడు, కరుణానిధి, నీలజీమూతసంకాశుడు, విద్యుత్పింగళ జటా ధరుడు, నున్నతుడు, కమండలధరుడు, కృష్ణాజనధరుడు, భస్మలిప్తాంగుడు, సర్వలక్షణక్షితుడు, త్రిపుండ్రధారుడు, రుద్రాక్షమాలాలంకృతుడు, నరుణ పద్మాయత నేత్రుడు నగు మహాపురుషుడు. నాహృదయపద్మమందు గోచ రింప, నేను విమోహితుడనై, యాయద్భుతమును గాంచుచు నానయనంబులు తెరువగనే గిరిప్రవాహమువలె జలము నా నేత్రములనుండి కారజొచ్చెను. ఇం తలో నద్భుతమైన వ్యోమవాక్కు లిట్లు వినబడజొచ్చెను. ఓ విప్రుడా ! సూతపుత్రా ! నివు త్వరలో వారణాసి కేగుము. నీవుపూర్వ ముపదేశించిన మహర్షులందరు నీకై వేచి యుండిరి. వారికి శుభములు చేకూర్చుము. నీరా కకై వారు నిరాహారులై నిరీక్షించుచుండి రన, నే నావాక్కులు విని సత్వర ములేచి, యుమాశంకరులకు ప్రదక్షిణముచేసి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి ఇది గురునాజ్ఞగా భావించి, ఆక్షేత్రమునుండి బయలుదేరి పదిరోజులు ప్రయాణముచేసి ఈ కాశీపురి చేరుకొంటిని. మీకు నేను తెలుపుదుచేయవలసిన దేదియో చెప్పుడన, ఋషులందరు సంతసించి యిట్లు ప్రశ్నింపదొడగిరి.

శివ మహాపురాణము నందలి కైలాస సంహితయందు

పదియవ అధ్యాయము సంపూర్ణము

---

## పదకొండవ యధ్యాయము

### వామదేవుడు స్కందుని కడకేగుట

ఋషులు సూతునిగాంచి, ఓమహాభాగా! నీవుమాకుత్తమ సద్గురుడవు. మమ్మనుగ్రహించి మాప్రశ్నల కుత్తరమునిచ్చి మమ్ముసంతోష పరచుము. శిష్యులమగు మాయందు దయయుంచిమాకు మరలదర్శనమిచ్చితివి. శ్రద్ధాళు లగు శిష్యులయెడ మీవంటి గురువులు ప్రసన్నులగు చుందురు. పరిశుద్ధ భావులకుగాని మీదర్శనము గాదు. వామదేవ మతాను సారమగు విరజా హోమము చెప్పినపుడు మాకునీవు పూర్తిగా చెప్పలేదు. ఆ విధానమెట్టిదో మాకుపూర్తిగా చెప్పకున్నచో మాసందేహములు తీరవు. మీరువినిపించి నచో నత్యాదరముతో నదుశ్రద్ధగా విందుమన, సూతుడు సంతుష్ట మాన సుడై, మహాదేవునకు గురుపాదములకు నమస్కరించి గురుపరంపరల కెరగి దేవికి ప్రణమిల్లి గంభీరవాక్కులతో నిట్లుపలుక జొచ్చెను.

ఓమునులారా! మీకుమంగళములు, సుఖములు చేకూరుగాక. మీరు శివభక్తులు. శివభక్తి ప్రవర్తకులు. స్థిరాత్ములుగాన, నేను గురుముఖమున విన్న యద్భుత శివగాథలు మీకిదివరలో వినిపింపనివియు మీరు విననివియు చెప్పెదవినుడు. అవన్నియు నతిగుహ్యాతమములై యున్నవి. మీరుదృఢ వ్రతులుగాన చెప్పెదను, నిశ్చలమనస్కులై వినుడు. పూర్వము రథంతర కల్ప మందు మహాపురుషుడగు వామదేవుడు గర్భమందుండి జనింపకనే గురుతర శివజ్ఞానము నొందియుండెను. ఇతడు వేదాగమ పురాణాది సర్వశాస్త్రార్థ తత్వ ముల నెరింగిన ప్రోడ. దేవాసుర, మనుష్యాది జీవుల జన్మకర్మల నెరింగిన దిట్టరి. సర్వాంగచితా భస్మలేపుడు, జటామండల మండితుడు. నిరాశ్రయుడు. నిస్పృహుడు, నిర్ద్వంద్వుడు, నిరహంకృతుడు, దిగంబరుడు, మహాజ్ఞాని. మహే శ్వరా కృతుడు, నగుమహాదేవుడు, మునీంద్రులగు శిష్యపరి వేష్టితుడై, పృథివి నంతయు పాదచారియై సంచరింపుచు పునీతము చేసెను. ఇతడు మేరుదక్షిణ శిఖరమునందలి కుమారశిఖరము కడకేగి. శివకుమారుడు శిఖివాహనుడు జ్ఞాన శక్తిధరుడు. వీరుడు. సర్వాసుర విమర్దనుడు గజవల్లీ సమాయుక్తుడు. సర్వ

వనమస్కృతుడునగు స్కందుని గాంచెను. అటస్కంధ సరోవరము గలదు అది సాగర సన్నిభమై, శీతలోదక పూరితమై, పానయోగ్యమై, స్వచ్ఛమై, యగాధమై, సర్వాశ్చర్యకరమై, సర్వగుణోపేతమై, యమృతతుల్యమై యాసమీపమునందుండెను. అందు శిష్యులైన మహామునులతో వ్యాసదేవుడు స్నానము చేసి, సుఖాసనాసీనుడు, మునిబృంద సేవితుడు, నుదయాదిత్య సంకాశుడు, మయూరవాహనుడు, చతుర్భుజుడు, సుందరాంగుడు, మకుటాదివిభూషితుడు, శక్తిరత్నద్వయ సేవితుడు, శక్తికుక్కుటధారుడు, వరదాభయహస్తుడునగు కుమారస్వామిని దర్శించి దగ్గరకేగి పరమభక్తితో నమస్కరించి ఇట్లు స్తుతింప దొడంగెను.

## కుమారస్తుతి

శ్లో॥ ఓం నమః ప్రణవార్థాయ ప్రణవార్థవిధాయినే
ప్రణవాక్షరబీజాయ ప్రణవాయ నమోనమః.

2. వేదాంతార్థ స్వరూపాయ వేదాంతార్థవిధాయినే
వేదాంతార్థవిదే నిత్యం విదితాయ నమోనమః.

3. నమోగుహాయ భూతానాంగుహాసు నిహితాయచ
గుహ్యాయగుహ్యరూపాయ, గుహ్యాగమవిదేనమః.

4. అణోరణీయసే తుభ్యం మహతోపి మహీయసే
నమఃపరావరజ్ఞాయ పరమాత్మస్వరూపిణే.

5. స్కందాయ స్కందరూపాయ మిహిరారుణతేజసే
నమోమందారమాలోద్యన్ముకుటాది భృతే సదా.

6. శివశిష్యాయ పుత్రాయ శివస్య శివదాయినే.
శివప్రియాయశివయో రానందనిధయేనమః.

7. గాంగేయాయ నమస్తుభ్యం కార్తికేయాయ ధీమతే.
ఉమాపుత్రాయ మహతే శరకానన శాయినే.

8. షడక్షరశరీరాయ, షడ్విధార్థ విధాయినే
షడధ్వాతీతరూపాయ, షణ్ముఖాయ నమోనమః.

9. ద్వాదశాయత నేత్రాయ ద్వాదశోద్యత బాహవే
ద్వాదశాయుధ ధారాయ. ద్వాదశాత్మ న్నమోస్తుతే.

10. చతుర్భుజాయ శాంతాయ శక్తికుక్కుట ధారిణే.
వరదాయ విహస్తాయ నమోసురవి దారిణే

11. గజవల్లీకుచాలిప్త కుంకుమాంకిత వక్షసే
నమోగజాననానంద, మహిమానందితాత్మనే

12. బ్రహ్మాది దేవముని కిన్నరగీయమాన
గాధావిశేషశుచి చింతిత కీర్తిధామ్నే.
బృందారకామల కిరీటవిభూషణస్రక్
పూజాభిరామ పదపంకజతే నమోస్తు.

13. ఇతిస్కంధ స్తవందివ్యం వామదేవేన భాషితం
యఃపఠేత్ శృణు యాద్వాపిస యాతిపరమాంగతిం

14. మహాప్రజ్ఞాకరం హ్యేతచ్ఛివభక్తివివర్ధనం
ఆయురారోగ్య ధనకృత్సర్వ కామప్రదంసదా.

ప్రణవప్రతి పాదితుడు, ప్రణవార్ధ విధాయకుడు ప్రణవాక్షర బీజుడు ప్రణవస్వరూపుడునగు నీకునమస్కారము.

వేదాంతార్ధ స్వరూపుడు. వేదాంతార్ధములను తెలియజేయువాడు. వేదాంతార్ధము నెరింగినవాడు నగునీకు నమస్కారము.

సర్వప్రాణాంతరంగముల యందు గుహ్యముగ నుండువాడు, నిహితం గుహాయాంపరమేవ్యోమన్నితిశ్రుతేః. గుహ్యమగు హృద్గుహాయందు దాగినవాడు. వేదరహస్యము నెరింగిన వాడు నగునీకు నమస్కారము.

అణోరణీయాన్మహతోమహీయా నాత్మాస్య జంతోర్నిహితో గుహాయాం అనుశృతి ప్రకారముగ అణువులలో నణువు మహత్తులలో మహత్తు, పరాపరజ్ఞానియు, పరమాత్మస్వరూపుడు నగునీకు సమస్కారము.

స్కంధనాముడు, శత్రుసంహారకుడు, సిందూరారుణ తేజస్కుడు, మందారమాలా ముకుటహారాలా ధరుడు నగు నీకు నమస్కారము.

శివశిష్యుడు, శివపుత్రుడు, కళ్యాణప్రదుడు శివప్రియుడు గౌరీశంకరుల కానంద దాయకుడు నగు నీకు నమస్కారము.

గంగాపుత్రుడు, కార్తికేయుడు. బుద్ధిమంతుడు, నుమాపుత్రుడు, మహాత్ముడు, శరవణశయనుడు నగునీకు నమస్కారము.

షడక్షర శరీరుడు, షడ్విధ ప్రయోజనముల నిచ్చువాడు, షడ్విధోపాసనాతీతుడు, షణ్ముఖుడు, యంత్రతంత్రమంత్ర జపహోమ ధ్యానముల నెడి షడ్విధమార్గముచే నెఱుంగబడు వాడునగు నీకునమస్కారము.

ద్వాదశాయత నేత్రుడు, ద్వాదశోన్నత బాహుడు, ద్వాదశాత్ముడు నగు నీకు నమస్కారము.

చతుర్భుజుడు, శాంతుడు, శక్తికుక్కుటధారణుడు. వరములిచ్చువాడు, వరదాభయహస్తుడు, నసురసంహారకుడు నగు నీకు నమస్కారము.

గజవల్లీ కుచాలిప్తకుంకుమాంకిత వక్షస్కుడు, గజాననున కానంద దాయకుడు, మహిమానందాత్ముడు నగు నీకు నమస్కారము.

బ్రహ్మాది దేవముని కిన్నరాదులచే కీర్తింపబడు గాధలు గలవాడును, బృందారకులచే నలంకరింపబడిన స్వచ్ఛమగు కిరీటముగలవాడును పూలమాలా విభూషణుడు పూజ్యపదపంకజుడు నగు నీకు నమస్కారము.

వాసుదేవుడు స్తుతించిన యీ దివ్యమగు స్కంధస్తవము నెవడు విని పఠించునో వాడు పరమగతినొందును. ఇది మహాప్రజ్ఞాకరమైనదియు, శివభక్తి వివర్ధకమైనదియు, నాయురారోగ్య ధనప్రదమైనదియు సదాసర్వకామపదమైనదియు నై యుండెను. ఇట్లు వామదేవుడు దేవసేనాపతియగు కుమారప్రభువు నిట్లు స్తుతించి ముమ్మారు ప్రదక్షిణముచేసి సాష్టాంగ నమస్కారమాచరింప నితని శిష్యులందరు పార్శ్వభాగమున నిలబడి నతశిరస్కులై యుండిరి. పరమార్థ విజృంభితమగు వామదేవుని స్తోత్రము శివ కుమారుడు

విని ప్రసన్నుడై ఓ వామదేవా! నీస్తుతులకు సంతసించితిని. నీకేమికావల యును? నీవు యోగిశ్రేష్ఠుడవు. పరిపూర్ణుడవు. ఏకోరికలులేని వాడవు. లోకమందు నీవంటి వాడెవ్వడును పరుల ప్రార్థింపనవసరములేదు. నీవంటి సాధుపుంగవులు లోకానుగ్రహ కాంక్షకై ధర్మరక్షణకై మహీతలమున సంచరింతురు. నీవేది వినవలయునో యడుగుము చెప్పెదను. నేనదిలోకాను గ్రహమునకై చెప్పెదనన వామదేవు డవనతశిరస్కుడై, మేఘగంభీర వాక్కు లతో నీవు భగవంతుడవు, పరమేశ్వరుడవు, అపారైశ్వర్య సంపన్నుడవు, సర్వజ్ఞుడవు, సర్వకర్తవు, సర్వశక్తిధరుడవు, నీసన్నిధియందున్న మేము జీవు లము. నీవు పరమాత్మవు, నీ వనుగ్రహించి నేనడిగినది సెలవిమ్ము. ఓ మహా ప్రాజ్ఞా అణుమాత్ర విజ్ఞానముగల నేను నిన్నుగాంచి కృతార్థుడనైతిని. నీ ప్రే రణచేత నే నిన్నడుగుచుంటిని. నాయందు దోషమున్న క్షమింపుము. ప్రణ వము పరబ్రహ్మ స్వరూపము. పశుపతి దేవుడని చెప్పబడెను. బంధితమగు పశువు అంబాయని యార్చుకున్న బంధవిమోచనము చేయునట్లు భగవంతుని వేడకున్నచో బంధవిముక్తుడు కాజాలడు. జీవులపాపములను ఛేదించువాడు గాన పశుపతియని చెప్పబడెను. పశుతుల్యులగు జీవులు నిన్ను ప్రార్థింప కున్నచో సంసారబంధవిముక్తులు గారు. శివుని ప్రణవముతో బిలిచినయెడల జీవుడు పాపవిమోచనుడగును. ఓమితిదం సర్వ మితియని సనాతనశ్రుతి సర్వము ఓంకారమేయని చెప్పబడుచున్నది. ఓమితి బ్రహ్మ, ఓమితిసర్వం ఓంకారమే బ్రహ్మ ఓంకారమే సర్వమనియుశ్రుతిచెప్పుచున్నది. ఓ దేవసేనా పతీ! నీకు నమస్కారము. యతిప్రభుడవు, పరిపూర్ణుడవు నగు నీకు నమస్కా రము. జగత్తునందు శివునికంటె పరమైనదియునులేదు. శివుడు సర్వరూపధ రుడు. సర్వాంతర్యామి. మరియు నతడు ప్రణవార్థమైన వ్యష్టిసమిష్టి స్వరూపు డని శ్రుతులచే వినియుంటిని. ఓమహేశా! నీవంటి గురువు వాకులభింపడు. గాన నీవు మాయందు దయయుంచి మేమడిగినది తెలుపునుజేయగోరుచుంటిను. సర్వపాశములు ఛేదించువాడే గురువు. గాన నాకు సదాచారక్రమముగను యుపదేశపూర్వకముగను నాయందుదయయుంచి యర్థసహితముగను జెప్పుము. నీవే నాగురుడవని వామదేవుడు పలుక స్కంధుడు అష్టత్రింశత్కళామయుడు,

ప్రణవశరీరుడు నగు శివునకు నమస్కరించి, యుమాదేవికి వందనమిడి శ్రుతి గోప్యములగు విషయములన్నియు మునిపరివేష్టితుడగు వామదేవుని కిట్లు చెప్పదొడంగెను.

శివ మహాపురాణము నందలి కైలాస సంహితయందు
పదునొకండవ అధ్యాయము సంపూర్ణము

---

## పన్నెండవ యధ్యాయము

### సన్యాస విధులు

ఓ వామదేవా! బాగు బాగు మంచి ప్రశ్న వేసితివి! నీవు శివభక్తాగ్రేసరుడవు. నీకు తెలియని విషయములు ముల్లోకములయందు లేవు. కాని లోకహితమునకై నేను చెప్పెదను. లోకంబున శాస్త్రంబు లెరుంగని పశువు లనేకులుగలరు. అతివిచిత్రమగు పరమేశ్వరమాయచే జీవులు వంచింపబడుదు పరమార్థ స్వరూపుడగు పరమశివు నెరుంగజాలకుండిరి. త్రివేదజనకుడగు బ్రహ్మ సగుణ నిర్గుణరూపుడై యుండెను. నేనుదక్షిణ బాహువుపై నెత్తి శపథముచేసి చెప్పుచుంటిని. నేను చెప్పిన ప్రతివాక్యము ముమ్మాటికి సత్యము. ప్రణవార్థ స్వరూపుడగు శివుడు ప్రధాన పురుషుడుగ చెప్పబడుచున్నాడు. శ్రుతిస్మృతి శాస్త్రపురాణాగమంబులు, వాక్కులకు మనస్సునకు గోచరింపని వాడని ఘోషించి చెప్పుచున్నవి. ఆనందో బ్రహ్మేతివ్య జానాత్ అనుశ్రుతి ప్రకారము ఆనందమే పరబ్రహ్మస్వరూపమని తెలిసికొన్నవాడు దేనిచేతను భయము నొందడు. ఎవనిచే ప్రథమమున, విష్ణుబ్రహ్మేంద్రాది దేవతలు, సర్వజగత్తులు సకలభూత సమూహంబు లుద్భవించెనో అట్టివాడు యెపుడు నెవనిచేతను జనింపబడలేదు. ప్రకాశముచే ప్రకాశింప బడుచుండిరి గాని వారికి స్వయంప్రకాశములేదు. జగత్తంతయు నితనిచేతనే ప్రకాశింప బడుచుండెను. ఇతడు సర్వైశ్వర్య సంపన్నుడు గాన, సర్వేశ్వరుడని చెప్పబడు చున్నాడు. ఎవడు ముముక్షువులచే ధ్యానింప బడుచుండెనో యట్టివాడంబరమధ్య గతుండై

యుండెను. ఆతడు సర్వవ్యాపియు ప్రకాశాత్ముడై చిన్మయుడై యుండెను. ఇతనికి పరాశక్తియు, భావగమ్యయు, మనోహారిణియు, నిర్గుణయు సగుణయు నిగూఢయు, నిష్కలయునగు శివాంబిక భార్యయై యుండెను. ఈదేవి స్థూల సూక్ష్మ పరములనెడు మూర్తిత్రయముతో నొప్పుచుండెను. ఈమెను యోగులు మునులు ముముక్షువులు క్రమముగా ధ్యానింతురు. నిష్కలుడు, సర్వదేవతల కాదిదేవుడు, సనాతనుడు. జ్ఞానక్రియా స్వభావుడునగు శివుని పరమాత్ముడని చెప్పుచున్నారు. ఈ దేవాదిదేవుడే సదాశివుడు. పంచాయతనమంత్ర స్వరూపుడు కళాప్రపంచ విగ్రహుడు, శుద్ధస్ఫటిక సంకాశుడు, ప్రసన్నుడు, శీతలప్రకాశుడు, పంచవక్త్రుడు, దశభుజుడు, త్రిపంచనయనుడు, ప్రభుడు, ఈశానముకుటుడు, పురాతన పురుషాస్యుడు, అఘోరహృదయుడు, వామదేవగుహ్య ప్రదేశుడు సద్యఃపాదుడు. సగుణితడు పంచబ్రహ్మస్వరూపుడై యుండెను. ఇతడు సకలుడు, నిష్కలుడు, సర్వజ్ఞత్వాది షట్ఛక్తి స్వరూపుడు, షడంగవిగ్రహుడు. అనగా, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము జ్యోతిషము, కల్పము, ననునారింటిచే నొప్పెడి శరీరముగలవాడు, పూర్వమీమాంస యుత్తరమీమాంస శబ్దశాస్త్రము, తర్కశాస్త్రము, సాంఖ్యశాస్త్రము, యోగశాస్త్రము, ధనుశ్శాస్త్రములచే తెలియబడువాడు, శబ్దస్పర్శరూప గంధములచే వ్యాప్తిచేసినవాడు, హృత్పంకజవిరాజితుడు, వామభాగమున పార్వతితో శోభించువాడు, షడంగమంత్ర స్వరూపుడు, వేదార్థ మార్గదర్శకుడు, సమష్టివ్యష్టి భావాత్మకుడు, ప్రణవాత్మకుడునగు పరమేశ్వరుని యుపదేశక్రమము జెప్పెద వినుము. మానుజులు చతుర్వర్ణంబులతో ప్రసిద్ధినొందియుండిరి. వారిలో మూడువర్ణంబులవారు వేదాచారములు గల్గి ప్రవర్తింప వలయును, శూద్రులు వేదబహిష్కృతులై శుశ్రూషలచే తరింపవలయును. వారివారి వర్ణాశ్రమ ధర్మంబులు నెరవేర్చుచుండవలయును. శ్రుతిస్మృతులయందు చెప్పబడినదే ధర్మము. వాటినుల్లంఘించి యేపనియు చేయరాదు. శ్రుతిస్మృతి ప్రకారముగ కర్మలాచరించినవారు కర్మఫలముల నొందెదరు. ఇట్లు వేదమార్గ ప్రదర్శకుడైన పరమేశ్వరుడు చెప్పియుండెను. పూర్వమనేకులు వారివారి వర్ణాశ్రమాచారపరులై పరమేశ్వరు నర్చించి, పుణ్యము సంపాదించుకొని శివసాయుజ్యము నొందిరి. బ్రహ్మచర్యముచే ఋషులను,

యజ్ఞక్రియలచే దేవతలను, గృహస్థుడై సంతానమునొంది పితృదేవతలను, తృప్తినొందింపవలెనని శ్రుతి చెప్పుచున్నది. ఇవ్విధంబున ఋణత్రయ విముక్తుడై తదుపరి వానప్రస్థుడై, శీతోష్ణసుఖాది ద్వంద్వముల సహించుచు జితేంద్రియుడై విజితాహారుడై తపంబుచేయుచు యమనియమాసన ప్రాణాయామప్రత్యాహార ధ్యానధారణ సమాధులనెడి యష్టాంగయోగ మభ్యసించుచు నెంతవరకు మనసు దృఢతరమై యుండునో అంతవరకు అష్టాంగయోగ మభ్యసించుచుండవలెను. ఇవ్విధంబున క్రమముగా పరిశుద్ధాత్ముడై సర్వకర్మలు విసర్జించి సన్యసించి జ్ఞానపూజాపరుడై యుండవలెను. ఇట్లున్నచో శివైక్యమునొంది జీవన్ముక్తి నొందును, రవికా రహితులగు యతులిది సర్వోత్తమంబని యెరుంగవలయును. లోకహితము నకై యిదంతయు నీకు జెప్పితిని. ఇంకను జెప్పెదను సావధానుడవై వినుము. సన్యసింపదలచినవాడు సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞుడు, వేదాంతజ్ఞానపారగుడు నగు గురువునకడకేగి గురుడే శివుడని, శివుడే గురువని భావించి సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి స్తుతించి గురుని ప్రసన్నునిజేసి తన మనోగతము నెరిగించి దేశికుననుజ్ఞనొంది ద్వాదశదినంబులు పయోవ్రతమాచరించి శుక్లపక్ష చతుర్దశినాడు గాని దశమిరోజునగాని విధిక్రమముగ ప్రాతఃస్నాన మాచరించి పరిశుద్ధాత్ముడై, నిత్యకర్మలు దీర్చుకొని, గురువు నాహ్వానించి యథావిధిగ నాందీశ్రాద్ధముగావించి సత్యవసువు లనెడు విశ్వేదేవులు నాహ్వానించి దేవశ్రాద్ధమునకై బ్రహ్మవిష్ణు మహేశ్వరుల నాహ్వానించి ఋషిశ్రాద్ధ మొనరింపవలెను. దేవక్షేత్రమనుజుల నాహ్వానింపవలెను. దేవశ్రాద్ధమందు వసురుద్రాదిత్యుల నాహ్వానింపవలెను. మనుజశ్రాద్ధమందు సనకాది చతుష్టయము నాహ్వానింపవలెను. భూతశ్రాద్ధమందు పంచమహాభూతముల నాహ్వానింపవలెను. త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణ శ్రోత్రము లనెడు పంచేంద్రియంబులును జరాయుజాండజ స్వేదజోద్భిజ్జము లనెడు భూతగ్రామ చతుష్టయము నర్చింపవలెను. దేవతలు ఇంద్రియములకధిష్ఠాతలు గాన వారి నర్చింపవలెను. పితృశ్రాద్ధమందు పితృపితామహ ప్రపితామహుల నర్చింపవలెను. తల్లి, తండ్రి తల్లి, ముత్తాతభార్య వీరిని మాతృశ్రాద్ధమం దాహ్వానింపవలెను. ఆత్మశ్రాద్ధమున, తనకు, తండ్రికి, తాతముత్తాతకు భార్యలతోసహా శ్రాద్ధము చేయవ

లెను. మాతామహ శ్రాద్ధమున తాత, ముత్తాత తండ్రికి తల్లి సంబంధమైన వారలకు పిండప్రదానము చేయవలెను. శ్రాద్ధముచేయువా రిరువురి బ్రాహ్మణుల నాహ్వానించి స్వయముగ పాదప్రక్షాళనము గా[illegible]ంచి సకల సంపత్తులు చేకూరుటకును మావంశంబున సకలాపత్తులు నశించుటకును నపార సంసారసాగరమును దాటించుటకును యీబ్రాహ్మణ పదపద్మములు కడుగుచుంటిని. ఈపాదరేణువులు మమ్ముద్ధరించుగాక యనిపలుకుచు నీవిప్రపాదములు దట్టమైన యాపత్తిమిరములకు భానుకిరణములవంటివి. కోర్కెలొసంగుటకు కామధేను సదృశములైనవి. సకలతీర్థసదృశములుగాన పవిత్రమగు నీబ్రాహ్మణ పాదరజంబు మమ్ము రక్షించుగాక యనిపలుకుచు నమస్కరించి సంతుష్టాంతరంగుడై సాష్టాంగదండప్రణామంబు లాచరించి తూర్పుదిశగా నిలబడి శంభుపదాంబుజములు స్మరించి పవిత్రము ధరించి యజ్ఞోపవీతము సవ్యముగ ధరించి యాసనాధిష్ఠితుడై ముమ్మారు ప్రాణాయామముగావించి మరల సంకల్పము చెప్పుకొని సర్వాంగభూషితమై, వైశ్వదేవాది క్రియలు క్రమముగా పూర్తిచేసికొని పూర్వోక్త ప్రకారముగ పితృదేవతలకు పార్వణ శ్రాద్ధమును చేసి మీయాజ్ఞచే నిచట శ్రాద్ధము చేయుచుంటినని గురువునకు విన్నవించి సంకల్పించి కుశల నుత్తరముఖముగ బాఱవైచి యుదకము స్పృశించి లేచి మరల పవిత్రము ధరించి చేతులు తుడుచుకొని విశ్వేదేవతలకై మీకు వరణ లిచ్చుచుంటినని బ్రాహ్మణులతో బలికి యథాక్రమముగ పూజించి మమ్ములను రక్షింపవలయునని ప్రార్థించి, యుత్తరదిక్కు ప్రారంభించి దశమండలములు నిర్మించి యక్షతలచే పూజించి, యామండలములపై బ్రాహ్మణుల నాసీనులంజేసి వారిపదంబుల నక్షతలచే పూజించి వారిని విశ్వేదేవతలారా యని సంబోధించుచు పాద్యాక్షతల కుశపుష్పాదు లివిగోనని యర్పించి యుత్తరముఖుడై యర్ఘ్యంబులిచ్చి, రెండుమార్లాచమనమిచ్చి, తా నాసనమధిష్ఠించి విప్రులారా కూర్చొనుడని దర్భాసనములిచ్చి తాను కుశలుధరించి నాందీ శ్రాద్ధమునకై, మీరుక్షణము[illegible] మానుడని విశ్వేదేవతల ప్రార్థించి, దర్భలిచ్చి మీరుస్వీకరించితిరా యని పలుక నావిప్రులు స్వీకరించితిమి. మీసంకల్పములు నెరవేరుగాక, మీకుఫలసిద్ధికలుగుగాక యని దీవింపవలయును. తదుపరి నన్ననుగ్రహింపుడని కర్తవారిని ప్రార్థించి పరిశుద్ధిచేసిన కదలీప

త్రంబులు పరచి అన్నాది భోజ్యద్రవ్యము లన్నియు యథావిధిగ నొడ్డించి వాటిప్రక్కన కలశలుబరచి యుదకము ప్రోక్షించి యుదకము పత్రముల చుట్టూత్రిప్పి పరిషేకించి పాత్రను చేతియం దిడికొని పృథివీతేపాత్రం అను మంత్రముచే భూమినిస్పృశించి యక్కడి దేవతలను చతుర్థంతములచే నుచ్చరించి అక్షతలచే నుదకము గ్రహించి దేవతలకై యన్న హోమముచేసి, విధి క్రమముగ నమోంతముగ బలుకుచు శంకరపదపద్మములు స్మరించి జపించి నచో నేదోషములున్నను నశించి శ్రాద్ధము పూర్తియగును. నాచే చేయుబడిన నాందీ శ్రాద్ధమంతయు పూర్తియై సత్ఫలమొసంగుగాకయని పలుకుచు ఫలసిద్ధియగుగాక యని విప్రులచే నాశీర్వదింపబడి యుదకమును వదల సాష్టాంగదండప్రణామంబు లాచరించి మీకు భోజనము సంపూర్ణమైనదా యనిబలికి నమకచమకములు పురుషసూక్తమును, యథావిధిగ పఠించి సదాశివుని చిత్తమందు నిలిపి, పంచబ్రహ్మల జపించి విప్రభోజనానంతరమును నమకము పఠించి, విప్రులకు మార్జనముచేసి, యుక్తరాపోశన మంత్రముచే నుత్తరాపోశనమిచ్చి పాదప్రక్షాళనము చేసి. ఆచమనము చేసి పిండస్థానముకడ కేగి తూర్పుదిశగా కూర్చుండి మౌనముగ ముమ్మారు ప్రాణాయామముచేసి నాందీముఖోక్త శ్రాద్ధాంగం కరిష్యేయని పలుకుచు పిండములుచేసి పిండాదిన్యాసముచేసి, దక్షిణమున ప్రారంభించి ఉత్తరము వరకు తొమ్మిది గీట్లుగీసి, తూర్పు మొదలుకొని యుత్తరము వరకు నాలుగు నాలుగు చొప్పున పన్నెండు దర్భలు పరచి యక్షతలతో దేవతలకు పంచజ్ఞానము లేర్పరచి, మరిమూడు స్థానములయందు మాతృస్థానములకై యక్షోదకములు చల్లి మరొక స్థానమందు పితరుల కక్షోదకములుచల్లి ఈనవస్థానములు చతుర్థ్యంతములతో నర్చించి దేవతాస్థానము లందు పూజచేసి పిండములు సమర్పించి పిటిని గృహ్యాసూక్తప్రకారముగ వేరువేరుగ సమర్పించి పితృస్థానమం దక్షతలు నుదకమునుంచి హృదయాంభోజ మధ్యమున సదాశివుని ధ్యానింపుచు బ్రాహ్మణులకు నమస్కరించి యథాశక్తి దక్షిణలొసంగి క్షమార్పణ వేడి వారిని సాగనంపి పిండములను గోవుకు గాని జలమందు గాని సమర్పింపవలయును. తదుపరి పుణ్యాహ వాచనముచేసి స్వజనులతో భుజింపవలయును. మరునాడుదయమున లేచి, నిత్యకృత్యములు దీర్చుకొని యుపవసించి కక్షో

పక్షపివర్జితముగ క్షౌరము చేయించుకొని కర్మవిధిగ కేశశ్మశ్రునఖములు విస ర్జించి స్నానముచేసి, ధౌతవస్త్రధారియై మౌనముతో రెండు మార్లాచమించి యథావిధిగ భస్మముధరించి పుణ్యాహవాచనము చేసికొని ఆయుదకముచే పవిత్రుడై పరిశుద్ధస్వభావుడై హోమశేషద్రవ్యము లన్నియు నాచార్యున కిచ్చి తన ద్రవ్యము విశేషముగ బ్రాహ్మణులకు పంచిపెట్టి శివరూపుడగు గురువునకు, భక్తులకు ననేక దానంబులిచ్చి వస్త్రాదిదక్షిణలిచ్చి సాష్టాంగ నమస్కారముచేసి మొలత్రాడు, కౌపీనము, వస్త్రము, దండము క్షాళనముచేసి శుభ్రపరచి యుంచుకొని సాగరతీరమునగాని, నదీతీరముగాని, పర్వతములయం దునగాని, శివాలయమందుగాని, యరణ్యమందునగాని, గోశాలయందుగాని, విచారించి యే యుత్తమ ప్రదేశములయందైనను కూర్చుని యాచమించి మానసిక జపముచేసి ఓంనమో బ్రహ్మణేయని ముమ్మారు జపించి, అగ్నిని మీడేపురోహితం అను మంత్రము నుచ్చరించి అగ్నిర్దేవానా మనుమంత్రము జపించి ఇషేత్వోర్జేత్వా యను మంత్రము పఠించి అగ్న ఆయాహి వీతయే శన్నో దేవీ రభీష్టయే అనుమంత్ర ముచ్చరించి మరల మయ, రస, తజ భన లగ యను నక్షరంబు లుచ్చరించి ఐదు సంవత్సరములు వేదమభ్యసించి శిక్షణ పొందెదనని బలికి వృద్ధిరాదైచ్చయను వ్యాకరణ సూత్రము బలుకుచు, పిమ్మట నథాతో బ్రహ్మ జిజ్ఞాసాయని పలుకుచు వేదమును పఠింపుచు బ్రహ్మ, ఇంద్ర, సోమ, సూర్య,ప్రజాపతి, ఆత్మ, అంతరాత్మ, జ్ఞానాత్మ, పరమాత్మ ఓం బ్రహ్మత్మనేనమః యని ఈనామంబులన్నియు నమోంతముగ నుచ్చరిం పుచు సత్తుపిండి పిడికెడు తీసికొని భుజించి ప్రణవముతో రెండు మార్లాచ మించి ఓ నమః అని నాభినిస్పృశించి ఓబ్రహ్మణేనమః అనెడు పైనామము లుచ్చరించి ఓం నమః స్వాహాయని యుచ్చరింపుచు పాలు పెరుగు నేయి వేరు వేరుగా ప్రణవముతో ప్రాశనముచేసి మరలరెండు మార్లాచమనముచేసి ప్రాఙ్ముఖుడై కూర్చుని దృఢచిత్తుడై యథోక్తముగ ప్రాణాయామత్రయము చేయవలెను.

శివ మహాపురాణము నందలి కైలాస సంహితయందు

పన్నెండవ అధ్యాయము సంపూర్ణము

---

# పదుమూడవ యధ్యాయము

## యతివిధులు

మరల సుబ్రహ్మణ్యుడిట్లు చెప్పదొడంగెను. మరల మధ్యాహ్న సమయమున స్నానమాచరించి నియత మానసుడై, గంధపుష్పాక్షతాదిపూజా ద్రవ్యములు సేకరించుకొని, దేవపూజ్యుడగు వినాయకుని నైరుతి దిశయందు పూజించి, గణానాంత్వాయను మంత్రముచే గణపతినాహ్వానించి.

శ్లో॥ రక్తవర్ణంమహాకాయం
సర్వాభరణ భూషితం
పాశాంకు శాక్షా భీష్టంచ
దధానంకర పంకజైః

అని ధ్యానించి, ఆవాహనముచేసి పూజించి పాయసాపూపనారికేళగుడంబులునైవేద్యముచేసి తాంబూలమిచ్చి స్తుతించి, విఘ్నము లేకుండ జేయుమని ప్రార్థించి గృహ్యాసూత్రోక్తవిధిగ నగ్నిని స్థాపించి యజనవిధిగ నాగ్నేయ భాగమున హోమముచేసి, భూస్స్వాహాయని పలుకుచు పూర్ణాహుతి నిచ్చి, మధ్యాహ్నము తరువాత నపరాహ్ణకాలాంతము వరకు, గాయత్రిని జపించి. సాయంసమయమున స్నానమాచరించి, సంధ్య నుపాసించి, సాయంకాలోపాసనహోమముచేసి, మౌనముదాల్చి గురునాజ్ఞనొంది హావిస్సును తయారుచేసి, నమకము చేతగాని, పంచబ్రహ్మ మంత్రములచే గాని, సమిధాజ్యాన్నములతో హోమము చేయవలెను. ఈశానాది పంచబ్రహ్మ మంత్రముల చేయు మాశంకరుల నగ్ని యందు ధ్యానముచేసి గౌరీమిమాయ అను మంత్రముచే హోమముచేసి, గౌరిని స్మరింపుచు అగ్నయే స్విష్టకృతే స్వాహాయనియొక్క మారుహోమముచేసి ఇవ్విధంబున హోమ పూర్తిగావించి. అగ్నికి నుత్తర భాగంబున కూర్చుని మౌనియై జపించి, చేలాజినకు శోత్తరములపై నాసీనుడై మరునాడు బ్రాహ్మీముహూర్తము వరకు గాయత్రిని జపించి దృఢచిత్తుడై స్నానముచేసి, అశక్తుడైనచో భస్మస్నానమాచరించి, ఆయగ్నియందే చెరువునొండి చెరువునుత్తరముగ బెట్టి, ఘృతము

కరిగించి చరువునందు వేసి యభిఘరించి వ్యాహృతులు జెప్పి. రుద్రసూక్తముల తోను. పంచసూక్తములతోను చెరువును హోమముచేసి, చిత్తము శివపదాంబుజము నందుంచి. బాహ్యముగ జపించుచు, ఓం ప్రజాపతయే స్వాహా, ఓం ఇంద్రాయస్వాహా ఓంవిశ్వేభ్యో దేవేభ్యస్వాహా, ఓంబ్రహ్మణేస్వాహాయని పశ్చిమ భాగంబున ఈఐదుగురిని జపించి తదుపరి యాచనముచేసి యగ్నిముఖస్థుడై అగ్నయేస్వాహాయని వెనుకకు మరలి, ప్రాణాయస్వాహా, అపానాయ స్వాహా, వ్యానాయస్వాహా, ఉదానాయస్వాహా, సమానాయస్వాహా, యని పంచాహుతులిచ్చి, సమిత్ ఘృతాన్న హోమములు, యథాశక్తిగజేసి, చెరువు ఘృతముతో తడిపి యగ్నయే శ్విష్టకృతేన్వాహాయని ఐదుమార్లుహోమముచేసి, నమకపారాయణచేసి, పంచబ్రహ్మల జపించి. మహేశాది చతుర్వ్యూహమంత్రముల జపించి, తన వేదాను సారముగ మహేశాది మంత్రములతో హోమముచేయవలెను. ఇట్లు దేవతల నుద్దేశించి, సంపూర్తిగ హోమము గావించి, పాపనాశనముకై విరజాహోమము గావించి. దేహశుద్ధికై, షడ్వింశ త్తత్త్వముల గ్రహించి, యాత్త్వము లన్నియు నాయందే లీనమగుగాక యని తలంచుచు నాత్మశుద్ధ్యర్థమై యారుణకేతుక మంత్రముల జపింపవలెను. ఈమంత్రములు తైత్తిరీ యారణ్యక భాష్యమునందున్నవి. అష్టయోనియష్ట పుత్రా మొదలుకొని సప్తపురుషాంతముల వరకు పఠించి, ఆజ్యముతో గూడిన చరువును, హోమముచేసి మౌనియై, శివపాదాంబుజములను స్మరింపవలయును. పృథివ్యప్తేజో వాయురాకాశములనెడు భూతపంచకము, శబ్దస్పర్శరూప రస గంధములనెడి, శబ్దాది పంచకము, వాక్పాణి పాదపాయూపస్థలనెడు వాగాదిపంచకము, త్వక్చక్షుర్జిహ్వాఘ్రాణ శ్రోత్రములనెడి శ్రోత్రాది పంచకము, శిరఃపార్శ్వోరు పుచ్ఛచతుష్టయము. జంఘాద్వయము, వస, అసృక్, మాంస, మేదోస్థి, మజ్జా, శుక్లములనెడు, సప్తధాతువులు, ప్రాణాపానవ్యానోదాన సమానములనెడి ప్రాణపంచకము అన్నమయ, ప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయములనెడి పంచకోశములు, మనోబుద్ధ్యహంకార చిత్తంబులనెడి అహంకార చతుష్టయము, ఖ్యాతి, సంకల్పము, సత్త్వరజస్త మోగుణంబులు. ప్రకృతి పురుషులు, ఇన్నింటితో కూడిన శరీరధారియే భోక్తయన బడుచున్నాడు. తదుపరి అంతరంగము పంచభూత, తత్త్వాత్మికమై

యున్నది. నియతి (కాలము) రాగము విద్యాకళా యనునివియైనను మాయచే నుత్పన్నమయ్యెను. ప్రకృతియేమాయ. శ్రుతిసమ్మతమైన తత్వములన్నియు. మాయచేతనే జనించెను. కాలస్వభావేనియతిరుని శ్రుతియందు చెప్పబడెను. ఈపంచకములకే కాలపంచక మనిపేరు. మూఢుడగు విద్వాంసుడు పంచతత్వముల గ్రహింపలేడు. ప్రకృతి క్రిందుగను, పురుషుడూర్ధ్వముగను నుండును. కాకాక్షిన్యాయమున పురుషుడుండి. పకృతిని గాంచుచుండును, ఇదియే విద్యా తత్వము, శుద్ధవిద్యయే మహేశ్వరుడు. సదాశివుడు, శక్తి, శివుడు శివపంచ తత్వమునని ప్రజ్ఞానిధులగు బ్రహ్మవాదులు నుడివియుండిరి. పృథివ్యాది శివాంతమువరకు, బ్రహ్మస్వరూపమని చెప్పబడుచున్నది. జీవునకు ఇంద్రియ గుణములన్నియు నశించినచో పరిశుద్ధుడై, పరమేశ్వరుని పొందగల్గును. శంకరుని ఏకాదశ మంత్రములు క్రియా పద భేదములచే. కపాలాయనమః॥ పింగళాయ నమః॥ భీమాయనమః॥ విరూపాక్షాయనమః॥ విలోహితాయనమః॥ శాస్త్రాయ నమః॥ అజపాదాయనమః॥ అహిర్బుధ్న్యాయనమః॥ శంభవేనమః॥ చండాయ నమః భవాయనమః అని ఈఏకాదశ రుద్రనామంబులసట్లు చతుర్ధ్యంతముగ పల్కుచు, నయమేతియని బల్కుచు, అనగా ఈఫలమంతయు శివార్పణయే గాని నాది కాదనియుచ్చరింపుచు, ఫలత్యాగముచేసి, విద్యైస్వాహా॥ కపోతకాయస్వాహా. వ్యాపకాయ పరమాత్మనే. ఇదంన మతియని పలుకుచు. శివ జ్యోతిషేనమః విశ్వభూతాయనమః. హననోత్సుకాయనమః, త్రైలోక్యవ్యాపినేనమః పరమాత్మనేనమః దేవాయనమః అనియు, ఉత్తిష్ఠమంత్రముచే ఓం విశ్వరూపాయ పురుషాయస్వాహా, యని పలుకుచు త్రైలోక్య వ్యాపినే పరమాత్మనే శివాయ ఇదంనమను. ఈఫలమంతయు నీశ్వరునిదే నాదేమియు లేదని, సమర్పించి, తనవేదశాఖోక్త ప్రకారముగ, తంత్రకర్మలాచరించి, నేతితోను ఆవుపాలతోను వండిన చేరువును ప్రాశనచేసి, గురువునకు సువర్ణ దక్షిణనిచ్చి, పురోహితుని సత్కరించి పంపించి, ప్రాతరుపాసన గావించి, సమాంసించంతుమరుతః అనుమంత్రమును జపించి, మానిద్యో, యాతోఅగ్న యితిమంత్రముచే నగ్నిని ప్రజ్వలింపజేసి, అగ్నిపై చేతులుంచి యాయగ్నిని యాత్మారోపణము గావించుకొని ప్రాతస్సంధ్య నుపాసించి సూర్యునకు నమస్కరించి, సూర్యోప, స్థానమంత్రము జెప్పి, నాభివరకు జలములో ప్రవేశించిరి

నిశ్చలాత్ముడై, మంత్రము జపించుచుండవలెను. ఆహితాగ్నియైనచో ప్రాజాపత్యేష్టిని చేసి శ్రౌతాగ్నియందు హోమము చేసి పురోహితునకు దక్షిణలిచ్చి యగ్నిని యాత్మారోపణ చేసికొని గృహాబహిర్గతుడై, సావిత్రీ ప్రథమపాదమును జపించుచు సావిత్రీం ప్రవేశయామియని బలుకుచు. ఓంభూః అని పలికి గాయత్రీ రెండవ పాద ముచ్చరించుచు సావిత్రీం ప్రవేశయామియని పలుకుచు భువరోం అని పలికి గాయత్రీ మూడవపాద ముచ్చరించుచు, గాయత్రీంప్రవేశయామియని పలికి సువరోం అని యుచ్చరించుచు, భూర్భువస్సువరోం అని పలుకుచు, గాయత్రీ మంత్రమును జపించి, నిశ్చలాత్ముడై శంకరార్ధ శరీరిణియు పంచవక్త్రయు, దశభుజయు త్రిపంచ నయనోజ్వలయు, నవరత్న చంద్రలేఖావతంసయు, శుద్ధస్ఫటిక సంకాశయు, దశాయుధధారిణియు, హార కేయూర నూపురాది భూషితయు, దివ్యాంబర ధారిణియు, రత్నభూషణ భూషితయు, ఋషి బ్రహ్మావిష్ణు దేవగంధర్వ మునులచే పూజింపబడునదియు. సదాశివ ధర్మపత్నియు, మనోహరాంగియు, జగదంబయు, ముముక్షువుల జననియు, త్రిగుణయు, నిర్గుణయు, జన్మరహితయు నగు గాయత్రిని బుద్ధిమంతుడు జపింపవలెను. ఈమె యాదిదేవియగు త్రిపదగాయత్రి, ఈమె, బ్రహ్మక్షత్రియ వైశ్యులకు త్రిపదగాయత్రియై యొప్పుచుండెను. ఈమెను త్రివర్ణంబులవారు జపింపనిచో, కొన్ని కల్పములవరకు నరకవాసులగుదురు. ఈమె వ్యాహృతుల యందు జనించి వాటియందే లయమగుచుండును, మరియు నీమె ప్రణవము నందేజనించి, ప్రణవము నందే లయమొందుచుండును. ప్రణవము సర్వవేదములకు నాదిస్వరూపము. ప్రణవమే శివుడు, ఇది మంత్రరాజమై, మంత్రబీజమై యొప్పుచుండెను. శివుడే ప్రణవము, ప్రణవమే శివుడు. ఇది శబ్దార్థములవలె నభిన్నమై యొప్పుచుండెను. కాశియందు మరణించుచున్న వారికి శివుడే ప్రణవముపదేశించి ముక్తినిచ్చుచుండును. ఓమిత్యేకాక్షరంబ్రహ్మయను శ్రుతిప్రకారము ప్రణవమే శివుడు, ఏకాక్షర ప్రణవమును యోగులు తమహృత్పద్మమున ధ్యానించుచుందురు. ముముక్షువులు. ధీరులు, విరక్తులు. అలౌకికులు, మనోవిషయములు వీడి పరము శివుని తెలిసికొని ధ్యానింపుచుందురు. శివవాచకమైన గాయత్రిని ప్రణవముతో జపించి అహంవృక్షస్యరేరివ అనుయను వాకమును పఠించి యఃచ్ఛందసామృషభో రపితియను అనువాకమును పఠించి,

శ్రుతం మే గోపాయ, అను తైత్తిరీయోపనిషదను వాక్యము పఠించి, ఉత్థితో, హంఅని లేచి, ధనైషణ, దారైషణ. పుత్రేషణ లనెడి. యీషణత్రయమును వీడి, యందరు వినునట్లు సృష్టిస్థితిలయ కారణమగు ప్రణవముచ్చరింపుచు, మంద, అధిక, ఉచ్చస్వరంబులతో బలుకుచు, భూలోక. భువర్లోక. సువర్లోక, ములను సన్యసించు చుంటినని బలుకుచు నేను సర్వము త్యజించి సన్యసించి తినని బలుకుచు, ఓంకారముచే వ్యాహృతులు జెప్పికొనుచు, శివుని మనంబున ధ్యానింపుచు నేను మందుడనని పలుకుచు, సావధాన చిత్తుడై, మయాసన్యస్థం, మయా సన్యస్థం, అని ఉచ్చైస్స్వరంబున బలుకుచు, నేనుసమస్త భూతములకు హింసచేయనని అభయమిచ్చు చుంటినని బలుకుచు, తూర్పుదిశగా తిరిగి అంజలిచే జలము గ్రహించి పైకిజిమ్మి, శిఖాయజ్ఞోపవీతములు చేతితో త్రుంచి వేసి, ప్రణవముచ్చరింపుచు, సముద్రం గచ్ఛయని బలుకుచు ఉదకాంజలుడై, వహ్నిజాయాస్వాహాయని బలుకుచు ఓం భూః సముద్రంగచ్ఛ స్వాహాయని బలుకుచు జలము గ్రహించి, భూఃసన్యస్తం మయాభూః అని యుచ్చరింపుచు. శిఖాయజ్ఞోప వీతములు జలమందు పడవేయువలెను. తదుపరి యాచమనము చేసి తీరమునకువచ్చి, భూమిపై వస్త్రవిసర్జనచేసి. తూర్పుముఖముగా గాని, యుత్తర ముఖముగా గాని సప్తపదములిడుచు కొంచెముదవ్వునకేగుచుండ నాగుమాగుమని గురువు పలుకుచు, లోకవ్యవహారార్థమై యీదండ కౌపీనములు ధరింపుమని శిష్యునకీయువలెను. శిష్యుడు గురువొసంగిన కౌపీనకాషాయ వస్త్రములు ధరించి రెండుమార్లు యాచమనముచేసి గురువుకడకేగి, నేను మీశిష్యుడనైతిని నాకేదేనియాజ్ఞా పింపుడని పలికి, ఇంద్రస్యవజ్రోసి తత్ అను శృతిని బలుకుచు సఖాయముమాం. నీసఖుడనని పలుకుచు, దండమును ప్రార్థించి, దండమును గ్రహించి శివపదాంబుజములు స్మరింపుచు గురుపార్శ్వమున నిలబడి, నియతాత్ముడగు గురువునకు దండప్రణామంబు లాచరించి తిరిగిలేచిగురుసమీపమున బద్ధాంజలిపుటుడై యుండవలెను. తదుపరి గోమయము తెచ్చి పెద్ద వుసిరికాయంత ప్రమాణము గల యుండలుచేసి యెండపెట్టి హోమాగ్నినుంచి, విరజా మంత్రములచే హోమముచేసి, అగ్నిరిత్యాది మంత్రములచే భస్మమును స్పృశించి, ఈశానాది మంత్రములచే శీర్షాది పర్యంతము విభూదిధరించి త్ర్యంబకంయజామహే అను మంత్రముచే త్రిపుండ్రములుధరించి

శిష్యుడు సద్భక్తియుక్తుడై. యుగారాశంకరుల హృత్పద్మమున ధ్యానింపుచుండ, గురువు శిష్యుని శిరముపై హస్తమిడి, శిష్యుని దక్షిణ కర్ణంబున ఋష్యాది సహితమగు ప్రణవమును మున్యాస్యానుప దేశింప వలెను. తదుపరి కరుణతో ప్రణవార్థమును కూడ నుపదేశించి క్రమముగ షడ్విధార్థ జ్ఞానము నుపదేశింప వలెను. పిమ్మట శిష్యుడు ద్వాదశ పర్యాయములు. గురువునకు సాష్టాంగదండ ప్రణామంబు లాచరించి. ఓగురూ! నేను తమదాసుడను. మీరు చెప్పిన పను లన్నియు చేయుదును. మీమాటకెదు రాడనని పలికి గురువు వలన వేదాంత సారవాక్యములన్నియు గ్రహించి. సగుణ నిర్గుణో పాసనలు చేయుచు శివ జ్ఞాన పరుడై, గురువు నాశ్రయించి, శ్రవణమననిదిధ్యాసలచే శివజ్ఞాన సం తుష్టుడై యుండు గురువు శిష్యునిచే సూర్యోదయము మొదలుకొని అస్తమయ ముపరకు గల క్రియలన్నియు చేయించి. కైలాసమను మండపము నిర్మించి, శివునందు నిల్పి, శిష్యునిచే శివుని పూజింప చేయవలెను. నిత్యము నిట్లుచేయు ట కసమర్థుడైనచో స్ఫటిక శివలింగమును సింహాసనమునందుంచి పూజింప వలెను. ఇట్లు పూజింపుచు ప్రాణము పోయినను శిరచ్ఛేదమైనను యెన్నియు వాంతరములు వచ్చినను శివపూజ చేయనిదే నేనన్నము భుజింపనని గురుసన్ని ధిని ముమ్మారు శపథము చేయవలెను. శిష్యుడు దృఢ చిత్తుడై శివభక్తిని వృద్ధి నొందించు కొనవలెను. పంచావరణ పూజలు గావించుచు నిత్యము శివపూజ చేయుచుండవలెను.

శివపురాణము నందలి కైలాస సంహితయందు
పదుమూడవ అధ్యాయము సంపూర్ణము.

---

## పదునాలుగవ యధ్యాయము

### శివరూప ప్రణవ వర్ణనము

వామదేవుడు కుమారస్వామినిగాంచి ఓషణ్ముఖా! అశేషవిజ్ఞానామృత సాగరా! విశ్వామ రేశ్వరనుతా. ప్రణతార్తిభంజనా! ఓభగవన్ ఇష్టద మైన షడ్విధార్థజ్ఞాన మన నెట్టిది? దాని స్వరూపమేమి? వీని నెవరు ప్రతిపా

దింగిరి? వీనిఫలమెట్టిది? ఇదంతయు మాకెరిగింపుము. శివమాయామోహితులమై, భ్రాంతులమై యుంటిమి. మాయజ్ఞానము తొలగింపుము. నేనిప్పుడు శివపద ద్వంద్వ జ్ఞానామృత రసాయనము చేసి విగతమోహుడ నగుదును. గాన నాయందు కృపామృతార్ద్రదృష్టిని ప్రసరింపజేసి నాయం దనుగ్రహింపుము. నీపాదాబ్జములంటి వేడుచుంటినని జ్ఞానశక్తిధరుడగు నాసుబ్రహ్మణ్యుడు సంసార సంత్రాసకరమగు వాక్కులతో ఓమునిశార్దూలా! నీవడిగినదంతయు చెప్పెద వినుము. సమిష్టి, వ్యష్టి యని యీశ్వరుడు రెండు విధముల నొప్పుచుండెను. ప్రణవార్థపరిజ్ఞానమును నీకు విస్తరించి చెప్పెదను షడ్విధార్థపరిజ్ఞానమును కూడ చెప్పెదను. మొదటిది మంత్రరూపము. రెండవది యంత్రము. మూడవది దేవతార్థము. నాల్గవది ప్రపంచార్థము. ఐదవది గురురూపము ఆరవది శిష్యాత్మరూపము. ఈ రూపును షడ్విధార్థము లని చెప్పబడుచున్నవి. ఇప్పుడు మంత్రస్వరూపమును చెప్పెద వినుము. ఇది తెలిసినంతనే మహాజ్ఞాని యగును. అకార ఉకార మకారంబులు కలిసి ఓంకారమనియు నాటికి నాదబిందువులు కలిసినచో పంచార్ణవమనియు సకలంబయు కలిసినచో సమష్టిరూపమనియు వేదములందు చెప్పబడెను. మరియు నాదమే సర్వసమిష్టియనియు, అకార ఉకార, మకార బిందువులు నాల్గుకలసి వ్యష్టియనియు ప్రణవమే శివుడనియు చెప్పుచుండెను. రెండవది యగు యంత్రమన శివలింగమని ప్రాజ్ఞులు చెప్పియుండిరి. యంత్రమనగా పీఠమున కూర్ధ్వభాగమున స్వరము లిఖించి దానిపై ఉకారము నిర్మించి దానిపై మకారము నిర్మించి, దానిపై బిందువు లిఖించి వానిపై నాదము లిఖింపవలెను. ఇదియే యంత్రము, దీనిని పూజించుటచే సర్వార్థకామము లోసంగును. ఈయంత్రము చుట్టూ ఓంకారములు లిఖింపవలెను. ఈఓంకారోచ్చారణమే నాదమనబడును. అతి నిగూఢమగు మూడవదగు దేవతార్థమననెట్టిదో చెప్పెద వినుము. ఇది నాకు శంకరుడు చెప్పియుండెను. ఇది నీయందలి స్నేహముచే చెప్పుచుంటిని. సద్యోజాతంప్రపద్యామి, మొదలుకొని శివోమే అస్తు సదాశివో అను పంచమంత్రములు పంచబ్రహ్మలని శ్రుతులయందు చెప్పబడెను. ఈపంచసూక్ష్మరూపంబులు శివస్వరూపమని చెప్పబడుచున్నది. ఈపంచబ్రహ్మలకు శివమూర్తికి భేదములేదు. వీరు శబ్దార్థములవలె నుం

మును. ఇతడు ఈశాన ముకుటోపేతుడై తత్పురుషాది చతుర్ముఖ పరివేష్టితుడై యుండును. ఇవ్విధంబున శివుడు సద్యోజాత వామదేవ, అఘోర, తత్పురుషులనెడి చతుర్ముఖంబులతోను యూర్ధ్వమున యీశానముఖంబు గలిగి పంచముఖుడని చెప్పబడు చున్నాడు. ఇదంతయు వ్యష్టిరూపమని చెప్పబడు చున్నది. పంచార్థాకారమైన యనుగ్రహ చక్రమన నిదియే ఈపరబ్రహ్మ స్వరూపము. సూక్ష్మము, నిర్వికారము. అనామయమునై యుండెను. ఇది దృశ్యాదృశ్యము లగు సాకారనిరాకారములతో గూడియుండెను. ఈరూపములు భక్తులకు భుక్తిముక్తుల నిచ్చుచుండును. ఈసద్యోజాతాది పంచమూర్తులు పంచభూతాత్మక సృష్టిచేయుచుండును. ఈపంచముఖములు సకల కళ్యాణముల నొసంగుచుండును. అనుగ్రహమైనదియు, శాంత్యతీత కళామయమగునదియు నగు చక్రమునందు ముక్తిప్రదుడగు సదాశివు డధిష్ఠించి యుండును. భావితాత్ములగు యతులిట్టి పదమును గోరుచుందురు. సదాశివోపాసకులు ప్రశాంతాసక్త చిత్తులునగు మహాత్ములిట్టి పదమును పొందుదురు. ఇట్టి జ్ఞానవంతులకు, పరమేశ్వరుడు యిహమందు భోగములు పరమందు ముక్తి నొసంగును. ఈపరమేశ్వర సేవకులు మహాప్రళయమందు కూడ నశింపక, శివుని సేవించుచు సంసారాబ్ధిని దాటి శివసన్నిధి నుందురు. ఇదంతయు శివుని సమిష్టి యైశ్వర్యమని చెప్పబడుచుండెను. ఈవిషయమంతయు నధర్వోప నిషత్తునందు చెప్పబడెను మరియు నితడు చమకమందు చెప్పబడిన వస్తుజాలము నన్ని నొసగు డైశ్వర్యముల నిచ్చును. ఈదృశ్య ప్రపంచమంతయు బ్రహ్మపంచక మనబడును. ఇతడు సూక్ష్ముడై సర్వాకారుడై యుండెను. నితడు స్థూలరూపముచే ప్రపంచమంతయు స్థాపించెను. పురుష, శ్రోత్ర, వాక్, శబ్ద, ఆకాశములను నవి పంచబ్రహ్మ స్వరూపములై ఈశానవ్యాప్తములై యుండెను. మరియు, ప్రకృతి, వాక్కు, పాణి, స్పర్శ, వాయువులను నీపంచకము నీతత్పురుష రూపవ్యాప్తమై యుండెను.

అహంకారము, చక్షువులు, పాదములు, రూపము, పావకుడు, అను నీయైదు నఘోర వ్యాప్తమై యుండెను.

బుద్ధి నాలుక పాయు రసజలము లను నీఐదు వామదేవ వ్యాప్తమై యుండెను.

మనస్సు, నాసిక, ఉపస్థ, గంధము భూమి యను నీయైదు సద్యోజాత వ్యాప్తమైయుండెను. ఇవ్విధంబున జగత్తంతయు పంచబ్రహ్మ స్వరూపమై పంచవింశతి తత్త్వాత్మకమై యుండెను. శివవాచకమైన ప్రణవమును యంత్ర విధానముగ జెప్పితిని. ఇదియే శివతత్త్వము

శివ మహాపురాణము నందలి కైలాస సంహితయందు

పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునైదవ యధ్యాయము

### ఉపాసనామూర్తి వర్ణనము

ఈశ్వరుడు పార్వతితో మరల నిట్లు చెప్పదొడంగెను. ఓ దేవీ నీకిటుపై నుత్తమంబైన సృష్టి పద్ధతి చెప్పెద వినుము. సదాశివుడు మహేశాది చతుష్టయముతో గూడి సమిష్టిరూపుడై యాకాశాది ప్రభుడై, సర్వప్రభువై యుండెను. ఇతడు వామభాగమున మాయాశక్తితో గూడుకొని సకలుడై, క్రియాధికుడై యుండెను. ఈశుడు, విశ్వేశ్వరుడు, మహేశుడు, సర్వేశు డను నీశాది చతుష్టయముతో గూడి యుండెను. దీనిని వ్యష్టిరూప మందురు. ఇతడు రుద్రాదినామంబు లదృశ్యరూపుడు గను, దేహములందు జీవాది రూపంబుల నదృశ్యుడుగను, ద్వివిధంబులుగ నుండును. జీవుడు దేహమందుండి తన కర్మానుసారంబుగ సుఖదుఃఖము లనుభవించుచుండును. పరమాత్ముడు సాక్షిభూతుడై గాంచుచుండును. ఈశానాది చతుష్టయము పరబ్రహ్మాత్మకమై, నిర్వికల్ప నిరామయమై యుండెను. తిరోభావాత్మకమైన చక్రము శాంతికళామయమై. మహేశాధిష్ఠితమై యత్యుత్తమంబై యుండెను. మహేశపద సేవకులకీ పదవి లభించును. ఇట్టి వారు సాలోక్యాది ముక్తుల నొందవచ్చును. మహేశ్వరుని సహస్రాంశముచే రుద్రుడు జనించెను. అఘోరు వదనము నుండి, పంచభూతములు జనించినవి. ఈప్రభువు వామభాగమున గౌరీశక్తియుతుడై సంహారము చేయుచుండును. శివుడు, హరుడు, మృడుడు, భవుడు, వృష్టిరూప చతుష్టయ మందురు. దీని నే వ్యష్టిచక్ర మందురు. జీవుడు నిత్యుడ

నియు, సుషుప్తుడనియు, నైమిత్తికుడనియు చెప్పబడుచుండెను. ఈ జీవుడు పర బ్రహ్మయందు లయమగుటయే సంహారమన బడును. శాంతచిత్తులు. పరిపక్వ కర్ములు నగు జీవుల హృదయ పద్మములందు రుద్రుడు విశ్రమించుచుండును. అమిత తేజస్కుడగు రుద్రుడు సృష్టిస్థితి సంహారంబులు చేయుచుండును. మరియు నితడు సృష్టిస్థితిలయతిరోభావానుగ్రహము లనెడు పంచకృత్య ములు చేయుచుండును. భవాది సర్వదేవతలు, పరబ్రహ్మ స్వరూపులై లోకానుగ్రహ కారకులై యుండిరి. దీనినే విద్యారూప కళామయమైన సహారకచక్రమందురు. నిరామయమై నీచక్రము నందు రుద్రు డధిష్టించి యుండును. రుద్రసేవకు లీపదము నొందెదరు. ఇతడు భక్తులకు చతుర్విధ ముక్తుల నొసంగును. ఈ రుద్రుని సహస్రాంశముచే విష్ణువు జనిం చెను. చక్రాత్మకు డగు వామదేవుడు జలతత్వమునకు నాయకుడై యుండెను. ఈ విష్ణువు వామభాగమున రమాశక్తితో గూడుకొని సర్వరక్షాకరుడై, చతుర్భుజుడై, యరవిందాక్షుడై, శ్యామగాత్రుడై, శంఖ చక్రగదాపద్మ ధరుడై, వాసుదేవ ప్రద్యుమ్నా నిరుద్ధ సంకర్షణ నామవ్యూ హంబుతో నొప్పుచు, వ్యష్టిరూపుడై విష్ణుభక్తులకు ముక్తి నిచ్చుచుండును. ఇదియే యుత్తమంబైన స్థితిచక్రము. ఇతడు సృష్టిస్థితులను గావించుచు జీవుల శుభాశుభ కర్మల ననుసరించి ఫలంబు లొసంగుచుండును. జీవరక్షణార్థమై విష్ణువు నిర్మింపబడెను. ఈవిష్ణువు సృష్టి స్థితులయందు పంచకృత్యము లొన రింపుచుండును. ప్రద్యుమ్నాది దేవతలు నిర్వికల్ప నిరాంతరమైన యానంద కరమగు ముక్తి నిచ్చుచుందురు. దీనినే ప్రతిష్టింప బడిన స్థితి చక్రమందురు. ఇది జనార్దనాధిష్ఠితమై పరమపదము నిచ్చుచుండును. విష్ణు పదసేవకుల కిట్టి పదము లభించును. సాలోక్యాది పదము లిచ్చెడి విష్ణు చక్రమిదియే.

ఈవిష్ణువుయొక్క సహస్రాంశముచే పితామహుడుజన్మించెను. ఇతడు సద్యోజాతముఖాత్ముడై, పృథివీతత్వనాయకుడై యుండెను. ఇతడు వామభా గమునవాగ్దేవి సహితుడై, జగత్సృష్టికర్తయై, చతుర్ముఖుడై, రక్తవర్ణుడై రజోగుణస్వరూపుడై, హిరణ్యగర్భాదివృష్టిరూప చతుస్స్వరూపుడై, హిరణ్య గర్భుడై, విరాట్పురుషుడై, కాలస్వరూపుడై, యుండెను.

ఇతనినే సృష్టిచక్రమందురు, ఇతడు సనకాదిఋషులచే సేవింపబడుచు

సర్వకామార్థదాయకుడై, తనపరివారంబులకు సుఖంబులిచ్చుచు జీవులకు కర్మానుసారంబుగ, పుత్రమిత్రకళత్రాది ధనంబులనిచ్చుచు కర్మఫలంబు లనుభవింపజేయుచు, సంయోగ వియోగంబులు గల్గింపజేయుచు జీవులను సృష్టిచక్రమున భ్రమింపజేయుచు, పంచవిధంబులగు జగత్సృష్టిని జేయుచుం డును, ఈసృష్టిచక్రము నివృత్తిరూపముగ చెప్పబడెను. దీనికి పితామహు డధిష్ఠాతయైయుండెను, సకలకర్మలు బ్రహ్మార్పణమని చేసినచో బ్రహ్మ పదము నొందగలరు. ఇతడుకూడ సాలోక్యాదిముక్తులనిచ్చును, మహేశ, రుద్ర, విష్ణు, బ్రహ్మచక్రములు నాల్గును, ప్రణవమునుబోధించును, ఇదియేశృతి విశ్రుతమైన జగచ్చక్రమందురు. దీనినే పంచారచక్రమనికూడనందురు. ఈజ గచ్చక్రముశంభు, శక్తిచే విజృంభించెను. పంచభూతములే పంచారచక్రముగ నుండెను. అలాతచక్రముత్రిప్పినచో, (మండెడికొరకంచు) నేకచక్రాకారముగ నొప్పినట్లు, నద్దానినిత్రిప్పినచో, చక్రముదానియందే లయమగునట్లు, నీజగ చ్చక్రము పరమేశ్వరుని యందేలయమగుచుండును. ఈవిధంబుననే పృథివీసృ ష్టిచక్రము పెద్దదిగాగోచరింపుచు, అదిపరమేశ్వరునియందు లీనమగుచుండును. ఇదంతయుపరమేశ్వరుని హిరణ్మయవికారమగు, తేజోరూపమగుశక్తితోగూడు కొనిప్రకాశించుచుండెను. ఈజ్యోతీరూపము సలిలావృతమైయుండెను, ఈసలి లమువహ్నిచేనావృతమైయుండెను. ఈవహ్నివాయువుచే నావరింపబడియుం డెను, ఈవాయువు ఆకాశముచే నావరింపబడియుండెను, ఆకాశముభూతా దితామసాహంకారముచేనావృతమైయుండెను, తామసాహంకారము, మహ త్తత్వముచే నావరింపబడియుండెను, ఇవివిశ్వమునకు గుప్తములైన సప్తావర ణాలనిచెప్పుదురు. నివినొకదానికన్ననొకటి పదేసిరెట్లు పరిమితిగలదైయుం డెను. దీనినేబ్రహ్మాండమందురు, ఇదంతయు విస్తరించి చక్రముగ పోల్చిచెప్పి తిని, ఈయావరణాలన్నియు జలమధ్య మందున్నవని శృతులుజెప్పుచున్నవి. శివుడుశక్తియుతుడై యనుగ్రహతిరోభావసంహారస్థితులచే సకలసృష్టుల జేయు చుండెను. బహునాక్తులుపలుకనేల సర్వబ్రహ్మాండములకు శివుడే యాధారము.

శివ మహాపురాణమునందలి కైలాససంహితమునందు
పదునైదవ అధ్యాయము సంపూర్ణము

# పదహారవ యధ్యాయము

## శివతత్వము

ఇట్లు శివకుమారుడు చెప్పియుండ వామదేవుడు మరల నిట్లు ప్రశ్నించెను, ఓస్వామీ! జ్ఞానశక్తిధరా! పరమానంద విగ్రహా. నీముఖాబ్జమునుండి వెలువడిన ప్రణవార్థామృతమును పానముచేసి దృఢప్రజ్ఞుడనై సందేహనివృత్తుడనైతిని, నిన్ను మరొక ప్రశ్న వేసెదను చెప్పుము. సదాశివుడు మొదలుకొని కీటకము వరకు స్త్రీపురుష రూపములే గాని వేరుగోచరింపుట లేదు. ఈ రూపంబులకు సనాతనమైన కారణముండవలయును గదా. ఈ జగస్సృష్టికి కారణము స్త్రీయా లేక పురుషుడా? లేక నపుంసకుడా? లేక మిశ్రమమా? లేక నిదేవియూగాక వేరైన దేదైన యున్నదా? దీనినిర్ణయము నాకు తెలియదు. విద్వాంసులు శాస్త్రవిమోహితులై యనేక విధంబులుగ జెప్పుచుండిరి. ఈసృష్టిక్రమము త్రిమూర్తులు గాని, దేవతలు గాని, శృతులు గాని నెరుంగవు. సిద్ధులసలేయెరుంగరు. ఎవరమట్టుకువారు యిదంతయు మావల్లనే జరుగుచున్నది మేమేచేయు చున్నామని తలంచుటయే గాని దీనియదార్థము తెలిసినవాడొక్కడును లేడు. సర్వాత్ముడు సంశుద్ధుడు గాని ఇట్టి సృష్టిచేయలేడు. మనోబుధ్యహంకారములతో గూడిన దేహేంద్రియంబులే యాత్మయని భావింపుచుండిరి. ఇంతికన్న నాశ్చర్యమేమున్నది. దేహమే పరమాత్మయని కొందరు. దేహముకన్న పరమాత్మ భిన్నుడని మరికొందరు వివాదములు చేయుచుందురు. గాన, నాయజ్ఞానజనిత సంశయవిమ్రుమంబును ఛేదించి శివాద్వైతమహాకల్పవృక్షమును నాహృదయ భూమియందు నెలకొల్ప వలెను. నీవు నాచిత్తమునందు జ్ఞానబీజము నాటినచో నీకృపచే నేను దృఢజ్ఞాని నౌదునన. వామదేవ వాక్కులువిని షణ్ముఖుడు దరహాసితవదనుడై ఓవామదేవా! నేనొకానొకప్పుడు నాతల్లియగు పార్వతి స్తన్యము తృప్తిగా పానముచేయుచుండ పరమేశ్వరుడు నాతల్లితో జెప్పిన వాక్కులు నాకు స్మరణకు వచ్చుచున్నవి. ఆమాటలన్నియు యదార్థములని నేను నిశ్చయించుకొంటిని. అతిరహస్యమైన యావాక్కులన్నియు. నీకెరింగించెదను శ్రద్ధతో వినుము. ఆస్తిక్య బుద్ధితో

సత్కర్మ లాచరింపుచు. శాస్త్రార్థము లన్నియు గ్రహించి వివేకవంతుడై, జ్ఞానవంతుడై గురువంతటివాడు కావలయును. శాస్త్రములు జ్ఞాన మొసగు చుండును. నీవనేక శిష్యాశిష్యులకు శాస్త్రజ్ఞాన ముపదేశించినను, నీవంటి శిష్యుడొక్కడును లేడు. పూర్వము కొందరధములు కపిల శాస్త్రము పఠించి భ్రమనొంది పరమేశ్వరుడు లేడని వాదింపుచు. శివనింద చేసి యుండిరి.

పూర్వము వీరు అర్హులు మహర్షులచే మీరునాస్తికులగుదురు గాక యని శపింపబడుటచే వారిట్టి మోహము నొందిరి. సారస్యవాదములు చేయు చుండిరి గాన వారివాదంబు లెవరును వినరాదు. పాటింపరాదు. వారికి ప్రత్యక్ష ప్రమాణమే గాని యనుమాన ప్రమాణము వారు పాటింపరు. ధూమదర్శనముచే నగ్నికలదని భావించినట్లు శృతిస్మృతులచే మనము పరమేశ్వరుడున్నాడని భావింతుము. వారు భావింపరు. వారుప్రత్యక్షమైన ప్రపంచమునే నమ్ముదురు జ్ఞానముచే పరమాత్ముడగు పరమేశ్వరుని తెలిసికొనవలెను. ప్రపంచమంతయు ప్రత్యక్షముగ స్త్రీపురుష రూపముగ గోచరింపుచున్నది. త్వక్, మాంసరుధిరమేదో మజ్జాస్థులనెడి షట్కోశములతో గూడిన పిండము, పై మూడుభాగములు తల్లిచేతను తరువాత మూడుభాగములు తండ్రిచేతను, వృద్ధినొందుచున్నదని శృతులు చెప్పుచున్నవి గాన, సర్వశరీరములు, స్త్రీపురుష భావముచే నొప్పుచుండెను. పరమాత్మయందు కూడనిట్టి స్త్రీపురుష భావము కలదు.

సచ్చిదానంద రూపత్వంవదతి బ్రహ్మణః శృతిః ఈ పరమాత్ముని సచ్చిదానంద స్వరూపు డని శృతి చెప్పుచున్నది. అతడు సన్నివర్తకు డని ఆమ్నాయము చెప్పుచున్నది. భిచ్ఛబ్దముచే నితడు జగన్నివర్తకు డని చెప్ప బడుచున్నాడు. ఇతడు త్రిలింగ శబ్దాత్మకుడు. బ్రహ్మశబ్దము. నిత్య నపుంసక లింగమైనప్పటికి పురుషుని తెలుపుడు చేసినట్లుగ పరమాత్ముడు స్త్రీ నపుంసక రూపములతో నొప్పుచుండెను. ప్రకాశచిత్తు లనెడి శివ పార్వతులు జగత్కారణులై యుండిరి. శివుడే పార్వతి, పార్వతియే శివుడు. యెట్లన, తైల వత్తి అగ్నిచే మాలిన్య రహితమై యగ్నివలె ప్రకాశించి నట్లు శక్తిచే శివుడు ప్రకాశించుచుండెను. వత్తికి దీపమునకు బేధము లేనట్లు శివ పార్వతు

లకు భేదములేదు. చిచ్ఛక్తి జీవు నాశ్రయించి యుండుటచే దుర్బలుడై యుండెను. దీనిని వృత్తికై శక్తిని సంపాదింపవలెను. బలవంతుడే శక్తివంతు డని లోకము వేదము కూడ చెప్పుచున్నది. శివ శక్తులు రెండును పరమాత్మ యందు గోచరింపుచున్నవి. శివ శక్తి సంయోగముచే నానందము జనించు చున్నది. ఇట్టి శివ శక్తుల నారాధించి యనామయ లోకము పొందుచుండిరి. ఇతనినే సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ యని యుపనిషత్తులు చెప్పియుండెను. బృంహితత్వాత్ బ్రహ్మ అను శృతి ప్రకారముగ సర్వవ్యాపిగాన బ్రహ్మ యని చెప్పబడుచున్నాడు. ఈ విశ్వమంతయు, పంచబ్రహ్మ మయమై యుండెను. ప్రతిలోమ ప్రకారముగ ప్రణవార్థమగు హంసను గూర్చి చెప్పెద వినుము. సోహంలో సకారమును, హకారమును విసర్జించినచో ఓంకారము మిగిలినట్లుగ స్థూలమగు పరమాత్మను, సూక్ష్మముగ వర్ణించెదను. ఈమహా మంత్రము తత్వవేత్తలగు మహాత్ములు చెప్పియుండిరి. ప్రజ్ఞానం బ్రహ్మ అను శృతి ప్రకారముగ పరమేశ్వరుడు ప్రజ్ఞావంతు డనియు, శివ శక్త్యాత్మకుడనియు చెప్పబడుచుండెను. ప్రజ్ఞాన మనగా పరబ్రహ్మ యని సందియములేదు. శివ సూత్రమందు నితడు చైతన్యాత్మకు డని చెప్పబడుచుండెను. సర్వజ్ఞాన క్రియాత్మక మగు చైతన్యమే విశ్వమని చెప్పబడు చున్నది. స్వతంత్రమగు స్వభావమే ఆత్మయని చెప్పబడు చుండెను. ఇట్టి శివ సూత్రము లన్నిటికిని నేను వ్యాఖ్యాన ములు రచించియుంటిని. జ్ఞానము, బంధము అని రెండుసూత్రములు చెప్పి యుంటిని. ఆత్మజ్ఞానమే జ్ఞానముగాని క్రియా జ్ఞానముకాదు. క్రియాత్మకమగు కించిత్ జ్ఞానమే జీవలక్షణ మనబడును. ఈరెండుశక్తులు పరాశక్తివల్లనే జనించినవి. ఈపరాశక్తియే సృష్టికారకురాలని, శ్వేతాశ్వత రోపనిషత్తునందు చెప్ప బడెను, పరమేశ్వరుడు ఇంద్రియాధి ష్ఠానరూపుడై లోనప్రవేశించి, మనంబునకు జ్ఞానక్రియా శక్తులొసంగుచుండును, జ్ఞానక్రియేచ్ఛారూపంబులే శంభుని నేత్రంబులని చెప్పబడుచుండెను. ఇతడు నింద్రియ మధ్యమునందుండి యింద్రియజ్ఞాన గోచరుడై యుండును. ఇతడు దేహమందు ప్రవేశించి జీవరూపుడై సర్వము గ్రహించుచుండును. ఇదియే ఆత్మరూపమని, నిశ్చయింపవలెను. ప్రణవైకత్వప్రదర్శనమును ప్రపంచమునకై చెప్పెదను, ఓమితీదంసర్వం అనుశ్రుతి ప్రకారముగ ఈసర్వము నోంకారమే'' జగత్సృష్టియంతయు నోంకారముచేతనే

జరుగుచున్నది. ఈశ్రుతి తాత్పర్యము చెప్పెదవినుము. నీయందలి ప్రేమచే వేదార్థమంతయు విస్తరించి చెప్పెదను, శివశక్తి సంయోగమే పరమాత్మ యనబడును, పరాశక్తివలన చిచ్ఛక్తియు, చిచ్ఛక్తినుండి యానందశక్తియు,' నానందశక్తినుండి యిచ్ఛాశక్తియు, ఇచ్ఛాశక్తినుండి జ్ఞానశక్తియు, జ్ఞానశక్తినుండి క్రియాశక్తియు జనించెను, ఈపంచశక్తులచేతను నివృత్త్యాది కళల న్నియు జనించినవి; చిదానందము నుండి నాదబిందువులు, ఇచ్ఛాశక్తిచే మకారము, జ్ఞానశక్తిచే ఉకారము, క్రియాశక్తిచే అకారము, జనించెను. ఇదియే ప్రణవోత్పత్తి, నిటుపై ప్రపంచబ్రహ్మోత్పత్తి చెప్పెదవినుము. శివుని వలన ఈశానుడు, ఈశానునినుండి తత్పురుషుడు, తత్పురుషునినుండి యఘోరుడు, అఘోరునినుండి వామదేవుడు, వామదేవునినుండి సద్యోజాతుడు అను వారలు జనించిరి. వీరినుండి ముప్పదియొనిమిది మాతృకలు జనించినవి. ఈశానునినుండి శాంత్యాతీతకళయు, తత్పురుషునినుండి శాంతికళయు, అఘోరు నినుండి విద్యాకళయు, వామదేవునినుండి ప్రతిష్ఠాకళయు, సద్యోజాతునినుండి నివృత్తి కళయు జనించినవి. ఈశానచిచ్ఛక్తుల ముఖమునుండి మిధునపంచకము జనించెను. ఈఐదును నుగ్రహాదిపంచకృత్యములకు హేతువులై యుండెను. అనుగ్రహము, తిరోభావము, సంహారము, స్థితి, సృష్టి అనునవి పంచకృత్యములనబడును. వాచ్యవాచక సంబంధమే మిధునత్వమని చెప్పబడుచున్నది. కళావర్గ వస్తుస్వరూపమైన పంచకమే భూతపంచకమని చెప్పబడుచుండెను. దీనినే వియదాది పంచకమందు చిత్స్వరూపమగు నాదిమిధునమునుండియే యీపంచభూతములు జనించెను. ఆకాశమునకు శబ్దగుణ మొక్కటియే గలదు. వాయువునకు శబ్దస్పర్శ గుణములు రెండుగలవు. వహ్నికి శబ్దస్పర్శ రూపంబులనెడు త్రిగుణంబులుగలవు. సలిలమునకు, శబ్దస్పర్శ రూపరసముల నెడు నాల్గు గుణంబులుగలవు. పృధివికి శబ్దస్పర్శరూప రసగంధంబులనెడు నైదు గుణంబులుగలవు, పంచభూతములు పంచగుణములతో ప్రపంచ మంతయు వ్యాపించియుండెను. సమస్త బ్రహ్మాండము వ్యష్టిరూపముగ వ్యాపించి యుండెను, పృధివీతత్వము మొదలుకొని శివతత్వమువరకు జీవులతో గూడ నీతత్వ సముదాయమంతయు పరమేశ్వరుని యందు లీనమగు చుండును. మరల శక్తిద్వార సృష్టి ప్రారంభమగుచుండును, ఈసృష్ట్యంతయు ప్రళయ

పర్యంతమువరకు సుఖముగానుండును, పరమేశ్వరుడు తనయిచ్ఛా మాత్రముచే నీసృష్టి నంతయు నడిపించుచుండును. సర్వక్రియలు శివతత్త్వమునుండియే జరుగుచున్నవి. సర్వకృత్యములకు. నిచ్ఛాశక్తియే ప్రధానకారణము. జ్ఞాన క్రియా శక్తులలో జ్ఞానశక్తి యధికముగనున్నచో, దానినే సదా శివతత్త్వమందురు, జ్ఞాన క్రియాశక్తులు సమముగానున్నచో, శుద్ధవిద్యయని చెప్పబడును, మాయచే శాస్త్రములయందు శివతత్త్వము మరుగుపడి యందలి గూఢార్థములు గ్రహింపనేరక మోహితులై యథార్థమును గ్రహింపనేరక పెడదారిని పడుచుందురు. యుక్తాయుక్త విచక్షణలేక సకలము మాయచే గ్రహించుచుందురు. జీవులు సంసార మాయామోహితుల గుచుందురు. ఇట్టివీరు నానాకర్మ విమూఢులై, శివజ్ఞాన విహీనులై యుందురు శివునికన్న భిన్నమైన దేదియు లేదు. ఇది అజ్ఞానులెరుంగరు. రోగాది శాస్త్రజ్ఞాలిరునివంటివారు గాక, శిష్యుడు సద్గురువునిపొంది జ్ఞానవంతుడైనచో శివునంతటి వాడగును. సర్వకర్తృత్వ స్వరూపిణియు. సర్వోద్భవస్వరూపిణియు, పూర్ణస్వరూపిణియు, నిత్యత్వవ్యాపకత్వస్వరూపిణియు నగు శివశక్తి పంచశక్తులతో గూడికొని, నిబిడీకృతమైనను యానుకూల్యముగ విస్తరించి ప్రకాశించుచుండును, జీవకళయనగా విద్యయనియు, నియతియనియు చెప్పబడుచు, పంచతత్త్వ కళారూపమై, అనగా దేహరూపమై ప్రకాశించుచుండెను. జీవుడు కించిజ్జ్ఞుడు, గాన, కించిత్తత్త్వములనే గ్రహించుచుండును. ఈ తత్త్వములను సాధించుటయే విద్యయనబడును. విషయములయందు ప్రీతికల్గుటయే రాగమనబడును. భావాభావంబులను, విషమావిషయంబులను, పుట్టించి నశింపజేయువాడే భావాతీతుడనియు పరమేశ్వరుడనియు చెప్పబడుచున్నాడు. ఇది నాకర్తవ్యము. నేను చేయుక్రియల లోనాకు సంబంధములేదు. నేను నిమిత్తమాత్రుడను. పరమేశ్వరుడు నియంతయని తలచినవాడు, పశుధర్మమును వీడి పరమాత్మ ధర్మమునొందగలడు. లేనిచో పతితుడగును. జీవునకు పంచావరణాలే పంచకంచుకములని చెప్పబడుచున్నవి. ఇదియే యంతరంగ సాధనమైనది.

శివ మహాపురాణమునందలి కైలాససంహితయందలి

పదునారవ యధ్యాయము సంపూర్ణము

---

# పదునేడవ యధ్యాయము

## శివాద్వైత జ్ఞానబోధ

మరల వామదేవుడిట్లు ప్రశ్నించెను. ఓమన్మునీ! ప్రకృతిక్రిందుగాను, పురుషుడుపైన నుండెనని నీవు పూర్వము జెప్పియుంటివి. ఇపుడు వ్యత్యస్తముగ జెప్పుచుంటివి కారణమేమి? మాయాసంకుచితమైన ప్రకృతిక్రిందుగా నుండు నని చెప్పితివి దీనినెరింగించినా సంశయముతీర్చుమన సుబ్రహ్మణ్యుడిట్లు చెప్ప దొడంగెను. అద్వైతులగు శైవవాదులు, ద్వైతమునొకానొకప్పుడు గూడ సహింపరు వీటిలోనద్వైతము స్థిర మైనది.

ద్వైతముయ స్థిరమైనదియున్నై యుండెను. శివుడే సర్వకర్త, సర్వజ్ఞుడు సర్వేశ్వరుడు, అగుణుడు, త్రిమూర్తిజనకుడు, సచ్చిదానంద విగ్రహుడు, పర బ్రహ్మ, శంకరుడనబడుచుండెను. ఇతడుతనమాయచే సంకుచితరూపుడై, కళాదిపంచకముతోగూడి భోక్తృత్వమునకై నియమింపబడెను. ఇతడుప్రకృతితోగూడుకొని ప్రకృతిగుణములన్నియు ననుభవించుచుండును. ఇతడు త్రిగుణంబులతో గూడినట్లుండునుగాని యితడు త్రిగుణాతీతుడు సత్వమునగా ప్రకృతితత్వము. ఇవన్నియు సత్యమునుండియే జనించెను. సాత్వికాది విభేదములచే ప్రకృతిగుణములన్నియు జనించెను. గుణములనుండి బుద్ధిజనించెను. ఈబుద్ధి వస్తునిరూపణము చేయగలదు. దీనినుండియే అహంకారము ఇంద్రియములు జనించెను. సంకల్పవికల్పములతో గూడినదే దేహమని చెప్పబడుచున్నది. దీనినుండి బుద్ధీంద్రియంబులు త్వక్ శ్రోత్రంబులు చక్షుర్జిహ్వాఘ్రాణంబులు, శబ్దస్పర్శరూపరసగంధంబులు గోచరింపుచున్నవి. బుద్ధీంద్రియశ్రోత్రములు క్రమముగా జెప్పెదవినుము. ఈమనోవికారముచే నహంకారము తన్మాత్రలు క్రమముగా జనించినవి. ఇదంతయు తత్వవేత్తలగు మునులచే చెప్పబడెను. కర్మేంద్రియములు స్వకార్యములతోగూడి యుండును. వాక్పాణిపాదపాయూపస్థలు కర్మేంద్రియములనబడును. వచనాదానగమన విసర్గానందములు, వీటి గుణములై యుండెను. తదుపరి భూతములు పంచతన్మాత్రలు జనించెను. శబ్ద స్పర్శరూపరసగంధంబులు వీటిగుణములై యుండెను. పృథివ్యప్తేజోవాయ్వా

కాశంబులు పంచభూతములనబడును. (వీటినే పంచభూతములందురు) ఇవి అవకాశమిచ్చి వాహకత్వమునిచ్చి. పచనముచేయుచు వేగముగాధారణాశక్తి కల్గి వ్యవహరింపుచుండునన వామదేవుడువిని ఓకుమారా! నీవిదివరలో భూత సృష్టిచెప్పియుంటివి ఇపుడు కళలు భేదములుగ చెప్పుచుంటివి కారణమేమి? నాకుసందేహముగనున్నది. అకారము ఆత్మతత్వము, విద్య ఉకారము మకారము శివతత్వము బిందునాదములురెండు, సర్వతిత్వార్థములు ఇదియే ఓంకార మనబడును. దీనియందు బ్రహ్మవిష్ణు రుద్ర, మహేశ్వర శివులుండిరి. వీరందరు సాక్షాచ్ఛివస్వరూపులేయని శృతులందు చెప్పబడియున్నవని నీవిదివరలో చెప్పియుంటివి. ఇప్పుడుతన్మాత్రలనుండియే సృష్టియంతయు జరుగుచున్నదని చెప్పుచుంటివి. నాకు సందేహముగనున్నది. నాయందు దయయుంచి నాసంశయము తీర్చుమన వామదేవవాక్కులువిని కుమారుడిట్లు చెప్పదొడంగెను.

తస్మాద్వాయని ప్రారంభించి భూతసృష్టినంతయు జెప్పెదవినుము. పంచ భూతములు, కళలుజనించినతరి నీశ్వరుడగు భూతపతినుండి స్థూలప్రపంచ మంతయు జనించెను. శివతత్వము ప్రారంభించి పృధివీతత్వమువరకు క్రమముగా తన్మాత్రలుద్భవించెను. అదంతయు క్రమముగా జెప్పెదను తన్మాత్రలే కళలందురు. ఈభూతకళల సంయోగముచే భూతసృష్టి జరుగుచున్నది. దీనిలోసందేహములేదు స్థూలసూక్ష్మాత్మకమైన ప్రపంచము చంద్రసూర్యులు గ్రహనక్షత్రంబులు బ్రహ్మవిష్ణు మహేశాదిభూత జాలంబులు ఇంద్రాదిదిక్పాలకులు దేవతలు, నాగులు, పితరులు, యసురులు, రాక్షసులు, మనుజులు, ఇతరస్థావరజంగమములు, పశుపక్షికీటక పన్నగాదులు తరుగుల్మల తౌషధులు విస్తృతములగు సప్తపర్వతములు గంగాదినదులు సప్తసాగరంబులు, సకలవస్తుజాలంబులతో గూడి నియోంకారమునంది మిడియుండెను. ఇదంతయు సద్బుద్ధిచే నంతరంగమున నెరుంగవలయునుగాని బహిశ్చక్షువులకు గోచరముగాదు. ఈప్రపంచమంతయు శివశక్త్యాత్మకమగు స్త్రీపురుషరూపముతో నొప్పుచున్నది. శివజ్ఞాన విశారదులగు మాబోంట్లచేతనే యిది తెలియబడుచున్నది. సర్వంబ్రహ్మ. సర్వోవై రుద్రఅను శృతిప్రకారము అంతయు పరబ్రహ్మయగు శివుడని తెలిసికొనవలెను. సదాశివుడే ప్రపంచాత్ముడని శృతిచే చెప్పబడుచున్నది. అష్టాత్రింశత్కళాతీతుడగు పరమేశ్వరుని తెలిసికొన్నవాడే యద్వై

తుడనబడును నేనేసదాశివుడనని భావించువాడే, గురువు శివుడున్నై యుండెను. ఇట్టిగురువునిపొంది తానేశివుడు కావలయును సర్వవ్యాపియు, దేవతయు యంత్రము, మంత్రము నాచార్యరూపముగనెంచి సేవించినచో సర్వబంధ విముక్తుడగును. జీవుడు శివపదాసక్తుడైనచో గురువు యాత్మస్వరూపుడై యుండును. ఈ ప్రణవమేవ్యష్టి సమిష్టిరూపమై విరాజిల్లుచుండెను. రాగాది దోషరహితమైనదియు, వేదసారమైనదియునగు యీతత్త్వము శివుడేయుప దేశించియుండెను. శివప్రియుడవగు నీకు అద్వైతజ్ఞానమంతయు నీయందలి ప్రేమచే నేను చెప్పియుంటిని. మదగర్వితులు నాయీవాక్కులు నన్యథాతలపోయు చుందురు. దేవతలుగాని, మనుజులుగాని, గంధర్వులుగాని, సిద్ధులుగాని, దురాత్ములై యన్యథాభావించినచో నాశక్త్యాయుధముచే వారిశిరములు భేదించుట తథ్యము. నాశక్తి కాలాగ్నిసదృశమైనది. సంశయములేదు. నీవుశివాద్వైతము నెరింగినవాడవు. నీవు శివజ్ఞానోపదేశకుడవు. శివాచారప్రవర్తకుడవు ఎవని దేహము భస్మముచే లిప్తమగుచుండునో, వానిసర్వాఘములు నశించి శుచి యగును. పిశాచత్వమునొందినను భూతిస్పర్శచే సద్గతినొందగలడు. ఇట్టివాడు శివయోగియని పిలువబడుచు త్రిలోకవిభవంబుల నొందగలడు. ఈశ్వర కటాక్షసంపర్కముచే పశువుపశుపతియగును. ఇదంతయు నీకుతెలియని విష యముగాదు. లోకప్రబోధమునకై నిజకీర్తిని నేనుజెప్పితిని సాధువుల లోకోపకారమునకై భువిని సంచరింతురు. ఈరహస్యము నీకుజెప్పితిని నీవు శ్రద్ధాభక్తులతో ప్రణవమునాదరించి పరమేశ్వర స్వరూపముని భావింపుము. నీవు శివాచారతత్పరుడవై విభూతిరుద్రాక్షలుధరించి యద్వైతభావము నొందుము. నీవులోకరక్షణార్థమై ప్రపంచమంతయు సంచరించుచు నీతత్త్వము భక్తులకుపదేశింపుచు నక్షయసుఖమునొందుమన, వామదేవు డద్భుతమైన దియు, శ్రుతిసమ్మతమైనదియు వేదాంతబృంహితమైనదియు, సమృద్ధికరమైన దియు నగుకుమారవాక్కువిని వినమ్రుడై యనేకవిధంబుల ప్రణమిల్లి సాష్టాంగ దండనమస్కారముచేసి పాదారవిందమకరందమును మధుపంబువలె గ్రోలి సంతుష్టుడయ్యెను.

శివ మహాపురాణమందలి కైలాససంహితయందలి

పదిహేడవ అధ్యాయము సంపూర్ణము

---

## పద్దెనిమిదవ యధ్యాయము

### సన్యాసి శిష్యున కుపదేశించు విధము.

శౌనకుడు సూతునిట్లు ప్రశ్నించెను. పరమామృత మైనదియు. వేదాంతసార మైనదియు. నతిరహస్య మైనదియు నగు శివతత్త్వము విని వామదేవుడేమనెను? శివజ్ఞాన రతుడు యోగిపుంగవుడునగు వామదేవుడు ధన్యుడు. పరమ పావనమైన దివ్యగాథలన్నియు నతని వలన లోకమునకు వెల్లడియైనవన, ప్రేమగర్భితములగు మునివాక్కులు సూతుడు విని ప్రసన్నాత్ముడై శివాసక్త మనస్కుడై. ఓశౌనకా! మీరందరు ధన్యులు. మహాదేవ భక్తులు. లోకోపకారకులు వామదేవ షణ్ముఖ సంవాదము చెప్పెదవినుడు. ద్వైతనాశకుడు నద్వైత జనకుడునగు మహేశతనయుని వాక్కులువిని వామదేవుడు సంతుష్టుడై నమస్కరించి ననేక విధంబుల స్తుతించి యతివినయముతో తత్త్వమునిట్లు ప్రశ్నింప దొడగెను.

ఓ భగవానుడా! ఓసర్వజ్ఞుడా! షణ్ముఖా! అమృతజలధీ! భావితాత్ములగు యతీశ్వరులు. నన్నెట్లు గురువుగా స్వీకరించిరి. జీవులకు భోగమోదసిద్ధులెట్లు కల్గును? పారంపర్యముగ విషయము లెరింగిన వారు కాని యుపదేశార్హులుకారు కదా? గాన క్షౌరకర్మ. స్నానవిధులు నాకు నిశ్శంశయముగ తెలుపగోరుచుంటినన, కార్తికేయుడు శివాశివులను మనంబున స్మరించి యిట్లు చెప్పదొడంగెను. నేను యోగపట్టమును గూర్చి చెప్పెదను. ఇదివిన్నవాడు గురువగుట కర్హుడగును. నతిగోప్య మైనదియు, ముక్తిప్రద మైనదియు నగు నిదంతయు నియందలి ప్రేమచే చెప్పెదను. వైశాఖమాస మందుగాని. శ్రావణమాస మందుగాని. యాశ్వయుజ, కార్తీకమార్గశీర్ష, మాఘమాసముల యందుగాని, శుక్లపక్షములయందు పంచమినాడు గాని పౌర్ణమియందు గాని ప్రాతఃకృత్యములు నెరవేర్చుకొని గుర్వాజ్ఞచే నియతిమానసుడై, స్నానమాచరింపవలెను. దీని విధానమంతయు చెప్పెద వినుము. పర్యంకశౌచము చేసికొని, కట్టుకున్న వస్త్రము తడిపి, యథావిధిగ స్నానమాచరించి, వస్త్రోపవీతములు ధరించి, పాదప్రక్షాళనము గావించి, రెండుమార్లాచమించి సద్యోజాతాది

మంత్రములచే విభూతి శరీరమంతయు పూసికొని పూర్వముఖముగ తిరిగి గురువు చేతులు బట్టుకొని చేలాజినకుశోత్తరీయంబులపై కూర్చుండ బెట్టియుండ, గురువు శంఖము జలపూరితము చేసి సిద్ధముగ నుంచవలెను. శిష్యుడు గుర్వాజ్ఞచే మండపమందు కూర్చుండవలెను. ఆచార్యుని శంఖము నస్త్రమంత్రములచే నభిమంత్రించి, తీసికొని వచ్చి గంధ పుష్పాదులచే పూజించి, యస్త్రకవచముచే శోధనచేసి, పూర్వరీతిగ శంఖమును పూరించి, షడంగ ప్రకారముగ పూజించి, ప్రణవముచే సప్తపర్యాయము లభిమంత్రించి, గంధపుష్ప ధూపదీపాదులచే నర్చించి, రక్షాముద్రను ప్రదర్శించి, కవచముచే శంఖమును రక్షించి, ధేనుశంఖముద్రలు జూపించి గురువుని గాంచి యెదురుగా నున్న శంఖమును దక్షిణదిక్కు నందుంచి, మండలమునందు శంఖమును పూజించి, తంతుపరివేష్టితమైన ఘటమునట నుంచి, ధూపము వేసి, వస్త్రము చుట్టబెట్టి యుదకమును పూరించి, పంచవృక్షత్వక్కులు, పంచపత్రములు, పంచమృత్తికలు, సుగంధ ద్రవ్యములు ఘటమునందు వేసి, మామిడియాకులు, దూర్వాగ్రములు సుమంబులు ఘటము నందు వేసి నారికేళఫలము దానిపై నుంచి, ఇంకను నాఘటమున నేకవస్తువులచే నలంకరించి, ఘటమునందు పంచరత్నములుంచి, రత్నములులేనిచో బంగారు శకలములు వేసి, [నీలము, మాణిక్యము, గోమేధికము, సువర్ణము, పగడము వీటిని పంచరత్నము లందురు.] ఇవిఘటము నందుంచి, నృమ్లుస్కయని యుచ్చరింపుచు, గ్లౌంయని పలుకుచు, దేశకుని సమృగ్విధానముగ సానుకూలముగ ప్రీతితో నర్చించి, యాధారశక్తి మొదలుకొని యజనోక్తవిధిచే పంచావరణ మార్గముగ దేవునావాహనించి పూజింపవలెను. తదుపరి పాయసము నైవేద్యమిడి, తాంబూలాదులిచ్చి నామాష్టకముచే నర్చించి, అభిమంత్రించి, ప్రణవ మష్టోత్తర శతము జపించి, క్రమముగ పంచబ్రహ్మలను పూజించి సద్యోజాతాది మంత్రములచే, కలశపూజ గావించి యస్త్రమంత్ర కవచములచే నాచ్ఛాదన గావించి, వస్త్రధూప దీపంబులిచ్చి, ధేను, యోని, ముద్రలుజూపించి శిష్యుని శిరముపై కుశలచే నాచ్ఛాదన గావించి ఈశానాది మంత్రములచే, మండపము కల్పించి శిష్యుని యనుకూల యాసనంబుపై కూర్చుండబెట్టి, స్వస్తివాచక పూర్వకముగ గురువు యాఘటమును చేతితో తీసి సవ్యముగ త్రిప్పి శిష్యున కభిషేకించి ప్రణవము సప్తపర్యాయము చల్ల

రింపుచు పంచబ్రహ్మ మంత్రములచే ఐదుమార్లు పరివేష్టింప జేసి శంఖముతో నభిషేకింప వలెను. తదుపరి నూతనవస్త్రమును దీపమును మట్టుగా త్రిప్పి, కౌపీనమును, మొలత్రాడును, నిచ్చి ధరింపజేసి, పాదప్రక్షాళన గావించి రెండుమార్లాచమనము చేసి, గురుశిష్యులు భస్మముధరింప వలెను. గురువు మండపమధ్యమున శిష్యుని హస్తము తనహస్తముచే బట్టుకొని, శిష్యునకు యథావిధిగ భస్మమలది సుఖాసనాసీనుంజేసి తత్వజ్ఞానాభిలాషియగు శిష్యుని, పూర్వాభిముఖమున కూర్చుండబెట్టి నీవుపరిశుద్ధుడవైతివని పలుకుచు, నీవుపరిపూర్ణుడవు, నీవొకముహూర్త కాలము, గాఢముగ సమాధి యందుండుమని గురువు శిష్యునితో బలికి, శిష్యుని నేత్రంబులు సానుకూలంబుగ దెరిపించి, కృతాంజలియై నతమస్తకుడై యున్న శిష్యుని గాంచి, తనస్వహస్తముచే తడిపిన విభూదిని శిష్యుని మస్తకమందు పూసి, శిష్యుని దక్షిణ కర్ణంబున స్ఫుటముగ హంససోహమని యుపదేశింప వలెను. తదుపరి మంత్రార్థములు యథాశక్తిగ నుపదేశింప, శిష్యుడు యథాశక్తిగ గ్రహింప వలెను నేనే శివుడనని తలంప వలెను, తనయాత్మయే శివుడని యూహింపవలెను, గురువు అణోరణీయాన్ మహతో మహీయాన్ అను శ్రుతికి నర్థము వివరించి చెప్పవలెను. మిగిలిన బ్రహ్మవాక్యములకు, వివరముగ నర్థము చెప్పవలెను, నేను నాటి యర్థములన్నియు విశదముగ జెప్పితిని, సావధానుడవై వినుము.

శివ పురాణమునందలి కైలాస సంహితయందు
పద్దెనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## పంతొమ్మిదవ యధ్యాయము

### మహా వాక్యములు

1. ప్రజ్ఞానంబ్రహ్మ॥ప్రజ్ఞానమే బ్రహ్మస్వరూపము॥
2. అహంబ్రహ్మాస్మి॥ నేనుబ్రహ్మను॥
3. తత్త్వమసి॥ఆపరబ్రహ్మవు నీవే॥

4. అయమాత్మాబ్రహ్మ॥ ఈఆత్మయే బ్రహ్మ॥

5. ఈశావాశ్యమిదంసర్వం॥ ఈదృశ్యప్రపంచమంతయు నీశ్వరునిచే వ్యాప్త
మైయుండెను॥

6. ప్రాణోస్మి॥ నేనుప్రాణస్వరూపుడను॥

7. ప్రజ్ఞానాత్మా॥ నేనుప్రజ్ఞానాత్ముడను॥

8. యదేవేహతదముత్ర॥ యదముత్రతదన్విహ॥ అంతరంగమందున్న పరమాత్ముడు; బాహ్యమందున్న పరమాత్ముడు ఒక్కడే. వాడేవీడు. వీడేవాడు.

9. అన్యదేవతద్విదితాదథో అవిదితాదధి ఇతి విదితావిదులకంటె పరుడగు వాడే పరబ్రహ్మ వాడే యాత్మస్వరూపుడై యంతర్యామియై యుండెను.

10. ఏషసఆత్మా అంతర్యామ్యమృతః వీడుఆత్మ, అంతర్యామియైన అమృతస్వరూపుడు.

11. సయశ్చాయం పురుషేయశ్చాసావాదిత్యేసఏకః॥ పురుషునియందు నాదిత్యునియందునున్న యాత్మ ఒక్కడే.

12. అహమస్మిపరంబ్రహ్మ పరమఃరంపరాత్పరం॥ నేనుపరబ్రహ్మను, పరాత్పరుడను.

13. సర్వభూతస్థితంబ్రహ్మతదేవాహంనశంశయః॥ సర్వభూతస్థితుడగు బ్రహ్మను నేను. సందేహములేదు.

14. వేదశాస్త్రగురుత్వాతు స్వయమానందలక్షణం నేనువేదశాస్త్రములెరిగిన గురువును. నేనుస్వయముగ నానందస్వరూపుడను.

15. తత్వస్యప్రాణోహమస్మిపృధివ్యాః ప్రాణోహమస్మి నేనుతత్వమునకు ప్రాణుడను. పృధివికిని ప్రాణుడను.

16. అపాంచప్రాణోహమస్మి తేజసశ్చప్రాణోహమస్మి॥ నేను జలమునకు ప్రాణమును తేజమునకు ప్రాణమును.

17. వాయోశ్చప్రాణోహమస్మి ఆకాశస్యప్రాణోహమస్మి॥ నేనువాయ్వాకాశంబులకు ప్రాణుడను.

18. త్రిగుణస్య ప్రాణోహమస్మి॥ నేనుత్రిగుణంబులకు ప్రాణుడను.

19. సర్వోహంసర్వాత్మకోహం సంసారీ యద్భూతంయచ్చభవంయద్వర్తమానం సర్వాత్మకత్వాదద్వితీయోహం సర్వమునేనే. నేనుసర్వాత్ముడను, సంసారిని (సర్వవ్యాపిని) భూతభవిష్యద్వర్తమానములునేను. నేనుసర్వాత్ముడనుగాన నద్వితీయుడను.

20. సర్వంఖల్విదంబ్రహ్మ॥ ఈదృశ్యమానమంతయు బ్రహ్మస్వరూపము.

21. సర్వోహం॥ సర్వమునేను.

22. విముక్తోహం॥ నేనువిముక్తుడను

23. యోసౌసోహం॥ యెవడుబ్రహ్మస్వరూపమో వాడేనేను.

34. హంసస్సోహమస్మి॥ నేను పరమహంసస్వరూపుడను.

ఈవిధముగసర్వత్ర ధ్యానముచేయవలెను. ఇంకను ఈమహావాక్యముల క్రమము విపులముగజెప్పెద వినుము. ప్రజ్ఞానం బ్రహ్మయను దానికి నిదివరలో జెప్పితిని. అహమన శక్త్యాత్మకమగు పరమేశ్వరుడు, అకారము సర్వవర్ణములలో మొదటిది. ఇదిప్రకాశమానమై శివస్వరూపమై యుండెను. హాకారము వ్యోమరూపమై సర్వశక్త్యాత్మకస్వరూపమై యొప్పుచుండెను. ఈశివశక్తులసంయోగముచే నానందము జనించుచున్నది. ఈ యానందము నిత్యమై వెలుగుచుండును. బ్రహ్మయన శివశక్తుల సర్వాత్మకత్వమును ప్రకటింపజేయుచున్నది. నేనిదివరలో చెప్పినప్రకారముగ సోహమస్మియని భావనచేసికొనవలెను. తత్వమసిలో, తత్ అనగా శక్త్యాత్మకమని యెరుంగవలయును. ఇదియెరుంగనిచో సోహంబ్రహ్మయనుచోట విపరీతార్థము గోచరించును. అహంఅను అస్మచ్ఛబ్దము పులింగముగను తచ్ఛబ్దము నపుంసకలింగముగను చెప్పబడెను. ఇవిఅన్యోన్యముగ విరుద్ధార్థములు గల్గినను వాటికి భేదములేదు. స్త్రీ పురుషులు జగత్కారణులు, గాన శివశక్తులకు భేదము

లేనట్లుగ వారికిభేదములేదు. తత్త్వమసియను మహావాక్యమునకు భావమిదియే. ఇదియే శివశక్త్యాత్మకము. అయమాత్మేతివాక్యమునందు రెండు పుంలింగశబ్దములు గలవు. ఈజగత్తు ఈశ్వరునిచే రక్షింపబడుచున్నది గాన, ఈశావాస్యమిదంజగతని చెప్పబడుచున్నది. ప్రజ్ఞానాత్మయదేవేహాలదము (తేతిచింతయేత్ అను శ్రుతిప్రకారము యిహమందున్న పరమేశ్వరుడు పరమందుకూడ గలడని భావింపవలయును. సవేవేతి, వాడేవీడని విద్వాంసులు, సిద్ధులు నిర్ణయించిరి. పైనున్నవాడే యిచటకూడ నుండెనని శ్రుతిచెప్పుచున్నది. విద్వత్స్వమ్మతమగు నీవిషయమిదివరలో చెప్పియుంటిని. సోయమాత్మా పరంబ్రహ్మ. ఈవిషయమై మాండూకోపనిషత్తునందు చెప్పబడెను. సోయమాత్మా అనునది ఓంకారము ఇది పరమేశ్వరునిచే రక్షింపబడుచున్నది గాన ఈశావాస్యమని చెప్పబడుచున్నది.

ప్రాణోస్మి ప్రజ్ఞాత్మాయనగా ప్రజ్ఞాస్వరూపమగు ప్రణవమునేను. పుత్రుడగు ప్రతర్ధనున కింద్రుడిదంతయు నుపదేశించెను. ప్రాణశబ్దము బ్రహ్మవాచ్యమని కాషీతకోపనిషత్తునందు చెప్పబడెను. కార్యకరణోపాధులతో గూడిన చైతన్యము ప్రపంచముగ భాసించుచున్నది. జీవునకు ప్రపంచముతో సంబంధమున్నదని జీవులుతలచెదరు. జ్ఞానులట్లు తలపరు. కార్యోపాధి జీవుడు. కారణోపాధి యీశ్వరుడునై యుండెనని సిద్ధాంతులు నుడివియుండిరి. జీవుడు ప్రపంచ ధర్మములనుభవించుచుండును. జ్ఞానియగు వాడు ప్రపంచధర్మములకు వేరుగానుండి సదాపరమాత్మనే చింతింపుచు తానే బ్రహ్మనని తలచుచుండును. ఈయాత్మను నామరూప కార్య కారణాభిమానినిగ గుర్తెరుంగవలెను. ఈ పరమాత్మ కార్యకారణములకు బాహ్యుడని భాష్యకారులు చెప్పియుండిరి. అతడు విపరీతముగ కనబడుచుండును, ఇదిగుర్తెరుంగుట కష్టము, భావమును బట్టి ఫలముకలుగుచుండును. దీనియథార్థమంతయు జెప్పెదవినుము, దేనిచేతను తెలియబడని వాడని యిదివరలోనే జెప్పియుంటిని, జ్ఞానముచే ప్రకాశితమగు పదార్థమంతయు విదితమగును, ప్రవృత్తియే విదితమనబడును. దీనికంటె యన్యమైనది, యవిదితము. ఇదియే మోక్షమనబడును. అదియెట్లు సిద్ధించునాయని యోచింపవలెను. సర్వాంతర్యామియగునమృతస్వరూపుడే శివుడు. ఈపురుషుడే యాదిత్యమండల మధ్యవర్తియై ప్రకాశింపుచుండును. శేషుడనెడి పర్యంకమున

పవ్వళించిన మహాపురుషుడితడే. కారణోపాధి, కార్యోపాధియనెడు ఉపాధి ద్వయముగల ఈపురుషునే సేవింపవలయును. ఇతడే శంభుడనియు, హిర ణ్మయ స్వరూపుడనియు, శ్రుతులు చెప్పుచున్నవి. ఇతడు హిరణ్యబా హువని శ్రుతులు జెప్పుచుగాన ఇతని సర్వాంగములు స్వర్ణమయములని యూహింపవలెను. ఇతడు హిరణ్మయ స్వరూపుడుగాన సర్వమునకు సమర్థుడగు ప్రభువై యుండెను. సకలలోహములలో స్వర్ణము శ్రేష్ఠమైనట్లు సకలదేవతలలో నీ పరబ్రహ్మ శ్రేష్ఠుడు. ఇతడు సర్వాంతర్యామియని చాం దోగ్యమునందు చెప్పబడెను. ఇతడు హిరణ్యశ్మశ్రుడనియు, హిరణ్మయ కేశుడనియు నాపాదతల మస్తకమువరకు హిరణ్మయ స్వరూపుడని శ్రుతి చెప్పుచున్నది. అహమస్మిపరంబ్రహ్మ, పరాతరపరాత్పరం, అనుశ్రుతికి అర్థ ముచెప్పెదవినుము. పరమన పరము, పరాత్పరమునగు బ్రహ్మ అహమస్మి యని యెరుంగవలెను. అహ మనగాశక్తితో గూడిన శివుడు, సవివాస్మి యనుదానికి, సర్వోత్కృష్టుడు, సర్వాత్ముడునగు పరబ్రహ్మయని చెప్పబ డుచున్నది. పరుడు, అపరుడు, పరాత్పరుడు, అనువారలు, రుద్రబ్రహ్మ విష్ణువులని చెప్పబడుచుండిరి. వీరుముగ్గురు బ్రహ్మస్వరూపులు, నేనా బ్రహ్మను ఇది శ్రుతివాక్యము, అని తెలిసికొనవలెను. పరమోదేవం అను శబ్దముచే సర్వోత్కృష్టుడగు నీ నుండియె దేవతలందరు జనించిరని చెప్ప బడుచుండిరి. శిష్యునకు గురువువలన వేదశాస్త్రములు హృదయంగమ ములైనట్లుగ పూర్ణానందమయుడగు శంభుడు, భక్తుల హృదయంబున నావిర్భవించు చుండును. సర్వభూతస్థితశ్శంభుస్స ఏవాహం న సంశయః, అను శ్రుతిప్రకారము సర్వభూతములయందుండెడి శివుడను నేను అని శ్రుత్యర్థము. సర్వజీవులయందున్న జీవుడనునేను నేనే శివుడను, అని శృతిగలదు. శివ తత్వత్రయమును జెప్పెదను. సత్వరజస్తమోగుణంబులు నేను. పృధివ్యాది పంచభూతముల స్వరూపమును నేను. సకలాత్మతత్వంబులు నేను. నేను విద్యా తత్వమగు శివాత్మకుడనని గ్రహింపవలెను. నేను సర్వతత్వప్రాణుడను. సర్వా త్మకుడను. జీవాంతర్యామిని. సర్వదా నేను జీవుడను. భూత భవిష్య ద్వర్త మాన త్రికాలంబులు నేను. సర్వ మారుద్రస్వరూపమని భావింపవలెను. ఈవి షయము, శివుడు తనముఖమున స్వయముగ జెప్పియుండెను. భగవంతు డిట్టి

యుత్కృష్టగుణములతో కూడియుండును. అట్టిశివునకు నాకును నభేదముగాన నేనదివ్వతీయుడను, సర్వంఖల్విదంబ్రహ్మ అను శ్రుతికి నిదివరలో నర్థము చెప్పియుంటిని. నేను పరిపూర్ణుడను, భావరూపుడను గాన నిత్యముక్తుడను. జీవులందరు నన్నాశ్రయించి నాభావమునుపొంది ముక్తినొందెదరు. సర్వాత్మకుడగు శంభుడను నేను, శివుడను నేను అని శివుడు చెప్పియుండెనని షణ్ముఖుడీ విధంబున వామదేవునకు జెప్పియుండెను. ఇవన్నియు శ్రుతి వాక్యాలు వీటియర్థములు యాదరముతో జెప్పెదను వినుమని స్కంధు డిట్లు చెప్పదొండగెను. ఈ మహా వాక్యములన్నియు గురువు శిష్యునకుపదేశింప వలయును. తదుపరి జలపూరితమగు శంఖమును, గాయత్రీ మంత్రముచేతను, భస్మము చేతను పరిశుద్ధిచేసి చతురశ్ర మండలమునందుంచి అర్చించి ఓం అని గంధపుష్పాక్షత వస్త్రాదులచే పూజించి వడపోసిన జలము శంఖమునందు పోసి ఓం అని పూజించి మరల ప్రణవముచే సప్తపర్యాయములు పూజింపవలెను. శంఖము నిండ జలముపూరింపక వెలితియున్నచో యనర్థము సంభవించును. ఇట్లు శ్రుతిచే చెప్పబడెను. గాన నిర్భయముగ నట్లు పూజించి శివుని స్మరించి శిష్యుని యాసనము షడధ్వమార్గమున పూజించి శివునకాసనముకల్పించి శివమూర్తిని కల్పించి శిరము లగాయతు పాదముల వరకు పంచబ్రహ్మ విన్యాసము జెప్పి శిరో ముఖములయందు ప్రణవముతో నష్టత్రింశత్కళలను 38 ప్రవేశపెట్టి మంత్రపూర్వకముగ శిష్యుని మస్తకమందు కళలనావాహనింపజేసి శివ ముద్రలను ప్రదర్శింపజేసి అంగవిన్యాసముగ జెప్పి, సర్వజ్ఞానీ యని ప్రారంభించి షోడశాసనవిధిగ నుపచారంబులు కల్పించి యగ్నయేస్వాహా యని పాయసమును నైవేద్యంబులు క్రమముగ నిడి వేదపారగులగు బ్రాహ్మణులను యష్టమూర్తి నామంబులచే పూజించి బ్రహ్మవిదాప్నోతి యను మంత్రము జపించి, భృగుర్వై వారుణిః యను మంత్రము నుచ్చరించి, యోదేవానాం యని ప్రారంభించి ప్రకృతిలీనస్సయఃపరస్య మహేశ్వర, అంతదనుక జెప్పి కల్హారములు తెచ్చి మాలగట్టి శివున కర్పించిపంచముఖశివుని స్మరించి సిద్ధి స్కంధుని జపించి పూర్ణాహుతి యగునంతవరకు మంచిమనసుతో కలువ మాలను ఈశ్వరునికంఠమందుంచి తదుపరి శిష్యుని గళమందు వేసి, అనగా దేశికుడీ మాలను వేసినుదుట తిలకమిడి గాత్ర మంతయు చందనములది,

యథావిధిగను సంప్రదాయానుసారముగను జేసి శిష్యునకు శ్రీపాదుడని పేరిడి ఛత్రపాదుకలిచ్చి శివునకు మహార్ఘ్యార్చన జేసి, గురువు శివుడుగను, శిష్యుడు శివుడుగను భావనచేసి కొని శివోహమస్మి యని గురువును సమాధి యందుండి నమస్కరించి శివునర్చించి సంప్రదాయానుసారముగ శిష్యుడు గురువునకు నమస్కరించి, గురువే శిష్యుడు శిష్యుడే గురువని ప్రవర్తించుచు శిష్యుడు లేచి గురువునకు నమస్కరించి నత శిరస్కుడై గురువుకడ వినయ విధేయతలతో నుండవలెను. నేటినుండి నీవు ప్రజల ననుగ్రహించుచుండుమని శిష్యునాశీర్వదించి యొక సంవత్సరము శిష్యుని పరీక్షించుచు రాగద్వేషాదులు వీడి శివధ్యాన పరుడై యుండుమని శిష్యుని శాసించుచు, మన సంప్రదాయ ములతోడనే సంచరించుమని బోధించుచు నితరులతో సంచరింపరాదని శాసించుచు నింతప్రాణము కంఠగతమైనను శివార్చన చేయక భుజింపనని శపథము చేయించుచు గురుభక్తిని వీడక సుఖముగ నుండుమని దీవించుచు దయాళువైన గురు వీవిధంబున చేయవలెను. గురు శిష్యులిరువురు అనుకూల భావముగ నుండవలెను. ఓ వామదేవా! నీయందలి స్నేహముచే రహస్యమగు యోగపట్టము నీ కుపదేశించితినని పలుకుచు నతనికి యతిసమ్మతమగు క్షౌరప్రక్రియను చెప్పనారంభించెను.

శివ మహాపురాణము నందలి కైలాస సంహితయందు
పందొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువదవ అధ్యాయము

### క్షౌర స్నాన విధము

మరల సుబ్రహ్మణ్యుడు వామదేవా! శిష్యుడీవిధంబుగ యోగపట్టవిధు లన్నియు గురువువలన పొంది క్షౌరకర్మానుష్ఠానమునకై గురువునకు నమస్కరించి గుర్వాజ్ఞనొంది. శిరంబు కడిగికొని, ఆచమించి ధరించిన వస్త్రములతోనే క్షౌరముచేయించుకొనదలచి యావస్త్రమును జలమృత్తికలచే తడిపి. మంగలి

కత్తినికూడ జలమృత్తికలచే కడిగి మంగలివానికి మృత్తికను కత్తినియిచ్చి, శివశివాయని కత్తిపై జలమును ప్రోక్షించి తన నేత్రముల ననామికాంగుష్ఠము లచే నభిమంత్రించి నేత్రములు మూసికొని గాయత్రిని జపించుచు నేత్రములు తెరిచి క్షౌరసామగ్రి నభిమంత్రించి గాంచి గాయత్రి మంత్రముచే ద్వాదశ పర్యాయములు ప్రోక్షించి కత్తిని మంగలివానికిచ్చి, దక్షిణభాగమున ప్రారంభించి క్షౌరముచేయించుకొని వపనము పూర్తియైన తరివాత కేశము లన్నియు నొక ఆకునందుంచి గడ్డము, కరచరణనఖంబులు తీయించుకొని పత్రముపై విసర్జించి, బిల్వమృత్తికలను తీసికొని వచ్చి, నదీతీరమున కేగి ద్వాదశపర్యాయము లీమృత్తికచే స్నానముచేసి. మృత్తికను త్రివిధంబులుగ జేసి ముమ్మారు జలముచే నభిమంత్రించి గాయత్రీ మంత్రముచే ముమ్మారు ప్రోక్షించి, వాటిలో నొకభాగమును గ్రహించి. ద్వాదశ పర్యాయములు చేతులుకడిగికొని, క్రమముగ ముఖమును, పాదములను కడిగికొని, మాటిమాటికి మృత్తికచే స్నానమాచరింపుచు జలమందు మునుగుచు, మరొకభాగమందున్న మృత్తికను శిరమునకు పూసికొని పన్నెండు పర్యాయములు స్నానమాచరించి తీరమునకు వచ్చి షోడశపర్యాయములు గండూష మాచరించి, రెండుపర్యాయములాచమించి, ప్రాణాయామముచేసి, అష్టపర్యాయములు ప్రణవమును జపించి మూడవ భాగమందలి మృత్తికను మూడుభాగములు చేసి అందొకభాగమును గ్రహించికటిపాదశౌచములు చేసికొని రెండుమార్లాచమించిమానముచే షోడశపర్యాయములు ప్రణవముతో ప్రాణాయామము గావించి, మరొకభాగము మృత్తికను గ్రహించి, ఓం అని యుచ్చరింపుచు, యూరుభాగములందు ముమ్మారు లేపనముచేసికొని హస్తపాదములు ప్రణవముతో సప్తపర్యాయములు ప్రోక్షించుకొని మృత్తికచే మరల మూడు పర్యాయములు కడిగికొని పవిత్ర మూర్తియగు సూర్యుని గాంచుచు మృత్తికధరించి యెడమహస్తముచే కుడికక్షయు కుడిహస్తముచే నెడమకక్షయు క్షాళనముచేసికొని దృఢమనస్కుడై, మరొకభాగమైన మృత్తికను గ్రహించి గురుభక్తితో శీర్షాది పాదాంతము మృత్తిలేపనము గావించుకొని, సూర్యునిగాంచి భూతలమందున్న దండము గ్రహించి, జ్ఞాననిష్ఠచే గురుమంత్రము జపించుచు, సాంబుడు చంద్రశేఖరుడు, మహేశ్వరుడునగు శంకరుని స్మరించి, గురుశివులకు ముమ్మారు సాష్టాంగనమ

స్కారములుచేసి ఉరసా దృష్ట్వా, మనసా వచసా యనెడు పంచాంగములచే నమస్కరించి ఆ మృత్తికతో తీర్థోదక మధ్యంబున మునుగుచు భుజస్కంధ ములకు పూర్వము ప్రకారముగ మృత్తికపూసికొని శేషించిన మృత్తికసం తయు గ్రహించి జలమధ్యమందు మునిగి సర్వాంగములకు మృత్తికాలేపనము చేసికొని ముమ్మారు ఓంకార ముచ్చరించి శివుని స్మరింపుచు సంసారాంబుధిని దాటించి జన్మరాహిత్యము చేయుమని ప్రార్థింపుచు, విరజా భస్మమును జల మునందుకలిపి ఓం అని స్నానముచేసి భస్మము సర్వాంగములకు బూసికొని, భస్మస్నాన మాచరించి యథోక్త విధిగ, త్రిపుండ్రములు ధరించి సావధానుడై యథోక్తాంగములకు భస్మము ధరించి శుద్ధమనస్కుడై మాధ్యాహ్నిక క్రియ లాచరించి, మహేశ్వర, గురు తీర్థంబులకు నమస్కరించి భక్తితో పరమేశ్వరు నర్చించి నమస్కరించ యతీశ్వరుడు కృతచేతస్కుడై సాధువిప్రుల గృహము నకు భిక్షకై యేగి భోజనము పంచవిధములుగ విభజింపవలయును. ఉచిత మైన భిక్షనే గ్రహింపవలయును. కాని దూషితాన్నమును భుజింపరాదు.

శ్లో॥ శౌచం స్నానం తథా భిక్షా॥
నిత్య మేకాంత సేవనం॥
భిక్షోశ్చత్వారి కర్మాణి
పంచమం నైవవిద్యతే।

శౌచము, స్నానము, భిక్షా, ఏకాంతవాసముననను నీ నాల్గుకర్మలేగాని యతి నైదవకర్మచేయరాదు.

శ్లో॥ అలా బుం వేణు ప్రాతంచ॥
దారవం మృణ్మయుం తథా॥
భిక్షో శ్చత్వారి ప్రాత్రాణి॥
పంచమం నైవవిద్యతే॥

సారపాత్ర వేణుపాత్ర, దారుపాత్ర మృణ్మయపాత్ర వినా యతు లితర పాత్రలు వాడరాదు.

3॥ తాంబూలం తైజసం పాత్రం
రేతస్సేకం సితాంబరం
దివాస్వాపోహి నక్తాన్నం
యతీనాం షడ్వివర్జితాః॥

యతులు తాంబూలము లోహపాత్ర రేతస్సేచనము, శ్వేతవస్త్రము పగటినిద్ర నక్తభోజనమునను నీ యారువిసర్జింపవలయును.

4॥ సాక్షి రావిపతీతాశ్చ
రాక్షసాస్త ఇతిస్మృతాః
తస్మాద్వై విక్రీతంచ
కర్మనైవాచ రేద్యతిః

యతీశ్వరుడు యతివాదములు వితండవాదములు చేయరాదు. అట్లుచేసి నవారు రాక్షసు లనబడుదురు. యతి ప్రముఖ్ల పూర్వకముగ క్షౌర స్నాన విధులచే పరిశుద్ధుడై సదా సదాశివుడగు పరబ్రహ్మను ధ్యానింపవలెను. ఓ వామదేవా నీయందలి స్నేహముచే నిదంతయు జెప్పితిని ఇక నేమి విన గోరు చుంటివి?

శివమహాపురాణము నందలి కైలాస సంహితయందు
ఇరువదవ అధ్యాయము సంపూర్ణము.

---

# ఇరువదియొకటవయధ్యాయము

## యతులుమరణానంతరము దశాహ్నిముఉ,

వామదేవుడు కుమారునిట్లు ప్రశ్నించెను, ఓగురూ; ఓకార్తికేయా! ముక్తులగు యతీశ్వరులకు దహనకర్మలు లేవనియు, ఖననము చేయుదురనియు నేను వినియుంటిని నాకదంతయు విస్తరించి జెప్పుము. నీకన్న జెప్పు సమర్థులు మరొకరులేరు. పూర్వము యతులు ఏభావము నాశ్రయించి దేహపంజ

రమునుండి విముక్తులైరి. యేయుపాసనలచే దేహముక్తులై పరమగతినొందిరి. ఓ శంకరాత్మజా! నన్ను నీశిష్యునిగ భావించి, యతులగతి విశేషంబులన్నియు నాకెఱింగింపుమన, రాక్షస మారకుడగు శక్తిపుత్రుడువిని విజ్ఞప్తినాకర్ణించి యీశ్వరునిచే తాను విన్న రహస్యమంతయు నిశ్లేరింగించెను. ఓమునీ ఈకథ కడు రహస్యమైనది సుమా! ఒకానొకప్పుడు, పినాకపాణి సాక్షా త్సర్వజ్ఞుడు భగవంతుడునగు శివయోగి భృగునితో జెప్పగా నేను వినియుంటిని. ఆయోగము శాంతులగు శిష్యులకు శివభక్తిపరులకు జెప్పవలయును గాని యితరులకు జెప్పరాదు. సమాధియందు శివభావముతో నుండు యతి శివుడేయగును. శివభక్తి కల్గినవాడు తప్పక శివుడేయగును అధైర్యవంతు డెన్నడు సమాధి నొందలేడు, సమాధి నొందు నుపాయముజెప్పెదను సావధానముగ వినుము, జ్ఞాన, జ్ఞేయ, జ్ఞాత, లనెడి త్రిపుటీపదార్థజ్ఞానమునొంది వేదాంత శాస్త్ర వాక్యములు గురుముఖమున విని, యమనియమ, ఆసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ సమాధులనెడి యష్టాంగ యోగముల నభ్యసించుచు, శివధ్యానపరుడై, నిత్యము నియమముతో ప్రణవాసక్తమానసుడై దేహదార్బల్యమువీడి ధైర్యమవలంబించి నిష్కాముడై, శివుని స్మరింపుచు తన జీర్ణ దేహమువీడి, సదాశివానుగ్రహముచే నందిచే ప్రేరేపింపబడుచుండును. అతివాహికులగు దేవతలు నైదువిధంబులుగ జెప్పబడుచుండిరి. వీరెవరనగా కొందరు ఆత్మగాంధాకృతులు (అగ్నితుల్యులు జ్యోతిః పుంజ వపుష్మంతులు) కొందరు దివాభిమానులు కొందరు శుక్లపక్షాభిమానులు, కొందరు ఉత్తరాయణాభిమానులు ఈరైదుగురని పంచవిధ దేవతలని చెప్పుదురు, వీరు జీవుని దేవ మార్గముగ గొంపోవుదురు. దక్షిణాయ నాభిమానులు ధూమాభిమానులు, రాత్ర్యభిమానులు, కృష్ణపక్షాభిమానులు నగు నైదుగురు పాపాత్ములను నరకమునకు, పుణ్యాత్ములను స్వర్గమునకు, గొంపోవుదురు. పుణ్యాత్ముల నర్చిరాదిమార్గమున గొంపోవుదురు, వీరు దక్షిణాయణ పంచదేవతలు, ఉత్తరాయణ పంచదేవతలని చెప్పబడుచుందురు. ఈ దక్షిణాయన పంచదేవతలు, కర్మానుష్ఠానపరులగు జీవులను వారి పుణ్యప్రభావముచే స్వర్గమునకు గొంపోయి పుణ్యక్షయ మగు నంతవనుక నటనుంచి మరల భువిపై పడవేయుదురు, ఆజీవులు పూర్వజన్మలవంటి జన్మలనే పొందుదురు. పైజెప్పబడిన పంచదేవ

తలు యతీశ్వరుని శివలోకమునకు జేర్చెదరు శివుడు వారిని యనుగ్రహిం చును. ఈశ్వరుడు విరక్తుడగు యతిని గాంచి, మహావాక్యార్థములన్నియు, చక్కగ భోధించి తనసారూప్యమునిచ్చి గణాధిపత్యము నొసంగును, సర్వనా యకుడగు శంకరుడు యతుల నీవిధంబున ననుగ్రహించును. సారూప్యమునగా మృగ టంక త్రిశూలాగ్ర వరదాన విభూషితుని గావించి త్రినేత్ర చంద్రార్ధశే ఖరుని చేసి జటామకుట గంగా శోభితుని జేసి సర్వకామదమగు విమానాధిష్ఠి తుని జేసి విరక్తుడగు యతిని రుద్రకన్యాసమావృతుని గావించి మనోహరమగు రుద్రగీత వాద్యంబులు ప్రయోగింపజేయుచు, దివ్యాంబర గంధమాలాలంకృతుని జేసి సర్వభూష, భూషితుని జేసి దివ్యామృతఘటంబును, దివ్యజలపరిపూరిత ఘటంబునిచ్చి సూర్యకోటి ప్రతీకాశమైనదియు చంద్రకోటి సుశీతల మైన దియు, మనోవేగమైనదియు స్వేచ్ఛా సంచారముగలదియు నగు విమాన మత నికిచ్చి సర్వభోగంబుల ననుభవింపజేయుచు, భోగములయందు విరక్తి గల్గిన తరి మూలప్రకృతి మొదలుకొని మహదాదిశక్తులన్నియు రంజింపజేసి దుర్గమం బగు కులయానల సుప్రభంబగు కాంతారంబున వసింపజేసి యనుగ్రహించి మహామంత్ర ముపదేశించి నేను పరమేశ్వరుడనైతినను పూర్ణభావము కల్గింపజేసి యనుగ్రహించి యచలశివదాస్యంబునిచ్చి సూర్యమండలము భేదిం చుకొని యూర్ధ్వలోకమున కేగు యనర్గళ సమర్థత నిచ్చి బ్రహ్మాయుప్రమా ణము వరకు పునరావృత్తిలేని పదము నిచ్చును, తదుపరి ముక్తినికూడ నొసం గును, ఇట్టి వేదాంతులకు ముక్తి యవశ్యము కల్గునని పరమేశ్వరుడు ఘంటా పథముగ జెప్పియుండెను, ఈ సమిష్టి యైశ్వర్యము యతీశ్వరులకు లభించును. యతి శిథిలదేహుడై ప్రాణత్యాగ సమయము దున్నపుడు శిష్యులైన యతులు చుట్టూ పరివేష్టించి క్రమముగ ప్రణవాది మహావాక్యము లన్నియు బల్కుచు స్ఫుటముగ శిస్మరణ చేయుచు యతి శిద్ధినొందుదనుక నిర్గుణ పరబ్రహ్మ వాక్యము లుచ్చరింపుచుకాలము గడుపవలెను. ఇటుపై యతి సంస్కారములు కూడ చెప్పెద వినుము. యతీశ్వరులకు సంస్కారము లేకున్నను, దుర్గతి సంభవింపదు. నితడు సర్వకర్మ సన్యాసిగాన ఇతనికే క్రియలు చేయకున్నను దుర్గతిరాదు. రాజులు యతులను దూషించినచో వారు రాజ్యభ్రష్టులగుదురు. ఆ గ్రామవాసు లందరు కూడ దుఃఖితులగుదురు. ఆ

దోషపరిహారమును జెప్పెద వినుము. ఓంనమ ఇరిణ్యాయచ అను నమకరు
క్కును ప్రారంభించి, నమఆమీవత్క్యేభః అనువరకు పఠించి ఓం అనియుచ్చరించి
దేవయజ్ఞమును చేయవలెను. అప్పుడు దోషశాంతి యగును. యతుల నెవరును
నిందింపరాదు. మృతి జెందినయతికి వాని పుత్రులు యథావిధిగ సంస్కా
రము చేయవలెను. ఇదియే యుత్తమంబు. సంస్కార విధానమంతయు జెప్పెద
వినుము. యతని శుద్ధోదకములచే స్నానముచేయించి కుసుమంబులచె
పూజించి రుద్రునమక చమకములచే నభిషేకించి శంఖము నెదురుగా బెట్టి
జలముచే పూరించి తజ్జలముచే నభిషేకించి పుష్పము గ్రహించి ప్రణవముచే
శిరము తుడిచి పాత కౌపీనమును తీసివేసి నూతన కౌపీనమును ధరింపజేసి
విధిప్రకారముగ సర్వాంగములకు భస్మమలది త్రిపుండ్రముబెట్టి నుదుట
చందన తిలకమిడి కళేబర మంతయు పుష్పమాలలచే నలంకరించి మంత్రవిధి
క్రమముగ రుద్రాక్షలు యురమునకు కంఠమునకు శిరమునకు బాహువు
లకు నలంకరించి శరీరమంతకు ధూపము వేసి ఆశరీరమును ఉట్టియందుంచి
ఈ చిక్కమును పంచబ్రహ్మరథమందుంచి యారథమును పంచబ్రహ్మ
మంత్రములచే నభిమంత్రించి సుగంధ కుసుమమాలలచే నారథ మలంక
రించి నృత్య గీత వాద్యంబులు విప్రవేద ఘోషంబులు జరుపుచు బ్రాహ్మ
ణులా రథమును వహించి గ్రామమునకు ప్రదక్షిణము చేయించి ప్రేతభూమికి
గొంపోయి తూర్పు దిశయందుగాని, ఉత్తర దిశయందుగాని పుణ్యవృక్ష
సమీపమునందుంచి దండమాత్ర ప్రమాణముగ గర్తము తీసి ప్రణవ
వ్యాహృతులచే ప్రోక్షించి శమీపత్రపుష్పంబులను నుత్తరాంగములుగ
మూర్ధ్వ భాగమున నుంచి దర్భలు పరచి కృష్ణాజినము వస్త్రముపరచి
పంచగవ్యము ప్రణవముచే శరీరమంతయు జల్లి ప్రణవముచేతను నమకము
చేతను ప్రోక్షించి శంఖతోయములచే నభిషేకించి శిరమున పుష్పములిడి
శివస్మరణ చేయుచు స్వస్తివాచక పూర్వకముగ ఓం అని పైకెత్తి
యోగాసన పూర్వకముగ గర్తమందు యతని ప్రాఙ్ముఖముగ కూ
ర్చుండబెట్టి గంధపుష్పధూప దీపంబులిడి విష్ణోహవ్యం రక్షయని పలుకుచు
దక్షిణహస్తమున దండము వామహస్తమున కమండలము నుంచి ప్రజాపతే
నత్వదేతి యను మంత్రముచే కమండలమందుదకముపోసి బ్రహ్మజజ్ఞాన అను

మంత్రముచే శిరమును స్పృశించి నమకముచే భ్రూమధ్యమును స్పృశించి మానోమహాంతముత యనెడి చతురనువాకములు జెప్పి నారికేళముచే శిరమును భేదించి అగ్రమంతయు మట్టి గోపూడ్చి వేసి ఆప్రదేశమును పంచబ్రహ్మలమంత్రముచే స్పృశించి ఓ దేవానాం అని మొదలుకొని యఃపరస్యమహేశ్వరః అను నంతదనుక జెప్పి సాంబుడు సంసారవైద్యుడు సర్వజ్ఞుడు అపరాధీనుడు సర్వానుగ్రహ కారకుడునగు మహాదేవుని జపించి అందు మూరెడు వెడల్పు రెండుమూరలు పొడవుగల యాసనము మట్టిచే నిర్మించి గోమయముచే నలికి యందు చతురశ్ర కోణము నిర్మించి గంధాక్షత సుగంధ కుసుమ బిల్వ తులసీ దళంబులచే పూజించి ప్రణవముచే ధూపదీపములిచ్చి పాలతో వండిన హవిస్సును నైవేద్యమిచ్చి ఐదుమూర్ల ప్రదక్షిణ నమస్కారములుచేసి ద్వాదశపర్యాయములు ఓం కారమును జపించి నమస్కరించి యష్టదిక్కులకు ప్రణవముచే నమస్కరించి పంచబ్రహ్మలకు ప్రణవముతో నమస్కరింపవలెను. ఇట్లు పదిదినముల పర్యంతము చేయువలెను. ఇటుపై యతీశ్వరుని ఏకాదశ విధిని చెప్పెద వినుము.

శివ మహాపురాణము నందలి కైలాస సంహితయందు
ఇరువది యొకటవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువది రెండవ యధ్యాయము

### యతుల ఏకాదశ కృత్యములు

మరల సుబ్రహ్మణ్యు డిట్లు చెప్పదొడంగెను. ఓ వామదేవ! నీయందలి ప్రేమచే నేకాదశ కృత్యములను జెప్పెద వినుము. ఆ వేదికనంతయు పదునొకండవ రోజున నలికి పుణ్యాహవాచనముచేసి జలము ప్రోక్షించి పశ్చిమ దిశను ప్రారంభించి తూర్పువరకు నైదు మండలములు నిర్మించి యుత్తరాభిముఖుడై ప్రాదేశ మాత్రమును మంత్రము పఠింపుచు మండపమధ్యమున చతురశ్ర మండలము నిర్మించి బిందు త్రికోణ షట్కోణవృత్తాకారములుగ క్రమముగ మండలము లన్నియు నిర్మించి పైజెప్పిన యైదు మండలముల నైదు విధంబులుగ

నిర్మించి శంఖము నెదురుగానుంచి ప్రాణాయామముచేసి సంకల్పించి యాతివాహిక నాములగు పంచ దేవతలను పూజించి దర్భల నుత్తరముగ వైచి వాటిని స్పృశించి యారు మండపములయందు నాసనముల నిమిత్తమై పుష్పములు వేసి ఓం హ్రీం అని యాతివాహిక దేవతలనుపూజించి ఆవాహయామినమః అని క్రమముగా పూజింపుచు ప్రత్యేకముద్రలు జూపించి హ్రాం హ్రీం అని క్రమముగా పూజించి అంగపాశ అంకుశ అభయ అభీష్ట ముద్రల జూపించి, చంద్ర కాంతి సమప్రభమైనరత్నాంగుళీయకము ధరించి రత్నాంగుళిచే నలుదిక్కుల ప్రకాశింపజేయుచు రక్తాంబరధారియై కరపదపంకజ శోభితయై త్రినేత్రోల్లాసిత వదనయై పూర్ణచంద్రమనోహారియై మాణిక్య మకుటోద్భాసితయై చంద్రలేఖా వతంసయై కుండలశోభిత గండస్థలయై పీనోన్నత పయోధరయై హారకేయూర కటక కాంచీదామ మనోహారియై తను మధ్యయై పృథుశ్రోణియై రక్త దివ్యాంబరావృతయై మాణిక్యమయ మంజీర సింజత్పద మనోహారిణియై యతి మనోహర శ్రోణీ పాదాంగుళీయకములుకల్గి యనుగ్రహరూపిణియగు శక్తితో గూడిన యీశ్వరుని ధ్యానింపవలెను. ఈ శివశక్తులను ధ్యానించిన వారలకు లభింపని దేదియు నుండదు ఇట్లు ధ్యానించి శివానుగ్రహమునకు పాత్రులు గావలెను. తదుపరి శంఖోదకముచే పాదయోః పాద్యం అని ఇవ్వవలెను, హస్తములయం దాచమన మివ్వవలెను, శిరమునం దర్ఘ్యమిచ్చి ఆభరణంబులొసంగి శంఖోదకమును ప్రోక్షించి రక్తాంబరముల నిచ్చి పంచబ్రహ్మముకుటముపై యాభరణంబుల నలంకరించి సువాసితములైన గంధాక్షతలిచ్చి సువాసిత మనోహర కుసుమంబులు సమర్పించి హ్రీం అను మంత్రముచే ధూపదీపముల సమర్పించి ఓంనమః అని పాయసము నైవేద్యమిడి తదుపరి నేయి పంచదారతో జేసిన అప్పములు అరటిపళ్లు, బెల్లము సువాసితద్రవ్యంబులుఅరటియాకునందుంచి భూర్భువసువరోమితి యని ప్రోక్షించి ఓం హ్రీం స్వాహా యని నైవేద్యముచేసి నమః అని మధ్యే మధ్యే పానీయ మొసంగి పంచదేవస్వరూపుడగు నీశ్వరుని పూర్వదిక్కును ప్రారంభించి యథాక్రమముగ నుద్వాసనజేసి ఆప్రదేశమును పూర్తిగ కడిగి శుభ్రముచేసి గండూషమునకై యాచమనమిచ్చి తాంబూల ధూపదీపంబులిచ్చి ప్రదక్షిణ నమస్కారములుచేసి శిరమువంచి ప్రార్థించి యక్కడి ప్రసాదమును కన్యకలకు పంచి బెట్టి యీయతిని రక్షింపు

ము పరమేశ్వరుని ప్రార్థించి దేవతలను యథాస్థానములకు బంపి ఈపూజా ద్రవ్యంబు లన్నియు జలమందు పడవేయుటగాని గోవులకు బెట్టుటగాని చేయవలెను. తరువాత పారణ చేయవలెను. గానియతికి ఏకోద్దిష్ట మవసరములేదు. పారణముహూర్తము చేయవలెను. దీని విధి చెప్పెద వినుము కర్త స్నానముచేసి ప్రాణాయామము చేసి సవ్యోపవీతుడై కూర్చుని అపవిత్రః పవిత్రోవా అనుమంత్రమును జెప్పి పుణ్యసలిలము హస్తమం దిడికొని పారణశ్రాద్ధం కరిష్యే యని సంకల్పించి యాసనము నకై దర్భలను బరచి జలముచు స్పృశించి బ్రాహ్మణ చతుష్టయమున కర్ఘ్యంగ నము గావించి, ధృతవ్రతులు శివభక్తులగు వారినే యాహ్వానించి మిమ్ము లను విశ్వేదేవతలుగా భావించుచుంటిమి. ననుగ్రహింపుడని వారలతో బలికి మీరు ఆత్మా అంతరాత్మా పరమాత్మ స్వరూపులై యున్నారని వారిని ప్రార్థింపుచు వారిపాదములు కడిగి పూజించి తూర్పు ముఖులుగా నాసీను లం గావించి గంధపుష్పాదు లొసంగి శివలింగమున కెదురుగ భోజనములు పెట్టి వారుభుజించినతరి గోమయముచే నొకప్రదేశమున నలికి తూర్పుముఖ ముగా దర్భలుబరచి ప్రాణాయామముచేసి పిండప్రదానము చేయుచుంటినని సంకల్పించి మూడు మండలములుచేసి యర్చించి ఆత్మా అంతరాత్మా పర మాత్మలుగ భావించి ఆత్మనేనమః అంతరాత్మనేనమః పరమాత్మనేనమః యని యుచ్చరింపుచు మూడు పిండములు బెట్టి పిండందదామి యని భక్తితో బలు కుచు పిండములటనుంచి విధిపూర్వకముగ కుశజలములచే ప్రోక్షించి ప్రదక్షిణ నమస్కారములు చేసి బ్రాహ్మణులకు యథావిధిగ దక్షిణలిచ్చి యాప్రదేశ మునందే నారాయణబలినిచ్చి రక్షణార్థమై సర్వత్ర విష్ణువుని పూజించి పాయ సము నైవేద్యమిడి వేదపారగులగు బ్రాహ్మణులను రావించి గంధపుష్పాదులచే కేశవనామంబులతో పూజించి ఛత్రపాదుకా వస్త్రంబులిచ్చి మంచివాక్కులచే వారల సంతసపరచి పూర్వదిశాగ్రములుగ దర్భలుబరచి, ఓం భూః స్వాహా! ఓంభువః స్వాహా! ఓంసువః స్వాహా! యని పాయసాన్నమును బలినివ్వవలెను.

ఇటుపై ద్వాదశాహవిధిని జెప్పెద వినుము.

శివమహాపురాణము నందలి కైలాససంహిత యందు

ఇరువది రెండవ అధ్యాయము సంపూర్ణము.

# ఇరువదిమూడవ యధ్యాయము

## ద్వాదశాహ కృత్యములు

యతీశ్వరుడు మృతినొందిన పన్నెండవరోజున కర్త ప్రాతఃకాలమున లేచి స్నానముచేసి నిత్యకృత్యములు దీర్చుకొని ప్రాతరౌపాసన గావించి శివభక్తులనుగాని యతులనుగాని శివప్రీత్యర్థమై యాహ్వానించి స్నానము చేయించి మృష్టాన్న భోజనంబులు తయారుచేయించి పరమేశ్వర సన్నిధిని కూర్చుండబెట్టి పూర్వోక్తవిధిగ పంచావరణ పూజలు గావించి సుముహూర్తము ప్రాణాయామము చేసి మూరే మాంగురువులు మొదలుగల పూజచేయుచుంటినని వారితో బల్కి మహాసంకల్పము జెప్పి పూజాంకరిష్యే అని బలికి దర్భలు స్పృశించి మౌనముతో వారిపాదములు కడిగి ఆచమనముచేసి భస్మభూషితులగు వారలను తూర్పుదిశగ కూర్చుంబెట్టి యష్టమూర్తి స్వరూపుడగు సదాశివుని ధ్యానించి గురువు పరమగురువు పరాపరగురువు లను ధ్యానించి ఇదమాసనమని యాసనములిచ్చి ప్రణవసహితమగు నామంబులు ద్వితీయాంతముగ బలుకుచు నావాహనముచేసి అర్ఘ్యోదకములిచ్చి పవిత్రోదకములచే పాద్యోదకములిచ్చి గంధాక్షత వస్త్రంబులిచ్చి పుష్పమాలాలంకృతులజేసి యష్టమూర్తి నామంబులు ప్రణవముతో బల్కుచు సుగంధకుసుమంబులిచ్చి ధూపదీపాదులచే సకలారాధనలు గావించి సంపూర్ణమైనదని పలికి లేచి నమస్కరించి పాత్రలు నరటియాకులు జలముతో కడిగి శుద్ధాన్నము పాయసము యపూపములు చక్కెరలు పచ్చళ్లు వడ్డించి కదళీఫలంబులువేసి వేరువేరు పాత్రలతో నేయితేనె మొదలగునవి వడ్డించి విష్ణోర్హవ్యమితి యని యుదకము చల్లి పరిషేచనచేసి రక్షస్వయని వారిచేతులు బట్టుకొని యాపోశనము చేతిలోవేసి సదాశివాదయః ప్రీతావరదాస్సుప్తాధనంతుమే యని పలుకుచు యేదేవాదివ్యేకాదశస్థ అను నుపనిషద్వాక్యములు బలుకుచు సక్తతలు విదలి లేచి నమస్కరించి సర్వత్రామృతమస్తని బలుకుచు బ్రాహ్మణులను ప్రసన్నులుగ జేసి గణానాంత్వాం అని ప్రారంభించి పంచరుద్రసూక్తములను పఠింపుచు అన్నమిడి పురోహితం అనియు నమస్తేరుద్రమన్యవే తాను రుద్రనమకమును చమకమును అగ్నావిష్ణూసజోషసే యను ఏకాదశ మంత్రములును లేక పరిణోరుద్రస్వహేతిః యను

నారురుక్కులను సద్యోజాతాది పంచమంత్రములును పఠింపవలెను. బ్రాహ్మ ణుల భోజన మైనతరి శేషించిన మంత్రములన్నియు జెప్పి యక్షతలిచ్చి యుత్త రాపోశనమిచ్చి హస్తాంఘ్రిముఖ శోధనమునకై జలమిచ్చి సుఖాసనాసీనుల జేసి శుద్ధోదకమిచ్చి ముఖసువాసనలకై పచ్చకర్పూరాది సుగంధద్రవ్యములిచ్చి భూరిదక్షిణలు ఛత్రపాదుకాసనంబులిచ్చి వీవనలొసంగి ఫలములు వేణుదం డంబులనిచ్చి ప్రదక్షిణనమస్కారములుచేసి యాసీస్సులనొంది మరల నమస్క రించి యచంచలంబగు గురుభక్తిగల్గి ఓ సదాశివాది పంచబ్రహ్మస్వరూప లారా మీరు సుఖముగా మీమీస్థానముల కేగుడని ప్రార్థించి వారిని సింహ ద్వారమువరకు సాగనంపి యతిథులకై యెదురుచూచుచు బంధుమిత్రులతో నా దీనులు ననాథులునగు వారితో భుజింపవలయును. కర్త యెట్టివికారమును పొం దక నా రోజంతయు గడపవలయును. గుర్వారాధనము ప్రతిసంవత్సరము శివ ముగ యతికి శిష్యుడుగాని కుమారులుగాని చేయవలెను ఇట్లాచరించిన వారలు యిహమందు సర్వభోగము లనుభవించి పరమందు శివలోకమున కేగెదరు. ఈవిషయమంతయు తన శిష్యుడైన వామదేవున కుపదేశించెను. ఇదంతయు లోకానుగ్రహమునకై జెప్పియుండెనన ఋషులు సూతవాక్కులువిని ఓ మహర్షీ! మేమిదంతయు పూర్వము నైమిశారణ్యమున వ్యాసునిచే వినియుం టిమి కాన మాకతడు ప్రథమగురువు నీచేవినియుంటిమి గాన నీవు ద్వితీయ గురుడవు నైయుంటివి. పరమేశ్వరుని వలన నందికేశ్వరుడు, నందికేశ్వరునివలన సనత్కుమారుడు సనత్కుమారునివలన వ్యాసుడు వ్యాసునివలన శుకుడు విని యుండెను. ఇంకను వ్యాసునకు వైశంపాయనుడు పౌలోముడు, జైమిని సుమం తుడు ననునల్గురు శిష్యులుండిరి వారు వేదాధ్యయన సంపన్నులు ధర్మస్థాపకులు మహాతేజస్కులునై యుండిరి వీరు ముఖ్యశిష్యులు. అగస్త్యుడు పులహుడు, పుల స్త్యుడు, క్రతువు వామదేవుని ముఖ్యశిష్యులై యుండిరి. సనక, సనందన, సనా తన, సనత్సుజాత చతుష్టయము యోగివర్యులై శివప్రియులై యుండిరి. సనత్కు మారుని శిష్యులందరు సర్వవేదార్థ పిత్తములై యుండిరి. గురువు పరమగురువు పరాత్పరగురువు పరమేష్ఠిగురువులని గురుసంప్రదాయము చెప్పబడెను. గురుసంప్రదాయము నెపుడు పూజింపవలెను. ఈ గురుసంప్రదాయమును శుకుడు పూజింపుచుండెను. వారందరికికూడ ప్రణవవిజ్ఞానముగలదు. కాశీయందు ముక్తి

వాయువు ప్రసంగించిన విధంబున చెప్పుదుమని ప్రారంభించెను. పంచలక్షణములతో గూడిన పురాణమును, సర్గము, ప్రతిసర్గము, వంశము, మన్వంతరము వంశాను చరితము వీటితో గూడినది గాన పురాణం పంచలక్షణం అని అందురు. ఇట్టిపురాణము సంకలి ముఖ్యవిషయంబులు సూతుడిట్లు చెప్పదొడంగెను. సకలవిద్యాస్థానంబులు పురాణాను క్రమమైయున్నవి. అట్టిపురాణోత్పత్తి నుగురించి మీకుజెప్పెదను. ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణవేదములనునవి నాల్గును, వీటికంగములైన, శిక్ష, వ్యాకరణము, ఛ్ఛందస్సు, నిరుక్తము జ్యోతిషము, కల్పము, అనునారును, మీమాంస, న్యాయశాస్త్రం, పురాణ, ధర్మశాస్త్రములనెడి నాల్గును, మొత్తమివి చతుర్దశ విద్యలని చెప్పబడుచున్నవి. ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము అను ఈనాల్గును కలిపినచో నష్టాదశ విద్యలని చెప్పబడెను ఈ విద్యలన్నియు చిన్న చిన్న భాగములతో, నున్నను. వీట్లకన్నిటికి, శివుడే, కవియు, నాదికర్తయునై యుండెనని, శృతులయందు చెప్పబడెను. సర్వజగన్నాధుడగు పరమేశ్వరుడు, జగత్తుల సృజింపనిచ్ఛగించి, విశ్వకారణమునకై ప్రథమమున బ్రహ్మను సృజించెను, గాన బ్రహ్మ పరమేశ్వరునకు ప్రథమపుత్రుడుగా నుండెను. అతనికి విశ్వసృష్టికై విద్యరాసంగెను. తదుపరి విష్ణువును సృజించి పరిపాలనా శక్తి నిచ్చి యుండెను. ఈశ్వరున కితడు మధ్యమ పుత్రుడై యుండెను. ఇతడు బ్రహ్మను సైతమురక్షించుచుండును బ్రహ్మ పరమేశ్వరునిచే విద్యను బడసి సృష్టిప్రారంభమున, సకలశాస్త్రములు, పురాణములు రచించెను. తదుపరి యతని చతుర్ముఖములనుండి చతుర్వేదములు జనించెను, బ్రహ్మచే విశ్రుతమైన వేదశాస్త్రము లెవరు నతిక్రమింపరాదు, ఇదంతయు మత్స్యపురాణము నందుగలదు. విద్యలన్నియు సంపుటీ చేయుటకై. విశ్వేశ్వరుడగు శివుని ఆజ్ఞానుసారముగ ద్వాపరాంతమున, విశ్వాత్ముడు, విశ్వంభరుడు, ప్రభువగు విష్ణువు వ్యాసుడను పేరుతో భువియందవతరించెను. ఈవిధంబుగ విష్ణువు వ్యాసనాముడై ప్రతిద్వాపరమందున, వేదములు విభజించి పురాణములు రచింపుచునేయుండును. ఇతరగ్రంథములుకూడ రచింపుచుండును. ఈద్వాపరమందు వ్యాసుడు కృష్ణద్వైపాయనాఖ్యుడై యరణియందగ్నివలె, సత్యవతీ సూనుడై జనించి, మరల వేదములన్నియు, సంక్షిప్తముగ జేసియుంచుటచే, వేదవ్యాసు

డని పేరువచ్చెను. ఇతడు పురాణములన్నియు సంక్షిప్తముగ నాల్గులక్షల శ్లోకములతో రచించెను. దేవలోకమందు పురాణములు నేటికిని, శతకోటి శ్లోకప్రవిస్తరములై యుండెను. చతుర్వేదములు నుపనిషత్సహితముగ తెలిసికొన్నను, పురాణము తెలియకున్నచో వాడు చతురుడు కానేరడు.

శ్లో॥ యేవిద్యాచ్చతురో వేదాన్
సాంగోపనిషదాన్ద్విజః
నచేత్పురాణం సంవిద్యా
న్నైవ స స్యాద్విచక్షణః.

ఇతిహాస పురాణములతో వేదార్థము జతపరచి చెప్పవలెను. హీనోపమానములచే వేదార్థము నుడువరాదు.

శ్లో॥ సర్గశ్చ ప్రతిసర్గశ్చ
వంశోమన్వంత రాణిచ
వంశాను చరితంచైవ
పురాణంపంచలక్షణం.

అని పురాణములు పంచలక్షణములు గలవిగ చెప్పబడెను. అష్టాదశ పురాణంబులకు మహర్షులు బృహత్సూక్ష్మ పద్ధతులుగ వ్యాఖ్యానములు వ్రాసియుండిరి.

శ్లో॥ బ్రాహ్మంపాద్మం వైష్ణవంచ
శైవంభాగవతం తథా
భవిష్యం నారదీయంచ
మార్కండేయమతః పరం.

ఆగ్నేయం బ్రహ్మవైవర్తం
లైంగంవారా హమేవచ.
స్కాందంచ వామనంచైవ
కౌర్మంమాత్స్యంచ గారుడం.

బ్రహ్మాండం చైవ పూర్వోయం
పురాణానామనుక్రమః

ఇవియే యష్టాదశ పురాణము లని చెప్పబడెను. వీటిలో నాల్గవదైన శివపురాణము సర్వార్థసాధకమై యుండెను. ఈపురాణము ద్వాదశ సంహితలతోను, లక్షశ్లోకములతోను శివునిచే రచింపబడెను. ఇందుసర్వధర్మములు ప్రతిష్ఠింపబడెను. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రులు దీనినాచరించిన ముక్తులగుదురు. ముక్తిని కోరువారు శివునాశ్రయింపవలెను. శివునాశ్రయింప కున్నచో దేవతలకైనను ముక్తిరాదు. ఈశైవపురాణమంతయు వేదసమ్మతమై యుండెను. దీనియందలి భేదములన్నియు జెప్పెద వినుడు.

విద్యేశ్వర, రౌద్ర, వినాయక, ఉమా, మాతృ, రుద్రైకాదశ, కైలాస, శతరుద్ర, కోటిరుద్ర, సహస్రకోటిరుద్ర, వాయువీయ, ధర్మసంహితలనెడు, ద్వాదశ సంహితలుగల శివపురాణమును శివుడు రచించెను. వీటిలో విద్యేశ్వర సంహిత పదివేల శ్లోకములతో నుండెను. రుద్రవినాయక మాతృ సంహితలు ఒక్కొకటి 8 వేలశ్లోకములతో నుండెను. రుద్రైకాదశ సంహిత 13 వేల శ్లోకములతోను, కైలాస సంహిత 6 వేలశ్లోకములతోను, శతరుద్రసంహిత 3 వేల శ్లోకములతోను సకలార్థజ్ఞాన సంయుతముగు కోటిరుద్ర సంహిత 9 వేలశ్లోకములతోను, సహస్రకోటిరుద్ర సంహిత 11 వేల శ్లోకములతోను, వాయుసంహిత 4 వేలశ్లోకములతోను, ధర్మసంహిత 12 వేల శ్లోకములతోను, ఇవ్విధంబున శివపురాణ లక్షశ్లోకములతో నుండెను. వేదసారము, భుక్తిముక్తి ప్రదమునగు శివమహాపురాణము నంతయు వ్యాసుడు 24 వేలశ్లోకములతో సంక్షిప్తముగ, విద్యేశ్వర సంహిత, రుద్రసంహిత, శతరుద్రసంహిత, కోటిరుద్రసంహిత, ఉమాసంహిత, కైలాస సంహిత, వాయవీయ సంహితలనెడు సప్తసంహితలతో వ్రాసియుండెను. ఈవిద్యేశ్వర సంహిత 2 వేలు. రుద్రసంహిత 10500 శతరుద్ర సంహిత 2180 కోటిరుద్రసంహిత 2240 ఉమాసంహిత 1840 కైలాస సంహిత 1240 వాయువీయ సంహిత 4000 శ్లోకములతోను, ఇవన్నియు కలిసి 24000 ఇరువది నాల్గువేల

శ్లోకములతో కూడియుండెను. ఇందులో వాయవీయ సంహిత రెండు ఖండములుగ నుండెను. అవిమీకు జెప్పెదను. వేదార్థము తెలిసినవానికి గాని యీసంహిత యర్థముకాదు. శ్రద్ధాభక్తులులేని వారికీపురాణము వినిపింపరాదు. ధార్మికుడు, శివభక్తుడు, అసూయారహితుడునగు శిష్యునకు మాత్రమే వినిపింపవలెను. ఇట్టివారు కానిచో వినిపింపరాదు.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ఒకటవ అధ్యాయము సంపూర్ణము

---

## రెండవ యధ్యాయము

### మునులు బ్రహ్మతో ప్రసంగించుట

మరల సూతుడిట్లు చెప్పదొడంగెను. పూర్వకల్పముగడిచి శ్వేతవరాహకల్పము ప్రారంభముకాగా, మరల సృష్టినిర్మాణ ప్రారంభ సమయమున సద్వంశజాతులగు నార్గురుమహర్షులు గుమిగూడి వారిలోవారు సంభాషించుకొనుచు, పరబ్రహ్మ ఇదికాదు యిదికాదని నిషేధింపుచు, నేతినేతియను వాక్యముచే నిషేధింపుచు తుదకు నేదియునిర్ణయింప లేక వీరు బ్రహ్మనుగాంచుటకై యేగిరి. భగవానుడగు బ్రహ్మ సురాసురులచే స్తుతింపబడుచుండెను. అట మేరు శృంగసిద్ధ చారణ గంధర్వసేవితమై బహుపక్షిజాల సమేతమై మణివిద్రుమ భూషితమై, నికుంజకందరదరీ గుహానిర్ఝరశోభితమై, నానామృగసమాకీర్ణమై యుండెను. అందుబ్రహ్మవనమును విపినముగలదు. ఆవనము దశయోజనవిస్తీర్ణమై, శతయోజనాయతమై, మధురశీతలతోయంబులు గల పూర్ణసరోవరంబు గల్గి మత్తభ్రమరసంఛన్న రమ్యపుష్పిత పాదంబులు గల్గియుండెను. అట్టివనమందు, తరుణాదిత్య సంకాశమై యొప్పుచున్న మనోహరంబగు పురంబున గలదు. ఆపుర మున్నతమగు స్వర్ణప్రాకారంబులు గల్గి, హేమతోరణంబులచే శోభించుచు ననేకకోట్ల సౌధంబు లాకాశచుంబితములై విరాజిల్లుచు విచిత్ర

గణములచే ప్రకాశింపుచు బలవంతులగు దైత్య దానవులచే సేవింపబడుచు రాజవీధులు రంజింపుచుండ, నాపురమధ్యభాగంబున మహాసౌధంబు లోకపితామహుడైన బ్రహ్మనివసించుచుండెను. ఆబ్రహ్మవాగీశ. దేవర్షి గణసేవితుడు, స్వర్ణతేజస్కుడు, సర్వాభరణభూషితుడు ప్రసన్నవదనుడు, సౌమ్యుడు పద్మపత్రాయతేక్షణుడు దివ్యకాంతిసమాయుక్తుడు దివ్యగంధానులేపనుడు దివ్యశుక్లాంబరధరుడు. దివ్యమాలావిభూషితుడు, సురాసురేంద్ర యోగీంద్ర వంద్యమానపదాంబుజుడు నగు బ్రహ్మను చామరసమప్రభలుగల సరస్వతి కరంబున వింజామరం బాల్చి వీచుచుండ ఆమహర్షులుగాంచి ప్రసన్నవదనేక్షణులై శిరమునఅంజలి ఘటించిసురశ్రేష్ఠుడగు బ్రహ్మనిట్లు స్తుతించిరి.

శ్లో॥ నమస్త్రిమూర్తయేతుభ్యం
సర్గస్థిత్యంతహేతవే
పురుషాయపురాణాయ
బ్రహ్మణేపరమాత్మనే.

2. నమఃప్రధాన దేహాయ
ప్రధానక్షోభకారిణే
త్రయోవింశతిభేదేన
వికృతాయావికారిణే.

3. నమోబ్రహ్మాండ దేహాయ
బ్రహ్మాండోదరవర్తినే
తత్రసంసిద్ధకార్యాయ
సంసిద్ధకరణాయచ

4. నమోస్తు సర్వలోకాయ
సర్వలోకవిధాయినే
సర్వాత్మదేహసంయోగ
వియోగ విధిహేతవే

6. త్వయైవ నిఖిలం సృష్టం
సంహృతం పాలితం జగత్
తథాపి మాయయా నాథ
నవిద్మస్త్వాం పితామహం

1. సృష్టిస్థితి సంహార కారకుడవు త్రిమూర్తి స్వరూపుడవు, పురాణపురుషుడవు, బ్రహ్మాఖ్యుడవు, పరమాత్ముడవునగు నీకు నమస్కారము.

2. ప్రధాన దేహుడవు, ప్రళయ కారకుడవు, త్రయోవింశతి తత్త్వభేదంబులచే జీవులను వికారమునొందించుచు నిర్వికారుడవై యున్న నీకు నమస్కారము.

3. బ్రహ్మాండ దేహుడవు, బ్రహ్మాండోదరవర్తనుడవు, సంసిద్ధ కార్యుడవు, సంసిద్ధ కారణుడవునగు నీకు నమస్కారము.

4. సర్వలోక స్వరూపుడవు, సర్వలోకస్రష్టవు, సర్వాత్ముడవు, దేహ సంయోగ వియోగ కారకుడవగు నీకు నమస్కారము.

5. నిఖిల సృష్టికారకుడవు, సర్వవ్యాపివై జగత్తును పాలింతువు. అట్టి నిన్ను మేము మాయా మోహితులమై తెలిసికొనలేమైతిమి.

అని ఇట్లు మహర్షులు స్తుతింప బ్రహ్మ సంతుష్టుడై మహాభాగులగు నో ఋషులారా! మీరు మహాసత్త్వులును, మహౌజసులునై యుంటిరి. మీరే కారణముచే నిటకేతెంచిన బ్రహ్మవాక్యములు విని వారు వినయాగర్భితులై ప్రాంజలులై ఓభగవంతుడా! మేమంధకారావృతులమై వితండవాదములచే పరమదో తెలియకుంటిమి. నీవు సర్వజగత్స్రష్టవు సర్వకారణకారణుడవు నీకు తెలియని దేదియు లేదు. ఎవడు సర్వజీవపరుడై యుండెను? ఎవడు పురాణ పురుషుడు? విశుద్ధపరిపూర్ణుడు, శాశ్వతుడునగు పరమేశ్వరు డెవడు? ప్రథమమున యీ చిత్ర సృష్టియంతయు నెవనిచే సృష్టింపబడెను? ఇదంతయు మాకు చెప్పి మా సందేహములు బాపుమన,

బ్రహ్మ ఋషివాక్యములు విని విస్మయము నొంది లేచి నిలబడి యొక్క క్షణకాలము ధ్యానస్థుడై యుండి అంతలో మహాదేవా అని పలుకుచు ఆనందపులకితగాత్రుడై ప్రాంజలియై ఇట్లు పలుకదొడగెను.

శివ మహాపురాణ వాయువీయసంహితయందు పూర్వఖండమున
రెండవ అధ్యాయము సంపూర్ణము

---

# మూడవ యధ్యాయము

## నైమిశారణ్యోత్పత్తి

శ్లో॥ యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ
ఆనందం యస్య వై విద్వాన్ న బిభేతి కుతశ్చన

2. యస్మాత్సర్వమిదం బ్రహ్మవిష్ణురుద్రేంద్ర పూర్వకం
సహ భూతేంద్రియైః సర్వైః ప్రథమం సంప్రసూయతే

3. కారణానాం చ యో ధాతా ధ్యాతా పరమకారణః
న సంప్రసూయతే న్యస్మాత్కుతశ్చన కదాచన

4. సర్వైశ్వర్యేణ సంపన్నో నామ్నా సర్వేశ్వరః స్వయం
సర్వైర్ముముక్షుభిర్ధ్యేయః శంభురాకాశమధ్యగః.

5. యో౽గ్రే మాం విదధే పుత్రం జ్ఞానం చ ప్రహిణోతి మే
యత్ప్రసాదాన్మయా లబ్ధం ప్రాజాపత్యమిదం పదం.

6. ఈశో వృక్ష ఇవ స్తబ్ధో య ఏకో దివి తిష్ఠతి
యేనేద మఖిలం పూర్ణం పురుషేణ మహాత్మనా.

7. ఏకో బహూనాం జంతూనాం నిష్క్రియాణాంచ సక్రియః
య ఏకో బహుధా బీజం కరోతి స మహేశ్వరః

8. జీవై రేభిరియాల్లోకా న్సర్వాన్నీశో య ఈశతే
యఏకో భగవాన్ రుద్రో నద్వితీయోఽస్తి కశ్చన.

9. సదాజనానాం హృదయే సన్నివిష్టోఽపి యఃపరైః
అలక్ష్యో లక్షయన్విశ్వ మధితిష్ఠతి సర్వదా.

10. యస్తుకాల ప్రముక్తాని కారణా న్యఖిలానపి
అనంతశక్తి రేవైకో భగవా నధితిష్ఠతి.

11. నయస్య దివసోరాత్రి ర్నసమానో నచాధికః
స్వాభావిక పరాశక్తి ర్నిత్యాజ్ఞాన క్రియేఅపి.

12. యఇదంక్షరమవ్యక్తం యదప్యమృతమక్షరం
తావుభావక్షరాత్మానా వేకోదేవః స్వయంహరః

13. ఈశతే తదభిధ్యానా ద్యోజనా సత్వభావనః
భూయోహ్యస్య వశోగన్తే విశ్వమాయా నివర్తతే

14. యస్మిన్నభాసతే విద్యుత్న్నసూర్యో నచచంద్రమాః
యస్యభాసా విభాతీద మిత్యేషా శాశ్వతీశ్రుతిః

15. ఏకోదేవో మహాదేవో విజ్ఞేయస్తు మహేశ్వరః
నతస్య పరమం కించిత్పదం సమధిగమ్యతే.

16. అయమాది రనాద్యంత స్వభావా దేవనిర్మలః
స్వతంత్ర పరిపూర్ణశ్చ స్వేచ్ఛాధీన శ్చరాచరః.

17. అప్రాకృతవపుః శ్రీమాన్ లక్ష్యలక్షణ వర్జితః
అహం ముక్తో మోచకశ్చ హ్యకాలః కాలచోదకః.

18. సర్వోపరికృతావాసః సర్వావాసశ్చ సర్వవిత్
షడ్విధాధ్వమయస్యాస్య సర్వస్య జగతఃపతిః.

19. ఉత్తరోత్తర భూతానా ముత్తరశ్చ నిరుత్తరః
అనంతానన్త సందోహ మకరంద మధువ్రతః.

20. అఖండ జగదండానాం పిండీకరణ పండితః
ఔదార్య వీర్యగంభీర్య మాధుర్య మకరాలయః.

21. నైవాస్య సదృశం వస్తునాధికంచాపికించన.
అతులం సర్వభూతానాం రాజరాజశ్చ తిష్ఠతి

22. అనేన చిత్రకృత్యేన ప్రథమం సృజ్యతే జగత్
అంతకాలే పునశ్చేదం తస్మిన్ప్రళయమేష్యతి.

23. అస్యభూతాని వశ్యాని అయం సర్వ నియోజకః
అయంతు పరయాభక్త్యా దృశ్యతే నాన్యథాక్వచిత్.

24. వ్రతాని సర్వదానాని తపాంసి నియమా స్తథా
కథితాని పురా సద్భిర్భావార్థో నాత్రసంశయః

25. హరిశ్చాహంచ రుద్రశ్చతథాన్యేచ సురాసురాః
తపోభిరుగ్రైరద్యాపి తస్యదర్శనకాంక్షిణః.

26. అదృశ్యః పతితైర్మూఢై ర్దుర్జనైరపికుత్సితైః
భక్తైర స్తర్చహితైశ్చాపి పూజ్యసంభాష్యఏవచ.

27. తదిదంత్రివిధంరూపం స్థూలంసూక్ష్మంతతఃపరం
అస్మదాద్యైమర్త్యైఃదృశ్యం స్థూలంసూక్ష్మంచయోగిభిః.

28. తతఃపరంతుయన్నిత్యం జ్ఞానమానంద మవ్యయం
తన్నిష్ఠైస్తత్పరైర్భక్తైర్దృశ్యంత ద్వ్రతమాశ్రితైః.

29. బహునాత్రకిముక్తేన గుహ్యాద్గుహ్యాతరంపరం
శివేభక్తిర్నసందేహ స్తయాయుక్తోవిముచ్యతే.

30. ప్రసాదాదేవసాభక్తిః ప్రసాదోభక్తి సంభవః
యథాచాంకురతో బీజంబీజతో వాతథాంకురః.

31. ప్రసాదపూర్వికా ఏవపశోస్సర్వ ప్రసిద్ధయః
సఏవసాధనైర్య రన్తైస్సర్వైరపి చసాధ్యతే

32. ప్రసాదసాధనం ధర్మస్సచదేవేనదర్శితః
తదభ్యాసవశాత్సామ్యం పూర్వయోః పుణ్యపాపయోః

33. సామ్యాత్ప్రసాద సంపర్కో ధర్మస్యాతిశయ స్తతః
ధర్మాతిశయమాసాద్యపక్వః పాపపరిక్షయః.

34. ఏవంప్రక్షీణపాపస్య బహుభిర్జన్మభిఃక్రమాత్
సాంబేసర్వేశ్వరే భక్తిర్జ్ఞానపూర్వా ప్రజాయతే.

35. భావానుగుణమీశస్య ప్రసాదోవ్యతిరిచ్యతే
ప్రసాదాత్కర్మ సంత్యాగః ఫలతోనస్వరూపతః.

36. తస్మాత్కర్మఫలత్యాగాచ్ఛివధర్మాన్వయఃశుభః
సచగుర్వనపేక్షశ్చతదపేక్ష ఇతిద్విధా.

37. తత్రానపేక్షాత్సాపేక్షోముఖ్యః శతగుణాధికః
శివధర్మాన్వయస్సస్యశివజ్ఞాన సమన్వయః

38. జ్ఞానాన్వయవశాత్పుంసః సంసారేదోషదర్శనం
తతోవిషయవైరాగ్యం వైరాగ్యాద్భావసాధనం.

39. భావసిద్ధ్యుపపన్నస్యధ్యానేనిష్ఠానకర్మణి
జ్ఞానధ్యానాభియుక్తస్య పుంసోయోగః ప్రవర్తతే.

40. యోగేనతుపరాభక్తిః ప్రసాద స్తదనంతరం
ప్రసాదాన్ముచ్యతే జంతుర్ముక్తః శివసమోభవేత్.

41. అనుగ్రహప్రకారస్య క్రమోయఉమవివక్షితః
యాదృశీయోగ్యతాపుంస స్తస్యతాదృగనుగ్రహః.

42. గర్భస్థోముచ్యతేకశ్చి జ్జాయమాన స్తథాపరః
బాలోవాతరుణోవాథ వృద్ధోవాముచ్యతేపరః.

43. తిర్యగ్యోనిగతః కశ్చిన్ముచ్యతేనారకోపరః
అపరస్తుపదేప్రాప్తోముచ్యతే స్వపదక్షయే.

44. కశ్చిత్ క్షీణపదో భూత్వాపునరావర్త్యముచ్యతే
కశ్చిదధ్వగత స్తస్మిన్ స్థిత్వాస్థిత్వావిముచ్యతే.

45. తస్మాన్నైక ప్రకారేణనరాణాం ముక్తిరిష్యతే
జ్ఞానభావానురూపేణ ప్రసాదేనైవనిర్వృతిః

46. తస్మాదస్య ప్రసాదార్థం వాఙ్మనోదోషవర్జితాః
ధ్యాయంతశ్శివమేవైకం సదారతనయార్నయః

47. తన్నిష్ఠాస్తత్పరాస్సర్వే తద్యుక్తాస్తదుపాశ్రయాః
సర్వక్రియాః ప్రకుర్వాణాస్తమేవమనసాగతాః.

48. దీర్ఘసూత్రసమారబ్ధం దివ్యవర్షసహస్రకం
సత్రాంతేమంత్రయోగేన వాయుస్సత్రిగమిష్యతి.

ఎవడు వాఙ్మనంబుల కందని పరమాత్మను తెలిసికొని యానందము
నొందునో అట్టిపండితుడెన్నడు దేనికిని భయమునొందడు. ఎవనివలన బ్రహ్మ
విష్ణురుద్రులు, సకలభూతేంద్రియంబులు, ప్రథమంబున జనించినవో, యెవడు
సృష్టికారకులగు బ్రహ్మాదులకు పరమకారణుడో, యెవడులేకున్న సృష్టి
జరుగకుండునో, యెవడుసర్వైశ్వర్య సంపన్నుడో, యెవడు సర్వేశ్వరుడని
చెప్పబడుచున్నాడో, యెవడుముముక్షువులచే ధ్యానింపబడునో, యెవ
డాకాశమధ్యగతుడగు శంభుడో, యెవడున్ను ప్రథమమున పుత్రునిగా
సృజించి విజ్ఞానమొసంగెనో, యెవని ప్రసాదముచే నేను ప్రాజాపత్యపదవినొంది
తినో, యేయీశ్వరుడు వృక్షమువలె స్తబ్ధుడై యాకాశమునం దొక్కడు
నిలిచియుండెనో, యేమహాపురుషునిచే నీసమస్తము నిండియుండెనో, యెవడు
తానొక్కడై సకల జీవులయందుండి సకలక్రియలు సక్రమంబున చేయించు
చుండెనో, బీజరూపుడగు తానొక్కడై, బహుబీజముల సృజింపుచుండెనో,
యెవడు సకలజీవులతోఁ గూడినలోకములను పరిపాలింపుచుండెనో, యెవడు
సదాసర్వుల హృదయములందుండి, గోచరింపకుండెనో, యెవడు విశ్వమందు
దృశ్యాదృశ్యుడైయుండునో, యెవడు కాలాతీతుడో, యఖిలమున కెవడు
కారణుడో, యెవడనంతశక్తిమంతుడో, యెవనికి దివారాత్రంబులు సమా
నాధికంబులుగాని లేవో, యెవని స్వభావము పరాశక్తియో, యెవనిచే నిత్య
జ్ఞాన క్రియలుజరుగుచున్నవో, యెవడక్షర ప్రపంచమున కవ్యక్తుడో, యెవ
డమృతాక్షర స్వరూపుడో, యెవడు క్షరాక్షర స్వరూపుడో, యెవని కాంతి
ముందు, విద్యుత్కాంతులు రవిచంద్రులు ప్రకాశింపవో, యెవని స్వయం
ప్రకాశముచే సూర్యచంద్రాది ప్రకాశవస్తువులు ప్రకాశింపబడుచున్నవో,

అట్టి వాడే, మహేశ్వరుడు, దేవదేవుడు, హరుడు, పశుపతి, రుద్రుడని చెప్పబడుచుండెను. ఎవడు సత్వభావముచే నిట్టి ఈశ్వరుని ధ్యానించెదరో యట్టి వారు ప్రపంచభ్రాంతివీడి ముక్తి నొందెదరు. ఈ మహాదేవు డొక్కడే సకలమునకు నీశ్వరుడు. ఇతనికి మించిన పరమేదియులేదు. ఇతడే ఆద్యంతుడు, నిర్మలస్వభావుడు, స్వతంత్రుడు, పరిపూర్ణుడు, స్వేచ్ఛాధీనుడు, చరాచరుడు, నప్రాకృతశరీరుడు, శ్రీమంతుడు లక్ష్యలక్షణ వర్జితుడు, ముక్తస్వరూపుడు, పాపవిమోచకుడు, కాలరహితుడు, కాలప్రేరకుడు, సర్వలోకములకు నుపరిభాగముననుండువాడు, సర్వహృదయవాసుడు, సర్వులయందుండి సర్వము నెరింగినవాడు. షడ్విధాధ్వమయమగు ప్రపంచమునకు ప్రభువని శ్రుతులు ఘోషించి చెప్పుచున్నవి. ఇతనితో సమానుడు నభూతో నభవిష్యతి. ఇతడనంతానంద సందోహ మకరంద మధువ్రతుడు, సకల బ్రహ్మాండములు, లయముచేయు సమర్థుడు. ఔదార్య వీర్యగాంభీర్యమాధుర్యములకు, మహోదధివంటివాడు. ఇతనితో తుల్యమైనదిగాని, అధికమైనదిగాని లేదు. ఇతడు సర్వభూతములకు సాటిలేనిరాజైయుండెను. ఇతడు ప్రథమమున చిత్రములతో ప్రపంచములను సృజించెను. ఈసృష్టియంతయు ప్రళయకాలంబున నశింపజేయుచుండును. ఇతనికి సర్వభూతములు వశ్యములు. సర్వభూతములను శాసించుచుండును. ఇతడుత్కృష్టభక్తిచేగాని దేనికిచూడబడడు. వ్రతములు సర్వదానంబులు తపోనియమంబులు నీభగవంతుని కనుగొను సాధనములని పెద్దలుచెప్పియుండిరి. బ్రహ్మనగునేను, రుద్రుడు, విష్ణువు, సురాసురులు మొదలగు మేమందరము నాపరమేశ్వరుని కనుంగొనుటకై నేటికి నుగ్రతపంబు చేయుచునేయుంటిమి. పతితులకు కుత్సితులకు మూఢులకు నితడగోచరుడు. భక్తులకంతర్బహిర్భాగములనుండి వారితోసంభాషింపుచు పూజింపబడుచుండును. ఇతడు స్థూలసూక్ష్ముడు. వీటికి పరుడున్నైత్రి విధంబులు గనొప్పుచుండెను. బ్రహ్మనగునేను విష్ణ్వాదిదేవతలు పరమేశ్వరుని స్థూలరూపమును గాంచుచుందుము. యోగులుమాత్రము తమహృదయాంతరాళమున పరమేశ్వరుని సూక్ష్మరూపముగాంచుచుందురు. ఇంకను నిత్యుడు, జ్ఞానస్వరూపుడు, నానందస్వరూపుడు నవ్యయుడునగు నాపరమేశ్వరుని, తపోవంతులు నియమవ్రతులు శివసేవాపరులు, కనుగొనుచుందురు. పరమేశ్వ

రుడు గుహ్యాద్గుహ్యతముడు. శివభక్తులకుముక్తి సందేహములేదు. భక్తియున్నచో శివప్రసాదముకల్గును. శివప్రసాదముకల్గినచో బీజముచే నంకురము నంకురముచే బీజము నుద్భవించినట్లు శివప్రసాదముచేభక్తి, భక్తిచేశివప్రసాదములభించును. జీవులందరికి నీశ్వరప్రసాదముచే సర్వసిద్ధులు కల్గును. శివభక్తిచే సర్వసాధనములు సాధింపవచ్చును. శివునిప్రసన్నుని జేసికొనుటకు ధర్మమేసాధనము. ఇట్టిధర్మము వేదములందు నిరూపింపబడెను. వేదధర్మములెరింగినచో పుణ్యపాపముల తారతమ్యముల నెరుంగుదురు. ఇవి తెలిసికొన్నచో ధర్మాతిశయముకల్గి శివప్రసాదము లభించును. మరియుజీవులు పాపక్షయు లగుదురు. ఇట్లుపాపక్షయులగుచుండు జీవులుకొన్ని జన్మలకుముక్తులగుదురు. సర్వేశ్వరుడగు సాంబునియెడ భక్తికల్గినచో జ్ఞానము సిద్ధించును. తమ భావములబట్టి యీశ్వరప్రసాదముకల్గుచుండును. ఈశ్వరప్రసాదముచే కర్మఫలత్యాగముచేసి శివుడే కాగలడు. అనగా శివసారూప్యము నొందగలడు. వీటిలోగురునియపేక్ష, యనపేక్షయని రెండువిధములు. వీటిలోగుర్వపేక్షయే శతగుణాధికమైయుండెను ఏమన గురువువలన శివధర్మములెరింగి శివజ్ఞానము నొందగలడు. ఇట్టిధర్మములెరింగినచో సంసారదోషములనెరింగి విషయవైరాగ్యములు కలవాడై భావసిద్ధినొంది ధ్యాననిష్ఠుడై కర్మత్యాగికాగలడు కర్మయోగియై జ్ఞానధ్యానములతో కూడినచో యోగికాగలడు. ఇట్టియోగి శివప్రసాదముచే ముక్తినొంది శివసారూప్యమొందును శివానుగ్రహమున కిదియేమార్గము. కొందరు జీవులు గర్భస్థులై యుండగను కొందరుజన్మించియుండగను, కొందరు బాల్యమునను కొందరుతరుణావస్థయందును కొందరు వృద్ధత్వమునందును జ్ఞానులై ముక్తినొందెదరు. కొందరు తిర్యగ్యోనియందుండియు, కొందరు నరకమునందుండియు ముక్తినొందెదరు. కొందరు తమపాపపుణ్యములు క్షీణముకాచినే ముక్తినొందెదరు. కొందరుపుణ్యాత్ములు స్వర్గాదిసుఖంబుల ననుభవింగం. పుణ్యము క్షీణముకాగా మరలభువియందుద్భవించి ఫలాపేక్షలేక పుణ్యకర్మము చేసి ముక్తినొందగలరు. ఇట్లునరులనేక విధంబులుగ ముక్తినొందుచుందురు. ఈశ్వర జ్ఞానము నొందనగాని ముక్తికలుగదు. ఈశ్వర ప్రసాదమునకై వాఙ్మనో దోషముల విడనాడవలెను. నిత్యాగ్నిహోత్రునకట్టి ఫలంబు లభించునో శివభక్తునకట్టి ఫలంబు లభించును. పరమేశ్వరు నాశ్రయించిన వారల

కవశ్యము తత్ఫలము లభించును. గాన మీరు శివునియందు మనసు నిల్పి సర్వక్రియలాచరింపుచు, దివ్యసహస్ర వర్షములు దీర్ఘసత్ర యాగముచేయుడు. సత్రయాగానంతరమున మంత్రయోగముచే వాయువు మీకడకే తెంచి మీకు శ్రేయోదాయకములగు నుపాయంబులు చెప్పగలడు. తదుపరి మీ రుమాసహితుడై విశ్వేశ్వరుడున్న కాశీపురి కేగుడు. అతడు భక్తానుగ్రహ మునకై నాపురియంతయు విహరింపు చుండును. మీరట కేగి యటనున్న సర్వా శ్చర్యములుగాంచి, మరల నాకడకు రండు. అపుడు మీకు మోక్షోపాయమును జెప్పెదను. దీనితో మీకొకజన్మయందే ముక్తి లభింపగలదు. అనేకజన్మసంసార బంధనములన్నియు నశించి యీజన్మలోనే మీకు జన్మ రాహిత్యము కలుగ గలదు. నాచే సృజింపబడిన యీమనోమయ చక్రమును, నేను విడుచు చుంటిని. దీనినేమి మార్గముగ మీరు చని యిది నిలిచినచోట మీరు సత్రయాగము ప్రారంభింపుడని బ్రహ్మ మహర్షులతో బల్కి శివునకు ప్రణమిల్లి, తేజోమయమును నగునదియు మనోమయ మగునదియు, నగుచక్ర మును విడువ, ఋషులు సంతుష్టాంతరంగులై జగత్ప్రభవగు బ్రహ్మకు నమస్క రించి యాచక్రము వెంట వారు జనుదెంచుచుండ, నాచక్రము పోయి పోయి యొకవనమందలి కఠినశిలపై బడియుండ, నిచ్చట తాడనముచే, పెద్దజలా శయ మొకటి యుద్భవించెను. అప్పటినుండియు నావనము మునిపూజితంబగు నైమిశారణ్యమని పేరుజెందెను. నేటికిని నైమిశారణ్యమున చక్రముపడిన తావు చక్రతీర్థమని ప్రఖ్యాతిగాంచియుండెను. ఆప్రదేశమంతయు యక్ష గంధర్వ విద్యాధరసమాకులమై యుండెను. అష్టాదశసాగరములతోగూడిన నవద్వీపములు పురూరవుడేలుచు, నొకానొకప్పుడు విలాసముగ దేవప్రేరి తుడై యూర్వశి కడకేతెంచి ఆమెతోగూడుకొని హిరణ్మయమగు యజ్ఞ శాలకడ కేతెంచి మోహాపరుడై యక్రమంబున యజ్ఞశాలనాక్రమింప ఋషు లిదిగాంచి కోపించి వజ్రతుల్యములగు కుశలచే పురూరవుని వారించిరి. ఈప్రదేశము నందు పూర్వము బ్రహ్మ ప్రజాసృష్టికై గార్హపత్యాగ్ని వేల్చి, సత్రయాగము చేసియుండెను. శబ్దార్థకోవిదులగు ఋషులందరు శక్తిప్రజాక్రియాయోగంబు లచే ధీరులై, నిత్యము వేదవాదంబులుచేయుచు, నల్పబలులను తమపాండిత్య ప్రకర్షలచే జయించుచుండిరి. ఆప్రదేశంబున స్ఫటికమణి పర్వతములనుండి

బయలు వెడలిన యమృతోపమానమైన జలధారలు నిర్మలముగ ప్రవహించుచుండెను. అటనతిమధుర ఫలంబులతో గూడిన మామిడి వృక్షంబులనేకములు గలవు. కాన నీనైమిశారణ్యమంతయు, మునీశ్వరులకు తపోనుకూలంబుగ నుండెను.

**శివ మహాపురాణము నందలి వాయువీయసంహితయందు పూర్వఖండమున మూడవ అధ్యాయము సంపూర్ణము**

---

## నాలుగవ యధ్యాయము

### మునీశ్వరుల కడకు వాయువేతెంచుట

నైమిశారణ్యంబున మునులందరు శంసితవ్రతులై యీశ్వరుని గురించి సత్రయాగము చేయుచుండ నీదీర్ఘసత్రయాగము గాంచి మునులందరు నాశ్చర్యమొందసాగిరి. భూరిదక్షిణలతో జన్నమును సమాప్తము కాగా బ్రహ్మ ప్రేరితుడై వాయువట కేతెంచెను. ఈ వాయువు తనయంగభూతములగు నలుబది తొమ్మిది వాయువులతో గూడుకొని బ్రహ్మశిష్యులైన మునులకడ కేతెంచెను. ప్రతిశరీరమునందీ వాయువులు ప్రాణాద్యవృత్తులను కల్గింపజేయుచుండును. ఈ వాయువులచేతనే సకలభూతశరీరంబులు నిల్చియున్నవి. ఈ వాయువు అణిమాద్యష్టైశ్వర్యములతో గూడుకొని ప్రతిజీవునియందు తిర్యక్స్వభావముగ సంచరింపుచు నాకాశమందు ద్విగుణీకృతుడై స్పర్శశబ్దసమన్వితుడై తేజంబులకు ప్రకృతియై యుండెనని తత్త్వవేత్తలు చెప్పుచుండిరి. దీర్ఘసత్రయాగ మొనర్చిన మహాత్ములందరు తమసన్నిధి కేతెంచిన వాయువునుగాంచి, పితామహ వాక్కులు స్మరించుకొని మిక్కిలి సంతసించి యంబరగతుడగు నావాయువునకెదురేగి నమస్కరించి స్వర్ణసింహానాసీనుజేసి యర్చించి, మునులందరు కుశల ప్రశ్నలచే యభినందించుచుండ నావాయువు వారలగాంచి ఓమునులారా! మీరిచట కుశలములగ నుంటిరిగదా? మీ క్రతువు సక్రమముగ జరిగియుండెనా? సురద్వేషులగు రాక్షసులు మీయజ్ఞమునకు విఘ్నంబులు కల్గించలేదుకదా?

మీ జన్నము ప్రాయశ్చిత్తములు లేకుండ సక్రమంబుగ జరగెనుకదా? దేవతలు పితృదేవతలు సంతుష్టినొందిరికదా? మీరు యథావిధిగ దేవతలను భూ దేవతలను, పితృదేవతలను అతిథులను యర్చించితిరికదా? మీ క్రతువు సంపూర్తి యైనదికదా? ఇక మీ కోరిక యేమియన వారందరు వాయువాక్కులు విని ప్రహృష్ట మానసులై శివుని చిత్తమందుంచి మేమందరము కుశలముగ నుంటిమి. మా క్రతువు సక్రమముగ పూర్తియైనది. మా తపంబులు శాంతముగ జరుగుచున్నవి. మా శ్రేయస్సుల కై నీవిటకే తెంచితివి. మా వృత్తాంతము వినుము. పూర్వమునుండి మేము జ్ఞానవృద్ధికై ప్రజాపతి నుపాసించుచుంటిమి. మే మొకానొకప్పుడు బ్రహ్మను శరణుపొంది పరమకారణుడగు పరాత్పరు డెవరని మేము ప్రశ్నింప పరమకారణుడగు రుద్రుడే యందరికన్న నధికుడు, అతడూహింప శక్యముకానివాడు. యథార్థ స్వరూపుడు. భక్తులనే చూచుచుండును. భక్తిచే శివప్రసాదము, శివప్రసాదముచే మోక్షము సంప్రాప్తించును. రుద్రు డిట్టి వాడు గాన యతనికై నైమిశారణ్యమున దీర్ఘసత్ర యాగము గావింపుడు. అతని ప్రసాదముచే సత్రాంతమున వాయువు మీకడకే తెంచును. అతని ముఖమున మీకు జ్ఞానోపదేశము చేయగలడు. అతనిచే మీకు శ్రేయస్సులు కలుగగలవని యాపరమేష్ఠి బలుక మే మతనిచే ప్రేరేపింపబడి యీ సత్రయాగముచేసి నీరాకకై నిరీక్షింపుచుంటిమి. మేము దివ్యసహస్రవర్షంబులు దీర్ఘసత్రయాగము గావించి నీరాకకై నిరీక్షించుటయే గాని మాకు వేరొండు పనిలేకుండెనన, ఋషుల వాక్కులు వాయువు విని ప్రీతమానసుడై ముని మండలమధ్యంబున నాసీనుడై యుండ నతనింగాంచి భావవివృద్ధికరంబులగు శివగాథలు మాకు వినిపింపుమని కోరిరి.

శివ మహాపురాణము నందలి వాయువీయ సంహితయందు

నాలుగవ అధ్యాయము సంపూర్ణము

# ఐదవ యధ్యాయము

## శివతత్వ జ్ఞానము

సూతుడు మరల నిట్లు చెప్పదొడంగెను. పూర్వము మహాభాగులగు నైమిశారణ్యవాసు లందరు వాయువునకు నమస్కరించి ఓసమీరణా! నీకు ఈశ్వర గోచరమగు జ్ఞానమెట్లు కల్గెను? అవ్యక్తజన్ముడగు శివునిభావము నీకెట్లుకల్గెనో తెల్పుమన వాయువు మహర్షులారా? పందొమ్మిదవ దగు శ్వేతలోహితకల్పమందున చతుర్ముఖ బ్రహ్మ ప్రజాసృష్టికై తపమొనర్ప పితామహుని తీవ్రతపంబునకు మెచ్చి యీశ్వరుడు, దివ్యకౌమార రూపుడై రూపవంతులలో శ్రేష్ఠుడై, శ్వేతమునీశ్వరుడై, దివ్యవాక్కులు పల్కుచు, దేవదేవుడగు నామహేశ్వరుడు దర్శనమొసగ, వేదాధిపతియగు పరమేశ్వరుని పితామహుడు గాంచి నమస్కరించి పరమజ్ఞాన మయమైన గాయత్రిని యతనిచే నుపదేశము నొంది, లబ్ధవిజ్ఞానుడై, విశ్వకర్మయగు నాచతుర్ముఖుడు, స్థావరజంగమాత్మకమగు జగత్తులన్నిటిని సృజించెను. ఈశ్వర ముఖమున శ్రుత్యర్థములన్నియు విని బ్రహ్మ తపోజ్ఞానవంతుడ నైతినన, ఋషులు వాయువాక్కులువిని, నీవట్టి జ్ఞానము నొందితివి? దానియంతరువు లెట్టివి? ఎక్కడ తపంబుచేసిన, నట్టి నిష్ఠ కుదురును? పరమార్థ సుఖమును కోరువారేమి చేయవలయును? చెప్పుమన, వాయువు మహర్షులారా! పశుపతి జ్ఞానము నే నెట్లుపొందితినో మీకు చెప్పెద వినుడు. సుఖములు కోరువారు పరమాత్మ నిష్ఠులై యుండవలెను, అజ్ఞానోత్పన్నమగు దుఃఖము జ్ఞానముచే నివర్తించును. జ్ఞానము వస్తు పరిచ్ఛిన్నము యపరిచ్ఛిన్నము యని రెండు విధంబులుగ చెప్పబడెను. వస్తువు అజడము, జడము, నియంతయుని, మూడువిధంబులు. మరియు, పశువు, పాశము, పతి యని త్రివిధంబులుగ చెప్పబడుచుండెను. అక్షరమనియు, క్షరమనియు, క్షరాక్షరమనియు కూడ చెప్పబడుచుండెను. వీటినే తత్వవేత్తలు, త్రితయమని పల్కియుండిరి. వీటిలో నక్షరమనగా పశువు, అనగా జీవుడు, క్షరమనగాపాశమని యర్థము, క్షరాక్షరముల కన్నపరుడే పశుపతియని వాయువు పలుక, ఓమారుతా! క్షరమనియు, నక్షరమనియు, పరుడనియు మాకేవో చెప్పితివి. అవిమాకు విపులముగ తెల్పుమన వాయువు మునులారా! ప్రకృతియే క్షరము

పురుషుడే యక్షరము, ఈ రెండింటిని ప్రేరేపించుచు పరముగా నుండువాడే, పరమేశ్వరుడని చెప్పబడుచున్నాడన, మహర్షులు ఓమారుతా! ప్రకృతి పురుషులన నెట్టివారు? వీరిరువురకు గల సంబంధమేమి? ఈశ్వరుడు వీరల నెట్లు ప్రేరేపించెనన, మాయయే ప్రకృతి, మాయతోగూడిన వాడే పురుషుడు, కర్మబంధములే వీరికి మూలకారణము. వీరికి నీశ్వరుడే ప్రేరకుడని వాయువు పలుక, మాయయన నెట్టిది? మాయావృతు డెట్టి స్వరూపుడు, మూలకారణ మననేమి? శివుడెవరు? శివతత్వ మనగానేమి? యని, ఋషులు బలుక, శివశక్తియే మాయ. ఈమాయ చిద్రూపమున కావరికమై యుండెను, ఈమాయాచ్ఛాదకుడే విశుద్ధ పరమాత్ముడగు శివుడని వాయువు పలుక ఏకారణముచే మాయ పురుషు నావరించియుండెను. పురుషు డీమాయ నెట్లు దాటగలడు?

జ॥ పరమేశ్వరు డెన్నికళలతో గూడినను నేటికిని మాయావృతుడై యుండెను. మాయచే కర్మభోగములకు హేతువు, మాయనశించినతరి కర్మలు నశించును.

ప్ర॥ కళలన నెట్టివి? కర్మలకాది యెట్టిది? కర్మఫలమెట్టిది? ఫలము దేని నాశ్రయించి యుండును? ఎవనిచే భోగము లనుభవింపబడును? భోగములన నెట్టివి? భోగసాధనము లెట్టివి? మలక్షయ మెట్లుకల్గును? ఏవిధంబున పురుషుడు క్షీణకులుడగును?

జ॥ కళావిద్యారాగంబులు కాలముచే నియమింపబడెను. కళతో గూడినవాడే భోక్తయగు పురుషుడన బడుచున్నాడు. పుణ్యపాపకర్మంబులే, సుఖదుఃఖము లొసంగును. అనాదిమలముచే నజ్ఞానమావరింపు చున్నది. కర్మ నశింపదు. పంచేంద్రియముల ద్వారా శరీరముచే భోగములనుభవింప బడును. భగవంతు నాశ్రయించినచో పాపక్షయ మగును, పాపము క్షీణింపగనే పురుషుడు శివతుల్యు డగును.

ప్ర॥ కళాది పంచత్వములకు వేరువేరు కర్మలెట్లు జరుగును? భోక్త యనగానెవడు?

పురుషుడన నెవడు? ఎవనిచే నాత్మప్రసిద్ధి నొందెను? ఆత్మయన నెట్టిది? అవ్యక్తమన నెట్టిది? భోక్తయాకార మెట్టిది? ముక్తికి నెవనిని శరణుపొంద,వలెను?

జ॥ పురుషునకు జ్ఞానోత్పత్తిని కలుగజేయునదిశక్తి. అదియేవిద్య. క్రియలనుపరోక్షముగ తెలుపుచుచేయునది కళయనబడును. విద్యకు కళయేఆచ్ఛాద

నము. దీనికి దేవశక్తి నియంతమైయుండెను. అవ్యక్తమగు కారణము త్రిగుణముగా వ్యక్తమయ్యెను తత్త్వచింతకులు దీనికంతకు ప్రధానము ప్రకృతియని చెప్పు చుండిరి. ఈకళలు వ్యక్తావ్యక్తములుగ నుండును. ఈకళలచే సుఖదుఃఖమోహము లనెడుత్రిగుణంబుల ననుభవించుచుండును. ప్రకృతివలన సత్త్వరజస్తమోగుణంబులుజనించెను. ఈత్రిగుణంబులు తిలలయందు తైలంబువలె ప్రకృతియందు లీనమైయుండును. సుఖాదులే సత్త్వమనబడును. దుఃఖహేతువులే రాజసమనబడును. ప్రవృత్తి, నివృత్తిశూన్యమగు మోహము తామసమనబడును. సాత్త్వికముచే నూర్ధ్వగతి గల్గును. తామసముచే నధోగతి సంభవించును, రాజసంబుచే మధ్యగతి ప్రాప్తించును. భూతపంచకము, తన్మాత్రలైదు, జ్ఞానేంద్రియంబులైదు కర్మేంద్రియములైదు, మనోబుద్ధ్యహంకారచిత్త చతుష్టయంబులతోగూడిన యవ్యక్తుడగు పరమాత్ముడు, వికారియని చెప్పబడుచున్నాడు. ఈదశను పొందిన దో నవ్యక్తుడన బడుచుండెను. మృత్తికచే ఘటము తయారయినట్లు పంచభూత తత్త్వములచే శరీరము నిర్మింపబడు చున్నది. మృత్తిక కన్న ఘటము వేరు కానట్లు, వ్యక్తావ్యక్తములకు భేదములేదు. గాన, కార్యకారణములే యవ్యక్తమని చెప్పబడుచున్నది. దీనికిశరీర మాధారము, భోగ్యమునై యుండెను.

ప్ర॥ బుద్ధీంద్రియంబులు శరీరముకన్న భిన్నములైనవా? కావా? ఆత్మ శబ్దము యథార్థముగ దేనియందుండెను?

॥జ॥ బుద్ధీంద్రియంబులకంటె శరీరము వ్యతిరిక్తమైనది. ఆత్మఇట్టిదని తెలిసికొనుటకు, కఠినములగు కారణములుగలవు, బుద్ధీంద్రియశరీరము లాతని కావనిబుద్ధిమంతులు జెప్పియుండిరి. స్మృతులయందు కూడ నాత్మ ఇట్టిదన్న నిరూపింపలేకుండెను. అది వేదచక్షుర్గోచరమేగాని, చర్మచక్షుర్గోచరముకాదు. వేదములయందు, వేదాంతములయందు పరమాత్ముడంతర్యామి యని చెప్పబడెను. సర్వమునందు పరమేశ్వరుడు, పరమేశ్వరునియందు సర్వము వ్యాపించియుండెను. ఐనను ఏఒక్కనికి యెన్నడు గోచరింపడు, ఈపరమాత్మ, చక్షువులకగోచరుడు, ఇంద్రియములకగపడడు. ప్రదీప్తమనస్కులకితడు వశుడైయుండును. ఇతడు స్త్రీపుంనపుంసకుడు గాడు. ఊర్ధ్వాధస్తిర్యగ్భాగములుగాడు, నియమస్థానములేదు, సకలశరీరములయందున శరీరుడై, స్థాణువై, యవ్యయుడై సంచరింపుచుండును. ధీరులగు మనుజులు విమర్శించగా, విమర్శించగా సదా

గాంచగలరు. బహువాక్యములు పలుక నేల? యీపరమాత్మ దేహముకన్న భిన్నుడు, సర్వముపరమాత్మయేయని వేరుభావనలేక గాంచువానికి, దర్శనమిచ్చుచుండు ను. ఈశరీరము యీపురుషునికన్నను పరమైనది, ఈపరమాత్మకు, అశుచిగాని వశములేకుండుటగాని దుఃఖముగాని యెన్నడునుండదు. దేహము ఆపక్బీజము లకు, మూలకారణము. దేహి తనకర్మలచే, సుఖదుఃఖము లనుభవించు చుండును, జలముచేతడుపబడిన క్షేత్రము బీజమును జనింపజేసినట్లు, యజ్ఞానజల ముచేతడుపబడిన దేహము జన్మాంకురముల నభివృద్ధి పరచును. ఈజన్మలయం దేయు సుఖములులేవుసరికదా యవియునంతముగు సుఖదుఃఖముల కాలయ మైయుండును. చివరకు మృత్యువు పాలగును. దేహములకతీతానాగతుల నెడి, తనయు లనేకులుగలరు. ఈశరీరము, జీర్ణింపగనే మరియొక శరీరము నొందు చుండును. ఏ దేహమునందును జీవుడుస్థిరముగానుండడు, జీవుడుశరీరముచే గప్పబడి మేఘావృత చంద్రునివలె నొకప్పుడు ప్రకాశకుడుగను మరియొకప్పు డప్రకాశకుడుగను గన్పట్టుచుండును. జీవుడనేక దేహముల నొందుచుండుటచే నాశ్చర్యవృత్తులు, భిన్నములుగనుండును. స్వర్ణముద్ర లనేకములుగనున్నను, స్వర్ణ మొకటియగునట్లు దేహములు వేరైనను జీవుడొక్కరూపముతోడనే యుం డును. పధికులతోసంయోగమెట్లో భార్యాపుత్రబంధు సంయోగముకూడ నట్లే. సాగరంబున రెండు కాష్ఠంబులు కలసి మరలవేరగునట్లు జీవుడుబంధువు లతోకలిసినట్లుండి, విడిపోవుచుండును. జీవుడుశరీరమునుగాంచుచుండునుగాని, దేహముజీవుని గాంచలేకుండును, ఈజీవశరీరము లిరువురు పరమునుగాంచు చుండురుగాని పరమువీరలగాంచదు, బ్రహ్మమొదలుకొని స్థావరాంతమువరకు గలజీవులు పశువులనబడుదురు. సుఖదుఃఖభోగులగు జీవులందరు పాశబద్ధులగు చుందురు, ఇదంతయు, నీశ్వరలీలయని పండితులు జెప్పియుండిరి. అజ్ఞులుశరీరమే యాత్మయని సుఖదుఃఖములనుభవింపు చుందురు, జీవు డీశ్వరప్రేరితుడై స్వర్గ మునకుగాని, నరకమునకుగాని పోవుచుండును, అనియీవిధంబున వాయువు బలుకమునీశ్వరులందరు ప్రీతమానసులై, శైవాగమవిచక్షణుడగు వాయువునకు నమస్కరించి ఇట్లు పలుక జొచ్చిరి.

శివ మహాపురాణము నందలి వాయవీయసంహితయందు
ఐదవ అధ్యాయము సంపూర్ణము

---

# ఆరవ యధ్యాయము

## శివతత్వము

మునులు మరల వాయువు నిట్లు ప్రశ్నించిరి. ఓవాయుదేవా! పశువులన నేమియో పాశము లన నెట్టివో తెల్పుము. ఇక పరికర పలక్షణము డగు పశుపతి యెవ్వఁడో తెల్పుమన, నతఁ డిట్లు చెప్పదొడంగెను. అనంతర మణీయ గుణాశ్రయుఁడు, విశ్వపతి, జగన్నిర్మాత, ఇట్టివాఁడే పశుపాశవిమోచకుఁడు. ఇతఁడు లేనిచో సృష్టియే జరుగదు. పశుపాశములు రెండు నజ్ఞానజనితములై, చేతనాచేతనములై యున్నవి. ప్రధానములైన పరమాణువు లన్నియు నచేతనములైనవి. చేతనసంబంధము కుదురుట లేనిచో స్వయంకర్తృత్వ ముండదు. ఈజగత్తు సాపేక్షమై యుండెను. కర్తలేనిచో జగత్సృష్టి జరుగదు. ప్రతికార్యమునకు కర్త యవసరముకదా? వీటన్నిటికి కర్త యీశ్వరుఁడు. పశుపాశములు కర్త్రాధీనములు. ఈశ్వరప్రేరణచే జీవులు కర్త లగుచుందురు. అంధు డితరసహాయము లేక నడువలేనట్లు జీవు డీశ్వరసహాయము లేక నేపనియు చేయలేడు. పశుపతి ననుసరించి పశువులు సంచరింతురు. ఆత్మ జీవునకంటె భిన్నము గాదని భావించి ఆత్మోపాసన చేసినచో భ్రమరకీటకన్యాయముగ తానే ఆత్మయై అమృతత్వము నొందగలఁడు. పశుపాశములకు పశుపతికి అంతర మిదియే. బ్రహ్మజ్ఞానులిది యెఱింగి యోగముక్తు లగుదురు. క్షరాక్షరములు రెండు వ్యక్తావ్యక్తములుగ నుండ పరమేశ్వరుఁడు విశ్వాధారుఁడై విశ్వవిమోచకుఁడై యుండెను. భోగ్యము, భోక్తా, ప్రేరకుఁడు ననుమూఁటిని తెలిసికొన్నచో నిక తెలియదగినవిషయమే యుండదు.

శ్లో॥ తిలేషువా యథా తైలం దధ్నివా సర్పిరర్పితం
యథాపఃస్రోతసి వ్యాప్తా యథారణ్యాంహుతాశనః.

తిలలయందు తైలమువలెను, దధియందు ఘృతమువలెను, ప్రవాహమునందు జలమువలెను అరణియం దగ్నివలెను, తనఆత్మయందు విలక్షణరూపుఁడై పరమేశ్వరు డుండును. సత్యము సత్యమైన తపంబుతో నుండినచో నాపరమేశ్వరుని గనవచ్చును. ఈపరమేశ్వరుఁ డొకఁడు నైంద్రజాలికునివలె సర్వము

వశము చేసికొని, తనశక్తిచే సర్వము తన స్వాధీనము నందుంచుకొని సర్వమునకీశుడై యుండెను. ఇంతకు కారణము రుద్రుడొక్కడే కాని మరొకడు లేడు. ఈరుద్రుడు సృష్టిస్థితిలయములు చేయుచుండెను. ఇతనికి విశ్వమే చక్షువులు. విశ్వమే ముఖము. విశ్వమే బాహువులు. విశ్వమే పాదములు. ద్యావాపృథువుల నితడొక్కడే సృజించెను. సకలదేవతలను కూడ నితడే సృష్టించి రక్షింపుచుండెను. ఇతడు దేవతలకన్న ముందుగా బ్రహ్మను సృజించెను. ఇతడు విశ్వముకన్న నధికుడని శ్రుతులు మహర్షులు చెప్పియుండిరి.

"యో వై బ్రహ్మాణం విదధాతి పూర్వం॥

యో దేవానాం ప్రథమం పురస్తాద్విశ్వాధిపో రుద్రో మహర్షిః అను శ్రుతిప్రకారమిదంతయు పరమేశ్వరుని సృష్టి. బ్రహ్మాది దేవత లందరు నితనివల్లనే జనించిరి. ఇతడే మహాపురుషుడు అమృతస్వరూపుడు, అచలుడు, ఆదిత్యవర్ణుడు. తమస్సుకంటె పరుడు ప్రభువు. ఈ పరమాత్మునికంటె నధికుడు, స్థూలుడు, సూక్ష్ముడు లేడు. ఇతనిచే సర్వజగత్తులు నిండియుండెను. ఇతడు సర్వాననశిరోగ్రీవుడై, భూమ్యంతరిక్షములు వ్యాపించి యశ్వత్థమువలె శాఖాబాహువులు గల్గి, సర్వత్ర యక్షిశిరోముఖంబులుగల్గి, సర్వత్ర శ్రుతులు గల్గి సర్వము వ్యాపించి విరాడ్రూపుడై యుండెను. మఱియు నితడు సర్వేంద్రియగుణాభాసుడు. సర్వేంద్రియవర్జితుడు నై యుండెను.

సర్వజీవులకు ఈశానుడే ప్రభువు. ఈప్రభువు నేత్రములు లేకుండగనే గాంచును. శ్రోత్రములు లేకుండగనే వినును. ఇతడు సమస్తమును తెలిసికొనును గాని, యితనిని తెలిసికొనువా రెవరును లేరు. అట్టి వాడే పరమపురుషుడు. ఇతడు అణువులో నణువు. మహత్తులో మహత్తునై యుండెను. ఇతడవ్యయుడు. ఇట్టి పరమేశ్వరుడు జీవులహృదయాంతరాళముల వసించుచుండును. మఱియు నితడు యేకోరికలు లేనివాడు. యజ్ఞస్వరూపుడు. మహిమాతిశయాన్వితుడు. ధారణపోషకుడు. వీతశోకుడు. ఈశ్వరుడునై యందరిని గాంచుచుండును. ఇతడజరుడు. పురాణపురుషుడు. సర్వగుడు. విభుడు. జన్మనిరోధములు లేనివాడని బ్రహ్మవాదులు పలికి యుండిరి. ఇతడొక్కడై యుండి ముల్లోకముల సృజించెను. ఈమహేశ్వరుడు విశ్వమున

కాదిర్యై విశ్వస్రష్టయై యుండెను. మరియు నితడు విశ్వాధారకుడు. అజుడు. సేవ్యుడు. చిత్రాకృతుడు. పరుడు.

"అజామేకాంలోహితకృష్ణశుక్లాః" అను శ్రుతిప్రకారము సత్వరజస్తమో గుణము లనెడి లోహితకృష్ణశుక్ల, వర్ణాత్మకుడు. ఇత డందరిని యుద్ధరింప జేసి యందరియందు తా నుండి సర్వము ననుభవించుచుండును. ద్వాసుపర్ణాస యుజాసఖాయా, అని శ్రుతిప్రకారము జీవుడు పరమాత్మ యను వీరిరువురు దేహావృక్షమునందు చెలిమితో కూడియుందురు. వారిలో జీవుడు కర్మఫలముల ననుభవించుచుండును. పరమాత్మ సాక్షియై గాంచుచుండును. ఈసంసారవృక్షమందు జీవుడు మగ్నుడై భోగము లనుభవించుచును మోహముచే దుఃఖించుచుండును. జీవుడు నిర్మలుడై పరమాత్మను ధ్యానించినచో పరమకారణు డగు పరమేశ్వరుని గాంచి దుఃఖరహితు డగును. ఆతనికృపచే విగతశోకుడై, సుఖము నొందగలడు. ఈపరమాత్ముడు వేదములు, యజ్ఞములు క్రతువులు భూతభవిష్యద్వర్తమానములు మాయతో గూడిన విశ్వమును సృజించి అందు తానుండి మాయకు పరుడై యుండును. ప్రకృతియే మాయ. మాయానియంత పరమేశ్వరుడునై యుండెను. జగత్తంతయు పరమేశ్వరుని యవయవములతో వ్యాపించి యుండెను, సూక్ష్మాతిసూక్ష్ముడగు పరమేశ్వరుడు జీవోత్పత్తికి గర్భమందు కరుడుగట్టి యుండును. ఇతడు ప్రపంచసృష్టికర్తయై యున్నను, గర్భమధ్యమందు మావిచే కప్పబడియుండును. శివుడే జీవుడు. జీవుడే శివు డని తెలిసికొన్నవా డత్యంతశాంతి నొందగలడు. ఇతడే ప్రభువు. కాలుడు, విశ్వరక్షకుడు, విశ్వాధిపతి యని గ్రహించినవాడు, మృత్యుపాశవిముక్తుడగును. ఇతడు సూక్ష్ముడు. సూక్ష్ముడనగా నేతికంటె పరమగు మీగడవలె నుండును. ఇవ్విధంబున గూఢముగ సర్వదేహములయందు పరమేశ్వరు డుండును. పెరుగు మథించి మథించి వెన్నను తీసి కాచినగాని నేయి రానట్లు ఈశ్వర ధ్యానముచే మనసును మథించిన గాని పరమేశ్వరుడు బైటపడడు. ఇతడు దివసస్వరూపుడు గాడు. రాత్రిస్వరూపుడును గాడు సత్తుడు గాడు. అసత్తుడు గాడు. సదసత్తూను గాడు. ఇతడు కేవలము పురాతను డగు ప్రజ్ఞాస్వరూపుడు. ఇంకను దీర్ఘుడు గాడు హ్రస్వుడు గాడు. తిర్యక్కు గాడు. ఇతని

నెవడు నందుకొన జాలడు. ఇతనితో తుల్యు డెవడును లేడు. ఇతనితో సమాన మగు ప్రతిభగాని, యశంబుగాని, విగ్రహముగాని యెచటను లేదు. భస్మభీరువు లగు కొందరు వృద్ధులు యితడొక్కడే, యజాతు డని చెప్పుచుండిరి. జగద్రక్షణార్థమై రుద్రుడు దక్షిణముఖము ధరించెను. వానివంబునకు పైని ద్వ్యక్షుర మైనబ్రహ్మ కలడు. అతడే యనంతుడు. పరాత్పరుడు. ఇతనియందు విద్యావిద్యలు గూఢముగ నున్నవి. క్షరము అవిద్య యనియు, నక్షరము అమృతస్వరూప మగునదియు విద్య యనియు చెప్పబడెను. వీటికి ప్రభువు మహేశ్వరుడే గాని యన్యుడు లేడు. వీటిలో నవిద్యచే సంసారమునందు భ్రమించుచుందురు. విద్యచే ముక్తు లగుదురు. ఈపరమేశ్వరు డొక్కడే యుండి యనేకబ్రహ్మాండములను సృజించి వీటికి తానధిపతియై యుండెను.

ఇతడు స్వయంప్రకాశుడై యూర్ధ్వతిర్యగధో భాగంబులను ప్రకాశింపజేయుచుండెను. ఇతడొక్కడు స్వభావముగ వాచ్యవాచకస్వరూపుడై, భోజ్యుడై, భోక్తయై సర్వగుణంబులతో సర్వము వ్యాపించియుండెను. పరాత్పరు డగు నీబ్రహ్మ విషయ మంతయు గుహ్యోపనిషత్తునం దుండెను. పూర్వమీబ్రహ్మయందే జగత్తు లన్నియు జనించిన వని మహర్షులు పల్కియుండిరి. ఈవిషయ మంతయు భావగ్రాహ్యమై మనీషాఖ్యమై భావభావమైకర మంగళప్రదమై యుండెను. పరమేశ్వరుడు షోడశకళాపరిపూర్ణు డని తెలిసికొని మహనీయులు ముక్తి నొందుచుండిరి. కొందరు విమోహితులు కాలముచేతను స్వభావముచేతను నిదంతయు జరుగుచుండె నని తలంచుచుందురు. పరమేశ్వరునిమహిమచే జగత్తంతయు నజ్ఞానముచే భ్రమించుచుండెను. ఇతనికళలు కాలాత్మకమై ప్రపంచమంతయు వ్యాపించి యుండెను. ఈపరమేశ్వరునిచేతనే జీవులందరు కర్మప్రేరితులై సంచరింపుచుందురు. శుభమును కోరువారు భూరికర్మలు చేయుచు, ఫలము పరమేశ్వరార్పణము చేసి విరక్తులై యుండవలెను. ఈతత్వముతో యోగమభ్యసింపవలెను. పంచభూతములు, త్రిగుణంబులు విద్యావిద్యలు, కాలము. అష్టమూర్తులు స్వభావములతో ప్రపంచమంతయు వ్యాప్తమైయుండెను. గుణానుసారముగ కర్మలారంభించి. కర్మానుసారముగ చేయుచుందురు. సత్వప్రధానులు కర్మక్షయము చేసికొని ముక్తినొందెదరు. భోక్తృభోగంబు లన్నియు స్వభావంబుగ జరుగుచుండును. పరమపురుషుడు

త్రికాలాతీతుడు అకలుడు. నిర్గుణుడు. సర్వవేత్త. త్రిగుణాధీనుడు. పరాత్పరుడు నగు శివుడే విశ్వరూపుడు. భవుడు. స్తుతిపాత్రుడు. ప్రజాపతి. దేవదేవుడు. జగత్పూజ్యుడు సచ్చిదానంద స్వరూపుడునై యుండెను. ఎవడు కాలముచే ప్రపంచచక్రము త్రిప్పుచుండెనో. ఎవడు ధర్మరక్షకుడై యుండెనో. ఎవడు పాపములను పోగొట్టుచుండెనో. అట్టివాడే భోగేశుడు, విశ్వధాముడునై యుండెను.

ఇతడు ప్రభువులకు ప్రభువు. దేవతలకు పరమదేవత. పతులకు పతి. పరముకంటె పరుడు. సగుణనిర్గుణ స్వరూపుడు. భువనేశ్వరుడునై యుండెను. ఇతనికికార్య కారణములులేవు. జగత్తులయందితనితో సముడు గాని అధికుడు గానిలేడు. ఇతనికి పరశక్తి గలదని శ్రుతులుజెప్పుచున్నవి. ఇతడు జ్ఞానబలక్రియా శక్తులచే నీవిశ్వమంతయు సృజించెను. ఇతనికి పతిలేడు. ఎచిహ్నములు లేవు. ఇతడుకారణములకు కారణుడు. అధిపులలో నధిపుడు. ఇతడొకపుడును జన్మింపడు. సర్వజన్మలకు నితడే కారకుడు. సర్వజీవులయందు నితడు గూఢముగ వ్యాపించి యుండెను. ఇతడు సర్వభూతాంత రాత్ముడు. ధర్మాధ్యక్షుడు. నిర్గుణుడు. సకలభూతాంత రాత్ముడు. సాక్షీభూతుడునై యుండెను. ఇతడొక్కడై సకలభూతముల యందు సంచరింపుచుండును. ఇతడు నిత్యులలో నిత్యుడు. చేతనులలో చేతనుడునై, యొక్కడై, బహురూపుడై, యకాముడై, కామములకుప్రభుడై, సాంఖ్యయోగాదిగమ్యుడై, జగత్పతియై, కారణుడై యుండెను. ఇట్టి పరమేశ్వరుని తెలిసికొన్నవారో పశుపాశ విముక్తులగుదురు. ఇతడు విశ్వకర్త. విశ్వయోని. కాలకర్త. అగుణుడు. ప్రధానుడు. క్షేత్రజ్ఞుడు. పతి గుణేశుడు. పాశమోచకుడు. ఇతడు స్వయముగ బ్రహ్మనుసృజించెను. ఇట్టిదేవుని నే నాత్మబుద్ధి ప్రసాదముచే తెలిసికొంటిని. ప్రపంచమందు ముముక్షువు లితనిని శరణుపొందుదురు. నిష్కళుడు. నిష్క్రియుడు. శాంతుడు, నిరవద్యుడు. నిరంజనుడు. అవధిలేని అమృతస్వరూపుడు. దుఃఖదారువులకు అగ్నితుల్యుడు నగు నితడు కొలిమితిత్తిలో వాయువు దాగినట్లుగ జీవులయందు దాగియుండెను. ఇట్టిశివుని తెలియనిచో దుఃఖముల కంతమేయుండదు. మహర్షులు తపః ప్రభావముచే నితనియనుగ్రహము బడసిరి. ఈశివజ్ఞానము యత్యాశ్రమ మందు సుస్థిరముగా నుండును. ఇదంతయు, పురాతన కల్పమందు నుపనిషత్తుల యందు

గుహ్యాముగ నుండెను. నాభాగ్యవశముచే బ్రహ్మదేవుడు నాకిదంతయు చెప్పి యుండెను. ఈయుత్తమ జ్ఞానము నప్రశాంతులకీయరాదు. మరియు, బ్రహ్మ విద్య పుత్రులు కాని వారలకు శిష్యులుకాని వారలకు నీయరాదు. దేవీభక్తులకు. గురుభక్తులకు, శివభక్తులకు దీనిని తెల్పవలెను. ఈశివుడే ప్రళయకాలంబున సర్వము లయింపజేసి సృష్టికాలమున సృజించుచుండును. ప్రకృతికంటె పరుడు శివుడని నీకు సంక్షేపముగ జెప్పియుంటిని.

శివమహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ఆరవఅధ్యాయము సంపూర్ణము.

---

# ఏడవ యధ్యాయము

## కాలమహిమ

మరల ఋషులువాయువు నిట్లు ప్రశ్నించిరి. కాలముచేతనే సర్వము జనించి యందేలయమగుచున్న దికాదా? కాల మొకప్పుడును నితరాపేక్షనొందదు. సంసారమండలముతో కూడిన విశ్వమందు కాలమంతర్గతమైయుండును. ఇదిసృష్టి, లయముచేయును చక్రమువలె పరిభ్రమించుచుండును. బ్రహ్మవిష్ణు రుద్ర సురాసురులైనను యీకాలమును నతిక్రమింపలేరు. వారినికూడనీకాలమే సృజించి లయమొందించుచుండెను. ఈకాలము భూతభవిష్యద్వర్తమానంబులను పేరుతో జీవులకు జన్మజరామరణంబులు కల్గించుచుండును. ఈకాలము అన్నింటికి తానే ప్రభువై యతిభయంకరస్థితిని కల్గింపుచుండును. దీనికివశులగు వారెవరు, వశముకానివారెవరో తెల్పుమన వాయువిట్లు చెప్పదొడంగెను.

ఈశ్వరుడు కళాకలితవిగ్రహుడుగానీ నీకాలమును చరాచరములేవియు దాటజాలవు. కళాకాష్ఠనిమిషంబులు మహేశ్వరుని తేజంబులని చెప్పబడెను, ఈకాలమునకు యీశ్వరనియమనముచే విశ్వనియామకమగు బలముకల్గెను. మహాత్ములీకాలమునుదాటి, ముక్తి నొందెదరు. ఇది యీశ్వరునుండి వెలు

వశీ యందరికన్న సర్వశ్రేష్ఠముగ ప్రవర్తింపుచుండెను, దీనికి విశ్వము మైశవ యున్నదిగాని, విశ్వమునకు కాలము వశముగాదు శివునకుమాత్రము కాలము వశమగును. కాలమునకు మాత్రము శివుడు వశుడుగాడు. కాల మప్రతిహతి మైనది. శర్వ తేజముచె ప్రతిష్ఠింపబడెను. కాలముదాట శక్యము కానిది. దీని ప్రజ్ఞ కడుకఠినమైనది. దీని నుల్లంఘింప సమర్థు లెవరును లేరు. కాలము ననుసరించి యేకర్మలు జరుగుచుండును. దాని నడ్డుకొను వా రెవరునులేరు. ఏకచ్ఛత్రాధిపతియై, లోకము లన్నిటి నేలుచున్నను, కాలమునకు వశుడుగాక తప్పదు, ఎట్టి పరాక్రమవంతుడైన సాగర వేల దాటనట్లు, కాలమును దాటలేడు. ఇంద్రియములను జయించి, జగత్తును జయించినను, కాలమును మాత్రము జయింపలేడు. కాలమే జయించును. ఆయుర్వేదమంతయు పఠించి, రసాయనము లెన్ని సేవించినను, కాలమును దాటి మృత్యువును జయింప లేడు. ఐశ్వర్యముగల్గినను, రూపశీలములున్నను, సత్కు లసంజాతుడైనను కాలమును జయింపలేడు. వారొకటి తలచిన తానొకటి చేయుచుండును. ప్రియమైనవారితో సంయోగములుగల్గినను, యచింత్యవస్తువులు ప్రాప్తించి నను, కాలము వియోగములు మాత్రము కల్పించుచునేయుండును. ఒకప్పుడు దుఃఖము నొకప్పుడు సుఖము నేదో కారణముచే కల్గించుచుండును. కాలస్వభా వముమాత్రము తెలియశక్యము కానిది. ఇది యొక విచిత్రము. కాలముచే నొకప్పుడు యువకుడై, మరొకప్పుడు వృద్ధుడై, ఇంకొకప్పుడు బలవంతుడై మరియొకప్పుడు దుర్బలుడై, ఒకప్పుడు శ్రీమంతుడై యొకప్పుడుదరిద్రుడై, చిత్ర గతులనొందు చుండును. కులహీనుడైనను, బలహీనుడైనను, శీలవంతుడుగాకు న్నను, నిపుణుడుగాకున్నను కాలముకలిసినచో సకలపనులు నిరభ్యంతరము గ నెరవేరును. సహాయులైనను జాతులైనను గీతవాద్యవినోదకుడైనను అనాథు డైనను పరులకన్న మిడినను, వీరియందెట్టి భేదముజూపక, కాలము సమవర్తి యైయుండును. కాల మనుగ్రహించిన నో, రసాయనములు ఫలించును. ఔష ధములు తప్పక పని చేయును. సర్వాసిద్ధులు సిద్ధించును. సర్వసుఖములు చేకూరును. కాలము సరిగ లేకున్నచో పుష్టిని పొందడు. పుట్టను పుట్టడు చావను చావడు. సుఖము నొందడు. దుఃఖమునొందడు. సమస్త వస్తువులు కాలము చేతనే సిద్ధించుచున్నవి. కాలముచేతనే శీతలము గల్గుచున్నది వాయువు వీచు

చున్నది. మేఘములు వర్షించుచున్నవి. ఎండలు శాంతించుచున్నది. సర్వము సఫలత నొందుచుండెను. సర్వమునకు కాలమే హేతువు. కాలముచేతనే సస్యములు ఫలించుచున్నవి. నశించుచున్నవి. జీవలోకమంతయు కాలముచేతనే జీవించుచున్నది. ఇట్టి కాలము నెవరు తెలిసికొందురో అట్టివారు కాలము నతిక్రమించి కాలాతీతులై యుందురు. కాలము తెలియని వానికి ముక్తి లేదు. కాలాతీతుడు, ప్రకృతిపరుడు, విశ్వపరుడు నగు శివునకు నమస్కారము.

శివమహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ఏడవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఎనిమిదవ యధ్యాయము

### కాలప్రభావము

మఱల మహర్షులిట్లు ప్రశ్నించిరి. మారుతా! ఏ మానముచే కాలమును నిర్ణయించిరి? ఆయువు యేకాలమానముచే గణింపబడుచున్నది? దీని యవధి యెంతయో తెల్పుమన వాయువిట్లు చెప్పదొడంగెను. ఆయువు నిమేషములతో ప్రారంభమయ్యెను. శాంత్యాతీతకళలు యవధిగా నుండెను. కనురెప్పపాటు కాలమునకు నిమిషమందురు. పదిహేను నిమిషములొక కాష్ఠమనబడును. ముప్పది కాష్ఠము లొక కళ యనబడును. ముప్పది కళలొక ముహూర్తము. ముప్పది ముహూర్తము లహోరాత్రము లనబడును. ముప్పది యహోరాత్రము లొక మాసము. రెండు పక్షములొక మాసము. ఇవి కృష్ణపక్షము, శుక్లపక్షమునని చెప్పబడుచుండెను. ఆరుమాసములొక యయనము. రెండయనములొక మానుషసంవత్సరము. ఇది దేవమానముచే నొక రోజనబడును. మనుజ మానప్రకారముగ దేవతలకు దక్షిణాయనము రాత్రి ఉత్తరాయణము పగలునై యుండెను. దేవతల కొక మాసమగుసరికి మనుజులకు మూడు సంవత్సరములగు నని మరియొక మానప్రకారము చెప్పబడెను. పన్నెండు మాసములగు సరికొక సంవత్సరమగును. మనుజులకు మూడువందల

సంవత్సరము లగుసరికి దేవతల కొక సంవత్సర మగును. ఈదివ్యవర్షముల ననుసరించి యుగసంఖ్యలు చెప్పబడుచున్నవి. భారతవర్షమందలి కవులు యుగములు నాల్గని లెక్కించిరి. వీటిలో మొదటిది కృతయుగము. రెండవది త్రేతాయుగము. మూడవది ద్వాపరయుగము. నాల్గవది కలియుగమని చెప్పబడియుండెను. కృతయుగము నాల్గు వేల సంవత్సరములు. ఈయుగమునకు ముందుయుగమునకు మధ్య, సంధ్యనాల్గువందలు. త్రేతాయుగము మూడు వేల సంవత్సరములు. సంధ్య మూడువందలు. ద్వాపరము రెండు వేల సంవత్సరములు. సంధ్య రెండువందలు. కలివెయ్యి సంవత్సరములు. సంధ్యవంద. ఈ సంధ్యలు యుగములకు పూర్వాపరములు రెండింటియందున నుండునుగాన నాల్గు యుగంబులు నుభయసంధ్యలతో పన్నెండు వేల సంవత్సరము లని చెప్పబడెను. ఇట్టి చతుర్యుగములు సహస్రమైనచో నొక కల్ప మనబడును. డెబ్బదియొక్క చతుర్యుగములొక మన్వంతరమనబడును. ఇట్టి మనువులు పదునాల్గుయైనచో నొక కల్పమనబడును. ఈగణనప్రకారముగ మన్వంతరములు కల్పములు జరుగుచున్నవి. వీటియం దనేక ప్రజలు జననమరణము లొందుచు దీనిని గుర్తెరుంగకుండిరి. ఇంతకు పూర్వపుసంగతి మాకే తెలియదు. అవ్యక్తజన్ముడగుబ్రహ్మకు ఇట్టి కల్ప మొకపగ లనబడును. ఇట్టి కల్పములు సహస్రములైనచో బ్రహ్మ కొక వత్సరము. ఇట్టి వత్సరములు ఎనిమిది వేలైనచో బ్రహ్మకొక యుగము. ఇట్టి యుగ సంవత్సరములు బ్రహ్మ కొక సవనము. ఇట్టి సవనసహస్రంబులు మూడైనచో బ్రహ్మయాయువు సమాప్తమగను. బ్రహకొక పగలైనచో పదునల్గురింద్రులు గతింతురు. బ్రహ్మకొక మాసమగుసరికి నాల్గువందలయిరువది యింద్రులు గతించెదరు. బ్రహ్మకొక సంవత్సరముగడుచుసరికి ఐదులక్షల నలుబదిమంది ఇంద్రులు గతించుసరికి బ్రహ్మ ఆయువు పరిసమాప్తమగును. ఈమానప్రకారముగ విష్ణువునకొక దినమగుసరికి బ్రహ్మఆయువు పూర్తియగును. ఇవ్విధంబు ననే రుద్రునకొక దినమగుసరికి విష్ణునియాయువు పూర్తియగును. ఈశ్వరునకొక దినముకాగా రుద్రుని ఆయువు సమాప్తమగును. సత్పదార్థమే శివుడు. శివుడే సదాశివుడు. ఈ శివుని కాలంబున ఐదులక్షల నలుబది వేల రుద్రులుగడచెదరు. పరమశివుడగు పంచముఖేశ్వరునకు కాలగణనములేదు. కాలము నితడే కల్పించెను. ఇతడు

కాలాతీతుడు. ఈ చెప్పిన కాలప్రమాణమంతయు పరమేశ్వరునకొక పగలగును. ఇట్లే రాత్రికూడనగును. ఇతనికి పగటియందు సృష్టి. రాత్రియందు లయము జరుగుచుండును. ఇతడు కాలాతీతుడు. కాన నితనికి రాత్రింబగళ్లు లేవు. ఇది లోకవ్యవహారముకొరకై చెప్పబడెను. ప్రజలు ప్రజాపతులు, సురాసురులు యింద్రియార్థంబులు, పంచమహాభూతములు, తన్మాత్రలు, బుద్ధి వీటియధిష్ఠాన దేవతలు పరమేశ్వరుని యాజ్ఞననుసరించెదరు. పగటియం దుద్భవింతురు. ఇతడు విశ్వాత్ముడు. కాన నేకత్త్వములు ఇతనిని దాటలేవు సకల ప్రపంచము ఇతని యధీనమైయుండెను. ఇట్టి పరమాత్ముడగు శంకరునకు నానమస్కారము.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
పూర్వఖండమున ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

## తొమ్మిదవ యధ్యాయము

### బ్రహ్మాండ స్థితివర్ణము

ఈపరమేశ్వరుడు తానుండగ లీలమగు నీజగత్తును యెట్లు సృజించెను? జగత్తునందెట్లు క్రీడించెను? అతడు ముందేది సృజించెను? తనశక్తియందు యీసృష్టి యంతయు నెట్లు లయము చేసికొనెను? ఇదంతయు చెప్పుమని ఋషులు ప్రార్థింప వాయు విట్లు చెప్పదొడంగెను. ఈశ్వరునివలన ముందుగా శాంత్యతీతపరోత్తరంబగుశక్తి యుద్భవించెను. ఇది మాయాశక్తి యనియు అవ్యక్తమనియు శివశక్తియనియు చెప్పబడుచుండెను. పిమ్మట శాంతిపదము, నటుపై విద్యాపదము, నదుపరి ప్రతిష్ఠాపదము సంభవించెను. తరువాత నివృత్తిపద ముత్పన్నమయ్యెను. ఈవిధంబుగ నీశ్వరసృష్టి జరిగెను, ఇట్లు క్రమముగ సృష్టియు, దీనికి ప్రతిలోమముగా లయము జరుగుచుండును. ఈ పంచ కళలచేతను జగస్సృష్టియంతయు జరిగెను. ఇదంతయు నవ్యక్తకారణమగు పరమాత్మచే జనించెను. మహదాదితత్త్వములన్నియు నవ్యక్తము నుండియే జనించెను. దీనికంతకు, కర్తృత్వము పరమేశ్వరునిదే గాని యిక వేటికిని లేదు. పరమాణువు లగాయతు బ్రహ్మావరకు ప్రతివస్తువులు నచేతన

ముతే గాని చేతనములు కావు. ఇవంతయు బుద్ధిమంతు లగువారికే తెలియగ
దగును. పరమేశ్వరానుగ్రహముచే గాని మనకిట్టి బుద్ధి లభించదు. ఈ జగత్తు
తయు కర్తృత్వాపేక్ష చే నొప్పుచున్నది. సర్వశక్తిమంతుడు, సర్వస్వతంత్రుడు,
సర్వవేత్త, యనాదినిధనుడు, మహదైశ్వర్య సంయుతుడు, నగు మహేశ్వరుడు
జగత్కర్తయై యుండెను ఇతడు సర్వమును రక్షించుచు పాలించుచుండెను.
అన్నిటికి వేరుగా నుండును. ప్రధానులైన ప్రకృతి పురుషుల కితడాధారుడై
యుండెను. ఇతడు సర్వసత్యవ్రతుడై యందరిని శాసించుచుండును. అల్ప
బుద్ధు లిది గ్రహింపలేరని సత్పురుషుల నిశ్చయము. సృష్టి యారంభము
మొదలుకొని ప్రళయమువరకు బ్రహ్మకు శత వత్సరములు నిండును.
అవ్యక్తజన్ముడగు బ్రహ్మకిది పరమాయువని, చెప్పబడుచుండెను. ఈ
బ్రహ్మపరమాయువుచే ప్రథమపరార్థమనియు ద్వితీయపరార్థమనియు చెప్ప
బడుచుండెను. రెండు పరార్థములైనచో ప్రళయము సంభవించును. బ్రహ్మ
యాయువు పూర్తికాగా నుండు సగములో సృష్టి సగములో లయము జరుగు
చుండెను. దీనినే పరార్థమందురు, అవ్యక్తము నుండియె మహత్తత్త్వము
జనించి, సకలసృష్టులు జరుగుచుండెను. వికారరహిత మగు నాత్మయందు,
ఈశ్వరుడు ప్రతిఫలింపబడుచుండును. ప్రధానపురుషులగు శివశక్తు లిరువురు
సధర్మముచే ప్రతిష్ఠింపబడుచుండిరి. వీరిద్దరు సమస్వరూపంబులు సమముగ
ప్రవర్తింపుచుండును. వారిరువురు నోతప్రోతములైన పరస్పరము భేద
రహితులై యుందురు. వీరికి గుణములలో నభేదము. నామరూపాదులలో
భేదములు లేవు ఒక్కడే మహేశ్వరుడు ఎవరికిని తెలియబడకుండును.
పరమేశ్వరుడు రాత్రియందు పరాశక్తి నుపాసించి మరల సృష్టికాలమున
మరల నాపరాశక్తితో సృష్టిప్రారంభించును. పరమేశ్వరుడు మహాయోగ
ముచే సృష్టియందు ప్రవేశించి జీవులను క్షోభపెట్టుచుండును. తదుపరి జీవులకు
సృష్టిలయములు కల్పించుచుండును పరమేష్ఠియాజ్ఞచే సర్వవ్యక్తము(మాయ)
సృష్టిగావించుచుండెను గాని పరమేశ్వరుని స్వయంప్రతిపత్తి గాని వేరువచ్చెను.
సకలలోకవిలక్షణుడగు పరమేశ్వరునకు నమస్కారము.

శివమహాపురాణమునందలి వాయవీయ సంహితయందు

తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

# పదవ యధ్యాయము

## బ్రహ్మోండోత్పత్తి

వాయువు మరల నిట్లు చెప్పదొడంగెను. ఈశ్వరాజ్ఞచే ముందుగా పురుషాధిష్ఠిత మగు నవ్యక్తము జనించెను. దీనిచే క్రమముగా బుద్ధ్యాదివికారంబులన్నియు జనించెను. వీటిచే త్రిమూర్తులు జనించిరి. ఈముప్వురు నవ్యాహతమగుశక్తితో జగత్రయములు నిండి సృష్టిస్థితిలయంబులు చేయుచుండిరి. వీరు యప్రతిహాత మగు జ్ఞానసంయుక్తులై యణిమాద్యష్టైశ్వర్యంబులు గల్గి సృష్టిస్థితికారణభూతులై యుండిరి. మహేశ్వరుడు ప్రసన్నుడై వీరికి ప్రభుత్వము నొసంగియుండెను. కల్పాంతమందు త్రిమూర్తుల కెట్టి మోహంబు లేకుండ జేసి పరమేశ్వరుడు మరల వారల కాపదవులనే యొసంగు చుండెను. ఈముప్వురు పరస్పరముగ నుత్పవిల్లి పరస్పరము సహాయభూతులై ఒకరినొకరనుసరించి యభివృద్ధి నొందుచుండిరి. ఒకప్పుడు బ్రహ్మకొనియాడ బడుచుండెను. మరొకప్పుడు రుద్రుడు ప్రశంసింపబడుచుండెను. మరియొకప్పుడు విష్ణువు ప్రస్తుతింపబడుచుండెను. వీరిలో వీరికి న్యూనాధిక్యములు లేవు. కలుగజేసినచో రాక్షసులుగాని పిశాచులుగాని యగుదురు. సందియములేదు. చతుర్వ్యూహస్వరూపు డగు మహేశ్వరుడు త్రిగుణాతీతుడై యుండెను. మరియు నితడు సకలుడు, సకలాధారుడు, శక్త్యుత్పత్తి కారణుడు. త్రిమూర్తులకు, ప్రకృతిపురుషుల కీశ డత్మస్వరూపుడు. లీలగా జగస్సృష్టినంతయు జేసి తాను నియంతయై యుండెను. ఈపరమేశ్వరు డన్నిటికంటెను, పరుడు. నిష్కలుడు. నిత్యుడు. ఇతడు సర్వాధారుడై సర్వాధిష్ఠితుడై సర్వాత్ముడై యుండెను. త్రిమూర్తులు ప్రకృతిపురుషులు మొదలగు వారందరు శివాత్మకులని చెప్పబడుచుండిరి. ఈ ప్రధానపురుషునినుండి ప్రథమమున బుద్ధి, ఖ్యాతి, మతి, జనించెను. మహత్తత్త్వముయొక్క సంక్షోభముచే త్రివిధాహంకారములు జనించెను. అహంకారముచే పంచభూతములు తన్మాత్రలు జనించెను. అహంకారవికారముచే సత్వోద్రిక్త మగు సాత్వికము జనించెను. ఈవికారములనుంచి యొకసృష్టి బయలుదేరెను. అదియే బుద్ధీంద్రియపంచకము, పంచకర్మేంద్రియంబులు

మనస్సు కలసి యొకసృష్టి బయలుదేరెను. అహంకారతమోయుక్తమై పంచభూతములచే శరీర ముద్భవించుచుండెను. పరమేశ్వరుడు భూతములకు కారణభూతుడు గాన ఆదిభూతు డని చెప్పబడుచుండెను. భూతములలో నాకాశము మొదటిది గాన నాకాశాత్ముడని చెప్పబడుచున్నాడు. ముందుగా నాకాశముచే స్పర్శ జనించెను ఆస్పర్శచే వాయు వుద్భవించెను. వాయువునుండి రూపము ప్రభవించెను. రూపముచే తేజ ముద్భవించెను. తేజముచే రసము సంభవించెను. రసముచే జలోత్పత్తి యయ్యెను. జలముచే గంధము పుట్టెను. గంధముచే పృథివి సంజాత మయ్యెను. ఈపంచభూతములచే చరాచరము లావిర్భవించెను. అవ్యక్తుడైన పురుషుని యనుగ్రహముచేతను మహదాదివిశేషతత్త్వములచేతను బ్రహ్మాండ మావిర్భవించెను. బ్రహ్మచే కార్యకారణంబులు సిద్ధించుచున్నవి. ముందుగా బ్రహ్మ వృద్ధినొందెను. ఈబ్రహ్మ ప్రథమశరీరపురుషు డని చెప్పబడుచుండెను. ఇత డీశ్వరసదృశుడై జ్ఞానవైరాగ్యలక్షణుడై, ధర్మైశ్వర్యోత్కృష్టముల గావించుచు జ్ఞానయజ్ఞముల నభివృద్ధి చేయుచుండెను. ఇతనిమనసువలన నవ్యక్తము జనించెను. ఇతడు త్రిగుణోపేతుడై తను త్రిగుణంబులను వశముచేసికొనెను. ఇత డాత్మను త్రిధా విభజించి, ముల్లోకముల నిండియుండెను. ఇతడే సృష్టిస్థితిలయంబుల చేయుచుండెను. ఈపరబ్రహ్మసృష్టికి చతుర్ముఖబ్రహ్మయై రక్షణకు సహస్రశీర్ష పురుషు డగువిష్ణువై, లయమునకు కాలరుద్రుడై సత్త్వరజస్తమోగుణంబులతో వెలయుచు సత్త్వగుణముతో విష్ణువుగను రజోగుణముతో బ్రహ్మగను తామసగుణముతో రుద్రునిగను త్రిమూర్తిస్వరూపుడై త్రిధా విభజింపబడి బ్రహ్మయై సృజింపుచు విష్ణువై పాలింపుచు రుద్రుడై లయమొందించుచుండెను గాన నితడు త్రిమూర్తిస్వరూపు డని చెప్పబడుచుండెను. ఇతడు నాల్గు విధంబులుగ విభజింపబడినపుడు చాతుర్వ్యూహు డని పిలువబడుచుండును. అందరికి నిత డాదిపురుషుడు గాన నిత డాదిదేవు డని పిలువబడుచుండెను ఇతడు జన్మరహితుడు గాన నజన్ముడని పిలువబడుచుండెను. ప్రజలను పరిపాలింపుచుండెను గాన ప్రజాపతి యని పిలువబడుచుండెను. స్వర్ణమయ మగు మేరుపర్వత మితనిగర్భశయమై యుండెను. సాగర మితనిగర్భోదకమై యుండెను. పర్వతము లితని గర్భకోశచర్మములై యుండెను. ఇతని జరాయు వాంయండమునందు ముల్లోకములతో గూడిన విశ్వమంతయు వ్యాపించియుండెను.

ఈయండమునందు చంద్రసూర్యులు గ్రహనక్షత్రవాయువులు నుండెను. ఈ యండము పదింతలు జలముచే వ్యాపించియుండెను. ఈజలమునకు దశాధికముగ తేజము వ్యాపించియుండెను. ఈతేజమునకు పదిరెట్లు వాయువు వ్యాపించి యుండెను. వాయు వాకాశముచే నావరించి యుండెను. ఆకాశము పంచ భూతావృతమై యుండెను. భూతాదులు మహతత్త్వముచేవ్యాపించియుండెను. మహత్తత్వ మవ్యక్తముచే నావరింప బడియుండెను. ఇవ్విధంబున బహిర్బ్ర హ్మాండ మంతయు పంచభూతములుమహత్తత్వము యవ్యక్తములను సప్తావ రణావృతమై యుండెను. దీనినావరించి యష్టప్రకృతులు నుండి సృష్టిస్థితి లయంబులు చేయుచుండెను.

శ్లో॥ భూమిరాపోనలోవాయుః ఖంమనోబుద్ధిరేవచ
అహంకారఇతీయాంమే భిన్నాప్రకృతిరష్టధా.

భూమి జలము అగ్ని వాయువు ఆకాశము మనస్సు బుద్ధి అహంకారము యనునవి అష్టప్రకృతు లనబడును. ఇవియొకదానిచే నొకటి జనించి యొకదా నితోనొకటి యాధారమై యుండెను. ఇవి ఆధారాధేయ భావముల నొంది వికా రులకు వికారములుకల్గింపుచు, కూర్మాంగములవలె ముందుకు జొచ్చుచు వెను కకు మరలుచు నవ్యక్తమందు, వికారములు సృజింపుచు సంహరింపుచు నుండును. ఇట్లు పూర్వోక్తవిధిగ జగత్తంతయు నుత్పన్నమై యవ్యక్తముచే ప్రకటింపబడు చుండెను. ఇదంతయు ప్రళయకాలంబున ప్రతిలోమ ప్రకారముగ లయమొందు చుండెను. కాలవశముచేతనే గుణవిశేషము లన్నియు, జనించి గుణసామ్యము లందు లయమొందుచు వ్యత్యాసముగ సృష్టిజరుగుచుండెను. దీనినే బ్రహ్మ యోని యందురు. ఈపరబ్రహ్మచేతనే యండము జనించెను. గాన బ్రహ్మ క్షేత్రమనియు క్షేత్రజ్ఞుడనియు చెప్పబడుచుండెను. ఇట్టి బ్రహ్మాండము లనేకవే లుండెను. ఇతడు సర్వజ్ఞుడు గాన నెక్కడ గాంచినను తానే యుండెను, ఇతడు త్రిమూర్తులచే సర్వకార్యములు చేయించుచు నందరకు నియంతయై యుండెను. పరమేశ్వరు డొక్కడే యవ్యక్తుడు, మిగిలిన దంతయు వ్యక్తమైనదియే. అండమునుండి బ్రహ్మ, బ్రహ్మనుండి లోకములు జనించెను. ఇదందయు నీశ్వర వాక్కులే గాని నాస్వంత వాక్కులేమియుగావు. ఆఈశ్వరుడు ప్రళయకాలమున

నిట్టి లీలలు జూపించుచు తానొక్కడై విహరింపుచు ప్రధానుడగు పరబ్రహ్మ ప్రకృతిని జనింపజేసి యనాదియైనదియు నాదిమధ్యాంత రహితమైనదియు ననంత వీర్యమైనదియు నగు శుక్లము జనింపజేసెను. ఇది యధిక శోణితరజంబుతో కలిసి యధికోత్పత్తికి కారణమై జగత్ సృష్టి గావింపుచుండెను. రక్తవృద్ధి యధికమైనచో నధిక సంతానోత్పత్తిని కల్గించుచుండును. ఆదికాలమున నిత డష్టవికాసంబులతో సృష్టి నుత్పన్నము చేసి యంతకాలమున సంహారింపుచుండును. మహేశ్వరుని సంకల్ప మాత్రముచేతనే ప్రకృతి మూలకముగ సృష్టియంతయు జరుగుచుండెను.

శివమహాపురాణమందలి వాయవీయసంహితయందు
పూర్వఖండమున పదవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునొకండవ యధ్యాయము

### సృష్ట్యాది వర్ణనము

కల్పభేదముల ననుసరించి సర్వమన్వంతరంబులు, ప్రతిసర్గలు, అంతస్సర్గలు మాకు తెల్పుమని మహర్షులడుగ వాయు విట్లు చెప్పదొడంగెను. బ్రహ్మయొక్క పరార్థసంఖ్యను చెప్పెద వినుడు. బ్రహ్మకు పగటికాలము సృష్టి. రాత్రికాలము లయము జరుగుచుండెను. బ్రహ్మకు రోజురోజు పదునాల్గుమనువులు మారుచుందురు. పరబ్రహ్మయగు నీశ్వరు డనాదియు ననంతుడు గాన నితనికాలములో నెన్నిమన్వంతరంబులు మెందరు బ్రహ్మలు గడచిరో యెవరికీ పూర్తిగా తెలియదు. పెద్దలు చెప్పినవాక్యములనుబట్టి విన్నంతవరకు నేను చెప్పెదను వినుడు. మాటిమాటికి చెప్పుటలో ప్రయోజన మేమున్నది? ఈ చెప్పినదాని కేమియు భేదముండదు. ప్రతికల్పమునందు నిట్లే సృష్ట్యాదులు జరుగుచుండును. ఇపు డీవర్తమానము నందు వరాహకల్పము జరుగుచుండెను. దీనియందుకూడ చతుర్దశమనువులు పాలింతురు. వీరిలో స్వాయంభవు మనువులు నేడ్వురు సావర్ణిమనువు లేడ్వురు నుందురు.

ఇప్పుడు సప్తమమను వగు వైవస్వతమనువు పాలింపుచుండెను. ప్రతిమన్వంతరమునందు సమముగ సృష్టిస్థితిలయంబులు జరుగుచున్నవా? లేవా? యని తెలిసినవిజ్ఞానులు తర్కింపుచుండిరి. పూర్వకల్పముప్రళయము సంభవింపగనే వాయుప్రహారముచే వనములందలి సకలవృక్షంబులు మొదలంట నేల గూలుచుండును. తదుపరి యగ్నిచే తృణములగాయతు సర్వవృక్షంబులు దహింపబడుచుండును. తదుపరి పుష్కలావర్తమేఘము లుద్భవిల్లి భూమి నంతయు జలమయము చేయుచుండును. అట్టితరి పరబ్రహ్మ నారాయణ స్వరూపుడై జలమునందు శేషశయనుడై పవళించియుండును. ఈనారాయణుని గూర్చి శ్రుతి ఇట్లుచెప్పెను.

శ్లో॥ ఆపోనారాయణఃప్రోక్తః ఆపోవై నర సూనవః
అయనంతస్యతాయాస్మా తేననారాయణః స్మృతః

నార మనగా జలమని యర్థము. అట్టినారములు స్థానముగా గలవాడుగాన, నారాయణు డని పిలువబడుచుండెను. నారములయందు శయనించువాడుగాన, నారాయణు డని చెప్పబడుచుండెను. నరాణాం జీవానాం, నరాః అయనం స్థానం యస్య సః, నారాయణః. సర్వజీవులకు, హృదయమందుండెడివాడు గాన, నారాయణు డని పిలువబడుచున్నాడు. ఈశివుడు నారాయణుడై యోగనిద్ర నొందియుండ జనోలోకవాసు లందరు బద్ధాంజలిపుటులై, సిద్ధులు, సురలతో గలసి ప్రభాతసమయంబున, స్తోత్రములు చేయుచు మేల్కొలుపుచుందురు. సృష్టిసమయమందు యీనారాయణుడు, యోగనిద్రనుండి లేచి, నిద్రాలసటచే నలుదిక్కుల గాంచుచుండ తనయాత్మకన్న భిన్నమైన దేదియు నతనికి గోచరింపకుండెను. ఇదంతయు గాంచి విస్మితుడై మనోహరమగు భూప్రదేశమంతయు నేమయ్యెను? నానావిధంబులగు నదీనదకాననంబు లేమయ్యెను? అనిఇట్లు బహువిధంబుల చింతించుచు. భూదేవినిగురించి యాలోచింపుచు నేమియు తెలియక, తనతండ్రియు త్రిలోచనుడు నగు మహేశ్వరుని ధ్యానింప నమిత తేజస్కుడగు శివుని స్మరించినంతమాత్రమున నే, ధరణీపతి యగునారాయణుండు, ధరణి జలమగ్నమైనదని గ్రహించి, భూమి నుద్ధరింప దలంచి, జలక్రీడ కుచితమగు వరాహరూప మూని పర్వతసన్నిభుడై, మేఘ

గంభీరనిస్వనుడై, నీలమేఘప్రతీకాశుడై, భయంకరంబుగ గర్జింపుచు, పీనవృత్తఘనస్కంధుడై, పీనోన్నతకటిప్రదేశుడై హ్రస్వపీనవృత్తయూపజంఘంబులు గల్గి, తీక్ష్ణఖురంబులు గల్గి ప్రవాళసదృశవృత్తనేత్రంబులు గల్గి, వృత్తదీర్ఘమహాకాయంబు గల్గి, యుజ్వలకర్ణస్కంధంబులుగల్గి, ప్రళయకాలవాయువులవంటి యుచ్ఛ్వాసనిశ్వాసలతో జలంబుల చిందరవందచేయుచు, విస్ఫురచ్ఛటాచ్ఛన్నకపోలస్కంధబంధురుడై విచిత్రమణిభూషణధారుడై మేఘమందలి విద్యుజ్జ్వాలవలె ప్రకాశింపుచు భూమినుద్ధరించుటకై రసాతలము ప్రవేశించి పెద్దపర్వతమువలె ప్రకాశింపుచు లింగస్వరూపుడై పాతాళమువరకు వ్యాపించిన శివపాదమూలంబుకడ కేతెంచి రసాతలంబున జలమగ్నమైయున్న భూమిని తనదంష్ట్రచే పైకెత్తి పృథివి నుద్ధరింప జనోలోకవాసులు, సిద్ధులు, మునులు, నిది గాంచి సంతసించి వరాహమూర్తిపై కుసుమవర్షము కురిపించిరి. అట్టితరి నీసూకరమూర్తి ఖద్యోతావృత మగు కాటుకపర్వతమువలె శోభించుచు భూమినియథాస్థానంబున స్థాపించి భూధరుండనకై కులపర్వతముల స్థాపించి పూర్వమువలె చతుర్దశలోకములు స్థాపించి విశ్వకర్మచే సకలచరాచర జగత్తులు కల్పించెను.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
పదునొకండవ అధ్యాయము సంపూర్ణము

---

# పండ్రెండవ యధ్యాయము

## సృష్టివర్ణనము

వాయువు మరల నిట్లు చెప్పదొడంగెను. ఆదియందు బ్రహ్మ సృష్టి నారంభింప నుద్దేశించి ధ్యానింపుచుండ తమోమయ మగు మోహమును పొందెను. దీనినుండి మోహము, మహామోహము, తామిస్రము, అంధతామిస్రము అవిద్య యనెడు పంచమోహములు ప్రాదుర్భవించెను. దీనిచే నైదువిధంబులగు సృష్టిలు ప్రారంభ మయ్యెను. బీజములతో నిండిన కుంభముల

వలె సృష్టియంతయు నంధకారమైయుండెను. ఈసృష్టియంతయు బహిరంతర్గత భాగములయందు ప్రకాశము లేక స్తబ్ధమై సంజ్ఞ లేకయుండెను. సృష్టిలోని జీవులకందరికి ముఖేంద్రియంబులు కల్పింపవలెనని తలచి, ముందుగా పర్వతములను వృక్షములను సృజించెను. కాని దీనితో సృష్టి ప్రయోజనము లేకుండుటచే తృప్తినిపొందక తిర్యగ్జంతువుల సృష్టించి, ఇవి విజ్ఞానరహితములగుటచే నసంతృప్తిజెంది సత్వగుణోపేతులు నూర్ధ్వగాములు నగు దేవతలసృష్టి నారంభించెను. వీరందరు మహాతేజస్కులై యంతర్బహిః జ్ఞానవంతులై సుఖవంతులై యుండిరి. తరువాత తనుస్సును ధ్యానముచేయ సత్వరజ ప్రధానులు దుఃఖభూయిష్టులు నగు మనుజులుద్భవించిరి. వీరందరు బహిరంతర్గత భాగములయందు తమోగుణము స్వల్పముగను, రజోగుణము యధికముగను నుండెను. ఇంతదనుక చతుర్విధ సృష్టులైనవి. ఐదవదగు పరమేశ్వరుని యనుగ్రహా సృష్టి నాల్గువిధంబుల విభజింప బడెను. ఇది విపర్యయముగ నాల్గువిధంబులుగ శక్తిచే సృష్టిప్రారంభింపబడి భూత సృష్టికంతకు ఆహారము నియమించెను. ముందుగా పరమేష్ఠి బ్రాహ్మణ సృష్టి ప్రారంభించి రెండవదగు మంత్రసృష్టిని గావించి తదుపరి మూడవదగు వైకారికమగు నింద్రియ సృష్టినిచేసి నాల్గవవదగు ముఖ్యమైన స్థావరసృష్టిని గావించెను. తిరువాత నైదవదగు తిర్యక్సృష్టిని గావించి యారవదగు నూర్ధ్వ ప్రవాహా సృష్టిని గావించెను. దీనిని దేవసృష్టియని కూడ నందురు. తదుపరి నేడవదగు నదుల సృష్టిని గావించెను. తరువాత నన్నుగ్రహాముచే నష్టమంబగు మనుజసృష్టిని గావించెను. పిమ్మట తొమ్మిదవది యగు కుమారసృష్టిని ప్రారంభించెను. తదుపరి బుద్ధిపూర్వకముగ మూడు ప్రకృతి సృష్టులు గావించెను. మొదటి ఐదు సృష్టులు బుద్ధిపూర్వకముగ గావించెను. మిగిలిన సృష్టులన్నియు నప్రయత్నముగ సంకల్పమాత్రముచేతనే గావించెను. తదుపరి బ్రహ్మ యుగ్రతపముతో తన ఆత్మతుల్యులగు సనక సనందన సనాతన సనత్కుమార ఋషభులనెడి వారలను సృజించెను. వీరందరు వీతరాగులై విమత్సరులైయుండి ఈశ్వరాసక్త చిత్తులై సృష్టియందిచ్ఛలేకుండ యోగమార్గమవలంబించి యుండిరి. వీరిట్లుండుటచే బ్రహ్మ సృష్టికాముడై మరల బహుకాలము తపంబుచేసి ఫలసిద్ధి బడయకుండుటచే దుఃఖతుడై క్రోధమూని యుండ నతనిక్రోధాశ్రు బిందువులు క్రిందబడి

భూతప్రేతములు జనించెను. బ్రహ్మ నీకలను గాంచి ఇట్టిసృష్టి జనించె నేమి యని తన్నుదా నిందించుకొనుచు క్రోధహార్న సమన్వితుడై మూర్ఛనొంది ప్రాణ త్యాగమును కూడ చేసియుండ, పరమేశ్వ రానుగ్రహముచే నీలరోహితు డగు రుద్రుడు బ్రహ్మముఖమునుండి ఆవిర్భవించి ఏకాదశరు ద్రస్వరూపుడై బ్రహ్మ యెదుట సాక్షాత్కరింప, నీశ్వరా నుగ్రహముచే బ్రహ్మ లేచి ఓవత్సలారా? మీ రందరు నాచే సంజాతులై మీరు లోకానుగ్రహమునకై జనించితిరి గాన, మీరు సర్వలోకములను స్థాపించి రక్షింపుచు ప్రజాసృష్టిని గావింపు డన, వారు బ్రహ్మవాక్కులు విని రోదనము చేయ నారంభించిరి. గాన వారు రుద్రనాములై యుండిరి. బ్రహ్మముఖమునుండి జనించెను గాన మహే శ్వరుడు బ్రహ్మపుత్రు డని చెప్పబడెను. మహేశ్వరుడు బ్రహ్మ యెదుట నిలచి జగద్గురు వగునో విరించీ నీవు భయపడకుము, నిన్ను జీవింపజేసితిని సుఖముగా లెమ్మన బ్రహ్మ స్వప్నతుల్యము లగు రుద్రవాక్కులు విని, ప్రఫుల్లాంబుజనేత్రుడై మహేశ్వరుని మాటిమాటికి నిరీక్షింపుచు మనోహర గంభీరవాక్కులతో కృతాంజలిపుటుడై ఓప్రభూ! నీదర్శన భాగ్యముచే నామనం బానంద పరవశమయ్యెను. ఏకాదశ రుద్రస్వరూపుడవు నీవే యన, మహేశ్వరుడు బ్రహ్మను బుజ్జగింపుచు హస్తముచే స్పృశించి పరమాత్ముడ నైన నేను నీపుత్రుడ నైతిని. ఏకాదశరుద్రులను రక్షింపుచుండుము. నే నేగెదను. దీర్ఘమూర్ఛను పొందియున్న నిన్ను సజీవుని చేసితిని. నా యనుగ్రహముచే దిరిగి లేచితివి. నీవు జ్ఞానవంతుడవై యథాకీర్తిని సృష్టిని గావింపుచుండుమన, బ్రహ్మ ప్రీతమనస్కుడై, నామాష్టకముచే పరమేశ్వరు నిట్లు స్తుతించెను.

శ్లో॥ నమస్తే భగవన్ రుద్ర, భాస్కరామిత తేజసే!
నమో భవాయ దేవాయ రసాయాంబు మయాత్మనే.

2. శర్వాయ క్షితిరూపాయ నందీసురభయే నమః
ఈశాయ వసతే తుభ్యం నమస్పర్శమయాత్మనే,

3. పశూనాంపతయే చైవ పావనాయాతి తేజసే,
భీమాయవ్యోమరూపాయ శబ్దమాత్రాయ తేనమః

4. ఉగ్రాయోగ్రస్వరూపాయ యజమానాత్మనే నమః
మహాదేవాయసోమాయ నమోస్త్వమృతమూర్తయే.

అని ఇట్లు స్తుతించి, ఓప్రభూ! మహేశ్వరా! భూతభవ్యేశా! సృష్టికై నాయంగములనుండి జనించితివి. ఓజగత్ప్రభూ! నేను చేయుసృష్టికై సహాయము చేయుము. నీచే నేను పవిత్రుడనైతి నన, నీశ్వరుడందుల కంగీకరించి యట్లే నీకు సహకరించెదను. సృష్టి గావింపు మన, నీశ్వరానుగ్రహముచే బ్రహ్మ సకలసృష్టులు గావించెను. బ్రహ్మముందుగ మరీచి, భృగ్వంగిరస, పులస్త్య, పులహ, క్రతువులను దక్షాది వశిష్టులను మానసంబున సృజించెను. తదుపరి, ధర్మమును, సంకల్పము జనింపజేసెను. వీరందరు పురాణ గృహమేధి యగు రుద్రునితో జనించిరి. వీరందరు ద్వాదశబ్రహ్మపుత్రు లనబడుదురు. వీరందరు దివ్యదేవతలచే పూజితులై, ప్రజావంతులై క్రియ వంతులై మహర్షిపరివేష్టితులై మునిమండ లాలంకృతులై యుండిరి. బ్రహ్మ మరలనింకను సృష్టుల చేయదలచి రుద్రుని యనుగ్రహముచే, ముఖమునుండి దేవతలను, కక్షలనుండి పితృదేవతలను, జంఘములనుండి యసురులను, శిశ్నమునుండి మనుజులను, గుదభాగమునుండి క్షుధాతురులగు రాక్షసులను జనింపజేసెను. ఈరాక్షసులందరు తమోరజోవంతులై బలవంతులై నిశాచరులై యుండిరి. తదుపరి యక్షరక్షోగంధర్వులు, సర్పంబులు, భూతంబులు జనించెను. తదుపరి పక్షస్థలమునుండి వక్షములుగల పక్షులను జనింపజేసెను, పిమ్మట ముఖమునుండి మేకలు, పార్శ్వంబులనుండి యురగంబులు పదంబులనుండి యశ్వమాతంగంబులు, శరభగవయమృగంబులు, ఉష్ట్రంబులు, శృంగంబులుగల నితరమృగంబులు జనించెను. రోమంబులనుండి ఓషధులు, ఫల పుష్పంబులు సకలవస్తువులు జనించెను. బ్రహ్మ తూర్పు ముఖమునుండి త్రిపద గాయత్రి యగ్నిష్టోమాది యజ్ఞంబులుజనించినవి. బ్రహ్మ దక్షిణముఖమునుండి యజస్సులు త్రిష్టుప్ఛందస్సులు పంచదశస్తోమంబులు, బృహత్సామము జన్మించెను. పశ్చిమముఖమునుండి వైరూప్యము అతిరాత్రము జనించెను. ఉత్తర ముఖమునుండి అధర్వణ వేదంబునందలి అప్తోర్యామాది ఏకవింశతిక్రతువులును అనుష్టుప్ఛందోవికారమైన వైరాజసామంబులు జనించెను. ఇంక అతని శరీరము నందుండి పెద్ద పెద్ద భూతంబులు యక్షపిశాచ గంధర్వాప్సరోగణంబులు నరకిన్నర రాక్షస ఖగపశుమృగోరంబులు, నవ్యయమైనస్థావర జంగమంబులు పూర్వసృష్టి వలెయథా ప్రకారముగ సృజించెను. ఈసృష్టియంతయు వారివారి కర్మాను సారముగ మృదుకఠిన స్వభావంబులుగను, హింసాహింసకులుగను, ధర్మా

ధర్మంబులుగను, పూర్వకర్మలనను సరించి భావి జన్మలనొసంగుచుండెను. జీవులకు నానావిధేంద్రియములకు నానావిధముక్తుల నొసంగుచుండెను. అనగా, పరమాత్ముని గాంచుటచే నేత్రంబులకు, నర్చించుటచే హస్తములకు, స్తుతించుటచే జిహ్వకు, దేవళంబులకేగుటచే పదంబులకు, భగవన్నిర్మాల్యమును, ధరించుటచే శిరంబునకు, భగవత్కథలు వినుటచే శ్రవణంబులకు, సర్వదామననము చేయుటచే మనంబునకు నీవిధంబుగ నేకాదశేంద్రియంబులకు ముక్తి నిచ్చుచుండును. ఇట్లు చేయుటచే యాయింద్రియములకు నేబాధలు కలుగకుండ ప్రశాంతముగనుండును. ప్రాకృత ప్రపంచ జీవులకు నామరూపంబులు గల్గించుచుండెను. పితామహుడు వేదశబ్దములచే చరాచర జగత్తుల సృజించెను. ఋషిసంబంధమగు వాక్యములన్నియు వేదములయందిమిడియుండెను. ఇవ్విధంబున పగలంతయు సృష్టించి, రాత్రియంతయు లయము చేయుచుండును. ఋతువులు ఋతుధర్మంబులు నేర్పరిచెను. యుగముల ననుసరించి స్వభావ ధర్మంబుల నేర్పరిచెను. ఇవ్విధంబున స్వయంభువుడు లోకసృష్టిని గావించెను. మహాదాది వికారంబులన్నియు ప్రకృతివలన జరుగుచుండెను. అవ్యక్తుడగు బ్రహ్మ యీశ్వరానుగ్రహముచే నదులు సాగరంబులు పర్వతంబులు పురంబులు నతివిశాల మనోహర పట్టణంబులు వనంబులు సృజించెను. దేహవృక్షంబునకు, బుద్ధియను వృక్షమూలంబు మహాశాఖంబులతో నొప్పుచుండెను. ఈపాదపంబు యింద్రియంబులనెడి తొర్రలుకల్గి, పంచభూతంబులనెడి పల్లవంబులు కల్గి, ధర్మాధర్మంబులనెడి పుష్పంబులుగల్గి, సుఖదుఃఖములనెడి, ఫలంబులుగల్గి, సనాతనమైన యీవృక్షము సకలజీవులకాశ్రయమిచ్చి జీవింపజేయుచుండెను.

విశ్వరూపబ్రహ్మకు స్వర్గము శిరంబుగను, ఆకసము నాభిగను, చంద్రసూర్యులు నేత్రంబులుగను, దిశలు శ్రవణంబులుగను, పృథ్వి పాదంబులుగను గల్గి యచింత్యాత్ముడగు పరమాత్మయొప్పుచు సర్వసృష్టులు గావించుచుండెను. ఇతని ముఖమునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు, నూరువులనుండి వైశ్యులు, పాదంబుల నుండి శూద్రులు ననుచాతుర్వర్ణ్యంబు పరమేశ్వరుని యంగములనుండి జనించినవి.

శివ మహాపురాణమునందలి వాయువీయసంహితయందు

పన్నెండవ అధ్యాయము సంపూర్ణము

---

## పదమూడవ యధ్యాయము

### బ్రహ్మ విష్ణువుల యుత్పత్తి

చతుర్ముఖబ్రహ్మ ముఖమునుండి పరమేశ్వరుడగు రుద్రుడు జనించెనని చెప్పితివి మాకదంతయు నాశ్చర్యముగనుండెను. అదంతయు మాకు విపులముగ దెల్పుము దేవశ్రేష్టుడు విరూపాక్షుడు దీప్తశూలధరుడు హరుడు కాలాత్ముడు భగవంతుడు రుద్రుడు జటాజూటుడు నీలలోహితుడు బ్రహ్మ విష్ణ్వాది దేవతలను సంహారకాలంబున సంక్రుద్ధుడై దహింప జేయుచుండునుగదా బ్రహ్మ విష్ణువు లతనికి భయపడుచు ప్రణామంబు లాచరింతురుగదా? బ్రహ్మవిష్ణ్వాదులతోగూడిన లోకములన్నియు నతనికి వశమేకదా? పూర్వము బ్రహ్మవిష్ణువులను తనయంగములనుండి యేకదా సృజించెను. వారి యోగక్షేమములు నిత్యము నతడేగదా చూచుచుండును. ఆదిదేవుడు పురాతనుడు భగవానుడు నగు రుద్రు డెందులకు బ్రహ్మముఖమునుండి యావిర్భవించెను ఈ అవ్యక్తజన్ముడు బ్రహ్మపుత్రు డెట్లయ్యెను? విష్ణుబ్రహ్మలు పరమేశ్వరుని యంగములనుండి జనించిరని చెప్పితిరి. నిశ్శేషభూతంబులు పంచమహాభూతంబులు గుణప్రధాన భావంబులతో పరస్పర మెట్లు ప్రాదుర్భవించెను. ఇంతవరకు మీరుచెప్పునదేకా మేము వినియుండలేదు. మేము మీశిష్యులముగాన మీచే నిదంతయు విని సఫలతనొందెదము. పూర్వము నీకు బ్రహ్మ చెప్పిన విధానముగ నదంతయు మాకు వినిపింపుము ఈశ్వరుని సద్యశమంతయు శ్రద్ధాభక్తులతో వినగోరుచుంటిమి మన వాయువు ఓమహాత్ములారా? మీరు పండితులుగాన నిట్టిప్రశ్నలు వేసితిరి నేనుకూడ బ్రహ్మ నిట్లుప్రశ్నించితిని అతడు చెప్పిన ప్రకారంబు మీకే రుద్రోత్పత్తి చెప్పెదను బ్రహ్మవిష్ణువులుకూడ నెట్లు జనించిరో చెప్పెదను. చరాచర విశ్వసృష్టికై సృష్టిస్థితి సంహారములను క్రియాత్రయము చేపరమేశ్వరుడు తన యాత్మను త్రిధావిభజించి శక్తితోగూడుకొని సృష్టికై బ్రహ్మను రక్షణకై విష్ణువును సంహారమునకై రుద్రునిసృజించెను. వీరుమువ్వురు నతిపరాక్రమవంతులు శక్తివంతులు నగుటచే నొకరినొకరు గణింపక స్వతంత్రులై తమతండ్రియగుపరమేశ్వరుని గూర్చి తపంబు చేసి సంతుష్టిపరచిరి. బ్రహ్మవిష్ణువులకు పూర్వమేపరమేశ్వరు డొక కల్పమునందు రుద్రునిసృజించెను మరొక

నదియు, హేమరత్నఖచిత మైనదియు నొకవిమానమును మనసానిర్మించుకొని ఆపంక జేక్షణు డనంత భోగశయ్యపై శయనించి చతుర్భుజుడై శంఖచక్ర ధరుడై, మనోహరాంగుడై, సర్వాభరణభూషితుడై, శంఖచక్రధరుడై, సౌమ్యుడై, చంద్రబింబాననుడై ప్రసన్నమధుర మందహాసవదనుడై, ధరా మృదుకరాంభోజ స్పర్శరక్త పదాంబుజుడై యోగనిద్ర జెందియుండ, తమస్సుచే కాలరుద్రుని వలెను రజస్సుచే కనకాంబుజమువలెను సత్వముచే సర్వము వ్యాపించిన విష్ణువు వలెను, నిర్గుణంబుచే మహేశ్వరుని వలెను యుండెను. బ్రహ్మ యట్టి పురుషుని గాంచి యతిప్రగల్భ వాక్కులతో ఓవిష్ణూ! పూర్వము నన్ను ధిక్కరించి యెట్లు నన్ను గ్రసించితివో నిన్నిపుడు ధిక్కరించి గ్రసించెదను చూడు నాప్రతాప మని ప్రతాపవాక్కు లాడు చుండ; బ్రహ్మ పలుకులకు విష్ణువు లేచి, చిరునగవుతో నుండ, బ్రహ్మ మహాత్ముడగు విష్ణుని మ్రింగివేసెను. వెంటనే విష్ణువు, బ్రహ్మ భ్రూమధ్యము నుండి, సునాయాసముగ వెంటనే వెలుపలకు వచ్చెను. బ్రహ్మ విష్ణువుల యద్భుత శక్తులు మహేశ్వరు డదృశ్యుడైచూచుచు, రూపవంతుడై బ్రహ్మ విష్ణువుల కడకేతెంచి వారి ననుగ్రహింప దలచియుండ, వారిరువురు పరమేశ్వరుని గాంచి హర్షభయాకుల మానసులై, స్తుతింపుచు, నమస్కరింపుచు, వినయవిధేయతలతో నుండ పరమేశ్వరును సంతసించి, వారల నను గ్రహించి యాదరంబున వీక్షింపుచు నదృశ్యుడాయెను.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
పదమూడవ అధ్యాయము సంపూర్ణము

---

# పదునాలుగవ యధ్యాయము

## రుద్రా విర్భావము

ప్రతి కల్పమునందు రుద్రావిర్భావమును గురించి చెప్పెదను. బ్రహ్మ సృష్టి విచ్ఛిన్న మైనదిగాన, సర్వదా రుద్రులు జనించుచునే యుందురు. ప్రతి కల్పమందు బ్రహ్మ బ్రహ్మాండముల యందు ప్రజాసృష్టి చేయుచునే

యుండును. ఒకానొకపుడు బ్రహ్మ తన సృష్టి యభివృద్ధినొందకుండుటచే దుఃఖితుడై యుండ, నతని దుఃఖము పోగొట్టుటకును, ప్రజాభివృద్ధి కొరకును, నాయాకల్పముల యందు మహేశ్వరుడు, నీలలోహితుడు, కాలాత్ముడు, రుద్రగణాధిపుడు నగు రుద్రుడు పరమేశ్వరునిచే నిర్దేశింపబడి బ్రహ్మ కొకపుడు యనుజుడై, మరొకపుడు పుత్రుడై, యుద్భవించుచుండును. ఆ రుద్రుడే భగవంతుడు. తేజోరాశి. యనామయుడు, ననాదినిధనుడు, సృష్టికర్త, భూతసంహారకుడు, విభుడు, పరమైశ్వర్య సంయుక్తుడు, శాశ్వతుడు, త్రిశూలాది చిహ్నితుడు నగు నాపరమేశ్వరుడే, యీ పరమేశ్వరుడు. ఆ రూపమే యీ రూపము. అతని క్రియలే యితని క్రియలు. అతని నామంబులే యితని నామంబులు. అతని వ్యాపారములే యితని వ్యాపారంబులు. అతని యాజ్ఞాపాలకుడు, సహస్రాదిత్య సంకాశుడు, చంద్రశేఖరుడు, భుజంగహార కేయూర వలయుడు, ముంజమేఖలుడు, జలంధర విరించీంద్రకపాలధారుడు, గంగాతుంగ, తరంగార్ధ పింగళానన మూర్ధజుడు, భగదంష్ట్రాంకురా క్రాంతప్రాంత ధరాధరుడు, దక్షిణకర్ణ భాగమండ వికృతోనగి శోభితుడు, ఋషభవాహనుడు, మహాజలదనిస్వనుడు, మహానల సమప్రభుడు, మహా బలపరాక్రముడు, ఘోరస్వరూపుడు, బ్రహ్మపుత్రుడు నగు మహేశ్వరుడు బ్రహ్మకు విజ్ఞానమిచ్చి, సృష్టియందతనికి సహకరింపుచుండును. రుద్రప్రసాదముచే బ్రహ్మ ప్రతికల్పమునందు ప్రజాసృష్టిని గావింపుచుండును. నిత్యము ప్రవాహము వలె సృష్టి జరుగుచునే యుండును. ఒకానొకపుడు బ్రహ్మ రుద్రుని ప్రార్థింప తన యాత్మతుల్యులగు పుత్రులను కొందరిని సృజించెను. వారలందరు, జటాజూటులు, నిరాంతకులు, నీలగ్రీవులు, త్రిలోచనులు, జరామరణ వర్జితులు, దీప్తశూలవరాధులు నై పదునాల్గు భువనంబులు వ్యాపించియుండిరి. బ్రహ్మ వారలను గాంచి, ఓ మహేశ్వరా! నీకు నమస్కారము, నీవంటి ప్రజలను మాత్రము సృష్టింపకుము. మృత్యు సమన్వితులను మాత్రమే సృజింపు మన, పరమేశ్వరుడు బ్రహ్మను గాంచి యీ రుద్రులందరు నాయంశసంభూతులు. వీరునాతోపాటు సర్వక్రియలయందు సంచరింతురు. వీరందరు మహాత్ములు. మహాబలులు నై యుండిరి. మృత్యు సంభూతులను నేనెన్నడును సృజింపను. ఈరుద్రులు నామానస సంభూతులు సామాన్యులను నేను సృజింపను. అని

యివ్విధంబున భూతేశ్వరు డగు హరుడు బ్రహ్మతో బలికి యారుద్రుల గూడుకొని యదృశ్యు డయ్యెను. వీరినే యేకాదశ రుద్రులందురు. వీరందరు ప్రళయమువరకు నూర్ధ్వ రేతస్కులై యుందురు.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునైదవ యధ్యాయము

### అర్ధనారీశ్వర స్తవము

వాయువు మరల నిట్లు చెప్పదొడంగెను. బ్రహ్మ తాను చేసిన మానసిక సృష్టి వృద్ధినొందకుండుటచే మైథున సృష్టి చేయదలచెను. కాని ఇంతదనుక నీశ్వరుడు స్త్రీ సృష్టిని గావింపకుండుటచే దాను స్త్రీ కులము నెరుంగక స్త్రీ సృష్టి నెట్లు గావింతునాయని యోచించు నందుకు సమర్థుడుగాక ఈశ్వరుని యనుగ్రహముచే గాని యీ సృష్టి చేయజాలనని తలంచి తపము చేయ నారంభించె, ఆద్యురాలు, ఉత్కృష్టురాలు, అనంత శక్తివంతురాలు, లోకపూజ్యురాలు, సూక్ష్మతరాలు, శుద్ధురాలు, భావగమ్యురాలు, మనోహరురాలు, నిర్గుణురాలు, నిష్ప్రపంచురాలు, నిష్కళ, నిరుపద్రవ, నిరంతరా నిత్యా, నిరత మాహేశ్వర పార్శ్వగామియు, పరమశక్తియు నగు భగవతితో గూడిన సత్యాంబని హృదయమునందు నిల్పుకొని యుగ్రతపము చేయనారంభించెను. బ్రహ్మ యుగ్రతపంబునకు, యీశ్వరుడు మెచ్చి, అర్ధనారీశ్వర రూపంబుతో నతని యెదుట సాక్షాత్కరించె, తమస్సునకంటె పరుడు, సవ్యయుడు, అద్వితీయుడు, అనిర్దేశ్యుడు, అదృశ్యుడు, సర్వలోకవిధాత సర్వలోకేశ్వరుడు, సర్వలోక సృష్టికర్త, శక్తియుతుడు, అప్రతిరూపుడు, మనోతీతుడు, ప్రకాశుడు, అమేయుడు, అజరుడు, అచలుడు, నిశ్చలుడు, నిర్గుణుడు, శాంతుడు, అనంతమహిమాస్పదుడు, సర్వగుడు, సర్వాత్మ, సర్వజ్ఞుడు, సదసద్వ్యక్తివర్జితుడు, సర్వోపమానాతీతుడు, నిర్మత్తుడు, శరణ్యుడు, శాశ్వ

జయశాశ్వతి కానుగ.
జయాత్మత్రయ పాలిని

6. జయాత్మత్రయ నిర్మాత్రి
జయాత్మ త్రయపాలిని
జయాత్మత్రయ సంహర్త్రి
జయాత్మత్రయ నాయికే.

7. జయావలోక నాయత్త
జగత్కారణ బృంహణ
జయోపేక్షా కటాక్షోత్థ్యన్
హృతభుక్త భౌతిక.

8. జయదేవాద్య విజ్ఞేయె
స్వాత్మసూక్ష్మ దృశోజ్జ్వలే
జయస్థూలాత్మ శక్త్యేశే
జయవ్యాప్త చరాచరే.

9. జయనామైక విన్యస్త
విశ్వతత్వ సముచ్చయ
జయాసుర శిరోనిష్ఠ
శ్రేష్టానుగ కదంబిక.

10. జయోపాశ్రిత సంరక్షా
సంవిధానపటీ యసి
జయోన్మూలిత సంసార
విషవృక్షాంకురోద్గమే.

11. జయప్రాదేశి కైశ్వర్య
వీర్యశౌర్య విజృంభణ
జయవిశ్వ బహిర్భూత
నిరస్తపర వైభవ.

12. జయప్రణీత పంచార్థ
ప్రయోగ పరమామృత
జయపంచార్థ విజ్ఞాన
సుధాస్తోత్ర స్వరూపిణి.

13. జయాతిఘోర సంసార
మహారోగ భిషగ్వర
జయానాది మలాజ్ఞాన
తమఃపటల చంద్రికే.

14. జయత్రిపుర కాలాగ్నే
జయత్రిపుర భైరవి
జయత్రిగుణ నిర్ముక్తే
జయత్రిగుణ మర్దిని.

15. జయప్రథమ సర్వజ్ఞ
జయసర్వ ప్రబోధికే
జయప్రచుర దివ్యాంగ
జయప్రార్థిత దాయిని.

16 క్వ దేవతే పరంధామ
క్వ చతుచ్ఛ వచోవచః
యథాపి భగవద్భక్త్యా
ప్రలపంతం క్షమస్వమాం

17. విజ్ఞాప్యైవం విధై సూక్తై
ర్విశ్వకర్మా చతుర్ముఖః
నమశ్చకార రుద్రాయ
రుద్రాణ్యైచ ముహుర్ముహుః.

18. ఇదంస్తోత్ర వరంపుణ్యాం
బ్రహ్మణాసముదీరితం
అర్ధనారీశ్వరం నామ
శివయోర్హర్ష వర్ధనం.

19. యఇదంకీర్త యేద్భక్త్యా
యస్యకస్యాపి శిష్యయా
సతత్ఫల మవాప్నోతి
శివయోః ప్రీతికారణాత్.

20. సకలభువన భూతభావనాభ్యాం
జననవినాశ విహీన విగ్రహాభ్యాం
నరవరయువతీవపుర్ధరాభ్యాం
సతతమహంప్రణతోఽస్మి శంకరాభ్యాం.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
పదునైదవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునాఱవ యధ్యాయము

## దేవీ ప్రాదుర్భావము

వాయువు మరల ఋషులతో నిట్లు పలుకజొచ్చెను. మహాదేవుడు బ్రహ్మను గాంచి, మహాజలద నిస్వనుడై, మధుర గంభీరమంగళ ప్రదము లైనవియు, నర్థసంపన్న పదజాలంబులు గలవియు రాజలక్షణయుక్త మైన వియు. సంపూర్ణ విషయారంభలక్షణ మైనవియు, విమలమైనవియు, సమ ర్థములైనవియు, మనోహరమైనవియు, సుదారసహిత మైనవియు, నగు మధురస్మిత వాక్కులతో, బ్రహ్మను గాంచి, సంప్రీతుడై, ఓ వత్సా! కుమారా! ప్రజాభివృద్ధి కై తపంబు చేయుచుంటివని గ్రహించితిని. నీతపం బునకు సంతుష్టుడనైతిని. నీయాప్సితము నెరవేర్చెదను కోరుకొమ్మని పర మేశ్వరుడు పలికి, తన శరీరము నుండి స్త్రీని సృజింప, బ్రహ్మకోరిక ప్రకా

రము దివ్యగుణాన్వితయు, పరమశక్తియు, యెన్నడు కనివిని యెరుంగనిదియు, జన్మమృత్యు జరాదుఃఖంబులు లేనిదియు, నగు నాభగవతి పరమేశ్వరుని యంగము నుండి యావిర్భవించెను ఈమె మనోవాగింద్రియముల కందనిదై యుండి జగదంబ శరీరధారిణియై బ్రహ్మ యెదుట సాక్షాత్కరించి తనమాయచే జగత్తంతయు మోహింప జేయుచుండెను. అజాతయగు నీమె యీశ్వరుని యందే జనించెను. ఈమె సురాసురులకు కూడ తెలియదు. పరమేశ్వరుని నుండి విభక్తమై కానవచ్చుచుండెను. పరమేశ్వరియు, సర్వలోక మహేశ్వరియు, సర్వజ్ఞురాలును, సర్వవ్యాపినియు, సూక్ష్మరాలును, సదసద్వ్యక్తియు, వర్జితయు జగత్ప్రకాశినియు నగు నా దేవినిగాంచి బ్రహ్మ ననుసరించి, ఓ దేవీ ! సర్వజగన్మయీ! నేనాదిని మానవ సృష్టిని గావించితిని. దేవతలందరు నాచే సృజింపబడిరి. నెనెన్ని మార్లు సృజించినను నాసృష్టివృద్ధి నొందుటలేదు. ఇకముందు మిథునసృష్టి వృద్ధ నొందుటలేదు. ఇకముందు మిథున సృష్టి చేయదలచితి. ప్రజాభివృద్ధికె పాటుబడుచుంటను. నేనిదివరకెన్నడు నారీసృష్టిని చూచియెరుంగను. గాన, నేను స్త్రీ సృష్టిని చేయలేకుంటిని. సర్వశక్తులు, నీచేజనించుచున్నవి. నీవు తెలుచుకొన్నచో, సర్వశక్తుల నొసంగెదవు. ఓ సురేశ్వరి ! ఓ వరదాయిని ! నన్ను ప్రార్థించు చుంటిని. సృష్టి సమర్థత నిమ్ము. నీయంశచేతనే, చరాచర సృష్టిగావింపుము. నీవు నా పుత్రు డగు దక్షునకు పుత్రికవు గమ్మని, బ్రహ్మ ప్రార్థింప తనతో తుల్యమగు శక్తిని, తన భ్రూమధ్యమునుండి సృజించెను. ఆమెను గాంచి శివుడు ప్రసన్నుడై, ఓ దేవీ! నీవు పరబ్రహ్మ నారాధించి, బ్రహ్మ యాప్సితములు నెరవేర్పుమన దేవి యందుల కంగీకరించి తపంబు చేసి, బ్రహ్మకు ప్రజాసృష్టి శక్తినిచ్చి తాను దక్ష పుత్రికయై జనించెను. ఇటు పరమేశ్వరుడు దేవి సహితముగ నదృశ్యుడయ్యెను. అప్పటినుండి యాబ్రహ్మ యాపరాశక్తి సుగ్రహము మనంబు నిడుకొని, స్త్రీ సృష్టిగావింపు చుండెను. అప్పటినుండి మైథున సృష్టియే జరుగుచుండెను. తన సృష్టివృద్ధి యగుట గాంచి బ్రహ్మ యానందమునకు మేరలేకుండెను. ఈశక్తిని ముద్భవమైన భూతసృష్టి విన్నంతనే పుణ్యావృద్ధి కల్గును. శక్తి యధికమగును. పుత్రువంతు లగుదురు.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు

పదునాఱవ అధ్యాయము సంపూర్ణము

---

# పదునేడవ యధ్యాయము

## సృష్టి కదనము

వాయువు మరల నిట్లు చెప్పదొడంగును. బ్రహ్మ అర్ధనారీశ్వరు డగు పరమేశ్వరుని గాంచి, తన యర్ధ శరీరము నుండి శతరూప యనెడు స్త్రీని, మిగిలిన యర్ధభాగమునుండి స్వాయంభువ మనువుని సృజించెను. ఈ శతరూప దుష్కర తపంబుచేసి స్వాయంభువ మనువును పతిగా బడసి ప్రియంవదోత్తాన పాదులను నిరువురు పుత్రులను, ఆకూతి, ప్రసూతియను నిరువురు పుత్రికలను బడసెను. స్వాయంభువుడు, యాకూతిని రుచిప్రజాపతికి, ప్రసూతిని దక్షునకు నిచ్చియుండెను. ఈ యాకూతికి, రుచిప్రజాపతి వలన యజ్ఞ, దక్షిణయను మిధునము జనించెను. వీరినుండి జగస్సృష్టి యంతయు వృద్ధి నొందెను. ప్రసూతికి దక్షుని వలన, దేవతాంశ సంభూతులగు నిరువది నల్గురు కన్యక లుద్భవించిరి. వీరిలో, శ్రద్ధా, లక్ష్మీ, ధృతి, పుష్టి, తుష్టి, మేధా, క్రియా, బుద్ధి, లజ్జా, వపు, శాంతి, సిద్ధి, కీర్తి, యను నామంబులు గల పదమువ్వురను యమధర్మరాజున కిచ్చి యుద్వాహము చేసియుండెను. మిగిలిన పదకొండుగురు పుత్రికలలో, ఖ్యాతిని భృగువునకు, సతిని, శివునకు, సంభూతిని మరీచికి స్మృతిని యగిరునకు ప్రీతిని పులహునకు, క్షమను క్రతువునకు, సన్నతిని పులస్త్యునకు, ననసూయ నత్రికి, నూర్జను, వశిష్టునకు, స్వాహను పావకునకు స్వధను పితృదేవతలకు నిచ్చి పరిణయము గావించెను. కామ, దర్ప,నిలయ, సంతోష, లాభ, శృతదండ సమయ, బోధ, అప్రమాద, విలయ, వ్యవసాయ, క్షేమ, సుఖ, యశ, యను వారలు యమధర్మరాజు పదమువ్వురు భార్యల వలన. నీపదమువ్వురు జనించిరి. వీరందరు నత్యంత సుఖకారకులై యుండిరి. దుఃఖదాయక మగు సంతానమంతయు, నధర్మహింసల యందు జనించిరి, అధర్మమునకు నికృత్యాది సంతానము జనించిరని, విష్ణు పురాణము నందుకలదు. అధర్మము నకు నికృత్యాది సంతానము జనించిరని, విష్ణు పురాణము నందు కలదు. అధర్మమునకు హింస యను భార్య కలదు. ఈ దంపతులకు అనృత మనెడి పుత్రుడు, పాప మనెడి కన్యక, జనించిరి. వీరందరు నీతి నియమంబులు లేక ధర్మశూన్యులై యుండిరి. వీరందరు

తామస సృష్టిచే జనించిరి. గాన నధర్మ్ములై యుండిరి. దక్షపుత్త్రిక యగు సతి, రుద్రుని వివాహమాడి, భర్తృనింద సహింపలేక, తన తండ్రి యగు దక్షుని బంధువులను నిందించి, తన దాక్షాయణీ శరీరమువీడి మేనకా హిమవంతులకు పుత్త్రికయై జనించెను. రుద్రుడు సతీ దేహత్యాగమును గాంచి, తన యాత్మతుల్యులగు ననేక రుద్రులను జనింపజేసెను. ఇదంతయు నిదివరలో జెప్పియుంటిని భృగువు ఖ్యాతివలన విష్ణు ప్రియ యగు లక్ష్మిని జనింప జేసెను. ధాత, విధాత యిరువురు, వేలకొలది పుత్త్రపౌత్త్రులను జనింప జేసిరి. భార్గవ వంశీయు లందరు స్వాయంభువ మన్వంతరమందు జనించిరి. మరీచి, సంభూతులకు పౌర్ణమాసి జనించెను. తనుపరి నల్గురు కన్యకలుకూడా జనించిరి. వీరిచే వంశమంతయు మిక్కిలి వృద్ధి నొందెను. వీరి వంశమందు బహుపుత్త్రు వంతుడగు, కశ్యపుడు జనించెను. అంగిరసునకు స్మృతి యను పత్ని వలన నాగ్నిధృడు శరభుడు నను నిరువురు పుత్త్రులు, నల్గురు కుమార్తెలు గల్గిరి. వీరికి యనేక వేల పుత్త్ర పౌత్త్రులు జనించిరి. పులస్త్యునకు ప్రీతి యను భార్య వలన, దంతాగ్ని యను వాడు జనించెను. ఇతడు, పూర్వ జన్మమున స్వాయంభువ మన్వంతరమున నగస్త్యుడై జన్మించెను. ఇతని సంతతి వారందరు పౌలస్త్యులని పిలువబడుచుండిరి. పులహ ప్రజాపతికి క్షమ యను భార్య వలన, కర్దమ అసురి, సహిష్ణు లనెడి త్రేతాగ్నుల వంటి పుత్త్రత్రయము జనించెను. వీరందరు వంశ ప్రతిష్ఠితులై యుండిరి. క్రతువు సన్నతి యనెడు భార్య వలన తనతో తుల్యులగు పుత్త్రులను బడసెను. వీరందరు కళత్ర పుత్త్ర శూన్యులై యూర్ధ్వ రేతస్కులై బ్రహ్మచారులై యుండిరి. వీరా అరువది వేల వాలఖిల్యులని పిలువబడుచు నసూరుని యగ్ర భాగము నుండి సూర్యుని చుట్టు పరివేష్టించి సంచరింపుచుందురు. అత్రి అనసూయలకు నేవురు పుత్త్రులు. శ్రుతి యనెడు కన్యక గలదు. ఈశ్రుతికి శంఖపాదు డనెడు పుత్త్రుడు గలడు. సత్యనేత్రుడు, హవ్యుడు, ఆపోమూర్తి, శనైశ్చరుడు, సోముడు, నను నిదేవురు నత్రి పుత్త్రులై యుండిరి. వీరు వీరి సంతానములు నాత్రేయులని పిలువబడుచుండిరి. వీరు స్వాయంభువ మన్వంతరమున వందల కొలదిగా వృద్ధినొందిరి. వశిష్ఠుని వలన నూర్జకు సప్త పుత్త్రులు. నొక కుమార్తెయు కల్గెను. ఈమె పేరు పుండరీక, రజ, గాత్ర, యూర్ధ్వ బాహు, సవన,

అనయు, సుతడ, శుక్రియ యనెడి నామంబులు గల వశిష్ఠుని సప్త పుత్రులు సప్తర్షులై యుండిరి. వీరందరు వశిష్ఠగోత్రులై, విస్తార ప్రజావంతులై స్వాయంభువ మను కాలంబున వర్ధిల్లుచుండిరి. ఋషుల వంశావళి యంతయు జెప్పితిని. ఇదంతయు మీకు సంక్షేపముగ జెప్పితిని. విస్తరించి చెప్పుట కెవరి తరముగాదు. రుద్రాత్మకుడగు యగ్ని బ్రహ్మ మానస పుత్రుడని చెప్ప బడుచుండెను. ఈ యగ్నిని స్వాహా వలన, పావకుడు, పవమానుడు, శుచి, యను నామంబులతో ముగ్గురు పుత్రులు గల్గిరి. మథించిన యగ్ని పవమానుడనియు, విద్యుత్తుల యందలి యగ్ని, పావకుడనియు, సూర్యాతపము నందుండెడి యగ్ని శుచి యనియు పిలువ బడుచు నిత్రేతాగ్నులు, హవ్యకవ్యంబుల రక్షించుచు వీరు ముగ్గురు నలుబది తొమ్మిది మంది పుత్రులను బడసిరి. వీరిలో కొందరు దేవతలు పితృదేవతలు సురులునై యుండిరి. వీరందరు త్రికాలముల యందు కామ్య నైమిత్తిక కర్మలయందు పాల్గొనుచు తపోవంతులై నియమవ్రత ధారులై యుండిరి. మరియు వీరు రుద్రాత్మలై, రుద్రపరాయణులై యుండిరి. వీరందరు నన్ను ముఖమున భుజించుచుందురు. రుద్రుల కీయవలసిన వారిందరు అగ్నిమున కింద జేసినచో వారలకు ముట్టును. ఇక పితృదేవతలను గురించి చెప్పెదను వినుము. సంవత్సర కాలమునకు షడృతువులు పితృదేవతలని వేదములో చెప్పబడెను. ఋతవః ఖలువై పితరః అని శృతిచే చెప్పబడెను. ఈ కారణముచే షడృతువుల యందు స్థావర జంగమము లన్నియు జనించుచుండెను. పితృదేవతలకు యజనంబులే ఋతు కాలంబు లనబడును. పితరః ఆర్తవః పితరః ప్రజాపతిః పితరం పితృయజ్ఞేనయజంతే అని శృతి ఋతువులే పితృదేవతలు. పితృలే ప్రజాపతి గాన, పితృదేవతలను, పితృ యజ్ఞంబుచే సర్పింపవలెను. పితృదేవతలు యంబరము నందుండి యజమాని యభివృద్ధిని నిరీక్షించుచుందురు. అగ్నిష్వాత్తులు, బర్హిష్మంతులు అని పితరులు రెండు విధములు. అగ్నియందు హోమము చేయుటచే అగ్నిష్వాత్తులనియు బర్హిస్సుల యందు పిండము లుంచుటచే బర్హిష్వాత్తులనియు రెండు విధములుగ పిలువబడుచుందురు. యజ్ఞము చేసినను, చేయకున్నను గృహమేధులకు పితృదేవతల సర్పింప వలెను. అగ్నిష్వాత్తులనెడి పితృదేవతలకు మేనాయనెడు కన్యకయు బర్హిష్వాత్తులనెడి

పితరులకు ధరణీ యనెడి కన్యకయు కలదు. వీరు లోకవిఖ్యాతులు వీరిచే విశ్వమంతయు ధరింపబడెను. మేనహిమవంతుడు సహ భార్యయై, మైనాక, క్రౌంచపర్వతములను సుతులుగా బడసెను. మరియు శివస్పర్శచే పవిత్రులైన గౌరీ గంగలని యిరువురను పుత్రికలుగా బడసెను. మేరువు బహిప్వాత్తు కన్యక యగు ధరణిని వివాహమాడెను. వీరికి చిత్ర విచిత్రములతో గూడిన మందరాద్రి జనించెను. ఈమందరాద్రి తపమాచరించి శ్రీకంఠుడగు శివుని తన యందు నివాసునిగా చేసికొనెను. ఈధరణికి వేలా, నియతి, ఆయతి, యను మువ్వురు పుత్రికలు కలరు. ఆయతి, నియతి యనెడు వారలను భృగు పుత్రుల కిచ్చి యుండిరి. స్వాయంభువ మన్వంతరమునకు పూర్వమె భృగు పుత్రుల గాథలు చెప్పబడెను. వేల సముద్రునకు భార్యయై, సువర్ణ యను పుత్రికను బడసి ప్రాచీన బర్హికిచ్చి యుండెను. ఈసాగర కన్యక యగు వేల ప్రాచీన బర్హి నుండి పదుగురు పుత్రులను బడసెను. వీరందరు ధనుర్వేదపారగులై ప్రాచేతస నామకులై యుండిరి. వీరు స్వాయంభువ మను కాలంబున దక్షుని పుత్రుగా బడసిరి ఈదక్షుడు శివ శాపముచే చాక్షుష మన్వంతరము వరకు నుండెను. ఈ ధర్మాత్ముల గాథలన్నియు, నతి విస్తారము గాకుండగను, నతి సంక్షిప్తము గాకుండగను చెప్పియుంటిని. ఇది దివ్యమైన దేవతల చరిత్ర. వీరందరు క్రియావంతులై ప్రజావంతులై ముని మండలాలంకృతులై యుండిరి. ఈ సృష్టి యంతయు ప్రజాపతిచే సృష్టింపబడెను. వర్ష కోటి శతంబులైనను ఈ సృష్టిని వర్ణింప శక్యము గాదు. పవిత్రములగు చంద్ర సూర్య వంశపు రాజు లెందరో గలరు. ఇక్ష్వాకుడు, అంబరీషుడు, యయాతి, నహుషుడు మొదలగు పవిత్ర వంశీయు లందరు నీయుభయ వంశములయందు జనించిరి. ఇంకను నానా వీర్యసమన్వితులగు ననేక రాజఋషు లుండిరి. ఇక నెందరిని వర్ణింప గలను? ఈశ్వరుడు లేని కథలు యెన్ని చెప్పిన ప్రయోజనమేమున్నది. చెప్పుటకు తావుకూడ నుండదు. చెప్పినను సత్పురుషులు సమ్మతింపరు. ఈశ్వర ప్రభావము చెప్పుచు నీకథలన్నియు చెప్పితిని.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు

పదునేడవ అధ్యాయము సంపూర్ణము

# పదునెమిదవ యధ్యాయము

## సతీదేహత్యాగము.

దక్షపుత్రిక యగు నాదేవి. దాక్షాయణీతనువును త్యజించి. మేనకాహిమవంతుల కెట్లు పుత్రికయై జనించెను? రుద్రుడు దక్షునిచే నేలనిందింపబడెను? దీనికి కారణమేమి? శివ మరణించిన దక్షుడు మరలనెట్లు జీవించెను? చాక్షుష మన్వంతరమునకు పూర్వగాథలన్నియు వినిపింపుమని మహర్షులుకోర వాయువిట్లు చెప్పదొడంగెను. ప్రజలచేతను దేవతలచేతను, దూషింప బడిన లఘుచేతస్కుడగు దక్షచరిత్ర చెప్పెదవినుడు. ముందుగా సర్వసురాసురులు. సిద్ధులు, పరమర్షులు, ఒకానొకప్పు డీశ్వరుని గాంచుటకై కైలాస శిఖరమేగ నట్టితరి సతీశివులిరువురు. సుఖసింహాసనా సీనులైయుండ, వీరందరు వారినిద ర్శించిరి. దక్షుడా దేవతలతో తన పుత్రికను యల్లునిచూచుటకై. వారిసముఖమునకేగ, జామాతయు, తనపుత్రికయు. దేవతలకంటె తన్నధికముగ గౌరవింపకుండుటచే, దక్షుడు మనంబున క్రోధమూని వారితో విరోధము తలబెట్టి దానికి ప్రతీకారముచేయబూని, యజ్ఞమొకదానిని తలబెట్టి, కేవలమజ్ఞానియై. మూఢుడై, వారుపరాత్పరులని తెలియక విధిప్రేరితుడై, వైరమూని, తాను యజ్ఞ దీక్షితుడై, యితర యల్లుళ్లను. కూతుళ్లనుపిలిచి. ద్వేషముచే సతీశివులను మాత్రము పిలువడయ్యెను. ఈమఖమునకు వేలకొలదిగా వచ్చినవారందరిని పూజింపుచుండెను. రుద్రాణినారదుని వలనతండ్రి మఖంబునంగతి నెరింగి రుద్రుని యాజ్ఞగొని తండ్రిభవనమున కేగుటకు సంసిద్ధయై నొక దివ్యవిమానమధిష్ఠించెను.

ఆ విమానము విశ్వతోముఖమై. సులక్షణములు గలదియై. సుఖారోహమై యతిమనోహరమై. తప్తజాంబూనద ప్రఖ్యమై చిత్రరత్న పరిష్కృతమై, ముక్తామయ వితానప్రసగ్భూషితమై. తప్తకాంచనమయమై. రత్నస్థంభ శతావృతమై వజ్రసోపానోపేతమై. విద్రుమస్తంభతోరణ సంయుతమై, పుష్పపట్టపరిస్తీర్ణమై, చిత్రరత్నాసనా లంకృతమై. మణికుట్టిమ వజ్రజాలంబులచే శోభాయమానంబుగ ప్రకాశింపుచుండెను. ఆసనిపుణో భాగంబున. మణులచే చేయ

బసిన మహావృషభమట శోభాయమానముగ నుండెను. విమానముముంగట. మేఘాకారమగు ధ్వజమెగురు చుండెను. ఆసతిబంగారు జల్తారు చీరగట్టి. రత్న జటితమగు రవికదొడిగి సకలభూషణంబులు ధరించి విమానాధిష్ఠితయై జను చుండ. వేత్రహస్తులై సేనలునటునీటు జనుచుండిరి. గణాధిష్ఠితు లందరుముందు జనుచుండిరి. మృదంగ తాళగీతాది వేణువీణావిశారదు లందరు. వాద్యఘోషణంబులు చేయుచు జనుచుండిరి. వేషభాషలతో కొందరు. నిరాడంబరులై కొందరు, స్త్రీపురుషులు వెంటజనుచుండిరి. ఆమహాదేవి ఇట్టి పరివారంబులతో గూడుకొని, ప్రియసఖీసమేతయైయుండ, మనోహర వజ్రదండంబులు గల చామరంబులతో, నిరువురు రుద్రకన్యకలు వీచుచుండిరి. ఆచామరంబుల మధ్యనా దేవి శోభాయమానముగ ప్రకాశింపుచుండెను. ఇంకనునామె యుద్ధము చేయుచు రెండు హంసలమధ్య నున్న పద్మంబువలె ప్రకాశింప జొచ్చెను. మరియొక సహచారిని, శశివిభమైన ముత్యాల హారములచే వ్రేలాడు ఛత్రమును బట్టియుండెను. ఆ ఛత్రకాంతి సతీముఖముపై తళతళ మెరయుచు సముద్రోత్ కలశయందలి చంద్రబింబము వలె ప్రకాశింప జొచ్చెను. మరియొక దూతిక ఆమె సరసను కూర్చుని ఆమెతో పాచికలాడుచు సంతసపరచు చుండెను. మరియొక చేటికరత్న భూషితములగు పాదుకలామె పదంబులకు దొడుగుచుండెను. మరియొక నెచ్చెలి ఆమె స్తనద్వయమధ్యంబున, హారంబులు సవరింపుచు, దర్పణము జూపించుచుండెను, మరియొకసఖి వీవనచే విసరుచు తాంబూలపేటిక చేతికందిచ్చు చుండెను. మరియొక భామిని, కీడాశుకమును. చేతికందిచ్చుచుండెను. మరియొక మోహనాంగి. మనోహర సుగంధపుష్పంబులు జడపై యలంకరింపుచుండెను. మరియొక కమలనేత్రి యాభరణంబులలంకరింపుచుండెను. మరియొక విశాలాక్షి యామెకనులకు కాటుకబెట్టి మెడకు గంధమలదు చుండెను. మరియొక కొమ్మయేది కావలసినను అందిచ్చు చుండెను. ఇవ్విధంబుగ నీమెనెచ్చెలు లందరు. దేవిని పరివేష్టించి. సకలోపచారములు చేయుచుండిరి. ఈసఖిబృందమును ధ్యనాదేవి శరత్కాలతారల మధ్య చంద్రునివలె శోభిల్లుచుండెను. శివగణంబులన్నియు శంఖభేరీమృదంగాదుల మ్రోయింపుచు దేవివెంట జనుచుండిరి. ఇంకను మధురకాహళధ్వను లనేకములుగ మ్రోయింపుచుండిరి. మహేశతేజస్కులగు కొందరు గణంబులు సాయు

ధపాణులై జనుచుండిరి. ఆయుధధారులగువారు. సుదునెనిమిది వందలమంది. ముందుజనుచుండిరి. ఇంకను కుమారస్వామి వంటి యనేకగణములు. వృషభారూఢులై గజారూఢులై జనుచుండిరి సోమనందీశ్వరులు గణనాయకులచే పూజింప బడుచు జనుచుండిరి. దివినుండి సురలు సుఖప్రదములైన దుందుభులు మ్రోగింపుచుండిరి. సిద్ధయోగులు. మునీశ్వరులు. ముదముతో నృత్యముచేయుచు జనుచుండిరి. దేవవిమానంబుపై జలధరంబులు. కుసుమ వృష్టికురియింపుచుండెను. దేవతలందరు ఈపరివారంబుతో కలసికొని జనుచుండిరి. వీరందర గూడుకొని దాక్షాయణి దక్షసదనమున కేతెంచ వినాశకాలముచే దక్షుడు కూతునిగాంచి కోపించెను. ఈమె చెల్లెళ్లు ఈమెను గాంచియు సత్కరింపకుండిరి. శశిముఖియగు నీయంబిక. తండ్రిచే నిరసింపబడి, క్రుద్ధురాలై, ఓతండ్రీ! బ్రహ్మాలగాయతు పిశాచాంతము వరకు నే దేవనర్చించెదరో అట్టి శివుని నీవర్చింప కుంటివి. నాతోడబుట్టువుల నందిరిని గౌరవించి నన్నేల నిరశింపుచుంటివి? నేను తండ్రిచే పూజింప బడక నిందితురాలనైతినని దేవిపలుక దక్షుడు సతినిగాంచి క్రోధావిష్టుడై. నీకన్నను, నీభర్తకన్నను నీసోదరీమణులు వారి భర్తలు శ్రేష్ఠులని వారిని గౌరవించితిని వారందరు నన్ను గౌరవించిరి. నీభర్తయగు త్ర్యంబకునికంటె వారిభర్తలందరు నధికగుణవంతులు, నీభర్తయగు శివుడు స్తబ్ధాత్ముడు. తామసుడు. నాశనకారకుడు. అట్టివానికి నీవు భార్యవై యుంటివిగాన నిన్ను కూడ తిరస్కరించితిని భవుడునాకు ప్రతికూలుడుగాన నిన్ను నేనవమానింపు చుంటినన, దక్షుని క్రోధవాక్కులు విని సభాసదు లందరు వినుచుండనో తండ్రీ! నిర్దోషియగు నాభర్తను నీవు నిందింపు చుంటివి.

శ్లో॥ విద్యాచోరో గురుద్రోహీ.
దేవేశ్వర విదూషకః.
త్రయైతే బహుపాప్మాన
స్సర్వేదండ్యా ఇతిశ్రుతిః.

విద్యాచోరుడు, గురుద్రోహుడు, దేవదేవ దూషకుడు వీరందరు మహాపాపులు దండార్హులని శ్రుతిచే చెప్పబడెను. వీరందరు నత్యుత్కట పాపులతో సమానులు. త్వరితముగ దారుణమైన దండన నాపరమేశ్వరుడే నీకు విధించును.

నీవు శివుని దూషించి సత్కరింప కుంటివి గాన నీకులమంతయు దుష్టమగును. నీవు నశించెదవని శపించి యాసతిరోషావృతయై దేహము త్యజించెను. లబ్ధ పుణ్య ఫలోదయుడు శ్రీమంతుడు. పర్వత ప్రవరుడు నగు హిమవంతుడు ఈ దేవిని పుత్రికగా బడయుటకై చిరకాలము దుశ్చర తపము గావింప నీశ్వరి ప్రసన్నురాలై హిమవంతు ననుగ్రహించి తన యోగమాయచే పర్వత రాజునకు పుత్రికయై జనించెను. సతి భయవిహ్వలయై తండ్రిని దూషించి జనిన తరి, మంత్రము లదృశ్యములై మఖము ధ్వంసమయ్యెను. సతీ దేహత్యాగము నీశ్వరుడు విని కోపించి దక్షుని గాంచి ఓరీ నీవు నాభార్యను నన్ను నవమానించి మిగిలిన జామాతలను, పుత్రికలను గౌరవించితివి గాన వైవస్వత మన్వంరము నీకు నే నల్లుడను గాకుందును. మనుజులకు రాజువై దక్షనామంతో ప్రాచీన బర్హికి పౌత్రుడవై యుందువు. ఓ దుర్మతీ నీకపుడు నేననేక విఘ్నంబులు గావించుచుందును. నీధర్మార్థ కామంబులకు మాటిమాటికి విఘ్నమును గావింతును. యమితతేజస్కుడగు రుద్రుడు శపింప దక్షుడు తన స్వాయంభువ శరీరము చాలించి ప్రాచేతసులకు దక్షుడై జనించెను. భృగ్వాదులందరు శివ శాపముచే వైవస్వత మన్వంతరమున బ్రహ్మ యజ్ఞమందు వరుణ పుత్రులై జనించిరి. వైవస్వత మన్వంతరమున ధర్మార్థమై దక్షుడు యజ్ఞము చేయుచుండ నీశ్వరుడు దానికి విఘ్నములు గావించెను.

శివ మహా పురాణము నందలి వాయవీయ సంహితయందు
పదునెనిమిదవ అధ్యాయము సంపూర్ణము

---

## పందొమ్మిదవ యధ్యాయము

### వీరభద్రోత్పత్తి

మహాత్ముడగు దక్షుడు యజ్ఞముచేయుచుండ మహేశ్వరుడెట్లు విఘ్నముచేసెనో తెల్పుమని ఋషులు ప్రశ్నింప వాయువిట్లు చెప్పనొడంగెను. జగన్మాత యగు నా దేవితన తపోబలముచే హిమవన్నగమునకు, పుత్రికయై

జనించి శివుని వివాహమాడి భర్తతో బహుకాలము హిమాలయమున క్రీడించెను, వైవస్వత మన్వంతరమున దక్షుడు ప్రాచేతసపుత్రుడై ఋషి సంసేవితమైన హిమవత్పృష్ఠమందలి గంగాద్వారంబున సవనముచేయ నారంభించెను, ఈక్రతువునకు శక్రుని పురస్కరించుకొని సకలదేవతలు వచ్చియుండిరి. ఆదిత్యులు, వసువులు, రుద్రులు, సాధ్యులు, మరుద్గణములు సేతెంచిరి, ఎండపానము చేయువారు, సోమపానముచేయువారు, నాద్యపానముచేయువారు, ధూమపానముచేయువారు, ఈక్రతువునకే తెంచిరి. అశ్వినిదేవతలు, తదితర దేవతలు, మహర్షులు, విష్ణుసహితముగ యజ్ఞభాగం లందరువచ్చిరి, ఈశ్వరుడు వినా సకలదేవతలు నీ మఖమున కేతెంచుట దధీచిగాంచి కోపోద్రిక్తుడై యపూజ్యులను పూజించినను, పూజనీయులను పూజింపకున్నను, పాపము సంభవించుటలో సందియములేదు. అసత్పురుషుల గౌరవించి, సత్పురుషుల నెవరు నిందితురో అట్టివారు దేవదండన మొంది సద్యఃపతితులగుదురని దధీచి దక్షునితో బలికె ఓదక్షా, పూజ్యుడగు పశుపతిని నీవెందుల కర్చింపకుంటివన, దక్షుడు ఆ మహేశ్వరుడెవడు! అతడెవడో నాకు తెలియదు. శూలధరులగు నేకాదశరుద్రులు నాకడకు వచ్చియేయుండిరిగదా యన, దధీచి అదేమి యట్లనుచుంటివి? యెందరిదేవతల నర్చించినను నామహేశ్వరునితో సరిరారు. ఫలితములభింపదు. రుద్రుడనగా జన్మమునకురాజు, అట్టివానిని, నీవు పూజింపకుంటివి. అవ్యయుడు, ప్రభుడునగు నీమహేశుడే, బ్రహ్మవిష్ణురుద్రుల సృజించి, వారిచే నర్చింపబడుచుండెను, బ్రహ్మమొదలు పిశాచాంతమువరకు నితనిని పూజింతురు, అతడు ప్రకృతి పురుషులకన్న పరుడు తత్త్వదర్శులు, యోగులు, ఋషులు నతనిని చింతింపుచుందురు. ఇతడక్షరుడు పరబ్రహ్మ సదసత్స్వరూపుడు అనాదిమధ్యనిధనుడు, అప్రతర్క్యుడు, సనాతనుడు, సృష్టిస్థితి సంహారకారకుడు, యజ్ఞమునందు మహేశ్వరుడు వినా, యన్యమేదియు గోచరింపదు. శంకరుడు లేని క్రతువుచేయకు మన దక్షుడు ఈమఖమందు మంత్రపూర్వకముగ హావిస్సు స్వర్ణపాత్రయం దుంచబడియుండెను, ఈ యూహవనీయాగ్నియందు విష్ణువునకే భాగమిచ్చెదను అతడే యజ్ఞభోక్త యజ్ఞకర్తయునైయుండెనన, దక్షువాక్కులు విని దధీచి క్రుద్ధుడై, యజ్ఞవాటికవీడి. తనయాశ్రమమునకు జనెను. ముందువచ్చెడియనర్థము లెరింగి దధీచివెళ్ళినంతనే, దక్షు

నివీడి దేవతలందరు వారి వారి నిలయములకేగిరి. దక్షుడు మఖమాచరించుట పార్వతియెరింగి యజ్ఞముధ్వంసము చేయుమని యీశ్వరునకు ప్రబోధింప నీశ్వరుడు గణేశ్వరుడగు వీరభద్రునిసృజింప నతడు సహస్రవదనుడై, సహస్రకమలేక్షణుడై సహస్ర ముద్గరధారియై, సహస్ర శరపాణియై, శూలటంకగదాహస్తుడై దీప్తకార్ముకధరుడై, ఘోరచక్రవజ్రధరుడై, చంద్రార్ధశేఖరుడై, వజ్రాయుధ హస్తుడై, తటిత్ప్రకాశ మానమూర్తుడై దంష్ట్రాకరాళవదనుడై, మహోదరుడై విద్యుజ్జిహ్వాప్రలంబోష్ఠుడై, మేఘసాగరనిస్వనుడై. వ్యాఘ్రవసనుడై మహా రుధిరస్రవుడై, ప్రలంబ ఒక హోలకుండలద్వయుడై, వరామరశిరోమాలుడై, నీలకుంచితకేశుడై, రణన్నూపురకేయూర మహాకనక భూషితుడై, రత్నసంచయదీప్తతారహారోరస్కుడై, మహాశరభశార్దూల సింహసదృశ విక్రముడై ప్రశస్త మత్తమాతంగ సమానగమనుడై, శంఖచామరకుందేందుమృణాలసదృశప్రభుడై తుషారాద్రిసమాన గమనుడై, జ్వాలామాలాపరిక్షిప్తదీప్తమౌక్తికభూషణుడై, యుగాంతదీప్యమానపావకప్రకాశమానుడై. రుద్రునకు సాష్టాంగ దండప్రణామంబు లాచరించి దేవదేవుడగు నీశ్వరుని పార్శ్వభాగంబున సమాస్థితుడై యుండమహేశ్వరి యగు, పార్వతి తనయంశ యగు భద్రకాళిని సృజించి, కర్మసాక్షిగ, వీరభద్రుననుసరింపు మని యాజ్ఞాపించెను. కాలాగ్ని సదృశుడగు వీరభద్రుడు భద్రకాళీయుతుడై యుండుటగాంచి. మాకు మంగళములు చేకూరుగాక యని శంకరుడాశీర్వదించెను. అపుడు వా రుభయులు మేమేమి చేయవలయునో యాజ్ఞాపింపుడని రుద్రునవేడ. త్రిపురాంతకుడగు శివుడు హైమవతీ హితమునకై గంభీర వాక్కులతో. ఓవీరభద్రా! ప్రాచేతసదక్షుని యజ్ఞము వెంటనే వినాశనముచేయుము. భద్రకాళిని నీ సహాయార్థము వెంటగొంపోవుము. నేను పార్వతీసహితుడనై. రైభ్యాశ్రమ సమీపమునుండి, నీ దుస్సహావిక్రమంబును గాంచుచుందును. గంగాద్వారసమీపమునందలి. కనఖలవృత్తి ప్రదేశంబున. సువర్ణసదృశమగు నదియు, మేరుమందరతుల్యము లగు ప్రదేశంబులు దక్షుడు మఖము గావించుచుండెను. నీవు త్వరితగతి నట కేగి మఖధ్వంసము గావింపు మని శంకరుడు బలికె. పార్వతి వీరభద్రుని తన బిడ్డనిగ భావింపుచు, ధేనువు తన బిడ్డనాదరించు నట్లు భద్రకాళి వీరభద్రుని యాద

రింపుచు నాలింగన మొనర్చుచు. షణ్ముఖునివలె మూర్ధాఘ్రాణము చేయుచు సస్మితవదనయై. మధుర వాక్కులతో నో మహాపరాక్రమా! ఓ మహా భాగా! ఓబిడ్డా! వీరభద్రా! నాప్రియమునకై నీవు జనించితివిగాన, నాక్రోధము శాంతింపజేయుము. యజ్ఞేశ్వరుడగు నాభర్తను పిలువకుండ, దక్షుడు యజ్ఞము చేయుచుండెను. గాన దక్షునితో వైరమూని, నీవామఖధ్వంసము గావింపుము నీవు నాయాజ్ఞచే, యజ్ఞలక్ష్మీ శోభను భంగపరచి. యజమానుడగు దక్షుని హింసించి, చంపి భద్రముగరమ్మన, చిత్రకృత్యులగు శివపార్వతుల యాజ్ఞను, వీరభద్రుడు శిరసావహించి. శిరమువంచి నమస్కరించి, పార్వతీదేవి కోపము శాంతింపజేయుటకు. క్రోధోద్రిక్తుడై, ప్రేతవాసుడగు నావీరభద్రుడు, తన రోమకూపములనుండి రోమజాలనెడి. యనేకవేల గణముల సృజించి. తనదక్షిణ భుజమునుండి శతకోటి, గణంబులను. పాదయూరుజంఘ. పృష్టపార్శ్వము ఖగళ. గుహ్యగుల్ఫ శిరోమధ్య ముఖోదరములనుండి, తనతో తుల్యపరాక్రములగు ననేకవేల గణంబుల సృజించెను. వీరందరు భూమ్యాకాశంబులు వ్యాపించియుండిరి. వీరుసహస్రహస్తులై సహస్రాయుధపాణులై. రుద్రసమప్రభులై, రుద్రానుచరులై, శూలశక్తిగదాహస్తులై, టంకోపల శిలాధారులై కాలాగ్ని రుద్రసదృశులై, త్రినేత్రులై, జటాధారులై, అంబరమున కెగురుచుండిరి. అనేకమంది సింహారూఢులై యుండిరి. ఈభద్రగణంబులన్నియు వర్షాకాల జలదంబులవలె గర్జింపుచుండెను. ఇట్టిసైన్యముతో వీరభద్రుడు పరివృతుడై కాలానలశతంబులతో గూడిన కాలభైరవునివలె ప్రకాశింపుచు. మౌక్తిక ఛత్రంబును. శ్వేతచామరంబును ధరించి జగద్గురుడగు పరమేశ్వరుని పార్శ్వమున శైలేంద్రమువలె వీరభద్రుడు, భసితప్రభలు గలవాడై, ప్రకాశింప జొచ్చెను. కంపుడనెడువాడు, హేమరత్నాలంకృతుడై, వీరభద్రుని ముందునిలబడి, శంఖముపూరింప, దేవతలు దుందుభులు మ్రోయించిరి. మేఘములతనిశిరముపై, సుమవర్షములు కురియించిరి. వాయువులు సుగంధ కుసుమ బాటలు పరుచుచుండెను. గణంబులన్నియు నాపూలబాటలయందు. యుద్ధమహోత్కటులై నాట్యము చేయుచు సంతసమొందుచు, గానముచేయుచు పయనము సాగించుచుండిరి. శివపార్వతులవలె. భద్రకాళీ వీరభద్రులు బయలుదేరి హిరణ్మయ వికారమగు దక్షునియాగ వాటికచేరి. ప్రళయకాలమం

దలి జీవులను పరమేశ్వరుడు పడగొట్టినట్లు యజ్ఞవాటికయందున్న ప్రధానుల నందరిని భూమికొరుగునట్లు చేయుచుండెను.

శివమహాపురాణము నందలి వాయవీయసంహితయందు
పందొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువదవ యధ్యాయము

### దక్షయజ్ఞ విధ్వంసనము

మరల వాయు విట్లు చెప్పదొడంగెను. విష్ణ్వాది ప్రధాన దేవతలతోను, చిత్రధ్వజంబులతోను శోభించుచున్న యజ్ఞమండప మంతయు వీరభద్రుడు గాంచుచుండెను. కుశలతో నాచ్ఛాదింప బడిన ప్రజ్వలితాగ్నులను సలంకృతములైన కాంచన క్రతుభాండంబులను, యథావిధిగ సమస్తముగ క్రియలు చేయించు ఋషులను, వేదములు క్రమముగ సుస్వరంబులతో బల్కు విప్రులను నాట్యము చేయుచున్న యప్సరసలను వేణు వీణారవంబుల చేయువారలను, వేదఘోషలు చేయువారలను గాంచుచు ప్రతాపవంతుడగు వీరభద్రుడు గంభీర జలదంబువలె సింహనాదము చేయుచుండెను. వీరభద్ర గణంబులు చేయు కిలకిలారావంబులు సాగరఘోషలను మించి మిన్నుముట్టుచుండెను. ఈ శబ్దఘోషలు విని కొందరు భీతిజెంది పరుగిడుచు వస్త్రాలంకారములు జారవిడుచుచుండిరి. అట్టితరి మేరువు వంగెను. పృథివి చలించెను. దీనికి కారణ మేమని సురులు భీతిజెందిరి. గహనమందు మృగేంద్ర నాదము విని గజేంద్రములు పరుగిడు నట్లు జీవితాశచే దేవత లందరు పరుగిడు జొచ్చిరి. ఇంకను వారి భయంకర ఘోషలచే పర్వతములు బ్రద్దలగుచుండెను. పవనము చలించుచుండెను. సాగరములు క్షోభించుచుండెను. అగ్ని సూర్యులుల ప్రకాశులై యుండిరి. గ్రహనక్షత్ర తారకులు ప్రకాశింప కుండెను. అట్టి సమయంబున వీరభద్రుడు కాళితోను గణంబులతోను యజ్ఞవాటిక ప్రవేశించెను. వారలగాంచి దక్షుడు లోలోన భయపడుచు పైకి ధైర్యమూని దృఢ

చిత్తుడై వీరభద్రుని గాంచి నీవెవడవు? ఇటకేతెంచుటకు కారణమేమని క్రోధముతో బలుక దురాత్ముడగు దక్షువాక్యములు మహాతేజుడగు వీరభద్రుడు వినియుండ హాసముచేయుచు, దేవతలను ఋషులను గాంచుచు మేఘగంభీర సదృశంబులగు వాక్యములతో మేమందరము నమిత తేజస్కుడగు శర్వుని యనుచరులము. మాభాగములకై మేమువచ్చితిమి. మాక్రతు భాగములు మాకిమ్ము. సురులందరకు భాగములిచ్చి మాకివ్వకుండుటకు కారణమేమి? మాకు భాగమీయకున్నచో మాతో యుద్ధము చేయుమన వీరభద్రుని పలుకులు వీని దక్షాది దేవతలందరు నేమంత్రములలోను యీశ్వరునకు భాగమిమ్మని లేదని బలుకుచు మంత్రముల ద్వారా వారి క్రియలు వారొనర్చుకొనుచు నీశ్వరునకు భాగమీయకుండుటచేతనే వీరభద్రుని కొట్టుటకు సిద్ధపడుచుండ వీరభద్రుడు వారలగాంచి ఓ విష్ణ్వాది దేవతలారా! మీరు మదగర్వితులై యీశ్వరునకు భాగమిచ్చెడి ప్రమాణమంత్రము వేవియు లేవని చెప్పుచుంటిరి. ఈ మఖమునందు మాకు భాగము లీయక మమ్మవమానించుటకు కారణమేమి? ఈ కారణముచే మీగర్వములు చూర్ణము చేసెదనని బలుకుచు తన త్రినేత్రములచే యజ్ఞమండప మంతయు భస్మము చేయుచుండ రుద్రగణముల వారందరు యజ్ఞమండప స్తంభము లూడబెరికి హోమముచేయుచున్న మహర్షు లందరినీ రజ్జువులచే కంఠములు బిగించి స్తంభములకు కట్టి హింసించుచు క్రతు పాత్రలన్నియు ముక్కలు కొట్టి నదిలో పడవైచుచు సవన పరికరము లన్నియు గంగలో పడవైచుచుండిరి. అన్నము నందున్న పర్వతోపమానములైన యన్నపానంబులు రసాయనంబులు క్షీరనదులు నవనీత సరస్సులు దధికర్దమంబులు ననేక విధభక్ష్య భోజ్యంబులు రసవంతంబులై పానీయంబులు ననేక విధంబులైన లడ్డూ పూరీ జిలేబి మొదలకు పిండివంటలు, పచ్చళ్లు మొదలగు పదార్థము లన్నియు భుజింపుచు తిని నన్నిటిని పారవేయుచు వజ్ర, చక్ర మహాశూల శక్తి పాశ పట్టిసంబులచేతను ముసలఖడ్గ, టంక భిండిపాల పరశ్వధములచేతను లోకపాల పురస్సరముగ దేవత లందరిని కొట్టుచుండిరి. అట్టితరి యగ్నులు ప్రకాశింప కుండిరి. భాస్కరుడు తేజోహీనుడై యుండెను. గ్రహముల ప్రకాశములై యుండిరి. తారకలు వెలవెల బారెను. వీరభద్ర గణంబు లన్నియు కొట్టుడు, తిట్టుడు,

చూర్ణము చేయుడు. భగ్నమొనర్పుడు, హరింపుడని భయంకర శబ్దములతో బలుకుచు మహర్షులను ఋషీశ్వరులను ఋత్విక్కులను పట్టి ఈడ్చి తెచ్చి ఒక్కొక్కరి నొక యవయవము భంగము చేయుచుండిరి. ఆశ్రమ వాసులగు తపోధను లందరిని కొట్టి చంపుచుండిరి. వారి హస్తముల యందలి స్వర్ణకంబులు బలాత్కారముగ లాగి యగ్నియందు, జలమునందును విసరుచుండిరి. అందున్న కలశలు బ్రద్దలు కొట్టి పారవేయుచుండిరి. మహావేదికలు భగ్నపరచుచుండిరి. పెద్దగా నట్టహాసములు చేయుచు నవ్వుచు గానము చేయుచు వారి నెత్తురులనెడి సురను గ్రోలుచు నృత్యములు చేయుచు ఇంద్ర సహిత దేవతలను వారి గణంబులను, మృగేంద్ర నాగేంద్ర వృషేంద్రాదుల పరాక్రమవంతులను పీడించుచు నిందించుచుండిరి, కొందరు పెద్దగ గర్జించుచుండిరి. కొందరు కొట్టుచుండిరి. కొందరు పరిగెత్తించుచుండిరి. కొందరు నృత్యము చేయుచుండిరి. కొందరు నవ్వుచుండిరి. కొందరు గ్రేలుచుండిరి. కొందరు మదించి మేఘములపై కెగురుచుండిరి. కొందరు గగనసూర్యుని పట్టుకొనుటకై పై కెగురుచుండిరి. కొందరు పవనములవలె వియద్భాగమున కెగురుచుండిరి. కొందరు భీమపరాక్రమములైన ప్రమథులు గరుడులు సర్పములను వేటాడినట్లుగ సురల నీడ్చి కొట్టుచుండిరి. కొందరు పర్వతసన్నిభులగు ప్రమథులు గగనముపై కెగురుచు దేవతలను పరిగెత్తించుచుండిరి. కొందరు గృహములను వేదికలను పెకలించి పారవేయుచుండిరి. కొందరు సకల వస్తువులను గంగలో పడవైచి కాలమేఘమువలె గర్జించుచుండిరి. కొందరు ద్వారములు గవాక్షములు లాగి పారవేయుచుండిరి. ఇవ్విధంబున యజ్ఞము చూడవచ్చిన వారి వసతి గృహంబు లన్నియు విరిచి ముక్కలు చేసి భగ్నము చేయుచుండ అయ్యో నాథా యనియు తండ్రీయనియు అన్నాయనియు, సోదరాయనియు నారందరు పలువిధముల నేడ్వసాగిరి.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు

ఇరువదవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువది ఒకటవ యధ్యాయము

## దేవతాసిక్షణము.

దేవతాముఖ్యులందరు. విష్ణుశక్రాదులను పురస్కరించుకొని భయవిహ్వాలులై. పరుగిడుచుండ, వీరభద్రగణములు, దండాస్త్రాల శిక్షింపుచు నదంద్యులవీడు చుండిరి. వీరభద్రుడు క్రోధతామ్రాక్షుడై, త్రిశూలధారుడై, నిప్పులుగ్రక్కుచు, పైకిజూచుచు, సింహము గజయూథముల పరుగిడజేయునట్లు దేవతల పరుగెత్తించుచు, వారివెంట తాను మనోహరముగ నడుచుచు చూచువారలకు, మదించిన యేనుగుగున్న యాయున్నట్లు గోచరింపుచు, బలవంతుడై, సురయూథంబుల భయపెట్టుచు, మత్తవారణము, మహాసరోవరమును మథించి నీలపాండులోహిత వర్ణంబుగ జేసినట్లు. వారలకలత బెట్టుచుండెను. స్వర్ణపుగావులతో సమర్చబడిన. వ్యాఘ్రాజినములుచించి, చిందరవందర చేయుచుండిరి. పొదలయందగ్ని హోత్రుడువలె వీరభద్రుడు దేవతలనడుము సంచరింపనాగెను. శూలధరుడై యితడొక్కడు తిరుగుచుండ, వేయిమంది తిరుగుచున్నట్లు తలంచుచుండిరి. భద్రకాళి శూలధారిణియై. క్రుద్ధురాలై రణమందు దేవతలను పీడించుచుండెను. రుద్రకోపసముద్భవుడగు వీరభద్రుడు యుగాంతాగ్నివలె ప్రజ్వరిల్లుచు. భద్రకాళితో. గలసి, వేవతలను మర్దింపుచుండెను. కల్పావసాన మందలి యగ్నిజ్వాలలవలె వీరభద్రుడు ప్రజ్వరిల్లుచు జగత్తులదహింపజేయు నాయున్నట్లుండి సప్తాశ్వరథస్థుడగు సూర్యుని శిరము విలాసమున తనయెడమ పాదముతో తన్ని ఖడ్గముచే పావకునిగొట్టి. యముని శాసించి. దృఢశూలముచే నేకాదశరుద్రులను. ముద్గరముచే వరుణుని. దృఢపరిఘముచే నిరుఋతిని, టంకముచే వాయువును, గొట్టెను. ఇవ్విధంబున వీరభద్రుడు శివవిరోధులందరిని తగినట్లుగ శిక్షింపదలచి. సరస్వతి, నాసికాగ్రభాగంబును, అదితిహస్తాగ్ర భాగమును, గాయపరచియుండెను. తదుపరి యగ్నియొక్క బాహుదండములుకుఠారముచే ఛేదించి అతని జిహ్వాగ్రము రెండంగుళంబులు ఖండించి, స్వాహాదేవి దక్షిణనాసికాగ్రము ఛేదించి, వామస్తనచూచుకాగ్రమును ఖండించెను. శతపత్ర సమప్రభములగు భగుని ఆయత నేత్రములు మిక్కిలి వేగముతో జని అకస్మాత్తుగ నూడబెరికెను. పిమ్మట,

శివునకు భాగమిమ్మని స్పష్టముగ చెప్పకుండుటచే ముక్తావళి సమప్రభమైన పూషుని దంతపంక్తులు ధనుష్కోటిచే త్రెంచివేసెను. తదుపరి చంద్రుని తన పాదాంగుష్ఠముచే విలాసముగ నల్లినట్లె నలిపి భువిపై బడవైచెను. తదుపరి దక్షభార్య, హాహాకారముచే చేయుచు దుఃఖించుచుండ, దక్షునిశిరము ఖండించి భద్రకాళి కివ్వగనామె యాశిరమును గ్రహించి ఆనందముతో నృత్యముచేయుచు. తాళఫలమువంటి యాశిరమును రణరంగమున కందుకక్రీడలాడుచుండెను. దక్షభార్యయగు వీరిణి కుచ్ఛితస్త్రీ మగనిని గొట్టినట్లు గణేశ్వరులందరిని కరచరణంబులతో గొట్టుచుండెను. తదుపరి రుద్రగణంబుల రిష్టనేమిని! సోముని, ధర్ముని, ప్రజాపతిని, బహుపుత్ర సంతుడగు అంగిరసుని, కుశాశ్వుని, కశ్యపుని కంఠములబట్టి మెల్లిత్రిప్పుచు పీడించి శిరములపై పిడికళ్ళ గ్రుద్దుచుండిరి. భూతప్రేత పిశాచంబులు. దారాపుత్రులతో గూడిన కుటుంబమును భయపెట్టి పీడించినట్లుగను, కలియుగమునందలి రాజులు కులస్త్రీలను భయపెట్టినట్లుగను సింహవిక్రములగు గణంబులు వారలభయపెట్టుచుండిరి. ఇంకను అటనున్న కలశములన్నియు భగ్నముచేసి, వేదికలన్నియు విరిచివేసి. యూప స్తంభము లూడబెరికి. తోరణములు త్రెంచివేసి, యజ్ఞశాలలు తగులబెట్టి. దేవతల బెదరగొట్టి. తపోధనులజంపి. వేదఘోషలు లోపింపజేసి, మనుజహననముచేసి, యాగసంభారముల నశింపజేసి. స్త్రీలనుదుఃఖింప జేసి యజ్ఞస్థానమంతయు శూన్యవనముగ జేసి; శూలముచే కొందరి బాహువులను? కొందరియూరువులను వక్షంబులను శిరంబులను ఖండించి పారవేయుచుండిరి. ఇట్లు భిన్నభిన్నాంగులై దేవతలు బుష్ణులుపడియుండ వీరభద్రుడు యాగవహ్ని యాగ్నికుండము దరికిరాగ, కాలాగ్నిసన్నిభుడగు వీరభద్రుని గాంచి యజ్ఞేశ్వరుడు మరణభీతిచే కృష్ణమృగమై పారిపోవుచుండ, వీరభద్రుడు ధనువునాకర్ణాంతము వరకులాగి ధనుష్టంకారము చేయుచు సాయకము సంధించి ద్యావాపృథువులు నిండునట్లుగ నారీఘంకారము చేయుచు యజ్ఞేశ్వరునిపై శరమువిడువబోవ, హాతోస్మి హతోస్మి యని యజ్ఞమూర్తి భయపడుచు, వెంటాడుచున్న వీరభద్రుని తప్పించుకొని పారిపోవుచుండ, వీరభద్రుడు తనిపై సాయకమేయ నాయజ్ఞమూర్తి శిరముఖండింపబడి నేలబడెను. విష్ణువిది గాంచి, సూర్యసన్నిభుడగు వీరభద్రునిపై కోపించి, యుద్ధము చేయదలచి, పన్నగాశనుడగు గరు

త్స్మంతుని, స్మరించి యత మూపురముపై నధిష్ఠించి శేషించిన దేవతలను, దేవేంద్రుని వెంటనిడుకొని వీరభద్రుని సమీపించుచుండ, సింహము సృగాల ములగాంచునట్లుగ వీరభద్రుడు వారలను గాంచుచుండెను.

శివమహాపురాణము నందలి వాయువీయ సంహితయందు
ఇరువది ఒకటవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది రెండవ యధ్యాయము

### దక్షయజ్ఞ విధ్వంసనము

ఇంతలో వినువీధిని యొక రథ మావిర్భవించెను. అది సహస్ర సూర్య సంకాశమై వృషభ ధ్వజ శోభితమై, అశ్వద్వయ సంయుతమై, చక్ర చతుష్టయము గలదై, సకల దివ్యాస్త్ర శస్త్రసంభరితమై యుండెను. అది త్రిపురాసుర సంహారమందు ఈశ్వరు డధిష్ఠించిన రథమువలె శోభించుచుండెను. అందు దారుకు డధిష్ఠించి యుండెను. ఆరథము విష్ణువు గాంచుచుండగ వీరభద్రుని కడకు వచ్చి, వీరభద్రా! నేను శివాజ్ఞచే నీకొరకై ఈ యురథము తెచ్చితిని. నేను బ్రహ్మను. నీవిది యధిష్ఠింపుము. రైభ్యాశ్రమంబున శంకరుడు పార్వతీ సహితుడై నీపరాక్రమము గాంచుట కేతెంచి యుండిన రణకుంజరుడగు వీరభద్రుడు బ్రహ్మవాక్కులు విని అనుగ్రహముగలవాడై, రథమధిష్ఠించి బ్రహ్మను సారథిగ జేసికొని త్రిపురాసుర యుద్ధ మందలి పరమేశ్వరునివలె శోభించుచుండెను. మహాబలుడగు, భానుకంపుడు ఇందు, కుందసమ ప్రభమైన శంఖమును పూరింపుచుండెను. సాగరఘోష సదృశమగు ఈశంఖ నాదము విని భయపడజొచ్చిరి. యక్షవిద్యాధర సిద్ధనాగులి యుద్ధము చూడవచ్చి గగనమంతయు గప్పివైచిరి. అట్టితరి విష్ణువు శార్ఙ్గధనువు గ్రహించి మేఘములు వర్షధారల వలె వీరభద్రునిపై శరవర్షధారలు కురియుంప నారంభించెను. వీరభద్రు డిది గాంచి చైత్రధనువును గ్రహించి యనేక బాణంబులచే విష్ణు బాణములు ఖడింపుచుండెను, వీరుభయులు భయంకర యుద్ధము

త్రిపురంబుల భస్మముజేసినట్లుగ తన నేత్రాగ్నిచే వారలదహింపజేయ, విష్ణువు కోపించి యమోఘమైన చక్రము ప్రయోగింప నుద్యుక్తుడుకాగా, భద్రుడా చక్రమును, విష్ణుహస్తంబున నేస్తంభింపజేసెను. విష్ణువెంతప్రయత్నించినను, చక్రముకదలకుండుటచేచే పెద్దగా గర్జింపుచు, చక్రముకదల్పజూచ్చెనుగాని అది యణుమాత్రము కదలకుండుటచే, విష్ణువు పాషాణంబువలె నిశ్చలుడై శృంగములులేని వృషభంబువలెను. శరీరములేని జీవమువలెను. కొట్టుకొనుచు నావేదనపడుచు, కోరలులేని సింగమువలెనుండ, నిట్టిదశయందున్న విష్ణువునిగాంచి దేవతలు క్రుద్ధమానసులై సింహమును బంధింపబోవు వృషభంబులవలె, వీరభద్రుని ముట్టడింపదలచి, సకలాయుధంబులు ధరించి వచ్చుచుండ వీరభద్రుడా దేవతలను నీచమృగంబులవలె గాంచుచు. తనగణములతో నట్టహాసము చేయుచు వారలను స్తంభింపజేయ వజ్రప్రహారముచే మును మూర్ఛితుడైన శక్రుడు చిత్తరువువలె నిలబడిపోయెను, దేవతలందరునుగూడ నాయుధములతో నస్తంభింపబడిరి. ఇట్లీ విధంబుగ వీరభద్రుడు స్తంభింపయుండ, వారందరు యుద్ధము చేయుసమర్థత లేక నిశ్చేష్టులై గాంచుచుండ, వీరభద్రుడు వారలపై, పర్వతములపై మేఘములు వర్షించినట్లుగ బాణవర్షములు కురిపించెను. పరిఘోపమములైన బాహువులన్నియు అగ్నిని గ్రక్కు సర్పంబులువలె ప్రకాశింపుచు, బ్రహ్మాస్త్రప్రథమమున సృజించిన ఘాతములాయన్నట్లు ప్రకాశింపుచు సూర్యకిరణములచే మేదిని గప్పబడినట్లుగ శరములచే గప్పబడియుండెను. వీరభద్రుని సువర్ణపుంఖములుగల శరంబులు, దేవతలపైబడి, మేఘములందలి మెరుపులవలె ప్రకాశింపుచు సర్పములు భేకములను గ్రసించినట్లుగ వారిగాత్రములను కబళింపుచుండెను. వారిగాత్రంబులన్నియు గాయపరచి, వీరభద్రగణంబులు రుధిరపానము చేయుచుండిరి. ఇంకనుపిదప కొందరి దేవతల ముఖంబులు. కొందరి భుజంబులు. కొందరిపార్శ్వంబులు ఖండించి భువిపైపడవేయుచుండిరి, సురలందరు భిన్నమస్తకులు. భిన్నబాహువులు. భిన్నహృదయములు గలవారై రక్షకులులేక కొందరు పారిపోవుచుండిరి. కొందరు గగనమ్ముపైకెగురుచుండిరి. కొందరదృశ్యులగుచుండిరి. కొందరుభువిలో దాగుకొనుచుండిరి. కొందరు గుహాలలో దాగుకొనుచుండిరి. కొందరు జలములో ప్రవేశించుచుండిరి. ఇట్లు దేవతలందరిని యంగవిచ్ఛేదములు గావించి, ప్రళయమునందలి భైరవు

# ఇరువది మూడవ యధ్యాయము

## దేవతలు కైలాసమేగి శంకరునిస్తుతించుట

మరల వాయువిట్లు చెప్పదొడంగెను. విష్ణ్వాది దేవతలందరు క్షతగాత్రులై కొంతతడవు బాధపడి వారియోగము లోచించుచుండ, వీరభద్రుని ప్రేరణచే, ప్రమథగణంబులన్నియు నేమముచేసిన దేవతలను పట్టితెచ్చి, కొందరి చేతులకు కొందరిగళములకు కొందరియుదరములకు లోహపుగొలుసులచే కట్టిబంధించి పీడించుచుండిరి. ఇదంతయుగాంచి నారాయణుడు బ్రహ్మఅద్రిజాతనయుడగు వీరభద్రునిగాంచి, ఓభద్రా! క్షతగాత్రులగు ఈదేవతలందరిని క్షమించి విడిచిపెట్టుము. నీకోపమును శాంతింపజేసి నీగణములనుపశమింపజేయుమని, భద్రుడు బ్రహ్మనారాయణులమొరనాలకించి తనగణంబుల నుపశమింపజేసి, దేవతలవిడిచియుండ నారాయణుడు దేవదేవ మంత్రియగు వీరభద్రునిగాంచి యంజలిఘటించి శివమహిమనిట్లు స్తుతింపదొడంగిరి.

ఓశివా! శాంతిస్వరూపా! యజ్ఞవిధ్వంసకా! త్రిశూలధరా నీకునమస్కారము, ఓవీరభద్రా! రుద్రపతీ! రుద్రస్వరూపా! కాలాగ్నిరుద్రరూపా! కాలహరా! కామాంగహరా! త్రిపురసంహారా! దురాత్ముడగు దక్షుని శిరముఛేదించితివి. అత్యిష్టుడగు దక్షుని దుష్టయజ్ఞమును, నాశనఫలమొసంగితివి నిందతులమగు మేమందరము నీచే శిక్షింపబడితిమి నీప్రతాపమునుచే మేమందరము భీతులమై దహింపబడుచుంటిమి ఓప్రభూ! నీవేమాకుగతివి నిన్నేశరణుపొందితిమి. రక్షింపుము రక్షింపుమని వేడుకొనిరి. వీరభద్రుడు దేవతలస్తుతులకు సంతసించి వారందరిని, నిగళబంధవిముక్తులజేసి ఈశ్వరసన్నిధానమున కంతరితుమునుండి గొంపోయెను. విష్ణ్వాది దేవతలందరు సగణంబులతోగూడి శర్వుడు, మహేశ్వరుడునగు, పరమేశ్వరునిగాంచి ప్రీతమానసులై భయముతో నమస్కరింప ప్రణతార్తిహరుడగు మహేశ్వరుడు దేవతలగాంచి నవ్వుచు నోదేవతలారా! భయమొందకుడు, మీరందరు నావారలు. మీరునన్నవమానించినను మిమ్ములతగినవిధముగ దండించి, మిమ్మనుగ్రహించితిని. నేనుకోపించినచో మీరుజీవింపనేలేరని, దేవతలందరు ఈశ్వరవాక్కులువిని భయమువీడి, ముద

ముతో నృత్యము చేయుచు, ప్రసన్నమనస్కులై యానందవిహ్వలచిత్తులై దేవదేవుడగు శివునిట్లు స్తుతింపదొడగిరి.

ఓ దేవా! నీవు సర్వలోకకర్తవు, హర్తవు, పరమేశ్వరుడవు, సత్త్వరజస్తమోగుణముల నాశ్రయించి బ్రహ్మవిష్ణుమహేశ్వరరూపములతో నొప్పుచుంటివి. నీవు విశ్వభావనుడవు! పావనుడవు. సర్వమూర్తివియును నగు నీకు నమస్కారము. అమూర్తివంతుడవైన నీవు భక్తానుగ్రహమునకై యీమూర్తిమంతుడవైతివి. ఓ శంకరా! నీయనుగ్రహము చేతనే గదా, చంద్రుడు క్షయరోగవిముక్తుడయ్యెను. సోమవారవ్రతపూజాదులచే, భర్తచనిపోయిన సీమంతిని, నీప్రసాదముచే మరల భర్తను బడసి సర్వసౌభాగ్యముల నొందె. పార్వతీ ప్రసాదముచే పుత్రులను బడసెను. శ్రీకరునకు తనపదవి నొసంగితివి. సుదర్శనుని రాజుల భయమునుండి తప్పించితివి. మేదుర భార్యయగు శారద వైధవ్యము నొంద నామెను మరల సౌభాగ్యవంతురాలను జేసి సకలైశ్వర్యంబు లొసంగితివి. భద్రాయువునకు విపత్తుల తొలగించి సుఖములు జేకూర్చితివి. నీసేవా భాగ్యమునే శౌనకుని సంసారబంధవిముక్తయై తరించెను. అని యిట్లు దేవతలు స్తుతింప విష్ణు విట్లు స్తుతింప దొడంగెను.

ఓ శంభో! నీవు త్రిగుణంబులచే త్రిమూర్తుల సృజించి సృష్టి స్థితి లయంబులు చేయుచుంటివి. నీవు సర్వతేజోవంతుడవై సర్వుల గర్వము హరింపుచుంటివి. నీవు సర్వవిద్యారూపుడవై సర్వానుగ్రహకారకుడవై యుంటివి. సర్వము నీవే. నీచే సర్వము జనించెను. ఓ యోగీశ్వరా రక్షింపుము. రక్షింపుము. మాయందు దయయుంచుమని స్తుతింప; బ్రహ్మ కృతాంజలి పుటుడై ఈశ్వరునిట్లు స్తుతింప దొడంగెను.

ఓ దేవా! మహాదేవా? ప్రణతార్తి భంజనా! నీకు జయమగు గాక. అపరాధులయందు దయచూపుటకు నిన్నుమించిన వారెవరుందురు. మృతప్రాయులగు దేవతలందరు నీదయచే జీవించిరి. నీవు ప్రసన్నుడవైనచో, మాకెట్టి యాపత్తులు నుండవు. దేవతల దూషణంబులన్నియు నీవు భూషణంబులుగ నంగీకరింపుము. దేవతలు యంగవికలులై యుండిరి. వారల రక్షింపుమన శంకరుడు పార్వతివైపు గాంచుచు బ్రహ్మను పుత్రవాత్సల్యముగ నెంచుచు, దేవతల శరీరాంగము లన్నియు యథాప్రకారంబుగ చేసియుండెను. సరస్వతి యదితి మొదలగు దేవమాతల యంగములు యథా

ప్రకారముగ జేసియుండెను. శివుని యాజ్ఞచే దక్షునకు బ్రహ్మ గొర్రె ముఖము ప్రసాదించి సజీవుని చేసెను. దానిచే దక్షుడు లేచి భయమొందుచు ననేకవిధంబులుగ నిట్లు స్తుతింప దొడంగెను.

ఓ దేవా ! జగన్నాథా ! లోకానుగ్రహ కారకా ! మహేశ్వరా ! నాయపరాధంబులు క్షమించి నన్ను మన్నింపుము. ఓ జగత్ప్రభో నీవు కర్తవు. భర్తవు. హర్తవునై యుంటివి. నీవు బ్రహ్మ విష్ణ్వాదు లందరికి ప్రభుడవని నేను తెలిసికొంటిని. నీవు సకల జగత్తుల సృజించి అందు వ్యాపించి విస్తరించి యుంటివి. గాన వీనిని నశింప జేయకుము. రక్షింపుమని దక్షుడు ప్రార్థింప శివుడు ప్రసన్నుడై నవ్వుచు భయపడకుమని పలుకుచు బ్రహ్మను సంతోష పెట్టుటకై దక్షునకు అక్షయమైన గణాధ్యక్ష పదవి నిచ్చి యుండెను, బ్రహ్మాది దేవతలందరు నీశ్వరు నిట్లు స్తుతింప దొడంగిరి.

ఓ శంకరా ! దీనబంధూ ! దేవేశా ! మహాప్రభూ ! మహేశ్వరా ! మాయందు కృపయుంచుము. నీకు నమస్కారము. మాయపరాధములు క్షమింపుము. ఓ మఖపాలా ! మఖాధీశా ! మఖవిధ్వంసకారకా ! మాయపరాధములు సైచి మాయెడ కృపజూపుము. ఓ దేవదేవ ! పరమేశ్వర ! రక్త ప్రాణాపహా ! దుష్టదండప్రదా ! నాయందు కృపజూపుము, నీకు నమస్కారము. నిన్నెరుంగని దుష్టుల గర్వము చూర్ణము చేయుచుందువు. నీయందాసక్తి చేతస్కులగు సత్పురుషులను రక్షింపుచుందువు. నీ చరిత మద్భుతమైనది. ఓ దీనదయాళూ ! మాసర్వాపరాధంబులు క్షమించి రక్షింపుమని వేడుకొన శంకరుడు వారి నుతులు విని సంతసించి ఓ దేవతలారా ! ఇదంతయు దైవవిధిచే జరిగియుండెను. ప్రారబ్ధవశంబుచే దైవము ప్రతికూలమై యిట్లు చేసియుండెను. మీరు నన్ను శరణు పొందుటచే మీయపరాధములు మన్నించితిని. మీరుచేసినకృత్యములు మరచి భయమువీడి మీస్థానములకు జనుడన విష్ణ్వాది దేవతలందరు దక్షయజ్ఞ విధ్వంసనము చెప్పుకొనుచు వారి వారి నెలవుల కేగిరి. తదుపరి పార్వతీ సహితముగ శివుడంతర్ధాన మొందెను.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ఇరువది మూడవ అధ్యాయము సంపూర్ణము

# ఇరువది నాల్గవ యధ్యాయము

## శివుడు మందరగిరియందు క్రీడించుట

శివుడు దేవితో యన్యత్ర యేటకేగి ఏమిసల్పెనో తెల్పుమని ఋషులు ప్రశ్నింప వాయువిట్లు చెప్పదొడంగెను. మహీధర శ్రేష్ఠుడు శోభాయుక్తుడు చిత్రకందరుడు నగు మందరగిరి, దేవదేవుడగు శివుడు దేవితో తనపై నివసించుటకై బహుకాలము తపంబుచేసెను. ఈ కారణంబుచే శివాశివులా మందరగిరిపై నివసించుటకేగిరి. అతని తపఃఫలంబుగా నా యుమాసంపతుల పాదపంకజస్పర్శసుఖంబు కొండకబ్బెను. ఆనగ సౌందర్యమును సహస్రవదనుడగు శేషుడు సైతము వర్షకోటి శతంబులైనను వర్ణింపనశక్యము. ఆ మహాశైలమునకు పార్శ్వతి సౌందర్యము గానాతీతము దుర్నిరూప్యమై యుండెను. ఆనగశోభయే నగనంబులకు లేకుండెను. ఉత్కృష్టంబగు నివాసంబులచే నగరియందు మధురమయ్యెను. శంకరుడు తన ప్రియురాలి ప్రీతికై యా గిరియందతి మనోహరంబగు నంతఃపురమొకటి నిర్మించెను. ఆనగమధ్య ప్రదేశంబున చదునుగ్గిన, చలువ రాళ్లతోను. విమల స్ఫటికంబులతోను. నా దంపతులు నివసించుటకనువుగానుండెను. శివుడు సదాయచట నివసించుటచే. జగత్తులన్నిటిని యా నగరము తిరస్కరించుచున్నదా యున్నట్లుండెను. జగన్మాతాపితరులగు పార్వతీపరమేశ్వరులా భూధరముపై నివసించి. స్నానపానములు విహారములు చేయుటచే నా శైలము కీర్తినలుమూలల వ్యాపింపచేసెను. లఘుశిలల స్పర్శముగల నిర్ఝరాంబువులు ప్రవహించుటచే నా నగాధిపతియు హాస్యభరితుడగు వానివలెనున్నట్లుండెను. నా శైలమంతయు చంద్రకాంతి వ్యాపింప శ్వేతఛత్రధారియగు రాజాధిరాజాయున్నట్లు శోభించుచుండెను. ఇరుగడల జలపాతంబులు చలించుచుండ నానగరాజమునకు వింజామరలు వీచుచున్నదా యున్నట్లుండెను. సూర్యోదయమగుచుండ, నా మందరరాజు సర్వాలంకార భూషితుడై, దర్పణము చూచుచుండెనా యున్నట్లుండెను. విహంగంబుల కూజితంబులు, వాయుసంచాలితమైన లతాభుజంబులచే పుష్పములు జల్లుచు, మృదుపల్లవంబులు ప్రేంఖణ వేయుచు. వృక్షముల ప్రాకుచుండు నా మహీరుహంబులన్నియు, జటామండల మండితులగు, మహర్షులాయున్నట్లు శోభించుచు. నానగరాజు నాశీర్వదించుచున్న నాయున్న

ట్లుండెను. పర్వతశిఖరంబు లూర్ధ్వాధోతిర్య గ్భాగముల వ్యాపించి యుండు టచే పృథ్వినధో తిర్యగూర్ధ్వ భాగంబుల వ్యాపించెనా యన్నట్లును, జగత్తును గాంచి నృత్యముచేయుచున్న దా యన్నట్లుండెను. మహాముఖంబులు. విపులో దరంబులుగల్గి నోరు తెరుచుకొని యున్నట్లుండెను. ఆగిరికందరంబులు శిథిలము కాని లావణ్యముచే జృంభణములు చేయుచున్న వా యన్నట్లుండెను. ఇంకను నాశైలము పూర్ణ జగత్తును మ్రింగునట్లుగను. సాగరమును పానముచేయునట్లు గను. చీకటిని వెడలగ్రక్కునట్లుగను మేఘముల తుడిచి వేయునట్లుగ నుండెను. ఆప్రదేశమంతయు అద్దమువలె నిగనిగలాడుచుండెను. వృక్షచ్ఛాయలు మనో వ్యథలదూరీ కృతములు చేయుచుండెను. నాతపతాపంబు లంతరింపజేయుచుం డెను. నదీతటాకాది జలస్పర్శలన్నియు శీతలముగనుండెను. శివపార్వతులు సం చరించిన తావులన్నియు సఫలీకృతము లయ్యెను.

తదుపరివై భ్యాశ్రమంబున దుష్టులగు శుంభనిశుంభులుండుటచే, వారి సంహారమునకై శివాశివులట కేగిరి, ఆరాక్షసులు బ్రహ్మచే వరములనొంది సర్వపురుషులు కవధ్యులై యుండిరి. వారికి బ్రహ్మ పురుష మాత్రుడెవడు మిమ్ము జగత్తులయందు జయింపలేడు కాని యంబికాంశ, సంభూతయు, యయోనిజయు, కన్యకయు. యెన్నడు పురుషస్పర్శ నెఱుంగనిదియు నగునా మెను కామవశులై మోహించి యుద్ధమున నామెచే మడియుదురని బ్రహ్మవా క్కులు వారంగీకరించి యది మొదలుగొని దేవతలందరిని జయించి యజ్ఞభా గంబులు లేకుండజేసి జగత్తునందు వేదవషట్కారంబులు లేకుండజేసిరి. దీనిచే బ్రహ్మయీదానవుల వధకై శివుని ప్రార్థించి ఓశంకరా! దేవికికోపము కల్గించి ఆమె తినయంగమునుండి యొక కన్యకను సృజించునట్లుచేసి, సురరక్షణకై శుం భులవధకు నాకన్యకనిమ్మని ప్రార్థింపశంకరుడు బ్రహ్మవాక్కుల నంగీకరించి నవ్వుచు. పార్వతిని ఓకాళీయని మాటిమాటికి సంబోధింపతాను శ్యామలము గనుండుటచే నిట్లుశివుడు పదేపదే హాసించుచుండెనని తలచి కోపగించి, ఓశం కరా! నాశరీరవర్ణము మీకిష్టములేనిచో నేనేమిచేయవలయును? మాటిమాటికి కాళీకాళీయని పిలుచుచునన్న వమానింపుచుండిరి. ఇట్లు నన్నెంత కాలము నిందించెదరు. నాయందు మీకు ప్రీతిలేనియెడల నీచెంత నెట్లుండగలను! ఇష్టములేని, కాపరము నాతో మీరెంత కాలముచేయు

వర్ణాంతరము పొందను. నేను బ్రహ్మను గురించి తపంబుచేసి త్వరితముగ గౌరవ ర్ణురాలనగుదు నన, దేవివాక్యములు విని శంకరుడు నాప్రసాదముచేతనే గదా బ్రహ్మ బ్రహ్మత్వము నొందెను. అతనికై నీవు తపమాచరింప నేలయున, పార్వతి యో దేవ దేవా! దేవతలందరు మిమ్మారాధించియున్న వారైనచో మీయాజ్ఞచే సురులందరు బ్రహ్మ నెంతుల కారాధించుచుండిరి. పూర్వము నేను దక్షపుత్రికనై సతీనామంబుతోనుండి తపంబుచేసి గత్పతియగు మిమ్ముల పతిగా బడసితిని. ఆవిధంబుగనే తపంబుచేసి గౌరినై మిమ్ము సంతోష పరిచెదను. దీని లోదోషమేమున్నదన శంకరుడు పార్వతివాక్యములువిని మందహాసముచేయుచు దేవకార్యము సాధింపనిచ్ఛగించి ఆమె తపంబున కంగీకరించెను.

శివమహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ఇరువది నాల్గువ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువదిఅయిదవ యధ్యాయము

### పార్వతి గౌరియగుట

పతివ్రతయగు పార్వతిక, పతికిప్రదక్షిణ నమస్కారములు చేసి, పతివి యోగమునకు దుఃఖించుచు నియతవ్రతయై, పూర్వము తాను సఖులతో తపమాచరించిన హిమవత్పర్వతదేశమునకేగ దలచి, పయనము సాగించుచు నటకేగి తలితండ్రులను గాంచి నమస్కరించి, తనవృత్తాంతమంతయు వారికి దెలిపి, వారియనుమతి నడసి, సర్వభూషణంబులు త్యజించి, పరమపవిత్రమగు తపోవేషముదాల్చి. తపోవనమునకేగి స్నానమాచరించి తీవ్రతపమాచరింప సంకల్పించి భర్తృపాద, పంకజములు స్మరించుచు, పరమేశ్వర తపమాచరించుచు త్రికాలములయందు వేదవిధిగ పార్థివలింగ మర్చించుచు, వన్యపుష్పఫలంబు లర్పించుచు, పరబ్రహ్మయగు. శివుడు నాయనోవాంఛ తీర్చుగాకయని ప్రార్థింపుచు నిత్యము నివ్విధంబుగ తపమాచరింపుచు బహుకాలము గడువ నొకదుష్టవ్యాఘ్రమటకేతెంచి దుష్టభావముతో నిమెపయోగమునకే తెంచుచుండ

ప్రథమపుత్రుడవు. తదుపరి ప్రజాభివృద్ధికై ఈశ్వరుడు నీ ఫాలమునుండి జనించెను. కావున నేను నీకు కోడలనైతిని. నీవు నాకు మామగారగుటచే పూజ్యుడవైతివి. ఇదియుంగాక నాతండ్రియగు హిమవంతుడు నీకు పుత్రుడై యుండుటచే నేనీకు మనుమరాలనైతిని అందుచే నీవు లోకపితామహుడవైతివి, మన బాంధవ్య మిట్లున్నది. ఇట్టిసన్నివేశ సంజాతనగు నాకీమాయ యెట్లు సంభవించెను, నేనీ తపంబుచేసి నలుపునువీడి గౌరిని కాదలచుచుంటి? ననగా, ఓ కాళీ! యింతమాత్రమున కింతతపమేల? విలాసముగ పొందవచ్చునుగదా! నీవికె యింత కాయకష్టమేల? ఓ జగన్మాతా! ఈ క్రీడలన్నియు లోకహితమునకై చేయుచుంటివి. నీవు తలచినచో నీకు సాధ్యముకాని పనియేమున్నది ఓ కాళీ! నేనొక కార్యమునకై వచ్చితిని, శుంభనిశుంభులనెడు దానవులకు, నేనిదివరలో వరమొసగియుంటిని. నావరప్రభావముచే, వారు దేవతలను పీడించుచుండిరి. నీవు కిలాడీమోహ పలంబనముచేయక, నాదుష్టరాక్షసులను సంహరింప వలయును. నీవు బ్రహ్మాండధామముచే వారుసంహరింపబడుదురని, నామాట బ్రహ్మ ప్రార్థించెను. కాళి, నలుపునువీడి గౌరవర్ణము కలిగియుండెను, ఆకాళిమయుంతయు గౌరియిచ్ఛచే కౌశికియనెడు కన్యయై యుద్భవించి, కాళీరూపముతో నొప్పుచుండెను. ఆకాళి ప్రళయకాలాంబుదము వలె ప్రకాశింపుచు, మహామాత్మిక యనియు మహామూర్తియనియు విష్ణువశక్తియనియు పిలువబడుచు నష్టభుజంబులు గల్గి శంఖచక్ర త్రిశూలాద్యాయుధంబులు ధరించి, సౌమ్య, ఘోర, మిశ్రస్వరూపయు త్రినేత్రయై, చంద్రశేఖరయై, పురుషస్పర్శరహితయై, యతిసుందరియై యుండెను. గౌరి బ్రహ్మ కొసంగి యుండెను. బ్రహ్మయామెకు వాహనమునకై సింహము నొసంగి వింధ్యాచలమును వాసముగనేర్పరిచి, మధుమాంసా హారంబులు ఫలపుష్పంబులొసంగి యుండెను. ఆకాళి బ్రహ్మకు ప్రణమిల్లి, తల్లిదండ్రులను వాస్తవ దేవసనేక శక్తులను పొంది శుంభనిశుంభుల వధకై వింధ్యాచలమున కేతెంచి, నాయకులగు శుంభనిశుంభులను సంహరించెను, నటుకైన గాధయంతయు నిదివరకే చెప్పియుండుటచే ఇపుడు చెప్పుటలేదు. అవ్వలిగాధ గాధ చెప్పెదను.

శివమహాపురాణమందలి వాయవీయ సంహితయందు

ఇరువది ఐదవఅధ్యాయము సంపూర్ణము.

---

# ఇరువది ఆరవ యధ్యాయము

## వ్యాఘ్రమున కుత్తమగతి

ఇవ్విధంబున గౌరీదేవి తన గాత్రము నుండి కౌసికను జనింపజేసి, బ్రహ్మకొనంగి వ్యాఘ్రమునకు ప్రత్యుపకారము చేయదలచి ఓ బ్రహ్మ! ఈ వ్యాఘ్రము దుష్టజంతు వైనను, నాయాశ్రమ మందుండి నన్ను రక్షించుచు నితర దుష్టమృగంబులు రానీయకుండ జేసి నన్ను పాలించుచు దివారాత్రము లిటనేయుండి నన్ను సేవించుచుండెను. గాన నీవ్యాఘ్రమును రక్షించుటకంటె మరియొక ప్రియమైన పనినాకేదియు లేదు. ఇది నాయంతఃపురమున సంచరింపుచుండవలయును. శంకరుడు దీనికి గణేశ్వర పదవి నొసంగవలెను. దీనిని నాయగ్రభాగమునందు కొని సఖులతో నేను విహరింపుచుండవలయును. ప్రజాపతి వైన నీవిందులకై యనుజ్ఞ ఈయవలెనన బ్రహ్మ గౌరి వాక్కులు విని నవ్వుచు దాని పూర్వ దుష్టచరిత్ర నంతయు నిట్లు చెప్పదొడంగెను.

ఓ దేవీ! పాపమున కమృతము పోసినట్లే దుష్టజంతువుపైన నీకింత కరుణ యేల? ఇది కేవలము వ్యాఘ్రము కాదు సుమీ? ఇతడొక దుష్టనిశాచరుడు. ఇతడీ రూపంబున ననేక గోవులను, బ్రాహ్మణులను, తపోధనులను, భక్షించుచు ననేక రూపంబులు ధరించి సంచరింపుచు ననేక దుష్కృత్యములు చేసి యుండెను. ఇతడు పాపముల ననుభవింపవలెను. ఈదురాత్మునియందు నీవు కృపజూపరాదు. వానిఫలము వాడే మనుభవింపవలెను. నీవు స్వభావమునం గలుషాత్ములకు. నీకపకారము చేయదలచి చేయలేక యూరకుండెననన, దేవి బ్రహ్మ వాక్కులు విని యోవిధాతా! నీవితని భక్తిని గ్రహింపలేక పూర్వ పాపముల జెప్పుచుంటివి. నీవు చెప్పినదంతయు నత్యమే కాని, ఇతడు నాయందలి భక్తిచే విగతపాపుడయ్యెను. ప్రసన్నుడై నన్నాశ్రయించెను. గాన నీభక్తుని నేను విడువనన, ఓ దేవీ! ప్రస్తుత మితని భక్తి యెరుంగక పూర్వ పాపముల జెప్పితిని. భక్తిచే సర్వపాపములు నశించును. భక్తుడెన్నడు నశింపడు. నీయాజ్ఞ లేనిచో పుణ్యకర్మలు చేయలేరు. నీవు జన్మరహితవు.

ప్రాజ్ఞురాలవు, పురాణవు, పరమేశ్వరివి, సర్వుల బంధమోక్షములు నీయధీనములై యున్నవి. ఎవరెన్ని కర్మలు చేసినను నీవను గ్రహింపనిచో నశింపవు. సర్వవిధశక్తులకు నీవేయాధారము. నీశక్తిలేకున్నచో నెవ్వరైనను యెట్టి కర్మలను చేయలేరు. యెట్టివాడైన నశక్తుడగను. విష్ణువు నేను, దేవదానవ రాక్షసులు నైశ్వర్య వంతుల మగుటకు నీవే కారణము. నీయాజ్ఞచే ననేకవేల బ్రహ్మ విష్ణు రుద్రులు మారుచుండిరి. నిన్నారాధింపని వారికి ధర్మార్థ కామమోక్షంబులు చేకూరవు. చరాచరంబు లన్నియు నీవల్లనే జన్మించుచున్నవి. సుకృతదుష్కృతములను నీవే స్థాపించితివి. జగత్ప్రభువగు పరమేశ్వరునకు నీవనాది శక్తివి. నీవనాదిమధ్య ధనవు, ఆదిశక్తివి, సనాతనివి, సకల లోక పాత్రలు నడిపించుటకై నీవీస్వరూప మూర్తితివి. నీవనేక విధముల క్రీడింతువు. నీయార్థము మాకు తేలియదు. దుష్టబుద్ధిగల యీవ్యాఘ్రము నీయనుగ్రహముచే ప్రతిబంధకములేని పరమసిద్ధి నొందెను. నీయాజ్ఞ నుల్లంఘించు వారెవ్వరని బ్రహ్మ పలికి యామెను తపంబునుండి విరమింపజేసి యామె యనుజ్ఞచే నదృశ్యుడయ్యెను. తదుపరి దేవి మేనకా హిమవంతులకు నమస్కరించి శివుని కడకేగెదనని బలక, వారు పుత్రిక విరహమును సహింప నేరక నామె నోదార్చుచు యీ తపోవన వృక్షంబులన్నియు నీకు నెచ్చెలులైయుండి రాయని వారు జాలి నొందిరి. అందున్న వృక్షములు, దేవి యెడబాటు సహింప నేరక కన్నీరనెడి పుష్పంబులు జారవిడిచినవి దేవి పతివియోగము సహింప నేరక భర్తృ దర్శన కాంక్షియై తన ముందున్న వ్యాఘ్రము నౌరస పుత్రునివలె ప్రేమించుచు తన స్వర్ణకాంతులచే దశదిశలు ప్రకాశింప జేయుచు సృష్టిస్థితుల యకారకు డగు పరమేశ్వరు డున్న మందర గిరి కందరముల కేగెను.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు

ఇరువది ఆఱవ అధ్యాయము సంపూర్ణము

# ఇరువదియేడవ యధ్యాయము

## శివుడు పార్వతి నూరడించుట

దేవిగౌరవర్ణము నొందిన తరువాత భర్తృమందిరమున కేగుచుండ ద్వారపాలకులందరు యామెను గాంచి యపరిమితానంద మొందుచు శంకరు డీమె నంగీకరించునా లేదాయని సంశయాత్ములై యుండ, నింతలో గౌరి నిశ్శంకముగ లోనికేగుచుండ రెండవ కక్ష్యయందలి ప్రమథ గణంబులు శివున కీమె రాక నెరింగించిరి. ఇంతలో ఈమె శివుని సమీపించి పాదములకు నమస్కరింప శివుడామెను బాహువులతో దరికి దీసి యాలింగన మొసర్చి మిక్కిలి సంతసించి, తన యంకమున కూర్చుండ బెట్టుకొన బోవ, నామె సమీపమందున్న శయ్యపై కూర్చుండ, పరమేశ్వరు డాపర దేవతను; బలవంతముగ తన యంకముపై కూర్చుండ బెట్టుకొని, మందహాసము చేయుచు ఆమె ముఖపద్మము ముద్దుకొని పూర్వ గాథలన్నియు జెప్పుచు నో సర్వాంగ సుందరీ! నీపూర్వ దశ మారియుండెను. నీకోప మెట్లు తీర్పవలెనో నాకు తెలియకున్నది. నీవు నీఇచ్ఛచే కాళీరూపమును వీడి గౌరివై యుంటివి. నీవు నాచిత్తమపహరించి న్ననవసరముగ చింత బెట్టుచుంటివి. నీవు స్వేచ్ఛాభావముచే నేను పరాత్పరు డను భావము మరచి యుంటివి. నీచిత్తము కలుషిత మొందుటకు కారణమేమి? మనమిరువురము దూరముగా నుండుటచే మనకు విరోధ మని ప్రజ లూహింపుచుండిరి. మనకున్న ప్రేమ చరాచరములలో నెవరికిని లేదు. నేనగ్ని స్వరూపుడను. నీవు సోమస్వరూపవై శిరము నందుంటివి గాన ఈవిశ్వమంతయు నగ్నిషోమాత్మకమై మనచే వ్యాపించి యుండెను. మన మిరువురము జగద్ధితమునకై స్వేచ్ఛారూపము దాల్చి విహరింపుచుంటిమి. మన మిరువురము ఇట్లు కోపించి వియోగము నొందినచో జగము నిరాధారముగ నుండును. మనము వాగర్థములవలెన భిన్నులమని, స్మృతి శాస్త్రములు చెప్పుచున్నవి. ఇదియును గాక, స్థావర జంగమము లన్నియు శబ్దార్థముల వలె కలసి యున్నవి. నీవు సాక్షాత్తుగ నమృత మయురాణివి. నేనమృత రూపమగు నర్థమును మనకు వియోగము కలిగినచో నీయమృతత్వము నశించును గదా! నీవు నిత్యవు! నేను వేద్యుడను నీవు జ్ఞానము, నేనుజ్ఞేయుడను

ఇట్టి మనకు వియోగ మెట్లు కల్గును. నేను సృష్టి స్థితిలయంబులు స్వయముగా చేయుటలేదు. నీయాజ్ఞచే, చేయుచుంటిని. నీయాజ్ఞాను సరణమె మైశ్వర్యము. అదియే స్వతంత్ర లక్షణము. నీయాజ్ఞా వియోగము కల్గినచో నాకైశ్వర్య మెట్లు కల్గును. గాన మనకు వియోగముండరాదు. మనకు వియోగమన నద్భుతముగ నున్నది. దేవకార్యములకై మన మిట్టి వియోగ మనుభవించునట్లుంటిమి గాని, నిజముగా మనకు వియోగ మెక్కడిది? త్రిలోక రక్షణకై నీవు నాయెడ కోపము జూపుచుంటివి. గాని యథార్థముగ నాయెడ నీకు కోపముండదు. నీవనవసరముగ కోపించి భూతముల కనర్థము చేయుమన.

శృంగార భావములతో గూడిన పార్వతి భర్త ప్రియవాక్కులు విని, యోపరమేశ్వరా ! నేను శికిని సృజించితిని. మీరామెను గాంచి యెరుంగరు. అట్టి కన్యక యిదివరలో లేదు. ముందు నుండ బోదు. ఆమె వింధ్య పర్వత నివాసిని యైన బలపరాక్రములచే శుంభనిశుంభుల సంహారింప గలదు, ఆమెను సేవించిన వారలకు ప్రత్యక్ష ఫలము సిద్ధించును. సుర రక్షణకై బ్రహ్మ యామెను నియోగించెనని చెప్పునంతలో ఆమె సఖులు వ్యాఘ్రమును తీసికొనివచ్చి యామె యెదుట నుంచ దేవి పరమేశ్వరా ! నేను మీ కొరకొక కానుక దెచ్చితిని. ఈవ్యాఘ్రముతుల్యుడగు నుపాసకుడు నాకెవడు లేడు. ఇది దుష్ట మృగముల రానీయక నాతపోవనమును రక్షించి యుండెను. నాయందత్యంత భక్తి గల్గి నన్నుపాసించి యుండెను. మరియు నిది తన స్వస్థానము వీడి నాయనుగ్రహమునకై యే తెంచి యుండెను. నాకిది మిక్కిలి ప్రీతి గలదై యుండెను. నంది మీయంతఃపుర రక్షణకై నియమింపబడి యుండి నట్లుగ యీ వ్యాఘ్రము నాయంతఃపుర రక్షణ కుండవలయునన నీశ్వరుడు దేవి వాక్కులు విని సంతసించి యొక మారా వ్యాఘ్రముపై తిలకింప తక్షణమే యావ్యాఘ్రమును వర్ణ వేత్ర హస్తయై, చిత్ర రత్న కవచధారిణియై సర్పసదృశ ఖడ్గధారిణియై గణాధ్యక్ష వేషధారిణియై యుండెను. ఉమాదేవి యానందమునకై పరమేశ్వరు డీవ్యాఘ్రమునకు సోమనంది యని పేరిడి దివ్య రూపమిచ్చి యంతఃపుర రక్షణకై నియమించెను. దేవి సోమాత్మక మైనది గాన నీవ్యాఘ్రమునకు సోమనంది యని పేరిడెను. ఇందే ధలేశ్వరు

డగు శివుడు పార్వతి సంతోషమునకై దివ్య రత్న భూషణములచే నాసోమ నంది నలంకరించెను. తదుపరి గౌరిని తన పర్యంకమునకు జేర్చి సకల భూషణములచే నలంకరించెను.

శివ మహాపురాణము నందలి వాయువీయ సంహితయందు
ఇరువది ఏడవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువది ఎనిమిదవ అధ్యాయము

## భస్మ తత్త్వము

శివుడు పార్వతిని గాంచి దేవి! నీవు సోమస్వరూపవు. నే నగ్నిస్వరూపుడను. అగ్నిసోమాత్మకమైన యీవిశ్వమంతయు. వాగర్థములవలె నవినాభావముగ మనచే వ్యాపించియుండెను. నీ వాజ్ఞాసారభూతురాలవు. నే నాజ్ఞానువర్తిని యని పలికియుండెనుగదా, ఇదంతయు నిపులముగ జెప్పుమని ఋషులు బలుక వాయు విట్లు చెప్పదొడంగెను. రుద్రుడు ఘోర తేజ స్వరూపుడు గాన, నగ్నిరూపు డనబడుచున్నాడు, శక్తి యమృత స్వరూపము. శాంతిస్వరూపము గాన. సోముడని పిలువబడుచుండెను. కనుక నీ యాదిదంపతు లిరువురు. నగ్నిసోమాత్మకు లని చెప్పబడుచుండిరి. ఈమె విద్యాకళలచే ప్రతిష్ఠితురాలయ్యెను. గాన అమృతస్వరూపిణియని చెప్పబడెను. ఈమె సకల సూక్ష్మభూతములయందు రసస్వరూపయై నివసించుచుండెను, సూర్య తేజము. అగ్ని తేజము లని ఈ తేజంబులు ద్వివిధంబులు. రసస్వరూపము లగు జలము లన్నియు. సోమాత్మకము. తేజంబులు విద్యున్మయములై యుండెను. రసంబులు మధురంబులై యుండెను. ఈ చరాచరంబు లన్నియు తేజోరసమయంబులై యుండెను. అగ్నిచే నమృతము జనించుచున్నది. అమృతముచే నగ్ని వృద్ధి నొందుచున్నది. అగ్నిరాప ఇతి శృతేః. అమృతంవా నదస్య మితి శృతేః. అమృతమే ఆదస్య స్వరూపము. ఈ యాదస్యముచే అగ్ని వృద్ధినొందు చుండెను. ఇందుచే నగ్ని సోములిరువురు జగద్ధిత కారకులై

యుండిరి. హావిస్సుయనగా వృష్టి, ఈవృష్టిచే సస్యాభివృద్ధికలుగుచున్నది. సస్యముఅగ్నిరూపము, వృష్టిఅద్యరూపము: అగ్నిసోమ సమ్మేళనముచే సస్యాభివృద్ధికలుగుచున్నది. అనగా ప్రజోత్పత్తికలుగుచున్నది. అగ్నియూర్ధ్వముగ ప్రజ్వలింపుచుండ, సోమాత్మకమైన జలము, దానినుపశమింప జేయుచుండెను. ఆఈకారణముచే అగ్నినుండి యమృతము స్రవించుచుండెను, కాలాగ్నిక్రిందుగను. శక్తిరూపమైన జలమూర్ధ్వముగనుండి, కాలాగ్నిని శాంతింపజేయుచుండెను. కాలాగ్నిరూపుడగు నీశ్వరుడాధారశక్తియగు యంబిక నూర్ధ్వమున ధరించియుండెను. ఊర్ధ్వముఖుడై ఈశ్వరుడుండ నధోముఖియై యంబికసోమాత్మికమై ప్రవహించుచుండెను. ఈశ్వరుడు గంగాధరుడనుటకిది యే కారణము. కానప్రపంచమంతయు శివశక్త్యాత్మకమే గాని వేరులేదు. ఒక్కొకపుడు జగత్తంతయు. నగ్నిచే భస్మమగుచుండుటగాన నీభస్మమగ్ని వీర్యమని పిలువబడుచుండును, ఇట్టిభస్మమును. అగ్నిరితిభస్మ. వాయురితిభస్మయని, భస్మముధరించి. భస్మస్నానము చేసినచో సర్వబాధ విముక్తుడగును. అగ్నిరూపమగు భస్మము, సోమరూపమగు జలముచే తడిపి ప్రాకృతమనుజులుధరింపవలెను. యోగులుముక్తులు సర్వులు నీపవిత్రమైన భస్మమును తడిపిధరించినచో సర్వపాపవిముక్తులగుదురు. అగ్నియను భస్మము. శక్తియను జలముచే తడిపిధరించినచో మృత్యువును కూడ తొలగించుచుందురు. శివశక్త్యాత్మకమైన యీవిభూతిధరించిన వారలకు. మృత్యువేలేదు. ఏ గాటికైనను మృత్యువు సంభవించినచో జన్మరాహిత్య మొందగలరు. ఈ భస్మము ధరించి మృతిజెందినవారు. యోగివలె ముక్తినొందును. జగత్తంతయు నగ్నిసోమాత్మకమని గ్రహించి, విభూతి యర్థమును తెలిసికొని భస్మముధరించినచో ముక్తినొందుట తథ్యము.

శివమహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ఇరువది ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము.

# ఇరువదితొమ్మిదవ అధ్యాయము

## వాగర్థాత్మకత్వ వర్ణనము.

ఇటుపై వాగర్థాత్మకత్వమన నెట్టిదో చెప్పెదవినుడు షడ్విధజ్ఞానము కూడ సంక్షేపముగ జెప్పెదను. అర్థములేని శబ్దము నిరర్థకము. అర్థము సర్వార్థసాధకమై యున్నది. ప్రకృతి ద్విధావిభజింపబడి శబ్దార్థములవలె నొప్పుచుండెను. గోశబ్దమునకు ఆవుయను నర్థములేనిచో శబ్దమువ్యర్థమౌనుకదా! ఈప్రకృతిపరిణామమే శివాశివుల స్వరూపమని గుర్తెరుంగవలెను. ఈశబ్దాత్మకవిభూతిని, స్థూలసూక్ష్మ పరములని పండితులు త్రివిధంబుగ నుడివియుండిరి. వీటిలోస్థూలము శ్రుతులచే తెలియబడును. సూక్ష్మము మనస్సుచే తెలియబడును. అనగా చింతామయ మనబడును. మనోగోచరము, చింతారహితమైనదియే పరమనబడును అనగ మనోతీతమైనది. క్రియాశక్తి, జ్ఞానశక్తి, ఇచ్ఛాశక్తియని, శక్తులుమూడు విధంబులు, వీటిలో క్రియాశక్తి పరమేశ్వరు నాశ్రయించి యుండును. జ్ఞానశక్తి, యోగశక్తి నాశ్రయించి యుండును. ఇచ్ఛాశక్తి యాత్మశక్తి నాశ్రయించి యుండును. సర్వశక్తి సమిష్టియే శక్తి తత్వమని చెప్పబడుచుండెను. సకలకార్యములకు మూలప్రకృతియే కారణము, ఇదివిశుద్ధ మాయాస్వరూపమై కుండలి నీశక్తియనబడుచున్నది. దీనికే శబ్దాధ్వయని పేరు. దీనిని భాగములేషడధ్వము లనబడుచున్నవి. వీటిలో, మూడుమార్గములకు మూడర్థములు చెప్పబడియున్నవి, షడధ్వములన షడ్విధ మార్గములు, వీటిలోమూడుమార్గములనే తరుచు గ్రహింపుచుందురు. వీటిని మనోనియమ శుద్ధులచే గ్రహింపగల్గుదురు. పరిపూర్ణయోగులు, నొక్కొకచక్రమును గ్రహింపుచు నందధిష్ఠాన దేవతలగుర్తెరుంగుచు పైచక్రములకు జనుచు, చివరకు షట్చక్రములను సాధించి సహస్రారమున పరమాత్మయందైక్యమగు చుందురు. ఈషట్చక్రములు, కళలచే వ్యాప్తమైయుండెను. ఇదిప్రకృతి పరిణామముచే పంచవిధంబులుగ విభజింపబడెను. నివృత్యాది కళలన్నియు నిండియున్నవి.

మంత్రాధ్వము. పదాధ్వము. వర్ణాధ్వము. భువనాధ్వము. తత్వాధ్వము. కళాధ్వము. అనునవి షడధ్వములు. ఇవియన్యోన్యము వ్యాప్య, వ్యాప

కభావంముతో నొప్పుచుండును. మంత్రార్థ మనజ్ఞానముద్వారా మోక్షము నొందుట. సర్వపదములతో కూడినది యేపదాధ్వము. వాక్యస్వరూపమె వర్ణాధ్వమనబడును. చతుర్దశభువన స్వరూపమే భువనాధ్వమనబడును. చతుర్వింశతి తత్వములే తత్వాధ్వమనబడును. నివృత్యాది పంచకళలే కళాధ్వమనబడును. వర్ణము లన్నియు భువన వ్యాపకములై యుండెను. చతుర్వింశతి తత్వములు పదునాల్గుభువనములకు. వెలుపలలోపల వ్యాపించియున్నవి. క్రమముగా నీ తత్వము లన్నియు. సర్వబ్రహ్మాండములు వ్యాపించి యుండెను. శివాగమ శాస్త్రమం దావిషయము చెప్పబడియుండెను. సాంఖ్యయోగశాస్త్ర మందున విపులముగ తత్వముల గురించి చెప్పబడెను. నివృత్యాది తత్వకళలను గురించి, శివ శాస్త్రములయందు వివరింపబడి యుండెను. నివృత్తి, ప్రతిష్ఠ, విద్యా, శాంతి, విశుద్ధి, యనునవి, నివృత్తికళ లనబడును, ఈ కళలకతీతమైనదియే పరాశక్తి. ఈ పరాశక్తి షడధ్వముల యందు నవిభక్తముగ వ్యాప్తమైయుండెను. పరప్రకృతి భావమే శివతత్వము. శక్తి మొదలు పృథివ్యంతమువరకు శివతత్వమునుండి జనించెను. మృత్తికచే ఘటాదులవలె శివతత్వముచే సర్వము జనించెను. ఈషడధ్వములచే శివలోకము ప్రాప్తించును. వ్యాపికా వ్యాపికలగు శక్తిపంచతత్వ శోధనలచే తెలియబడును, నివృత్తికళలు యండాండము లగాయతు రుద్రపర్యంతము శోధనచేయవలెను. ప్రతిష్ఠాకళయూర్ధ్వమందైనయవక్త కళయందు గోచరమగును. దీనియూర్ధ్వ మందైన విద్యాకళ విశ్వేశ్వరా వధివరకునుండును. దీనిపై శాంతి యూర్ధ్వమునుండును. శాంత్యతీతము. శాంత్యతీతమునవి శుద్ధకళయుండును. దీనిపై ప్రకృతి యోగముచే పరమవ్యోమముండును. పంచతత్వములచే జగత్తంతయు వ్యాపించియుండెను, సాధకులు. దీనినంతయు, పంచతత్వాత్మకమగు శరీరమునుండియే సాధింతురు. ఈషడధ్వములను తెలియని యోగియెంత ప్రయత్నించి ననుఫలసిద్ధి నొందదు. అట్టి అట్టివాని పరిశ్రమము నరకహేతువగును, శక్తిపాత సమాయోగము తెలియనిచో విశుద్ధ చక్రయోగమును తెలియజాలకు, శైవశక్తియాజ్ఞా చక్రమునకు పరముగ నుండెను. ఆమెయే చిద్రూపయగు పరమేశ్వరి. కారణభూతమగు శక్తితో, శివుడంతటను వ్యాపించియుండెను. ఆత్మకాదు: మాయకాదు. ఏవికారములులేవు. యేబంధములులేవు. ముక్తిలేదు. అన్నియు నీపరమేశ్వర

స్వరూపమేయని గ్రహించినచో బంధముక్తుడగును. శివునికొక్క సర్వైశ్వర్యపరా కాష్ఠయే యాదిశక్తి యనబడును. శివాశివుల భావంబులు సమానములై యుండును. శివుడు గృహస్థుడు, శక్తిగృహిణియునై యుండెను. జగత్తులే వారిసంతానము! కర్త శివుడు, కారణము శక్తియునై యుండెను, భేదమున్నట్లు గోచరింపు చుండిరిగాని వీరికిభేదములేదు. ఒక్కశివుడే రెండుగా విభజింపబడెను. స్త్రీపురుషరూపములతో నొప్పుచు, సమానబలవంతులుగనుండిరి. సూర్యునకు సూర్యకాంతికి భేదములేనట్లు శివాశివులకు భేదములేదు, శివుడు పరమునకుహేతువు. శివాజ్ఞయే పరమేశ్వరి. అవినాశియగు శివుడు, మూలప్రకృతి ప్రేరణచే త్రిగుణాత్మకుడై త్రిమూర్తి స్వరూపుడయ్యెను. మహామాయచే ప్రకృతిమూడు విధంబులయ్యెను. దీనినుండి కార్యవేధనలచే షడధ్వములు జనించెను. వాగర్థములవలె ఈషడధ్వములు ప్రపంచమంతయు వ్యాపించియుండెను. దీనిచేతనే శాస్త్రములన్నియు విస్తరింపబడెను.

శివమహాపురాణము సంకలి వాయవీయ సంహితయందు
ఇరువది తొమ్మిదవ యధ్యాయము సంపూర్ణము.

# ముప్పదవ యధ్యాయము

## శివతత్త్వ ప్రశ్నలు

శివచరిత్రలు కడువిచిత్రములై, గహనమై, దేవతాదుర్విజ్ఞేయములై, మానవులు మోహింప జేయునవియై యుండెను. శివాశివుల తత్త్వములందు భేదమేమియులేదు ప్రకృతిభావముచే వీరుభిన్నులుగ గోచరించుచుండిరిగాని, వీరికిభేదములేదు. సృష్టిస్థితిలయ కారకులగు త్రిమూర్తులు, శివునివశవర్తులై. నిగ్రహానుగ్రహ సమర్థులై యుండిరి. శివుడు మాత్రము, యెవరి నిగ్రహానుగ్రహములనపేక్షింపకుండును. ఇతడ త్యున్నతైశ్వర్యములకు ప్రభువు. ఇతరైశ్వర్యముల నితడపేక్షింపడు, ఇదియేస్వాతంత్ర్య లక్షణము. ఇతడు స్వభావసిద్ధముగ మూర్తిమంతుడగు చుండునుగాని యెవనిచేతను జనించినవాడుకాడు. ఇతడు కారణములేకుండ స్వరూపము ధరింపడు, విశ్వమునకై యితడుస్వరూప

మూనుచుండును. అన్నిటికి నితడే కారకుడు కాని ఇతనికి కారకులు లేరు. ఇతడు నిర్గుణుడని చెప్పియుంటివి. ఇతడు సగుణుడెట్లయ్యెను? స్వభావశూన్యుడగు నిర్గుణ పరబ్రహ్మ, పరభావముల నొందిన సగుణుడెట్లయ్యెను? సగుణరూపునకు నాశనమెట్లు లేకుండెను? పరమాత్మ సకలుడెట్లయ్యెను? నిష్కలుడెట్లయ్యెను? మూర్తిమంతులలో మూర్తిమంతుడితడే గదా! ఈమూర్తిమంతుడమూర్తిమంతుడెట్లయ్యెను? ఇతరాపేక్ష లేనివాడు మూర్తిమంతుడెట్లయ్యెను? ఏదైన కార్యము సాధించుటకు శివుడు మూర్తిని ధరించెనా? ఇతనికి స్వేచ్ఛా శరీరమున్నదా లేదా? ఇతడు స్వతంత్రుడా? లేక నస్వతంత్రుడా? ఇతడు కర్మాను సారముగ స్వేచ్ఛారూపుడయ్యెనా? లేక స్వతంత్రుడై స్వేచ్ఛారూపమొంది యుండెనా? తనంతట తానుద్భవించి లయమొందుచుండెనా? బ్రహ్మలగాయతు పిశాచాంతమువరకు కర్మావశస్థులై జనించిలయమొందు చుండిరా? లేక ఇచ్ఛాను సారులై జనించి లయమొందుచుండిరా? పరమేశ్వరుడింద్రజాలకునివలె మాయచే జనించి అణిమాదిశక్తుల వశపరచుకొను చుండెనా? లేక స్వతంత్రుడై చేయుచుండెనా? దధీచితో విష్ణువుయుద్ధము చేయునపుడు తనప్రభావము చూపుటకై విష్ణువు విశ్వరూపము జూపింప, దధీచికూడ తనప్రభావముచే విశ్వరూపము జూపించి విష్ణువును జయించెనుగదా? అట్లియీశ్వరుడు తనప్రభావము జూపించుచు జగత్తుల జయించుచుండెనా? అట్లైనచో సర్వదేవతలతో సమానుడేగదా? దేవతలతో తుల్యుడైనచో వారలనెట్లు శాసింపగలడు? బ్రహ్మపంచమ శిరంబుశివుడు ఛేదించెనని చెప్పితివి? అదియేకల్పమున జరిగెను? శివనిందచేసినకు మఱియు బ్రహ్మకు శివుడెట్లు పుత్రుడై జనించెను? విష్ణువు నృసింహరూపుడై యుండ యతనిని శాంతింపజేయుటకై విష్ణువుతనమాట నిరాకరించుటచే తనపాదనఖంబులతో, నృసింహుని హృదయము చీల్చెనని వినియుంటిమి, దక్షయజ్ఞమందున దేవతలకు దేవతాస్త్రీలకు వీరభద్రుడు పరాభవము గావింప నితని యెడ దేవతల సమర్థులగుటకు కారణమేమి? శరభుని యెడ విష్ణువసమర్థుడగుటకు కారణమేమి? శివుడు త్రిపురాసురులను స్త్రీపుత్ర బాంధవంబుగ సంహరింపుటకు కారణమేమి? ప్రజోపకారకుడగు మన్మథుడు సురకార్యమునకై యేతెంచినంతనే తననేత్రాగ్నిచేయు తని నెందులకు దహింజేసెను? ఒకానొకపుడాకాశమునందున్న గోవులు. శివుని శిరముపై క్షీరవప

ర్షము కురియింప వాటినేల భస్మము చేసెను? మహాసురుడగు జలంధరుని. తన పాదములచే గిరగిర త్రిప్పుచు. మకరాలయ మందేలపడవైచెను? విష్ణువుని యనంతునిచే బంధించి శతయోజనము లెందుకు విసరివైచెను? తానుసృజించిన జలంధరుని త్రిశూలమునెందుకు సంహరించెను? విష్ణువుతపంబుచేసి చక్రము సంపాదించి దయలేనివాడై. దైత్యకులము నెందుకు నిర్మూలించెను? శివుడు సంతప్త త్రిశూలముచే సంఘకాసురుని హృదయమెందుకు వహింపజేసెను? శివుడుతన కంఠమునుండి కాలరూప స్త్రీనిజనింపజేసి దారుకునెందుకు సంహరించెను. గౌరిచర్మకోశమునుండి కౌశికిని జన్మింపజేసి శుంభని శుంభుల నేలసంహరింపజేసెను? దేవతాశత్రువగు తారకాసురుని స్కందుడు సంహరించెనని స్కాందపురాణము నందువినియుంటిమి? అదెట్లుజరిగెను? శివుడుబ్రహ్మచే మందరగిరియందు మాతో విహరింపుమని ప్రార్థింపబడి, ఆగిరి యంతఃపురమునందు దేవితో విహరింపుచు సత్ప్రసంగములు చేయుచు భువిసరసాతలమందు ప్రవేశింపజేయుటకు కారణమేమి? శివుడుతన యమోఘమైన వీర్యమును దేవియందుంచక ఆమెను వంచించి పవిత్రమగు హవిస్సును అగ్నియందుంచుటకు కారణమేమి? తన యంశమైన వీర్యమును యగ్నినుండి గంగయందిడుటకు కారణమేమి? స్వాహాదేవి షట్కృత్తికలరూపముదాల్చి భర్తతో రమించి శివవీర్యమును కొంచెకొంచెముగ గ్రహించి మేరునగ మందలిశరవణంబున విడుచుటకు కారణమేమి? మరియు నిశివవీర్యము శరవణమందుపడి దశదిశలు వ్యాపించునట్లు ప్రకాశింపుచు నామేరునగ మంతయు స్వర్ణమయముగ జేసెనని స్కాందమునందు వినియుంటిమి. ఇంకను నాదివ్య తేజము కొంత కాలమునకు సుకుమారుడగు కుమారుడై వెలసెను. శైవస్వరూపుడగు మనోహర శివకుమారుని గాంచి. దేవాసుర మనుజులందరు విస్మితులై, విమోహితులై. యుండిరి. ఇంతలో పుత్రదర్శన లాలసుడై పార్వతితో పరమేశ్వరుడేతెంచి పార్వతియుంకమున కుమారుని కూర్చుండబెట్టి హార్షంబున చిఱునవ్వునవ్వుచు అమృతపానమువలె కుమారుని ముఖారవిందము పానముచేయుచు, సంతిరాత్మయందు స్నేహావివశుడై, దేవతలు ఋషులుగాంచుచుండగ తనవక్షస్థలంబున కుమారునాడించుచు పార్వతీసహితుడై కుమారునితో క్రీడింపుచుండ, దేవికుమారున కమృతోపమైన స్తన్యమిచ్చి లాలింపుచు తండ్రీనీవు జగద్ధితమునకై యవ

తరించితివని పలికెను. ఇట్లాదిదంపతులు కుమారునిజూచి పొందినయానందము నకు మేరలేకుండెను, వారితృప్తి తీరకుండెను.

ఇంతలో తారకాసుర భయముచే సురులందరు శక్రునితో కేతెంచి సురద్విషుడగు నీశ్వరుని కడనున్న కుమారునకు తారకాసుర సంహారమునకై సైన్యాధిపతిగ నభిషేకించిరి. శంకరుడు కుమారుని దేవేంద్రున కొప్పగించి తన పుత్రునకు క్రౌంచవిదారక మగునదియు, కాలాగ్ని సదృశమగు శక్తి నిచ్చి యదృశ్యుడయ్యెను. కుమారుడు కాలాగ్ని సదృశ్యమగు శక్తిచే క్రౌంచ నగమును భేదించి ఇంద్రుని భయము, తారకుని శిరము నొక్కమారు భేదిం చెను. ఇదిగాంచి బ్రహ్మ విష్ణ్వాది దేవతలందరు ననేక విధంబుల కుమారుని స్తుతించిరని స్కాందము నందీ కుమారుని గాథలన్నియు చెప్పబడి యుండెను. కుమారుడు కూడ శివు డంతటి బలశాలి యేకదా? రాక్షసాధిపుడగు రావ ణుడు బలగర్వితుడై తన భుజబలముచే కైలాసమును కదలింపుచుండ శివు డీదుర్మార్గమును సహింపలేక తన పాదాంగుష్ఠముచే పర్వతము నణచి యతని గర్వము నణగ ద్రొక్కెను. బాలవటుడైన మార్కండేయుడు తానాయు విహీనుడగుట నెరింగి శివారాధన చేయుచుండ నింతలో నంతకుండేతెంచ శివుడు ప్రత్యక్షమై బాలకుని రక్షింప, యముడు బాలకునకూ శివునకు నమ నమస్కరించి స్వస్థానమున కేగెను. జగత్తంతయు నేకార్ణవమై యుండ బడ బానల స్వరూపమగు వృషభమును తన కంఠము నందుంచి కాపాడెను. జగ ద్గర్భు డగు నితని యంగములు చలింప జగంబు లన్నియు చలింపు చుండె నని విని యుంటిమి. ఇతడు నిర్గుణుడైనచో నిదెట్లు సంభవించును? ఇతడు శాం తుడు, సమభావుడు, సమర్థుడు నైనచో, సర్వుల ననుగ్రహించి ముక్తి యొం దుల కొసంగకుండెను? ఇదంతయు ననాది కర్మవైచిత్ర్యముచే జరుగు చుండె నని తోచుచుండెను. ప్రారబ్ధ ఫలంబులకు కర్మలే కాని ఈశ్వరుడు కారకుడు కాడని తెలియుచున్నది. పలువిధంబులు చెప్పనేల. యిదంతయు వినుచుండ నాస్తిక్యము గోచరింపుచుండెను. ఓ వాయుదేవా! మాకిదంతయు విపులముగ జెప్పి మాప్రశ్నలకు తగు సమాధానంబు లొసంగి మాసందేహ బాపుము.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ముప్పదవ అధ్యాయము సంపూర్ణము

---

## ముప్పది ఒకటవ యధ్యాయము

### జ్ఞానోపదేశములు

మహర్షు లిట్లు ప్రశ్నింప వారి సందేహ నివృత్తికై వాయు విట్లు చెప్పదొడంగెను. ఓ మహర్షులారా ! మీరడిగిన సందేహము లన్నియు హేతు భూతములై యుండెను. సాధు బుద్ధితో సావధానముగ నాలోచించి నచో నాస్తిక బుద్ధి లేకుండును. సత్పురుషులకు మోహ వృత్తి కలిగెడి ప్రమాణ వాక్యములు చెప్పెద వినుడు. శివ ప్రసాదము లేనిచో నసత్పురు షుల కసద్భావము తే గోచరింపుచునడుచు. పరిపూర్ణు డగు శివునకు కూడ పరానుగ్రహము లేనిచో, చేయవలసిన పని యే యుండదు. శివుడు పరాను గ్రహముకై కర్మలను స్వభావముగ జేయు సమర్థుడై యుండెను. పరానుగ్ర హము లేని దే స్వతంత్రుడై యేపని చేయజాలడు. సమిపాశాత్మక మైన యీ జగత్తంతయు పరుసిచే సర్వము అనుగ్రహింప బడుచున్నది. ఆ పరమా త్ముడు నితరుల ననుగ్రహించుటకై శివు నాజ్ఞాపించెను. అతని యాజ్ఞాను సారముగ శివుడందరిని వారికి కర్మానుసారముగ వారి ననుగ్రహించుచుండును. ఈకారణముచే శివుడు పరతంత్రుడని చెప్పబడుచుండెను. పరమశివుని యను గ్రహము లేనిచో నెవరికని యనుగ్రహము కలుగదు. ఆపరమశివు డనపేక్షుడు గాన స్వతంత్రుడన బడుచుండెను. అనుగ్రహ మంద పేక్ష లేనిచో పరమేశ్వరుడు మాత్ర మె ట్లనుగ్రహించును? నిర్గుణ పరమశివుని సేవింపలేనిచో సగుణ శివుని సేవించి తరింప వచ్చును. శివునకు తెలియని విషయము లేవియును లేవు. సక లుడు తెలిసి నట్లుగ నిష్కళులు డెవరికిని తెలియబడడు. శైవమూర్తి యగు శివుని నిర్గుణ పరమ శివు డని భావించి పూజింప వలెను. పరమ కారణు డగు నీశివుడు నిష్కళు గాడు. సగుణంబు తోడనే నితని నెరుంగ వలయును. ఇతడు యితర ప్రమాణములచే గోచరింప వలసిన వాడేగాని ప్రత్యక్షముగ గోచరింపడు. ఏమంత్ర తంత్రో పాసనలచేత నైన గోచరింప వలయును గాని సామాన్యముగ గోచరింపడు. ఆత్మాతిశయంబుచే కూడ నెరుంగవచ్చును. శివ మూర్తి యే పరాత్పరు డని యెరుంగవలయును. కాష్ఠములు మధించిన గాని యగ్ని గోచరింప నట్లు సాకార మూర్తి యగు శివుని మనస్సు చే మధిం

చిన గాని నిర్గుణ శివ స్వరూపము కానరాదు. ఈకారణము చేతనే విగ్రహ పూజలు కల్పింప బడెను. గాన లింగాదులచే గాని, విగ్రహ రూపంబులుగ గాని యుపాసించి పరమ శివుని తెలిసికొనవలెను. జీవు లందరు మూర్తి వంత మైన పరమేశ్వరుని మనంబున నిల్పుకొని ధ్యానింప వలెను. మన మందరము ఆ పరమేశ్వరుని యెదుట పశువులము. జీవానుగ్రహామునకై పరమ శివుడు మూర్తిమంతుడై సర్వమూర్తుల యందు వెలయు చుండెను. శివార్చన నాత్మ భోగములకై వినియోగించుట కన్న మోక్షమునకై వినియోగించుట విశేషము. చేతనా చేతనముల యందితడు మూర్తి మంతుడై యుండెను. భోగ కర్తలకే సుఖ దుఃఖములు సంప్రాప్తించు చుండును. ఏకర్మలు చేయని శివునకు కర్మ ఫలంబు లెట్లు వచ్చును? జీవుల కర్మ దోషమే గాని శివుని దోషము కాదు. శివుడు కొందర ననుగ్రహించుట కొందరిని ననుగ్రహింప కుండుట వారి వారి కర్మ దోషమే గాని శివుని దోషము కాదు. దోషము జీవులకే గాని శివున కేమాత్రము లేదు. బ్రహ్మాదులు వారి వారి పనులు నిర్వర్తించుటకు వారి కర్మఫలములే నిదర్శనము లోకానుగ్రహమునకై శివుని చే బ్రహ్మాదులు సృజింప బడిరి. శ్రీకంఠు డగు శివుడే బ్రహ్మాండాధిపతి సంశయము లేదు. ఇతడు జగత్తు యందు క్రీడించుచు బ్రహ్మాది దేవతలను ప్రజలను వారి వారి దోషములకు నగినట్లు శిక్షించుచు వారి పాపములు పోగొట్టి దుఃఖ దూరులు చేయుచుండును. గాన నితని సామర్థ్యమును పండితు లెవరును దూషించుట లేదు. దండార్హులను ప్రభువులు దండించుచునే యుందురు. గదా! కార్య వర్గము నందిట్టి సిద్ధిని పొందిన వాడు గాన ఇత డీశ్వరు డని పిలువ బడుచుండెను. ఈశ్వరానుగ్రహము చేతనే బ్రహ్మ సృష్టి చేయ సమర్థు డయ్యెను. బ్రహ్మను యిది చేయుము. ఇది చేయకుమని శాసింపు చుండును. ప్రభువుల శాసనమును వర్తించుట సాధు లక్షణము. అసాధువుల దీనికి విపరీతముగ వర్తింతురు. అసాధువులు సామదాన భేదములకు లొంగనిచో, దండించి యైనను సాధువులుగ మార్చవలెను. సర్వులకు హితము చేకూర్చిన వాడు ఈశ్వర తుల్యుడగును. అసత్పురుషు లైనను నిగ్రహ మున్నచో దూషితులు గారు. నిగ్రహము చేతనే దైవానుగ్రహము కల్గును. చేయరాని కృత్యములు చేసినచో లోకులుచే నిందింప బడుదురు.

ఎవరును లోక నిందిత కృత్యము లాచరింప రాదు. దీనిచే లోకులే గాక భగవంతుడు కూడ సంతసింపడు. శంత్రి పుత్రుని రక్షింపుటలో ద్వేషమున బడదు. ఇరువురు ద్వేషింపుచుండ తాను మధ్యస్థుడై వారలను శాంతింప జేయవలయును. గాని, వారిరువు రను తగువుల పాలు చేయరాదు. పరుల దోషములు బలుకక వారి దోషములు పోవు నుపాయములనే జెప్పుచుండ వలెను. న్యాయ వాక్కులు కఠినముగ దోచినను స్థిరచిత్తుడై యాలోచించి నచో వానికి హితమే చేకూరును. దయారహితుడు హింసలు చేయుచునే యుండును. రోగికి వైద్యులు మందులు మాటలు అహితముగ దోచినను వాటిని పాటింప వలెను. మందు సేవించినచో వ్యాధి నివారణమై సుఖమును పొందు నట్లుగ, విజ్ఞుల మాటలు వినుటకు, ఆచరింపుటకు కఠినము లైనను, శాంతుడై వాటిని సాధించినచో, సర్వ సుఖముల నొందగలడు. చంప దగిన వాడైనను చంపక విడుచు వాడే దయావంతు డనబడును. తాను శక్తివం తుడై రక్షకుల రక్షింప కున్నను. దోషము సంభవించును. సర్వ ముఖ మం దున్న జీవుల నైనను శక్తియున్నచో రక్షింప వలెను. లేనిచో దోషము సంభవించును. గాన సర్వవిధముల దయజూపి హింస మాన్పించుటయే శ్రేయో దాయకము సమ్మత మైనదియు నై యుండెను. సర్వ కారణముల చేతను పరమేశ్వరుడు దూషితుడు గాడు. ఎట్లనయ లినయగ్ని తామ్రమున నగ్ని యందు దహింప బడినను ఆ మాలిన్యము యగ్ని కంటనట్లుగ జీవుని దోషము లీశ్వరుని కంటవు. తామ్ర సంసర్గముచే నగ్ని యపరి శుద్ధము కాజాలదు గాని యగ్ని సంయోగముచే తామ్రము పరిశుద్ధి నొందును గాని, ఇవ్విధంబు శివస్పర్శచే సర్వజీవులు పరిశుద్ధి నొందురు. జీవుల కిల్బిషములు పరమేశ్వరు నంటవు. అగ్నియందు లోహముంచిన లోహము దహింప బడును గాని యగ్ని దహింప బడనట్లు శివునిచే జీవులు పవిత్రు లగుదురు గాని జీవుని దోషములు పరమేశ్వరుని కంటవు. శివుని పొందుటయే జీవుల యైశ్వర్యము. కాష్టము లేనిదే యగ్ని ప్రజ్వలింప నట్లుగ మూర్తి లేనిదే యాత్మ యుండదు. మృత్తికచే ఘటము వలెను, పాషాణముచే మూర్తి వలెను యగ్నిచే వాయువలెను పరమేశ్వరునిచే జీవుడు ప్రకాశించు చుండెను. ఇవ్విధంబున ప్రతి శరీరమందు పరమేశ్వరుడు ప్రకాశింపు చుండెను.

మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష, యనునవి చిత్తవృత్తులై యున్నవి. ఇవి గౌణము లనియు, నగౌణము లనియు, చెప్పబడు చున్నవి. ఇవి జీవుల గుణ దోషములకు నిమిత్తము లై యున్నవి. ఇవి ఈశ్వర విషయమై గుణములై యొప్పుచున్నవి తదితర విషయము లందు దోషములై యొప్పుచున్నవి. పరమేశ్వరు నకు గుణములు గాని, దోషములు గాని లేవు. శివాను గ్రహ మున్నచో, దోష ప్రవృత్తులుండవు. సంసార విముక్తికి శివాను గ్రహమున్నచో, నేగౌణ మార్గములు ననుసరింప పనిలేదు. భగవదారాధనములలో వామాచార మనియు, దక్షిణాచారమనియు రెండు విధములుగ నున్నవి. పశుహింస మొదలగు నుద్రేక పూరితము లైనవి. వామాచార మనబడును. శాంతియుతముగ నహింసా పద్ధతి ననుసరించి యున్నది. దక్షిణాచార మనబడును. ఈ రెండు విధముల చేతను భగవంతుని తెలిసికొందురు. అందరికి నుప కారము చేయుట యే దయ యనబడును. అందరిని నను గ్రహించుట యే యుపకార మనబడును. శివు డందరికి హితము చేయును గాన సర్వోప కారకు డనబడు చుండెను. చిదచిదాత్మకు డగు పరమేశ్వరుడు పరుల హితమునే కోరుచుండును తన కోర్కెల నణచు కొన్నవాడు పరులకు హితము చేయ నమర్థు డగును. సూర్యుడు తన యంశువులచే పద్మముల వికసింపజేసి నట్లు, తన యుదార గుణములచే పరుల మనంబులను వికసింప చేయవలెను. స్వభావముల కర్థము తెలియ నంతవరకు విపరీతములుగ దోచుచుండును. దాని యర్థము తెలిసిన పిమ్మట యథార్థము గోచరించును. మలిన స్వర్ణమైనను యగ్నితప్త మైనచో మాలిన్యము నశించి స్వచ్ఛమైన సువర్ణము శోభించి నట్లు జీవుడు శివ స్మరణచే తన పాపములను త్యజించి పరిశుద్ధు డగును. సువర్ణ మెన్నటికిని నగ్నిని కరిగింప లేదు. గాని యగ్ని సువర్ణమును మాత్రము కరిగించును. ఈ విధంబున జీవుడు పరమాత్మను శాసింపలేడు గాని, పరమాత్మ శాసన ముచే జీవుడు బాగుపడును. తాను తలచిన పని నిర్వహింప లేనివాడు స్వతంత్రు డెట్లగును? కోరికల మలిన మైనచో జీవు డన బడుచుండెను. కోరికల జయించినచో పరమాత్మ డనబడు చున్నాడు. నియమంబు లన్నియు జీవు నకే గాని, పరమాత్మకు లేవు. కర్మమాయా బద్ధుడు, సంసారి యనబడును. అన్ని బంధములు జీవునకే గాని, శివున కెట్టి బంధములును లేవు. పాపములు

స్వభావముగ నాగంతుకముగ వచ్చుచుండును. ఇట్లు వచ్చుటకు కారణ మెవ్వరును చెప్పలేరు. విచిత్ర స్వభావములచే పుణ్య పాప హేతులు కల్గుచుండును.

ఆత్మసమత్వమున్నచో బద్ధుడైనను ముక్తుడగును. ఇట్టివారు కొందరు భోగప్రాప్తులగుదురు. కొందరు మోక్షప్రాప్తులగుదురు. పరమేశ్వరుని సేవించి కొందరుభోగములు, కొందరుమోక్షములు నొందుచుండిరి. ఈభగవంతుని సేవించి కొందరు సాలోక్యముక్తిని, కొందరు సామీప్యముక్తిని, పొందుచుండిరి. కొందరుషడధ్వాతీతుడగు మూర్తివంతుడైన ఈశ్వరుని సేవించి, ముక్తి నొందుచుండిరి. షడధ్వములలో మూడధ్వలు సేవించి యుత్తీర్ణులగుచుండిరి. పైమూడధ్వలు సేవించి ముక్తినొందుచుండిరి. ఈశ్వరునిమాయచే బ్రహ్మవిష్ణు మహేశ్వరులు మూడుగుణంబులతో. మూడు విధంబులుగ జనించిరి. వీరు. ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ యనబడుచుండిరి. ఆత్మయనగా దేహమందున్నవాడు. అంతరాత్మయన. హృదయమందున్నవాడు, పరమాత్మయన, సర్వత్రనిండినవాడు. ఈముగ్గురు పరమాత్ముడైన శివపదము నాశ్రయించి కొందరంతరాత్మ పదమందుందురు. కొందరు చిదాత్మపదమందుందురు. కొందరు శాంత్యాతీత పదమందుందురు. శైవులందరు శాంత్యాత్మకమగు మహేశ్వరపదమందుందురు, రౌద్రులు విద్యాస్థానమందు. ప్రతిష్ఠాస్థానమున విష్ణువు నివృత్తిస్థానము బ్రహ్మబహ్మంగ యోనులునుందురు. దేవయోను లెనిమిది యుత్తమంబైనవి. మనజయోనులు మధ్యమంబులైనవి. పశ్వాదిపంచయోనులు, అధమములన బడును. పశు, పక్షి, సర్ప, క్రిమి, దంశకములు. పశ్వాద్యధమ పంచకమనబడును. మొత్తమివి పదునాల్గు యోనులనబడును. ఊర్ధ్వాధోజీవుల మలంబుల తెలిసికొని. జీవులుసంచరింప వలెను. జీవులజ్ఞానముచే నపక్వఘటము వలెనుండక, జ్ఞానముచే పక్వఘటమువలె నుండవలెను. సంసారము పక్వఘటుము వంటిది అదిశాశ్వతమైనది గాదు ఏమాత్రము దెబ్బతిన్నను విడిపోవును. పక్వఘటమటుగాక సుఖదుఃఖముల నోర్చియూర్ధ్వగతి నొందగల్గును జీవయాత్మలు త్రివిధమలంబుల నొప్పుచుండెను. మొదటిది కేవలము సత్వప్రధానముగను రెండవది. సత్వరజః ప్రధానములు గనుమూడవది. సత్వరజస్తమః ప్రధానములుగ నుండును, మొదటిది యుత్తమము, రెండవది మధ్యమము, మూడవది యధమంబుగ నొప్పుచుండెను. ఇందులో నొకదానికన్న

నొకటి గొప్పదియైయుండెను. దీనినుండియే జగత్తుయందలి జీవులకు వ్యాధి, భేదములు కల్గుచున్నవి. ఈమాయకు మూలములయందు. శివుడధిష్ఠితుడై యుండెను. రుద్రాధిష్ఠితమైన పృథివి నంతయు, అండాండ మందలి యాదిశేషుడు భరింపుచుండెను. త్రిగుణంబుల కతీతుడగు పరమేశ్వరుడు, త్రిగుణంబుల యందువ్యాపించినట్లుగ, జగత్తులన్నిటిని వ్యాపించియుండెను. మాయతోగూడిన జగత్తులగాయుతు దేవతల పర్యంతము సంగుష్ఠ ప్రమాణుడగు పరమేశ్వరుడంతటను వ్యాపించియుండెను. సప్తసాగరములు, సప్తలోకములవరకు వ్యాపించిస్థిరముగానుండి యంతరిక్షమువరకు సంచరింపుచున్నవి. అంతరిక్షమందు దేవతలు సంచరింపుచుందురు, విప్రులు దేవతల నారాధించి, దేవత్వము నొందుచుండిరి. వీరితపంబు పరిపూర్ణమై ఫలోదయము నొందినచో మరల భువిపై జన్మింపరు లేనిచో వారిపుణ్యము క్షీణింపగనే, మరలజన్మింతురు. పరిపూర్ణసిద్ధులకు, జననమరణంబు లుండవు. ఈజన్మాది రోగముల కౌషధము జ్ఞానమే. వీనికన్నె ద్యోను శివుడు దుఃఖములు పోగొట్టి జీవులను, రక్షించుటకు శివుడొక్కడే సమర్థుడు, సంసారమే దుఃఖము శివుడీదుఃఖముల నెట్లు పోగొట్ట గలడని సంశయింపనలదు. శివానుగ్రహము లేనిదే తరింపలేము. అయస్కాంతము లోహమునాకర్షించినట్లుగ పరమేశ్వరుడు జీవులనాకర్షించును. అయస్కాంతమునకు, నలువైపుల నున్నలోహము చలించునట్లుగ పరమాత్మసాన్నిధ్యమందున్న జీవులు చలించుచు నేయుదురు పరమేశ్వరుడు మాత్రము చలింపడు. శివసాంగత్యము లభించినచో మరల నతనినివీడి వెనుకకురాడు. శివుడు జగదధిష్ఠానుడై యుండి, యెవరికిని తెలియబడకుండ నుండెను, జీవుడు లేనిచే నేత్రప్రవృత్తులు నుండవు. శివప్రేరణచేతనే సర్వము జరుగుచుండెను. అతనిశక్తి విశ్వతో ముఖమై యుందరిని యాజ్ఞాపించుచుండెను. సర్వవ్యాపిగాన నతని కేదోషము లేదు. ఈవిశ్వా మంతయు నీశ్వరునిచే నిర్మితమైనదిగాని ఈశ్వరునికన్న పూర్వము దేదియులేదు. అతడీశ్వరుడుగాన కర్మఫలముల నను సరించి యాజ్ఞాపించుచుండును. అతడు న్యాయముగ ప్రవర్తించును. ఎవరిచేతను దూషింపబడడని, వాయువుచెప్పు [illegible] న్యాయుషులు వినుచుండ, నీమాటలు సత్యము. మున్మాటికిని సత్యమని వ్యోమవాక్కులు వారివినులబడెను, స్ఫుటముగుగగన వాక్కులువిని ఋషులందరు విగతసంశయులై, విస్మయావిష్టులై

వాయువునకు నమస్కరింప, వాయువు వారలకు జ్ఞానము స్థిరబరచుటకై ఓబుషులారా! పరోక్షము. యపరోక్షమునని జ్ఞానము. రెండువిధములు. వీటిలో పరోక్షమస్థిరముగను, నపరోక్షము సుస్థిరముగనుండును, పరోక్షము హేతువులచే తెలియబడును. అపరోక్షము నను ష్ఠానములచే సాధింపవచ్చును. అపరోక్షములేనిచో మోక్షములేదు ఇట్టిమోక్షమునకై ఏవిధమగు మాయలులేక, శ్రేష్ఠానుష్ఠాన సిద్ధికొరకు ప్రయత్నింప వలయును.

శివమహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ముప్పది ఒకటవ అధ్యాయము సంపూర్ణము.

---

# ముప్పది రెండవ యధ్యాయము

## శ్రేష్ఠానుష్ఠానములు

ఓపవన దేవా! శ్రేష్ఠానుష్ఠానము లనగెట్టివి? దేనివలనన పరోక్షజ్ఞానము, ముక్తియుకల్గును? దానిసాధనము లెట్టివో తెల్పుమని, ఋషులు ప్రశ్నింప వాయువిట్లు చెప్పదొడంగెను. శివోపాసన శ్రేష్ఠానుష్ఠానము. ముక్తిహేతువనియు, శివునిచే నపరోక్షజ్ఞానము కల్గుననియు పెద్దలునుడివి యుండిరి. క్రియాతపోజప ధ్యానాత్మ జ్ఞానములచే పైవన్నియు సిద్ధించును. క్రియలచే తపము, తపముచే జపము, జపముచే జ్ఞానము. జ్ఞానముచే ఆత్మజ్ఞానము, ఆత్మజ్ఞానముచే పరోక్షాపరోక్ష జ్ఞానములు, వీటిచే మోక్షము సిద్ధించును. అన్నిసిద్ధులకు ధర్మమేప్రధానము. సత్యధర్మములు లేనిదే నేవియు సిద్ధింపవు. అపరోక్షము మోక్షమునిచ్చునదై యుండెను. ధర్మమన్నిటికి సాధనమని శృతులందు చెప్పబడియుండెను. సర్వయోగంబులు పరమధర్మానుష్ఠానములై యున్నవి. మనకు ధర్మమే పరోపకారకము. ధర్మమే శిరోభూషణము నై యుండెను. పాశుపత యోగము పరమధర్మమని యుపనిషత్తులయందు చెప్పబడెను. సర్వయోగంబులు నుత్కృష్ట ధర్మానుష్ఠానములై యున్నవి. మాయాపాశరహితానుష్ఠానమే పరమధర్మము. ఇట్టివాడన్నిటికి నధికారియై యుండెను. ఇట్టిధర్మము

లందరునాచరింపలేరు. ఆత్మజ్ఞానమందరికి కుదురదు సత్క్రియలాచరింపుచు, యాగాదులు చేయుటకూడ ధర్మము లనబడును. ఈ యపరధర్మము పరమ ధర్మమునకు సాధనమై యుండెను. ఇవన్నియు ధర్మశాస్త్రముల యందు చెప్పబడియున్నవి. శివ శాస్త్రమందు శ్రేష్ఠ శివధర్మములు, అనుష్ఠాన ములు చెప్పబడియుండెను. ఇతిహాస పురాణములందు కూడ నిట్టి ధర్మము లన్నియు చెప్పబడియుండెను. శివ శాస్త్రమునంది దంతయు సాంగోపాంగ ముగ విస్తరింప బడెను, శివదీక్షాపరుల సంస్కారములన్నియు నందు వివరింప బడియున్నవి. శృతిస్మృతి భేదములచే శైవశాస్త్రము రెండు విధములుగ నున్నవి. ఈ రెంటిలో నొకటి వేద శాస్త్ర సమ్మతముగను. రెండవది స్వతం త్రముగ నుండెను. స్వతంత్రము మొదటిభాగము. దశవిధంబులుగను, రెండవ భాగ మష్టాదశ విధంబులుగను చెప్పబడెను. ఇదంతయు సిద్ధాంత సంజ్ఞ లతో గూడుకొని కామికాది సమాఖ్యానముల నుండెను. వేద శాస్త్ర సమ్మత మైనది శతకోటి ప్రవిస్తరమై యుండెను. దానియందు మిక్కిలి పాశుపత వ్రత జ్ఞానములు చెప్పబడెను. శివుడు యుగయుగములయందు యోగాచార్యస్వరూ పముగాని శిష్యులకుపదేశించు చుండును. రురువు. దధీచి. అగస్త్యుడు, ఉపమ న్యుడు మొదలగు వారు శివోపదేశంబులు. శివునిచే స్వయముగ వినియుండిరి. ఇంకననేకులు వినియుండిరి గాని అందరిని చెప్పుటకవకాశము లేదు. పశుపతిని గూర్చిచెప్పబడెను గాన, పశుపతి శాస్త్రమని చెప్పబడెను. దీనినాచరింపు వాడు పశుపతి వ్రతులని చెప్పుదురు, నేటికని శిష్యప్రశిష్యులతో పాశుపత వ్రతులనేక వేలుండిరి. ఈవ్రతధర్మంబులు చతుర్విధంబుగ నుండెను పాశుపత వ్రతములచే శివుడు ప్రత్యక్షమగును. ఇదియే శ్రేష్ఠయోగానుష్ఠాన మనమ దును. ఈపాశుపత వ్రతానుష్ఠానములు బ్రహ్మకూడ చెప్పియుండెను. అష్టాం గయోగంబులు ప్రజాహితంబునకై శివుడుకల్పించి యుండెను వీటిచేశివభక్తి యభివృద్ధియగును.

యమనియమ, ఆసనప్రాణాయామ. ప్రత్యాహార. ధ్యాన. ధారణ. సమాధులను సప్తాంగములు యోగమనబడును.

1. యమమనగా నింద్రియ నిగ్రహము
2. నియమమనగా నొకకట్టు బాటులోనుండుట

3. ఆసనమనగా, పద్మాసనము మొదలగునవి.

4. ప్రాణాయామమనగా వాయునిరోధనము.

5. ప్రత్యాహారమనగా, విషయములనుండి యింద్రియములను మరలించుట

6. ధారణయనగా, భగవంతునితప్ప యితరము గానకుండుట

7. ధ్యానమనగా, చలింపకుండ భగవంతుని ధ్యానించుట

8. సమాధియనగా మనోలయము. దీనిచే శైవప్రజ్ఞ కల్గును.

ఈ ప్రజ్ఞచే స్థిరమగు పరమ జ్ఞానము చిరకాలమందే లభించును. ఇట్టి జ్ఞానముచే శివుడు శీఘ్రముగ ప్రసన్నుడగును. శివానుగ్రహముచే పరమ యోగము ప్రాప్తించును. దీనిచే నపరోక్ష జ్ఞానము సిద్ధించును. శివుడు ప్రత్యక్షమగును. శివ సాక్షాత్కారముచే సంసార బంధనములు విడిపోవును. అపుడు సంసార విముక్తుడై శివ తుల్యుడగును. ఇదంతయు బ్రహ్మ నుడివిన యుపాయంబులు, ఇంకొక పద్ధతి కూడ చెప్పబడి యుండెను, శివుడు, మహేశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, పితామహుడు, సంసార వైద్యుడు, సర్వజ్ఞుడు, పరమాత్ముడు నను నీయష్ట నామంబులు ముఖ్యము లైనవి. ఈనామాష్టకమును స్మరించి నను, శివానుగ్రహము కల్గును. మొదటి పంచనామంబులచే క్రమముగ శాంత్యాతీతపదంబు లభించును. ఈ యైదు పంచోపాధులై సదా శివనామ సంజ్ఞలై ప్రవృత్తి మార్గములై యుండెను. మిగిలిన మూడు నివృత్తి మార్గములై యుండెను. గాన నీ యష్ట నామంబులు నిహపర సౌఖ్యకారకములై మోక్ష ప్రాప్తిని కలుగ జేయును. మరియు నీ మూడు యుపాధి భేదంబులు, దూరము చేసి, మోక్షము ప్రాప్తిని కల్గించును. మోక్షపదమే నిత్యమైనది. తదితరము లన్నియు ననిత్యములు. పై యైదు నామంబులు సాధించినచో, తరువాత మూడింటిచే ముక్తిని సాధింప వచ్చును. మొదటి యైదు నామంబులు నాత్మ జ్ఞానమును కల్గించును. చివర మూడు నామంబులచే మాయవశమగును. ఈ నామత్రయము శివోపాధియై యుండెను. అనాదిమల సంయుక్తుడై నచో నుపాధితో గూడిన జీవుడగును. అది లేనిచో శివుడే యగును. శివ

కళ్యాణ గుణంబు లెరింగిన వారందరు, శివ తత్వమును గ్రహింతురు. శివ తత్వార్థ వాదులను సత్పురుషులు శివుడే యనుచున్నారు. ఇరువది మూడు తత్వముల కంటె పరమైనది ప్రకృతి. దానికంటె పరమేశ్వరుడు పరుడు. ఇతనినే పంచవింశతి తత్వాత్మకు డందురు. వేదము నందు వాచ్య వాచక భేదము ననుసరించి యోంకారమే సర్వమని చెప్పబడెను. యోంకారమే వేదైక వేద్యుడగు పరమేశ్వరు డని యుపనిషత్తుల యందు చెప్పబడెను. పురుడగు పరమేశ్వరుడు ప్రకృతి లీనుడై యుండెను. ప్రకృతి పరమేశ్వ రాధీనమై యుండెను. ఇతని నుండియే త్రిగుణంబు లుద్భవించెను. ప్రకృతి యనగా మాయ, మాయావి పరమేశ్వరుడు, మాయావిచ్ఛేదకు డనంతుడు యీ యనంతుడే పరమేశ్వరుడు కాలాత్ముడు, స్థూల రూపముగను, పరమాత్ముడు, సూక్ష్మరూపముగ నుండెను. రు॥ దుఃఖమును॥ ద్రావయతి॥ పోగొట్టువాడు గాన, రుద్రు డనబడుచున్నాడు. ఈ శివుడే పరనుకారణు డని సత్పురుషులు నుడివి యుండిరి. తత్వాది భూతపర్యంతము శివుడు వ్యాపించి యుండెను. గాన, రుద్రు డని పిలువబడు చుండెను. శివుడు సర్వ జీవులకు తండ్రి వంటి వాడు గాన పితామహు డని పిలువబడు చుండెను.

శ్లో॥ నిధానజ్ఞో యథావైద్యో రోగస్య విని వర్తకః
ఉపాయైర్భేష జైస్తద్వల్ల యభోగాది కారకః

2. సంసారస్యేశ్వరోనిత్యం॥ సమూలస్యనివర్తకః
సంసారవైద్య ఇత్యుక్తః సర్వతత్వార్థ వేదిభిః

వైద్యుడు నాడీ నిదానముచే వ్యాధిని తెలిసికొని రోగము నౌషధముచే నివారించు నట్లుగ, భవరోగ భేషజు డగు పరమాత్మ జీవులమ నస్తత్వముల కనిపెట్టి సంసార నివృత్తికి చికిత్సలు చేయుచు, భోగములు కోరు వారికి భోగములు, మోక్షములు కోరువారికి మోక్షములు నొసంగు చుండును. మరియు నితడు త్రికాల వేద్యుడై, జీవుల యింద్రియ ప్రవృత్తుల నెరింగి, వారి వారి కర్మఫలంబుల నొసంగుచుండును. వస్తు యాథార్థ్యమును పరమేశ్వరుడు వినా యెవరు నెరుంగరు. ఇతడు సర్వజ్ఞాన వేద్యుడు గాన, సర్వము, నెరుంగును. యథార్థ వస్తువు నకు నాశనము లేనట్లుగ శివునకు నాశనము లేదు.

యత్నము లేకుండగనే నిత్యము సర్వము నెరుంగును గాన సర్వజ్ఞుడని పిలువ బడు చుండెను. ఈనామాష్టకమును గురుముఖమున తెలిసికొని, మొదటి దైన నామంబులచే, నివృత్త్యాది కళాగ్రంధులను గ్రెంచి క్రమముగ మూలా ధారాది పంచ గ్రంధులను భేదించి గుణములను శోధన చేయుచు, వాయుని రోధముచే వాటిని ఛేదింపుచు హృత్కంఠ, తాలు భ్రూమధ్య బ్రహ్మ రంధ్రము వరకు ప్రవేశించి, పుర్యష్టకమును ఛేదించి సుషుమ్నానాడిచే సహ స్రార మందున్న పరమాత్మను తెలిసి కొనవలెను. పుర్యష్టకమును గురించి విపులముగ నాచే రచింప బడిన వేదాంత సంజ్ఞా, కుసుమావళి యందు కలదు. ద్వాదశ దళాత్మకమగు హృత్పద్మ మందలి మనశ్చంద్రుని తీసికొని సహ స్రార మందున్న పరమేశ్వరుని యందైక్యము చేయవలెను. ముందుగా హృ దయ శ్వేత పంకజము నందున్న యర్ధనారీశ్వరు డగు పరమేశ్వరుని యిట్లు ధ్యానింప వలెను.

శ్లో॥ అర్ధనారీశ్వరం దేవం నిర్మలం మధురాకృతిం
శుద్ధస్ఫటిక సంకాశం ప్రసన్నం శీతలద్యుతిం

అని ధ్యానించి స్వస్థచిత్తుడై ఏమానవుడు పై జెప్పిన యష్టనామంబు లనెడిభావ పుష్పములచే పూజించి ప్రాణాయామము చేసి స్వస్థ చిత్తుడై ఈనామంబులు జపించినచో సహస్రార మందైన పరమేశ్వరుని గాంచవచ్చును. ఇడా పింగళల మధ్యను సుషుమ్న నాడియుండును. ఎడను నాసికయందు ఇడ, కుడి నాసిక యందు పింగళ యుండును. ఇడా పింగళ నాడులే గంగా యమునలు వీటి మధ్య యందున్న సుషుమ్న నాడి సరస్వతీ నది యనబడును. అనగా విజ్ఞా నము. ఈ విజ్ఞానముచే సహస్రార మందున్న పరమాత్మను గాంచవచ్చును ఇదియే యోగవిజ్ఞానము నాభియందష్ట నామంబులచే అష్టాహుతులు వ్రేల్చి పూర్ణాహుతి చేసి నమస్కరించి

శ్లో॥ అహింసా ప్రధమం పుష్పం
పుష్ప మింద్రి య నిగ్రహం
సర్వభూత దయా పుష్పం
క్షమా పుష్పం విశేషతః

శాంతి పుష్పం తపః పుష్పం
ధ్యాన పుష్పంతథైవచ
సత్యపుష్ప విధః పుష్పం
శివ ప్రీతికరం భవేత్.

1. **అహింసయే ప్రథమ పుష్పము.**
2. **ఇంద్రియ నిగ్రహము, ద్వితీయ పుష్పము.**
3. **సర్వభూత దయయే తృతీయ పుష్పము.**
4. నాల్గవది క్షమా పుష్పము.
5. ఐదవది శాంతి పుష్పము.
6. ఆరవది తపస్సు పుష్పము.
7. ఏడవది ధ్యాన పుష్పము.
8. సత్యనిష్ఠ పుష్పము.

ఇట్టి పుష్పములతో మానసిక పూజ చేయువాడు భగవత్సాయుజ్యమును పొంద గలడు.

ఇట్టి అష్టపుష్పంబులచేత తుదను పూజింపవలెను. హస్తమునందు జలము నిడుకొని తన యాత్మను పరమాత్మకు నివేదన చేయవలెను. ఇట్లు చిరకాలము చేసినచో పాశుపత జ్ఞానము కల్గును. ఈవ్రతముచే నుత్తమ ఫలము నొందగలడు. దీనిచే పరమ యోగము నొంది ముక్తినొందగలడు.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ముప్పది రెండవ అధ్యాయము సంపూర్ణము.

---

# ముప్పదిమూడవ యధ్యాయము

## పాశుపత వ్రతము

బ్రహ్మాది ఋషులందరు నాచరించిన పాశుపత వ్రతమును గూర్చి మాకు తెల్పుమని ఋషులు ప్రశ్నింప వాయువిట్లు చెప్పదొడంగెను. సర్వపాపహరమైనదియు. నతిరహస్యమైనదియు నగు పాశుపత వ్రతము చెప్పెద వినుడు. ఇది శ్రౌతము గో నథర్వశిరస్సు నందుండెను. అనగా అథర్వోపనిషత్తు నందుండెను. ఈవ్రతము చైత్రపౌర్ణమినాడు ప్రారంభింపవలెను. దీనిని శివక్షేత్రమందుగాని ఆరామముల యందుగాని, యరణ్యములందుగాని ప్రశస్తములగు శుభప్రదేశము లందుగాని, పౌర్ణమియుందు శుక్లత్రయోదశినాడు అగ్ని స్థాపించి, గురువు నాహ్వానించి పూజించి నమస్కరించి యనుజ్ఞ వడసి తాను శ్వేతవస్త్రధారియై, శుక్లయజ్ఞోపవీతముధరించి శుక్లమాల్యానులేపనుడై, దర్భాసనాసీనుడై, పిడికెడు దర్భలు గ్రహించి, ముమ్మారు ప్రాణాయామము చేసి. తూర్పుముఖంబునగాని, యుత్తరాభిముఖుడై గాని కూర్చుని యుమాశంకరులకు నమస్కరించుకొని ధ్యానించి వారియనుజ్ఞనొంది. దీక్షితుడై, వ్రతసంకల్పము చేసి, యావజ్జీవంతముగాని, ద్వాదశాబ్దములుగాని. యారుసంవత్సరములుగాని, మూడుసంవత్సరములుగాని, సంవత్సరముగాని. ఆరుమాసములుగాని, మూడుమాసములుగాని, మాసముగాని, పక్షముగాని, పన్నెండుదినములుగాని, యారుదినములుగాని, మూడుదినములుగాని, లేక ఒక్కదినముగాని, ఈపాశుపత వ్రతముచేయుదునని సంకల్పించి అగ్నియందు విరజాహోమములు గావించి, ఆజ్యచరు సమిధలచే యథావిధిగ హోమముగావించి, పూర్ణాహుతిచేసి, మరల తత్త్వసిద్ధికై సమిధలచే మూలమంత్రముతో హోమముచేసి. పంచభూతంబులు, పంచతన్మాత్రలు, పంచేంద్రియంబులు, జ్ఞానకర్మవిభాగంబులు, పంచకర్మవిభాగంబులు. త్వగాదిసప్తధాతువులు, పంచప్రాణాది వాయువులు. మనోబుద్ధ్యహంకారఖ్యాతి గుణంబులు, ప్రకృతిపురుషులు, రాగవిద్యాకళనియతికాలంబులు, మాయా శుద్ధవిద్యా, మహేశ్వర, సదాశివులు, శక్తిని, శివతత్త్వమని, విద్వాంసులు పల్కుదురు, ఇట్టితత్త్వ సిద్ధికొరకై యీ హోమము చేయుచుంటినని పల్కుచు, విరజామంత్రములచే హోమముచేసి. పాపరహి

తుడై, శివానుగ్రహము నొంది జ్ఞానవంతుడై, గోమయము తెచ్చి, శుద్ధచేసి, యభిమంత్రించి. అగ్నియందుంచి ప్రోక్షించి, ఆరోజంతయు హవిష్యభుజించి యుండి, మరునాడు చతుర్దశిరోజున, నిరాహారముతో నుపవాసముండి పూర్వమువలె యథావిధిగ హోమము చేసి, గడిపి, మరునాడు పౌర్ణమి రోజున, హోమము పూర్ణాహుతిచే పూర్తిచేసి, యగ్నిచల్లారిన తర్వాతభస్మము తీసికొని, జటిలుడైగాని, ముండియైగాని శిఖా ముడి ధరించిగాని స్నానముచేసి, లజ్జలేనిచో. దిగంబరుడైగాని, కాషాయ వస్త్రము ధరించిగాని, ఏకాంబర వల్కలుడైగాని, మేఖలధారియై దండముధరించి, పాదప్రక్షాళనము గావించి, రెండుమార్లాచమించి, హోమభస్మము గాత్రమంతయు ధరించి అగ్నిరితి భస్మాయని, ఆరుసారు సూర్యాత్మమంత్రములచే శిరము మొదలు చరణముల వరకు స్పృశించి. తదుపరి నాభస్మము స్నానముచేతగాని శివమంత్రము చేతగాని, క్రమముగా శరీరమంతయు పూసికొని. తదుపరి త్ర్యాయుషంజమదగ్నే యను మంత్రముచే త్రిపుండ్రములు ధరించి శివభావమునొంది శివయోగమాచరించి, త్రికాలములయందిట్లు పాశుపత వ్రతమాచరించవలెను. ఇట్లు చేసినచో భక్తిముక్తులుకల్గి పశుత్వము నశించును. ఇట్లు పశుత్వమునువీడి, సనాతనుడైన లింగమూర్తియగు మహేశ్వరు నర్చించును, విభవమున్నచో కేసర కర్ణికాసహితమైనదియు, హేమనవరత్న ఖచితమైన పద్మమునిర్మించి. లేనిచో శ్వేతపద్మముగాని, రక్తపద్మముగాని స్థాపించి యాపద్మ కర్ణికయందు, చిన్న స్ఫటిక లింగముకాని, సువర్ణలింగముకాని, రత్నలింగముకాని, మరియేలింగమైననుగాని స్థాపించి, లేకపంచముఖ విగ్రహము నైననుస్థాపించి. ప్రతిష్ఠాన పూర్వకముగ స్థాపించి తనశక్తికొలది సువర్ణపాత్రలలో పంచద్రవ్యముల నభిషేకించి యాలింగమునకు. గంధము పచ్చకర్పూరము. నితర సుగంధద్రవ్యములు. కుంకుమ, పునుగు జవ్వాజి, చందనము మొదలగువాటిని లింగముపై పూసి బిల్వపత్రంబుల చేతను, రక్తశ్వేత పద్మంబులచేతను, యుత్పలంబు చేతను, నీలోత్పలంబుల చేతను, యితర సుగంధపుష్పంబుల చేతను, తులసీ బిల్వదూర్వాది పత్రంబులచేతను ప్రాప్తమగు కుసుమంబుల చేతను, మహాపూజావిధానంబుగ పూజించి, ధూపదీపనైవేద్యాదు లొసంగవలెను. ఇష్టమైనవియు, విశిష్టమైనవియు నగువస్తువులు, న్యాయోపార్జిత విత్తము సంపాదించి

యూపూజలుగావింపవలెను, ఇవన్నియు సహస్రంబులు లభింపనిచో 108 చొప్పున నైననుగ్రహించి పుష్పదళంబులచే సహస్రనామార్చన చేయవలెను. ఏమియున్నను లేకున్నను విశేషముగ బిల్వపత్రములు మాత్రముండవలెను. శక్తి యున్నచో సహస్ర సువర్ణకమలములతో పూజించిన మరియు విశేషము. ఒకసువర్ణ పద్మముతో పూజించిన, సహస్ర పద్మంబులతో పూజించిన ఫలం బులభించును, ఒకబిల్వ పత్రము వేయినల్లకలువలసమానము, మిగిలిన పుష్పం బులకు సంఖ్యానియమములేదు. ఎన్నిలభించిన, నన్నిటితోనే చేయవచ్చును, అష్టాంగధూపము, విశేషమైనది. వామదేవునకు చందనము. తత్పురుషునకు. అరిదళియు, అఘోరునకు, కృష్ణాగరు. సద్యోజాతునకు, మణిశిల. ఈశాను నకు భస్మముపూయవలెను. లేక ధూపము వేయవలెను. మరియొక విధానము చెప్పదను అఘోరునకు శ్వేతాగరువు. తత్పురుషునకు కృష్ణాగరువు, సద్యో జాతునకు గుగ్గులము. వామదేవునకు,సుగంధద్రవ్యములు, ఈశానునకు వట్టివేళ్లు ధూపము వేయవలెను. ఇవియతి విశేషము. చందనాగరు ధూపంబులు సామాన్యములని చెప్పబడెను. కర్పూరదీపములు గోఘృతవత్తి దీపములు పైవాటికన్న విశేషము. ఈశ్వరుని పంచముఖములకు, ప్రత్యేకముగ ప్రతిము ఖమునకు అర్ఘ్యాచమనంబు లీయవలెను. కర్పూరాదులను కర్పూరకపిల ఘృతం బులతో కూడిన జలము సమర్పింపవలెను. పిదపచే స్వర్ణాచ మనంబులీయవ లెను. తరువాత యావరణపూజలు గావింపవలెను. ప్రథమావరణంబున, గణ పతి షణ్ముఖులను, బ్రహ్మాంగసంభూతులగు త్రిమూర్తులను పూజింపవలెను. ద్వితీయావరణంబున విఘ్నేశ్వర, చక్రవర్తులను పూజింపవలెను. తృతీయావర ణంబున భవాద్యష్టమూర్తులను పూజింపవలెను. చతుర్థావరణంబున నేకాదశ రుద్రులను, ముండిగణపతి, లక్ష్మీగణపతి మొదలగు గణపతులను పూజింప వలెను. పంచమావరణ మందునస్త్రశస్త్రసహితులగు దశదిక్పాలకుల నర్చింపవలెను. ఇంకను, బ్రహ్మమానసపుత్రులను, సకల జ్యోతిర్గణంబులను, సర్వదేవతలను, దేవశాస్త్రులను సర్వభేదములను, సర్వమునిగణంబులను యోగులను, పక్షులను, మాతృకలను గణంబులతో క్షేత్రపాలురను, సర్వచ రాచరంబులను, పాతాళవాసులను, ఏదుందరు శివవిభూతులని శివప్రీతికై పూజింపవలెను. ఇట్లుపంచావరణ పూజయైనతరి పంచముఖేశ్వరుని పూజించి.

నేయి పాలతో వండినహవిస్సును నైవేద్యము చేసి, ముఖశుద్ధికై తాంబూలమిచ్చి నానాపుష్పమాలాలంకృతుని చేసి కర్పూరనీరాజనమిచ్చి, ఛత్రచామరాందోళిక శయనంబులు సమర్పించి, శయనించు నపుడు, చంద్రసంకాశమగు హారము సమర్పించి రాజోపచారంబులు గావించి, స్తుతించి, శివమంత్రము జపించి, ప్రదక్షిణముచేసి, పునః పూజగావించి యాత్మసమర్పణము గావించి, గురువిప్రులపూజించి, యష్టపుష్పంబులు సమర్పించి, నుద్వాసనము జెప్పి. అగ్నిహోత్రమునకు ద్వాసనము చెప్పవలెను. నిత్యము శివపూజనాచరింపని వారునుద్వాసనము చెప్పనవసరములేదు. నిత్యము చేయని వారు ఈశివలింగమును గురువునకచ్చిగాని దేవాలయము నందుంచుటగాని చేయవలెను. పూజానంతరము, విప్రులకు భోజనము, యతులకు ఫలమూలంబులనిచ్చి, సంతుష్టిపరుపవలెను. దీనులకు భిక్షులకు భోజనంబిడవలెను. ఈవ్రతమాచరించు వారు, క్షీరపానము చేసిగాని, యేకభుక్త మొనరించిగాని, నక్తభోజనముచేసిగాని యుండిశుచియై యధశ్శయనుడై భస్మశాయియైగాని, తృణశాయియైగాని కృష్ణాజినమునగాని, నారవస్త్రములయందుగాని శయనించుచు, నిత్యముబ్రహ్మచర్యము సల్పుచు నివ్రతము చేయవలెను, శక్తివంతుడైనచో రవివారమందున. ఆర్ద్రానక్షత్రమందున, పౌర్ణమి, అమావాస్య అష్టమి చతుర్దశి దినములయందు ఉపవసించిగాని, ఏకభుక్తము చేసిగాని ఈవ్రతముచేయవలెను. ఈవ్రతదినములయందు పాషండులను, పతితులను, రజస్వలా స్త్రీలను ప్రసూతిస్త్రీలను, అపవిత్రులను. త్రికరణశుద్ధిగ ప్రయత్నముగ వర్జింపవలెను. సదా, క్షమా, దాన, దయాసత్యాహింసా శీలములతో నుండవలెను. మరియు సంతుష్టుడై, ప్రశాంతుడై, జపధ్యాన పరాయణుడై త్రికాలస్నాతుడై, లేకభస్మస్నాతుడై, విశేషముగ, మనోవాక్కాయ కర్మలచే పూజింపవలెను. అమంగళకరమగు కృత్యములెన్నడు చేయరాదు. ఈక్రియలన్నియు శక్తికొలది, లఘుగురుత్వములననుసరించి, చేయవలెను, ఉచితక్రియలు మరచినచో, ప్రాయశ్చిత్తము చేసికొని పూజ హోమ జపాదులుచేసి, ప్రమాదములు లేకుండ వ్రతసంపూర్తి గావింపవలెను. తదుపరి శక్తికొలది సర్వకామ వివర్జితుడై, శివప్రీతికై, భక్తులు గోదానము, వృషోత్సర్జనము చేయవలెను. అనగా ఆంబోతును అచ్చువేసి విడుచుట

ఇదంతయు, సంక్షిప్తముగ చెప్పితిని ఇటుపై ప్రతిమాసము చేయవలసిన విధులను చెప్పెదను వినుడు.

శ్లో॥ వైశాఖే వజ్రలింగంతు
జ్యేష్ఠే మారకతం శుభం
ఆషాఢే మౌక్తికం విద్యా
చ్ఛ్రావణే నీలనిర్మితం.

2. మాసేభాద్రపదే చైవ
పద్మరాగమయం పరం
ఆశ్వినే మాసివిద్యాద్వై
లింగంగో మేధికంవరం.

3. కార్తిక్యాం వైద్రుమంలింగం
వైఢూర్యం మార్గశీర్షకే
పుష్యరాగమయంపౌషే
మాఘేద్యు మణిజంతథా.

4. ఫాల్గుణే చంద్రకాంతోత్థం
చైత్రేతద్వ్యత్యయాధవా
సర్వమాసేషు రత్నానా
మలాభేహేమమేవవా.

5. హైమాభావే రాజితంవా
తామ్రజంశైలజంతథా
మృణ్మయంవాయథాలాభం
జాతుషం చాన్యదేవవా.

6. సర్వగంధమయంవాథ
లింగంకుర్యాద్యథారుచి
వ్రతావసాన సమయే
సమాచరిత నిత్యకః.

వైశాఖంబున వజ్రలింగము, జ్యేష్ఠంబున మరకత లింగము. ఆషాఢం బున మౌక్తిక లింగము, శ్రావణంబున నీలలింగము, భాద్రపదంబున పద్మ రాగ లింగము, ఆశ్వయుజంబున గోమేధిక లింగము కార్తీకమున, విద్రుమ లింగము, మార్గశీర్షమున వైఢూర్య లింగము, పౌషమున, పుష్యరాగ లింగము, మాఘమున సూర్యకాంతి లింగము, ఫాల్గుణమున, చంద్రకాంతి లింగము, చైత్రమున, చంద్రకాంతి లింగమునే యర్చింప వలెను. ఈ రత్న లింగములు లభింపనిచో సువర్ణలింగము లతో సమానముల యందర్చింప వలెను. సువర్ణము లభింపనిచో రజతము గాని, తామ్రముగాని, శిలా లిం గమును గాని, అథవా మృణ్మయ లింగము గాని సుగంధ ద్రవ్యములతో చేసిన లింగము గాని నర్చింప వచ్చును. వీటిలో నెుకటి కేలింగమో దానినే పూజింప వచ్చును. పూజాంతమున నాచార్యుని విశేషముగ పూజింప వలెను. తదుపరి నాచార్యుని యనుజ్ఞచే పూర్వముఖంబున గాని, యుత్తరముఖంబునగాని కూర్చుని కుశపాణియై, ధర్భాసనాసనుడై ప్రాణాయామంబు చేయుచు శక్త్యను సారముగ శివ మంత్రమును జపించుచు, చేతులు మోడ్చి నమస్కరించు, నీయాజ్ఞచే నీవ్రతము పూర్తి చేసితిని. భగవంతుడా యని పల్కుచు, నట పరచిన దర్భలన్నియు తీసి యుత్తర దిశయందు విసర్జింప వలెను. తదుపరి దండ ము నార బట్టలు జటలు, మేఖలము, విసర్జించి, ఆచమించి, పంచాక్షరి జపించి, శక్తి యున్నచో జీవితాంతము వరకు నీవిధంబుగ నాచరింప వలెను. ఇట్టి వాడు పరమ నైష్ఠికు డనబడును. సన్యాసు డని కూడ చెప్పబడును. ఇట్టి వాడు తాపస శ్రేష్ఠు డనబడును. దీనిని మించిన వ్రతము లేదు. ముముక్షువు లలో నీవ్రత మాచరించిన వాని కన్న కృత కృత్యు డెవడును లేడు. సన్య సించడము కన్న నీవ్రతము శ్రేష్ఠ మైనది. ద్వాదశ దినము లీవ్రతము తీవ్ర ముగ చేసినచో, నైష్ఠిక తుల్యుడగును. శరీర మంతయు గో ఘృతము పూసి కొని, మూడు రోజులు గాని, రెండు రోజులు గాని ఈ వ్రతమును చేసినచో వాడు నైష్ఠికు డనబడును. నిష్కామముతో నీవ్రతము చేసి, యాత్మార్ప ణము చేసినచో నట్టి వానితో సదృశు డెవడు నుండడు. భస్మము ధరించిన వారి సర్వ ఘోర పాపములు వెంటనే నశించును. రుద్రాగ్ని భస్మమే దానికి తగినది. ఈ భస్మమును రుద్రాగ్ని వీర్యమందురు గాన శివ భస్మము ధరిం

చిన వారు వీర్యవంతు లగుదురు. భస్మ నిష్ఠుల పాపము లన్నియు, నగ్ని సంగమముచే కాష్ఠములు భస్మమగు నట్లు భస్మ మగును. భస్మ స్నానముచే పరిశుద్ధాత్ము డగును. మనుజుడు భస్మ నిష్ఠు డన బడును. సర్వాంగములకు విభూది పూసికొని భస్మముచే త్రిపుండ్రములు ధరించి భస్మ స్నానముడై యున్న వానిని, భూత ప్రేత పిశాచంబులు దరికి చేరలేవు. అట్టి వాని కడకు ఘోర రోగంబు లైనను రావు, సంశయములేదు. భాసించెడిది గాన భస్మ మని చెప్పబడెను. కల్మషము లను భక్షించును గాన భస్మమన బడును. ఐశ్వర్య ప్రదమైనది. గాన, విభూతి యనబడు చుండెను. ఇట్టిది భూది సర్వ రక్షాకరమై యుండెను. భస్మమాహాత్మ్య మెంత చెప్పినను యంత ముండదు. ఇంతగా జెప్పనేల భస్మము ధరించిన వాడు, శివు డంతటి వాడ గును. శివునకీ భస్మము పరమాస్త్రము వంటిది. శైవులకీ భస్మము, దివ్యాస్త్రము వంటిది. ఉపమన్యు డీవ్రతము చేసి తన యాపదలను పోగొట్టుకొనెను. కాన సర్వ ప్రయత్నములచేత నీ పాశుపత వ్రత మాచరింప వలెను. ఈ భస్మ మును ధన తుల్యముగ భావించి జాగ్రత్తగ సంగ్రహింప వలెను. భస్మస్నానము భస్మలేపనము విడువరాదు.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు పూర్వఖండమున
ముప్పది మూడవ అధ్యాయము సంపూర్ణము

---

## ముప్పవ నాలుగవ యధ్యాయము

### ఉపమన్యుని తపస్సు

ధౌమ్యాగ్రజు డగు నుపమన్యుడు బాల్యమున శివుని గురించి క్షీరములకై తపంబుచేసి, క్షీరార్ణవమును బడసెను గదా? అతనికి శివోపాసన యెట్లు తెలిసెను? నతుడిరి యింకను నెందులకై తప మాచరించెను. అతడు పొందిన సిద్ధులెట్టివి? అతని జ్ఞాన మెట్టిది? రుద్రాగ్ని వీర్య భస్మముచే తానెట్లు రక్షింప బడెను? శివ విజ్ఞాన మెట్లు పొంద గల్గెనో

చెప్పుమని ఋషులు ప్రశ్నింప వాయు విట్లు చెప్పదొడంగెను. ఉప మన్యుడు సాధారణుడు గాడు. ఇతని తపంబును సాధారణ మైనది గాదు. ఇతడు ధీమంతు డగు వ్యాఘ్ర పాదముని కుమారుడై యుండెను. ఇతడు ఇతడు జన్మాంతర కారణముచే తపోభ్రష్టుడై మునికుమారుడై జనించెను. గాని జన్మ నొంద వలసిన వాడు గాడు. మహాదేవుని ప్రసాదముచే దుగ్ధముల నిమిత్తమై తపమాచరించి యతని కృపాకటాక్ష పాత్రుడై, గణాధ్యక్షుడై శాశ్వత కుమారత్వము నొందెను. స్వయముగ శంకరు డితని దుగ్ధార్ణవము నిచ్చి యుండెను. శివాను గ్రహముచే యితడు, శివజ్ఞానమునొందగల్గెను. ఇదంతయు ఇతనికి కుమారావస్థ యందే సంప్రాప్త మయ్యెను. ఇంకను మంచి వక్తయై, శాస్త్ర జ్ఞానసంపన్నుడై జ్ఞానసాగరు డయ్యెను. ఇతడిట్టి జ్ఞానము నొందుటకు తల్లియే కారణము. ఇతడు చిన్న తనమందు మేనమామ గారి యింట నుండగా మేనమామ కుమారుడు పాలుపానము చేయుట గాంచి తల్లితో నో తల్లీ! నాకు రుచికరమగు వేడివేడి గో క్షీరంబులు పానము చేయవలె నని యున్నది. యిమ్మని తల్లి పుత్రుని వాక్కులు విని మనకు పాలెక్కడివి తండ్రీ! నీవిట్లడుగకు మని పలు మారు బోధింప నుపమన్యుడు మాటిమాటికి పాలు కావలయునని యేడ్చుచుండ, పిల్లవాని పోరు పడలేక నాకలభాషిణి యుంఛ వృత్తిచే తాను సంపాదించిన ధాన్యమును దంచి పిండిచేసి దానిని పిండిపాలుగ తయారు చేసి కొడుకునకు క్షీరము నివ్వలేక పోతినని దుఃఖింపుచు, రారా నాయనా యని బుజ్జగింపుచు నా కృత్రిమక్షీరంబు లొసంగ, నుపమన్యు డవి గ్రోలి, తల్లీ యివి పాలుకావు. ఇవి బాగులేవని పలుకుచు నేడ్చుచుండ, తల్లి దుఃఖించుచు కుమారుని నేత్రములు తుడిచి బిడ్డా! సర్వ రత్నములు శివభక్తి గల్గిన భాగ్య వంతులకే లభించును. స్వర్గము, రాజ్యము, మోక్షము, మంచి మంచి భోజనములు, క్షీరములు, శివభక్తులకే లభించును గాని, భక్తి లేని వారికి లభింపవు. సకల వస్తువులు శంకర కృపచే లభించును. యితర దేవతల నారాధించి వ్యర్థముగ కాలము గడుపుటయే గాని ఫలితముండదు. వనవాసు లమగు మనకు క్షీరము లెక్కడి నుండి వచ్చును? అందులో మనము హీనులము గాన, నీకు పిండిపాలిచ్చితిని నీవిది వరలో మేనమామ గారింట నిచ్చిన గో క్షీరములు కొంచెము రుచి చూచితివి గాన నీకు పాలరుచి

తెలిసి యివి పిండిపాలని గ్రహించితివి. నీవవవసరము దుఃఖింపకుము. ఈశ్వరానుగ్రహము లేనిదే పాలు లభింపవు. సపరివారుడైన సాంబశివుని సేవించినచో సర్వ సంపదలు లభించును. అతనిని పూజింపనిచో యెట్టి ధనంబులు లభింపవు, భక్తులయభీష్టంబు లిచ్చు భగవంతు డితడొక్కడే సుమా! నేను పూర్వజన్మమున, శివునిగాని, విష్ణువునిగాని, సేవింపలేదు గాన నాకీదరిద్ర బాధసంభవించెను. ఏమిచేయుదునన, నుపమన్యుడు తల్లివాక్కులు విని లోలోనదుఃఖింపుచు, నతిప్రగల్భముతో నోతల్లీ! శోకింప కుము. సాంబశివుడు సుఖములిచ్చువాడైనచో నీవుశోకము వీడుము. ఆ మహాభాగుడు మనకు, సకలమంగళములు చేకూర్చును. పరమేశ్వరుడన్న మాట సత్యమైనచో నేతనిని మెప్పించి క్షీరసాగరము నచిరకాలంబునగాని చిరకాలంబునకుగాని యవశ్యము తెచ్చెదను. నామాటవినుమన బుద్ధిమంతు డగు పుత్రవాక్కులు తల్లివిని యోబిడ్డా! నీవునాకు సంతోషకరమగు వాక్కు లువినిపించితివి. విలంబముచేయక, సదాశివుడగు శాంబుని సేవింపుము, సర్వ కారణములకు కారణుడు శివుడేకాని యన్యుడులేడు బ్రహ్మాది సకలదేవతలు నతనికి కింకరులై యుండిరి. ఈశ్వరప్రసాదముచే వారైశ్వర్యములనొంది యీశ్వరదాసులై యుండిరి. లోకశంకరుడైన శంకరునివినా తెలిసి కొనదగిన పురుషుడెవడును లేడుగాన నితర దేవతల వీడి గణంబులతో గూడిన సాంబుని త్రికరణ శుద్ధిగ, భావపురస్సరముగ, సేవింపుము దేవాదిదేవుడగు శివుడు, వని దాతయై యుండెను. ఓంనమశ్శివాయ యనుమంత్రాధిష్ఠాన దేవతయితడె, ముందుగ నోంకారము ఓంకారమునుండి శివపంచాక్షరీ మంత్రముజనించెను. ఈమంత్రము స్వతంత్రమై యుండెను. మిగిలిన మంత్రములు ఈశ్వరాధీనములై యుండెను. శివుడు. నిష్ప్రాప్త కృష్టజీవుల నందరిని. రక్షింపుచుండును. గాన, సర్వవిధముల పంచాక్షరిని జపింపవలెను. ఈమంత్రము జిహ్వాయందాడినచో, లభింపని వేవియునుండవు. ఈయఘోరాస్త్రము శైవులను రక్షించు దివ్యా స్త్రమువంటిది. గాన నీమంత్ర ప్రభావము నెరింగి శివతత్పరుండవు గమ్ము, నేను నీతండ్రి కడనుండి సర్వరక్షాకరమైన విరజాభస్మమును తెచ్చియుంటిని, నీవు నాయనుజ్ఞచే, నీభస్మమును ధరించి శివమంత్రమును జపించినచో నీకు రక్ష ణకల్గునన, నతడు, తల్లియాజ్ఞను శిరసావహించి, భస్మమును గ్రహించి, నమ

స్కరించి తల్లిచే దీవనలొంది తపంబునకు హిమాలయమునకు జనుచుండ దేవతలు నిన్ను రక్షించెదరు. గాకయని తల్లి మరల దీవించెను. తదుపరి యుపమన్యుడు, యేనిమిది యిటుకలను స్థాపించి దానిపై మృణ్మయ లింగంబునిడి గణ సహితముగ సాంబమహేశ్వరుని స్థాపించి, దీక్షవహించి వన్యపుష్ప ఫలంబులు తెచ్చి, పంచాక్షరీ మంత్ర రాజముచే నర్చింపుచు జపించుచు, చిరకాలము పరమ తపముచేసి, క్షీణ శరీరుడై, శివాసక్త మానసుడై యుండ,

పూర్వము కొందరు మునులు మరీచి శాపగ్రస్తులై రాక్షస భావము నొంది, యుపమన్యుని తపంబు విఘ్నము చేయుచు పీడింప సాగిరి. వారు పీడింపు చున్నను, నా బాలుడు తపంబు మాత్రము మానక, మాటిమాటికి, ఓం నమశ్శివాయ, యని పలుకుచుండ, నాపిశాచంబులీ శివ స్మరణ విని రాక్షస భావము వీడి, యీ బాలుని సేవింప జొచ్చిరి. మరియు నితడు యథేచ్ఛగా తపంబు చేయుచుండ తేజోవంతమైన యతని తపోవేడిమికి చరాచర జీవులన్నియు తపింప సాగెను.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు
ముప్పది నాలుగవ అధ్యాయము సంపూర్ణము.

---

## ముప్పది ఐదవ యధ్యాయము

### ఉపమన్యుని తపస్సిద్ధి

దేవతలు ఉపమన్యుని ప్రదీప్త తపోగ్నికి తాళలేక విష్ణువు కడకు వైకుంఠమున కేగి విన్నవింప, విష్ణు వదంతయు నెరింగి మందరాద్రికి డను మహేశ్వరుని కడకేగి నమస్కరించి యోమహేశ్వరా! బ్రాహ్మణ కుమారుడైన యుపమన్యుడు క్షీరార్ణవమునకై తపంబు చేయుచుండెను. చరాచర జీవులన్నియు నతని తపో వేడిమిని సహింప లేకున్నవి గాన దానిని నివారింపుమన, శంకరుడందుల కంగీకరింప విష్ణువు దేవతలతో స్వస్థాన మేగెను. తదుపరి నీశ్వరుడు దేవేంద్ర రూపముతో బాలుని రక్షించెద నని తలంచి,

శక్ర రూపము నొంది ఐరావతారూఢుడై దేవతలు సిద్ధులు వెంటనడువ
మహోరగులు సేవించుచుండ, శచీ సహితుడై, సురలు, చామరంబులు వీవ
చంద్ర బింబముచే మందర పర్వతము శోభించు నట్లుగ ఆతపత్రముచే శోభిం
చుచు శక్ర రూపముతో నుమాపతి యుపమన్యు నను గ్రహింపనై యతని
యాశ్రమంబున కేగెను. ఇట్లు చనుదెంచి యున్న శక్రుని గాంచి యుపమ
న్యుడు నమస్కరించి యో దేవేంద్రా! మీ రాకచే నా యాశ్రమము పవిత్ర
మయ్యెనని, నిలబడియుండ, శక్ర రూపుడగు పరమేశ్వరుడు గంభీర వాక్కు
లతో ఓ సువ్రతా! నీ తపమునకు మెచ్చితిని. వరము కోరుము. నీయాప్సితము
నెరవేర్తును. కోరుమనగ, బాలుడు శక్ర వాక్కులు విని ఓ యింద్రా!
నిన్ను గురించి నేను తపమాచరింప లేదు. నీవట కేతెంచుటకు కారణమేమి?
నా తపంబు విఘ్నము చేయుటకు కాదుగదా! యన దేవేంద్రుడు బాలకా!
నన్ను నీ వెరుగవు. నేను త్రిలోకాధిపతిని. శక్రుడను. సర్వదేవ నమస్కృతు
డను మహావిప్రులందరు సర్వదా నన్నర్చించుచుందురు. నీకు సుఖములు
చేకూర్చెదను. నిర్గుణుడగు రుద్రుని భజన విడువుము. నిర్గుణుడగు నతడు
నీ కార్యమెట్లు సాధింప గలడు? అతడు దేవతా పంక్తి బాహ్యుడు. పిశాచ
సేవితుడన, బాలుడింద్రుని వాక్కులు విని, నా తపో విఘ్నమునకై నిత
డేతెంచెనని తలచుచు, శివ మంత్రము జపించుచు నో యింద్రా! నీవు శంక
రుని నిందింపుచుంటివేల? రుద్రుడు సర్వదేవ మహేశ్వరుండని యెరుగవు
గాబోలును. శివుడు త్రిమూర్తులకు జనకుడు. ప్రకృతికంటె పరుడు సదసద
వ్యక్తుడని బ్రహ్మవాదులు పలుకుచుందురు, మరియు నిత్యానిత్యుడు యేకా
నేకుడు గాన, నట్టి పరమేశ్వరుని చేత నేను వరములు బడసెదను. అతడు హేతు
వాద వినిర్ముక్తుడు సాంఖ్య యోగప్రదుడుగాన నతనివల్లనే నేను వరములు
బడసెదను. సర్వకారణ కారణుడగు పరమేశ్వరుని వినా యెదియు లేదు.
అతడు బ్రహ్మ విష్ణ్వాది దేవతల సృజించెను. త్రిగుణాతీతుడు విభుడు వేరుగా
చెప్పనేల? అతనిని నేను బాగుగా నెరుంగుదును. జన్మాంతర పాపముచే శివ
నింద వినుచుంటిని గాన నేను వెంటనే దేహము చాలించి, శివ లోకమున
కేగెదను. శివాస్త్రముచే నిన్ను సంహరించి నేను శివలోక మేగెదనని బల్కి
శివ భస్మము గ్రహించి, యతి ఘోరమగు నఘోరాస్త్ర మభిమంత్రించి,

బిగ్గరగ శివ మంత్ర ముచ్చరింపుచు శంభుపదాంబుజములు స్మరింపుచు జీవితాశను వీడి, యాగ్నేయాస్త్ర మభిమంత్రించి పురుహూతునిపై విడువ నందీశ్వరుడు దాని నుపసంహరించెను. తిదుపరి శంకరుడు బాలేందు శేఖరుడై యుపమన్యుని యెదుట సాక్షాత్కరించి, క్షీరార్ణవ సహస్రంబులు నమృతార్ణము, దధిసాగరము, ఘృతకడలి ఫలభక్ష్య భోజ్యోదధులు, నపూప పర్వతంబులు, బాలకున కిచ్చి పార్వతీ సహితుడై, వృషభ వాహనుడై నలువైపుల గణములు సేవింపుచుండ, త్రిశూల ధారుడై శంకరు డుపమన్యునకు దర్శన మిచ్చెను. దేవతలు దుందుభులు మ్రోయించి కుసుమ వర్షము కురియించిరి. విష్ణు బ్రహ్మాది దేవతలు దశదిశలు వ్యాపించి యీ విచిత్రమునగాంచుచుండిరి. ఉపమన్యుడు పరమేశ్వరున సాక్షాత్కారముచే నంతఃలేని యానంద సాగరమగ్నుడై సాష్టాంగ దండప్రణామం బాచరించి భువిపైనట్లే పడియుండ శంకరు డాబాలుని లేవతీసి బాలుడా రమ్మని శిరంబు ముద్దిడి నీకిదే భక్ష్య భోజ్య క్షీరార్ణవంబు లొసంగితిని. నీవు నీబంధువులతో యథేచ్ఛగ నివన్నియు ననుభవింపుము. నీవు నాయందు భక్తియుంచి దుఃఖమును వీడి సర్వదా సుఖింపుము. ఓ యుపమన్యూ! నీవు నాపుత్రుడవు. పార్వతి నీతల్లి. నే నిచ్చిన క్షీరార్ణవమును యథేచ్ఛగ ననుభవింపుము. ఓ మహాముని! నీకు యింకను దధ్యర్ణవము, ఘృతసాగరము, భక్ష్యభోజ్యోదధులు, ఫలపర్వతము, నపూపనగములు, నక్షయంబుగ నొసంగితిని. ఇంకను నీయిాప్సిత వరంబులు కూడ నిచ్చెదను కోరుకొనుము. సందియము లేదని ముద్దిడి మన పుత్రుడిదుగోనని పార్వతికి జూపింప, దేవికూడ నుపమన్యుని ముద్దుపెట్టుకొని స్కందునివలె గాంచుచు, నవ్యయమైన కుమారత్వము నిచ్చెను. శివు డింకను ప్రమథ గణాధిపత్యము నిచ్చెను. క్షీరసాగరము సాకారుడై వచ్చి, యుపమన్యుని హస్తమున స్వాదుక్షీరంబు లిడి యక్షయమైన క్షీరపిండ మతనికిచ్చియుండెను. ఇంకను యోగైశ్వర్యము, సదాతుష్టి, యవినాశి యగు బ్రహ్మవిద్య సకల సమృద్ధులు, సంతుష్టమానసము నొప్పు తపశ్శక్తియు నిచ్చి, పాశుపత జ్ఞానము, పశుపత వ్రతయోగతత్త్వము, ప్రవక్తృత్వము, సర్వసమర్థత, సర్వదా కుమారత్వము నొసంగ నుపమన్యు డానంద సాగరోర్మలచే

నుప్పొంగుచు ప్రసన్న చేతస్కుడై కృతాంజలి పుటుడై, దేవదేవుని మరి యొక వరమడగ దలచి

శ్లో॥ ప్రసీద దేవదేవేశ ప్రసీద పరమేశ్వర.
స్వభక్తిం దేహిపరమాన్దివ్యామవ్యభిచారిణీం

2. శ్రద్ధాం దేహి మహాదేవస్వ సంబంధుషు మేసదా
స్వదాస్యం పరమం స్నేహం సాన్నిధ్యం చైవ సర్వదా

3. దేవదేవ మహాదేవ శరణాగత వత్సల
ప్రసీద కరుణాసింధో సాంబ శంకర సర్వదా

ఓ పరమేశ్వరా! దేవదేవా! రక్షింపుము, రక్షింపుము. ఉత్కృష్టమైన యెడతెగని భక్తిని నాకిమ్ము. ఓ మహాదేవా! నీబంధువుల యెడ నాకు శ్రద్ధనిమ్ము. సర్వదా నాసాన్నిధ్యమందుండి నాసేవలకంగీకరింపుము. ఓ దేవ దేవ మహాదేవ శరణాగత వత్సల, ఓ కరుణాసింధూ! సాంబశంకర సర్వదా నన్ను రక్షింపుమని స్తుతింప సర్వేశ్వరు డేవమస్తు యని బల్కి ఓ వత్సా! నేను సంతసించి నీవడిగిన వన్నియు నిచ్చితిని. నీవు దృఢభక్తుడవై నాయందు జిజ్ఞాసతో నుండుము, యనియు నీవు దుఃఖవర్జితుడవై, యజరామరుడవై, తేజోవంతుడవై, యశోవంతుడవై, దివ్యజ్ఞాన సమన్వితుడవై, అక్షయ చాంధవుడవై, సదాకుల గోత్ర సమృద్ధుడవై, నాభక్తికలిగి యుందువు. నిత్యము నీయాశ్రమ నివాసుడనై యుండగలను. నీవు సదా నాయెదుట నానందముతో నుండగలవని సూర్యకోటి సమప్రభుడగు నీశ్వరుడు పలికి అదృశ్యుడయ్యెను. ఉపమన్యుడు ప్రసన్నాత్ముడై శ్రేష్టవరముల నొంది తన తల్లి కడకేగి యిదంతయు విన్నవించి సర్వసుఖంబుల నొందుచుండెను.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు పూర్వఖండమున ముప్పది ఐదవ అధ్యాయము సంపూర్ణము.

---

# ఆంధ్రవచన శివమహాపురాణము

## వాయవీయ సంహిత

## ప్రథమాధ్యాయము

### ఉత్తర ఖండము

### శ్రీకృష్ణ భగవానుని తపస్సు పుత్రప్రాప్తి

శ్రీగణేశాయనమః శ్రీగౌరీశంకరాభ్యాంనమః.

శ్లో॥ ఓం నమస్సమస్త సంసార చక్రభ్రమణహేతవే.
గౌరీకుచతట ద్వంద్వ కుంకుమాంకిత వక్షసే

సూతుడిట్లు చెప్పదొడంగెను. వాయుదేవుడుపమన్యుని వరప్రభావమంతయు జెప్పి, మధ్యాహ్న క్రియలనువర్తించుకొని మరల సభలో సుఖాసీనుడై యుండ మంగళకరుడగు శంకరుని కథలెన్ని విన్నను. మాకుతృప్తిలేదు. గాన యింకనుమాకు వినిపింపుము, ఉపమన్యుని సేవించి శ్రీకృష్ణుడు పాశుపతవ్రతము చేసెనని వింటిమి. ఆసంగతియు, మాకు తెల్పుమని ఋషులు ప్రశ్నింప వాయువిట్లు చెప్పదొడంగెను. సనాతనుడగు వాసుదేవుడైన శ్రీకృష్ణుడు స్వేచ్ఛగా నవతరించియున్నను. తనమనుజ, జన్మను, సందించుకొనుచు, దేహాశుద్ధికొరకు పుత్రునికొరకు తపంబుచేయ నిశ్చయించి యుపమన్యుని యాశ్రమంబు కడకేగి, భస్మలిప్త సర్వాంగుడు, త్రిపుండ్రాంకిత మస్తకుడు రుద్రాక్షమాలా భరణుడు, జటాముకుట శోభితుడు, వేదశాస్త్రవేత్తలగు మహామునులచె పరివేష్టిప బడినవాడు, శాంతుడు, మహాద్యుతి వంతుడు, నగు నుపమన్యునిగాంచి, పులకాంకితగాత్రుడై, ముదితుడై, నమస్కరించి బహుమాన పురస్సరంబుగ ముమ్మారుప్రదక్షిణముచేసి ప్రీతితో స్తుతించి, నతకంధరుడై కృతాంజలి పుటుడై నమస్కరింప, తన దేహ మలంబులు. మాయాజాలకర్మలు నామునిని గాంచినంతనే నశించెను. ఉపమన్యుడు క్షీణమలుడైన కృష్ణునిగాంచి యగ్నిరత్యాది మంత్రములచే భస్మమతని గాత్రమంతయు పూసి అతనిచే ద్వాదశమాస యుతమగు పాశుపతవ్రతము చేయించి యుత్త

మంత్రమైన జ్ఞానమొసంగెను. అప్పటినుండి మహామునులందరు నుపమన్యునిచే పాశుపతవ్రతము నెరింగి వ్రతనిష్ఠులై యందే నివసించుచు వ్రతముచేయుచుండిరి. శ్రీకృష్ణుడు నూరుల పరమశక్తివంతుడగు పుత్రునికై నుపమన్యునాజ్ఞచే శివునికై తపంబుచేయ శంకరుడు సంతుష్టుడై గణంబులతో సాక్షాత్కరింప. కృష్ణుడు వరప్రదుడగు శంకరుని గాంచి, శిరమువంచి నమస్కరించి, కృతాంజలిపుటుడై స్తుతింప, శంకరుడు ప్రసన్నుడై, యాత్మతుల్యుడగు పుత్రునిప్రసాదించెను. అతడేసాంబుడు జాంబవతీతనయుడై జన్మించెను. శ్రీకృష్ణుడట్టి తరిమహర్షులచే జ్ఞానలాభము పరమేశ్వరునిచే పుత్రలాభమును బడసెను. ఈఅధ్యాయ శ్రవణ పఠనాదులచే, విష్ణుజ్ఞానమునొందిరి. సర్వసుఖంబులు నొందెదరు.

శివమహాపురాణము నందలి వాయువీయ సంహితయందు
ఒకటవ అధ్యాయము సంపూర్ణము.

---

## రెండవ యధ్యాయము

### ఉపమన్యుడు కృష్ణునకు శివతత్త్వము బోధించుట

పాశుపతి జ్ఞానమన నెట్టిది? శివుడు పశుపతి యెట్లుయ్యెను? మహాత్ముడగు శ్రీకృష్ణుడుపమన్యు నెట్లు ప్రశ్నించెను? శంకరస్వరూపుడవగు నో వాయుదేవా నీవంటివక్త త్రిలోకములయందు లేదని మహర్షులు బలుక ప్రభంజనుడొకక్షణకాల మీశ్వరుని ధ్యానించి, ఓమహర్షులారా! పూర్వము శ్రీకంఠుడగు మహేశ్వరుడుమందరాద్రియందు పార్వతితో విహరింపుచు నొకానొకసమయంబున పార్వతితో పాశుపతవ్రత విధిని జెప్పియుండెను, ఈవ్రతవిధానమును. శివుడు పశుపతియగు విధము, నుపమన్యుడు శ్రీకృష్ణునకు జెప్పియుండెను. అదంతయు మీకుజెప్పెద వినుడు, శ్రీకృష్ణుడు పమన్యుని పురోభాగమునండి, యోపూజ్యుడా! మహాదేవుడు దేవితో జెప్పినవాక్కులు నాకువినవలయునని యున్నది. దివ్యమగు పాశుపత జ్ఞానవిభూతియన నెట్టిది? ఆదేవుడు

పశుపతి యెట్లుయ్యెను? జీవులెట్టి పాశంబులచే బంధింప బడుచుందురు. మరల నెట్లువిముక్తులగు చుందురు. ఇదంతయు నాకు విస్తరముగ జెప్పుమన, నుపమన్యుడు గౌరీశంకరులకు నమస్కరించి యిట్లుచెప్పదొడంగెను. బ్రహ్మాది స్థావర జంగమములగు జీవులన్నియు, సంసారవశవర్తులై, దేవదేవుడగు శూలపాణికి పశువులై వర్తింపుచుండిరి. ఈపశుజీవులందరికి ప్రభువు యీశ్వరుడుగాన పశుపతియని పిలువబడుచుండెను. ఈపశుపతి జీవుల మలమాయా పాశంబులు ఛేదించుచుండును. తన్నుభక్తితో నుపాశించెడి భక్తులపాశంబులే ఛేదింపుచుండును. చతుర్వింశతి తత్వంబులు మాయాగుణ పూరితములైన విషయములని చెప్పబడెను. జీవులందరు నీవిషయ పాశంబులచే బంధింపబడుదురు. బ్రహ్మాది స్తంబపర్యంతముగల జీవులన్నిటిని మహేశ్వరుడు పశుపాశములచే బంధింపుచు వారివారి కర్మానుసారముగ కార్యములను జేయించుచుండును. మహేశ్వరుని యాజ్ఞచే, ప్రకృతి పురుషోచితమగు జగత్కార్యములన్నియు చేయించుచుండును. ఆప్రకృతివలన బుద్ధిజనించెను. బుద్ధిచే నహంకారము, నహంకారముచేదశేంద్రియంబులు. మనస్సును. వీనిచే పంచతన్మాత్రలు శివునిశాసనముచే జనించినవి. ఈమహాభూతములన్నియు బహ్మాది తృణపర్యంతమగు దేహములయందంటను, వ్యాపించియున్నవి శివాజ్ఞచేతనే యీమహాభూతములన్నియు జనించుచున్నవి, నిశ్చయాత్మకమగు బుద్ధియే అహంకారమనబడును. చలింపజేయునదిగాన చిత్తమనబడును. సంకల్పములు జనింపజేయుచున్నది గాన మనస్సని చెప్పబడుచున్నది. ఈమనస్సు శ్రోత్రాదీంద్రియముల వేరువేరుగా గ్రహింపుచున్నది. ఇవన్నియు తమబలముచేగాక యింద్రియాధిష్ఠాన దేవతల బలముచేతను, పరమేశ్వరుని బలముచేతను తమతమ క్రియలు కొనసాగింపుచున్నవి, సర్వేంద్రియంబులు శివాజ్ఞచే ప్రవర్తింపు చున్నవి. గాని వాటికి స్వతంత్రశక్తిలేదు. అవిశివాజ్ఞను మీరలేవు. ఇవన్ని ప్రబలములై జీవుల కవకాశము కల్గింపజేయుచున్నవి. ఆకాశము పరమేశ్వరుని ఆజ్ఞచే అంతటావ్యాపించియుండెను. దశవాయువులు నామభేదములతో లోపల వెలుపల వ్యాపించి పరమేశ్వరుని యాజ్ఞచే, మెలంగుచున్నవి. పరమేశ్వరుని శాసనంబుచే నగ్ని దేవతలకు హవ్యములు, పితరులకు కవ్యములనిచ్చుచు, పాకాదులు చేయుచుండెను. శివాజ్ఞచే జలము సర్వజీవులకు జీవనాధారమై యుండెను, పృథ్వీశంకరా

జ్ఞచే సర్వముధరింపు చుండెను. మరియు నాపరమేశ్వరుడు, దేవతల రక్షింపుచు నసురుల సంహరింపుచు త్రిలోకముల రక్షింపుచుండెను. ఇతని యనుగ్రహముచే నింద్రుడు దేవాధిపత్యము, వరుణుడు జలాధిపత్యము చేయుచుండెను. యముడు శివాజ్ఞచే జీవులను పాశబద్ధులజేసి దండించుచుండెను. శంకరానుగ్రహముచే కుబేరుడు ధనాధిపతియయ్యెను, పరమేశ్వరుడు జీవుల పుణ్యానుసారముగ విద్యాబుద్ధులు, పశుధనంబులు, గృహారామంబులు పదవులు నొసంగుచుండును. ఇతనియనుగ్రహముచే, మేధస్సుసంపదలు, జ్ఞానము నిల్చుచుండును. శివానుగ్రహముచే, యసాధువులుకూడ, సాధువులగుదురు. శివనియోగముచే శేషుడు భూమినిధరించుచుండెను. శంకరనియోగముచే రుద్రునిసృజించెను, బ్రహ్మ యాతనిశాసనముచే జగత్సృష్టి చేయుచుండెను, తానురుద్రుడై సంహరింపుచుండెను విష్ణువై రక్షింపుచుండెను, తాను అనేకరూపంబులనుండి, రక్షణసంహారములు చేయుచుండెను. తానే త్రివిధ స్వరూపుడై సృష్టిస్థితిలయంబులు చేయుచుండెను. ప్రళయంబున హరశాసనముచే. నీజగత్తంతయు హరింపబడుచుండును. ఇతనిశాసనముచే దివినుండి సూర్యుడు ప్రకాశించుచుండెను. మేఘుడు వర్షించుచుండెను, చంద్రుడితని శాసనముచే నోషధులను, సంతసపరుచుచు, దేవతలకమృతము నొసంగుచు శివునకు భూషణంబుగనుండెను. ఆదిత్యులు, వసువులు, రుద్రులు యశ్వినులు, మరుత్తులు, ఖేచరులు, ఋషులు, సిద్ధులు, ఫణంబులు. మనుజులు, మృగంబులు, పశువులు, పక్షులు, కీటకాదులు స్థావరంబులు, నదులు, సముద్రంబులు, పర్వతంబులు, కాననంబులు, సరస్సులు, సాంగోపాంగ వేదంబులు, శాస్త్రంబులు, మంత్రంబులు, మఖంబులు స్తోమంబులు, కాలాగ్ని మొదలు శివాంతమువరకు నుండెడి, భువనంబులు, భువనాధిపతులు, యసంఖ్యాకములగు బ్రహ్మాండంబులు వానియావరణంబులు భూతభవిష్యద్వర్తమానకాలంబులు, దిశలు, విదిశలు. కళలతోగూడిన కాలభేదంబులు. జగత్తులయందు చూడబడుచున్నవి. వినబడుచున్నవి యునగు సర్వము శంకరాజ్ఞాబలముచే సమధిష్ఠితమై యున్నవి. ఇతని యాజ్ఞచే. పృథ్వీపర్వతములు. మేఘంబులు, సాగరంబులు. జ్యోతిర్గణంబులు, శక్రాది దేవతలు. చరాచరంబులు. వారివారి ధర్మంబులతో నిలబడియుండిరి. అమితతేజస్కుడగు నీశ్వరుని చరిత్రలు కడువిచిత్రములైనవి. యితని మహామహి

మలన్నియు నేను వేదశాస్త్రములందు వినియుంటిని. నీకిదంతయు జెప్పెద వినుము. పూర్వము యింద్రాది దేవతలు, గణములను యసురులజయించి, నేను జయించితిని. నేనుజయించితినని వారిలో వారు తగవులాడు కొనుచుండ, విశ్వేరుడు యక్షరూపుడై, విహీనాంగుడై వారిమధ్య నిలబడి యొకతృణమును భూమిపై నిడి, ఓసురులారా! అసురులను జయించిన వారీ తృణమును కదల్పుడన నింద్రుడు యక్షవాక్యములు వినినవ్వుచు, నాతృణమును కదల్పబోవ నది చలింపకుండుటచే వజ్రాయుధము ప్రయోగింప నా తృణముచే వజ్రాయుధము నేలబడెను, గని, నాతృణము నేమియు జేయజాలకుండెను. అపుడు లోకపాలురందరు వారివారి యాయుధంబులు ప్రయోగించి విఫలులైరి తదుపరి యాతృణము మహాతేజోమయమై ప్రళయవాయువులచే ప్రళయాగ్ని మండునట్లు నుండుచుండెను. దేవతలందరు దీనినుపశమింప జేయలేకుండిరి. యక్షుని శక్తిబలముచే దేవతల ప్రయత్నములు విఫలమయ్యెను. వారలందరు విస్మితులై నీవెవరవని ప్రశ్నించుచు నమస్కరింప, నాయక్షుడు, స్వస్వరూపంబుతో నోసురులారా! నేనుమీకగుపడను, నేనుసంసార రూపుడుగు చరాచర చక్రమును త్రిప్పుచుందును, ముందుగా జగత్తుసృజించి మరల సంహరింపుచుందును. నాకునియంత లేడు, నేనందరిని శాసించుచుందునని యదృశ్యము కాగా నాదర్శ మొగంబై దేవతలందరు నమస్కరించి పోయిరి.

శివపురాణము నందలి వాయవీయసంహితయందు ఉత్తరఖండమున
రెండవ అధ్యాయము సంపూర్ణము.

## మూడవ యధ్యాయము

### ఉపమన్యుడు కృష్ణునకు శివతత్త్వము బోధించుట

మరల నుపమన్యుడు కృష్ణా! పరమాత్ముడగు శివుని చరిత్ర లింకను చెప్పెద వినుము. శివుడు యీ చరాచర జగత్తంతయు వ్యాపించి యుండెను. మరియు నతడాత్మ స్వరూపుడై యన్ని మూర్తులయందు వ్యాపించి యుండెను. బ్రహ్మ విష్ణు రుద్ర మహేశ సదాశివ నామంబులతో పరమేశ్వరు

డంతటను వ్యాపించి యుండెను. ఈ విశ్వమంతయును మూర్తులన్నియు నతని స్వరూపములని భావింపుము. ప్రపంచ మంతయు పంచ బ్రహ్మ స్వరూపము. ఇతని కన్న భిన్నమైన దేదియు లేదు. ఈశానుడు, తత్పురుషుడు, యఘోరుడు, వామదేవుడు, సద్యోజాతు డను పరమేశ్వరుని పంచముఖంబుల నామంబులై యున్నవి. వీటిలో మొదటిదగు ఈశాన ముఖము మహత్తర మైనది. ఇది ప్రకృతి భోక్తయై, క్షేత్రజ్ఞుడై, యొప్పారుచుండెను. తత్పురుష ముఖము స్థాణురూపమై యున్న మూర్తుల యందొప్పుచు గుణముల నాశ్రయించి భోగ్యమును నవ్యక్తరూపమై యుండును. అఘోర ముఖము ధర్మాద్యష్టాంగ సంయుక్తమై బుద్ధితత్త్వంబులతో నొప్పుచు నత్యంత భ్రాజితమై యుండెను. ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యంబులు అధర్మాజ్ఞాన వైరాగ్య మైశ్వర్యంబులను నవి ధర్మాద్యష్టాంగము లందురు. వామదేవ ముఖము బ్రహ్మ విద్యస్సుతో, ప్రజ్వలించుచు నహంకారమున కధిష్ఠాన దేవతయై యుండెనని యాగమ వేదములు చెప్పుచుందురు. సద్యోజాతముఖ మత్యంతదివ్యస్వరూపమై మనోధిష్ఠాన దేవతయై, మతియంతమై యుండెను. ఈశానుడు శ్రోత్రవాక్ శబ్దవ్యోమంబులకు ఈశ్వరుడై యుండెనని వేదవిదులు చెప్పుచుండిరి. త్వక్పాణి స్పర్శ వాయు నాసికలకు తత్పురుషుడు ప్రభుడై యుండెను. అగ్నిరూపము లైన చక్షు శ్చరణంబులకు ఘోరుడధిష్ఠాన దేవతయై యుండెనని మునీశులు చెప్పియుండిరి. రసనేంద్రియంబులకు, పాయురసంబులకు వామదేవు డధిష్ఠాన దేవతయై యుండెను. ఘ్రాణోపస్థ పృథ్వీగంధము లకు సద్యోజాతు డధిష్ఠానుడై యుండెను. ఈ పంచమూర్తులకు సదా వందనము చేయుచుండ వలెను. శ్రేయస్సులు కోరు వారీ పంచమూర్తిని సేవింప వలెను. సూత్రమందు మణులవలె, భవుడు శర్వుడు, ఈశానుడు, పశుపతి, రుద్రుడు, ఉగ్రుడు, భీముడు, మహాదేవుడు, నను, నష్టమూర్తులచేత ప్రపంచ మంతయు వ్యాపించి యుండెను. భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము, క్షేత్రజ్ఞుడు, సూర్యుడు, చంద్రుడు, నీ యష్టమూర్తులు మహేశ్వరుని కధిష్ఠానములై యుండిరి. విశ్వంభరాత్మకుడగు నీశ్వరుడు చరాచరాత్మకమగు విశ్వమంతయు ధరించుచుండెను. ఇతడు శర్వుడనియు, శివుడనియు, శాస్త్రములచే నిర్దిష్టుడై యుండెను. ఇతడు జగత్ప్రాణుడై జీవులను జీవింప జేయుచుండెను. ఇతనిని భావ మూర్తి

యనియు, భవుడనియు, పిలుచు చుందురు. ఇతడు తేజంబులచే సంతర్పి హితాత్మ్యుడై యుండెను. ఇతడు రౌద్రముగ నుండుటచే రుద్రుడని పిలువ బడు చుండెను. ఇతడు వాయువుని స్తంభింప జేయుచున్న వాడు గాన యఘోరు డన బడుచుండెను. బ్రహ్మ ఇతని నుగ్రుడని పిలుచుటచే నందరు నితనిని యుగ్రుడని పిలుచుచుండిరి. భయంకర స్వరూపుడై యన్ని యవకాశముల యందు నిండియుండెను గాన భీముడని పిలువబడుచుండెను. సర్వాత్మల యందు నధిష్ఠానుడై, సర్వక్షేత్ర నివాసియై పశుపాశ విచ్ఛేదకుడై యుండెను, గాన పశుపతి యని పిలువబడు చుండెను. సూర్యుడై గగనమున ప్రకాశింపు చుండెను గాన, ఈశాను డని పిలువబడుచుండెను. చంద్రుడై యమృతమును వెదజిమ్ము చుండెను. ఇవ్విధంబున శివు డష్ట మూర్తులలో నొప్పుచుండెను, గాన, ప్రపంచ మంతయు శివాత్మకమై యుండెను. వృక్షమూలంబున జలంబు పోసినచో శాఖలన్నియు చిగిర్చి పుష్పించి నట్లుగ నొక్క శివుని పూజించి నచో సర్వదేవతలు సంతసించెదరు. శివారాధనచే సర్వానుగ్రహము, సర్వో పకారము కల్గును. పుత్రపౌత్రులను గాంచి తండ్రి సంతసించిన నట్లుగ జీవులను గాంచి శివుడు సంతసించును. దేహి, దేహులను హింసించినచో అష్టమూర్తు లను హింసించిన వాడగును అష్టమూర్తులచే విశ్వమంతయు వ్యాపించి యుం డెను గాన, పరమ కారణు డగు రుద్రుని సర్వవిధముల సేవింపవలెను.

శివ మహాపురాణము నందలి వాయవీయసంహితయందు ఉత్తర ఖండమున
మూడవ అధ్యాయము సంపూర్ణము

---

## నాలుగవ యధ్యాయము

### గౌరీ శంకరులవిభూతి

ఉపమన్యు వాక్కులువిని మరల కృష్ణుడిట్లు ప్రశ్నించెను. భగవంతుడు నమిత తేజస్కుడు నగుపరమేశ్వరుడు మూర్తివంతుడై విశ్వమంతయు నెట్లువ్యా పించెనో వినియుంటిని, ఇంక నుపార్వతీ పరమేశ్వరుల యధార్థ తత్వము మీచే

మాయచేత నవ్యక్తమునకు త్రిగుణములు జనించెను, త్రిగుణంబులు వ్యక్తావ్యక్తము లుగ విభజింపబడెను, సర్వజగత్తు సత్వరజస్తమోగుణంబులచే వ్యాప్తమయ్యెను త్రిగుణంబులకు త్రిమూర్తులు ప్రభువులుగానుండిరి. తదుపరి మహదాదితత్వ ములన్నియు, జనించెను. వాటినుండి శివాజ్ఞచే నండపిండాండములు జనించెను. శరీరాంతరభేదములచే, శక్తిభేదములు కలుగుచున్నవి. ఇవి స్థూలసూక్ష్మభేద ములచే ననేకరూపంబులు నొందుచున్నవి, రుద్రునకు రౌద్రశక్తి, విష్ణువునకు వైష్ణవశక్తి, బ్రహ్మకుబ్రహ్మశక్తి, ఇంద్రునకు ఇంద్రాణీశక్తియు నని ఇవ్విధం బున ప్రపంచమంతయు శక్తియుతమై యాత్మస్వరూపముగ వ్యాపించియుం డెను. పరమాత్మకళయే పరమశక్తియనబడును, ఈశక్తి యీశ్వరేచ్ఛచే ప్రవ ర్తించుచుండెను, ఈశక్తిచే, చరాచరంబులన్నియు సృజింపబడెను, జ్ఞానశక్తి క్రియాశక్తి, ఇచ్ఛాశక్తులనెడు మూడుశక్తులచే, పరమేశ్వరుడు. జగత్తంతయు వ్యాపించియుండెను. ఇదినిజము ఇదియసత్యము అని తెలిసికొనుటయే జ్ఞానశక్తి యనబడును. పరమేశ్వరుడు తనయిచ్ఛాశక్తిచే నిత్యము కార్యముల నియమిం చుచుండును. జ్ఞానశక్తిచే, కార్యాకార్యంబులను, కరణకారణంబులను గ్రహిం చుచుండును. క్రియాశక్తిచే జగత్తులను వశముచేసికొనును, మనోప్సితంబుల నెరవేర్చుచుండును. మరియు నతడు సంకల్పమాత్రముచే, క్షణములో నన్ని కార్యములు చేయుచుండును ఈశక్తిత్రయంబులు జగత్తు నుద్భవింప జేయుచుం డును, శంకరుడు తన పరమశక్తిచే సర్వము లయము చేయుచుండును. మరల శక్తిచేతనే సృజింపుచుండును. ఇట్టి శక్తులతో కూడినవాడు గాన, శివుడు శక్తి సంయుతుడయ్యెను. ఈజగత్తంతయు శివశక్తిమయమై యుండెను. తల్లిదండ్రులు లేనిదే పుత్రులుద్భవింపనట్లుగ, శివాశివులు లేనిదే, చరాచర జగత్తులు జనిం పవు, జగత్తంతయు స్త్రీపురుషులచే నుద్భవించెను. స్త్రీపుంసాత్మకమై యుం డెను, స్త్రీపురుషుల నైశ్వర్యము స్త్రీపురుషులచే సహింపబడి యుండెను, శివా శివులే, పరమాత్మయని చెప్పబడుచున్నారు, శివుడే సదాశివుడు. పార్వతియే మనోన్మని, శివుడే మహేశ్వరుడు, పార్వతియే మాయ, పురుషుడే పరమేశ్వ రుడు, ప్రకృతియే పరమేశ్వరి, రుద్రుడే మహేశ్వరుడు, పార్వతియే రుద్రాణి, విష్ణువే విశ్వేశ్వరుడు, లక్ష్మియే విశ్వేశ్వరి, బ్రహ్మయే శివుడు, సరస్వతియే పార్వతి, ముగురమ్మలకు, ముమ్మూర్తులకు భేదములేదు. భాస్కరుడే శంభుడు''

ప్రభయే పార్వతి, ఇంద్రుడే శివుడు. శచియే పార్వతి, అగ్నియే మహాదే
వుడు, స్వాహాయే పార్వతి, యముడే త్ర్యంబకుడు, శ్యామలయే పార్వతి. నిర్
రుతియే యీశ్వరుడు నిరుృతిదేవియే పార్వతి, వరుణుడే శివుడు, వారుణియే
కాళి, వాయువే మృత్యుంజయుడు, వాయువియే, దుర్గ,' కుబేరుడే శంకరుడు
కుబేర సతియే చండిక, చంద్రుడే చంద్రార్ధ శేఖరుడు, రోహిణియే భవాని,
ఈశానుడే పరమేశ్వరుడు, ఈశానియే పరమేశ్వరి, అనంతుడే శివుడు, అనంత
లక్ష్మియే ఉమ, కాలాగ్నిరుద్రుడే శివుడు, కాళియే పార్వతి, మనువే
మృత్యుంజయుడు, శతరూపియే కాత్యాయని, దక్షుడే త్రినేత్రుడు, ప్రసూ
తియే పరమేశ్వరి, రుచియే భవుడు, ఆకూతియే, జగన్మాత యగును.
భృగువే, మృడుడు ఖ్యాతియే, మృడాని. మరీచియే పశుపతి, సంభూతియే.
హైమవతి, అంగిరుడే త్రిలోచనుడు. స్మృతియే. ఈశ్వరి, పులస్త్యుడే త్రిపురారి,
ప్రీతియే, శర్వాణి పులహుడే, స్మరహరుడు, అతని ప్రియయే, శివప్రియ,
క్రతువే, త్రిపురధ్వంసి, సన్నతియే యపర్ణ, అత్రియే, త్ర్యంబకుడు, అనసూ
యయే, దాక్షాయణి, కశ్యపుడే, కాలకంఠుడు, అదితియే యపర్ణ, వశిష్ఠుడే.
భవుడు, అరుంధతియే, యార్య. ఇట్లు లోకంబున పురుషులందరు శివస్వరూపులు
స్త్రీలందరు, శర్వాణి స్వరూపలు ఈస్త్రీపురుషులందరు శివాశివుల విభూ
తులు, ఇంకను, విషయశివుడు, విషయము పార్వతి, శ్రోతశివుడు, శ్రావ్యము
యును, సర్వవస్తు జాలంబులు శంకరుడు, ఇవన్నియు నడిపించునది. శంకరి,
చూడబడు వస్తువులన్నియు, శశిఖండ శేఖరుడగు ఈశ్వరుడు. చూచునది,
భవాని రసాన భవుడీశ్వరుడు, రసస్వరూపము ఈశ్వరి, ప్రియవస్తు సమూహ
ములన్నియు, గౌరి ప్రియవస్తుభోక్త, భుజంగ భూషణుడు, తెలియదగిన వస్తు
జాలమంతయు. పార్వతి. తెలిసికొనువాడే యీశ్వరుడు, బోద్ధవ్య వస్తురూపమం
తయు, మహేశ్వరి, బోధస్వరూపుడీశ్వరుడు సర్వప్రాణము లీశ్వరుడు, ఇం
రూపమై ప్రాణులరక్షించునది, గిరిజ. క్షేత్రమాయుంచిక. క్షేత్రజ్ఞుడు, పరమే
శ్వరుడు, పగలు ఈశ్వరుడు, రాత్రి యీశ్వరి, ఆకాశము శంకరుడు, పృథివి పార్వతి
సాగరము ఈశ్వరుడు. వేల పార్వతి, వృక్షము వృషభధ్వజుడు, పర్వతి. లత,
పుంలింగము శివుడు స్త్రీలింగము పార్వతి, శబ్దజాలమంతయు, పార్వతి. అర్థజాల
మంతయు పరమేశ్వరుడు, వస్తుజాలమంతయు ఈశ్వరుడు, వస్తు ... ఈశ్వరి

మిత్రులు గల్గి, విద్యాభి వృద్ధులు గల్గి' శైవ భక్తు లగుదురు. ఈ శైవ విద్యచే శివునకు శివభక్తు లకు మిత్రులై యుందురు. కోరిన వెల్ల లభించును. ఇట్లను పూర్వజన్మ పాపకర్మలు హరించి, యాంతరంగిక భక్తులై యుందురు. మాటిమాటికి విది పఠించిన వారలకు తీరని కోరిక లుండవు. దుర్లభము లగు నవి నేవియు నుండవు. గాన ప్రధానము భక్తి యలవర్చు కొనపలెను. భక్తి మూడు విధములు.

1. **బాహ్య భక్తి ఇది ఎద్దుబండి వలె మందముగ ప్రయాణము చేయును.**

2. **అనన్య భక్తి ఇది రైలుబండివలె వడిగా పోవును.**

3. ఏకాంత భక్తి ఇది విమానము వంటిది. దీనిచే త్వరితముగ శివ సన్నిధికి చేరవచ్చును.

శ్లో॥ పూజాకోటి సమస్తోత్రం
స్తోత్ర కోటి సమోజపః
జపకోటి సమంధ్యానం
ధ్యానకోటి సమోలయః

కోటి పూజలు చేయుటకంటె భక్తితో ఒక స్తోత్రము చేయుట మంచిది. కోటి స్తోత్రముల కంటె ఒక జపము ముఖ్యము. కోటి జపముల కంటె ఒక ధ్యానము త్కృష్టము. కోటి ధ్యానములకు ఒకలయము సమమై యున్నది. అనగా మనోలయము స్వస్వరూపస్థితి ఇవిన్నియు క్రమముగ నలవరచు కొని భగవంతుని పొందుటయే జన్మ సాఫల్యము.

శివ మహాపురాణము నందలి వాయవీయ సంహితయందు ఉత్తర ఖండమున
నాలుగవ అధ్యాయము సంపూర్ణము

---

# ఐదవ యధ్యాయము

## పశుపతితత్త్వ జ్ఞానయోగము

ఓకృష్ణా! చరాచరాత్మకమగు ప్రపంచమంతయు నీశ్వరస్వరూపమై యుండెను. జీవులుదీని నెరుంగకుండిరి! ఆయొక్క పురుషునే బహురూపునిగ జెప్పుదురు, మహర్షులు సైతము యితనిభావంబు నెరుంగకుండిరి. సర్వము పరాపరభేదంబున ద్వివిధమందురు. అపరము బ్రహ్మరూపమైదియు. పరముబ్రహ్మాత్మకమైనదియు నై యుండెను. బ్రహ్మరూపమున బ్రహ్మచే నధిష్ఠింపబడెను, కొందరీమహాదేవుని. యనాదినిధనునిగ, జెప్పుదురు. భూతేంద్రియాంతః కరణప్రధాన విషయాత్మక మైనదియు. అపరబ్రహ్మ నిర్దిష్ట మైనదియు. చిదాత్మక పర్వబ్రహ్మమైనది యనియు కొందరు చెప్పుదురు, పెద్దవాడై అంతటను వ్యాపించినవాడు గాన, బ్రహ్మయని చెప్పబడుచున్నాడు, ఈరెండునుకూడ, పరబ్రహ్మ స్వరూపమే యనబడును. కొందరు, విద్యావిద్యా స్వరూపములు రెండునీశ్వరుడే యని చెప్పుచున్నారు. విద్యచేతన మైనదియు నవిద్యయచేతన మైనదియునై యుండెను. విద్యావిద్యాత్మకమగు విశ్వమంతయు లోకగురువగు పరమేశ్వరస్వరూపము. భ్రాంతియవిద్య పరాయనియు. శార్వరూపము పరమనియు చెప్పుచుండిరి. బుద్ధియర్థములయందనేక విధములుగ భ్రాంతినొందుచున్నది. యథార్థాకార విజ్ఞానమే. విద్యయనబడును, వికల్పరహితమైన తత్త్వమేపరమన బడును. అసచ్ఛబ్దము విపరీతార్థమునందు చెప్పబడుచున్నదని, వేదవిదులు చెప్పుచుండిరి. ఇతడు సదసత్తులకు పతిగాన సదసత్పతియని చెప్పబడుచున్నాడు. ఇంకను నితడు క్షరాక్షరాత్మకుడనియు క్షరాక్షరపరుడనియు నందురు. సర్వభూతములు, క్షరమనియు, కూటస్థుడక్షరుడనియు చెప్పుదురు. ఈరెండును పరమేశ్వరరూపములే. ఈక్షరాక్షర రూపములకంటె పరుడగువాడే పరమశివుడు. ఇతడు సమిష్టివ్యష్టిరూపుడు, సమిష్టివ్యష్టి కారకుడునై యుండెను. సమిష్టి, అవ్యక్తమనియు, వ్యష్టివ్యక్తమనియు చెప్పబడెను. ఆపరమాత్మ తనఇచ్ఛచే, వ్యష్టిసమిష్టి రూపములను దాల్చుచుండును. ఈరెంటికిని శివుడే పరమకారణుడు. కారణములేనిదే వ్యష్టిసమిష్టి రూపములనొందదు. కారణార్థము లెరింగినవారలు, సమిష్టివ్యష్టులే కారణమని చెప్పుచుండిరి. కొందరు

జాతివ్యక్తి స్వరూపుడని చెప్పుదురు. పిండాత్మకమైనదియే జాతియనబడును. వ్యక్తి వ్యావృత్తరూపమై పిండమునాశ్రయించి యుండును. వ్యక్తములగు జాతులన్నియు పరమేశ్వరాజ్ఞను పాలింపుచుండును. మహాదేవుడు జాతివ్యక్తి రూపుడని చెప్పబడుచుండెను. ప్రధానపురుషుడగు శివుడు కాలాత్మకుడనియు, నవ్యక్తుడనియు చెప్పబడుచుండెను. ప్రకృతిని, ప్రధానమనియు పురుషుని క్షేత్రజ్ఞుడనియు నందురు. ఇరువదిమూడు తత్వంబులు, వ్యక్తస్వరూపమని. మనీషులు చెప్పుదురు. కాలము కార్యప్రపంచకము యొక్క పరిణామమునకు, ముఖ్యకారణము, ఈశ్వరుడే యధిపుడు, ధాత్రప్రవర్తకుడు నివర్తకుడునై యుండెను. ఇతడొక్కడే యావిర్భావతిరోభావకారణుడు. ఈప్రధానపురుషుడు వ్యక్తుడై కాలస్వరూపుడై యుండెను. ఈపురుషుడు సర్వమునకు కారణుడుగాన, ధాతయనియు, మహేశ్వరుడనియు, విరాట్టనియు. హిరణ్యగర్భుడనియు, హిరణ్యగర్భాత్ముడనియు, చండీశుడనియు చెప్పబడుచుండెను. హిరణ్యగర్భుడు, విరాట్టు. విశ్వాత్ముడు, లోకకారణుడునై యుండెను. శివుడంతర్యామియనియు పరుడనియు, కవులు చెప్పుచుందురు. ఇంకను ప్రాజ్ఞుడనియు, తైజసుడనియు చెప్పుచుందురు. మరికొందరు. తురీయుడనియు సౌమ్యుడనియు. మూర్తస్వరూపుడనియు. మానవంతుడనియు. పూజ్యుడనియు. బుద్ధిమంతుడనియు నందురు. కొందరు, కర్తయనియు క్రియయనియు, కార్యమనియు, కరణమనియు, కారణమనియు, జాగ్రత్ స్వప్న, సుషుప్త్యవస్థలనియు. ఆత్మస్వరూపుడనియు చెప్పుదురు. కొందరు తురీయుడనియు. కొందరు తురీయాతీతుడనియు. చెప్పుదురు. కొందరు నిర్గుణుడనియు, కొందరు గుణవంతుడనియు, కొందరు సంసారియనియు, కొందరసంసారియనియు. కొందరుస్వతంత్రుడనియు కొందరస్వతంత్రుడనియు, కొందరు ఘోరుడనియు కొందరు సౌమ్యుడనియు, కొందరు రాగియనియు, కొందరు విరాగియనియు, కొందరు నిష్క్రియుడనియు, కొందరు సక్రియుడనియు, కొందరు సేంద్రియుడనియు, కొందర నింద్రియుడనియు, కొందరు స్థిరుడనియు. కొందరస్థిరుడనియు, కొందరరూపుడనియు, కొందరు సరూపుడనియు, కొందర దృశ్యుడనియు, కొందరు దృశ్యుడనియు, కొందరు వాచ్యుడనియు, కొందరవాచ్యుడనియు, కొందరు శబ్దాత్మకుడనియు, కొందరు శబ్దాతీతుడనియు, కొందరు చింతామయుడనియు, కొందరు చింతారహితుడ

నియు, కొందరు జ్ఞానాత్మకుడనియు. కొందరు విజ్ఞానాత్ముడనియు, కొందరు జ్ఞేయుడనియు, కొందరు పగుడనియు, కొందర పరుడనియు, పరమేశ్వరుని యాథాత్మ్యమును వికల్పముగ తెలిసికొనుచుండిరి. పరమేశ్వరునికూప గుణంబు లిట్టివనియు నిదమిత్థమనియు, నేమహర్షులు నిర్ణయింపలేకుండిరి. ప్రయత్నము లేకుండ పరమేశ్వరు నెట్టివారైన తెలిసికొనలేరు. సంసారజాలమునపడిన జీవు డీశ్వరు నెంతమాత్రము తెలిసికొనజాలడు, సంసారచక్రమున జీవుడు పరి భ్రమించుచు సుఖదుఃఖముల నొందుచు పరమేశ్వరుని గాంచలేకుండును. పుణ్యపాపములకు విదూరుడు, నిరంజనుడు, నకల్మషుడునగు విద్వాంసుడు, పరమేశ్వరు నెరుంగలడు.

**శివమహాపురాణము నందలి వాయవీయసంహిత ఉత్తరఖండమున ఐదవ యధ్యాయము సంపూర్ణము.**

---

## ఆరవ యధ్యాయము

### శివతత్వము

శివునకు బంధములులేవు. అతని మాయయే సకలకార్యములు చేయు చుండును. అనగా అహంకారాత్మకమగు ప్రకృతియే సర్వకార్యములు చేయు చుండును. ఇతనికి మానసబంధములులేవు. మనస్సులేదు. ఇంద్రియములులేవు. తన్మాత్రబంధనములులేవు. భూతబంధనములేదు. కాలములేదు. కళలు లేవు. నియతిలేదు. రాగద్వేషములులేవు. అమిత తేజస్వియగు నీపరమేశ్వరునకు నాగ్రహములేదు. కుశలములేదు. యకుశలములేదు కర్మవిపాకములైన సుఖ దుఃఖములులేవు. వాటిఫలములునులేవు. ఆశలతో సంబంధములేదు. కర్మలు లేవు. సంస్కారములులేవు. భోగంబులు లేవు. భోగసంస్కారములులేవు. త్రికా లంబులులేవు. కారణములేదు. కర్తలేదు, ఆదిమధ్యాంతములులేవు. కర్మకరణం బులులేవు. ఈశర్వుడనియు, నిర్గుణుడనియు, నిష్క్రియుడనియు, శివుడనియు చెప్పబడుచుండెను. అకారఉకారమకారములనెడు త్రిమాత్రలు, త్రిమూర్తుల

నర్ధమాత్రయగు నాదము శివుని తెలుపుచు చేయును. ఈ పరమేశ్వరుని కన్న పెద్దదియు లేదు. చిన్నదియు లేదు. ఇతడు వృక్షమువలె కదలక స్తబ్ధుడై దివి యందుండును, ఈపూర్ణపురుషు డంతటను నిండియుండును.

శివ మహాపురాణము నందలి వాయువీయ సంహితయందు ఉత్తరఖండమున ఆరవ అధ్యాయము సంపూర్ణము.

## ఏడవ యధ్యాయము

### శివ తత్త్వము

ఇంకను శివతత్త్వమును గురించి చెప్పెదను వినుము. కృష్ణా! ఈ పరమేశ్వరుని శక్తి స్వాభావికమై యుండును. విశ్వ విలక్షణమైన దే విద్య యనబడును. సూర్యుని కాంతి సర్వత్ర వ్యాపించినట్లు పరమేశ్వరు శక్తులును, యతని రూపములంతటను వ్యాపించి యున్నవి. యితని యనంత శక్తులు; ఇచ్ఛాజ్ఞాన క్రియాశక్తులుగ నొప్పుచుండెను. అగ్నిచే విస్ఫులింగము లుద్భవించు నట్లు యితని మాయచే ననంత శక్తులుద్భవించు చున్నవి. మరియు యితని నుండి త్రిమూర్తులు, విద్యా విద్యేశ్వరాదులు జనించిరి. ఈ పరాత్పరు నుండి ప్రకృతి పురుషులు జనించిరి. వీరిచే మహాదాది తత్త్వములు జనించి యిట సకల మూర్తులు జనించినవి. ఇంతకన్న సత్యమైన దేదియు లేదు. ఇతని శక్తి సర్వవ్యాపకమై, సూక్ష్మమై, ప్రబోధానంద రూపిణియై యుండును. శివా శివుల విద్యయే ప్రజ్ఞ యనబడును. దీనిని ప్రజ్ఞావంతులు తెలిసికొందురు. ఈ ప్రజ్ఞ యొక్క స్మృతులనబడును. వీనిచే ధృతి యందురు ఇదియే స్థితి. వీటనే సత్తాజ్ఞాన క్రియాశక్తులనబడును. పరబ్రహ్మ జ్ఞాన సారముగ పరా పర లనెడు రెండు విద్యలు బయలు దేరెను. వీటినే శుద్ధవిద్య, శుద్ధకళలందురు. ఇవి సర్వశక్తియుతమై యుండెను. మాయ యన ప్రకృతి ప్రకృతి యన జీవునకు, భోగాపవర్గము

నకు కారణ మగు శక్తి దీనిచే జీవుడు సవికారుడై వికృతులు నొందుచుం డును. జీవుడు సత్యాసత్యములతో వ్యాప్తమై యుండును. ప్రకృతి మాయచే చరాచరంబులతో గూడిన బ్రహ్మాండము లన్నియు సృజించెను. ఈమాయ తన శక్తిచే నప్రయత్నముగ జీవుల మోహింప జేయుచు, విముక్తిని గల్గింపు చుండును. పరమేశ్వరుడీమాయతో సప్తవింశతి తత్వంబుల గూడుకొని విశ్వ మంతయు వ్యాపించి ముక్తి నిచ్చుచుండును. పూర్వ మునులు, ముముక్షువులు బ్రహ్మవాదులు సంశయావిష్ట మానసులై భగవంతుని విస్మరించి మన మెం దులకు జనించితిమి? మన మెవరిచే జీవింపుచుంటిమి? మనల నిట నిల బెట్టిన వారెవరు? ఎవనిచే మన మధిష్ఠింప బడితిమి? మన మెవరి ద్వారా సుఖముగ నిద్రింపు చుంటిమి? ఎవనిచే ప్రబోధ మొందుచుంటిమి? ఈ విశ్వమంతయు నెవని కాటపట్టై యుండెను? కాలనియతి నడిపించు వాడెవడు? భూతములకు కారణ పురుషు డెవడు? వాడు యోగియా లేక పరుడా! ఇతనికి కాల పరిణామ మున్నదా! లేదా? ఇతడు చేతనుడా! యచేతనుడా! అతనికి సుఖదుఃఖము లున్నవా! భూతస్వరూపుడా! అనిశస్వరూపుడా! ఈశ స్వరూపుడా! విచారింప వలయును. అతని ధ్యాన యోగ ప్రాప్తి యున్నచో నిశ్వరత్వము చూపించును గదా? తాను నిగూఢుడై యుండి జీవుల పాశబంధములు విచ్ఛేదములు చేయునందురు కదా? అని పలో ప్రశ్నింపు కొనుచుండిరి. అతడు సర్వకారణ కారణుడు గాన పాశబంధములు ఛేదింపుచుండును. దివ్య చక్షువులు లేనిచో నామహాపురుషుని గాంచలేము. ఇన్ని కారణ ములచే నితడు కాలాత్మకు డని చెప్పబడుచుండెను. అతని యప్రమేయ శక్తిచే సర్వాధిష్ఠాతమై యుండెను. పరమయోగ మభ్యసించి యతని ప్రసాదము నొందవలయును. సంతతమైన భక్తిచే దివ్య పదము లభిం చును గాన మనము భక్తిచే హృదయమందలి పరమేశ్వరుని దర్శింప వలయును. ఇట్లు చేసిన వారికి నిరంతర శాంతి లభించును. ఇక దేని చేతను, శాంతి చేకూర దని శృతులు చెప్పియుండెను. శక్తి వంతున కెన్నడెప్పుడు గూడ శక్తి వియోగము కలుగదు. ఇది శక్తి వంతుని ప్రసాదముచే శక్తి కల్గును. ఇంతకన్న వేరుమార్గ మేమియు లేదు. జ్ఞాన నిష్ఠులకు క్రమపద్ధతి

యవసరము లేదు. ముక్తికోరు వారికి జ్ఞాన కర్మలవివక్ష లేదు. ఈశ్వర ప్రసాదమున్నచో ముక్తి కరతలామలకమై యుండును. అతని ప్రసాదమున్నచో దేవతలైనను, దానవులైనను, పశువులైనను, పక్షులైనను కీటకములైనను క్రిములైనను, గర్భస్థుడైనను, జనించిన వాడైనను, బాలుడైనను, తరుణుడైనను వృద్ధుడైనను, మృతుడైనను, స్వర్గవాసుడైనను, నరకవాసుడైనను, పతితుడైనను, పండితుడైనను, ధర్మాత్ముడైనను, మూఢుడైనను యీశ్వర ప్రసాదమున్నచో తత్క్షణమే ముక్తుడగును సందియము లేదు. అయోగ్యుడైనను భక్తుడైనచో పరమేశ్వరుడు వాని యెడ కరుణ జూపించి పాపవిముక్తుని జేయును. శివానుగ్రహముచే భక్తియు, భక్తిచే ముక్తియు కల్గును అవస్థాభేదములు గుర్తించిన పండితుడెవడును మోహము నొందడు. అతని ప్రసాదముచే భుక్తి ముక్తులు కల్గును. మనుజుడొక జన్మచే ముక్తి నొందలేడు. అనేక జన్మలయందు శ్రౌతస్మార్త కర్మానుష్ఠాన నిరతుడై, విరక్తుడై, జ్ఞానవంతుడైనచో పరమేశ్వరుడనుగ్రహించును. దానిచే వాడు భక్తుడై, నాప్రభువు శివుడేయని తలచుచుండును. ఇట్లు భక్తితో జన్మలు గడచుసరికి మరు జన్మమున తపంబు చేయుచు శైవ ధర్మపరుడై యుండును. దీనిచే నుత్కృష్టమైన శివభక్తి కల్గును. ఈ పరమ భక్తిచే పరమేశ్వరుని యందు పూర్తి నమ్మకము కల్గును. దీనిచే సంసార పాశవిముక్తుడై, మోక్షము నొందును. శివుని యందెంత స్వల్ప భక్తియున్నను మూడు జన్మలలో నరుడు ముక్తి నొందవచ్చును. ఇట్టి వానికెన్నడు యోని జన్మ కలుగదు. భగవంతుని సగుణ నిర్గుణ సేవలు చేయుట భక్తి యనబడును. ఈ భక్తి మనోవాక్కాయ కర్మలచే త్రివిధంబులుగ నొప్పుచుండెను. శివ రూపమును చింతించుటయే, మానస మనబడును. జపములు వాచక మనబడును. పూజాది కర్మలు కాయిక మనబడును. ఇవి పరమేశ్వరుని త్రివిధ సేవలు, ఇవియే శివ ధర్మములు, ఇవి విస్తరించి, తపము, కర్మ, జపము, జ్ఞానము, ధ్యానములని పరమేశ్వర సేవలైదు విధంబులుగ చెప్పబడెను. తపమనగా చాంద్రాయణ వ్రతాదులు కర్మ మన లింగపూజలు, జపమన మంత్రోచ్చారణ, ధ్యాన మనగా శివుని ధ్యానించుట, నిత్యానిత్య వస్తువు లెరుంగుటయే, జ్ఞాన మనబడును. కొందరిట్లనిరి. పాశుపత వ్రతము చాంద్రాయణ వ్రతము

అను సవి, తపము, విగ్రహ లింగార్చనలు, కర్మలు, కాయిక వాచిక మాన సిక పూజా జపంబులు జపమనబడును. శివుని చింతించుట ధ్యానమనబడును. శివశాస్త్ర మెరుంగుటయే జ్ఞాన మనబడును. దీనినే శివాగమందురు. కరుణా మయులై శివభక్తుల నాశ్రయించి శివశాస్త్రములు తెలిసికొని యాచరించు టయే సాధక మనబడును. శివభక్తుల నాశ్రయించుటచే భక్తి ద్విగుణీ కృత మగును. శ్రేయస్సులు కోరువారు విషయాసక్తులను వీడి శివుని భజింపవలెను.

**శివ మహాపురాణము నందలి వాయవీయసంహితయందు ఉత్తరఖండమున**
ఏడవ యధ్యాయము సంపూర్ణము

---

## ఎనిమిదవ యధ్యాయము

### వ్యాసావతార వర్ణనము

ఉపమన్యువాక్యాలు విని శ్రీకృష్ణుడో యుపమన్యూ! శివుడు తన యాశ్రితులగు భక్తులకు వినిపించిన, శివజ్ఞానము నాకు వినిపింపుము, వేదసార మైన, ఈశివజ్ఞానము న భక్తులకు బుద్ధిహీనులకు, సముక్తులకు నగోచరము పం చతత్వములతో గూడిన దీనిని మూఢులెరుంగరు, మూర్ఖులు నిందింతురు. శివనిందచే దోషము, వర్ణాశ్రమధర్మాలకు పాపము సంభవించును. షడంగ ములతో గూడిన వేదసారమంతయు గ్రహించి సాంఖ్యయోగ సారమంతయు తీసి శతకోటి శ్లోక విస్తీర్ణమగు శివపురాణగ్రంథము పరమేశ్వరుడు చెప్పియుం డెను గదా అట్టి పరమేశ్వరుని పూజించుటెట్లు? ఎట్టి వారికతని పూజార్హులగు దురు జ్ఞానయోగాదులనెట్టివి? ఓ సువ్రతా! యిదంతయు నాకు విస్తరించి చెప్పుమన నుపమన్యుడిట్లు చెప్పదొడంగెను. శివుడు చెప్పిన శైవశాస్త్రమును సంక్షిప్తముగ చెప్పెదను. శివనిందలేని స్తుతులు విశ్వాసపాత్రమగు భక్తిము క్తులకు ప్రధాన కారణము. గురు ప్రసాదముచే లభించునదియు, ననాయాస ముగ ప్రాప్తించునదియు, నగు శివతత్త్వమును సంక్షిప్తముగ జెప్పెదనుగాని విస్త

రించిచెప్పలేను, పూర్వము స్థాణువు నవ్యక్తుడు నగు మహేశ్వరుడు, జగత్సృష్టినై, 'తానుస్వయముగ నుద్భవించి దేవాదిదేవుడైన యీప్రభువు బ్రహ్మను సృజించి సృష్టిచేయు మని నియోగించెను. ఈబ్రహ్మ దేవతలలో ప్రథముడు. ఇతడు తన తండ్రియగు శివుని శాసనముచే సృష్టిచేయ నారంభించి వర్ణాశ్రమ ధర్మంబులు విభజించి యజ్ఞములకై సోముని సృజించి, సోమునికై స్వర్గమును సృజించి తదుపరి, పృథివిని వహ్నిని, సూర్యుని యజ్ఞ స్వరూపుడగు విష్ణువుని, యింద్రుని సురులను, రుద్రాధ్యాయముచే స్తుతించి రుద్రుని సృజించెను. రుద్రుడు దేవతల యెదుటనుండి తన లీలచే దేవతల జ్ఞానము హరింప వారు మోహితులై రుద్రునిగాంచి నీవెవరవని ప్రశ్నింప నో దేవతలారా! నేను పురాతన దేవుడను. మీకంటె మొదటివాడను, నేనంతటను వ్యాపించినవాడను, నాకంటె నధికుడు, సముడు కూడలేడు నా తేజంబుచే జగత్తు నంతను తృప్తిపరచెదనని యామహేశ్వరుడం తర్ధితుడయ్యెను. విష్ణ్వాదిదేవత లందరు నతనినై పె గాంచుచు మహేశ్వరుని యధర్వోపనిషత్తులచే స్తుతింపుచు, పాశుపతవ్రతమాచరింపుచు, సంతసింపజేసిరి. వీరందరు భస్మలిప్తాంగులై యధర్వ వేదమందున్న పాశుపతవ్రతముచే రుద్రుని సంతసపరుప నీశ్వరుడు సంతసించి తన గణంబులతో యుమాసహితుడై వారలకు సాక్షాత్కరించెను. యెవడు నిద్రాశ్వాసములను జయించెనో, పాపరహితుడగు యోగి యెవడో, యోగుల హృత్పుండరీకమున నెవనిని దర్శింతురో అట్టిదేవుని దేవతలు గాంచిరి. ఈశ్వరేచ్ఛానువర్తి యగు పరమశక్తిని యతని వామభాగమున గాంచిరి. ఏదేవిని గాంచినంతనే సంసారబంధ విముక్తులై శివ పదమునొందెదరో, అట్టిదేవిని దర్శించిరి. తదుపరి శివగణము లన్నియునుగాంచిరి. ఇట్టి శివునిగాంచి శివసంబంధమగు పురాణశ్లోకములచే స్తుతింప నాపురాణపురుషుడు సంతసించి యో దేవతలారా! నేను సంతసించితిని మీకోరిక తెల్పుడన, ఓ దేవదేవా! నిన్నే మార్గముచే భూతలమందు పూజింపవలయును? నీపూజకు యధికారయెవ్వడు? చెప్పుమని సురులు ప్రశ్నింప, శివుడు నవ్వుచు దేవినై పు జూచి, సూర్యాత్మకమగు తన ఘోరరూప మిట్లు చూపింప దొడగెను, అప్పుడ తని స్వరూపమెట్టిదన సర్వైశ్వర్యగుణో పేతమైనదియు మూర్తివంతములైన దేవతాగణములతో గూడినదియు, పరమ శక్తిసంయుతమైనదియు అష్టబాహు

వులు, చతుర్వక్త్రంబులు గల్గినదియు, నద్భుతమగు నర్ధనారీశ్వరరూపముతో గూడినదియు నైయుండెను, నా యద్భుతమగు శివ స్వరూపమును విష్ణ్వాదిదేవతలుగాంచి, యీ దేవుని సూర్యునిగ భావించి, దేవిని చంద్రునిగ భావించి, పంచభూతాత్మకమగు సకల చరాచరంబులు యితనిస్వరూపయేయని తలచి, ఆభగవంతు నిట్లు స్తుతించిరి.

శ్లో॥ సిందూరవర్ణాయ సుమండలాయ
సువర్ణ వర్ణాభరణాయ తుభ్యం
పద్మాభ నేత్రాయసపంక జాయ
బ్రహ్మేంద్ర నారాయణ కారణాయ.

2 సురత్న పూర్ణం ససువర్ణ తోయం
సకుంకుమాఢ్యం సకుశంసపుష్పం
ప్రదత్తమాదాయ సహేమ పాత్రం
ప్రశస్తమర్ఘ్యం భగవన్ప్రసీద.

3 నమశ్శివాయ శాంతాయ
సగణాయాది హేతవే.
రుద్రాయ విష్ణ వేతుభ్యం
బ్రహ్మణే సూర్యమూర్తయే.

అని ఇట్లు వారందరు సూర్యమండలమధ్యస్థుడగు శివునిస్తుతించి బంగారు పాత్రలతో నర్ఘ్యమిచ్చిరి, ఎవడు సూర్యమండలమధ్యస్థుడగు శివుని పూజించి, రత్న ఖచితసువర్ణపాత్రయందు మూడు వేళ నర్ఘ్యములిచ్చి, స్తుతించినచో వానికి ముల్లోకములయందు, దుర్లభమైన దేదియు లేదు. ఈమూర్తికి నమస్కరించి స్తుతించిగాని, స్తుతులు విన్నగాని ప్రాప్తింపని దేదియునుండవు గాన, ధర్మార్థకామ మోక్షంబులకై యాదిత్య రూపుడగు శివుని సదా త్రికరణశుద్ధిగ నర్చింపవలెను దేవతలందరు శివుని ప్రార్థింపనా పరమేశ్వరుడు సర్వాగ మోత్తమంబైన శివశాస్త్రము వారల కొసంగి యదృశ్యుడయ్యెను. ఈశాస్త్రమునకు బ్రహ్మక్షత్రియ వైశ్య లేయధికారుల నిగ్రహించి వారల

కుపదేశించి, దేవతలు వారివారి తావులకేగిరి. బహుకాలము గడచినతరి నీశివశాస్త్రము దృశ్యమయ్యెను, శివుని యంకమునందున్న మహేశ్వరి భర్తను గాంచి, శివశాస్త్రమును గురించి ప్రశ్నింప నామెకు దానిసాదమును బోధించి ప్రకటింప, పరమేష్ఠి లోకమునందు విస్తరింపజేసెను, బ్రహ్మయాజ్ఞచే నేనగస్త్యునకు జెప్పితిని, అగస్త్యుడు దధీచికి తెల్పెను, దధీచి లోకమంతయు విస్తరింప జేసెను. శివుడుయుగాదియందు నవతరించి భక్తులకు జ్ఞానమొసగి ముక్తిమార్గ ముపదేశించును.

ఋభుడు, సత్యుడు, భార్గవుడు, అంగిరుడు సవిత్రుడు, మృత్యువు, శతక్రతువు, వశిష్ఠుడు, సారస్వతుడు త్రిధాముడు, త్రివృత్తుడు, శతతేజుడు, ధర్ముడు, నారాయణుడు, స్వరక్షుడు, అరుణుడు, కృతంజయుడు, భరద్వాజుడు, గౌతముడు, కవి, వాజశ్రవుడు, సూక్ష్మాయణుడు, శుచి, తృణబిందువు, కృష్ణుడు, శక్తి, శాక్తేయోత్తరుడు, జాతూకర్ణుడు, కృష్ణద్వైపాయనుడు యను నామంబులతో ఒక్కొక కల్పమున ఒక్కొకడు వ్యాసుడై క్రమముగా జనించు చుందురు. ప్రతి ద్వాపరమందున నొక్కొక వ్యాసుడు జన్మించు నని లింగపురాణమునందు సప్తమాధ్యాయమున లిఖింపబడెను. కలి యుగంబున శివుడు యోగాచార్యుడగు పతంజలియై జనించునని, లింగపురాణమునందు లిఖింపబడెను. ప్రతి వ్యాసావతారములందు నల్గురేసి శిష్యు లుందురు. ఆశిష్యులకు, ప్రశిష్యులు వందలు వేలుగలరు. వీరందరిచే శివతత్త్వము వెల్లడియైన భక్తులు ముక్తినొందుచుండిరి.

శివ మహాపురాణమునందలి వాయవీయసంహిత యందుత్తర ఖండమున
ఎనిమిదవ అధ్యాయము సంపూర్ణము



# తొమ్మిదవ యధ్యాయము

## శివుని యోగావతారములు

ప్రతియుగ ప్రారంభమందున భగవంతుడగు నీశ్వరుడేదో యిమచే వ్యాసావతారములు దాల్చుచుండుననంటివి. ఆయవతార విశేషంబులు, వాని శిష్యుల విశేషములు చెప్పుమని శ్రీకృష్ణు డుపమన్యుని ప్రశ్నింప, నతడిట్లు చెప్పదొడంగెను. శ్వేత, సుతార, మదన, సుహోత్ర, కంక, లౌగాక్షి, మహామాయ, జైగీష, దధివాహ, ఋషభ. ఉగ్ర, అత్రి, సుబాలక, గౌతమ, వేదశిర, గోకర్ణ, శిఖండి, జటామాలి, అట్టహాస, దారుక, లాంగులి, మహాకాల, శూలి, దండి, ముండి, సహిష్ణు, సోమశర్మ, లకులి, అను నీ అష్టావింశతి సంఖ్యలుగల వీరందరు, నీసప్తముడగు వైవస్వత యనుకాలంబున, వరాహకల్ప మందీశ్వరుడు, యుగయుంనంబునకు క్రమముగ యోగాచార్యుడై, జనించును. ఇన్ని యవతారంబులలోను శాంతచిత్తులగు శిష్యులు నల్గురేసి కలరు. ఈశిష్యులందరు మొత్తముసంఖ్య 112 గురు కలరు. వారినామంబులు నుడి వెదవినుము,

శ్వేత, శ్వేతశిఖ, శ్వాతాక్ష, శ్వేతలోహిత, దుందుభి, శతరూప, ఋచీక; కేతుమాన్, వికోశ, వికేశ, విపాశ, పాశనాశన, సుముఖ, దుర్ముఖ, దుర్దమ, దురత్రిక్రమ, సనత్కుమార, సనక, సనందన, సనాతన, సుధామ, విరజ, శంఖపాద, వైరజ, పారస్వత, మేఘ, మేఘవాహ, కపిల, ఆసురి, పంచశిఖ, వల్కల, పరాశరీ, గర్గ, భార్గవ, అంగిర, బలబంధు నిరామిత్ర, కేతు, శృంగ, తపోధన, లంబోదర, లంబాక్ష, లంబికేశ, సర్వజ్ఞ, సమబుద్ధి, సుధామ, కశ్యప, వశిష్ఠ, విరజ, అత్రి, ఉగ్ర, గురు, శ్రేష్ఠ, శ్రవణ, అవిష్టక, కుణి, కుణబాహు, కుశరీర, కునేత్రక, కశ్యప, ఉశన, చ్యవన, బృహస్పతి, ఉతథ్య, వామదేవ, మహాకాల, మహానిల, వాచశ్రవ, సువీర, శ్యామాశ్వ, యతీశ్వర, హిరణ్యనాభ, కౌశల్య, లోకాసి, కుథుమి, సుమంతు, జైమిని, కబంధ, కుశ్వకంధర, ప్లక్ష, దార్భ్యాయణి, కేతుమాన్, గౌతమ, వల్లవి, మధుపింగ, శ్వేత, కేతు, ఉశిజ, బృహదశ్వ, దేవల, కవి, శాలిహోత్ర, సువేష, యువనాశ్వ,

శరద్వసు, అక్షపాద, కణాద, ఉలూక, వత్స, కులిక, గర్గ, మిత్రక, రుష్య, శంబూక, భగల, కుండ, కర్ణకుంభ, ప్రబాహుక, అశ్వలాయన, విద్యుత్, శంబుక, యోగియను వారలు మొత్తము శిష్యులు నూటపన్నెండుగురు గలరు. వీరందరు, మహేశ్వరుడగు యోగాచార్యరూపులై భస్మోద్ధూళిత గాత్రులై, పాశుపతవ్రతసిద్ధులై, సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞులై, వేదవేదాంగ పారగులై, శివాశ్రయరతులై, శివజ్ఞానపరాయణులై, సర్వసంగ వివర్జితులై, శివాసక్తమానసులై, సర్వద్వంద్వ సహిష్ణువులై, ధీరులై, సర్వభూత హితరతులై, సత్యశీలులై, మృదుస్వభావులై, స్వస్థచిత్తులై, జితక్రోధులై, జితేంద్రియులై, రుద్రాక్షధారులై, త్రిపుండ్రాంకిత మస్తకులై, కొందరు శిఖాజటిలులై, కొందరు సర్వజటులై, కొందరు ముండశీర్షులై, తరుచు ఫలమూలాశనులై, ప్రాణాయామ పరాయణులై, శివాభిమాన సంపన్నులై, శివధ్యానైకతత్పరులై, సంసార విషవృక్షాంకుర భేదకులై, శివపుర ప్రయాణ సంసిద్ధులై, గురువులై శివపూజారతులై, ముక్తినిగోరుచుండిరి. వీరందరు శివసాయుజ్యము నొందుటలో సందియములేదు.

శివమహాపురాణము నందలి వాయువీయసంహిత ఉత్తరఖండమున
తొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

# పదవ అధ్యాయము

## శివభక్తి

ఓ భగవన్, సర్వజ్ఞా! యోగీంద్రా! గణేంద్రా! మునీంద్రా! సర్వజ్ఞానని సిధీ! గురూ! అపరమడానన స్వరూపా! భువియందు జనించిన మమ్ములను, పాశవిముక్తులజేసి రక్షింపుము. నీవుమాహార్షి రూపముతో నున్న పరమేశ్వరుడవు. నీవుగాక శివత్వము నన్యులెవ రెరుంగుదురు? నీముఖారవిందమునుండి, బయలు వెడలినది వాక్కులన్నియు కేవలము శివత్వమునుండి వెలువడినదివ్య వాక్కులవలె నున్నవి. శివజ్ఞానామృతమింత పానముచేసి నను నాకు తృప్తిక

గ్లుటలేదు. పరమేశ్వరాంకము నందున్న పరమేశ్వరి భర్తనేమని ప్రశ్నించెనో, తెల్పుమని కృష్ణుడు ప్రశ్నింప నుపమన్యు డిట్లు చెప్పదొడంగెను. ఓకృష్ణా! శివభక్తుడవగు నీకు మంగళములు చేకూరుగాక, నీవు మంచి ప్రశ్న వేసితివి. నీవడిగిన దంతయు చెప్పెదవినుము. మహీధర శ్రేష్ఠమైన దివ్యమందర చారుకందరంబున మహాదేవుడు, దేవితో గూడుకొని, దివ్యజ్ఞాన యుతుడై కొంతకాలము గడుప నొకానొక సమయంబున స్మితాస్యయు. శోభావతియు నగు నా దేవి, ప్రియసఖి, మనోహరములగు, ప్రఫుల్ల పుష్పంబులుకోసి. ఆది దంపతుల కడనుంచ, పరమేశ్వరుడాకు సుమంబులు స్వయముగతీసి దేవిశిఖయందు సంతోషముతో నలంకరించెను. ఆ దేవియంతఃపురమునందు సర్వాలంకారభూషితయై, చారుహాస్యయై స్వయముగ భర్తకువిసురుచు, నొకరితో నొకరు వినోదముగ సంభాషించుకొనుచుండ నింతలో దేవి లోకహితమునకై ఓ దేవా! మందచేతస్కులు, నాత్మతత్త్వ విముఖులు, నాత్మజ్ఞానవిహీనులు, నగుమనుజులే విధంబున తరింతురని శంకరుని ప్రశ్నింప నా దేవదేవుడిట్లు చెప్ప దొడంగెను. కర్మలచేతగాని, జపతపంబులచేతగాని, జ్ఞానముచేతగాని, యితర సాధనంబులచేగాని, నాయందు భక్తిలేనిదే, నేను వశుడను గాను, ఎవడు యేవిధముగనైననునన్ను సేవించినచో వానిని నేనుస్పృశించెదను. వశ్యుడవగుదును. గాంచెదను. సంభాషించెదను. గాన నాయందు, శ్రద్ధాభక్తులుండవలెను. వారికే నేను వశుడనగుదును. చతురాశ్రమముల వారికి శ్రద్ధయే కారణము. వర్ణాశ్రమధర్మముల తిక్రమించి సంచరించువారికి శ్రద్ధాభక్తులుండవు. వర్ణాశ్రమధర్మంబులన్నియు బ్రహ్మనాయాజ్ఞను సారముగ ధర్మశాస్త్రంబుల యందు లిఖించి యుండెను. బ్రహ్మలిఖించిన ధర్మంబులన్నియు. బహువిత్త క్రియాన్వితములై యున్నవి. ఉపనయన యజ్ఞాదిక్రియలన్నియు. బహుశ్రమకారకములై, స్వల్ప ఫలంబు లొసంగునవియై యుండెను. ఈధర్మా నుష్ఠానములచే ఫలంబులు స్వల్పమైనను శ్రద్ధయధికమై విరాజిల్లుచుండును. ఏవర్ణస్థుడైనను. యనన్యభక్తితో నన్ను సేవించినచో, ధర్మార్థ కామ మోక్షంబులు సిద్ధించును. అనేకవర్ణాశ్రమధర్మంబులు నేనుకల్పించితిని, వర్ణాశ్రమధర్ములకు నాయందు భక్తికల్గును భుక్తిముక్తులు కల్గును. వారివారి స్వవర్ణధర్మములతో నన్ను గొలిచినచో నేను సంతసించి భుక్తిముక్తుల నొసంగుదును. ఎంతయధికములైనను, నిశరధర్మ

ముల నాశ్రయింపరాదు. అట్లాశ్రయించినను ఫలములభింపదు. సర్వాశ్రమ వాసులకు నాయందు భక్తికల్గిన నో, ముక్తినొసంగెదను. నేనుచెప్పిన మార్గము నెరిగిన నన్నాశ్రయింతురో వారికి నేను భుక్తిముక్తు లొసంగుదును. నాయను గ్రహముచే మలపాశ విముక్తులగుదురు. నన్నాశ్రయించిన వారలు జన్మరహితులై నాపురమందుండ గలరు. ఇదియే పరమధర్మము. ఇదియే నివృత్తి మార్గము, నాభక్తులుగాకున్నను, నాభక్తులకు భక్తులైయున్నను, ముక్తినొందవచ్చును. వర్ణధర్మము లాచరింపకున్నను, భక్తుడై నాభృత్యుల నాశ్రయించినను, తరింప వచ్చును. నేను చెప్పిన ధర్మంబుల నే యొక్కటి యాచరించినను యితర ధర్మంబులు కోటి చేసిన ఫలము లభించును. ప్రతియుగము లందున యోగా చార్యుడనై జన్మించి యనేక వేల మందిని తరింప జేతును. గాన నాయవ తార విశేషములు గ్రహించి ప్రయత్న పూర్వకముగ తెలిసికొనవలయును. యుక్తా యుక్తము లెరుగని వారు, భక్తి హీనులు, మందమతులు, నన్నెరుం గుట దుర్లభము. అంధులై, యజ్ఞానులై యిట్టి మహాపురుషు నెరుంగక, నిత రుల సేవించుచు, మోహితులై ముక్తి నొందజాలరు. ఓ మహేశ్వరీ ! శివ ధర్మ ధేనువునకు, జ్ఞానము, క్రియా, చర్యా, యోగములను చతుష్పాదంబులు గలవు. పశుపతి జ్ఞాన మనబడును. షడధ్వ మార్గమున, పరిశుద్ధ క్రియ లొన ర్చుటయే క్రియ యనబడును. వర్ణాశ్రమ ధర్మముల ననుసరించి, నన్ననుస రించుటయే చర్యయనబడును. చిత్తము నాయందు నిల్పి యితర చింతలు లేక నన్ను ధ్యానించుటయే, యోగమనబడును. చిత్తశాంతి కల్గుట యశ్వ మేధయాగము కన్నను శ్రేష్ఠము. ఇది ముక్తి నిచ్చుటకు కారణము. విష యైషణుల కిది దుష్ప్రాపము, యమ నియమాదులచే, విజితేంద్రియులు, పూర్ణపాపహరులై యుందురు. వీరిని విరక్త యోగులందురు. వైరాగ్యముచే జ్ఞానము, జ్ఞానముచే యోగము కల్గును. యెంత పతితుడైనను యోగముచే ముక్తు డగుటలో సందియము లేదు. సదా దయగల్గి యుండుట, హింస లేకుండుట, జ్ఞాన సంగ్రహము సత్యము, ఆస్తిక్యము, చోరత్వము లేకుండుట శ్రద్ధా, యింద్రియ నిగ్రహము, అధ్యాపనము అధ్యయనము, యజనము, యాజనము, ఈశ్వర ధ్యానము, జ్ఞాన శీలత మొదలగు నవి యలవరుచు కొన విప్రునకు జ్ఞానయోగము సిద్ధించును. ఇట్టివాని కచిరకాలమందే

జ్ఞానము సిద్ధించి యోగము ఫలించును. జ్ఞాని క్షణకాలములో, జ్ఞానాగ్నిచే దేహము దహింప జేసికొని నాప్రసాదముచే యోగజ్ఞాని యై కర్మబంధ విముక్తు డగును. పుణ్యాపుణ్య కర్మలు రెండును ముక్తికి ప్రతిబంధక ములే యగును, గాన యోగి యైన వాడు యీ రెంటిని వర్జింప వలయును. ఫలకాములై కర్మ లొనరించినచో నవి బంధ హేతువు లగును. భగవదర్పిత ముగ కర్మ లొనరించినచో కర్మత్యాగి యనబడును. ముందుగా నన్ను కర్మ యజ్ఞములచే బహిఃపూజ లొనరింప వలయును. తదుపరి జ్ఞాన యజ్ఞరతుడై యోగ మభ్యసింప వలయును. దేహధారులు కర్మ యజ్ఞముచే నన్ను తెలిసికొని విరక్తులై, స్వర్ణమృత్తికల నొకటిగ భావింప వలెను. నన్నెరుంగని వారు స్వర్ణమృత్తికలకు విలువ తెలియ నట్లుందురు. నిత్య ముక్తులు మునిశ్రేష్ఠులు, సమాహిత చిత్తులు నగు మన్మక్తజనులు జ్ఞానయోగ రతులై నా సాయుజ్యము నొందుచుందురు. జ్ఞానచర్యా క్రియాసక్తులు; విరక్త చిత్తులు, వర్ణధర్ములు, నాయుపాసకులు, బాహ్యాభ్యంతర పూజా నిరతులు, త్రికరణ శుద్ధిగ నన్ను సేవించు వారు ముక్తి నొందెదరు. తపము, కర్మ, జపము, ధ్యానము జ్ఞానములు యను నీ యైదింటిచే సత్పు రుషులు నన్ను భజించు చుందురు. సమస్త జీవులను పరమాత్మగా భావిం చినచో, పరమాత్మ జ్ఞాన మలవడును. బాహ్యాభ్యంతరముల యందీవి ధముగ పరమాత్మను తెలిసికొనవలయును. తన్ను తాను తెలిసికొనుటయే యాంతరంగిక పూజ యనబడును. నాయందు చలింపని చిత్తమే చిత్తము. నన్ను స్తుతించినదే వాక్కు. త్రిపుండ్ర ధారియై భక్తిచే నా లింగార్చన చేయుట కాయమే కాయము. నా యర్చన క్రియలే బాహ్య యజ్ఞము లన బడును. నాకై కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతంబులచే శరీరమును కృశింప జేయుటయే, తపమనబడును. నాకై పంచాక్షరిని గాని, ప్రణవాక్షరిని గాని, జపించుటయే జప మనబడును. వేదమంత్రయు పఠింప లేకున్నను నిత్యము నమక పారాయణము చేసినచో వేదపారాయణ ఫలము లభించును. నారూప మును ధ్యానించి చింతించుటయే. సమాధి యనబడును. నాశాస్త్ర విజ్ఞానమే జ్ఞాన మనబడును. ఇతర విజ్ఞానము జ్ఞానము కాదు. ఇతర చదువులు చదు వులు కావు. పూర్వ జన్మవాస నానుసారముగ జీవులున్న బాహ్యాభ్యంతర

పూజలు చేయుచుందురు. బాహ్య పూజలకన్న యాంతరంగిక పూజలు శత గుణాధికమై యుండెను. ఏమన, బాహ్యపూజలకు దోషము లుండును గాని, యాంతరంగిక పూజలకు నే దోషము నుండవు. కాన, నంతరంగము పరిశుద్ధముగ నుండవలెను. లేనిచో నపవిత్రమగును. అంతః శుద్ధి లేనిచో బాహ్యశుద్ధులతో ప్రయోజనము లేదు. కాన, పరమాత్ముని భక్తితో బాహ్యాభ్యంతర పూజలు భావయుక్తముగ చేయవలెను. దీని నే భజన యందురు. లేనిచో ఫలము విపర్యయము నొందును. కృత్రిమ సౌఖ్యమునకు, నిత్య సుఖమునకు, ఫలింపని దేహము నుండదు. భేదభావము లేక బాహ్యాభ్యంతర మందు నన్ను పూజించుటయే, సనాతన ధర్మమనబడును. మనోవాక్కాయ కర్మలచే నన్ను ఫలకాములై యర్చించు వారు నాకు నెంతో భారమనిపింతురు. ఏదో స్వల్ప ఫలంబుల నిచ్చిన సంతోషించి పోవుదురు. ఫలము కోరక నన్ను త్రికరణ శుద్ధిగ నన్ను సేవించినచో, వారి భారము నాకధికమై శ్రమకల్గించును. వారి భారమంతయు నాదేయగును. ఫలసిద్ధికై నన్నర్చించిన వారలకు నాడు కోరిన ఫలంబు లొసంగెదను. భారమంతయు నాపై నుంచినచో వారు కోరుకున్నను వారి సర్వక్షేమంబులు నేనే చూచెదను. వారే నాకు ప్రియులు. ఫలాపేక్ష లేక నన్ను సేవించి, తుదకు ఫలంబులు కోరినను నాకు వారు ప్రియ భక్తులగుదురు. ఫలాఫలంబులు కోరక నన్నే సేవించువారు నాకధిక ప్రియభక్తుల గుదురు. అధిక ఫలంబుల నొందెదరు. వారికి నిర్వాణాది పదంబుకూడ నొసంగెదను. నాయందు చిత్తము నిల్పి యనన్య భక్తియుతులై, యున్న వారలు నాకధిక ప్రియ భక్తులగుదురు. నా భక్తులష్ట విధంబులుగ నుందురు, అవి యేవన, 1 నాభక్తుల వాత్సల్య ముండుట 2 నాపూజల నామోదించుట 3 స్వయముగ నన్నర్చించుట 4 నాసేవలకై కరచరణాద్య వయవంబులు వినియోగించుట 5 భక్తితో నాకథలు వినుట 6 భక్తిచే పులకిత గాత్రులగుట 7 సుస్వరముగ నన్ను కీర్తించుట, సదా నన్నే యాశ్రయించి స్మరించుట ఈ యష్ట చిహ్నంబులు గల వారలే. పండితులు, మునులు, భక్తులునై యుండిరి. మ్లేచ్ఛులైనను ఈ చిహ్నంబులు గల వారలు పండితులు, మునులు నగుదురు. ఇవి లేనిచో చతుర్వేదంబులు పఠించిన వారైనను నాకు ప్రియులు కారు. చండాలురైనను యిట్టి వారు నాకు ప్రియులు. వా రొసంగిన

పూజా నైవేద్యంబులు నేను స్వీకరింతును. ఎవ్వరైనను భక్తితో నాకు పత్ర, పుష్ప, ఫల, తోయంబు లొసంగిన వారికి, నేనెన్నడు నన్యాయము చేయను. వారిని సదా కాపాడుచునే యుందును.

శివ మహాపురాణము నందలి వాయవీయసంహితయందు ఉత్తరఖండమున పదియవ అధ్యాయము సంపూర్ణము

---

## పదకొండవ యధ్యాయము

### శివజ్ఞానము

ఓ పరమేశ్వరీ! వర్ణాశ్రమ ధర్మనిరతులు. ద్విజముఖ్యులు, పండితులు, నాభక్తాధికారులనగు వారలను గురించి చెప్పెదవినుము. త్రికాలస్నానము, నగ్నికార్యము, క్రమపద్ధతిని లింగార్చన, యీశ్వరార్పణముతో దానము, సర్వదా సర్వుల యందు దయ, సత్యము, సంతోషము, ఆస్తిక్యము, అహింసా లజ్జా, శ్రద్ధా, అధ్యయనము, సదా యోగాభ్యాసము, నధ్యాపనము. వ్యాఖ్యానము బ్రహ్మచర్యము, శ్రవణము, తపము, క్షమా, శౌచము. శిఖోపవీతము, నుష్ణీషణము, యుత్తరీయము, నిషిద్ధసేవన నిషేధము, భస్మరుద్రాక్షధారణము, పర్వపూజలు, చతుర్దశలయందు విశేషముగ పూజించుట, కుశోదకపానము ప్రతిమాసమునందు యథావిధిగ చేయుట, మాసమాసమునకు పంచగవ్యప్రాశన, పంచగవ్యముచే పరమేశ్వరుడనగు నన్నభిషేకించుట, సత్క్రియలు చేయుట, శ్రద్ధమానకుండుట. పర్యుషితాన్నము (నిలువయన్నము) యవాన్నము నైవేద్యమిడకుండుట, మద్యము, మద్యవాసన గలదియు, నైవేద్యము చేయకుండుట, అట్టివి భుజింపకుండుటయు నుండవలయును. ఇవన్నియు నన్ని వర్ణములకు ముఖ్యమేగాని. బ్రాహ్మణులవశ్యమాచరింప వలయును. క్షమా శాంతి, సంతోషము. సత్యము, చోరత్వము లేకుండుట, బ్రహ్మచర్యము, శివ జ్ఞానము, వైరాగ్యము, భస్మధారణము, సర్వసంగ పరిత్యాగము ననునీపదియు నందరు నాచరణలో నుంచవలెను. ఇవిచాల విశేషకరము లైనవి. దివమందు

భిక్షాటనము చేయుట మొదలగునవి యోగిలక్షణములు. వానప్రస్థులకు కూడ నివియేవిధులు, బ్రహ్మచారులందరు రాత్రిభోజనము వర్జింపవలెను. క్షత్రియుడు ప్రతిగ్రహముచేయరాదు. అధ్యయనము అధ్యయనము. యజనము చేయవచ్చును. మరియు, స్వవర్ణంబుల వారిని రక్షించుట యుద్ధమునందు శత్రువులను, దుష్టులను, వధించుట, దుష్టపక్షులను, దుష్టమృగములను, దుష్టమనుజులను శాసించుట, క్షత్రియధర్మము. ఇవి వైశ్యులకు నిషిద్ధములు. క్షత్రియులు నాథభక్తులను వినాయితరులను నమ్మరాదు. ఋతుకాలములయందే స్త్రీలతో రమింపవలెను. సర్వదా సేనల రక్షించుకొనవలెను. సదా, చారులచే లోకవృత్తాంతములను తెలిసికొనవలెను. సదాయస్త్రధారియై, కవచధారియై, భస్మధారియై యుండవలెను, ఇదియే రాజుల ధర్మము.

గోరక్షణము, వాణిజ్యము, వ్యవసాయము, వైశ్యుల ధర్మము, పైవర్ణముల వారికి శుశ్రూషలు చేయుట భగవత్ క్షేత్రములయందు ఉద్యానవనములు నిర్మించుట శూద్రధర్మమై యుండెను. గృహస్థులు, పరస్త్రీపరాయణులుగాక, తనధర్మపత్నితో నుండుట ధర్మము. బ్రహ్మచారులు, వానప్రస్థులు, యతీశ్వరులు, బ్రహ్మచర్యవ్రతులై యుండవలెను. స్త్రీలకు భర్తృశుశ్రూషలతో సమానమైన ధర్మములేదు. స్త్రీలు భర్తల యనుమతినొంది సన్ను పూజింపవలెను. భర్తృశుశ్రూషలువీడి, వ్రతములాచరించినచో నరకము నొందుదురు.

భర్త లేని స్త్రీనుగురించి సంక్షేపముగ జెప్పెదను వినుము. వ్రతములు, దానములు, తపముశౌచము, భూశయనము, రాత్రిభుజింపకుండుట, బ్రహ్మచర్యము, త్రికాలస్నానము, శక్తిలేనిచో భస్మస్నానము, శాంతి, మౌనము, ఓర్పు, సంగవర్జనము, అష్టమి, చతుర్దశి, పౌర్ణమి, ఏకాదశి మొదలగు విశేష పర్వదినములయందు. విధిపూర్వకముగ, నర్చించి యుపవాసముండుట, విధవస్త్రీలకు ముఖ్యములు. చతురాశ్రమ ధర్మములు సంక్షేపముగ జెప్పితిని, సర్వులకు నివియేసనాతన ధర్మములు. ఓ దేవీ! షడక్షర మంత్రమును సర్వదా జపించుచుండుము. ఇదంతయు వేదోక్తమైన సనాతన ధర్మము. నీకు సంగ్రహముగ జెప్పితిని. లోకమందున్న మానవులు, పూర్వకర్మానుసారముగ దేహధారులై

కొందరు విషయ విరక్తులుగను, మరికొందరను రక్తులుగను, కొందరు పాపులు గను, కొందరు పుణ్యాత్ములుగను, కొందరు పద్మపత్రాంబువులవలె నిర్లిప్తులు గను, కొందరాత్మ విజ్ఞానులుగను, కొందరు విశుద్ధులుగను, కొందరు వివేకులు గను, నుందురు. నన్నాశ్రయించిన వారలు. నాప్రసాదముచే సర్వదుఃఖరహి తులగుదురు. వారికి కృత్యాకృత్యములతోను, విధినిషేధంబులతోను పనిలేదు. నేనుభక్తుల హితముసకై మానవునివలె సంచరింపుచు రుద్రలోకముపీఠ. యిట సంచరింపుచుంటిని. నాశాసన బద్ధులై, బ్రహ్మాదులు ప్రవర్తింపుచుండిరి. నాని యోగముచే నరులందరు ప్రవర్తింపుచుండిరి. నాయాజ్ఞాను వర్తులగుటచేతను, సద్భావాతిశయము చేతను, నన్నుగాంచుట చేతను, సర్వపాపక్షయము గల వారగుచుండిరి. నాయెడవిశ్వాసముతో ప్రవర్తించినవారికి, విశేషఫలంబుల నొసగెదను. నాభావాసక్తులకు గోచరింపని విషయములేవియు నుండవు. నా నామము విన్నంతనే పులకితశరీరుడై కంపించుట, చెమటబట్టుట, గద్గదకంఠు డగుట యానందబాష్పములు గార్చుట, నాభక్తులకు గల్గుచుండును. ఈచిహ్న ములచే, యుత్తమల మధ్యమ- యధమ భక్తులుగ గుర్తింపవచ్చును.

శ్లో॥ యథాచాగ్ని సమావేశా, న్నా యోభవతి కేవలః.
తథైవమనుసాన్ని ధ్యాన్న తే కేవలమానుషాః.

అగ్ని సాన్నిధ్యముచే లోహము అగ్నిరూప మైనట్లు నాసాన్నిధ్యముచే నాభక్తులు, నారూపవంతులగుదురు. అట్టివారు మానుష దేహధారులగు రుద్రు లుగాని సామాన్యులుగారు. మూఢచేతస్కులిట్టి వారిని సామాన్యునిగ తలపో యుచు నిందించి యవమానింతురు. ఇట్టి నిందకులు, యాయువు, శీలము, యైశ్వర్యము, కులము నశించినవారై, నిరయవాసు లగుదురు. నాసేవకులకు. బ్రహ్మవిష్ణీంద్ర పదవులైనను తృణప్రాయములై యుండును. అట్టివారు నన్ను గాక యితరుల నపేక్షింపరు ప్రాకృతబుద్ధి గలవారందరు నిట్టియైశ్వర్యములనే కోరుచుందురు గాని యప్రాకృత బుద్ధులీయైశ్వర్యములను కోరరు. బహూక్తులు పలుకనేల, ఏహేతువు చేతనైనను చిత్తము నాయందునిల్చినచో వారు పొందరాని దేదియులేదని యివ్విధంబులుగ శ్రీకంఠుడగు శివుడు జగద్ధితము నకై యిదంతయు పరమేశ్వరికి వివరించెను. ఈ విజ్ఞానమంతయు, వేదశాస్త్ర

సమన్వితమై యుండెను. ఇదంతయు నితిహాస పురాణములయందు వ్యాఖ్యానిం పబడి యుండెను. జ్ఞానము, జ్ఞేయము, యనుష్ఠేయాధికారము. సాధనము సాధ్యము. యధికారియను నివియేపదర్థములు, నీకుసంగ్రహముగ జెప్పితిని, గురువుచే పొందబడినదే విజ్ఞానమనబడును. పశుపతిని పొందుట యేజ్ఞేయము. లింగార్చనయే యనుష్ఠేయము. శివమంత్రాదులే సాధనము. శివసమానతయే సాధ్యము. భక్తుడే దీక్షాధికారి! ఇవియేపదర్థములు కర్థము. సర్వజ్ఞానమే సర్వజ్ఞతయనబడును, ప్రపంచంబున. శక్త్యానుసారముగ, కర్మయజ్ఞముల నాచరింపలెను. తనుపరి బాహ్యపూజలు, తనుపరి మానసిక పూజలుచేయవలెను. ఆంతరంగిక పూజచేసినచో బాహ్యపూజతో నిమిత్తము లేదు. మహాత్ములు బాహ్యకర్మలాచరింపరు శివాత్ములగు భక్తులు జ్ఞానామృతముచే తృప్తులగుదురు. వారికి బాహ్యాభ్యంతర కృత్యములతో పనిలేదు, ముందుగా బాహ్యక్రియలువీడి తరువాత నంతరంగ కృత్యములు విడవలెను. జ్ఞానముచే జ్ఞేయమును తెలిసికొని, జ్ఞానమును వీడవలెను ఏకాగ్రతలేనిచో, క్రియలన్నియు వ్యర్థములగును. అదికుదిరినచో, బాహ్యాభ్యంతర క్రియలన్నియు తమంతటతామే నశించును. ఏయుపాయముచేతనైనను శివునియందు చిత్తముల పరచుకొనవలెను. శివునియందేకాగ్రచిత్తుడైనచో పరమునుకూడ త్యజించి కైవల్యముక్తిని పొందగలడు. ఓం నమశ్శివాయ యనుమంత్రమును జపించినచో సర్వసిద్ధుల నొందవచ్చును. గాన దానినవశ్యము పఠింపవలయును.

శివ మహాపురాణము నందలి వాయవీయసంహిత ఉత్తరఖండమున
పదకొండవ అధ్యాయము సంపూర్ణము.

---

# పన్నెండవ యధ్యాయము

## పంచాక్షరీ మహిమ

పంచాక్షరీ మాహాత్మ్యమును నాకు వినిపింపుమని శ్రీకృష్ణుడడుగ నుపమన్యు డిట్లు చెప్ప దొడంగెను. దీని మాహాత్మ్యమును వర్షకోటి శతంబులైనను విస్తరించి చెప్పుట యశక్యము గాన సంక్షేపముగ జెప్పెద వినుము. వేదమందును శైవశాస్త్రమందును చెప్పబడిన ప్రణవ సహితమైన శివ షడక్షరి శివ భక్తు లందరికి నశేషమైన విశేష ఫలంబు లిచ్చును. దీని యందక్షరము లన్నియు స్వల్పమైనను యర్థము గంభీరమై యుండెను. ఈ అక్షరము లన్నియు వేదసారములై యుండెను. ముక్తి నిచ్చును. షడక్షరము శివ స్వరూపమై యుండెను. మరియు నిది నానాసిద్ధియుతమై, దివ్యమై, లోక చిత్తానురంజకమై సునిశ్చితార్థమై గంభీర వాక్యములు గలదై, పరమేశ్వర సమ్మతమై శుభముఖోద్గీతమై విశేషార్థ ప్రతిపాదకమై యుండెను. ఓం నమశ్శివాయ యను పలుకు దేహధారు లందరికిని శివుడు సర్వజ్ఞత్వము నిచ్చును. ఇది విద్యల కాది బీజము. షడక్షరములతో గూడి మంత్రమే సూరాది మంత్రము. ఇది వటబీజము వలె నతిసూక్ష్మమై మహార్థమును తెలుపుచు చేయుచుండును. ఈ దేవుడు త్రిగుణాతీతుడు సర్వజ్ఞుడు సర్వద్రష్టా ప్రభువునై యుండెను. సర్వగతు డగు శివుడు ఓం అనెడి ఏకాక్షర మందుండెను. ఇతని పంచాక్షరములు, ఈశానాది పంచముఖములై వెలసెను. ఈ పంచాక్షరమందు పంచబ్రహ్మ లుండిరి. ఇతడు వాచ్య వాచక స్వభావుడై వాచకము మంత్రము, వాచ్యుడు శివుడునై యుండెను. శివునకు, మంత్రమునకు, వాచ్య వాచకములకు వలె భేదము లేదు. ఇది యనాది సిద్ధము. అనాది నుండియు నీ ఘోర సంసార సాగరము ప్రవర్తిల్లు చుండెను. సంసార మోచకుడైన శివుడు కూడ ననాదియై యుండెను. వ్యాధికి వైద్యునివలె సంసార వ్యాధికి పరమేశ్వరుడు విరోధియై యుండెను. జగన్నాథుడగు శివుడు లేకున్నచో జగత్తంతయు తమోమయమై యుండును. సృష్టియే లేదు. ఏమన, ప్రకృతి యచేతనమైనది. పురుషుడు జ్ఞాత, అతడెవడో తెలియడు. పరమాణువులగా యతడు సర్వము నచేతనమై యుండెను. కారణము లేకుండ కార్య ముండదని బుద్ధిమంతుడు గ్రహింప

వలయును. ధర్మాధర్మంబులు, బంధమోక్షంబులు గుర్తెరుంగ వలయును. సర్వజ్ఞుడు కానివాడు సృష్టియే చేయలేడు. వైద్యుడు లేనిచో రోగులు దుఃఖించు విధముగ భగవంతుడు లేనిచో జీవులు దుఃఖించు చుందురు. కాన జీవులను సంసార సాగరము నుండి యుద్ధరించుటకు ననాదియైనవాడు సర్వజ్ఞుడు, పరిపూర్ణుడు, సదాశివుడు, నాథుడై యుండెను. ఇతడు ఆది మధ్యాంత నిర్ముక్తుడు, విమలస్వభావుడు, ప్రభువు, సర్వజ్ఞుడు, పరిపూర్ణు డని శివ శాస్త్రము నందు చెప్పబడెను. ఇతని నామమే యితని మంత్రమై యుండెను. ఇతని నామమే మంత్రము కాన మంత్రసిద్ధి త్వరలో కల్గును. ఇదియే శివజ్ఞానము ఇదియే శివపదము ఓం నమశ్శివాయ యనునది. శివషడక్షర మంత్రమై యుండెను. శైవశాస్త్ర మంతయు దీని వ్యాఖ్యానమై యుండెను. ఇందర్థవాద మేమియు లేదు. ఇది శివాశ్రయ స్థానమది. శివుడు సర్వజ్ఞుడు, సంపూర్ణుడు, విమల స్వభావుడునై యుండెను. అతడు లోకానుగ్రహ కారకుడు. ఇందులో సందేహమేమియు లేదు. ప్రతి వస్తువులు గుణదోషములతో కూడియుండెను. ఈ పరమేశ్వరు డొక్కడే గుణదోషములు లేనివాడై యుండెను. కాన సర్వజ్ఞు డనబడుచున్నాడు. సంపూర్ణ ఫలంబు లిచ్చువాడు కాన సర్వజ్ఞు డనబడుచున్నాడు. కొందరనృతులు, శివుడు రాగద్వేషముల పోగొట్టడని యందురు. అది యనృతము. సర్వజ్ఞుడగు శివుని కేదియు తెలియకనుట దోషము. నేచెప్పిన వన్నియు సత్యవాక్యములు. సంశయము లేదు. ఇవన్నియు నీశ్వర వాక్యములు. వీటిని శ్రద్ధతో పాటింపవలెను. పుణ్యపాపముల యథార్థము తెలియనిచో నరకము సంభవించును. యథార్థ వాక్యములు విని యాదరించినచో స్వర్గాపవర్గంబులు లభించును. మహర్షుల వాక్యములు తెలిసికొని పాటింపవలెను. రాగద్వేషానృత క్రోధకామతృష్ణానుసారుల వాక్యముల పాటించినచో నిరయగాములగుదురు; ఎంత వ్యాకరణ యుక్తముగ మాట్లాడినను, మధురముగ సంభాషించినను, మృదువాక్కులు పల్కినను ఏమిలాభము. అవిద్యారాగ వాక్యములతో కాలయాపన జేసినచో నవి సంసార క్లేశములకు హేతువులగును. శాస్త్రసమ్మతమైనవి. మనోహరములైనవి, నగు వాక్యములు దుర్లభము, ఏది విన్నంతనే శ్రోత్ర శ్రేయముగ నుండునో యది శాస్త్రసమ్మతమగుట కష్టము. సంసార బంధమునకు హేతువు. ఏది విన్నంతనే శ్రవణ

కఠినముగ గనిపించునో, యది శాస్త్రసమ్మతము, ముక్తి హేతువు నగును. ఇతర మంత్రము లెన్ని యున్నను శివ మంత్రముతో తుల్యములు గావు. వేదశాస్త్రంబులు సాంగముగ పఠించినను ఈ మంత్రముతో సరిరావు. సప్త కోటి మహామంత్రములకు నీ మంత్రము సూత్రప్రాయముగ నుండెను. శివ జ్ఞానమును తెలుపుడు చేయు విద్యాస్థానము లెన్ని యున్నను శివ భావమును తెలుపునవి యే గాని యీ మంత్రముతో సరిరావు. ఈ మంత్రము పఠించి హృదయమందు ధరించిన వారికి వేదశాస్త్రములతో పనిలేదు. సకల శాస్త్రములతో పనిలేదు. సకలశాస్త్రములు వీరికి కరతలామలకములై యుండును. ఈ మంత్ర పఠనముచేసినవి, చూచినవి, విన్నవి స్థిరముగ నుండును. ఓం నమశ్శివాయ యను మంత్ర, మెవని జిహ్వాయందు సదా వర్తించు చుండునో వాని జీవితము సఫల మైనది. అంత్యజు డైనను అధము డైనను, మూర్ఖుడైనను, పండితు డైనను, నిష్ఠతో జపించినచో పాపపంజర విముక్తు డగును. ఇవ్విధంబున పరమేశ్వరుడు పార్వతికి, విశేషముగ బ్రాహ్మణులకును, నితరుల హితములకై తెల్పియుండెను.

శివ మహాపురాణము సందలి వాయవీయసంహితయందు ఉత్తరఖండమున పండ్రెండవ అధ్యాయము సంపూర్ణము

---

## పదమూడవ యధ్యాయము

### పంచాక్షరీ మాహాత్మ్యము

కలుషితమగునదియు, దుర్జయమగు నదియు, దురతిక్రమమైనదియు, పుణ్యహీనమైనదియు, ధర్మపరాఙ్ముఖమైనదియు, వర్ణాశ్రమాచార హీనమైన దియు, సంకటభూయిష్ఠమైనదియు సర్వాధికార శూన్యమైనదియు, విపరీత నిశ్చయముగలదియు, గురుశిష్య సాంప్రదాయ శూన్యమైనదియు నగు కలికాలంబున జీవులే యుపాయంబులచే తరింతురో తెల్పుమని పార్వతిప్రశ్నింప, పర

మేశ్వరు డిట్లు చెప్పదొడంగెను. పరమవిద్య యైనదియు, మనోహరమైనదియు నగుపంచాక్షరి జపించినచో కలిని జనులు, ముక్తులగుదురు. మనోవాక్కాయ దోషములెన్ని యున్నను, యెంతకృతఘ్నులైనను, యెంతనిందితులైనను, యెంత దూషితులైనను యెంత కపటాత్ములైనను, యెంతలుబ్ధులైనను వక్రమనస్కులైనను నాపంచాక్షరీ విద్యను జపించినచో, సంసారసాగరమును తరింతురు. నాభక్తుడై నాపంచాక్షరి నుపాశించినచో వానిని తరింపజేసెదనని, నేను ప్రతినబూని యుంటినన, పార్వతి ఓదేవా! కర్మయోగ్యుడు కర్మలవీడి పతితుడైనచో వాడునరకము నొందకయెట్లు పవిత్రుడగును? మీయొక్క నామస్మరణచే వానికిముక్తి యెట్లు కలుగునో చెప్పుమన నీశ్వరుడో దేవీ! ఇది చాలరహస్యమైనది. ఇంతదనుక నీతోకూడ చెప్పియుండలేదు. పతితుడై, మోహితుడై, నన్ను పూజింపకున్నను నాపంచాక్షరి జపింపకున్నను తప్పక నరకవాసియగును. జలవాయు భక్షకులై, యెన్ని కఠినోపవాసము లొనర్చి. యెన్నివ్రతములు చేసినను, నన్నుపాసింపని వారు నాలోకమును పొందలేరు. నాపంచాక్షరిని జపించిన వారలు, నామంత్రప్రభావముచేత, నాలోకమును వసింతురు. యెన్ని తపోయజ్ఞ వ్రతనియమంబు లాచరించినను నాపంచాక్షరికి కోటియంశలైనను సరిరాదు, భవబద్ధుడు నాపంచాక్షరితో. విముక్తుడగును నాపూజచేతనే ముక్తుడగును. రుద్రభక్తుడైనను, గాకున్నను, యెంతపతితుడైనను, మూఢుడైనను, పంచాక్షరిచే నన్నర్చించినచో ముక్తుడగును. బ్రహ్మరూపమైన, నాపంచాక్షరి గాని, షడక్షరిగాని జపించినచో ముక్తి నొందనివాడుండడు. పతితుడైనను, అపతితుడైనను నన్ను జపించి పూజించిన భక్తులకు లభ్యముకానిదేదియు నుండదు. ఎంతయలభ్యవస్తువులైనను కోటిగుణితములై లభించుచుండును. బ్రహ్మచర్యముచే నన్నుపాసించినవాడు నాసదృశుడగును. బహూక్తులతో ప్రయోజనమేమి? నాభక్తులు సర్వాధికారు లగుదురు. నామంత్రము శ్రేష్ఠతరమైనది. ఈమంత్ర ప్రభావముచే లోకములు, వేదములు నిల్చియున్నవి. ప్రళయకాలమందీప్రకృతి యంతయు నాపంచాక్షరి యందు లీనమగుచుండును. అట్టితరినే నొక్కడును వినాయేదియు నుండదు. వేదశాస్త్రములన్నియు నట్టితరి నాపంచాక్షరియందే లీనమైయుండును. వేదములు నాశక్తిచే నశింపకుండును మరల ప్రకృతినాయాజ్ఞాను సారముగ సృష్టింపుచుండును. నాత్రిగుణంబులు మూర్త్య

త్మకములై సృష్టిస్థితిలయంబులు చేయుచుండును. జగత్తునకు జలప్రళయంబు కల్గినపుడు, జలమందు నారాయణరూపుడనై శయనించును. నే నాజలమందు శేషశయనుడనై నాలోయమధ్యమునందుండెదను. అట్టితరి నానాభికమలము నుండి పంచవక్త్రుడగు పితామహుడు జనించెను. ఆపితామహుడు త్రిలోక సృష్టిచేయ నసమర్థుడై కొందరిని మానసికసృష్టి చేసెను. అసృష్టివృద్ధి కాకుండుటచే పితామహుడు నన్ను ప్రార్థింప నేనాపద్మ సంభవునకు పంచాక్షరీమంత్ర మునుపదేసించితిని. అతడుతన, పంచవక్త్రములతో. పంచాక్షరములు గ్రహించి లోకములను గ్రహింపగలెను. వాచ్యవాచక విధంబులుగ నన్నతడు గ్రహించెను, అతనికి నేనుమంత్రము. మంత్రార్థమును జెప్పితిని, అతడు పుత్రరూపమున నామంత్రము గ్రహించి లోకపితామహుడై, నామంత్రము యథావిధిగ జపించుచు, నన్నారాధింపుచు, మేరుపర్వత శిఖరమందున్న నాప్రియభక్తుల చేసేవింపబడుచు, సృష్టిని మిత్తమై దివ్యసహస్ర వర్షంబులు వాయుభక్షణ చేయుచు, తపంబుచేయ నారంభించెను. నేనతని భక్తికిమెచ్చి దర్శనమిచ్చి నేచెప్పిన పంచాక్షరీ మంత్రమునకు నంగన్యాస కరన్యాసములు. ఋషులు ఛ్ఛందస్సులు, దిగ్బంధ దిగ్విమోచనలు, చెప్పియుంటిని. దానిపొంది యతడు జగ సృష్టినంతయు చేయగలెను. సృష్ట్యంతయు వృద్ధియయ్యెను. ముందుగా నమః అనియు, పిమ్మట శివాయఅనియు నుచ్చరింపవలెను. ఈమంత్రము శృతిశిరోభూషణమై యుండెను. సర్వోత్కృత్తికిది కారణమై యుండెను. ఈమంత్రమునా ముఖమునుండి వెలువడెను గాన ఇదినాయునికిని తెలుపును చేయును. ఈమంత్రమునకు వాచకుడను (అధిష్ఠానదేవతను) నేను. ఇదితప్పచా మీాకరప్రఖ్యమై పీనోన్నత పయోధరమై, చతుర్భుజమై త్రినయనమై. బాలేందు కృత శేఖరమై పద్మోత్పలకరమై సౌమ్యమై, వరదాభయ పాణిమై, సర్వలక్షణ సంపన్నమై సర్వాభరణభూషితమై సితపద్మాసనాసీనమై నీలకుంచిత మూర్ధజమై పంచవర్ణశోభితమై. ప్రకాశమానకిరణశోభితమై, పీతకృష్ణ ధూమ్ర. స్వర్ణ. రక్త వర్ణంబులుగలదై, బిందునాదవి భూషితమై, చంద్రార్ధనిభమై. బిందునాదదీపశిఖాకృతిమై, మంత్రబీజములకు బీజమై ఓంకారశక్తులతో కూడినదై, యుండెను. ఓం అనగా, బీజము. నమః అనగా శక్తి. దీనికి వామదేవుడుఋషి. పంక్తిఛ్ఛందము, శివుడు దేవత, అనిచెప్పవలెను. మరియు పంచవర్ణంబులకు

ఋపంచఋషులు చెప్పబడెను. ఇదియొక పద్ధతి. గౌతమ, అత్రి, విశ్వామిత్ర, అంగిర, భరద్వాజఋషయః. అని చెప్పవచ్చును. గాయత్రనుష్టుప్. త్రిష్టుప్. బృహతీవిరాట్టను ఛ్ఛందస్సులును, ఇంద్ర, రుద్ర, హరి, బ్రహ్మ, స్కంద దేవతలు. వీరందరు క్రమముగ నాపంచముఖస్థానములందుండెదరు. నాపంచముఖ స్థానములకు నుదాత్తానుదాత్త స్వరితస్థానములు చెప్పెదవినుము. పంచాక్షరములలో, నమవా. అనునవి నుదాత్తములనబడును. శివ, యను రెండక్షరములు యనుదాత్తములనబడును. నకారవకారములుదాత్తములనియు. మకారయకారములు స్వరితములనియు, శికారమను దాత్తమనియు, రుద్రాధ్యాయమందు చెప్పబడియుండెను. ఇదంతయు వ్యాకరణశిద్ధమైయున్నది. మూలవిద్య శివ పంచాక్షరి సూత్రము, ఇదియే నాస్వరూపము. మరియు నకారము శివుడు. మకారము శిఖ. శికారము కవచము. వకారము నేత్రము. యకారము అస్త్రము. నమః స్వాహా. వషట్ వౌషట్ ఫట్. ఇవి పంచాక్షరములకు అంగములు. గౌరీ పంచాక్షరి కూడ కొంచెము భేదముతో నిట్లే యుండును. ఇది పంచవర్ణములతోను, ద్వాదశసరములతోను, ణకార విరవిభూషితమై యుండును. ఈభేదముల ననుసరించి జపహోమ తర్పణంబుయి గావింపవలెను. దీనిచే శ్రద్ధా బుద్ధులు, సిద్ధులు, శక్తులు, చతురత కల్గును. కోరిన దెల్ల లభించును. భక్తిచే నిట్లు జపించిన వారికి ముక్తి తథ్యము. మంత్ర విధిక్రమము చెప్పెదను. అది తెలియనిచో జపమునిష్ఫలము. నే నీవిషయము సర్వ శాస్త్రముల యందు విస్తరించి చెప్పియుంటిని.

శివ మహాపురాణము నందలి వాయువీయసంహితయందు త్తరఖండమున

పదమూడవ అధ్యాయము సంపూర్ణము

---

## పదునాలుగవ యధ్యాయము

### పంచాక్షరీ మహిమ

మరల నీశ్వరు డిట్లు చెప్పదొడంగెను. ఓ దేవీ! గురూప దేశము లేకున్నను, క్రియా హీనుడైనను, శ్రద్ధలేకున్నను, గురుదక్షిణ నీయకున్న నట్టి జపము సదా జపించినను నిష్ఫలము. ఇవన్నియు సిద్ధించినచో జపము ఫలించును. ముందుగా ధ్యానయోగ పరాయణుడు, జపనిష్ఠుడు సద్గుణో పేతుడు, తత్వవేత్తయు, విప్రుడు నగు గురువు నాశ్రయించి, భావశుద్ధి సమన్వితుడై గురువుని ప్రయత్న పూర్వకముగ సంతోష పెట్టి మనోవాక్కాయ కర్మలచే పూజించి తన విభవమునకు తగినట్లుగ, సశ్వరథ రత్న క్షేత్ర గృహ వస్త్ర భూషణ ధాన్య ధనాదులచే గురువుని పూజింప వలెను. మంత్రసిద్ధికై విత్త లోభము చేయక యథాశక్తిగ గురువు నర్చింప వలెను. కపట రహితుడై యివన్నియు గురువున కర్పించి గురువుచే మంత్ర జ్ఞానము నొంది యొక సంవత్సర మహంకార రహితుడై గురు శుశ్రూషలు జేయుచు గురువు కడ పుత్రుని వలె సంచరింపుచు సంవత్సరము గడిపి గుర్వాదరణ పొంది శుచియై యుపవశించి శుద్ధికై పూర్ణకుంభ కలశను స్థాపించి మంత్రశుద్ధి జలముతో పుణ్య ద్రవ్యముల నందుంచి గంధ పుష్పమాల్యాదులచే నలంకరించి పుణ్యాహ వాచనముచేసి విప్రుల పూజించి సముద్ర తీరమున గాని నదీ తీరమున గాని గోష్ఠమున గాని, శుచి ప్రదేశమందు గాని, గృహమందు గాని, సర్వ దోష వర్జితములగు శుభతిథి, శుభనక్షత్ర, శుభ యోగములందు ప్రసన్న చిత్తుడై యేకాంత ప్రదేశమందు నాకు జ్ఞానోప దేశము చేయుమని ప్రార్థింప నాగురువు మాటిమాటికి శివస్మరణ చేయుచు నీకు శుభమగుగాక. మంగళమగుగాక యని పలుకుచు శిష్యునకు మంత్రోప దేశము చేయవలెను. ఇవ్విధంబున గురువు కడ మంత్రోపదేశము నొంది సంకల్ప పూర్వకముగ జపించి పునశ్చరణ చేసి యావజ్జీవము నష్టోత్తర సహస్రకముగ జపింప వలయును. ఇంతకు తక్కువ జపింపరాదు. అధికము చేయవచ్చును. అనన్యత్పరుడై, యిట్లు జపించినచో పరమ గతి నొందగలడు. జితేంద్రియుడై యక్షర లక్షలు గాని దానికి చతుర్గుణితముగ గాని మంత్రమును జపించుట పరశ్చరణ మందురు. పురశ్చరణ

మైన తరి మరల మంత్రము నిత్యము జపించు చుండవలెను. ఇట్టివాడు సిద్ధుడగును. ఇట్టి వానితో తుల్యు డెవడు నుండడు. స్నాతుడై శుచియై రుచిరాసన బద్ధుడై, శివ పార్వతుల మగు మనలను, గురువుని హృదయ మందు నిల్పుకొని యుదఙ్ముఖుడై గాని ప్రాఙ్ముఖుడై గాని యాసీనుడై, యేకాగ్ర మానసుడై, మౌనియై, పంచతత్వ శోధనగావించి దహన పావనములు చేసి (పాపములు పోగొట్టుకొని) పవిత్రుడై మంత్ర న్యాసములు చెప్పుకొని సఫలీకృత విగ్రహుడై ప్రాణాయామ పూర్వకముగ మనలను ధ్యానించి యంగ న్యాసకరకర న్యాసములు ఋషిచ్ఛందస్సులు బీజశక్తుల నుచ్చరింపుచు, పంచాక్షరిని జపింపవలెను. మానసిక జప ముత్తమము. ఓష్ఠములు కదుల్చుచు యుపాంశు జపము మధ్యమము, పైకి యుచ్చరించుట యధమ మని యాగాను సారవేత్తలు తెల్పియుండిరి. రుద్ర దేవు నారాధించుట యుత్తమము. విష్ణు దేవు నారాధించుట మధ్యమము. బ్రహ్మ దేవు నారాధించుట యధమని పూర్వులు జెప్పియుండిరి. ఉదాత్త నుదాత్త స్వరిత స్పష్టాక్షర పదంబులతో నుచ్చరించి జపించుట వాచక జపమన బడును. ఓష్ఠ పుటంబులు, జిహ్వా కొంచెముగ కదుల్చుచు నెదుట వానికి స్పష్టాంబులతో వినబడకుండ జపించుట యుపాంశు జపమందురు. పదపదంబులు విడదీసి శబ్దార్థములు గ్రహించి జపించుటయే మానసిక జపమందురు. వాచిక జపము కన్న యుపాంశు జపమునకు శతాధిక ఫలము లభించును. ఉపాంశువు కన్న మానసికమునకు వేయి రెట్లు ఫల మధికము. ప్రాణాయామముతో చేసిన జపము దీనికి శతాధిక మగును. దీనిచే సగర్భ జపమందురు. అగర్భ జపమైన నాద్యంతముల యందు ప్రాణాయామము చేసి జపింప వలెను. ప్రాణాయామ పూర్వకముగ మంత్రార్థములు చింతింపుచు నలుబది పర్యాయములు శక్తికొలది జపింప వలెను. శక్తి లేకున్నచో 5 పర్యాయములు గాని మూడు పర్యాయములు గాని ఒక పర్యాయము గాని సగర్భముతో జపించిట శ్రేష్ఠము. అగర్భము రెండవ పక్షము. ధ్యానము చే సగర్భ జపము చేసినచో సహస్ర గుణాధిక మగును. ఈ యెదు విధంబులుగ శక్తి కొలది జపింప వలయును. అంగుళి కన్న అంగుళి రేఖలతో జపించుటకు 8 రెట్లు ఫలమధికము. దీనికన్న పుత్రజీవి బీజములతో జపించుటకు పది రెట్లధిక ఫలము. దీనికన్న శంఖమణులతో జపించు

టకు శతాధిక ఫలము లభించును. దీనికన్న ప్రవాళములతో జపించుటకు సహస్రాధిక ఫలము లభించును. తీనికన్న స్ఫటికములతో జపించుటకు దశ సహస్రాధిక ఫలము లభించును దీనికన్న ముత్యములతో జపించుటకు లక్ష రెట్లు ఫలమధికము. దీనికన్న పద్మ బీజములతో జపించుటకు దశలక్షల ఫల మధికముగ లభించును. దీనికన్న సువర్ణమాలా జపమునకు కోటిరెట్లధిక ఫలము లభించును. దీనికన్న కుశగ్రంధుల చేతను రుద్రాక్షలతోను జపించు టకనంతగుణితమై యుండెను.

ముప్పది రుద్రాక్షలతో జపించినచో ధనప్రాప్తికల్గును. 27 రుద్రాక్ష లతో జపించిన పుష్టిప్రదమగును -25 రుద్రాక్షలచే జపించిన ముక్తికల్గును 15 రుద్రాక్షలతో జపించిన, యాభిచారక ఫలములభించును. అంగుష్టముచే జపిం చిన మోక్షము. తర్జనిచే శత్రునాశనము, మధ్యమము, ధనము, అనామిక శాం తిని కలుగజేయును. అష్టోతర శతమాల యుత్తమోత్తమము. ఏబదినాల్గు రుద్రాక్షలమాల, హృదయమునకు శ్రేష్ఠము. జపమాల లెవరికి కనబడరాదు. కనిష్టాంగుళితో జపించిన, శుభములు కల్గును. అంగుష్టముతో గూడిన అంగు ళీజపము చేయవలెను. అంగుష్టము లేనిజపము వ్యర్థము. గృహములోని కన్న గోష్ఠజపము శతగుణాధికము. దీనికన్న, పుణ్యారణ్యములయందు, నారామ ములయందు, సహస్ర గుణాధికమై యుండెను. దీనికన్న, పర్వతములకన్న పదివేలు. పుణ్యనదీతీరములయందులక్ష. దేవాలయములయందు కోటిరెట్లధి కము కల్గును. నాసన్నిధియందు, ననంతఫలము కల్గును. మరియు, సూర్యాగ్ని చంద్రదీపజలముల సన్నిధియందు. విప్రగో సన్నిధులయందు జపించుట ప్రశ స్తము. తూర్పుముఖముగా జపించుట వశీకరణము. దక్షిణముఖమున నాభి చారకము. పశ్చిమముసధనము. ఉత్తరమున శాంతియులభించును. సూర్యా గ్నిగురు, సన్నిధుల యందభిముఖుడై జపముచేయవలయును గాని, విముఖుడై జపమాచరింపరాదు. తలపాగాజుట్టుకొనిగాని, చొక్కాతొడుగుకొనిగాని నగ్నుడైగాని. కంఠమునకు వస్త్రము జుట్టపెట్టుకొనిగాని. యపవిత్రుడైగాని యపరిశుద్ధుడైగాని, దుఃఖింపుచుగాని క్రోధమదంబుతోగాని, తుమ్మువచ్చిన పుడుగాని, ఉమిసినపుడుగాని, ఆవులింతవచ్చినపుడుగాని, నీచులను, శునకము లను దర్శించినపుడుగాని జపమాచరింపరాదు ఒకవేళ నట్లుసంభవించినచో,

నాచమించి, శివపార్వతులను స్మరింపవలెను. లేక తారకలను దర్శింపవలయును. లేనిచో ప్రాణాయామము చేయవలెను. ఆసనము లేకుండగాని, శయనించిగాని, నడుచుచుగాని. నిలబడిగాని, రాజమార్గమునందుగాని. అశుచిమార్గమందుగాని, యంధకారమందుగాని, కాళ్లు చాచుకొనిగాని, గొంతుక కూర్చునిగాని, వాహనములయందుగాని, శయ్యయందుగాని, చింతాకులితమానసుడై గాని, జపింపరాదు. మానసకుండ, తనశక్త్యాను సారముగ జపింపవలయును. బహూక్తులు పలుకనేల. సంక్షేపముగ జెప్పెదవినుము. సదాచారులై శ్రద్ధాభక్తులతో జపించుట మంగళప్రదమై యుండును. ఆచారమే పరమధర్మము. ఆచారమే పరమధనము. ఆచారమే పరమవిద్య. ఆచారమే పరమగతి. ఆచారహీనుడగు పురుషుడు లోకనిందితుడగును. ఇట్టివాడు పరమందు కూడ నిందితుడగును. సుఖముండదు. వేదశాస్త్ర సమ్మతముగ నడచువాడు సదాచారుడన బడును. లేనివాడాచారహీనుడనబడును. సత్పురుషులాచరించు నట్లాచరించుట కూడ సదాచారమనబడును. సదాచారమే యాస్తిక్యమునకు మూలకారణము. ఆకస్మికగము నేదైనను ఆచారమునకు భంగముకల్గినచో దానిదోషముంటదు. నరుడు సుకృత, దుష్కృతములచే, సుఖదుఃఖములనుభవించుచు, పరలోకమున్నదని తెలిసికొనుటయే యాస్తిక్యమనబడును. రహస్యవిషయములన్నియు నీకెరిగించితిని, ఇవన్నియు నీవు గోప్యముగ నుంచుము, ఈవిషయములన్నియు నొకానొకపుడు కూడ, నాస్తికులకు, పశుప్రాయులకు, సదాచారవిహీనులకు. పతితులకు నంత్యజులకు, చెప్పరాదు. కలియుగమందు రక్షించుటకు పంచాక్షరిని మించిన మంత్రములేదు. నడుచుచున్నను. నిలబడినను, స్వేచ్ఛగా సర్వక్రియలొనర్చుచున్నను. యశుచియైనను. శుచియైనను, యేవిధముగ నీమంత్రముచ్చరించినను ఫలించునుగాని, నిష్ఫలముగాదు. నియమంబుతో చేసిన యధిక ఫల మొసంగును యెంతనీచుడైనను, ఎంతయధముడైనను, దీనిని జపించినచో నవశ్యముఫలించును. ఎట్టియవస్థయందైనను; నన్ను స్మరించినచో తప్పక ముక్తుడగును. సందేహములేదు. సునక్షత్రలగ్నతిథి వార యోగంబులు లేకున్నను, కూర్చున్నను, లేచినను, శయనించినను, నిద్రించినను, నన్ను జపించి స్మరించినచో శత్రువులు లేకుండ కాపాడుదును సకలము సిద్ధించును. వారికసాధ్యములైన వేవియునుండవు. గురువుసిద్ధుడైన నసిద్ధుడైనను, దీక్షతో మంత్రము జపించినచో సిద్ధివం

తుడగును. సిద్ధగురువైనచో త్వరలోసిద్ధించును. ఇతరమంత్రము లేవని చింతిం పక నొక్కశివపంచాక్షరి జపించినచో సర్వమంత్ర సిద్ధులులభించును. అందరు యీయత్కృష్ట పంచాక్షరి నాశ్రయింపవలెను. ఎన్నిమంత్ర సిద్ధులున్నను. యీమంత్రము సిద్ధికలుగనిదే మోక్షములేదు. ఈమంత్రముసిద్ధించినచో సర్వ మంత్రములు త్వరలోసిద్ధించును, లభింపనివన్నియు నీమంత్రముచే లభించును, నేనువశుడనైనచో సర్వదేవతలు వశులగుదురు, ఏమంత్రముల యందైనను దోషములుండ వచ్చునుగాని, ఈమంత్రమునకు దోషములేదు. ఇతరమంత్రము లకు జాత్యాది వివక్షత కలదుగాని ఈమంత్రమునకు జాతితో పనిలేదు. అందరు చేయవచ్చును క్షుద్రకోరి కలకై యీమంత్రము నుపయోగించుట మంచిదికాదని పరమేశ్వరుడు పార్వతికి పంచాక్షరి ప్రభావ మంతయు జెప్పియుండెను.

శివమహాపురాణము నందలి వాయవీయసంహిత యందుఉత్తరఖండమున పదునాలుగవ అధ్యాయము సంపూర్ణము.

---

## పదిహేనవ యధ్యాయము

### శివదీక్షా విధానము

మంత్ర మాహాత్మ్యయము వినిపించితివి. మంత్ర ప్రయోగ విధానము కూడ వినుపింపుమని శ్రీకృష్ణు డడుగ నుపమన్యు డిట్లు చెప్పదొడంగెను. సకల పాపహరము పుణ్యప్రదము నగు శివ సంస్కారవిధిని చెప్పెద వినుము. ఎవడు షడధ్వ పరిశోధనలచే పరిశుద్ధుడై శివ పూజాధికారియగునో వాడే సంస్కారి యనబడును. ఎవనిచే విజ్ఞానము గల్గి పాశబంధము ఛేదింప బడి సంస్కారియగునో వాడే దీక్షితుడనబడుచున్నాడు. శివ శాస్త్రమందు శివుడు, శాంభవి, శక్తి, మంత్రి, యనెడు త్రివిధ దీక్షలు చెప్పబడి యుండెను. గురు దర్శన, స్పర్శన, సంభాషణ మాత్రముచే జీవుడు పాశబంధ విముక్తు డగును. ఇదియే శాంభవీ దీక్ష యనబడును. ఈదీక్ష పాశక్షయ భేదములచే తీవ్రా

తీవ్రతరా యని రెండు విధములుగ నొప్పుచుండెను. దేనిచే తత్కాలమందే పాప నివృత్తి యగునో దానినే తీవ్రతర యందురు. జీవుడు పాపములను శోధించుటయే తీవ్రమందురు. గురువు యోగమార్గముచే శిష్యునకు క్రియా క్రియా జ్ఞానచక్షువుల నిచ్చి శక్తి జ్ఞాన శిఖలు శిష్యుని దేహమందు ప్రవేశ పెట్టుచున్నాడు. క్రియావతి, మంత్రి, దీక్షకుండ మండలపూర్వకముగ, బహిర్గత మగునట్లు గురువు చేయవలెను. శిష్యుని శక్తి ననుసరించిగురువును గ్రహింప వలెను. శైవ ధర్మాను సారముగ శిష్యునకు సంపూర్ణముగ కాని, ముఖ్యమూల సూత్రములు గాని శిష్యుని శక్తి ననుసరించి యుపదేశింప వలెను. ఎక్కడ శక్తి పతితము గాకుండునో యక్కడనే శక్తి యుండును. శివాచారములు లేకున్నచో శక్తి యుండదు. శక్తి పాతము లేకుండ గురువు శిష్యుని పరీక్షింప వలయును. గురువు శిష్యుని మోహములో బడకుండ చూడవలెను. మోహములో పడిన దుర్గతి నశించును. గాన నన్ని విధముల శిష్యుని పరీక్షింప వలెను. ప్రబోధానంద లక్షణములతో నుండుటయే శక్తి పాత లక్షణము. ప్రబోధానంద రూపమైనదే, పరమ శక్తి యనబడును. అంతఃకరణ వికారమే ఆనంద బోధలింగ మనబడును. ఖండించుట రోమాంచనము గద్గద స్వరము గన్నీరు మొదలగు లక్షణములు శిష్యునకున్నవా లేవా యని గురువు పరీక్షింప వలయును. ఇవన్నియు పరీక్షించి శిష్యునకు శివ జ్ఞాన మీయవలెను. గురువే శివుడు. శివుడే గురుడని శిష్యుడెరుంగ వలెను. విద్య నిచ్చుటచే, గురువు శివుడగును. శిక్షింప బడెడు వాడు గాన శిష్యుడనబడును. కారణ మీయుట గాన గురు వనబడును. శివుడే విద్య. విద్యయే గురువు శివుని విద్యను గురువుని పూజించినచో సమాన ఫలము వచ్చును. సర్వ దేవాత్మకుడు శివుడు. సర్వ మంత్రాత్మకుడు గురువు గాన, సర్వ ప్రయత్నములచే శిష్యుడు గుర్వాజ్ఞను శిరసావహింప వలయును. శ్రేయోభిలాషి మనంబున నైనను గుర్వాజ్ఞను మీరరాదు. గుర్వాజ్ఞా పాలకుడు, జ్ఞానవంతుడగును. భుజించుట, నిద్రించుట, సంచరించుట, మొదలగు సర్వ క్రియలు గుర్వాజ్ఞ లేనిదే చేయరాదు. గురువు సముజ్ఞ లేని యేపనియు చేయరాదు. గురు గృహమందున్న తాసనముపై నెన్నడు కూర్చొనరాదు. సమక్షమందసలే కూర్చొనరాదు. గురు గృహమే దేవళము.

గురువే దేవుడు. పాపులతో సాంగత్య మొనర్చినచో పతితు డగును. వహ్ని సంస్కారముచే స్వర్ణము మలినము వీడినట్లు శిష్యుడు గురు సాన్నిధ్యముచే పరిశుద్ధుడగును. అగ్ని సమీప మందున్న ఘృత భాండము కరిగి ద్రవించు నట్లుగ గురు సమీప మందున్న శిష్యుని పాపములు కరిగిపోవును. పావకుడు శుష్కేంధనములు దహించి నట్లుగ శిష్యుని సర్వపాపంబులు గురువు దహింప జేయును. గురువును సంతోషపరచినచో శిష్యుని పాపములు క్షణ ములో దహింప జేయును. త్రికరణ శుద్ధిగ గురువునకు క్రోధము లేకుండ జేయవలెను. అతని కోపాగ్నిచే శిష్యుని యాయువు, జ్ఞానము, సత్క్రియలు, సర్వధనంబులు క్షణములో నశించును. గురువు కోపించినచో సర్వ యజ్ఞం బులు నిష్ఫలంబులు, యమ నియమంబులు కూడ పని చేయవు. గురువునకు వ్యతిరేకముగనే కార్యములు పలుకరాదు. మోహముచే నట్లు పలికినచో, రౌరవాది నరకముల నొందగలడు. శ్రేయోభిలాషి యగువాడు గురువునకు విరుద్ధముగ నేపనియు చేయరాదు. గుర్వా యాజ్ఞాపించినను, లేకున్నను, గురువునకు హితముగ కార్యమునే చేయవలెను. అసమక్ష మందున్నను, సమక్ష మందున్నను, త్రికరణ శుద్ధిగ గురు కార్యము చేయవలెను. నిత్యము గురు భక్తి దీక్ష చేయవలెను. గురు ప్రీతికరుడగు శిష్యుడే, శైవ ధర్మమున కర్హుడు. శ్రేయస్సులు కోరువారు మిథ్యాచారములు సలుపరాదు. గురువు ప్రాజ్ఞుడు గాకున్నను, గురువు నవమానింపక సత్కరింప వలెను. శివ జ్ఞాన ముచే బ్రహ్మజ్ఞానియై తత్త్వవేత్తయై, పరమానందుడై ముక్తి నొందును. ఆనందమే పరబ్రహ్మము. తత్త్వము తెలిసిన వాడే ఆనంద పరబ్రహ్మను గాంచగలడు. తత్త్వజ్ఞాన రహితుడు నామమాత్ర పురుషుడే గాని విశేష వేత్తగాడు.

శ్లో॥ అన్యోన్యంతారయేన్నౌకా కింశిలా తారయేచ్ఛిలాం
ఏతంన్యాయానామ మాత్రేణముక్తిర్నైనాము మాత్రికా

నౌక తాను దాటి, యితరులను దాటించును. శిల దాటనూ లేదు యితరులను దాటించనూ లేదు. ఇవ్విధంబున తత్త్వవేత్త తాను తరించి తరించి యితరుల తరింపజేయును మూఢులు తాము తరించ లేరు యితరులను తరింపనూ లేరుగాన

జ్ఞానుల నాశ్రయించుట తరణోపాయము. తత్త్వవేత్త కానివాడు తానెట్లు తరింపగలడు. యితరుల నెట్లు తరింపజేయగలడు. దైవజ్ఞానము లేనిచో పశుతుల్యుడగును. పశుపతి దయగల్గినచో పశుత్వము నశించును. తత్త్వవేత్త పశుమోచనము నొందును. సర్వలక్షణ సంయుక్తుడైనను, సర్వశాస్త్రవిశారదుడైనను, సర్వోపాయవేత్తయైనను, తత్త్వజ్ఞానము లేనిదే నిష్ఫలము. తత్త్వవేత్తయగు పురుషుని గాంచినంతనే బ్రహ్మానందము గల్గును, ఎవని సాంగత్యముచే ప్రబోధానందములు గల్గునో వాడే తత్త్వవేత్త యనబడును, బుద్ధిమంతుడట్టివాని నే గురువుగ స్వీకరింపవలయును. వినయాచార చతురతగల శిష్యుల బాధింపకుండుటయే గురువు లక్షణము. ముక్తి నిచ్చువాడు సంపూర్ణ విజ్ఞానము కలుగునంతదనుక. గురువును సేవింపవలయును. జ్ఞానము లభించు నంతవరకు భక్తితో గురుసేవ మానరాదు. తత్త్వవిషయమై యుపేక్ష చేయరాదు. సత్త్వము విడరాదు. ఒకసంవత్సరము గురువును సేవించినను. యేవిధమైన విజ్ఞానము కలుగకున్నచో నన్యగురువును సేవింపవలెను. కాని మొదటి గురువును నిందింపరాదు. బోధకులు ప్రేరకులునైన గురుభ్రాతలనుగాని గురుపుత్రులనుగాని గురువుగా స్వీకరింపవచ్చును. లేనిచో వేదపారగుడగు బ్రాహ్మణుని గురువుగా స్వీకరింపవచ్చును. గురువునారాధించి విశేషమైన ప్రజ్ఞను ప్రసన్నత్వమును పొందవచ్చును. సర్వాభయప్రదుడు కరుణాక్రాంతమానసుడు, నగు గురువును. మనోవాక్కాయకర్మలతో సంతోష పెట్టవలెను. గురువు ప్రసన్నుడగు నంతదనుక గురువు నారాధింపవలయును. గురువు ప్రసన్నుడైనంతనే శిష్యుని పాపంబులన్నియు నశించును. శిష్యుడు తనవిత్తానుసారంబుగ నవరత్న క్షేత్రగృహ భూషణ వస్త్రయాన శయ్యాదిదానంబులు, గురువునకొసంగవలెను. పరమగతిని కోరనచో కపటములేకుండ తనశక్తి ననుసరించి గురువునకు ధనంబు లొసంగవలయును. గురువే. తల్లి, భర్తా, బంధువు, ధనము, సఖుడు, మిత్రుడు, సుఖము ననితలచి, సకలధనంబులు నివేదింపవలయు నంతేకాక తనకుటుంబమునంతను, గురుసేవకై వినియోగింపవలయును. తానుసపరివారముగ నిత్యము గురువునకు వశుడైయుండ వలెను. గురువు శివస్వరూపుడని తలచి యెవడు తనయాత్మను సమర్పించునో, అట్టివాడు, పునర్జన్మరహితుడై శివుడే యగును. గురువు తన యాశ్రితుడగు శిష్యుని, బ్రాహ్మ క్షత్రియ వైశ్యులలో నెవడైన నొకటి

రెండుమూడు సంవత్సరముల తనిగురుభక్తిని పరీక్షింపవలయును. అవసరమున్నచో శిష్యుడు సర్వధనంబుల నిచ్చుటయేగాక ప్రాణత్యాగముకూడ చేయునో. చేయడోయని, పరీక్షింపవలయును. శిష్యుని యుత్తమ. మధ్యమాధమకార్యములయందు నియోగించి యతడు క్లేశము బొందునో బొందడో యని పరీక్షింపవలెను. కేశములొడిసిపట్టి లాగినను, కొట్టినను, విషాదము నొందునో, పొందడోయని, పరీక్షింపవలెను. ఇట్టివాడే శివదీక్షార్హుడు, పరిశుద్ధుడు నహింసకుడు, దయావంతుడు. గురుభక్తి యుతచిత్తుడు, మానరహితుడు, బుద్ధిమంతుడు, స్పర్ధారహితుడు, ప్రియంవదుడు, సత్యస్వభావుడు, మృదుచిత్తుడు, పరిశుద్ధుడు, వినయవంతుడు, స్థిరచిత్తుడు, శౌచాచారసంయుక్తుడు శివభక్తుడు బ్రాహ్మణుడు నగు వానిని వాఙ్మనః కర్మయోగ్యతల పరీక్షించి యథాన్యాయముగ శివదీక్షనీయవలయునని, నిశ్చయముగ శాస్త్రములు చెప్పుచున్నవి, శివసంస్కార కర్మలయందు స్త్రీలకుస్వతః సిద్ధముగ నధికారములేదు భర్త్రాజ్ఞను పొందిభక్తితో దీక్షపొందవచ్చును. భర్త లేకున్నచో పుత్రపౌత్రులయనుజ్ఞను పొందవచ్చును కన్యకయైనచో తండ్రియాజ్ఞచే దీక్షనుపొందవచ్చును. శూద్రులకు నంత్యజులకు. పతితులకు సంకరజాతులకు పాదోకములిచ్చి పరిశుద్ధులజేసి శివభక్తి నొసంగవలెను. పరమకారణుడగు నీశ్వరునియందు కృత్రిమభావములేక యుండవలెను. సంకరజాతులన్నిటికి మాతృసంప్రదాయముల ననుసరించి శివభక్తి నొసంగవలెను. కన్యకతండ్రి యాజ్ఞచేశివధర్మముల నొందవచ్చును. శివభక్తులకేగాని యీదీక్షను శివభక్తరహితుల కీయరాదు. తనయశక్తిని పరిత్యజించి ధర్మయుక్తముగ శివునారాధింపవలెను. పతివ్రతయగు ననసూయ పతి తపస్సమాధుల యందుండ, భర్త యనుజ్ఞలేనిదే పశుపతిని శేవించి, కృతకృత్యురాలయ్యెను. అట్టి అభావపరిస్థితులయందు నెవరియాజ్ఞలు లేకున్నను, శివదీక్షనుపొందవచ్చును. శివపూజ నెన్నడును వీడరాదు. నారాయణ దేవుని తపంబుచే నారాధించి ద్రౌపది పంచపాండవులను పతిగా బడసెను. ఈమెయెవని యాజ్ఞను పొందక తపంబుచేసెనుగాన ఆదోషముచే ద్రౌపదికి పరమార్థము లేకుండెను. శివధర్మనియుక్తులై, శివశాసన గౌరవులై యున్నవారల కేదోషముల నంటవు. బహూక్తులు బలుక నేలయన్ని విధముల శివునాశ్రయింపవలెను. గురూపదేశముకొంది సంస్కారవంతుడైన వాడెన్నడు

పరాజయము నొందడు, గురుని దర్శించుట స్పర్శించుట, సంభాషించుట నమస్కరించుట మొదలగు శైవాకృత్యములచే నెన్నడు పరాభవము నొందడు. ప్రజ్ఞావంతుడగును, యోగమార్గమున సంస్కారముల నొంది యోగమల వరచుకొన్నచో నితరసంస్కారములతో పనిలేదు. ఈరహస్యము లన్నియు గురుముఖమున నేర్చుకొనవలెను, గాన విస్తరించి చెప్పుటకు వీలుపడదు.

శివమహాపురాణము నందలి వాయువీయసంహితయందు ఉత్తరఖండమున తదిహేనవ అధ్యాయము సంపూర్ణము.

---

## పదునాఱవ యధ్యాయము

### శిష్య సంస్కార విధులు

మరల సుపమన్యు డిట్లు చెప్పదొడంగెను. పుణ్య దినంబున శుచి ప్రదేశంబున దోషరహితమైన తిధి వారనక్షత్రంబుల శిష్యునకు సమయసంస్కారముచేసి యథావిధిగ, గంధవర్ణ రసాదులచే, భూమిని పరీక్షించి, శిల్ప శాస్త్ర ప్రకారంబుగ మండపము నిర్మించి దాని మధ్య వేదికను నిర్మించి, పశ్చిమదిక్కు మొదలుకొని యష్టదిక్కులయందు కుండములు నిర్మించి, ప్రధాన కుండము పశ్చిమ భాగమం దుంచి దానిని శోభాయమానముగ నలంకరించి వితానధ్వజమాలలచే శోభింప జేసి, వేదిమధ్యమంబున శుభలక్షణంబగు మండలము నిర్మించి, ఈశ్వరావాహనోచితము లగు రక్త హేమ వర్ణంబులు గల పసుపు కుంకుమలచే నలంకరించి, శక్తియున్నచో రత్నహేమ చూర్ణంబులచే ముగ్గులు పెట్టి నిర్ధనుడైనచో, శిందూర శాలినీ వారచూర్ణంబులచే నొక మూరగాని, రెండు మూరలుగాని, తెలుపు చూర్ణముతో గాని, యెరుపు చూర్ణముతో గాని, యష్టదళ పద్మంబు నిర్మింపవలెను. ఒక హస్తప్రమాణము పద్మమున్నచో దాని కర్ణిక యష్టాంగుళ పరిమిత ముండవలయును. కేసరములు దీనిలో సగము నాలుగంగుళము లుండవలెను. ద్విహస్త పద్మమున్నచో కర్ణికాదులు రెట్టింపుగ

నుండవలెను. దీనికి ఈశాన్యభాగమున శోభాయమానముగ నలంకరింపవలెను, ఏకహస్తముగ గాని, యర్థహస్తముగ గాని, వేదికా మండపములు నిర్మింప వలెను. గోధుములు, బియ్యము, తిలలు పుష్పంబులు, కుశలు, మండపము గా బరచి సర్వలక్షణ సంపన్నమగు శివకుంభమును స్థాపింపవలెను. ఆకుంభము సౌవర్ణముగాని రాజితము గాని. తామ్రము గాని, మృణ్మయము గానియై యుండవలెను. ఆ కుంభమందు గంధపుష్పాక్షతలు, కుశదూర్వాంకురంబులు నింపవలెను. ఆ కుంభము కంఠమున తెల్లని దారము గట్టి రెండు వస్త్రములు చుట్టబెట్ట వలెను. ఇంకను దానియందు శుద్ధాంబువులు పోసి, దర్భకూర్చియు మృత్తికను వేయవలెను. దీనిలో నేదిలోపించినను నుత్తర భాగంబున నరవిందమును స్థాపించినచో పరిపూర్ణ మగును. ఆపూర్ణ కుంభమందు పూర్ణవిధిగ నీశ్వరుని పూజింప వలెను. ఈ పూజ సాగరతీరంబున గాని, గోశాలయందు గాని, పర్వతమందుగాని, దేవళమందు గాని, గృహామందు గాని, యితర శుచి ప్రదేశమందు గాని, పూర్వము చెప్పిన మండపములు లేకున్నను తండుల మండపము పోసి యగ్నిని స్థాపించి ప్రహృష్ట వదనుడై గురువుతో పూజాగృహమున ప్రవేశించి, నిత్య విధులను తీర్చుకొని మండప మధ్యమందు శివకుంభము స్థాపించి శివ పూజగావించి యజ్ఞరక్షకు డగు నీశ్వరుని పశ్చిమాభిముఖుడై ధ్యానించి యీశ్వరుని దక్షిణ భాగంబున సనాళపద్మమును పూజించి యావద్ద్రవ్యమును మంత్రయుతముగ కుంభము నందుంచి ముద్రలు జూపించి వ్రతము పూర్తిచేసి శివాగ్ని యందు హోమము చేయవలెను. ఇతర కుండములయందు ఋత్విజులచే హోమము చేయింప వలెను. ప్రధానకుండ మందు తన ప్రధానాచార్యునిచే పదునాల్గు గాని, నాల్గు గాని హోమంబులు చేయవలెను. తదుపరి వేదపారాయణము మంగళ స్తోత్రంబులు సన్యగ్జపంబులు మొదలగునవియు శివభక్తి పరాయణులచే నృత్య గీత వాద్యంబులు మంగళగీతికలు సదస్యులకు పూజలు గావించి కర్మాంత పుణ్యాహ వాచకము గావించి శంకరుని మరల పూజింప వలెను. శిష్యు ననుగ్రహింపుమని మరల గురువు శంకరు ప్రార్థింపుచు ఓ దేవ దేవా! నీవు నా శరీర మందు ప్రవేశించి నా శిష్యుని సర్వపాపములు పోగొట్టుమని శంకరుని యనుజ్ఞ నొంది హవిస్సు

భుజించిన శిష్యుని దగ్గరగ కూర్చుండబెట్టుకొని మండప పశ్చిమ ద్వారం బున దక్షిణా మండపమున కెదురుగా కూర్చుని శిష్యుని యుత్తర ముగ దర్భాసనవాసీనుం జేసి కృతాంజలి యగు నట్లు జేసి గురువు ప్రాఙ్ముఖుడై ప్రోక్షణిపాత్రయందున్న జలమును హస్త్రిముద్రచే శిష్యునిపై సంప్రోక్షించి పుష్పముచే శిష్యుని కొట్టి నేత్రములు మూసి నూతనవస్త్ర కండవా గప్పి శిష్యుని మండపమునకు జేర్చి ఈశ్వరునకు ముమ్మారు ప్రదక్షిణములు చేయించి సువర్ణ పుష్పాంజలు లిప్పించి తూర్పుముఖముగ సాష్టాంగదండప్రణమంబులు చేయించి యాతని శిరముపై మంత్రపూర్వకముగ సంప్రోక్షించి వీపుపై చరచి శిష్యుని నేత్రబంధనము విప్పవలెను. అప్పుడు శిష్యుడు కనులు తెరచి గురువును ఆ మండపమును గాంచవలెను. గురువు శిష్యుని తన వద్ద దర్భాసనముపై కూర్చుండబెట్టుకొని శివపూజలు గావించుచు శివ తేజోమయుడగుచు తన హస్తముచే శిష్యుని స్పృశించి శివమంత్ర ముచ్చరించుచు, హస్త మస్తక సంయోగము గావించి శరీరమంతయు స్పృశింపచుండ శిష్యుడు శివ స్వరూపుడగు గురువునకు నమస్కరించి శివాలయమందున్న శివుని పూజించి మున్నూర్లు హోమములు గావింపవలెను. శిష్యుని మంత్ర పూర్వకముగ కర్ములతో స్పృశించినచో శిష్యునకు సకలసిద్ధులు లభించును. ఇట్లొనరించి నాడీసంధానముచే శివునకు నమస్కరించి శివశాస్త్ర ప్రకారముగ ప్రాణనిర్గమముచేసి భగవంతుని శిష్యుని దేహమందు ప్రవేశ బెట్టి మంత్రతర్పణముచేసి మూలమంత్రముచే పది పర్యాయములు హోమము గావించి అంగదేవతలను కూడ హోమముచే తృప్తిపరచి ప్రాయశ్చిత్తమునకై పూర్ణాహుతి నిచ్చి, మరల మూలమంత్రముచే దశాహుతులు వేల్చి ఆచార్య దేవుని పూజించి తానుస్వీకరింపబడితినని కొనవలయును. ముందుగా వైశ్యుడ నైతిననియు, పిమ్మట క్షత్రియుడ నైతిననియు, తదుపరి బ్రాహ్మణుడనైతి ననియు తలచి బ్రాహ్మణుడైన పిమ్మట రుద్రుడగుటకు ప్రయత్నింపవల యును. ఇట్లగుటకై గురువు మంత్రోదకములు శిష్యునిపై ప్రోక్షించి యాత్మను పరమాత్మయందు జేర్చుమని శిష్యుని తాడనచేసి. విస్ఫులింగ సదృశ్యమగు శివుని స్మరింపుచు నాడీద్వారా రేచకవాయువు ద్వారా శిష్యుని హృదయమందు ప్రవేశబెట్టి చైతన్యమును కలిగింపజేసి నిలబిందు

నిభమైన స్వరూపమును స్మరించుచుండ శిష్యుడు తన యాత్మబలము చేతను స్వతేజముచేతను పాపరహితుడు కావలయును. గురువు వాయువును నాడీద్వారా తీసికొనివచ్చి సంసారముద్రచే పూరకమందు నిలిపి యాత్మను పరమాత్మయందు కలిపి రేచకమందున్న వాయువును కుంభకమందు జేర్చి పూర్వమువలె మరల శిష్యుని హృదయమందు జేర్చి ఈశ్వర జ్ఞానము న్నకై శిష్యునకు నూతనయజ్ఞోపవీతము ధరింపజేసి, మూడాహుతులు వేల్చి పూర్ణాహుతి జేసి శిష్యుని దక్షిణభాగమున, శివ మండపమును కూర్చుండ బెట్టుకొని, తానుత్తరదిశగానుండి కృతాంజలుడై యున్న శిష్యుని, తూర్పు ముఖముగ కూర్చుండ బెట్టి ముందుగా స్థాపించిన పూర్ణకుంభ జలమును శిష్యుని శిరముపై నభిషేకించి శ్వేతపుష్పమాలలు ధరింపజేసి మండపమందు కుశాసనాసీనం జేసి భస్మము చేతబూని, యీశ్వరుని స్మరించి శిష్యుని శరీర మంతయు పూసి, సకలీకరణమాతృకాన్యాసము జెప్పి శిష్యసహితుడై శివు నాహ్వానించి పూజించి, యెల్లప్పుడు నాహృదయమందుడు గాక యని శివుని ప్రార్థించి మానసికపూజ గావించి, శిష్యుని చెవియందు శివమంత్రముపదేశింప శిష్యుడా మంత్రమును గ్రహించి జపింపవలయును. గురువు శిష్యునకు మంత్రో చ్చారణక్రమ మంతయు విపులముగ చెప్పవలయును. తదుపరి వాచ్యవాచక మంత్రార్థంబులు కొన్ని మాసము లుపదేశింపవలయును. తదుపరి యీశ్వర వర్ణన యోగాభ్యాస శిక్షణ గురువుచే పొంది శివాగ్ని సమీపంబున గురు సమీపంబున దీక్షాస్వీకార మంత్రములు పల్కుచు ప్రాణములు పోవునంత దనుక శివార్చన మాననని ప్రమాణముచేసి, శిరచ్ఛేదనము గావించినను, శివ జపము వీడనని బలుకుచు మహావ్రతుడై శివార్చన చేయక భుజింపనని దీక్షవహించి భోగములు వీడి నియమవంతుడై శివు నారాధింప వలెను. ఇట్టి వాడే శివదీక్షాపరుడు. గుర్వాజ్ఞను మీరక జపించు వాడే దీనికధికారి. తదుపరి గురువు శిషునకు భస్మమలంకరింపజేసి ధరించుటకు రుద్రాక్ష లొసంగవలెను. శిష్యుడది లగాయతు, శివలింగమును గాని విగ్రహమును గాని పూజింపుచు, ధ్యానింపుచు, జపించు చుండవలయును. శిష్యుడెన్నడు గుర్వా జ్ఞను మీరక గురువు ననుసరింపుచు, బహుమతులుగా ననేకధనంబు లొసం గుచు గురువును తృప్తిపరచు చుండవలెను. గురువు కడనెప్పుడు శిరము వంచి

వినయవిధేయతలతో నుండవలయును. మఠమందుగాని, దేవళమునందుగాని, గృహమందుగాని శంకరు నర్చించుచుండవలెను. భక్తిశ్రద్ధా ప్రజ్ఞల ననుసరించి తన శివవిద్య నంతను శిష్యునకుపదేశింప నచ్చును. దీక్ష పొందినవానికే గాని, ఈ శివదీక్షాభిధాన మితరులకు చెప్పరాదు. మనలకిది శివపదము నొందుటకు పరమసాధనమై యుండెను.

శివ మహాపురాణమునందలి వాయవీయసంహితయందుత్తరఖండమున
పదునాఱవ యధ్యాయము సంపూర్ణము

---

## పదునేడవ యధ్యాయము

### షడధ్వములు

తదుపరి గురువు శిష్యుని యోగ్యత తెలిసికొని సర్వబంధ విముక్తికై షడధ్వశుద్ధి చేయవలెను. కళలు. తత్త్వము. భువనము, వర్ణము, పదము, మంత్రము లనెడు. షడధ్వలు సంక్షేపముగ వర్ణించి శిష్యునకు జెప్పవలెను. నివృత్త్యాది పంచకళలు కళాధ్వములనబడును. ఇవియొక్కొకటి నైదువిధములగు కళలతో నొప్పుచున్నవి. శివుడు మొదలుకొని, భూమ్యంతరము వరకు, శివాధ్వలని చెప్పబడుచుండెను. ఇరువది యాఱు తత్త్వములతో గూడికొని శుద్ధాశుద్ధ మార్గములతో నొప్పుచుండెను. ఆధారాద్యున్మతాంతము వరకు భువనాధ్వ లనబడుచున్నవి. ఇవి భేదోప భేదంబులు లేకుండగ నరువది విధంబులుగ నొప్పుచుండెను. ఇందులో నేబది రుద్రరూపవర్ణాధ్వ లనబడుచున్నవి. షడధ్వలు ననేకరూప భేదంబులతో నున్నవి, పంచాక్షరి యనెడి పరమవిద్యతో సప్తకోటి మహామంత్రములు వ్యాప్తమై యుండెను. శివుడు తత్త్వాతీతుడై తత్త్వనాయకుడుగ గణింపబడుచుండెను. ఇతడు మంత్రనాయకుడు, కళాధ్వుడుగాన. సర్వకళలయందు వ్యాపించెను. ఇతడు సర్వత్ర వ్యాపించి వ్యాపకుడై యుండెను. తత్త్వము తెలియనివాడ ధ్వశోధనకు తగినవాడు కాడు. షడధ్వ లెఱుంగనివాడు వ్యాప్యవ్యాపకత్వముల నెఱుగుటకు సమర్థుడు

గాదు, ఇవియే షడధ్వరూపము లనబడును. యథావిధిగ తెలిసికొనవలెనన్న నధ్వశుద్ధికావలెను. పూర్వమువలె, రెండుహస్తముల ప్రమాణముగ, మండపము. కలశేలు. కుండలములు నిర్మించి శివార్చన శిష్యునిచే చేయింపవలెను. నాలుగుప్రస్థముల బియ్యమును. పాయసమువండి యందర్ధభాగము హోమము చేసి, మైదుకుంభములు తీసికొనివచ్చి నాల్గుదిక్కులయందు నాల్గు, మధ్య నొక కుంభమును స్థాపించి, మధ్యకుంభమున, నీశానుని పూర్వునతత్పురుషుని దక్షిణమున, నఘోరుని, యుత్తరంబున వామదేవుని, పశ్చిమంబున సద్యోజాతుని, నావాహనముచేసి రక్షాబంధముకట్టి కుంభముల నభిమంత్రించి ముద్రలు జూపించి పూర్వమువలె శివానలమున, ప్రస్థముబియ్యముతో వండిన పాయసములో సగముహోమముచేసి శేషించిన పాయసము శిష్యుడు భుజించుటకై యిచ్చి. మంత్రాంగతర్పణము చేయించి పూర్ణాహుతిగావించి, యగ్నిని ప్రజ్వలింపజేసి, ఓం హుంనమః శివాయఫట్ స్వాహాయని జెప్పి. యగ్నిని ప్రజ్వలింపజేసి, క్రమముగా సంగదీపనకర్మలకు మూడాహుతులనిచ్చి, యొక్కొకమంత్రముచే, అనగా సద్యోజాతాది మంత్రములచే పంచముఖీశ్వరుని ప్రజ్వలింపజేసి మూడుసూత్రములు విప్రకన్యకలచే తెప్పించి శిష్యునిశిఖను బంధించి యాసూత్రము, నంగుష్ఠమువరకు రప్పించి, మిగిలిన సూత్రము సుషుమ్నా నాడియని శిష్యునకు బోధించి శాంతముద్రలు జూపించి, మూలమంత్ర ముపదేశించి మూడాహూతులిచ్చి, తన సాన్నిధ్యమున కూర్చుండబెట్టుకొని, పుష్పముచే హృదయమునగొట్టి, పూర్వచైతన్యముప్రసాదించి, సూత్రము సూత్రముతో గలిపి యంగుష్ఠము మందున్న సూత్రము శిష్యుని దేహమునకు చుట్టబెట్టి, ఇవియేమూలపాశములని గ్రహింపజేసి, విషయేంద్రియములన్నియు దేహాది జనకంబులని భావింపజేసి. వ్యోమాది భూతలంబులన్నియు శాంత్యాతీతకళలని భావించి, అన్నిటికిని సూత్రధారుడు, పరమాత్ముడని గ్రహించి పూజింపవలెను. నమోంతముగా గాని. బీజసంపుటిచేగాని పూజింపవలెను. కాలముల శుద్ధినై, హోమముచేసి, శిష్యుని శిరమున గొట్టి యతని దేహమున సూత్రమును యథాప్రకారముగ నుంచి, శివమంత్రము జపించుచు మున్మారు హోమము గావించి, మంగళమునకై శివు నర్చించి యుత్తరముగ శిష్యుని కూర్చుండ బెట్టి దర్భలయందున్న చరువును, శిష్యున కొసంగ శిష్యుడు,

గురువున కొసంగ వలయును. ఇట్లు వారిరువురు హోమము పూర్తియైన తరి చరువును భుజించి శివుని స్మరింపుచు, రెండు మార్లాచమనము చేసి, పంచగవ్య ప్రాశన చేసి మరల తృతీయ మండపమున శిష్యుని పూర్వము వలె కూర్చుండబెట్టి తూర్పుగా గాని ఉత్తరముగా గాని దంతశుద్ధి చేయవలెను. పిమ్మట నాచమనముచేసి ప్రాంజలియై గురుసమ్ముఖమున గూర్చుని దోషపరిహారమునకై, వందగాని, యేబదిగాని, పాతికగాని, శివమంత్రములతో హోమములుచేసి, రాత్రి తూర్పు శిరస్కుడై శయనించి. సూత్రమును శిఖాగ్ర భాగమున బంధించి, వస్త్రము జుట్టుబెట్టి భస్మము, తిలలు, ఆవాలుతో బాహ్య బలులనీయవలెను. శిష్యుడు భోజనము చేయరాదు. గురువు భుజింపవలెను. శిష్యునకేదైన స్వప్నమువచ్చినచో గురువునకు తెల్పవలయును.

శివమహాపురాణము నందలి వాయవీయసంహితయందు ఉత్తరఖండమున
పదుహేడవ యధ్యాయము సంపూర్ణము.

---

## పదునెనిమిదవ యధ్యాయము

### షడధ్వ శుద్ధులు

మరల ప్రాతః కాలంబున లేచి స్నానాది కృత్యంబులు నెరవేర్చుకొని ప్రాంజలియై, శివమండప పార్శ్వమందు కూర్చుని పూజచేసి, మిగిలిన కృత్యములన్నియు పూర్వదినము వలె నొనర్చినతరి నేత్రబంధన పర్యంతము గల మండలములను గురువు జూపింపవలెను. తరువాత శిష్యుని దోసిలి నిండ పువ్వులు పోసి, పుష్పములు క్రిందకు విమ్మని శిష్యునకాదేశించి పూవులు లెక్కబెట్టి దాని ప్రకారము శిష్యునకు పేరుపెట్టవలెను. తరువాత పూర్వాసనమందు కూర్చుండబెట్టి యీశానుని పూజింపజేసి శివానలమునందు హోమము చేయించి శిష్యునకు గత రాత్రియందు స్వప్నము వచ్చినచో అనిష్టస్వప్నమైన తద్దోషనివారణకై వందసార్లుగాని యేబదిసార్లుగాని, మూలమంత్రముచే హోమము చేయించవలెను. తరువాత పూర్వమువలె సూత్రమును గట్టి హోమ

ముచేయించి, యాధారపూజ మొదలుకొని నివృత్తికళాదుల వరకుచెప్పి వాగీశ్వరీ పూజగావించి, హోమముచేసి, నివృత్తిరూపులగు వాగీశ్వరీ వాగీశ్వరులకు నమస్కరించి మండపమందు దేవుని పూజించి యాహుతిత్రయమిచ్చి, జన్మజన్మలకు నిట్టి గురువే కావలెననియు శివోపాసనయే చేయవలయునని ప్రార్థించుచుండ శిష్యుని సూత్రముచే గొట్టి యాత్మనివేదనము చేయింపవలెను. తదుపరి శిష్యుడు, సకలముద్రలు, మూలమంత్రము నాచార్యునిచే గ్రహింపవలెను యష్టదేవ యోనులతోను, పంచతిర్యగ్యోనులతోను, నొకమనుజయోనితోను. మొత్తము పదునాల్గు యోనులతోను గురువు శిష్యుని హృదయమందొక్కసారి ప్రవేశింపజేసి, శిష్యునిజ్ఞాన గర్భనివృత్తికై దేవునిప్రార్థించి జ్ఞానముకలిగింపజేసి, భోగనివృత్తికై యాజ్యహోమములుచేసి జాత్యాయుర్భోగ సంస్కార సిద్ధికై మున్మూరు హోమములు చేసి దేవుని ప్రార్థించి శిష్యుని భోక్తృత్వ విషయ మలంబుల బోగొట్టి పాశత్రయముల బోగొట్టి పాశంబులు ఛేదించి పరిశుద్ధుని జేసి, పూర్ణాహుతులు గావించి బ్రహ్మ పూజలు గావించి, మూడు హోమంబులు చేసి గురువునకు నమస్కరించి, బ్రహ్మస్వరూపుడవగు నో గురూత్తమా, తమ ప్రసాదముచే నేను శివపదమును పొందగల్గుచుంటిని దీనికి ప్రతిబంధకములు లేకుండ, కాపాడుమని ప్రార్థించి పూజించి శివపూజలు గావించి, హోమము చేసియుండ శిష్యుని ప్రవృత్తిమార్గము నుండి నివృత్తిమార్గమునకు మరలించి బంధవిముక్తిని జేసి, సూత్రవిసర్జన గావించి, శివపూజ చేసి యాహుతిత్రయము నిచ్చి, శిష్యుని హృదయమందు శివునిప్రవేశింపజేసి. పూర్వమువలె సకలకృత్యములు నెరవేర్చి, విష్ణుపూజలుగావించి, విసర్జనచేసి, వాగీశ్వరుని ధ్యానించి, హోమము చేసి, నీలరుద్రుని పూజించి విసర్జించి, శాంతికై విద్యాకళల నాహ్వానించి, వాగీశ్వరుని భావనచేసి, శివపూజలుచేసి, మనంబున ప్రవేశింపజేసి కొనవలెను. శాంత్యాది కళాతీతుని తెలిసికొని ఆత్మవ్యాపియగు వాగీశ్వరుని చింతింపుచు నాత్మారోపణము చేసికొని యాకాశ మండల స్వరూపుడగు పరమేశ్వరుని హృదయము నందర్చింపుచు, వాగీశ్వరుని పూజించి విసర్జింపవలెను, తదుపరి శిష్యుని శిరముపై ప్రోక్షించిశక్తి తత్వముల చింతింపవలెను. షడధ్వాతీతమైనదియు, కోటిసూర్య సమప్రభమైనదియు, నగు దేవీశక్తిని ధ్యానింపవలెను.

తదుపరి శుద్ధస్ఫటికనిర్మలుడగు శిష్యుని దరికిజేర్చి శివశాస్త్రానుసారముగ ప్రక్షాళనచేసి సూత్రముతో గూడ శిఖనుఛేదించి గోమయమ్ముతో కలిపి శిఖనుయగ్నియందు హోమముచేయవలెను. శిఖసూత్రములు ఛేదించిన కత్తిరిని కడిగి స్నానముచేసినతరి, శిష్యుని మండలాంతర్గతునిజేసి, సాష్టాంగ దండనమస్కారముల చేయించి, క్రియాశైవ కల శుద్ధికై మరలపూజలు చేయించి మూడాహుతులుచేసి, మెల్లిగాబలుకుచు హోమముచేసి మరలపూజించి, మనస్సులోనుచ్చరించుచు, మువ్వూరు హోమముచేసి యుమామహేశ్వరుని పూజించి ఓ భగవంతుడా నీప్రసాదముచే షడధ్వ శుద్ధుడనైతిని యవ్యక్తమైన ధ్యానమిమ్మని నాడీసంధాన పూర్వకముగ నిల్లు విజ్ఞాపించి భూతగ్రంధుల ఛేదించి, శివునియందు బుద్ధినిల్పి, శిష్యుని ముఖము పరిశోధించి, మంత్రముచే శరీరమంత్రయు దగ్ధము చేసి, మరల నమృతముచే తడుపుచు, విశుద్ధాధ్వమయమగు శరీరము నాత్మయందు నిలిపి, శాంత్యాతీత కళలను, శిష్యునిశిరముపై నిల్పి ముఖన్యాసము జెప్పిలోన ప్రవేశబెట్టి, విద్యను కంఠముందు ప్రవేశబెట్టి క్రమముగా జానుపర్యంతము ప్రవేశబెట్టి, శివాత్మకమైన మంత్రన్యాసముజెప్పి, దేవుని హృదయమందు నావాహనముచేసి పూజింపవలెను. తదుపరి గురువు శిష్యునకష్ట సిద్ధులు కల్గునట్లు చేయవలెను. తదుపరి త్రిరాహుతులిచ్చి, ఆపాదమస్తకము శిష్యునియందు శివుడు వ్యాపించినట్లు భావించినచో పరమాత్మజ్ఞానముకల్గును. అపుడతడు శక్తివంతుడై స్వతంత్రుడై విరాజిల్లగలడు. తదుపరి సద్యోజాతేత్యాది మంత్రములచే కలశయందున్నజల మభిషేకించి హృదయమందు పరమేశ్వరుని ధ్యానించి, అభిషేకించి శివుని శిష్యుడు బాహ్యపూజచేయవలెను. తదుపరి గురువుచే శైవవిద్య నొందవలెను. తదుపరి ఓంనమశ్శివాయ యని జపింపవలెను. తదుపరి శివపార్వతుల నావరణపూజలతో నర్చించి నాకునుకృతమిమ్మని శివుని ప్రార్థింపవలయును. పిమ్మట గురుశిష్యులిరువురు మండపమునకు నగ్నికి నుద్వాసన చెప్పవలయును. తదుపరి పూజార్హులగు సదస్యులను పూజించి విత్తానుసారముగ కపట రహితముగ చేయవలెను.

శివమహాపురాణము నందలి వాయవీయసంహితయందుత్తరఖండమున పద్దెనిమిదవ యధ్యాయము సంపూర్ణము.

---

# పందొమ్మిదవ యధ్యాయము

## సాధక సంస్కార మంత్రమాహాత్మ్యము

పూర్వమువలె మండలము నిర్మించి కుశలచే దేవుని స్థాపించి, హోమము చేసి, తలకు పాగ లేకుండ శిష్యుని కూర్చుండబెట్టి పూర్వమువలెనే శిష్యున కభిషేకించి, శివమంత్రముపదేశించి క్రమముగా విద్యనంతయు నుప దేశించి, పుష్పోదకములచే శిష్యుని హస్తములు తడుపుచు, శైవ విద్యనుప దేశించి, సర్వసిద్ధులు, నైహికాముష్మికంబులు సిద్ధించుగాక యని యాశీర్వ దించి యాపరమేశ్వరుని ప్రసాదముచే నీకీమంత్రముపదేశించితి నని బలుకుచు దేవునర్చించి శివాజ్ఞనొంది, శివయోగసాధనమును శిష్యునకుపదేశింప వల యును. శిష్యుడు గురువు చెప్పినదంతయు గ్రహించి గురుసాన్నిధ్యముననే యభ్యసింపవలెను. మూలమంత్రమును సాధించుటయే, పురశ్చరణ యందురు. గురువు యెదుట జపాదికములు చేయుటయుండ పురశ్చరణ మనబడును. మోక్షేచ్ఛ గలవాడధికముగా పురశ్చరణలు చేయనవసరము లేదు. ఇది యుభయ లోకములకు శుభంబు లొసంగును, శుభదిన, శుభనక్షత్ర, శుభ యోగములందు దంతధావనము చేసికొని స్నానమాచరించి నిత్యకృత్య ములు దీర్చి, గంధమాల్యాను లేపనుడై యలంకరించుకొని యుష్ణీషము, నుత్తరీయము ధరించి శుక్లవస్త్రము ధరించి గృహమందు గాని, దేవాలయ మునందు గాని, మనోహర ప్రదేశమునందు గాని సుఖాసనాసీనుడై శివ శాస్త్ర విధిగా దేవదేవుని పూజించి పాయసము నివేదనచేసి నమస్కరించి యనుజ్ఞ వడసి, కోటిగాని యర్థకోటిగాని, పాతికలక్షలుగాని, ఇరువది లక్షలుగాని పదిలక్షలుగాని శివ పంచాక్షరిని జపించి పాయసాన్నమును గాని, లవణ యుక్తమైనది గాని, లేనిదిగాని భుజించి సదా యహింసకుడై క్షమావం తుడై, శాంతుడై, దాంతుడై యుండవలెను. పై చెప్పినవి, లభింపనిచో ఫల మూలంబులు భుజింపవచ్చును. ఫలమూలంబులే యుత్తమంబులు. లేక చెరువు గాని సత్తుపిండిగాని భుజింపవచ్చును. శాకమూలఫలంబులు, క్షీర దధి ఘృతం బులు, శివ మంత్రముచే నభిమంత్రించి నివేదనచేసి భుజింపవచ్చును. సాధన పురశ్చరణలకే యిట్టినియమంబులు గాని దీక్ష లేనిచో పై జెప్పిన నిబంధనలు

పాటింప నవసరములేదు. మౌనముతో భుజించుట యుత్తమంబు. గృహమందు స్నాతుడైనచో 800 పర్యాయములు శివ మంత్రముచే జలమభిమంత్రించి స్నానముచేసి పరిశుద్ధుడు కావలయును. నదీ నదముల కడ తన శక్తి కొలది నభిమంత్రించి స్నానమొనరింపవలయును. తదుపరి నిత్యము ఏడుగాని ఐదుగాని, మూడుగాని, హోమములు చేయవలయును. ఇట్లాచరించిన వారలకు, దుర్లభమైన దేదియులేదు. ఇట్టి వారికి పరలోకములందు పొందలేని వేదియు నుండవు. భోజనము చేయకుండగ సహస్ర పర్యాయములు శివ మంత్రము జపించి ప్రోక్షణచేసి భుజించినచో లభ్యము కాని దేదియులేదు. ఇట్లాచరించినచో నిహమందు సర్వ సుఖములు సర్వ ధనంబులు, సర్వ సౌఖ్యంబులు నొంది పరమున ముక్తి నొందగలడు. నిత్యము స్నానముగాని భస్మ స్నానముగాని చేసి జపింపవలయును. శుచియై శిఖాయజ్ఞోప వీతముల ధరించి భస్మ రుద్రాక్షలు ధరించి దర్భాంగుళీయకము ధరించి పంచాక్షరీ విద్యను ధరించి పంచాక్షరీ విద్యను జపింపవలెను.

శివ మహాపురాణము నందలి వాయువీయసంహిత యందు ఉత్తరఖండమున పందొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువదవ యధ్యాయము

## శివదీక్షా స్వీకారము.

ఇట్లుసంస్కరింపడిన శిష్యునిచే పాశుపతవ్రతముచేయించి శ్రేష్ఠుడైనచో నభిషేకముచేయింపవలెను లేనిచో పూర్వమువలె, మండప నిర్మాణముచేసి, పరమేశ్వరుని పూజించి పంచ కలశలు స్థాపించి, నివృత్తికలశనుముందు స్థాపించి పశ్చిమంబున ప్రతిష్ఠాఘటమును స్థాపించి, దక్షిణంబున, విద్యాఘటమును స్థాపించి, శాంతిఘటము నుత్తరంబున స్థాపించి, మధ్యను పరాఘటమును స్థాపించి, దానికి రక్షాబంధనము గావించి, ధేనుముద్ర జూపించి, పూర్ణాంతము

వరకు ఘటముల నభిమంత్రించి హోమము చేసి, తలపాగా లేకుండ శిష్యుని మండపమందు ప్రవేశ పెట్టి, పూర్వమువలె తర్పణాదులు, పూర్తి చేయించి, దేవుని పూజించి యతనియనుజ్ఞ వడసి శిష్యున కభిషేకించి యాసనాధిష్ఠితుని జేసి, పంచకళాన్యాసము జెప్పి, మంత్రబంధనము చేసి శిష్యుని శివునకర్పించి యతని యనుజ్ఞ వడసి, తదుపరి యాపంచఘటోదకములచే శివునభిషేకించి, శిష్యుని శిరముపై హస్తముంచి, శిష్యుడు శివభావము గనట్లు తలచి, మండపమందు శివునారాధించి యష్టోత్తరశతంబు హోమము చేసి, పూర్ణాహుతినిచ్చి, మరల శివుని పూజించి, సాష్టాంగదండ నమస్కారము చేసి ఓ దేవా నీయనుగ్రహముచే, నేను గురువునైతిని. నా శిష్యుననుగ్రహించి యితనికి దివ్యజ్ఞానమిమ్మని, భగవంతునకు శిష్యునితో నమస్కరించి, శివుని, శివాగమ పుస్తకమును పూజించి శివాజ్ఞనొంది, శివజ్ఞాన పుస్తకమును శిష్యునకొసంగవలెను. తదుపరి శిష్యుని హస్తముతో హస్తములు కలిపి, శిష్యుని శిరమందు చేయునిడి, విద్యాసనంబుపై నాసీనుం జేసి, శివశాస్త్రలక్షణంబులు శిష్యునికున్నవో లేవోయని, పరీక్షించి, సంస్కరించి శివశాస్త్రోపదేశమును జేసి, పవిత్రత, సహనశీలత, దయ, నిస్పృహ, యనిందయు నాత్మముచే నలవరచవలయును. తదుపరి శివ కుండలమును, శివుని, సదస్యులను పూజింపవలయును, ఇట్లు గురుశిష్యులాచరింపవలెను. లేనిచో మంత్రసంస్కారముల చేతనే యిపన్నియు నడిపింపవలయును. మనుజులకీ శాంభవీ విద్య దుర్లభము శాక్తేయులు, సంస్కారులు, శివశాస్త్ర పారంగతులు దీని నాచరింతురు.

శివ మహాపురాణము నదంలి వాయవీయ సంహితయందుత్తరఖండమున
ఇరువదవ అధ్యాయము సంపూర్ణము.

# ఇరువది యొకటవ యధ్యాయము

## నిత్యనైమిత్తిక కర్మలు

శివశాస్త్రమందలి నిత్యకర్మ విధులన్నియు, జెప్పుమని శ్రీకృష్ణుడడుగ నుపమన్యుడిట్లు చెప్పదొడంగెను. ప్రాతఃకాలమున లేచి, యుమామహేశ్వరుల ధ్యానించి, గృహకార్యములాలోచించుకొని, బహిఃప్రదేశమునకేగి దంతధావనాదికృత్యములు దీర్చుకొని, చతుర్దశి, అష్టమి, పూర్ణిమ, సంక్రాంతి సంధాతిథి, నవమి, మొదలగు పర్వదినములయందు, కాష్ఠములతో దంతధావన చేయరాదు. జలముచే పన్నెండు పర్యాయములు గండూష మొనరించుకొని, విధిపూర్వకముగనాచమించి, వారుణమంత్రస్నానమాచరించి, నదులయందుగాని, తటాకములయందుగాని, గృహమందుగాని స్నానముచేసి బహిర్మలరహితమునకై, గోమయమృత్తికా స్నానములుచేసి. వస్త్రము లుతుకుకొని, శుభ్రవస్త్రములు ధరించి (సుగంధాదులతో) దంతధావనముచేసి సుగంధాదులతో స్నానముచేయవలెను. బ్రహ్మచారులకు, యతీశ్వరులకు, విధవలకు, సుగంధాదు లవసరములేదు. సవ్యయజ్ఞోపవీతుడై, శిఖనుబంధించి, (ముడివేసికొని స్నాతుడై. జలమందు, మూడుమండలము లుగావించి, యథాశక్తిగ శివమంత్రమును జపించి, జలమునుండి లేచి శివమంత్రముచే నాచమించి, తనకు తానభిషేకించుకొని యీయభిషేకము గోశృంగము చేతగాని, పలాశదళముచే గాని, కమలపత్రముచేగాని, లేనిచో తనపాణితలముచేగాని పదిహేను పర్యాయములు మంత్రస్నానమాచరించి, వారుణ మంత్రస్నానముచేసి, లేనిచో, నుద్యానవనమందుగాని గృహమందుగాని, జలకలశను గొందుమార్లభిమంత్రించి, యభిషేకముచేసికొనవలెను. ఇందుకశక్తుడైనచో, తడివస్త్రముచే, నాపాదతలమస్తకముతుడుచుకొని, యాగ్నేయమంత్రముచేగాని శివమంత్రముచేగాని స్నానముచేయవలెను. శివమంత్రము శ్రేష్ఠము. స్వసూక్తమంత్రములచే స్నానమాచరించి, బ్రహ్మయజ్ఞాది పితృతర్పణములుచేయవలెను. తదుపరి సూర్యమండలాంతర్గతుడగు నీశ్వరుని ధ్యానించి యర్ఘ్యాదులిచ్చి, తనసూత్రప్రకారముగ హస్తములు కడుగుకొని, యంగన్యాస కరన్యాసములచే, శరీరమంతయు శుద్ధిచేసికొని, హస్తమున సుగంధోదకములుంచుకొని కుశలచే నాజల

మును శిరమునమూలమంత్రముచే ప్రోక్షించుకొని, ఆపోహిష్ఠామమంత్రములచే శిరమునప్రోక్షించుకొని శేషజలము నాఘ్రాణింపుచు దేవుని భావనచేసి, యంతర్బాహ్యములంబులు, నశించెనని భావింపుచు, తదుపరి దేవఋషి, తర్పణంబులిడి, హస్తమాత్ర ప్రమాణంబుగ, రక్తతోయంబుచే మండలముగ గావించి, వృత్తాకారముగ రక్తచూర్ణముచే నలంకరించి, యావరణ సహితము సూర్యునిపూజించి, సుఖసిద్ధికై, ఖఖోల్కాయ, యను మంత్రముచే పూజించి, మరల మండలము గావించి యంగపూజలు చేసి మగధదేశపు తూకముప్రకారమొక ప్రస్థము స్వర్ణముతో, అనగా 128 తులముల బంగారముతో కలశను స్థాపించి, రక్తచందనతోయముతో, నాకలశను పూరించి. రక్తపుష్పములు, రక్తతిలలు రక్తాక్షతలు, కుశలు, నాఘటమునందు వేసి, దూర్వాంబులు, గోక్షీరంబులు, ఉత్తరేణి, పంచగవ్యములు, లేనిచో నుదకంబులైననుపోసి జానువులు భువిపై మోపి నమస్కరించి, యాపాత్రను శిరమున ధరించి, శివునకర్ఘ్యమిచ్చి, కరశోధన పూర్వకముగ, కరన్యాసము జెప్పి, ఈశానాది పంచమంత్రములచే, భస్మముసర్వాంగములకు ధరించి, శుభ్రవస్త్రధారుడై, రెండుమార్లాచమించి, తడివస్త్రము ప్రక్కనుంచుకొని, మరల రెండుమార్లాచమించి, శివుని స్మరించి, మరల త్రిపుండ్రములు ధరించి, సుగంధాంబువులచే భస్మముతడిపి, గుండ్రముగాగాని, చితురశ్రమముగాగాని, బిందువుగాగాని, యర్ధచంద్రాకారముగ గాని, లలాటమున ధరింపవలెను. మిగిలిన యంగములకు, త్రిపుండ్రనియమంబులులేవు, రుద్రాక్షలు శిరంబున, కంఠమున, శ్రవణములకు, ధరింపవలెను. సువర్ణవర్ణముగల రుద్రాక్షలు ధరించుట శుభప్రదము. ఇది బ్రాహ్మణులు వినా, నితరులు ధరింపరాదు. క్షత్రియులకు పసుపు వైశ్యులకు ఎరుపు, శూద్రులకు నలుపు వర్ణముగల రుద్రాక్షలు ధరింపవలెను. ఇట్లు లభింపనిచో నేవైనను ధరింపవచ్చును. దుష్టములైనవి, బీటలువారినవి ముక్కలువిరిగినవి ధరింపరాదు. క్రిందవర్ణంబులు ధరించెడి రుద్రాక్షల నగ్రవర్ణములవారు ధరింపవచ్చునుగాని, యగ్రవర్ణంబులు ధరించెడి రుద్రాక్షలు, క్రింది వర్ణములవారు ధరింపరాదు. శుచివంతుడై, పూజాదులయందుగాని, త్రిసంధ్యలయందుగాని, సదాగాని ధరింపవలెను. శ్వేతవర్ణరుద్రాక్షలు బ్రాహ్మణులు ధరింపవలెను. ఇట్లు ధరించి శుచి యాసనాసీనుడై పూర్వాభిముఖుండైగాని, యుత్తరాభి

ముఖుడై గాని యుమామహేశ్వరుల ధ్యానించి, గురువునకు నమస్కరించి, శివ నామాష్టకము జపించి,

శ్లో॥ శివోమహేశ్వరశ్చైవ.
రుద్రోవిష్ణుః పితామహః.
సంసారవైద్యస్సర్వజ్ఞః.
పరమాత్మేతిచాష్టకం.

ఇవియె యష్టనామంబులు. లేనిచో నొక్క శివమంత్రనే, పదకొండు గాని, యంతకుమించిగాని జపింపవలెను. వ్యాధిశాంతికై పైజెప్పిన శివ నామాష్టకము జపించి చేతులు కడిగికొని, చందనచర్చితకరుడై కరశోధన పూర్వకముగ కరన్యాసముజెప్పుకొనవలెను.

శివ మహాపురాణమందలి వాయవీయసంహితయం దుత్తరఖండమున
ఇరువదియొకటవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువదిరెండవ యధ్యాయము

### శివశాస్త్రోక్త కర్మలు

ఉత్పత్తిస్థితిలయము లనెడి న్యాసములు చెప్పెదను. ఉత్పత్తిన్యాసము, బ్రహ్మచారులకు, స్థితిన్యాసము గృహస్థులకు లయన్యాసము సన్యాసులకు చెప్పబడెను. దీనినే సంహృతిన్యాసమందురు. వానప్రస్థులకుగూడ నిదియే న్యాసము. భర్తృహీనలకు, కుటుంబీకులకు స్థితిన్యాసమే చెప్పుకొనవలెను. అంగుష్ఠము మొదలుకొని కనిష్ఠాంతమువరకు స్థితిన్యాసమందురు. దక్షిణాంగుష్ఠము ప్రారంభించి, వామాంగుష్ఠాంతమువరకు చెప్పెడి న్యాసము, ఉత్పత్తిన్యాస మందురు. దీనికివిపరీతముగ జెప్పుటయే సంహృతిన్యాస మందురు. ఓం మొదలుకొని నకారాదిన్యాసము చెప్పవలెను. నివృత్త్యాదిపంచకళలు, పంచభూతములన బడును. ఈపంచభూతములు సధష్ఠానదేవతలతో న్యాసించియుండును. మరియు నివి, హృత్కంఠతాళుభ్రూమధ్య బ్రహ్మరంధ్రములవరకు నాశ్రయించి యుండును. ఆయాబీజములయందా యాబీజములు భావింపవలయును. ఈగంధులవి

శుద్ధికై పంచాక్షరిని జపింపవలయును. గుణసంఖ్యానుసారముగ ప్రాణ వాయువు నరికట్టవలెను. అస్త్రముద్రలచే భూతగ్రంధులను భేదింపవలయును. ప్రాణవాయువులచే సుషుమ్నా నాడిని లేవతీయవలెను. ఈనాడిని బ్రహ్మ తేజము వరకు వ్యాపింపజేసి, శివ తేజము నందైక్యము చేయవలెను. వాయువుచే శరీరమును శోషింపజేసి, కాలాగ్నిచే దహింపజేసి వాయువుచే నుపరిభాగమం దున్న కళలనుపసంహరింపజేసి దగ్ధమైన యీ దేహము నమృతకళలచే తడిపి, యధాస్థానమం దుంచి భస్మీభూతమైన వన్నియు మరల జీవింపజేయవలెను. బ్రహ్మరంధ్రమార్గముగ శివాగ్ని దీపకళికతనలో ప్రవేశించినట్లు భావనచేయ వలెను. తదుపరి నాపరమేశ్వరుడు హృత్పుండరీక మందున్నట్లు భావించి ధ్యానింపవలెను. తదుపరి విద్యామయామృత జలముచే శరీరమంతయు తడుప వలయును. తదుపరి కరశోధనము చేసి కరన్యాసము జెప్పుకొని దేహన్యాసము జెప్పి, మహాముద్ర జూపింపవలెను. తదుపరి శివమంత్రముచే నంగన్యాసము జెప్పుకొనవలెను. తదుపరి హస్తపాదాది సంధులయందు వర్ణన్యాసము జెప్పు కొనవలెను. ఇట్లు మంత్రమునకు తగిన యంగన్యాసకర న్యాసములు జెప్పుకొని యష్టదిగ్బంధన మొనరించి లేనిచో మూర్ధాది పంచన్యాసములు జెప్పి యీ విధంబున దేహాత్మశోధనజేసి శివభావము నొందిశివుని పూజింపవలెను. అవ కాశమున్నచో విస్తీర్ణకళాన్యాసము జెప్పుకొనవలెను. మాతృన్యాసము బ్రహ్మన్యాసము ప్రణవన్యాసము హంసన్యాసము పంచాక్షరాత్మకమైన శివ న్యాసము చెప్పవలెను. పూజాదికముల యందునిది యెదుగాని యితరన్యాస ములుగాని చెప్పవచ్చును.

అకారము శిరమునందున, ఆకారములలాటమందున, ఇం ఈంలు నేత్రద్వ యమందున, ఉం. ఊంలు. శ్రవణద్వయమందున. ఋఋూలు కపోలద్వయం బున, ఌౡంలు నాసాపుటద్వయంబున ఏం, ఐం, లు ఓష్ఠద్వయంబుల ఓం ఔం, లు, దంతపుటద్వయంబున, అం జిహ్వాయందున, అః లోదవడలయం దున, కవర్గము దక్షిణహస్తమున, దానివ్రేళ్లసంధులయందున, చవర్గమువా మహస్తమున దానివ్రేళ్లసంధులయందున, టవర్గ, తవర్గముల నుభయపాద ములయందున, వాటి వ్రేళ్లసంధులయందున, పఫాయి, పార్శ్వములయందున, బభాలు పృష్ఠనాభులయందున, మకారము హృదయమందున, త్వక్చక్షుశ్రో

శ్రోత్రజిహ్వా ఘ్రాణంబులైదింటికి॥ య, ర, ల, వ, అనునక్షరంబులు చెప్పవలెను. యకారము మొదలుకొని, సకారమువరకుగల సప్తాక్షరములకు, సప్తధాతువులు చెప్పవలెను. హకారము హృదయమందున, క్షకారము భ్రూమధ్యమందున, నీఏబదియక్షరవిన్యాసముల ద్వారా పరమేశ్వరునిలోన ప్రవేశింపజేయవలెను. రసము, రుధిరము, మాంసము, మేధస్సు, క్రొవ్వు, అస్థి, రేతస్సు అనునవి, సప్తధాతువులందురు. తదుపరి, పంచబ్రహ్మ కళాన్యాసముజెప్పి, తదుపరిక్రమముగ, కరన్యాసము జెప్పి, శిరోవదన హృదయ గుహ్యపాదములయందు పంచబ్రహ్మకళాన్యాసముజెప్పి, యూర్ధ్వముఖము మొదలుకొని, పంచముఖేశ్వరునిధ్యానించి, ఈశానునకుకళలు, తత్పురుషునకు నాల్గుకళలు, అఘోరునకు, హృదయము, కంఠము, భుజములు, నాభి, కుక్షి, పృష్ఠము, వక్షము, పాదహస్తములయందు నష్టకళలుగాభావింపవలెను. వామదేవునకు, పాయువు, మేఢ్రము, యూరువులు, జానువులు, జంఘములు, పిరుదులు, కటి, పార్శ్వములు, యివన్నియు కలసి త్రయోదశకళలుగా జెప్పవలెను. సద్యోజాతునకు, పాదములురెండు, హస్తములురెండు, బాహువులు రెండు, నాశిక, శిరము, వీటిని యష్టకళలుగా భావింపవలెను. ఇవ్విధంబుగ ముప్పదియెనిమిది, కళాన్యాసముల జెప్పవలెను. తదుపరి బుద్ధిమంతుడు ప్రణవన్యాసము జెప్పుకొనవలెను. తదుపరి బాహువులు, మోచేతులు, మణిబంధములు, పార్శ్వములు, ఉదరము, ఊరువులు జానువులు, పాదములు, పృష్ఠము, వీటియందు ప్రణవాది న్యాసములజెప్పవలెను. తదుపరి శివశాస్త్రమునందుజెప్పబడిన హంసన్యాసము జెప్పవలెను. హంసబీజమును విభజించిన నేత్రఘ్రాణంబులు, మరలవిభజించి బాహు, నేత్ర, లలాట, ఘ్రాణంబులు కక్షలు, స్కంధములు, పార్శ్వంబులు స్తనములు, కంఠపార్శ్వంబులు, పంచాక్షరంబులవిడతీసి, హంసన్యాసములుజెప్పవలెను. శివుడు గాకుండ శివునిపూజింపరాదు గాన, నీశివన్యాసము జెప్పకొని, తాను శివుడై, శివునర్చింపవలెను పశుభావము వీడి నేనే శివుడ నని, శైవకర్మలు చేయవలెను. కర్మయజ్ఞము, తపోయజ్ఞము, జపయజ్ఞము, ధ్యానయజ్ఞము, జ్ఞానయజ్ఞము లనునవి. పంచయజ్ఞము లనబడును. కొందరు, కర్మ యజ్ఞములు, కురికొందరు తపో యజ్ఞములు, కొందరు జపయజ్ఞములు, కొందరు ధ్యానయజ్ఞములు కొందరు జ్ఞాన యజ్ఞములు చేయుచుందురు.

వీటిలో నొకటికన్న నొకటి, శ్రేష్ఠము అన్నిటికన్న జ్ఞాన యజ్ఞమే శ్రేష్ఠము, క్రమముగాని వికామయజ్ఞములు, నిష్కామయజ్ఞములు నని రెండు విధములు, కామయజ్ఞములు చేయువారాఫల భోగముల ననుభవించి మరల జన్మించు చుందురు. నిష్కామ యజ్ఞము లాచరించు వారు. రుద్రసన్నిధినీ సకల భోగముల ననుభవించి ముక్తు లగుదురు. పై నాల్గు యజ్ఞములు చేయు వార లూర్ధ్వ లోకముల సకల సౌఖ్యము లొంది మరల భువి మానవులై జన్మింతురు. జ్ఞానయజ్ఞము చేయువాడు మాత్రము మరల జన్మింపక శివ సాయుజ్యము నొందగలడు. సకామయజ్ఞరతులు కర్మబంధనములకు గురియగు దురు. ఈపంచయజ్ఞములచే జ్ఞానమునుసంపాదింపవలెను. ధ్యానజ్ఞానములు న్నచో, భవార్ణవముదాటగలడు. ధ్యానయజ్ఞమాచరింపుము, హింసాదిదోష వివర్జితుడై, విశుద్ధచిత్తసాధకుడై, యున్నవాడు పరమందపవర్గ ఫలమునొంద గలడు. బాహ్యకర్మలు చేయువారు చక్రవర్తులగుదురేగాని మోక్షలక్ష్మిని పొందలేరు. ధ్యానయోగులు సూక్ష్మశరీరధారులై ప్రత్యక్షై శ్వర్యములనొం దగలరు. మృత్కాష్ఠ శిలావిగ్రహాములచే పూజించెడువారికన్న ధ్యానయ జ్ఞరతులకే ఫలమధికము. ఆంతరంగిక జ్ఞానములేనివారలు విగ్రహపూజలాచరించి క్రమముగా, జ్ఞానవంతులు కావలయును. హృదయాంతర్గతుడగు, పరమేశ్వరుని రింగి యర్చింపక బాహ్యపూజలుచేయువారలు, హస్తమందున్న యమృతము నుజారవిడిచి మోచేయినాకినట్లుండును. జ్ఞానముచే ధ్యానము, ధ్యానముచే జ్ఞానము కల్గును. ఈరెండింటిచే ముక్తిలభించును గాన ధ్యానము ప్రధానము, ధ్యానశాంతమైనబ్రహ్మరంధ్రమున, శిరంబున, లలాటంబున, భ్రూమధ్యంబున, నాసాగ్రమందున, కంఠమందున హృదయమందున, నాభి యందున, భగవంతుడు శాశ్వతముగనుండునుగాన శ్రద్ధతో దీనినెరుంగవలయును. ఈపరమేశ్వరుని లింగవిగ్రహాములచె బాహ్యపూజలుగాని, హృత్పద్మమందుగాని, యగ్నియందు గాని, తండులములయందుగాని, భక్తితో, విత్తానుసారంబుగ పూజింపవలెను. ఆంతరంగిక పూజలు చేయలేనివారు బహిః పూజ లొనర్పవలెను.

శివ మహాపురాణమునందలి వాయవీయసంహితయందు త్తరఖండమున
ఇరువదిరెండవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువది మూడవ యధ్యాయము

## లఘుపూజా విధానము

శంకరుడు పార్వతికి చెప్పినవిధానంబుగ పూజావిధాన మంతయు జెప్పె దవినుము. దీనికంగ భూతమైన యాగ్ని కార్యము, సంతరంగముగాని, బాహ్యముగాని చేసిగాని చేయగాని, పూజాద్రవ్యములు ప్రత్యక్షముగాని, మానసికముగాని కల్పించి, దక్షిణదశను వినాయకుని ధ్యానించి, యథావిధిగ నర్చించి, యశంబునకై, ఉత్తరంబున, నందీశ్వరుని ధ్యానించి, మనసా యాసనము కల్పించి యారాధించి, సింహాసన మందుగాని, పద్మాసన మందుగాని శివపార్వతులస్థాపించి యిట్లు ధ్యానింపవలెను.

శ్లో॥ సర్వలక్షణ సంపన్నం సర్వావయవ శోభనం
సర్వాతిశయ సంయుక్తం సర్వాభరణభూషితం.

2. రక్తస్వపాణి చరణంకుంద చంద్రస్మితాననం.
శుద్ధస్ఫటిక సంకాశంప్పుల్ల పద్మత్రిలోచనం.

3. చతుర్భుజ ముదారాంగంచారు చంద్రకళాధరం.
వరదా భయహస్తంచ, మృగటంకధరంహరం.

4. భుజంగహార వలయంచారు నీలగళాంతరం.
సర్వోపమాన రహితంసానగం సపరిచ్ఛదం.

అనిధ్యానించి యీశ్వర వామభాగ మందైన పరమేశ్వరిని యిట్లుధ్యానింపవలెను.

శ్లో॥ ప్రఫుల్లోత్పల పత్రాభాం విస్తీర్ణాయతలోచనాం.
పూర్ణచంద్రా భవదనాం నీలకుంచిత మూర్ధజాం.

నీలోత్పలదళ ప్రఖ్యాం చంద్రార్థ కృత శేఖరాం అతివృత్తఘనోత్తుంగ స్నిగ్ధ పీనప యోధరాం తనుమధ్యాంపృథు శ్రోణింపీతసూక్ష్మవరాంబ రాంసర్వాభరణసంపన్నాం లలాటతిలకోజ్వలాం విచిత్రపుష్ప సంకీర్ణ కేశ పాశోపశోభితాం

సర్వతోనుగుణాకారాం కించిల్లజ్జానతాననాం హేమారవిందం విలసద్ధ ధానం దక్షిణేకరే, దండవచ్చా పరంహస్తే న్య స్యాసీనాంమహాసనే, పాశవిచ్ఛేదికాం సాక్షాత్సచ్చిదానంద రూపిణీం. ఇట్లు సింహాసనాధిష్ఠతులగు శివపార్వతులను ధ్యానించి, సర్వోపచార భావపుష్పంబులు సమర్పించి, లేక బాహ్య పూజలో నర్చి; నాభియందగ్ని యునట్లుగ భావించి, సమిధాజ్య, హోమంబులు గావింపవలెను, శుద్ధదీపశిఖాకృతియగు శివుని, భ్రూమధ్యమున ధ్యానింపవలెను, ఇవ్విధంబున స్వతంత్రుడగు యోగిధ్యానింపవలెను, లింగమందుగాని తండులములయందుగాని, యగ్నియందుగాని, శివునారాధింపవలెను.

శివ మహాపురాణము నందలి వాయవీయసంహితయం దుత్తరఖండమున ఇరువదిమూడవ యధ్యాయము సంపూర్ణము.

---

# ఇరువది నాలుగవ యధ్యాయము

## ఘనపూజా విధానము

పరిశుద్ధికై పూజాద్రవ్యములన్నియు మూలమంత్రముచే ప్రోక్షించి, విఘ్న నివారణకై, అస్త్రాయఫట్ అని చెప్పి, పవిత్రతకై చతుర్దిక్కులయందు, మంత్రోదకములు చల్లి, సర్వపాత్రలు శుద్ధిచేసికొని, ప్రోక్షణీయ, అర్ఘ్య, పాద్య, ఆచమనీయములకు నాల్గు పాత్రల నటనుంచి పరిశుద్ధ సుగంధ తోయములు పోసి. రత్న రజిత హేమ గంధపుష్పాక్షతలును, ఫలపల్లవ దర్భలు ననేక పుణ్యద్రవ్యంబులును కలశలయం దిడవలెను. స్నానోదకములయందు విశేషముగ సుగంధద్రవ్యము లుండవలెను. అందుకు సుమసమ్మిత మగు శీతలోదకము లుంచవలెను. వట్టివేళ్లు చందనము, పాద్యకలశ యందుంచవలెను. జాజీఫలము, కంకోల కర్పూరము బహుమూలము. తమాలము నివి చూర్ణము చేసి, యాచమనీయ పాత్రయం దుంచవలెను. కుశలు, నక్షతలు, యవలు. వ్రీహిలు, తిలలు, ఘృతము, ఆవాలు, భస్మము, నర్ఘ్యపాత్రయం దుంచవలెను. కుశలు, పుష్పములు వ్రీహిధాన్యము, బహుమూలము (శతా

వరి) తమాలము, భస్మము. ప్రోక్షణీపాత్రయందుంచవలెను. సర్వత్రమంత్ర విన్యాసముజెప్పి, బాహ్యాకవచము ధరించి, అస్త్రముచే రక్షించుకొని, ధేను ముద్రను జూపించి, ప్రోక్షణీ పాత్రయందలి జలముచే పూజాద్రవ్యములపై ప్రోక్షించి, మూలమాత్రముచే శోధించి, ప్రోక్షణపాత్ర లేకున్న నర్ఘ్య పాత్రమైనను యుండవలయును. దక్షిణద్వారమున వినాయకుని పూజించి భక్ష్యభోజ్యంబు లిడి, యుత్తరభాగంబున, చామీకరాచల ప్రఖ్యుడు సర్వా భరణ భూషితుడు, బాలేందుముకుటుడు, సౌమ్యుడు, త్రినేత్రుడు, చతు ర్భుజుడు, త్రిశూల మృగటంక ధరుడు, తీక్ష్ణ వేత్రధరుడు, చంద్రబింబా భవదనుడు, వానరముఖుడు, నంతఃరాధిపుడు, మరుత్సుతాసహితుడునగు నందీశ్వరుని పూజింపవలెను. ఈమరుత్సుత యగు నందీశ్వరుని భార్య పార్వతి పాదంబు లొత్తుచుండును. ఇట్టి నందీశ్వరుని భార్యతో నర్చించి తదుపరి పరమేశ్వరిని యంతర్భవనమున ప్రవేశించి, శివలింగ నిర్మాల్యములను తీసి కశిరి శిరమున ధరించి పుష్పములు హస్తమునం దిడికొని శక్తికొలది జపించి యాపుష్పములచే నీశాన్యమందున్న చండీశ్వరుని పూజంపవలెను. తదుపరి యాసనము కల్పించి శ్యామవర్ణంబుగల చండికను పూజించవలెను. ఆధార శక్తియు శ్యామలగాత్రయునగు చండికను భువిపైనుండి పూజించి తదుపరి, యనంతస్వరూపుడు, కుండలాకారుడు, ధీనుడు, పంచఫణీశ్వరుడు, నంబుర లేలిహానుడు, కుండలి స్వరూపుడగు నాదిశేషుని పూజించి, నతుడై, భద్రాసనుడు, ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యములను నకుంఠితచతుష్పదంబులు గలవాడును, నాగ్నేయాది చతుర్దిక్కులయందు. శ్వేత, రక్త, పీత, శ్యామ వర్ణముఖంబులు గల్గి, నలువైపులయందు ధర్మాది చతుష్టయంబులు గల్గి, చక్రవర్తులు ధరించెడి శ్రేష్ఠమణులచే ప్రకాశింప బడుచున్నట్లు భావించి, పరిశుద్ధ వస్త్రమ్ముపైన కప్పుకొని శ్వేతవిమల పద్మాసనాసీనుడై యున్నట్లును, ఆపద్మంబునకు నణిమాద్యష్ట సిద్ధులనెడి, యష్టపత్రంబులు గల్గి, రుద్రవామాది శకులనెడి కేసరంబులు గల్గి, వైరాగ్య మనెడి కర్ణిక గల్గి, శివజ్ఞానమనెడి నాళంబు గల్గి శివధర్మంబులనెడి కందంబు గల్గి (మూలము) కర్ణికాంతరమందు త్రిమండలంబులనెడి, త్రితత్వములనెడు సుఖాసనాసీనుడై యుండెడువానినే, విచిత్రాస్తరణమందురు. శుద్ధవిద్యాసముజ్వలమైన యిట్టి యాసనమును,

కల్పింపవలెను. తదుపరి ఆవాహనము, స్థాపనము, సన్నిరోధము, నిరీక్షణము, నమస్కారములు చేసి, ముద్రలు ప్రదర్శింపవలెను, పిమ్మట నర్ఘ్యక పాద్యాచమనంబులు, గంధపుష్పభూషణ, ధూపదీపనైవేద్య, తాంబూల నీరాజన, మంత్రపుష్పంబు లొసంగవలెను. లేనిచో మూర్తిని కల్పించి, మూలమంత్రముచేగాని, వేదమంత్రములచేగాని, పరమకారణుడగు శివుని దేవితో నాహ్వానించి, ఇట్లు ధ్యానింపవలెను.

శ్లో॥ శుద్ధస్ఫటిక సంకాశం దేవం నిశ్చల మక్షరం.
కారణం సర్వలోకానాం సర్వలోకమయం పరం
అంతర్బహిః స్థితం వ్యాప్యహ్యణోరణుం మహాత్తరం
భక్తానామప్రయత్నేనదృశ్య మీశ్వరమవ్యయం
బ్రహ్మేంద్ర విష్ణురుద్రాది దేవానామ ప్యగోచరం
వేదచారంచ విద్వద్భిరగోచరమితి శ్రుతం
ఆదిమధ్యాంత రహితం భేషజం భవ రోగిణాం ॥

అని ఇట్లు ధ్యానించి లమిత్యాది పుంచ పూజలు గావించి స్నానకాలమందు జయజయ మంగళధ్వనులతో, పంచగవ్యములచేతను, ఘృతక్షీర గధమధువులచేతను, మూలఫలరసంబులచేతను, తిలలు, ఆవాలు, సక్తుపిండి మాషచూర్ణంబులతోను నలుగుబెట్టి ఉష్ణోదకములచే స్నానము చేయింపవలెను. తదుపరి విలేపనగంధము లన్నియు, బిల్వపత్రములచే తుడిచి శుభ్రము చేసి, రాజోపచారంబులచే స్నానము చేయించి, సుగంధామలక చూర్ణము, పసుపుచే, మరల నలుగుబెట్టి, మరల, కుశపుష్పగంధోదకములచే స్నానము చేయించి, తదుపరి హిరణ్యారత్నతోయంబులచే మంత్రశుద్ధిగ స్నానము చేయింపవలెను. పీటిలో లభించిన వస్తువులతోడనే స్నానము చేయించి లేనిదానికి వినాయిపడక కలశముతోగాని, శంఖముతోగాని, పుష్పములతోగాని స్నానము చేయింపవలెను. పవమాన సూక్తములచేగాని, రుద్రసూక్తముచేగాని యిలా సూక్తముచేగాని త్వరితసూక్తముచే గాని, లింగసూక్తముచేగాని, అధర్వశిరసుచేగాని, ఋగ్వేదముచేగాని, సామవేదముచేగాని, శైవసూత్రములచేగాని, సద్యోజాతాదిబ్రహ్మసూత్రములచేగాని, ప్రణ

వముతోగాని, శివుని స్థాపింపవలెను. పార్వతీ పరమేశ్వరులకు సాటియైనవా రెవరును వేరుగాన ప్రయత్నపూర్వకముగ వారల స్నానము చేయించి యర్చింపవలెను. ముందుగా శివుని స్నానము చేయించి, తదుపరి దేవిని స్నానము చేయింపవలెను. ఇది శివశాసనము. అర్ధనారీశ్వరుడైనచో స్నానములకు పృథక్త్వపరంబు లవసరములేదు. జయమంగళ శబ్దములతో నభిషేకము చేసి, శుభ్రవస్త్రములతో తుడిచి వస్త్రయజ్ఞోపవీతంబులిచ్చి, పాద్యాచమనగంధ పుష్పభూషణాదు లిచ్చి. ధూపదీపనైవేద్యంబు లొసంగి, ముఖశోధనకై పానీయమిచ్చి, తదుపరి యాచమన మొసంగి, ముఖశోధనకై వస్త్రమిచ్చి, సర్వరత్నాలంకృతం బగు మకుటం బలంకరించి, వింజామరలచే వీచుచు, ఛత్రమొసంగి దర్పణము జూపించి, సర్వమంగళ నిస్వనములతో, నీరాజన మొసంగి, జయజయధ్వానములతో గీతనృత్యములు గావింపుచు స్వర్ణపాత్రయందుగాని, తామ్రపాత్రయందుగాని, మృణ్మయపాత్రయందు గాని, కమలబీజములు, దధియుక్తతలనుంచి, నలువైపులను, మధ్యను దీపంబు లిడి పంచముఖేశ్వరునిగ ధ్యానించి నవశక్తులను పూజించి, శివకవచముచే శరీరమును రక్షించుకొని, ధేనుముద్రను జూపించి, కలశనుపైకెత్తి పంచదీపము లను జూపించి కలశకు నలువైపులను, మధ్యను దీపములుంచి, మూల మంత్రముచే పాత్రకు, మున్మూడు ప్రదక్షిణములు చేసి యీశ్వరుని శిరంబుపై. సుగంధిలమైనదధచే నర్ఘ్యమిచ్చి, పుష్పాంజలు లిచ్చి, యుపచా రంబులుచేసి, పునరాచన మిచ్చి, తదుపరి దధ్యాచమనం బిచ్చి, సుగంధయుత మగు నైవతాంబూలంబు లిచ్చి, ప్రోక్షణీయ పాత్రోదకములచే ప్రోక్షించి నృత్యగానంబులు చేయించి శివుని ధ్యానించి, జపించి ప్రదక్షిణ నమస్కార ములుచేసి స్తుతించి, యాత్మను సమర్పించి, వినయపూర్వకముగ తన కార్యమును నివేదించి, యర్ఘ్యపుష్పాంజలులిచ్చి, ముద్రలు జూపించి, క్షమార్ప ణనువేడి, శివుని తన యందారోపణము జేసికొని, యుద్వాసన జెప్పి, ముఖ శుద్ధిపై పాద్యమిచ్చి, భావపునస్సరముగ పుష్పాంజలు లిచ్చి, యంతటి సంకట మందైనను, శివపూజ చేయక భుజింపనని శపథము చేయవలెను. శివపూజ చేయక భుజించినచో, దొంగతిండి తిన్నవాడగును. ప్రమాదవశమున భుజించినచో, మరునాడు స్నానముచేసి, ద్విగుణముగ శివార్చనచేసి, యుపవ

శించి, పదివేలు శివమంత్రము జపించి, బ్రహ్మచర్యవ్రతుడై, మరునాడు మరల, శక్త్యనుసారముగ, సువర్ణపుష్పములచే శివుని పూజించి నైవేద్యము చేసి భుజింపవలెను.

శివమహాపురాణము నందలి వాయవీయ సంహితయందు త్తరఖండమున ఇరువది నాలుగవ అధ్యాయము సంపూర్ణము.

---

## ఇరువది ఐదవ యధ్యాయము

### శివపూజా ఫలము

ఉపమన్యుడు కృష్ణుని గాంచి ఓ కృష్ణా ! ఈ పూజలలో లోపములు సంక్షేపముగ జెప్పెదను వినుము. ముందుగా దీపము వెలిగించిగాని నీరాజన మిచ్చిగాని యావరణ పూజచేయవలెను. తదుపరి యష్టదిక్కులయందు నష్ట దిక్పాలకుల నర్చింప వలెను. తదుపరి చతుర్ముఖములను చతుర్దిక్కుల యం దున నూర్ధ్వమున పంచమ ముఖమును పూజింప వలెను. పూర్వము చెప్పిన ప్రకార మావరణ దేవతలందరిని పూజించి తదుపరి యుమామహేశ్వరులను పూజింప వలెను. దీనినే గర్భావరణ పూజయందురు. యోగధ్యాన జప హోమ పూజాదులు బాహ్యాభ్యంతరములయందు చేయవచ్చును. షడ్విధంబు లగు హవిస్సు, ముద్గాన్నము, పాయసము, గుడముతో గూడిన పెరుగు తేనె మొదలగు నవియు ననేక కూరలు పచ్చళ్లు పిండివంటలు, యపూపంబులు, స్వాదుఫలంబులు నైవేద్యముచేసి రక్తచందనము, సుగంధ పుష్పంబులతో గూడిన శీతల పానీయంబుల నొసంగి ఏలాలవంగ కర్పూరములతో గూడిన తాంబూల మొసంగి, స్వర్ణ వర్ణము, గౌరవర్ణంబుగల శైల చూర్ణము నొసం గవలెను. శ్వేతచూర్ణము, నిషిద్ధము, కర్పూరము, కంకోలము, చామంతి, చందనము, కస్తూరి, కుంకుమ, పవిత్ర సువాసనలు గల పుష్పంబు లొసంగ వలెను. సువాసనలేని పుష్పంబులు, నుగ్రవాసనలుగల పుష్పంబులు దూషిత

పుష్పంబులు శిఖల పుష్పంబులు మృదువస్త్రంబు లొసంగి విద్యుత్ప్రభలు గల యాభరణంబు లలంకరించి, యగరుధూపదీపంబులు వేసి, పువ్వులు చల్లి, పన్నీరు చల్లవలయును. చందనాగరు కర్పూరకాష్ఠ గుగ్గులుచూర్ణంబులు ధూపములకు శ్రేష్ఠము. ఘృతము, తేనె ప్రసిద్ధ ధూపములని చెప్పబడెను. కమ్మని సువాసన గల కపిలఘృతధూపము, కర్పూరమిశ్రిత ధూపము శ్రేష్ఠము. గోసంబంధమగు పంచామృతములచే నభిషేకము చేయుట శ్రేష్టము. కపిల గో ఘృత క్షీరంబులచే స్నానపానాదులు చేయుట ఈశ్వరునకు ప్రీతికరము గజదంతాసనము గాని రత్నఖచితసువర్ణాసనము గాని వేసి మెత్తని పరుపు వేసి సుఖశయ్యనేర్పరచి యందు నూతను హంసతూలికాశయ్యల నాసీనుం జేసి నిద్రపుచ్చవలయును. సాగర గాములగు నదీజలంబులు, నదజలంబులు తీసికొనివచ్చి యాచల్లని నీటిని వడపోసి, భగవంతుని స్నానపానాదుల కుపయోగించుట శ్రేష్ఠము. నవరత్నరచితమైనవియు, హేమదంతము గూడినవియు, శశినిభమైనవియు, ముక్తాదామ విభూషితమైనదియు, మనోహరమైనదియు నగు ఛత్ర మొసంగవలెను. చామీకర విభూషితమైనవియు, హంసాకారమైనవియు, సూక్ష్మమైనవియు, స్వచ్ఛమైనవియు, రత్నదండోప శోభితమైనవియు, నగు రెండు చామరంబులచే వీవ వలయును. పరిశుభ్రమగు దర్పణమును జూపింప వలయును. అదుపరి మంచిగంధము పూసి, హేమరత్న మాలాంకృతుని జేసి, హంసకుందేందు సన్నిభ మగు శంఖముచే గంభీరారావము చేయవలెను. తదుపరి మృదు మధుర వాద్యంబులు ప్రయోగించి సువర్ణ మౌక్తికహారంబులు ధరింపజేసి, భేరీ మృదంగము రజపటహ వాద్యంబులు చేయింపవలెను. ఇంకను పత్ర పుష్ప సహితానేక సువర్ణ పాత్రలనట నుంచవలెను.

శివునకు శిల్పశాస్త్ర ప్రకారంబుగ నాలయము నిర్మింపవలెను. అది మహారాజ భవనంబువలె నుండవలయును, ఎత్తైన ప్రాకారంబులు, పర్వతశృంగంబులవంటి గోపురంబులు రత్నసన్నిభమగు హేమద్వారకవాటంబులు తప్త జాంబూనదమయమగు శత, రత్నస్థంభంబులు, ముక్తావిద్రుమతోరణంబులు, సువర్ణవికారకుంభంబులు రాజనివాసయోగ్యంబులగు ప్రాసాదంబులు నంబర చుంబిత శిఖరంబులు పంకితాలంకృతంబులగు సభామండపంబులు నత్యం

తాలంకృతంబులగు నంతరావరణంబులు, నృత్యగీత విశారదులగు స్త్రీలును, వేణువీణా విశారదులగు, పురుషులును, రక్షకులచే రక్షింపబడు గజవాజి యూథంబులును, ననేకపుష్పవాటికలును సరోవరంబులు, ననేకదిగుడు బావులు, వేదవేదాంత, తత్వజ్ఞులు, శివశాస్త్రవిశారదులు శివాశ్రయరతులగు భక్తులు, శివశాస్త్రోక్తలక్షణులు శాంతులు, స్మితముఖులు, మనోహరులు, సదాచారపరాయణులు, నుగామమహేశ్వరభక్తులు, విప్రులతో నొప్పుచుండెడి, మంచిప్రదేశమున నదీతీరమందుగాని పర్వతమందుగాని, పుణ్యారణ్యమందు గాని యోగ్యమగు గృహమందుగాని శిలతోగాని, గజదంతములతోగాని, కర్రతోగాని, ఇటుకలతోగాని శివాలయమును నిర్మింపవలయును. ధనవంతు డైనను, దరిద్రుడైనను శక్తివంచన లేకుండ న్యాయార్జితధనముచే భక్తితో నాలయము నిర్మింపవలయును. ఈ ప్రభువు భావవశ్యుడు గాన న్యాయార్జిత ధనముతో నెట్లు నిర్మించినను దోషము లేదు. న్యాయార్జితధనమైనను భక్తి లేక పూజించినచో ఫల ముండదు. దరిద్రుడై స్వల్పధనముతో కొంచెము పూజించిన నధికఫలము లభించును. ఎంతధనము వెచ్చించినను భక్తిలేని పూజలు వ్యర్థము గాన భక్తితో విత్తానుసారముగ పూజింపవలయును. భక్తి లేనిదే సర్వస్వమిచ్చినను ఫలములేదు. భక్తిలేని తపోదానయజ్ఞంబులన్నియు నిష్ఫలంబులు. భక్తికల్గి చేసినచో ముక్తి తప్పదు. ఓకృష్ణా! అతిగూఢములైన సంగతులన్నియు జెప్పితిని. ఎట్టివాడైనను శివభక్తిచే ముక్తి నొందగలడు. సందేహము లేదు.

శివమంత్రజప ధ్యానహోమయజ్ఞ తపోదానాధ్యయనము లన్నియు, శివభక్తికై చేయవలయును. భక్తిహీనుడెన్నడు ముక్తుడుగాడు. భక్తిభావ మున్నచో నివన్నియు చేయకున్నను ముక్తుడగును ఎన్నిచాంద్రాయణ వ్రతములు చేసినను ప్రాజాపత్యశతంబులు చేసినను యెన్నిమాసోపవాసంబులున్నను శివభక్తిలేనిదే ప్రయోజనముండదు. కొందరభక్తులు స్వల్పభోగంబులకై గిరికందరములనుండి తపంబుచేయుదురు. అట్టివారికిముక్తిలేదు. భక్తితోనే స్వల్పముగ భజించినను ముక్తికల్గును యోగులు సాత్వికులై ముక్తికై తపంబు చేయుచుందురు. వీరికి ముక్తి లభించును. సాత్వికకర్మలచే యోగు లగుదురు.

రాజసులు రజఃకర్మలు చేయుచుందురు. తమోగుణ ప్రధానులు యసుర కృత్యంబు లాచరింతురు. ఇట్టివారు మోహకములైన ప్రాకృతాదులను తప మొనరింతురు. సాత్విక రాజస, తామసులెవ్వరైనను భక్తితో పూజించినచో శుభంబులు చేకూరును, భవార్ణవమును భక్తినౌకతో దాటవచ్చును. భక్తియున్న రజోతమంబులేమియు చేయజాలవు అంత్యజుడైనను నధముడైనను పతితుడైనను, మూర్ఖుడైనను, శివ భక్తుడైనచో, సురాసురులచే గూడ పూజింపబడును. సామాన్యులమాట జెప్పనేల గాన సర్వప్రయత్నములచే భక్తితో శివు నర్చింపవలయును. భక్తిలేనిచో ఫలముండదు. వేదవాదులు నిశ్చయించిన రహస్య విషయములను జెప్పెదను వినుము.

శివ మహాపురాణమందలి వాయువీయసంహితయందుత్తరఖండమున
ఇరువదిఐదవ అధ్యాయము సంపూర్ణము

## ఇరవై ఆరవ యధ్యాయము

## సాంగోపాంగ పూజావిధానము

బ్రహ్మహత్యా పాతకుడైనను, సురాపానరతుడైనను, చోరుడైనను, గురుతల్పగుడైనను, మాతృహంతకుడైనను, పితృహంతకుడైనను, వీరహాతకుడైనను, భ్రూణహంతకుడైనను, ద్వాదశవర్షంబులు శివునిపూజించినచో సర్వపాపవిముక్తుడగును. [illegible]తుడైనను శివార్చనచే సర్వపాపనిర్ముక్తుడగును. ఎంతయోగియైనను, ఎంతయుభక్తియుక్తుడైనను, జలపానముచే తపంబుచేసినవాడైనను, భక్తిలేనిచో నిష్ఫలము, ఏపూజలుచేసినను చేయకున్నను, శివపంచాక్షరిని జపించినచో శివలోకము ప్రాప్తించును. కోటియజ్ఞంబులు, దానంబులు, వ్రతంబులుచేసినను, శివార్చనతో సాటిరావు. ఎట్టిబద్ధుడైన, శివపంచాక్షరిచే బంధవిముక్తు డగును. ఎట్టివాడైనను, నమకచమకములచే శివునర్చించినచో

ముక్తుడగును, పతితుడైనను, మూర్ఖుడైనను, శివార్చనచే పరిశుద్ధుడగును, ఓం నమ శ్శివాయ యను షడక్షరములచే గాని, నమకముచేగాని, శివార్చనచేయ వలయును. గురువులభించినను లభింపకున్నను, శివభక్తికల్గి శివమంత్రము జపిం పవచ్చును. గురూపదిష్ట మంత్రము శ్రేష్ఠము. మూలమంత్రముచేగాని, నమక ముచేగాని, నిత్యము త్రికాలంబుల, శివు నర్చింపవలయును. శివార్చనచేయు వారు, మహేశ్వరీతుల్యులు, శివపరిజ్ఞానములేక శివార్చనచేసినచో మాఁజన్మ లకుగాని, ముక్తిలభింపదు, దుర్లభమైన మనుజ, జన్మలభించినను, మూఢులై శివార్చనచేయనిచో సంసారదుఃఖ సాగరమున భ్రమించుచుందురు. మోక్షము సాధింపలేని జన్మ నిష్ఫలము. శివార్చనచేసిన వాని జన్మము సఫల మగును. వారలేనకోత్తములు. భగవద్భక్తి పరులు, భవప్రణత చేతస్కులు, భవసంస్మ రణోద్యుక్తులు, నెన్నడు దుఃఖభాగులుకారు. మనోహర భవనంబులు, నాభర ణంబులు స్త్రీలు, ధనము మొదలగునవి శివపూజా ఫలంబుచేతనే సంప్రాప్తమ గును. శివపూజా ధురంధరులకు కోరినవన్నియు లభించుటయేగాక నింద్రపదవి కూడ లభించును. శివార్చనచే సకలసౌభాగ్యంబులు! శరీరకాంతి, సురూపము, సత్యము, త్యాగము, దయార్ద్రభావము, శౌర్యము, జగద్విఖ్యాతియు లభిం చును. కానసర్వము త్యజించి యేకాగ్రచిత్తుడై శివునర్చింప వలయును. శుభ ములు కోరువారు శివపూజలు మానరు. త్వరితముగ జీవితము ముగియును. యౌవనము నశించును. వ్యాధులు సంప్రాప్తించును. కాన మరణము రాకుండ గనే జరాపీడితుడుగాకముందే యింద్రియ వైకల్యము పొందకమునుపే శంకరు నర్చింపవలయును. ముల్లోకములయందు శివార్చనకు మించిన కర్మము లేదు. ద్వారమునకు తెరలువేసి, ద్వారపూజలు చేసి, పరివారముల కోబలు లిచ్చి, నిత్యోత్సవంబులు చేయించి పూజింపవలెను. హవిస్సు నివేదనచేయవలెను. ఇది స్వయముగాచేయుటగాని, యితరులచే చేయించుటగాని, చేయవలెను. అనేక వాద్యఘోషంబులు సల్పుచు ధూపదీపనైవేద్యములిడి యుత్తరముఖుడై భూతబలులిచ్చి వేదనాన్నమును చండీశ్వరునకు సమర్పింప వలయును. తదుపరి హోమముచే పూజపూర్తి చేసి, మంత్రము జపింపవలెను. నిత్యోత్సవములు విధిగా చేయవలెను. విపులతైజసపాత్రయందరుణ పద్మము నుంచి, పాశు పతమంత్రముచే పశుపతిని స్థాపించి, యావాహనము చేసి పూజింపవలెను.

మంగళగీతికలతో నృత్యగీత వాద్యంబులతో పూజలు సల్పుచు దీపధ్వజంబుల నలంకరించి ప్రదక్షిణత్రయము చేసి, పీఠమునకు మున్నూరు ప్రదక్షిణము చేసి, కృతాంజలిపుటుడై, యస్త్రముద్రను జూపించి, మరల ప్రదక్షిణముచేసి యష్టపుష్పంబులు సమర్పించి పూజను సమర్పణ చేయవలెను.

శివమహాపురాణము లందలి వాయువీయసంహిత ఉత్తరఖండమున
ఇరువదిఆఱవ అధ్యాయము సంపూర్ణము

---

# ఇరువదియేడవ యధ్యాయము

## అగ్ని కార్యవిధులు

అగ్నికార్య విధులను జెప్పెద వినుము. స్థండిలముగాని వేదికగాని నిర్మింప వలెను. ఈవేదిక లోహముచేగాని నూతనమృణ్మయ పాత్రచేగాని, నర్మింప వచ్చును. ఈ కుండము రెండు మూరలుగ గాని, మూరెడుగాని యుండవలెను. ఇది చతురముగగాని, వర్తులముగ గాని యుండి నాలుగంగుళములుగాని, రెండంగుళములుగాని ఎత్తు ఉండవలెను. వేదిక లోతు 24 అంగుళములుగాని, 12 అంగుళములుగాని యుండవలయును- దీనిని నాభిభాగ మందురు. వేదిక మధ్య నష్టదళ పద్మము నర్మింపవలెను. వేదికయంచు మూడంగుళములు గాని, రెండంగుళములుగాని ఒక యంగుళముగానియుండ వలయును. ఇదంతయు మృదువుగ జేసి యలంకరింపవలెను. లోపలిభాగ మున మట్టిగాని, ఇసుకగాని పోయవలెను. వేదకను గోమయముచే నలికి ముగ్గులిడి, ప్రోక్షించి కుండము చుట్టూ దర్భలుగాని, పుష్పములుగాని పరిచి, పూజాహోమములకు కావలసిన ద్రవ్యములు సమకూర్చుకొని, ప్రోక్షణి పాత్రలు శుభ్రముచేసియుంచి, మణిసభవాగ్నిగాని (చకుముకిరాయి) యశ్వత్థ కాష్టములచే మధించిన యగ్నిగాని, శ్రోత్రియాగ్నిగాని, యితర గృహాగ్నులుగాని తెచ్చి యగ్ని బీజములు బల్కి కుండలమందగ్నిని స్థాపించి నలు

వైపుల ప్రజ్వలింపజేసి బింబాకారమగు యగ్ని అందు ప్రవేశించి నట్లు భావించి యన్వాధాన పురస్సరముగ నాజ్య సంస్కారముచేసి, తమసూక్త ప్రకారముగ నగ్నిని స్థాపించి మూలమంత్రముచే దక్షిణపార్శ్వమున శివుని స్థాపించి యర్చించి మంత్రన్యాసము జెప్పి ధేనుముద్రను జూపించి సృక్సృవంబులచే హోమము చేయవలెను. ఇనుముతోగాని, సీసముతోగాని సృక్సృవంబులు పనికిరావు. కాష్ఠముతోగాని, సఛిద్రములు గాని, మోదుగు పత్రంబులతో గాని హోమము చేయవలెను. ముందుగా పత్రములను దర్భలచే ప్రోక్షించి యగ్ని తప్తముచేసి వాటితో హోమము చేయవలెను. స్వసూక్త ప్రకారము నగ్నిసంస్కార సిద్ధికై యష్ట బీజములచే హోమము చేయవలెను. తదుపరి సప్త జిహ్వాలకు నొక్కొకదానికి భుం. స్తుం. బ్రుం. శ్రుం. పుం. డుం. ద్రుం. అనెడు సప్త బీజముల నుచ్చరింపుచు 49 పర్యాయములు హోమము గావింప వలెను. వీటిలో త్రిశిఖ యనెడు మధ్యమ జిహ్వా బహు రూపములతో నొప్పియుండెను. ఆగ్నేయ జిహ్వా రక్త వర్ణంబుగను, నైరుతి దిశను కృష్ణ వర్ణంబుగను, మిగిలిన జిహ్వాలు సుప్రభలతో విరాజిల్లుచుండును. వాయవ్య దిశయందున్న మరుజిహ్వా యతి చంచలముగ నుండును. ఇది తన పేరునకు తగినట్లుండును. ప్రతి మంత్రాంతమునందు స్వాహా యని పలుకవలెను. భ్రుం. ఊం. త్రిశిఖాయై స్వాహా. రుం. వహ్నయే స్వాహాయని జెప్పి మధ్యజిహ్వాకు మూడాహుతు లీయవలెను. ఘృతముచేగాని సమిధలచేగాని పరిషేచనము చేయవలెను. దీనినే శివాగ్ని యందురు. అంధర్ధనారీశ్వరున కాసనము కల్పించి యజింప వలయును. అగ్ని ప్రజ్వరిల్లిన పిమ్మట సమిద్ధోమము చేయవలెను. జ్వాలలేనిదే హోమము చేయరాదు. మోదుగ జమ్మి మొదలగు పవిత్రములగు సమిధలచే హోమము చేయవలెను. సమిధలు వంకరలేక 12 అంగుళములు పొడవుగల్గి యుండవలెను. పై చర్మముండవలెను. రంధ్రము లుండ రాదు. లేనిచో దశాంగుళములు గాని, జానెడుగాని యుండవలయును. దేవగల సమిధలు, దూర్వాదళసద్మశము లైవవి. చతురంగుళంబు లైనను సరిపోవును. తనంతటతాను శుష్కించిన వృక్షసమిధలు నిషిద్ధములు, అక్షప్రమాణము గల యన్నమును, నేతితో హోమము చేయవలెను. మిరియములు, ఆవాలు, పేలాలు, యవలు, తిలలు, భక్ష్య భోజ్య లేహ్యంబులు చోష్యంబులు నేతితో

తడిపి, పది పర్యాయములు గాని ఐదు పర్యాయములు గాని, మూడు పర్యాయములుగాని, హోమము చేయవలెను. లేనిచో నొక్క యాహుతియైనను చేయవలెను. ఘృతముచేగాని సమిధలచేగాని హస్తమునకు యెదురుగా గాని ప్రక్కగా గాని హోమము చేయవలెను. ఏ పవిత్ర ద్రవ్యముతో నైనను హోమము చేయవచ్చును. ప్రాయశ్చిత్తమునకై మువ్మారు హోమము చేయవలెను. లోప నివారణకై స్రువమునందు పుష్పములుంచి యధోముఖుడై హోమము చేయవలెను. తదుపరి యవలు, కుశలు, నంజలి యందు ధరించి, వౌషట్, యనిపలుకుచు ధారలుగా హోమము గావింపవలయును. పూర్ణాహుతిచేయుచు పూర్వమువలె పరిషేచనము చేయవలెను. తదుపరి దేవుని ధ్యానించి, యగ్ని రక్షించుకొనవలెను. లేనిచో నగ్ని నాత్మారోపణముచేసి కొనవలెను. లేనిచో శివ శాస్త్రప్రకారముగ నగ్నిని నాభియందుంచవలెను. అనగా నాభియందున్నట్లు భావింపవలెను. వాగీశ్వరీ గర్భసంభూత మగు యగ్నిని విధి పూర్వకముగ నర్చింపవలెను. మరల నన్వాధానము చేసి, పరిధులుచుట్టును బరచి, రెండేసి పాత్రలుంచి ఇటుకలుబరిచి శివునర్చించి ప్రోక్షణీయపాత్రలను కడిగి, యుదకముచే ప్రోక్షించి ప్రణీతపాత్ర నీశాన్యమందుంచి జలముచే పూరించి యాజ్యసంస్కారము చేసి స్రుక్స్రువంబులు కడిగి, గర్భాదానము, పుంసవనము, సీమంతోన్న యనంబులు వేరువేరుగా జేసి అగ్నినిమథించి త్రిపాదంబులు, సప్తహస్తంబులు చతుశ్శృంగంబులు, ద్విశీర్షంబులు, మధుపింగ త్రినేత్రంబులు, గలిగి, కపర్దేందు శేఖరుడు, రక్తలేపనుడు, రక్తాంబరుడు, మాల్యభూషణ భూషితుడు, సర్వలక్షణ సంపన్నుడు, సయజ్ఞోపవీతుడు, త్రిమేఖలుడు, శక్తిమంతుడు, దక్షిణస్రుక్స్రువ ధారుడు, సితరహస్తములచే తోమరతాలవృంత ఘృతపాత్రలు ధరించినవాడు నగునగ్నిని ధ్యానించి, జాతకర్మచేయవలెను, ఇదంతయు, నాభిచ్ఛేదనమైనతరి, పురుషుడు పదిరోజులు గడిచిన పిమ్మట జాతకర్మ చేయవలెను. ఇదంతయు రుచియనెడి శివాగ్నియందాహుతి పురస్సరముగ చేయవలెను. చౌలోపనయ నాదులయిన పిమ్మట తలితండ్రులను వీడి, యప్తోర్యామము వరకు స్వీయముగ నగ్నిహోత్రము చేసి కొనవచ్చును. తదుపరి నాజ్యధారలచే స్విష్టకృత్తను హోమముచేసి; రంఅనెడు బీజముచే పరిషేచనచేసి, బ్రహ్మవిష్ణు రుద్రులను,

లోకపాలురను, అస్త్రముల సహితముగ పూజింపవలయును. వీరందరికి ధూప దీపంబులర్పించి యగ్ని నిప్రజ్వలింప జేయవలెను. పిమ్మటను మామహేశ్వరుల కగ్నియందాసనము కల్పించి పూజించి పూర్ణాహుతులిచ్చి, వహ్నికర్మ శివార్పణముగ చేయవలెను. ఇట్టి శివాగ్ని భస్మముపయోగించుట శ్రేష్ఠము. లేనిచో వైవాహిక భస్మముగాని, కపిలగోమయము భూమిపై పడకుండ తెచ్చి పిడుకలుచేసి భస్మముచేసినదిగాని భస్మమును ధరింపవచ్చును. సుగంధమిళిత మగు విభూదిని ధరింపవలెను. ఒకవేళ గోమయము క్రిందపడినచో అడుగుభాగము, పైభాగము తీసివేసి, మధ్యభాగ ముపయోగింపవచ్చును. గోమయము నిలువయున్నది, గట్టిగానున్నది, దుర్గంధమైనది పనికిరాదు. ఏరోజువేసిన గోమయ మారోజున నేపిడుకలు చేయవలెను. గోమయము పుటములు తయారుచేసి శివమంత్రముచే శివాగ్నియందు వేసి, మధ్యయందున్న తెల్లటి విభూతిని గ్రహించి, రజితపాత్రయందుగాని, దారుపాత్రయందుగాని, మృణ్మయపాత్ర యందుగాని, శిలాపాత్రయందుగాని, ఈభస్మమును ధనమువలె భద్రపరచి, మారేడుఫలము నందుపోసి, నిత్యము నుపయోగింపవలెను. అపరిశుద్ధ ప్రదేశ మందీ విభూదినుంచరాదు. నీచుని హస్తమందున్న విభూదిని ధరింపరాదు. విభూదిని దాటరాదు. దీనినిమంత్రయుతముగ ధరింపవలెను. అగ్ని నుద్వాసింపకమునుపే హోమభస్మమును గ్రహింపవలెను. లేనిచోనది చండీశ్వరాధీనమగును, అగ్నికార్యమైన తరి, స్వసూత్రాను సారముగ బలులీయవలెను. తదుపరి పీఠమును శుభ్రపరచి, విద్యాకోశమును ప్రతిష్ఠించి క్రమముగా పుష్పములచే పూజింపవలెను. విద్యాపీఠమున కెదురుగా గురువునకై మండలము నిర్మించి పుష్పములతో గురుపూజచేసి పూజ్యులగు వారినర్చించి క్షుధార్తులకన్నమిడి తానుభుజింపవలెను. ఆత్మశుద్ధికై దేవతా నివేదనాన్నము భుజింపవలెను. లోభముచే చండీశ్వరునకిచ్చి నదిమాత్రము భుజింపరాదు. భోజనమైన తరినాచమించి శివునిధ్యానించి శివమంత్రమును మనసాజపింపవలెను. రాత్రిరెండవ యామమున పార్వతీపరమేశ్వరులకై పుష్పశయ్యనమర్చి వారలపూజించి భక్ష్యభోజ్యంబులిడి, పుష్పమాలాలంకృతులజేసి పవళింపు సేవ జేసి తాను వారిపాద సన్నిధిని జితేంద్రియుడై శయనింపవలెను. గృహస్థుడైనచో భార్యతో వారిపాదసన్నిధిని, జితేంద్రియుడై శయనించి ప్రత్యూషకాలంబున లేచి,

గణసహితులగు నుమామహేశ్వరులకు మనసానమస్కరించి నిత్యకృత్యములు దీర్చుకొని, శంఖవాద్యాది ఘోషంబులచే దేవదేవేరులను మేల్కొలిపి పూర్వోక్తవిధానంబుగ పూజింపవలెను.

శివ మహాపురాణము నందలి వాయవీయసంహితయం దుత్తరఖండమున ఇరువదిఏడవ అధ్యాయము సంపూర్ణము

---

## ఇరువదియెనిమిదవ యధ్యాయము

### నిత్యనైమిత్తిక విధులు

నిత్యనైమిత్తిక విధులను గూర్చి చెప్పెద వినుము. ప్రతి మాసముల యందు పక్షములయందు నష్టమీ చతుర్దశులయందు ప్రతిపర్వములయందు, రెండయనములయందు విషువత్పుణ్యకాలములయందు గ్రహణములయందు శక్తికొలది విశేషముగ పూజింప వలెను. ప్రతిమాస శివరాత్రియందున బ్రహ్మకూర్చచే (కుశలచే) శివునకభిషేకము చేసి నియతవ్రతుడై యభిషేక జలము పానముచేసి యుపవసించి శివార్చన చేసినచో బ్రహ్మహత్యాది మహా పాపములు వెంటనే నశించును. అట్టి పాపములుపోవుట కింతకన్న వేరగు నుపాయంబులేదు. బ్రహ్మకూర్చోదక పానముచే బ్రహ్మహత్యా దోషము నశించును. పుష్యమాస పుష్యమీ నక్షత్రమున శివునకు నీరాజన మిచ్చుట విశేషఫలము నిచ్చును. మాఘమాస మఖానక్షత్రంబున ఘృతము, కంబళము నర్పించుట విశేషఫలము. ఫాల్గుణమాస యుత్తర నక్షత్రంబున శివునకు మహోత్సవము చేయింప వలెను. చైత్ర పౌర్ణమీ చిత్తానక్షత్రంబున డోలోత్సవము చేయింప వలెను. వైశాఖమాస విశాఖానక్షత్రంబున పూలమందిరము కట్టి పూజింప వలెను. జ్యేష్ఠమాస మూలానక్షత్రంబున శీతలోదక భాండము సమర్పింప వలెను. ఆషాఢమాసమున నుత్తరాషాఢా నక్షత్రమున కుశారోపణ చేయవలెను. శ్రావణ మాసంబున శ్రవణా నక్షత్రమున

ప్రాకృత మండలము నిర్మింప వలెను. భాద్రపద పౌర్ణమి పూర్వాషాఢా నక్షత్రములయందు జలక్రీడ చేయింప వలెను. ఆశ్వయుజ పౌర్ణమినాడు పాయసము నివేదన చేయవలెను. శతభిషానక్షత్రమునం దగ్నిహోత్రము చేయవలెను. కార్తీకమాస కృత్తికా నక్షత్రమున సహస్ర దీపములు వెలిగింప వలెను. మార్గశీర్షము నందార్ద్రా నక్షత్రమున గో ఘృతాభిషేకము చేయవలెను. ఇట్లు చేయలేనిచో నుత్సవము లైనను చేయవలెను. ఇట్టి రోజుల యందధిక పూజలు చేయవలెను. దుస్స్వప్న, దుర్నిమిత్త దుర్గ్రహ దుష్టరోగ సమయముల యందు చేసినచో నవన్నియు నుపశమించి యారోగ్యము కల్గును. యశుభములు తొలగును. ఎట్టి యశుభంబులు కల్గినను స్నానపూజా జపహోమాదులచే నివారింప బడును. పునశ్చరణచే సర్వకార్యంబులు సిద్ధించును. హోమము లన్నియు శివాయలమునందు చేయవలెను. నిత్యము నిట్లు శివ ధర్మను లాచరించిన వారికి శివు డొక జన్మమునందే ముక్తి నొసంగును. ఇట్టి వారు కైలాస నివాసులై, శతకోటి సంవత్సర పర్యంతము సర్వభోగ ముల ననుభవించి కుమారుడై దివి నుండిభువికేతెంచి తదుపరి బ్రహ్మ విష్ణు రుద్రలోకంబులు నొంది యట చిరకాలము సకల భోగముల ననుభవించి తదుపరి స్థానపంచకములను దాటి యూర్ధ్వ లోకమునకేగి పరమేశ్వర జ్ఞానము నొంది కైలాస నివాసియగును. ఈ చెప్పిన వాటిలో సగము చేసినను రెండు మూడు పర్యాయములు పై చెప్పిన లోకములన్నియు తిరిగి తుదకు కైలాస మేగెదరు. ఎస్వల్పముగ చేసినను రుద్రలోకమేగి సహస్ర యుగంబు లనేక భోగములననుభవించి పుణ్యక్షీణము కాగా మరల భువియందు సత్కుల సంజాతుడై పూర్వజన్మ సంస్కారముచే మరల శివభక్తుడై శివార్చనలు చేయుచు పశుధర్మముల విడి శివధర్మము లాచరించుచు సర్వజ్ఞుడై శివలోక మేగి సకల భోగము లనుభవించి విశ్వేశ్వర పదము నొంది విద్యేశ్వరునితో సకల భోగము లనుభవించి బ్రహ్మాండాతర్భాగ బహిర్భాగంబుల సంచరించుచు శివజ్ఞానము, శివభక్తిని పొంది శివ సారూప్యము నొంది మరల తిరిగి రాకుండును. విషయములయందున్నంత యాసక్తి శివుని యందున్నచో పూజాపునస్కారములు చేయకున్నను ముక్తి లభించును. శివవ్రతము నొక్కసారిగాని, రెండుసార్లుగాని యుమ్మారుగాని యాచరించినచో సంసార

చక్ర మందెన్నడు బడడు. శ్రేయస్సులు కోరువారు శివధర్మము లాచరింప వలయును. ఇది నిర్బంధముగాదు. అతివాదులు నిర్బంధముగ జేసినను అది ప్రకృతికి విరుద్ధముగ నుండును. పరులు హర్షించినను హర్షింపకున్నను పుణ్యసంస్కారము లన్నియు చేయవలెను. పుణ్యసంస్కారములచే సంసార బీజ మంకురింపదు. శివధర్మములు శివారాధన ప్రకృతిగుణంబులు నశింప జేయును. శుభములు కోరువారు శివధర్మము లాచరింప వలయును.

శివ మహాపురాణమునందలి వాయవీయసంహితయం దుత్తరఖండమున ఇరువది యెనిమిదవ యధ్యాయము సంపూర్ణము

---

# ఇరువదితొమ్మిదవ యధ్యాయము

## కామ్య కర్మలు

శృతిసమ్మతమగు వాక్యములన్నిటిని నీముఖమున వినియుంటిని. తన యాశ్రితులకు శివుడు చెప్పిన నిత్యనైమిత్తిక విధులను జెప్పితివి. శివధర్మాధి కారుల కామ్యకర్మలను గురించి చెప్పుమని శ్రీకృష్ణు డుపమన్యుని ప్రశ్నింప నతడిట్లు చెప్పదొడంగెను. ఐహికాముష్మిక, కర్మలై దువిధంబులుగ చెప్పబ డెను. కొన్ని క్రియామయములైనవి. కొన్ని కర్మమయములైనవి. కొన్నితపో మయములైనవి. కొన్ని జపమయములైనవి కొన్ని ధ్యానమయము లైనవియునై యుండెను. మొత్తమిది యైదువిధంబులుగ నొప్పుచున్నవి. క్రియామయధర్మంబు లన్నియు క్రమముగా హోమదానార్చనలచే నొప్పుచుండెను. ఇవిసర్వశక్తిమం తులకే సఫలమగుచుండును. పరమేశ్వరుని యాజ్ఞాశక్తిచే నివన్నియు సఫల మగుచుండును. ద్విజులు కామ్య కర్మలు చేయుచుండవలెను. ఇహాముత్రఫల ప్రదమగు కామ్యకర్మలను చెప్పెదను వినుము. శైవులు, బాహ్యాభ్యంతర కర్మలయందాసక్తులై యుందురు. అంతరంగిక పూజలకు బహిఃపూజలకు భేద మేమియులేదు బాహ్యకర్మలకు భూమిని శుభ్రముగ నలికి ముగ్గులిడి పూర్వో క్తప్రకారముగ, రెండుమూరలుగాని, ఒకమూరగాని మండలము నిర్మించి

అందుకర్ణికో పేతాష్ట దళపద్మము నిర్మించి పైన తెరలచే నలంకరించి శక్తి యున్నచో రత్న హేమ చూర్ణంబులతో నష్టదళపద్మంబు లిఖించి, బహుశో భాన్వితములగు పంచావరణాలు నిర్మించి, దళములయం దష్టసిద్ధులను, కేసర ములయందు శక్తులను కల్పించి, దళములకు తూర్పు మొదలుకొని యష్టదిక్కు లయందు నష్టమూర్తులను స్థాపించి, వైరాగ్య బీజకర్ణికయందు నవశక్తులను స్థాపించి, మూలమందు శివాత్మకధర్మంబులు, నాళమందు, శివాశ్రయజ్ఞానము, కర్ణికోపరి నాగ్నేయ మండలంబున, సూర్యచంద్రులను, వాటిపై శివవిద్యాత్మ కమగు త్రితత్వంబులు, పంచావరణంబులతో గూడిన మండపమందు శివపా ర్వతులకు సుఖాసనము కల్పించి, ఆవాహనముచేసి నిట్లు ధ్యానింప వలెను.

శ్లో॥ శుద్ధస్ఫటిక సంకాశం.
ప్రసన్నం శీతలద్యుతిం.
విద్యుద్వలయ సంకాశం.
జటామకుట భూషితం.

2. శార్దూల చర్మవసనం.
కించిస్మిత ముఖాంబుజం.
రక్తపద్మ దళప్రఖ్యం.
పాణిపాద తలాధరం.

3. సర్వలక్షణ సంపన్నం.
సర్వాభరణ భూషితం.
దివ్యాయుధవరైర్యుక్తం.
దివ్యగంధాను లేపనం.

4. పంచవక్త్రం దశభుజం.
చంద్రఖండ శిఖామణిం.
అస్యపూర్వ ముఖే సౌమ్యం.
బాలార్క సదృశప్రభం.

5. త్రిలోచనా రవిందాఢ్యం.
కృతబాలేందు శేఖరం.
దక్షిణం నీలజీమూత
సమానరుచిర ప్రభం.

6. భృకుటీ కుటిలం ఘోరం.
రక్తవృత్తే క్షణత్రయం
దంష్ట్రాకరాళ దుర్దర్శం
స్ఫురితాధర పల్లవం.

7. ఉత్తరం విద్రుమప్రఖ్యం
నీలాలక విభూషితం.
సవిలాసం త్రినయనం
చంద్రాభరణ శేఖరం.

8. పశ్చిమం పూర్ణచంద్రాభం.
లోచన త్రితయోజ్జ్వలం.
చంద్రలేఖాధరం సౌమ్యం.
మందస్మిత మనోహరం.

9. పంచమం స్ఫటికప్రఖ్యం.
ఇందురేఖా సముజ్జ్వలం.
అతీవ సౌమ్యముత్ఫుల్ల.
లోచన త్రితయోజ్జ్వలం.

10. దక్షిణే శూల పరశూ.
వజ్రఖడ్గౌ సముజ్జ్వలం.
సవ్యేచ నాగనారాచ.
ఘంటా పాశాంకుశోజ్జ్వలం.

11. నివృత్యాజాను సంబద్ధ.
మానాభేశ్చ ప్రతిష్ఠయా.
ఆకంఠవిద్యయాతద్వ.
దాలంగాటంతు శాంతయా.

12. తదర్థం శాంత్య తీతాఖ్య.
కలయా పరయాతధా.
పంచాధ్వ వ్యాపినంసాక్షా.
త్కళాపంచక విగ్రహం.

13. ఈశానముకుటం దేవం.
పురుషాఖ్యం పురాతనం.
అఘోరహృదయం తద్వ.
ద్వామగుహ్యం మహేశ్వరం.

14. సద్యఃపాదం చతన్మూర్తిం
అష్టత్రింశ కళామయం.
మాతృకామయ మీశానం.
పంచబ్రహ్మ మయంతధా.

15. ఓంకారాఖ్య మయంచైవ.
హంసశక్త్యా సమన్వితం
తథేచ్ఛాత్మికయా శక్త్యా.
సమారూ ఢాంకమండలం.

16. జ్ఞానాఖ్యయా దక్షిణతో.
వామతశ్చ క్రియాఖ్యయా.
తత్త్వత్రయ మయంసాక్షా,
ద్విద్యామూర్తిం సదాశివం.

అగ్నిమూర్తిని భావించి ధ్యానింపవలయును. తదుపరి మూర్తిమంతమగు శివుని, శక్తితోసహా యావాహ్వానించి, పంచపూజలుచేసి, సదసద్వ్యక్తి వర్జితుడగు పరమేశ్వరు నర్చించి, షడంగ సహిత వేదములతోను, మాతృకాన్యాసములతోను, ప్రణవముతోడను, శక్తిసహితుడగు నీశ్వరుని క్రమముగా పూజించి శాంతిసూక్తములు జెప్పి, శివపార్శ్వగులను పూజింపవలెను. అభిషేకమైన తరి పంచావరణ పూజలుచేసి శివుని పూజింపవలెను.

శివమహాపురాణము నందలి వాయువీయసంహితయందుత్తరఖండమున ఇరువదితొమ్మిదవ అధ్యాయము సంపూర్ణము.

---

## ముప్పదవ యధ్యాయము

### శైవకామ్య కర్మలు

ఉమామహేశ్వరుల కిరువైపుల షణ్ముఖ హేరంబులను స్థాపించి త్రిమూర్తుల నావాహ్వానించి ప్రథమావరణ పూజలు చేయవలెను. అష్టదళ పత్రమందైన తూర్పుపత్రంబున శక్తిసహితు డగు ననంతుని దక్షిణ పత్రంబున సూక్ష్మ సహితమగు శక్తిని పశ్చిమదిశ పత్రంబున శక్తి సహితు డగు శివుని ఉత్తరదిక్పత్రమున నేక నేత్రుని ఈశాన్యదిశ పత్రంబున శక్తి సహితైక రుద్రుని యాగ్నేయదళంబున శక్తియుతులగు త్రిమూర్తులను నైరుతి దిశ పత్రమందు పత్నీయుత శ్రీకంఠుని వాయవ్యపత్రంబున పత్నీ సహిత శిఖండిని పూజింప వలెను.

ద్వితీయావరణంబున సర్వచక్రవర్తులను పూజింప వలెను.

తృతీయావరణంబున అష్టదిక్కుల యందున యష్టమూర్తులను చంద్రుని పూజింప వలెను. తదుపరి ననంత శక్తి సహితులగు నేకాదశ రుద్రులను పూజింప వలెను.

శ్లో॥ మహాదేవః శివో రుద్రః శంకరో నీలలోహితః
ఈశానో విజయో భీమో దేవదేవో భవోద్భవః
కపర్దీశశ్చ కథ్యంతే తథైకాదశశక్తయః

మహాదేవుడు, శివుడు, రుద్రుడు, శంకరుడు, నీలలోహితుడు, ఈశానుడు, విజయుడు, భీముడు, దేవదేవుడు, భవోద్భవుడు, కపర్దీ యను వారలు ఏకాదశ శక్తులందురు మొదటి యష్టశక్తుల నాగ్నేయాద్యష్ట దిక్కులయందు క్రమముగ పూజింప వలెను. తదుపరి దేవదేవుని నాగ్నేయమందున, మధ్యయందు భవోద్భవుని స్థాపించి తదుపరి కపాలీశుని, వృషేంద్రుని, దానికి దక్షిణముగ నందీశ్వరుని, నుత్తరంబున మహాకాలుని, యాగ్నేయమున శాస్తారుని దక్షిణంబున మాతృకలను, నైరుతియందున గజాస్యుని పశ్చిమంబున షణ్ముఖుని వాయువ్యమందున జ్యేష్ఠుని దానియుత్తరంబున గౌరుని ఈశాన్యమందున చండుని, శాస్తనందుల మధ్యమున నీశ్వరుడైన వృషభుని మహాకాలుని యుత్తరభాగంబున పింగళుని శాస్తమాతృకలమధ్య భృంగీశ్వరుని మాతృ విఘ్నేశ్వరుల మధ్య వీరభద్రుని స్కంద విఘ్నేశ్వరుల మధ్య సరస్వతిని జ్యేష్ఠకుమారులమధ్య శివ పదార్చితయగు లక్ష్మిని జ్యేష్ఠాగణాంబ మధ్య మోటిని, గణాంబాచండులమధ్య దుర్గను పూజింప వలెను. తదుపరి శివానుచరులను, రుద్ర, ప్రథమ భూతంబులను వారిశక్తులను దేవీ నెచ్చెలులను ధ్యానించి పూజించి ఇట్లు తృతీయావరణ పూజముగించి, తదుపరి చతుర్థావరణ పూజను ప్రారంభించి భానుని పూర్వదళంబున చతుర్ముఖబ్రహ్మను దక్షిణదళంబున రుద్రుని పశ్చిమదళంబున విష్ణుని యుత్తరదళంబున శక్తులతోసహా వేరు వేరుగ పూజింపవలెను. పదుపరి దీప్తా, సూక్ష్మా, జయా, భద్రా విభూతి, విమలా యను, నాలు శక్తులను క్రమముగ పూజింపవలెను. ద్వితీయావరణ యందు క్రమముగా చతుర్మూర్తులను పూజింపవలెను. పూర్వాద్యుత్తర పర్యంతముగల శక్తులను పూజింపవలెను. ఆదిత్యభాస్కర, భాను, రవి, అర్క, బ్రహ్మ, రుద్ర, విష్ణు వివస్వాదులను పూర్వాదిశయందు పూజింపవలెను. ఈ పూజలన్నియు దక్షిణదిక్కుగా విస్తరింపజేయరాదు. బోధనిని, పశ్చిమంబున ఆప్యాయనిని యుత్తరంబున నటుప్తిని యుషను,

ప్రభను, ప్రాజ్ఞను, సంధ్యను, ద్వితీయావరణమందు యజింప వలయును. తృతీయావరణమందు నవగ్రహములను పూజింపవలెను. లేనిచో ద్వాదశాదిత్యులను పూజింపవలెను. తృతీయావరణమందు మేషాదిద్వాదశ రాసులను పూజింపవలెను. గిరీశ ప్రదేశంబున సప్తసప్తగణంబులను పూజింపవలెను. తదుపరి సకలఋషి దేవ గంధర్వ పన్నగాప్సరోగణంబులను గ్రామాధికారులను, యక్షరాక్షసులను హయంబులను సప్తచ్ఛందస్సులను వాలఖిల్యులను పూజింపవలెను. తృతీయావరణంబున సూర్యుని పూజించి వీరందరితో బ్రహ్మను పూజింపవలెను. తదుపరి హిరణ్యగర్భుని పూర్వభాగంబున విరాజుని దక్షిణ భాగంబున కాలుని పశ్చిమ భాగంబున పురుషునుత్తరభాగంబున పూజింపవలెను. మరియు హిరణ్యగర్భుడు కమలసన్నిభుడునగు బ్రహ్మయు నంజనసంకాశుడగు కాలుని స్ఫటికోపముడగు పురుషుని త్రిగుణంబులను ప్రథమావరణమందు పూజింపవలెను. ద్వితీయావరణయందు తూర్పు మొదలుకొని నలువైపుల సనత్కుమార, సనక, సనందన, సనాతనులను పూజింపవలెను. తృతీయావరణమందు దక్ష, రుచి, భృగు, మరీచి, అంగిర, పులస్త్య, పులహ క్రతు, అత్రి, కశ్యప, వశిష్ఠులను ప్రజాపతులను, ప్రసూతి, ఖ్యాతి, సంభూతి, ధృతి, స్మృతి, ప్రీతి, క్షమా, సన్నతి, అనసూయ అదితి, అరుంధతులను, వారిభార్యలను పూజింపవలెను. ఇంకను, చతుర్వేదంబులను, ధర్మశాస్త్రంబులను, సకలవేద విద్యలను పూజింపవలెను. పూర్వదిక్కున కెంపురంగు తనకభిరుచిగల, వేదంబును, నితరదిక్కుల యందితరవేదంబులను స్థాపింపవలెను. పిమ్మట నష్టవిధంబులుగా గాని, చతుర్విధంబులుగాగాని, పూజింపవలెను మూడు యావరణలయందు బ్రహ్మను పూజించి, దక్షిణపశ్చిమ భాగములయందు నావరణ సహితముగ రుద్రుని పూజింపవలెను. బ్రహ్మను, షడంగములను ప్రథమావరణమందు పూజింపవలెను. ద్వితీయావరణమందు విద్యేశ్వరుని పూజింపవలయును, తృతీయావరణమునందున నాల్గు మూర్తులను నలువైపుల పూజింపవలెను. త్రిగుణుడు, సకలుడు నగు దేవుని పురోభాగమున పూజింపవలెను. దక్షిణంబున రజోగుణ బ్రహ్మను పూజింపవలెను, పశ్చిమంబున, సంహారకరుడు, తామసగుణుడగు హరునిపూజింపవలయును. పూర్వదిశయందు శివుడు సత్వప్రధానుడగు విష్ణువను పేరుతో నుండెడివానిని,

పూజింపవలెను. పశ్చిమంబున శంభుడు, సద్యోంశక నామంబుతోనుండెను. ఉత్తర పార్శ్వమందు నైఋతముననర్చింప వలెను, అట వాసుదేవుని పురస్కరించుకొని, ప్రథమావరణ పూజచేయవలెను. దక్షిణంబున అనిరుద్ధుని, పశ్చిమంబున ప్రద్యుమ్నుని సంకర్షుని పూజింపవలెను. మత్స్యకూర్మవరాహ, నారసింహ వామన, పరశురామ, శ్రీరామ, బలరామ, శ్రీకృష్ణ, హయగ్రీవులను, తృతీయావరణ పూర్వభాగంబున పూజింపవలెను. దక్షిణంబున నారాయణాస్త్రమును, పశ్చిమంబున పాంచజన్యము, నుత్తరంబున శార్ఙ్గధనువును, విష్ణుభగవానుని తృతీయావరణ యందు పూజింపవలెను. మూర్తివంతులగు, శివకేశవులను పూజింపవలెను. చతుర్వ్యూహములయందు, విశ్వాఖ్యుడు, హరి, మహావిష్ణువు సదావిష్ణువుల నెడి, చతుర్మూర్తులను, వారివారి శక్తులతో పూజింపవలెను. ఆగ్నేయదిగ్భాగంబున, ప్రథను, నైరుతియందున సరస్వతిని, వాయువ్యమున గిణాంబికను, నుత్తరంబున లక్ష్మిని, తదుపరి భావ్యాది మూర్తులను, వారిశక్తులను, మిగిలిన యావరణలయందు లోకేశులను పూజింపవలయును. తదుపరి పశ్చిమదిశయందు, సంద్రాగ్నియమ, నిరుతి, వరుణ వాయు, సోమకుబేరేశానుల నర్చింపవలయును.

ఇట్లు చతురావరణ పూజలుగావించి, బాహ్యప్రదేశమున, ఈశాన్యమున త్రిశూలంబును, తూర్పున వజ్రాయుధంబును, నాగ్నేయమున పరశువును దక్షిణంబున సాయకమును, నైఋతియందు ఖడ్గమును, పశ్చిమంబున పాశమును వాయవ్యమున నంకుశము, నుత్తరంబున పినాకములనెడి, మహేశ్వరుని యాయుధంబులు పూజింపవలెను. ఇట్లు పంచావరణ పూజయైన తరి, రుద్రస్వరూపులగు క్షేత్రపాలుని పూజింపవలెను. సర్వావరణ దేవతలను వెలుపల పూజించి. పరమేశ్వరుని కెదురుగా మూర్త్యాకారగణంబుల నర్చింపవలెను. మండపమునుచుట్టూ, ఖేచరులు, ఋషులు, సిద్ధులు, దైత్యులు, యక్షులు, రాక్షసులు, ననంతుని, నాగేంద్రులను నాగకులోద్భవులను. డాకినీ భూతభేతాళ ప్రేత భైరవనాయకులను, పాతాళవాసుల నితరనానాయోని సముద్భవులను, నదులను, సాగరంబులను, పర్వతములను, గిరులను, కాననంబులను, పశువులను, పక్షులను, వృక్షములను, కీటకములను, క్షుద్రయోనులను, నరులను, వివిధా

కార మృగములను, అంతర్భువనంబుల ననేకకోట్ల బ్రహ్మాండంబులను, బహి ర్బ్రహ్మాండంబులను, యధిష్ఠాతలతో గూడిన భువనంబులను, పూజించి సకలది శలు వ్యాపించియున్న బ్రహ్మాండాధిపతియగు రుద్రుని, యితని వామపార్శ్వ మున, గౌణరూపయు, శివసంబంధమైనదియు, శక్తి స్వరూపశబ్దాతీతమైనదియు వాచ్యవాచ్యక స్వరూపమైనదియు. చిదచిదాత్మకమైనదియు. నగుపరాశక్తిని పూజింపవలెను. ఇట్టియు మాయమహేశ్వరులగాంచి, కృతాంజలిపుటులై, స్మితా ననులై, శివాశివుల నర్చింపవలయును. మనోవిక్షోభ శాంతికిట్లు సర్వదా యావరణపూజలుచేసి దేవీదేవుల నర్చించి, శివపంచాక్షరీ మంత్రమును ప్రీతితో జపింపవలయును. తదుపరి పునఃపూజలుచేసి యమృతోపరమాన్నమైన, నివేదనను చేయవలెను. హవిస్సును వండి, కూరలు, పచ్చడులు, పిండివంటలు యథాశక్తిగ, తయారుచేసి నైవేద్యముచేయవలయును. ముప్పదిరెండు యాఢ కములుగాని, అధమమొక్క యాఢకము బియ్యము అన్నము వండి నివేదనచే యవలెను.

రెండు మానికలొక శరావము. రెండు శరావములొక ప్రస్థము. నాల్గు ప్రస్థములొక యాఢకము. ఆఢక మనగా నాల్గు కుంచము లనబడును. ముప్పదిరెండు ఆఢములనగా 128 కుంచములు. శక్తి యున్నచో నైవేద్య మొనరింపవలయును. లేనిచో నాల్గు కుంచముల యన్నమైనను వండి నైవే ద్యము చేయవలెను. లేనిచో యథాశక్తిగా భక్తి శ్రద్ధలతో నైవేద్యము చేసి తాంబూల నీరాజనము లిచ్చి పూజ సమాప్తము గావింప వలెను. శక్తి యున్నంతవరకు ధనలోపము చేయరాదు. శ్రద్ధా భక్తులు లేక చేసినచో కామనకర్మ లైనను ఫలింపవు. కామ్యఫల సిద్ధులను కోరువారు శ్రద్ధాభక్తు లతో పరమేశ్వరు నర్చింప వలయును. అర్చన పూర్తియైనతరి స్తుతించి తదు పరి సహస్రంబుగాని, యష్టోత్తర శతంబుగాని జపింప వలయును. తదుపరి విద్యా పూజను గురుపూజను చేసి సభాసదుల పూజించి సత్కరించి యావరణ దేవతాసహితముగ దేవును ద్వాసనజెప్పి కుండమును గురువునకు దక్షిణగా నిచ్చుటగాని శివభక్తులకిచ్చుటగాని దేవాలయమునందిచ్చుటగాని చేయువ లెను. లేనిచో నీశ్వరుని అగ్నియందే ఆవాహనముచేసి సర్వావరణ దేవతల

నందే పూజింప వచ్చును. ఇట్టి యోగి యోగీశ్వర నామంబున త్రిలోక విఖ్యాతుడై యుండెను. ఇంతకు మించిన యోగమేదియు లేదు. ఇట్టి వానికి జగత్తునందు సాధ్యము కానిదేదియు నుండదు. ఇది వైహికాముష్మిక ఫలంబుల నిచ్చును. దీనిఫల మింతని చెప్పుట కలవికాదు. కోరినవెల్లనిచ్చును. శ్రేయస్సులు కోరువారికిది శ్రేష్ఠసాధనము. ఈ చెప్పిన యోగవరణ పూజలలో నేవిధంబుగ జేసినను చింతామణివలె సకల కోర్కెలనిచ్చును. ఈవ్రతము చేసి క్షుద్రఫలములు మాత్రము కోరరాదు. దీనిచే పొందరాని దైనను పొందవచ్చును. అమోఘకార్యమైనను సునాయాసముగ చేయగల్గుదురు. అధికముగ చేసినను, స్వల్పముగ చేసినను తగిన ఫలము వెంటనే సిద్ధించును. మహాదేవు నుద్దేశించు కర్మలన్నియు, పొందరాని ఫలంబుల పొందింపజేసి శత్రు సంహారము కల్గించి మృత్యువును కూడ జయింపజేయును. ఫలసిద్ధికై చతుర పురుషులు దీని నాచరింతురు. దీనిచే మహాపాపములు నశించి, మహారోగములు హరించి దుర్భిక్షము లుపశమింపజేసి శాంతిచేకూరును. బహూక్తులు పలుకనేల, మహావ్యాధులన్నియు నశించును. సామాన్య వ్యాధులమాట చెప్పనేల? ఇదియే పాశుపతాస్త్రము. ఆత్మరక్షణకై దీనిని మించిన యస్త్రము లేదు. ఇది తెలిసికొని యాచరించిచో సర్వశుభంబులు చేకూరును. లేనిచో స్తోత్రములు పఠించిన నష్టాంశఫలము లభించును. ఇది అర్థము తెలిసి పఠించినచో నాల్గవ వంతు ఫలము లభించును. అష్టమి చతుర్దశి మొదలగు పర్వ దినములయందు పఠించినచో నర్ధఫలము లభించును. ఒక మాసము భక్తితో పఠించినచో సంపూర్ణ ఫలము లభించును.

శివ మహాపురాణమునందలి వాయవీయ సంహితయందు త్తరఖండమున
ముప్పదవ అధ్యాయము సంపూర్ణము

---

# ముప్పదిఒకటవ యధ్యాయము

## శివ మహాస్తోత్రము.

ఓకృష్ణా! పంచావరణ మార్గముతో కూడినస్తోత్రము చెప్పెదవినుము. ఇదిపఠించినవారు. పంచావరణలతో కూడి. పరమేశ్వరుని పూజించిన ఫలము కల్గును.

1. జయ జయ జగదేక నాథ శంభో
ప్రకృతి మనోహర నిత్య చిత్స్వభావ.
అతి గత కలుష ప్రపంచ వాచా.
మపి మనసాం పదవీ మతీత తత్త్వం.

2. స్వభావ నిర్మలా భోగ.
జయ సుందర చేష్టిత.
స్వాత్మ తుల్య మహాశక్తే.
జయ శుద్ధ గుణార్ణవ.

3. అనంత కాంతి సంపన్న.
జయా సదృశ విగ్రహా.
అతర్క్య మహిమాధార.
జయా నాకుల మంగళ.

4. నిరంజన నిరాధార
జయ నిష్కారణోదయ.
నిరంతర పరానంద.
జయ నిర్వృత్తి కారణ.

5. జయాతి పరమైశ్వర్య.
జయాతి కరుణా స్పద.
జయ స్వతంత్ర సర్వస్వ.
జయా సదృశ వైభవ.

6. జయా వృతమహా విశ్వ.
జయా నావృత కేనచిత్.
జయోత్తర సమస్తస్య
జయా త్యంత నిరుత్తర.

7. జయా ద్భుత జయాక్షుద్ర.
జయాక్షత జయావ్యయ.
జయా మేయ జయామాయ
జయాభావ జయామల.

8. మహా భుజ మహాసార.
మహాగుణ మహాకధ
మహాబల మహామాయ
మహారస మహారధ.

9. నమః పరమ దేవాయ.
నమః పరమ హేతవే.
నమశ్శివాయ శాంతాయ.
నమశ్శివ తరాయ తే.

10. త్వదధీన మిదం కృత్స్నం.
జగద్ధిత సురా సుర౯.
అత స్త్వ ద్విహి తామాజ్ఞాం
క్షమ తే కోటివర్తితుం.

11. అయం పునర్భవో నిత్యం.
భవ దేక సమాశ్రయః
భవానప్యనుగృహ్యాస్మి౯.
ప్రార్థితం సంప్రయచ్ఛతు.

12. జయాంబికే జగన్మాత.
ర్జయ సర్వ జగన్మయి.
జయా నవధి కైశ్వర్యే
జయా నుపమ విగ్రహే.

13. జయ వాఙ్మన సాతీతే.
జయ చిధ్వాంత భంజికే.
జయ జన్మ జరాహీనే
జయ కాలోత్త రోత్త రే.

14. జయా నేకగుణా విధాన స్థే
జయా నేకసుఖాత్మి కే
జయా నేకమహాస త్వే
జయా నేకగుణోర్జి తే.

15. జయా నేకగుణాత్మ స్థే
జయా లోకమహేశ్వరి
జయ విశ్వాది కాత్మ స్థే
జయ విశ్వేశ్వర ప్రియే.

16. జయ విశ్వసురా రాధ్యే.
జయ విశ్వ విజృంభిణి
జయ మంగళదివ్యాంగి
జయ మంగళదీపికే.

17. జయ మంగళచారిత్రే.
జయ మంగళ దాయిని
నమః పరమకళ్యాణ
గుణసంచ యమూర్తయే.

18. నమశ్శివాయై విశ్వస్మా
త్పరస్యై శివశక్తయే
త్వత్తః ఖలుసముత్పన్నం
జగత్వయ్యేవ లీయతే.

19. త్వద్వినాతః ఫలందాతు
మీశ్వరోపి నశక్నుయాం.
జన్మప్రభృతి దేవేశి
జనోయం త్వాముపాశ్రితః.

20. అతోస్య తవభక్తస్య
నిర్వర్తయ మనోరథం.
పంచవక్త్రో దశభుజః
శుద్ధస్ఫటిక సన్నిభః.

21. వర్ణబ్రహ్మ కళా దేహో.
దేవస్సకల నిష్కళః
శివభక్తి సమారూఢః
శాంత్యతీతస్సదా శివః.

22. భక్త్యామయార్చితోమహ్యం
పార్థితంశం ప్రయచ్ఛతు
సదాశివాంక మారూఢా
శక్తిరిచ్ఛా శివాహ్వయా.

23. జననీ సర్వలోకానాం
ప్రయచ్ఛతు మనోరథం.
శివయోర్దయితాపుత్రౌ
దేవౌహేరంబ షణ్ముఖౌ.

24. శివానుభావౌ సర్వజ్ఞౌ.
శివజ్ఞానామృతాశినౌ.
తృప్తౌపరస్పరం స్నిగ్ధౌ
శివాభ్యాం నిత్యసత్కృతౌ.

25. సత్కృతౌచ సదాదేవౌ.
బ్రహ్మాద్యై స్త్రిదశైరపి
సర్వలోక పరిత్రాణం
కర్తుమభ్యుత్థి తేసదా.

26. స్వేచ్ఛావతారం కుర్వంతౌ
స్వాంశభే దైరనేకశః
తావిమౌ శివయోః పార్శ్వే
నిత్యమిత్థం మయార్చితౌ

27. తయోరాజ్ఞాం పురస్కృత్య
ప్రార్థితం మే ప్రయచ్ఛతాం
శుద్ధస్పటిక సంకాశ
మీశానాఖ్యం సదాశివం

28. ఊర్ధ్వాభి మానినీమూర్తిః
శివస్య పరమాత్మనః
శివార్చన రతం శాంతం
శాంత్యతీతం మఖాస్థితం

29. పంచాక్షరాంతిమంబీజం
కాలాభిః పంచభిర్వృతం
ప్రథమావరణే పూర్వాం
శక్త్యాసహా సమర్చితం

30. పవిత్రం పరమం బ్రహ్మ
ప్రార్థితంమే ప్రయచ్ఛతు
బాలసూర్య ప్రతీకాశ
పురుషాఖ్యం పురాతనం

31. పూర్వవక్త్రాభిమానంచ
శివస్య పరమేష్ఠినః
శాంత్యాత్మకం మరుత్సంస్థం.
శంభోఃపాదార్చనేరతం

32. ప్రథమం శివబీజేషు
కళాసుచ చతుష్కళం
పూర్వభాగే మయాభక్త్యా
శక్త్యాస్యహా సమర్పితం.

33. పవిత్రం పరమంబ్రహ్మ
ప్రార్థితంమే ప్రయచ్ఛతు
అంజనాది ప్రతీకాశ
మఘోరంఘోర విగ్రహం.

34. దేవస్య దక్షిణం వక్త్రం
దేవదేవ పదార్చితం
విద్యాపాదం సమారూఢం
వహ్నిమండల మధ్యగం.

35. ద్వితీయం శివబీజేశం
కలాస్వష్ట కలాన్వితం
శంభోర్దక్షిణ దిగ్భాగే
శక్త్యానహా సమర్పితం.

36. పవిత్రం మధ్యమం బ్రహ్మ
ప్రార్థితం మేప్రయచ్ఛతు
కుంకుమక్షోద సంకాశం
వామాఖ్యం వరవేషధృక్.

37. వక్త్రముత్తర మీశస్య
ప్రతిష్ఠాయాం ప్రతిష్ఠితం
వారి మండలమధ్యస్థం
మహాదేవార్చనే రతం.

38. తురీయం శివబీజేషు
త్రయోదశ కళాన్వితం
వేదస్యోత్తర దిగ్భాగే
శక్త్యాసహా సమర్చితం

39. పవిత్రం వరమం బ్రహ్మ
ప్రార్థితంమే ప్రయచ్ఛతు
శంఖకుందేందు ధవళం
సంధ్యాఖ్యం సౌమ్య లక్షణం

40. శివస్య పశ్చిమం వక్త్రం
శివపాదార్చనే రతం
నివృత్తి పద నిష్ఠంచ
పృధివ్యాం సమవస్థితం

41. తృతీయే శివ బీజేషు
కళాభి శ్చాష్టభిర్యుతం
దేవస్య పశ్చిమే భాగే
శక్త్యా సహా సమర్చితం.

42. పవిత్రం పరమం బ్రహ్మ
ప్రార్థితం మే ప్రయచ్ఛతు
శివస్యతు శివాయాశ్చ
హృన్మూర్తి శ్శివభావితే.

43. తయోరాజ్ఞాం పురస్కృత్య
తేమేకామం ప్రయచ్ఛతు
శివస్యచ శివాయాశ్చ
వర్మణా శివభావితే.

44. సత్కృత్య శివయో రాజ్ఞాం
తేమేకామం ప్రయచ్ఛతాం
శివస్య చశివాయాశ్చ
నేత్రమూర్తిం శివాశ్రితే

45. సత్కృత్య శివయోరాజ్ఞాం
తేమేకామం ప్రయచ్ఛతాం
అష్టమూర్తిం చశివయో
నిత్య మర్చన తత్పరే

46. సత్కృత్య శివయోరాజ్ఞాం
తేమే కామం ప్రయచ్ఛతాం
వామోజేష్ఠ స్తదారుద్రః
కాలోవికరణస్తథా

47. బాలో వికరణ శ్చైవ
బలప్రమథనం పరః
సర్వభూత స్యదమనః
తాదృశశ్చా ష్టశక్తయః

48. ప్రార్థితం మే ప్రయచ్ఛంతు
శివయోః శే వశాసనాత్
అథాంతశ్చ సూక్ష్మస్య
శివస్యా ప్యేక నేత్రకః

49. ఏకరుద్రాఖ్య మూర్తిశ్చ
శ్రీకంఠశ్చ శిఖండకః
తథాష్టౌ శక్తయస్తేషాం
ద్వితీయా వరణేర్చితా

50. తే మే కామం ప్రయచ్ఛంతు
శివయోః శే వశాసనాత్
భవాద్యా మూర్తయశ్చాష్టౌ
తాసామపి చశక్తయః

51. మహాదేవా దయశ్చాన్యే
తద్భిన్నా దశమూర్తయః
శక్తిభిస్స హితాస్సర్వే
తృతీయా వరణేస్థితాః

52. సత్కృత్య శివయో రాజ్ఞాం
దిశంతుఫల మీప్సితం
వృషరాజో మహాతేజా
మహామేఘ సమస్వనః

53. మేరుమన్దర కైలాస
హిమాద్రి శిఖరోపమః
శితాభ్ర శిఖరాకారః
కకుదా పరిశోభితః

54. మహాభోగీంద్ర కల్పేన
వాతేన చ విరాజితః
రక్తాస్య శృంగచరణో
రక్తప్రాయ విలోచనః

55. పీవరోన్నతసర్వాంగ
స్సుచారుగమనోజ్వలః
ప్రశస్త లక్షణః శ్రీమా
న్ప్రజ్వల న్మణిభూషణః

56. శివప్రియశ్శి వాసక్తః
శివయోర్ధ్వ జవాహనః
తథాతచ్చరణన్యాస
పావితా పరవిగ్రహః

57. గోరాజపురుష శ్శ్రీమాన్
శ్రీమాన్శూలవరాయుధః
తయోరాజ్ఞాం పురస్కృత్య
సమేకామం ప్రయచ్ఛతు

58. నందీశ్వరో మహాతేజా
నగేంద్ర తనయాత్మజః
స నారాయణ కైర్దేవైః
నిత్యమభ్యర్చ్య యంతితః

59. శర్వస్యాన్తః పురద్వారి
సార్ధిః పరిజనైస్థితః
సర్వేశ్వర సమప్రఖ్యా
స్సర్వాసుర విమర్దనః

60. సర్వేషాం శివధర్మాణా
మధ్యక్షత్వే భిషేచితః
శివప్రియశ్శివాసక్తః
శ్రీమచ్ఛూల వరాయుధః

61. శ్రివాశ్రితేషు సంసక్త
స్త్వనురక్తశ్చ తైరపి
సత్కృత్య శివయో రాజ్ఞాం
స మే కామం ప్రయచ్ఛతు

62. మహాకాలో మహాబాహు
ర్మహాదేవఇవా పరః
మహాదేవా శ్రితానాంతు
నిత్యమే వాభిరక్షతు.

63. శివప్రియశ్శివా సక్తః
శివయో రర్చకస్సదా
సత్కృత్య శివయోరాజ్ఞాం
స మేదిశతు కాంక్షితం.

64. సర్వశాస్త్రార్థ తత్వజ్ఞః
శస్తావిష్ణోః పరంతనుః
మహామోహాత్మతనయో
మధుమాంసాదనప్రియః.

65. తయోరాజ్ఞాం పురస్కృత్య
స మే కాల ప్రయచ్ఛతు
బ్రహ్మాణీ చైవ మాహేస్యే
కౌమారీ వైష్ణవీతథా.

66. వారాహీచైవ మాహేంద్రీ
చాముండా చండవిక్రమా
ఏతా వైమాతర స్సప్త
సర్వలోకస్య మాతరః.

67. ప్రార్థింత మే ప్రయచ్ఛంతు
పరమేశ్వర శాసనాత్
మత్తమాతంగ వదనో
గంగోమాశంకరాత్మజః.

68. ఆకాశదేహో దిగ్బాహు
స్సోమసూర్యాగ్నిలోచనః
ఐరావతాది భిర్దివ్యై
ర్దిగ్గజైర్నిత్య మర్చితం

69. శివజ్ఞాన మదోద్భిన్న
స్త్రిదనామ విఘ్నకృత్
విఘ్నకృచ్చా సురాదీనాం
విఘ్నేశశ్శివ భావితః.

70. సత్కృత్య శివయోరాజ్ఞాం
సమేదశతు కాంక్షితం
షణ్ముఖ శ్శివ సంభూతః
శక్తివజ్రధరః ప్రభుః.

71. అగ్నిశ్చత నయో దేవో
వ్యాపర్ణాతనయః పునః
గంగాయాశ్చగణాం వాయాః
కృత్తికానాం తథైవచ.

72. విశాఖ సచ శాఖేన
నైగమే యేనచావృతః
ఇంద్రజిచ్చంద్ర సేనానీ
స్తారకాసుర జిత్తథా.

73. శైలానాం మేరుముఖ్యానాం
వేధకశ్చ స్వతేజసా
తప్తచామీకరః ప్రఖ్యః
శతపత్ర దళేక్షణః.

74. సుకుమార సుకుమారాణాం
రూపోదాహరణం మహత్
శ్శివప్రియ శ్శివాసక్తః
శివపాదార్చక స్సదా.

75. సత్కృత్య శివయో రాజ్ఞాం
సమేదిశతు కాంక్షితం
జేష్ఠావరిష్ఠా వరదా
శివయోర్య జనేరతా.

76. తయో రాజ్ఞాం పురస్కృత్య
సమేదిశ తు కాంక్షితం
త్రైలోక్యవందితా సాక్షా
దుల్కాకారాం గణాంబికా.

77. జగత్సృష్టి వివృధ్యర్థం
బ్రహ్మణాభ్యర్థితా శివా
శివయా ప్రవిభక్తాయా
భృవోరస్తర నిర్వృతాః.

78. దాక్షాయణీ సతీమేనా
తథాహైహ్యా మవతీవ్యామా
కాశిక్యాశ్చైవ జననీ
భద్రకాళ్యాస్తథైవచ.

79. అపర్ణాయాశ్చ జననీ
పాటలాయాస్తథైవచ
శివార్చన రతానిత్యం
రుద్రాణీ రుద్రవల్లభా.

80. సత్కృత్యశివయోరాజ్ఞాం
సామేదిశతు కాంక్షితం
చండస్సర్వ గణేశానః
శంభోర్వదన సంభవః

81. సత్కృత్య శివయోరాజ్ఞాం
సమేదిశతు కాంక్షితం
పింగళో గణపశ్శీమాన్
శివాసక్తశ్శివప్రియః

82. ఆజ్ఞయా శివయోరేవ
సమేకామంప్రయచ్ఛతు

83. భృంగీశో నామగణపః
శివారాధన తత్పరః
ప్రయచ్ఛతు సమేకామం
పత్యురాజ్ఞా పురస్సరః

84. వీరభద్రో మహాతేజా
హిమకుందేందుసన్నిభః
భద్రకాళీ ప్రియోనిత్యం
మాతౄణాం చాభిరక్షితః

85. యజ్ఞస్యచ శిరోహర్తా
దక్షస్య చదురాత్మనః
ఉపేన్ద్రయ మాదీనాం
దేవానా మంగరక్షకః.

86. శివస్యానుచరశ్శ్రీమాన్
శివ శాసన పాలకః
శివయోశ్శాసనా దేవ
సమేదిశతు కాంక్షితం

87. సరస్వతీ మహేశస్య
వాక్స రోజసముద్భవా
శివయోః పూజనేసక్తా
సామేదిశ తుకాంక్షితం.

88. విష్ణోర్వక్ష స్థితా లక్ష్మీః
శివయోః పూజనేరతా
శివయోః శాసనా దేవ
సామేదిశతుకాంక్షితం.

89. మహామోటీ మహాదేవ్యాః
పాదపూజా పరాయణా
తస్యా ఏవనియోగేన
సామేదిశ తుకాంక్షితం.

90. కౌశికీ సింహమారూఢా
పార్వత్యాః పరమాసుతా
విష్ణోర్నిద్రా మహామాయా
మహామహిష మర్దనీ

91. నిశుంభ శుంభ సంహర్త్రీ
మధుమాంసా సవప్రియా
సత్కృత్య శాసనమాతు
స్సామేదిశతు కాంక్షితం

92. రుద్రా రుద్ర సమప్రఖ్యా
ప్రథమాః ప్రథితౌజసః
భూతాఖ్యాశ్చ మహావీర్యాః
మహాదేవసమప్రభాః

93. నిత్యముక్తా నిరుపమా
నిర్ద్వంద్వానిరుప ప్లవాః
సశక్తి యస్సానుచారా
సర్వలోక నమస్కృతాః

94. సర్వేషామేవలోకానాం
సృష్టిసంహారణక్షమాః
పరస్పరానురక్తాశ్చ
పరస్పరమనువ్రతాః

95. పరస్పరమతిస్నిగ్ధాః
పరస్పరనమస్కృతాః
శివప్రియతమానిత్యం
శివలక్షణలక్షితాః

96. సౌమ్యాధర సథామిశ్రీ
శ్చాంతరాళద్వయాత్మికాః
విరూపాశ్చసురూపాశ్చ
నానారూపధరా స్తథా

97. సత్కృత్యశివయోరాజ్ఞాః
తేమేకామం దిశంతువై
దేవ్యాప్రియసఖీవర్గో
దేవీలక్షణలక్షితః

98. సహితోరుద్రకన్యాభి
శ్శక్తిభిశ్చాప్యనేకశః
తృతీయావరణేశంభో
గ్భక్త్యానిత్యం సమర్చితః

99. సత్కృత్య శివయోరాజ్ఞాం
సమేదిశతుమంగళం
దివాకర మహేశస్య
మూర్తిర్దీప్త సుమండలః

100. నిర్గుణోగుణసంకీర్ణ
స్తథైవగుణ కేవలః
అవికారాత్మకశ్చాద్య
ఏకసామాన్యవిక్రియః

101. అసాధారణకర్మాచ
సృష్టిస్థితిలయ క్రమాత్
ఏవంత్రిథాచతుర్ధాచ
విభక్తాః పఞ్చధాపునః

102. చతుర్థావరణేశంభోః
పూజితశ్చానుగైస్సహ
విశ్వప్రియః శివాసక్తః
శివపాదార్చనేరతః

103. సత్కృత్యశివయోరాజ్ఞాం
సమేదిశతు మంగళం
దివాకరషడంగాని
దీప్తాద్యాశ్చాష్టశక్తయః

104. ఆదిత్యోభాస్కరోభాను
రవిశ్చేత్యనుపూర్వశః
అర్కోబ్రహ్మాతథారుద్రో
విష్ణుశ్చాదిత్యమూర్తయః

105. విస్తరాసుతరాబోధిన్యా
ప్యాయిన్యశ్చాపరాఃపునః
ఉషాప్రభాతథాప్రాజ్ఞా
సంధ్యాచేత్యపిశక్తయః

106. సోమాదికేతుపర్యన్తం
గ్రహాశ్చశివభావితాః
శివయోరాజ్ఞయానున్నా
మంగళం ప్రదిశంతుమే

107. అథవాద్వాదశాదిత్యా
స్తదాద్వాదశశక్తయః
ఋషయో దేవగంధర్వాః
పన్నగాప్సరసాంగణాః

108. గ్రామణ్యాశ్చతథాయక్షు
రాక్షసాశ్చసురా స్తథా
సప్త సప్త గణాశ్చైతే
సప్తచ్ఛందో మయాహయాం.

109. వాలఖిల్యా దయశ్చైవ
సర్వేశివపదార్చకాః
సత్కృత్య శివయో రాజ్ఞాం
మంగళం ప్రదిశంతు మే

110. బ్రహ్మాథ దేవ దేవస్య
మూర్తిర్యాభమండలాధిపః
చతుష్షష్టిగుణైశ్వర్యో
బుద్ధితత్త్వే ప్రతిష్ఠితః

111. నిర్గుణోగుణ సంకీర్ణ
స్తథైవగుణ కేవలః
అవికారాత్మకో దేవ
స్తతఃస్సాధారణఃపురః

112. అసాధారణకర్మాచ
సృష్టిస్థితిలయక్రమాత్
భువంత్రిధా చతుర్ధాచ
విభక్తః పంచధాపునః

113. చతుర్థావరణేశంభోః
పూజితస్సహానుగైః
శివప్రియశ్శివాసక్త
శ్శివపాదార్చనేరతః

114. సత్కృత్య శివయోరాజ్ఞాం
సమేదిశతుమంగళం
హిరణ్యగర్భోలోకేశో
విరాట్కాలశ్చపూరుషః

115. సనత్కుమార స్సనకః
సనందశ్చ సనాతనః
ప్రజానాంపతయశ్చైవ
దక్షాద్యా బ్రహ్మసూనవః॥

116. ఏకాదశః సపత్నీకా
ధర సంకల్పఏవచ,
శివార్చనర తాశ్చైతే
శివభక్తి పరాయణాః॥

117. శివాజ్ఞా వశగాస్సర్వే
విశంతు మను మంగళం
చత్వారశ్చ తథావేదా
స్సేతిహాస పురాణకాః

118. ధర్మశాస్త్రాణి విద్యాభి
వైదికా భిస్సమన్వితాః
పరస్పర విరుద్ధార్థాః
శివ ప్రకృతిపాదకాః

119. సత్కృత్య శివయోరాజ్ఞాం
మంగళం ప్రదిశంతుమే
అథరుద్రో మహాదేవః
శంభోర్మూర్తిర్గరీయసీ

120. వహ్న్యాయం మండలాధీశః
పౌరుషైశ్వర్య వాన్ప్రభుః
శివాభిమాన సంపన్నో
నిర్గుణస్త్రి గుణాత్మకః

121. కేవలంసాత్వికశ్చాపి
రాజసశ్చైవ తామసః
అవికార రతఃపూర్వం
తతస్తు సమవిక్రియః

122. అసాధారణ కర్మాచ
సృష్ట్యాది కరణాత్పృథక్
బ్రహ్మణోపి శిరశ్ఛేత్తా
జనకస్తస్య తత్సుతః

123. జనక స్తనయశ్చాపి
విష్ణోరపి నియామకః
బోధకశ్చతయోర్నిత్య
మనుగ్రహాకరః ప్రభుః

124. అండస్యాంత ర్బహిర్వర్తీ
రుద్రలోకద్వయాధిపః
శివప్రియ శ్శివాసక్తః
శివపాదార్చనే రతః

125. శివస్యాజ్ఞాం పురస్కృత్య
సమేదిశతు మాంగళం
తస్యబ్రహ్మషడంగాని
విద్యేశాంతంతథాష్టకం

126. చత్వారోమూర్తిభేదాశ్చ
శివపూర్వాశ్శివార్చకాః
శివోభవోహరశ్చైవ
మృడశ్చైవతథాపరః

127. శివస్యాజ్ఞాంపురస్కృత్య
మంగళం ప్రదిశంతు మే
అథవిష్ణుర్మహేశస్య
శివస్యైవపరాతనుః

128. వారితత్వాధిపసాక్షా
దవ్యక్తపదసంస్థితః
నిర్గుణస్తత్వబహుళ
స్తథైవగుణకేవలః

129. అవికారాభిమానీచ
త్రిసాధారణవిక్రియః
అసాధారణకర్మాచ
సృష్ట్యాదికరణాత్పృథక్

130. దక్షిణాంగభవేనాపి
స్పర్ధమానఃస్వయంభువః
ఆదేసబ్రహ్మణాసాక్షాత్
సృష్టస్రష్టాచతస్యతు

131. అండస్యాంతర్బహిర్వర్తీ
విష్ణుర్లోకద్వయాధిపః
అసురాస్తకరశ్చక్రీ
శక్రశ్చాపితథానుజః

132. ప్రాదుర్భావశ్చ దశధా
భృగుశాపచ్ఛలాదిహ
భూభారనిగ్రహార్థాయ
స్వేచ్ఛయావతారక్షితౌ

133. అప్రమేయబలో మాయీ
మాయయా మోహయజ్జగత్
మూర్తింకృత్వా మహావిష్ణుః
సదావిష్ణు మథాపివ

134. వైష్ణవైః పూజితో నిత్యం
మూర్తిత్రయమయాసనే
శివప్రియశ్శివాసక్తః
శివపాదార్చనేరతః
శివస్యాజ్ఞాంపురస్కృత్య
సమేదిశతుమంగళం

135. వాసుదేవో నిరుద్ధశ్చ
ప్రద్యుమ్నశ్చతతఃపరః
సంకర్షణస్సమాఖ్యాతా
చతస్రో మూర్తయో హరేః

136. మత్స్యఃకూర్మోవరాహశ్చ
నారసింహోథవామనః
రామత్రయంతథాకృష్ణో
విష్ణుస్తురగవక్త్రకః

137. చక్రంనారాయణస్యాస్త్రం
పాంచజన్యంచాశార్ఙకం
సత్కృత్యశివయోరాజ్ఞాం
మంగళం ప్రదిశంతు మే

138. ప్రభాసరస్వతీ గౌరీ
లక్ష్మీశ్చశివభావితా
శివయోశ్శాసనాదేతౌ
మంగళంప్రదిశంతుమే

139. ఇంద్రోగ్నిశ్చయమశ్చైవ
నిరుఋతిర్వరుణస్తథా
వాయుస్సోమః కుబేరశ్చ
తథేశాన త్రిశూలధృక్

140. సర్వేశివార్చనరతాః
శ్శివసద్భావ భావితాః
సత్కృత్య శివయోరాజ్ఞాం
మంగళం ప్రదిశంతుమే

141. త్రిశూలమథ వజ్రంచ
తథాపరశుసాయకే
ఖడ్గపాశాంకుశంచైవ
పినాకశ్చాయుధోత్తమః

142. దివ్యాయుధాని దేవస్య
దేవ్యాశ్చైతాని నిత్యశః
సత్కృత్య శివయోరాజ్ఞాం
రక్షాంకుర్వన్తు మేసదా

143. ఋషరూపధరో దేవః
సౌరభేయో మహాబలః
బడబాఖ్యానలస్పర్ధాం
పంచగోమాతృభిర్వృతః

144. వాహనత్వ మనుప్రాప్త
స్తపసా పరమేశయోః
తయోరాజ్ఞాం పురస్కృత్య
సమేకామం ప్రయచ్ఛతు

145. నందాసునన్దాసురభిః
సుసీలాసుమనా స్తథా
పంచగోమాతరస్త్వేతా
శివలోకేవ్యవస్థితాః

146. శివభక్తిపరానిత్యం
శివార్చన పరాయణాః
శివయోశ్శ్వా సనాదేవా
దిశన్తుమమవాంఛితం

147. క్షేత్రపాలో మహాతేజా
నీలజీమూత సన్నిభః
దంష్ట్రాకరాలవదనః
స్ఫురద్రక్తాధరోజ్జ్వలః

148. సక్తోర్ధ్వమూర్ధజశ్శ్రీమాన్
భృకుటీకుటిలేక్షణః
రక్తవృత్తత్రినయనః
శశిపన్నగభూషణః

149. సగ్నత్రిశూలపాశాశి
కపాలోర్జిత పాణికః
భైరవోభైరవైశ్శివైః
యోగినీభిశ్చ సంవృతః

150. క్షేత్రేక్షేత్రే సమాసీనః
స్థితోజోరక్షకస్సతాం
శివప్రణామ పరమః
శివసద్భావ భావితః

151. శివాశ్రితాన్విశేషేణ
రక్షన్త్యత్రాని వేరసాన్
సత్కృత్యశివయోరాజ్ఞాం
సమేదిశతు మంగళం

152. తాలజంఘాదయస్తస్య
ప్రమావరణేర్చితాః
సత్కృత్య శివయోరాజ్ఞాం
చత్వారస్స మవన్తుమాం

153. భైరవాద్యాశ్చయేచాన్యే
సమన్తాత్తస్య వేష్టితాః
తేపిమామనుగృహ్ణన్తు
శివశాసన గౌరవాత్

154. నారదాద్యాశ్చమునయో
దివ్యాదేవైశ్చ పూజితాః
సాధ్యానాగాశ్చ యేదేవా
జనలోక నివాశినః

155. వినివృత్తాధికారాశ్చ
మహర్లోకనివాశినః
సప్తర్షయస్తథాన్యేవై
వైమానికగణైసహ

156. సర్వేశివార్చనరతా
శ్శివాజ్ఞావశవర్తినః
శివయోరాజ్ఞయాచైవ
దిశంతు మమకాంక్షితం

157. గన్ధర్వాద్యాః పిశాచాన్తా
చతస్రో దేవయోనయః
సిద్ధావిద్యాధరాద్యాశ్చ
పిశాచాన్యనభశ్చరాః

158. అసురా రాక్షసాశ్చైవ
పాతాళ తలవాసినః
అనన్తాద్యాశ్చ నాగేన్ద్రాః
వైనతేయాదయో ద్విజాః

159. కూష్మాండాప్రేత భేతాళాః
గ్రహాభూత గణాః పరే
ఢాకిన్యాశ్చాపి యోగిన్యః
శాకిన్యశ్చాపి తాదృశాః

160. క్షేత్రారామగృహాదీని
తీర్థాన్యాయతనానిచ
ద్వీపాస్సముద్రా నద్యశ్చ
నదీశ్చాన్యే సరాంసిచ

161. గిరయశ్చసుమేర్వాద్యాః
కాననాని సమంతతః
పశవః పక్షిణోవృక్షాః
కృమికీటాదయో మృగాః

162. భువనాన్యపిసర్వాణి
భువనానా మధీశ్వరః
అణ్డాన్యావరణైస్సార్థం
మాసాశ్చదశదిగ్గజాః

163. వర్ణాపదా నిమన్త్రాశ్చ
తత్వాన్యపి సహాధిపైః
బ్రహ్మాండ ధారకారుద్రా
రుద్రాశ్చాన్యే సశక్తికాః

164. యచ్చకించిజ్జగత్యస్మిన్
దృష్టంచాను మితంశ్రుతం
సర్వేకామంప్రయచ్ఛంతు
శివయోదేవశాసనాత్

165. అథవిద్యా పరాశైవీ
పశుపాశ విమోచనీ
పంచార్థ సంజ్ఞితాదివ్యా
పశువిద్యా బహిష్కృతా

166. శాస్త్రంచశివధర్మాఖ్యం
ధర్మాఖ్యం చతదుత్తరం
శైవాఖ్యం శివధర్మాఖ్యం
పురాణం శ్రుతిసమ్మితం

167. శైవాగమాశ్చ యేచాన్యే
కామికాద్యాశ్చ తుర్విధాః
శివాభ్యామ విశేషేణ
సత్కృత్యేహ సమర్చితాః

168. తాభ్యామేవ సమాజ్ఞాతా
మనూభి(ప్రేతసిద్ధయే
కర్మేదమను మన్యంతాం
సఫలం సాధ్వనుష్ఠితం

169. శ్వేతాధ్యానకులీ శాతాః
ససిష్యాశ్చాపి దేశికాః
తత్సంతతీయగురవో
విశేషాద్గురవోమమ

170. శైవామాహేశ్వరాశ్చైవ
జ్ఞానకర్మ పరాయణాః
కర్మేదమను మన్యంతాం
సఫలం సాధ్వనుష్ఠితం

171. కాసికా (బ్రాహ్మణాస్సర్వే
క్షత్రియాశ్చవిశః (క్రమాత్
వేద వేదాంగతత్వజ్ఞా
స్సర్వశాస్త్ర విశారదాః

172. సాంఖ్యావైశిషికాశ్చైవ
యోగానయ్యాయికానరాః
సౌరా(బ్రాహ్మ్యస్తథారౌద్రా
వైష్ణవాశ్చాపరేనరాః

173. శిష్టాస్సర్వే విశిష్టాశ్చ
శివశాసనయన్త్రితాః
కర్మేదమను మన్యంతాం
మమాభిప్రేతసాధకం

174. శైవాశ్శిద్ధాంతమార్గస్థా
శైవాః పాశుపతాస్తదా
శైవామహావ్రతధరాః
శైవాః కాపాలికాః పరే

175. శివాజ్ఞాపాలకాః పూజ్యా
మమాపిశివశాసనాత్
సర్వేమమాను గృహ్ణంతు
సంపన్నసఫలక్రియాః

176. దక్షిణజ్ఞాననిష్ఠాశ్చ
దక్షిణోత్తరమార్గగాః
అవిరోధేన వర్తంతాం
మన్త్రశ్రేయోర్థినోమమ

177. నాస్తికాశ్చశఠాశ్శైవ
కృతఘ్నాశ్చైవతామసాః
పాషండాశ్చాతిపాపాశ్చ
వర్తంతాందూరతోమమ

178. బహుభిఃకింస్తుతైరత్ర
యేఽపికేఽపిచిదాస్తికాః
సర్వేమామనుగృహ్ణంతు
సన్తఃకుర్వన్తుమంగళం

179. నమశ్శివాయ సాంబాయ
ససుతాయాదిహేతవే
పంచావరణరూపేణ
ప్రపంచేనావృతాయ తే

180. ఇత్యుక్త్వా ద్గండవద్భూమౌ
ప్రణిపత్య శివంశివాం
జపేత్పంచాక్షరీంవిద్యాం
అష్టోత్తరశతాంవరాం

181. తథైవ శక్తి విద్యాంచ
జపిత్వాతత్సమర్పణం
కృత్వాతంక్షమయిత్వేశం
పూజాం శేష్యాం సమాపయేత్

182. యేతత్పుణ్యతమంస్తోత్రం
శివయోర్హృదయంగమం
సర్వాభీష్టప్రదంసాక్షా
ద్భుక్తిముక్త్యేకసాధనం

183. యఇదంకీర్తయేన్నిత్యం
శృణుయాద్వాసమాహితం
సవిధూయాశుసపాపాని
శివసాయుజ్యమాప్నుయాత్

184. గోఘ్నశ్చైవకృతఘ్నశ్చ
వీరహా భ్రూణహాపిచ
శరణాగతఘాతీచ
మిత్రవిస్రంభఘాతకః

185. దుష్టపాపసమాచారో
మాతృహాపితృహాపివా

స్తవేనానేన జప్తేన
తత్తత్పాపాత్ప్రముచ్యతే

186. దుఃఖస్వప్న మహానర్థ
సూచికేషుభయేషు చ
యదికీర్తయేదేత
న్నతతోనర్థభాగ్భవేత్

187. ఆయురారోగ్యమైశ్వర్యం
యచ్చాన్యదపివాఞ్ఛితం
స్తోత్రస్యాస్యజపేత్తస్మిన్
తత్సర్వంలభతేనరః

188. అసంపూజ్య శివంస్తోత్రం
జపాత్ఫలముదాహృతం
సంపూజ్యచజపేత్తస్య
ఫలంవక్తుంనశక్యతే

189. ఆస్తామియం ఫలావాప్తి
రస్మిన్సంకీర్తితేసతి
సార్ధమంబికయాదేవః
శృత్వైవంది వితిష్ఠతి

190. కృతాంజలిపుట స్తస్మిన్
స్తోత్రమేతదుదీరయేత్
శివయోశ్శ్యాసనాదేవ
దిశంతుమమవాంఛితం

శివ మహాపురాణమునందలి వాయవీయసంహితయందు ఉత్తర ఖండమున
ముప్పది యొకటవ అధ్యాయము సంపూర్ణము

# ముప్పది రెండవ యధ్యాయము

## ఐహిక సిద్ధికర్మలు

ఓ కృష్ణా ! నీకు ఇహాముత్రఫలకర్మలు జెప్పితిని. క్రియాతపోజపధ్యానంబులచే నిహమందు ఫలముల నొసంగు శివధర్మములను జెప్పెద వినుము. పూజాహోమ జపధ్యాన తపోదానంబులచే నుత్కృష్టఫలంబు చేకూరును. సిద్ధమంత్రములు లేకున్నను పూజాహోమ స్తుతులచే ప్రతిబంధకముల పోగొట్టుకొని, సిద్ధఫలంబుల నొందనచ్చును. పాపనివారణకై శకునంబులచే నెట్లు చేయవలయునో తెలిసికొని యట్లాచరింప వలయును. మోహముచే నన్యథా యాచరించినచో ఫలము లభింపదు. విశ్వాసము లేకుండ నేపనియు చేయరాదు శ్రద్ధలేనిపని ఫలింపదు. దేవకర్మలయందపరాధము చేసినచో నిష్ఫలమగును. చెప్పిన ప్రకారమాచరించినవారికి నిహమందే ఫలము సిద్ధించును. సాధకుడు సిద్ధమంత్రములచే ప్రతిబంధకములను పోగొట్టుకొని విశ్వాసముతో శ్రద్ధగల్గి, కర్మలాచరించినచో సత్ఫలము నొందగలడు. లేనిచో సత్ఫలములు కోరువాడు జితేంద్రియుడై బ్రహ్మచారి యైనచో సత్ఫలము నొందగలడు. రాత్రిహవిష్యాన్నము గాని, పాయసముగాని, ఫలములుగాని, భుజించి, మనసాకూడా హింసానిషిద్ధకర్మల నాచరింపక సదాభస్మలిప్తుడై శుచివంతుడై, సువేషధారియై యుండి యొకానొక యనుకూల శుభదినంబున, పూర్వోక్త లక్షణంబులుగల్గి, యొక బారెడు ప్రదేశము గోమయంబుచే నలికి ముగ్గులుపెట్టి, పుష్పమాలలచే నలంకరించి, నడుమునందష్టదళ కమలము లిఖించి, శక్తియున్నచో కేసరంబులు గల్గిన స్వర్ణమయాష్టదళ పద్మంబును నుంచి, కర్ణికయందు నవరత్నములు స్థాపించి, పద్మమునకు నాళముకూడ నుంచి, యాయష్టదళములయందు నణిమాద్యష్టసిద్ధులున్నట్లు భావించి, రత్నలింగమును గాని, సువర్ణలింగముగాని స్ఫటికలింగముగాని లక్షణమైన లింగమును, పద్మకర్ణికయందు స్థాపించి గణసహిత శివుని యావాహనముచేసి యతని వామపార్శ్వమున మహేశ్వరుని కల్పింపవలయును. లేనిచో చతుర్భుజములు, చతుర్వక్త్రంబులు గలిగి సర్వాభరణ భూషితుడు, శార్దూల చర్మవసనుడు, మందస్మితవదనుడు, వరదాభయహస్తుడు, మృగటంకధరుడు నగు

మూర్తిగాని, లేనిచో, నష్టభుజడగు మూర్తినిగాని కల్పించి, దక్షిణహస్తం బుల త్రిశూలపరశుఖడ్గ వజ్రంబులు, వామహస్తంబుల పాశాంకుశఖేటనాగం బులును, ప్రతి వక్త్రమును బాలార్కసదృశంబుగను, త్రిలోచనంబుగ నున్నట్లు మూర్తిని తయారుచేసి, పూర్వముఖము సౌమ్యాకారముగను, దక్షిణముఖము నీలజీమూతసదృశంబై, ఘోరరూపముగ నున్నట్లును, నుత్తరముఖము, విద్రుమ ప్రఖ్యమై. నీలాలకవిభూషితమైనదిగను, పశ్చిమ ముఖము పూర్ణచంద్రాభముగను. సౌమ్యేందుకళాధరముగను భావించి, యతని యంకమున మహాలక్ష్మీసదృశురాలై శ్యామవర్ణయై, సర్వమనోహా రిణియై, పరాశక్తి యున్నట్లు భావించి, ఏక మూర్తిని కల్పించి, వారి నావాహ నించి బాహ్యాభ్యంతరములయందు యజింపవలయును. వారినభిషేకించుటకై కపిలగోపంచగవ్యంబుల నుపయోగింపవలయును. దాడిమబీజములతోను, పం చామృతములతోడను, యభిషేకము చేయుట శ్రేష్ఠము. దేవునకెదురుగా రత్నచూర్ణంబులచే ముగ్గులు పెట్టవలెను. కర్ణికయం దీశానకలశను స్థాపింప వలయును. నలువైపుల సద్యోజాతాదికలశను స్థాపింపవలెను. అష్టదిక్కుల యందు విద్యేశాద్యష్టకలశలను స్థాపించి, ఈకలశలన్నిటిని తీర్థోదకములచే పూరించి పూర్వమువలె సూత్రముబంధించి మంత్రయుతముగ గంధాది పుణ్య ద్రవ్యము లాకలశయందుంచి పట్టువస్త్రము చుట్టబెట్టి. మంచిగవ్యములచే సర్వ మంగళనిస్వనంబులతో భగవంతుని స్నానముచేయించి, తదుపరి కుశోదక ములచేతను, స్వర్ణరత్నోదకములచేతను, గంధపుష్పములచేతను, మంత్రయుత ముగ స్నానముచేయించి. గంధపుష్ప ధూపదీపంబులతో పూజ సమాప్తి చేసి, యొకఫలములగాయతు పదకొండు ఫలములవరకు శక్తి ననుసరించి, సువర్ణపుష్పంబులచే పూజించి యింకను సువర్ణరత్నకుసుమంబులతోను, పరి మళ పుష్పంబులతోడను, నల్లకలువలు, తెల్లకలువలు, ఎర్రకలువలు, శ్వేత పద్మంబులు, నరుణపద్మంబులు, మొదలగువాటిచే నర్చించి, కృష్ణాగరు కర్పూర గుగ్గులధూపంబులు వేసి, కపిలఘృతదీపంబులు, కర్పూరదత్తిదీపంబు లిడి, పంచబ్రహ్మలను షడంగాములచే నర్చించి, పాలు బెల్లముతో పాయ సము తయారుచేసి నైవేద్యమిడి, పాటలోత్పల పద్మాది సుగంధితపానీ యంబు లొసంగి, పంచ సుగంధోపేతమైన తాంబూల మొసంగి సువర్ణరత్న

ఖచిత భూషణంబు లొసంగి నూతన సూక్ష్మవసనంబులిచ్చి గానవాద్యం బులు ప్రయోగింపుచు, దర్పణము జూపించి మూలమంత్రము లక్షజపించి, మరియొకసారి పునఃపూజ గావించి, నూటపది వర్ణ్యాయములు హోమము చేసి, మారణోచ్చాటనలు ప్రయోగింపవలసినచో ఘోరరూపుడగు నీశ్వ రుని ధ్యానించి శివలింగముయందుగాని, శివాగ్నియందుగాని, శివవిగ్రహ మందుగాని శివుని పూజింపవచ్చును. శాంతిపుష్టి కార్యములయందు సౌమ్య రూపుడగు శంభుని ధ్యానింపవలయును. మారణాది కార్యముల యందా యస, స్రుక్స్రువంబు లుపయోగింపవలయును. శాంతి కార్యములయందు సువర్ణ స్రుక్స్రువంబు లుపయోగింపవలయును. దూర్వాంకురంబులు, ఘృత

క్షీరములతోడను, మధుఘృతముతో గూడినచరువు కేవలము పాలతోను హోమంబు చేసిన నపమృత్యువు తొలగును. వశీకరణకై జాజిపుష్పం బులు ఘృతముతో కలిపి హోమంబు చేయవలయును. ఘృతముతో గూడిన కరవీరపుష్పంబులతో హోమంబు గావించిన నాకర్షణకలుగును. తైలముచే నుచ్చాటనము మధువుచే స్తంభనము. మరియు నావాలుచే కూరుస్తంభనము వెల్లుల్లిచే పతనముకల్గును. ఖరోష్ట్రరక్త హోమముచే, ఆపముకల్గును, తిలమిశ్ర మగు ముళ్లమోదుగ బజములచే మారణోచ్చాటనకల్గును. నారికేళ తైల ముచే విద్వేషణముకల్గును మాముగబజములచే సేనాస్తంభనము, బంధనము కల్గును. సకలహోమద్రవ్యముల నరావాలుతో కలిపి హోమముచేసినచో సేనాస్తంభనముకల్గును. అభిచారమునకై, హస్తముచే పిండిన తైలము హోము ముచేయవలయును. మరియు నభిచారమునకై, పగిటితో గూడినపొట్టు, దూది ఆవనూనెతో కలిపి, హోమము చేయవలయును. జ్వరోపశాంతి సౌభాగ్యములకై క్షీర హోమము చేయవలెను. మధుఘృతదధిహోమంబులచే సర్వసిద్ధులుకల్గును. క్షీరంబులు, తండులంబులు, చరుహోమములచే సకలసౌభాగ్యంబులుకల్గును. శాంతిపుష్టులకై, సప్తసమిధలచే హోమము చేయవలయును, ద్రవ్య విశేషణములకొలది, వశ్యాకర్షణములుకల్గును. ఇవియుగాక సకలైశ్వర్యంబులు కల్గును. బిల్వపత్ర హోమముచే శత్రువిజయముకల్గును. మోదుగచంద్రసమి ధలచె శాంతి కల్గును. గ్రహములను, కపటులను జయించుటకై, కరవీరము

జిల్లేడులతో హోమము చేయవలెను. క్రూరకర్ములు యాభిచారిక మంత్ర హోమంబులు చేయుచుందురు. వాటిని నివారించుటకై, శాంతిపుష్టికర్మలు చేయవలెను. శాంతులు శాంతికర్మలే చేయుచుందురు. ఆతతాయులుమారణ కర్మలే చేయుచుందురుగాన ప్రతిక్రియలచే నివారించుకొనవలెను. వారల నట్లుచేసినచో దోషములేదు. స్వరాష్ట్రపతిపై యాభిచారకములు ప్రయోగింపరాదు. ధర్మిష్ఠులయందు, పూజ్యులయం దిట్టి యాభిచారకములు చేయరాదు. అనవసరముగ నాతతాయులయందుకూడ ప్రయోగింపరాదు. తనదేశపురాజుయందు శివభక్తునియందు. ప్రయోగించినచో పతితుడగును. ఒకవేళప్రమాదముచే చేసినను పశ్చాత్తప్తుడై ప్రాయశ్చిత్తముచేసికొనవలెను. దరిద్రుడైనను ధనవంతుడైనను బాణలింగమును పూజింపవలెను. లేనిచో స్వయంభూలింగమునుగాని, ఋషిస్థాపితలింగమునుగాని, శక్తివంతుడైనచో, హేమలింగమునుగాని,రత్నలింగమునుగాని, పూజింపవలెను. ద్రవ్యాభావమైనచో, మానసికపూజగావింపవలెను. వారివారిశక్తిననుసరించి, శివార్చన చేసినచో నవశ్యము ఫలములభించును. కర్మలుచేసినచో ఫలములెందుకుకనబడవు? ఒకసారిచేసిన ఫలముకనబడనిచో రెండవసారిచేయువలెను. రెండవసారియు కనబడనిచో ముమ్మారుచేసినతప్పక ఫలము కనిపించును. పూజలో నుపయోగించిన శ్రేష్ఠవస్తువులన్నియు దక్షిణతోసహా గురువునకీయవలెను. గురువునకీయనిచో, శివునకే యర్పింపవలెను. లేక శివభక్తులకైన నీయవలెను. తదితరులకీయరాదు. తానుపయోగించుకొన్నచో ఫలితముండదు. నిత్యమునర్చించెడి లింగద్రవ్యములు తానుపయోగించుకొనవచ్చును. దోషములేదు. నిత్యము నర్చించెడిలింగమును స్వయముగా నర్చింపకున్నను యితరులచే నర్చింపచేయవచ్చును. యథోక్తకర్మలన్నియు విధువక చేయువలెను. యథోక్తకర్మలాచరించినవారికే దేషములుండవు ఫలములభించెడివానిని విడిచినప్రయోజనమేమి? ఉత్తమ లబ్ధులకై యిట్టికర్మలాచరింపవలయును. ఇట్టి క్రియలచే శత్రుసంహారమగును. వ్యాధులునశించును. మృత్యువుతొలగును. ఏయుపాయములుండవు. ఎంతకృపణుడైనను పూజింపబడును. ఎంతదరిద్రుడైనను, కుబేరుడగును. ఎంతవికారుపుడైనను, మన్మథుడగును. ఎంతవృద్ధుడైనను, తరుణుడగును. శత్రువులు మిత్రులగుదురు. ఎంతవిరోధియైనను, తత్కాలమందే కింకరు

డగును. విష మమృతమగును. అమృతము విషమగును, సాగరము దిబ్బ యగును, దిబ్బ సాగరమగును పర్వతములు గోతులగును గోతులు పర్వతము లగును అగ్ని సరోవరమగును సరోవర మగ్నియగును, వనముద్యానవనము ఉద్యానవనము వనమగును, క్షుద్రసింహము లేడియగును లేడి క్షుద్రసింహ మగును స్త్రీలు వశులగుదురు లక్ష్మి స్థిరముగ నుండును. స్వైరిణియైనను స్వచ్ఛందచారిణియైనను, ప్రియవాక్యములు బల్కును. కీర్తిగణనీయమగును మేధావంతుడగును. కఠినహృదయమైనను సుస్నిగ్ధమగును. మరియు వాయు వంతశక్తియు మత్తగజమంతయు నిముసమున నిల్చును. శత్రుపక్షక్రియలన్నియు స్తంభించిపోవును. శత్రువులు నపుంసకులగుదురు. రిపులు వశులగుదురు. మిత్రులు సజీవులగుదురు. ఆసన్నదురదృష్టము నశించును. అమృతస్వాదుడగును. ఎంతయపథ్యవస్తువైనను నమృతమగును. సదా నవయవ్వనుడగును. అరచేతి ఆమల కమువలె గతాగతంబుల నెరుంగును. అణిమాది సిద్ధులన్నియు ననాయాసముగ లభించును. బహువిధములుగ జెప్పనేల, సర్వకోర్కెలీడేరును. శివపూజలచే పొందలేని దేదియునుండదు.

శివ మహాపురాణమునందలి వాయువీయసంహితయందు ఉత్తరఖండమున
ముప్పది రెండవ యధ్యాయము సంపూర్ణము

---

## ముప్పదిమూడవ యధ్యాయము

### ఆముష్మిక కర్మఫలములు

ఇటుపై పరలోక ఫలమునిచ్చు కర్మలను జెప్పెదను వినుము. వీటికి మించిన కర్మలు భువనత్రయమునందును కానరావు! ఈకర్మలు పుణ్యాతిశయ సంయుక్తమైనవి. సర్వదేవానుష్ఠితములైనవి. త్రిమూర్తులచె విశేషముగ నారాధింప బడుచున్నవి. ఇంద్రాది లోకపాలురు, సూర్యాది నవగ్రహంబులు, విశ్వామిత్రాది మహర్షులు, శ్వేతాగస్త్యదధీచులు. శివాశ్రితుల మగుమేము,

నందీశ్వరమహాకాల భృంగీశాది మహేశ్వరులు పాతాళ వాసులగు దైత్యులు, శేషాదిమహోరగులు, సిద్ధయక్ష గంధర్వ రాక్షసభూత పిశాచంబులు, నాము ష్మిక, కర్మలుచేసి, వారి వారి పదవుల స్వీకరించిరి. దీనిచే సురలు దేవత్వమొం దిరి. బ్రహ్మ బ్రహ్మత్వము, విష్ణువు వ్యాపకత్వము, రుద్రుడు రుద్రత్వము, యింద్రుడు యింద్రత్వము గణేశులు గణేశత్వము, నొందిరి. సితచందనతో యములచే. శివాశివరూపముగు లింగమును స్నానముచేయించి, శ్వేతపద్మము లచే పూజించి సర్వలక్షణ సంయుక్తమగు పద్మాసనంబిడి తనవిభవాను సార ముగ రత్నఖచిత స్వర్ణపద్మంబు సృజించి, పద్మకేసరములమధ్య లింగమును స్థాపించి. యంగుష్ఠ ప్రమాణముగు విగ్రహామునుగాని స్థాపించి, సర్వగంధం బులుపూసి! దక్షిణభాగంబున స్థాపించి, బిల్వపత్రములచే పూజించి. దక్షిణ పార్శ్వమున నగరు, పశ్చిమంబున మణిశిల, ఉత్తరంబున చందనము, తూర్పున నరదళము, గంధములు లింగమునకు పూయవలెను, తదుపరి విచిత్రరమ్య సుగంధ కుసుమంబులచే పూజించి కృష్ణాగగరు గుగ్గులాది ధూపంబులిడ్చి, పట్టువస్త్రంబులిడి ఘృతదీపంబిడి. ఘృతసంయుత పాయసముని వేదనముచేసి, భక్తితో నమస్కరించి, స్తుతించు క్షమార్పణవేడి, పిండి వంటలు కూరలు పచ్చళ్లు మొదలగు వాటితో మహానైవేద్యముచేసి, శివమంత్రముచే సకలవ స్తువులు, శివునకర్పించి దక్షిణా మూర్తి రూపుడగు శివునాశ్రయించి పంచ భూతాత్మకుడు, పంచగంధమయుడు నగుశివునర్చించి సర్వపాపవిముక్తుడై శివ లోకము నొందగలడు. ఈశివలింగ మహావ్రతము, వ్రతములలో నుత్తమంబై నది. కడుగోప్యమనది. శివుభక్తుడవుగాన జెప్పితిని భక్తిలేనివారికి చెప్పరాదు. ఇదిశివభక్తులకే జెప్పమని శివుడు చెప్పియుండెను.

శివ మహాపురాణము నందలి వాయవీయసంహిత యందుత్తరఖండమున ముప్పదిమూడవ అధ్యాయము సంపూర్ణము.



# ముప్పది నాలుగవ యధ్యాయము

## బ్రహ్మ విష్ణువులు మోహపడుట

శివలింగార్చనచే సిద్ధ్యైశ్వర్యైహికాముష్మిక కామ్యములు సిద్ధించును. ఈ ఫలముల కై లింగమునుగాని, విగ్రహమునుగాని పూజింపవచ్చును: సర్వలోకములు లింగమయములై యుండెను. సర్వము లింగప్రతిష్ఠితమై యుండెను. ఒక లింగమును ప్రతిష్ఠించినచో సర్వమును ప్రతిష్ఠించినట్లగును. త్రిమూర్తులు, నితర దేవతలు లింగప్రతిష్ఠ చేసి వారివారి పదవులనొందిరి. ఇంతకన్న నేమి చెప్పుదును? శివుడు కాశియందు విశ్వేశ్వర లింగము ప్రతిష్ఠ చేసెను. ఇహపరలోక సుఖముల కై లింగప్రతిష్ఠ చేయవలయును. లింగము కానిచో విగ్రహము నైనను. స్థాపింపవలయునను, యుపమన్యువాక్యములు విని శ్రీకృష్ణపరమాత్మ పరమేశ్వరుడు లింగస్వరూపుడగుటకు కారణమేమి? లింగస్వరూపుడగు శివు నెట్లర్చింపవలయును? చెప్పుమన నుపమన్యు డిట్లు చెప్పదొడంగెను.

లింగమనగా నవ్యక్తము ఇది త్రిగుణాత్మకమైనది, ప్రళయము చేయును. ఇది యనాద్యంతమైనది, విశ్వమునకు మూలకారణమైనది. మూల ప్రకృతి యగు మాయ దీనియందే జనించెను. ఈమాయచేతనే చరాచర జగత్తులన్నియు జనించెను. శుద్ధము, యశుద్ధము, శుద్ధాశుద్ధములనవి మూడు విధంబులుగ జనించెను. తరువాత శివుడు, మహేశ్వరుడు, రుద్రుడు, విష్ణువు, పితామహుడు ననువారలు జనించిరి. తదుపరి భూతేంద్రియంబులు జనించి, శివాజ్ఞచే లీనమగుచుండును. శివుడు సృష్టిసంహారకుడై లింగస్వరూపుడయ్యెను. ఇతని యాజ్ఞలేనిదే యేమియు జరుగదు. ఇతనిచే విశ్వము జనించి యితనియందే లయమగుచున్నది. ఈ కారణముచే లింగస్వరూపుడయ్యెను. లీయతే ఇతి లింగం సమస్తము నితనియందు లీనమగుచున్నది. గాన లింగమని పిలువబడుచుండెను. లింగము నుమామహేశ్వరు లధిష్ఠించి యుందురు గాన లింగపూజలు చేయవలయును. లింగము మహేశ్వరుడు. పానుమట్టము, మహేశ్వరి యన్నై యుండెను. పానుమట్టసహితమగు లింగమును పూజించినచో నుమామహేశ్వరుల పూజించిన వారగుదురు. నిజముగా వారికి స్వరూపములే శివు. వారు నిత్యపరిశుద్ధులు. వారికి లింగదేహములు

లేవు. భక్తులకై యీ దేహములు ధరించిరి గాని, భోగములకై కాదు. శివుడే పరమాత్మ. పార్వతియే పరమశక్తి. ఈ శక్తి యాజ్ఞచే చరాచర జగత్తులు జనించు చున్నవి. ఈ శక్తి మహిమ వర్ణ శతంబులైనను వర్ణింపనలవికాదు. ఒకానొకప్పుడు బ్రహ్మ నారాయణులు కూడ మోహితులైరి. పూర్వము త్రిభువన ప్రళయము జరిగినప్పుడు విష్ణువు యుదకము నందే శయనించి సుఖముగా నిద్రించెను. బ్రహ్మ యధాలాభమున విష్ణువునిగాంచి శివమాయా మోహితుడై నీవెవరవని, విష్ణువును లేపియడుగ విష్ణువు మనంబున కోపించి పైకి కోపములేనట్లు నటించి యోవత్సా! నీవెక్కడనుండివచ్చితివి? నీయాపన యేమో చెప్పుమనగ, రజోగుణప్రధానుడగు బ్రహ్మ విష్ణువాక్కులు విని, ఓ వత్సా! యని నన్ను గురువు శిష్యునివలె సంబోధించుచుంటివి. నీవు నన్నెరుగవా? సకల సృష్టులు నేనేచేయుచుంటిని. నేనేప్రజాపతిని. నాశరీరము త్రిధావిభజించి సృష్టిస్థితిలయంబులు చేయుచుంటిని. నన్ను మించినవాడు జగత్తునందు లేడన నవినాశియగు విష్ణువు, బ్రహ్మనుగాంచి నేనే యాదిపురుషుడను. ఆదికర్తను. సృష్టిస్థితి సంహారకర్తను, మీరందరు, నవినాశనమైన నాశరీరమునుండియే ప్రాదుర్భవించిరి. నాయాజ్ఞచే నానుండి, త్రిమూర్తులుగ విభజింపబడి సృష్టిస్థితిలయంబులు చేయుచుండిరి. నీవు, నారాయణుడు జగన్నాధుడని మరచితివి. నీతండ్రి నగు నన్నే యవమానించితివి. ఇందులో నీయపరాధమేమియు లేదు. నీవు నామాయచే మోహపడితివి. నాయనుగ్రహముచే నీభ్రాంతి నశించును. ఓ బ్రహ్మా! నాసత్యవాక్కులు వినుము. నేను సర్వదేవేశ్వరుడను. కర్తను, భర్తను, హర్తను, నాతో తుల్యుడగు ప్రభువులేడు అని [illegible] హరివిధులు వాదులాడుచు మహా భయంకర రోమహర్షణ ముష్టియుద్ధము చేయుచుండ వారి దర్పమడచుటకై వారుభయులమధ్యనుండి పరమాద్భుతమగు, లింగముద్భవించెను. ఆలింగము, జ్వాలామాలసహస్రాఢ్యమై, యప్రమేయమై, యనుపమేయమై, క్షయవృద్ధి రహితమై, యాదిమధ్యాంతవర్జితమై యుండ, బ్రహ్మ విష్ణులు దానిని గాంచి విమోహితులై, విస్మితులై, యుద్ధము మాని, యిదేమియని యాలోచింపుచు నిజము గుర్తెరుంగలేక దానియాద్యంతములు తెలియగోరి, పరీక్షింపదలచి బ్రహ్మ పక్షములతో గూడిన హంసయై, మనోవేగుడై దివికెగసెను.

విశ్వాత్ముడగు నారాయణుడు నీలాంజన సమప్రభమగు వరాహరూపుడై యధోలోకముల కేగెను. ఇట్లు విష్ణువు, నతితొందరగ వేయి సంవత్సరంబులు ప్రయాణముచేసి లింగమూలము గాంచలేక జలమునుండి మరల భువి చేరు కొనెను. ఇట్లే బ్రహ్మకూడ నూర్ధ్వమునకు ప్రయాణముచేసి తుదిగానక మరల భువిచేరుకొనెను. వీరిరువురు, శివమాయా మోహితులై కృత్యాకృత్యంబు లెరుగక యొకరి నొకరు వీక్షించుచు నిలబడి యాలింగము చుట్టూ తిరుగుచు నిదియేమి యాశ్చర్యమని వింతగాంచు చుండిరి.

శివ మహాపురాణమునందలి వాయుపీయసంహితయం దుత్తరఖండమున
ముప్పది నాలుగవ యధ్యాయము సంపూర్ణము

---

## ముప్పదిఐదవ యధ్యాయము

### ఓం కారోత్పత్తి

ఇట్లు వారుండ నోమిత్యే కాక్షరం బ్రహ్మయనెడి దానిని ప్రతిపాదించెడి యోంకారనాదము వారచేవినుల బడెను. వారిరువురు రజస్తమోగుణప్రధానులై యుండుటచే దానియథార్థము వారుగుర్తెరుంగరైరి. ఓం అనెడి నోంయక్షరము చతుర్ధా విభజింపబడి, అకార, ఉకార, మకార, యర్ధమాత్రలతో నొప్పుచు నాల్గువిధములయ్యెను. వాటిలో నకారము లింగదక్షిణ భాగమునను, ఉకారము నుత్తరభాగంబునను, వాటిమధ్యను, మకారంబును, లింగోపరిభాగకంబున నర్ధమాత్రయగు నాదంబును ప్రజ్వరిల్ల సాగెను. అపరనూక్షర మిట్లు విభజింప బడినను, బ్రహ్మవిష్ణువులు, నసిరహాస్య మెరుంగరైరి. అపుడు వేదాత్మకముగ ప్రణవముమార్పు జెందెను. అదెట్లున, అకారము ఋగ్వేదముగను, ఉకారము యజుర్వేదముగను, మకారము సామవేదముగను, నాదమథర్వవేదముగను, గోచరింపజేసి తనస్వరూపమంతయు నేకాక్షరముగ వ్యక్తపరచియుండెను. తానుసృష్టినై, పంచబ్రహ్మమయుడై, సృష్టిస్థితిలయము

లకై బ్రహ్మావిష్ణురుద్రులను సృష్టించెను. లింగాధోభాగంబున కారణత్రయములనెడు బీజములను సృజించెను (అనగా స్థూలసూక్ష్మకారణంబులు) చతుష్షష్టికళలతోగూడిన యణిమాద్యష్టసిద్ధులను సృజించెను. వీటిచే దశదిశలు నిండి వ్యాపించియుండెను. స్వార్థమునకై యజుర్వేదము దశవిధములుగ స్థాపించెను. అనగా, క్రియలలో సత్వగుణము విష్ణువు, క్రియలలో నాదిక్రియ, లోకమందు స్థితి, త్రితత్వములలో విద్యాకళలో ప్రతిష్ఠాకళ, పంచబ్రహ్మలలో వామదేవుడు, లింగమధ్యభాగంబున, త్రికారణములచే యోనిరూపము, యజుర్వేదమయమై ప్రాకృతైశ్వర్యము, సామర్థ్యమునకై తపస్సు, నీవిధంబున దశధావిభజింపబడెను. గుణములలో తమోగుణప్రధానుడగు రుద్రుడు, క్రియలలో నాదిక్రియ, లోకములయందు సంహారము చేయుటలో శివతత్వము. కళలలో విద్యాకళ, పంచవక్త్రములలో నఘోరముఖము.

లింగభాగములలో పీఠము, త్రికరణములలో బీజరూపము. పౌరుషములలోనైశ్వర్యము. ఈవిధముగా జగత్తంతయు సామవేదముచే వ్యాపించియుండెను. అథర్వవేదమున యాత్మయనగా, నైర్గుణ్యమని చెప్పబడెను. (దయ) మూర్తులలో సదాశివుడగు మహేశ్వరుడు శ్రేష్ఠుడు. క్రియలలోనిష్క్రియ శ్రేష్ఠము పరమాత్ముడగు శివుడు భూతానుగ్రహాకారకుడుగాన, జీవులను తరింపజేయుచుండెను. ఇతడు మనోవాగాతీతుడు ఊర్ధ్వలోకములపై మనోమోదకరమగు చంద్రలోకము, నటుపై కైలాసముకలదు. అందీశ్వరుడుమతోనిత్యస్థితుడై యుండును. అక్కడినుండి తిరిగిరావలసినదేగాని, దానిపై నేలోకంబులులేవు. శాంత్యాది సకలకళాధిష్ఠానుడు, పంచబ్రహ్మమూర్తియునగు సదాశివుని యావాహనచేసి యర్చించినచో నిష్కళుడైనను సకలుడుగ గోచరించును. ఇతడు నాదబిందుపరాశక్తులకంటె నతీతుడు, తత్వాతీతుడు, తత్వరహితుడు. ఇతడు తనమాయచే సర్వకారణములను కల్పించుచుండెను. అనంతమైన శుద్ధికంటె పరమేశ్వరుడుపరుడై యుండెను. అనగా మంత్రాతీతుడు, సర్వవిద్యాధీశ్వరుడు, నితనికన్న పరమేదియులేదు. ఇతడుసర్వమంత్రస్వరూపుడు. శక్తిత్రయసమన్వితుడు, పంచవక్త్రుడు, దశభుజుడు, సకలనిష్కలుడు, నాదబిందువులకంటెపరుడు, విశ్వాధీశుడు, సుషుమ్నకంటెపరుడు, బ్రహ్మరంధ్రమందున్న

సహస్రారాధీశ్వరుడు, శివతత్త్వముకన్న పరుడు, పరమకారణుడు, నిష్కారణుడు, కారణములను సృజించినవాడు, ధ్యానముచేయదగినవాడు, ధ్యానగోచరుడు, నవ్యయుడు, పరమాకాశమధ్యస్థుడు, పరమాత్ముడు, సర్వైశ్వర్యసంపన్నుడు, సర్వేశ్వరుడు, ననాద్యైశ్వర్యవంతుడు, అపారమైనవాడు, సర్వస్వాతంత్రుడు, నిరస్తాతిశయుడు, స్థిరుడు ఇతడు దశవిధంబులుగ నుండెనని అధర్వశృతియందు చెప్పబడెను. విశ్వమంతియు వ్యాపించియుండెననియుకూడ చెప్పబడెను. ఋగ్వేదమందు నేనేజాగ్రత్స్వరూపుడనియు, నాత్మ తత్త్వస్వరూపుడననియు శివుడే చెప్పియుండెను. స్వప్నస్థను నేనేయని యజుర్వేదంబున చెప్పబడెను. జ్ఞానవిద్యచే, నేనే భోగ్యాత్ముడననుకూడ చెప్పెను.

సామవేదమందు నాసుషుప్తియే తమోగుణమని చెప్పియుండెను. అథర్వవేదమందు తురీయుడను, తురీయాతీతుడను, షడధ్వాతీతుడను, నేనేయని చెప్పెను. అధ్యాత్మికమగు శ్రుతియము, శివవిద్యయని చెప్పబడెను. మోక్షపదము కోరువారు వేదములచే తెలిసికొందురు. అధ్యాత్మమగు తురీయపదము మోక్షము నొసంగును. అధ్యాతీతుడై నిర్గుణపరబ్రహ్మను తెలిసికొనవలెను. దీనిని తెలుపుడు చేయునదినాదము ఆనాదమే నాస్వరూపమని చెప్పియుండెను. సకలవస్తువులు గుణప్రధానములై యుండును. గాన, నట్టిగుణ ప్రధానుడు పరమేశ్వరుడని తెలిసికొనవలెను. వ్యస్తమగు జగత్తంతయు, నోంకారమయమని చెప్పబడెను, ఈయోంకారము, సకలపదార్థములకు వాచకమై యుండెను. ఓంకారము చేతనే జగత్తంతయు విస్తరింపు జేసితినని శివుడు చెప్పియుండెను. శివుడేప్రణవము ప్రణవమే శివుడు. వాచ్యవాచకములకు భేదములేనట్లు వీరలకు భేదములేదు. రుద్రుడు ఓంకార రహితుడని మనంబున యూహింపవలెను. ఈయోంకారమును జపించినచో పరమేశ్వరుని పొందకుండ వెనుకకురాడు. ఓంకారమందలి యకారము, ఆత్మస్వరూపమగు బ్రహ్మయని భోధింపవలయును. ఓంకారమందలి ఉకారము విష్ణువుగను, మకారము రుద్రునిగను, భావింపవలెను. మహేశ్వరుని దక్షిణాంగమున బ్రహ్మవామాంగమున విష్ణువునని తెలిసికొనవలెను. ఆతనిహృదయమునుండి నీలలోహితుడగు రుద్రుడుజనించెను. అతడే శివుడని తెలిసికొనవలెను. సృష్టికై బ్రహ్మను, పాలనకై విష్ణువును నియమించి వారునిత్య సృష్టిస్థితుల చేయుచుండుదురు. నేను సంహారకాలమున సంహా

రము చేయు మందునని రుద్రుడు నుడివియుండెను. ఈముగ్గురు జగత్కారకులు. ఈ కారణ త్రయమునకు శివుడే పరమ కారణుడు. బ్రహ్మావిష్ణువు లిరువురు నీర హ్యా మెరుంగక, కలహముచే కదనము చేయుచు, బద్ధవైరులై యుండిరి. వారికి జ్ఞానోపదేశముచేసి వారికలహమును బాపుటకై వారిరువురిమధ్య లింగరూపుడై శివుడావిర్భవించెను. ఓంకారమే ఈశ్వరుడని యధర్వవేదమందున్నదని నీకు చెప్పియుంటిని దీనినుండియె, యనేక వేలరుక్కులు. సామంబులు బయలు దేరెను. వేదములన్నియు, స్వయముగా పరమేశ్వరుని ముఖమునుండి వెలువడినవి.

అతనినవినయె యెరుంగవు, బ్రహ్మావిష్ణువులు యజ్ఞానాంధకారమును తొలగించుటకై, పరమేశ్వరుడు లింగమై, తనచిహ్నమనిచూపించి వారియజ్ఞానమును తొలగించి, వేదమందు చెప్పినట్లుగ లింగమందు ముద్రితుడై కాన్పింప వారు శాంతిమనస్కులై జ్ఞానవంతులైరి, ఉత్పత్తిలయకారకుడు షడధ్వరూపుడు, షడధ్వాతీతుడు, పరంధాముడు, పరమపురుషుడు, నిరుత్తరుడు, తనకన్నపై వాడు లేనివాడు. నిష్కళబ్రహ్మ శివుడు. సీశ్వరుడు ప్రపంచమందలి పశుపాశములను ఛేదించువాడు. ప్రభువు, యెచటనుభయయములేనివాడు. యెల్లప్పుడు వృద్ధి క్షయములులేనివాడు, నవ్యయుడు, బాహ్యాభ్యంతర వ్యాప్తుడు, బాహ్యాభ్యంతరవర్జితుడు, నిరస్తాతిశయుడు, ప్రపంచాతీతుడు, లక్ష్యలక్షణ నిర్దేశ్యుడు, అవాఙ్మానస నగోచరుడు, ప్రకాశైకరసుడు, శాంతుడు, ప్రసన్నుడు స్తుతిపాత్రుడు సర్వకళ్యాణనిలయుడు, శక్తిసహితుడునగు విరూపాక్షునిగాంచి, బ్రహ్మావిష్ణువు లిరువురుశిరమువంచి కృతాంజలిపుటులై యుండి, ఓ ప్రభూ మమ్ములను జ్ఞానాజ్ఞానులుగ నిర్మించితివి, మాకిట్టి భ్రాంతులుకల్గించితివి, నిన్ను మేమెట్లు తెలిసికొందుము, నీవుమాయెదుటనుండగ భ్రాంతి లెక్కడివి? నియెదుటనిర్భయముగ మాట్లాడువాడెవడు, మావివాదమిప్పుడుశోభగనుండెను, మావివాదఫలముచే నీపాదాభివందనములొందగల్గితిమి, నిన్ను స్తుతించుటకుమావాక్కులందవు, నీయెదుటతూష్ణీభావము నొందుటయేగాని, యేమియుచేయయజాలము. ఇట్టి సంఘటనజరిగెనేమి! నీవిష్టపడియేచేసితివా? తెలియకపలికిన మాప్రలాపములను మన్నింపుము. సకలకార్యములకు నీవేయధిపతివి, నీమాయచేనిన్ను మరచియుంటిమి. మోహితులమైయిట్లుచేసితిమిగాన, మమ్ముమరలశాసింపుము.

మేమమిక్కిలి భయపడియుంటిమి, మమ్ము రక్షింపుము, ఈశ్వరా! మేమపరాధము చేసి నిన్ను పరీక్షింప నెంచితిమి. మాభయమును పోగొట్టుము. ఓమహాదేవా! నీతిరస్కారమునకు ముమ్ము క్షమింపుమని మన్నింపుమని వారిరువురు నీశ్వరుని ప్రార్థింప.

నీశ్వరుడు మందస్మితవదనుడై వారలగాంచి ఓవత్సలారా! మీరునా మాయామోహితులై మీశ్రేష్ఠత్వములను గర్వించి, పరస్పర బద్ధవైరులై యుద్ధపర్యంతము వివాదము చేయుచునే యుంటిరి. మీవాదములచే ప్రజాసృష్టి నిలిచిపోయెను. మీరుకామమోహితులై వివాదములాడుచుండుటచే దానిని శాంతింపజేయుటకై, లింగచే నీలింగము నావిర్భవింపించితిని. మీరులజ్జను విడిచి వివాదములు మానుడు. మీరుశాంతిమంతులై మీమీక్రియలు నిర్వర్తింపుడు, పూర్వము మీరునాయాజ్ఞచే సర్వవిజ్ఞానులై యుండి, మీరుమహాశక్తులు కల్గుటకు పంచాక్షరీమహామంత్రము నుపదేశించితిని. అదిమీరిప్పుడు మరచితిరి. మరలమీకుపదేశించెదను. నాయాజ్ఞచే జపింపుడు. నాయాజ్ఞలేని దే మీరుసృష్టిస్థితులు చేయలేరని పరమేశ్వరుడు వారిరువురకు జ్ఞానసహితముగ మంత్రరాజముపదేశింప, వారుభయులు పరమేశ్వరాజ్ఞచే మంత్రరాజమును పొందిరి. మహాప్రణవముతో నిమంత్రము, సకలకళలతో కూడియుండెను. అట్టి మంత్రమునుపొంది మాదేవదేవునకు సాష్టాంగనమస్కారముచేసి భయరహితులై సస్మితులై యుపరిముఖానందభరితులై యుండ, నింతలో నింద్రజాలమువలే నటనున్నలింగ మదృశ్యమయ్యెను. వారలదిగాంచి విస్మితులై యిదంతయు కలయా నిజమాయని యూహింపుచు స్వప్నమను భంగమొనదని చింతింపుచు జగద్వ్యాపారంబునకై వారివారి నాసములకేగిరి. ఆనాటినుండి, శక్రాదిసర్వ దేవతలు, ఋషులు, నరులు, నాగులు, స్త్రీలు, విధివిధానంబుగ లింగప్రతిష్ఠలు చేసి పూజింపుచుండిరి.

శివమహాపురాణమందలి వాయువీయసంహితయందుత్తరఖండమున

ముప్పది అయిదవ యధ్యాయము సంపూర్ణము

# ముప్పదిఆరవ అధ్యాయము

## లింగప్రతిష్ఠానవిధి

లింగప్రతిష్ఠయు, విగ్రహప్రతిష్ఠయు నెట్లుచేయవలయునో తెల్పుమని శ్రీకృష్ణుడు ప్రశ్నింప సుమన్యుడిట్లు చెప్పదొడంగెను. ఒకానొక శుక్లపక్ష శుభదినంబున శివశాస్త్రప్రకారముగ ప్రమాణముననుసరించి శివలింగమును స్థాపింపవలయును. లింగమును భూపరీక్షచేసి పరిశుద్ధ ప్రదేశమున బెట్టి, లింగమునకు దశోపచారములుచేసి ద్వారపూజలుచేసి దిసకముందుగా వినాయకునర్చించి, పరిశుద్ధ ప్రదేశమందు లింగమును స్నానమునకై తీసికొనివచ్చి స్నానశిలపై కూర్చుండబెట్టి కుంకుమాది రంగులతోడను శివశాస్త్ర ప్రకారంబుగ నష్టమృత్తికాసలిలంబులతోను, లేక పంచమృత్తికాసలిలంబులచేగాని, స్నానముచేయించి పిండిచే నలుగుబెట్టి పంచగవ్యములచే మరలస్నానము చేయించి స్నానవేదిక నర్చించి యాలింగమునుతీసి, నదియందుగాని తటాకమందుగాని జలాధివాసముచేసి, యొకరోజుంచి, మరల పూర్వస్థానమందుంచి చుట్టూతోరణములుగట్టి, దర్భమాలలచేనలంకరించి, ఘటములనుంచి దిగ్గజములను దిక్పాలకులను స్థాపించి పూజించి.

మంగళాష్టకములు పఠించు, మండలముగాని దారువుతోగాని, పద్మాసన పీఠముచేయించి మధ్యను స్థాపించు సముద్రుడు, వీరభద్రుడు, సునందుడు, వినందకుడు ననువల్లురు ద్వారపాలకుల నలువైపుల పూజించి వేదికతో సహా లింగమును స్నానముచేయించు కూర్చులతో వస్త్రముగప్పి జలముప్రోక్షించి లింగము నటశయనంజేసి పూర్వముఖంబుగా సూత్రముపై పరుండబెట్టి పశ్చిమమందు పిండికనుంచి సర్వాయుధ సంయుక్తముగు లింగమును దధివాసముచేసి, యటపంచ రాత్రులుగాని త్రిరాత్రులుగాని యొకరాత్రిగాని, యటనేయుంచి పూర్వమువలె పూజించి శోధించు,యుత్సవములు చేయుచు శయనాగారంబునకు తీసికొనివెళ్లి. మండలమధ్యమున శుద్ధజలముచే స్నానముచేయించి యర్చించు, యీశాన్య దిశయందు పద్మములిఖించి శివకుంభమును స్థాపించి శివునాహ్వానించి పూజించి, వేదిక మధ్యను తెల్లని పద్మములిఖించి, దానిపశ్చిమ భాగం

బున, మరియొకపద్మమును లిఖించి చండికను స్థాపించి, యుక్తకమున పట్టుబట్ట లుగప్పి పుష్పములు దర్భలునందుంచి సర్వమంగళనిస్వనంబులతో లింగమును స్వర్ణపుష్పంబుపై శయనింపజేసి వస్త్రములచేగాని కూర్చిచేగాని లింగమును గప్పి పిండికచేగప్పి. పూర్వముపలె శయనింపజేసి, మొదటగా నష్టదళ పద్మం బులిఖించి శైవవర్గనియగు విద్యేశకలశను మధ్యను స్థాపించి మూడుపద్మము లను పరిచి బ్రాహ్మణులచే హోమముచేయించి యష్టదిక్కులయందు నష్టమూ ర్తుల స్థాపించి తేనిచో నలుదిక్కుల యందైనను పూజించి విరించ్యాది చతు ర్మూర్తులకై హోమముచేసి పశ్చిమమునందుగాని యీశాన్యమందుకాని ప్రథ మంబున గురువునర్చించి సప్తద్రవ్యములచే ప్రధానహోమము చేయవలెను. సగమువరకు నాచార్యుడుగాక గురువుగాని హోమముచేసినతరి మిగిలిన హోమము బుత్విక్కులు చేయవచ్చును. గురువు ప్రధానహోమమైన చేయవ లెను. హోమముపూర్తియైనతరి నూటయెనిమిది పర్యాయములు మంత్రయుత ముగ పూర్ణాహుతిచేయవలెను. తదుపరిహస్తముచే శివుని శిరమందు స్పృశించి వందగాని, ఏబదిగాని ఇరువదియైదుగాని సప్తద్రవ్యములతో హోమముచేయ వలయును. మాటిమాటికి లింగమును వేదికను స్పృశించుచు క్రమముగా పూర్ణాహుతిగావించి దక్షిణలీయవలెను. ఆచార్యునకు తానుదక్షిణ లీయదల చుకొన్న సొమ్ములో సగముగాని నాల్గవ వంతుగాని దానమీయవలెను, మిగి లిన దానిలో సగభాగము బుత్విక్కుల కీయవలయును.

ఉన్న దానిలో సగము శిల్పికీయవలయును. మిగిలినది తారతమ్యము లననుసరించి, సభాసదులకు పండితులకీయవలెను. తదుపరి నియమితప్రదేశ మున గర్తమందు సువర్ణవృషభమునుగాని దర్భకూర్చలుగాని యందుంచి, పంచగవ్యములచేతను, కుశోదకముచే గను ప్రోక్షించి చందనముచే నలికి నవరత్నములందుంచి పానుపట్టమును స్థాపించి, దానిపై లింగమును స్థాపించి కరన్యాసము జెప్పి నవశక్తినామంబులచే పూజించి, హరితాళాదిధాతువులు, బీజగంధౌషధంబులు, శివశాస్త్రోక్త ప్రకారంబుగ, శివలింగముపైనుంచి వృక్ష క్షీరంబులచే తడిపిలింగముపానుపట్టము నందుంచి మూలవిద్యచే నుత్తరముగ గాని తూర్పుగాని లింగమును స్థాపించి శాంతిమంత్రముచే లింగమునకు

లింగిచేసంబగుబెట్టి, బంధక్రన్యములచే బంధించి, స్నానముచేయించి, శుద్ధి పరచి యర్ఘ్యమిచ్చి, పుష్పములిడి, తెరగట్టి, లింగముయెదుట, నిషేకాది క్రియలన్ని యుజరిపి, (జన్మాదిక్రియలుజరిపి) శయనస్థానమున దశకలశయించి, మహాపూజలు ప్రారంభించి, శివసూక్తముచే శివకుంభముస్థాపించి యంగు స్థానామికలచే, చిన్ముద్రనుజూపి, లింగేశానభాగమధ్యయందునవి ద్యావిద్యే శులశక్తి న్యాసముజెప్పి లింగమూలమున శివజలముచేతడిపి, విద్యేశకలశ యందు పిండిక వేసి. యభిషేకముచేసి యాసనమిచ్చి, యాధారముకల్పించి పంచకళాన్యాసముజెప్పి, దీప్తలింగమునుస్మరించి, యుత్తరముఖంబునగాని పాఙ్ముఖంబునగాని, శివపార్షదుల నావాహనముచేసి, రథముపైగాని, వృషభముపైగాని యుత్సవవిగ్రహములను కూర్చుండబెట్టి, యలంకరించి, సర్వాభరణభూషితులజేసి, సర్వమంగళధ్వనులుగావించి యూరేగింపుచుండ, బ్రహ్మ విష్ణు మహేశ్వర, శక్రాది దేవతలు. దానవులు, నానందాశ్రుపరిప్లుతులై కృతాంజలిమస్తకులై. నృత్యగీతవాద్యంబులు సల్పుచు నేతెంచుచుందురు. తదుపరిపంచోపచారంబులచే పూజలుగావించి యథాస్థానమునకు తీసికొనివచ్చి స్థాపనమంత్రముచే స్థాపింపవలయును. విగ్రహములను జలాధివాసముచేసి నప్పుడు, నయనమోచనముచేసి, యధోముఖముగ పరుండబెట్టి, హృదయమునుతాకి, కుంభోదకాయుతాం అనుమంత్రము జెప్పి, ప్రతిష్ఠాలయమునకు తీసికొనివచ్చి ప్రతిష్ఠచేయువలయును. అశక్తుడైనచో తనశక్తికొలది ప్రతిష్ఠచేయవచ్చును.

ఇటుపై గృహార్చనవిధి చెప్పెదవినుము. ఉత్తరాయణ శుక్లపక్ష శుభదిన శుభనక్షత్రంబున లింగమునుగాని విగ్రహమునుగాని, స్థాపించి యొక పద్మముపై దేవినిస్థాపించి మండపమధ్యయందు కుంభమునుస్థాపించి, పత్ర పుష్పంబులిడి నలువైపుల నాల్గుకలశలుంచి, పంచకలశలయందు పంచబ్రహ్మల స్థాపించి ముద్రలజూపించి పూజించి మృత్తికాజలముచే లింగమునుగాని, విగ్రహమునుగానికడిగియుత్తరభాగంబున పుష్పములువేసి స్థాపించి, శిరముపై పుష్పములిడి ప్రోక్షణజలముచే ప్రోక్షించి జయశబ్దములచే పూజించి మూలమంత్రముచే నీశానకుంభోదకముచే నభిషేకించి పంచకళాన్యాసముజెప్పి, పూర్వ

మువలె పూజింపవలెను. నిత్యము నిట్లాయుమామహేశ్వరుల పూజింపవలెను. లేనిచో నొకకుంభమున్థాపించి యైనను యథావిధిగ పూజింపవయును. శోధన చేసి దోషరహితముగు లింగమును పూజింపవలెను. బాణలింగమును పూజించుట శ్రేష్ఠము. దైవఋషిస్థాపిత లింగములకు పీఠములేనిచో, పీఠమును కల్పించి ప్రతిష్ఠచేసి పూజింపవలయును. లేనిచో పనికిరాదు. దగ్ధమైనదియు దెబ్బతిన్నదియు, విడిపోయినదియు, సగులింగమును పూజకుపయోగింపరాదు. గాన, అట్టివి జలమందు పడవేయవలెను. వికలమైన లింగముగాని, విగ్రహము గాని పూజింపరాదు. సంధానము చేయుట కుపయోగించెడి లింగమైనచో సంధానముచేసి ప్రతిష్ఠచేసి పూజింపవలెను. వికలమైనలింగములు పూజించుట కన్న హృదయమున మూర్తిని కల్పించుకొని మానసికపూజచేయుటశ్రేష్ఠము.

శ్లో॥ దగ్ధం శ్లథంచ తాంగంచ
క్షిపేల్లింగం జలాశయే
సంధానయోగ్యం సంధాయ
ప్రతిష్ఠావిధి మాచరేత్

2. చరాద్వా వికలాల్లింగా
ద్దేవపూజా పురస్సరం
ఉద్వాస్యహృదిసంధానం
త్యాగంవాయుక్తమాచరేత్

ఒకరోజులింగమును పూజింపకున్నచో. సంప్రోక్షణచేసి ద్విగుణీకృతముగ పూజించిరెండురాత్రులు మహాపూజలుగావింపవలయును. ఒకమాసముగాని మరి కొన్ని దినములుగాని పూజింపకున్నచో మరల ప్రతిష్ఠచేసి పూజింపవలయును. కొందరు ఋషులు, సంప్రోక్షణచేసి పూజింప వచ్చుననిరి. సంప్రోక్షణ యనగా యెనిమిది పర్యాయములు గాని ఐదుపర్యాయములు గాని మృత్తికాజలముచే స్నానము చేయించి, గోసంబంధమగు పంచామృతములచే స్నానము చేయించి, కుశాగ్రోదకములచే స్నానము చేయించి మూలమంత్రముచే ప్రోక్షణీ పాత్రల యందున్న జలముచే నూటయెనిమిది పర్యాయములు స్నానముచేయించి లింగమస్తకమందు, కుశలు పుష్పంబులిడి, పంచాక్షరిని

పంచపర్యాయములు గాని యష్టోత్తర శత పర్యాయంబులుగాని, జపించి, పీఠమును లింగమును స్పృశించి, దేవు నాహ్వానించి, పూర్వమువలె పూజింపవలయును. దేవాలయమున కేగి పూజింప కున్నను తనవద్ద చరలింగము లేకున్నను మంగళప్రదమగు ప్రదేశమందు గాని, జలమందుగాని, యగ్నియందుగాని, యాకాశమందుగాని, రవియందు గాని, శివుడున్నట్లు భావించి పూజింపవలయును.

శివ మహాపురాణమందలి వాయవీయసంహితయందుత్తర ఖండమున
ముప్పది ఆరవయధ్యాయము సంపూర్ణము

---

## ముప్పదియేడవ యధ్యాయము

### యోగగతి వర్ణనము

శ్రీకృష్ణు డుపమన్యుని గాంచి ఉపమన్యూ జ్ఞానక్రియలు శివప్రతిష్ఠావిధులు పూజలు సంగ్రహముగ నీచే వినియుంటిని ఇటుపై పరమధర్మమగు యోగమును గురించి విన కుతూహలముగ నున్నది. వాటి సాంగ విధులు నధికారములు ప్రయోజనములు యోగము పూర్తిగాక మరణించిన వారిగతియు సమర్థుడైయుండి యోగమభ్యసింపకున్న చో జీవున్మృతుడనిపించు కొనునుగదా? యోగ మభ్యసించెడి కాలములు కాలభేదంబులు వినిపింపు మన నుపమన్యుడిట్లు చెప్పదొడంగెను ఓకృష్ణా! నీవడిగిన ప్రశ్నలన్నియు నత్యుత్తమంబై యున్నవి. క్రమముగా చెప్పెదను వినుము. పరమేశ్వరుని యందు స్థిర చిత్తము గల్గి చలింపకుండుట యోగమందురు. ఇది యైదువిధములు అది యేవన మంత్రయోగము స్పర్శయోగము, భావయోగము, నభావయోగము, మహాయోగమనునవి. వీటిలో మహాయోగము శ్రేష్ఠమైనది. మంత్రాభ్యాసమునే మంత్రయోగమందురు; మంత్రముచే మంత్రానుష్ఠాన దేవతగోచరింపవలయును. ఇతర దృష్టిలేకుండ మంత్రము జపించుట మంత్రయోగమందురు. ప్రాణాయామముచే సహస్రారమందున్న భగవంతుని స్పృశించుటను స్పర్శ యోగమందురు. మం

త్రము కూడజపింపక, భావముచేతనే మనోవీధిని భగవంతుని యూహించుట భావయోగమందురు. ఈదృశ్య ప్రపంచమంతయు భగవంతునియందు లీనమై యున్నదని తెలిసికొనుటయే, అభావయోగమందురు. శివునికన్న భిన్నమైనదే దియు లేదనియు, శివతత్త్వమునకు మించినతత్త్వము లేదనియు గ్రహించుటయే. మహాయోగమందురు. ఇష్టమైనవి విసర్జించుట విషయ పరక్తుడగుటచే యోగాధికారియగును అనగా జ్యోతిష్టోమాదియాగంబులుచేసి స్వర్గాదులు కోరక సకలవస్తువులయందు విరక్తుడై యున్న వాడే యోగాధి కారి కాని యితరుడు కాడు, మరియు నిహపరసుఖంబులు కోరక ఈశ్వరగుణంబులే వర్ణింపుచు, సతతము నీశ్వరదర్శన కాంక్షియై విరక్తుడై మనోవాంఛలవీడి యష్టాంగయోగంబుగాని షడంగయోగంబుగాని యభ్యసింపవలయును.

యమనియమ, స్వస్తికాద్యాసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులనెడి నివి నష్టాంగంబు లందురు. ఆసనప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ ధ్యాన సమాధుల షడంగయోగ మందురు. శివశాస్త్రమందు వీటిలక్షణంబులు. వేరువేరుగా చెప్పబడెను. గాన నేనీవిషయము సంక్షేపముగ జెప్పితిని. యాజ్ఞవల్క్యాదు కూడ నీయష్టాంగములను విపులముగ జెప్పెను. ఈ అష్టాంగంబులు, యోగమున కంగములు. వీటిలో శ్రేష్ఠమైనవి. ప్రాణాయామంబులు మూడు విధంబులు. ప్రత్యాహారమైదు విధంబులు. ధారణ పంచవిధంబులు. వీటిలో మూడు శ్రేష్ఠము. సమాధికిన్ని విధంబులులేవు. ఒక్కటే రూపమని కొందరు ఋషులు చెప్పిరి. దీనినే విస్తరించి చెప్పెద వినుము.

హింసచేయకుండుట, అనృతమాడకుండుట, చోరత్వము చేయకుండుట, బ్రహ్మచర్యవ్రతుడై యుండుట, ప్రతిగ్రహము లేకుండుట యీదైదు యమములందురు. దీనినే పంచావయవయోగ మందురు. శౌచము, తుష్టి, తపము, జపము ఈశ్వరార్పణమునకై జేసెడి కర్మలుననునివి నియమ పంచక మందురు.

స్వస్తికము, పద్మము, మిధ్యేందు, వీర, యోగ, ప్రసాధిత పర్యంక, యథేష్టలనెడు యాసనములష్టవిధంబులు. ఇవియే యాసనంబులు.

తన దేహమందున్న వాయువు నరికట్టుటయే ప్రాణాయామ మందురు. ఈప్రాణాయామము రేచక పూరక కుంభకములని త్రివిధంబు. నాశికా పుటము నంగుళిచే నొక్కి యుదరమందున్న వాయువు, పీల్చి నూర్ధ్వముగా మరి యొక నాసాపుటముచే పీల్చుట రేచకమనబడును. అనగా, ఒక నాసాపుటముచే వాయువుపీల్చి,మరియొక నాసాపుటముచే విడుచుట రేచకమందురు. బైటనున్న వాయువును నాసాపుటచేలోనికి గ్రహించి పూరించుటయే పూరకమందురు. బాహ్యాభ్యంతరమందున వాయువును పీల్చుటగాని వదులుటగాని లేకుండ జేసి పరిపూర్ణ కుంభమువలె చలింపకుండ నిలుపుటయే కుంభకమందురు. రేచకపూరక కుంభములుమూడును ద్రుతవిలంబములు లేకుండచేయవలయును. యోగసాధకుడు దీనిని క్రమముగ నభ్యసింపవలయును. నాడీ శోధనపూర్వకముగ రేచకాదు లభ్యసింపవలయును. ఇట్లభ్యసించినచో స్వేచ్ఛగా సహస్రారచక్రము నందుకొనవచ్చును. ఇట్లు యోగశాస్త్రమందు చెప్పబడెను. కొద్దికొద్దిగా ప్రారంభించి క్రమముగా వృద్ధిచేసికొనవలెను. మూలాధారము మొదలుకొని వాయు విరోధముచేయుచు సహస్రారమునకు జనవలయును. నాడీ శోధన పూర్వకముగ రేచకపూర్వక కుంభములం దభ్యాసము చేయవచ్చును. స్వేచ్ఛగా సహస్రారమునందు యోగశాస్త్ర ప్రకారంబుగ సంచరింపవలయును. మూలాధారములగాయతు క్రమముగా వాయు నిరోధము చేయువలయును.

మాత్రాగుణ విధానములుగనది నాల్గువిధంబులుగ జెప్పబడెను. కర్ణిక నాల్గుమాత్రలుగాని ద్వాదశమాత్రలుగాని యూహింపవలెను. ఆప్రదేశమున ఇరువది నాల్గుమాత్రలుగాని విభజింపవచ్చును. ఇదిమధ్యమము ఇదిత్రిభాగం బులుగజేసి ఇరువది యారుమాత్రలుగ విభజించుటు యుత్తమంబు స్వేదకం పాదులుకలుగు నంతవరకు ప్రాణాయామము చేయవలెను ఆనందబాష్పములు రోమాంచము కల్గునంతవరక ప్రాణాయామము చేయువలెను. జల్పభ్రమణ మూర్చాదులు కల్గునంత వరకు యోగిపట్టువిడువక, ప్రాణాయామ మభ్యసింప వలయును. జల్పమనగా విరుద్ధముగ మాట్లాడుట. జానువులందు హస్తములా నుకొని యాలస్యమూగాక తొందరయుగాక నొకప్రదక్షిణముచేయుచు నొక చిటిక వేయుట మాత్రయందురు. నాడీశుద్ధికై ప్రాణాయామముచేయువలయును.

అగర్భమనియు సగర్భమనియు ప్రాణాయామము రెండువిధంబులు. జపధ్యానములు లేకుండ ప్రాణాయామము చేయుట, సగర్భమందురు. జపధ్యానములతో కూడినది సగర్భమందురు. అగర్భముకన్న సగర్భ ప్రాణాయామచే శతాధికఫలములభించును. కావున యోగులు సగర్భప్రాణాయామ మాచరింతురు. ప్రాణవిజయమునకై దశవాయువులను జయించవలెను. ప్రాణము అపానము సమానము. ఉదానము, వ్యానము, నాగము, కూర్మము, కృకరము, దేవదత్తము, ధనంజయములనునవి దశవాయువులనబడును. ప్రయాణము చేయునుగాన ప్రాణవాయువనబడుచున్నది. భుజించిన పదార్థమును క్రిందకుతీసికొని పోవునుగాన నపానమనబడుచుండెను. శరీరసర్వాంగములయందు వ్యాపించి వృద్ధిపరచునుగాన వ్యానమనబడుచున్నది. మర్మాభివృద్ధిని కలిగించెడిదగాన నుదానమనబడుచున్నది సకలాంగములను సమముగా చేయుచున్నదిగాన సమానమనబడు చున్నది. ఉద్గరించునుగాన నాగమనబడుచున్నది. నేత్రోన్మీలనము చేయునది కూర్మమనబడుచున్నది. తుమ్మును కలిగించెడిద కృకరమనబడుచున్నది. ఆవులింతకలిగించెడిద దేవదత్త మనబడుచున్నది. ధనంజయ వాయువు ప్రాణముపోయినను విడువదు. ప్రాణాయామము సక్రమంబుగ సలపచుకొన్నచో, సకలరోగములను నశింపజేసి యాయుర్వృద్ధిని కలగించును. మరియు కర్త దేహంబును కాపాడి దోషములు నశింపజేయును. యోగము సిద్ధించినది లేనిది తెలిసికొనుటకు కొన్ని చిహ్నములు గలవు.

మలమూత్ర శ్లేష్మంబులు స్వల్పముగ నుండుట బహు భోజనము చేయుసామర్థ్యము కలుగుట ఆలస్యముగా శ్వాసపీల్చుట తేలికగానుండుట త్వరితగమనము యుత్సాహము స్వరసౌష్ఠవము సర్వరోగక్షయము బలము తేజము, సురూపము, ధైర్యము, మేధాశక్తి, యౌవనము స్థిరత్వము ప్రసన్నత్వము కల్గియుండుటయే దీని చిహ్నములు. యజ్ఞదానవ్రతఫలంబులచే పాపక్షయమగు నట్లుగ ప్రాణాయామముచే సర్వపాపక్షయమగును. ప్రాణాయామముతో మిగిలిన వన్నియు పదహారవ వంతుకూడ సరిరావు.

ఇంద్రియ గుణములను విషయములయందు ప్రవర్తింపకుండ జేయుటయే ప్రత్యాహారమనబడును. అనగా నింద్రియములను విషయములనుండి

మరణించుట, దశేంద్రియంబులు మనస్సుతో నరికట్టి స్వర్గనరకంబు లొకటిగా భావించి,సుఖదుఃఖంబులు సమముగా నెంచుచున్న, మతిమంతుడు జ్ఞాన వైరాగ్యస్థిరుడై యుండును. ఇట్టి వాడింద్రియ నిగ్రహుడై యాత్మచే పరమాత్మను తెలిసికొనెను.

చిత్తమును తన స్థానమందు బంధించుటయే ధారణయందురు. ఇంద్రియములనెడు యశ్వములను బంధించి జీవాత్మను పరమాత్మతో గలిపి స్థిర చిత్తము కల్గుటయే ధారణయందురు. యోగసూత్రములలో కూడ నిట్లే చెప్పబడెను. దోషత్రయము లేనిచోటనే శివుని స్థానముండును. నేనింతకాలము స్థిరుడనై యుందునని, నియతుడై యుండవలెను. లక్ష్యము లేనిదే ధారణ కుదరదు. స్థిరచిత్తుడై యున్నచో ధారణ కుదురును. ధారణాభ్యాస యోగముచే ముందుగా మనమును స్థిరము చేసికొనవలెను. ధ్యై చింతాయాం అను సూత్రముచే, శివచింతనను మాటిమాటికి చింతనచేయవలెను. దీనినే ధ్యానమందురు. ఇతరచింతలు లేక ఈశ్వరుని చింతించుటయే ధ్యానమనబడును. ప్రత్యయైకతానతాధ్యానమితి అని యోగసూత్రమందు చెప్పబడెను.

నాభి, హృదయము, భ్రూమధ్యమునందున్న భగవంతు నెరింగినచో, సర్వ జ్ఞానములు కరతలామలకమై యుండును. జగత్కారణుడు అవ్యక్తుడు ప్రకాశమానుడు మహాపరాక్రమవంతుడు నగు ఈశ్వరుని మనంబునగాంచి సోహం భావముచే తెలిసికొనుటయే, యుత్తమధ్యానమని యాజ్ఞవల్క్యుడు చెప్పి యుండెను. కారణము లన్నియు వీడి, పరమేశ్వరుడెన్ని రూపములతో నున్నను, భగవంతుడొక్కడే యని భావించుటయే ధ్యానమనబడును. ఇతరము లన్నియు వీడి మంగళకరుడగు శివుడు దేవేశుడు పరుడనని, నమ్మకముతో ధ్యానింపుమని అథర్వవేదమందు చెప్పబడెను. కాన సర్వభూతగతుడగు శివుడే పరుడని ధ్యానము చేయవలెను. ఇతడే సర్వగుడని శ్రుతులు శాస్త్రములు చెప్పుచున్నవి. కాన నానారూప విభేదకుడగు పరమేశ్వరుని సతతము ధ్యానింపవలయును. ముక్తి కావలయునన్నను అణిమాదిసిద్ధులు కావలయునన్నను విశ్వాసముతో ధ్యానింపవలయును. ధ్యాతృ ధ్యేయము లున్నచో ధ్యానఫలములభించును. ధ్యాతృ, ధ్యాన, ధ్యేయ ప్రయోజనములను చతు

ష్టయములను తెలిసికొని యోగి కావలయును. జ్ఞానవైరాగ్యసంపన్నుడు శ్రద్ధావంతుడు, క్షమాన్వితుడు, మమకారరహితుడు, సదోత్సాహుడు ధ్యానమునకు యోగ్యపురుషుడనబడును. జపముచే, నలసి ధ్యానము చేయవలెను. ధ్యానముచే నలసి జపముచేయవలెను జపధ్యానములచే నలసిన పురుషుడు శీఘ్రముగ యోగసిద్ధుడగును. పండ్రెండు ప్రాణాయామములు చేసినతరి ధారణచేయవలెను. పండ్రెండు ధారణలు చేసిన పిమ్మట ధ్యానము చేయవలెను. ఇట్టి ధ్యానములు పండ్రెండైనచో యోగ సమాధి యనబడును. సమాధి యోగమునకంతిమాంగము సమాధిచే ప్రజ్ఞావంతుడగును. యోగసాగరంబున మునిగి యొకయర్ధమాత్రమైనను స్థిరుడై శ్వాసోచ్ఛ్వాసశూన్యుడై, దేహమును మరచియుండుటయే సమాధియనబడును. ధ్యేయపురుషుని యందు మనంబునిల్పి సుస్థిరుడై గాలి లేని దీపశిఖవలె ప్రజ్వరిల్లుచుండుటయే సమాధి యనబడును. ఏదియు వినబడకుండ, నేదియు నాఘ్రాణింప, నేదియుబలుకక, నేదియు గాంచక, నేదియు స్పృశింపక, సర్వము నెరుగక, మనస్సంకల్పములు లేక, నేటిని కోరక దేనికి బద్ధుడు గాక, కాష్ఠమువలె నుండి, శివునియందాత్మను లయబరచి యుండుటయే, సమాధి యనబడును. దీపము వాయువిహీన ప్రదేశమున చలింపనిరీతి నిశ్చలుడై సమాధినిష్ఠుడై బుద్ధిమంతుడుండును. ఇట్లు క్రమముగా యోగి సాధనము చేసినచో నాటి నాటికి కలుగు నంతరాయములు నశించును.

శివ మహాపురాణమునందలి వాయవీయసంహితయందు ఉత్తరఖండమున
ముప్పది యేడవ యధ్యాయము సంపూర్ణము

# ముప్పదిఎనిమిదవ యధ్యాయము

## యోగ విఘ్నంబులు

మరల నుపమన్యుడిట్లు చెప్పదొడంగెను. ఆలస్యము. తీక్ష్ణవ్యాధి. ప్రమాదము. స్థానసంశయము. అనవస్థితి. అశ్రద్ధ. భ్రాంతి. దుఃఖము. దౌర్మనస్యము. విభ్రమలోలత్వము. నీపదియు యోగమునకు విఘ్నములు చేయుచుండును. ఇవియేయంతరాయములు. యోగి దేహచేతనములచే. నలసత్వము నొందుటయే నాలస్యమనబడును.

ధాతువైషమ్యముల చేతను కర్మదోషముల చేతను జనించినవి వ్యాధులందురు.

యోగసాధనమభావమగుటయే ప్రమాదమందురు.

పై రెండింటికి విపరీతముగ నుండుటయే స్థానసంశయ మందురు.

చిత్తముస్థిరముగా లేకుండుటయే యనవస్థితి యనబడును.

యోగమార్గమున భావరహితమగు వృత్తికల్గుటయే యశ్రద్ధయనబడును.

విపరీతమతి కల్గుటయే భ్రాంతియన బడును.

పురుషుని యజ్ఞాన జనితమైనదే దుఃఖమనబడును. దీనినాధ్యాత్మిక దుఃఖమందురు. జీవునకు పూర్వకర్మానుసారముగ జనించిన దుఃఖమాధిభౌతికమందురు.

శస్త్రవిషాదులచే సంభవించిన దుఃఖమాధి దైవికమందురు.

ఇచ్ఛావిఘాతములచే జనించిన క్షోభను. దౌర్మనస్య మందురు.

విచిత్రములయందు, విషయములయందు విభ్రమము కల్గుటయే, విభ్రమలోలత్వ మందురు.

ఈవిఘ్నములు దూరమైనచో యోగికి యోగముసిద్ధించును. యోగసిద్ధికై కొన్నిసూచనలుగలవు. వాటినుపసర్గ లందురు.

ప్రతిభా శ్రవణము. వార్తా. దర్శనము. ఆస్వాదనము వేదనము నీయారు నుపసర్గలు. వీటిచే యోగము సిద్ధించును. సూక్ష్మమునుదాటి యనర్థములు

రాకుండ కాపాడు కొనుటను ప్రతిభయందురు. యథార్థమగు ప్రజ్ఞ దేనియందుండునో అదే ప్రతిభ యనబడును.

సర్వశబ్దంబులు నప్రయత్నంబుగా వినుటయే శ్రవణము.

సర్వదేహధారుల యందుండెడి వార్తలు జ్ఞానముచే గ్రహించుట వార్త యనబడును.

దివ్యమైన వాటిని ప్రయత్నముగ జూచుట దర్శన మనబడును.

దివ్యరసంబుల నాస్వాదించుట ఆస్వాదన మనబడును.

స్పర్శనుపొందుటయే వేదన మనబడును. దివ్యగంధముల నాఘ్రాణించువాడు బ్రహ్మలోకాధిపతియగును.

మధురవాక్యములు బల్కినచో శ్రేష్ఠరత్నంబులు సిద్ధించును. పై సిద్ధులన్నియు బడసినచో దేవతాస్త్రీలు సకల ఉపాయనంబులు నొసగి ప్రణాములొనర్తురు, యోగసిద్ధుడు భోగములుకోరక నాత్మనునే కోరినచో నిక చెప్పుట కేమున్నది. నేనింతయు స్వయముగా జూచితిని మరియు నిట్టిసిద్ధుడు, కృశత్వము స్థూలత్వము. బాల్యత్వము వార్ధక్యము యౌవనము. నానాజాతి స్వరూపము, అండజ, యోనిజ, స్వేదజోద్భిజ్జముల నెడు చతుర్విధ దేహంబుల నొందగలడు. పార్థివాంశము లేకుండ నిత్యము సుగంధద్రవ్యముల నాఘ్రాణించుచు, మిగిలిన నాలుగుపదములయందుండి యష్టగుణంబుల ననుభవించుట పిశాచలక్షణమందురు.

జలమందు నివసించుట, భూమియందు దాగియుండుట ఇచ్ఛగల్గినచో సాగరమును కూడ పానముచేయు శక్తిగల్గుట. ఇచ్ఛగల్గినచోట జలమును కల్పించుట కుంభము లేకుండగనే జలమును హస్తమందు నిల్పుకొనుట, సారమున్నను లేకున్నను. ఇచ్ఛగలపదార్థములు తత్కాలమందే భుజించుట, జలస్వరూపమునుగాని, వాయుస్వరూపమునుగాని, యగ్నిస్వరూపమునుగాని ధరించి సంచరించుట పిశాచలక్షణము. ఇది పార్థివశరీర మూనవహించినను. దెబ్బలు తగులకుండుట మొదలగు షోడశగుణములతో నద్భుతైశ్వర్యముల నొందుచుండును. ఈ పిశాచము లష్టవిధంబులుగ నుండును. తన శరీరమునుండి యగ్ని నిప్పుట్టించును. అగ్నికి భయపడని ప్రయత్నముగ జగత్తునంతయు

భస్మముచేయు శక్తికల్గియుండును. అగ్నిని సృజించును. అగ్నిని హస్తమందు ధరించును. జలమును పుట్టించును. ప్రపంచమును దహింపజేయును. పచనపదార్థములు తనముఖముతో పచనముచేసికొని తినగలదు. వాయుతేజంబులచే శరీర ధారణచేసికొనగలదు. పిశాచములిట్టి యైశ్వర్యములతో నుందురు. వీటిలో తేజోగుణము ఇరువదినాల్గు గుణములతో కూడి యుండును. మనోవేగంబుగ జనుట క్షణమాత్రములో జీవుల యంతఃకరణంబులయందు ప్రవేశింపగల్గుట, యతిసునాయాసముగ పర్వతాదిమహాభారములు ధరించుట, గురుత్వాంఘుత్వముల నొందుట పాణియందు వాయువునుబంధించుట, కాలిగోరుచే భూమిని చలింపజేయుట మనుజశరీరములో ప్రవేశించి సకలభోగముల నుభవించుట మొదలగునవి తేజోపిశాచ లక్షణంబులు.

వాయురూపపిశాచంబులు ముప్పదిరెండు విధములుగ నుండును. ఇచ్ఛాహీనములుగ నుండును. ఇంద్రియములకగోచరించకుండుట, సకలమునృజించుట, స్వేచ్ఛగా నాకాశ గమనముచేయుట యింద్రియములతో కూడియుండుట తన దేహముతో గగనముదాటుట ఆకసమున క్రీడిగాచేయుట శరీరములేకుండుట మొదలగు లక్షణంబులతో నుండును.

నంబరమున గగనమున సమస్తకోరికల ననుభవించుట స్వేచ్ఛగా సంచరించుట కామవర్జితులగుట, సర్వమును తిరస్కరించుట సర్వరహస్యముల నెరుంగుట కర్మానుసారముగ నిర్మించుట సమస్తము వశముచేసికొనుట యన్నిటిని ప్రేమించుట, భోగేంద్రియములచే ప్రపంచమునందలి సకలభోగముల నుభవించుట మొదలగునవి ఇంద్రైశ్వర్యమందురు.

మనోగుణములకన్న నధికమైనది, చంద్రైశ్వర్యమందురు.

ఛేదనము, తాడనము, బంధము, మోచనము, గ్రహణము ప్రపంచమందలి సకలభూతములు వశమగుట సర్వుల ననుగ్రహించుట, మృత్యుకాలమును జయించుట, నివి ప్రపత్రైశ్వర్యమనియు యాభిమానికైశ్వర్యమనియు నందురు.

మనోభోగముల నుభవించుట ఏబదియారు గుణములతో కూడియుండుట, సంకల్పమాత్రముచే సృష్టించుట, పోషించుట, సంహరించుట,

సర్వుల యందధికారము కల్గుట, భూతపిశాచములను ప్రవర్తింపజేయుట, భూతముల కనుకూలముగ సంచరించుట సృష్టికి ప్రతిసృష్టిచేయుట శుభాశుభంబులు చేయుట ప్రజాపతులతో కూడియుండుట ఇత్యాది యరువదినాల్గు గుణములతో కూడియుండుట బ్రహ్మైశ్వర్యమందురు.

బుద్ధిచేసంపాదింపబడు నైశ్వర్యమును ప్రాకృతైశ్వర్యమందురు. దీనికంటె గుణమయమైనదియు పరమైనదియు వైష్ణవతత్వమందురు. ఈతత్వమే భువనమంతయు వ్యాపించియుండెను. ఈతత్వముకంటె పరబ్రహ్మను తెలిసికొనెడి మార్గము మరియొకటిలేదు.

దీనిపైదిగజేకపదము దీనినివిష్ణువు వినామరియొకడు తెలిసికొనలేడు. విజ్ఞానము పొందుటకై గురువన్నియు నుపకరించును. ప్రయత్నపూర్వకముగ సర్వవిఘ్నములు తొలగించుకొనుచు పరమవైరాగ్యముతో మెలగవలయును. సకలరాజభోగంబులు తృణప్రాయముగ త్యజించినవానికి యోగసిద్ధి కల్గును. లేనిచో ననుగ్రహముచేయునిదై జగత్తంతయు తిరుగుచు, సకల భోగంబులు తృణప్రాయముగ త్యజించిన వానికి యోగసిద్ధికల్గును. లేనిచో ననుగ్రహముచె యుసిదై జగత్తంతయు తిరుగుచు సకలభోగంబుల ననుభవించుచు ముక్తిపొందనచ్చును.

ఇంకను యోగప్రయోగంబులు చెప్పెదవినుము. శుభకాలంబున శుభదేశంబున శుభక్షేత్రాదుల యందుగాని, శివక్షేత్రాదుల యందుగాని, జంతురహిత విజన ప్రదేశంబులయందు గాని నిశ్శబ్దప్రదేశమందుగాని బాధావర్జిత ప్రదేశంబున, శుభ్రముగ నలికిన ప్రదేశంబున సౌమ్యగంధధూపాదులున్న ప్రదేశంబున ముక్తపుష్ప వితానములచే నలంకరించిన ప్రదేశమందుగాని కుశపుష్పసమిధలతోడను ఫలమూలంబులతోను యలంకరింపబడిన తావుల యందగ్ని ప్రమాదము, జలప్రమాదము, శుష్కపత్రంబులు లేని తావుల యందు, దోమలు, ఈగలు, క్రూరమృగంబులు, సర్పంబులు, దుర్జనులులేని తావులయందు యోగము భ్యసింపవలయును - శ్మశానములయందు వల్మీక సమీపములయందు చతుష్పథములయందు, జీర్ణాగారములయందు, నదీనద సాగరతటంబులయందు జీర్ణోద్యాన గోష్ఠ ప్రదేశములయందు ననిష్ట నిందిత

ప్రదేశములయందు జీర్ణాంబరాభాదులయందు, విణ్మూత్రదూషిత ప్రదేశములయందు యోగము భ్యసింపరాదు. మరియు, ఛర్దిరోగమున్నపుడు నతిసారవ్యాధియున్నపుడు నతిగా భుజించినపుడు శ్రమపడినపుడు నతిచింతాకులుడైనపుడు, నతిగాక్షుత్పిపాసలుకల్గినపుడు కార్యభారము మోపబడినపుడు, యోగ, మభ్యసింపరాదు. యుక్తాహార విహారములు చేయుచు యుక్తకర్మలు చేయుచు, యుక్తనిద్రా ప్రబోధంబులుగల్గి, యేవిధమైన యాయాసంబులులేక, శుచియైనదియు,సమమైనదియు, విశాలమైనదియు, రమ్యమైనదియు మృదువైనదియు నగు నాసనము నధిష్ఠించి స్వస్తికాసనముగాని పద్మాసనముగాని వేసికొని; గురుపరంపరలకు నమస్కరించి కంఠము నిలిపి శిరము హృదయము సమముగా నిలిపి నేత్రములు సమముగా జూచుచు కొంచెము శిరమునంచి దంశములు, దంతములు కలియనీయక జిహ్వనుకదల్పక యూరువులచే వృషణముల నొక్కిబెట్టి ఊరువుపై యూరువునుంచి నొక్కిపెట్టి కుడిచేయి యెడమచేతిపై నుంచినొక్కిబెట్టి పృష్ఠము పైకెత్తి హృదయము ముందుకు చాచి యేదిక్కులను గాంచక నాసాగ్రభాగమును గాంచుచు, పవనమును బంధించి పాషాణప్రతిమవలె నిశ్చలుడై తన దేహాలయమునందు హృత్పద్మమున శివపార్వతులనిల్పి మానసిక పూజగావించి మూలమంత్రముచ్చరింపుచు నాసాగ్రమందుగాని నాభియందుగాని కంఠమందుగాని తాలీరంధ్రమందుగాని భ్రూమధ్యమందుగాని మూలాధారమందుగాని లలాటమందుగాని, శిరమునందుగాని పరమేశ్వరుని స్మరించి ధ్యానింపవలయును. ఇట్టితావులయందు పరమేశ్వరున కాసనము కల్పించి యావరణ పూజలతోగాని లేకుండగగాని పూజింపవలెను.

ద్విదళంబులుగాని షోడశదళంబులుగాని ద్వాదశదళంబులుగాని దశదళంబులుగాని షడ్దళంబులుగాని చతుర్దళంబులుగాని గల పద్మమును కల్పించి యందు శివుని స్మరింపవలయును. విద్యుత్ప్రభలు గలద్విదళ పద్మమును భ్రూమధ్యమున ధ్యానింపవలయును. భ్రూమధ్యమున దక్షిణోత్తరములందు షోడశపత్రంబులతో నున్న పద్మము ధ్యానింపవలయును. తూర్పులగాయతు నలుదిక్కులయందున కకారాదిటకారాంతము యక్షరపంక్తి రేకులుగల పద్మమును ధ్యానము చేయవలెను. హృదయాంతరమునందు భానువర్ణంబుగల పద్మమును ధ్యానింపవలయును. ఈ పద్మదళముపై డయనుయక్షరము మొద

లుకొని ఫవరకు నక్షరములు లిఖించి యాఱుదళము లధోముఖముగను. నాలుగూర్ధ్వ ముఖముగ నున్నట్లు భావింపవలెను. మూలాధారమందున్న పద్మము ధూమచితాంగారమువలె ప్రకాశింపుచు వ మొదలుకొని స కారమువరకు లిఖించి స్వర్ణవికారముగ నున్నట్లు భావింపవలయును. నకారము మొదలు సకారమువరకు గలయక్షరంబులు పత్రములుగా భావింపవలయును. ఈయరవిందములయందు మనసును ప్రవేశపెట్టి ధైర్యముతో నుమామహేశ్వరుల ధ్యానింపవలయును. ఆపరమేశ్వరుని యంగుష్ఠమాత్ర ప్రమాణునిగను. దీప్తిమంతునిగను, శుద్ధదీపశిఖాకారునిగను, శక్తితో ప్రకాశించు వానిగను, నిందురేఖా సమాకారునిగను. నక్షత్రరూపునిగను లేక నీవారశూకసదృశునిగను, కదంబగోళాకారునిగను, మంచుబిందువుగను చతుర్వింశతి తత్త్వాతీతునిగను. తనయిచ్ఛానుసారముగ ధ్యానింపవచ్చును. స్థూలముగ తత్త్వాతీతుని ధ్యానింపవలయును. భవాద్యష్టమూర్తులను ధ్యానింపవలయును. ఈప్రస్థానభేదంబులు శివశాస్త్రమందు చెప్పబడెను.

ఘోర మిశ్ర ప్రశాంతుల నెడి ముమ్మూర్తి స్వరూపునిగ మునీశ్వరులు ధ్యానించెదరు. ఫలాభిలాషులు సగుణమూర్తిని మోక్షకాములు నిర్గుణరూపుని ధ్యానింతురు. వీటిలో ఘోరుని చింతించినచో పాపరోగక్షయము కలుగును. మిశ్రుని ధ్యానించినచో సద్యస్సిద్ధి నిచ్చును. ప్రశాంతుని ధ్యానించినచో శాంతిని ప్రజ్ఞను. విశేషముగ ముక్తిని నొసంగును. క్రమముగా వీటిని ధ్యానించినచో సర్వసిద్ధులు కల్గును.

శివమహాపురాణమునందలి వాయవీయ సంహితాయందుత్తరఖండమున
ముప్పదియెనిమిదవ యధ్యాయము సంపూర్ణము.

# ముప్పదితొమ్మిద యధ్యాయము

## శైవ యోగము

మరల నుపమన్యు డిట్లు చెప్ప దొడంగెను. శ్రీకంఠనాథుని స్మరించినంత నేత్వరితముగ సర్వార్థములు సిద్ధించును గాన యోగులందరు నితనినివిడువక ధ్యానింతురు. మనంబుస్థిరముగ నుండుటకై సాకారస్థూల రూపమును ధ్యానించెదరు. స్థూలముస్థిరమైనచో. సూక్ష్మమల వడును. దానిచే నిర్గుణో పాసనార్హుడగును. శివచింతనచే సర్వసిద్ధులు సిద్ధించును.

ఇతని మూర్తులను ధ్యానించినను. పూజించినను. లక్ష్యస్థైర్యములు కల్గి సివభావము నిల్చును. సగుణముగ ధ్యానించినచో నిర్గుణధ్యానము చేయగల్గుదురు. నిర్గుణమునకు ధ్యాననువసరము లేదని పెద్దలుచెప్పిరి. బుద్ధిచేనూహించిన దానినే ధ్యానమని కొందరు బల్కిరి. గాన కేవలము నిర్విషయ మందే మనస్సును ప్రదర్శింపజేయ వలెను సగుణ [illegible]మును ధ్యానించినచో బాలార్క కిరణ సదృశునిగ ధ్యానింపవలెను. సూక్ష్మము నాశ్రయించుటయే నిర్విషయ మందురు. ఇదయే నిర్గుణము దీనిని మించిన పరమార్థమేదియు లేదు. స విషయ ధ్యానము సాకారము నాశ్రయించి యుండును. నిర్విషయ ధ్యానమే నిరాకారము, నిర్బీజము, సబీజము నని ధ్యానము రెండువిధములు. ముందుగా సాకార బీజము నలవర్చుకొని నిరాకార బీజమును సాధింపవలయును. నిర్బీజ ధ్యానము సర్వసిద్ధికరమైనది. ప్రాణాయామము వే క్రమముగా శాంత్యాదిసిద్ధులు కల్గును.

శాంతి, ప్రశాంతి, దీప్తి, ప్రసాదము లనెడివి శాంత్యాదులందురు. సర్వాశలు తొలగుటయే శాంతి. అంతర్బహిస్థిత తమస్సులు నశించుట ప్రశాంతియనబడును. లోపలను వెలుపలను ప్రకాశమానముగ నుండుట దీప్తియనబడును. స్థిరబుద్ధియే ప్రసాదము. ఇది బాహ్యాభ్యంతరములయందు బుద్ధికి శీఘ్రముగ ప్రసన్నత కలిగించును.

ధ్యాత ధ్యానము, ధ్యేయము ధ్యానప్రయోజనములను నీ నాల్గింటిని తెలిసికొని ధ్యానముచేయవలెను. జ్ఞానవైరాగ్య సంపన్నుడై శాంతచిత్తుడై శ్రద్ధావంతుడై ప్రసన్నాత్ముడై నవాడు ధ్యాతయనబడును. ధ్యైచింతాయాం అనుస్మృతిప్రకారము ధ్యానించుచువాడు ధ్యాతయందురు.

మాటిమాటికి శివునిచింతించుటయే ధ్యానమనబడును.

పరమేశ్వరుని శ్రద్ధతో క్షణమాత్రమైనను. యోగాభ్యాసముచే చింత నచేసినచో సర్వపాపములు నశించును. ఇదియు ధ్యానమే. చలింపని మనంబుతో పరమేశ్వరుని చింతించుట. ప్రవాహరూపముగు బుద్ధినియరికట్టుటకూడ ధ్యానమనబడును.

స్వయం శివుడగు సాంబుడే ధ్యేయుః, అనగా ధ్యానింపదగిన వస్తువు. ఈశివ ధ్యానముచే నణిమాది సిద్ధులుకల్గి ముక్తిలభించును: శివధ్యానము యొక్క సంపూర్ణ ప్రయోజనమిదియే దీనిచేతనే సర్వసౌఖ్యములు; మోక్ష మునొందగలరు. కావున సర్వమునువిడి సదా ధ్యానయుక్తుడై యుండవలయును. ధ్యానములేనిదే జ్ఞానములేదు. యోగికానిదే ధ్యానముండదు. ధ్యానజ్ఞానములు లేనిచో, భవార్ణవమును దాటలేరు. సర్వోపాధి వర్జితుడై యేకాగ్రచిత్తుడై ప్రసన్నాత్ముడై యుండుటయే జ్ఞానమనబడును. యోగాభ్యాసము లగు యోగులకిది సిద్ధించును. అశేషపాపములు నశించినచో ధ్యాన జ్ఞానములందు బుద్ధినిల్చును. పాపోపహతచేతస్కులు వీటినాటలైనను చెవినిబెట్టరు.

శ్లో॥ యథావహ్ని ర్మహాదీప్తః.
శుష్కమార్ద్రం చనిర్దహేత్.
తథా శుభాశుభం కర్మ.
ధ్యానాగ్నిర్ద హతే క్షణాత్.

జ్వాలాగ్నియే విధంబుగ శుష్కార్ద్ర కాష్ఠంబుల దహింపజేయునో అవ్విధంబున శుభాశుభకర్మలు తక్షణమే, ధ్యానాగ్నిచే దహింపబడును.

శ్లో॥ అత్యల్పోపిడి యథాదీపః
సుమహాన్నాశయేత్తమః
యోగాభ్యాస స్తథాల్పోపి
మహాపాపం వినాశయేత్.

దీపమెంత చిన్నదైనను మహాతిమిరమును బోగొట్టునట్లు యోగాభ్యాసమెంత స్వల్పముగ చేసినను మహాపాపములు నశింపజేయును. శ్రద్ధతో పరమేశ్వరుని క్షణమాత్రము ధ్యానము చేసినను మహాశ్రేయస్సులు కల్గును. దీనికి చాలిన విద్యలేదు. దీనికంతమును లేదు.

శ్లో॥ నాస్తిధ్యాన సమంతీర్థం
నాస్తిధ్యాన సమంతపః
నాస్తిధ్యాన సమోయజ్ఞః
తస్మాద్ధ్యానం సమాచరేత్.

ధ్యానముతో సమానమగు తీర్థము లేదు. ధ్యానముతో తుల్యమగు తపము లేదు. ధ్యానముతో సదృశమగు యజ్ఞము లేదు. కాన ధ్యానమాచరింప వలయును.

యోగులాత్మయే పరమాత్మయని భావించి తీర్థంబులు తోయపూర్ణంబులనియు దేవతావిగ్రహములు మృణ్మయ పాషాణంబులనియు నిశ్చయించి వాటిపై విలువయుంచక యాత్మధ్యానము చేయుచుందురు. యోగులు దమ శరీరమందలి సూక్ష్మరూపుడగు పరమేశ్వరుని ధ్యానించెదరు. అదియే వారికి ప్రత్యక్షైశ్వర్యము. యోగులు కానివారు మృత్పాషాణ విగ్రహములు పూజింతురు. ఇదియే స్థూలరూపము. రాజులంతశ్చరులనే ప్రియముగ జూతురు గాని బాహ్యచరులను క్షమింపరు. ఇవ్విధంబున భగవంతుడు నాంతరంగిక భక్తులను ప్రేమించి నట్లుగ బాహ్యకలాప భక్తుల నంతగా ప్రేమింపడు.

యోగి యోగ మభ్యసించుచుండ నంతరాయములు కల్గినను, యోగ మభ్యసింపదలచినను రుద్రలోకములభించును. ఇట్టి యోగి కొంతకాలము రుద్రలోక సుఖములనుభవించి మరల యోగికులమందే జన్మించి జ్ఞానయోగ మునుపొంది సంసారార్ణవము ను దాటగల్గును. జిజ్ఞాసువుకూడ యోగగతినిపొంద గల్గును, ఎన్ని సుఖంబులాచరించినను యట్టి గతిని పొందలేడు. ఒక్క శివయోగికి భిక్షమిడినచో వేదపారగులగు కోటివిప్రులకు భోజనంబిడిన ఫలము లభించును. యజ్ఞాగ్నిహోత్రదానంబులు సకల తీర్థయాత్రలు చేసినఫల మొక శివయోగికన్నమిడినచో లభించును. శివయోగులను దూషించెడి వారలు వినిసహించెడి వారలు ప్రళయాంతమువరకు నరకవాసులగుదురు. ఎవడైనను మూర్ఖుడు శివయోగిని నిందించినచో విన్నవాడు సమర్థుడైనచో నిందకుని శిక్షింపవలెను. లేనిచో నచటనుండి పోవలయును. శివయోగిని సతతము సేవించినచో నిహమందు సర్వభోగములనుభవించి యంతమున యోగియై శంకరుని పొందును. భోగములు కోరువారు శివయోగిని పూజింపవలయును. శివ

యోగి కాశ్రయమిచ్చి యున్న పాపాదుల నొసంగి, శయనించుటకు తల్ప మొసంగి కప్పుకొనుటకు దుప్పటి యొసంగినచో పాపముద్గరంబులచే ఛేదింపబడక యోగఫలము లభించును. యోగము పారమైనదిగాన వ్యర్థముగాక పాపములను ఛేదించుచునే యుండును. వజ్రమును తండులములు ఛేదింపనట్లుగ యోగిని పాపము లేమియు చేయజాలవు.

పద్మపత్రాంబువులవలె యోగికి పాపములంటవు. శివయోగరతుడగు మునియే దేశమున వసించునో యాదేశము పవిత్రమగును. అతడున్న ప్రదేశముమాట చెప్పనేల? గాన సర్వము పరిత్యజించి సకలకృత్యములు మాని ఇతరవిచక్షణలు లేక సర్వదుఃఖములు పోగొట్టుకొనుటకై శివయోగమభ్యసింపవలయును. యోగసిద్ధుడగు యోగి లోకహితకామ్య భోగంబులనుభవించుచు స్వేచ్ఛావిహారములు సల్పుచుండును. మరికొందరు యోగులు విషయసుఖంబులు నీచములనియెంచి వాటినత్యజించి వైరాగ్యవంతులై స్వేచ్ఛాకర్మలనువీడి ముక్తినే కోరుచుందురు. మర్త్యుడు తనమృత్యువు నెరింగి తనకు రాబోవు యరిష్టములు తెలిసికొని కాశీమొదలగు శివక్షేత్రములకేగి యోగారంభనిరతుడై యటనె వసించుచు నీరసనుడై రోగములచే పీడింపబడకుండ యోగముచే ప్రాణము త్యజింపవలెను లేనిచో నిరశన వ్రతముచేగాని శివానలమందుగాని లేనిచో శివతీర్థములందు మునిగిగాని ప్రాణములు త్యజింపవచ్చును. శివశాస్త్ర ప్రకారంబుగ నివిధంబులుగ ప్రాణత్యాగము చేయవచ్చును. ఇట్టివానికి ఆత్మహత్యాదోషముండదు సరికదా సద్యోముక్తికల్గును. రోగార్తుడు శివక్షేత్రము జేరి యటమృతి నొందినచో ముక్తినొందగలడు. అట్టిక్షేత్రాదులయందు నిరశనవ్రతముచే మరణించుట శ్రేష్ఠము. శాస్త్రవిన్యాసముగల ధీమంతులు చేయవలెను. శివనిందచేసినవాని స్వయముగా చంపినను దోషరహితుడై ముక్తినొందును. శివనిందకుని చంపుటకశక్తుడైనచో వానిచే చంపబడినను తానుయిరువదియొక్క తరముల వారితో ముక్తినొందును. శివభక్తునికైగాని శివభక్తునికైగాని మరణించినచో ముక్తిమార్గగాములలో వీనిని మించినవాడు లేడు. ఇంతకన్న తీవ్రతరమగు భక్తి ప్రపంచమందు లేదు. ఇంతకన్న వేరొక యుపాయంబును లేదు. యథావిధిగ పడధ్వసిద్ధుల నొందెడివారలు మృతిజెందిన పిమ్మట సామాన్యజీవులకు

వలె నూర్ధ్వలోకక్రియలు చేయనవసరములేదు. ఇట్టివారు మరణించినచో పుత్రాదుల కా శౌచముండదు. అట్టిపవిత్రులను, యగ్నియందు, దహనముగాని భూస్థాపనముగాని కాష్ఠమువలె జలమందు పడవేయుటగాని చేయువలెను. తదుపరి యతని నుద్దేశించి మానసరమగు కర్మలుచేయవలెను. తమపరిశక్తి కొలది విప్రసమారాధన చేయవలెను. ఇట్టివానికి ధనమున్నచో పుత్రులుగాని శివభక్తులుగాని యనుభవింపవలెను. లేనిచో శివపుస్తకవిని యోగికిప్పవలెను గాని తదితరులకీయరాదు.

శివ మహాపురాణమందలి వాయవీయసంహిత యందు త్తరఖండమున
ముప్పదితొమ్మిదవ యధ్యాయముసంపూర్ణము

---

## నలుబదివ యధ్యాయము

### నైమిశారణ్యయాత్ర.

సూతుడిట్లు చెప్పదొడంగెను. ఇవ్విధంబున వాయువు, నుపమన్యు శ్రీకృష్ణసంవాదమంతయు మహర్షులకు వినిపించి వాయువు సాయంసమయ మున, నంతర్హితుడయ్యెను. నైమిశారణ్యవాసులందరు, ప్రభాతమునలేచి, యజ్ఞమును పరిసమాప్తిగావించి యవభృథస్నానమునకై నదికేగదలచి యుండ, బ్రహ్మయనుజ్ఞచే, సరస్వతీదేవి ప్రసన్నురాలై సౌమ్యమై స్వయముగ స్వాదుసలిల ధారిణియై మునులయెదుట ప్రవహింప, దానినిగాంచి మునులు, సంతుష్టాత్ములై యందుస్నాతులై, దేవఋషితర్పణంబులు గావించి, శివుని స్మరింపుచు, వాయువుచెప్పిన విషయములను, స్మరింపుచు, వారందరు కాశీపురికేగి, గంగనుగాంచి సంతుష్టులై, యుత్తరవాహినియైన యాగంగ యందుమ్రుంకులిడి, పురమంతయుగాంచి సంతసించి, యవిముక్తేశ్వరలింగమైన, విశ్వేశ్వరునిగాంచి, హృష్టమానసులై యథావిధినర్చించి, వచ్చుచుండ, యంబరమున నొకయుజ్వల తేజః పుంజమును గాంచిరి.

ఆతేజము సూర్యకోటిప్రతీకాశమై, దివ్యమై, యద్భుతమై, తన దివ్యతేజంబుచే గగన మంతయు నాక్రమించి, దిగంతరముల వ్యాపింపజేయు, పాశుపత వ్రతులు, భస్మలిప్తాంగ దేహులు, సిద్ధులు నగు మునులనేక వేల

మంది, ఆ శివతేజమందు లీనమైరి, మునులందరు లీనమైనతరి నా తేజమదృశ్య మాయెను. ఇదియేమి యాశ్చర్యమని నైమిశారణ్య వాసులందరు గాంచుచు, దానివిషయ మెరుంగక, నది తెలిసికొనవలయునని యూహించి, మరల నైమి శారణ్యమున కేగి, వారిచిత్తములు, పరివారసహితుడగు శంకరునిపైనుంచి, బ్రహ్మకిదంతయు, తెలుపుకు చేయదలచి, బ్రహ్మపురి కేగ,

నట బ్రహ్మ సభచేసియుండెను. గానవిద్యానిపుణుడను నేను నేనని నారద తుంబురులు వాదులాడుచుండిరి, వీరిలో నిపుణుడెవడో తెల్పుటకు బ్రహ్మ మధ్యస్థుడై యుండెను. ఈసమయంబున మునులందరు లోపలకు ప్రవేశింపబోవ ద్వారపాలకులడ్డుకొనిరి. మునులటనే నిల్చియుండిరి. ఆసభయంతయు గంధర్వా ప్సరసలచే సేవింపబడుచుండెను. తుంబురునారదులు వారివారి గానవిద్యా చాతుర్యమును జూపింప బ్రహ్మ వారిగానంబులు విని మీయిరువురిగానంబులు సమముగనుండెను గాన మీరు స్పర్థవీడి మైత్రిగా మెలగుడని బ్రహ్మబలుక బ్రహ్మ యాజ్ఞానుసారముగ తుంబురు నారదులిరువురు స్పర్థలవీడి మైత్రితో నుండిరి. తమపరివారుగంధర్వా ప్సరలతోడుకొని కులగోత్రములులేని పర మేశ్వరుని సేవించుటకై మేఘమునుండి బయలువెడలిన సూర్యునివలె నార దుడు బ్రహ్మభవనమునుండి వెలుపలకురాగ వెలుపలనున్న మునులు నారదు నకు నమస్కరించి స్వామీ యీలాలజడి యేమిటి? ఇంతతొందరగా బోవు చుంటిరేలయని వారుప్రశ్నించిరి. నేనొకకార్యార్థమై తొందరగ నేగుచుం టిని. ఇచటి వారలనడిగి తెలిసికొనుడని పలికి నారదుడు జనుచుండ మునులు. ద్వారపాలురచే సర్వము నెరింగి వారియనుమతిచే లోనికేగి దూరమునుండియే పద్మభవునకు నమస్కరించి బ్రహ్మయాజ్ఞానుసారముగ నతని సమీపమునకేగి యతనిని పరివేష్టించ యాసీనులైయుండ బ్రహ్మవారల కుశలమడిగి ఓ ముసు లారా! మీవృత్తాంతమంతయు వాయువువలన తెలిసికొంటిని. వాయువు యదృశ్యమునతరి మీరేమిచేసిరని యడుగ మునులు యవభృథస్నానము మొదలుకొని గంగాతీర్థగమనము వారణాశి యాత్ర దేవతలచే స్థాపింపబడిన శివలింగమును దర్శించుట యవిముక్తలింగముగు విశ్వేశ్వరు నర్చించుట యాకసమునందు తేజోరాసిని దర్శించుట సిద్ధమునులా తేజమునందు లయ మగుట తామా తేజము నెరుంగ విలపించుట మొదలగు విషయములన్నియు విస్మయముతో విన్నవించి మాటిమాటికి నమస్కరింపుచుండ.

చతుర్ముఖుడు వారివాక్కులువిని శిరఃకంపముచేయుచు గంభీరవాక్కులతో నోమునులారా! మీకు పరలోకసిద్ధి సమీపమునకు వచ్చినది. మీరు దీర్ఘకాలము సత్రయాగముచేసి శివుని సేవించితిరి. మిమ్ములననుగ్రహించుసూచనకై పరమేశ్వరుడు మీకా తేజమును జూపించెను. వారణాశియందు మీరాకాశమునందు గాంచినది, శివతేజము. శ్రౌతపాశుపత వ్రతులందరు. నా తేజమునందైక్యమైరి. ఆనైష్ఠికులు దగ్ధపాపులై ముక్తినొందిరి. మీకుకూడ స్వల్పకాలమున ముక్తిప్రాప్తించును. మీముక్తిసూచనకై మీకా తేజంబు గోచరించెను. మీకు దైవయోగ మనుకూలించెను. మీరు దేవతాసేవితమగు మేరుదక్షిణ శిఖరమునకేగుడు అక్కడనాపుత్రుడు పరమమునీశ్వరుడునగు సనత్కుమారుడుగలడు. అతడటభూతనాథుడగు నందీశ్వరుని రాకకై నిరీక్షించుచుండెను.

పూర్వము సనత్కుమారుడు పరమేశ్వరునిగాంచి యజ్ఞానముచే తాను సర్వయోగీంద్ర పూజ్యుడనని యభిమానముగలవాడై శివునిగౌరవింపక యతినిర్భయుడై యుండ, నంది దీనినెరింగి యాయపరాధము సహింపనేరక క్రుద్ధుడై, నీవుయుష్ట్రమువలె నుండువుగాక యని నంది సనత్కుమారుని శపింప కొంతకాలమునకు నేనదియెరింగి దుఃఖించి యుమామహేశ్వరుల నారాధించి నందిని సంతసబరిచి యతిప్రయత్నముగ సనత్కుమారుని యుష్ట్రత్వము నివారింపజేసితిని. అపుడు మానససత్కుమారుడు యథాప్రకారముగ పూర్వరూపము నొందెను. శంకరుడీరంతయు నెరింగి నందినిగాంచి నవ్వుచు నోనందీ నన్నవమానించినంత మాత్రమున సనత్కుమారునట్లు చేసితివేమి! అతనికి నాయదార్థ తత్త్వము తెలుపుము బ్రహ్మపుత్రుడైన సనత్కుమారుడు మూఢుడై నన్నుస్మరింపకుండెను. నాయనుజ్ఞచే యతనిని సిశిష్యునిగా జేసికొని నాజ్ఞానప్రవర్తకునిజేయుము నికతడు ధర్మాధ్యక్షాభిషేకము చేయుమన నందిశంకరునియాజ్ఞ శిరమునవహింప సనత్కుమారుడు నాయాజ్ఞానుసారముగ మేరునగముకడకేగి నందీశ్వర ప్రసాదమునకై దుశ్చర తపమాచరించు చుండెను. మీరటకేగినచో నానందిని చూడగలరు. సనత్కుమారుని తపంబునకుమెచ్చి నందీశ్వరుడటకు రాగలడన మునులు బ్రహ్మవాక్కులువిని సత్వరమే మేరుదక్షిణమందున్న కుమారశిఖరమున కేగిరి.

శివ మహాపురాణమందలి వాయవీయసంహితయందుత్తరఖండమున
నలుబదివయధ్యాయము సంపూర్ణము

---

# నలుబదిఒకటవ యధ్యాయము

## వ్యాసోపదేశములు

మరల సూతుడిట్లు చెప్పదొడంగెను. ఆ హిమాలయ శిఖరంబున నాగరతుల్యమైనదియు సమ్యక్ శోభాయమానమైనదియు సఖండాకారమైనదియు నగునొక సరోవరంబుగలదు. అది స్వచ్ఛ శీతలస్వాదు జలంబులు గలిగియున్నదై యుండెను. దానికి నలువైపుల స్ఫటిక వికారములగు పాషాణములు గలవు. ఆప్రదేశమంతయు సకలర్తుప్రఫుల్ల వృక్షమై యుండెను. మరియు నాసరోవరంబు శైవలోత్పలంబులచేతను. పద్మంబులచేతను. తారకోపమములైన కుముదంబులచేతను. నభ సంకాశమైనతరంగములచే నొప్పుచు నాకాశము భూమిపైకే తెంచెనా యన్నట్లుండెను. ఇంకను సరోవరంబున నష్టదిక్కుల యందు శోభాయమానములగు నీలశిలామయంబులగు సోపానంబులుగలవు. అవి సూర్యోపమానా వర్ణోపానములకనుకూలంబులుగ నుండెను. ఇంకను నితరప్రదేశంబులందు గూడ ననేక సోపానపంక్తులు గలవు. అందు స్నానము చేయు మునీశ్వరులు శుక్లయజ్ఞోపవీతకౌపీన వల్కలధారులై, కొందరు జటలుగల్గి, కొందరు శిఖలుగల్గి, కొందరు ముండులై, త్రిపుండ్రధారులై, విరాగవంతులై స్థిరబుద్ధులై యుండిరి. వారుఘటముల తోను తామరాకు దొన్నలతోను. జలంబులు దేవపూజకై పుష్పంబులు గొనిపోవుచుండిరి. కొందరు మునులాచారవంతులై ధవ్యలిప్తాంగులై ఘటంబులయందు సలిలంబులు, నగాధజలమునుండి నింపుకొని శమ్మనరైన స్పృశించెదరన్న భయముచే మెల్ల మెల్లగ పోవుచుండిరి. అందలి సోపానము లన్నియు మునుల స్నానజలములచే తడిసి కుశాక్షతకుంకుమ తిలలచే వ్యాప్తమైయుండెను. వారందరు దేవర్షి పితృతర్పణంబులు చేయుచుండిరి. కొందరు గోత్రనామంబులతో స్నానము చేయుచుండిరి. ప్రతిప్రదేశంబున ఘంటానాదములు, పుష్పంబులుగాన వచ్చుచుండెను. మరియొక తావున సూర్యుని కర్ఘ్యము లిచ్చుచు తండులములచే పూజించుచుండిరి. మరియొకప్రదేశంబున కొన్ని గజ యూథంబులు తనివితీర స్నానములు చేసి జనుచున్నవి. మృగిమృగంబులాకలిదప్పికలచే నేతెంచి జలములు గ్రోలిపోవుచున్నవి; కొన్ని మయూరంబులు మత్తగజంబులగాంచి మేఘములని భ్రమించి నృత్యములు చేయసాగెను. కొన్నిగజంబులు తటం

బులు త్రవ్వుచు ఋషభంబులవలె రంకెలు వేయుచున్నవి. ఇంకను పక్షులకూజితంబులు సారసంబుల కిలకిలరావంబులు చకోరనినదంబులు మరియొకతావున భ్రమరగీతి కలుపాడుచు ఆమధురజలంబుల గ్రోలుచు చెట్లపై నివసించుచు తనసంతతిని పోషించు కొనుచు ప్రేమతో తమభాషలచే సంభాషించుకొనుచు కాలముగడుపు చున్నవి. శాఖలపైనున్న కోకిలారావంబులు పాంథులయాతప బాధనునివారించుకొనుట కాహ్వానించుచున్న వాయన్నట్లుండెను. ఆసరస్తటంబున కల్పవృక్షచ్ఛాయలయందు వజ్రశిలా ఖచితములైన మృగచర్మంబు బరచియుండెను. దానిపై బాలరూపుడగు సనత్కుమారుడా సీనుడై యచలసమాధినుండి యోగీంద్రులచే పూజింప బడుచుండెను.

నైమిశారణ్యవాసులనిం గాంచి నమస్కరించి యట నాసీనులై యుండిరి. కొంతసేపటికి సనత్కుమారుడు యోగమువీడి మునులనుగాంచి మీరాకకు కారణ మేమని ప్రశ్నింప వారు చెప్పబోవు నంతలో దివినుండి దుందుభులు మ్రోగెను. భానుసన్నిభమగు విమానము గోచరించెను. ఆ విమానమంతయు ససంఖ్యాకులైన గణేశ్వరుల తోడను, యప్సరోగణంబులతోను రుద్రకన్యకలతోను, నిండియుండెను. మరియు నది మృదుమధుర వేణు వీణా నిస్వనంబులుగలదై చిత్రరత్నవితానాఢ్యమై, ముక్తాదామ విరాజితమై, ముని సిద్ధ గంధర్వ యక్ష రాక్షస కిన్నర సేవితంబై యొప్పుచుండెను. అందు కొందరు నృత్యము చేయుచుండిరి. కొందరు గానములు చేయుచుండిరి. కొందరు వాద్య ఘోషలు చేయుచుండిరి. అందు కొందరు వీరులు గోవృషభ చిహ్నులై యుండిరి. కొందరు పగడపు బెత్తంబులు చేతబూని యుండిరి. విమానంబుపై పతాకంబు లెగురుచుండెను. విమానమధ్యంబున రెండు చామరంబులు శోభిల్లుచుండెను. ఇంకను నందు చంద్రబింబమువంటి శ్వేతచ్ఛత్రము ప్రకాశించుచుండెను, దాని మధ్య నొక నవరత్నఖచితసింహాసనంబు గలదు. అందు మహాయశస్సుగలదియు, మరుత్సుతయు, నగు నందీశ్వరుని భార్య లక్ష్మివలె శోభించుచు, త్రినేత్రయై యుండెను. ఆ విమానమందంతట పరమేశ్వరుని చరితలన్నియు చిత్రింపబడి యుండెను. నాదేవి జగత్కర్త్రయగు బ్రహ్మను మాజ్ఞాపించుట కేతెంచుచున్న దాయన్నట్లు అందర నను గ్రహింప వచ్చుచున్నదా యన్నట్లుండెను. సిలాద తనయు

డగు నందీశ్వరుడు, శూలధరాయుధుడై, విశ్వేశ్వరారాధ్యతముడై యపర విశ్వేశ్వరుడా యన్నట్లు ప్రకాశించుచు సృష్టికర్తలను శాసించు వాడా యన్నట్లొప్పుచు, చతుర్బాహుడై, యజానుబాహుడై, చంద్రరేఖా విభూషితుడై కంఠమున నాగేంద్రుని, మౌళిని శశాంకుని ధరించి శోభాయమానాంగుడై సర్వక్రియా సమర్థుడై ముక్తిప్రదుడై సర్వజ్ఞుడై యుండెను. నందీశ్వరుని బ్రహ్మ పుత్రుడగు సనత్కుమారుడు మునులందరితో సందర్శించి సంతసించి, ప్రహృష్టవదనుడై లేచి, యంజలిఘటించి నమస్కరించి తన యాగమును సమర్పించుకొన్న నాయన్నట్లుండి నాయుచుండ సింహాసనమున వసించి విమానవనాగెను. సనత్కుమారుడు నందిని గాంచి సాష్టాంగదండ నమస్కారము చేసి స్తుతించి నో దేవా! మహర్షులీను లైన యీ మునులు నైమిశారణ్యమున దీర్ఘసత్రయాగము గావించి బ్రహ్మ గారి యాజ్ఞచే మిమ్ముసేవించుట కేతెంచిరన

నందీశ్వరుడు సనత్కుమార వాక్యములు విని తన కృపాకటాక్షముచే వారి బంధనములు ఛేదించి శివధర్మైశ్వర్య జ్ఞానమొసగి శివ సన్నిధానమునకు గొంపోయెను. నందచే సనత్కుమారుడు శివజ్ఞానమంతయు విని, మా గురువగు వ్యాసునితో విన్నవింప వ్యాసుడు దయతో నాకు వినిపించెను. దానంతయు మీకు సంక్షేపముగ జెప్పియుంటిని. వేదమందు నమ్మిక లేనివారికి ఈ పురాణరత్నము చెప్పరాదనియు నభక్తులకు శిష్యులు కానివారలకు నాస్తికులకు చెప్పరాదని పురాంతకుడైన శివుడు శాసించెను. చెప్పినచో నిరయవాసులగుదురు. ఇది గురుముఖమున విని పఠించి గ్రహించి, యాచరించిన వారలకు సర్వసుఖంబులు ధర్మార్థ కామంబులు కల్గి యంతమున మోక్షము కల్గును. పౌరాణిక మార్గముగ మీకందరకు నుపకరించుటకై యోగమార్గమంతయు జెప్పితిని గాన నేను పూర్ణకాముడనైతిని. మీకు శివుడు మంగళములు చేకూర్చుగాక. నేను పోయెదనని సూతుడు వారల నాశీర్వదించి ప్రయాగకేగి యట నొక యజ్ఞము గావించి కలికలుషితములు గాంచి కాశీపురి పరిసర ప్రాంతమందు నివసించి జీవన్ముక్తికై పాశుపతవ్రతమాచరించుచు మంచి విజ్ఞానము కలవాడై యనిందితమగు మోక్షము నొందెను.

వ్యాసుడిట్లు పల్కెను. ఆదరముతో నీశివమహాపురాణము సంపూర్తిగ విన్నను పఠించినను, హితముగా నాదరించినను, ప్రయత్నపూర్వకముగ విన్నను, మహదైశ్వర్యము లబ్బును. దీని ప్రకారమాచరించిన వారికి ముక్తి తథ్యము, నాస్తికులకు, శ్రద్ధాహీనులకు మూర్ఖులకు, భక్తిలేని వారలకు, మహేశ్వరుని కథలు వినిపింపరాదు. ఈపురాణమంతయు నొకసారి విన్నను పఠించినను. సర్వపాపములు భస్మమగును. అభక్తుడు భక్తుడగును. భక్తుడు దృఢభక్తుడగును. దృఢభక్తుడైనతడి మరల పఠించినచో నవశ్యము, ముక్తి నొందగలడు. మోక్షేచ్ఛగలవారు, మాటిమాటికి వినుచుండవలయును. ఐదుపర్యాయములు పఠించినచో, నుత్కృష్టఫలములభించును. పూర్వకాలంబున బ్రహ్మక్షత్రియవైశ్యులు, సప్తపర్యాయములు పఠించి, శివదర్శనము నొందగలిగిరి. భక్తితత్పరుడై యెవడువినునో, వాడిహమందు సర్వభోగముల ననుభవించి పరమందు ముక్తినొందగలడు. ఈశివపురాణము శివునకత్యంతప్రీతి కరమైనది. భుక్తిముక్తిప్రదమైనది, బ్రహ్మసమ్మతమైనది, భక్తివర్ధనమైనదియు నైయుండెను. ఇదివిని పఠించినవారల శంకరుడు పుత్రమిత్రబాంధవ పరివారములతో రక్షించును.

శ్రీవత్ససగోత్ర పవిత్ర వేలూరిపాటి నృసింహశర్మోత్ముఖ యాజిధర్మ
పత్నియు, చావల్యపనామక యజ్ఞేశ్వరసోమయాజ్యగ్ని పూర్ణాంశప
తుల గర్భశుక్తిఫలమును, శ్రీమతి వేలూరిపాటిలక్ష్మీ సరస్వతిచే
నాంధ్రీకరింపబడిన, శ్రీశివమహాపురాణమునందలి వాయవీయ
సంహితయందుత్తరఖండమున, నలుబది యొకటవ అధ్యా
యముతో శివమహాపురాణము సంపూర్ణము.
సాంగం సపరివారమహేశ సహితమహామృత్యుంజయార్పణమస్తు,
సర్వంపంచముఖేశ్వరపరబ్రహ్మార్పణమస్తు.
మంగళంమహత్.
శ్రీ శ్రీ, శివాయగురవేనమః

అవిఘ్నమస్తు

శ్లో. సువర్చలాధిష్ఠిత వామభాగం
నిరస్తకందర్ప సురూపదర్పం
భానుప్రియం రాఘవ కార్యదక్షం
అస్మత్కులేశం హనుమంత మీడే.

గురుస్మరణ

నమామి దేవం పరమాత్మరూపం
సచ్చిత్సుఖానంద ఘనంప్రసన్నం
స్వా. స్వాత్మాభిరామం బహుజీవగమ్యం
సర్వం మదీయం గురురూపమీడే.

# రచయిత్రి విన్నపము

మానవులారా! ప్రత్యక్ష దైవమగు గోమాత నర్చించితరింపుడు. సర్వ దేవతలు, గోవునందు వసింతురుగాన గోపూజ 40 రోజులు చేసినచో తీరని కోర్కెలుండవు. సదా సేవించిన చో భుక్తిముక్తులు కల్గును. భవిష్యత్పురాణ మునందు, గర్గభాగవతమునందు, గోమాహాత్మ్యము విపులముగ చెప్ప బడియుండెను. వాటినాధారముగ తీసికొని అందుముఖ్య శ్లోకము సేకరించి గోపూజాకల్పము వ్రాసితిని. హంసక్షీర న్యాయము వలె నా దోషములు మన్నించి, మంచిని గ్రహింతురుగాక.

గోపూజ, శూన్యమాసములు, మౌఢ్యములు లేకుండ ప్రారంభింపవలెను. ప్రత్యక్ష గోవులేనిచో, గోవు కట్టురాట, గోమయం, సాలగ్రామము, జలకుంభము, అగ్ని, వీటియందు గోపూజ చేయవలెను. బ్రాహ్మణేతరులు, సాలిగ్రామాగ్నులయందు చేయరాదు.

ప్రథమ దివసమున, కలశపూజ, గణపతిపూజ నవగ్రహార్చన, అష్ట దిక్పాలక పూజలు గావించి, గోపూజచేయవలెను. ఇట్లుసేసినచో విఘ్నములు కలుగవు; పిమ్మట గోదేవినర్చించిన చాలును. ఇట్లు 40 రోజులు గోపూజ చేయుటకు గోవ్రతమందురు. గోవును పూజించి ఉభయతోముఖ గోదానము విప్రునకిచ్చినచో, బహువిస్తారమైన భూదాన మిచ్చిన ఫలములభించును. దాన మిచ్చుటకు, పూజించుటకు గోవుప్రశస్తమైనది, సదాగోమాత నర్చించినచో సకల సంపదలుగల్గి గోలోకము పొందగల్గుదురు. ఇసుక రేణువులు, తారలు, లెక్కింప వచ్చునుగాని, గోమాహాత్మ్యము, లెక్కింప నలవికాదు.

యేలూరిపాటి లక్ష్మీనరస్వతి.

# గోపూజా కల్పం

1. ధ్యానం॥ సర్వదేవ మయే దేవి లోకానాం శుభనన్దిని
మాతర్మమాభిలషితం సఫలం కురునన్దిని॥

## ఆవాహనం

2. యాలక్ష్మీస్సర్వభూతానాం యాచ దేవేవ్యవస్థితా॥
ధేనురూపాచసా దేవీ మమపాపం వ్యపోహతు॥

నవరత్నఖచిత సింహాసనం

3. విష్ణోర్వక్షసి యాలక్ష్మీః స్వాహాయాం చవిభావసౌ
చంద్రార్కశక్రశక్తిర్యా ధేనురూపాస్తు సాశ్రియై॥

పాదయోః పాద్యం

4. చతుర్ముఖస్య యాలక్ష్మీః యాలక్ష్మీర్ధనదస్యచ
యాలక్ష్మీర్లోకపాలానాం సా ధేనుర్వరదాస్తు మే॥

హస్తయోరర్ఘ్యం

5. సౌభాగ్యం దేహి మేపుత్రాన్ ధనంపౌత్రాంశ్చపూజితాన్
గృహాణార్ఘ్యం మయాదత్తం దేవి సౌఖ్యం ప్రయచ్ఛమే॥

శుద్ధాచమనీయం

6. స్వధాత్వం పితృముఖ్యానాం స్వాహాయజ్ఞభుజాంపునః
సర్వపాపహరే దేవి తస్మాద్భూతిం ప్రయచ్ఛమే॥

వస్త్రయజ్ఞోపవీతకంచుకముపవస్త్రం

7. గోషుయజ్ఞాః ప్రవర్తంతే। గోషు దేవాః ప్రతిష్ఠితాః
గోషు వేదాస్సముత్కీర్ణాః సషడంగపదక్రమాః

గంధం

8. కుంకుమాగరుకస్తూరీ, కర్పూరాగరుచందనం
విలేపనం మహాదేవి వాంఛితార్థప్రదాయిని

పుష్పమాలాలంకరణం

9. శృంగమూలేగవాం నిత్యం। బ్రహ్మవిష్ణుశ్చసంస్థితా!
శృంగాగ్రేసర్వతీర్థాని స్థావరాణి చరాణి చ

సురభ్యంగపూజ

1. శృంగమూలే॥ బ్రహ్మవిష్ణుభ్యాంనమః
2. శృంగాగ్రే॥ స్థావరచరాచర సర్వతీర్థేభ్యోనమః
3. శృంగమధ్యే। సర్వకారణకారణ మహాదేవాయనమః
4. లలాటే॥ అగ్నయేనమః
5. నేత్రయోః॥ శశసూర్యాభ్యాంనమః
6. దక్షిణకర్ణే శివాయనమః
7. వామనేత్రే శివాయైనమః
8. నాసావంశేచ॥ షణ్ముఖాయైనమః
9. నాసాపుటే॥ కంబళాశ్వతరాభ్యాం నమః
10. కర్ణయోరశ్వనీ దేవాభ్యాంనమః
11. దంతేషు॥ అష్టవసుభ్యానమః
12. జిహ్వాయాం॥ వరుణాయనమః
13. హృదయకుహరే॥ సరస్వత్యైనమః
14. గండయోః॥ యమయక్షరాజేభ్యోనమః
15. సంధ్యాద్వయే। విష్ణుబ్రహ్మయనమః
16. గ్రీవాయాం॥ పురందరాయనమః
17. మూపురే॥ రాక్షసేభ్యోనమః
18. పార్ణ్యాం॥ స్వర్గభ్యాంనమః
19. చతుష్పాదేషు। సకలధర్మాయనమః
20. జంఘేషు॥ వేదేభ్యోనమః
21. ఖురమధ్యేషు॥ గంధర్వేభ్యోనమః
22. ఖురాగ్రేషు॥ పన్నగేభ్యోనమః
23. ఖురపశ్చిమభాగే॥ రాక్షసేభ్యోనమః

24. పృష్ఠే॥ ఏకాదశరుద్రేభ్యోనమః

25. సర్వసంధిషు॥ వరుణాయనమః

26. శ్రోణీతటే॥ పితృదేవేభ్యోనమః

27. కపాలే॥ మానసాయనమః

28. అపానే॥ శ్రియైనమః

29. గవాంనిత్యం స్వాహాలంకారభూషితాయైనమః

30. వాలే ఆదిత్యరశ్మిభ్యాంనమః

31. మూత్రే సాక్షాద్గంగాయైనమః

32. గోమయే॥ యమునాయైనమః

33. రోమకూపేషు॥ త్రయస్త్రింశత్కోటి దేవేభ్యోనమః

34. ఉదరే॥ సశైలవన కాననస్పృథివ్యైనమః

35. పయోధరేషు చతుస్సాగరేభ్యోనమః

36. క్షీరధారేషు॥ పర్జన్యాయనమః

37. బిందుషు॥ మేఘాయనమః

38. జఠరే॥ గార్హపత్యాగ్నయేనమః

39. హృది దక్షిణాగ్నయేనమః

40. కంఠే॥ ఆవహనీయాగ్నయేనమః

41. తాల్వా॥ సభ్యోగ్నిభ్యాంనమః

42. అస్థిషు॥ కులపర్వతేభ్యోనమః

43. రోమసు॥ ఋషిభ్యోనమః

44. శరీరే॥ భువనేభ్యోనమః

45. మద్యాసు॥ క్రతుభ్యోనమః

46. గోచతుర్వర్ణేషు। చతుర్వేదేభ్యోనమః

47. పాలే॥ పరబ్రహ్మణేనమః

48. అంత్రేషు। నాగేభ్యోనమః

49. యోనే॥ త్రిపథగామిన్యైనమః

50. హుంకారేషు॥ చతుర్వేదేభ్యోనమః

51. అంభారావ॥ ఓంకారనాదాయైనమః

52. మూర్తే॥ సార్ధత్రికోటితీర్థేభ్యోనమః

53. సర్వశరీరే॥ విష్ణవేనమః

54. వత్సేః వాత్సల్యాయనమః

అంగపూజానంతరం। గోత్రిశతిపూజాంకుర్యాత్ ॥

1. హ్రీం॥ శ్రీం॥ క్లీం॥ ఐం॥ వ్రజనివాసిన్యైనమః
2. గోదేవ్యైనమః
3. చతుర్దశ భువనధారిణ్యైనమః
4. రాధికా వర్ధితాయైనమః
5. గోపగోపికా సేవితాయైనమః
6. ధూతపాపౌఘ నాశనాయైనమః
7. గోవర్ధన పర్వత వాసిన్యైనమః
8. అంభారా విణ్యైనమః
9. గోలోక రక్షిణ్యైనమః
10. గోలోక నివాసిన్యైనమః
11. సౌరభేయైనమః
12. శరత్కోటి పూర్ణశశిరూపిణ్యైనమః
13. తారహారా యైనమః
14. మంజీర మండితాయైనమః
15. విచిత్రశిరోమణ్యైనమః
16. బాలసూర్య సమప్రభా యైనమః
17. శింజినీ కింకిణీ ఘంటాది భూషితాయైనమః
18. శోభనాకారా యైనమః
19. గరుత్మన్మాణిక్య ప్రభాయైనమః
20. గోమేధిక మాణిక్య వర్ణిన్యైనమః
21. లాంగూల ధారిణ్యైనమః
22. పుష్పరాగమణి నిభాయైనమః

23 నవరత్న శోభితాయైనమః

24. ధన్యైనమః

25. నీలవర్ణా యైనమః
26. అరుణ వర్ణాయైనమః
27. ధూమ్రవర్ణాయైనమః
28. మయూర పింఛ వర్ణాయైనమః
29. కపిల వర్ణాయైనమః
30. తామ్రవర్ణాయైనమః
31. సువర్ణ వర్ణాయైనమః
32. హారిద్ర వర్ణాయైనమః
33. తదియచంద్ర శంగాయైనమః
34. వత్సవత్సలా యైనమః
35. వత్సరోగ నివారిణ్యైనమః
36. అమృత దాయినే నమః
37. దీర్ఘశృంగా యైనమః
38. ధర్మధరాయైనమః
39. ధర్మ స్వరూపిణ్యైనమః
40. పుత్రదాయైనమః
41. పౌత్రదాయైనమః
42. పవిత్రదాయైనమః
43. దోషనివారిణ్యైనమః
44. దోషాకరసహోదర్యైనమః
45. నవగ్రాసేష్టాయైనమః
46. నికుంజసంచారిణ్యైనమః
47. పూర్వపాప వినాశిన్యైనమః
48. మోహిన్యైనమః
49. మోహన రూపాయైనమః
50. మహామోహిన్యైనమః
51. వికచాంబుజేక్షణాయైనమః
52. వ్యజనవీజితాయైనమః

53. వేణుగానలోలాయైనమః
54. వేదనాద వినోదన్యైనమః
55. వేదస్వరూపిణ్యైనమః
56. వేదాంత వేద్యాయైనమః
57. ఊర్ధ్వగతిదాయిన్యైనమః
58. ఊర్ధ్వలోక నివాసన్యైనమః
59. సర్వలోకనివాసిన్యైనమః
60. సర్వేష్టాయైనమః
61. సర్వేశ్వర్యైనమః
62. సామగాన ప్రియాయైనమః
63. సామవేదస్వరూపిణ్యైనమః
64. సర్వలోకసాక్షిణ్యైనమః
65. సర్వజన వందితాయైనమః
66. సర్వశిశుపోషిణ్యైనమః
67. సర్వాఘౌఘనివారిణ్యైనమః
68. సర్వోపనిషత్స్వరూపాయైనమః
69. ఋగ్వేదాయైనమః
70. యజుర్వేదాయైనమః
71. సామవేదాయైనమః
72. అథర్వవేదాయైనమః
73. అథర్వవేద్యాయైనమః
74. సామవేద్యాయైనమః
75. ఆదిస్వరూపిణ్యైనమః
76. అఖిలజగదాధారాయైనమః
77. దేవతాయైనమః
78. కల్పవృక్షాయైనమః
79. కామధేన్వైనమః
80. కామితార్థప్రదాయిన్యైనమః

